మానవాదర్శ గ్రంథమండలి. ప్రథమపుష్పము.

శ్రీ

# బుద్ధపురాణము.

"పరోపదేశే పాండిత్యం సర్వేషాం సుకరం నృణాం
ధర్మే స్వీయమనుష్ఠానం బుద్ధదేవేన దర్శితం."

గ్రంథకర్త:
దుగ్గిరాల బలరామకృష్ణయ్య.

మానవాదర్శ గ్రంథమండలి. ప్రథమపుష్పము.

# బుద్ధపురాణము.

## ప్రథమఖండము





గ్రంథకర్త:

దుగ్గిరాల బలరామకృష్ణయ్య,

అంగలూరు.





శాశ్వతోద్ధారకులు:

కొడాలి ఉమామహేశ్వరరావుగారు,

మున్సిఫ్, జవర్లపూడి.

 [వెల రు 4 లు.

3-12-0





ప్రకాశకులు:
తిపిర్నేని లక్ష్మీనారాయణ, మేనేజరు,
మానవాదర్శ గ్రంథమండలి
అంగలూరు, కృష్ణాజిల్లా.

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల యందు
క. కోదండరామయ్యగారిచే, ముద్రింపబడియె.
1927.





ಗ್ರಂಥಕರ್ತ.

ಜನಕನು. ಜನನಿ.

గీ॥ పుణ్యపురుషుల చారిత్ర • బోధనముల
వినుచు నారీతివర్తించు • విమలమతులు,
కర్మసామ్రాజ్య సత్సూత్ర • ధర్మగరిమ
నిర్మలానూన సుజ్ఞాన • నిధిని బడసి
భవము దరియించి, నిర్వాణ • పదవి గనరె?
ఆదిమధ్యాంతవర్తియా • నభవుచేత,
గల్పితంబౌ ప్రపంచంబు • గాంచినపుడు
కరుణ చిగురొత్త సమదృష్టి • గలిగియుండి
తృష్ణ నెడఁబాసి శ్రద్ధ ను•త్కృష్టభక్తి
జ్ఞానవైరాగ్య ధనముల • గాంచునరుడు
భూరికైవల్య సౌఖ్యంబు • బొందుటరుదె?
వ్యక్తిగతమైన జీవితా•సక్తి వీడి
విశ్వజీవిత నిర్వాహ • విధము నెఱిగి
లోకకల్యాణ మొనరించి • రూఢిమెఱయ
శాశ్వతానంద సత్కీర్తి • జనుడు వడయు.

# మానవాదర్శ గ్రంథమండలి.

## పోషకవర్గము.

### —• ప్రథాన రాజపోషకులు •—

శ్రీ కొరిపాటి శివరామయ్యగారు,
కప్తానుపాలెం - దివి తాలూకా.

శ్రీ కొడాలి ఉమామహేశ్వరరావుగారు,
మున్సిఫ్, జవర్లపూడి - గన్నవరం తాలూకా.

### —• రాజపోషకులు •—

శ్రీ సూదనగుంట అప్పారావుగారు,
మునుపల్లె - బాపట్ల తాలూకా.

శ్రీ అట్లూరి కాంతయ్యగారు,
అంగలూరు - గుడివాడ తాలూకా.

### —• పోషకులు •—

శ్రీ మల్లినేని రాఘవయ్యగారు,
తోట్లపాలెం - బాపట్ల తాలూకా.

శ్రీ దాసరి అంకమ్మగారు ,, ,,

శ్రీ అత్తోట సత్యనారాయణగారు ,, ,,

శ్రీ తుమ్మల సూర్యనారాయణగారు,
గోవాడ - తెనాలి తాలూకా.

# కృతిసమర్పణము

శ్రీ శ్రీ కొండాలి ఉమామహేశ్వరరావు

జవర్లపూడి మున్సిఫు గారికి:—

పూజనీయా!

నశ్వరములగు భౌతికసౌఖ్యములనే జీవిత పరమావధిగా భావించి, అధునాతనమానవ ప్రపంచము పరమార్థదాయకములగు సత్కార్యముల విస్మరించువిధము ననుసరింపని భవదుదారహృదయ మాదర్శప్రాయము. ఉత్తమగృహస్థులరయి దానదయాధర్మముల నిత్యకర్మలుగనెంచి విద్యావ్యాపనమున కెంతయు దోడ్పడు భవదహింసాపరతంత్రమగు భక్తహృదయము సర్వజనానుకరణీయము. సద్విద్యాపోషకా! సరస్వతీ ప్రసాదమగు నీ బుద్ధపురాణమును భవత్కరకమలముల సమర్పించుకొంటి. దీనంజేసి భవద్యశఃకాయము వసుధ నాచంద్రతారార్కంబుగ వర్ధిల్లునుగాక!

—గ్రంథకర్త.

## కృతిభర్త




విద్యాపోషకులు; మహాదాతలు:

కోడాలి ఉమామహేశ్వరరావుగారు.

# పండితాభిప్రాయములు

49/1C Harish Mukerji Road,
Bhawanipur,
Calcutta.
15—10—27.

Dear Sir,

I received your packet yesterday and am writing to you immediately, as there has been already some delay, thanks to the postal authorities.

I have not been able to study your work carefully but have read enough to form an estimate of its value. I believe that it is the first serious attempt in Telugu to present the life and teaching of Buddha, one of the noblest figures of world's history. Scholarship and insight are the two great requisites for a proper interpretation of past history and these you have in an abundant measure. We, Hindus, have not been fair to Buddha and our sacred literature is marked by a want of sympathy for his great work. Latterly, however, there has been a change in our perspective. We are trying in a humble measure to make amends for our past neglect. Your work is thus a sign of the times.

I am at one with you in thinking that Buddhism is not an entirely fresh start with no roots in India's past. Its spiritual foundations are to be traced in the Upanishads. It is a later phase of the general

movement of thought of which the Upanishads are the earlier. Buddha set aside the inconsistent compromises of the Upanishads with Vedic polytheism, drew out the logical implications of the indefinable character of the Absolute Brahman and emphasised the ethical universalism of the Upanishads. That sorrow or suffering is the essential fact of life, that it is possible for us to reach beyond it to **Nirvana**, that insight into the nature of reality and moral life lead us to the goal and the main principles of the phenomenality of the world and Karma and birth are common to the Upanishads and Buddhism.

You are right in contending that it is unfair to represent Buddha's teaching as atheistic or **nastika**. It is quite true that Buddha refused to answer Malunkya's questions (see also the **Dialogue of Vaecha**) on the nature of the ultimate reality and **Nirvana**. But his refusal to answer does not mean an admission of atheism. To argue that Buddha did not believe in any permanent reality, cosmic or psychical, would be to reduce **nirvana** to an abyss of annihilation. Such a barren creed of negative rationalism would not have appealed to the theistically minded people of Buddha's age. Nor is it easy to assume that Buddha's silence was a cloak for ignorance. His frequent assertions that he is in

possession of the truth and could lead men on to it, become unintelligible on this view. It is more reasonable to think that Buddha accepted the idealsim of the Upanishads but did not declare it as his opinion since he insisted on each one's realisation of the truth for oneself. Besides, metaphysical wrangling has little to do with the attainment of sanctity which is more spiritual and inward than logical and theoretical. Only this view can account for Buddha's positive descriptions of the state of **nirvana** and his consistent refusal to deny the reality of an absolute beyond phenomena. The famous sermon at Benares suggests strongly the reality of an absolute. The **Udana** says :—"there is an Unborn, an Unoriginated, an Unmade, an Uncompounded; were there not, O mendicants, there would be no escape from the world of the born, the originated, the made and the compounded" (VIII. 3). In view of the obvious limits of the human understanding accepted by the Upanishads and Buddha, the latter refused to define the absolute. But within the limits allowed by logic, he describes the ultimate principle of the universe as **Dharma** or righteousness. In the Upanishads **Dharma** and **Satya** are identified. As Buddha's interest was mainly ethical, he emphasised the **dharma** nature of the ultimate reality. **Dharma** takes the place of **Brahman (Digha N. III. 232)**. **Brahmanyana** is called **Dharmayana** (Sutta Nipata V 5.). **Brahmacakra** is

paralleled by **dharmacakra** ( Majjhina N. I. 69 ). The Upanishads also give the first place to **dharma** **Brhadaranyaka Up.** I 4–14 and **Matranarayana Up.** XXI. 6).

Throughout your work I find a lofty enthusiasm for lofty ideals. Impartiality of view and balance of judgment which distinguish the philosopher from the propagandist, characterise your treatment. Your discerning attitude with regard to our past history, your deep love for the great Hindu ideals and severe condemnation of the lapses from them appeal to me very much. Your discussions of the dates of the Epics, your criticism of the episode of **Sambuca** in the **Ramayana**, your view of the implications of the **Purushasukta** account of caste are so just.

I have no doubt that this book will help to popularise interest in Buddhism with which our Andhra had intimate connection. I congratulate you on the accomplishment of this great work and the invaluable service you have rendered to the Andhra world by it.

I wish you all joy and prosperity,

Yours very Sincerely,

(Sd.) S. RADHAKRISHNA.



ఆంధ్రానువాదము :—

జగత్ప్రసిద్ధతత్త్వవేత్తలు - యస్. రాధాకృష్ణపండితులు,
జార్జిఫిప్తు, ప్రొఫెసరు ఆఫ్ ఫిలాసఫీ,
కలకత్తా, యూనివర్సిటి.

ప్రియమహాశయా !

తమ గ్రంథమును సాంగోపాంగముగను, సావధాన ముగను బరిశీలించు వ్యవధి నాకు లభింపకున్నను తద్గ్రంథ మూల్యమును దెలుపగలట్టి ముఖ్యవిశేషములనెల్ల గమనించు నంతవఱకు పఠించినాడను. ప్రపంచ చారిత్రమున సుప్రసిద్ధు లయినవారిలో నొకండును, సుదృఢదారమూర్తియు నగు శ్రీబుద్ధదేవుని సజ్జీవితమును, తన్మహనీయుని దివ్యప్రబోధము లను ఆంధ్రప్రపంచమునకు సవిస్తరముగ నుపదేశింప దమ మహద్గ్రంథమే తొల్లింటిదని నేను విశ్వసింపుచున్నాడ. ఎన్న డో మఱుగువడిన పాతపురాణములను, ఇతిహాసములను సం పూర్ణముగ సమన్వయపఱచి హృద్యముగను, విశ్వాసార్హం బుగను లోకమునకు సమర్పించగోరువారికి రెండు యుత్తమలక్ష ణములు పరమావశ్యకములు. అందు సర్వతోముఖమగు పాండి త్యమొకటి. తాటాకుకవిళ్ళలో లభింపనేరని మాతార్థముల చక్కగ గ్రహింపగల యంతర్దృష్టియొకటి. ఈ రెండు యుత్త మలక్షణములును తమయం దపారముగ వెలయుచున్నవి. హిం దువులమని సంభావించుకొను మన మెవ్వరమును మనపూర్వ

లును శ్రీబుద్ధభగవానుని దివ్యప్రబోధములయం దాదర విశ్వా
సముల బ్రదర్శించియుండలేదు. కాని యిటీవల హైందవ దృక్ప
థ మొకింత నవ్యపరివర్తనమును బడసినది. నిరసనభావము లిం
చుక శాంతించినవి. శ్రీబుద్ధదేవుని మహోన్నత చరిత్రమును
గ్రహింప నభిలషించు పరిస్థితు లేర్పడినవి. తమ గ్రంథ మీ
పరిస్థితుల నెంతయు సమర్థించుచు, అధునాతన భారతీయ ముఖ్య
లక్ష్యముల బోషించునదయి రాణించుచున్నది.

బౌద్ధమత మంతకుబూర్వము భరతవర్షమునం దాచ
రణయం దున్న మతసిద్ధాంతముల యాధారంబునగాక స్వతం
త్రముగను, నూతనముగను భువి నావిర్భవించిన విపరీత మత
ము కాదను తమ యుద్దేశ్యముతో నేను సంపూర్ణముగా నేకీ
భవించుచున్నాడ. బౌద్ధమతసిద్ధాంతముల యాధ్యాత్మికతత్త్వ
మంతయు నుపనిషత్సారముగ గోచరించు. ప్రాచీన హిందూ
మతపరిణామావస్థలలో నుపనిషత్తులును, బౌద్ధమతమును నేక
భావ వికాస పరిణతిని వెల్లడించుచున్నవి. ఈజిజ్ఞాసయం దుప
నిషత్తులు ప్రథమసోపానము- బౌద్ధతత్త్వము ద్వితీయము. తొ
ల్లింటి వేదములు దేవతాబాహుళ్యమును స్వీకరించి సగుణ
సరూపముగ దేవతల నేర్పఱచినవి. ఉపనిషదర్థముల నిర్వచిం
చియున్న ఋషీశ్వరులు పరబ్రహ్మ. గుణరూపముల కతీతు
డనియు, అనిర్వచనీయుండనియు బూర్ణముగ గుర్తెఱింగియుం
డిరి. కాని, స్వీయ తపఃఫలమును పూర్వవేదార్థములతో సమ
న్వయించు నుద్దేశముతో నొకింత గడబిడపడుచుండిరి. ప్రత

త్కారణంబున నుపనిషత్తులయం దించుక యస్థిరత్వము గోచరంబగును. శ్రీబుద్ధ ప్రభు వీ నిరర్థకసమన్వ యప్రయత్నముల నిరసించి యుపనిషత్తులలోని సత్పదార్థ నిర్వచనమునే ప్రధానాంశముగ స్వీకరించి, త దాధారంబున స త్సిద్ధాంతముల నిర్మించుకొనియెను. ఆప్రభువు యుపనిషత్తుల నీతిప్రాధాన్యతను సహితము గ్రహించెను. మానవజీవితమునకు దుఃఖానుభవ మవశ్య స్వభావమనియు, కాని మనుజప్రయత్నముచే నా దుఃఖము నశింప, నిత్యసత్యమగు బ్రహ్మానందము ననుభవింప వచ్చుననియు, సద్వస్తువును గ్రహించుటచేతను, ధర్మ బద్ధమగు సాధుజీవితయాత్రవలనను (ధర్మరతిచేతను, ఆత్మరతిచేతను) నిర్వాణము నందవచ్చుననియు, జీవాత్మను బంధించి కర్మవశముగ పునర్జన్మ నొసంగు కార్యకారణ స్వరూపంబగు హేతువాదము సమిత ముపనిషత్తులకును, బౌద్ధమతమునకును ముఖ్యాంశములయి యున్నవి

బౌద్ధమతము నాస్తికవాదము కాదని యనుకొనుటలో తమరు నిజమాడియున్నారు. పరతత్త్వ మెట్టిది? నిర్వాణ మెట్టిది? అని మాలంక్య డడిగిన ప్రశ్నములకు శ్రీ బుద్ధభగవాను డుత్తర మొసంగియుండనిమాట యథార్థమేకాని యీ మౌనీభావమువలన శ్రీ బుద్ధదేవుడు నాస్తికుండని వచింప సాధ్యపడదు. కార్యకారణ సంబంధ నిబద్ధమగు విశిష్ట ప్రపంచమునకును, విజ్ఞాన పరిజ్ఞాతమగువిశ్వమునకును నావలె నెద్దియో నిత్యమును, సత్యమునునగు పరముండెనని బుద్ధప్రభు వూహిం

-చియుండును. ఏతత్పరతత్త్వము నెఱుంగనివాఁడగుచో నతఁడు చార్వాకులవలె మృత్యువునే నిర్వాణముగ భావించియే యుం డెడివాఁడుకదా! శ్రీ బుద్ధదేవుఁడు నిర్యాణమును, నిర్వాణము నొక్కటిగ భావించియుండలేదు. శ్రీ బుద్ధచంద్రుని సమకాలికు లెల్లరును, వేదార్థోపనిషదర్థానుభవ సంపన్నులగు తత్కాల భారతీయులందరును దేశకాలాతీతమగు శాశ్వతసత్త్వమునందు విశ్వాసమునుగల్గియుండిరి. అట్టివారికి నిర్యాణమే నిర్వాణమను వాదము రుచించియుండదు. ఇంతియేకాక శ్రీ బుద్ధుని మూకీ భావ మజ్ఞానసూచకముగ భావించు టెంతయు వెఱ్ఱి! తాను సత్యము ననుభవించి యుంటిననియు, మానవకోటి కా సత్య స్వరూపమును బోధింపగలననియు బుద్ధుఁడు ప్రాయికంబుగ నిశ్శంకితమతియయి వక్కాణించియున్నాఁడు. అతఁడు సత్యము నెఱుంగనివాఁడేయగుచో, సంశయాత్ముఁడే యగుచో నితరుల కా విధంబున జెప్పియుండఁడనుట రూఢి. ప్రాయశః శ్రీ బుద్ధ భగవాను డుపనిషదుద్దిష్టమయిన పరబ్రహ్మము నెఱింగియు సత్పదార్థము ననుభవించియు, తద్భగవత్పదార్థము వాక్కుచే నన్యులకు నుపదేశింప వలనుపడదనియు నెవరికి వారే యద్దా నిని స్వానుభూతిచే నిర్ణయించుకొను టుచితంబనియు గ్రహించి ఆ కారణంబునం జేసియే పరబ్రహ్మమునుగూర్చి వాచా ప్రాగ ల్భ్యము నధికముగా బ్రదర్శించి యుండలేదని నేను భావింపు చున్నాఁడను. మఱియు బ్రహ్మసాక్షాత్కారము అంతర్దృ ష్టిచేతను, ఆధ్యాత్మిక కృషివలనను, తదనుకూలోత్తమ జీవిత

నిర్వాహంబునను లభ్యమగునదియే కాని గంభీరంబులగు వేదాం
తోపన్యాస పరంపరలయందును, తార్కిక కౌటిల్య ప్రదర్శన
మందును హస్తగత మగునది కాదు. లక్షణమాత్ర పరిజ్ఞానమున
ననుభూతమగు విషయము కాదు పరబ్రహ్మ. కారణప్రపంచ
మున కావల పరతత్త్వ మొండు లేదని శ్రీబుద్ధదేవు డెన్న
డును, యెచ్చోటను నుడివియుండలేదు. కాశికాపురంబున
జగద్విఖ్యాతముగ నితఁ డొసంగిన గంభీర మహదుదారోపన్యా
సమందు పరతత్త్వ సూచనలు రూఢిగ గోచరింపుచున్నవి.
అపుడు బుద్ధుఁ డీ వడువున నుడివియున్నాడు:— "జననశూన్య
మయినదియు, ఆదిరహితంబును, నిర్మాణదూరంబును, నిర్గ్రథి
తంబును నగు నెద్దియో యొకటి యున్నదనుట వాస్తవము.
ఓ భిక్షువులారా! అట్టిది లేనియెడల జన్మాదియుక్తంబయి,
సంగ్రథితమయి, కల్పితమయి యొప్పు యీ భూత ప్రపంచ
మునుండి విముక్తింజెంద మనకు మార్గమే గోచరింపదు."
ఉపనిషత్కర్తలును, శ్రీ బుద్ధభగవానుడును మానవమేధస్సు
యొక్క పరిమితిని భగవత్పదార్థమును గుర్తెరుంగుటలో నీపరి
మితి యొక్క దౌర్బల్యమును గ్రహించియే యున్నారు. ఏతద్ధే
తువుననె శ్రీ బుద్ధప్రభువు పరబ్రహ్మ మిట్టిదని యనుభవపూర్వ
కంబుగ నిర్వచింప సాహసించి యుండలేదు. కాని తాత్కాలిక
పద్ధతుల ననుసరించి, పరిశోధించి చూచి ధర్మమే బ్రహ్మమని
నిర్వచించెను. ఉపనిషత్తులందు ధర్మమును సత్యమును యేకా
ర్థసూచకములుగనే యెంచబడినవి. బుద్ధదేవునకు నైతికశిక్ష

యందు నపూర్వమగు విశ్వాసముకలదు. అందువలననే యతడు పరతత్త్వమును ధర్మమూర్తిగ భావించుచుండెను. బౌద్ధమత మున ధర్మమే బ్రహ్మమయినది. ఇందున బౌద్ధప్రబోధము లుప నిషదర్థముల కనుగుణ్యముగనే రాణించుచున్నయవి.

తమ గ్రంథ మున్నతాశయములపట్ల తమ కుదారమగు జిజ్ఞాసయు, నపారమగు భక్తియు నున్నటుల స్పష్టీకరించుచున్న యది. మతప్రచారకులు పాక్షిక వాదంబులతోడను, నిరుప యోగములగు స్వాభిమానములతోడను నిరంతరము పెనగు లాడుచుండ తత్త్వజిజ్ఞాసువు లెపుడును నిష్పాక్షిక బుద్ధితో, సమదృష్టితో సద్విషయప్రతిపాదనము సలుపుచుందురు. తత్వా ర్థులకు సహజభూషణంబులగు నీయుభయ సుగుణములు తమ యం దున్నటుల బుద్ధపురాణ ముద్ఘోషించుచున్నయది. పూర్వ చరిత్రాంశములనెల్ల దులతూచి నిర్ణయించుటయందలి తమ బుద్ధివిచక్షణతయు, హిందూమత ధర్మాదర్శములపట్ల తమకు గల ప్రగాఢాభిమానమును, తన్మతధర్మములగల దోషముల ఖండించుటలో తమరు ప్రదర్శించిన మనస్థైర్యమును, భారత రామాయణాదుల కాలనిర్ణయ మొనర్చిన పద్ధతియు, శంబుక వధా విమర్శనము, పురుష సూక్తోక్త వర్ణనిర్ణయమునుగూర్చిన భవదుత్తమాభిప్రాయము నివి యన్నియు నాకెంతయు హృద యాహ్లాదకరము లయినవి.

బౌద్ధమత మాంధ్రరాష్ట్రమున నొకవిధముగ తలయె త్తినది. త న్మతవిజృంభణోద్యమమునం దాంధ్రదేశమునకు

తమ గ్రంథమెంతయు నభిరుచిని, యుత్సాహమును గలుగఁజే యగలదని నిస్సందేహముగా వచింపుచున్నాఁడను. తమ రీమ హాద్గ్రంథమును విరచించి, ఆంధ్రపాఠకలోకమునకు సమర్పించి మహోపకార మొనర్చినందుల కెంతయు దమ్మభినందింపుచున్నాఁడను. తమకు సకలానందైశ్వర్యములు లభింపఁగోరు.

భవచ్ఛ్రేయోభిలాషి,
యస్. రాధాకృష్ణ.

---

(2) గీర్వాణాంధ్రాంగ్ల సాహిత్య సరస్వతులు,
కట్టమంచి రామలింగారెడ్డి, ఎం. ఏ. గారు,
ఆంధ్రయూనివర్సిటీ వైస్‌ఛాన్సలరు.

శ్రీయుతులు దుగ్గిరాలబలరామకృష్ణయ్యగారిచే వ్రాయఁబడిన బుద్ధపురాణమును అక్కడక్కడఁ దడవి చదివి చవులు చూచితిని. ఆభాగముల యొక్క రసమును, రుచినిబట్టి ఆమూలాగ్రముగఁ దనివితీఱఁ జదివి ఆనందించుట కెప్పుడు చాలినంత కాలసౌకర్యము కలుగునాయని యువ్విళ్లూరుచున్నాను.

ఇది ఇప్పుడు ఆంధ్రభాషలో ప్రచురణకు వచ్చిన మహోత్కృష్టమైన గ్రంథములలో నొక్కటి. శ్రీబుద్ధభగవానునిచరిత్రాదులు విపులముగాను, విశదముగాను సరసమైన శైలిలో నిందు వివరింపఁబడియున్నవి. గ్రంథకర్త వయస్సునఁ మిక్కిలియు జిన్నవారు. వీరు పాండిత్యమునందును, సాహిత్యము

నందును అసాధారణ ప్రజ్ఞాశక్తి సమేతులు. వీరు రచించిన యీపరమపావనమును, ఆత్మోత్కర్ష కారకమును నగు శ్రీ బుద్ధపురాణము ఆంధ్రదేశ దిగ్విజయము చేసి అలరుగాత! బౌద్ధమతముయొక్క ప్రాశస్త్యమును గుఱించి చెప్పఁబూనుట అధికప్రసంగము. సర్వదేశముల యందలి చరిత్రవేత్తలు, తత్త్వశాస్త్రజ్ఞులు, మతపరిశోధకులు దానియొక్క గౌరవమును మూఢులయొక్కయు, మూర్ఖులయొక్కయు మనస్సులకు, హృదయములకు సమితమెక్కునట్లు ఏకకంఠముగ వ్రాసియున్నారు. జపాను, చీనా మొదలగు దేశములకు ఆమతము చేసిన మేలును వర్ణింప నలవికాదు. హిందూదేశమును దానిచే గడింపవలసిన సిరులనేకములు కలవు. అట్లగుట దానిని యిట్లు ప్రకటనకుఁ దెచ్చిన శ్రీదుగ్గిరాల బలరామకృష్ణయ్య గారు ఆంధ్రులయొక్క మెప్పునకు, కృతజ్ఞతకు సర్వవిధముల పాత్రులు.

బెజవాడ
9—10—27

కట్టమంచి రామలింగారెడ్డి.

---

(8) 'సాక్షి'కర్తలు, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు:—

అయ్యా ?

మానవాదర్శ గ్రంథమండలిలో మీరు రచియించి పంపిన బుద్ధపురాణమును మిగులఁ గృతజ్ఞతతో నందుకొంటిని.

సాంసారికములగు కొన్ని యిబ్బందులచే దాని నామూల గ్రమముగఁ జదువలేకపోయితి? అచ్చటచ్చట మాత్రమె చూచితిని. అనేక బౌదగ్రంథములను సవిమర్శనముగఁ జదివి, వాని సారమును సమంజసముగ సంగ్రహించి బుద్ధివిశేషమున యథార్థమని మీకు స్పష్టపడిన దానిని దృఢముగ గ్రహించి యీగ్రంథమును మీరు వ్రాసినట్లు సంపూర్ణముగ స్పష్టపడు చున్నది. గ్రంథరచనయందు మీకు గానబడుచిన స్వాభి ప్రాయమండనము, పరాభిప్రాయ ఖండనము, నితరమత సాం ప్రదాయజ్ఞానము, పట్టుదల, వాక్పటిమయు శ్లాఘాపూర్ణము లయి యున్నవి. మీగ్రంథము నాంధ్రలోకమంతయు నాద రించునుగాక! అన్ని పురాణములను వలె దానిని గూడ నం దఱు పఠింతురు గాక! దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని బరమేశ్వరుఁడు మీకుఁ బ్రసాదించి యింకోధికమైన సారస్వత కృషి మీచేఁ జేయించునుగాక!

పిఠాపురము.
14—11—27

చిత్తగింపుడు,
పానుగంటి లక్ష్మీనరసింహరావు.

---

(4) దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు :—

శ్రీయుత దుగ్గిరాల బలరామకృష్ణయాఖ్యునిచేత విర చితమైన బుద్ధపురాణమును వందనములతో నందుకొంటిని. గ్రంథకర్త వయస్సున పిన్నవాడయ్యును బుద్ధియందు కడు

పెద్దయనుటకు గ్రంథమునం దెల్లయెడల విపులీకృతములగు నుదారభావ పరంపరలును మత సిద్ధాంత పరిజ్ఞానమును, ప్రౌఢకల్పనాశక్తియు, నిదర్శనములు. గ్రంథశైలి సంస్కృత భాషా భూయిష్ఠమయి యించుక క్లిష్ట మయ్యును గంభీర మును, మధురమును, అనర్గళమునై యొప్పుచున్నది. లోక మున జనులు నానాట భోగైశ్వర్య పరాయణులును పర మార్థ విచారమునకు దూరులును నగుచుండుటచేతఁ దయా సముద్రుడును, లోకపావనమూర్తియు, మహావిరాగియు, పరమత్యాగియు, నైమహోన్నతజ్ఞాన శిఖరాగ్రమున నెక్కి విశ్వమానవకోటికి శాశ్వత నిశ్శ్రేయసాధనమగు బోధగా వించిన బుద్ధదేవుని విశుద్ధభావముల ప్రౌఢమగు గ్రంథ మూలకముగ ప్రకటించి ప్రజలహృదయముల పవిత్రముల గావించి ప్రాపంచిక తుచ్ఛసుఖంబులనే జీవితపరమావధిగ నెంచక యథాశక్తి లోకసేవను ధర్మసిద్ధాంత ప్రచారముచే గావించబూనిన యీ గ్రంథకర్తగారి ప్రయత్న మత్యంత శ్లాఘాపాత్రము.

గుంటూరు
10—10—27

—కొండా వెంకటప్పయ్య.

సుప్రసిద్ధ జాతీయవాదులగు ఉమర్ అలీషా కవిగారు:—

శ్రీబుద్ధపురాణము:

క॥ మానితబహుధర్మపథ
స్థానము వివిధార్థ తత్త్వ • సంలభ్యము ని
ర్వాణపదంబగు బౌద్ధపు
రాణము సంహితయనంగ • రాజిల్లుకదున్.

ఉ॥ బుద్ధపురాణమున్ విపులమున్
బొనరించి రచించినట్టి మీ
యిద్ధయశంబు లోకమున
నెంతయు శాశ్వతమొందు టారయన్
సిద్ధము దుగ్గిరాలకుల
శీతకరా బలరామకృష్ణ మీ
శుద్ధపవిత్రపుణ్యమార్గ మొగి సూరిజనస్తవనీయ మేయెడన్.

ఉ॥ వయసున చిన్నవాఁడు గుణ
వంతుఁడు మాబలరామకృష్ణయా
హ్వాయుఁడు జినః పురాణమును
భారతఫక్కిని దింపి బుద్ధ గీ
తయు వివిధేతిహాసములు
తత్త్వరహస్యము వ్రాసి ధర్మ సం
శయముల రూపుమాపె బహు
శాస్త్రములన్ విశదీకరింపుచున్.

క॥ ఇమ్మహి నేలిరి ధర్మ ప
థమ్మున మీపూర్వపృథులు • తగమీరలు త
త్త్వమ్మ నుడువుచుండిరి ని
క్కమ్ముగ మీకమ్మవారు ఘనులన్నియెడన్.

శా॥ బుద్ధుండీజనులాడు దేవునిమదిన్ • బూజింపఁగా లేదు సం
విద్ధిన్ వాని మతంబు వ్యక్త "మసదే • వేదంపురాసీత్త" నే
శుద్ధపరిస్ఫుట శూన్యవాద్యముసకే • జోహారుగావించి సం
బద్ధుండై జగముద్ధరించె నిజ • నిర్వాణంబు సంధింపఁగన్.

ఉ॥ బౌద్ధమతంబు నేటికిని • భారతవర్షమునందు నున్న నీ
పద్ధతి దాస్యజీవనము • వచ్చునె యన్యులువచ్చి దేశమం
దిద్ధపదంబు మోపగల • రే నిజరాజ్యము పోవునే స్వరా
జ్యోద్ధరణంబుకై పెనఁగు • టుండునె యీమహనీయు
[లెల్లరున్.

తే॥ గీ॥ అస్తినాస్తికవాదంబు • లందు నిజము
మనకుఁ దెలియదు వేరికే • మతము నిష్ట
మైన నదె పొందఁదగును మోక్షార్థ మఖిల
వ్యాపకుం డీశుఁడన శూన్యుఁ • డన్న నొకటె.

సీ॥ బుద్ధుని నిజజీవ • పద్ధతి సన్మత
సంస్కార విధము సం • స్తవము నిజము,
నీతి నేర్పుటకిది • నిజమగు గ్రంథంబు
హింసనుమాన్పు సం • హితనిజంబు,
అధ్యాత్మతత్త్వంబు • నరయు జిజ్ఞాసుల
కమృతోపమానమై • యలరుచుండు,
గ్రంథమాద్యంతంబు • కడుసొంపు నింపుచు
విసుగుజనింపదే • విషయమందు,

తే॥ గీ॥ భాష గంగాప్రవాహమై • పరిఢవిల్లు
శబ్దములు ముద్దులొలుకుచు • జాలువారు
భావము లుదారములు శాస్త్ర • వాదమునను
రాణవెలుఁగొందు బుద్ధ పు• రాణమందు.

తే॥ గీ॥ మానవాదర్శ సద్గ్రంథ • మండలికిది
ప్రథమ పుష్పంబుగా సరు • ర్పణముఁ జేసి
ధన్యతనుగూర్చె మాయాంధ్రి • ధరణికెల్ల
బుద్ధభగవానుని చరిత్ర • బోధపఱచి.

పి ఠా పు ర ము,
20—10—27.

ఇట్లు,
ఉమర్ అలీషా.

---

రాజా మంత్రిప్రెగడ భుజంగరావుబహద్దరుగారు, యమ్.ఏ.యం.

శ్రీబుద్ధ పురాణమను నామంబునం బరగు మహో త్కృష్ట గ్రంథ రాజమును గ్రంథకర్త నాయభిప్రాయార్థమై పనుప వందనపూర్వకంబుగా నందుకొని సావధానచిత్తుండనై సాంగముగఁ బరించితిని. కృష్ణామండలములోని యంగలూరు గ్రామవాస్తవ్యులగు మహారాజశ్రీ దుగ్గిరాల బలరామకృష్ణ య్యగారీగ్రంథమును విరచించిరి. గ్రంథరచనావిధానమును బరికింప వీరు సంస్కృతాంధ్రాంగ్ల భాషలయం దసమాన ప్రావీణ్యతఁ గలవారని పాఠకులకుఁ జెప్పకయే గోచరమగును. చిన్నయక్కరములతో ముద్రింపఁబడిన 127 పుటలుగల విపుల మగు పీఠికను వ్రాసిరి. కవిచంద్రుని విద్యావైశద్యమెల్ల నీ

వీరి కాపఠనమువలననే ప్రిస్ఫుటమగుచున్నది. వీరి విశేషముగా లోకానుభవజ్ఞానమును, సదసద్వివేచనాపటిమయు మిక్కుటముగఁ బ్రశంసాపాత్రములు. బుద్ధదేవుని జీవితచరిత్ర 477 పుటల గ్రంథము; పిదప 244 పుటల బుద్ధగీతలు కలవు; విశేషాంశములు 345 పుటల గ్రంథము కలదు. చరమభాగమున ఛందోబద్ధమగు 90 గీతపద్యములుఁ గూడ గలవు. గ్రంథకర్త వింశతిహాయనములతరుణ వయస్కులని వినియుంటిని. ఇంతటి స్వల్పప్రాయంబుననే సకల విద్యాపారంగతులయి యిట్టి మహోత్కృష్ట గ్రంథమును ఆంధ్రలోకమునకు సమర్పింపఁ గలుగుటఁజూడ భారతీదేవి వీరి రసనాగ్రమునఁ దాండవము సలుపుచున్నదియా యను భ్రాంతి జనించుచున్నది. గ్రంథము గీర్వాణపదభూయిష్ఠమయి దీర్ఘసమాససంఘటితమయ్యుఁ బాదరసమువలెఁ బ్రవహించుచున్నయది. భాషాపరిజ్ఞానము నించుక గాంచిన ప్రాజ్ఞుల కానందసంధాయకమగు శైలియని చెప్పనొప్పును. ప్రకృతకాలానుసారముగ నెంచునెడల భాషాసేవఁ గావింపని వారికి శైలి కఠినమని తోఁపకమానదు. అంతమాత్రమున లోపమువాటిల్లనేరదు. గ్రంథరచనా విధానము సర్వోత్కృష్టముగ నున్నదని నే నపారానందము నందితిని. వాక్యరచనయం దెచ్చటను ననుగుణ పదసంఘటనకై తడవుకొనిన సందర్భము కాన్పింపదు. హృద్గతాభిప్రాయములఁ దేటతెల్లముగ వివరింపలేకపోయిన తావొక్కటియు నింతటి యుద్గ్రంథమున నెచ్చటను బొడకట్టలేదు. గీర్వాణ భాషయం

దు కాదంబరి యెట్లు నవరసాలంకార భూయిష్ఠమయి హృద
యంగమముగ నుండునో యాంధ్రమున వచనకావ్యములలోనీ
గ్రంథమట్టిస్థానమున కర్హమయినదని నాయభిప్రాయము. ఇతి
వృత్తము శ్రీబుద్ధదేవుని జీవితచరిత్రమును, బోధనావిశేషము
లును గలదియగుటచే నత్యున్నతస్థానమును వహించినది. ప్రపం
చమున విశేషముగ వ్యాప్తమయిన మతములలో బౌద్ధమత మొ
క్కటి కాన నట్టి మతకర్తయొక్క జీవయాత్రయు, బోధనయు
నుత్కృష్టముగ నుండునని వేఱుగఁ జెప్పవలయునా? ఏతద్గ్రం
థమున నచ్చటచ్చట విపులీకరింపఁబడిన రాద్ధాంతసిద్ధాంతము
లతో పూర్తిగ నేకీభవింపజాలను. అట్టి యభిప్రాయభేదములఁ
జర్చించుటకిది సమయముకాదు గాన విరమించెదను. మొత్తము
మీఁద గ్రంథకర్త బహువిశాలహృదయముతో నీగ్రంథ
మును స్పృశించెను. దయామయుఁడగు భగవంతుఁడాయురా
రోగ్యైశ్వర్యాభివృద్ధుల నీ గ్రంథకర్తకుఁ బ్రసాదించి చిరకాల
మాంధ్రభాషాసేవ నీ పండితోత్తమునిచేఁ గావింపఁజేయుఁగావు
తమని మనస్ఫూర్తిగఁ బ్రార్థించుచున్నాఁడను. మానవాదర్శ
గ్రంథమండలివా రీబుద్ధపురాణమును ప్రథమ పుష్పముగఁ
బ్రకటించి స్వీయనామమును సార్థకమొనరించుకొనిరి. ఆంధ్ర
లోకమునఁగల ధనాఢ్యులెల్లరు నిట్టి గ్రంథములఁ గొని ప్రక
టనాధికారుల యుద్యమముల సార్థకపఱచుట ధర్మము. గ్రంథ
ములఁ గొన నుపపత్తికలవారెల్లఁ బ్రకటింపబడుఁ బ్రతిగ్రం
థము నొక్కొక ప్రతినిగొని భాషాసేవకులకుఁ బ్రోత్సాహ

మును గల్గించినఁ గాని భాషామతల్లి నవనవాలంకార విభూషి తయై విరాజిల్ల నేరదని విన్నవించుచుంటిని.

"నమో బుద్ధాయ, నమో ధర్మాయ,
నమస్సంఘాయ, నమోనమః"

ఏలూరు,
18—10—27.

ఇట్లు సజ్జన విధేయుఁడు,
రాజా మంత్రిప్రెగడ భుజంగరావు.

---

(7) శ్రీ వడ్డాది సుబ్బారాయకవిగారు.

అయ్యా!

మీరు నాయందుఁగల యాదరాతిశయముచేత పంపిన బుద్ధపురాణమనెడు మానవాదర్శగ్రంథమండలి ప్రథమ పుష్పము నా కత్యంతామోదము గలిగించినది. ఈ పుష్పము పరిమాణమునుబట్టి సహస్రదళ కమలముగా భావించుచు న్నాను. దీని మొదటి "సృష్టివైచిత్ర్యము, విశ్వహృదయము" అను రెండు విషయములుమాత్రము నేను జదువఁగలిగితిని. వయోధర్మమునుబట్టి నా కన్నులు చిరపఠనమును సహింపకు న్నవి. అయినను ముఖవర్చస్సే హృదయభావమున కాదర్శ ముగా నుండును. ఈ రెండు శీర్షికలలోని యంశములను నేను జదువుచున్నప్పుడు భగవత్సృష్టి విశేషములును, భారత భూ పూర్వౌన్నత్యమును కరతలామలకముగా గోచరించుటవలన గలిగిన సంతోషముచేతను, ప్రస్తుత హీనస్థితి తలఁచుకొనుట

వలనఁ గలిగిన విచారముచేతను నా నేత్రములనుండి యశ్రు బాష్పములు స్రవించినవని చెప్పుటకంటెఁ దద్రచనాకౌశల మును గూర్చియు, గ్రంథప్రాశస్త్యమును గూర్చియు వేరు మాట లనవసరములని భావించుచున్నాను. పరమేశ్వరుడు మీ యుద్యమమును నిరంతరాయముగ సాగించి అందువలన మానవలోకమునకు మహోపకారము గలుగునట్లాశీర్వదించుఁగాక!

రాజమహేంద్రవరము, 11—10—27. } వడ్డాది సుబ్బారాయుడు.

---

(8) ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయాధ్యక్షులు,
శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు.

అయ్యా!

పరిమళ లేశమాత్రంబునఁనే ఫలపరిపాకస్థితి ప్రకాశితం బైనయట్లు, ప్రథమోపన్యాసమాత్రముననే పాండిత్య ప్రకర్ష ప్రస్ఫుటితంబైనయట్లు, బాహ్యప్రకృతి పరిచయమాత్రంబు ననే పరమపురుషోత్కృష్టత ప్రబోధితంబైనయట్లు పరిమితభాగ పఠనమాత్రంబుననే మీ బుద్ధపురాణప్రాశస్త్యము ప్రకటితం బగుచున్నది. శ్రీ బుద్ధదేవుఁడు పరమేశ్వరుని దశావతారంబు లలో నొక్కఁడుగాఁ బరిగణింపఁబడుచున్నను ఆ మహాత్ముని దివ్యచరిత్ర మింతవరకును బదునెనిమిది పురాణములతోఁ

జేరని కొఱంతను దీర్పఁగలిగిన మీ పరిశ్రమ ప్రశంసనీయమై, ధన్యమయినది. మాతృభాషయగు గీర్వాణవాణికూడ నెన్నఁడు నెఱుంగని యీ యమూల్య గ్రంథ రత్నాలంకారముచే మన యాంధ్రభాషామతల్లి నలంకరించినందులకై యాంధ్రమహా జను లెల్లరును మీ యెడలఁ గృతజ్ఞులయి యుండకతీరదు.

చిత్తగించవలయును.

పిఠాపురము.<br>
28—10—27.

మీ ప్రియమిత్రులు,<br>
వేంకటపార్వతీశ్వర కవులు.

---

(9) సుప్రసిద్ధకవిపండితులు—సంస్కర్తలు,
ఆదిపూడి సోమనాధరావుగారు.

మిత్రరత్నమా! నమస్కారము.

మీరు దయతోఁ బంపిన బుద్ధపురాణమును, ఉత్తరమును అందినవి. నేను బహువాత పీడితుఁడనై యుంటఁజేసి ప్రత్యుత్తరము వ్రాయజాలకుంటిని. క్షమింతురుగాక. మానవాదర్శ గ్రంథమండలికిఁ బ్రథమమున బుద్ధపురాణమును మీరు సమర్పించుట యెంతయు సమంజసము. మానవాదర్శమూర్తియగు బుద్ధదేవుని జీవితము నిరుపమానము. దానిని మీరు విపులముగను, రసవంతముగను వ్రాసి మాయందఱ కృతజ్ఞతకుఁ బాత్రులైయున్నారు. చరమావస్థయందుండు

నా జీవితమునకు మీ బుద్ధచరిత్రము అపారమగు శాంతిని ఆనందమును గలిగించినది. దానిని మాటిమాటికిం జదువుచు నానందించుచున్నాఁడను. అన్ని విధముల చేతను మీ పాత్రము ఉత్తమమై యలరారుచున్నది. మానవాదర్శగ్రంథమండలిని మీవంటివారనేకులు దోడ్పడి చిరకాలము జీవింపఁజేతురుగాక. ఒక వ్యక్తి ఆస్తికుఁడా నాస్తికుడా అనునది వానిమాటలను బట్టికాని, యుపన్యాసములను బట్టికాని, గ్రంథములను బట్టికాని కాదు. వాని జీవితమునుబట్టి పరీక్షింపవలసియున్నది. తన జీవితమంతయు దయకొఱకే వినియోగపఱచిన బుద్ధదేవుఁడే ఆస్తికుఁడు కాఁడేని మఱి యెవ్వఁడాస్తికుఁడు? పరిశుద్ధమైన వస్త్రములను దొడుగవచ్చును. తీయని మాటలాడవచ్చును. దీర్ఘోపన్యాసములను, ప్రార్థనలను సలుపవచ్చును. మానసమును పరిశుద్ధముగ నుంచుకొని జీవితమంతయుఁ బరోపకారమునందే వినియోగపరచుట మాత్రము మిక్కిలి కష్టము. విశేషించి వ్రాయనసమర్థుఁడను గాన నింతటితో విరమించుచున్నాను. మీధర్మోత్సాహము పరమేశ్వరుని కృపచే నానాట వర్ధిల్లునుగాక.

మదాసు, మైలాపూరు,
19—10—27.

విధేయ మిత్రుడు,
ఆదిపూడి సోమనాథరావు.

(10) కృష్ణాపత్రికా సంపాదకులు, ముట్నూరి కృష్ణా రావుగారు:—

ఒక కాలమున ఆంధ్ర మండలము బుద్ధ స్తూపముల తోడను, బౌద్ధవిహారములతోడను వెలయుచుండెను. బౌద్ధ ధర్మ భిక్షుకులచే బునీతమైన పుణ్యభూమి యిది. అయినను బౌద్ధధర్మ రహస్యమును దెలుపగల గ్రంథ రాజమొకటియు తెలుగులో నింతవఱకును లేకపోవుట శోచనీయము. బౌద్ధ ధర్మమునుగూర్చి పండితులలో సహితము చాల యపోహాలు కలవు. ప్రజలలో నీవిషయమైగల పరిచయము మృగ్యము. ఇప్పు డీగ్రంథ రాజ మీలోపమును దీర్చగలదు. ద్వితీయ ఖండముగూడ త్వరలో వెలువడుటకు నీగ్రంథకర్తకు దగిన ప్రోత్సాహ మొసగబడును గాక!

బందరు
30—10—27

ము. కృష్ణారావు.

---

(11) రాజా సర్. పి. రామారాయణీం,

ఎం. ఏ. ఎం. ఎల్. సి. గారి ప్రత్యేకలేఖ.

My dear Balarama Kristnaiah Choudari garu!

Thanks for your kind presentation of two copies of your Buddha puranam. I am going through the work. I shall be glad to express my opinion on the work later on. But let me say that in preparing

this account of Buddha's life you have shown yourself to be a profound student of the Hindu religious literature. I am sure your work will be read with great interest.

Yours Sincerely,
(Sd.) P. RAMARAYANUM,
Raja of Panugal.

(11) ఆంధ్రానువాదము—

ప్రియమిత్రులగు బలరామకృష్ణయ్య చౌదరిగార్కి.

తమరు ప్రేమతో బంపిన బుద్ధపురాణము యొక్క రెండు ప్రతులును జేరినవి. వందనములు. నేను పురాణమును జదువుచున్నాడను. నే నానందపూర్వకముగా నా యభిప్రాయమును బిమ్మట వెల్లడించెదను. శ్రీ బుద్ధచరిత్రమును దయారుచేసి తమరు హిందూమత సాహిత్యమునందొక గంభీరమైన గృషి సలిపిన విద్యార్థిగ తమ్ము బ్రకటించుకొనియున్నారు. తమ గ్రంథ మాంధ్రలోకముచే నిస్సందేహముగ నాదరింపబడగలదని నుడువుచున్నాడను.

భవద్ధితాభిలాషి,
పి. రామారాయణిం (పానుగల్లు ప్రభువు.)

---

(12) స్వార్థత్యాగులగు బులుసు సాంబమూర్తి గారు.

ఓం

శ్రీయుత దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారిచే రచింపబడిన బుద్ధపురాణము మహాదాశయముల యొక్క ఫలితము.

గ్రంథకర్త సత్యధర్మప్రబోధ గీతావళి యొక్క అంతిమవిన్నప మున తన భావములను చక్కగ నీ క్రింది పద్యమున బొందు పఱచిరి:—

"దేశహితమునుగోరని • తెలువులేల!
నీతినెడబాయు కవుల యా • నేర్పులేల?
ముక్తికిఁ జాడఁదెల్పని • పొత్తమేల?
ఆంధ్రసోదరవరులార! ఆర్యులార!"

1085 పుట.

ముక్తిదాయకమగు బుద్ధదేవుని సాధనవిస్పష్టముగ నాంధ్రసోదరులకు తెలియ జెప్పుటయే గ్రంథముయొక్క పరమలక్ష్యము.

సుమారు 2500 సంవత్సరములకు బూర్వము జన్మించి మానవకోటికి నిర్వాణ సందేశమును బ్రసాదించిన బుద్ధదేవుని చరిత్ర, పితృమాతృ వంశములు, జననము, బాల్యము, వివాహము, వైరాగ్యోదయము, గృహపరిత్యాగము, దేశ పర్యటనము, అహింసా ప్రబోధము, బోధిప్రాప్తి, నూతన ధర్మ ప్రచారము, అంతిమ జీవితము మున్నగు విషయములు బుద్ధ పురాణమందు విపులముగ వర్ణింపబడినవి. బుద్ధగీతయొక్క ఆంధ్రానువాదమును ముముక్షువుల కత్యంతోపయోగకరము. బ్రాహ్మణవర్గమున నుత్తమ బ్రాహ్మణ లక్షణములు, మాన వున కాచరణయోగ్యములగు ధర్మములు స్పష్టీకరింపబడి యున్నవి. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము,

క్రోధము, రాగము, ద్వేషము, నరకము, భైక్ష్యము మున్నగు విశేషాంశములు యోగీతయందు విపులముగ నుపదేశింపబడినవి. పరిశిష్టప్రకరణమున హిందూబౌద్ధ క్రైస్తవమతముల యొక్క సామాన్య ధర్మములు విశేషప్రయత్నముచే నిరూపింపబడినవి. బౌద్ధసాధకుని ధ్యానయోగము, విశ్వప్రేమ, అహింసావ్రతము, సత్యనియమము, ధర్మదీక్ష, అహంకార మమకార రాహిత్యము; కామక్రోధ లోభ మోహాదుల జయము, నిర్వాణగూఢ రహస్యము చక్కగ నిర్వచింపబడినవి.

బౌద్ధనిర్వాణము, స్థితప్రజ్ఞుని బ్రహ్మనిర్వాణము, క్రైస్తవుని పరిశుద్ధాత్మానంద ప్రాప్తియు నొకటిగనే గ్రంథకర్త సిద్ధాంతీకరించెను: "సాధనము వలన నంతర్దృష్టి బంధనము విముక్తమయినంతనే సాధకుని యాంతరంగిక గూఢ తత్త్వదివ్య ప్రకాశము గోచరమగును. ఈపరమ ప్రకాశమును మనము బ్రహ్మమని కాని, హోలీగోస్టు అని కాని, బ్రహ్మకాయమని కాని చెప్పుకొనవచ్చును. నామభేదంబున నయ్యది వికృతము కాజాలదు. వీనియన్నింటియొక్క మూలపదార్థ మొక్కటియె" 305 పుట. ఇత్యాది వాక్యములయందు సర్వమత సమత్వము స్థిరపఱచబడి యున్నది.

బౌద్ధమతము, క్రైస్తవమతమునయిత మద్వైతమతముల నియే గ్రంథకర్త యభిప్రాయము—"బౌద్ధజీవితలక్ష్యము భారతీయుల యద్వైతసిద్ధాంతమున కెంతయు మెరుగువెట్టు చున్నయది. క్రైస్తవమతమీ యద్వైతభావ మందే శుద్ధానందము

నందుచందమున బౌద్ధమతము సహితమటులే సేయుచు హిందూ మత సిద్ధాంతమగు "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" మును సార్థక పఱచుచున్న యది" 785 పుట. బౌద్ధమత మొకస్వతంత్రమతము కాదనియు, ఉపనిషన్మతసారాంశమే యనియు, నాస్తిక మతము కాదనియు వైదికమతమేయనియు గ్రంథకర్త తన యభిప్రాయమును స్పష్టముగ వెల్లడించియున్నాడు. ఉపోద్ఘాతము 93 పుట చూడుడు. అద్వైత మతస్థాపకులగు శంకరాచార్యుని ద్వైతులు ప్రచ్ఛన్న బౌద్ధునిగ బరిగణించుచున్నపుడు బుద్ధు డద్వైతమత ప్రబోధకుడుగ భావింపబడుట యం దెట్టి వైచిత్ర్యమును లేదు. "బుద్ధుడు వైదిక మతోక్త విధంబుననే మానవుడు గతజన్మ కృతపాపఫలంబులచే జన్మచక్రంబున బడి సుఖదుఃఖాదుల ననుభవింపుచున్నాడనియు, పునర్జన్మ కలదనియు, సుకృతదుష్కృత పరిణామము లవశ్య భోక్తవ్యములనియు, సకలమానవజాతికి సత్య దయా క్షమాదులు మంతవ్యములనియు, తృష్ణావిసర్జనమే దుఃఖనాశకరమనియు, సన్యాసమే సర్వజీవ శ్రేయోదాయకంబనియు, నైహికపదార్థము లన్నియు నశించునవనియు, నిర్వాణమే శాశ్వతంబును, ప్రాప్యంబునయి వెలయుచున్నదనియు మేఘగంభీర స్వనమున బోధించి యున్నాడని గ్రంథకర్త తన సహజపాండిత్య ప్రతిభతో వర్ణించియున్నాడు. ఉపోద్ఘాతమున నార్ష మతము, వేదములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణములు, దర్శనములు, నీతిగ్రంథములు మున్నగు

వనేకవిషయముల గూర్చి ముఖ్యాంశములను గ్రంథకర్త సంక్షేపముగ వ్రాసి తనవిజ్ఞానసంపత్తిని జాటియున్నాడు. ఆంధ్రులు బుద్ధపురాణమును జదివి, బుద్ధదేవుని ధర్మముల గ్రహించి ధన్యులయ్యెదరుగాక! అశోకుని కాలమున బౌద్ధ మత ప్రచారమును విరివిగా గొనసాగించి వీరికాపురమును పాదగయగ శాశ్వత ప్రతిష్ఠాపనము జేసిన యాంధ్రులు బౌద్ధ మత గ్రంథములను బఠించుటయం దెప్పుడా నాసక్తిగలిగియే యుండెదరు. శ్రీకృష్ణభగవానుడును, బుద్ధభగవానుడును సర్వకామ సంకల్ప విసర్జనమే మోక్షసాధనమని యేకకంఠముగ బోధించియుండిరి. జన్మకర్మ బంధనములనుండి ముక్తిని జెంద గోరు మహాశయులందరు బౌద్ధధర్మములను జక్కగ జదివి యనుష్ఠించి తరించెదరు గాక!

కాకినాడ, కాంగ్రెసు సంఘము 20—10—27 } —బులుసు సాంబమూర్తి.

---

కవిసార్వభౌములగు శతావధాని, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు:— (తిరుపతి వెంకటకవులలో నొకరు)

మీబుద్ధపురాణము నక్కడక్కడ చదివిచూచినాను. బహుగ్రంథ ద్రష్టత్వమును తెలిసినంతలో సాహసించి స్వసిద్ధాంతము ను వెల్లడిచేయుటయు ననునంశములు ముఖ్యముగా

సర్వత్ర గోచరించుచున్నవి. మీరు నిర్ణయించిన నిర్ణయములు నిల్చెడివా? నిలువనివియా? అను సంశయమునుగూర్చి చర్చింప నాబోటికి నధికారముచాలదు. ఏమనిన? మీరు వేదములను, పురాణములను, వానికి సంబంధించిన మతసిద్ధాంతములను ఉద్దేశించితోచిన యంశములను వ్రాసియున్నారు. ఎవరికోతక్క సర్వసాధారణముగా వానినిగూర్చి చర్చించి నిర్ధారణసేయు శక్తియుండదు. మీ పూర్వజన్మసుకృతము మంచిదిగనుక మీ కట్టి నిశ్చితజ్ఞానము ఆమహావిషయమునుగూర్చి కల్గినది. కాని మాకు ఆవిషయమున నిశ్చితజ్ఞానము లేదు. అందందు ప్రాచీన మహామహులు వ్రాసిన సిద్ధాంతములే నిజమైనవను తెగలోని వారము. కాబట్టి వానినిగూర్చి యేమియును వ్రాయజాలను. కాని యింత గ్రంథమును ఇన్నివిషయములను చర్చించి వ్రాసినందులకు మాత్రము మిమ్ము మిక్కిలి అభినందింపుచున్నాడను. ఆభగవంతుడు మీకు శ్రేయోదాయియగుగాక!

కడియము
15—10—27

గ్రహింపుడు,
చె. వెంకటశాస్త్రి, శతావధాని.

---

(14) ఆంధ్రజాతీయ కళాశాలా ప్రధానాచార్యులు చిల్లరిగె శ్రీనివాసరావు బి. ఏ. గారు.

(బుద్ధపురాణము) అంగలూరు గ్రామవాస్తవ్యులగు దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారిచే రచింపబడిన గ్రంథము.

ఇది యితరుల వర్ణనలేకయే ఉత్కృష్టముగ ప్రకాశించుచున్నది. యువకులయ్యు, చాలదేశ సంచారము చేయుటవలనను, బహుగ్రంథ పరిశోధనంబునను ఇట్టి విపుల గ్రంథమును స్వల్పకాలములో వీరు రచించియున్నారు. ఇందలిశైలి మృదులమై, మనోహరమై, భక్తిరసపూరితమై గంభీరముగ బ్రవహించుచున్నది. ఇటువంటి గ్రంథములను బ్రకటించుట కుద్దేశించిన మానవాదర్శ గ్రంథమండలి కి నా మనఃపూర్వకమైన యభినందముల సేయుచున్నాడను. ఈ గ్రంథకర్త ఆంధ్రజాతీయ కలాశాల విద్యార్థియై యున్నందులకు నేనెంతయు గర్వపడుచున్నాను. దైవబలమును, దేశీయుల యభిమానమును ఇట్టి పవిత్రాత్మునకు తోడగునుగాక!

ఆంధ్రజాతీయకలాశాల, బందరు
15—10—27 } చిల్లరిగె శ్రీనివాసరావు.

---

## (15) పిఠాపురం రాజాగారి హైస్కూలు హెడ్మాస్టరు కూచి నరసింహం పంతులు, బి. ఏ గారు.

శ్రీరామా!

శ్రీదుగ్గిరాల రామకృష్ణయ్యగారు నాయభిప్రాయమును గోరుచు తమచే రచింపఁబడిన "శ్రీబుద్ధపురాణము ప్రథమ ఖండము" అను మానవాదర్శ గ్రంథమండలియందలి ప్రథమ పుష్పమును దయతో నాకంపినారు. కాని శరీరము మిక్కిలి

యనారోగ్యస్థితిలో నుండుటచే వారు కోరినట్లు సవిమర్శ
ముగా గ్రంథము చదివి యభిప్రాయ మొసగ నశక్తుఁడనై
యున్నందుల కెంతయు విచారించుచున్నాను. అక్కడక్కడ
నాలుగైదుపట్ల గ్రంథముచదివి చూచినాను; చాలాబాగుగా
నున్నది. వారుచేసిన ప్రయత్నము సర్వజన స్తవనీయమైన ప్రయ
త్నము, ప్రస్తుతస్థితిలో మనదేశము యొక్క యభివృద్ధి కిట్టి
సద్గ్రంథములే కావలయును. ఇట్టిపనులు, గ్రంథకర్తగారి
వంటి బుద్ధిమంతులును, మహాపరిశోధకులును, దేశభక్తులును
నగువారు పూనుకొనవలయునవిగాని సామాన్యేతర జన
సాధ్యములు గావు. ఎంతో శ్రమపడి ప్రథమసంపుటములో
కోపకారార్థ మిప్పుడే వెలువఱచినారు. శ్రీబుద్ధాచార్యుని
సమ్మతప్రతిపాదితములగు ధర్మములు దెలుపు నిట్టివేరెండు
సంపుటముల వ్రాయనున్నారు. శ్రీరామచంద్రమూర్తివారు,
ఆయన సదుద్యమమును నిర్విఘ్నముగాఁ గొనసాగించుగాక!
ఆంధ్రదేశీయులందఱును శక్త్యనుసారము వారికి సహకారు
లగుదురుగాక!

పిఠాపురము
7—10—27

శుభమస్తు,
కూచి నరసింహము.

---

16 ఆంధ్రభారతకర్తలు, కవిరాజు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.

బుద్ధపురాణము, ప్రథమఖండము:—ఇది 1086 పుటలు గల పెద్దగ్రంథము. ప్రత్యేకముగా 127 పేజీల పీఠికకలదు.

చరిత్ర 477 పుటలు 229 పు. బుద్ధగీత 327 పే. విశేషాంశములు. 20. పే సత్యధర్మ ప్రబోధగీతావళి. కృతికర్త-అంగలూరు గ్రామవాస్తవ్యులు దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. ఈగ్రంథము అనేకపురాణేతిహాస సంహితాదులలోని నీతి మత ధర్మములం గ్రోడీకరించి వ్రాసినదని చదివినవారికిం దెలియకపోదు. అనఁగా నిందనేక గ్రంథసాంప్రదాయములు పేర్కొనఁబడి మనదేశగౌరవము, మతగౌరవము నత్యంతస్తోత్రపాత్రములుగ చెప్పబడియున్నవి. వేదములు, వేదధర్మములు, ఉపనిషద్ధర్మములు, భగవద్గీతారహస్యములు లోనగునవి యిందుదాహృతములు. పాశ్చాత్యగ్రంథకర్తల యుక్తమరీతులు నిందుసూచితములు. బుద్ధావతారకథనము జేసి బుద్ధుఁడు మహావిష్ణువనియు, బుద్ధునిమతము నాస్తికముగాదనియు, హిందూబౌద్ధమతములు భిన్నాదర్శములు కలవికావనియు సిద్ధాంతీకరించినారు. మఱియు, తిలకు మహాశయునియు రవీంద్రకవి సార్వభౌమునియు, వివేకానందునియు, గాంధి మహాత్మునియు, మఱికొందరి మహాశయులయు యభిప్రాయముల నిందు గ్రంథకర్తగారు వ్యక్తపఱచినారు. మఱియు వివిధమతముల విధులను సూచించినారు. చరిత్రలో గౌతమ బుద్ధుని శాక్యవంశమును, మాతృవంశమును, శాక్యులచరిత్రమును, బుద్ధజననంబును, బాల్యమును, వివాహమును, వైరాగ్యోదయంబును, యతిసందర్శనంబును, సుజ్ఞానపీయూష పానంబును, పుత్రజననంబును, శుద్ధోధనుని ప్రబోధమును, గృహ

పరిత్యాగంబును, దేశపర్యటనంబును, కపిలవస్తు నగరస్థితియు బింబసారనరనాథుని కథయు, అహింసాప్రబోధంబును, బోధిప్రాప్తియు, శిష్యస్వీకారంబును, ఉపదేశారంభమును, నూతన ధర్మప్రచార వ్యాపనంబును, అంతిమజీవితంబును గ్రంథకర్త గారు సప్రమాణముగా వర్ణించుచు, "బుద్ధంశరణంగచ్ఛామి" అనువాక్యముతో ముగించినారు. పిమ్మట:—బుద్ధగీత-సంస్కృతప్రాయ పాలీ భాషలోనున్న దానికి జక్కనివృత్తి వ్రాసినారు. ఈగీత ఉత్కృష్టధర్మబోధకములయి మనోహరముగానున్నవి. హిందూమతముతో సంబంధమును దేటతెల్లము చేయుచున్నవని గ్రంథకర్తగారు రుజువు చేసినారు "సర్వజ్ఞస్సుగతోబుద్ధో" అను నామలింగాను శాసనోక్తములగు నామములు, వానివ్యుత్పత్తులును పేర్కొనఁ బడినవి. పిమ్మట విశేషాంశములను పేరుతో బుద్ధదేవుని ధార్మికసార్వభౌమత్వము నిర్ణయింపబడినది.

నేనే, బేకన్, లూకన్, రామతీర్థస్వామి, అశ్వనీకుమారదత్తు, భర్తృహరి, వార్తికకారుఁడు, శంకరాచార్యులు, రామకృష్ణపరమహంస, షేకుసాదీ, భీష్మాచార్యులు, పతంజలి, వేమనయోగి, శుకుడు, దయానందసరస్వతి, రామమోహనరాయి, ఈశ్వరచంద్రవిద్యాసాగరులు, నిత్యానందుఁడు, చైతన్యస్వామి, కబీరుదాసు, హస్తామలకాచార్యులు లోనగు మహాత్ములును, హితోపదేశము, భగవద్గీత, భాగవతము, మహా

భారతము, యోగోపనిషత్తు, యోగవాశిష్ఠము. శాంతిశత
కము, మనుస్మృతి, చాణక్యనీతి, పంచదశి, సీతారామాంజనే
యసంవాదము, అధ్యాత్మ రామాయణము, ఆత్మప్రబోధము,
మహోపనిషత్తు, భజగోవిందశ్లోకములు, వేదాంతడిండిమము,
బైబిలు, వ్యాసానుగీతలు, వైశేషికధర్మబోధ, గారుడపురా
ణము, కిరాతార్జునీయము, చండకౌశికము, గణేశగీత, కఠో
పనిషత్తు, చాతుర్వర్గ చింతామణి, నక్షత్రచూడామణి, కుమా
రసంభవము, చరకసంహిత, రాజశిక్షాసోపానము రాజయో
గము, బృహన్నారదీయము, రాజయోగ రత్నాకరము,
పద్మపురాణము, శుక్రనీతియు లోనగు మహాగ్రంథము
లును బోధించిన ధర్మములన్నియు బుద్ధదేవుని ధర్మము
లకు సరిపడియే యున్నవని గ్రంథకర్తగారు నిర్ణయించి చూపి
యున్నారు. గ్రంథాంతమందు "సత్యధర్మ ప్రబోధ గీతా
వళి" అను పేరునఁ గొన్ని గీతములు కవి స్వరచనముగా
వ్రాసియుండె. బుద్ధచరిత్ర మంతయుఁ జదివి యదియొక గ్రం
థముగా రచించినపిమ్మట కవికిఁ బుట్టిన యభిప్రాయమెల్ల
నిట్లు వ్యక్తీకరించియుండినట్లు తోఁచెడిని. అందు గొన్ని వాక్య
ములతో నే నేకీభవింపనుగాని సర్వసంగ పరిత్యాగులయిన
వారు వాని నాదరింపకపోరు. ఈ గ్రంథరచనయందు గ్రంథ
కర్తగారు మిక్కిలి శ్రమచేసి యనేక మహాగ్రంథముల బరిశో
ధించి యీ గ్రంథము వ్రాసినారనియు, ఇది జగదుపకార

మొనర్పునదనియుం జెప్పుచు వారి యుద్యమము నభినందిం చుచు నింతటితో విగమించుచున్నాడను.

రాజమహేంద్రవరము,
27—10—27. } శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

(17) శారదానికేతన స్థాపకులును, "మాలపల్లి" కర్తలునగు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు.

ఈ పెద్దగ్రంథమునకు పురాణ మనుపేరు తగియున్నది. పూర్వము బౌద్ధు లనేకులు బుద్ధచరితమును వ్రాసియున్నారు. వారిలో అశ్వఘోషు డగ్రేసరుడు, ఈయన వ్రాసిన బుద్ధచరితము సంస్కృత వాఙ్మయమున కలంకారమునుగ నున్నది. అప్పటి దేశభాషయగు పాలీలో పలువురు బుద్ధచరిత్రములను వ్రాసి యుందురు గాని యిప్పటి కవి మృగ్యము. ఆంధ్రభాషలో నా మహాపురుషుని చరిత్రమును మొదట వ్రాసిన కీర్తిని తిరుపతి వేంకటకవులు గడించిరి. వచనమున విపులముగ వ్రాయుట కిదియే ప్రథమ ప్రయత్నము. 1089 పేజీల అసలు గ్రంథమును దానికిదోడు 127 పుటల పీఠికయును గలసి బుద్ధపురాణము యొక్క ప్రథమ ఖండమని దెలిపినచో చదువరులకు భీతిక గొలుపకమానదు. అయినను గ్రంథము మృదుమధుర శైలిలో వ్రాయబడి, విషయము అమృతప్రాయముగ నుండుటచే చదువరు లెట్టి సంకటములకును గురిగాక అపారమయిన నీ పాలసంద్రమును చులకనగా గడవ నీదగలరనుట నిశ్చయము.

బుద్ధగీతయొక్క మూలము నిందు బొందుపఱచుట మేల యినది. హిందూ బౌద్ధమతముల సంఘర్షణకాలములో హైందవులు బౌద్ధమతమును నిరసించినను వేదమతమునకు సంపూర్ణ విజయముగలిగినతరువాత బౌద్ధమతములోని విలువగల విషయములనన్నిటిని స్వీకరించి, స్వమతములో జీర్ణింపజేసికొని బుద్ధునకవతారపదము నొసంగిరి. పరిణామసిద్ధాంతము ప్రకృతిలోని సృష్టిక్రమమునకేగాక అవతారములకు సహితము వర్తించును. "ఆపః పృథ్వీ" యని భూమికంటె ముందు జలము సృష్టింపబడినది. కేవల జలజంతువయిన మత్స్యము మొదటి యవతారము. జలజంతువేయయినను స్థలమునగూడ నివసింపగల కూర్మము రెండవ యవతారము. కేవలము స్థలజంతువయినను నీటను బురదను ఆసక్తిగల వరాహము మూడవ యవతారము. కేవల స్థలజంతువుగమారి మనుష్యలక్షణములు మొలకరించుచున్న నరసింహరూపము నాలుగవది. పూర్ణముగా మానవాకారమును బొందినను మరగుజ్జురూపము వామనుడు. ఆఱవ యవతారమగు పరశురాముడు బ్రాహ్మణుడేయయినను రాజస స్వభావముగలవాడయి కౌర్యముతోగూడిన పరాక్రమముగలిగి తన తండ్రిని జంపిన పగతీర్చుకొనుటకయి రాజలోకమును సంహరించెను. ఏడవ యవతారమయిన శ్రీరాముడు ఉత్తమ క్షత్రియుడు. మొక్కవోని క్షాత్రముగలవాడు. హింసాయుతమైన మార్గమున శత్రుసంహారము గావించెను. శ్రీకృష్ణపరమాత్మ హింసామార్గమును నిషేధింపకున్నను, ధర్మనిర్వహణమునకయి

ఫలమాసింపక హింసజేసినను దోషములేదని బోధించెను. ఫలాపేక్ష లేనివానికి హింసగావించుట కవకాశముండదు గనుక భగవద్గీత యొకవిధముగ సహింసకే దారితీయుచున్నది. సర్వతోముఖమగు సహింసాధర్మమును నవముగ నవమావతారమయిన బుద్ధుడు బోధించెను. ప్రపంచమునమతకర్తలెందరో గలరుగాని అహింసావ్రతులు గామిచే వీరికి నెవ్వరును సరిరారు. మానవజాతిని వివిధ మతకర్తలు క్రమముగ దైవత్వమువైపునకే నడిపించిరిగాని తన అహింసావ్రతముచే బుద్ధదేవుడే మానవుని పశుత్వమును బోకార్చి దివ్యత్వమును బొందించెను. ఇతడే యుత్తమోత్తముడయిన యవతారపురుషుడు. కనుక బుద్ధపురాణమును పురాణరాజమని చెప్పనగును. ఇట్టిపురాణము నాంధ్రలోకమున కొసంగి శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు ధన్యులయిరి.

గుంటూరు, }
2—11—27. }

ఇట్లు,
పున్నవ లక్ష్మీనారాయణ.

---

సరసకవిశేఖరులగు - చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

అయ్యా!

మీరు దయతో నంపిన బుద్ధపురాణమును మహాగ్రంథము చేరినది. అందు ముఖ్యమయిన భాగములు చదివించుకొని వింటిని. బుద్ధదేవునిగూర్చిన సమస్తవిషయము లీగ్రంథమందు

గలవు. ఆయన చరిత్రములో నిదివర కెన్నఁడు నేను వినియె-
ఱుంగని నూతనాంశము లనేకములు మీ రుదహరించిరి.
బుద్ధదేవుఁ డుపదేశించిన ధమ్మపదము, బుద్ధగీతము మొదలగు
లోకోత్తర పవిత్రగ్రంథములసారముగూడ నిందుఁ జేర్పఁబడి
యుండుట మిక్కిలి ప్రశంసనీయము, శైలి గంభీరమై శ్లాఘనీ-
యమై యున్నది. ఇది నిజముగా నొక మహాపురాణమనియే
చెప్పఁదగును. బుద్ధునిగుఱించియు, సమ్మహాత్ముని మతమును
గుఱించియుఁ దెలిసికొనఁ దలఁచువారి కిది సద్విషయ రత్నాక-
రమై యున్నదనుట యతిశయోక్తిగాదు. ఇటువంటి మహాగ్రం-
థమును రచియించి మీ రాంధ్రలోకమునకు గొప్ప యుపకా-
రము చేసినారని నానమ్మకము. మీకు భగవంతుఁడు దీర్ఘాయు-
రారోగ్యములఁ బ్రసాదించి సారస్వతాభివృద్ధికరములు, దేశ
క్షేమ సాధకములునగు నిట్టి మహాగ్రంథముల రచియించుటకు
మిమ్ముం బురికొల్పునుగాక! ఆంధ్రదేశీయులందఱు మీగ్రంథ-
మును సమాదరింతురుగాక!

రాజమహేంద్రవరము,
20—10—1927. —చిలకమర్తి లక్ష్మీనరసింహము.

ధర్మసాధని పత్రికాసంపాదకులు-పాలపర్తి నరసింహముగారు:

ఆర్యవర్య!

సమస్కారములు. తాము పంపిన గ్రంథమును, వ్రాసి నజాబులును చేరినవి. అభిప్రాయమును తెలుపుటలో అనివార్యముగా ఆలస్యమయినది. క్షమింపవేడుచున్నాను. మానవాదర్శగ్రంథమండలి యను పేరిట తాము ప్రకటింప నెంచిన గ్రంథ ప్రసూనమాలలో మొదటి ప్రసూనముగా తాము ప్రచురించిన బుద్ధపురాణములోని ప్రథమఖండమును నేను వందనములతో స్వీకరించితిని. తెనుగుభాషలో నిపుడు గ్రంథము లనేకములు బయలుదేరుచున్నవి. కాని వానిలో ఆదర్శప్రాయములగు నవి చాల తక్కువ. తాము ప్రకటించిన యీ గ్రంథమునుబట్టియు, ఉపోద్ఘాతములో తాము వ్రాసిన సంగతులను బట్టియు తమ గ్రంథమండలి మిక్కిలి ప్రశస్తములయిన పద్ధతులమీాద నడువగలదని నేను దృఢముగా నమ్ముచున్నాను. వేయి పేజీలకు మించినదగుటచే తమ పుస్తకమును నేను పూర్తిగా చదువలేకపోతిని. కాని ముఖ్యభాగముల నవలోకించితిని. గౌతమబుద్ధుని గూర్చి శ్రీతిరుపతి వెంకటేశ్వరకవులు గద్య పద్యాత్మకమయిన కావ్యము నొక దానిని రచియించిరి. కీర్తిశేషులయిన శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు తమ హిందూదేశ కథాసంగ్రహములో బుద్ధునిగూర్చి కొంత విపులముగా వ్రాసియుండిరి. కాని తాము రచించిన యీగ్రంథము వానిలో నున్నవానికంటె నధిక విషయములతో విరాజిల్లుచు

ఆంధ్రలోకమునకు బుద్ధజీవితమునుగూర్చియు, బౌద్ధధర్మమునుగూర్చియు విశేష పరిజ్ఞానమును నొడగూర్పగలదై యొప్పుచున్నది. తామీఖండములో చేర్చిన బుద్ధగీతయు విశేషాంశసమన్వితమయిన పరిశిష్టమును గ్రంథముయొక్క విలువను హెచ్చుచేయుచున్నవి. ఈ పుస్తకరచనయందు తాము అనుసరించిన శైలి విషయ ప్రాశస్త్యమున కనుకూలముగా నున్నది. "సత్యధర్మ ప్రబోధ గీతావళి" యను శీర్షికతో చిట్టచివర తాము పొందుపఱచిన పద్యరత్నములు గ్రంథసారమును వెల్లడించుటయేగాక యావద్గ్రంథమునకు నూత్న రుచిని సమకూర్చుచున్నది. ఈ గ్రంథముయొక్క రచనాప్రకటనల నిమిత్తమై తామెంతయో వ్యయప్రయాసలకులోనై యుందురనుటకు సంశయములేదు "కష్టేఫలీ" యన్నట్లు కష్టపడనిది ఫలము కలుగదుగదా! మానవజన్మతారకమయిన యీగ్రంథమును ప్రకటించి తాము తమ జన్మమును సార్థకము చేసికొనియున్నారు. భాషాప్రపంచమునందే గాక ఆంధ్రదేశమునందుగూడ నిందుమూలమున తాము సుస్థిరమయిన స్థానమును గడించియున్నారు. తాము ప్రచురింపనున్న ఇతర గ్రంథములకయి ప్రాజ్ఞులగు నెల్లవారును నెదురుచూచుచుందురనుటకు సందేహము లేదు. ఆంధ్రలోకము తమకు సముచిత సాహాయ్యప్రోత్సాహముల నొసంగుగాకయని కోరుచున్నాను.

గుంటూరు,
20—10—27.

ఇట్లు విధేయుడు,
పాలపర్తి నరసింహము.

బౌద్ధమహాయుగ గ్రంథకర్తలు వేలూరి సత్యనారాయణగారు:

ఇది మానవాదర్శ గ్రంథమండలి ఆంధ్రలోకమునకు సమర్పించిన తొలిపూత. మానవాదర్శగ్రంథమండలి ఈప్రపంచమున నుద్భవించిన మానవులలో కెల్లనాదర్శపురుషుడగు బుద్ధుని జీవితముతో ప్రారంభమగుటెంతయు శుభసూచకము. ఇట్టి మహాపురుషుల జీవితముల నింకెన్నియో ఆంధ్రలోకమునకు ప్రసాదింపుచు యీగ్రంథమండలి ఆంధ్రభూమిని చిరస్థాయియై వర్ధిల్లుగాక. వేయి వత్సరముల కాలము యీభూస్థలిని విజయపతాకమెత్తి నేటికి భూమండలమున నైదవవంతు మానవాళికి ప్రధానమతమై వరలెడు మహామతమును, బౌద్ధమతమును సంస్థాపించిన మహాపురుషుని జీవితము పరిపూర్ణముగ మన తెనుగుభాషయందు లేకుండుట శోచనీయము. మఱియు ఇట్టి మహత్తర సంస్కర్త ఆసియాఖండములో నెల్ల భగవానుడని నారాధింపబడు పుణ్యమూర్తి హింసాత్మకములగు యజ్ఞయాగాది క్రతువుల చాటుగ మరుగువడిపోయిన అహింసాధర్మమును వెలికి దీసి మానవాళిని వేయి సంవత్సరముల కాలము సత్పథమున నడిపింపగల్గిన పురుషసింహుడు, బుద్ధుడు మనయీ భారతభూమియందే కద యుద్భవిల్లినాడు. అట్టి గానతపసి జీవితము మన తెనుగుభాషయందు నేటివరకును లేకుండుట లజ్జాకరమేకద. ఇది గాక బౌద్ధమత మొక దుర్మతమనియు, పాషండమతమనియు వైదికమత విధ్వంసమునకై నిది కల్పింపబడినద

నియు ఈ మతమునెడ అపోహలు మన యాంధ్రభూమియందే గాక తక్కిటిప్రాంతములందుకూడ గాఢముగ ప్రబలియున్నవి. బౌద్ధమత ధర్మములెట్టివో నెరుగజాలని మౌఢ్యమే యిట్టి యపోహలకు గారణము. ఇట్టి దురభిప్రాయముల పోద్రోలుటకు బౌద్ధమతములకు యీషణ్మాత్ర భేదమని తెలుపుటకు బౌద్ధమత నిజస్వరూపము దెలుసుకొనవలసిన యావశ్యకతకలదు కద! ఈగ్రంథరచనకు బూని మన బలరామకృష్ణుడు యీకార్యము సాధింపదలచినాడు. అందులకు ఆంధ్రలోకమీతని సంస్తుతింపవలసియున్నది.( బౌద్ధపురాణము,ఆంధ్రమహాజనులచే నాదరింపబడవలసిన గ్రంథమనుటకు సందియము లేదు గ్రంథకర్తఅనేక గ్రంథములపరిశోధించి చిరకాలము కష్టించి యీగ్రంథమును వ్రాసినట్లు కన్పించుచున్నది. ఈగ్రంథమున గ్రంథకర్త తన సంస్కృతాంధ్రభాషాపరిచయమును వర్ణనాకౌశలమును, కల్పనాశక్తియు, రచనానైపుణ్యమును వెల్లడించియున్నాడు. శుద్ధోదనమహీపాలుని రాజధానియగు కపిలవస్తునగర సౌభాగ్యము, సిద్ధార్థుని పరిణయ పుత్రజననములు, శాక్యసింహుని గృహపరిత్యాగము, మున్నగునవి మిగుల నింపుగులుకునట్లు వర్ణింపబడినవి. పరిశిష్టము కథుసమర్థతో నిర్వహింపబడినది ఇందు పెక్కునూతనాంశములు ప్రదర్శింపబడినవి:బుద్ధుని కాలమునాటి మత, రాజ్యాంగ, పారిశ్రామిక పరిస్థితులుగూడనించుచిత్రింపబడినవి. బౌద్ధ, వైదిక, క్రైస్తవమతములకుగల సాదృశవైదృశములు

బౌద్ధమతసారము, బౌద్ధనీతి, బౌద్ధకర్మ, బౌద్ధసాధన మున్నగు విషయము లిందు చెప్పబడినవి. అప్పముగ బుద్ధుని ప్రబోధము లెగాక గ్రంథకర్త మానస వీధుల సంచరించు భావపరంపరలు గూడ యీగ్రంథమునందు గుచ్చెత్తబడినవి. ఈతడు తన గ్రంథమున పలుతావులందు వైదిక బౌద్ధసిద్ధాంతముల వెద జల్లినాడు. సమయము దొరకినపుడెల్లప్రాచీన భారతసౌభాగ్య ముగు నేటియధఃపతనమును జూపి పాఠకుల దేశభక్తిపార వశ్యులజేయ యత్నించినాడు. శైలి సంస్కృతపదభూయిష్ఠమై, దీర్ఘసమాసాలంకృతమై గంభీరముగనున్నది. కాని వర్ణవిభేద వితర్కములును, పాఠకుల నుద్దేశించు సంబోధనలును ప్రకృతిపుర అరణ్యాదివర్ణనలును గ్రంథమును పెంచి ప్రధాన విషయము నొక్కింత మరుగుపరచుచున్న వేమో యని భయ మగుచున్నది. మొత్తముమీద బౌద్ధపురాణము ఆంధ్రభాషకు వన్నె తేగల గ్రంథమనుటకు సందియములేదు.

బెజవాడ,
26—10—27.

—వేలూరి సత్యనారాయణ.

# విషయసూచిక

## ఉపోద్ఘాతము



## శ్రీ బుద్ధచరిత్రము

శ్రీబుద్ధచరిత్ర సమాప్తము.

---

## శ్రీ బుద్ధ గీత

## పరిశిష్టము.-విశేషాంశములు.



బౌద్ధమతానుకూల హిందూమత శ్లోకములు.

---

## శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి

# పీఠిక

### ఓంనమశ్శివాయ !

తల్లీ? భారతమతల్లీ! బుద్ధభగవానుని లోకమునకు ప్రసాదించిన నీమహిమ యగణ్యము! లోకానుగ్రహార్థ మవతరించిన దివ్యావతారములందు, బౌద్ధావతారము, త్యాగావతారము— శాంతావతారము— ప్రేమావతారము— ధర్మావతారము— శ్రీరామకృష్ణావతారములందు ధర్మసంస్థాపనమునకు,దుష్టసంహారమునకునర నారాయణజన్మలు సాధనంబులయినవి.శ్రీకృష్ణావతారమునందు విలసితంబయినశృంగార ప్రేమ కామసంక్షుభితమై బౌద్ధావతారమునందు వైరాగ్య ప్రేమరూపమున దాల్చినది. సమ్మోహజనకమయిన నవయౌవనానురాగము, మోహనాకారము, మోహనాంగి, ముద్దుబిడ్డ, రాజ్యవైభవములు నిర్వికార జ్యోతిర్మయుడయిన ధ్యానసంచలనము గలుగజేయని బౌద్ధావతారము త్యాగావతారము—శాంతావతారము. జీవజాలముల దుఃఖనివృత్తికి మహాతపంబు చేసి జీవకారుణ్యమును ప్రతిపాదించిన బుద్ధావతారము ప్రేమావతారము. ధర్మపథమునను, నిర్వాణపదమానను మార్గమును జూపిన బోధిసత్త్వావతారము ధర్మావతారము. దివ్యమయిన బుద్ధఘోషలు, బుద్ధనామరూపాంకితములు పవిత్రము చేసిన స్తూపములు, చైత్యములు, విహారములు భారతహృ

దయముల వలెను శూన్యాలయములయి విషాదమును గలుగ జేయుచున్నవి. దివ్యమయిన అమరావతి స్తూపశిథిలములు వస్తుప్రదర్శనశాలల మూలలందు మూల్గుచున్నవి. అజంతా శిల్పములు సాంచి, కార్లిస్తూపము, కార్లి వీనావిహారములు తేజోవిహీనములయి బౌద్ధయుగ ప్రతిభను స్మరింపజేయుచున్నవి. ఒకయుగమునందు బుద్ధధర్మమయమయిన భరతవర్షము బుద్ధధర్మములను కాలాంతరమునను విస్మరించుటయును నిరసించుటయు దైవఘటనగదా? కాలమహిమ దుర్గ్రాహ్యముగనున్నది. రాజ్యము లంతరించినవి. ధర్మములు మారినవి. నూతనమతములు వ్యాపించినవి. బుద్ధభగవానుడు ప్రతిష్ఠించిన ఆత్మవిజయము జీవకారుణ్యము- ప్రేమతత్త్వము నిర్వీర్యములయినవి. ఆత్మప్రకర్షణము, జీవసంరంభము, కామతత్త్వము పురుషార్థములయినవి లోకమునందంతటను శాంతిధర్మములు దురారాధ్యములయి, హింసాతృష్ణలు సుఖారాధ్యములయినవి. తృష్ణావికాసము, ప్రబుద్ధస్వార్థపరత్వము మానవధర్మములుగ వెలయుచున్నవి. సంక్షోభమయమయిన ప్రపంచమునందు మానవ ధర్మలక్ష్యమును పునరుద్ధారణ చేయుటకు నవజీవనహృదయము పరితపించుచున్న విధమును విశ్వావృతమయిన ధర్మ పరివర్తన ప్రయత్నములు విశదము చేయుచున్నవి. మానవ ధర్మాభ్యుదయమునకును, ప్రపంచశాంతికిని మహాత్యాగము చేసిన బుద్ధభగవానుని సంస్మరణము ఆత్మశాంతికిని, లోకశాంతి

కిని సాధనము కాగలదు. భారతహృదయమునకు సుపరిచిత మయినను విస్మృతమయిన బుద్ధచరిత్ర భారత సత్త్వసంరక్షణ మునకు సాధనముగ నున్నది.

శ్లో॥ "సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషః యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః।"

శ్రద్ధామయమయిన జీవితపరిణామము సంకల్పమున కను రూపముగను నేర్పడుచున్నవి. మానవసత్త్వమున కనురూపము గను శ్రద్ధాసంకల్పములు కలుగుచున్నవి. వర్తమానకాలము నందు భారత హృదయమునం దుదయించిన శ్రద్ధాసంకల్పము ల ఫలము బౌద్ధ ధర్మాన్వేషణాభిలాషయందు గోచరంబగు చున్నయది.

పురుషార్థములందు ధర్మము ప్రధానస్థానము నాక్రమించుచున్నది. ధర్మసంసేవనము దుఃఖనివృత్తికిని సుఖప్రాప్తి కిని దోడ్పడగలవిధము నీబుద్ధపురాణము విశదము చేయు చున్నది. శ్రీయుత దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు రచియిం చిన బుద్ధపురాణమునందు మూడుభాగములు కలవు. ప్రథమ భాగమునందు బుద్ధచరిత్రము సవిస్తరముగను 477 పుటలందు రసవంతముగను వర్ణింపబడియున్నది. సిద్ధార్థుడు వైరాగ్య సంపన్నుడై సంసారసాగరమును విడిచి తీవ్రమైనతపస్సును జేసి బోధిసత్త్వుడై ధర్మప్రచారమును జేసిన విధము కడు రసవంత ముగ నీభాగమునందు వివరింపబడినది. 2-వభాగమునందు బుద్ధ

గీత మని ప్రసిద్ధినిగాంచిన ధమ్మపదము మూలార్థసహితముగను శాణింపుచున్నయది. పరిశిష్టభాగమునందు విజ్ఞానదాయకములైన విశేషాంశములను బలరామకృష్ణయ్యగారు వివిధమత ధర్మముల నుండియును గ్రోడీకరించిరి. ఆమతధర్మములను ధమ్మపదము నందుగల ధర్మములతో సమన్వయము చేసినారు. ఉపనిషత్తులు, భగవద్గీత, భారత భాగవతములు, బైబిలు, వివిధ భాషా కావ్యములు మొదలగు గ్రంథములందు గల ధర్మసిద్ధాంతముల కును బుద్ధగీతయందలి ధర్మసిద్ధాంతములకును గల సామ్యత్వమును బలరామకృష్ణయ్యగారు లోకమునకు సుబోధ్యము చేసిరి. మానవధర్మములకు అహింస, సత్యము, ధర్మము మూల స్తంభములుగ నున్నవి. ఆ ధర్మములను బుద్ధభగవానుడు ప్రేమరూపమున సుసాధ్యము చేసిన విధమును మన యీ బుద్ధపురాణము విశదము చేయుచున్నది.

శ్రీ బలరామకృష్ణయ్యగారు వ్రాసిన ఉపోద్ఘాతమందలి "భవ్య భరతవర్షము విశ్వహృదయ" మను విషయమును వారు మహా విషాదోత్సాహములతో నెంతేని నభివర్ణించి యున్నారు. ఇందలి మహర్షుల విజ్ఞానము త్సాహమును, మన వర్తమాన దైన్యస్థితి విషాదమును గలుగజేయుచున్నది. విశ్వ శాంతికి సాధనంబయిన అహింసాధర్మము హింసాత్మకమయి జీవబలులకును మత ద్వేషములకును, మూలమగుట దుష్కృత ఫలముకదా ! మానవాదర్శములందు "సర్వంఖల్విదం బ్రహ్మ,

తత్త్వమసి" సిద్ధాంతములు విశ్వహృదయమును సర్వత్ర ప్రత్యక్షము జేయుచున్నవి. సర్వసాక్షియయిన పరబ్రహ్మ విస్మరణమును, అనిత్యమయిన ఆసురసంపదారాధనమును దుఃఖభాజనంబుగనున్నవి. ఆత్మసంస్మరణము దుఃఖనివృత్తికిని ధర్మప్రతిష్ఠకును సాధనంబుగనున్నది. బలరామకృష్ణయ్యగారు రచించిన బుద్ధపురాణము ఆంధ్రులు బుద్ధభగవానుడు బోధించిన ధర్మసందేశమును గ్రహించి తరించుట కెంతయు బరమప్రయోజనముగనున్నది. బలరామకృష్ణయ్యగారు పిన్నవయస్సునందే భారతధర్మపరిశోధనలజేసి బుద్ధపురాణమును రచియించుట కడుప్రశంసనీయమైవారి విజ్ఞానాభినివేశమును దెలుపుచున్నది. బలరామకృష్ణయ్యగారు స్థాపించిన మానవాదర్శ గ్రంథమండలియందు బుద్ధపురాణము, ప్రథమఖండము ప్రథమకుసుమమయి వెలయుచున్నది. మానవాదర్శములు సంకుచితములయియున్నసమయమునందు మానవధర్మాభ్యుదయమునకు సాధనంబులయిన నిట్టి సర్వోత్కృష్ట గ్రంథములు పురుషార్థసిద్ధికి పరమప్రయోజనకరములుగ నుండగలవు. ఆంధ్రమహాజను లెల్లరు నీబుద్ధపురాణమునకును, మానవాదర్శగ్రంథమండలికిని సుస్వాగతము నొసంగి దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి ప్రయత్నముల నాదరించుటకు వేడుచున్నాను.

ప్రభవ, ఆశ్వీజ శుద్ధ
నవమి, బుధవారము.

— కా. నాగేశ్వరరావు.

# ఉపోద్ఘాతము

## సృష్టివైచిత్ర్యము.

ఆహా! ఏమి యీసృష్టివైచిత్ర్యము! ఇద్దాని విలక్షణంబగు మహిమాతిశయంబు నభినుతింప నెవ్వానితరము? చిత్రవిచిత్రలక్షణలక్షితమయి, అవాఙ్మానసగోచర నిగూఢతత్త్వార్థమండితమయి, అపూర్వానూనదివ్య సౌందర్యప్రభాభాసురమయి వెలుంగుచు, మానవబుద్ధిబలంబునకు నవిహిత మతీతమయి యెన్నిగతుల బరిశోధించినను, దీనికాద్యంతములును, సత్యాసత్యములును గోచరింపకున్న వేమి? విశ్వప్రకృతి, నిజహస్తంబున సంసారరూపక సూత్రంబును ధరించి నిత్యము నవీననవీనంబులగు నాత్మీయ స్వరూపకాంతుల బ్రదర్శింపుచు జరాచరాత్మకప్రపంచము నేచందమున ముగ్ధత్వంబున దేల్చివైచుచున్నయదో, చిత్తమా! తత్తరపా టుడిగి, స్థిరబుద్ధితో నిటు వీక్షింపుమా! ఏపార్శ్వమ్ము నుపలక్షించినను, యేదిక్కు దృక్కుల బ్రసరింపజేసినను, చిత్రవిచిత్రవర్ణోద్దీపితంబులగు నీశోభాతిశయము లేమి? ఈవింతవింతలగు పరమద్యుతులేమి? శిరీషకుసుమపేశలసదృశంబులగు నీపదార్థసౌకుమార్యము లేమి? శ్రోత్రపర్వంబుగా నేతెంచు నీమృదుమధురంబులగు సుస్వరధ్వను లెటనుండి? అంతయు విచిత్రము. విస్మయోత్పాదకము!! గంభీరము!! ఊహాతీతము!!! లోచనగోచరమయ్యు నగోచరమయి, ఆకర్ణింపబడియు గర్ణాతీతమయి, ఆఘ్రాణింపబడియు నాసికాగమ్యమయి, స్పృశింపబడియు ద్వగింద్రియశక్తి బాహ్యమయి యొప్పు నీనిగూఢమహిమాన్విత విశ్వకావ్యనిర్మాణకుశలుం డెవ్వడు? మానవుడా? కాదు; కాదు. మానవుండ నగు నాకగమ్యగోచరమయియుండు బ్రహ్మాండపురాణ విరచనాచాతురీవిలసితుండొక్కరుం డుండియే తీరును. చిత్తమా! ఏమనుచుంటివి? అస్పష్టముగా నెద్దియో యుచ్చరించితివే? సృష్టికర్త సర్వేశ్వరుం డందువా? సమస్తమున కతడే కర్తయు, భర్తయు, హర్తయు

నయియుండు ననియా నీవు వచింపువది? కార్యకరణకర్తృత్వము లవ్వాని వే యు
నియా నీయూహ? సరి సరి, తదీశ్వరాన్వేషణ కార్యపరతంత్రముగానట్టియు
సృష్టితత్త్వపరిశీలనాస్వభావమును గల్గియుండనట్టియు నీ వేచందమున నిట్లు
సాహసించి విశ్వనిర్మాతను నిర్ణయింప సమర్థమయితివి? విజ్ఞానమయదృక్ప
సారంబునను, దీర్ఘకాలసంప్రాప్తభవానుభవంబునను యీరహస్యంబు నె
ఱుంగ గల్గితివందువా? గ్రహించితి, అయిన నాదేవు డెంతటి ప్రజ్ఞావంతుడు,
ఘనుడు? అట్టి గ్రంథసాంగుని అట్టి మహనీయుని మహత్తరాద్భుతశక్తి సా
మర్థ్యాతిశయంబు లనేకముఖంబున సంస్తుతింప నేనెంతటివాడను? ఓజగన్ని
యంతా! ఆదిమధ్యాంత వర్తియు, రహితుండవును నగు నోప్రభూ! నా
తండ్రీ! నీవట్టి సుబుద్ధుండవును, అతిశయ గుణాన్వితుండవును నగు నపూ
ర్వాద్వితీయ శిల్పజ్ఞుండవు? కవిచంద్రుడవు? తావకంబగు చిత్రకళానై
పుణ్యంబును, కవితారచనా శక్తియు నెట్టియనూన మగునది? త్వదీయ
విచిత్ర చిత్రచిత్రణకార్య మత్యాశ్చర్య జనకము!! నీవు స్వీయ పాణి
తలంబున నిరుపమానంబగు నిజ తాంత్రిక లేఖినిం బూని, చిత్రాతి చిత్రంబులగు
చిత్తరువుల నెన్నిటినో చిరస్థాయిగా చిత్రించివైచి, యవ్వానిపయి దివ్యభావ
మయ కవితల నెన్నింటినో గూఢముగా లిఖియించి వైచితివి!! ఓ నాతండ్రీ!
నాదసుర్దిక్కుల నీగాననగుఫలపత్ర పుష్ప సంభరితంబులగు పాదపపంక్తు లేమి?
ఈమంజుల లతానికుంజములేమి? ఈ వివిధవర్ణ విరాజితంబులగు నీవిహంగ
వితతుల నెట్లు రచియించితివి? అహా! అవృక్షశ్రేణీశాఖల నధిరోహించి
ఆకార ప్రకారంబుల నల్పంబులయ్యు నాశారికాకీర పికబృందము లెట్లు
మనోపర్వంబుగా గలకంఠకంఠంబుల నెత్తి పాడుచు, పాషాణముల
ద్రవీభూతము సేయుచు, చెట్ల మోళ్లు జిగురింపజేయుచున్నవో వీక్షింపుమా?
దేవా! ఆతళుకు బెళుకుల గొలుపు సొబగుతో పింఛములవిప్పి నృత్యము సేయు
నామయూర మమకారోత్పాదక శక్తి నెట్లుసృష్టించితివి? నీ రచనాచాతు
రిని మూకబుద్ధిని వీక్షించి భావమునం దానందింప వలసినదేకాని వర్ణింప

శక్యము కాదు. ప్రభూ? క్రమభంగ మొనరింపకయే నిత్యము విశ్వము నానంద కలుప నేతెంచునట్టి యీ దివాకర నిశాకరు లెవరయియుందురు? త్వదాస్థాన మందిర ద్వారపాలకులు కాదుగదా? దివారాత్రము లిట్లు క్రమానుగతము లగుటకు నీశక్తియేకదా మూలకారణము! గంభీరంబును, అతిశీతలంబును, హిమకణ సంసిక్తంబును నగు నుషఃకాలమును, అరుణవర్ణ విభాసితంబగు సూర్యాస్తమయంబును నీ వేవడువున విరచించియుంటివో? పీత హరిత వర్ణ విభ్రాజితంబగు వసంతాగమనమునకు హేతుభూతుండ వయిన నిన్నెన్ని విధముల వనలక్ష్మి విహంగబృందవందిమాగధులచే సంస్తుతింప జేయుచున్న దియో కాంచితివా? పరాత్పరా! నీవిశ్వమహాత్మ్యము నూహించిన కొలం దియు జిత్తముత్తలంగున దత్తర పడుచున్న దేమి? ఆనందింపుచుండియు భీతిల్లు చున్నదదేమి హేతువు? ప్రభూ! నీచెయిదము లెంత మర్మపూరితములో? సుఖదుఃఖాది గుల్మముల రాగద్వేషాది సుమనంబుల సహితము నిర్మించియుం టివే? నవవికసిత సుగంధమయ సుందర సుమనంబుల జొరబడియుండు కీటక జాలంబుల విధంబున, సుఖానంద భోగమయ మానవజీవితంబుల దుఃఖభయ వ్యాధి మరణంబుల వెలయింపజేసితి వదెందులకు? నేడు సౌఖ్యవారధిం దేలి యాడు జీవము రేపు దుఃఖాబ్ధింబడి కొట్టుకొనుచుండు నేమి? వికసించుపువ్వు ములు వికసింపుచుండ, కొన్ని ముకుళితములయి రాలిపోవుచున్నవే? ఏమి మాయదియో, తండ్రీ! నాకు విశదము సేయవా? నాచిత్తము నీచందమున ఖేద మునకు బాల్పడజేయు టుచితమా? నానావిధంబుల నవ్యతరమయి వెలయు నీబ్రహ్మాండ పురాణము నవలోకించి దర్శకసంఘము నిస్తబ్ధత నారాధింపుచు న్నదికదా! విద్వాంసులు, పండితమాన్యులు, భోగులు, యోగులు, పురుషులు స్త్రీలు, వృద్ధులు, బాలురు వీరు వారననేల? మానవమాన వేతర జీవరాసులన్ని యు వ్యామోహాంబుధిని బుట్టకలు వేయుచు, నిజప్రాణపంచకమును త్వదీయ పాదారవిందద్వయ సన్నిధిని సమర్పణము గావించి వేయుచున్నవే? వేదవేదాం గోపనిషద్బృందము నీమహత్తరానూన సామర్థ్యమునకు "నేతి" పదమునే

స్వీకరించుటయం దెంత మహదర్థము గర్భితమయియున్నదియు దెలియుచునే యున్నది. తృటిమాత్ర కాలములో సంకల్పబలంబున భవద్విరచితంబయిన పురాణగ్రంథమునకెన్నియో భాష్యములు, తాత్పర్యగ్రంథములు, విమర్శనములు శతకోటిసంఖ్యల బండితోత్తములచే ఘోరతపశ్చర్యానంతరము లిఖియింప బడియు నిదమిత్థమను నిర్ణయతీరమున జేరరయిరి. ఓ శుభవాధవా! త్వత్పురాణగ్రంథప్రథమాధ్యాయంబున జన్మానంద తత్త్వములగూర్చి వ్రాయబడియుండ, ద్వితీయప్రకరణమందే మరణదుఃఖభయతత్త్వముల గుఱించి లిఖింపబడియుండుట నే నుపలక్షించితి. ద్వంద్వార్థభూయిష్ఠంబగు నీభావమయకావ్యకన్యక శ్లేష నాదరించినదేమి? బంధనముక్త్యాద్యలంకారములు నీకావ్యరామణీయకత నభివృద్ధిసేయుచుండ, నిగూఢశబ్దలాలిత్య రసప్రాచుర్యభావపుష్ట్యాదులు వలయునంతటి పరిమితియందు వెలయుచున్నయవి. ఆశ్చర్యంబగు నీకావ్యమందలి మాయామయరహస్యభేదనము కింజిజ్ఞులును, మతిజ్ఞులను నగు మానవ వ్యాఖ్యాతలకు సాధ్యపడునా? ఓ కవిచంద్రమా! త్వత్కావ్యము నెంత బతియించినను నూతనాంశములే నవ్యాభిరుచులతోడ బొడకట్టుచున్నవేమి? ఈవిశ్వకృతికి భారములేనటులే తెల్లమగుచున్నయది. త్వదద్భుతమహిమాసంస్తవ స్వరూపంబులుగ నెన్నిఖండమహాకావ్యముల విరచింపబడినను నవి యపూర్ణములేయగును. నీకు నీవేసాటి. నీరచనకు నీకృతియేసాటి. ఈసృష్టిరహస్య మదేమియోకాని స్వల్పంబగు బీజమునుండియే మహాప్రచండ శాఖోపశాఖావిరాజితంబగు వటవృక్షముత్పన్నమయి యసంఖ్యాకములగు జీవకోటుల కాశ్రయస్థానంబగుచున్నయది! ఎంతకాలమునుండి వీక్షించుచువచ్చియున్నను నీసృష్టియంతయు మహోత్తుంగ పర్వతపంక్తులచేతను, నానావిధాగాధసాగరంబులతోడను, అంబరచుంబిత విశాల వ్యాప్తవిటపశ్రేణీనిచయంబుచే నిండియున్న సాంద్రారణ్యముల చేతను, వివిధ సస్యఫలప్రదంబులగు సుక్షేత్ర కేదారమాలికలతోడను, జీవప్రపంచ దేహపోషణశక్తియుక్తములగు నదీనదంబులతోడను, వాపీకూప తటాక మందిర పరిష్కృ

తంబులగు మానవ నివాసంబులచేతను రాణించుటకును, నశించుటకును హేతు విదమిత్థమని గ్రహించు టెట్లు? అనంతమయి, అపారమయి, భావాతీతమయి, నానావిధ ప్రాణిసంతతుల కాలవాలమగు నీవిశ్వమున నిత్యము సంఘటింపు చుండు విచిత్ర పరంపరలకైనవలోకించు నాహృదయం బీ విధంబున నవిరళభావ తరంగముల దేలిపోవుచున్న దేమి? నాచిత్తము నావహించియున్న కర్తృత్వ భోక్తృత్వాద్యభిమానములు మటుమాయమగుచు, మద్హృదయ విరాజిత గర్వదర్పాహంకారాది దుర్గుణవల్లరులు చెల్లాచెదరగుచున్న వేమి చెపుమా? ఈసృష్టియందలి రహస్యంబుల దర్శింపనుదయించు గంభీరభావ ఝుంఝూ మారుతము మజ్జీవితవ్యామోహాంబుదపటలము నెట్లు భగ్నమొనర్చివేయుచున్న యది! అనుక్షణము సంకల్పమాత్రంబున ఘటియించు నీదివారాత్రములు, వివిధఋతువులయాగమనములు, జననమరణములు, వృద్ధిలయములు, సుఖదుః ఖములెట్లు విరచింపబడుచున్నవియో తెలియరాదు ఇవి యెటనుండి యెం దునిమిత్తముద్భూతమగుచున్నదియు నగమ్యగోచరముగా నున్నది. చిత్తమా! నిమిష నిమిషమునకు సంయోగవియోగ సంకల్పవికల్ప భేదంబునంబడి మెఱ యు నీతళుకు బెళుకులు ప్రకృతీదేవి యుచ్ఛ్వాసనిశ్వాసములు మాత్రమే కేవలము! వీనికయి తత్తరపడు చిత్తము చిత్తకోర్కెల జిక్కువడి కొందలమం దును. మానసమా! వివిధగతుల బరువులిడు చంచలభావతరంగములచే నుబ్బూ తలూగుటమాని, యొకింతస్థిరత్వమును బిగబట్టి సృష్టిరహస్యస్వభావ పరిశో ధనార్థము ముందంజవేయుము! డెందమా! యీనావచనమును విస్మరింపకు. ద్వివిధసంసారభావ ప్రవాహంబునబడి తేలిపోక, యనాసక్తభావంబుతోడ నంతయు వీక్షింపుము!......రా! రమ్ము! అల్లదిగో! ఆకాననగు గగనచుం బితోన్నత సుధాసమసౌధాంతరాళమునకు దృష్టినిబ్రసరింపజేయుము! మం దిరబాహ్యాడంబరమునకే చెచ్చెరనచ్చెరువందుచుంటివా? అగు నీమహోత్తుంగ మందిరనిర్మాణకలాకౌశలత్వ మవశ్యసందర్శనీయము! భూపాలురదుర్గ ప్రా కారముల మించు యీ కుడ్యముల గాంభీర్య దృఢత్వము నేరీతి వర్ణింప

బడును? సౌధోపరిభాగ కక్ష్యాంతరాళమున మందహాసరుచులు ముఖార
విందముల దాండవింప, మంద మలయ మారుత కిశోర సంస్పర్శంబున ముంగు
రులు ముచ్చటలాడుకొను చున్నట్టులుండ, పికస్వరంబున మృదుమధురంబుగ
సంభాషించుకొనుచు రసాబ్ధిం దేలియాడు నా మానవమూర్తు లెవ్వరు?
ప్రణయపాశ బద్ధులా? ఇద్దరు యువతీయువకులా? ఆహా! ఈ దంపతుల
మందిరమునకు నలుగెలంకుల నస్త్ర శస్త్ర సుసజ్జితులగు నీబలాఢ్యు లిట్లు
వేచియుండ నేమి హేతువు? రక్షణార్థమా? ఛీ! జీవమును గాపాడ దే
నితరము? మానవహృదయ మీమందిరమును బ్రవేశింపరాదని పెద్దయక్కర
ములతో నాభిత్తికపయి వ్రాయబడియున్నదే! మానవ హృదయ మీ గృహ
మును బ్రవేశింప ననుమతిని బడయవలయునా! ఎవరిచే? తన్మందిరాధి
పతిచే! సరిసరి! సర్వేశ్వర రాజ్యమున నొకమానవుని కృపాకటాక్షప్రాప్తికిని,
ఆజ్ఞానుసరణమునకును మరొక్క సోదరమానవుడు దీనుని పగిది వేచియుండ
వలయునను విధానము నీ సృష్టి కల్గియున్న దిదేమివింత? ప్రాకారముల చుట్టు
ను బరివేష్టించియున్న యోధులు మందిరాధిపతి భృత్యవర్గమా? ఆహా! ఈ
సృష్టియందు మితజ్ఞానులు, నశ్వర జీవులును నగు మానవులయందే యొక్కడు
సేవకుండును, మరొక్కడు సేవితుడును గలడా? భౌతికజీవిత సౌకర్యముల
నపేక్షించియే నిర్ధనులగు వీరు నిజస్వాతంత్ర్యమణిని విక్రయించుకొని పరావ
లంబిత జీవితముల వ్యతీతము సేయుచున్నారు. ఇంక నీ దంపతుల విశేషముల
నరయ నుల్లమా! వాయువేగంబును సరకుగొనని ద్రుతగమనంబున మంది
రాంతరాళమును బ్రవేశింపుము! ఆహా! ఏమి యీభోగనికేతన సౌందర్య
ద్యుతి పరిభావము! వజ్ర వైడూర్య మాణిక్యాదుల యాప్రకాశ పుంజ
ములేమి!! చీని చీనాంబరముల తళుకు బెళుకులు! పీతవర్ణవిభాసిత దుకూల
ములు, కుంకుమ కర్పూరాగరాది సుగంధ ద్రవ్యముల సువాసనలు, మందిర
మంతయు గ్రింద నాచ్ఛాదితము గావింపబడిన రత్నకంబళముల దివ్య కాం
తులు, మణిమయ సువర్ణ పర్యంకముల మహత్తేజము, కనక రజిత పాత్ర

ములు, షడ్రసోపేతామూల్యాహార పూరితంబులగు పళ్లెరములు, ద్రాక్షా రస పరిపూర్ణంబులగు కాచపాత్రిలు, యింక నెన్నియో భోగోచిత వస్తువాహనములు గలవు. వీని నన్నింటి లెక్కింప నావశముకాదు. అల్లదిగో! దంపతు లియువురు నెట్లు కౌగిలించుకొని తమ యానంద బాష్పకణాభిషిక్త కపోలముల చుంబనముల ముద్రించు కొనుచున్నారో చూడుమా! వీరి ధనధాన్య వస్తువాహనారామక్షేత్రాది భౌతిక సంపదలకును, భోగానుభవంబులకును, శృంగారమయ విలాస పరంపరలకును, కామచేష్టితములకును, బ్రహ్మస్వరూపంబగు సమయ దుర్వినియోగమునకును, నింద్య కుటిల భ్రూభంగములకును చంచలతర సుస్నిగ్ధ ముగ్ధ కటాక్ష వీక్షణములకును పారములేకున్నదేమి? వీరలేనా రతీమన్మథులనువారు? వీరి జీవితపరమావధి, నశ్వరంబును, బుద్బుదప్రాయంబును, దుఃఖభయప్రదాయకంబును నగు భోగము. దాని పరిణామము రోగము. అద్దాని పర్యవసానము మరణము. వీరు భోగగతజీవులు! వీరు కామమాత్రోపజీవు లన దగుదురు. నింద్యమగు వీరి తళుకుబెళుకుల, యొయ్యారముల, పడపువృత్తులకొంప నుండు చిత్రమా! ఒక్కతూరి బయటబడుము! తడవు సేయకుము! అయ్యో! ఈ పక్షామాత్ర కాలంబున నాస్థిరమతి యెట్టు విచలిత మయిపోయినది! కన్నోయి యెట్లు చెదరిపోయినది! నిరంతరామితాహార సంభోగ నిద్రా స్వీకరణ పరిణామస్వరూప దుఃఖభయ రోగమరణాలవాలంబగు నోభోగమందిరమా! పో!! పొమ్ము! నాస్మృతివీధిని బాసి వేవేగ వెడలిపొమ్ము!!

చాలదూరము విహరించి వచ్చితిని. ఈ లోచనగోచరంబగున దెద్దియో సమీపించి విలోకించెద గాక! అయ్యో! ఏమిది! జర్జరపత్రవినిర్మితకుటీరమా? అగునగును, ఆకుటీరమే యిద్ది. దీనిపై గప్పబడియున్న శుష్కపత్రంబులన్నియు జెల్లాచెదరయియున్న వేమి చెపుమా! కుటీరమంతయు నీవడువున శిథిలంబయి యున్న దేమి హేతువు? అయ్యో! భీషణసూర్యాతప ప్రచండవర్ష శీతబాధలనుండి యీ యాకుటింటిమానిసి సంరక్షింపబడుట దుస్సాధ్యముకదా!

ఉల్లమా! ఈదైన్యస్థితికి బెల్లుగా గొల్లుమనకు; చల్లబడుము. పరిశీలనకార్యసం
సిద్ధి కనాస క్రస్థితి పరమావశ్యకము. దైవప్రకోపంబనదగు ప్రచండమారుతా
హతి కాహుతియయిన, నీయుటజమును బ్రవేశించిచూచెద. చిత్తమా! నిర్ధ
నులును, గుణవంతులునునగు కారుణికమనుజుల నీరీతి బీడించు పంచభూతముల
దైవమేల నిరోధింపడనియా నీవు విచారించునది? ఆవిషయ మతినిగూఢము!
వడువుము. కుటినిబ్రవేశింపుము! కుటీరమునకు జతుర్దిశల నీపంకియేమి! అం
దును గంటకములా! మనుష్యసంచారము లేన ట్లీగుడిసెచుట్టు ప్రక్కలనున్న
కాలిబాటలు గడ్డిగాదరచే గప్పబడియున్న వేమి? ఈదుర్గంధమయవాయు
ప్రసారమెచ్చోటనుండి? మనమా! ఒకింతయోపికబట్టుము, గుట్టు బట్టబయల
గును. నిశాసమయంబున నీకుటీరమున దీపప్రకాశములేని కారణమేమయి
యుండును? చంద్రజ్యోత్స్నయు నంతగాఢముగలేదు. కీచురాల నిస్వనంబులు
ను, శృగాలరోదనములును, ఘూకములభయముగొలుపు కూతలును వినబడు
నిచ్చోట నిట్టిదీనస్థితియందున్న కుటీరవాసిస్థితి యెంతకరుణాజనకమో కదా!
హరిహరీ! ఈమలినకుశాసనంబున శక్తిశూన్యుడయి పండియున్న వ్యక్తియె
వడు? ఇతని నాసికాబిలములనుండి వేడినిట్టూర్పులు వెడలుచున్న వేమి? రోగ
గ్రస్తుడయియుండ నోపు. వీడు నిత్యదరిద్రుడయి యుండ దైవికంబుగా బ్రా
ప్తమయిన భయంకరవ్యాధికి జిక్కి, యాహారశూన్యుడయి యిట్లీశ్వరరాజ్యం
బున నాక్రందనము నేయుచు మరణోన్ముఖుడయి యున్నట్టున్నయది. వీడు
మిక్కుటంబగు బాధచే మూల్గుచున్నట్లు సవ్వడియగుచున్నది. పాపమునశిం
చును గాక! వీనియాకృతి యెడుభయంకరము గానున్నది. రక్తమాంసశూన్య
మయి, వీనికళావిహీనంబగు శరీరము శల్యావశిష్టమయి, అస్థిపంజరము స్మ్రు
తికిదెచ్చుచున్నయది. అయ్యో! పాపము వీనిశుష్కదేహ మాచ్ఛాదనవసనము
లేక శీతబాధచే గంపించుచున్నయది. చిత్తమా! ఆగుమాగుము, వీనిరుద్ధకంఠ
మునుండి "అకలి, అకలి, దప్పి" యను పదములు వెలువడుచున్నవి. వీనికిట్టి
దుర్గతి సంభవించినను భూనభోంతరాళములు నెవరును వీనికి సాహాయ్యమున

ర్చువారు లేరయిరిగా! వీనిమొర లడవిగాచిన వెన్నెల కరణినయ్యె. వీనిప్రా
ర్థనారవము కుటీరముయొక్క చతుర్దిశలవ్యాపించియున్నను, భీకరనిస్తబ్ధతయందే
లీనమయిపోవుచున్నది. అయ్యో! ఇదేమి చిత్రము! ఈమూలబడియున్న సుందర
దేహ మెవ్వారిదయియుండు? అస్పష్టముగా బ్రసరించు నీచంద్రికాప్రకాశం
బున నీమనోజ్ఞమూర్తియీపీడితవ్యక్తి సతీమణియయియుండునని తోచుచున్నది.
భర్తృవిషాదమయంబును, కరుణాజనకంబును నగు దురవస్థను గాంచి యీ
పతివ్రతాతిలకము సాంఘిక స్వాతంత్ర్య శూన్యయగుటంజేసి, యాహారో
పార్జన కన్యమార్గమును గాంచలేక, ఉద్విగ్నచిత్త సంజాత హృదయవేద
నముచే హృదయస్పందనము స్థగితమగుడు మరణించియున్నదని తెలియు
చున్నది. అయ్యో! ధనాఢ్యులును బలాఢ్యులును నగు భోగోపజీవులేల
దీన హీన సోదరమానవులకు విపదావస్థయందు తోడ్పడక నీచులయి మను
చుందురు? ఏమి యీ భోగపరాయణుల స్వార్థాంధత! దయాశూన్యంబగు
చిత్తకాఠిన్యత!! ఔదార్యరహితమగు హృదయకార్పణ్యత!!! పాప మీ
సాధ్వీమణి భర్తృ విపద్దశ కెంత గుందియుండెడినో తెలియరాదు. ఈవనితా
రత్నము, యీ భర్తృగతప్రాణ, త్యక్తస్వప్రాణాభీష్టపరాయణ, విశుద్ధ
ప్రేమ స్వరూపిణి జీవితము ధన్యము!! ........ రామ! రామ! మరొక్క
హత్యయా? ఈదేవి చేలాంచలమును గరతలంబున గట్టిగబట్టి యీ పడి
యున్న బాలసుధాకర బింబాననుం డెవడు? అయ్యో! నిండుచందురుని సొ
పును గేలిసేయఁజాలు వీనిమోము, కలువలను మించు కన్నవ, ధనురాకృతిం
గీటు భృకుటి, గండుతుమ్మెదల నపహసింపజేయు కురులు; అహా! ఏమి వీని
యనన్య సామాన్య సౌందర్యాతిశయము! క్షుధార్తుడయి యీదంపతుల
నేత్రతారకయగు వీడసువులం బాసినట్లేయున్నది. మాతాసుతు లుభయు
లును క్షుధార్తి వలనను, కుటీరాధిపతి దుస్థితికిని జివికి చివికి మరణించి
యున్నారు. అనాధనాధా! కృపాసింధూ! నీవెటనున్నాడవో యీ దీనుల
మొర బిరాన నాలకింపవా? అనాధులయి కడుప నాహారంబును, దారిద

పానీయంబును, ధరింప వస్త్రములును, నివసింప గుటీరంబులును లేక యాకలి దప్పుల కడలుచు, మండు టెండలకు మాడుచు, పెద్ద వానలకు నానుచు, చలి బాధకు వణకుచు, చెట్లపుట్ల నాశ్రయించి రోగగ్రస్తులయి, ఈ హాహాకార ధ్వనుల నొక్కపెట్టున భూమ్యంతరిక్షముల వ్రయ్యజేయుచు మృత్యువాతం బడు మానవు లెందరీ విశ్వంబున లేరు? ఇట్టిదీనుల యోగక్షేమము లారయు వారు లేరేమి? ధనాఢ్యులగు భోగులు, కాముకులు, మోహాంధులు దుర్విషయాసక్త ప్రాప్తవ్యాధులకు జిక్కి క్రుగ్గుచుండ, నిర్ధనులగు సత్య గుణు లీచందమున గూటికి వాచి చావనేల? అంతయు నగమ్యగోచరము గానున్న దేమి? ఈ ప్రపంచ విలక్షణ భయంకరదృశ్యము చిత్తమా! నీ యా నందముపాలిట నశనిపాతం బయ్యెనా? మద్యమాంసవనితా భోగాసక్తుల దూషింపకు, ధనవిహీన గుణాఢ్య విపద్గ్రస్త మానవ సంఘమును గాంచి ఖేద ముచే గ్రుంగి కృశింపకుము. నడువుము! ముందునకుబోయి యింకను బ్రపంచ స్థితిగతుల నరయుదము. దృష్టిపథంబున బడు సమస్తము నట్లే రెప్పవాల్పక చూచుటయే నీపని............ అల్లదిగో ఆకానవచ్చు సౌధము దుప్ప తిలు నానందధ్వనులు, కలకల నిస్వనములు, సంరంభము లేమయి యుండును. చిత్తమా! ఏమంటివి? తద్గృహస్వామి పుత్రోదయోత్సవసన్నా హాసంరంభము నేయుచుండ గలుగు కోలాహలమందువా? సరిసరి, తెలిసి నది. అమితధనమును దుర్వినియోగపఱచి మేళతాళములతోడ నుత్సవము సలుపు వీరిస్థితి యానంద సౌదామినీ చంచలగతి ననుసరించినదా? ఏమి? వెఱ్ఱి!! రేపో మాపో గిట్టుదాని కిట్టి యార్భాటములు!! డెందమా! అటు జూడుము! మహోన్నతంబులగు భూరుహమాలికలచే నాక్రమింపబడియున్న నాప్రదేశమధ్యంబునుండి పైకెగయు నాధూమ్రపటలమేమి, ఆజనసమూ హమేమి? అయ్యో! నాపరిచితుండగు ధనాఢ్యుని మనోజ్ఞమూర్తి యిట్లు రజ్జువులచే బంధింపబడియున్న దేమి? అట నాసీనులయి వెక్కి వెక్కి రోదించు వారలెవరు? గ్రహించితి, ధనాఢ్యుడు మృత్యువాతంబడ మమత్వపాశ

బుద్ధులగు వారిబాంధవు లాక్రందింపు చున్నట్లున్నయది. అయ్యో! చూచు చుండగనే ధనవంతుని సుందర తనూలత భయంకరాగ్ని జ్వాలల కప్పింపబడ, నిట్లు భస్మ రాసియయి పోయినదో చూడుము!! ఏమిది? అప్రయత్నముగా నా చెక్కిళ్ళపై నీ బాష్పబిందువులు! చిత్తమా! సహజమునకు వాపోవు నీవెంతటి బేలవు? అహంకార మమకారములకును, కామక్రోధాదులకును, భోగ పరాయణత్వమునకును స్థానమగు దేహగేహ మెప్పటికయిన భస్మంబగునదే కదా! ఘటము మృత్తికయందు విలీనము కావలసిన వస్తువే సుమా! ఇంక నీరుద్రభూమిని బాసి యొకింత ముందునకడుగిడుము. తజ్జన కోలాహల ప్రదేశంబున కరిగి వింతలజూచెద. శ్రీహరి! అఘముపశమించు గాక! ఈమేషమేషీ గోవృషభ కుక్కుట హాహాకారధ్వను లేమి? మన్నును మిన్నును బ్రద్దలసేయదగు నీయార్తుల గోలయేమి? అబ్బా! నాధైర్యము నశించినది, పదములు కంపించుచున్నవి, తల తిరిగిపోవుచున్నది. కాయమంతయు ఘర్మజలబిందు సిక్తమయి పోయినది. ఇదియొక పశువధాస్థానము. ఈతండోప తండములయి వచ్చు నరరూప ఘాతుకమృగములు మందహాసములజేయుచు, కరుణాజనకంబగు నీపశువధశాల కెందులకు ప్రవేశింపుచున్నారు? ఛీ! ఛీ! ఈ మానవాకృతియందున్న నారకాధములు పశువులు ఘోరున నడలుచుండ ఖడ్గముల గుత్తుక లుత్తరింపుచుండ నానందింపుచు మాంసక్రయమునకయి వేంచేసియున్నారు. మనమా! ఎన్నితూర్లుబోధించిన నీచంధమున నంగలార్చు టేమి? హా దైవమా! ఈభయంకరరాక్షస హృదయుల హస్తములనుండి యీ సాధుజంతువుల సంరక్షించువారు లేరుగా? హా విధీ! నీసృష్టియందిట్టి ఘోరహత్యాచారమును మాకు జూపించుటకంటె మమ్ముల పిరికరవాలధారల కెగజేయవు? భూదేవీ! నీవయిన నొక్కసారి విచలితవు కారాదా?

ఆమాంసవిక్రయశాలల నంటియున్న యాయున్నతభవన మేమయియుండును? ఆయూగుచునూగుచు బ్రేలుచువచ్చు విలాసపురుషులెవరు? ఆహా!

విశదమయినది. ఆభవనంబోక మద్యవిక్రియమందిరము. ఆవచ్చువారు సురాపానమత్తులు. వారెటకేగుచున్నారో, చూచెదగాక! ఏమి వారారాజప్రాసాదమును ప్రవేశింపుచున్నట్లున్నయది. ఈసౌధసమ్ముఖంబున నీయశ్వశకటంబులేమి? ఈవిద్యుచ్ఛకటములేమి? ఆఁ దెలిసినది. ఇదియొక్క వేశ్యాగృహము! ధనాఢ్యులగు కామాంధులు మహాట్టహాసములతోడ వారాంగనాగృహము నలంకరింప నేతెంచియున్నారు, ఛీ! ఈదృశ్యమునవలోకింపరాదు. చిత్తమా! నడువుమిఁక ముందునకు. ఆహా ఈవనదృశ్యమెంతయు రమణీయమయి నేత్రపర్వముగా నున్నయది. ప్రకృతీదేవి క్రీడాస్థలంబనదగు దీనిసౌందర్యవిభవము భవైకవేద్యమేకాని శ్రవణమాత్రంబున బూర్ణము గాగోచరింపదు. అల్లదిగో ఆభవ్యపర్ణకుటీర సమ్ముఖంబున బద్మాసనాసీనుడై, ముఖారవిందమునుండి బ్రహ్మతేజస్సు దొలుకుచుండ, శాంతిభావము గంభీరముగా లాస్యము సలుపుచుండ, కందమూలాదుల భక్షించునత డెవడు? ఆత్మానంద యోగియా? వాని వదనమండలమున భక్తిజ్ఞానయోగాభ్యాసాభాసము పుంజీకృత మయియున్నది. వానిచెంతనే కుశాసనము, మృణ్మయపాత్రి, హస్తదండము. తాళపత్ర ప్రాచీన గ్రంథము మొదలగు పరికరము లెట్లుపడియున్నవో చూడుము! అవన్నియు వాని సాధులక్షణములనే వెల్లడింపుచున్నయవి. మనస్తుష్టిని, భోగనివృత్తిని, కామనిర్యాణమును జీవిత క్షణభంగురత్వమును, జ్ఞానబలవిశేషమును, విశ్వమయప్రేమను, అహింసావ్రత నిష్ఠను గల్గియుండు వీనిని ప్రాపంచక సుఖదుఃఖాది వ్యామోహ తరంగము లెంతయు తిరియు స్వప్నమందయిన స్పృశింపజాలవు. ఇతడు సచ్చిదానంద మయుండయియున్నట్లు తెలియవచ్చుచున్నయది. చిత్తమా! ఏమిది వచించి యంటివి? త్యక్తతృష్ణాధనుండగు ననాసక్తహృదయుడా యితడు! సంసారతత్త్వము వీని లోమము నయినా విచలితముగావింప జాలనందువా? ఏమి పారమార్థిక జీవియగు వీని కకలంకంబును నవ్యాజంబును ననశ్వరంబును నగు బ్రహ్మానందమే ప్రాప్యపదార్థమందువా? ఐహికాముష్మిక శాంతి వీని పాదరాజీవంబుల

నాశ్రయించుననియూ నీవు కోవిదులవలన నాలకించి యున్నది? పరిశుద్ధ భక్తి జ్ఞాన వైరాగ్య పాఠముల నిజజీవితముల యందు సమన్వయ మొనరించువారు సదా శివమూర్తులగుట గాంచియుంటివా? అహా! నేడెట్టి బ్రహ్మానంద మయంబగు వార్తల నాకర్ణించు భాగ్యము వాటిల్లినది!! సాధు సజ్జన సందర్శన సాంగత్య ప్రాభావమందు రిదిరొ కాబోలు! ఇంక పర్యటనమును స్థగిత మొనర్చి విశ్రాంతి నందుటుచితము. డెందమా! భూఖండమందలి సకలజీవప్రపంచము స్త్రీపురుష భేదంబున వెలయుచు మిథునానురాగ పాశబద్ధమయి, వియోగంబుల దుఃఖింపుచు, సంయోగంబుల నానందింపుచు వ్యాధిమరణముల కయి యడలుచు, ఆయురారోగ్యముల కవిరళ కృషి సేయుచు నుండుటను రహస్యము నాకు దెల్లమయినది.

ఈవిచిత్రంబగు సృష్టియంతయు దరిద్రులు, ధనాఢ్యులు, అనాథులు, సనాథులు, దుఃఖితులు, శుభాన్వితులు, పామరులు, పండితులు, శూరులు, ఆహారులు, నిర్దయులు, దయార్ద్రహృదయులు మొదలగు ననేక తరగతుల మానవ మానవేతర జీవపుంజములతో నిండియున్నది. సుఖమందే దుఃఖము, దుఃఖమున నే. సుఖలేశాల్పప్రకాశము జననమువిదనందనే మరణము, మరణము వెనువెంటనే జన్మ క్రమానుగతములయి శుక్లకృష్ణపక్షములవలె నేతెంచుచున్నయవి. పరస్పర పీడనమందే జీవప్రపంచము సజీవమయి యున్నది. సమస్తము హింసాత్మకంబును, దుఃఖాత్మకంబు నయియున్నది. తృష్ణలేని ప్రదేశమందు బ్రహ్మానందమే, బ్రహ్మానందము కలదు, వీనికన్నింటికి హేతువేమి? ఏమంటివి? ఉల్లమా! మరియొక్కమారు వక్కాణింపుమా! "ఇవన్నియు గతజన్మ సుకృత దుష్కృత పరిణామములందువా?" పునర్జన్మము లేదనియే యొకనివలన విని విశ్వసింపలేదా? ఈసృష్టి యెప్పుడు, యెందునిమిత్తము విరచింపబడినది? యో చిత్తమా! తెలుపగలవా? మానవుడను వహించితివేమి? ఎంతకాలమింక నిర్వహింపబడునో ప్రత్యుత్తరము నొసంగ సందేహింపు చుంటివని గ్రహించితి, ఈవిషయంబు లన్నియు నవాఙ్మానస

గోచరములనియు, భావాతీతములనియు, వాక్చాతుర్యంబునను మేధాసంపత్తి వలనను, యుక్తిప్రమాణాప్త వాక్యానుమానంబులవలనను నిదమిత్థమని స్పష్టీకరించుట మానవసాధ్యము కాదనియు నీయూహ. మానసమా! ఇట్టివిషయంబుల నిగూఢత్వంబు ననేక దేశముల నేకవిధుల యుక్తిప్రయుక్తుల భేదింపనెంచితినని కాని యవన్నియు నిష్ప్రయోజనములనియే నాకిపుడు స్పష్టమయినది. ఈవిచిత్ర సృష్టిజాలంబున జిక్కువడి పోవువారికి చిత్తశాంతి సౌఖ్యము లిహపరముల లభించు మార్గములసయిత మనేక దేశములం గ్రహించి మించిన విషయము రూఢి. ఇందును బరమును గుఱించి విచారించుటకు నిహామించిన విషయము రూఢి. శాంతిని బట్టియే యవకాశ ముండునని తెలియనగును. చిత్తమా! ఏమంటివి? ఐహికవిషమసమస్యల బహిష్కరించుటయం దపూర్వంబగు సాధనమార్గము నన్వేషింప గల్గినది భరతఖండమనియా నీసంపూర్ణ విశ్వాసము! అబ్బా! ఈవిచిత్రసృష్టి మాయాతంత్రవాదమును ఖండింపనేర్చిన యార్యావర్తమెట్టి మహిమకలదో తెలియ నాతురత యొదవుచున్నయది. అల్లదిగో! భారతీయాధ్యాత్మిక జ్ఞానసంపన్నుండగు వ్యక్తి "ప్రాచీనభారతమును, "విశ్వహృదయ" మను వ్యాసముచే నొప్పు కరపత్రికల వితరణము గావించుచున్నాడు. నేనునహిత మొకపత్రి మందుకొని విలోకించెద.

---

# "విశ్వహృదయము."

"వందే భారతమాతరం సురనుతాం సస్యాది సంశోభితాం."

సకలభూవలయంబునన్ కీర్తివ్య భారతవర్షమే గుండెకాయ. ప్రాక్పశ్చిమ పండితమండలాగ్రగణ్యులెందరో తమ సుప్రసిద్ధములగు గ్రంథములయందీవిషయమును సమర్థించియున్నారు. విజ్ఞులకెల్లరి కీయుదంతము హృదయంగ

సమే యయియుండు; ఈభరతఖండము యొక్క మాహాత్మ్యము నిటసంక్షిప్తము గా వర్ణించుటయే సమంజసముగా దోచెడిని. మనయీజన్మభూమి "ఆర్యావర్తము, సింధుస్థానము, భారతవర్షము, భరతఖండము, హిందూదేశము, హిందూస్థాన" మను శుభాభిధేయంబుల నొప్పారుచున్నయది. ఆంగ్లేయులిద్దానినే ఇండియాయని పేర్కొనుచున్నారు. ఈనామముల వ్యుత్పత్తిని గురించి వ్రాయబూనుట మదుద్దేశము కాదు. ఒకకాలమునం దీభరతఖండము సకలవిశాలవిశ్వవలయంబునకును హృదయసదృశమయి, జ్ఞానవిజ్ఞానములకును, వివిధకళాప్రావీణ్యమునకును తావుయయి వెలసి యుండెను. గ్రీసుదేశీయులచేతను, చైనాదేశీయులచేతను వ్రాయబడిన ప్రాచీనచరిత్రగ్రంథముల పుటల ద్రిప్పి ధ్యానముతో జూచువారికెల్ల — భారతీయులపరమాద్భుత పాండిత్యప్రకర్షయు, శిల్పకళానైపుణ్యంబును, ఆధ్యాత్మిక విద్యాభ్యుదయమును, భరతనాట్యసంగీత వైద్యవిద్యాపాటవంబును, దేవభాషయనందగు గీర్వాణభాషావాఙ్మయ స్వాతంత్ర్యంబును, మతపరిజ్ఞానప్రౌఢిమయు, రాజతంత్రపరిజ్ఞానకుశలత్వంబును, పాలకపాలితుల పరస్పరగౌరవ స్వత్వసంరక్షణాసక్తియు, నూతన రాజ్యనిర్మాణ చాతురీవిలసనంబును, వ్యవసాయవిద్యాభివృద్ధియు, భూగోళ ఖగోళ రసాయన శాస్త్రవిద్యావిశేషంబును, లలితకళాలాలిత్యంబును, అనర్గళ దివ్యప్రకృతీహృదయప్రదర్శక కవితాధోరణియు, చికిత్సావిధానంబును, ఆయుర్వేదౌషధ నిర్మాణబుద్ధి చాకచక్యంబును, ఆదర్శగ్రామ రచనాచాతురియు, పారమార్థికజీవిత నిర్వహణాభిలాషాపారతంత్ర్యమును, శాంతి క్షమా దమ తపశ్శౌచ కరుణాహింసా ద్యపూర్వసద్గుణగణోపార్జనాభిలాషయు విశదము కాగలవు. సకలదేశములు సభ్యతాశూన్యములయి, విద్యావివేకములదలియక పరస్పరహింసాద్యనేకదుష్ప్రవృత్తుల నవలంబించి, ఆధ్యాత్మికమునకు, గడుదూరములయి, స్వాతంత్ర్యంబులును, సుఖపూర్వకంబులునగు భౌతిక జీవితోపకరణముల నయిన సంపాదింపలేక పశుతుల్యంబయినట్టి నింద్యమగు హింసాత్మకజీవితమునే వ్యతీతము నేయుచుండిన భయంకరంబగు కాలంబున,

మన యీభరతఖండము స్వేచ్ఛాపరతంత్రమయి, సేద్యమునే సాధుజీవితయాత్రకరణంబయినవృత్తిగా నవలబించి యీపరక్షేత్రములనెల్ల సస్యప్రదంబులును, సారవంతములునునగు సుక్షేత్రములుగ మార్చి, ఆధ్యాత్మికజ్యోతి ప్రభావంబున నజ్ఞానాంధకారబంధురంబగు భూఖండమునంతయు దేదీప్యమానము గావించి యుండెను. తత్కాలమున భరతఖండమందలి ప్రతిమానవుడును "ఆత్మవశం సర్వం సుఖం, పరవశం సర్వందుఃఖ" మ్మను మనుసూక్తినే జపించుచు స్వతంత్ర జీవితమును, స్వేచ్ఛావృత్తులను గల్గియుండెడివాడు. నాటి భరతఖండవాసియగు కృషీవలుడు వేషభాషలయం దెట్టి యాడంబరమును గల్గియుండకపోయినను, జర్జర పర్ణ కుటీరంబులును, వృక్షమూలంబులును, పర్వతకంధరములును వాని నివాసయోగ్యంబులగు గృహములే యయి యుండియున్నను - వానిహృదయంబును, భావంబులును జీవితలక్ష్యములను సకల మానవ ప్రపంచజీవితాదర్శమహాపర్వత శిఖరంబు నధిష్ఠించి యుండెను. వాని దృష్టు లూర్ధ్వ ముఖములు. చిత్తము సంయమ వ్రతానుష్ఠాన పరతంత్రము, చేష్టితములు సర్వజీవోపయోగకరములు, చరిత్రము సత్యజ్ఞాన ధర్మ పారిశుద్ధ్య వినిర్మితము, హృదయభాండము విశ్వజీన కరుణారస భరితము. వాని వచనములు మృదు మధురములును, వినయభావ సంశోభితములు నయి యుండెడివి. వానివదనమండలము సర్వకాల సర్వావస్థలయందును సురుచిరాధ్యాత్మిక జ్ఞానసంపన్నార్య జనోచిత గంభీర సుస్నిగ్ధభావస్ఫూర్తి విభాసితము. ఆ కృషికారుడు నిజహస్తంబున హలముంగొని, క్షేత్రముల దున్నుచు వృషభంబుల ప్రేమతోడ నదలింపుచు, నాధ్యాత్మికతత్త్వ గీతముల గానముసేయుచు, పశుపక్ష్యాదుల యుల్లంబుల నెల్ల ఝల్లువింప జేయుచుండెడివాడు. వానిభోగంబులన్నియు మితత్వమును గల్గియున్న సంయమ నిష్ఠాచిహ్నములె. వాస్తవ మరయ నతని జీవితావసరములే స్వల్పములు. పరస్పర సహాయ మప్పటికి యాకృషికారుల విధ్యుక్తధర్మముగ భావింపబడుచుండెడిది. పరస్పరపీడనము, ద్వేషము, పరాభ్యుదయ మత్సరము, దుర్వృత్తులచే

ధనోపార్జనము, పరస్పరకలహము మొదలగు ప్రజైక్యహృదయవిదారకం బులగు దుర్గుణము లప్పటి భారతీయులయందు లేవని నొక్కి వక్కాణింప మన ప్రాచీన చరిత్రగ్రంథములును, మతగ్రంథ రాజములును సాక్షిభూతములు. గ్రామపంచాయతులే వారి న్యాయాలయములయి, క్వాచిత్కముగా వారి యందొదవు కలహబీజమూలోచ్ఛేదము గావించుచుండెడివి. కృషీవలుర పుత్రపుత్రికాసంతానము గురుకులముల కరిగి వేదాధ్యయనము, బ్రహ్మ చర్య నిష్ఠాపారతంత్ర్యమున నేయుచుండెడివారు. ఋషివరేణ్యులును, తాపసచంద్రులును, విరక్తపురుషులును, జాతి వివక్షతల గంధమునయిన నెఱుంగక మాధుకరవృత్తిచే నుదరపోషణము చేసికొనుచు, పారమార్థిక దృష్టిచే జెన్నొందుచు గ్రామగ్రామంబులను, వాడ వాడలకు, వీథు వీథులకేగి వేదాంత తత్త్వోపదేశముల జేయుచుండెడివారు. ఒక్కొక్కెడ గృహయజమానియే పుత్ర పుత్రికలకును, పుత్రవధూ జామాతలకును గృహస్థాశ్రమ ధర్మశాస్త్రంబుల దెలుపుచుండెడి వారు. ప్రతిదివసము౯ దొక్క గడియ కాలమైన రైతులు సద్గోష్ఠియందే ప్రతీతయు నేయ నభ్యస్తులయియుండెడివారు. ఆహార పానీయనిద్రాస్వీకారంబుతోబాటు దాన ధర్మ దయాభిక్షాతిథ్యములను, సాధుసజ్జనపూజా గౌరవంబులను భారతీయులు నాడు విహిత కర్తవ్యములుగ భావించియుండిరి.

ప్రత్యేకవనితాపురుషుని హృదయమాధ్యాత్మిక తేజస్సుచే నిండి, సంసార భోగదుఃఖమయరూపంబును, క్షణభంగురత్వమును గుర్తెఱింగియేయుండెడిది. వారు తమకర్తవ్యంబుల నాధ్యాత్మికసిద్ధాంత సమన్వయమునకు స్థానమొసంగి నటుల భౌతికధర్మమాత్రముల నొసంగుటకు సమ్మతించెడివారు కారు. అప్పటి మనసంపూజ్యమగు భరతఖండము సకలవిద్యల కాలవాలమయి, సంపదలకు గాణాచియయి, శరీరమనోబలంబులకు బట్టుగొమ్మయయి, మహాపురుషులకును, సాధ్వీమణులకును జననియయి, బ్రహ్మజ్ఞానోత్పత్తికి నిలయమయి, సకల

సస్యఫలపుష్ప ప్రదాయినియయి, ఎల్లవాడులకు గుంజియయయి, విశ్వమణియన వాసికెక్కియుండెనన్న సత్యోక్తి కానేరదు.

విశ్వమందలి సమస్త దేశీయుల మతగ్రంథములకంటె మనచతుర్వేదములే కడుప్రాచీనతమములయి, జ్ఞాన ధర్మ నీతి సాధన ప్రదములయియున్నవనియు, నాల్గువేదములయందును ఋగ్వేద మతిపురాతనమయినదనియు సకలమతదేశ పండితప్రకాండులు నేకగ్రీవముగా స్వీకరించియున్నారు. మన వేదాదులయందు నైహికాముష్మిక సుఖప్రదంబులగు బోధనలును, మార్గములును విపులముగ జర్చింపబడియున్నవి. అవి యనాదికాలంబున భరతఖండమున ఘటియించిన సమస్తవిషయంబుల దెలుప, చరిత్రములవలెను, ఆచారవ్యవహార భాషా వేషాదుల విశదపఱుప సాంఘికగ్రంథములుగను ప్రాచీనపరతత్త్వ పరిశీలనావిధానమును దెల్లమొనరింప వేదాంతగ్రంథములుగను, మానవాళికుపయోగపడుచున్నవి. అవి భారతభూతయుగ దర్పణములు, చతుర్వేదంబులగు ఋగ్యజుస్సామాథర్వణముల లక్ష్యములను, భావవిభూతులను సమర్థింపుచున్న యుపనిషద్గ్రంథజాలము నంతయు మన ప్రాచీన భారతీయ ఋషిసత్తములే విరచించియున్నారు. సృష్టియందలి మేధావులనెల్ల నిశ్చేష్టుల గావింపదగు షడ్దర్శనము (షట్ఛాస్త్రములు) ల రచించిన ధీరవిస్తారులగు పుణ్యమూర్తులు ప్రజ్ఞాచక్షువులగు తపోధనులు కపిల గౌతమ వ్యాస కణాద జైమినీ పతంజలి ఋషిపుంగవుల గన్న చల్లనితల్లి మన భారతమ్మయె. ఇట్టి మహాఋషులెందరో మన యీ భారతమాతృ గర్భంబునుండి జననమంది తద్దేవీ పవిత్ర దుగ్ధధారల గ్రోలి పుష్టిని, మనస్తుష్టిని జెంది, బాల్యకాలమంతయు నీతల్లి యంకసీమయందే క్రీడలెన్నెన్నియో సలిపి, జగత్ప్రసిద్ధంబులగు తత్త్వవిషయంబుల నకుంఠిత భక్తిభావంబున సాధించి, లోకంబున జాటికీర్తికాయులయిరి. జర్మను దేశమునొక్క షోపనహార మాక్సుముల్లరు పండితమ్మన్యులు మన యుపనిషద్దర్శనములగూర్చి ప్రశంసించుచున్న యభిప్రాయముల పాఠకభ్రాతలారా! మీ రొక్కతూరి పరికింపుచో ప్రాచీన భరతఖండ ప్రాశస్త్యమును దెలియ

గలరు—"ఉపనిషత్తులతోడను, దర్శనములతోడను నీడగు ప్రాచీన గ్రంథము లెందును గానరావు. ఈ భారతీయ గ్రంథములు సత్యసందేశముల దెలుప మానవజాతి కుపయోగపడునట్లు మరియేగ్రంథములును సృష్టియందు ప్రయోజనీయములు కావు." "సర్వోత్కృష్టంబగు నాధ్యాత్మిక జ్ఞానమును, ధర్మసాధనములును, నీతినియమంబులును, సృష్టిరహస్యంబులును, సకలవిశ్వమానవజాతులకు భారతీయ ఋషిసంతతులనుండియే లభించుచువచ్చియున్నది. వారి పదపదమందు బ్రహ్మజ్ఞాన తేజస్సు మూర్తీభవించియున్నది. పశ్చిమఖండవాసులందరిచే మన్నింపబడు నీమహాపండితశేఖరు లిరువురు దమ గ్రంథములయం దెన్నిటియందో నీ నిరీతి భారత స్తవపాఠము గావించి మన కృతజ్ఞతకు భాజనులయినారు.

గౌతముని న్యాయదర్శనమే గ్రీసు దేశాభ్యుదయమునకు బ్రథమ మార్గదర్శినియయి యాదేశమం దభ్యుదయము నందెను. మన నీతిసిద్ధాంతముల నెన్నింటినో రోమకులు సహిత మవలంబించియున్నట్లును, పార్శికుల పురాత గ్రంథమగు జందవేస్తాయందును, హోమరుగాథయందను, అరబ్బీల కురాను గ్రంధరాజమందును, ఆసియాఖండవాసియు, నార్షమతప్రోక్త ధర్మనీతిసిద్ధాంత ప్రచారకుండును నగు క్రీస్తుభగవానుని మతగ్రంథమగు బైబిలునందును మన ప్రాచీనార్షేయ నీతియంతయు గొద్దిపాటి దిద్దుబడులచే వెలయుచుండుట దేశవిదేశీయ చరిత్రకారు లెరుంగని విషయము కాదు. ఖగోళశాస్త్రజ్ఞాన నిష్ణాతయు, మహాపండితోత్తముండును నగు నార్యభట్టమహాశయుని గన్నదియు నీ భరతమాతయే సుడీ! వసుంధరయొక్క మధ్యాకర్షణ శక్తిని దీర్ఘ పరిశీలనానంతరము గ్రహించి మించిన వరాహమిహిరుడీ భరతఖండ గౌరవ స్వరూపుడే యని తెలియలేకపోయితిరా! క్షేత్రరేఖాబీజగణితముల, ననన్య సామాన్య పరిజ్ఞానమును భారతీయులే గ్రహించి యనంతరము విశ్వమునకు జాటిన విషయమును విజ్ఞులకు వేఱుగ విశదము సేయవలయునా? చరిత్రలగణితశాస్త్ర పరిజ్ఞానంబున బ్రసిద్ధికెక్కిన నకలియాథేశ మీ పురాతభారత

మాతృపాదరాజీవ శుశ్రూషవలననే బడయఁగలిగినదను రహస్యమును పశ్చిమ
ఖండవాసులును, పాశ్చాత్యవ్యామోహపంకిగ్రస్తులును, పాశ్చాత్యసభ్యతా
ప్రియులును నగు మా శుష్కభారతీయు లెఱుంగక "పూర్వపు హిందూదేశీ
యుల నాగరకులు గుడ్డకట్టువారు కారు. నల్లగానుండువారు. పచ్చిమాంసమే
వారి తిండి. అడవులే యిండ్లు. తోళ్ళుకప్పుకొనెడివారు." అని పలవరించుట
కెంతయు ఖేదక్రోధముల బడయుచున్నాడను. మన భారతీయుడగు భాస్క
రాచార్యుని సిద్ధాంతశిరోమణియందు వ్రాయబడియున్న గణితశాస్త్ర విష
యక గూఢసూత్రములు వ్యాపించునంతపర్యంతము ద్వాదశాబ్దముదనుక
విశ్వమునం దన్ని దేశముల గణితము శూన్యముగనే యుండెనని చెప్పనొప్పు.
భరతఖండమును గలిగియున్నట్టి యేషియానుగూర్చి యింగ్లాండు పండితుఁడగు
"ఎడిత్తుహోలాండు" యెట్టి సంస్తవవాక్యముల బశ్చిమఖండవాసుల యభి
మానము విదళితమగుచందమున వ్రాసియున్నాఁడో పాఠకులారా! అతని
"East and West" అను వ్యాసమునఁ జూడుడి.

వివేకానందుని ప్రాక్పశ్చిమ వ్యాసాంశముల గాంచి పశ్చిమఖండ
వాసులు మిన్నకుండిరేమి? శ్రీస్వాములవారు అమెరికాదేశమున నొసంగి
యున్న ప్రాచీనభారత సంస్తవోపన్యాసములకు, నవి సత్యములే కాకున్న
మేధాసంపన్నులగు మతాధికారులెల్లరేల బురలిలనెగురవైచి, స్వామికి
బాదాక్రాంతులయిరి? విదేశములకరిగి భారతీయమతజ్ఞాన ధర్మనీత్యుప
న్యాసముల నొసంగియున్న రామమోహనరాయి, కేశవచంద్రసేను, రామ
తీర్థ, రాధాకృష్ణ మొదలగు ధర్మాచార్యుల భారతీయ జ్ఞాన విజ్ఞాన మహిమాస్త
వస్వరూపంబులగు నుపన్యాసముల బాశ్చాత్యపండితులెల్ల రెందుకు గౌరవించి
యుండిరో పాఠకులు గ్రహింపలేకపోరు!

మహాప్రసిద్ధుండగు పాణినీ వైయ్యాకరణున కేది జన్మస్థానము? ప్రథ
మచికిత్సా శాస్త్రోద్గమస్థాన మెయ్యది? చరకసుశ్రుతాయుర్వేద గ్రంథ

రత్నము లేదేశము స్తకము నత్యున్నతము గావించినవి? ప్రథమరసాయన శాస్త్రజ్ఞాన మేనాడు నాదరించియున్నది? వీనికన్నింటికి మూలము ప్రాచీన భరతఖండము; ఇది ధ్రువము. ధాతుసర్మితంబులగు ననేకౌషధముల గూర్చిన విషయంబు లెన్నియో చరక సుశ్రుతములం జేర్కొనబడియున్నవి. ఉద్భిద్విద్య ప్రపథము సుశ్రుతమునుండియే యావిర్భవించి నల్దెసల వ్యాపించి, క్రమాభివృద్ధినందెను. వేదశల్యంబులును, నీతినిధులును, ధర్మసిద్ధాంత భండారములును జ్ఞానఖనులునునగు భారత భాగవత రామాయణాదుల విరచించిన చిరస్మరణీయులగు మహానుభావులు, కవిచంద్రులు మన భరతపుత్రులె. పర్షియా, అరేబియా, గ్రీసు, స్పైను, జర్మనీ, ఇంగ్లాండు మొదలగు విదేశభాషల ననువదింపబడి వ్యవహారజ్ఞాన దర్పణమని వాసి గన్న నీతినిధియగు పంచతంత్రము తొలుత గీర్వాణభాషయం దీ దేశపుత్రునిచేతనే వ్రాయబడినది. సంగీత స్వరజ్ఞానమును ప్రాచీన కాలమందే మన పూజనీయులగు ఋషులు సామవేద గానమునకయి యభ్యసించియుండిరి, మన భరతఖండమే శిల్పవిద్యకు బుట్టినిల్లనుటకు బ్రస్తుతము శైథిల్యమునకు సమీపించియున్న మనదేశమందలి మందిరములు, దేవాలయములు, బర్వత దుర్గములు, పర్వత గృహములు ఎల్లోరా యజంతాగుహలయందలి చిత్రములు శిలావిగ్రహములు, నానావిధములగు చెక్కడములు, దేశవిదేశముల గాననగు భారతీయ బౌద్ధస్తూపములు, తాజమహాలు మొదలగు చిత్రకళా ప్రదర్శనములె సాక్షిభూతములు. ఇనుము కరిగించుటయందు భరతఖండమే తొల్లి యగ్రస్థానమునంది యున్నదనుట కెన్నియో వేల సంవత్సరములకు నిందప్రస్థపురమందలి బూర్వమువగు లోహ స్తంభమే ప్రబల నిదర్శనము. భరతఖండ భూభాగమునందు ప్రథమమునుండియు బంచలోహములును, వజ్రరత్నమౌక్తికములును విశేషముగా లభించుటం జేసియే భరతఖండమునకు సువర్ణ ప్రభూతియనియు, రత్నగర్భ యనియు బేర్లు కలవు. మేరీ మహారాజ్ఞీమణి చెంతనున్న సుప్రసిద్ధంబగు కోహినూరువజ్రము మన భారతీయుల సంపత్తియే. శ్రీకృ

ష్ణుని కాలమునాటి శమంతకమణిని కోహినూరు స్మృతికి దెచ్చుచున్నయది. గృహ నిర్మాణోపకరణములగు చలువరాళ్ళ గుట్టలను, కలపతో నిండిన ఘోరారణ్యములను, శాకాదులను, కందమూలాదులను, సకల ధాన్యములను బ్రసాదింప ఫలప్రదంబగు భూభాగంబును, లవణము నొసంగు పర్వతాంబునిధులను మన కసంఖ్యాకములను మన చల్లనితల్లి సంపాదించి యున్నది. చందనాగరు కుంకుమ కర్పూరాది సుగంధ ద్రవ్యములకు తావు మన భారతదేశమె. అనాదికాలమునుండియు భారతీయులు సాగరయాన నిర్మాణకుశలురనుటకును, సముద్రయాత్రాసక్తు లనుటకును, బ్రహ్మదేశము, శ్యామదేశము, కంబోడియా, జావాద్వీపము, బలిద్వీపము, మొదలగు దేశములకు వలసిపోయియున్న మన భారతీయ సోదరులే ప్రబలప్రమాణము. పురాతనకాలమున జైనా త్రివిష్టపతార్తారములనుండి పండితు లనేకు లీదేశమున కేతెంచి ఋష్యాదుల నాశ్రయించి, గురుకులంబుల శరణుజొచ్చి, భారతాంబకు మ్రొక్కులిడి, వేదాదులకు జోహారులు సేసి న్యాయదర్శన వేదవ్యాకరణాది శాస్త్రముల నభ్యసింపుచుండెడివారు. మహా భయంకర పర్వతారణ్య సాగరంబుల నతిక్రమించి కాశ్మీరము, నేపాళము, త్రివిష్టపము, బ్రహ్మదేశము, మంగోలియా, చైనా, కోరియా, జపాను, జావాద్వీపము, సుమిత్రాద్వీపము, కాబూలు, సిరియా, పాలస్టయిను, సింహళము మొదలగు దేశ విదేశములకు బోయి బౌద్ధమత ప్రచారము గావించిన దీ భారతీయులె. మత బోధక సంఘనిర్మాత లీ భారతీయులె. క్రిష్టియను మిషనరీలు మతప్రచారక సమతులజ్ఞానమును బడసినదియు మననుండియె. మన ప్రాచీనార్యావర్త గౌరవాధిక్య ప్రాశస్త్యముల నాలకించి యుండియే యలెగ్జాండరు, మహమ్మదుగోరీ, గజనీమహ్మదు వంటి పరరాజ్యాపహరణాసక్తులును, హుయాన్సాంగు, మెగస్తనీసు, బర్నియరు వంటి చరిత్రకారులును భారత స్వర్గమును బ్రవేశించియుండిరి. మొగలు ప్రభుత్వమునకు బూర్వ మరాహామార్గము లేర్పడి యుండని కాలంబున గాశీయాత్ర హిందువుల కెట్టిపూనికను సంతసి

ప్రదమగు కృత్యమయియుండెనో! విదేశీయులకును మన భారతయాత్ర యెంతహర్షదాయకంబుగ నుండెడిది. హూణశకమునకు బూర్వమే ప్రాచీన భారతాభ్యుదయ చిహ్నములు నశించిపోయినవి. శేషించియున్న ప్రాచీన భారతగౌరవ ప్రాశస్త్యము ననుసరించియే హూణులాదిగాగల విదేశీయులొకింత జ్ఞానవిజ్ఞానముల నార్జింప సమర్థులయిరి, గ్రీసుదేశ విఖ్యాత చరిత్రకారుండగు హెరొడోటసు మహాశయుడీ విషయంబుల నన్నింటి గ్రహించియే వర్తమానసమయమందు సమగ్రవిశ్వమందలి సకలజాతు లన్నింటిలోను భారతజాతియే బలవత్తరమయినది." అనివాక్రుచ్చియున్నాడు. మహాసత్త్వశక్తిస్వరూపిణియగు భారతమాతృశ్రీగర్భమునుండి "శ్రీరామచంద్రునింబోలు పితృవాక్యపరిపాలనా దక్షుండును, ఏకపత్నీవ్రతస్థుండును, భ్రాతృవాత్సల్యతా పరిపూర్ణచిత్తుండును, స్వార్థభావశూన్యుండును, శరణాగతరక్షణబిరుదాంకితుండును, పరమార్థతత్త్వప్రేమోపేత భూపాలుండును - శ్రీకృష్ణచంద్రునివంటి రాజనీతిపారంగతుండును ఆధ్యాత్మికప్రభాననిలయుండును, విశ్వప్రేమగతజీవుండును, స్వాయంభువమనువుబోటి సకలధర్మనీతివిశారదుండును, స్మృతిగ్రంథకర్తయు, కపిలమునిచంద్రునివంటిసాంఖ్యశాస్త్రవేత్తయు, సత్యాసత్యకారణకార్యనిరూపణకర్తయు, కాశ్యప, గౌతమ, బృహస్పతి, అగస్త్య, వాల్మీకి, యాజ్ఞవల్క్య, వసిష్ఠ, విశ్వామిత్ర, వ్యాస, పతంజలి, శుకాదివిరక్తులును, బ్రహ్మజ్ఞానసంపన్నులును, తత్త్వమీమాంసకులును, బాలధ్రువప్రహ్లాదాది భాగవతచింతామణులును, సర్వలోకపూజ్యులును, పరశురామాంజనేయ భీష్మార్జునాది యవక్రపరాక్రమోపేతులును, బ్రహ్మచారులును, దృఢప్రతిజ్ఞాధురంధరులును, జ్ఞానతేజోవిరాజితులును, పరాశరసూతాది మహర్షులనుబోలు, సుప్రసిద్ధపురాణకర్తలును—జనకరాజర్షి వంటి బ్రహ్మజ్ఞానసత్త్వుండగు ధరణీపాలుండును—ఉమాహరులంబోలు పురాణదంపతులును, ఆదర్శప్రేమైక్యహృదయులును, హరిశ్చంద్ర దధీచి శిబికర్ణ రంతిదేవాది మహాదాతృత్వసంపన్నులును, సత్యసంధులును, ప్రజాహితపరతంత్రులును, త్యక్త సమస్తస్వార్థులును, దిలీప రఘు

అంబరీష, చంద్రగుప్త, అశోక, హర్షవర్ధన, విక్రమాదిత్య, భోజ, అక్బరాది యాదర్శ రాజనీతికుశలులును, సర్వేశ్వర సత్యప్రతినిధులును, ధర్మమూర్తులును, సామ్రాజ్యాధారకులును, మహోజ్జ్వలకీర్తికాయులు నగు నృపాలమణులును — ఛత్రపతిశివాజి, రాణాప్రతాపసింహుడు, శ్రీకృష్ణదేవరాయలు వంటి నవీనహైందవసామ్రాజ్యనిర్మాణకుశలురును, స్వదేశోద్ధరణ కార్యపరతంత్రులును, మహాత్యాగులును, కవివరేణ్యులును, సారస్వతప్రియులును, విజాతీయప్రభుత్వధ్వంసకులును — పృథ్వీరాజునుబోలు వీరవరేణ్యుండును, పరాక్రమశాలియునగు వసుంధరాధిపతియు — దుర్గాదాసు, యశవంతసింహుడు, మానసింహుడు, వీరబలుడు మొదలగు ప్రభుభక్తిపరాయణులును, శ్రీబుద్ధదేవునివంటి సర్వజీవదయార్ద్ర హృదయాంబుజుండును, బ్రహ్మజ్ఞాన పరిపూరితచిత్తుండును, మారవిజేతయు, మిథ్యా కర్మకాండ వర్ణభేదపిశాచ కామక్రోధాద్యరిషడ్వర్గమారకుండును, నిష్కామ కర్మయోగాచార్యుండును, సత్యసందేశ ప్రచారకుండును, హింసాత్మక యజ్ఞయాగాది వినాశకుడును, శాంతిశ్రీయుతుండును, నవీన సజీవ ధర్మసంస్థాపనాచార్యుడును — కుమారిలభట్టు, శంకరాచార్యులు, మధ్వాచార్యులు, రామానుజాచార్యులు, బసవేశ్వరుడు, చైతన్య మహాస్వామి, రామానందుడు, గురునానక్, కబీరుదాసు, రామదాసయోగి, దయానంద సరస్వతి మొదలగు గొప్ప ధర్మప్రవర్తకులును — కాళిదాస, భవభూతి, మాఘ, భట్టబాణ, శ్రీహర్షాది సంస్కృత సరస్వతీ వరపుత్రులును, కావ్యకానన కేసరులును, శుక్ర చాణక్యాదులవంటి నీతినిపుణులును — భర్తృహరినిబోలు రసజ్ఞ కవిశేఖరుండును విరక్తపురుషుండును — స్వామి రామతీర్థ, వివేకానంద, రామమోహన రాయి, కేశవచంద్రసేను, మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు, ఈశ్వరచంద్ర విద్యాసాగరు, లోకమాన్య తిలకు, అరవిందఘోషు, చిత్తరంజనదాసు, మహాత్మా గాంధివంటి మహాపురుషులు, జగదారాధ్యులు, మానవజాతి సంస్కర్తలును — కౌటిల్యునిబోలు అర్థశాస్త్ర నిపుణుండును — జగదీశ చంద్ర

బోసువంటి ప్రకృతి శాస్త్రవేత్తయు" జనవమంది, మాతృదేశ గౌరవమును గాదు కాను మానవజాతికి సహజముగానుండు దైవిక శక్తిగౌరవమును దేశదేశాంతరముల ప్రఖ్యాతి మొనరించియు, నొనరించుచున్నారు. ఇప్పటికిని సకల భూమండల కవికుమారులలో సాహిత్య సంపన్న హృదయంబులలో నధికుడై, దేశదేశాంతర సత్కవిరాట్సంఘ సంస్తవనీయుడయి, ప్రకృతీదేవి మున్ననల గన్న నాధ్యాత్మికజీవి యగు రవీంద్ర కవీంద్రుడును, హిందూమతజ్ఞాన విచక్షణుండును, నిరుపమానపండితుండును సనాతన ధర్మప్రచారకుండును, దీనసేవాసంఘ సంస్థాపనా భాసురయశుండును నగు మాలవ్యా పండితుడును భారతదేశ గౌరవమును వృద్ధినేయుచునే యున్నారు. హిందూమత సత్యస్వరూప దిగ్దర్శకుండును, ప్రాచీన భారతీయ మృతగురుకుల విద్యావిధాన పునరోద్ధారకుండును, సర్వసంగ పరిత్యాగియు, శుచిసంఘటనోద్యమ మూలకారకుండును, నిమ్నజాత్యభ్యుదయ కార్య పరతంత్రుడును నగు శ్రద్ధానందస్వామి మాతృ ఋణ బంధన విముక్తుడయి మతాంధుండగు నొక్క క్రూర యవనుని హస్తముల మొన్న మొన్ననే మరణించియున్నాడు. ఆంధ్రదేశ చరిత్ర ప్రసిద్ధులగు రాజరాజనరేంద్రుడును, ప్రతాపరుద్రుడును భారతపుత్రులె. సనాతనగ్రంథ ప్రచారకుండును, కవిజనసంకల్పతరువును, ఆంధ్రసాహిత్య హితకార్యాసక్తుండును నగు రాజరాజనరేంద్రుని భరతమాత ముద్దుకరవాని కీర్తిచంద్రిక లింకను త్రిలింగదేశమున నశింపలేదు. ఇంక నిట్టి యసంఖ్యాకులగు మహాపురుషులు, యోగులు, తత్త్వవేత్తలు, సాహిత్యాచార్యులు, పరోపకారపారీణులు, బ్రహ్మచారులు, అహింసావ్రత ప్రచారకులు, ధర్మమూర్తులగు నృపాలుర యీజనని గర్భమునని జనించి భువి నాచంద్రతారకముగానుండు సర్వోత్త మాదర్శకార్యంబుల నెన్నింటినో జేసి దేశగౌరవమును వృద్ధిపఱచి యున్నారు. ఈ భారతీయులే స్వదేశ భక్తి ప్రాదుర్భావంబున కాదికారకులు. "జననీజన్మ భూమిశ్చ స్వర్గాదపి

గ.

గరీయసి" యను దివ్యమంత్రి మీభరతపుత్రుల భక్తిరస పరిప్లుత కంఠస్వరమునుండియే బహిర్గతమయి, దేశదేశంబుల కెగబ్రాకినది. స్వాతంత్ర్య మాధుర్యముకంటె దేశభక్తి మాధుర్యమునే మిన్నగా భారతీయులు భావించియుండిరనుటకు "రాజస్థానకథావళి" యను మహద్గ్రంథమే సాక్షిభూతము. ఈదేశమున జననమందిన ప్రతిబాలుడును దేశమాతవిపద్గ్రస్త యయియున్నపుడు సమరాంగణమున దమరక్తధారల బ్రవాహరూపంబున స్రవింపజేయుటకు నభ్యస్తులయియుండిరి. స్త్రీలు నయితము దేశసంరక్షణార్థము బలిదానమగుటకు సిద్ధముగనే యుండెడివారు. బాలబాలికా స్త్రీపురుషుల వీరాత్మలెన్నియో యుద్ధక్షేత్రమున భారతమాత బంధనవిముక్తికయి సమర్పితములయియున్నటుల జరిత్రములే తెలుపుచున్నయవి. పరోపకారమే పరమార్థమను భక్తిభావప్రేరితులయి, అనాథుల సంరక్షింప ద్యక్తసర్వస్వులయినట్టియు దుఃఖభయ మరణముల బ్రేమపురస్సరంబుగ వరించినట్టి యుదారవీర పుత్రావతంసముల కిదియె జన్మభూమి. సకలావనీ వనితాసముదాయ గౌరవ చంద్రబింబము నొక్కతూరి విశ్వ గగనమండలమున బ్రకాశింపజేసిన దీ ప్రాచీన భారతీయ మహిళాసంఘ భాస్కరుండె యనదగును. భారతీయ సాధ్వీలోకంబువలననే యిప్పటికిని యీ భరతఖండము ఖ మత్యుజ్జ్వలమయి రాణింపుచు పూర్వాభాసగంధమును గల్గియేయున్నది. చిరస్మరణీయులగు నారాధ్యదేవులును, మహాపతివ్రతామణులును, విద్యారూప గుణసంపన్నులును నగు వనితాలలామ లెందరో యీభరతభూమి యందు జన్మించి యుండిరి. వారు గొనముల ప్రోవులయి, దిగదిగంతముల నిజకీర్తిపల్లరుల వ్యాపింపజేసియుండిరి. సతీదేవి, సావిత్రిదేవి, సీతాదేవి, అరుంధతీదేవి, అనసూయాదేవి, దమయంతీదేవి, గాంధారీదేవి, చంద్రమతీదేవి, తారాదేవి, సుకన్యాదేవి మొదలగు సతీమణులును, పాతివ్రత్యధర్మ పరిపాలనాదక్షులును, హిందూదేశచరిత్ర గర్భమును నిజదివ్యజ్యోతిశ్శక్తిచే బూరించి యుండిరి. మైత్రేయి, గార్గి, శాండిలి, సుభద్ర, మదాలస, దేవ

పాలాతి, ఆత్రేయి మొదలగు బ్రహ్మతత్త్వ విదుషీరత్నముల బ్రసవిం చిన దీ భారతమ్మయే. శంకరాచార్య మండనమిశ్రుల కిరువురకు సంఘ టియించిన శాస్త్రవాదమున మధ్యవర్తినిగా నున్న భారతీదేవి భరత పుత్రియయి మన గౌరవమును బెంచినది. గణితశాస్త్రనిర్మాణచతురయగు లీలావతియు మన సహోదరియె కదా! ఖినాదేవియను లలనామణి జ్యోతిష శాస్త్రపారంగతయయి విదేశీయుల మన్ననలగన్న యదంతయు విజ్ఞులెరుంగనిది కాదు. సంసారక్షణికసుఖభోగంబుల బరిత్యజించి, నిత్యత్వమును బడయ వైరాగ్యము నాశ్రయించి, భక్తిరసమయగీతంబుల గానము సలుపుచు భారతీయహృదయంబుల భక్త్యానందభావతరంగమాలికాడోలికలనూపిన భక్తి పరవశహృదయలయిన మీరాబాయి మొదలయిన రాణ్మణులెందరో రాజ పుత్రస్థాన బున నావిర్భవించి తల్లి గౌరవమును గాపాడియుండిరి. వేదాదుల యందలి యెన్నియోబుక్కులు వనితాలలామలచే విరచింపబడినట్లు వేదపఠ నంబున విశదమగుచున్నయది. శీల, భట్టారిక, వికటనితంబ, ఫల్గుహస్తిన్ని రాజకన్య, విజయ, విజ్జిక, నాగమ, మారుల మొదలగు విదుషీమణులు సంస్కృతప్రాకృత సాహిత్యంబుల మున్నతస్థానమునందిన దీచల్లనితల్లి కడుపున బుట్టియేకదా! నిమ్నజాతిగ భావింపబడు కుమ్మరవంశమునబుట్టియే మొల్ల సురుచిర కవితామయంబగు రామాయణకావ్యమును రచించి భారతీయప్రా చీన వనితాబృంద విద్వత్కవిత్వ శక్తిసామర్థ్యముల వెల్లడించినది. విక్టోరియా మహారాజ్ఞివలె మన భారతఖండమున జాలకాలమునకు బూర్వమే హస్త మున రాజదండమును, శస్త్రాస్త్రములనుబూని మహాశత్రుసేనాసమూహం బును బారద్రోలి, సింహాసనారూఢులయి రాజ్యపరిపాలనము జేసిన క్షత్రి యాంగనామాడామణులగు అహల్యాబాయి, తారాబాయి, దుర్గావతి, పద్మిని, వీరమతి మొదలగువా రీయమ్మకడుపున బుట్టినవారలే సుమీ! వీరమాతలగు, కుంతి, దేవకి, రుక్మిణి, సుభద్ర, శాంకుంతల, సుమిత్రాద్యక లంక చరిత్ర లీభారతమ్మకడుపునబుట్టియే మనకు సోదరీమణులయి, ఇప్పటికి

నీ సాధ్వీలోకమునకు గుణపాఠములను, వీరపుత్రి పుత్రికాజనన వాంఛా ప్రబోధములను సేయుచునేయున్నారు. ప్రాచీన భారతీయ స్త్రీ పురుష సంఘము యావన్మానవ కల్యాణసాధనమార్గమును బరిష్కృతమొనర్చినటుల మరి యే దేశముయొక్క మానవజాతియు కావించియుండలేదు.

ఇప్పటికిని మన భారతాంబ యుత్తమాంగమున హిమాచలము మకుటమయి విభ్రాజిత మగుచుండ, అంబుధి పాదరాజీవప్రక్షాళన మొనరింపుచుండ గంగ, సింధు, సరయూ, కృష్ణ, గోదావరి, తుంగభద్ర, కావేరి, మొదలగు నదములు సస్యవృద్ధి సలుపుచుండ, గోమాతలు దుగ్ధ దధి ఘృత ప్రవాహంబుల బ్రవహింపజేయుచుండ మాత బాహ్యాంతరిక దాస్యవశవర్తిని యయి, పూర్వముగన్న సంతానమువంటి యుత్తమసంతతి నతించెంగదా యని గగ్గోలు సేయుచున్నది. మనపురాతన భరతఖండ గౌరవ స్తంభ స్వరూపులయిన ఋష్యాదులెట్లు సత్యాసత్య పూరితంబగు ప్రపంచమున ధర్మాధర్మ నిర్ణయము జేయుచు, భవాబ్ధిని దరించి ముక్తిపురి నలంకరింప నాధ్యాత్మిక విద్యావలంబనమున మతమును స్థాపించి ధన్యులయినదియు విచారించు టుత్తమము. రవీంద్రకవీంద్రుడు భక్తిగద్గదకంఠమున నంజలిఘటియించి ప్రార్థించిన యాచందమున "Where the mind is without fear and the head is held high; where knowledge is free; where the world has not been broken up into fragments by narrow domestic walls; where words come out from the depth of truth; where tireless striving stretches its arms toward perfection; where the clear stream of reason has not lost its way into the dreary desert sand of dead habit; where the mind is led forward by thee into ever-writing thought and action—In to that heaven of freedom, my Father! let my country awake." నాతండ్రీ! ఈ నాజన్మభూమి నెపుడు మర

శుద్ధస్వాతంత్ర్య యుక్తంబుగను, సుజ్ఞానతేజో విరాజితంబుగను, ఉన్నత మస్తక విభాసితంబుగను స్వార్థభావశూన్యంబుగను, సత్యభావ ప్రకాశితంబుగను, సమస్తబంధ విముక్తంబుగను విమలస్వేచ్ఛా స్వర్గంబుగను జేతువో కదా! నాతండ్రీ! కృపామయా! మా భారతంబు రవీంద్రమహాత్ముని కథ నానుసారంబుగ బ్రాచీన విధానానుసరణిం జేయవా? తండ్రీ! ఇంక మా భారతమును, మాతల్లిని, మాప్రియజననిని జాగ్రిత భారతంబుగ జేయరమ్మ రారమ్మ!!!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

## ప్రాచీనార్షమతము.

అనాదికాలమునుండియు నీ విశాలంబగు నీశ్వరసృష్టి సాగరతరంగ మాలికలబోలికను బునః పునరావృత్తులతో నెగయుచు వచ్చియున్నది. అతీతంబును, అపారంబును, అగమ్యంబును నగు కార్యకారణసంఘటనవ్యాపార సంచలన మెప్పటినుండి సాగుచున్నదియు బ్రపంచమునం దేమతము కాని, ధర్మప్రవక్తకాని వచించియుండలేదు. కార్యకారణ వ్యాపార మనాదికాలమునుండియు సాగుచున్నటులె తత్త్వపరిశీలనశక్తి సంపన్నులెల్లరి యుద్దేశ్యము. ప్రమాణాప్తవాక్య బుద్ధిబలంబుల కీవ్యాపార మతీతమై యున్నది. సకలదేశ మానవసంఘములు కార్యకారణముల యప్రతిహతాపూర్వ కార్యక్రమమును స్థూలదృష్టిచే గాంచి నిర్విణ్ణులగుచున్నవి. కొందరీరహస్యమయ వ్యాపారయాథార్థ్యమ వాఙ్మానసగోచరంబనియు,నతర్క్యంబనియు, గాని యిద్దాని మాస్తిక్యములేక యపూర్వామానసత్త్వము నిశ్చయంబనియు జెల్లమొనరింపుచున్నారు. అనికాలమందే మన యీ యార్యావర్తవాసులగు పుణ్యపురుషులు కార్యకరణముల పరమాద్భుత వ్యాపారసంబంధ రహస్యంబు లతీతంబులనియు, నాద్యంతములు లేవనియు నుడివియేయున్నారు.

ఆర్యులగు సాధుణ్యపురుషులను మనము ఋషులనుచున్నారము. వారి వృత్తు లనుగుణించియు, వేషభాషావ్యాపార సాంఘికనియమంబుల గూర్చియు నుల్లే ఖించుట మదుద్దేశ్యమునకు విరుద్ధము. వారిట్లే భారతవర్షంబున మతమును స్థాపించినదియు గ్లుప్తీకరించి వ్రాయుటయే మదుద్దేశము. మతములును, గ్రంథములును, శాస్త్రములును జననమంది ప్రచారమందుటకు బూర్వమే యీ కాననగు విశాల విశ్వమందు చరాచరాత్మక పదార్థసంచయముండి యుండెను. చరాచరాత్మక ప్రపంచమున కధిపతియును, కర్తయు, ధర్తయు హర్తయునయి యద్భుతసామర్థ్యాతిశయంబులచే నొప్పుచు, నిరంజన సర్వ కారాప్రమేయుడయి, శుద్ధబుద్ధారాధ్య దేవుడును గలడు. అనాదికాలము నుండియు జీవరాసులలోనికెల్ల పురోభివృద్ధి జ్ఞానసంపన్నుండగు మానవ జీవుడే యుత్కృష్టుడయు, యతిప్రశస్తుడయి యున్నాడు. మానవుడాయాద్య కాలమందు మూఢుడేయయి యుండియున్నను వానియందును స్వతంత్రంబును విశృంఖలంబును, దివ్యజ్ఞానజ్యోతిస్స్వరూపంబును, బరమేశ్వరప్రతిబింబమును నగు శుద్ధబుద్ధాత్మ ప్రకృతిని యమపాశబద్ధమయి జీవరూపంబున లేకపోలేదు. లోకపరలోకజ్ఞానయుక్తుండగు నిక్కాలపుయొక్క మహాపురుషునికిని, మన ప్రాచీన మూఢమానవునకును, జీవితమందును, కార్యధర్మవిచారములయం దును భేదముండినను, జీవనిర్మాణమందును, ఆత్మధారణయందును బారత మ్యము నుంతయు నుండదనయే విజ్ఞులెఱుంగుదురు. మతధర్మజ్ఞానము లేనట్టి యాదిమానవులు మనవలెనే తమ యల్పజ్ఞాన విజ్ఞానముల ననుసరించి కర్మ సేయుచుండెడి వారు. పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాప్త మయియున్న ప్రతిజీవియు సృష్టియం దున్నంతకాలము నిజ సుఖానంద శాంతులకే వ్యాకులపడుచుండును. జీవాత్మ సర్వకాల పర్యావస్థలయం దును ప్రకృతినియమబంధనముల నుండి విముక్తిని బడసి స్వస్థానంబగు పరమాత్మయందు లీనమగుట కుద్విగ్నమయి యుండుచుండును. జీవుడు ప్రకృతి సంబంధములగు రాగవైర పురుషార్థ సుఖదుఃఖ కించిజ్ఞత్వ

మితజ్ఞత్వాద్యవస్థల నతిక్రమించి పరమశుద్ధంబును, దివ్యప్రకాశ భాసురంబును, సంపూర్ణంబును సర్వజ్ఞత్వ యుక్తంబును నగు భగవత్పదార్థమం దైక్యము జెందుటకే యువ్విళ్ళూరుచుండును. అంబుధి నుదయంబగు వీచిక యబ్ధి సలిలంబుననె లయమగుట నైసర్గిక ధర్మమయినటులే, జీవాత్మయు సుఖదుఃఖ జననమరణ సంకులంబగు ప్రపంచ సాగరమును దరించి గమ్యస్థానమును జేర యత్నించుట స్వాభావికధర్మముగ భావింపుచుండును. జలాశయంబున సుస్థిర కాంతిని, నిజానందమును, సుఖమును బడయుగల్గు మత్స్యము జలబహిర్గతము గావింపబడినంతనే మహా వ్యాకుల చిత్తంబుతో బునర్జలప్రవేశమునకయి ప్రార్థనాసూచకంబులగు దైన్యదృక్కుల జతుర్దిశల వ్యాపింపజేయుచుండును గదా! ఈ చందముననే పరమాత్మాంశమగు జీవాత్మయు స్వస్వరూపోపలబ్ధి కెంతయు దత్తరపడుచుండును. కాని సంసార వ్యామోహ పాశముల మాటిమాటికి బంధింపబడుచునేయుండును. మాతృహస్తములనుండి యొకింత తెలివిగల బాలుని మన మెవరమయిన నిర్బంధముగా వేఱుపఱచినయెడల వాడెంతయు జననికయి యాక్రందించును. ఆ రోదనసమయమందే మన మెవ్వేని తినుబండారముల గాని, మనోజ్ఞంబులును, సుందరతమంబులును నగు నాటబొమ్మలగాని వాని కిచ్చునెడల విలపించుట మానివేయును. వాడొకింత కాలము మాతృ విశుద్ధప్రేమస్మృతిని బాసి, పదార్థ వ్యామోహంబునకు జిక్కియుండును. అట్లు కొంతసేపుండి మాతృస్మరణంబున దిరిగి వాడేడువ నారంభించును. జ్ఞానమందును బాలుడగు జీవుడు సయిత మిదియే వడువున గమ్యస్థానంబగు పరమాత్మను జేర నఱ్ఱులూచుచు, మధ్యమధ్య సంసార వ్యామోహ బంధనములకు జిక్కుచు, ప్రకృతీదేవి శృంగారమయ నాట్య కలాకౌశలత్వమున కచ్చెరువందుచు, క్షణభంగుర సుఖముల ననుభవింప గడంగుచు, కొంతకాలమున కివియన్నియు భయవిషాదముల నొసంగ విరక్తుడయి స్వస్థాన ప్రయాణస్మృతిచే ఘోరముగ వ్యాకులపడుచుండును. జీవుడు స్వస్థానస్మృతి విస్మృత్యవస్థల జిక్కుచు, విడివడుచు, లోకానుభవజ్ఞాన

సంపదల బడయఁగోరుటయుం దెంతయు నారితేరును. జీవప్రవృత్తి, మిట్టపల్లంబుల బల్లమునే వరించు ప్రవాహంబు విధంబున, సత్యసుఖమునకయి లగ్నమయి యుండును. జ్ఞాని ప్రపంచముతో సంబంధబాంధవ్యములుగాని, స్వయంజ్ఞాన శక్తిసామర్థ్యాతిశయంబుల గాని కలిగియుండనిమూఢుఁడగు మానవుడు బాల్యావస్థయందున్న బాలునివలెనే దైవికచైతన్యమును గల్గియుండి విచిత్రంబుగనున్న సృష్టిని వెర్రివెర్రి చూపుల జూడ నారంభించును. సృష్టియందలి సకల వస్తు శ్రేణుల కాశ్చర్యమును బడయుచుండును. వానికాసక్తియందు యుక్తాయుక్తములును, సత్యాసత్యములును, ధర్మాధర్మములును, స్ఫురించుటెంతమాత్రము దుస్తరము. సుఖతృష్ణ జీవునికి సహజముగుగటంజేసి మానవుఁడాసుఖప్రాప్తికయి వ్యాకులచిత్తముతో నటునిటు బర్వులెత్తును. వానికొక్క ప్రదేశంబున జాజ్జ్వల్యమానంబుగనున్న యరుణవర్ణ విభాసితంబగు నగ్ని లోచన గోచరంబగును. వాఁడంతకుబూర్వము దానినిగాంచి యుండకపోమి, దానికయి వింతపడుచు నద్దానిని స్పృశించును. సార్వకాలికంబును, సార్వదేశికంబును నగు దహనశక్తిం గల్గియున్ననిప్పు వానిహస్తమును గాల్చివేయును. వాడంత జీవప్రపంచ సామాన్యంబగు బాధచే నంగలార్చుచు దానికి దూరముగా బారిపోవును. జీవుడిచట గష్టమునసుభవించి గుణపాఠమును నేర్చుకొనుచున్నాడు. ఆమూఢమానవుడంత చిచ్చు తాకరాని పదార్థమనియు బ్రిచండానల సపర్శనము కర్తవ్యము కాదనియు నేర్చును. ఆటనుండి వాని చిత్తప్రవృత్తులకు స్పష్టముగా రెండుపథము లేర్పడుచున్నయవి. అవియేవి? కర్తవ్యము, అకర్తవ్యము. ఈచందమున నే కొంతకాలము సృష్టియందు జీవుడు తనకు సహజములగు కర్మలనాచరింపుచుండ నందు కొన్ని బాధకరంబులనియు గొన్ని శ్రేయస్కరంబులనియు గ్రహించునంతటి లోకానుభవ జ్ఞానసంపత్తిని బడయ సమర్థుండగును. మానవజీవిత నిర్మాణము లొక్కటియే యయినను వాని బలాబలంబుల యందును, బటుత్వాపటుత్వములయందు నీషణ్మాత్రభేదముండును. కారణమేమనగా నివి జననీ జనకాదుల ననుసరించియే వచ్చు

నని. పైఁజెప్పఁబడిన ప్రకారము లోకజ్ఞానము సంసారసాగర సుఖదుఃఖ తరంగ ప్రహారంబుల వివి మానవుఁ సంపాదింపుచు, బరస్పరభావ సమ్మేళనంబున విశేషధర్మంబులను గర్మంబులను గ్రహింపుచు, గాలక్రమంబున యుక్తాయుక్త వివేచనా పరిజ్ఞానతీరంబును సమీపించుచు. బ్రహ్మాండ భాండము గుణావగుణ పరిపూర్ణమయి, సుఖదుఃఖాది ద్వంద్వభావ భూయిష్ఠమయి యనాదికాలంబునుండియు వచ్చుచున్నది. ఇంక నిట్లుండగలదు. ఇది రూఢి. మన పూర్వపురుషులు సహిత ముపర్యుక్తవిధంబున నొకప్పుడు మూఢులయియుండి, వారలు వయఃపరిపాకంబుచే నొకింతకాలంబును సముపార్జించుభాతి, సంసారకష్టనష్ట దుఃఖభయ రోగంబులకు జిక్కుచు, విముక్తి జెందుచు, నజ్ఞానమయ వాతావరణము నుండి సుజ్ఞానతేజోమయ వాతావరణంబునకు వచ్చి యుండిరి. దీర్ఘకాలానుభవంబున వారు సృష్టియంతయు సుఖదుఃఖములతో, సత్యాసత్యములతో, ధర్మాధర్మములతో, జ్ఞానాజ్ఞానములతో ప్రాప్యాప్రాప్యములతో నిండియున్నటులను, సంసారతత్త్వము ద్వంద్వార్థయుక్తమయునటులను దెలియఁగల్గిరి. ఈ పుణ్యమూర్తులనే మనము మన ప్రాచీనఋషులని ప్రస్తుతము జేగొనుచున్నారము. ఆఋషులు సత్త్వగుణ ప్రతిపాదకంబులగు యుక్తకావ్యముల జేయుచు, పిపీలికాదిబ్రహ్మపర్యంతము వ్యాప్తమయియున్న సర్వాంతర్యామియగు ప్రభుశక్తి నిగ్రహించిరి. ప్రపంచమున వివిధవర్ణంబులతో, నానాద్యుతులతో, వివిధబాహ్యసౌష్టవంబులతో వెలయు పదార్థములన్నియు నశ్వరంబులనియు, సాంసారిక విషయాభిలాషలు నింద్యములనియు, దుఃఖదాయకంబులనియు, సత్వరత్యాజ్యములనియు, క్షణభంగురంబులు, నశ్వరంబులు, భయంకరవిషాదజననమరణ పరిప్లుతంబగు నీయిహంబునకతీతమయి, అలౌకికమయి, అనంతమయి, ఆరాధ్యమయి, సర్వకారణమయిన సచ్చిదానందమయపదార్థ మొకండు కలదనియు బూర్ణముగా గ్రహించిరి. సత్త్వగుణంబగు నాసచ్చిదానందమయ పదార్థమునే వారు సర్వేశ్వరుండనియు, సర్వాధారుండనియు, జగద్వంద్యుండనియు

విశ్వవ్యాపకుడనియు జగత్కారణభరణహరణ శక్తిసంపన్నుండనియు, బరమ
పితయనియు గ్రహింపసమర్థులయిరి. తమయందు వెలయును ననగా కామ
క్రోధాద్యరిషడ్వర్గపరీతమయి, అహంకారమమకారమండితమయి, సుఖ
దుఃఖవిరాజితమయి, జననమరణ రోగగ్రస్తమయియున్న దేహమును గేహ
ముగా జేసికొన్న జీవాత్మ యాపరమపిత్రంశమేననియు, రెంటికి భేదము
నశించుటయే ధర్మమనియు, నిశ్చయించుకొనియుండిరి. ఏతదభిలాషాప్రేరితు
లయి యాకాలమున మన యార్యావర్తమున జ్ఞానసంపన్నులగు ఋషిసత్త
ములు తమ్ముంగల తమ సహోదరహితసాధనాభిలాష పరతంత్రులయి
పర్వేశ్వరసాక్షాత్కారము నొదవజేయునట్టి సద్ధర్మ, సద్విచార, సన్మార్గ
ముల నొకవైపునను, అధర్మ, దుర్విచార, దూషిత పథకర్తవ్యంబుల నొక
వైపునను లోకమునకు జాటియుండిరి. ఒకింతకాల మారీతి గర్తవ్యాకర్తవ్య
ప్రబోధములతోడను, ధర్మాధర్మోపదేశములతోడను, సత్యాసత్యారవంబుల
తోడను, కార్యకారణసంబంధ బాంధవ్య రహస్యధ్వనులతోడను, నిద్య
ప్రకృతి తత్త్వ నిరసన భీషణ ధ్వానంబులతోడను, ఆర్యప్రాప్యప
ర్వేశ్వరప్రాప్తికయి కావింపబడిన మహా సంరంభాట్టహాసంబులతో
డను ప్రాచీనార్యావర్తమంతయు మారుమ్రోగుచు సంక్షుభితమయిపోయెను.
ప్రతిమానవుడు పరమాత్మ, జీవాత్మ ప్రకృతుల స్వభావ విభవాదుల బరి
శీలింప నినుమడించిన మహదానందముతో గార్యోన్ముఖులయిరి. కాని యా
మానవ సంఘమునందట్టి మహద్విషయంబుల సంపూర్ణైక్యములేక కించిన్మాత్ర
సందేహభేదము లుత్పత్తిలియుండెను.

తద్ధేతువుచే ఋషివరేణ్యులు కొందఱు మానవసంఘహితము నపేక్షించి
ఐహికాముష్మిక ధర్మసిద్ధాంతములనెల్ల స్థిరపఱచి, నిర్దుష్టంబును, దత్కాల
ప్రచలితంబును, విశాలంబును నగు సంస్కృతభాషయందు కొన్ని యుత్తమ
గ్రంథముల లిఖించుటెంతయు శ్రేయస్కరంబగునని భావించిరి. వారి సత్సం
కల్ప పరిణామంబుగ ఋష్యాదులలో నగ్రగణ్యుండగు నొక్కనిచేతనో

లేక యనేకులచేతను సాంఘికాచార వ్యవహారములను, పరివారపాలన పోషణాదివ్యాపార విధానంబును ధార్మికసిద్ధాంత సముదాయంబును, వైద్య విద్యావిధియు, వృక్షశాస్త్ర సంబంధ విషయములను, ప్రకృతిశాస్త్ర సూత్రములను, సర్వేశ్వరసాక్షాత్కార ప్రాప్త్యర్థంబులగు భక్తి జ్ఞాన వైరాగ్యాదులను, సృష్టితత్త్వమును, జీవేశ్వరైక్య సంధానమును మొదలగు సమస్త విషయములను విశదముసేయు జ్ఞానాత్మయభండారం బగు ఋగ్వేదము తోలుత విరచింపబడియెను. పూర్వాచార్యులెల్లరు దన్మహోద్గ్రంథమునకు భక్తిభారావనత మస్తకులయి నమస్కరించి, తమ యావద్భేదపరిత భావంబుల నెల్ల బరిత్యజించిరి. ఈ ఋగ్వేదమునందు నశ్వరంబులును, మాయాపరీతంబులును నగు భౌతికపథముల నెల్ల రోసి, సర్వేశ్వరుని గనుటకు దివ్యపథము నిర్ణయింపబడియెను. స్వస్వరూపావలోకనార్థము (తన్ను దాగనుట) నాడు ఋగ్వేదముచే సమస్తఋషులకు, భిన్నాభిప్రాయములు నశింప నొక్కటియే యభిప్రాయ మేర్పడియెను. అభిప్రాయమునకే మతమనియు సమ్మతమనియు సమ్మతియనియు దెలియబడినదనియు ననేకపర్యాయపదములు కలవు. జీవాత్మ, పరమాత్మయం దైక్యము జెందుటకు నాడు ఋగ్వేదవాక్య ప్రమాణంబుగ సకలఋషిమండలిచే స్థిరపఱుపబడిన యభిప్రాయమే "మతము" అను పేర జగద్విఖ్యాతమయినది. కాలక్రమంబున నార్యులు మతమున కర్థము స్వస్వరూపసందర్శనమున కేర్పడిన సాధనమని వచించిరి. ఆర్యులచే బ్రచలితమయినది కాన నార్యమతమనియు, వేదముచే స్థిరపఱుపబడిన దగుటచే వైదికమతమనియు, ఋష్యాదుల సంబంధముచే వచ్చుటంజేసి యార్షమతంబనియు బ్రసిద్ధికెక్కెను.

ఆర్యులు పూర్వము సింధుప్రాంతముల యందు సేద్యము జేయుచు నివసించియున్నకతన నాసింధునదీప్రాంతమంతయు సింధుస్థానమని వచింపబడియెను. పార్శీకులు యీశబ్దమునే తమ స్వభావమందున్న నిజవేదమగు జందవేస్తాయందు హిందూస్థానమని వ్రాసి ప్రచారమునకు దెచ్చిరి. ద్వాదశ

శతాబ్దముదిగ సింధుస్థానము, ఆర్యావర్తము, అనుటను మానుగ, మహమ్మ
దీయులు పార్సీకభాషాప్రియులయి హిందూస్థానమను పదమునే ప్రయోగ
మునకు దెచ్చిరి. నాటగోలె దాస్యగ్రస్తమయిన సింధుస్థానము హిందూదేశ
మనియే విశ్వమందలి యెల్లజాతులచే బేర్కొనబడియెను. ఆంగ్లేయులు
నయిత మీనదినే పార్సీకశబ్దము ననుసరించి (Indus) ఇండస్సనియు,
సింధుస్థానమును ఇండియా (India) అనియు బేర్కొనిరి. ఆర్షమతమున
కీచందమున హిందూమతమను నూతన నామాంతరము లభ్యమయ్యెను.
ప్రథమ గ్రంథము ఋగ్వేదమేయని వచించితిమి. ఋక్కు అనగా
మంత్రము, వేదమన విశదపఱచునది, తెలియజేయునది. ఈశ్వర రహ
స్యమును దెలియజేయునదియే ఋగ్వేదము. వేదధ్యేయమును, వేదోక్త
మగు నార్షమత లక్ష్యమును బరస్పరాభిన్నములయి సర్వేశ్వర సాక్షా
త్కారమునకే యేర్పఱుపబడినవి. ఋగ్వేదానంతర మెప్పుడో శేషించిన యజు
ర్వేదము, సామవేదము, అథర్వవేదము నను వేదత్రయము ఋగ్వేదానుయా
యులగు ఋష్యాదులచేతనే వ్రాయబడియెను. ఋగ్వేదమునందు రమారమి
1017 సూక్తములు (మంత్రసమూహములు) కలవు. ఋగ్వేదము రెండు
విధముల విభజింపబడియున్నది. ఈ మహాగ్రంధమునం దష్టాధ్యాయములు
గల్గిన యష్టాష్టకములు కలవు. ప్రతి యష్టకమునం దసంఖ్యాకములగు
ఋక్కులు కలవు. ఈ చందముననే ఋగ్వేదమున దశమండలములును వెల
యుచున్నయవి. ప్రతిమండలమునం దనేకాధ్యాయములును, ప్రతియధ్యాయ
మునం దనేకములగు మంత్రములును విద్యమానములయియున్నవి. నిరుపయో
గంబును, కృత్రిమంబునునగు సాహిత్య మీ ధర్మజ్ఞాన భండారమగు వేదమం
దు లేదు. శేషించిన మూడు వేదములును ఋగ్వేదమునే పూర్ణముగా ననుసరిం
చుచు స్వల్పముగ నూతనవిషయములగల్గి యొప్పారుచున్నయవి. ఆర్యఋషుల
ధార్మికసాహిత్యమున నగ్రస్థానము వహించిన నీ వేదముల ననుసరించి దీర్ఘ
కాలానంతరము, ఉపవేద చతుష్టయంబును, వేదాంగషట్కమును, ఉపాంగ

చతుష్టయంబును, ఋషులచే విరచింపబడియెను. ఈ చతుర్దశ వేదాంగములే ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థశాస్త్రము, శిక్ష, వ్యాకరణము, నిరుక్తము, కల్పము, జ్యోతిషము, ఛందస్సు, పురాణములు, న్యాయము మీమాంస, ధర్మశాస్త్రము" అను నామాంతరముల బ్రసిద్ధములైయున్నవి. వేదముల రచనా కాలమును సరిగా నిర్ణయింపజాలము. కొన్ని వేల సంవత్సరము లయియుండును. (విమర్శనాత్మకములగు విషయాదుల గురించి హిందూమత శైథిల్యమను విషయమున ముచ్చటించెదను.) వేదముల యందలి విభాగములు సంహితలనబడును. వేదమంత్రముల గొన్నింటి సమీకరణము కృష్ణ ద్వైపాయనుడు చేసియున్నాడనియు నందుచేతనే వేదవ్యాసుడనబడియెననియు సంహితల బఠింప దెల్లమగుచున్నయది. వేదములయందే బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, అను వేరువేరు భాగములు సయితము కలవు. ఉపదేశములగు నాయుర్వేదమునుండి చరకసంహిత, సుశ్రుత సంహితయను వైద్యగ్రంథములును, గాంధర్వవేదమునుండియే సంగీతశాస్త్రంబును, అర్థశాస్త్రమునుండియే నీతిశాస్త్రము, అశ్వవిద్యాశాస్త్రము, శిల్పశాస్త్రము, పాకశాస్త్రము మొదలగు చతుష్షష్ఠి కళలును జన్మించినవి. వేదాంగమగు శిక్ష, వర్ణమాలాక్రమోచ్చారణమును వ్యాకరణము యథోచితశబ్దవాక్య ప్రయోగమును, నిరుక్తము వేదమందలి శబ్దముల వ్యుత్పత్తిని, కల్పము వేదోక్త కర్మ విధానమును, జ్యోతిషము కర్మాచరణమునకయి సకాలమును దెల్పుటకును, ఛందస్సు వివిధకవిత్వలక్షణముల దెల్పుటకును రచింపబడినవి. వీనికెన్నియో శాఖోపశాఖలు కలవు. పేరెన్నికగన్న పురాణములు 18. వీనినన్నింటి వ్యాసుడే రచించెనని కొందఱియభిప్రాయము. 1 బ్రహ్మపురాణము, 2 పద్మపురాణము, 3 విష్ణుపురాణము, 4 వాయుపురాణము, 5 శ్రీమద్భాగవతము, 6 నారదపురాణము, 7 మార్కండేయ పురాణము, 8 ఆగ్నిపురాణము, 9 భవిష్యత్పురాణము 10 బ్రహ్మకైవర్తపురాణము 11 లింగపురాణము 12 వరాహపురాణము 13 స్కందపురాణము, 14 వామనపురాణము, 15 కూర్మపురా

ణము 16 మత్స్యపురాణము 17 గరుడపురాణము 18 బ్రహ్మాండపురాణము. ఇవికాక పరాశర విరచితంబులగు ననేకపురాణములుకలవు. ఉపపురాణములు:— సనత్కుమారసంహిత, నృసింహపురాణము, నందిపురాణము, శివధర్మోత్తర పురాణము, దుర్వాసపురాణము, బ్రహ్మాండపురాణమను సంహిత, ఉశనస్సంహిత, వరుణపురాణము, కాళీపురాణము, వసిష్ఠసంహితము సాంబపురాణము, సూర్యపురాణము, పరాశరసంహిత, మరీచిపురాణము, భృగుసంహిత, శివపురాణము, కల్కిపురాణము, దేవీభాగవతము, బృహన్నారదీయపురాణము, మొదలగునవి. వీనియన్నింటియందు విశేషించి సృష్టి, యుత్పత్తి, లయము, స్థితి, మానవచరిత్రములనుగూర్చిన యంశములుగలవు. దర్శనములు 6. ఇవిషట్ఛాస్త్రములన వన్నెగాంచినవి. వీనియందు పదార్థ నిరూపణము విశేషించియున్నది. రామాయణ భారతము లితిహాసగ్రంథములుగ ఋష్యాదులచేత నే వ్రాయబడినవి. వీనికర్తలును వైదికమతావలంబులె. వాల్మీకి వ్యాసులు వీనికికర్తలు. ఈ చందము ననాదికాలము నుండియు బౌద్ధయుగమునకు బూర్వముపర్యంత మనేకగ్రంథములు విరచింపబడి యార్షమతధార్మిక సాహిత్యము నభివృద్ధిబఱచెను. సమగ్రధార్మిక సాహిత్యము యొక్క ప్రిసమధ్యేయ మార్షమతమె. కొన్నిగౌనికభేదము లీధర్మగ్రంథముల యందున్నను వైదికమత సిద్ధాంతములకు గట్టుపడియుండుటయే వీనిని విధిమర్యాను ఆర్షమతధార్మిక సాహిత్యగ్రంథముల వెలయు కొన్ని పరిశుద్ధ నీతి జ్ఞాన ధర్మ సిద్ధాంతవాక్యముల దన్మతహృదయమును పాఠకభ్రాతలకు దెల్లమొనరింప నీదిగువ బొందుపఱచుచున్నాడను.

## వే ద ము లు ,

"పరిశుద్ధ బుద్ధ స్వరూపుండవగు నో తండ్రీ! అనాథులమును, కించిజ్ఞులమును నగు మమ్ము రక్షించుము. మా హృదయాంతరాళముల నీదివ్య తేజమును బ్రసరింపజేయుము, మా ఆత్మశక్తిని వికసింపజేయుము.

ఓసఖులారా! నిత్యశుద్ధబుద్ధస్వభావుండును, జగత్కర్తయు, అజ నిరంజన నిర్వికారుండును, కరుణామృతవారిధియు నగు పరమేశ్వరుండు దక్క మనకు దండ్రి యెవ్వడును లేడు. వానితో సమానుండును, వానికంటె నధికుండును నగు శక్తిశాలి లేడని యెల్లరు దెలియదగును. అతడే మనకు జనకుండును, న్యాయాధిపతియు భూపాలుండు నయి సమస్తముల నొసంగుచు నిరంతరము బ్రికాశింపుచుండును. అతనిని ద్యజియించి మరి యెవ్వనిని ధ్యానింపరాదు. మనకు బూజ్యులగు వరుణుడును, సునాసీరదేవతలును ఇంద్రుడును, మరుద్భగవానుడును, అగ్నిదేవుడును, సవితృుడు లేక పూషుడును మొదలగు దేవతలందరికి నధిపతియు, శుద్ధబుద్ధమూర్తియునగు నాదేవుని కృపయే యెల్లి లోకములను సంరక్షింపుచుండును. (ఈదేవతల నామంబు లన్నియు భౌతికశక్తులనామాంతరములు) సచ్చిదానందమయుని సమీపింప వాంఛించువారు సత్యమునే యారాధింపవలయును. ధర్మము నాచరింప వలయును. జ్ఞానమును సముపార్జింపదగును. అజ్ఞానాంధకారమయావరణము నుండి వెలువడవలయును. దుర్గుణములనెల్ల విసర్జించివేయువలయును. నిరంతర ధ్యానమనోపాసాదులను విస్మరింపకుండి మెలంగవలయును. క్రౌర్యము జారత్వము, ఆలస్యము, ప్రమాదము, మాదకద్రవ్యసేవనము, అసత్యభాషణము, హింస, చౌర్యము, ఈర్ష్య, ద్వేషము, మొదలగు దుర్గుణంబు లన్నియు సత్యాచారశిక్షను సమూలముగ విధ్వంసమొనర్చును అసత్యకథనమూ మరణపర్యంత మప్రతిష్ఠను గల్గించును. ప్రతిజ్ఞాభంగము హానికరము. అభిమానము తగని దుర్వృత్తి. ఛలకపటకృతఘ్నతలును నింద్యములె. పరాపకారపరనిందాదులు హృద్విదారకములు. త్రికరణంబుల భేదముండరాదు. కృతజ్ఞత నుగుణము, సుఖోత్పాదకము. ఉపకారమానందదాయకము. వాచాలత్వము త్యాజ్యము. మూకత్వము గర్హ్యము. కోవిదులసన్మానించుము. శత్రుత్వ మేజీవునితో నేయవలదు. ఈశ్వరధ్యానశూన్యుడసభ్యుడు; అనార్యుడు నిరీశ్వరవాది; దస్యుడు. ఎటనుండినయున నిశ్శంకితమతియయి సౌజన్యమును,

నీతిని, సుకృతమును గ్రహించుము. దుష్టులబారినుండి తొలగిపొండుము. శిష్టుల నన్వేషించి వారి దివ్యసన్నిధిని జేరుము. ఎటనున్నను గీతనుగోరుము. జననీజనకాచార్యుల సేవాశుశ్రూష మనోవాక్కాయార్థ ప్రేమాదుల సమర్పించి సేయుచుండుము. సదా సత్యోపదేశము సేయుట విహితకృత్యము. ధర్మయుక్తములగు కర్మలనాచరించు విధానమును దెలుపుటయే యాచార్య ధర్మములు. స్త్రీ పురుష భేదములేక చిత్స్వరూపునిగనుట కెల్లరు నాముష్మికంబగు సద్విద్యనభ్యసింపుడి. విద్యయే విశ్వమందలి యెల్లపదార్థములలోని కెల్ల సారవంతమయినది. సత్యమును విశ్వముయొక్క సమస్తదిగ్వలయంబుల బ్రచారము సేయుట శ్రేయోదాయకము. పాషండులను, దుష్టహృదయులను, వాగాడంబరసుశోభితులు నగువారికి దూరముండియే నమస్కరింపుము. నీతిబోధదాయకంబులగు నుత్తమవాక్యజాలముల గంఠస్థముజేసి స్మృతిపథంబున నిత్యము నిలయింపజేయుడి. మద్యమాంసాదిజిహ్వాచపలకరములును, తమోగుణదాయకంబులును, అస్పృశ్యంబులును నగు మాదకపదార్థముల స్వప్నమందయినదలంపకుము. నశించుదానింగూర్చి చేలవయి విచారింపకుము. భూమిని బారజూచి ముందునకడుగిడుము. అమితభోజనపానీయ నిద్రాసంగముల వర్జించివేయుము. మానవకోటికి జననీజనకాచార్యులే యుత్తమశిక్షకులని యెఱుంగుము. అందును మాతృదేవియే గురుస్థానము వహింపగలదు, ధార్మికులును, జ్ఞానసంపన్నులును నగు జననీజనకులే యుత్తములు. గర్భాదానమాది సంపూర్ణవిద్యోపార్జన కార్యసమాప్తి పర్యంతము సంతానభారమును వహించునది దంపతులేయని తెలియుడి. దంపతులు సంతానహితమును, స్వహితమును నభిలషించువారలయి, పరమార్థమునను దొందుకలదని యెఱింగి పునస్సంధానమునకు దొలుతయే మాదకాహారమును బహిష్కరించి, ధీవిధ్వంసకరములును, స్థూలములును, నగు పదార్థముల చింతయే రోసి కాంతిని, ఆరోగ్యమును, బలమును, బుద్ధిని, పరాక్రమమును, సుశీలతను, సభ్యతను, సత్వగుణశక్తిని, వీర్యపటుత్వమును సర్వదా ప్రసాదించునట్టి కందమూలధాన్యాదిసాత్వి

కాహారమునే యారగించుటధర్మము. ధర్మసంతానప్రాప్తికే వివాహసంస్కార మేర్పడినది. కామతృప్తికి కాదు. అతిసంగమువిచారమే తగనికృత్యము. దుర్వ్యాపార, దురభిలాష దుష్కృత్యములు పరివర్జనీయములు. దంపతుల శుభముల కానంబారోగ్యములు సుస్వస్థయందున్నపుడే సంగము సార్థకంబగును, మాతృదేవి స్వీయసంతానముల రోదనము, హాస్యము, వ్యర్థక్రీడ, జగడము, హఠము, శోకము, భయము, ఈర్ష్య, ద్వేషము మొదలగు దుర్గుణవల్లరుల జిక్కకుండ సంరక్షింపవలయును. మాత సదా స్వసంతానమును జితేంద్రియ నిష్ఠాగరిష్ఠుంబుగను, విద్యాప్రియుంబుగను, సత్యమునం దభిరుచికలదిగను జేయుట యతిహితకృత్యముగ నెఱుగనగును. ప్రథమావస్థయందు జననియే పుత్రపుత్రికలకు మృదుమధురంబగుసుస్వరమున యుక్తిప్రయుక్తులచే ప్రత్యక్ష దృష్టాంతములచే ధ్వనులను, పదములను నేర్పవలయును. బాల్యకాలమందే బిడ్డల కోమలహృదయంబుల సద్విషయాభిరుచుల నుత్పత్తిలజేయుచు వారికి బరమపితయగు దేవుని దివ్యనామస్మరణంబును జేయువిధానమును దెలుపవలయును. తల్లి నిరతము సద్భాషణము, మృదుభాషణము, శూరత్వము, ధీరత్వము, సంకల్పదార్ఢ్యము, ప్రసన్నత, వినయవిధేయతలు మొదలగు సద్గుణాంకురముల సంతానముయొక్క కోమలహృదయ క్షేత్రమున సకాలమున నాటుటయం దేమరియుండజనదు. సకలజీవులతో ప్రేమతో సంచరించుటకును, మిథ్యావిషయంబుల విరక్తిం గల్గియుండుటకును, వాస్తవికంబులగు సత్య, ధర్మ, జ్ఞాన, సర్వేశ్వరాది పదార్థముల శ్రద్ధాభక్తులగల్గి వ్యవహరించుటకు నుత్తమంబగు నొండుపథము సంతానమునకు జూపుటయు మాతృధర్మమే. ధూర్తోపదేశముల దూరదృష్టిలేక యాలకింపకుండుటకును, గురుజనులయెడ సమాదరము బ్రదర్శింపనేర్పుటకును, భ్రాంతిమూలకంబులగు సకలవిషయ పదార్థభావాది విభవపంకిని ద్రొక్కకుండుటకును, సంతానమునకు దంపతులిరువురును బోధచేయుటకును, జేయించుటకును బాధ్యులయియున్నారు. స్వతంత్రముగాను ధర్మయుతముగాను జీవించు సంతానమునకు జననీజనకులు

వ్యవసాయాదివృత్తులను, బ్రహ్మవిద్యాప్రపత్తులను నేర్పవలెను. వారిచే గాదేని ఋషివ్యాదుల సాహాయ్యంబున నేర్పించుట విశేషధర్మము. మాధుర్యము, వారి యాచార వ్యవహార విచారములను, అవ్వారి నిందనీయములగు చరిత్రములను వినుటయు గనుటయు - బిడ్డలారా! మీకు తగదు. కల్మషముతో గూడిన దేదియు సంస్మరణీయంబు కాదు. దుష్టవాక్యోచ్చారణము మనోవ్యాధికి మూలము. మన మనుభవించు సుఖదుఃఖాది ద్వంద్వములు పాపపుణ్య పరిణామములు. హఠాత్తుగా ననగా దలవనితలంపుగా సంఘటితములగు దైవికముల మానవులు గ్రహింతురనుట కల్ల. బ్రహ్మచారి విషయప్రాంతము లగు నాభ్యాయికోపాఖ్యానములనుండియు, ఆసక్తి బద్ధుల స్నేహమునుండియు, వాసనాదుల చింతనమునుండియు, ఏకాంతవనితాదర్శన, భాషణ, స్పర్శనమునుండియు దన్ను దానే సంరక్షించుకొనుచు నుత్తమ శిక్షయు, బూర్ణ విద్యయు, సర్వేశ్వర జ్ఞానమును సంప్రాప్తము గావించుకొనుట శ్రేయస్కరము. వీర్యము లేనివాడును, దుర్బలుడును, నిస్తేజుడును, ఉత్సాహ, సాహస, ధైర్య, బల, పరాక్రమ శూన్యుండును నగువాని జీవితము నిష్ప్రయోజనము. సమయము మహూల్యమను రహస్యమును విస్మరింపకుము. అది గతించిన మరల లభ్యమగు టసంభవము. ప్రతి నిమేషమును సత్యజ్ఞాన సాధన కృషికయి వినియోగించుము. విషయాధిక్యతచే నిండిన జీవితమునుండి విముక్తుడవయి సాధుసుందరజీవితమును గడపుము. వీర్య రక్షణ మానంద ప్రదము. ఇంద్రియనాశనము దుఃఖకరము. బిడ్డలు బాల్యకాలమునందే సంపూర్ణ స్వేచ్ఛాభ్రష్టులగుదురు. హఠాదివృత్తులనుండి మరల్చ బిడ్డలకు దాడన మొక్కటే సంరక్షిక సాధనమేయగును. క్రూరముల శిక్షించునప్పుడు బాహ్యమునకు భయక్రోధములను వెల్లడించుటయు, నాంతరికముగా కృపాదృష్టిని గల్గియుండుటయు జననీజనకుల కర్తవ్యము. సంతాన హితాపేక్షచే మాతాపితలు బాహ్యమున నవలంబించు క్రోధ భయప్రవృత్తులకు వశులయి నిజహృదయముల నీరసాక్రాంతమయిన గ్రోధద్వేషానల జ్వాలాభిభూతములఁ గావించుకొన

దగదు. శరీరారోగ్యమే యిహపరసాధనమునకు మూలము. శేయి శీఘ్రమే పవ్వళించుము. బ్రహ్మముహూర్తముననే మేల్కాంచుము. పరిశుద్ధవాయు జలవస్త్ర స్థానముల స్వీకరించుము. ఏ కార్యమునయిన ముందు విచారించిపరిశీలించి మరి చేయుము. విద్యార్థిహితుడు విద్వత్సభయందు, మరాళములమధ్య బకమువలె రాణింపడు. పుత్రపుత్రికల దేజస్సంపన్నులుగను విద్యావంతులుగను, ధర్మాత్ములుగను, సత్యసంధులుగను, పరమార్థోపజీవులుగను చేయు మాతాపితలు ధన్యవాదభాజనులయి వాసికెక్కెదరు. విద్యార్థులకు గాదు, కాదు మానవులకు త్తమగుణ కర్మస్వభావాదులే ప్రశస్తాత్మయాలంకారములు. సువర్ణ జితమణిమయభూషణములు జడములగుకతన బరిశుద్ధంబగునాత్మను సుశోభితము గావింప నసమర్థములు. నశ్వరాభరణ భూషితవ్యక్తి ద్వేషాభిమానము, విషయాసక్తి, చోరభీతి మొదలగు మానసిక వ్యాధులచే బీడితుండగుటయె రూఢి. స్త్రీపురుషాదులకు సర్వకాల సర్వావస్థల విద్యావిశాలసంపన్నంబగు చిత్తమే యుత్కృష్టము. సుందరశీలస్వభావము హర్షసంధాయకము. సత్య ధర్మ జ్ఞాన నియమ పాలనము మహారోగపిశాచము పాలిటి కరాళకాలమూర్తి. మాలిన్యవినాశ సత్యప్రబోధ విద్యాదానాదిక పరోపకారకృతులు సుకృతములు. యువతీ యువకులెల్లరు సంపూర్ణ విద్యాపారీణు లగుపర్యంతము బరస్పరదర్శన, స్పర్శన, సంభాషణ, విషయకథాశ్రవణ, ఖేలన, విషయ ధ్యాన, సంగమాద్యష్టమైథునములనుండియు వేఱుగా నుండవలయును. పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాపకమయియుండు దేవుని తేజస్సు మన హృదయాంతరాళముల బ్రవేశించుచుండుగాత! ఓ విశ్వంభరా! శ్రేష్ఠాచరణమందును, సత్యమార్గములందును, జ్ఞానసాధన క్షేత్రములందును విహరించుటకు స్వేచ్ఛను, బుద్ధిని మాకొసంగుము! నిత్యశుద్ధచైతన్య స్వరూపుండవగు నిన్ను బ్రాపించుటయే మావిధి. ధర్మనిర్వహణంబున కపూర్వబల సాహస సామర్థ్యాదుల గటాక్షించి మమ్ముబ్రోవరావా తండ్రీ! భవత్ప్రేషిత ప్రతినిధులగు

మా దేవతలన్నియు మాకు సేయు హితము భవద్వ్యాజానురాగమునసే మని గ్రహింప లేకపోలేదు. నీవ మాసుఖదాతవు! కన్నతండ్రివి! ధ్యేయమవు!!

(గాయత్రీ మంత్రమిదియె)

పరిశుద్ధజలంబుల శరీరము, సత్యాచరణంబున చిత్తము, హోమముచే వాయువు, బ్రహ్మచర్యముచే తేజస్సు, సంస్కారముచే గృహము, నిత్యసాధనముచే జ్ఞానము శుద్ధములయి యానందమును బ్రసాదించును. సంపూర్ణవిద్వాంసుడు, ధర్మాత్ముడు, పరోపకారప్రియుడు, సత్యవాది, పురుషార్థి, జితేంద్రియుడు, సుప్రసన్నవదనుడు నగు వ్యక్తిసత్తముడు సకలజీవబాంధవుడు; పరమాప్తుడు. అంబుదశూన్యమగు నంబరపథమున వర్షింపనట్టుల గారణశూన్యమగు కార్యము లేదు. యథోచితంబగు ధర్మానుష్ఠానము శుద్ధికి మూలమగును. జ్ఞానశూన్యుడు స్వరూపముచే మానవుడయ్యు నవలోకింపుచుండియు దృష్టిలేనియంధుడు, ఆకర్ణింపుచుండియు బధిరుడు, భాషింపుచుండియు మూకుడు, బాహ్యదేహారామణీయకమునకు సుందరవస్త్రాభూషణములు తోడ్పడు విధంబుననె సుజ్ఞానదాయకంబగు విద్య స్వస్వరూపంబును బ్రకాశవంతముగావించి యొక్కసారి ప్రత్యక్షముగా బహిర్గతముగావించి వేయును. వేదజ్ఞానసంపన్నులును, ధర్మాచరణపరిపక్వతామూర్తులును యోగులు (భక్తిజ్ఞానకర్మయోగసంపన్నులు) ను ముక్తిపురి నలంకరింప సమర్థులగుదురు. జ్ఞానరహితులు ఋగ్వేదపఠనమాత్రంబున బడయునది హుళక్కాయె. వచనము కర్మరూపమును ధరించినపుడే సార్థకంబగును. గార్దభస్వరమువంటి వ్యర్థాలాపములను ద్యజించుము. అల్పుల గ్రంథములను వారి యాకృతులును స్పృశింపకుము; స్మరింపకుము. పరవనితాగమనాసక్తి నింద్యకర్మ. జ్ఞానసంపాదనమే జీవితపరమావధి, సకలదానంబుల జ్ఞానదానమే మిన్న. శరీరవాక్చిత్త ధనాదులచే విద్య నభివృద్ధి సేయుము. ప్రీతిపరోక్ష వస్తువులయందువలె బ్రత్యక్షపదార్థములయందుండ నేరదు. (ఈ వాక్యము సాకారనిరాకారభేదమును దర్శింపజేయుచున్నది) ఉన్నతశీలుడు, విజ్ఞాన

ముచే విద్యాభివృద్ధి నభిలషించువాఁడు శీఘ్రమభ్యుదయము పదవిని సమీపించును. ఉత్తమకర్మ సలుపువాఁడు గొప్పజాతివాఁడు. నీచకర్మసేయువాఁడధమజాతీయుఁడు. (జాతి యనఁగా తెగ).

నీశరీరమందును, బుద్ధియందును జడత్వము ప్రవేశింపకుండు రీతి జరిం పుము. ప్రియసత్యము హర్షదాయకము. అప్రియసత్యము దుఃఖకరము. వ్యర్థాలాపములకంటె చెనరియోగ్యము. జాదకాఁడు నీబంధువుని గన్నెత్తి వీక్షింపవలదు. పరోపకారమునకే నీదేహము సర్వేశ్వరునిచే నిర్మితమైనదని భావించియే జీవమును హింసింపఁ గడఁగి, మహాపాతకుఁడవయి, అఘభారంబున మునిఁగిపోవలదు. శాంతచిత్తులును, విద్యావివేకసంపన్నులగువారు వనమందు దపమును, ధర్మానుష్ఠానమునం దాసక్తియు, సత్యమందు శ్రద్ధాళువును నయి భైక్ష్యకవృత్తిచే నుదరపోషణము జేసికొనుచు జీవితము వ్యతీతము సేయవలయును. అట్టివారు నాశనహీనుండును, పూర్ణజ్ఞుండును, సుఖదుఃఖదూరుండును, నగు నాపరమాత్మయం దైక్యము నెందుదురు. “నేను హోమము జేయుచు దీక్షితుండనైతి. సత్యాచరణమును, శ్రద్ధయును బడయుదును గాక యని” వాంఛించి వ్యక్తి తానపవిత్రుఁడయి వివిధంబులగు దపశ్చర్యలవలనను, సత్సాంగత్య, భక్తి, జ్ఞాన, సత్కర్మ యోగాభ్యాసంబునను, సద్విచారములచేతను జ్ఞానమును బవిత్రమొనరించుకొనుట యుత్తమము. సంసారముపట్ల విరక్తికలిగిన నిముసమందే గృహారామాదుల బహిష్కరించి మనుష్యుఁడు సన్యాసియగుట శ్రేయోదాయకము. ప్రతి మానవుఁడును మనోవాక్కర్మల నధర్మప్రవృత్తులనుండి మరల్చి ధర్మప్రవృత్తులయందు జొనుపుట విధ్యుక్తధర్మము. అకృతుఁడు కేవలము కృతిమాత్రంబున లభ్యుఁడు కాఁజాలఁడు. జ్ఞానము నయితము పరమావశ్యకము, అవిద్యయందే క్రీడింపుచు దమ్ము దామే బుద్ధిమంతుల మనుకొనువారు జన్మాంధునిచే నడుపఁబడిన యంధుని బోలియుండువారే యని తెలియుఁడి. వ్యామోహాంధకారమున రమించు బాలబుద్ధులు తమ్ము గృతార్థులుగ భావించుకొనుచుందురు. వాస్తవమున కది భిన్నము. కేవలము

కర్మకాండులగువారు పరతత్త్వమును దెలియరు, తెలియలేరు. కారణము వారు వ్యామోహచిత్తులయి యుందురు. వారాతురులయి జనన మరణ భేదముల దిగబడిపోయెదరు. ధర్మ మాచరింపుము. సత్కర్మ మాచరింపుము. ఈశ్వరీయ గుణసంపాదనమె ధర్మము. తద్విరుద్ధ గుణోపార్జనమె యధర్మము. స్వాత్మ సమానముగా నెల్ల భూతముల విశుద్ధప్రేమమును దృక్కుల నారయుము."

ఓంశ్శాంతిశ్శాంతిశ్శాంతిః !!!

ఉపర్యుక్తములగు సిద్ధాంతము లెన్నియో ఋగ్వేదమునందలివి. కొన్ని యజుర్వేద సామంబులందలివి సయితము కలవు. మానవునకు మతము ప్రధానము. దాని మహాదాదర్శము యుత్తమంబును, బ్రశస్తంబును నయియున్న సాంఘిక, ధార్మిక పారివారిక, రాజనైతికాచార వ్యవహార ప్రకారంబులన్నియు సమున్నతములును, సముజ్జ్వలములును, సమంజసములు నయి యుండుటయం దింతమాత్రము నతిశయోక్తి యుండబోదు. నేను పైం ఋగ్వేదమును రచియించిన ఋషీశ్వరుం డొక్కడో, యనేకులో యని సందేహాత్మకముగా వచించియుంటి. కొందరు చరిత్రకారులు దశమండలముల వేర్వేరు ఋష్యాదులు విరచించియున్నారని వక్కాణింపుచున్నారు. కాని మనకు చారిత్రాత్మక పరిశీలనకంటె మతాదర్శ పరిశోధనమే యుపోద్ఘాత లక్ష్యమును సత్వరము సార్థక మొనరింపగలదు. గ్రంథ విస్తరభీతియు విశేషాంశ లేఖనమునకయి నన్ను సాహసింప నీయకున్నది. వైదికమతావలంబులగు నార్యులనాటి యాచార వ్యవహారంబుల గొన్నింటి నిట సంక్షిప్తముగా దెలుపుచున్నాడ. "ప్రాచీనవైదికార్యుల ప్రధానవృత్తి సేద్యము. వారు వృషభములను, గోవులను, అశ్వములను సయితము గల్గి యుండెడివారు. తము ప్రాపించిన హితసాధనమునందు దోడ్పడు భౌతికశక్తుల నెల్ల, దేవతలారా! యని సంబోధించి కల్యాణయాచనాసూచకంబులగు ప్రార్థనములు సేయుచుండెడివారు.

వారు సకలభౌతికధనముల కెల్ల గోధనము (వ్యవసాయమునకు తోడ్పడు పశువులు) నే శ్రేష్ఠముగ భావించుచుండిరి. అతివృష్టిరాహిత్యమునకును, సకాలవృష్టిప్రాప్తికిని వారిందుప్రని గుణగానంబుల స్తుతిసేయుచుండెడివారు. వారి పొలములన్నియు మెట్టభూములె. గోధుమలు, యవలు వారిపైరులు. బావుల నుండి తోటలకు ఘటయంత్రములచే నీరుతోడెడివారు. ప్రత్తిని క్షేత్రముల నుత్పన్నముజేసి స్వయముగా వడికి వస్త్రములు నేసెడివారు. రంగులు వేయుటయు వారు నేర్చియుండిరి. మందిరములు పయితము రాళ్లతో గట్టుచుండెడివారు. గృహపార్శ్వభాగములు పూలచెట్లతో నిండియుండెడివి. వారు లోహముల నుపయోగించుకొనుటయందును జతురులే యయియుండిరి. గ్రహనక్షత్రములగుఱించియు వారెన్నియో రహస్యముల గ్రహించియుండిరి. వారు తమ వ్యవసాయమున కాధారభూతములయిన పశువులకు భక్తిభావావనతమస్తకులయి నమస్కరించుచుండెడివారు. అనదులను దేవీస్వరూపంబులుగ భావించి కీర్తించుటయందు నతియు వారు మోదమందుచుండెడి వారు. ఉషఃకాలమును వారు దేవిగా బూజించెడివారు. ఇన్నిజేయుచుండియు వారనేకేశ్వరవాదులె. అప్పుడు దేవళములులేవు. నిరాకారోపాసనయే వారివిధి. విశ్వమే వారికి దేవాలయము. సృష్టియందలి మహిమలే యీశ్వరలీలలని యెంచుచుండెడివారు. మహాపండితుడగు మాక్సుమూల్లరు మహాశయుడు,

"It is true, we have no really ancient temples in that Country" "Physical Religion P. 56."

జూపమును ప్రాచీనార్యులు బహునింద్యవృత్తిగా దలంచెడివారు. జూదరుల దిరస్కరించు వాక్యజాలము లెన్నియో ఋగ్వేదమునగలవు." ప్రాచీనార్యుల వైదికమతము (హిందూమతము) యాచందమున నాదికాలమునందుండెను. ఇంతహిందూమతము యొక్క వేర్పాటు గ్రంథముల కళేబరముల బాసి హృదయముల బరీక్షింతేరు!

## బ్రాహ్మణములు ; ఉపనిషత్తులు.

వేదదర్పణములగు వీనియందును ప్రాచీనార్యమత సిద్ధాంతములే కలవు. ఉపనిషత్తులు ప్రకృతి, జీవాత్మ, పరమాత్మ, జీవేశ్వరైక్యసంధానము, పరము, జననము, మరణము మొదలగు నధ్యాత్మ రహస్య సమస్యల బాగుగా బహిష్కరించిన గ్రంథములు. వీనిని సకలవిదేశీయప్రసిద్ధపండిత ప్రవరులును స్తుతించియున్నారు.

"ఈసృష్టి యాద్యంతరహితము; మాయాన్వితము. పరమాత్మ నిత్యశుద్ధసత్త్వము. ప్రతియణువునందు సర్వేశ్వరుడు వ్యాపించియేయున్నాడు. జగత్పతియే మన యాదిస్థానము. జీవులెల్లరు జ్ఞానముచే నతనియందు నైక్యము జెందవలయును. నరుడు సుకృతఫలము జేయుచు ధర్మయుతముగ శత వత్సరములపర్యంతము జీవింప నభిలషించుట యుక్తము. మానవు డధర్మాత్ముడయి యొక్కఘటికాకాలమయిన మనుట నిష్ప్రయోజనము. మనోవిజయమే ముక్తిపథమును దర్శింపజేయును. బుద్ధిహీనుల మృతదశ నిబిడాంధకార బంధురంబగు నరణ్యమువంటిది. ప్రకృతి మృగతృష్ణాసమానము. ప్రకృతిపాశబద్ధమగు జీవాత్మ జ్ఞానకుఠారంబున వ్యామోహబంధన విచ్ఛేదము గావించుటుచితము. దీపము ప్రకాశించుచున్నది. దానికి నల్దెసల నీడ వ్యాపించియున్నది. కాని యా నీడ దీపజ్యోతి కెంతమాత్రము కళంకము నాపాదింపజేయజాలదు. ఈ చందమున నే పరమాత్మ నంటక మాయ వెలయుచున్నది. ఒక్క సూర్యుడే భిన్నరూపంబుల ననేక జలాశయంబుల వెలయురీతి బరమాత్మయు నీ సృష్టియందనేక రూపంబుల గానవచ్చుచున్నాడు. ఈశ్వరు డనంతుడు. వానికి నానారూపాదులు లేవు. ఏ రూపంబున దేవుని పరిశుద్ధహృదయంబుతో సాత్త్వికభావముతో నుపాసించినను వానిని జీవుడు పడయగలడు. సంయోగములను, సంకల్పములను, వృద్ధిక్షయములను గల్గియున్నవన్నియు నశాశ్వతంబులనియు నవికృతంబగున దొక్కటియే సుస్థిరంబగునదనియు గ్రహింపదగును. జీవులు కర్మప్రభావంబునసే కాయములను ధరించుచు బ్రకృతి శాసనముల ననుసరింప బద్ధ

లగుచున్నారు. కాయము నశించకపూర్వమే సంపూర్ణజ్ఞాన జ్యోతిచే విభా
సితుండగు మానవోత్తముడు పునరావృత్తిరహితంబగు మోక్షమును బడయుచు
న్నాడు. సృష్టితత్త్వము నెఱింగి దానికి వశుడుకానట్టి వ్యక్తి జీవితకాలమం
తయు తాదాత్మ్యముచే నానందింపుచు దేహాంత్యానంతరము బ్రహ్మమునం
దైక్యముఁజెందును. ఈ జన్మయందు మూఢులయి యీషణ్మాత్రమయిన
జ్ఞానమును సంపాదింపక వన్యగార్దభముల చందమున మదోన్మత్తులయి స్వైర
విహారము సేయువారు జననమరణ ఘటనాచక్రంబున బడుచు భయవిషాదం
బుల ననుభవింపుచునే యుందురు. ఆత్మవికాసమును దుర్వృత్తులకయి వినియో
గించు వారును శీఘ్రకాలమునందే యవనతికి పాల్పడును. ఆత్మతుష్టి సంప
న్నుని భవతృష్ణావ్యాధి సమీపించుట సంభవము. వాని పావన జ్ఞాన సంప
త్తియే వానిని నిత్యమెల్లలోకంబుల సంరక్షింప సమర్థమయి యుండును.
మానవునకు వేతనము నందుచున్న యోధులు రక్షకభటు లెంతమాత్రమును
గారు. వారిని వ్యాధిమృత్యువులు, అశాపిశాచాదులు మ్రింగివేయును. కాని
శుద్ధభావములను రక్షకభటు లవిక్రపరాక్రమోపేతులయి మృత్యువునయిన
లెక్కింపక మానవుని సంరక్షించును. వీని రక్షణశక్తి యప్రతిహతమయినది
సార్వకాలికము; సార్వత్రికము. జ్ఞానకర్మలు రెండును బరస్పరావినాభావ
సంబంధయుతములయి ముక్తిమార్గము నాయత్తపరచు సాధనములు. మాన
వుడా! ఉపదేష్ట వగుటకు బూర్వ ముపదేశితుడవగుము. ప్రకృతిని, దాని
తళుకుబెళుకులను, వింతవింత సొబగులను వీక్షింపుము. కాని దానికి వశవర్తి
డవు కావలదు. మలినాచ్ఛాదితమగు దర్పణంబున ముఖబింబావలోకన
మసంభవంబగు విధంబుననె వ్యామోహ పటాచ్ఛాదితమగు హృదయ దర్ప
ణంబున సర్వేశ్వర రూప సందర్శనము నయితము దుస్తరంబేయగును. సర్వే
శ్వరుడు సర్వజీవ న్యాయాధీశుడయి, చరాచరాత్మక ప్రపంచమున కధీశ్వ
రుండయి మన నేత్రములయందే యాసీనుడయి, మనము సేయు కృత్యముల
నెల్ల నవలోకింపుచునే యున్నాడు. కాని మూఢుల జ్ఞానాంధకార పటు

లను దివ్యదృక్ప్రసారమున కద్దుతగులుటంజేసి, భాండమున శిరమునుంచి
క్షీరమును పానముసేయు మార్జాలము లోకమంతన్ను గాంచుటలేదని భ్రమించి
తాడనములకు గురియగు ప్రకారమే, తమదోషపుంజములు రహస్యముగా
జేయబడుటంజేసి యెవ్వారును గాంచియుండలేదని భ్రమింపుచు, అంతము
నకు పాపపరిణామంబుగ సర్వేశ్వరీయదండనకు పాత్రులగుచు వాపోవుచుం
దురు. సూర్యుడు దివ్యప్రభాభాసురుండయి నిజమరీచి మాలికల వసుంధరస్థిత
సకలకల్మషముల బరిసరింపజేయుచు వానిని బ్రకాశింప జేయుచుండును కాని
పదార్థముల దూషితగుణ మా ప్రభాకరకిరణరశ్మిని స్పృశింపజాలదు, జ్ఞానుల
దివ్యాలోకనముల మూఢులపయి బ్రసరించి వారిని బరిశుద్ధులుం జేసినను జేయు
గలవు. కానిమూఢుల దూషితస్వభావము జ్ఞానుల సమీపించనేలేదు. వివేకము
లేని విత్తవంతుడు తావిలేని పూవు. వినయవిధేయతలు సంపన్నిధులు. మాటల
నాచితూచి మాట్లాడువాడు బాగుపడువాడు. దివాకరుని సేవనంటె లోకసేవ,
భూమిపాము లొసంగు నుపకారమువంటి పరోపకారము నేర్వదగినది. బాహ్య
తేజము భోగతికిని, ఆంతరిక తేజమూర్ధ్వగతికిని మానవుల గొనిపోవుచుండును.
చిత్తశుద్ధికయి యహోరాత్రము జింతించుచు, కృషి సేయుము. నిరుత్సాహ
పడవలదు. కర్మ (క్రియ) బలవత్తరమయినది. దృఢసంకల్పంబున జ్ఞానమును
సాధించుము. సంకల్పక్రియా బలసమ్ముఖంబున సహస్రదళావళముల బల
మయిన నిలువజాలదు. బుద్ధిని విస్తరింపజేయుము. దానిని విశ్వమయంబుగ
ననాసక్తభావముతో జేసివేయుము. నాది, నేను యను మమకారాహంకార
ముల నిర్మూలించుము. విశ్వసత్తాత్మక జీవితశక్తియే ముక్తిరూప ధన భవతృష్ణలు
పొన్సకిందుండు భయంకర విషమయసర్పముల వంటివి. అవిచారమున లోక
తూరి చిత్తమున స్థానమొసంగుచో సర్వనాశనమయినట్లే భావింపుము. అంధ
కారము తనంతట దానే జన్మించి లోకమంతట గ్రమ్ముకొనును. ప్రకాశము
స్వాయముగా నుదయింపక దివాకరునాధారము జేసికొని యుదయింపు చుండును
ఈచందమున నే మానవుడు సహజముగనే ప్రకృతిబద్ధుడయి పోవుచుండును

ముక్తిగతుడు కాదలంచిన స్వయముగా గాజాలడు. కృషిచే జ్ఞానమునార్జింప వలసియుండును. నిష్కామకర్మ మానవుని దురాశలను, వ్యామోహబీజము లను నశింపజేయును. ఫలాపేక్షాపరుడగు కర్మయోగిహృదయము సంకల్ప దార్ఢ్యముచే నొప్పక దుర్బలముగా నుండుచుండును. దృఢసత్సంకల్ప శుష్పము పాలిటి కీటక మీఫలాకాంక్షయె. మానవుడా! ముక్తిని సాధింపనేమచో, బుద్ధిమంతుని చీవాట్లను హితోక్తులుగానెంచి, వెన్నముద్దలవలె ఉగమింగుము. కామక్రోధాది శత్రువుల బారద్రోలుము. దివ్యజ్యోతి కనబడును. తెరమఱుంగుననున్న పడతికరణి మాయకతీతమయి యాపరతత్త్వము వెల యుచున్నయది. ప్రమత్తుడు దుఃఖమను వెల్లువెల్లువను బడి కొట్టుకొనపోవును. సుందరమయిన చర్మచక్షువుకంటె విజ్ఞానయుతమయిన గ్రుడ్డికన్నయే దివ్యమ యినది. విశుద్ధ విశ్వప్రేమ యోగసాధనము విశుద్ధసత్యమునకు మనలగొని పోవు రాజమార్గమువంటిది. దేహధారి సుఖదుఃఖాదులనుండి దూరముగా నుండజాలడు. శరీరరహితుండగు జీవుడు సర్వవ్యాపకుండగు సర్వేశ్వరునియం దైక్యము జెందును. లోకమందలి ప్రతిష్ఠాలాభములనుండియు, భోగములనుండి యు జలజపత్రస్థిత జలకణంబుపగిది, భిన్నుడయి యుండువాడు విముక్తుడె. వీనిం గూర్చి ఋషుల ధార్మిక సాహిత్యమున జెప్పబడినది. స్మృతు లనేకములు కలవు. మనుస్మృతియే ప్రధానముగా నెన్నబడినది. పరాశరస్మృతియు నించుమించుగా మనుస్మృతి వలెనే యుక్తముప్రబోధ వాక్యములగల్గి వెల యుచున్నది. యాజ్ఞవల్క్యస్మృతియు వాసికెక్కినదియె. కొందరియభిప్రాయ మున, యాజ్ఞవల్క్యస్మృతియే విశేషముగా నాదరింపదగియున్నది. ఈచర్చతో మనకు బనిలేదు. రండు! స్మృతి వాక్యములఁ గాంచి యానందింతము. రాజ కీయ, నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, విజ్ఞానమయంబులగు సమస్తసిద్ధాంతము లీస్మృతులయందు గలవు. వీనికి ధర్మశాస్త్రములను నామము నయితముకలదు.

ధర్మము శ్రేష్ఠమయినది ఇదియే నిర్వాణదకందము. భవసాగ రతారణమున కిదియొతరణి. ఆడంబరమునకయి ధర్మము నాచరించువాడును,

అన్యులచే నిజవిఖ్యాతి వల్లరుల దిగ్వలయంబుల వ్యాపింపజేసికొనువాడును, పరధనాభిలాషియు, కపటవేషధారియు, పరనిందాపరతంత్రుడును, పరులను మోసగించువాడును, హింసాకార్యనిమగ్నుండును, బిడాలవ్రతధారి (కుహక జ్ఞాని) యనబడును. తనవినయాడంబరమును బ్రదర్శించుటకయి శిరమువంచి కపట విధేయతను గల్గియుండు వాడును, స్వార్థసాధనావిరాజితుండును, పరులతోడ నిష్ఠురముగా వర్తించువాడును, కుటిలబుద్ధియు, శృగాలవినయ సంపన్నుండును, కృత్రిమశ్రద్ధచే గరములు మొగుడ్చువాడును, ఆంతరికభక్తిలేశ శూన్యుండునునగు వేదానభిజ్ఞ బాపని (పుట్టువుచే బ్రాహ్మణుడు) సత్కరింపరాదు. దుష్టాత్ముడును, విషయాభిభూతుండును నగువ్యక్తి వేదాధ్యయన దానయజ్ఞనియమపాలన తపములచే బడయగల్గునది శూన్యమె. ఏమానవుడారగింపుచు, దానముసేయుచు, ఈక్షింపుచు, ఆఘ్రాణింపుచు బ్రసన్నతాప్రసన్నతలకు బాల్పడక ద్వంద్వములయెడ సమత్వముతోడ వెలయునో వాడే జితేంద్రియుడు. ఇంద్రియగ్రామంబును వశమొనర్చుకొని, యోగశ్రేయబలంబున జిత్తమును నిరోధించి, శరీరమును బీడింపక యథాతథముగా సకల పురుషార్థముల జేయుటుచితము. మన కట్టి దగ్గర సంబంధము (బాహ్యమగు చుట్టరికము) లేని పరవనితను 'భవతి' తల్లీ! యనిసంబోధించుట శ్రేయోదాయకము. అధికప్రాయము గతించుటచేగాని, కేశజములు పరిపక్వస్థితిని జెందుటచేగాని, అధిక ధనపరిజన పరివేష్టితుండగుటచే గాని యేమానవుడును పెద్దవాడు కాజాలడు. అక్షయజ్ఞాన భండారములగు వేదవేదాంగ పరిజ్ఞాతయే గొప్పవాడు. ఋషివరేణ్యులిట్టి ధర్మవ్యవస్థను గావించియున్నారు. పరిశుద్ధములయిన వాఙ్మనఃకర్మల గలవాడును, సమ్యగ్విధ సంరక్షితుడును, వేదాంత కథితసమగ్రఫల భాజనుండును, దుఃఖితుడయ్యు బరహృదయములు భేదింప జేయనివాడును, లోకముపట్ల మనమందయిన ద్రోహచింతన లేనట్టివాడును, గర్హితవచనంబుల నుచ్చరింపని వాడును, పరచిత్తోద్వేగమునకు హేతుభూతుడు కానట్టివాడును, ఆత్మానందమునందే నిత్యము తృప్త

డయియుండు వాడును, ఏవస్తువునందును మమత లేనట్టి వాడును, మాం
సాశన ప్రియుండును, విషయభోగేఛ్ఛా విహీనుండును నగు జ్ఞానిసత్తము
డేః దేహమాత్ర సాహాయ్యంబున ముక్తిపదవి నందును. నిజ వేతనమునకయి
భృత్యుడు నిరీక్షించు పడువున బ్రతిమానవుడును మృత్యుదేవాగమనమున
కయి ప్రతీక్ష సేయవలయును. ప్రతివిషయము దీర్ఘముగ విచారింపనిదె
యొక్కసారిగ స్వీకరింపకుము. వస్త్రముతో వడియబోసిన జలమునే త్రా
వుము. సత్యముచే సంశోధించియే ప్రతివాక్యమును సంభాషింపుము. పరి
శుద్ధ చిత్తముతో సత్యాంతఃకరణ పరిశోధితంబగు కార్యమును సలుపుము.
ఎవనితోడను వాదవివాదముల నధికముగా సేయుటనుచితము. ఏ జీవునయిన
నవమానింపకుము. ఈ క్షణభంగురమయిన దేహాభిమానముచే ప్రేరితుడవయి
యేమానవునితోడను శత్రుత్వము గల్గి యుండకుము. క్రోధాంధులతోడ
గుపితచిత్తుడవయి వ్యవహరింపకుము. నిందించువారిని దూరబోకుము. దూ
షించుటకు మారుగ వారల ప్రేమించుము. మృగయావినోదము, ద్యూతము,
పగటినిద్ర, పరదోషకథనము, పరస్త్రీసహవాసము, సురాపానము, నృత్యగీ
తావినోదములు, వ్యర్థపర్యటనము మొదలగు నివియన్నియు గామవ్యసనములు,
దివారాత్రము లింద్రియవశీకరణ ప్రయత్నమునకయి యత్నము సేయుట మానవ
ధర్మము. జితేంద్రియుడగు (విషయాసక్తి దూరుడు) భూపాలుడు మాత్ర
మే ప్రజాశాసనార్హుడు. క్రోధముచే జాయమానములగు వ్యసనాసక్తు
లచే ధరణీనాథుడు శరీర ధర్మ చ్యుతుండగును. సకల యజ్ఞాత దోషాన్వేష
ణమునే నిత్యవృత్తిగా గొన్నవాడు. దుష్కర్మల నపూర్వంబగు సాహస
మును బ్రకటించువాడు, ఈర్ష్యాద్రోహ బుద్ధియుతుండు, పరదోషాన్వగుణ
భాషి, అగ్రాహ్యద్రవ్య పరిగృహీత, దాతవ్య విత్తము దానము సేయని
వాడు, కఠోరభాషి, దండతాడన స్వతంత్రుడు నింద్యుడు. ఈదుర్గుణము
లన్నియు త్యాజ్యములు. పూర్వోక్తములగు సమస్త దుర్గుణ పరంపరలకును
లోభమే మూలకారణము. లోభవిజయముచే నీపాపవాసనాయుతములగు

దుర్గుణములన్నియు శతమకంబులగును. పరార్థాపహారణము, అశ్లీల వాక్యో
చ్చారణము, సత్వర త్యాజ్యములు. సువర్ణాది సంపదలకయి మిథ్యాభాష
ణమున కియ్యకొను వ్యక్తి స్వపంతాన హత్యాపాప సమానదోషి యగుచు
న్నాడు. ఏవిధమయిన స్వార్థసిద్ధికిని సత్యధర్మశాసనోల్లంఘనము సేయదగదు.
భూపాలుడగువా డీశ్వర ప్రతినిధియగు కతన ప్రియాప్రియంబులనెల్ల
వర్జించి జితక్రోధుడయి, సర్వేంద్రియ విజేతయయి, సర్వజనులతోడ
నైతికముగా జరింపుచు ధర్మసామ్రాజ్య పరిపాలనమునకు గడంగవలయును.
వ్యామోహధర్మములతో వసుంధరను బాలింపుచుండు దురాత్ముండగు నృపా
లుడు శీఘ్రకాలమునందే శాత్రవమండలిచే నాక్రమింపబడి పరాభవింప
బడుట నిక్కువము. చెదలు క్రమక్రమముగా మట్టితో గోడల నిర్మించు
కొనుభాతి మానవుడు జీవరాసుల దుఃఖింపజేయక తనకయి పరలోక మందిర
సోపానశ్రేణిని నిర్మించుకొనదగును. కారణ మేమనగా బరలోకంబున
మనసాహాయ్యంబునకు జననీజనకులు గాని, సతీసుతులుగాని, సహచర పరి
జనులుగాని రారు. కేవలమట మన ధర్మమే మూర్తీభవించి వచ్చి మనల
సత్కరించి హర్షాబ్ధి నోలలాడించును. కాన మనకు బరమశ్రేయస్కరం
బగు ధర్మానుష్ఠానము విహితకృత్యము. ఈజీవు డేకాకియయి యిహము
నకు వచ్చుచున్నాడు.

కొంతకాలమిటనుండి నిజపుణ్యపాపము లనుభవింప నేకాకియయి
చనును. మన మృతశరీరమును గాష్ఠలోష్ఠసదృశంబుగ నెంచి బంధువులెల్లరు
భూమిపై బారవైచి యప్రసన్నాసహ్యభావములతో దరలిపోవుదురు.
వెంటవచ్చు బాంధవులెవరును లేరు. వెంట కేవలము మనమాచరించిన ధర్మ
మే వచ్చును. భయాపహంబును, దుఃఖదాయకంబును నగు నరకము ధర్మ
ముచే నాశనమగును. పరలోకసంప్రాప్తికయి నిరంతరము ధర్మసంగ్రహము
చేయుటయందే తదేకచిత్తముతో లగ్నమయియుండును. దృఢసంకల్ప
చిత్తుడును, కోమలహృదయుండును, దాంతుడును, శాంతుడును, పాపా

చార పరతంత్రి పురుష సంసర్గదూరుండును, పరజననిష్పీడన హృదయుం డును, సహజోదారుండును స్త్రీయేంద్రియ నిగ్రహ దయాధర్మదానాదు లచే ముక్తిపురిని బ్రవేశించును. సంయమంబున రాగాది చిత్తరోగ నిర్మా ణము, ధారణ (ఈశ్వరునియందు చిత్తమును లగ్నమొనర్చుట) చుచే సమస్త పాప నివృత్తి, ప్రత్యాహారము (విషయాదులనుండి యింద్రియముల నాకర్షించుట) సమస్తసంసర్గ నిర్మాణము, ధ్యానముచే బ్రకృతిగుణములగు క్రోధలోభ మత్సరముల లయమొనరించుట హితప్రదము. దేహగేహమున కస్థులే స్తంభములు. స్నాయువులే రజ్జువులు. మాంసరుధిరములే పైపూతలు. చర్మమే పైకప్పు. ఈగ్రహము మలమూత్ర సంపూర్ణమయి, దుర్గంధభూయి ష్ఠమయి యొప్పుచున్నయది. వృద్ధాప్యముయొక్క నానావిధములగు యంత్ర ణము లిద్దాని నాక్రమించియున్నవి. ఈదేహము వ్యాధిమందిరము. క్షుధాపి పాసలు దీనిని వ్యాకులపఱచుచున్నయవి. ఈరహస్యంబులనెల్ల మానవులు గుర్తెఱింగి యీనులిన గృహవిముక్తికయి ప్రయత్నము సలుపవలయును. అనగా బునర్జన్మలేకుండ జేసికొనుటయే పరమలక్ష్యము. పారమార్థిక విచా రముచే విషయాదుల దూషితములుగ నెఱుంగు మానవోత్తము డీభూవల యంబున సంతోషజనిత సౌఖ్యమును, పరలోకమున ననశ్వరంబగు ముక్త్యా నంద పీయూషరసమును దనివిదీర గ్రోలుచున్నాడు. అట్టివిరక్తుడు పుత్ర మిత్రకళత్రాది బాంధవకోటియందలి మమకారమును విడిచిపుచ్చి, మా నాపమానాదికములగు ద్వంద్వములనుండి విముక్తుడయి, విశృంఖలుడయి, నిత్య సత్యస్వతంత్రుడయి బ్రహ్మమునందు విలీనుడగును. విషయలోలురగు మాన వులు వాసనాభోగముల దగుల్కొనిన కొలదియు, గాఢవ్యామోహబంధన ములు మరింతదృఢతరములగుడు దుఃఖగహ్వరమునబడి వెనగులాడుచుందురు. విద్య, తపములు రెండును గల్యాణకరములయినవి. తపముచే బాపక్షయము, విద్యచే జీవితపరమావధియగు శాశ్వతముక్తియు, గరతలామలకంబులగును. సమస్తజీవరాసులయందు నాత్మరూపంబుచే దన్నుగాంచువాడు సమస్తంబున

సమత్వభావంబున వెలయుచు సర్వశ్రేష్ఠ సచ్చిదానందమనుపదార్థమునం దైక్యమగును. ఓం! ఓం!! ఓం!!!

## ఇతిహాసగ్రంథములు - రామాయణ భారతములు.

ఈగ్రంథముల రచనాకాలము నిదమిత్థమని యుక్తిగ్రంథ ప్రమాణములచే నిరూపించుటకు నయితము శక్యముగాకున్నది. రమారమి యీ గ్రంథముల మొదటిదియగు రామాయణము విరచింపబడి నాల్గువేల సంవత్సరములయి యుండునని కొందఱియభిప్రాయము. అనగా ఋగ్వేదానంతరము మహాభారతము వ్యాసమహర్షిచే మూడువేల సంవత్సరములకు దొల్లి వ్రాయబడియె నందురు. గ్రంథరచనాకాలనిర్ణయప్రమాణముల గూర్చి ముందుచర్చించెద. ఈ రామాయణ భారతాది యితిహాస గ్రంథముల వలన మానవలోకమునకు లభించిన నీతిజ్ఞాన ధర్మాదర్శ వివరణము నీదిగువ నుదహరించు చున్నాడను. రామాయణమునందును మహాభారతమునందును భూపాలురచరిత్రము లెన్నియో వ్రాయబడియున్నవి. ప్రత్యేక చరిత్రము మనకు ప్రత్యేకమగు గుణనీతి పాఠమును నేర్పుచునే యున్నవి. వాల్మీకి, వ్యాసమునీంద్ర కవిచంద్రుల గ్రంథము లెంతయు భారతీయ పామరపండిత జనము నుద్ధరించినవనియే నావిశ్వాసము;—

"ధనముచేతను బలముచేతను విలసితుండయిన మానవుడు కల్యాణము నెంతమాత్రము బడయజాలడు. బలముతో బాటు ప్రతి మనుజు డిలాతలంబున సత్య దయా, క్షమ సమములను గల్గియుండ వలయును. ధర్మాత్ములు స్వప్రాణముల నొడిసియైన శరణాగతజీవముల సంరక్షింప యత్నించెదరు. సంకటావస్థయందయిన ధర్మము బరిత్యజింపని ధీరోదారుని పుణ్యకీర్తు లెల్ల లోకముల వ్యాపించును. బ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞాన సంపన్నుడయి, భయ విషాద రహితుడయి, సుఖదుఃఖశూన్యుడయి, సత్య, దాన, క్షమాశీల, లజ్జా, తప, శామవిజయ సంపన్నుడయి యుండవలయును. జన్మచే జాతి యేర్పడ

జాలదు. సత్వగుణ సంపన్నుడగు శూద్రయోనిసంభూతుఁడు భూసురుండే
యగును. బ్రాహ్మణ గర్భసంజాతుండగు ధరణీసురుడు దుర్గుణయుక్తుడయిన
పతితుఁడు శూద్రుడేయగును. జన్మ ప్రధానమయినది కాదు. గుణకర్మములే ప్రధాన
ములయినవి. సకలమానవ జనన మరణములు తుల్యములె. ఇదియే వేదప్రమా
ణము. జ్ఞానియగునంత పర్యంతము జన్మించువారెల్లరు శూద్రులేయని శ్రీ
స్వాయంభువు మనువు వచించియున్నాడు. గురుతిరస్కారము హానికరము.
గర్వమదాంధతలు కష్టములకు నిలయములు. సత్సంగతి ముక్తిమార్గ ప్రదర్శక
మయినది. విద్వాంసుడు లేబ్రాయము వాడయినను, రూపవిహీనుడయినను
నిరంతరాదర భాజనుడే యగును. ధనరూపశూన్యుఁడగు జ్ఞానిని దూషించువారు
వాయసములవంటివారు. అహంకారము నింద్యమగువృత్తి. ఏతద్వృత్తి మానవ
సంఘారణ్యమునకు దవానలము. కామక్రోధాదుల గ్రమక్రమంబుగ బాయ
నభ్యసింపుము. పరస్త్రీని మాతృభావంబున నారాధింపుము. జ్ఞానము నార్జిం
పుము. ఆర్జింపనివారి కార్జించువిధానము దెల్పుము. పరవనితాసక్తి నరక
మున కీడ్చును. సప్తవ్యసనములు దూషితవృత్తులు. బాహ్యాభ్యంతరిక శుద్ధియే
జీవిత సంస్కరణము. భౌతికదేహము నశ్వరము. కీర్తికాయ మనశ్వరము.
ఒక్కమార్గముచే గార్యద్వయమును సాధించువాడు గ్రంథసాంగుడు; మేధావి
బుభుక్షా పీడితుల కాహారము. పిపాసార్తుఁగు శీతలవారిని శ్రాంతపథికులకు
విశ్రమస్థానము, మూర్ఖులకు వివేకము దానముసేయువారి కపవర్గము లభ్య
మగును. నీజీవ మెట్లు నీకుప్రియకరమో యట్లే సకలప్రాణులకవ్వాని జీవములు
ను మధురములె. కాన వేనిని బాధింపకుము. కర్మవీరునిచే సాధింపబడనిదెద్ది?
ఇష్టానిష్టముల నాసక్తిలేమి నేయగలవుని భోగము జీవితపరమావధి యెంతమా
త్రమును గాదు. సత్య,ధర్మ, జ్ఞానప్రపత్తియే జీవనలక్ష్యము. అల్పమల్పము కాదు.
కాలము ననుసరించిమూషికమే జాలగ్రస్తమగు సింహమునకెంతయు దోడ్పడ
గలదు. రేపో మాపో గిట్టు నీకు బరుల ధనాదికములపయి నాశలేల? బిందుక్రి
మపతింబుననె ఘటజలపూరితంబగును, యెందరోమంది మానవుల దప్పికను

దీర్చు విధంబుననే నిత్యమొక్కొకటిగ నలవఱచుకొనిన సద్గుణములే ముక్తిపదవి నొసంగును. ధైర్యక్షమాదులతో మేళగించిన నిరంతరోద్యోగ ప్రభావం బున నిహపరముల గరమున జిక్కించుకొనవచ్చును. అభ్యాసవశంబున నఖిలసుఖములు లభ్యములగును. వేగిరపడువారు వ్యసనపడువారలే. ఆలసించు వా రాక్రందించువారు. ఆడితప్పువారే దలపంచుకొనవలసినవారు. గతించిన కాలమెంత విత్తమును వినియోగించినను దిరిగి రాదు. అన్యాయము, పరపీడనము తగనికృత్యములు. దంపతులు పరస్పరప్రేమ విశ్వాసపాశబద్ధులయి గృహస్థాశ్రమ జీవితమును గడుపదగును. వారల యైక్యహృదయము భగవత్పాదార్పితము కావలయును. పతివ్రతలు మూర్తీభవించిన సత్వగుణములయి, మూర్ఖులగుపతుల జీవితముల సంస్కరణంబున నుద్ధరింతురు. కటుభాషణము కార్యసాధన విరుద్ధము. మృదుభాషణము, సరళస్వభావము, సాధువర్తనము సకలజీవుల వశమొనరించును. అసత్యయుతములగు కటువచనములు తీక్ష్ణకంటకములు, సత్యసమన్వితములగు కోమలవచనములు మృదుల ప్రధానములు, క్రోధము ప్రచండాగ్ని. శాంతము శీతలసుగంధమయ చందనకలశము. సద్భావములు ముక్తిమందిర సోపానములు. అల్పమగు తృణము ఘుంఘుమాయితమును సరకుసేయని బలవత్తరమయినది. ప్రచండమగు మహీరుహము మారుతాహతిచే నొకటి వేళ్లతో నున్నతంబగు దర్పము చూర్ణీకృతమగునట్లు భూతలపతితంబగును. కారణము తృణము పెనుగాలికి దలవంచును. మహావృక్షము శిరమెత్తియే నిలబడియుండును. వినయవిధేయత లమృతవృష్టి ధారలు. అసత్యమెంతకాలము రహస్యముగానుండ నేర్చును! కపటము కార్చిచ్చు వంటిది. ద్వేషము విషసదృశము. విశుద్ధ విశ్వప్రేమ వెన్నముద్ద వంటిది. అహింస యారాధ్యము. బ్రహ్మస్వరూప సమానము. సహజనమ్రభావము, ప్రేమభావము, భక్తిభావము మొదలగునవి ప్రాణశత్రువు నయిన నాలింగనమునకు సిద్ధము చేయును. ధైర్యము శరీరమనోబలముల కూలి. వేదాధ్యయనముకంటె నాచరణమే యుత్తమమయినది. కొట్టకురా! కొట్టబడి

యెదవు! తిట్టుసురా! తిట్టుబడియెదవు! మోహింపకురా! మోసపోదువు. క్షణభంగురములగు భౌతికసుఖములును, భోగములును, విషయములును ప్రారంభమున మధురములయి యంతమునను విషమయంబులగును. విద్యయొక్క సత్వరసత్ఫలము నపేక్షించి యద్దానిని బహిష్కరింపకుము. ప్రయత్నమే నీవిధి. అధర్మము చిత్తసాగరమునకు తుపానువంటిది. సేవామార్గమందున్న మహదానందాతిశయము ప్రభుపదవియందులేదు. బాధ్యత భయంకరమయినది. నిరంకుశత్వము నిరయపథము. నియమపాలనము రసభాండము. విశ్రాణముకంటె నాశనమే సులభసాధ్యము, కాని యిది నింద్యము. ఎల్లరనొక్కపెట్టున జయింపవాంఛించుటకంటె నిన్ను నీవేల జయించుకొనవు? ధనసామర్థ్యశాసనబలములు కలవు కదాయని ప్రపంచాపకార పథమున నడుగిడవలదు.

నీపాపపుణ్యములకు నీయంతరాత్మయే సాక్షి. ఒకని హింసింప నెంచినచిత్తము నిన్నెపరిని బాధింపగడంగిన వాపోవదా? బలాఢ్యుడయినను దుష్కర్మల నాచరించువాడు చలిచీమలచే జిక్కిచచ్చు భయంకర భుజంగము వంటివాడు. మద్యపానాభిలాషి కన్నులుండియు నంధుడె. కామము, క్రోధము, భోగము, ద్వేషము. ఈర్ష్య, హింస, అశౌచము, పాపము, అధర్మము, అన్యాయము, నిర్దయ, క్రౌర్యము, కాపట్యము, దురాశ, శత్రుత్వము, కాఠిన్యము, అసత్యము, ప్రమత్తత, అమితత్వము, మొదలగు దుర్గుణములన్నియు నరకలోకవాసినియగు మృత్యుదేవి పరిచారికలు. సంయమము, క్షమ, అనాసక్తి, ప్రేమ, సహానుభూతి, అహింస, శుద్ధి, పుణ్యము, ధర్మము, న్యాయము, దయాదాక్షిణ్యము, కారుణ్యము, నిష్కాపట్యము, మృదుస్వభావము, నిరభిలాష, మిత్రత్వము, శాంతము, సత్యము, చైతన్యము, (అప్రమత్తతలేక భక్తి)మితత్వము మొదలగు సుగుణములన్నియు బ్రహ్మలోకమందు నివసించు ముక్తిశ్రీదేవి చెలికత్తియలు. గృహకలహము సర్వనాశనమునకు మూలము. కామాంధులు లజ్జాభయశూన్యులు, పతివ్రతలు శక్తిస్వరూపిణులు, క్షామమందు ప్రజలకు సాహాయ్య మొనరించుట యుత్తమ భూపాల

ధర్మము. సంతానము జననీ జనకులయెడ భక్తిని, గురుజనులపట్ల శ్రద్ధను గలిగి మెలంగదగును. అగ్రజు డనుజునియెడ వాత్సల్యమును అనుజుడు జ్యేష్ఠునియెడ నవ్యాజాదరమును గల్గి వర్తింపదగును. పితాజ్ఞాపరిపాలనము, మాతృవచన స్వీకారము నుత్తమసంతాన ధర్మములు. వీనికంటె సత్యధర్మ శాసననిర్వహణము ప్రశస్తమయినది. ధర్మము పరిశుద్ధాంతఃకరణగతి. బలులు నిర్బలుల బాధింప వారినీశ్వరుడు పట్టి దండించును. దుష్టాంతఃకరణము మానవుని సెజ్జయందలి వాడిబల్లెమును బోలియుండును. భాస్కరోదయము తమఃపటలమును దూర మొనరించు విధంబున, మహాపురుషుల బోధ పామరపండిత జనంబుల దరింప జేయును. పరస్పర జీవమైత్రి కంటకాకీర్ణమగు భయంకరాటవిని సుందర పుష్పవాటికగ జేయును. పరస్పర కలహబుద్ధి స్వర్గమును సయితము నరకముగావించి మించును. ఆహార మైథున, నిద్రా మాన సంభాషణము లన్నియు మితములయి యుండదగును. పురుషార్థచతుష్టయంబగు ధర్మార్థకామమోక్షోపలబ్ధికి దేహారోగ్యమే పరమావశ్యకము. మారుని జయింపలేనివాడు పర్వత కందరముల నధివసించినను, సాంద్రాటవుల నీశ్వరధ్యానమున సంలగ్నుడయి యున్నను, శిరోముండన, కాషాయాంబర ధారణాదిబాహ్య సన్న్యాస వేషముల నవలంబించినను బ్రహ్మోరాజన మోపత్తయిన గలుగదు. శీతలంబగు చంద్రిక సర్వజీవసంతోష సంధాయకం బయ్యు గలువలకును, ప్రణయవియోగ బాధితులకును, చోరులకును రుచింపని విధంబున బరిశుద్ధాత్మయ వివేకసంపద్భాండారములగు వేదముల హితోక్తులు, కామాంధులకును, భోగైకపరాయణులకును హృదయాహ్లాదకములుగా నుండజాలవు. హరము శరసాధము. విపదవస్థయందు దోడ్పాటు నొసంగునతడే యథార్థమగు సుహృద్వరుడు. యథోచిత ధనధాన్యాన్న జ్ఞానదానము మానవవిధి. సర్వవిధశక్తిరహితుడే దానగ్రహణమున కర్హుడు. అపాత్రదానము హానిప్రదము. నిష్కామకర్మజ్ఞాన భక్తియోగ సాధనము చిత్తముయొక్క తహతహపాటును, తత్తరపాటును, రిత్తకోర్కెల వెల్లువను

నిరోధించివేయును. సకాలమున జేయదగు ధర్మములన కాలమున నాచరించు వ్యక్తి చింతాక్రాంతుడగును. పరిశుద్ధమగు మాతృపితృగురుగోవిదభక్తి యాశ్వర భక్తిపాఠమును నేర్పునవియె. బాల్యకాలమందలి మాతృబోధయే మానవుల భావిసౌఖ్య సౌధనిర్మాణమునకు బునాది.

ఈసృష్టియం దెవ్వరును నిష్ప్రయోజకులు కారు. విచారించిచూడ, ప్రతివ్యక్తికెద్దియో యొకవిధమగు తెలివితేట లుండుట స్పష్టము కాగలదు. పదవులాశాపిశ్వాసములే కర్మయోగ సాధనోపకరణములయి, ఆత్మగౌరవ శక్తి ప్రేరేపకములయి, ఐహికాముష్మిక సౌఖ్యభండారముల సంపాదించుడు. స్త్రీపురుషు లిరువురును విద్యావినయ సంపన్నులయినపుడే వివాహమాడుట కర్హులయి, ఉద్వాహానంతరము దంపతులనబడుచు గృహస్థాశ్రమ వ్యవహారముల జక్కబెట్టదగుదురు. అనుమతినందనిదే పరవస్తువువైపునకు గన్నెత్తియయిున వీక్షింపకుము. పాపము తెలియకచేసియు ననంతరము పశ్చాత్తాపమునందిన యందర్థభాగము నశించును. ధనతృష్ణావృక్షమూలమునకు బరవసితాగపునద్యూతభోగాది నీచకృత్యంబులే యంబుధవృష్టి జలధారల వంటివి. జలవియోగమును జెందిన మత్స్యము సలిలప్రవేశమునకయి గిలగిల కొట్టుకొనుచుందమునే నీవును జ్ఞానము నార్జింప వ్యాకులచిత్తుడవగుచుండుము. స్వాత్మాభిమానమును బాసి నిత్యము నీనిత్యకర్మల నాచరించిన యనంతరము గురుజనుల పాలికేగి మంచిచెడ్డల గూర్చి తెలిసికొనుచుండుము. పరులపయి నాధారపడక స్వతంత్రవృత్తి నవలంబించి శక్తియున్నంతపర్యంతము బ్రదుకుము. పరజన కృపాకటాక్షలబ్ధామృత భాండముకంటె నీదగు గంజిముంత యుత్తమము. అస్వతంత్రమగు నేనుగుబలముకంటె స్వతంత్రమగు దోమబలమే యుత్తమము. స్త్రీలకు భూషణములు మానసంరక్షణము, మితభోగము పతిసేవ, పరివారపోషణము, భృత్యవాత్సల్యము. పురుషునకు గార్యశూరత్వము, మృదుభాషణము, నిరంతరోద్యోగము స్వకుటుంబసంరక్షణ బాధ్యత మొదలగునవి యలంకారములు. దేశసంఘ జీవపరివారాత్మోద్ధరణ కార్య

సాహాయ్యములు స్త్రీపురుషాదుల కథయులకు భూషణములు. తల్లిదం
డ్రులకు బుత్రుడు స్వర్గము నొసంగునుట కల్ల. జ్ఞానమే ముక్తినొసంగునది.
జ్ఞానములేని వేయిపుత్రుల కంటె జ్ఞానియగు నొక్కకుమారుడే శ్రేయస్క
రుడు. గులాబిపుష్పము తనసుగంధమును దనయందే లుప్తమొనరించుకొనక
మానవాళి హృదయానురంజనమున కుపయోగపడు విధంబున సజ్జనబృందము
తమ సుగుణములను, నీతి నియమములను, జ్ఞానసాధనములను, గుణపాఠము
లను లోకోపకారార్థమే వినియోగింతురు. పదార్థ మితవినియోగమే పదార్థ
సంపాదనము. బ్రహ్మచర్యముచే సత్వరవిద్యాసంపాదనము చక్కబడును.
గురుభక్తి ఛాత్రవిధి. సర్వవిధ శిష్యాభ్యుదయధ్యానము గురుధర్మము.
విద్యార్థికి భౌతికసౌఖ్య మెటనుండును? సుఖార్థికి శాశ్వతానంద దాయకం
బగు విద్య యలవడనేరదు. (విద్యయని యెన్నియోమారులు ప్రయోగించితి.
విద్యయనుశబ్దము ప్రయోగింపబడుచోట్లనెల్ల వివేకమనియు జ్ఞానమనియు
దెలియుడి. విద్య భాషాప్రౌఢిమకుగాని వాఙ్మయచాతుర్యమునకు గాని
సాహిత్యసంపత్తికిగాని పర్యాయవాచకము కాదు) ప్రభుభక్తి పాలితధర్మ
ము ప్రజాహితపరతంత్రత భూపాలుని విహితకృత్యము. మూఢుల యవిద్యా
వ్యాధికి సుజనప్రబోధమే దివ్యౌషధము. భక్తిశూన్యులకు వాసనా నిర్మూలన
ప్రయత్నమే తారకము. జాతిభేదము నిష్ప్రయోజనము. భాగవతుడే దేవ
తాపురుషుడు. స్వార్థతృష్ణ నింద్యము. ఈశ్వరభక్తి చిత్తశుద్ధికిని, ముక్తికిని
సత్సాధనము. ఈశ్వరార్చనము భౌతికభోగముల శోషిల్ల జేయునది. సాధుజన
సేవానురక్తి పరలోకతోషణము నొసంగునది. రాజ్యకాంక్ష దుఃఖదాయక
మయినది. దుష్టుడు శీఘ్రమే నశించును. తిరిగి దుఃఖింప నీచుడయి జననమందు
ను. పరోపకారముచే ఫలము నపేక్షింపకుము. మాతృభక్తి, పితృభక్తి గురు
భక్తి, దైవభక్తి, దేశభక్తి కోవిదభక్తి మానవుల కాదర్శప్రాయములు. మాన
వప్రయత్నము కొండల బిండిపిండిగ గొట్టగలదు. కామాతురుడు భస్మరాశి.
స్త్రీవ్యామోహము పురుషహృదయ నవనీతము పాలిట బ్రచండాగ్నిగోళము.

వనితాచిత్త సరోజమునకు బురుషవ్యామోహము సుధాకరశీతలచంద్రికవంటిది. హితోక్తుల వచించువాని పథము ననుసరింపని మూఢుడు వెల్లగ దల్లడిల్లువాడు. ఎవ్వనికయిన మృత్యువు తప్పదు. పీడనము పీడాకరము, జీవలాలనము పోషణపాలనమే యగును. జ్ఞానశూన్యులగు మాతాపితల ననుసరించి యథర్మ ప్రవృత్తులకు వశుడవు కావలదు. భక్తిజ్ఞానసంపన్నులు కన్నవారికంటె బూజ్యులు. విరక్తిపురుషుని భౌతికప్రపంచ వ్యామోహతరంగము లంటజాలవు. అనాథులకు నాథుడీశ్వరుడె. భక్తహృదయుడొకానొక కాల పర్యంతము కష్టగ్రస్తుడయినను, నీలనీరదమాలికలనుండి విడివడు సుధాకరబింబము వగిది విముక్తుండేయగును. భక్తిసంపన్నుని హృదయము నిర్మలంబగు తటాకము వంటిది అయ్యది విశుద్ధమగు దర్పణంబగు కతన సకలపదార్థముల సత్యాసత్య రూపంబులందున్నవియున్నట్లుగా బ్రతిబింబించును భక్తియనగా విశుద్ధమగు విశ్వప్రేమ లేక ప్రమాదరాహిత్యము. పశుబలప్రయోగరూపంబగు యుద్ధముచే హానియే కల్గును. జయాపజయములను బడసిన యుభయ దళములు దుఃఖమునకే గురియగును.

ఓం సత్యమేవ జయతి, నానృతం!!!

## శ్రీమద్భగవద్గీత

కురుక్షేత్ర సంగ్రామభూమియందు కురుపాండవ సేనావాహినులు ఘోరయుద్ధమునకు సన్నద్ధములయి యుండుతరి, పాండవ చమూయోధాగ్రేసరుండగు ధనంజయుడు బంధుప్రేమభావపరవశతరంగములు చిత్తము నల్లూలలూగించివేయ, విహ్వలహృదయుడయి, సమరకార్య భీరువయి శస్త్రాస్త్రముల విసర్జించినపు డతని మేనమఱందియగు శ్రీకృష్ణచంద్రుడు వానికి గర్మయోగజ్ఞానముల గొలిపి పిదప దక్కుంగల యధ్యాత్మ విషయంబుల సహిత ముపదేశించెను. తదాధ్యాత్మప్రబోధమే భగవద్గీత యన్నుపేర బ్రసిద్ధమాయెనది. ఈగ్రంథము చతుర్వేద వేదాంగోపాంగ పురాణస్మృ

ఇతిహాస సారాంశమందగినది. సృష్టియందిట్టి యుత్కృష్టంబగు నధ్యా
త్మ ప్రబోధకంబగు గ్రంథమదియుంచి యుండలేదు. హిందూమతోద్ధ
రణకును, చిరకాలజీవనమునకిదియే యాధారమన్న నతిశయోక్తి కానేరదు.
ఈభగవద్గీత మహాభారతమందలి యొక్క పర్వమున జెప్పబడినదియే యయి
నను బ్రశస్తంబును, ఉన్నతాదర్శవిరాజితంబునగు గ్రంథమగుటు దీని
యందు వెలయు సిద్ధాంతవాక్యముల గొన్నింటి నిట బేర్కొనుట సమంజ
సమేయని తలంచెద. హిందూమతమునకిదియు గుండెకాయయె.

"కర్మాచరణ సమయమున వ్యామోహమును జెందకుము. జీవుడవి
నాశుడు, వానికి మరణము లేదు. అట్టిశాశ్వతుని మట్టుబెట్టువారెవరు? మను
జుని మలినశుద్ధవసన పరిత్యాగగ్రహణంబులవలెనె, జీవుడు శరీరత్యాగ
స్వీకారముల జేయుచుండును. దేహాంతరకృత్యమునకయి జ్ఞాని ఖేదపడడు.
ప్రాణి, ఆద్యంతముల నవ్యక్తమయి మధ్య వ్యక్తమగుచుండును. జీవుని యీ
వ్యక్తావ్యక్త వ్యవస్థలకు జింతింపనేల? ఆత్మ నిత్య పరిశుద్ధాప్రమేయంబు
గదా! ధర్మపాలనము మానవవిధి. తత్త్యాగము పాపదాయకము; సంతాప
కరము. మానవుడా! కర్మనాచరింపుము. అధైర్యము వలదు. కర్మయోగులును,
వేదాధ్యయనపరులును ఫలాపేక్షాన్వితులగుటచే నాత్మతత్త్వమును దెలియ
జాలరు. వేదములు ప్రకృతిగుణత్రయవర్ణనము సేయుచు, వానినుండి విముక్తిని
బడయ గర్మమే ధర్మమగునని బోధించుచున్నయవి. సమత్వమునకు బాల్పడినట్టి
యు, ఫలాభిలాషాశూన్యమయినట్టియు, వ్యామోహ దూరమయినట్టియు
చిత్తమే కర్మయోగసాధన భాజనము. కామనావిముక్తి, ఆత్మతుష్టి, సుఖ
దుఃఖముల నానందనిరానందత్యాగము. రాగ మద క్రోధ నివృత్తి, అల్ప
తోషణబుద్ధి, వైరానురాగశూన్యత, ఇంద్రియదమనము, ఈశ్వరధ్యానము,
ఇంద్రియ ప్రవృత్తులకు వశమయిన చిత్తమును నిరోధించుట, నిత్యసుప్రసన్న
వదనము మొదలగు సుస్థిరసద్గుణములే జ్ఞానిలక్షణములు. సర్వకామనా విస

యుడు మమతాహంకార వివర్జితుడయి పరమశాంతి నంది, అద్దానిచే మోక్ష మునకు బాత్రిపించును.

కర్మనిరోధమునకును, సన్న్యాసము మోక్షమునకును హేతుభూతములు కావు. రెండును మానవాభ్యుదయకరములే. ప్రకృతిశాసనముచే జీవుడు కర్మాచరణమునకయి బాధ్యుడగుచున్నాడు. కర్మేంద్రియముల నిరోధించి, చిత్తమునందు తిరిగి వానిని ధ్యానించుట నిరుపయోగమె. ఇంద్రియముల వశపఱచుకొని కర్మ నాచరించుటయే సుఖదాయకము. కర్మ నిత్యాచరణ యోగ్యము. అకర్మకంటె కర్మయే యుత్తమము. కర్మలేనిచో శరీరము రక్షింపబడుటయే దుస్సాధ్యము. నిష్ఫలాపేక్షివయి కర్మ నాచరించిన బంధనప్రాప్తి కలుగనేరదు. ఎల్లరు నాత్మతుష్టి యుతులయి కర్మాచరణమునకు గడంగవలయును. మనుజుడా! లోకశ్రేయోభిలాషివయి కర్మణ్యుడవగుము. మహాత్ములు కర్మసల్పుచో, జనసామాన్యము వారి ననుసరించును. జ్ఞానులకును, అజ్ఞానులకును లోకకల్యాణము నపేక్షించిన వారి నేకమాత్రశరణ్యము కర్మయే. సమస్తక్రియాకలాపములు ప్రకృతిగుణములచే గలుగుచున్నవి. మనుజులేమి చేయుచున్నారు? ఇందువలన జ్ఞానులెల్లరు ఫలము నాశింపక కర్మచే మోక్షము నందదగును. పురుషులు తమస్వభావానుగుణ్యముగ కర్మ సేయుచున్నారు. రాగద్వేషములు, సుఖదుఃఖములు నింద్రియ విషయములందు వెలయుచున్నవి. వీనినే వశము జేసికొనదగును. పరధర్మకర్మములకంటె స్వధర్మకర్మములే ప్రశస్తములయినవి. వీనికయి బలిదానమగుము. భయమువలదు. రజోగుణ సముద్భవంబులగు కామక్రోధములే మానవునకు బరమశత్రువులయి, వానిమనోబుద్ధీంద్రియముల బ్రవేశించి జ్ఞానము నాచ్ఛాదించి వేయుచున్నవి. తత్కామక్రోధము లాత్మచే నింద్రియమనోబుద్ధుల జయింప, భస్మములయి పోవును. కారణమేమన నాత్మయే సర్వోన్నతమయినది.

ధర్మము లోపించి, అధర్మమభివృద్ధి జెందినప్పుడు పరాత్పరుడు నిజ మాయాపరిభావమున భువినవతరించి శిష్టరక్షణము, దుష్టశాసనము జేసి ధర్మ సంస్థాపనము గావింపుచుండును. ఈశ్వరీయ జన్మ కర్మతత్త్వమును గుర్తెఱిగి, రాగభయక్రోధ విముక్తుడయి సర్వేశ్వరార్పిత చిత్తుడయి వర్తించువట్టి జ్ఞాని మోక్షము జెందును. ఎట్లు భజించువాని కట్లే సర్వేశ్వరుడు ప్రసన్నుడగును. సకలపథములు దయామయుని యందే పోయి చేరును. చాతుర్వర్ణ్యములు గుణకర్మవిభాగము ననుసరించి జగన్నియంతచే సృజింపబడినవి. కర్తవ్యా కర్తవ్యంబుల భేదంబు నెఱింగి నిష్కామకర్మోన్ముఖుడగు వాడు పండితుడు లేక జ్ఞాని. ఫలాకాంక్షా విరహితుడు సర్వమాచరించియు నాచరింపనివాడౌ. అనాసక్తమగునదియే వాసవికమగు కర్మ. ఇదియే బంధనవిచ్ఛేదకారిణి. యజ్ఞము లనేకవిధములు కాని యజ్ఞములకెల్ల జ్ఞానయజ్ఞమే సర్వమాన్యమయినది. సమస్తకర్మకలాపము లీయజ్ఞములోడనే సమాప్తమగును. ఈజ్ఞానము జ్ఞానుల సేవ, కృప, సంవాదము మఱియు నుపదేశమువలన లభించును. ఈజ్ఞానము లభించినవానికెల్ల జీవములు స్వాత్మసదృశము కలుగ బ్రతీతమగును. సకలాఘములు మటుమాయమగును, శ్రద్ధాళుడు, దయాళుడు, పరాత్పర విశ్వాస గతజీవుడు జితషడ్గుణుడు జ్ఞానమునకు బ్రాపించి చిరశాంతిని బడయును. జ్ఞానయోగము సకలపాపవిధ్వంసకారిణి. నిఖిలసందేహ నివారిణి, మోక్ష దాయిని నైయున్నది.

కర్మసన్యాసములు రెండును మోక్షదాయకములే యయినను సన్యాస మకంటె గర్మయోగమే యుత్తమము. సన్యాస కర్మ యోగములు పృథక్పృథార్థములు కావు. సన్యాసిపదయుస్థానమునే కర్మయోగియు బొందును. కర్మయోగములేనిదే సన్యాసమును సాధించుట కష్టసాధ్యము. కాని కర్మయోగి సత్వరమోక్షగామియగును. కారణమేమన కర్మయోగి యనాసక్త భావముతో సమస్తము నాచరించును. అనాసక్తతయే సన్యాసముకదా! ఇంక రెంటికీ భేదమేమి? కర్మయోగీశ్వరుని చిత్తము సదావశమునందుండ

ఇంద్రియములు కర్మ నాచరింపుచుండును. ఇట్టికర్మయోగి నిరంతర బంధన విముక్తుడనియు శాంతుడనియు వేలుగనుడువవలయునా? శరీరముయొక్క కర్తవ్యములను సాంసారిక కర్మలను సర్వాంతర్యామియగు నాదేవుడు సృష్టించుటలేదు. అతడు మన సుకృతదుష్కృతములతో నెట్టిప్రయోజనమును గలిగియుండడు. వీనికన్నింటికి నా దేవుడే కర్తయని మనమజ్ఞానవశంబున భ్రమించుచున్నారము. మానవుడే సంపూర్ణజ్ఞానమును బడయునంతపర్యంతము నాత్మశుద్ధి నిమిత్తము కర్మసలుపుచునే యుండును. సంపూర్ణజ్ఞాన ప్రాప్త్యనంతర మతడు దైవము కర్మము సేయుటలేదనియు నది ప్రకృతిచే సలుపబడుచున్నదనియు గ్రహించి కర్మను విడనాడును. జ్ఞానోపలబ్ధిచే సర్వేశ్వర సాక్షాత్కారము, అజ్ఞానరాహిత్యముచే బునర్జన్మనివృత్తి కలుగుచున్నవి. జ్ఞాని సర్వమును సమవృష్టిలో వీక్షింపుచు స్థితప్రజ్ఞుడయి భగవత్పదార్థమును భావించి సుఖించును. ఇంద్రియభోగ పరిణామమె దుఃఖము. జ్ఞాని వాని నుండి విముఖుడయి చిత్తరిపువర్గమును నిర్జించి బ్రహ్మనిర్వాణమును బడయును. బ్రహ్మచర్య వ్రతపాలనము సలుపుచు నేత్రియుగ్మమును (దృష్టి) కను బొమలనడుమ స్థిరీకృతమొనరించి, ఉచ్ఛ్వాసనిశ్వాసముల సమము జేసి, మనోబుద్ధీంద్రియముల స్వాధీనపఱచికొని రాగ భయ క్రోధములవిసర్జించి దైవధ్యానము సేయువాడు మోక్షము బడయును.

స్వోన్నతికి మనుజుడే కర్త. ప్రకృతిని జయింపవచ్చు. మారజిత్తు కదా యోగి! యోగి శాంతుడు, సమదృష్టి, బ్రహ్మచారి, జ్ఞాని, దాంతుడునయి యుండవలయును. ధ్యానప్రభావమద్భుతము. తాదాత్మ్యమున కిదియ మూలము. చంచలుడెట్లు యోగికానేర్చును? ప్రకృతికి బంచభూతములు, మనోబుద్ధ్యహంకారములు నను ఎనిమిది శాఖలుకలవు. మాయను జయింప శేషించినది దైవమే. ఈశ్వరనామస్మరణ ముత్తమ ఫలదాయకము. భక్తిపథమె రాజమార్గము. జగత్తునకు దండ్రియు, దల్లియు, బ్రభువును ననుసర్వాంతర్యామికి సకలజీవములు సమములె. సర్వమహిమలకు, విభూతులకు దేవుడే కర్త. చరా

చరాత్మక ప్రపంచమందలి తేజము భగవదంశమే. వ్యక్తావ్యక్తోపాసవ లొక్క గతికి జెందినవె. వ్యక్తముకన్న నవ్యక్తము మిన్నయయినను యొకింత కష్టసాధ్యము. భక్తి అనాసక్తి నొదవించి మోక్షము నొసంగును. ఆత్మయే పరమేశ్వరుడు. క్షేత్రక్షేత్రజ్ఞుల (దేహాత్మలు) గ్రహించినవానికి బునర్జన్మ లేదు. సకలప్రాణుల నాయభవుడే ప్రకృతిచే సృజియింపుచున్నాడు. సకల జీవుల ప్రేమింపుచు ద్వంద్వముల జయించి ముక్తుడవగుము. సంసారవృక్షమునకు సర్వేశ్వరుడే మూలము. త్రిలోకముఌ, శాఖలు, వేదబుక్కుఌ, పత్రముఌ, విషయము కలిక, కర్మబంధనము లుపమూలములు, గుణవంతుడు నీరుపోయువాడు. ఈసంసార మహాభూరుహమును నిస్సంగ ఖడ్గధార కిర గావించి ముక్తిని బడయుము. రజస్తమోగుణసంపత్తి బంధనమును, సత్వగుణ సంపత్తి ముక్తిని బ్రసాదించును. శాస్త్ర నను సరించియే మానవజీవిత నిర్మాణ మగుచుండును. కర్మఫలాపేక్షాశూన్యుడే త్యాగియనబడును. నిస్సంగుడే సత్కర్మ నాచరింపగలవాడు. సత్కార్యములందు జూపబడు సాహసమే యధార్థమగు సాహసము. శమము, దమము, తపము, శుద్ధి, సాధుత్వము జ్ఞానము, విజ్ఞానము దైవభక్తి మొదలగు నివియే బ్రాహ్మణధర్మముఌ. శరణాగతజీవపరిత్రాణకర్త యొక్క సర్వేశ్వరుడె. ఇది విస్మరింపవలదు.”

ఓంతత్సత్ !!

ఇంత సెంతయో సారము భగవద్గీతయందు కలదు. కాని యుపోద్ఘాతవిస్తరభీతిచే వ్రాయ టనుచితంబని యెంచితిని.

## పురాణములు.

కొన్ని కల్పిత గాథలచే నిండియుండుటచే వీనినే మన భ్రాతలెల్లరు బుక్కుటి పురాణములని వక్కాణింపుచు నవహ్యంచుకొనుచున్నారు. ఉన్నతి నందగోరువారివిధి యిదికాదు. సృష్టియందు మేలికీడులతో నిండియుండని పదార్థమేదికలదు? జననమరణములే సాక్షి. “జీవితకాల మత్యల్పము. కాలము బ్రహ్మస్వరూపంబని యెఱింగి జ్ఞానోపార్జనకయి వినియోగింపుము. పుట్టునవన్నియు గిట్టునవియే, సచ్చరిత్రమునకు వివేకమావశ్యకము. సంసారము

కిల్బిషమయము, దానిని దరింప ధర్మమావశ్యకము. ధర్మమే జీవితసారము. సా-
ధువు దీనినే ప్రేమించును. బుద్ధిమంతుల మోసగింపకుము. మానవులు విశే-
షించి చపలచిత్తులు. అగ్ని బాలునిసయితము స్పృశించినంతనే కాల్చు
విధంబున నజ్ఞానముచే సలుపబడిన పాపమునకును దండనముండియే తీరును.
మంచిచెడ్డల విచారించి కర్మమాచరింపుము. పశుపక్ష్యాదులకంటె మనుజులు
జ్ఞానముందే యధికులు. దేవుడు సర్వవ్యాపకుండని యెఱింగి సకలజీవకోటుల
విశుద్ధప్రేమమయదృష్టిని వీక్షింపుము. సమభావస్వీకృతి మానాపమాన
ముల పటుత్వమును సడలజేసి, నిర్మూలించును. అప్పుడు కలిమిలేములు, కష్ట
సుఖములు సమములేయగును, పాపపుణ్యముల ఫలము లవశ్య భోక్తవ్యములు.
బ్రహ్మము నెఱుంగుట కేర్పడిన సత్సాధనమే విద్య. దురాశా దంభమత్స
రము లానందకుసుమములందలి కీటకములు. దుర్వృత్తులు, దుర్గుణములు, దుర
భిప్రాయములు జీవితమును గళంకితమొనర్చును. పుణ్యాత్మునితోడి సుఖ
ముల నొదవజేయునది. పాపులమార్గము భయంకరమయినది. సుఖాసక్తిచే
మనుజులు ప్రకృతియొక్క దృఢతరపాశములకు జిక్కి శాశ్వతసుఖమునకు
నీళ్లు వదలుకొనుచున్నారు. నిద్ర, జాగ్రత్త, సుషుప్త్యవస్థల మనుజుడప్ర
మత్తుడయి వర్తింపదగును. వినయము ఆత్మసమర్పణము, విశ్వప్రేమ భక్తి
కావశ్యకములగు పరికరములు. కష్టపడి పనిసేయనిదే యారగింపరాదు. దేహ
పరిశ్రమ మావశ్యకము. శీతలజలస్నాన ముత్తమము. సాయంకాల వాయుసే
వన మానందదాయకము. స్త్రీపురుషులు సాయంతనము వాహ్యాళికేగుట లాభ
దాయకము, దానము బ్రాహ్మణునకే కాదు. దురవస్థయందున్న ప్రతిజీవికి
సేయదగును. అహింస, సత్యము, దయ, శాంతి యివియే మానవధర్మముల
లోనికెల్ల నుత్తమములు. పరధన వనితాసక్తి, మద్యపానము మొదలగు
దుర్వ్యసనములన్నియు నింద్యములు. బ్రహ్మచర్యమునకు బ్రథమసోపాన
మింద్రియ నిగ్రహము. సన్యాసియగువాడు దురభిమానమును బాసి, నిర్లోభి

యయి, నిస్సంగుడయి మాధుకరవృత్తిచే జీవితయాత్రనే యుదగును. పుణ్య పురుషుల చరిత్రబోధనములు సత్యమార్గమును జూపించగలవు."

అహింసా పరమోధర్మః,

## నీతిగ్రంథములు.

బాల్యకాలమునందే విద్యనభ్యసింపనివాడును, జీవితకాలమునందు ధర్మము నాచరింపనివాడును వ్యర్థుడు. ఉత్తమపురుషుని అనుత్తమునిగు సహజము ప్రేమచే జయించుము. గొనములేనివాడు తావిలేనిపూవు. సోమరికి విద్య లభింపదు. విద్యలేనిదే యిహపరములు సాధింపబడవు. బాలకునకు రోదనము సాహాయ్యము. మూర్ఖునకు మానము లక్షణము. చోరునక సత్యము సాహయ్యము. సృష్టియందు దోషములు లేకపోలేదు. వ్యాధిలేనివాడెవడు? దుఃఖమెవరిని బాసినది? ఎల్లప్పుడు సుఖమెవరికుండును? అతిగర్వముచే రావణుడు హత్యగావింపబడియెను. ప్రియవాదికి రిపుడు లేడు. ఉద్యోగికి భారమేదియు లేదు. జ్ఞానికిబంధువులులేని స్థలమే లేదు. విద్వాంసునకు బరస్థానము లేదు. కర్మవీరుడు దరిద్రుడు కాజాలడు. యోగికి బాపములేదు. జాగ్రదవస్థయందు స్వప్నముండనిచందమున మౌనముచే గలహములేకుండబోవును. దయాశూన్యంబగు దేశమును, విద్యాశూన్యుండగు నుపాధ్యాయుని శీఘ్రము వదలివేయుము. దానముచే దారిద్ర్యము నిర్మూలమగును. సుందరస్వభావముచే దుర్బుద్ధినశించును. బుద్ధిచే నవివేకము పటాపంచలమగును. పరదేశమున విద్యయే మిత్రుడు. ఇంటియందు భార్యయు, రోగికిమందును, మృతునకు జ్ఞానమును మిత్రులు. క్షుధతో సరివచ్చు శరీరదుఃఖము, విద్యకు నీడగు దేహాలంకారము చింతాతుల్యమగు శరీరశోషణము, ఓర్పునకు దుల్యమగు కాయరక్షణమును లేవు. విభవ మస్థిరము. మృత్యువు ప్రతిజీవికి దప్పనియవస్థ. తృణరహితమగు భూమి నగ్ని నష్టపఱుపజాలని విధంబుననే సజ్జనుని దుర్జనుడేమి సేయగలడు? క్షణమందు హర్షము, క్షణమున గ్రోధముకలవాడు భయంకరుడు. ఉద్య

మము, సహనము, పరాక్రమము, బలము, బుద్ధి, ధీరత్వము మొదలగు షడ్గుణముగలవానికి దేవుడయిన భయపడు ననవచ్చును. ఎంతలాభము కల్గుచున్నను మూర్ఖుని స్మరింపనయిన దగదు. దుష్టుని జిహ్వాగ్రమున సుధారసమును, హృదయభాండమున హాలహలపూరితంబునయి యుండును. భూపాలుని కంటె విద్వాంసుడుత్తముడు. మనుష్యుడు విద్యాసంపాదన కాలమందు దన్నొక యజరామరునిగను, ధర్మమాచరించునపుడు మృత్యువు నెత్తిమీదనే యున్నట్లును భావింపవలయును. విద్య కనభ్యాసము కళంకము. అదృష్టాదురదృష్టముల దలంచుచు బ్రయత్నము బాయుటము. అదృష్టవిశ్వాసము ప్రమత్తుల లక్షణము. భాగ్యభాగ్యముల నిర్మూలించి స్వయంకృషికి గడంగుము. దరిద్రులు నారాయణస్వరూపులు. దరిద్రనారాయణుల బ్రేమించువారు ధన్యులు." ఇట్టివే యింకనెన్నియో కలవు.

## దర్శనములు.

ఇవి సంఖ్యయం దారు. వీని నేశాస్త్రములనియు నుడువుదురు. కపిలుడు సాంఖ్యశాస్త్రమును, పతంజలి యోగశాస్త్రమును, గౌతముడు న్యాయశాస్త్రము (ధర్మశాస్త్రము) ను కణాదుడు వైశేషికశాస్త్రమును, జైమిని పూర్వమీమాంసను, వ్యాసుడు ఉత్తరమీమాంసను రచించిరి. వ్యాసకృతోత్తర మీమాంసకే వేదాంతసూత్రములనియు, బ్రహ్మసూత్రములనియు మారు పేళ్లుగలవు. సాంఖ్యదర్శన ప్రధానోద్దేశ్యము లివియు;—చేతనజడములగు దేహాత్మలు విచారింపదగినవి. దేహాదికమగు సర్వప్రపంచము ప్రకృతిసంభూతమే గాని జీవకృతము గాదు, దేహమందాత్మ దటస్థుడయి, నిమిత్తమాత్రమయి యుండి మోక్షతరుణమున దేహగేహము బాసి చనును. అనాదులును, స్వయంభువులును నగు నీయాత్మప్రకృతులు స్వతంత్రశక్తి లేక పరస్పరబద్ధములయి యొప్పుచుండును. ఈదర్శనమున సర్వేశ్వరుని గూర్చిన రహస్యములు లేవు. యోగశాస్త్రమునందు దేహారోగ్యప్రాప్తి నిమిత్తమే ప్రాణాయామాదులు సేయుటకు పద్ధతులు వ్రాయబడియున్నవి. న్యాయ

శాస్త్రము వాస్తవికజ్ఞానోపార్జనకు సాధనములగు ప్రత్యక్షానుమానోప
మాన ప్రమాణముల బరపక్షసిద్ధాంత ఖండనమునే యుచు, స్వమతస్థాపనమును
జేసికొనినది. ఇందు సకలవస్తుస్వరూపాదులు నిశ్చయింపబడినవి. ఈ కారణ
మువలననే దీనికి తర్కశాస్త్రమను మారుపేరుగూడ గలదు. వైశేషికము విశేష
మాగా న్యాయశాస్త్రమునే యనుసరింపుచున్నను, పరమాణు సమ్మిశ్రణంబునే
ఘటియింపుచున్నదనియు, ప్రళయాంతమున సృష్టి యణురూపంబును దాల్చు
ననియును నుడువుచున్నయది. ఇది దేవుని దలపెట్టలేదు. పూర్వ మీమాంస
నిత్యకర్మాచరణంబున ముక్తి లభించుననియు బోధింపుచున్నది. ఇందు వేద
వాక్యములకు యథార్థార్థములు వ్రాయబడియున్నవి. ఉత్తరమీమాంస యను
బ్రహ్మసూత్రములు జీవేశ్వర సంబంధీయములగు సూక్ష్మసూత్ర రహస్యముల
దెలుపుచున్నవి. ఆత్మానాత్మ వివేచన మిందు వివరింపబడియున్నది. యుక్తివా
దమునకిది యాటపట్టు. బ్రహ్మమే సత్యము, జగత్తు మిథ్య, జీవేశ్వరులకభేదమే
సత్యమను విషయము లిందు నిర్ణయింపబడినవి. ఈషడ్దర్శనములు వేదావలంబి
తములగు నుపనిషద్బృంహితములై, ఆర్షమతదివ్యదీప్తికివియు నాధారములై.

వేదోపదిష్టమగు నార్షమత మిట్టిపవిత్రగ్రంథజాలముచే దీర్ఘకాల
పర్యంతము సుజ్ఞానము నొసంగుచు, భారతవర్షమునేగాక సమస్తదేశమత
జాలసంకుచిత హృదంబుల విశాలవంతములుంగ జేసి మించినది. కరుణా
మయంబును, శాంతిరస పరిప్లుతంబును, విశ్వప్రేమ సుస్నిగ్ధమంజుల జ్యోతిర్వి
భాసితంబును నగు జీసస్సు, మహమ్మదు, ధర్మప్రవక్తల దివ్యాత్మసందేశ
మీ ప్రాచీనార్షమత భవ్యజ్యోతిమండిమే బహిర్గతమయినది. ఉపయుక్తము
లగు ధర్మసిద్ధాంతములను, గుణపాఠములను, నీతిమాత్రములను, సద్భావము
లను నిరంతరము వల్లింపుచు, త్రికరణంబుల నాచరింపుచు భరతఖండమునకు
దీర్ఘకాలము [illegible]తించెను. అనంతరము మన యీ దేశమున ద్వేషభూయిష్ఠమును
భిన్నాభిప్రాయయుక్తంబును, అనైక్యతా సూచకంబును నగు సభ్యత ప్రబలి
పామరపండితులెల్లయ నధ్యాత్మ విద్యా తర్క వితర్కక్షేత్రముల బ్రాగ్గ

నుచు, మతమునకెల్లరు గర్తలేకావచ్చునను మిథ్యాభిమాన ప్రేరితులగుచు భౌతికపారమార్థిక నియమంబులెల్ల ద్రోసిపుచ్చి, ఇచ్చవచ్చిన తెఱంగున వర్తింపుచు, నీతి, ధర్మజ్ఞాన సంకరముజేయుచు మతగ్రంథముల వెలయు రూపకాలంకార యుక్తవిషయములకు విపరీతార్థముల గొనుచు హిందూమత ప్రాశస్త్యము దూషితమొనరింప దొడఁగిరి. పురాణములను, సదుద్దేశప్రేరితులయి ప్రాచీనబుధులు నిజాభిరుచుల ననుసరించి వ్రాసియుండ, దదంతర్గతములగు గాథల నిరాధారవిషయంబులనే భారతీయులు జీవితతరణో పాయంబులని భ్రమింపఁదొడంగిరి. పూజ్యాపూజ్య గ్రంథతారతమ్యము నశించెను. వర్ణవ్యవస్థ లపుడు బ్రిబలెను. జాతిద్వేషములు హెచ్చెను, చిత్తశౌచశూన్యములగు మూర్తిపూజలె ముక్తికి మూలమయ్యెను. తాంత్రికమాంత్రికులే నాడు ధర్మప్రవక్తలు. తత్సమయ హిందూమత శైథిల్యమును, వికృతాకృతిని విపరీతధర్మ సిద్ధాంతాదర్శమును చదువరీ! రమ్ము! ఒకసారి విలోకింతము!

## హిందూమత శైథిల్యము.

ఆహా! కొన్నివేల యేండ్లదనుక విశాల విశ్వమత సామ్రాజ్యము నేకచ్ఛత్రాధిపత్యముగ బరిపాలింపగలిగిన హిందూమతము పౌరాణికయుగంబున నెట్టి హ్రస్వభావసముదాయంబునకును, భేదాత్మక నైతికాదర్శమునకును, నైజప్రతికూలకథాకల్పనా చాతురికిని, చిత్తశౌచ శూన్యతా సూచక బాహ్యానుష్ఠానంబులకును గేంద్రస్థానమయినది!! మతము మానవనిర్మితంబుగదా! దిన నీతిపరివర్తనము కాలపరిభావంబున గలిగెనని వక్కాణింప వలనుపడదు. బుద్ధిననుసరించియే సర్వము నిర్వహింపబడుచుండును. కర్ణధారిహస్తగతము చుక్కాణి ననుసరించియే నౌక నడచుచుండును. కాలఘటనాచక్రంబున బడి సకలపదార్థములు స్వభావ విరుద్ధములగుచుండుననియు, నోడలు బండ్లును, బండ్లోడలును నగుచుండునని లోకులు భావింతురు. ఈరీతి గాలచక్రంబును దూరుచు సృష్టివైలక్షణ్యమున కబ్బురపడువా రెంతటి వెర్రివెంకటాయలు! కాలమును దూరదగదు. మనబుద్ధియే విశ్వమున భయంకరానంద

మయుపరిస్థితుల గల్పించుచుండును. ఉల్లమా! నీవును బేలవయి కాలమును దూలనాడకుము. త్వదీయసోదర మానవుల యద్భుతచర్యలే, యపూర్వభావములే భారతీయ వైదికమతమున కింతటి దురవస్థను గల్గించినవి. పాఠకమహాశయా! క్రీ. పూ 10 లేక 15 వందలయేండ్లకు దొలుత హిందూమత మిట్టి దుస్థితికి జాల్పడి వికృతాకృతిని దాల్చినదియు నీదిగువ గ్లుప్తముగా నుదహరింపబడిన విశేషాంశముల శ్రద్ధతోడ వీక్షింప నభిలషింతు:—

క్రీ. పూ 4 వేల వత్సరములకు బూర్వము వైదికమతము ప్రారంభమయినది. అయ్యది స్థాపింపబడిన దాదిగ రమారమి రెండు వేల యైదు వందల సంవత్సరముల పర్యంతము పరిశుద్ధాదర్శముతోడనే భరతఖండమున వెలసియుండెను. అనంతరము మతముయొక్క శుద్ధాదర్శ హృదయము విశేషముగా నశింప మతకళేబరమే శేషించి జనసామాన్య ప్రేమభాజనం బయ్యెడిని. అనగా క్రీస్తుశకప్రారంభమునకు 14 వందల యేండ్లకు బూర్వమే హిందూమతము కల్పితగాథలకును, కర్మకాండాధిక్యతకును, జాతిభేదములకును, మతసాంప్రదాయ విభజన సంస్థాపనములకును బుట్టినిల్లయి యుండెనని యూహింపవలసియున్నది. మూడు వేల సంవత్సరములకు బూర్వముసుండియు హైందవ జనసామాన్యము (హైందవులు, భారతీయులన నిఖిలభరతఖండవాసులకు జెల్లును గాని నాభావమిట వైదికమతావలంబులనియె.) చే నిప్పటివరకును మహోత్కృష్టగ్రంథరాజములుగ, అత్యుయజ్ఞాన నిధులుగ భావింపబడుచున్న రామాయణ భారతాష్టాదశపురాణముల యందలి గాథలయం దొక్కటియు వేదాదుల యందు గానరాకున్నవి. పురాణముల జెప్పబడియున్న కథల బ్రధానపాత్రముల ధరించియున్న వ్యక్తుల నామధేయంబులన్ని వేదముల యందున కయిన గోచరించుటలేదు. జ్ఞానవిజ్ఞానధనులగు మనప్రాచీన ఋషివరేణ్యులు ప్రాథములును, నిగూఢములును నగు రూపకాద్యలంకారములతో గూడిన భావయందు భౌతికశక్తుల నుతించియున్న స్తోత్రపాఠములనే, యనంతరకాలమందు గొందఱు ఋషులును, బండితులును, కవితాసంపన్నులును నగువారి

ల్లరు సత్యములగును వ్యాఖ్యానములగును నాఖ్యాయికలుగను గల్పించి ప్రజాసామాన్యమున బ్రచురించియుండిరి వేదములయందు సూర్యుడు, ఇంద్రుడు (మేఘాధిపతి) వాయువు, రుద్రుడు (మేఘగర్జనము) అగ్ని మొదలగు ప్రత్యక్షభౌతికశక్తులను నెల్ల బురుషరూపంబులుగను, ఉషస్సు (ఉషఃకాలము) సరస్వతి (ఒక నది) సింధు (నది) అహల్య (నిశాకన్య) సంధ్య (సాయంతనము) మొదలగువానిని స్త్రీరూపంబులుగను, దేవీదేవతలారా! యని సంబోధించి వానిని యుపకారగుణగణాదుల సంస్తుతింపుచుండెడివారు. ఈభౌతికశక్తులకన్నింటికి నాదివిరాట్టగు సర్వేశ్వరుండొకడు కలడని యావైదికఋషుల సంపూర్ణ విశ్వాసము. ఇవియును గాక రక్షకుడు, సర్వవ్యాపకుడు, సర్వాధికుడను నర్థములతో బ్రహ్మయనుపదమును, జగదాధారుడు; సర్వపాలకుడను నర్థములతో నింద్రుడను పదమును, సర్వాంతర్యామి, సర్వవ్యాపకుండను భావముతో విష్ణువనుశబ్దంబును, దుష్టశిక్షకుండను దాత్పర్యముతో రుద్రుడను పదంబును, మంగళమయుండను నర్థముతో శివుడను శబ్దంబును, అవినాశియను నర్థముతో నక్షరుండను పదంబును, స్వయంప్రకాశకుండను దాత్పర్యముతో స్వరాట్టను పదమును, మృత్యువునకు గాలమనుభావముతో గాలాగ్నియను పదమును, సంపూర్ణుండను నర్థముతో సుపర్ణుండను పదమును, గొప్ప స్వరూపముగలవాడను భావముతో గరుత్మానను శబ్దమును వాయువు వలె నపరిమిత బలాఢ్యుండను నాశయముతో మాతరిశ్వుడను శబ్దమును, సమస్తభూత జీవులకు నుత్పత్తిస్థానమను నుద్దేశ్యముతో భూమియను శబ్దమును మన ప్రాచీన వేదనిర్మాతలగు ఋషీశ్వరులేకేశ్వర సంస్తవ పాఠంబులకయి సామవేదంబున బ్రయోగించియున్నారు. నియుక్తమునందీ పాఠరహస్యంబులన్నియు దెల్లమొనరింపబడి యున్నవి. అంతరార్థములచే నొప్పు నీవివిధ శబ్దములే ప్రాచీన భారతీయేతిహాస పురాణోక్త కల్పితగాథాసామ్రాజ్యనిర్మాణమునకు బునాదులగు టెంతయు శోచనీయము! రెండువేల యేనూరు వందల సంవత్సరముల ప్రాంతమున శ్రీబుద్ధదేవావిర్భావసమయమందు

కర్మకాండము, హింసాప్రాబల్యము, కల్పితగాథా ప్రాముఖ్యము. వర్ణాచార పద్ధతులు, పౌరోహిత్య ప్రాకారణమంత్ర తంత్రములు ఘోరముగ బ్రబలి యున్నవని వివేకానందాదులు నుడివియేయున్నారు. ఇప్పటికి మూడు వేల సంవత్సరములకు బూర్వమెపుడో రామాయణ భారతపురాణములు విరచింపబడి యుండవచ్చును! పురాణములు ముందా? రామాయణభారతాదులు ముందా? యను విషయము సందేహాస్పదము. వానిగాథలెట్లున్నవో, భూతకాల సత్యాన్వేషణోపకరణములగు చరిత్రాంశములను నష్టస్థితినే వరించియున్నవి. పురాణములూహింపశక్యము గాని కాలచక్రమును యుగచతుష్కంబుగ విభాగించి ప్రథమయుగమగు కృతమునకు 17 లక్షల 20 వేల సంవత్సరములను త్రేతకు 12 లక్షల 96 వేల సంవత్సరములను ద్వాపరకు 8 లక్షల 64 వేల సంవత్సరములను, కలికి 4 లక్షల 32 వేల వర్షములను విధించియున్నవి. శ్రీరామచంద్రప్రభువు త్రేతాయుగమునాటివాడని పురాణోక్తి సిద్ధాంతము. పురాణకథనమును విశ్వసించిన రఘురాముడిప్పటికి రమారమి పదిపండ్రెండులక్షల సంవత్సరములకు దొల్లింటివాడని యూహింపవలసి వచ్చును. ఈ పండ్రెండులక్షల యతీతకాల సన్నిధిని వైదికయుగము నిన్నమొన్నటిదే యయిపోవును. పురాణములచే జేయబడు గతకాలసత్య పరిశీలనా కార్యసిద్ధి మృగతృష్ణచే దీర్చుకొనబడు దాహోపశాంతివంటిదే యగును. మహాభారతయుద్ధము ద్వాపరాంతమున సంఘటించినటుల మనగ్రంథములు నుడువుచున్నయవి. ఈగణనమునే విశ్వసించిన రామాయణ భారతయుద్ధముల మధ్య యేడెనిమిది లక్షల సంవత్సరముల కాలభేద ముండి యుండెనని భావింపవలసి వచ్చుచున్నయది. రామాయణమున శ్రీరామచంద్ర పాదారవిందభక్తుడని యొప్పిన శ్రీమదాంజనేయుడే పారిజాతపుష్పమునకయి త్రివిష్టపస్థిత నందనోద్యానమున కరుగు భీమసేనునికి మార్గమధ్యంబున దర్శనమొసంగి ధనంజయుని రథోపరిభాగంబున జయధ్వజమును గేలంబూని యుపవిష్టుండ నగుదునని నుడివియున్నటుల

భారతము నుడువుచున్నయది. దీనిచే హనుమంతునకు నేడులక్షల వత్సరములు
ప్రాయముండి యున్నటుల దెలియవలసి వచ్చుచున్నది. రామాయణ కాల
మందు శ్రీరామచంద్రుని దశరథబృందముచే, తాతా! తాతా! యని
పిలువబడుచుండిన వృద్ధుడగు జాంబవంతుడే ద్వాపరయుగాంతమున ఘటి
యించిన భారతయుద్ధమున ముఖ్యుడయిన శ్రీకృష్ణునితో నరణ్యమున ఘోర
ముగ బోరి యోటువడి నిజపుత్రికయగు జాంబవతిని గోపాలకృష్ణున కిచ్చి
వివాహ మొనరించి పురస్కారరూపంబుగ శ్యమంతకమణిని బ్రసాదించి
యున్నటుల మహాభారతము వచించుచున్నయది. త్రేతాయుగమున శ్రీరాము
నితో ఢీకొనిన పరశురాముడే ద్వాపరయుగమున నుండిన భారతవీరుడగు భీష్ము
నితో నంబాంబాలికల విషయమున ఘోరముగ యుద్ధ మొనరించినటుల భార
తము తెలుపుచున్నయది. ఈవిషయము లెట్టి యసందర్భములుగను, బ్రకృతి
విరుద్ధములుగ నున్నదియు బాఠకులే యూహించుకొనియెదరు గాక!

ప్రాచీన వైదికమతాదర్శమును దూషిత మొనరించియున్న కల్పిత
గాథలగొన్నింటి మచ్చునకయి వినుడు! రామాయణమున దయార్ద్ర హృద
యుండును, మహాపురుషుండును, నిస్స్వార్థుండును నగు శ్రీరాముడు మహా
జ్ఞానియగు శంబుకఋషిని వధించెనని వ్రాయబడియున్నది. ఇది యొక కల్ల. రాము
ని పేరిట స్వార్థులు కావించిన కుతంత్రమిదియె. జ్ఞానసంపన్నుండగు దశరథ
రాముని పాదరజోలేశస్పర్శమాత్రంబున పాషాణ మహల్యయను స్త్రీ
రూపమును దాల్చెనట, నిదియు బ్రకృతి విరుద్ధమగు విషయమె. జాతిభేదంబు
లేక, అల్పాధిక భేద భావమును బాసి నీచజాతీయుడగు గుహుని, శబరిని బ్రేమ
విహ్వల హృదయంబుతో నాలింగన మొనరించుకొని యుండిన విశ్వజీవ
కరుణారస పరిప్లుత సద్హృదయమూర్తి శ్రీరామచక్రవర్తి నీచకులమున
జన్మించి జ్ఞానముచే బ్రాహ్మణుడయిన వాల్మీకి విరచిత రామాయణమును
స్వీకరించెననియు, బాల్యకాలమాది బ్రహ్మచారియయి, మహాభక్తుండన
గణుతికెక్కిన హనుమంతునిచే వ్రాయబడిన రామాయణమును నామకా

బ్రాహ్మణ దుష్ప్రబోధమునకు వశుడయి సాగరమున బడవేయించెనని వ్రాయబడుటయు మిథ్యాభాషణమె. భారత భాగవతముల నధ్యాత్మవిదుండును, మహాకవీశ్వరుండును, జ్ఞాననిధియు నగు శ్రీకృష్ణచంద్రుని వెన్నదొంగయనియు, స్త్రీలోలుడనియు, గామాంధుడనియు వచించుట మహామౌఢ్యము. పరిశుద్ధహృదయుండును, నిర్వికారుండును, నిరంజనుండును, నగు సర్వేశ్వరుడు బ్రహ్మయను నామంబున వెలసి తుచ్ఛాతితుచ్ఛులును, నిత్యసంభోగోపజీవులును నగు నింద్రాది దేవతారాధనముల కెటనో స్వర్గపురి నిర్మించియుండెననుటయు బురాణకర్తల వెర్రియె! పూర్వము దేవదానవులు, దేవా! దేవా! యని యఱచుచు దపమొనరించినంతనే దేవుడు వారి కామాభీష్టానుకూలంబుగ వరముల బ్రసాదించియుండెనని పురాణములు వచించుట తగనిపనియే యయినది. మునులనేకులు మానాభిమాన క్రోధములగు చిత్తప్రవృత్తుల బాయకయే, దేవా! యని యఱచుచు దపమొనరింప వారు సకలశక్తిసంపన్నులయి యిచ్చవచ్చిన మచ్చున మానవుల రాక్షసులుగను, దేవతల బశువులుగను, జీవకోటుల భస్మరాసులుగను క్షణమాత్రకాలంబున శపించియుండిరను విషయముల నెందులకు బురాణములు కల్పించినదియు దెలియకున్నది. బ్రహ్మదేవుడే తనపుత్రిక మనోజ్ఞమూర్తి కలరి యామెనే మోహించెనట! రావణ త్రిపురాదులు పండ్రెండు పదుమూడు తలలగల్గిన భయంకర రాక్షసులట. నిరంతర భోగైకపరాయణులగు నింద్రాదులు దేవతలట! ఏతద్దేవతాపురుషుల కూర్వశీరంభాది వారాంగనలతోడి నిత్యసంభోగమే సద్వృత్తియట! వారిభోగసామ్రాజ్య సంరక్షకులు బ్రహ్మవిష్ణుమహేశ్వరులను త్రిమూర్తులట! పురాణోక్తసురాసురనిర్ణయ మీరీతి నున్నది. సురాసురులు క్షీరసాగరమును విచిత్రసాధనముల నాధారముగ జేసికొని నిర్వికారుండగు దేవునే బురస్కరించుకొని మథించిరట! దాన నైరావతము, విషము, లక్ష్మీ, అమృతము మొదలగు పదార్థము లెన్నియో లభించెనట! లక్ష్మీరూపరాశికి సర్వేశ్వరుడగు విష్ణువు ముగ్ధుడయి యామె నుద్వాహమాడెనట! ఇట్టిగాథలు

లక్షోపలక్షలు రామాయణ, భారత, పురాణములయందు గానవగుచున్నవి. రామాయణ, భారత, పురాణాదుల యందెన్నియో వైదికమత సిద్ధాంతవాక్య రత్నములు వెలయుచున్నను సుపర్యుక్తములగు కల్పితగాథలే వాని ప్రాశస్త్యమును దూషితమొనరించినవి. అధునాతన పండితులు వీనియందున్న సద్వాక్యముల వైపునకు ధ్యానమొసంగక వీనియందు వెలయు కల్పితాంశముల దిక్కునకే దృక్కుల బ్రసరింపజేయుచు ఋక్కటి పురాణము లను పేర వీని పేర్కొను టెంతయు జింత్యము! ఆర్షమతమను శీర్షికగల విషయమున నేను వీనియందున్న నీతులనే గైకొని కల్పనల విడనాడియుంటిని. ఇప్పుడయిన ను రామాయణ, భారత, భాగవతాది పురాణముల బరిత్యజించి భారతీయ నైతిక సాహిత్యము సజీవమయి యుండజాలదు. ఇదిధ్రువము. సత్యజ్ఞాన సంపాదనమునే జీవితపరమావధిగ నెంచి భయదుఃఖాదిద్వంద్వ ప్రపంచ బంధన విముక్తిని బడయ నభిలషించు బుద్ధిసంపన్ను లుపర్యుక్తగ్రంథముల నిరంతర దూషణమునే వృత్తిగా నవలంబింపక సత్యమును స్వీకరించి యసత్యమును బాయుదురుగాక! వేదముల నిగూఢముగ వ్రాయబడియున్న విషయముల సాధారణముగ జేసికొని పురాణకర్తలీవడువున కల్పితాంశములకు సత్య స్వరూపము నంటించిరి. యజుర్వేదము 31 వ మంత్రము సర్వేశ్వరుని ముఖమునుండి బ్రాహ్మణులును, బాహువులనుండి క్షత్రియులును, ఊరువులనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును జన్మించినవారని తెలుపుచున్నయది. దీనికర్థమిది:—సర్వేంద్రియములలో వాక్కుచే భూషితమయి ముఖ్యమయిన ముఖమువంటివారు బ్రాహ్మణులనియు, బలవీర్యములకు స్థానమగు బాహువుల వలె క్షాత్రబలమునే ప్రధానముగ నెంచువారు క్షత్రియులనియు, గమనాగమనముల కావశ్యకమగు బలముతో గూడియుండు నూరువులతో నొప్పుచు నిరంతర పర్యటనముచే గ్రయవిక్రయ వాణిజ్యాదికముల జేయువారు వైశ్యులనియు, దేహగేహమును నిరంతరము మోయుచుండు పాదములవలె మూఢులయి దాస్యవృత్తిచే బొట్టబోసికొనువారు శూద్రులనియు దెలియవలయును.

(ఈవిషయమును దూరదృష్టిలేని పాశ్చాత్యపండితులు ప్రాచీన గ్రంథము లన్నియు ప్రజాపతి సర్వాంగముల రోగానిమయము జేసియున్నవని మరల నలె బరిహాసము సేయగడంగుటెంతయు శోచనీయము) వేదములయందు, ఇంద్రాహల్యాదుల విషయమయి యిట్లున్నది: ‹ఇంద్రాహల్యాదుల సమ్మేళ నదృశ్య మెంత హృదయాహ్లాదకరముగ నున్నది!' ఇంద్రుడన సూర్యుడని తాత్పర్యము. అహల్య యన నిశ. సూర్యప్రకాశమందు నిశ విలీనమగుచున్నది. నిశా సూర్యప్రకాశముల సమ్మేళనమునే పురాణకారులు, బండితులును, అహల్యాదేవేంద్రుల జారత్వనాటకముగ గల్పించినారు. వేదములయందు బ్రహ్మ, పుత్రికను వెంబడించుటను గూర్చి యిట్లున్నది: ‹ప్రజాపతి యనగా ప్రకాశా తపములచే బ్రజలబాలించు సూర్యుడని తాత్పర్యము. ప్రజాపతి కుమారిక యుషఃకాలము. బ్రహ్మ ముహూర్తానంతరము స్వీయపుత్రికయగునుషఃకాల మును బ్రజాపతిప్రకాశము వెంటాడుచున్నట్టి దృశ్య మెంత సుందరము!'' అను వాక్యము వేదములయందుగలదు. ఈప్రకృతివర్ణనమునే పురాణకారులు బ్రహ్మదేవుడు నిజపుత్రికయందు మోహాంధుడయిన ట్లొక్క కల్పితగాథను యథార్థవిషయంబుగ విస్తృతరూపంబున వ్రాసియున్నారు. క్షీరసాగరమథ నమును గురించిన యంశము వేదములయం దిట్లున్నది:—జ్ఞానులును, అజ్ఞా నులును మోక్షాపేక్షచే బరతత్త్వమును నియమబద్ధమగు బుద్ధిచే దీర్ఘకాలము బరిశోధింపనందు జ్ఞానులు లేక సుర లమృతధామమును బ్రవేశించిరి. అనగా ముక్తులయిరి. ఈ యథార్థవిషయమునే పురాణము లొకవిస్తృత విపరీతగా థగ వర్ణించినవి. ఇట్టి కల్పిత మతసిద్ధాంత ప్రచారము రమారమి ఇప్పటికి 3 వేల 5 వందల సంవత్సరములకుపూర్వమే మనభరతఖండమున విజృం భించియుండెను. నాటినుండియే యీ దేశమున నిరుపయోగమగు కర్మకాం డాధిక్యతయు, హింసాత్మకములగు యజ్ఞయాగాదులును, బాహ్యపూజా విధానంబువనే ముక్తిలభించుననుమూఢసిద్ధాంతములును, లక్షోపలక్షలు దేవ తలు కలరను నిశ్శైతుక వాదంబును, బలులును, జాతరలును, మద్యపాన

ద్యూతమృగయావిహారవ్యభిచారాదులును, ప్రతిమారాధనలును, రాక్షస
వివాహములును, జాతిద్వేషములును, బహుభార్యాత్వమును, అపాత్రదా
నములును, స్త్రీపురుషస్వైరవిహారములును, బ్రాహ్మణేతర విద్యాభ్యసనా
నర్హతయు, భూపాలుర యసీమభోగవిలాసాది కాముకనింద్యచేష్టలును,
బాహ్య సన్యాసానుష్ఠానములును, ఆబోతుల దొమ్మలాటలును, పొట్టేళ్ల
పోరాటములును, మదగజసింహ సమరములును మొదలగు దుర్విచార,
దురాచార, దుష్కార్య, దుర్నీతులును లెక్కకు మిక్కిలిగా నెల్లదిక్కుల
నొక్కపెట్టున ప్రబలియుండెను. సర్వత్ర హింసలును, అధర్మమును, అన్యాయ
మును, నిరంకుశ రాజ్యపరిపాలన సేయుచుండెను. షడ్దర్శనకర్తలలో గొం
దఱు స్వీయశాస్త్రముల సర్వేశ్వర ప్రసంగము సేయకుండుటయు, వారు
సర్వేశ్వరుని విషయంబున దాటస్థ్యము వహించియుండుటయు నాధారము
జేసుకొని యొందఱో మతాంధులగు ధర్మప్రవక్తలు భిన్నములగు సాంప్ర
దాయముల నీతినియమముల బాటింపక యథేచ్ఛముగ నెలకొల్పియుండిరి.
వైదికమతాఖండదివ్యజ్ఞానజ్యోతి మలినమయి నానా సాంప్రదాయముల
నిర్జీవకళతో వెలయదొడంగెను. అప్పుడే శైవవైష్ణవ శాక్త గాణపత సౌర
కాపాలికములను షణ్మతము లుద్భవించి నిజప్రాబల్యమును వ్యాపింపజేయదొడం
గినవి. శైవులు శివుడే దేవుడనియు, శివునిబూజింపనివారు ముక్తిమార్గచ్యుతులే
యగుదురనియు, వైష్ణవులు విష్ణువే జగదాధారుండనియు, త్రిపుండ్రముల
ధరింపనివారికి ముక్తిలేదనియు, శాక్తేయులు దుర్గయే శక్తిస్వరూపిణియగు
నాదివిరాట్టనియు, శక్తిపూజాధురంధరులే మోక్షభాజనులగుదురనియు
నీరీతి షణ్మతములవారు మతలక్ష్యమునకు దూరులయి, విరుద్ధములును, నిరర్థ
కంబులునగు వివాదంబులకు గడంగి సదాచారధర్మనీతుల మంటగలుప
జొచ్చిరి. ఆమతక్రాంతికాలంబున, సత్యధర్మప్రాముఖ్యత గాణికధర్మమగు
డు స్వస్థాపిత కృత్రిమమతావేశాపూరిత విజయధ్వజ సంస్థాపనమే ప్రతిమతా
వలంబునియొక్క విధ్యుక్తధర్మంబుగ భావింపబడ సాగెను. కాదుప్రిలు వేద

విద్యాదూరులయి, క్రూరనింద్య వృత్తుల నవలంబించి, పశుతుల్యులగుచు జీవిత
ముల గడుపదొడంగిరి. విప్రులు స్వజాత్యాధిక్యత నెల్లయెడల స్థాపించుకొను
చు, సోమరులయి పరావలంబిత జీవితముల వ్యతీతము సేయ నుపక్రమించిరి.
భయంకరంబులగు యజ్ఞయాగాది క్రతువులకు నసంఖ్యాకములగు సాధుజీవ
ములు బలిదానము గావింపబడుచుండెను. శాక్తేయు లొకొక్కచో నరబలుల
నిర్విఘ్నముగా సాగించుటయందు వెనుకంజవేయరయిరి. దేవతామూర్తుల
సాన్నిధ్యదృశ్యము మద్యభాండముల తోడను, మాంస పిండములతోడను,
తప్తరుధిర పాత్రింబులతోడను, రోషోన్మత్త కృపాణ పాణులగు భయంకర
హంతకులతోడను నిండి బీభత్సమగుచుండెను. అధర్మదేవతయే భారతదిగ్వల
యంబునెల్ల, సత్యదయాత్మకహింసాజ్ఞానములనిర్మూలించి సుస్థిరసామ్రాజ్య
సంస్థాపనము గావింపనారంభించెను. విశుద్ధ విశ్వజీవకరుణార్ద్ర హృదయాం
బుజుడగు సర్వేశ్వరుని ధర్మసామ్రాజ్యభాను డస్తమింప నుండెను. సర్వ
మంధకార బంధురము! మహాభయంకరము!! పాపమయము!! ఘోరావిరళ
హింసాసంకులము!! అట్టి మహా భయంకర పరిస్థితియందు సర్వేశ్వరా
విర్భావ మనావశ్యకమందురా? లేదు. లేదు. పరమావశ్యకము!

## శ్రీబుద్ధావతారము.

చరాచరాత్మకంబును, ఆద్యంతరహితంబును నగు నీ బ్రహ్మాండ
భాండంబున కధినాయకుడు సర్వేశ్వరుడు. అతడే యీజగద్వలయమునకెల్ల
కర్తయు, భర్తయు, హర్తయు నయియున్నాడు. నిత్య విశ్వజీవ కళ్యాణ
పారతంత్ర్యమే యాదేవదేవుని యతిప్రశస్తంబగు కర్తవ్యము. అతడు
నిర్వ్యాజ కరుణారస పరిప్లుత హృదయాంబుజుడయి, కళ్యాణమయసాధన
పరంపరల స్వీయజీవ ప్రపంచమునకు నిరంతరము బ్రదర్శింపుచుండును.
తద్దేవునకు వ్యామోహాది భోగంబులుగాని, స్వార్థపరాయణత్వముగాని,
కర్తవ్యపరిజ్ఞానశూన్యతగాని యెందునకయిన లేవు, అతడు జీవునివలె కించి

జ్ఞానుఁడును, మితజ్ఞుఁడును, నిత్యసంసార సాగర మిథ్యాసుఖతరంగ మాలికా డోలికల నూగులాడువాఁడును గాక సర్వజ్ఞుఁడయి, సత్యస్వరూపుఁడయి, దివ్యాత్మయజ్ఞాన పరిపూర్ణుఁడయి, నిర్వికారుఁడయి, నిరంజనుఁడయి, సకలాపూర్వ సద్గుణగణ విభూషితుండయి యొప్పు సచ్చిదానందమూర్తి. తన్మహాపురుషేతరంబులగు సకలప్రవృత్తులును, నిఖిలగుణములును, మిథ్యాన్వితములయి, ప్రకృతిబద్ధములయి, సంయోగ వియోగ భేదభావంబునకు వశమయి జననమరణ భయవిషాదములకు గురియగుచుండును. ఏ కాలము, ఏరాష్ట్రము ఏజాతి, ఏ సంఘము జ్ఞానస్వరూపుండగు సర్వేశ్వరుని దివ్య తేజ స్వరూపంబులగు సత్యము, దయ, శౌచము, అహింస, కారుణ్యము, మైత్రి, ధర్మము, సదాచారము, నీతి మొదలగు సద్గుణములచే విభాసితమగుచుండునో, అది, సర్వానంద సుఖములకును, నిఖిలకళ్యాణములకును, సిరిసంపదలకును, నిత్యశాంతికిని నిలయమయి యాచంద్ర తారార్కంబుగ సుస్థిరమయి వసుధ వర్ధిల్లగలదు. ఉపర్యుక్తములగు సర్వేశ్వరీయ సద్గుణములకు విరుద్ధములగు ద్వేషము, మాత్సర్యము, కాపట్యము, అసత్యము, హింస, అశౌచము, అధర్మము, దురాచారము, దుర్నీతి మొదలగు దైవభక్తి విధ్వంసకరములగు దుర్గుణములగల రాష్ట్రమును, జాతియును గాఢాజ్ఞానాంధకార బంధురమగు నకర్తవ్య క్షేత్రమునబడి శతమతమగును. సకలదుర్గుణ ప్రేరేపకంబగు మూఢమంత్రములను జపించు మానవజాతి పరిశుద్ధాత్మ తత్త్వజ్ఞాన ప్రతిపాదకంబులగు సర్వదివ్య శక్తులనుడిగి యధోముఖమయి భక్తి జ్ఞానకర్మ యోగాభాసమయి, పరమార్థ లక్ష్యశూన్యమయి, కామక్రోధాద్యరిషడ్వర్గ పరివేష్టితమయి, క్రుళ్లి కృశించుట ధ్రువము. అచలపరిపూర్ణుండును, అనూనావ్యాజకరుణాసాగరుండును నగు నాప్రభువు పరమార్థ పథచ్యుతమయి దుష్పథము ననుసరించు యసహాయంబగు మూఢ మానవజాతిని వీక్షించి మానముద్రాంకితుడుగాక సహానుభూతిచే సత్యసందేశమునుగొని భువి నవతరింపుచుండును.

చిత్తమా! ఏమంటివి! నిర్వికారుడు మాత్రపురీషయుతమయిన మలినదేహ

గేహంబున నావిర్భవించి మిథ్యాన్వితమగు ప్రకృతిదుష్టశాసనమునకు వశు
డగునా యందువా? నిరాకారుండును, నిర్లిప్తుండును, సర్వాచారుండును, నగు
నాదివ్యమంగళమయమూర్తికి బంధనములేదు. బలవత్తరంబును, మహోత్త
రంబును, మహాద్భుతకరంబును నగు నాతని సత్యజ్ఞాన విశుద్ధప్రవృత్తియే
మానవకళ్యాణ ప్రేరేపకశక్తియై యొకానొక మానవోత్తముని పరిశుద్ధాంతః
కరణంబున మూర్తీభవించి యతని హృత్సీమన్నే నిత్య సత్యధర్మజ్ఞాన సంస్థా
పనాలీలల కాలవాలంబుగ జేసికొనుచుండును. తన్మానవోత్తముండట నిమి
త్తమాత్రుడయి యుండ, నతని విశాలాంతఃకరణము నావరించియున్న భగవ
త్ప్రేరేపక సత్యసందేశ ప్రవృత్తి విశ్వమున మానవకళ్యాణమయ కార్య
పరతంత్ర మగుచుండును. నిర్లిప్తంబగు నాభగవత్ప్రేరేపక శక్తిచే మానవో
త్తముని హృదయంబున మూర్తీభవించి లీలామానుష విగ్రహుండని ప్రా
పంచికులచే బేర్కొనబడుచుండును. అధ్యాత్మతత్త్వవిశారదుండగు శ్రీకృష్ణ
చంద్రుడీవిషయమయి జ్ఞాననిధియగు భగవద్గీతయందీచందమున వాక్రుచ్చి
యున్నాడు:

శ్లో:- "యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

తాత్పర్యము:—"ఓపార్థా! భువి ధర్మము క్షీణించి, అధర్మమభివృద్ధి
జెందునపుడెల్ల నేను యవతరింపుచుందును. సాధుసంరక్షణము, దుష్టవిధ్వం
సము, ధర్మసంస్థాపనము జేయ నేను యుగయుగమునందు భువి నవతరింపు
చున్నాడను."

శ్రీకృష్ణభగవానుని మహద్వాక్యమును సార్థకము జేయుటకో యన
క్రీస్తుశకమునకు బూర్వము 662 వ సంవత్సర ప్రాంతమున హిందూదేశము

మతవిప్లవములకును, ద్వేషమాత్సర్యములకును, జీవరక్తధారా ప్రవాహం బులకును, ఘోరాత్యాచారాధర్మములకును నిలయమయియున్న మహాభయంకర సమయంబున శ్రీబుద్ధదేవుడు పవిత్రభరతమాతృశ్రీగర్భమున జనన మందియుండెను. శ్రీబుద్ధుడు భూపాలప్రియతనూభవుండయి యవతరించియుండియు మిథ్యాగతంబులును, క్షణభంగురంబులును, తుచ్ఛాతితుచ్ఛములును నగు ప్రాపంచిక సౌఖ్య సముదాయముల నిరసనదృక్కుల వీక్షించి, ఘోరంబగు ధర్మసంగ్రామరంగమున గూరచిత్తుండగు మారుని కామక్రోధాది యోధబృందసమేతముగా బట్టి చీల్చిచెండాడి విధ్వంస మొనరించెను. అతడు భరతఖండమున నేదిక్కు బరిశోధించినను, ఏపార్శ్వము నవలోకించినను మతములన్నియు బరస్పరభిన్నాభిప్రాయోద్రిక్తములయి, ఉత్తమాదర్శగంధ విరహితములయి యుండ, సంఘములును వానినలంకరించియున్న సకల మనుజులును నింద్యాతినింద్య దుర్గుణములకు ఖనులయి యుండుట నుపలక్షించెను. సద్ధర్మదేవతాసామ్రాజ్య సింహాసనము తలక్రిందులగుడు ప్రచండరూపధారిణియగు రాక్షసి యధిష్ఠించియుండుటయు శ్రీబుద్ధదేవుని లోచనంబులకు గోచరంబయ్యెను. వాడవాడయందును స్వార్థప్రియులును, బుద్ధిహీనులును నగు దుష్టబోధకులకు గింకరులయి సకల నరనారీమణుల భ్రష్టత్వమునకు బాల్పడుటయు బుద్ధుడు గాంచెను. మహాకాళికయి బలాత్కారంబుగ హత్యగావింపబడు నబలాబలుల కరుణారసోత్పాదకంబులగు నార్తనాదములు బుద్ధుని నేత్రయుగ్మమున నశ్రుప్లావితము గావించెను. శుష్కవేదాంతులయొక్కయు, గురుపీఠముల నధిష్ఠించియున్న దోపిడిగాండ్రయొక్కయు మతముపేరిట నసంఖ్యాకములగు పాపపుంజముల నిర్భయచిత్తములతో నొనరించు కృత్రిమ ప్రవక్తలయొక్కయు, దృష్టలోహదండ సదృశములగు హస్తముల జిక్కి కయ్యో మెట్టో యని బొబ్బలిడు ధర్మదేవ్యాక్రందనధ్వాన పరంపరలు భూనభోంతరాళముల బ్రతిధ్వనింప జేయుచుండ, సహజదయార్ద్ర హృదయాంబుజుండగు శ్రీబుద్ధదేవుడు సనాతనవైదిక ధర్మపునరుద్ధరణము జేసి

సకల మానవాళికి సత్యధర్మ ప్రబోధము గావించి దయా సత్యధర్మాహింసాది దైవికగుణముల సంరక్షించి, సకలజీవ విశుద్ధ విశ్వమైత్రిని భువిని నెలకొల్పి శమదమాదుల బునర్జీవితములఁగ జేసి, విశ్వసామ్రాజ్యము నంతయు పరిశుద్ధ ప్రేమమయ స్వర్గసామ్రాజ్యముగ నిర్మాణమొనరింప ఘోరమగు కృషిచే సమ్యక్సంబోధి (సత్యయుతమగు పరమజ్ఞానము) నందెను. నవ్యజీవన జ్ఞానసంచలిత విశుద్ధాత్మశక్తి సంపన్నుడగు శ్రీబుద్ధదేవు డపుడే బౌద్ధమతమను పేర వైదికమతమును భరతఖండమునందే గాక సర్వేశ్వరుని సృష్టియున్నంత పర్యంతము వ్యాపింపజేసి, తనపూర్వజులగు నార్యఋషుల పవిత్రాత్మ గౌరవమును సుస్థిరకీర్తిభాజనం బొనరించెను. నాటగోలె బునః విశ్వమునం దెల్లెడల ప్రాచీనభారతీయ మతధర్మజ్యోతి తిరిగి సుప్రతిష్ఠితమయి యారాధ్యము గాదొడంగెను. కొందఱీబౌద్ధమతమును ప్రాచీనార్షమతమునుండి భిన్నముగ భావించు టెంతయు విచారకరము. పరిశుద్ధాత్మతత్త్వజ్ఞాన ప్రేరేపకంబగు నీబౌద్ధమతముఖంబున బుద్ధభగవాను డీచందమున విశ్వమున కుద్బోధించి యుండెను. తద్దేవప్రతిష్ఠాపిత ధర్మసిద్ధాంతంబుల గొన్నింటి మచ్చుకయి యుదహరింపు చున్నాడను.

(1) "ఆర్యసత్య చతుష్టయమును, అష్టాంగమార్గములను బౌద్ధధర్మమునకు ముఖ్యములు. (1 దుఃఖము, 2 దుఃఖోదయకారణము, 3 దుఃఖనాశన మార్గము, 4 దుఃఖనివారణోపాయము. దీని కీయష్టమార్గము లావశ్యకములు:—1 సమ్యగ్దృష్టి 2 సమ్యక్సంకల్పము 3 సమ్యగ్వచనము 4 సమ్యక్కార్యము 5 సమ్యగ్జీవితము 6 సమ్యగ్వ్యాయామము 7 సమ్యక్స్మృతి 8 సమ్యగ్ధ్యానము.)

(2) "క్రోధము, అనృతము, హింస, వ్యభిచారము మొదలగునవన్నియు త్యాజ్యములు. తృష్ణను బహిష్కరింపుము. పరుషవాక్యములు దుఃఖహేతువులు. ఎల్లజీవుల స్వాత్మసమానముగ బ్రేమించుము. కాని దేనియందు నాసక్తుడవయి యుండకుము. ప్రమాదము (సోమరితనము) సకల బహిరం

గాంతరంగిక వ్యాధులకు మూలము. అప్రమత్తత (భక్తి) ముక్తిసాధనప్ర
ధమ సోపానము. ద్వంద్వముల సమబుద్ధి సంసారసాగర మానవజీవిత తరణి
పాలిట చుక్కాణివంటిది. జ్ఞాని యెన్నికష్టములకయిన సహించి యనుసరిం
పుము. సకల సామ్రాజ్యపదవి కరగతమయినను మూఢజనసంగతి నభిలషిం
పకుము. సృష్టి క్షణభంగురమను మర్మమును విస్మరింపవలదు. విశుద్ధవిశ్వప్రేమ
యోగసాధనము సకలమానవధర్మము. వ్యక్తిగత జీవితాభిలాష పునర్జన్మో
పకరణశక్తి, పిపీలికాది విరాటపదార్థ పర్యంతము వెలయు ప్రాణశక్తి
యొక్కటియే యని తెలియుము. సుఖమును గోరుదువా దుఃఖింతువు. దైవికం
బులగు దుఃఖముల నాలింగనమొనర్తువా విముక్తుడవగుదువు. మాతాపితా
చార్య గురుజనుల సన్మానింపుము. త్రికరణంబుల శుద్ధుడవగుము. స్థిత
ప్రజ్ఞుడవగుము. ఇంద్రియదమన మానందసంధాయకము. ఆత్మవిజయము
ముక్తిపుర సింహాసనము నొసంగును. హృదయమున నిరంతరము సద్భావముల
గలిగి యుండుము. సత్ప్రయత్నములను, సత్కార్యములను సలుపుటయం
దేమరపాటు జెందవలదు. అహంకార మమకారముల ప్రాణాంతకరిపులుగ
నెఱింగి వీడుము. సత్యధర్మజ్ఞానమే జీవితపరమావధి. తక్కంగల పదార్థము
లన్నియు నశ్వరములు. ధర్మ మక్షయసంపన్నిలయము. మృదుమధుర
భాషణము మనోల్లాసకరము. సకలవనితల మాతృదేవులని యెఱుంగుము.
అనాథులను దోడ్పడుము. ఒకరిపై నాధారపడి యుండకుము. ఆత్మస్వాతం
త్ర్యమూల్య మధికము. పాపమార్గమును మఱచియయిన స్మరింపకుము. మాదక
ద్రవ్యసేవనము, మాంసభక్షణము, అసహనశీలత, కృతఘ్నత, పరద్రోహ
చింతనము, ఈర్ష్య, అశ్లీలవాక్యోచ్చారణము, పరనింద, రూపధనవైభవతృ
ష్ణలు, విలాసప్రియత్వము, రూపహీనుల పరిహాసము, చంచలచిత్తము, ఆత్మ
శ్లాఘ్యము, పరవస్తుగ్రహణము, అమితత్వము, నీతినియమసదాచారాది
పాలన రాహిత్యము మొదలగున వన్నియు సత్వరబహిష్కరయోగ్యములు.
కష్టముచేసిభుజింపుము. శ్రద్ధ, వినయము, సంతోషము, సద్విషయగోష్ఠి, సద్భావ

చింతనము, కృతజ్ఞత, పరోపకార పారీణత, బాహ్యాభ్యంతరికశుద్ధి, సత్వర గాత్రిహ్యాములు, సకలజీవసంరక్షణము మానవవిధి. సాధువేషము, సాధుభాష సాధువర్తనము శరీరాత్మభూషణములు. ప్రేమచే ద్వేషమును జయింపుము. ఆలోచనగోచరంబగున దంతయు బుద్బుదప్రాయము. శాశ్వతామలానంద సంధాయకంబగు నిర్వాణమునకయి సలుపబడు సత్యధర్మజ్ఞానకృషియే సార్థకము. ఇదిమఱువకుడు.” ఇది వైదికమత ప్రబోధము గాక మరి యేమగును? ఇట్టి మతమునా, ద్వేషముచే నాస్తికమనుట! ఇది కేవలము వెఱ్ఱి!!

## బౌద్ధమతము నాస్తికముగాదు.

బౌద్ధమత సంస్థాపనాచార్యుడగు శ్రీబుద్ధభగవానుడు సనాతన వైదిక మతావలంబులును, భగవద్భక్తి పరిపూర్ణచిత్తులును, నిత్యపరిశుద్ధ వర్తనులును నగుశుద్ధోధన మాయాదేవుల యనుంగుబిడ్డడయి భువినవతరించెను. అతని శరీరమునందలి రక్తకణములన్నియు హిందూమత భక్తిరస పరిపూరితములు, అతని వేషభాషాదులును, ఆచారవిచారములును, నీతినియమములును వేయేల తద్దేవుని సంబంధియములగు సకలవిషయములును ప్రాచీనార్ష మతాభిమాన సంజనితములు. అతడు పరిశుద్ధంబగు హైందవనికేతనమున జననమంది శైశవకాలంబున మాతృశ్రీముఖంబున సర్వేశ్వర నామ సంస్మరణ వాక్యముల నాలకించియుండెను. సాధారణముగా మనగృహములయందు బిడ్డలు బంధుబాంధవులచే అమ్మా అక్కా యని నేర్పువిధంబున నే శ్రీబుద్ధుడును దన పసితనమందే దేవా ఈశా, యనుపూతపదంబుల నుచ్చరింప నలవడియుండెను. పంచవర్ష ప్రాయంబునం దతడు సకలార్షశాస్త్రనిష్ణాతయగు విశ్వామిత్రాచార్యుల సన్నిధిని విద్యనభ్యసింప దొడంగి అష్టాదశవత్సర ప్రాయంబునకు దొలుతయే చతుర్వేదంబులను, సకలోపనిషత్తులను, షడ్దర్శనములును దక్కుంగల సకల బ్రాహ్మణగ్రంథములను సూక్ష్మబుద్ధియై సంపూర్ణముగ నభ్యసించెను. అనేకంబులగు భక్తిజ్ఞాన వైరాగ్యపూరిత మతిగ్రంథముల నవలోకింప నతని చిత్తము

విశ్వ జీవకరుణారస సంభరితమయి, ప్రాపంచిక వ్యామోహ శూన్యమయి, సత్యధర్మజ్ఞాన సంపాదనోన్ముఖుఁడయి తనరారఁజొచ్చెను. అతఁడీవిశాలంబగు సకలసృష్టికి గర్తయొకఁ డుండియే తీరుననియు, నతఁడే సర్వేశ్వరుం డనఁబఱఁగు ననియు శాస్త్రపఠనంబున గ్రహించెను. తదీశ్వరతత్త్వ మెట్టిదాయను సందేహ మతనిచిత్తమును బహుభంగుల బాధింపఁదొడంగెను. అతనికి షడ్దర్శనములయందు గొన్నింటి సర్వేశ్వరతత్త్వ నిరూపణ మిదమిత్థమని లేకుండుటయు, ఉపనిషత్తుల నేతివాదము విశేషముగా ప్రబలియుండుటయు, ననేక విధంబులగు సందేహము లుత్పత్తిలఁజొచ్చెను. ఉపనిషత్తులయం దధికముగా నాత్మజ్ఞానమును బ్రేరేపించు సత్సిద్ధాంతము లసంఖ్యాకములుగ వెలయుచుండుట కెంతయు నతఁడు ముదమందెను. దర్శనముల ఋష్యాదులు గావించిన పరస్పర విరుద్ధంబులగు నాత్మానాత్మ వాదవివాదముల కతఁ డెంతయు విచారించెను. వేదాదులు బోధించిన దివ్యజ్ఞానమున కతఁ డెంతయు బరమాహ్లాదితచిత్తుఁడయ్యెను. నిత్యము వేదాదులయందు వ్రాయఁబడియున్న మహద్వాక్యము లతని స్మృతిపథమున దోచినంతనే, ప్రాచీన ఋష్యాదుల దివ్యజ్ఞానమును సహస్రవిధముల సంస్తుతింపుచుండెడివాఁడు. అతఁడు భౌతికప్రపంచ క్షణభంగురత్వమును, దుఃఖమయావస్థను గుర్తెఱింగి, ఆధిభౌతికాధిదైవికాధ్యాత్మిక దుఃఖత్రయము నివృత్తికి సత్యపథము నన్వేషింప సర్వసంగపరిత్యాగియయి, హింద్వాచార్యుల దివ్యసన్నిధినే తత్త్వోపదేశము నందియుండెను. అతఁ డనన్యభక్తిపూరితహృదయంబుతో ఋషీశ్వరుల ధర్మసిద్ధాంతముల నెల్ల స్వీకరించెను. కాని వేదంబు బోధించిన హింసాత్మకంబులగు యజ్ఞయాగాది క్రతువులను, దేహదండనాత్మకంబులగు హఠయోగాదులను చిత్తశౌచరహితంబగు బాహ్యకర్మకాండమును, విశ్వసోదర ప్రేమ భంజకంబగు వర్ణవిభేదంబును మాత్రము సంపూర్ణముగ నిరాకరించెను. ఆమహానీయుఁడు సమ్యక్సంబోధి (ఆత్మసాక్షాత్కారము లేక బ్రహ్మైక్యసంధానము) నందినయనంతరము సద్గుణితము వేదాదులయందు వెలయు

మున్నట్టియే సత్యము, ధర్మము, అహింస, శౌచము మొదలగు సుత్తమ సిద్ధాం
తములనే మానవాభ్యుదయమునకు హేతుభూతంబులగునని నొక్కి వక్కా
ణించి యున్నాడు. వేదములయందును, "అహింసా పరమోధర్మ"మను
జ్ఞానసూత్రము వెలయుచుండుట నవలోకించి యజ్ఞము నింద్యమును,
ప్రకృతి వ్యామోహయుక్తంబును నగు హింసచే గావింపబడరానిదనియు,
నత్యుది పునీతమగు నాత్మత్యాగమునకును, మనోవాసనా బలిదానమునకును
నశ్వరభోగ పరిత్యాగమునకును మూలమయి యుండవలయునని బుద్ధుడు
సిద్ధాంతీకరించెను. ఆత్మానుసంధానమునకు చిత్తశుద్ధియే ప్రధానమని యుప
నిషత్తులు బోధింపుచుండ బుద్ధుడు నిరుపయోగంబులగు బాహ్యకర్మలకయి
పెనగులాడ రాదని బోధించెను. అతడు సర్వసౌభ్రాతృత్వమునే యుపని
షన్మతము మానవమాత్ర విధియని పేర్కొనుట కెంతయు హర్షించి ప్రేమ
శూన్యమగు నింద్యవర్ణావేశ పిశాచమును సమూలముగ విధ్వంసమొనరించెను.
"ఆత్మవత్సర్వభూతాని, పరోపకారార్థ మిదంశరీరం" అను సనాతన ధర్మ
వాక్యముల సన్మానించియే జీవకారుణ్యమును స్వార్థత్యాగమును బౌద్ధమతమం
దిరమునకు స్తంభములుగ జేసె. సర్వేశ్వరుడు లేనేలేడని శ్రీబుద్ధదేవుడు స్వీయ
మతస్థాపనానంతర మెపుడును వచించియుండలేదు. అతడజ్ఞానసంకోచ
రంబులగు నిగూఢవిషయంబుల సందిగ్ధావస్థయందు మౌనమును, తాటస్థ్య
మును వహించియుండెను. ఆత్మానాత్మ మీమాంసయందు సహిత మూచం
దమునవె వర్తించెను. అతని హితోపదేశ వాక్యములన్నియు ననాత్మబల
మును ద్రోసిపుచ్చుమనియు, నాత్మబలమును సంపాదించుమనియు బోధింపు
చున్నవి. అతడనాత్మసంబంధములగు కామక్రోధాదులను, అమితత్వ,
శత్రుత్వ కృత్రిమత్వాద్యనేక దూషితగుణములను బరిత్యజించి, ఆత్మవిషయ
కంబులగు స్వావలంబనము స్వాత్మజ్ఞానము, అప్రమాదము, స్వయంకృషి
స్వాత్మోత్సర్గము మొదలగు సత్వగుణముల సత్వరము స్వీకరింపుమని బోధిం
చెను. వివిధమతావలంబులగు బ్రాహ్మణులు సర్వేశ్వరుని విషయము

తగవులాడుచుండ వివాదపడుట తగనికృత్యమనియు, దేవుడు పరిశుద్ధుం డును, జ్ఞానపరిపూర్ణుండును సత్యస్వరూపుండును నయి యుండుననియు విద్వేషపూరితంబులగు వివాదములచే లభ్యుడు కాడనియు బుద్ధదేవుఁడెన్నియో తావుల నుపదేశించియుండెను. దేవుని యీ వాక్యమును బట్టి యతని నాస్తి కు డనుచుంటిమి. అతడు పరిశుద్ధాస్తికుండె. వేదములు దేవుడు సత్యస్వరూపు డనియు, జ్ఞానమయుడనియు నిరాకారుడనియు, అవాఙ్మానస గోచరుండ నియు బోధించియున్నవికదా! బుద్ధుడను భగవత్పదార్థ మిట్టిది యట్టిదని కల హించుట యీ దేహస్వల్పంబగు నమూల్యజీవితకాలమును దుర్వినియోగ పఱచ వలదనియు, జ్ఞానమునార్జింపదగుననియు, మృత్యువు సమీపించినపు డాతు రత పడుటవలన బ్రయోజనముండదనియు, సత్యధర్మజ్ఞానకృషిచే భవసాగర తరణోపాయంబు స్మరించి జీవన్ముక్తి నొందఁగుననియు బోధించియుండ నతనినిటులెట్లు నాస్తికంబెట్లగును? శబ్దాడంబరముచే నిత్యము దేవాదేవా యని స్మరింపుచు నైషిక విషయాసక్త పంకిలమున దిగబడి, భ్రష్టులయియుండు [illegible] ఆస్తికమనీషి [illegible] నిరసించి, సచ్చి దానంద కందంబగు పరతత్త్వమునకు శ్రద్ధాభక్తుల నిరంతరము [illegible] జ్ఞాన పరిపూర్ణుడగు బుద్ధుని శుద్ధహృదయుని నాస్తికునిగ అహా! ఎంత యన్యాయము! ఎట్టి పరమతద్వేషబుద్ధి! ఎంతటి యదూరదృష్టి! భగవంతు డనునందేగాక సకలావనీచతుర్దిక్కుల సనాతనార్యమతమును బునరుద్ధ రించి విజయ ధ్వజమును నెలకొల్పిన భాసురయశుండా నిరీశ్వర వాదిని? కాదు, కాదు, ఎప్పటికిని గానేరదు!

సకల భారతవసుంధరార్యులచే బరిశుద్ధాస్తిక గ్రంథములుగ నారా ధింపబడు సకల పురాణములు నాస్తిక గ్రంథములయి, నిరీశ్వర వాద విశ సితములయి, అనాత్మబోధ యుక్తములై యున్నవని స్పష్టముగా నిశ్శంకిత చిత్తములతోడ హైందవ భ్రాతలారా! మీకెల్లరు స్వీకరింపుడో నాపురా ణములచే విష్ణువుయొక్క యవతారముగ భావింపబడి పూజింపబడు శ్రీ

బుద్ధ భగవానుడు నాస్తికుడే యగు ననుకొనుడు, బుద్ధుడును వైదిక మతోక్త
విధంబుననే మానవుడు గతజన్మ కృత పాప ఫలంబులనే జన్మ చక్రంబున
బడి సుఖదుఃఖాదుల ననుభవించు చున్నాడనియు, పునర్జన్మ కలదనియు
సుకృత దుష్కృత పరిణామము లవశ్య భోక్తవ్యములనియు, సకలమానవ
జాతికి సత్య దయాక్షమాదులు మంతవ్యములనియు, తృష్ణా విసర్జనమే
దుఃఖనాశకర మనియు, సన్న్యాసమే సర్వజీవ శ్రేయోదాయకంబనియు
నైహిక పదార్థములన్నియు నశించునవనియు, నిర్వాణమే—నిత్యానందమే—
నిర్మలజ్ఞాననిధియే—నిఖిలలోక వ్యాప్త సత్యజ్యోతియే శాశ్వతంబును,
బ్రాహ్మ్యంబునయి వెలయు చున్నదనియు మేఘ గంభీర స్వనంబున బోధించి
యున్నాడు, బ్రాహ్మణమతమును సమర్థించుచు జీవుడు నిత్యుడనియు, శరీర
మనిత్యమనియు, ధర్మము శాశ్వతంబనియు, త్రికరణశుద్ధమగు ధ్యానము ప్రభా
వోత్పాదకమనియు, నింద్రియ దమనము ముక్తానందము నొసంగునదనియు
బుద్ధభగవానుడుపదేశించెను. హిందూమతోపనిషద్గ్రంథోక్తములగు నపహూత
లక్షణములకును, భగవద్గీతా ప్రబోధితములగు సన్న్యాస ధర్మములకును
బుద్ధుని పరిశోధిత ధర్మములకును మధ్య రవ్వంతేని భేద గంధమయిన గాన
రాదు. కృష్ణ భగవానునిచే నుడువబడిన జ్ఞానులయందును బుద్ధుడు వక్కా-
ణించి యున్న పండితులయందును భేదములేదు. యజుర్వేదమును, భగ
వద్గీతాది హిందూమత ప్రామాణిక గ్రంథములును, పలికిన వర్ణవ్యవస్థా
నిర్ణయమునె బుద్ధ భగవానుడును సద్గుణ, సద్వృత్తుల చేతనే మను
జుడు బ్రాహ్మణుం డగునని వచించి సార్థక మొనరించి యున్నాడు. వేద
మతమువలెను దుఃఖజాలనివృత్తికి జ్ఞానప్రవృత్తి పరమావశ్యకంబని బుద్ధు
డు వక్కాణించెను. బుద్ధ భగవానుడు చార్వాకుల వలె "తినుడు తినుడు
అనుభవింపుడు. భస్మమగు నీశరీరము మరల వచ్చుటెట్లు?" అని చెప్పియుం
డలేదు. (ఈలోక సుఖముల ననుభవింప గోరకుడు. అనాసక్తులయి మనుడి.
అజ్ఞానమును బారద్రోలుడి, అనిత్యములగువానిని స్మరింపక నిత్యమగు నిర్వా

ణము నే స్మరింపుచు సాధింప గృషిసలుపుడి. ఇదియే నిత్యపరమ లక్ష్యము జాగ్రత! జాగ్రత!' యని చీటికి మాటికి బుద్ధుడు వేదమతంబు రీతి భోధించి యున్నాడు.

ఇట్టి పరతత్త్వజ్ఞానప్రేరకంబున్, సత్యధర్మపరిజ్ఞానయుక్తంబున్నై, ఆత్మోద్ధావకరంబును సజీవంబును నగు బౌద్ధమతము ఆస్తికమె. బుద్ధు డాత్మవాదియె. అతని హృదయము సజీవము. మతము సజీవము. బౌద్ధమత మొక్క స్వతంత్రమతము గాదు. ఉపనిషన్మతసత్సారాంశమే యిది. శ్రీ బుద్ధ పురాణాంతమున 'బరిశిష్టము; విశేషాంశములు' వ్రాయబడియున్నవి. అవిమొదమును సాంగోపాంగముగ జదివించువారికి బౌద్ధము నాస్తికముగాదనియు వైదికమతమేననియు తెల్లంబగును. 50 కోట్ల ప్రజలు దీని నవలంబించి యున్నారు. ఇట్టి మతము నాస్తికమా? బౌద్ధమతమును దేశవిదేశ మహాపండితాగ్రేసరు లెట్లు స్తుతియింపుచు నాస్తికము గాదని వ్రాసియున్నారో, పాఠకభ్రాతలారా! దిగువ వ్రాయుచున్నాడ విలోకింపుడు.

* * * *

## శ్రీ బుద్ధదేవుని సత్యసందేశము

(పండిత వాస్వానీ మహాశయుడు)

వంగరాష్ట్రవాసులు శ్రీ బుద్ధదేవుని శత్యధిక ప్రేమభావంబున వైశాఖోత్సవమును సురేంద్రవైభవముతో సలిపియుండిరి. తదానందోత్సవమ్ము నాసేతు హిమాచలపర్యంతము విద్యమానములయియున్న సకల భారతీయ హృదయంబులను శుద్ధైక్యభావంబులో, సశద్ధభక్తిభావంబుతో గొనసాగించుట శ్రేయస్కరము. శ్రీ బుద్ధభగవాను డిలాతలమందలి తక్కుంగల మానవాళికంటె భారతీయ హృదయాకాశ మండలమునకు సుధాకరుడగు నెంతయు నాదర్శప్రాయము; శుభావహము. సంస్కృతోత్తమాదర్శయుక్తంబగు బౌద్ధమతమునుండి హిందూమతమును, హిందూమతమునుండి బౌద్ధమతమును భిన్నముగా నుండజాలవు. ఉభయమతము

మధ్య యచంచలంబగు నవినాభావసంబంధము గలదు. ఒకకాలమునం దీమతద్వయము భేదభావంబు నెఱుంగక జావాద్వీపంబునందును, కంబోడియా యందు నేకమాతృగర్భ సంభూతసహోదరప్రేమంబున వ్యాపించియుండె డిని. పరిశుద్ధంబగు హిందూమతము మహాకూలంకషప్రాయమయి, గంభీర మయి, సర్వవ్యాపకమయి బౌద్ధాది సకలవిశుద్ధమతములయొక్క ముఖ్యధర్మ కర్మాదర్శముల నెల్ల నిజవిశాల ధర్మాదర్శహృదయాంతరాళమున విలుప్త మొనరించుకొని సంపూర్ణత్వమునకును, సమున్నతస్థితికిని ప్రాపించియున్న దనియే మున్నిశ్చితోద్దేశ్యము. శ్రీ బుద్ధభగవానుడే స్వయముగా స్వీయ మతాదర్శ ధర్మంబులన్నియు విశుద్ధార్యమతప్రోక్తములనియే నుడివి యున్నాడు. ఆ మహనీయుడు పునరావృత్తిరహితంబగు నిర్వాణప్రాప్తికి బహుమావశ్యకంబులని ధమ్మపదము (బుద్ధగీత) న బోధించియున్న యార్యసత్య చతుష్టయమును, అష్టాంగమార్గములును నార్షమతసిద్ధాంతద్యోతకములేయనియు, నవ్వానియందు హిందూమతాదర్శనీతులకు భిన్నమగు మతవిషయకసిద్ధాంత స్ఫూర్తి యీషణ్మాత్రమయిన లేదని మనము హృదయంగమంబగుచున్నది. శ్రీబుద్ధ దేవుని యలౌకిక సామాన్యంబును, అన్యజనదుర్లభంబును అనిర్వాచనీయ శ్రద్ధా భక్తి మండితంబునునగు మహాప్రేమచే హిందూమతాదర్శదర్పణము పరిశుద్ధము గా గలిగినది. మధ్యకాలాగతంబులును, విశ్వసోదరామూల్య ప్రేమతత్త్వ భంజకములును నగు నానాసంప్రదాయలబ్ధభేదంబుల రూపుమాపి, బుద్ధ ప్రభువు హిందూమతమును సకలజీవకారుణ్య విభావితంబుగను, విశ్వసోదరా నూనానురాగ విరాజిత భావాన్వితంబుగను, తృష్ణా బహిష్కృతంబుగను పరిష్కరించి మతముయొక్క వాస్తవిక నైతికాధ్యాత్మికాదర్శ మహావిట పమూలమును నవ్యతర జీవితసంచలన సలిలంబుచే సంసిక్తమొనరించెను. శ్రీ బుద్ధుని నిర్వ్యాజకరుణాకటాక్ష బలంబున హిందూమతాదర్శము భూఖండ మునకెల్ల నధికవిస్తృతంబగు నాశియాఖండమున వ్యాపించి, ప్రాచీనార్షమత విజయధ్వజమును బునః సుప్రతిష్ఠిత మొనర్చి వినిర్మల విశ్వప్రేమ గీతముల

గానము జేసి, మానవప్రపంచ హృద్గత పారమార్థిక జ్ఞానమును జాగృత మొనరించెను. బుద్ధప్రభువు స్వీయమత సౌధమును, స్వానుభవసిద్ధ జ్ఞాన విజ్ఞాన సంపన్న హృదయులగు ఋషిసత్తములచే విరచింపబడిన యుపనిష ద్వాక్య రత్నపరంపరల చేతనే హృదయాహ్లాద కరంబుగను, నతిమనోజ్ఞంబుగ ను నిర్మాణ మొనరించి యున్నాడు. అతడు ప్రాచీనభారతవర్ష గౌరవస్తంభ స్వరూపులగు ఋషిసత్తముల యొక్కయు, దాపసశ్రేష్ఠుల యొక్కయు జీర్ణ స్థిత్యున్ముఖంబులగు సకల పరిశుద్ధసిద్ధాంత నిచయములను సంరక్షించి విశ్వ వ్యాపక మొనరించెను. మతవిషయకంబగు పరిజ్ఞానము లేకయు, దూరదృష్టి శూన్యత చేతను బుద్ధదేవుని నిరీశ్వరవాదియనియు, బౌద్ధమతము నాస్తికం బనియు, జడవాద ప్రభావంబనియు నుడువసాహసించు టెంతయు నింద్యము; నిరాధారము; నిష్ప్రయోజనము. బుద్ధదేవుని ప్రత్యేక మతాదర్శనైతిక సిద్ధాంత ఖండంబును, ఆత్మజ్ఞాన శూన్యంబులును, పారమార్థికజ్ఞాన సంచలన విరహితంబులును నగు మానవశుష్క హృదయంబుల నైతికాధ్యాత్మిక తేజఃపుంజములచే నుద్దీపింపజేయు చున్నది. నిగూఢంబులగు మతవిషయం బుల బుద్ధుడు నిర్మలానందకందంబగు నిర్వాణపథప్రాప్తాపూర్వసౌఖ్యాం బుధినిమగ్నుం డగుటం జేసియే యనేక పర్యాయములు వ్యక్తీకరింపక మౌన ముద్రితు డగుచుండెడివాడు. దేవుని యామానముద్రయే యతని నాస్తికతను నిరూపించుటకు బ్రబల ప్రమాణము గాజాలదు. దేవు డాత్మానంద పార వశ్యముచే స్థూలంబగు భౌతికదృష్టి కతీతమగు సచ్చిదానంద స్వరూపము నిద మిత్థమని నిర్ణయింపక పోవుటయే యతనిని నాస్తికునిగ జేసివైచు టెంతయు శోచనీయము. అస్తికశిరోమణులుగ భావింపబడువారు వేయి సర్వేశ్వ స్వరూప నిరూపణా నిర్ణయములు వాస్తవ మాలోచింప గేవలము శబ్దాడం బర యుక్తములగు వర్ణనములును సంజ్ఞామాత్రంబులును, అసంపూర్ణంబులును నయి యున్నవే కాని, సత్య స్వరూపమును నిర్ణయించుట కర్హములుగా లేవని యే నుడువవచ్చును. సృష్టి స్థితిలయముల కాధార భూతంబగు నిత్య సత్య

శుద్ధ బుద్ధ సచ్చిదానంద స్వరూపము త్రికరణములకతీతమయి, భౌతికము
నకు భిన్నమయి, అనంతమయి, అవ్యక్తమయియున్న విషయము సత్యేతరము
కాదు. అవాఙ్మానసగోచరంబును, అతీతంబును నేతి నేతి కర్తవ్యంబును నగు
చిత్స్వరూపము కించిజ్జ్ఞుండును మితజ్ఞత్వాది భౌతికలక్షణయుక్తుండును నగు
మానవుడిట్టిదని మేఘగంభీర ధ్వానంబున వచింప బూనుటెంతయు సాహసము.
అవ్యక్తమగు చిదానంద శక్తిని మానవోత్తము లెవ్వారును నిర్ణయింపలేని
సందిగ్ధావస్థయందు వాక్చాతుర్యంబునను, యుక్తిప్రయుక్తులవలనను నిద
మిత్థమని నిశ్చయింపబూనుటకంటె దాటస్థ్యమును వహించుటయే శ్రేయోదా
యకము. బుద్ధభగవానుడవ్యక్తమఖండ స్వయంజ్యోతి స్వరూప విషయమునయి
మౌనమువహించి మహాపురుషునివిధిని నెఱవేర్చినాడు. బుద్ధప్రభువు క్వాచి
త్కముగా మౌనము నెడబాసి ప్రత్యక్షానుభవ సిద్ధంబులును, పరోక్షభావ
శూన్యంబులును నగు నొకటి రెండు విషయంబుల నుద్బోధించియున్నాడు.
ఒకతూరి నిజచ్ఛాత్రునితో బుద్ధుడిట్లు నుడివెను:- వాయనా! ఎయ్యెడ గమ
నాగమనంబులును, జననమరణంబులును సుఖదుఃఖములును మందునకయిన
గోచరింపక నిజాస్తిక్యమును బాపియుండునో [ద్వంద్వార్థభూయిష్ఠంబగు
భౌతికపదార్థమునుండియు, ఉపాధులనుండియు, విషయగ్రంథులనుండియు
భిన్నమయిన శాంతిమయావస్థ] తత్ప్రదేశంబుననే విశ్వకర్త యధివసింపు
చుండును. అట్టి యనంతామలాద్యశక్తిస్వరూపమే మహాశక్తి యగుచో సృష్టి
స్థితిలయాత్మకరూపక్రియాత్మకంబగు భూతప్రపంచజాలమునుండి జీవులు బంధన
విముక్తులు కాజాలరు. భూఖండమునం దిప్పటికిని బౌద్ధులలో నయిదుకోటుల
మహాత్ములు శ్రీ బుద్ధుని జ్ఞానమూర్తికి స్వయం సమర్పితములయి యున్నవి.
ఇట్టియపూర్వ జ్ఞానకరుణా తేజఃపుంజవిలసమాన నోత్ప్రాభవ్యమూర్తి యనాత్మ
వాది యెల్లకాలనేర్పాటుగా వాయువునో వేగంబుల బరుగిడు శతాబ్దముల వ్య
తీతమయినకొలది చరిత్రప్రసిద్ధుండును మానవసమాజాజ్ఞానాంధకారభాస్క
రుండును నగు శ్రీసిద్ధార్థునియెడ భారతీయుల కకళంకంబగు శ్రద్ధాభక్తులను

సంపూర్ణాచల విశ్వాసంబును ద్విగుణీకృతములు కాగలవు; ఇందు సందియం బావంతయు లేదు. ఇటలీ దేశమునం దిటీవల సుప్రశస్తంబగు గ్రంథరాజ మొండు విరచితంబయ్యెను. తద్విఖ్యాత గ్రంథమున శ్రీ బుద్ధాచార్యుని మహా దాదర్శంబగు దివ్యచరిత్రము మనోజ్ఞంబులగు గీతంబుల హృదయాహ్లాద కరంబుగ గానము సేయబడినది. తద్గ్రంథము పాపినీ మహాశయుని జీసుజీవిత చరిత్రముతో దుల్యగుణ మండితమయి రాణించుచున్నదని విజ్ఞులయభిప్రా యము. ఆబుద్ధజీవిత చరిత్రము గీర్వాణభాషాపండితమండలాగ్రేసరుండగు డాక్టరు పాలీమహాశయునిచే ద్రాక్షారస పరిప్లుతంబగు జీవశైలిని రసౌచిత్య మును, విషయపాటవంబును, మహాదాదర్శ స్ఫూర్తియు వెలయుచుండ, జిన్ని జిన్నెలు పెంపెక్క మృదుమధురంబుగ రచింపబడియెను. అందు సిద్ధా ర్థుని గృహపరిత్యాగమును మహదానందాతిరేక ప్రబోధ యుక్తంబుగను, మానసోల్లాస కరంబుగను, చిత్తరువుపగది చిత్రించియున్నాడు. బుద్ధుడు సాంసారిక విషయ పంకిలగ్రస్తులగు సోదరమానవులను, సకల జీవరాసులను భయవిషాదజనన మరణసాగరమునుండి యుద్ధరింప సమస్తరాజ్యభోగ భాగ్య విలాసంబులను, బంధుమిత్ర పుత్రకళత్రాద్యాత్మీయమండలిని తృణప్రా యంబులుగ, ననన్యసామాన్యంబగు మహదౌదార్య విశేషంబున బరిత్యజించి వైచెను. ఆతడు మహాబోధి వృక్షతలంబున భగవత్సాక్షాత్కారము (శాశ్వతానందము)ను బడసెను. దేవుడు తాను బడసిన నిర్మలనిర్వాణసౌ ఖ్యామృతరసమును జీవకోటికెల్ల బ్రసాదింపకుండుట యెంతయు స్వార్థభూ యిష్ఠంబగు నింద్యకర్మంబగునని భావించెను. బుద్ధప్రభువు తొలుత వార ణాసియందు నిజమహత్సత్య సందేశమును సకలజనులకును బోధించెను. బుద్ధు డు వైశాఖపూర్ణిమలయందెపుడును శిష్యబృందమునకు ధర్మతత్త్వవ్యాఖ్యాన పరిజ్ఞానమును గలుగజేయుచుండెడివాడు. బుద్ధుడు సజీవుడు. ఆతని చర్యలు సజీవములు. అతని ప్రత్యేకగీతాపద సమూహంబగు నైతికజీవ కళాస్ఫూర్తినిలసితము. ఇదియే నామనోనిశ్చయము. జీసస్‌క్రీస్తువు, శ్రీకృష్ణ

 

రామచంద్రాద్యవతార పురుషులీబుద్ధదేవునివంటివారే. సిద్ధపురుషులు పరిశు
ద్ధప్రబుద్ధులగు కతన గీర్తికాయులయి, మృత్యుముఖగహ్వరమునుండి దూరు
లయి, యాచంద్రతారార్కంబుగ వసుధవర్థిల్లుచు, జీవహిత కార్యపరతం
త్రులగుచునే యుందురు. భయవిషాదదాయకంబులును, సుఖదుఃఖోత్పాద
కంబులును నగు జననమరణోపాధులనుండి సంపూర్ణపరిత్రాణమును బడయ
నభిలషించు వారికి బుద్ధాది మహాత్ములు శాశ్వతంబగు తమ జ్ఞాన కాయములచే
దివ్యప్రబోధంబుల నొసంగుచు బ్రహ్మజిజ్ఞాసువులయొక్కయు, ధర్మజ్ఞాన
పిపాసువులయొక్కయు విశాల జీవితపథముల బరిష్కృతము లొనర్ప నమి
తోత్సాహంబును సర్వకాలసర్వావస్థలయందు గలిగి ధరణి వరలుచుందురు.

* * * *

## వాస్వానీపండితుని ద్వితీయోపన్యాసము—బుద్ధుని ఆత్మశక్తి

బుద్ధదేవుని మహదుత్తమ సందేశమును, నిర్వాణమును బడసిన సందర్భ
మును గూర్చిన కథాభాగ మత్యద్భుతము. సిద్ధార్థుడు భార్గవాశ్రమంబునకు దప
శ్చర్యోపక్రమణార్థ మరుగుటకు బూర్వము నిజసారథి కాత్మజ్ఞానప్రబోధము
సేయుచు భూపాలోచిత వసనాభూషణముల నతని కొసంగి, సుందరమగు
దీర్ఘకేశదామంబును జంద్రహాసంబున ఖండించివైచి భైక్షుక వేషమును ధరించి
యిట్లు నుడివియుండెను: "ఛన్నా! నా కీపీతాంబరములతోడ నేమి ప్రయోజ
నము? సన్యాసికి బాహ్యవేషాడంబరమును, బహిరంగానుష్ఠాన పటాటోపమును
దగదు." భూపాల తనూజుండగు సిద్ధార్థుడు భోగవిలాసాస్థిరత్వమును,
దేహక్షణభంగురత్వమును గ్రహించి సర్వసంగపరిత్యాగియయి, భిక్షుత్వము
(ఆత్మసన్యాసము) ను హృదయపూర్వకంబుగా స్వీకరించియుండెను. సిద్ధా
ర్థుడు వత్సరసప్తకము పర్యంతము దపోవనంబున నచంచలంబుగను, తదేకనిష్ఠా
గరిష్ఠంబును నగు తపశ్చర్యయందు నిరతుడయియుండినను నిజమనోభీష్టము
సిద్ధింపని హేతువుచే నన్యప్రదేశంబున కరుగ గమనోన్ముఖుడగుచుండ నంత
లో సంకల్పపరివర్తనమగుడు, తనకు సమీపమునందే యున్న బోధి (అశ్వత్థము)

వృక్షతలంబున దృణాసనమును నిర్మించుకొని, యాసీనుడయ్యెను. ధీరుడయి, వీరుడయి యతడట నంత నీచందంబున భీషణప్రతిజ్ఞాబద్ధహృదయుండయ్యెను. "నాయీ దేహము సంపూర్ణముగ శుష్కించిపోయినను, శల్యములు చూర్ణీకృతములయినను, రుధిరము శోషించిపోయినను, బరిశుద్ధమగు నామనోరథము సఫలమగు పర్యంతము—నిర్వాణపథము కరగతమగునంతవరకు నన్నీపాదపమూలమునుండి చలింపజేయు వాలువారెవ్వరు?" ఆహా! ఏమి యాధీరాగ్రేసరుని గంభీరభూధరసదృశాచంచల సుదృఢచిత్తము! ఏమి యాదివ్యపురుషపుంగవుని సుస్థిరమనస్సంకల్పము! ఆతనిదృఢప్రతిజ్ఞ ధన్యము! ధన్యము! మానవు డీసర్వంసహాచక్రమం దేకార్యమును సుస్థిరప్రతిజ్ఞాబలంబున సాధింపలేకుండు? అచంచలాభేద్యసంకల్పకవచధారియగు యోధు డీసంసారసమరాంగణమున బుద్ధదేవునివలె దుస్సాధ్యంబులుగ బ్రతీతములగు సమస్తకష్టమయకార్యకలాపంబు లనిర్విఘ్నముగ, నిరాఘాటముగ, నిస్సందేహముగ సాధింపగలడు— నిశ్చయముగ సాధింపగలడు. ఇది ధ్రువము. మనుష్యుడు దేవాంశసంభవుండగు కారణంబుననే సర్వసృష్టియం దుత్కృష్టుడయి, ఆత్మశ్రేయోభివృద్ధికరంబులగు సకలకార్యకరణోపకరణముల గలిగి మనుచున్నాడు. శ్రీబుద్ధదేవు డీచందమున నభేద్యంబును, నగమ్యంబును, కామప్రవేశదుర్లభంబును నగుసుస్థిరవిశుద్ధచిత్తంబుతోడ సుఖాసనాసీనుడయి, సత్యధర్మజ్ఞానపథాన్వేషణ విషయకపరిశీలనమందు మేధాసంపత్తి నుపయోగింపుచుండ, మకరకేతుడు (కాముడు) కామక్రోధాది నానారోధానుయోధ సుసజ్జితుడయి బుద్ధు నాక్రమింపనేతెంచి, యనేకవిధంబుల నాదేవునిచిత్తమును మార్గత్వంబున స్వాధీనము గావించుకొనుట కుపక్రమించెను. ఆతడు నిజతీక్ష్ణకోమల శరపరంపరల గోదండమున సంధించి, బుద్ధుని సుస్థిరచిత్తకవచమును భేదింపదొడంగెను. చిత్తసంయమదుర్గమును భూతలపతితము గావింప నున్ముఖములగుచున్న మారునితీక్ష్ణావిరళశరప్రహారంబుల ఖండించివేయుచు, నతనిదర్పాలకెల్ల బుద్ధుడు ప్రతిఘటించి, విజృంభితుడయి నిలిచెను. మన్మథుడు నిజభాగీరథ

ప్రయత్నంబు సహచరగణ సమేతంబుగ సలిపియు విఫలమనోరథుం డయ్యెను. అంతటితో వాడూరకుండక, యొక్కయెదుటను నిజకోశోన్ముక్త నిశితకృపాణ పాణియయి బుద్ధునిపయి బుభుక్షాపీడితంబగు వ్యాఘ్రము హాఱకాబకము నయి లంఘించుపడువున నటికిపడెను. కాని, మహాధీరుడగు బుద్ధప్రభువు తిలమాత్రంబయిన చంచలితుడుకాలేదు! కాముడు యథాశక్తి నానావిధమనోహాయంబులను, బాహుమనోబలాతిశయంబులను, మదన గామోత్పాదకశృంగారమయచేష్టలను గావించిచూచెను. కాని, బుద్ధుడించుకయు చలింపలేదు; చలించులక్షణమే కానరాదయ్యె! సామాన్యమానవ దుర్లభంబును, మధ్యందినమార్తాండప్రభా సదృశతేజోవంతంబును, మహీధరతుల్యగభీరప్రజ్ఞాతిశయంబునుగల చిత్తముయొక్క స్థిరసంకల్పప్రభావ మెట్టి యమోఘమయినది! సమగ్రవిశ్వమునకు సుస్థిరసంకల్పబలప్రభావ దివ్యమంత్రము నుపదేశించుటకై భువినవతరించిన బుద్ధదేవుని స్వీయధర్మసాధనమునుండి పరాఙ్ముఖుని గావింప నీకాముడేగాదు, ఇట్టి కామాధిపతులు కోటానుకోట్లు కేతెంచినను నతని వేడినిట్టూర్పు మందయిన నిలువనేర్తురా? వజ్రతుల్యంబగు దివ్యసంకల్పమే విశ్వహృదయంబున సర్వజీవితప్రసారము నొదవించునది. ఆత్మీయకపటవ్యాహారరచనా చాతుర్యము కూలబోయిన పన్నీటిచందమగుట నుపలక్షించి, మారుడు తీరనిపరాభవానల జ్వాలాపరివేష్టిత హృదయంబున ఖిన్నుండును, క్రుద్ధుండునునయి కాలరుద్రునిబోలె నేత్రయుగళినుండి యగ్నిస్ఫులింగము లసంఖ్యాకములు బహిర్గతమగుచుండ, నొక్కసారి విజృంభించి, బుద్ధునిపై శిలావృష్టిని వర్షింపజేయుచొచ్చెను. నవవికసితసుగంధమను పుష్పదామంబులవలె తీక్ష్ణములగు నాపాషాణఖండములన్నియు బుద్ధునిచరణ రాజీవములక్రోల బడదొడంగెను. అంతమునకు బుద్ధుడే విజయమును బడసెను. కుసుమబాణుడు ఖేదాంబుధినిమగ్నుం డయ్యెను. మహదతీతాహింసావ్రతానుష్ఠాననిష్ఠాగరిష్ఠుండగు శ్రీబుద్ధచంద్రుని విచలితునిగావించుటయా! ఏటి మాట! అతని యతులనీయంబగు పరిశుద్ధాత్మశక్తి! అనిర్వచనీయంబగు ప్రబల

విశ్వాసము!! అవశ్యంబగు పరివిమలచిత్తశుద్ధి!! మహత్తరంబగుస్థిరీకృతోద్దేశసంపత్తి!! అలౌకికంబగు ధీరసంకల్పబలము!!! కర్తవ్యపథ ప్రతిబంధకములనెల్ల నిర్మూలింపకుండునే? బుద్ధదేవుడంతమునకు మారునితో నిట్లనియెను: 'ఓరీమూఢా! దుర్మదాంధా! మారా! జీవితకార్య- సాధనప్రదేశంబగు నీదర్భాసనము మామకీనము. ఇద్దానిని నేను విసర్జింపనొల్ల. శక్యమగుచో రా! రమ్ము! మారా! ఓరీ క్రూరా!' నాపైకి దండెత్తిరమ్ము. నిన్ను భస్మీపటలమొనర్చి వైచెద. తావకంబగు నఖశిఖాగ్రపర్యంత దహనమే యీ నాసాధనము యొక్క పరమలక్ష్యము. ఇద్దియే నా నిశ్చితాభిప్రాయము; శిలాక్షరము. వీరకేసరియగు బుద్ధుని హృద్విదారకంబులగు వచనములను వినుచుండ దల్లడిల్ల నతని కాయమంతయు భయప్రకంపితమయి, స్వేదజలసిక్తమై పోయెను. రతీనాథు డతని కచిక్కుండుట హానికరమని గ్రహించి, పలాయమానుండయ్యెను. మారమారణ క్రియాసంగ్రామంబున విజయలక్ష్మి గౌతమునికంఠసీమను గుసుమమాలికచే శృంగారించెను. తత్క్షణమే సిద్ధార్థుని జ్ఞానచక్షువు తెరవబడె, అతనియాధ్యాత్మదృష్టి పరిష్కృతంబును, సమున్నతంబును సువిశాలంబును నయ్యెను. ఆతడంతట నిర్వాణము లేక బ్రహ్మసాక్షాత్కారము (బుద్ధి లేక సిద్ధి) నందెను. తదాదిగ నతని సిద్ధార్థనామము రూపుమాయ, బుద్ధుడు (పరమజ్ఞాని లేక బ్రహ్మానందయోగి) యను శుభాహ్వయంబు సుప్రసిద్ధమయ్యెను. నేడీవిపులసంసారచక్రమంతయు నాతని విశాలవక్షోభాగంబున నాశ్రయమును బడయగలిగెను. సకల జీవరాసులు నాదేవునిచే బ్రతిష్ఠితంబయిన సువిశాలోన్నత ధర్మధ్వజచ్ఛాయయందే భేదభావంబును బాసి ప్రేమగీతముల బాడుచు, నైక్యహృదయంబున బరిణమించి, యావజ్జగత్తును మృదులహాసచంద్రికలచే దేదీప్యమానముగావించివేయుచున్నవి. బుద్ధుడు వింశతిశతాబ్దములకు బూర్వమువలెనే నాముష్మికజీవిత నిర్వహణాసక్తులకెల్లరకు నిజదివ్యసందేశము నిప్పుడును బ్రసాదింపుచునేయున్నాడు. శ్రీబుద్ధశుద్ధసిద్ధప్రబోధవాక్యములెట్టివి? "అన్నలారా! జాగరూకులయి యుండుడి, అలసులగుట తగదు. అప్రమత్తతనే భజిం

ప్రుడి. స్వావలంబనమును విస్మరింపకుడు. మీ భాగ్యాభాగ్యములకు మీరలే కర్తలు." శ్రుత్యుపనిషత్కారులగు ఋష్యాదులెల్లరు హిందూమతావలంబుల కనుగ్రహించిన సందేశవాక్యము లివియేకదా! "లెండు, త్వరపడుడు, గమ్యస్థానమును జేరువరకు విశ్రమింపకుడు. దివ్యాత్మశక్తిని జాగరితమొనరింపుడు. ఎద్దానికిని దాస్యమొనరింపకుడు." ఋష్యాదులొసంగిన యీసందేశములందును బుద్ధదేవుని దివ్యాత్మజ్ఞానపూరితంబగు సుపర్యుక్తసందేశమందు నీషణ్మాత్రంబయిన దారతమ్యము లేదు.

రెండును నాత్మశక్తి ప్రేరేపకంబులేగాని భిన్నములుగావు. ఇటిస్థితియందు ఋష్యాదులమత మాస్తికంబును, బుద్ధునిమతము నాస్తికంబెట్లగును? శ్రీబుద్ధదేవు డఖిలవిశ్వంబునకును గటాక్షించియున్న మహాత్సత్య సందేశము నిస్తేజంబును, నిరాత్మవాదాశ్రయంబును, నిర్వీర్యంబును, అకర్మణ్యంబును నగు నన్న గేవలము నిందయె. ఆంధ్యాభ్యాస ప్రేరిత సందేశములకాధార మాధ్యాత్మిక నైతికశక్తులే. బుదుడు నిత్యము నాత్మస్థైర్యమును, ఆత్మబల విశ్వాసగౌరవములను, ఆత్మజ్ఞానవికాసమును నుద్దీపింపజేయుడనియే భౌద్ధసాధకుల (వేదాంతుల) కెల్లరకు బోధింపుచుండెడివాడు. బుద్ధదేవుడు బదపదియేట నిజనిర్వాణకాలము సమీపించినపుడు ప్రాచ్యపాశ్చాత్యులకును బ్రియశిష్యుండగు నానందునకును నీరీతి నుద్బోధించియుండెను.—"నాయనలారా! ఆత్మబలమును మఱువక, సంయమవ్రత పాలనమును బాయక, జీవకారుణ్యార్ద్రహృదయులరయి, ధర్మజ్ఞానముల సముపార్జించి, శాశ్వతానంద కందమగు సద్గతిని బడయుడి."

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

## లోకమాన్య బాలగంగాధర తిలకుగారు.

జగద్విఖ్యాత మేధాసంపన్నుండును, బరిత్యక్త సమస్త స్వార్థ ధనుండును, సకల లోకారాధ్యుండును, భారతమాతృ గౌరవాతిశయ పరివర్ధకుండును, రాజ్యాంగ, ధర్మ, వేద, వేదాంగ, సాహిత్యశాస్త్ర నిష్ణాతయు నగు తిలకుమహాశయుడు నిజకీర్తికాయస్వరూపంబగు గీతారహస్యమునం దీ చందమున లిఖియించియున్నాడు. "సుప్రసిద్ధములగు బౌద్ధ జైనమతములు రెండును, జనకుని వద్దనుండి పితార్జిత ధన సంపదల వలయువిభవమును విభజనమున బడసి, కొన్ని హేతువులచే వేఱుగానున్న పుత్రులవలె నున్నవి. అనగా నివి పరకీయములు కావనియు, వైదికమతోద్భవంబులే యనియు దెలియుడి." హిందూ బౌద్ధమతములు పృథక్కరణంబు నందినవే కాని భిన్నాదర్శ యుక్తములు కావని తిలకుమహాశయుని తలంపు.

## శ్రీ శరత్కుమార రాయలు.

వంగీయ దార్శనిక పండితమ్మన్యుఁ డగు నీమహాశయుఁడు బౌద్ధమతమునుగూర్చి నిజాభిప్రాయము నిట్లొసంగియున్నాడు:-

"సత్యజ్ఞాన కృషిచే లబ్ధంబగు యథార్థాత్మదృష్టి (జ్ఞాననయనము) వలన సాధకుని హృదయమందిరంబున స్వయంప్రకాశితంబగు నిగూఢతత్వ విశుద్ధ సత్యజ్యోతియే మోక్ష

వులు ప్రాపింపవలయు ముక్తి లేక నిర్వాణము. దీనిని బ్రహ్మ యన్నను, అల్లారహీమన్నను, హోలీగోస్టన్నను, ధర్మకాయ మన్నను భేదము నుంతయును లేదు. అన్నింటికి మూలపదార్థమొక్కటియే. ఇవన్నియు నిగూఢసత్య తత్త్వబోధకములె." ఈ పండితపుంగవుని యభిప్రాయము బుద్ధుడు నాస్తికుడుగాడనియు, దద్దేవుని నిర్వాణము శూన్యత్వ వాచకము గాదనియు, నదియే బ్రహ్మము లేక భగవత్పదార్థమనియు స్పష్టమగుచున్నది.

ఆచార్యక్షితీశ మోహనసేనుడు, ఎం. ఏ. గారు.

వంగవాఙ్మయమునం దున్నతస్థాన మంది దార్శనిక క్షేత్రవిహారమందే యానందమందు నటి యీపండితపుంగవుడొక్కచో బుద్ధదేవునిగూర్చి యిట్లభిప్రాయ మొసంగియున్నాడు:—"సత్య స్వరూపాన్వేషణమునందు శ్రీ బుద్ధాచార్యుడతికుశలుడు. అతనిసాధనమార్గము (మోక్షజ్ఞాన సంపాదనా విధానము) సకలమత పారమార్థికోద్యోగ విధానమును దిరస్కారదృక్కుల వీక్షించునంతటి మహత్తర మయినది. మహాపురుషుడగు బుద్ధుడు నిజతత్త్వ జవోపదేశంబులచే సమగ్ర విశ్వమునకు నపారమగు మహోపకారము సలిపియున్నాడు. ఆమహనీయుడు నిర్జీవంబగు హిందూధర్మోపదేశ భాగమును నిర్మూలించి, సజీవంబగు నాత్మవికాస విభాసురంబగు సనాతన ధర్మజ్యోతి నుద్ధరించి సమస్త ప్రపంచము 'నొక్కతూరి

దేదీప్యమానము గావించియున్నాడు. దీర్ఘకాలమునుండి సంకరములయి వివిధ సంప్రదాయ లబ్ధ విభేదంబులకు జిక్కి, కలుషితంబయిన మతమును, దస్మృత పరిచర్యచే వికాసశూన్యములయిన మానవాత్మలను, గళాన్వితములు గావించిన దీమహాత్ముడే. సర్వజీవన సంచార విహీనమగు జ్ఞానగమ్య సత్యము నందీసత్యస్వరూపుడే నూతన జీవిత స్ఫూర్తిని వెలయింపజేసి, ధన్యభాజనుం డయ్యెను. శ్రీ బుద్ధుడు సత్యసందేశమును భూలోకమునకు గొనివచ్చిన యవతార మూర్తియే కానిచో, నతని పాదరాజీవంబుల నసంఖ్యాకులగు మహదుత్తమ పండిత ప్రకాండులు నిజామూల్య జీవిత పుష్పగుళుచ్ఛంబుల నేల సమర్పింతురు? బుద్ధుని, బుద్ధునిమతమును దూషించుటే వృత్తిగా గల్గియున్నట్టియు, బరమతాసహన బుద్ధిచే జన్మించినట్టియు మహానుభావులకు బుద్ధదేవుని బోధనలన్నియు నాస్తికములును, జడత్వవాచకములే గావచ్చును. కాని పరిశుద్ధసత్య జ్ఞాన స్వరూపుండగు సర్వేశ్వరుని సాక్షాత్కరింప జేసికొన నభిలషించువారికి బుద్ధుడును, బుద్ధుని మతమును సన్మానభాజనములే యగును.

రవీంద్ర కవిసార్వభౌముడు.

"బౌద్ధమతము నాస్తికమే యగుచో, బుద్ధ డనాత్మవాదియే యగుచో, నసంఖ్యాకులగు మహానుభావులేల యా సత్పురుషుని సందేశముల నాలకించుటకయి, తండోప తండములుగ గుమిగూడియుండిరి?"

## శ్రీ వివేకానందస్వామి.

అమెరికా సంయుక్త రాష్ట్రములందలి డెట్రాయిటు నగరమున జగద్విఖ్యాత తత్వవేత్తయు, సకలమత సామరస్య ప్రకటనకర్తయు, మహాదాదర్శ భారతీయ వేదాంత జ్ఞాన నిధియు, మహాపురుషుండును నగు శ్రీ వివేకానందస్వామి బుద్ధదేవుని గూర్చి గంభీరోపన్యాసము నొసంగియున్నారు. తదుపన్యాసమందు మనకు వలయు ప్రధానాంశము లివియ:— ఒకపర్యాయము బ్రాహ్మణభక్తు లేవురు భగవత్స్వరూప నిర్ణయమునకయి పరస్పర కలహాగ్రస్తులరయి, వివాద పరిష్కారార్థము శ్రీ బుద్ధప్రభువు పాదరాజీవముల నాశ్రయించిరి. వారేవురియం దొక్కవిప్రుడు "బుద్ధదేవా! మాదేవుడే నిర్మలుండు, వానిని బ్రాపింప మస్మత్రోక్తపథమే యుత్తమము." అనియెను. ద్వితీయ భూసురుడు ప్రథమవ్యక్తి యభిప్రాయమును ద్రోసిపుచ్చుచు "దేవా! వీనిభావము భ్రమాన్వితమయినది. మా మతగ్రంథోక్తాభిప్రాయమే భగవన్నిర్ణయమునకును, దత్ప్రాప్తికిని దగియున్న" దనియెను. ఈవిధముననే బ్రాహ్మణపంచకము భగవద్విషయంబున వాదులాడుచు బుద్ధభగవానుని న్యాయమును బ్రసాదింపుడని వేడుకొనిరి. బుద్ధప్రభు వంతపర్యంత మవ్వారి కలహభావనంబులును, చిత్తశాంతి భంజకంబులును నగు శుష్కతత్వ వాదముల శాంతచిత్తముతోడ నాలకించి, తుదకిట్లు మృదుమధురంబగు కంఠ

స్వరంబున వారల బృచ్ఛించెను:—"నాయనలారా! సర్వేశ్వ రు డుగ్రస్వభావుడని గాని, పరాపకార పరతంత్రుడని గాని, అపరిశుద్ధ హృదయుండని గాని మీ మీ మతగ్రంథముల యం దెచ్చోనయిన లిఖియింపబడి యున్నదా!" "లేదు. లేదు. ప్రభూ! మా గ్రంథములన్నియు దేవుని నిత్య పరిశుద్ధుండని యు, దయాసాంద్రుడనియు, అనాథనాథుడనియు, శాంత స్వరూపుం డనియు గాఢాళధ్వానముల ఘోషింపుచున్నవి." అని యేపుస విప్రు లైక్యకంఠమున, మారువల్కిరి. అంత బుద్ధాచార్యు డీప్రత్యుత్తర మొసంగెను:— "అయినచో, బిడ్డలారా! మీరు తమలోందాము వాదులాడక, సర్వేశ్వర సాక్షాత్కార నిమిత్తమయి, దేవునివలె బరిశుద్ధ చిత్తులగు టకును, జ్ఞానసంపన్నులగుటకును, యోగ్యులగుటకును బ్రయ త్నము సేయరేల?"

అన్య ధర్మప్రవక్తలగు మహాపురుషులరీతి బుద్ధుడు శిష్యార్థము నిజసన్నిధి కేతెంచిన బ్రహ్మ జిజ్ఞాసువులకు సమస్త మానవ హితమునకును, విముక్తికిని దా నెంతమాత్రము గర్తనుగాననియు, మార్గబోధకుండ నగు నిమిత్తమాత్రుడనే ననియు, నెవరికివారే స్వయంకృషిచే నప్రమత్తతచే, స్వయం సమర్పణబుద్ధిచే నిర్వాణమును జెందవలయుననియు, బోధించి యున్నాడు. నిర్వ్యాజ కర్మాచరణ శీలతాపరిపూర్ణావతార పురుషుండగు బుద్ధాచార్యుని సత్కార్యాచరణ విధానావ

లంబనమున మనము సర్వోత్తమాధ్యాత్మికోచ్చ దశను బ్రాపింపగలము. బుద్ధభగవానుని విమర్శించి దోషముల నన్వేషింప నస్మాదృశుల కధికార మావంతయును లేదు, శక్తియును శూన్యమే. శ్రీ బుద్ధదేవుని యపూర్వావస్య కరుణా సుధారసార్ద్రశీతల హృదయము మహిమయందు దిలమంత శక్తియే నాకున్న నేనును ధన్యుడనే యగుదు.

స్వాముల వారి బౌద్ధమతము హిందూమతోద్దేశ్యముల నిర్వహించిన మతమే యను ద్వితీయోపన్యాస సారాంశము.

నేను బౌద్ధమతావలంబిని గానని మీరాక్షేపించి యున్నారు. అయినను నేను బౌద్ధుడనే. హిందువులు బుద్ధు నవతరించిన భగవానునిగనే భావించి యారాధింపుచున్నారు. బౌద్ధ హిందూమత సంబంధము, క్రైస్తవయూదియామత సంబంధమును బోలియున్నది. క్రీస్తుప్రభువు చందమున నే బుద్ధప్రభువుకు సనాతన మతోద్ధారకుడుగ భువి నవతరించియున్నాడు గాని పూర్వమతవిధ్వంసకుడుగా నావిర్భవించియుండలేదు. బుద్ధ, క్రీస్తుప్రభువు లిరువురు నొక్కతత్త్వ నిర్వాహకులయి, ప్రేరకశక్తిచే ధరణి నవతరించినారు. శ్రీ బుద్ధదేవోద్దేశ్యముల గ్రహింపలేక దూషించు వారు, జీసస్సును గొఱ్ఱు (సిలువ) వేసినవారికి దుల్యులేయగుదురు. హిందూమతోద్ధారకుడయి, బుద్ధప్రభు వవతరించియున్నాడు. తత్కాల హిం

దూమత స్థితిగతులలో బుద్ధావతార మెంతయు నావశ్యక మయియుండెను. ఆవిషమస్థితియందట్లు బుద్ధు డుద్భవింపక తప్పదు. శాక్యమునిచంద్రుడు నిగూఢమగు సమున్నత సంస్కృతభాషయందు లిఖియింపబడియున్న వేదములగుప్త సత్య జ్యోతిని బ్రకటితమొనర్చి, విశ్వమునంతయు నుద్దీపింపజేసిన విశాలభావ హృదయుడు; దివ్యతరానూన తేజోవిరాజితుడు; మహానుభావుడు. మతప్రచారక సమితుల ప్రథమస్థాపకోద్ధారకుండితడే. ఒకమతమునుండి మతాంతర స్వీకారమును బ్రజలచే జేయించిన ధర్మప్రవర్తకులందితడే యగ్రేసరుడు. ఈమహాత్ము డన్యాన్యమతములచే నల్పదృష్టితో నవలోకింపబడిన పామరులనెల్లర నవ్యాజ కరుణామయ దృక్కుల నవలోకించి, శిక్షాదీక్షచే నుద్ధరించి యున్నాడు. శ్రీ బుద్ధుని శిష్యులనేకులు బ్రాహ్మణులు. శ్రీ బుద్ధాచార్యుడు పండిత గ్రాహ్యమగు భాషను మతప్రచారమునకయి స్వీకరింపక వ్యావహారిక భాషనే గ్రహించి సకలప్రజా కళ్యాణమునందగ్రగణ్యుండయ్యెను. అనాది హిందూమతమున కాధార భూతములయిన సర్వసౌభ్రాతృత్వ, సర్వజీవ దయాపరత్వ, పరోపకార పరాయణత్వ దుఃఖసహిష్ణుత్వాది సత్వగుణంబు లన్నియు మటుమాయమగుచుండ బుద్ధదేవు డవతరించి వాని నన్నింటి బునరుద్ధరించెను. బౌద్ధమతము లేనిదే హిందూ మతము జీవింపజాలదు, హిందూమతము లేనిదే బౌద్ధమతమ్ము బ్రదుకలేదు. బ్రాహ్మణతత్త్వశాస్త్రము, బుద్ధియును బౌద్ధ

మతజీవితమున కాధార భూతములయియుండ, బౌద్ధుల సర్వ భూతదయార్ద్రహృదయంబును, నిష్కామకర్మాచరణ పరిపూర్ణత్వంబును హిందూమత జీవనమునకు ప్రాణసమానములయి యున్నవి. బౌద్ధహిందూమత విశ్లేషము హిందూదేశ పతనంబునకు హేతుభూతం బగును. కాన మనమెల్లరము శ్రీ బుద్ధ భగవానుని మహదుదార హృదయాంబుజమును, దయార్ద్ర చిత్తంబును హిందూమత మహాద్భుత సౌజన్యముతోడ సమ్మిళిత మొనరించి, ధన్యులమగుదము రండు !!

## ఎడిత్ హాలండు

ఎడిత్ హాలం (Edith Holland) డను నాంగ్లపండితురాలు బుద్ధదేవుని నిత్యపవిత్ర చరిత్ర చిత్రణము జేయుచు నాదేవుని యనన్యసామాన్యంబగు నాధ్యాత్మిక జ్ఞానతేజోరాశి కచ్చెరు వంది, అతని నవిరళ తరంగిత కరుణారస పూరితచిత్త మహిమ కప్రతిభయయి, అతనియప్రమేయవిశుద్ధవిశ్వప్రేమ గీతారవంబులు హృదయంబున బ్రతిధ్వనింపఁ బరమాహ్లాదిత హృదయయయి, పశ్చిమఖండ మాసియాఖండపాదధూళికయిన సరిరాదని నుడువ సాహసించియున్నది. ఈ పండితురాలు బుద్ధదేవునిగన్న యాసియాఖండమే యేసుప్రభువును సయితము బ్రసవించినదని నుడివెను. సకలపృథ్వీదిగ్వలయ వ్యాప్తసుజ్ఞాన తేజోమయకిరణ మాలికల కాసియాఖండమే యుత్పత్తిస్థానమని వచించియు నున్నది. ఈ యువతీమణి బుద్ధునియపూర్వసామ

ర్థ్యమున కాశ్చర్యమునంది 'East and west' అను తన వ్యాస మునం దీవాక్యముల వెల్లడించియున్నది:— "ఆసియాఖండ మునందలి ప్రత్యేక మానవునిపరిస్థితు లాధ్యాత్మిక తేజస్సంపన్నములయి, ఆత్మబల పరిపుష్టములయి, భాసిల్లుచుండునని బుద్ధదేవుని మహాదాదర్శము నవలోకించియున్న ప్రతిమనుజుడును గుర్తెఱుంగకపోడు. క్రీస్తుభగవాను డాసియాఖండమత సాగరతరంగ మాలికలనుండియే భగవత్తత్త్వ బోధకుడయి మహత్సత్యసందేశము నీపశ్చిమ ఖండమునకు గొనివచ్చి యున్నాడు." ఈ పండితురాలిచే విరచింపబడిన "The Story of the Buddha" శాక్యమునిసంస్తవవాక్యములతో నిండియున్నది. హాలండు విదుషీమణి ప్రధానాభిప్రాయమును గనుడి:— "Though Buddhism may differ in many ways from our own creed, we cannot but reverence a faith which has been the guiding light of so many of our fellowmen. Like Asoka let us honour those of whatever sect, who follow the Truth. The Buddha's message, like that of Christianity, was for all mankind without distinction." భావము:— "బౌద్ధమతము మనమతమునుండి భిన్నముగానున్నను దాని నాదరించుటయే మనవిధి. సత్యము ననుసరించు నేమతమునయిన, అశోకునివలె నారాధించుటయే శ్రేయస్కరము. బుద్ధదేవుని సందేశము నయితము మన క్రైస్తవమతము చందముననే సకల మానవజాతి నాహ్వానించినది." ఈమె యొక్కచో బుద్ధుడు క్రీస్తు

వలెనే దివ్యసందేశమును గొనివచ్చినదేవదూత యనియెను.

*　　*　　*　　*

బౌద్ధపరివ్రాజకుండగు హుయనుత్స్యాంగు.

రమారమి క్రీస్తుశకము 630 వ సంవత్సరప్రారంభమున జైనా దేశీయుండగు నీమహానీయుడు బుద్ధదేవుని పవిత్ర జన్మస్థానంబును దర్శింప నేతెంచి యుండెను. అత డీదేశమున బర్యటనము సలిపి సుమారు 1297 సంవత్సరములకాల మయినది. అప్పటి హిందూదేశమున హిందూబౌద్ధమతములు రెండు నెట్టి స్నేహభావంబున వర్తించినదియు దనయాత్రయం దీచందమున వ్రాసియున్నాడు:— "బౌద్ధ హిందూధర్మములు పరస్పర ద్వేషభావశూన్యములగా, యిటవెలయుచున్నవి. హిందూదేవాలయములును, బౌద్ధవిహారమందిరములును నిరుగుపొరుగుననే నిర్మింపబడి యేకమాతృ గర్భసంజాతులగు సహోదరుల యనురాగమును మఱపించుచున్నయవి." ఇంచుమించుగా శంకరాచార్యుని జననము పర్యంతము హిందూ బౌద్ధ మతములు పరస్పర ద్వేషములు లేకనే వర్తించియున్నట్లును, అనంతరమే పరస్పర ద్వేషమునకు బాల్పడినట్లును హుయనుత్స్యాంగు వ్రాతవలన దెల్లమగుచున్నయది.

*　　*　　*　　*

ఈమహానీయులేగాక, జగత్ప్రసిద్ధ పండితోత్తముండగు మాక్సుముల్లరు (Max Muller) "The Dammapada and

Sutta Nipata" యనుతనగ్రంథమందును, రైసుడేవిడ్సు (Rhys Davids) తన " Buddhism, Buddhist Suttas, dialogues of the Buddha, Buddhist India, Buddha's Birth Stories" అనుగ్రంథములయందును, కాప్లేస్టోను (Coplestone) తన "Buddhism" అనుగ్రంథమందును, బిగాన్డెట్టు మహాశయుడు (Bigandet) తన "The Life of Gautama" యనుగ్రంథమందును, డబ్ల్యు రాక్హిల్ మహాశయుడు (W. Rock Hill) తన "The life of the Buddha" యనుగ్రంథమందును, మనభారతజాతిరత్నంబగు రమేశచంద్రదత్తుమహాత్ముండు తన "Buddhism" అనుగ్రంథమునందును బుద్ధదేవుని, బౌద్ధమత సిద్ధాంతవాక్యరత్నములను వేనోళ్ళ సంస్తుతించి యున్నారు. ఆంగ్లేయ పండితోత్తములెందరో బౌద్ధమతప్రశస్త్యమును దెల్పు గ్రంథముల నెన్నింటినో విరచించి, ఐహిక భోగభాగ్య సాగరతరంగమాలికా డోలికల నుయ్యెలలూగు పశ్చిమఖండమునకు పారమార్థిక జ్ఞానశక్తి నొసదవించి యున్నారు. ఉపోద్ఘాతవిస్తర భీతిచే నింక సకల పండితాగ్రేసరుల యభిప్రాయముల వ్రాయుట మాని, అధునాతనవిశ్వపారమార్థిక జీవిత గగనమండలభాస్కరుండగు గాంధిభగవానుని బౌద్ధమతమునుగురించి వ్రాయబడినవ్యాసము నిట చేర్చుచున్నాడను. పాఠకభ్రాతలిపుడయిన బౌద్ధహృదయము నెఱుంగదగును.

శ్రీమద్గాంధి మహాత్ముడు.

నవదివ్యవిశ్వనిర్మాతయగు శ్రీగాంధి మహాత్ముడు తన యంగ

యుండియాపత్రికారాజంబున "The poet's Anxiety" అనువ్యాసమునందు రవీంద్రకవీంద్రుని కసహాయోద్యమము పట్లగల సకల సందేహముల నిర్మూలింప జేయుటకు దదుత్తరమోద్యమము యొక్క పరిత్యాగ (Negative) తత్త్వమును గూర్చి విపులముగ నిజ మృదు మధురంబగు భాషయం దుద్బోధించి యున్నాడు. మహాత్ముడు సహకారాసహకారోద్యమము లు రెండును సత్యసాక్షాత్కారమునకు మార్గద్వయమేసనియు లక్ష్యమునం దిసుమంతయు భేదములేదనియు దెల్ల మొనరించి పాఠకులయుల్లముల బల్లవింపజేసియున్నాడు. గాంధిదేవుడు సాహిత్య సమ్రాట్టు యొక్క యసహాయోద్యమ విషయక సమస్తమనశ్శంకల మూలోచ్ఛేదన మొనరింప నాస్తిక (Negative) ఆస్తిక (Positive) తత్త్వము లేచందమున సత్యమును బ్రాపింపజేయ సత్సాధనములయినదియు నీరీతివచించియున్నాడు:— 'కవీంద్రునకు బ్రతివిధనాస్తిక సిద్ధాంతనముదాయమన్నను భయమత్యధికము. అతని సంపూర్ణాంతఃకరణము సకలమతస్థిత సమస్తనాస్తికాచార విచారముల దిక్కునకు దిగస్కారదృక్పరంపరల బ్రసరింప జేయుచుండును. అననుసరణీయంబును, అత్యున్నతంబును, నగు నతనియపూర్వభాషాశైలియందే యతని నెగటివు తత్త్వ సిద్ధాంత ప్రతిబంధకోద్దేశ మిచట బొందు పరచెద:— "ఒకానొక యాదర్శ స్వీకరణమునందు గలుగు మనోదేకముకంటె బరిత్యాగమునం దొదవు చిత్తావేగమే విశే

షించియుండును. ఏతద్విషయము సత్య దూరముగాక పోయి నను, నే నయ్యదియే పరమసత్యమని విశ్వసింపజాలను."

"హిందూదేశముయొక్క బ్రహ్మవిద్యా ధ్యేయము లేక లక్ష్యము ముక్తి (Emancipation). బౌద్ధ మతము యొక్క పరమావధి నిర్వాణము (extinction). హిందూమతము యొక్క మోక్షము మనధ్యాసమును సత్యముయొక్క పరి గ్రహణతత్త్వము లేక భావార్థము (Positive form) వైపు నకాకర్షింపుచుండ, బౌద్ధమతనిర్వాణము లేక దుఃఖనాశనము సత్యస్వరూపముయొక్క పరిత్యాగతత్త్వము లేక అభావా ర్థము (Negative form) దిక్కున కీడ్చుచున్నయది. శ్రీ బుద్ధ దేవుడు త్యాజ్యమగు దుఃఖాస్తిక్యము కలదు, కలదనినొక్కి వక్కాణింపుచుండ, బ్రహ్మవిద్య, ప్రాప్యమగు దివ్యానందా స్తిక్యమున్నదని వచించుచున్నయది. ఏతద్వాక్యముల యందు ను మరికొన్ని యిట్టి వాక్యాంశములయందును రవీంద్రకవిసత్త ముని మనోభావస్వభావము హృదయంగమము కాగలదు. ఒక్క పదార్థాస్తిక్యస్వీకృతిభాతియే త్యాగముసహిత మాదర్శ ప్రాయమనియే మద్విషయపురస్సరాభిప్రాయము. సత్యస్వీ కారమెంత పరమావశ్యకమో, అసత్యపరిత్యాగము నటుత మంతియేముఖ్యమైనది. సకలమతము లీచందమున బోధింపు చున్నయవి:—పరస్పర విరుద్ధములగు శక్తులు రెండు మనచిత్తస్థ్ మలపయి నాధిపత్యమువహించి యున్నవి. మానవప్రియాత్మ్నో

ద్యోగములు పరిగ్రహణ పరిత్యాగ పరంపరలయందే ఘనీ భూతములయి యుండును. మేలుతోడ నలుపబడు సహయోగ మెట్టి విహితకృత్యమో, కీడుతోడనలుపబడు ననహయో గంబును నట్టివిధ్యుక్త ధర్మమేసుడీ!

తలపనితలంపుగా కవీంద్రుడు క్రమముగా నిర్వాణము (Extinction దుఃఖనాశనము)ను శూన్యత్వవాచకంబని వర్ణింపు చు బౌద్ధమతమునకు దీరనియన్యాయ మొనరించియున్నాడని సూచింప గడు సాహసించుచున్నాడను. కడుసాహసముతోడ నేనుహిందువులముక్తి(Emancipation)యెంతశూన్యతావాచ కమయియున్నదో,బౌద్ధులనిర్వాణము (Extinction) సైతమంతి యేశూన్యతాబోధక మయియున్నదనియే నుడువుచున్నాడను. హిందూమత దేహ బంధవిమోచన మేచందమున శాశ్వతానూ నానందమును బ్రసాదింపుచున్నదో, బౌద్ధకాయపాశవినాశము నయిత మదియేవిధమగు నపూర్వావ్యయానందము నే గటా క్షింపుచున్నదని వేఱుగ విశదీకరింపవలయునా? ఈ నావాదము నుపనిషత్తులయందలి సత్సారాంశమగు "నేతి,నేతి" యను శబ్దప్రకటనముతో విరమింప జేయుచున్నాడను. ఉపనిషత్క ర్తలు బ్రహ్మపదమునకీ 'నేతి' పదమునే సర్వోత్తమవర్ణన ముగా భావించియున్నారు. ఇది ధ్రువము."

---

పాఠకమహాశయులారా! శ్రీమద్గాంధి భగవానుడును భౌతికప్రపంచమున వ్యాప్తములయియున్న సకల మతనాస్తి కాస్తిక సిద్ధాంతము లెల్లేక హృదయంబుతో నేకధ్యేయమగు పరమ సత్య సాక్షాత్కారమును బడయు సమర్థము లగుచున్నదియు, పామరపండిత హృదయాహ్లాదకరంబుగ జిత్రించియున్నాడు. గాంధిప్రభువు త్యాగస్వీకార తత్త్వద్వయమును మానవాత్మల ముక్తిపురసింహాసనారూఢ మొనరింప సమర్థములగు రెండుత్తమోత్తమ శక్తులని నిరూపించియున్నాడు. సత్యస్వరూపుండగు సర్వేశ్వరుండాత్మీయసంతానమగు మానవాళికి హస్తద్వయమ్మును శరీర సంరక్షణార్థము బ్రసాదించియున్నాడు. దక్షిణహస్త సాహాయ్యంబున మానవు లాహారపానీయంబుల స్వీకారము సలుపుచుండ, వామహస్తాధారంబున శరీరగృహ మలత్యాగము సేయుచున్నారు. ఏతదుభయహస్తకృత్యములును శరీర సంరక్షణ నిమిత్తమేయని తెలియుడు. అయినను దూరదృష్టిరహితులు [అజ్ఞానులు] వామహస్తంబు నపవిత్రంబనియు, నల్పగౌరవార్హంబనియు, దక్షిణహస్తమే యుత్తమంబనియు, బూతంబనియు భ్రమియింపుచుందురు. కాని జ్ఞానులదూరదృష్టియం దుభయహస్తములును సమానములే యగును. బౌద్ధమతముయొక్క నెగెటివు తత్త్వము సత్యపథమందలి కంటకసదృశంబులగు దుర్గుణ, దుర్విచార, దురాచారదుష్కార్య కలాపంబులనెల్ల విసర్జింపుమని బోధింపుచుండ, హిందూమతముయొక్క పాసిటివు (స్వీకారతత్త్వము) తత్త్వము సత్యమార్గవ్యాప్తములగు సద్గుణకుసుమసముదాయమును గ్రహింపుమని యుపదేశింపుచున్నయది; దుర్గుణములనెల్ల బహిష్కరింప శేషించి మనుజునకు బ్రాప్తించునవి సద్గుణములే కదా! సద్గుణములనెల్ల బరిగ్రహింప మిగిలి నశించునవి దుర్గుణములే. రెండు విధముల మానవునకు బ్రాప్తించునవి సద్గుణములే యగును. హిందువులు చంద్రికారాధకులయిన, బౌద్ధు లంధకారోపాసకులగుదురు. బౌద్ధమతముయొక్క నెగెటివు సిద్ధాంతము శత్రుప్రభృతులను బాయుము, మోహమ్మును వీడుము, తృష్ణను మానుము, హింసను విడనాడుము, పరనిందాసక్తిని బార

ద్రోహములను, అహంకార మమకారముల నశింపజేయును, పాపమును బహి ష్కరించును, ప్రమాదమును విసర్జించును." అను సత్యమార్గ ప్రతిబంధక మగు త్యాజ్యసిద్ధాంత పరిత్యాగ సోపానపరంపరల నిర్వాణమందిరము నధిరోహింప నుపదేశించుచుండ, హిందూమతము యొక్క పాసిటివు సిద్ధాంతము "శాంతము స్వీకరించుము, విగతవ్యామోహ చిత్తుడ వగుము, పరిత్యక్తతృ ష్ణాన్వితుండ వగుము, అహింసను బడయుము, పరనిందారాహిత్యము నార్జించు ము, హృతాహంకార మమకార హృదయుండవగుము, గతపాపభయుండ వగుము, శౌచమును గ్రహించుము, జ్ఞానమైత్రికరుణల బరిగ్రహించుము." అను సత్యమార్గసాధనంబులగు గ్రాహ్య సిద్ధాంత స్వీకార సోపానశ్రేణుల ముక్తిసౌధము నారోహింప బోధజేయుచున్నయది. ఈ రెంటియందును భేదము నాస్తియె. సద్గుణ ప్రాప్తిచేగల్గు మహాత్సత్యస్వరూపమే, దుర్గుణ విసర్జనంబునను గోచరించుట సత్యము. సత్యము నభిలషించువానియందును అసత్యమును నాశనమొనరించువానియందును, చంద్రికాకౌముదులయందును నెట్టితారతమ్యము కలదు? హిందూబౌద్ధమతములు రెండును నొక్కటియె. ఉభయమతములును దివ్యాత్మతత్త్వజ్ఞాన భంజనంబులగు కామక్రోధా హంకార మమకారాదుల నశియింపజేసి, యాత్మజ్ఞాన జాగృతిదాయ కంబులును, ఐహికాముష్మిక సుస్థిరానూన శాంతిప్రదంబులును నగు శమ దమాదుల నార్జించుటకే నిద్రితమానవప్రపంచమును శ్రేయస్కరగీతంబుల జాగరితమొనరించుచున్నవి. పథములయొక్కయు, గతులయొక్కయు భేద ము లక్ష్యమును ఖండింపజాలదు. హిందువులు మంత్రోచ్చారణముతో ముక్తి పురిని సమీపించుచుండ, బౌద్ధులు మానసభజనముతో మోక్షమును జేరు చున్నారు. గాంధిదేవుడుపదేశించిన వాక్యములు చిరస్మరణీయములు! ప్రియ పాఠకభ్రాతలారా! బుద్ధునిగాని, బౌద్ధమునుగాని నాస్తికమని భ్రమబడి యయుక్త వచింపవలదు. హిందూబౌద్ధ మతజ్ఞానదాయకంబులగు నీరెండు శ్లోక ములతోడ నీవిషయమును ముగించుచున్నాడను. పాఠకులు వివేకానందాదుల యభిప్రాయంబుల నెల్ల గ్రహించియే యున్నారు కదా!

## హిందూగానము

శ్లో॥ బ్రహ్మానన్దం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

## బౌద్ధగానము

శ్లో॥ దయాసిద్ధిరేవాస్త్వహింసాస్తు లోకే
సదాన్తి స్సుశాంతి స్సునీతి స్సదాపి
స్వరాదిప్రసక్తిః పునర్జన్మహేతు
ర్భజధ్వం నిరాకార నిర్వాణమేకం.

భగవదవతారమగు బుద్ధునకు జయమగుగాత!

* * * *

## వివిధమతములు——మానవుని కర్తవ్యము.

ఏ పుణ్యపురుషుల సమగ్రసంఘాతము దివ్యావతారమూర్తులుగ భావించు యారాధించునో, ఆ పురుషపుంగవుల సదుపదేశముల ద్రికరణశుద్ధిగ స్వీకరించి తదుపదేశానుకూలంబగు జీవితక్రమమును గలిగి వర్తింపుచున్నను, లౌకికస్వభావప్రభావాధిక్యతచే ననేకాల్పాధిక సంప్రదాయములుగ జనసముదాయము విభక్తమగుచునేయుండును. కాని ప్రజాసంఘము సాంప్రదాయికవిభాగంబునకు వశమయియున్నను సంప్రదాయ సాధారణంబగు సంకీర్ణతకుమాత్రము బద్ధమయి యుండక దూరముగనే యుండుచుండును. జ్ఞానమునందును, విజ్ఞానమునందును, వేషభాషలయందును, ఆచారవిచార వ్యవహారములయందును గుణములందును మానవ్యమనుష్యునియందును, అనాదికాలమునుండియు దారతమ్యము నూత్నదృష్టికి నయితము గోచరమగుచునేయున్నది. ఈ భేదము చిరకాలపర్యంతము స్థిరత్వ

మును గలిగి భువిని వెలయుచుండుసవారయి. అసంఖ్యాకములగు నిట్టి విభేదా వస్థలకు బాల్పడియు సహజజ్ఞాన సంచార యుక్తమగు మానవహృదయము దేశదేశాంతరములయొక్క సోదరమానవుల జ్ఞానవిజ్ఞాన ధర్మకర్మాదర్శ హృదయముతో నైక్యభావము చెంద దత్తరపడుచునేయుండును. సర్వ కాల సర్వావస్థలయందును మానవ హృదయము స్పృహైక్యానుసంధాన పరత్వమునందే పరిశుద్ధానందాభాసమును గనుచుండును. సాధారణముగ మానవుని చిత్తముపై నతని జన్మస్థానముయొక్కయు, సమాజముయొక్కయు బరిస్థితుల ప్రభావమే విశేషించి యాధిపత్యము చెందుటయందు సార్థకతం జెందుచుండును. దేశాచారములును, లోకాచారములును, సంఘాచారవిచారములును, వంశగౌరవములును మొదలుగాగల నానాప్రకారములగు కృత్రిమవ్యవధానములు ధర్మాభిధేయమును వాస్తవికధర్మముయొక్క పరిశుద్ధంబగు జ్ఞానాధిక్యతయను బాధవ్యామోహావసనముచే నాచ్ఛాదితము గావించి వేయుచుండును. ఈ చందమున ప్రత్యేకసంఘము లేక సంప్రదాయము గణనాతీతులగు స్త్రీపురుషుల స్వకీయ కల్పిత సంకుచితధర్మదుర్గాంతరాళమున బంధించివేయుచుండుటయు గలదు. స్వకీయచిరాభ్యస్తంబును సుపరిచితంబునునగు నా సంకీర్ణ ధర్మసీమాంతరాళమున నశేషకాల పర్యంతమధివసించుచుండెనేని, జనసముదాయముయొక్క బుద్ధి జడత్వమునకు గురియగుచుండును. అంత ప్రజాగణము బుద్ధిజాడ్యప్రభావంబున స్వతంత్రధర్మ ధర్మపరిజ్ఞానాభిలాషాశూన్యులయి సీమాంతరాళంబున నుండుటయే శ్రేయోదాయకంబని భావింపగడంగుచుందురు. అట్టిస్థితియందు సకలప్రజావళి, తమ దీర్ఘకాలంబునుండియు సర్థము లేకుండగనే చుట్టుముట్టివచ్చుచున్న కృత్రిమ ధర్మసీమనుల్లంఘించి, బాహ్యవిశుద్ధ ధర్మాదర్శముతోడ యోగసాధనమున బరాక్రమింప నౌత్సుక్యమును జూపనొల్లదు. ప్రత్యేకసంఘమునందు లేక ధార్మికసంఘటమునం దొక్క మహాపురుషుడావిర్భవించి, తత్కాల ప్రచలితములగు కృత్రిమ ధర్మాచార వ్యవహారముల నిర్మూలింపుచుండును. అట్టిప్రతి

భా కాలియగు మహాపురుషుని సంఘ వ్యామోహములు కాని విపరీత పరిస్థితు
ల ప్రభావంబుగాని కలుషితునిగాని సంక్షుభితునిగాని గావింపజాలవు. అట్టి
మహాపురుషోదాత్తుని శుభోదావహంబగు బుద్ధిని సాంసారిక జడత్వమెంతమాత్ర
మునుస్పృశింప నేరదు. ఏసమయ సమయమునందునట్టిమహాపురుషులులోకమందలి
సకల సంఘముల నావిర్భవింపుచుందురు. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, మహా
వీరుడు, మహమ్మదు, జీసస్, శంకరుడు, రామానుజుడు, మధ్వుడు, బసవేశ్వ
రుడు, గురునానక్, కబీరు, రామమోహనుడు, చైతన్యుడు, దయానందుడు
మొదలయినవారందరు నిట్టివారె! ఈమహనీయులందరు భిన్న దేశంబుల భిన్న
కాలంబుల బతనోన్ముఖంబును, అపూర్ణంబును నగుధర్మమును సంపూర్ణత్వముచే
సుద్ధరింప జన్మించియున్నారు. వారు తమ జీవితకాలమునందు బోధించియున్న
సత్యసందేశములే దీర్ఘ కాలపర్యంతము నవికృతములయి యుండజాలవు. భిన్న
రుచులచేనొప్పు లోకుల కరముల జిక్కి సమయము ననుసరించి పరివర్తనమున
బాల్పడుచుండును. ఉపర్యుక్తులగు మహనీయుల శ్రీముఖములనుండి బహిర్గత
ములయిన సందేశవాక్యము లన్నియు నట్టిస్థితియందే యిప్పుడు సయితముండగ
లుగు టసంభవము. దీర్ఘకాలవ్యవధియు, ప్రజాప్రగాఢ వ్యామోహంబును,
మహాపురుషోపదేశితధర్మదర్శనమును నొకింతమలినముగావించివేయుటయేనిశ్చ
యము. దీనికుదాహరణంబుగ క్రైస్తవమతమునవలోకింపుడి. సత్యము తేటతెల్లము
కాగలదు. మహాపురుషుండగు బుద్ధునిదివ్యధర్మమును మఱింత సజీవంబును
దేదీప్యమానంబును గావించునిమిత్తమే యేషియాఖండమున గ్రీస్తుభగవాను
డవతరించెను. తొలుత నితడు మతజ్ఞాన శూన్యమయియున్న పశ్చిమఖండమునం
దెల్లెడల బుద్ధుని శాంతియుక్తంబును, కరుణాన్వితంబును, ఆత్మత్యాగ పరి
పూర్ణంబును, మార [సైతాను] గంధవిరహితంబును నగు సత్యధర్మప్రచార
మును సలుప సంకల్పించెను. బుద్ధప్రభువువలెనే క్రీస్తుదేవుడును విశ్వమానవ
సకలజీవప్రేమను, స్వార్థత్యాగమును, పరోపకారపారీణతను జాటియున్న
మహనీయుడె. అతడు లోకహితమునకయి సిలువపయి నసువుల బాసియుండె

డెను. అట్టిమహాపురుషుని పేరిటనే నేడనేకాపద్వాక్యములు బోధింపబడు చున్నవి. ఏక్రీస్తుభగవానుడు శాంతమే భూషణము, క్రోధమే ప్రచండాగ్ని, ద్వేషమే విషము, హింసయే మహాపాపము, త్యాగమే మహాసుఖము, దైవభక్తియే జీవన్ముక్తి, చిత్తశుద్ధియే నిర్మలానంద ప్రదమని బోధించియుండెనో, ఆక్రీస్తుదేవుని పేరిటనే బైబిలువంటి మహాగ్రంధమునందు "భూమిమీద సంచరించు కొన్ని జీవములను మనుజులు తినవచ్చును. ఏసు కన్యకే జన్మించినాడు. నరుల దప్ప కొన్ని జీవముల భక్షింపవచ్చును. ఏసు కుష్ఠరోగులను స్పృశింపఁగ తక్షణ వారు రోగవిముక్తులయిరి. ఏసు మరణించినవానిని లేదిరమ్మన, లేచివచ్చినాడు." అనునిట్టి వెన్నియో యసంభవములును, ప్రకృతివిరుద్ధములును నగు విషయము లువ్రాయబడియున్నవి. మతగ్రంధములు, పరమోత్కృష్టములగు ధర్మసిద్ధాంతముల నుపదేశించియుండ సాధారణమానవప్రపంచశక్తికవి సులభానుష్ఠేయము లంగాకపోవుటంజేసి తత్సిద్ధాంతముల సందుచితపలవిట్లు విశదమగుచున్నది. హిందువులు కొందఱు క్రైస్తవమతమును, క్రైస్తవులెల్లరు హిందూమతమును బరమతసమానబుద్ధి లేకపోమి దూషింపుచుందురు. క్రైస్తవమతగ్రంధమగు బైబిలునందున్నట్టి యవిశ్వాసార్హములగు విషయములవంటివే యెన్నియో, మన వేదాదులయందు లేకపోయినను, అన్యాన్యహిందూమత గ్రంధములగు రామాయణ, భారత భాగవతాదులయందు లేకపోలేదు. వేదోక్తమగు యజ్ఞము మానసిక శుద్ధివిషయకంబును, ఆత్మజ్ఞానప్రేరకంబును నయియుండ మన కొన్నిగ్రంధములు సైంధవవధచే రాజసూయాది యజ్ఞములు చేయఁదగునని వచించుట భ్రమాన్వితము. బైబిలు నందువలెనే భారత భాగవతములయందును శ్రీకృష్ణుడు పుట్టుగ్రుడ్డివాడగు ధృతరాష్ట్రునకు దివ్యమగు దృష్టినొసంగెననియు, సుత్తరాగర్భమున మరణించిన పరీక్షిత్తుని రక్షించెననియు ననునట్టివెన్నియో కథలుగలవు. శ్రీబుద్ధాచార్య జీవితానంతరము విరచింపడిన బౌద్ధజాతకకథలందును నిట్టివి కొద్దిగనో, గొప్పగనో లేకపోలేదు. మానవవిధి సత్యాన్వేషణమే కదా! అట్టి పరిశుద్ధంబగు సత్యము నన్వేషించిపథమును విశ్వమునకెల్లజూపు సాధువులు

లభించుటయే దుర్లభంబు. నాకొక ప్రాచీన పండితుని వాక్యము స్మృతికి వచ్చుచున్నయది:—

“శ్లో॥ శైలే శైలే న మాణిక్యం, మౌక్తికం న గజే గజే,
సాధవో నహి సర్వత్ర, చందనం న వనే వనే.”

ఈ రహస్యము నెఱింగి మహాపురుషులెకాలమందయిన, ఏజాతి యందయిన ఏదేశమందయిన జన్మించినను వారుపదేశించు సత్యసందేశముల భక్తిభావంబుతో నాలకించి, స్వీకరించి, యాచరించుట కడుంగడు శ్రేయస్కరము. మహానుభావుడు తాను జన్మించిన జాతికే బాంధవుడుకాడు. సకల జీవప్రపంచమునకును నాత్మీయుడే. ఏసు మావాడేయని క్రైస్తవులు గాని, కృష్ణుడు మాదేవుడేయని హిందువులుగాని, బౌద్ధులు బుద్ధుడు మాస్వామి యేయనిగాని వచించుట నింద్యము. సృష్టియున్నంతపర్యంతము మానవజాతి బాహ్యంబున కెన్నియో మతసంప్రదాయములుగ విభక్తమగుచున్నను సర్వేశ్వరాంశవినిర్మితంబగు మానవజాతిహృదయము సత్యజ్యోతివైపునకే లగ్నమయియుండుగాక! సృష్టియందొక్కడే మహాపురుషుడు జననమొంది సకల ధర్మముల బోధింపగలుగుట యసాధ్యము. ఒక్కొక్కమహాపురుషుడొక్కొక జీర్ణించిపోయిన ధర్మము నుద్ధరించుటకే భువి నవతరింపుచుండును. సర్వస్వర సమ్మేళనంబుననే సంగీతమాధుర్యము మనుజులు చవిజూడగలుగునట్లు సకల మతాంతర్గత ధర్మాదర్శస్వీకారంబుననే మానవజాతి యుద్ధరింపబడును. కాళిదాసకవిసార్వభౌముడు వచించిన—ఏసాగరమునందమూల్యములగు రత్నములు కలవో, ఆసంద్రమునందునే భయంకరంబులు, ప్రాణహానికరంబులును నగు తిమింగిలములును గలవు. ఏనిశానాథుడు షోడశకలాపరిపూర్ణుడో, అతడే దోషయుక్తుడును నయియున్నాడు.” అని వచించినట్లుగనే, మతము లన్నింట నెవియో కొన్ని దోషములు కాలము గతించినంతనే వాటిల్లు చుండును గాన, నంతమాత్రముననే వానిని దూషింపక, యాదరింపుము, సుధీ

కరుని కళంకమును, సాగరమునందలి తిమింగిలములను గూర్చి విచారింపని విధంబున వర్తించుట హితప్రదము.

## మన బుద్ధపురాణము.

ప్రస్తుతము సకల విశ్వము నధ్యాత్మవాదమును బహిష్కరించి భౌతిక వాదమునకే శిరము వంచినది. భారతేతర దేశంబులన్నియు జ్ఞానభూధరము నధోలోకమున కనిపి భౌతికవిజ్ఞానపర్వతోత్తుంగ శిఖరము నధిష్ఠించినవి, అధిరోహింపుచున్నవి, ఆరోహింపనున్నవి. భరతఖండము సయితము నధ్యాత్మమతపథమును బాసి రమారమి వింశతిశతాబ్దములు విస్మృతమార్గము నే యనుసరించి విషమఫలముల గుడిచినది. గాంధియుగ మేతెంచినది. సకల భారతీయ సంప్రదాయములు మేల్కాంచినవి. స్త్రీపురుషులెల్లరు శాంతిదేవ్యాలయమును హస్తముల వెలయు పళ్లెరముల స్వీయహృదయముల బెట్టుకొని విశ్వప్రేమ గీతముల గానముసేయుచు, సుప్రసన్నముఖారవిందములనుండి భక్తిభావము లొలుకుచుండ, సమీపించుచున్నారు. సాహిత్యము విదేశీయ ప్రభుత్వాగమనకాలమునుండియు నర్థములేని విలాసములను వశమయి, కలుషితమయి యిపుడిపుడే సంసారోన్నతి కనువగు రీతి సంస్కరింపబడుచున్నది. ప్రకృతితత్వవేత్తయగు రవీంద్ర కవీంద్రుని పేరిట సాంసారిక భావ తరంగితహృదయము ననుసరించి విరచింపబడు జ్ఞానశూన్యమగు భావకవిత్వ ప్రాబల్యము సడలుచున్నది. ఐహిక శృంగార రసమయవిషయాధిక్యతనే ప్రధానముగా నెంచు నవలల ప్రభుత్వమును శిథిలమయినదని యే నుడువవచ్చును. గాంధిని బోలు మహానుభావుల యపారాకృత్రిమ కృపాకటాక్షంబున భోగపులొత్తు అలంకరించుకొను తళుకు బెళుకుల కృత్రిమ వేసముల బాసి భారతీయ సాహిత్య సరస్వతి యాధ్యాత్మిక దివ్య తత్వాసనంబున నాసీనయయి ఒకచేత వీణను మీటుచు భక్తిగీతముల బాడుచు, మఱొక హస్తమున పరిశుద్ధవేదమును గలిగియుండి శాంతి, అహింస, విశ్వప్రేమ, పరోపకారము, దైవభక్తి మొదలగు నార్షేయ సిద్ధాంతముల

సకలదేశ ప్రజావళికి వినిపించుచున్నది. ఈశుభసమయమునందే సమున్నత
సాహిత్యము సృష్టియొక్క చరమ సౌందర్యమని భావించు నాధ్యాసము ప్రా
చీన భారతీయ ప్రశస్తాధ్యాత్మిక సాహిత్యమువైపునకు మరలినది. తద్ధార్మిక
సాహిత్య భండారమును నేనాతురతతో బ్రవేశించితిని. అందు బౌద్ధ
గ్రంథములు మహోజ్జ్వలములయి, ప్రకాశింపుచుండుట నేగాంచి భక్తి
భారావనతమస్తకుండ నయి శుద్ధబుద్ధమూర్తిని హృదయమున
స్మరించి వానికి బ్రణమిల్లితిని. బుద్ధభగవానుడు నాటగోలె నాస్మృతి
పథంబున మూర్తిభవింపుచు బిడ్డా, మానవుడవయి జన్మించిన నీవు
ప్రాపంచిక తుచ్ఛసుఖంబులనే జీవిత పరమావధిగా నెంచక, యథాశక్తి
లోకసేవను ధర్మసిద్ధాంతప్రచారమునుచే గావింపుమని బోధింపుచుండ నేనీ
గ్రంథరచన కియ్యకొంటి. అల్పవిజ్ఞానయుతుడను, అల్పవయస్కుడను, అయి
నను మతభక్తిభావప్రేరితుడనయి యీఘనకార్యమునకు గడంగితిని. ఈ
గ్రంథనామము బుద్ధజీవితచరిత్రము; బోధనములు లేక బౌద్ధపురాణమని
యుంచవలసినదే యయినను, బుద్ధదేవుని పవిత్రనామము సర్వజనావళికి సత్వ
రము తెలియవలయునను మూఢజనసామాన్యమగు నంధభక్తిచేత బుద్ధపురాణ
మనియే యుంచితిని. పురాణమనుశబ్దమున కీలక్షణములుండవలయునని పూ
ర్వులు నిర్ణయించియున్నారు:

> "సర్గశ్చ ప్రతిసర్గశ్చ, వంశో మన్వంతరాణిచ
> వంశానుచరితంచైవ, పురాణం పంచలక్షణం."

కాని నేనీలక్షణనియమంబులతో నిమిత్తము లేకయే పురాణమనుశబ్దము
హైందవజనులకెల్లరకు జిరకాలపరిచితంబయినదని యెంచి గ్రంథప్రచారము
నభిలషించి గ్రంథమునకు బుద్ధపురాణమనియే నామకరణం బొనర్చితిని. అస్వ
స్థుండ నగు నేనీ పురాణమును నిర్ధనవిద్యార్థులకు విద్యను గఱపుచు నావ
కాశము లభించినపుడును, రాత్రిసమయములందును దేహారోగ్యముంబాటిం
పకయే సత్వరము లిఖియించి ముద్రింపించితిని. ఇందనేక దోషములు దొరలి

యుండవచ్చును. "బుద్ధుని జన్మకు పూర్వము మాయాదేవి గాంచిన స్వప్న దృశ్యము" నిష్ప్రయోజనము యైనది. బుద్ధగీతయందు, 'note సూచన' యను చోటనున్న యామునశయాళమను వాక్యమును త్రోసివేయదగినదియె. అటనట విసుగుదోచి ప్రస్తుతము నీచులహస్తములజిక్కి దూషితమయ్యె వారిచే హిందూమతముగ భావింపబడునది శుద్ధ హిందూమతము గాదనియు నట్టిమతమును స్వీకరించినవారికి ముక్తియే లేదనియు వ్రాసియుంటి నను కొందురు. నాకు బరిశుద్ధమగు వైదికమతమున్న భక్తిలేదని పాఠకభ్రాతలు భ్రమింపకుందురుగాత మ్మని చేతులు జోడించుకొని మ్రొక్కుచున్నాడను. ఈభూమికయే నాకు హిందూమతమునందెట్టి భక్తిభావమున్నదనియు దెలుప గలదు. అటనట గ్రంథశైలి యొకింత క్లిష్టముగానున్నది. దీనికి క్షంతవ్యుడ. బుద్ధునిభావముల విస్తరించి వ్రాసినాడనేగాని యాదేవుని యాదర్శమునకు విరుద్ధముగా మాత్రము చరింపలేదు. ఆదేవుని పేరిట నెన్నియో సత్యముల బోధింపవలయునని నేనీగ్రంథరచనమునందు బ్రయత్నించితిని. లోకమునకు నేను బోధింపయోగ్యుడను గాకపోయినను మతభక్తినన్ను మానముగాపూర్ణుండ నీయుదయ్యె! "యత్సారభూతం తదుపాసితవ్యం హంసోయథాక్షీర మివాంబుమిశ్రం" అను గురుజనవాక్యము తెలుంగు నాంధ్రమహాజనులు నాపురాణము విషయమును సహితమట్లే వర్తించెదరని విశ్వసించెదను. సాధ్యమయినంత శీఘ్రమే దేశవిదేశయాత్రజేసి బౌద్ధమతముయొక్క దివ్యసందేశముల నెల్ల బుస్తకాకారంబుగ గూర్చి యాంధ్రభాషాయోష పాదరాజీవంబుల సమర్పించుకొనియెదను. శంకరాచార్యుని ప్రస్థానత్రయంబువలెనే బౌద్ధమత సాహిత్యమునకు బ్రధానములయిన 1 సుత్తపిటకము 2 వినయపిటకము 3 అభిదమ్మపిటకమను మూడుగ్రంథముల సారాంశమును శీఘ్రమే యాంధ్ర సోదరులకు దెలుప వేడుక పడుచున్నాడను. మన యీ పురాణమందొక్క భాగముగానున్న బుద్ధగీత యభిదమ్మపిటకముయొక్క యొకభాగము. పురాణాంతమున నద్వైతగీతములు గలవు, హిందూబౌద్ధ క్రైస్తవ మతములు

మూడు నద్వైతములై. అగీతము లీమూడుమతములకు జెందునవియె. పాఠకలో కముయొక్క చిత్తముల దీర్ఘముగు పీఠికను వ్రాసి విసిగించితి, క్షమింపుడి

ఈపురాణాంతమున బొందుపఱుపబడిన శ్లోకములును, ఆంధ్రాంగ్ల పద్యములును గొన్ని, యొక గ్రంథమునందలివి మఱియొక గ్రంథమునందలివని వ్రాసియుండును. బిందుసారుడు—బింబిసారుడు, ఛందుకుం ఛన్నుడు, యిట్టి నామభేదంబు లెన్నియో కలవు. వీనిని పాటింపలేదు. బుద్ధచరిత్రమున రామతీర్థ స్వామి వారికథనమని పేర్కొనబడిన యాంగ్లభాషావాక్యములు స్వామివారివి కావు. భావము వారిదే భాషకల్పితము. ఇట్టివే మరెన్నియో దోషము లుండి యుండును. పాఠకభ్రాత లీనాదోషములెల్ల మన్నింతురుగాక!

మానవాదర్శగ్రంథమండలి,<br>అంగలూరు, కృష్ణాజిల్లా,<br>4—7—1927.

సుజనపాదరేణువు,<br>గ్రంథకర్త.



శ్రీ

# బుద్ధచరిత్రము.



సీ॥ బాల్యకాలమునందె • భవమును నిరసించి
వ్యామోహతతి నెడఁ • బాసె నెవఁడు?
సంసారమది యెల్ల • సారహీనంబని
సన్న్యాసధర్మంబుఁ • జరపె నెవఁడు?
భోగభాగ్యములు మి • థ్యాగతంబులటంచు
వేదాంతపథమున • వెలసె నెవఁడు?
భువి 'నాత్మవత్సర్వ • భూతాని' యనువాక్కు
సార్థకంబుగఁ జేయఁ • జాలె నెవఁడు

గీ॥ అట్టి ధర్మైకనిరతుఁ డ • త్యమలగుణుఁడు
భూరిసుజ్ఞానమూర్తి యా • బుద్ధదేవు
పూతచరితంబు వినరండు • పూజ్యులార!
సకలదుఃఖంబు లుడుగు ని • స్సంశయముగ.





శ్రీ

# బుద్ధచరిత్రము



## బౌద్ధవంశపరిచయము.

శ్రీ బుద్ధదేవుడు హూణశకమునకు బూర్వము 662 వ సంవత్సరారంభమున బవిత్రంబగు శాక్యవంశమున జననమందెను. శాక్యవంశ క్షత్రియ భూపాలురలో గామకార్థాది చిత్తప్రవృత్తుల సంయమవ్రతానుష్ఠానంబున స్వాధీనమొనర్చుకొని, యపాందానంద కందంబగు నిర్వాణమును బడసిన ప్రథమ పురుషోత్తముం డీబుద్ధదేవుడే. శ్రీ బుద్ధభగవానుని హృదయసీమ నాధిపత్యము వహించియున్న భావాతీతంబగు సహనశీలత నవలోకించియే శాక్యవంశీయులెల్లరు నాదేవుని తమ వంశమున కలంకార ప్రాయంబుగ భావించి, శాక్యసింహుడు శాక్యమునియను శుభాహ్వయంబుల సంబోధింప నుపక్రమించిరి. హిందూపురాణాది ప్రాచీనగ్రంథ సిద్ధాంతముల వీక్షింప శాక్యవంశము సూర్యవంశము యొక్క భిన్నశాఖయయినట్లు విశదమగుచున్నది. సూర్యవంశీయుడగు నిక్ష్వాకుభూపాలునిచే నభివృద్ధిపఱుపబడినట్టి విశాలవంశమునుండియే శాక్యవంశోదయం బాయెడిని. ప్రాచీనకాలమున నిక్ష్వాకువంశమున సుజాతు

డను నామాంతరముగల భూపాలుడు సుప్రసిద్ధుడయి యుం డెను. సుజాతభూపాలుడు నిజపుత్రుల నెల్లర స్వదేశమునుండి వెడలనడచెను. తదాదిగ నా పుత్రులు శాక్యులని పిలువ బడ నారంభించిరి.

జనకుడగు సుజాతభూపాలు డేకారణంబున నిజ తనూ భవుల స్వదేశమునుండి వెడలగొట్టియుండెనో యీ క్రింది వ్రాయబడు కథాక్రమమును బఠించిన బాఠకలోకమునకు హృదయంగమంబగును. " ప్రాచీనకాలమునందు సుజాతు డను భూపాలు డయోధ్యానగరమును బరిపాలన సేయుచుం డెను. అతనికి పుత్రపంచకంబును, బుత్రికాపంచకంబును సం తానమయి యుండెను. క్రమముగా బుత్రుల నామము లియ్యవి: ఉపూరుడు, నిపూరుడు, కరకుండకుడు, ఉల్కా ముఖుడు, హస్తిశీర్షకుడు. తనూభవల నామంబు లియ్యవి: శుద్ధాదేవి, విమలాదేవి, విజితాదేవి, జలాదేవి, జలీదేవి. ఈసంతానమే కాక సుజాతభూపాలునకు మఱియొక పుత్రు డుండెను. అతడు సుజాతభూపాలుని మహారాజ్ఞిపరిచారి కకు భూపాల సాహచర్యంబున నుదయించియుండెను. పరిచా రికా నామధేయము జేంతిమతి. ఆముద్దరాలు నిజానూనదివ్య సౌందర్యముచే భూపాలుని కోమల సరసహృదయము నాక ర్షించెను. జేంతిమతీ మనోజ్ఞమూర్తిని బ్రేమించి, భూపాలుడు నాటగోలె నామె నుపపత్నిగనుండ నియమించెను. జేంతిమతికి రా జసాహచర్యంబున జననమందిన బాలకుని బ్రజాసముదాయము జేంతుడని పిలువసాగెను. ఒకానొక దినమున సుజాత ధరణీ నాథుడు కేళీగృహంబున జేంతుమతీ యథరామృత పానము

సేయుచు నామదిరాత్రి శృంగారమయప్రేమ కమితానంద పర వశుండయి యిట్లు నుడివెను:" సఖి! తావకంబగు ప్రణయ లీల కెంతయు ముదమందినాడ. నీదగు సౌజన్య మెంతయు సం స్తవనీయము. నీ మనోభీష్ట మెద్దియేని యున్న చో నిశ్శంకిత మతివయి నివేదింపుము. ఈ నీ ప్రియుడు సఫలీభూతము సేయ సంసిద్ధుడు." భూపాలుని ప్రసన్నతకు జేంతిమతి స్వాంత మునం బెంతయు హర్షించి యిట్లు విచారింప దొడంగెను. భూపాలుని జీవితానంతర మాతని పుత్రులే రాజ్యముపై నాధి పత్యము వహింతురు. నా కుమారుని వైపునకు గన్నెత్తి వీక్షించువారయిన నుండరు. కార్యము విషమించుటకు బూర్వమే జాగరూకురాలనయి యుండుట మంచిది. దీప ముండగనె వివేకసంపన్నులు గృహమును సంభాళించుకొం దురుగదా! చిత్తమునం దీరీతి విచారించుకొని ప్రత్యక్షముగ భూపాలసత్తమున కీ ప్రత్యుత్తర మొసంగెను. "భూపాలా! దాసియందు మీకు గల్గిన కరుణావిశేషమున కనేక కృతజ్ఞతాభి వందనములు. విజ్ఞులగు తమరు కాంక్షితవరమును బ్రసాదింప నుద్యుక్తులరయి యుండ, గించిజ్ఞ నగు నేను తృణీకరించుట శ్రేయస్కరంబుగాదు. కాన నో ధరణీనాథా! వాస్తవంబ యిన దయయే యీ చరణసేవకురాలియం దార్యపుత్రులగు తమకున్నచో, భావిరాజసింహాసనప్రాప్తికి మత్కుమారునకు గంటకప్రాయులయిన మీ తనూజుల నెల్లర రాజ్యమునుండి వెడలనడపుడి. అట్లు మీరు కావింపనిచో యుష్మజ్జీవితానంత రము మీ సుతులు మత్సుతుని రాజ్యభ్రష్టుని గావించి, సుఖ దూరుని జేయుదురను భయంబు నామదిని బాధింపుచున్న

యది. సత్యవాక్పరిపాలనాదక్షులగు మీరలు కావించిన ప్రతిజ్ఞ నుల్లంఘింపక, నా సుతునకు యౌవరాజ్యాభిషేకము గావించి నిజసుతులను స్వదేశదూరుల నొనరింపుడి. ఇద్దియే మ దభీష్టము."

జేంతిమతి ముఖమునుండి బహిర్గతములయిన వాక్కుల నాలకించి యొకింతసేపు పర్యంతము నిశ్చేష్టుడయి నృపాలుడు సత్యసంధు డగుటంజేసి కార్యము మించిపోయినదని చింతించి, యంతమునకు బుత్రవాత్సల్యమును ద్యజియించి, వారల స్వరాజ్యమునుండి వెడలనడచెను. ప్రతిజ్ఞాభంగ మగునని యెడి భీతిచే భూపాలుడు కావించిన నిష్కారుణిక కార్యము జేంతిమతీ పుత్రున కెంతయు లాభదాయకంబాయెను. కామాతురునకు యుక్తాయుక్తవివేచనా పరిజ్ఞాన మెట్లుండ నేర్చును? రాజాజ్ఞ నాలకించినంతనే పితాజ్ఞాపరిపాలనాధురంధరులును, క్షత్రియ వంశోద్భవులును నగు రాకుమారులు జన్మభూమి నెడబాసి, స్థానాంతరగతులయిరి స్వదేశమును బాసి హిమాలయప్రాంతారణ్య భూముల కరుగు రాజసూనుల నసంఖ్యాకులగు ప్రజలు వెంబడించిరి. ప్రేమపరిపూర్ణ హృదయులగు దేశవాసులు వెంట నరుదెంచ, భూపాలాత్మజపంచకము రోహిణీ తరంగిణీ తీరస్థంబగు శకోటవనము బ్రవేశించెను. విస్తీర్ణతమంబును, విశాలోన్నత భూరుహసందోహ సంశోభితంబును సమస్తవిధ కందమూలఫలాహార నిలయంబును నగు నా సాంద్రాటవీ మధ్యభాగంబునం దొక్కచో దపోవనమును స్థాపించుకొని కపిలు డను మహర్షి తపమాచరించుచుండెను. మన రాజకుమారు లా తపోవనమునకు సమీపమందలి భూముల

నెల్ల స్వాధీనము గావించుకొని, తమవెంట నేతెంచిన రాజ భక్తులగు దేశవాసుల పరమసాహాయ్యంబున నొక్క విశాల తమంబగు గ్రామమును నిర్మాణము గావించిరి. సేద్యమే వారి జీవిక కాధారభూతమయ్యెను. కాలము గతించినకొలది నా గ్రామ మొక్క విశాలతమంబగు పత్తనంబుగ నభివృద్ధినందెను. జనసంఖ్య హెచ్చెను. శకోటవనంబున నివాసముల నేర్పఱచు కొనిన హేతువుచే వారి నా ప్రాంతవాసు లెల్లరు శాక్యులని పిలువదొడంగిరి. వారి వంశము తదాదిగ శాక్యవంశమను నూతనాభిధేయంబుతో వ్యవహృతము కానారంభించెను. శాక్యవంశమునకు సుజాతభూపాలుని నగ్రసుతుం డగు నుపూ రుడే ప్రథానుండును నాదిపురుషుండు నయ్యెను. ఈ చందమున నిక్ష్వాకువంశమునుండి వెలువడిన భిన్నశాఖయే నూతనరాజ్య సంస్థాపనంబుచే శాక్యవంశ మను నూతననామమును బడసి జగ ద్విఖ్యాతమయ్యెడిని.

## కపిలవస్తునగర నిర్మాణము

సుజాతభూపాలుని తనయు లీరీతి ససంఖ్యాకులగు ప్ర జల ననేక ప్రదేశములనుండి రావించి, తమ నగరవైశాల్య ము నభివృద్ధిగావింప నుపక్రమించిరి. హిమాలయపర్వతము లకు సమీపస్థంబును, రోహిణీనదీ ప్రాంతస్థంబును నగు కపిల మునీశ్వరుని తపోద్యానమున కాలవాలంబగు శకోటవనమున రాజకుమారులు పురనిర్మాణము గావించుటంజేసి యాపురమున కు 'కపిలవస్తు'వను నామము వచ్చెను. కపిలమునియే యా శకోటవనమునందలి తపోధనులలోనికెల్ల నగ్రేసరుడయి యుం

డుటంజేసి, యాతని నామధేయ మాదర్శముగ స్వీకరింపబడి యెను. క్రమక్రమముగా నానాదేశాగత ప్రజా సముదా యంబులచే నగర మనంతవైభవోపేతం బాయెను. జనసమృద్ధియు, విభవాదిసిద్ధియు జనులకనుకూలింప, వాణిజ్యముసహిత మావిర్భవించి దినదినాభ్యుదయము నందజొచ్చెను. ఆర్యావర్తమందలి వాణిజ్యప్రధానంబులగు పత్తనములతో గపిల వస్తునగరము సంబంధమును బడయసాగెను. పరరాష్ట్రముల నుండి వణిక్కుల రాకపోకలచే ననుదినంబు నగరము సువిఖ్యాతియం దగ్రస్థానమునంద నారంభించెను. నగరనిర్మాణము గావింప గృతసంకల్పులయినపుడు ప్రప్రథమము రాజతనయులు కపిలమునీశ్వరుని యాదేశమును సహితము బడసి యుండిరి. అనేకవిధముల దనకు శిష్యులంబలె సేవాశుశ్రూషల సలుపుచుండిన భూపాలనందనులకు నూతననగర ప్రతిష్ఠాపనయందు కపిలమునిచంద్రుడు సాహాయ్యమొసర్చెను. ఏతత్కారణ విశేషంబుననే తన్నగరనామధేయము కపిలవస్తువాయెను. మునీశ్వరుని యాశీర్వాద బలంబునను, సర్వేశ్వరుని నిర్వ్యాజకరుణావిశేషంబునను, రాకుమారుల యవిరళ కృషి ప్రభావంబునను నగర మనతికాలమునందే భారతీయకళలకును వాణిజ్యమునకును, బారిశ్రామికాభివృద్ధికిని కేంద్రస్థానమాయెను. దుర్భిక్ష నివృత్తికి మూలమగు సేద్యము నిత్యమభివృద్ధి జెందుచుండ, ధనధాన్యైశ్వర్యములచే నగరవాసుల నికేతనములు పరిపూర్ణము కాదొడంగెను. నగరవాసులు క్షామ మను శబ్దమునే విస్మరించి, మానవోచిత లక్షణంబగు స్వావలంబనమును మరచిపుచ్చక, తాము క్షత్రియులే యయి

యున్నను బరరాజ్యాపహరణయందు దాసక్తి లేనివారలయి, వ్యవసాయ పశుపాలనాది సాత్వికవృత్తిచే దమజీవితముల నానందపూర్వకంబుగ గడుపదొడంగిరి. ఈచందమున గాన్యకుబ్జదేశమునుండి కుమాయూను పర్యంతము శాక్యవంశీయుల నివాసభూమి వ్యాపించెడిని. శాక్యరాజ్యపు యెల్ల లుత్తరమున సర్వోచ్చ భూధరంబులగు హిమాలయంబులు, ప్రాగ్దిశకు బ్రితాపవంతమగు మగధరాజ్యము, లిచ్ఛవీవంశ రాజ్యము, పశ్చిమంబున గోసల (అయోధ్య) రాజ్యము నయి యుండెను.

కపిలవస్తునగరనిర్మాణాభ్యుదయాది మహాత్కార్యము సంపూర్ణము గావించిన యనంతరము రాకుమారులలో నగ్రజుండగు నుపూరుడు రాజ్యసింహాసనమును ననుజులయనుమతి నధిష్ఠించెను. పాండవేయుల భ్రాతృవాత్సల్యమునందును, రాజ్యతంత్రిజ్ఞతయందును సోదరులయిదుగురును మించి రాజ్యపరిపాలనము సేయగడంగిరి. ఉపూరుని యనంతరము క్రిమంబుగ నతనిపుత్రిపౌత్రిప్రిపౌత్రులగు నిపురుడు, కరకుంతకుడు, సింహహానుడు రాజ్యసింహాసనముల నధిష్ఠించి, న్యాయంబును, ప్రేమను లక్ష్యమునందునిడికొని, ప్రిజాపాలనము జేసిరి. అంతిమ భూపాలుండగు సింహహానునకు నల్వురునందనులును, బుత్రికారత్న మొకర్తుకయు నుదయించిరి. క్రిమముగా శుద్ధోధనుడు, ధౌతోధనుడు, శుభోధనుడు, అమృతోధను డను నామంబుల బుత్రిలును, అమితాదేవియను శుభాహ్వయంబున సుతాతిలకంబును నొప్పారుచుండిరి సింహహానభూపాలుడు తనభౌతికలీలల బాసినంతనే యారాజశేఖరుని ప్రిథమసుతుండగు శుద్ధోధనుడు రాజగద్దియనధిష్ఠించె

ను. పరిశుద్ధహృదయాకర విందుండును. సాంఖ్యదర్శన నిర్మాతయు, సగరభూపాలతనయుల బ్రచండ శాపప్రభావంబున భస్మీభూత మొనర్చినట్టియు గపిలముని మన యీగాథయందలి కపిలముని కాడని పాఠకులు గుర్తెరుంగుదురుగాత మ్మని నావిజ్ఞప్తి. మన యీ కపిలమునిచంద్రుఁడు గౌతమగోత్రీయుఁడు. శాక్యవంశ ప్రాబల్యమునకు బూర్వుఁడువాఁడు. కోల వంశజయగు మాయాదేవీ పవిత్రగర్భంబునుండి సకలలోక పావనుండును, చతుర్దిశ జగద్వ్యాప్త యశోవిశాలుండును, సహజసముస్తభూతహిత కార్యపరతంత్రుండును, బౌద్ధధర్మ సంస్థాపనాచార్యుండును, నిర్వైరియు, నిస్సంగుండును, సచ్ఛీలుండును, నాధ్యాత్మిక యోగిప్రవరుండును నగు శ్రీ బుద్ధ భగవానుడు జననమందెను. శుద్ధోధన భూపాలుడు రాజ్యాధికారమును బడసినయనంతరమే కపిలవస్తువు రాజకీయంబుగను, సాంఘికంబుగను, నైతికంబుగను, ధార్మికంబుగను మఱియు నార్థికంబుగను నసాధారణాభ్యుదయము నందినట్లు చరిత్రల వలన దేటతెల్ల మగుచున్నయది. ప్రస్తుత మానగరచిహ్నము లయినలేక, కాలవాహినీ గంభీరగర్భంబున సమ్మిళితంబుల య్యెను. చైనాదేశీయుండును, సుప్రసిద్ధ చరిత్రకారుండును, స్వానుభవ సిద్ధైతిహాసిక జ్ఞానసిలయుండును నగు ఫాహియాన్ దేశమును దర్శించుట కేతెంచుటకు బూర్వమే కపిలవస్తువు శైథిల్యమునకు బాల్పడి, పంచభూతముల నైక్యము జెందె, నట్లు యా చరిత్రకారుని లేఖలవలన విశదమగుచున్నయది. పండిత మండలాగ్రేసరుండగు కార్లాయల మహాశయుండు 1875 సం

వత్సరము వారాణశికమునందు శాక్యవంశ వాస స్థానంబగు కపిల వస్తువు సకలైశ్వర్యసమన్వితంబయి, భూలోకస్వర్గముపలె వెలింగియున్నట్లు వాకొనియున్నాడు. సుప్రసిద్ధ చరిత్రకారుండగు బర్నియరుమహాశయుడు తన భారతయాత్రయందు సహిత మిదియే భావమును వ్యక్తీకరించియున్నాడు. టాడ్ మహాశయుని హైతిహాసిక వ్యాసములయందు కపిలవస్తువునుగూర్చి విశేషించి లిఖయింపబడినట్లే దృష్టిగోచర మగుటలేదు.

ప్రస్తుత మా ప్రాచీనశాక్యవంశ రాజధాని యగు కపిల వస్తు నగరస్థానంబున భుయిలానామాంతరముగల గ్రామ మొండు విద్యమానమయి యున్నట్లధునాతనచరిత్రజ్ఞుల వాక్యంబుల స్పష్టమాయెడిని. గ్రామమునకు సమీపమునందే యొక్క విశాలంబగు పరిశుద్ధసరోవరము విరాజిల్లుచున్న యది. సరోవరమునకు దాపుగనే తరంగిణియొండు ప్రవహించుచు గ్రామప్రాచీనాభ్యుదయగీతముల నిజావ్యక్తకలకలస్వనంబుల గానము సేయుచున్నట్లు సువ్యక్తమగుచున్నయది. శ్రీ బుద్ధభగవానుని జన్మస్థానంబగు నీ పవిత్ర ప్రదేశము వారణాసి (కాశి) కి పంచదశక్రోశములకు మించిన దూరమునందున్నయది. భుయిలాగ్రామము కాశీపట్టణమున కుత్తర దిక్కునను, అయోధ్యాపురంబున కీశాన్యముగా నిరువదియైదుమైళ్ళదూరమునను వెలయుచున్నది. ఆప్రాంతముల యందెల్లస్థానముల బౌద్ధమతప్రచారచిహ్నంబులగు బౌద్ధస్తూపములు లెక్కకు మిక్కిలిగా దృష్టిగోచరంబగుచున్నయవి. చదువరులారా! యింక శ్రీ బుద్ధదేవుని మాతృకులేతిహాసము దిక్కునకు మీ దృక్కుల బ్రసరింపజేయుడి.

## శ్రీ బుద్ధదేవుని మాతృకుల వివరణము.

శాక్యసింహుని మాతృకులచరిత్ర మత్యద్భుతము. బుద్ధదేవుని పితృదేవుడగు శుద్ధోధననరనాథుడు శాక్యవంశీయులతోడనే వివాహసంబంధము గావించుకొనియున్నను నాతడు పరిణయంబయిన వనితాలలామ కాలీయవంశజుల దౌహిత్రియయి యుండెను. నూతనంబగు నీకాలీయవంశోత్పత్తి శాక్యవంశీయుల యొకానొక కన్యవలననే జాగల్గినది. శాక్యవంశముచే బరిత్యజింపబడిన యొకానొక కన్య ఋషివర్యునొక్కని వరించెను. తత్కన్యావిశ్వమోహన సౌందర్యగరిమకు ముగ్ధహృదయుడయి, వ్రితభంగముగావించి యా ఋషికులతిలకుండు నా లలనాసంయోగసౌఖ్యవారిధి నోలలాడసాగెను. వారిరువురకు జనించిన పుత్రుని నామధేయమే కోలుడు. కాలీయవంశమున కితడే మూలపురుషుడు. కాలీయవంశోదయ వృత్తాంతమియ్యది.

సుజాతభూపాలుని నందనపంచకముతో స్వరాష్ట్రము నెడబాసి, హిమాలయప్రాంత భూములకరుదెంచిన క్షత్రియులు 'శాక్యు'ల ను నూతననామధేయమునంది, దినదినాభివృద్ధినంద మొదలిడిరి. శాక్యవంశజుండగు కరకుంతకుని రాజత్వకాలంబున శాక్యవంశోద్భవయగు నొక్క కన్య కుష్ఠువ్యాధిగ్రస్తయయ్యెను. సుప్రసిద్ధులును, సిద్ధహస్తులును నగు వైద్యశేఖరు లగణితంబుగ నేతెంచి, చికిత్సగావించిరి. కాని వారి ప్రయత్నములన్నియు నిష్ప్రయోజనములయ్యెను. అనతికాలమునందే యా కన్యక కాయమంతయు బుడ్లతోనిండిపో

యెను. హతభాగ్యయగు నాకన్య సాంక్రామికంబగు ప్రచండ కుష్ఠువ్యాధిగ్రస్తయగుటంజేసి సమస్తజనులచే నేహ్యదృష్టితో వీక్షింపబడసాగెను. ప్రజాసహ్యామునుగాంచి సహింపజాలక నా పెభ్రాత లామె నొక్కశకటమున నుపవిష్టంజేసి, పర్వతారణ్యముల విడిచిరా నిశ్చయించి, హిమాలయపర్వత ప్రాంత భూములకు బయనమయిరి. పర్వతము నొక్కదాని సమీపించి యందొక విశాలంబగు గుహ నవలోకించి, యాపెనా గుహయందుండ నియమించి, భోజనపానీయంబుల బ్రచురంబుగా నందుంచి యా క్షత్రియకుమారులు బాహ్యప్రదేశమునకు వెడలివచ్చిరి. అనంతరము వృక్షశాఖలతోడను, దీర్ఘంబులగు కాష్ఠములతోడను మృత్తికతోడను నా గుహాద్వారమును ఘాతుకమృగప్రవేశమున కనువుగాకుండ బంధించి వైచిరి. ఏతత్కార్యానంతరము శాక్యవంశజులగు నా క్షత్రియనందనులు కపిలవస్తునగరమునకు దిరిగి వచ్చిరి. మృతప్రాయయగు నాకన్య యగణితవాసరంబుల పర్యంతము గుహాయందు జీవములతో నెట్లో కాలము గడపెను. ద్వారము సంపూర్ణముగ బంధింపబడుటంజేసి వాయువందు ప్రవేశింప దుస్తరమయి యుండెను. వాయుశూన్యంబగు నా గుహయం దూష్ణవాయువు మెండాయెను. అధికోష్ణవాయు స్పర్శంబున నా శాక్యకన్య భయంకర రుగ్మత పటాపంచలాయెను. కళంకశూన్యంబును, రోగదూరంబును నగు నాకన్యాకాయము వహ్నిసంస్కృతసువర్ణచ్ఛాయను గేలిసేయుచుండ, నా తరుణవయస్కమనోజ్ఞమూర్తి దేవతాంగనను ధిక్కరింపుచున్నట్లు లుండెను. వాస్తవంబుగనే నా కన్యారత్నము వ్యాధిగ్రస్త యగుటకు

బూర్వ మపూర్వాతిశయ సౌందర్యవిభాసితయయి యుండెను. యుక్తప్రాయ మగుటంజేసి పూర్వసౌందర్యమును హాసియింప జేయు రూపరేఖావిలాస మాకన్యామణియందు గానన య్యెను.

ఒకతూరి క్షుధాపీడితంబగు వ్యాఘ్ర మొండు నరవాసన బడసినదయి గుహాద్వారమునన్నిధి కేతెంచెను. ఆఘ్రాణించుచు నాఘ్రాణించుచు నా వ్యాఘ్రము తీక్ష్ణంబులగు నఖంబుల గుహాబంధనమును భేదింప మొదలిడియెను. ఈ గుహాకు సమీపమునందే కోలుడను నామధేయంబున బ్రసిద్ధుడయిన రాజర్షి యొక డధివసింపుచుండెను. ఫలాన్వేషణార్థ మాతడు స్వాశ్రమము నెడబాసి ప్రయాణోన్ముఖుడాయెను. గుహాదిక్కున కరుదెంచు ఋషీశ్వరు నుపలక్షించి వ్యాఘ్రము భీతిజెంది, పలాయనం బయ్యెను. ఋషిచంద్రుడు గుహాద్వారమును దొలగించి లోపలికరుగ నచట నబలాదివ్య సుందర విగ్రహ మొండు దీనాననయయి యుండుట నవలోకించెను. ఋషీశ్వరు డావెను నీ వెవ్వతవని పృచ్ఛింప, నా తరుణీమణి వీయూషమును వర్షింపజేయుచు నిట్లుత్తర మొసంగెను. "స్వామీ! నేను కపిలవస్తునగరవాసియగు నొక్క క్షత్రియోత్తముని పుత్రికను. నేను దీర్ఘకాలమునుండి కుష్ఠువ్యాధిగ్రస్తనయి పీడింపబడుచుంటిని. భయంకర వ్యాధిగ్రస్తనగు నన్గాంచి మామక సహోదరు లప్రసన్నచిత్తులరయి యీగుహయందు చాలకాలమునకు బూర్వము వదలిపెట్టిపోయిరి. సర్వేశ్వర కృపాకటాక్షవీక్షణము లీ యథమాధమపై బ్రసరింప నా రోగము దూరీకృతమయినది. దుర్మత మటుమాయమయిన దాదిగ నాకారోగభాగ్యము హస్తగతమగుడు, సౌఖ్యము

ప్రాప్తించినది. స్వకుటుంబ పరిత్యక్తనగు నేను దుఃఖాబ్ధిముగ్న నేటి కుద్ధరింపబడితిని. విశేష సమయమునుండి మానవసందర్శన భాగ్యదూరములగు మామక నేత్రములు నేడు మానవోత్తములగు తమ్ము సందర్శించి ధన్యతనుబడసినవి. మృతప్రాయనగు నేను పునర్జన్మ నందితిననియే భావింపుచున్నదానను."

కోలరాజర్షి యాగజగామిని మందార మకరంద మాధుర్యమును లెక్కసేయని మధురవచనముల కలరియు, నాపె తమా సౌందర్య విభవమునకు ముగ్ధుడయ్యు వ్రతనియమ భంగము గావింప సన్నద్ధుడాయెను. పురుష సంయోగసౌఖ్యము నెఱుంగని యాసురంగలోచనను వెంటనిడికొని, యా ఋషిసత్తముడాత్మీయాశ్రమమున కరిగెను. తదాదిగ నా వనితాసాహచర్య సౌఖ్య రసాస్వాదనంబున మత్తుడయి యాజడదారి విరక్తోచిత జ్ఞానధ్యానమననాదుల విసర్జించెను. ఆ లలనాశిరోమణి సుస్నిగ్ధ వీక్షణములయందే మోక్షముగలడని భావించి, యతడాపెతో గార్హస్థ్యధర్మానుశీలనము గావింపదొడంగెను. సకాలమున కాశాక్యవంశబాలామణి క్రమక్రమముగా నష్టాదశ పుత్రుల జననమునకు హేతుభూతమయ్యెను. కుమారులు యుక్తప్రాయమును, వయోచిత విద్యాబలమును బడసిన యనంతర మా ఋషిపత్ని వారల జేరబిలిచి యిట్లు నుడివెను.

"నందనులారా! మీరు పవిత్రంబగు క్షత్రియవంశమునకు జెందినవారు. మీ జనకుడుసహితము క్షత్రియవంశసంభూతుడే. మీరిపు డాలసింపక సత్వరము క్షత్రియజనకేంద్రంబగు కపిలవస్తునగరమున కరుగుడి. కపిలవస్తునగరంబున నజంతు డను నామధేయంబున సుప్రసిద్ధుడయిన ధనాఢ్యుడే మజ్జనకుడు.

మీకు మాతులురును, నాకు సహోదరులును నగు నజంతుని కుమారులుసహిత మచటనే యర్థసంపన్నులరయి సుఖకాల క్షేపము సేయుచున్నవారలు. మీర లిపు డవ్వారిచెంత కడు గుడు. ప్రేమార్ద్రహృదయులును, నుదారభావ పరిపూర్ణ చిత్తులును నగు వార లవశ్యము మీకు జీవనోపాధిని గల్పింతురు. యుష్మన్మాతృవంశ మాహాత్మ్య మనిర్వచనీయంబు. అనాథులగు మిమ్ము వారత్యంతానందముతో నాదరింతురు.'' ఏతద్వచనముల నుచ్చరించిన యనంతర మా ఋషిపత్ని నిజ సూనులకు శాక్యవంశీయుల యాచార వ్యవహార నీతినిగూర్చి సంక్షిప్తముగ బోధించెను.

అంత నాఋషికుమారులు శాక్యవంశము యొక్క యాచారవ్యవహారనీతిని బాగుగాగుర్తెఱింగిన వారలయి, కపిలవస్తు నగరమునకరిగిరి. మాతృోపదేశిత దేశాచారంబుల పాటింపుచు వార లొక్కదివసము శాక్యవంశీయుల సభాభవనమున కేగిరి. ఋషికుమారులయందు శాక్యవంశోచిత కళా స్ఫూర్తిని యాచారలక్షణములను గాంచి సభికులెల్ల రాశ్చర్యమయమానసులయి యిట్లుపృచ్ఛించిరి: బిడ్డలారా! మీరెయ్యెనుండి యిటకరుదెంచినారు, మీయదేవంశము! అంతనాకుమారు లిట్లు ప్రత్యుత్తర మొసంగిరి:—"ఆర్యులారా! మేము శాలాశ్రమమునుండి మాతాజ్ఞాపరిపాలకులమయి యిట కేతెంచినారము. మామాతృదేవి ధనాఢ్యుడగు నజంతునిపుత్రి యుతనూభవ. మజ్జనకుడు రాజర్షియగు కోలుడు. సహోదర పరిత్యక్తయు, గుష్ఠురోగపీడితయు నగు మామాత దీర్ఘకాలము కు బూర్వము మాతులురవలననే పర్వతగహ్వరమునందు

బంధింపబడ దైవానుగ్రహంబున నొకింత కాలానంతరము రోగ ముదూరమగుడు సంపూర్ణ దేహస్వాస్థ్యమునం దెను. అనంతర ము మామాతను గోలరాజర్షి పరిణయమాడెను. వారిరువు రకు జనించినవారమే మేము. అనాథావస్థయందున్న మేము స్వకీయమాతామహుని యొక్కయు, మాతులుర యొక్కయు దర్శనము నపేక్షించి యిట కేతెంచినారము. మావృత్తాంత మిద్దియ." ఋషికుమార ముఖోద్గత వినయవిధేయతాయుక్త వచనంబుల నాకర్ణించి, తత్సభాభవనమునందే పుత్రపౌత్రి సమేతంబుగ నాసీనుడయియున్న నజంతు డత్యానందభరిత హృదయుడయ్యెను. కోలమహర్షి తనకు జామాతయగుటకును, నిజసుత రోగవిముక్తయగుటకును, వివేకవంతులును, సుంద రాకారులును నగు నాకుమారులెల్లరు దనపుత్రికాసంతాన మగుటకును మదియందెంతయు ముదమంది, వారల నిజపార్శ్వ స్థితాసనంబుల నుపవిష్టులగుట కాదేశించెను. రాజర్షియగు కోలుడు సన్యసించుటకుబూర్వము కాశీపట్టణమునకు ప్రభు వయియుండెను. అతడు పురాణవైరాగ్యంబున సన్యాసవ్రత మును స్వీకరించి రాజ్యపరిపాలనాధికారమును జ్యేష్ఠపుత్రు నకుబ్రసాదించి, హిమాలయప్రాంతారణ్యముల దపమాచ రింప నేతెంచియుండెను. కోలుని యీవృత్తాంతంబులనెల్ల నెఱిం గినశాక్యులకు రాజర్షి బంధుత్వ మానందసంధాయకంబయ్యెనన్న నాశ్చర్యమేమికలదు? అజంతునిపుత్రిలు ప్రేమపురస్సరం బుగ భాగినేయుల స్వగృహంబునకు గొనిపోయిరి. జమీందా రును ధనాఢ్యుండునునగు నజంతుడు దౌహిత్రులకు వేర్వేఱు గా గప్పమునెల్లించు గ్రామంబుల నుపహారముగ బ్రసాదిం

చెను. సేద్యమా గ్రామీణులవృత్తియై యుండెను. అష్టా దశ ఋషికుమారులును గౌలురనునామంబుల బ్రసిద్ధులయిరి. అష్టాదశపుత్రులలో జ్యేష్ఠుడే కాలీయవంశమున కాదిపురుషుడుగ గణుతికెక్కెను. కాలీయవంశేతిహాసమిట్టిది. సుభూతుడను నామాంతరముగల శాక్యవంశీయుడొక్కడు కాలీయవంశకన్య నొకర్తుకను వివాహమాడెను.. సుభూతునివలన నా కన్యారత్నమున కొక్కకన్య యుద్భవమయ్యెను. ఆ కన్యాశిరోమణి శుభాహ్వయమే మాయాదేవి. ఏతద్దేవియే భగవన్మాత లేక బుద్ధదేవుని జనని.

కపిలవస్తునగరమునకు సమీపమునందే దేవహేడా గ్రామమొకటి యుండెను. తద్గ్రామమునందే మాయాదేవి జనకుండగు సుభూతు డధివసించి యుండెను. సుభూతు డావిస్తీర్ణతమంబగు గ్రామమున కపధితి. గ్రామీణులెల్ల రతనికే కప్పము గట్టుచుండిరి. మాయాదేవి జననమందిన యనంతరము సుభూతమహాశయు డొక్కకాలీయవంశరాజకన్యను బరిణయమయ్యెను. ఆ రాజకన్యకు దొమ్మండ్రు పుత్రిక లుదయించిరి. సుభూతునిపుత్రికల నామంబులు క్రమంబుగ నియ్యవి:—మాయాదేవి, మహామాయ, అతిమాయ, అనంతమాయ, చులారా, కాలీసేవా, మహాప్రజాపతి, శేషించిన పుత్రికలనామధేయము లితిహాసగ్రంథముల పుటలయందు గానరాకున్నయవి.

సింహహనుభూపాలుడు పరమపదించినంతనే యతనిజ్యేష్ఠపుత్రుండగు శుద్ధోధనుడు పైతృకసంపదాధికారియయ్యెను. ఆతడు సుభూతునిజ్యేష్ఠపుత్రికయగు మాయాదేవిని గనిష్ఠ

సుతయగు మహాప్రజాపతిని (గౌతమియను నామంబు సహితము కలదు) పెండ్లాడెను. వివాహానంతరము ద్వాదశవత్సరములు గతింప, శుద్ధోధనుడు మాయాదేవిగర్భంబున బుద్ధదేవుని బడసెను. శ్రీ బుద్ధదేవుని శుభోదయమునుగూర్చి ముచ్చటించుటకు బూర్వమే శుద్ధోధనభూపాలునివిషయమున నాతని పరిపాలనమునందున్న శాక్యవంశీయుల యాచారవ్యవహారముల గూర్చియు సదాచారనీతులను గుఱించియు, వృత్తుల గుఱించియు పాఠకలోకమునకు విశదీకరించుట యుక్తము.

## — శాక్యవంశీయులు —

శుద్ధోధనభూపాలుని వంశజులగు శాక్యులాద్యావస్థయందు బాహుబలంబున గృషిజేసి రాజ్యప్రపత్తిని, ధనధాన్యైశ్వర్యములను బడసియున్నారను విషయము మనకు ప్రథమాధ్యాయంబుననే సుబోధకమాయెడిని. శుద్ధోధనభూపాలుని విస్తీర్ణతమంబగు శాక్యవంశరాజ్యసీమయందు కపిలవస్తువు, శిలావతి, దేవదహము, సక్కరము మొదలగు ననేక సంపన్నిలయ నగరములుండెను. వ్యవసాయ పశుపాలనాదివృత్తినే జీవనోపాధిగాగొన్న ప్రజలచే నిండియుండు పట్టణములుగాని పల్లెలుకాని యొక్కచో గుమిగూడి యుండజాలవు. ఏతద్ధేతువుచేతనే శాక్యుల నివాసస్థానంబులగు నగరములు పారస్పరిక సామీప్యమును గల్గియుండక దూరదూరముగనే యుండి, రాజ్యముయొక్క విస్తీర్ణత నభివృద్ధిపఱచెను. ధర్మశీలుండును, ప్రజాగతప్రాణుండును, రాజతంత్రజ్ఞుండును నగు శుద్ధోధనుడా విశాలంబగు శాక్యరాజ్యమున కధినాథుడయి యుండెను. అర్వా

చీనకాలమున నానాదేశములబాలించు నిరంకుశ స్వార్థమయ భూపాలురవలె నా శుద్ధోధనుడు స్వార్థప్రియుండును, స్వేచ్ఛా నువర్తియునయి యుండలేదు. రాజ్యపరిపాలనాధికారంబులును, నవీన శాసననిర్మాణ భారంబులు, దండనావిధానమును, వేయేల? అధునాతన రాజోచిత సమస్తస్వత్వముల బ్రజాప్రతినిధిసంఘా ధీనము గావించియుండెను. రాజకీయ కార్యసంచాలన సూత్ర ధారణాశక్తి ప్రజాహితమున కనుకూలించియే యుండును. శుద్ధోధనుని రాజనీతి ప్రజాసహితము నపేక్షనేయునదే కాని నుపేక్షించునదయి యుండలేదు. ఆకాలపు ప్రభువు నిక్కాల మందలి రాజ్యపరిపాలనాసమితియందలి యొక్క ప్రజాప్రతి నిధికి బోల్చిన బోల్పవచ్చును. రాజపద మాసమయమందు వంశ గతమయి యుండలేదు. ప్రజాసముదాయ నిర్వాచితపురుషుడే రాజ్యసింహాసనమున కర్తృడుగ భావింపబడుచుండెను.

శుద్ధోధనుడు తన కిరుపార్శ్వంబుల బ్రజాప్రతినిధు లాసీనులయియుండ, సమక్షంబున విద్యాదికులగు దేశవాసు లుండ, సింహాసనము నధిష్ఠించినవాడయి, రాజకీయవిషయముల గూర్చి సంభాషించుచుండెడివాడు. సమస్త రాజకీయవ్యవహార ములయందు దేశీయులగు యువకులును, వృద్ధులును, స్త్రీలును సమానాధికారమును గల్గియుండిరి. రాజకార్యములగూర్చి విచారణసలుపుటకు శాక్యవంశీయులకు ప్రధాన నగరంబగు కపిలవస్తుపురం దొక్కయాలోచనామందిర ముండెను. దానినే ప్రజలెల్లరు సంథాగారమని చెప్పుచుండిరి. తదాలోచనాల యంబుననే భూపాలుడు ప్రజాప్రతినిధుల యెదుటను, సమస్త ప్రజాసముదాయసమక్షంబునను రాజకీయసమస్యల బరిష్క

రింప సభ్యస్తుడగు యుండెను. సంథాగారము (ఆలోచనా మందిరములు) లొక్క రాజధానియందేగాక రాజ్యమండలి ప్ర ధాన నగరములన్నింటియందు నొక్కొక్కటి చొప్పున భూపా లునిచే రాజకీయవ్యవహారపరిష్కార సౌకర్యార్థము స్థాపింప బడియుండెను. గ్రామీణులు తమతమ సమస్తాల్పాభియోగముల సహితము నిస్సందేహముగా నాయానగర సంథాగారముల కరిగి, సభాసదుల సమ్ముఖంబున నివేదించుకొనుచుండిరి. పంచా యితీదార్లా యా యభియోగములనెల్ల సాంగోపాంగముగా విచారించి, ప్రజాసముదాయమునకు న్యాయము నొదవజేయు చుండిరి. ప్రజాహితమును, బ్రజాసౌకర్యమును రాజమందిర స్తంభపటుత్వమున కాధారభూతములని భూపాలుడును రాజ ప్రతినిధులును భావించుచుండెడివారు. అర్థసంపాదనమే నాటి రాజనీతి కాదు. ప్రాయికంబుగా సంథాగారసభ్యులగు పంచా యితీదార్లు ప్రజాగణము నివేదించుకొను న్యాయాన్యాయం బుల విచారింప, బ్రకృతీదేవి నాట్యరంగస్థలంబులగు నామ్ర వనములయందును, నారికేళవృక్ష నికుంజములయందును, నా మ్లిక వృక్షసముదాయ మధ్యంబునను సమావేశమగుచుండిరి. వర్తమానకాలపు సకీర్ణంబులును, మానవనిర్మితంబులును నగు న్యాయాలయంబుల న్యాయతత్వము సంకుచితమయియున్న చందముననే శాక్యుల విశాలంబులును, దైవనిర్మితంబులును నగు వృక్షనికుంజముల న్యాయతత్వము విశాలమయి, యీశ్వరీ యాంశ ప్రపూరితమయియుండెను. పంచాయితీదారులయందు సర్వేశ్వరస్వరూపంబగు సత్యము మూర్తీభవించియుండ ద్వేష మాత్సర్యాది దుర్గుణములు నశింప, బ్రజాసమ్మతంబగు న్యాయ

మాప్రకృతీదేవి క్రీడాలయంబులగు నికుంజముల బ్రజలకు లభ్యమగుచుండెను. పంచాయితీదార్లు విశేషంబుగా బహిరంగప్రదేశంబులనే న్యాయాలయముల గావించుకొనుచుండిరి. సంథాగారములకగు వ్యయమంతయు రాజకీయ ధనాగారమునుండియే కైకొనబడుచుండెడిది. తత్కాల రాజనీతి శాస్త్రమందు నిర్బంధమనుపదము నశియింప నద్దాని స్థానంబున బ్రబోధ మను నవ్యతరశబ్దము విద్యమానమయియుండెను.

శాక్యవంశజులు క్షత్రియులయియుండియు నర్థములేని వర్ణవిభాగమున కాధీనులయి, పరులబీడించియు, ధనమువ్యయపఱచియు బరరాజ్యాక్రమణమునకయి యత్నము నేయుచుండెడివారుకారు. ప్రజాసంఘమున వ్యాప్తమయియున్న శాంతిని సంరక్షించుటయే యాక్షత్రియులధర్మము. బాహుబలమును బశుబలంబుగ నెంచి, వర్తమానకాలపు పాలకులవలె శాక్యవంశజులు వృథాపుచ్ఛక సేద్యమును, బశుపాలనమును గావించుకొనుచు నాదర్శజీవితముల గడపుచుండిరి. వార లట్లు స్వార్థమయ జీవితముల నికృష్టము లని భావించి, భౌతికమునకు దమజీవితకాలంబుల నెక్కుడు ప్రాధాన్యము నొసంగక నాధ్యాత్మికంబునకే విశేషాధిక్యమునిచ్చి, సాధుజీవితముల వ్యతీతము నేయుచుండిరి. క్షత్రియులగువారి యాసాత్వికవృత్తిని బట్టి విచారింప, నాకాలమునందే యిప్పటికంటె నాత్మానాత్మమీమాంసాపరిజ్ఞాన మెక్కుడున్నటుల దెల్లమగుచున్నయది. శాక్యవంశీయులగు క్షత్రియులచే హిమాలయప్రాంత భూములన్నియు బ్రథమము నాసర క్షేత్రములుగ భావింపబడుచుండెడివి. ఆర్యులవిధానముల ననేకవిధముల ననుకరించు

శాక్యవంశజులు "కృషితో నాస్తి దుర్భిక్ష"మ్మను గురుజన సూక్తిని బాటించి, యూసరక్షేత్రముల నెల్ల బరిశ్రమచే నవ్యాతర సస్యభరితంబులగు సుక్షేత్రముల గావించి మించిరి. అరిభయంకరంబులగు శస్త్రాస్త్రంబుల జేబూను శాక్యులే నిజహస్తంబుల హలముల గొని సేద్యము జేయుచుండుట నవలోకింప నానందసాగరము పొంగి పొరలుచుండెడిది. వివిధసస్యములచే నానావర్ణంబుల వెలయు కేదారమాలికల గాంచి, బ్రహ్మానంద పరవశులరయి శాక్యవంశము యొక్క స్త్రీపురుషాదులు మేఘుని దమ సస్యాభివృద్ధికయి సమవృష్టినొసంగ, గేల్మోడ్చి ప్రార్థించుచుండిరి.

శాక్యులు పురుషులకంటె స్త్రీలధికముగా గోపాలనవిద్యయందసామాన్య ప్రావీణ్యత నందియుండిరి. పశుచికిత్సావిధాన మవ్వారికి హృదయంగమ మయి యుండెను. భుజింప నాహారమును, వసింప నికేతనములను, ధరింప వస్త్రములను మానవుడు పరులపై నాధారపడియుండక, స్వయముగా నార్జించుకొనుట శ్రేయస్కరమని శాక్యులెల్లరు భావింపుచు నదియేచందమున నాచరింపుచుండిరి. వస్త్రనిర్మాణమును గావింప గృషీవలురగు శాక్యులెల్లరు దమకు వలయునంత ప్రత్తి నుత్పత్తి జేసికొనుచుండిరి. ప్రతిగృహమునందును రాట్నగీతములు విననగుచుండెను. శరీరసంరక్షణమునకే వస్త్రాదులు నిర్మింపబడినవనియు క్షణికంబును, దుఃఖదాయకంబును నగు విలాసమునకు గాదనియు బ్రత్యేక శాక్యవంశజుడు గుర్తెఱింగియేయుండెను. శాక్యు లప్పటికి మిథ్యావర్ణాభిమాన పిశాచమును బ్రేమించువిప్రుల నారాధించుటమాత్రము విధిగా

భావించుచుండిరి. మనోప్రవృత్తులను, మనోహర్షమును నను సరించి యెల్లరు దమకుదోచిన పారిశ్రామిక వృత్తులనెల్ల నభ్య సింపుచుండిరి. దారిద్ర్యము ప్రజాశాంతికి భంగమనియు, స్వా వలంబనముచే నర్థరాహిత్యము దూరమగుడు, నుత్తమంబగు విత్తము లభ్యమగుననియు నద్దానిచే నీతికిని, మనశ్శక్తికిని విరు ద్ధంబులు కాని భౌతికసౌకర్యంబులన్నియు నేర్పడుననియు నాకాలపుశాక్యులు భావింపుచుండిరి. కుంభకారులు, స్వర్ణ కారులు, చిత్రకారులు మొదలగు శిల్పవిద్యానిపుణులెల్లరు నివసించుటకు గృహీవలురనుండి భిన్నమగుగ్రామములు నిర్మిం పబడియుండెను. గ్రామములకు దాపుగనే సాంద్రాటవు లుండెను. తదరణ్యముల చోరసంఘములు నివసించుచుండు నని జనసంఘముమధ్య కింవదంతి ప్రబలియుండెను. కాని వారు ప్రజైకమత్యమును, బ్రజాగత ప్రాణుండగు భూపాలుని నీతి యుక్తంబగు శాసనబలమును గుర్తెఱింగి యుపద్రవముల గావింపకుండిరి. శాక్యవంశ రాజ్యమున నెల్లయెడల శాంతిశ్రీ తన పాదారవిందద్వయమందలి హర్షోత్సాహములను చిరు గజ్జియలు శ్రవణానందకరముగ మ్రోగుచుండ లాస్యము సేయుచుండెను. ప్రజాప్రభుత్వంబును గల్గియున్న నాకాల మందు సమస్తగ్రామములు స్వతంత్రములే యయియుండి యున్నవని వక్కాణించు టెంతమాత్రము నత్యుక్తి కానేరదు. గ్రామవాసులు శాంతిపూర్వకంబుగ నిజస్వచ్ఛంద జీవితముల గడుపుచుండిరి. ధనాఢ్యులు నిర్ధనుల సమస్తవిధముల బుత్రీ వాత్సల్యంబున జూచుచుండిరి. ప్రజలెల్లరు నానందపూర్వక ముగ దమసమయమును వెలిబుచ్చుచుండిరి.

సమస్తజనులు మందులు కాకపోవుటంజేసి యల్ప పరిశ్రమమాత్రంబుననే ధనవిహీనులకు భోజనవస్త్రాదిసౌకర్యములు లబ్ధమగుచుండెను. దుష్టజనోపద్రవభీతి సబలనిర్బలుల కెవ్వారికిని లేకయుండెను. సర్వేశ్వర ప్రదత్తంబగు సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవింప బ్రత్యేకవ్యక్తి భాగస్వామియయి యుండెను. "ఆత్మవశం సర్వసుఖం పరవశం సర్వం దుఃఖ" మ్మను గురుజనోక్తిని రాజనీతి సంగతీంపుచు నేయుండెను. గ్రామవాసులయం దంత కుబేరులుగాని కుచేరులుగాని లేరని యే చెప్పవచ్చును. సామ్యవాదశాస్త్రమందలి కొన్ని సిద్ధాంతములచట నారాధింపబడుచుండెనన్న వింతకాదు. స్వేచ్ఛాపరతంత్రమగు సాత్వికజీవిత నిర్వహణమునకు వలయు సాధనసామగ్రి యంతయు సులభంబుగనే ప్రాప్తమగుచుండెను. దైవయోగముచే నేదేని యొక్కవత్సర మకాల భయంకరదృశ్యప్రాప్తి వాటిల్లినచో బరోపకారపారీణులును, నార్యసంతతివారును నగు శాక్యులు పరస్పర సాహాయ్యంబున దుర్భిక్షా మహాభయంకర రాక్షసిని స్వసంఘమునుండి పారద్రోలుచుండిరి. అనావృష్టివలనను, అతివృష్టివలనను బాయికంబుగా శాక్యులకు క్షామ బాధ యొదవుచుండినట్లు బౌద్ధమత గ్రంథావలోకనంబున విశదమగుచున్నయది. సేద్యగాండ్రగు శాక్యుల గృహములు, దాపుదాపుగా ననగా గృహిణులకును, గృహస్థులకును బరస్పరసహాయగ్రహణమున కనుకూలముగ నుండురీతి నిర్మింపబడియుండెను. ఐనైక్యమును సూచించులాగున గృహీవలుర భవనములు దూరదూరముగ నిర్మింపబడియుండలేదు. గ్రామీణులు నిరంతరము నిజధర్మంబుగను, సర్వేశ్వరాదేశంబుగను భావించి పరస్పర

సానుభూతిని గల్గియుండిరి. గృహమాలికలమధ్య వెలయు వీధులు విశాలములయి, పరిశుద్ధములయి చూపరుల డెందములకమందానందము నొదవజేయుచుండెను. గ్రామసందర్శనమాత్రంబున బ్రాచీనార్యాదర్శగ్రామసంస్మృతి యప్రయత్నముగనే మదినొడముచుండెను. గృహస్థులగు శాక్యవంశీయ కృషీవలురగృహాంగణముల గోవత్సములు గంతులువేయుచు దర్శకుల రంజింపజేయుచుండెను. ప్రతి కృషీవలునకు గేదెలు, గోవులు వృషభములు మొదలగు సాధుజంతువు లసంఖ్యాకములుగా నుండెడివి. వార లవ్వానినే తమ సంపద్విశేషంబుగ భావింపుచుండిరి. పశువుల మేతకయి సేద్యముసేయని కొన్ని పచ్చికబీళ్ళు గ్రామకంఠసీమల నుండెడివి. పంటలకాలము గతించినంతనే రైతులుతమ పశువుల నిరాతంకముగా నీది నాదను భేదదృష్టిని వీడి, క్షేత్రముల మేపుచుండిరి. నేటివలె మానవుల కేర్పడిన చందమున గాంగాగారములు లేవనిచెప్పుట కెంతయు సంతసమగుచున్నయది. సస్యభరితంబులగు క్షేత్రముల పశువులనుండి సంరక్షించునిమిత్తము గ్రామమునకు బదుగురేసి పశునిరీక్షకులుండెడివారు. పంటలకాలమందు నా నిరీక్షకులు రైతులనుండి ప్రతివిధమగు సాహాయ్యమును బడయుచు, దదితర ఋతువుల ననోన్యైస్య కార్యముల జక్కబెట్టుకొనుచుండువారు. కృషీవలులకు పరస్పర విశ్వాసము మెండు. ఏతద్విశ్వాసమే సంఘైకమత్యమునకు మూలమయి, యవ్వారిచిత్తముల విద్యామానమయియుండు శాంతి నభివృద్ధిపఱచెను.

ప్రతి పశురక్షకుండును వివిధాకారముల గల్గియున్న తన పశువుల విశేషచిహ్నముల గుర్తెఱింగి యుండెడివాడట.

గ్రామమందలి పశుసంరక్షకులు పశుచికిత్సా విధానమునం
దును, పశుపాలనమునందును విశేష నైపుణ్యమును బడసి
యుండిరి. పశుచికిత్సా నభిజ్ఞుడగు పశుసంరక్షకునకు గృషీవ
లుర సంఘమునం దాదరము ప్రాప్తించుట దుర్లభమయి
యుండెను. వర్తమానకాలపు జనులవలె పశ్వావలంబనయన్న
వారికి సహించెడిది కాదు. మానవుని బతితుని గావించున దద్ది
యే యని వారు భావింపుచుండువారు. నిరాంతకముగా సేద్య
ము నిర్వహింపబడు నిమిత్తము క్షేత్రములకు జలసౌకర్య
మనుకూలముగనుండెడిది. రైతులు నూతనములగు భూముల
ను క్షేత్రములగావింప వాంఛించి నీటిపారుదలకయి ప్రభువు
నభిలషింప నతడు రాజధనాగారమునుండి నిశ్చింతతోడ వల
యుధనము నొసంగుచుండువాడు. సంతానమున కావశ్యకం
బగు పదార్థములనెల్ల జననీజనకులు సంపాదించి యొసంగు
చందముననే, భూపాలుడు ప్రజాసముదాయమునకు బితయు,
బ్రజాపతినిధులపరిపాలనాసమితి మాతయు నయి సమస్తసౌ
కర్యములను గావింపుచుండెను. నాటి రాజనీతి మధునాతనికముల
నీతికి భిన్నమని వక్కాణించినజాలదా? వ్యవసాయ విషయిక
ప్రబోధములు నిత్యము గ్రామములయందు విననగుచుండెడివి.
ప్రతిగ్రామమునందు ప్రభుత్వముచే బోషింపబడు నొక్క
కృషిశాస్త్రవేత్తయు గృషికార్యానుభవపరుండును నగు రాజకీ
యోద్యోగి ప్రజలయడుగులకు మడుగులొత్తుచు బ్రభుప్ర
జాభక్తిపరాయణుడయి యుండువాడు. గ్రామకృషీవలులా
మహాశయునివలననే యేయే క్షేత్రముల నేయే సస్యములు పుష్క
లముగానగునో విచారించి సేద్యము నేయుచుండిరి. ప్రతి

గ్రామమునందు నొక్క దృఢకాయుండును గృషికార్యనిపుణుండును నగు మనుష్యుడుండెడివాడు. అతనిని నాయకుడని శాక్యులు పిలుచుచుండువారు. గ్రామకంఠసీమలగాని గ్రామమునకు సంబంధించిన రాజకీయస్థానములయందుగాని గ్రామముతోడి సంబంధముగల్గియుండు నదీతీరంబులగాని శాకాదుల నొసంగు మొక్కల నాటి పోషించుటయే యతనివిధి. అతడు భార్యాపుత్రాదులతో గలసి యా మొక్కలను బెంచుచుండును. ఆయా చెట్లవలన ఫలించినశాకాదుల గ్రమముగ గ్రామీణులకెల్లరకు నొసంగుచుండువాడు. అతనిని గ్రామమందలి కృషీవలులే పోషించుచుండువారు. క్షేత్రఖండములచే నిండియున్న విశాలమగు భూఖండమంతయు బౌద్ధపరివ్రాజకుల వస్త్రఖండములబోలి యుండెడిది. ఆకాలమున నధికసంఖ్యాకులగు శాక్యులు గ్రామములయందే నివాసముల నేర్పఱచికొని సేద్యము చేదమ జీవితముల నిశ్చింతతోడ గడుపుచుండిరి. పత్తనములయందు కేవలము కృషేతర కార్యపరతంత్రులే విశేషించి వసియింపుచుండిరి.

## —•*శ్రీ బుద్ధజననము•—

ఎవ్వాడు, నిజజ్ఞానసాధనా ప్రభావంబున విశాలమగు ధరణీవలయంబంతయు నవ్యతర ప్రభాభాసితంబు గావించిమించెనో, ఏమహనీయమూర్తి నిజానూనవివేకబలంబున నిర్జీవంబులగు ధర్మము. సాహిత్యము, విజ్ఞానము, శిక్ష, శిల్పకళా

* బుద్ధశబ్దప్రయోగమునకు దాత్పర్యము సిద్ధార్థుడనియే గ్రహింపనగును.

సముదాయము, స్త్రీసంస్కరణము, మొదలగు మానవసంపదల
సమస్తవిభాగములయందు సజీవములగావించి మించెనో, ఏయవ
తార పురుషాగ్రేసరుడు స్వకీయాత్మ పరిజ్ఞానవిశేషంబున
వసుధపై వ్యాప్తమయియున్న భౌతికవాదమును ఖండించి పవి
త్రాత్మవాదమును సుస్థిరంబుగావించెనో అట్టి నూతన ధర్మసం
స్థాపనాచార్యుడు మానవసంఘ పారావారరాకాసుధాకరుండు,
సర్వేశ్వరప్రదత్త వేదసిద్ధాంతప్రచారకుండును నగు శ్రీ బుద్ధ
భగవానుని పవిత్రతమంబగు జన్మవృత్తాంతమునుగూర్చి పాఠ
కులారా! భక్తిభారావనతమస్తకులయి వినుండు. నాచే నభి
వర్ణింపబడు బుద్ధభగవాను డైతిహాసికమహాపురుషుడేయయినను
ఆదేవుని ముఖ్యతమంబులగు నలౌకికగుణముల గురించియు
నతిశయోక్తిసంభరితంబులగు లీలావిశేషంబుల గూర్చియు
సంక్షిప్తముగా లిఖియింతు.

క్రీస్తుశకమునకు బూర్వము 662 వ సంవత్సరారంభమున
నయోధ్యాప్రాంతస్థ రోహిణీతరంగిణీ తటంబున విరాజమాన
మయి యున్న కపిలవస్తు వను పట్టణమును శాక్యవంశోద్భవుం
డగు శుద్ధోధన భూపాలుడు రాజధానిగా నేర్పఱచికొని
శాక్యవంశ రాజ్యపరిపాలనము సేయుచుండెను. న్యాయపరుం
డును బ్రజానురంజకుండునునగు నా ధరణీనాథుడు ప్రజాస్వా
మిక రాజ్యపరిపాలనాసక్తుడయి పాలకపాలిత ధర్మనిర్వహణ
మునం దశేషశేముషీవిలసితుండయి రాజ్యపరిపాలనమునందు
నిరతుడయి యుండెను. ఆభూపాలునకు సంభూతు డను నా
మాంతరమును, గపిలవస్తునగరికి రోహనాయను మారు పేరును, క
లవు. శుద్ధోధననరపాలుడు కౌలీయవంశజుండగు సుభూతుని

కన్యాద్వయమును ధర్మపురస్సరంబుగ బరిణయమాయెను. ప్రథ
మపత్ని మాయాదేవియను నామంబునను, ద్వితీయ మహాప్ర
జాపతి, యథవా గౌతమీదేవి యను శుభాహ్వయంబునను బ్ర
సిద్ధికెక్కియుండిరి. పత్నులిరువురు బతిగతప్రాణులయి, దివా
రాత్రము లాహృదయేశ్వరునే ధర్మార్థ కామమోక్షప్రాప్తి
నిమిత్తము ప్రత్యక్షదైవముగ మది నెంచి, యారాధింపుచుండిరి.
ఏతద్వనితారత్నము లిరువురును భర్తృమనస్తుష్టియందే కైవల్య
ముండునని సంభావించునట్టి పతివ్రతాచూడామణులు. పతియే
సతికి యేకమాత్రగతియనియు, బతిభక్తియే వనితాప్రపంచము
నకు ముక్తిసాధనమనియు భావించు మాయాగౌతమీదేవులిరు
వురును దమ యత్యంత పవిత్రచరిత్రంబుల నాకాలమున శాక్య
వంశీయులరాష్ట్రములయందెల్లెడలగణుతికెక్కియుండిరి. ప్రాపం
చికసౌఖ్యప్రాప్తినిమిత్తమే పతులు పత్నులకయి సృజింపబడినా
రనియు, సమస్తవిధముల భర్తల కాధీనులయియుండుట మా
నాభిమానముగల వనితాలలామలకు లజ్జాస్పదంబయిన కార్య
మనియు భ్రమించు మూఢస్త్రీజన మాదేవుల ప్రత్యక్షాదర్శ
చరిత్రముల, వృత్తాంతంబుల నాలకించి, నిరుత్తరలయి, లజ్జా
వనత మస్తకలయి, తమ యైశ్వర్య సౌందర్యాదులకు దమకు
గల్గిన ప్రౌఢత్వమునకును, నిజకించిజ్జ్ఞతకును లజ్జాభూత మన
స్కలయి తమచరితముల గ్రమక్రమముగ సంస్కరించుకొన
దొడంగిరి. పావనంబగు ప్రభాకరుని కిరణమాలిక స్వయం
జ్యోతియగుచు దా నేపదార్థముల బ్రసరించునో, అవ్వాని
నెల్ల ప్రకాశవంతములుగ జేయుచుండు చందముననే మానవ
మూర్తులవెలయు. సద్గుణము సహితము స్వయంజ్ఞాన ప్రభా

భాసురమయ్యు బ్రపంచమున నవివేకాంధకారపరిపూర్ణుల నెల్ల సంస్కరించి, చక్కగా బ్రకాశింపజేయుచుండునుగదా! శుద్ధోధనభూపాలుని పత్నులిర్వురు నిరంతరము మహాపురుషుల యొక్కయు మహాపతివ్రతామతల్లులయొక్కయు నలోక సామాన్యాద్భుత చరిత్రంబుల శ్రవణానందకరంబుగను, హృదయానురంజకంబుగను బారాయణము సేయుచు, నాయా దివ్యతమంబులగు చరిత్రలయందు వేర్కొనబడు దివ్యగుణముల నభ్యసింపుచు దమ చరిత్రనిర్మాణముల గావించుకొనుచు నిజజీవితముల ననుదినము బ్రభాభాసురంబుల నొనరింపుచుండిరి. నిశాకాంత శరీరకాంతిని హసియింపజేయు శ్యామవర్ణ విరాజితంబగు పికమున కేరీతి సంగీతమాధుర్యంబున కనువగు కంఠమార్దవ్యము వన్నెనొదవజేసెనో యదియేభాతి సువర్ణకాద్య నిర్మితాభూషణములకంటె వనితాబృందమునకు శాశ్వతంబును సర్వేశ్వరీప్రదత్తంబును నగు సుగుణమే దివ్యాలంకారము వికాసభూతంబగునని మాయాగౌతమీదేవు లనారతము దమ సన్నిధికరుదెంచు స్త్రీలోకమునకు బ్రబోధము సేయుచుండిరి. స్రష్టసృష్టియందుండు సమస్త సద్గుణము లాదేవులయందు మూర్తీభవించియున్నవో యన్నరీతి వారిచరిత్రము లాదర్శపాత్రము లయ్యెను. గౌతమీదేవి సద్గృహిణి పలుపవలసిన నిత్య గృహధర్మముల నిర్వహించుటయందు లగ్నమనస్కయయి యున్న తరుణమునందుసహితము బట్టమహిషియగు మాయాదేవి, భర్తృపాదారవిందద్వయ సన్నిధిని భూలోకమున కేతెంచిన సుమాదేవియో యన్నట్లు దోప, శాంత భక్తి రస పీయూష మాదేవీలలామ వాసోము ప్రతిబింబముచుండి

మొలుకుచుండ నాసీనయై సేవాశుశ్రూష చేయుచుండెడిది. భూపాలుఁడా దేవియపూర్వసద్వర్తనము నవలోకించి ముగ్ధుఁడయి, యా దేవి నొక్క నిముసమయిన నెడబాసియుండువాఁడు కాఁడు. సద్గుణగ్రాహకుండగు భూపాలుని మాయాదేవి నిజ శారీరక సౌందర్యప్రభా విశేషంబుననేకాక, తనయందు వెలయు కర్తవ్యపరాయణత్వము, ఆత్మసంయమనిష్ఠ, ధర్మాసక్తి, సర్వేశ్వరభక్తి మొదలగు సద్గుణావళిప్రభావంబునను మంత్రబద్ధుని వలె ముగ్ధుని గావించెను. పంచమవేద మనబఱగు మహాభారతంబున సత్యభామకు ద్రౌపదీదేవి యొసగిన భర్తృవశీకరణ ప్రబోధమెంతయు మన చరిత్రనాయకశ్రేష్ఠుండగు బుద్ధదేవుని మాతృదేవియెడ సార్థకంబాయెడిని.

అశేష శేముషీవిలసితయు, ననారత పతిసేవాపరాయణయు, నపూర్వ గుణాలంకార భూషితయు నగు పత్నీయుక్తుండును, సమస్తవిధ పవిత్రభోగ విలాససంపన్నుండును, నిత్య షడ్రసోపేతాన్న భోక్తయు, సమస్తైహిక సంపన్నిలయుండును నగు శుద్ధోధనభూపాలుఁడు దుర్దమనీయంబగు మనోవ్యథాతిరేకంబున డెందమునం దెంతయు గుందుచుండెను. ఆ భూపాలుని మహాచింతకు మూలహేతు వాతని మనోభిలాష సఫలీభూతము కాకుండుటయేయని వేఱుగ వక్కాణింపవలయునా? మనోవ్యాధికి ఔషధము లేదనికదా విజ్ఞప్రపంచము చే నంభావింపబడుట గాంచుచున్నారము.

"శ్లో॥ చింతాయాశ్చ చితాయాశ్చ బిన్దుమాత్రవిశేషణమ్
చితా దహతి నిర్జీవమ్ చింతా దహతి జీవినమ్॥

ఈశ్లోకమే భూపాలునియెడ సార్థకమగుచుండుట నుప లక్షించి సాధ్వీమణియు, సహధర్మచారిణియునగు మాయా దేవి భర్తృవిషాదకారణమును స్పష్టముగా దెలియ నభిలషించి, యొక్కదివసము పుడమిరేడు దండకేతెంచి హస్తకమలములు ముకుళీభూతముగావించి యిట్లు పృచ్ఛించెను:—"ఆర్యపుత్రా! నిత్యపరిభాన్వితంబగు భవదీయముఖమండలము వికాసశూన్య మయియున్న దేమి? ముఖలక్షణంబులే హృదయాంతర్గతంబులగు పరిస్థితుల దర్శింప దర్పణసదృశములయి యొప్పుచుండునుగదా! శరీరారోగ్య మస్వస్థంజెందెడినా లేక మనోవిషాదమున కెద్ది యేని హేతువున్నయదా? విశదము గావించి సహధర్మచారిణి నగు నానిరుత్సాహము నెడబాపుడి.

శుద్ధోధనుడు :— "దేవీ! దేహ మస్వస్థతంజెందలేదు. సర్వదానుద్విగ్నచిత్తుండనయి యుండుటకును, రాజకార్య ములయెడ విముఖత్వంబును, భోగవిలాసములయెడ నౌదా సీన్యమును వహించి వర్తించుటకును హేతువు మానసిక వేదనమే. మానసికవ్యాధికి హేతువేమియని నీవు పృచ్ఛింతు వనియే భావించెదను. పున్నామనరకకూపమున బతితుండనగు నా యీధనధాన్యైశ్వర్యాది వైభవంబులను విశాలసామ్రా జ్యమును మట్టిగలియునుగదాయని నే నిరంతరము స్రుక్కు చుందును. నాకు వాటిల్లు పున్నామనరకబాధ యటులుండ బ్రజాసంఘపరిపాలన భారంబు వహించి సర్వేశ్వరాదేశితంబగు శాంతిని సామ్రాజ్యమున సుస్థిరముగావించు వార లెవరా యని చింతిలుచున్నాడను."

భర్తృమనోవిషాదంబునకు హేతువును గ్రహించినదయి మాయాదేవి యక్కార్యము మానవశక్తికతీతంబయినదని గుర్తెఱింగి దీర్ఘముగ విచారించి "నారు పోయువాఁడు నీరుపోయఁడా" యను గ్రామీణుల సూక్తిస్మృతిపథంబున దట్టినంత నే హృదయేశ్వరుని సంబోధించి యిట్లు మృదుమధురంబులగు వాక్కుల వచింప నారంభించెను :—స్వామీ ! ఎవ్వానిని వాణి పరిత్యక్షముగావింపనశక్తమో కాని యెవ్వాని నిర్వ్యాజకరుణా విశేషంబున వాణియందు భాషించుశక్తి వెలయుచున్నదో యట్టి పురుషోత్తము నర్చింపుఁడు. ఎవ్వానిని మనము గ్రహింపజాలదో కాని యెవ్వానికృపాబలంబున మనము జ్ఞానమును బడయగల్గుచున్నామో యట్టి యపూర్వచరిత్రునే యారాధింపుఁడు; ఎవ్వాని నేత్రయుగ్మంబు సందర్శింపజాలదో కాని యెవనిదయాప్రభావంబున జక్షురేంద్రియములు దృష్టినందగల్గినవో యట్టి యలౌకికుని బూజింపుడి. ఎవ్వానిని మనము కర్ణేంద్రియంబుల నాకర్ణింపజాలమో, కాని యెవ్వానిదయాళుత్వంబున నాలకింపగల్గు శక్తిని శ్రవణములు బడయగల్గినవో యట్టి నిర్వికారుని భజింపుఁడు. క్షణమాత్రకాలంబున నిరాతంకముగా భవన్మనోభిలాష సఫలీభూతంబగును. చింతింప బనియేమి? సాధ్వీమణియగు మాయాదేవి దివ్యప్రబోధమును శ్రద్ధాళుఁడయి యాలకించి, భూపాలుఁడు మనస్తుష్టి నంది భగవదారాధన భవసాగర తరణంబునకే మూలసాధనమయియుండ నత్యంత పూజ్యంబగు మనోభిలాషా సాఫల్యతకు మూలసాధనము కాకుండునాయని సంభావించి, నిర్వికారుని భజియింపదొడంగెను. సత్సంతానాభిలాషియయి నరపాలుఁడు నిరం

తరము సాధు సజ్జన సేవాశుశ్రూషయు, మతగ్రంథ పారా
యణంబును, నిత్య బ్రాహ్మణ భోజనంబును (బ్రాహ్మణుల
నగా బ్రహ్మజ్ఞాన సంపన్నులని యే తాత్పర్యము) బ్రాతస్సం
ధ్యారాధనము సద్భక్తియుక్తుడై సలుప నుపక్రమించెను.
దివారాత్రము లన్యోన్యకార్యముల వర్జించి, భూపాలోచిత
భాగ్యభోగ్యంబుల నొల్లక విరాగిచందమున వ్యవహరింప
దొడంగెను. భూపాలుని హృదయమందిరమునం దాశానాశలు
ద్వంద్వయుద్ధ మొనరింపసాగెను. విజయనిర్ణయ మింకను గలు
గలేదు.

గీ॥ సర్వవిధ భాగ్యభోగ్యముల్ • సంతతంబు
ననుభవించియు సంతతి • గందలేక
వ్రతము లెన్నింటొ కావించి • ఫలముఁ గనక
చింతనందదొడంగెను • క్షితిపవరుఁడు ॥

ఒక్కొక్కెడ మానవప్రయత్నంబు నిష్ఫలంబగుచుం
డునని భావించి, భూపాలుఁడు భగవత్కృపాభిక్షుకై కై జాచి
వేచియుండెను. కాలచక్రము మహావేగంబున బరుగిడిపోవు
చునేయుండెను. కాంక్ష ఫలోన్ముఖం బగునని యెడి గుడ్డి
యాశను సహితము నృపాలుడు కోల్పోయెను.

ఒకానొకదివసము మాయాదేవి నిశాసమయంబున బ్రమో
దసదనంబున సఖీసమేతయయి శయనించియుండెను. నానావిధ
ప్రసంగముల నా చెలిమికత్తియతో సేయుచు నా దేవి గాఢనిద్రా
పరతంత్ర యయ్యెను. తత్సమయంబున నభోమండలమునుండ
దేదీప్యమానంబగు నొక్క తారక ప్రదీప్తలంబున కవతరించి

నిజశయనగృహకక్షాంతరాళంబున బ్రవేశించినట్లు సుస్పష్టము
గా నాదేవి గాంచెను. వసుధాస్థలి కవతరణంబుగావించిన యా
నక్షత్ర మల్పకాలమునందే ప్రచండరూపధారిణియగు శ్వేత
నాగమయినట్లు మాయాదేవి యవలోకించెను. తన్నాగము శత
ధా భిన్నమగుడు నందలి యొక్కఖండము సూక్ష్మరూపంబున
వామభాగమునుండి నిజగర్భంబున బ్రవేశింపుచుండుట సహి
త మా మహారాజ్ఞీమణి దర్శించెను. ఏతత్స్వప్నసందర్శంబున
మాయాదేవి భయభీతయయి ప్రభాతమే తెంచినంతనే హృద
యాధిపుండగు శుద్ధోధన నరనాథున కావింతవార్తను విశదీక
రించెను. పత్నీవ్రతుండును, నిర్మలప్రేమైకస్వరూపుడును నగు
నాభూపాలుడు విచిత్రంబగు నావార్త నాలకించినంతనే శం
కితస్వాంతుడయి, స్వకీయసభామందిరమున కాత్మీయసచివ పురో
హితబృందమును రావించి, భక్తిపురస్సరంబుగ నిజపత్నీ స్వప్న
సమాచారమును నివేదించి, దానియర్థ మేమయియుండునని
ప్రశ్నించెను. రాజకథనంబు నాలకించి సభాగతపౌరోహితగణం
బియ్యదత్యంతశుభప్రదంబగు స్వప్నమని సముచితప్రత్యుత్తరం
బొసంగి నిజస్థానములకు రాజానుమతంబున జేరిరి. అనుభవజ్ఞాన
సంపన్నుండగు ప్రధానామాత్యశేఖరుండు నిజధీశక్తిమెఱయ
నీస్వప్నఫలంబు "సత్వరసత్కుమారరత్నప్రాప్తి" యని దూర
దృష్టివలన గ్రహించి, ధరణీపతి కా శుభోదంతమును విన్న
వించెను. రాజశేఖరు డా చిరకాంక్షాసఫలీకృతంబగు కల్యాణ
మయసమాచారము శ్రుతిపుటంబుల బడినంతనే స్వర్గీయానం
దాంబుధి నోలలాడినవాడై భావిపుత్రలక్షణము లెట్లుండునని
యానందాతిరేకమును నిరోధింప నశక్తుండై సచివోత్తముని

సాదరముగ బృచ్ఛించెను. "భూపాలావతంసమా! నీ కుద్భవించు కుమారరత్న మనూనాపూర్వ శేముషీ విశేషవిలసితుండు. అత డానందపూర్వకంబుగ గృహస్థాశ్రమ స్వీకారము గావించి సంసారియగుచో మహాబలాఢ్యుండును, నవక్రవిక్రమోపేతుండును, లోకోత్తర ధైర్యస్థైర్యగుణగణ విరాజితుండును, సమస్త మహీచక్రపరిపాలనా సామర్థ్యాది సర్వగుణ సంశోభిత సార్వభౌముండును కాగలడు. దైవసంయోగంబున నాత డపార సంసారమును బాసి, సర్వసంగపరిత్యాగియే యగుచో సర్వతరోత్తమభావ విలసిత సద్ధర్మ సంస్థాపనాచార్యుడై భువి వెలయగలడు. ఆచంద్రతారార్కంబుగ దన్మహాత్మ స్థాపిత ధర్మరాజము సమస్తభూవలయంబున వ్యాప్తమై, మిథ్యాభిమానపూరిత హృదయులగు ధర్మప్రవక్తల గీటడంచి, అన్యాయాహంకారాది దుర్గుణంబుల రూపుమాపి, నిజదివ్యప్రకాశ పుంజముల నల్దెసల గ్రమ్మజేసి, కోటానుకోట్ల యాత్మల కనూనంబగు శాంతిసౌఖ్యప్రదానము గావించును. తన్మహాత్మ ప్రతిష్ఠాపిత ధర్మధ్వజముక్రింద జీవకోట్లన్నియు బరస్పర ద్వేష మాత్సర్యంబుల విడనాడి, సర్వసమానత్వము నే వలచి ప్రేమ పుష్పాంజలిని వెదజల్లుచు భౌతిక జీవితయాత్రను సేయగడంగును. అత్తతి నామహామహుని సత్కీర్తిచంద్రిక లెల్లయెడల వ్యాపించును. భూపాలసత్తమా! భవదాత్మజుం డలౌకికసద్గుణనిలయుండై, భగవదవతార పురుషాగ్రేసరుం డనబడగును. సందేహింపజనదు. నిక్కువము." అని మహాత్ముండగు నామంత్రి పుంగవుడు విచారించి వక్కాణించెను. నిజపుత్త్రతాభిలాష

సఫలీభూతంబగుననియెడి సత్సమాచారంబు నాలకించు మహా ద్భాగ్యము నొదవజేసిన సచివునకసంఖ్యాకంబులగు కృతజ్ఞతాభి వందనముల నర్పించి, యమూల్యవసనభూషణాది పారితోషి కంబుల బ్రసాదించి, సభాసదనమునుండి సాగనంపెను.

మాయాదేవి స్వప్నసమాచారసత్పరిణామము శీఘ్ర కాలమునందే యథార్థమని సమస్తజనులకు దెలియవచ్చెను. కతిపయవాసరంబులకె యద్దేవి గర్భము ధరించెను. మహారాజ్ఞి దూలాలయ్యెనను మంగళప్రదసమాచారము నాలకించి, శుద్ధో ధన రాజచంద్రుండును, గపిలవస్తు నగరవాస్తవ్యులును, రాజ కర్మచారీగణములును నమందానందకందళిత హృదయారవిందు లై, కైజాచు వారినెల్లర నిజశక్త్యనుసారంబుగ నానందపలుప సాగిరి. పుత్రసమానంబగు ప్రజాసంఘమునుండి దివ్యాశీర్వాదం బుల బడయనెంచియు, వారల సంతుష్టాంతఃకరణులగావింప నభిలషించియు భూపాలు డనిశంబు ధనకనకవస్తువాహనాంబర ముల నవిరళముగ వితరణము సేయుచుండెను. నృపాలశేఖ రుండు స్వీయానందప్రవర్ధనార్థ మనేకమఖంబుల (హోమము సేయుట) ను, ఆనందోత్సవంబులను గావించి హృజ్జనితానంద మయ భావప్రవాహంబును నగరమధ్యంబుగ బ్రవింపజేసి, తత్ప్ర వాహానందరసము నన్యులకుసహితము పానముసేయ నొసం గెను. వేయేల? నిజహర్షానుభవంబున నెల్లర బాల్గొననిచ్చెను. సాత్వికాచారసంపన్నుండగు నాసర్వేశ్వరప్రతినిధి యనేక విధంబుల బ్రజలను బ్రసన్నచిత్తులగావింప యత్నించెను. నవ మ్మాసములునిండ, నరపాలుని ప్రాణేశ్వరియగు మాయాదేవి ప్రసవంబునకయి, సాంఘికాచారము ననుసరించి, పితృగృహం

బున కరుగ బ్రయాణసన్నద్ధములు సేయగడంగెను. భూపాలు డామె కనుమతి నొసంగి, యామెవెనువెంట సంరక్షకసైన్యమును రథగజహయాదులను నగణితంబుగా ననిపెను. ప్రసవావస్థయం దత్యంత జాగరూకతతో బ్రమాదమును విస్మరించి, మహారాజ్ఞి సేవాశుశ్రూషలగావింప దాసదాసీజనంబు సహితను వెంటనంపెను. జనసమూహ మత్యంత వైభవోపేతమై, నానావిధ శృంగారములచే సుసజ్జితంబయి, సాగరోద్భవ తరంగమాలికాచందమున త్రుటిమాత్రకాలములో నగర ముఖద్వారంబుల నతిక్రమించి, బహిర్దేశమునబడి నడువదొడంగెను. ఈరీతి గతిపయదివసములపర్యంతము మార్గాతిక్రమణము సేయుచు గొంతదవ్వేగినంత నేనానావిధతరులతాసంతానావృతంబగునొక్క విశాల సాంద్రారణ్యము మార్గమధ్యంబున దటస్థించెను. సంతత దయార్ద్రచిత్తయు, కాఠిన్యగుణత్యక్తయు, నిరంతర విరించివిరచిత సంతానానుకూలానందప్రదాన కార్యానురక్తయునగు వాసంతికాదేవి తత్సమయంబున దివ్యదేహచ్ఛటల నలుగెలంకుల వ్యాపింపజేయుచుండెను. వనలక్ష్మీప్రియవల్లభుండగు వసంతుడే తెంచుట నవలోకించి స్వాగతంబు నొసంగుచున్నవోయన భూరుహశాఖోపవిష్ట విహంగబృందములు నిజకంఠములచే గలకలంబులగు నవ్యక్త మధురధ్వనులు సేయుచుండెను. తత్సమయంబున ఋతురాజమగు వసంతము ప్రకృతీదేవి కొక నూతనశోభ నావహింపజేసియుండెను. నవవివాహితంబలె ప్రకృతికన్యక సమస్తవిధభూషణా భూషితయయి, పరాయత్తములయియుండు చిత్తముల కున్మత్తత (లాహిరి) గొలుపుచుండెను. వివిధవిధ నవవికసిత పుష్పగుచ్ఛ

ములనుండి యావిర్భూతమగు దివ్యసౌరభము ఘ్రాణేంద్రియముల కమితాహ్లాదము నొడగూర్చుచుండెను. సూర్యభగవానుడు దీర్ఘప్రయాణంబుచే గ్లాంతమనస్కుండయి, యస్తాద్రిజేర సంసిద్ధుడయి యుండెను. అంబరచుంబిత వృక్షాళిపై గిసలయంబులు సంజకెంజాయల దివ్యారుణకాంతిచే నతిభాసురంబుగ బ్రకాశింపుచు, మారుతాహతిచే నల్లనల్లన నల్లలలాడుచు నొక వింతసౌందర్యము నుత్పన్నము సేయుచుండెను. మధురరసభరిత ఫలపుష్ప సమన్విత భూరుహశ్రేణిపై నూర్పునియున్న విహంగసముదాయము వసంతాగమనమున కెంతయు ముదమునంది యవ్యక్త మృదుమధుర ధ్వానంబుల శ్రోత్రతలకపూర్వానందము నొదవజేయుచు విలక్షణ లక్షణలక్షితంబగు ప్రకృతివిచిత్రచరిత్రము యొక్క మహిమాతిశయమును శతముఖంబుల నుద్ఘోషింపుచుండెను బాలరసాలసాలకిసలయంబుల బసతో మెసవు పికసమూహముల కలకంఠోచ్చారిత పీయూష సదృశ మధురగానరవ మాహృదయాహ్లాద కరంబగు సాయంతనకాలంబున శ్రోత్రలహృత్తంతువుల మీటుచున్నట్టులుండెను. భ్రమరగణము లటునిటు ఝుంకారధ్వనుల సేయుచు గాసారంబుల వికసించిన పూసారంబుల బానముసేయ వేసారక పరిభ్రమణము సలుపుచు వేశ్యాంగనా సందర్శనంబున గామోద్రేక పూరితుండగు తరుణవయస్కుండు పడయు మైకమువలె మకరందమాధుర్య రసాస్వాదనాపేక్షచే జనించిన లాహిరిచే బరవశత్వము జెందుచుండెను. ఏవైపుజూచినను, ఏదిక్కు బరిశీలించినను, ఏపార్శ్వము నవలోకించినను బ్రాకృతికసౌందర్యచ్ఛటయే దృక్పథంబున బడుచుండెను. హృద

యాప్లోదకరంబును నేత్రానందప్రదంబును శ్రవణానందమూలంబును నగు వాపసంతరాజాగమనదృశ్య మనన్యదృశ్యము; అసమానప్రభావభావవిభాసురంబు; అనిర్వచనీయ సౌందర్యబాహుళ్యమండితంబు; స్వకపోలకల్పిత వర్ణనాపృక్తంబును నిరర్థక సమాసమన్వితంబును, శృంగారరస ద్యోతకశబ్ద భూయిష్ఠంబును నగు కావ్యశైలిం బడిపోవుట చరిత్రకారునిముఖ్యధర్మమునకు విరుద్ధకార్యంబు గాన నానిరంకుశలేఖినిని యుక్తవిషయంబునుండి పరాయత్తముగానీయక బుద్ధదేవుని పునీతచరిత్ర చిత్రణము వైపున కాకర్షించెద. అర్వాచీనకాలపు నవలాకారులమాడ్కి పాశ్చాత్య లేఖనాఫక్కిని, పాశ్చాత్యభావబద్ధము కానీయక, దాస్యశృంఖలాబద్ధయు, సంతతదాస్యానల జనిత దుఃఖవిహ్వలయు స్వీయపుత్రిత్యక్తయు, ననాథయునగు భరతమాత కనుకూలంబగు దివ్యప్రబోధంబునకు మాత్ర మీగ్రంథమున నట నట దావీయ సంకల్పించితిగాన, బాఠకులారా! మన్నింపవేడెద.

పూర్వోక్త వసంతర్తుసమయంబున మాయాదేవి దాసదాసీజన పరివేష్టితయై, సాంద్రారణ్యస్థిత మహావటవృక్షతలంబున విడిసియున్నతరుణమున గర్భమునం దొక విధమగు బాధ యుప్పతిల్లి భయభీత యాయెను. తత్పీడ ప్రసవవేదనయే యయియుండునని శంకించి రాజపరివారము దివసత్రయంబు దనుక నయ్యెడనే వేచియుండవలసినదాయెను. దివసత్రయానంతరంబు ప్రాతఃకాలమున సూర్యుం డుదయమగుచుండ, దేవికి బ్రసవవేదనము మెండాయెను. అయ్యది గాంచి దాసదాసీజన హృదయాందోళనము హెచ్చుదొడంగెను. మహాభయంకరంబును, సౌకర్యదూరంబునగు స్థానంబున, రాజాంతఃపురంబున

వాసము సేయు దేవి ప్రసవింపవలసివచ్చెంగదా యని రాజభృత్య
మండలి పెద్దప్రొద్దు డెందమునగుంది సేయునది లేక, విధివిధా
నము నుల్లంఘింప మానవులకు సాధ్యముగాదని తెలిసి, వట
వృక్షచ్ఛాయయందు సమతలంబగు స్థానమున నవపల్లవంబు
లను, కిసలయంబుల నేర్చి కూర్చి మృదులశయ్యను సిద్ధపఱచిరి.
దాసీజన మాదేవిని శాంతముగ నాలేజిగుళ్లసెజ్జపై బండ జేసిరి.
దయాసాగరుండగు సర్వేశ్వరుని కారుణ్య భావవిశేషంబున
మాయాదేవి యసహనీయంబగు ప్రసవవేదనమును బడయ
కయే వలయాకారంబుగ దన్ను బరివేష్టించియున్న దాసీజనంబు
మాటున నొక్క పుత్రరత్నమును గనెను. ఆకుమారరత్నమే
శాక్యకులకమలదివాకరుండును, సమస్తపృథ్వీతల బౌద్ధజన
కైవల్యప్రదాతయును నగు శ్రీగౌతమబుద్ధభగవానుడు. భూరి
దానధర్మంబులవలనను, సత్క్రియాచరణంబునను, సాధు సజ్జన
సేవాశుశ్రూషాపరాయణత్వంబునను నిజ పితృప్రాసాదాంత
రాళంబునగాని, మాతామహుని రాజసౌధాంతరంబునగాని
జననమందక, ఘాతుకమృగ సంతానంబులకును, భయంకరా
కార విలసితంబులగు పశుపక్ష్యాదులకును, హాలాహల
పూరితకాలభుజంగవితతికిని నాలవాలంబగు నిర్జన నిబిడా
రణ్యంబున, భానూదయసమయమందు జననమందుటయందేదో
గూఢరహస్య మవశ్యము డాగియున్నదని వేరుగ వచింపవల
యునా? అసంఖ్యోపవాసంబులవలనను, దీర్ఘకాల ప్రయాణా
యాసంబునను మాయాదేవి నిర్మలప్రకృతియందు నూతన
పరివర్తన మొండు గానవచ్చెను. అనుక్షణము శరీరస్వాస్థ్యము
భగ్నమగుచుండెను. ఆపత్కాలమున నాత్మీయజనము నెడ

బాసి యాఘోరారణ్యమున వేచియుండుట వివేచనాపరుల కర్తవ్యము కాదని యెంచి మాయాదేవి సత్వరంబు సుతుని వెంటనిడుకొని పరివారసమేతముగా భర్తృగృహోన్ముఖి యయ్యెను. ఆశ్రితబృంద సమేతయయి నిజభవనంబునకు మరలి వచ్చిన ప్రాణేశ్వరీ యంకతలంబున బూర్ణేందుబింబమును గేరు పుత్రరత్నవదనమండలమును గాంచి, భూపాలు డనిర్వచనీయానందమును బడసెను. పెన్నిధింబడసిన పేదవలె భూపాలుడు తనభాగ్యమునెంతయు సంస్తుతించుకొన నారంభించెను. పద్మవిహీనంబగు సరోవరము పగిదియు, గంధశూన్యంబగు పుష్పవాటిక భాతియు, సతీత్వదూరయగు రమణీమణి తుల్యంబుగను సంతానవిహీనంబగు గృహస్థుని గృహముసహితము శోభాశూన్యమయి శ్మశానవాటికాసదృశంబుగ నంధకారాచ్ఛాదితమయి యొప్పుచుండును. కాని నేడు నవోదితపుత్రరత్నాగమనంబున శుద్ధోధనభూపాలుని రాజప్రాసాద మపూర్వకళాసంభరితమై ప్రకాశింపదొడంగెను. శుద్ధోధనభూపాలుని హృదయపటలముపై నాచ్ఛాదితమయియున్న విషాదమాలిన్యము సుపుత్రప్రాప్త్యానంద సలిలప్రక్షాళనంబున బరిశుద్ధమయ్యెను. జ్ఞానప్రదములయం దెల్లెడల బుత్రరత్న జననవార్త వ్యాప్తమయినంతనే శాసితులెల్లరు భూమిపరిపాలకుని బడసినారముకదాయని యమందానంద బాహుళ్యము నందసాగిరి. హతాశులయియున్న నాప్రజల, తత్సమయానందాతిరేకము స్వానుభవైకమేగాని కల్పనాచతురులగు కవుల లేఖినులకు జిత్రింప సాధ్యము కాదు. నగరమునం దంతట గల్యాణమహోత్సవములు విధి విరామములేకుండ సలుపదొడంగిరి.

రాజదంపతులు మనోభీష్టసిద్ధికై సర్వేశ్వరు ననేకముఖంబుల సంస్తుతింపుచు దత్సర్వేశ్వర ప్రీతిభాజనంబులగు సత్కార్యము లను సలుపుచు పాత్రదానములను బ్రసాదింపజొచ్చిరి. జాత కర్మానంతరంబు గురుజనకథనానుకూలంబుగ రాజదంపతులు తమయభీష్టమును, సమస్తప్రజల యభీష్టంబును నెరవేఱినవి కదాయను భావంబున నాపుత్రునికి సిద్ధార్థుడు లేక సర్వార్థ సిద్ధుడు యను నామకరణము గావించిరి. ద్వంద్వాత్మభూయిష్ఠం బును నస్థిరంబును నగు సంసారమున జిత్తశాంతి యెటులుండనే ర్చును? సుఖము వెంటనే దుఃఖము, దుఃఖముపిఱుంద నె సుఖము నంటియుండును గదా? శుక్లపక్షము వెంట గృష్ణపక్షము నద్దాని వెనువెంటనే శుక్లపక్షము నుండుచందమున నే భౌతికప్రపంచము న జీవకోటికి సుఖదుఃఖములును, జననమరణములును దటస్థింపు చుండును. కపిలవస్తునగరానందమునకు విఘ్నము వాటిల్లెను. సిద్ధార్థుని మాతృదేవి యగు మాయాదేవి యనుదినము క్షయ రోగపీడితయయి శుష్కింపజొచ్చెను. సుతుని లాలనపాలనము నేయు భాగ్యము నా ధాత లలాటమున వ్రాయ లేదుకదాయని డెందమున గుందుచునే యాదేవి గోలోకవాసిని యయ్యెను. మాయాదేవి పరమపదించినంతనే మాతృవిహీనంబగు సంతా నమునకు బ్రాప్తించు కష్టపరంపరలనెల్ల సిద్ధార్థుని దరిజేరనీయక శుద్ధోధనభూపాలుని ద్వితీయపత్ని యగు గౌతమీదేవి నవోదిత సుతుని లాలనపాలనాది భారమును స్వయముగ వహించెను. భూపాలుడు సహిత మా బహువత్సరముల పంటయగు ముద్దు బిడ్డ నతిప్రేమతో బోషింపుచు గంటికిఱెప్పబలె గాచుచుం

డెను. ఇటనుండి మనచరిత్రనాయకుని సిద్ధార్థుడనియే సంబో
ధించుట యుక్తము.

## సిద్ధార్థుని బాల్యము.

మన పూజనీయచరిత్రనాయకుండగు సిద్ధార్థుడు గౌత
మీదేవిపాలనపోషణంబున గ్రమ క్రమముగా బ్రవర్ధమాన
ము కాదొడంగెను. అనుదిన మాబాలుని వదనారవిందమునం
గల వన్నెలు చిన్నెలు సహిత మభివృద్ధి నందసాగెను. ధరణీ
పతి ప్రియికంబుగా నాత్మజు నంకతలంబున నిడికొని సంత
త ముపలాలనము గావింపుచుండువాడు. ఆత్మసంభవుడగు సిద్ధా
ర్థుని కుపనయనాదికర్మల గావింపజేసి భూపాలుడు విశ్వామి
త్రాహ్వయుడగు నొకవిప్రశేఖరుని సన్నిధి కనిశము విద్యో
పార్జనార్థము పంపదొడంగెను. ఏకసంతగ్రాహియు, నతితీక్ష్ణ
ధీసంపన్నుడును నగు సిద్ధార్థు డుపాధ్యాయప్రబోధిత పాఠం
బుల నెల్ల నొక్కక్షణకాలమునందే కంఠస్థముగావించి నూతన
విషయప్రబోధంబునకై యధ్యాపకు ననారతము బీడింపుచుం
డెను. గురుదేవుం డుపదేశించిన సద్విషయమునకు ద్విగుణితాం
శముల జేర్చి బోధింపగల శక్తిసామర్థ్యాతిశయము సిద్ధార్థుని
యందు సహజముగనే వెలయుచుండెను. బాలకుండగు సిద్ధా
ర్థుడు నిర్మాణశక్తికిని ఆలోచనాశక్తికిని నిలయుడని చెప్పదగి
యుండెను. అతడనేకవిధంబులగు భోగంబులయందును, సౌఖ్యా
ప్రపత్తులయందును శైశవంబాదిగ బోషింపబడినవాడయ్యు
బాల్యకాలమునుండియు భావగాంభీర్యమును, సంయమపవిత్ర
దార్ఢ్యమును గల్గియేయుండెను. బాల్యకాలసామాన్యంబగు

స్వాభావిక చాంచల్య మణనియం దీషణ్మాత్రమయినలేక యుం
డెను అతనిస్వభావమత్యంతశాంతమయమై సహనశీలతాయుక్త
మై గంభీరమైయుండెను. మేథాసంపన్నుడు, స్థిరబుద్ధియునగు
నతం డల్పకాలమునందే సమస్తవిద్యలయం దుత్తీర్ణుండయ్యెను.
సమస్తశాస్త్రాధ్యయనంబున నలోకసామాన్య పండితమండలా
గ్రగణ్యుం డగుటజేసి సర్వవిద్యానిష్ణాతులెల్ల రతనిని మనః
పూర్వకంబుగ నభినందింపజొచ్చిరి. సకలశాస్త్ర పారంగతుం
డననియు, భూపాలాత్మజుండననియు నహంకార మిసుమంత
యయినలేక సర్వదా నిష్కల్మషంబగు ప్రేమతోడ సహచరుల
సాంగత్యము నభిలషించుచుండెను. నేస్తకాండ్రిందఱు నిట్టి
యపూర్వగుణగణ విరాజితుండగు సుహృన్వరు డిలాతలంబున
లభ్యమగుట దుర్లభంబని సంస్తుతించినంతమాత్రంబున మిథ్యా
భిమానపూరితహృదయుడు సిద్ధార్థుడెప్పుడును గాలేదు. చెలి
కాండ్రెండ్రారులయం దవ్యాజంబగు మైత్రిని గల్గియుండు
టయే ప్రధానమని యతం డెల్లవారికి బోధ సేయుచుండువాడు.
రాజసూనుండగు సిద్ధార్థుడు సమస్తశాస్త్రవిశారదత్వ ప్రాప్త్య
నంతరం బాచార్య ప్రబోధోత్తేజితుండయి, క్షత్రియకుమా
రోచిత బాణకృపాణకుంత ప్రయోగాది శస్త్ర శాస్త్రాధ్యయ
నంబు సేయ నుపక్రమించి, యల్పకాలమునందే క్షత్రియ
కుమారులెల్లరు లజ్జజెందుచందమున నత్యధికంబగు ప్రావీణ్య
తను బడసెను. మహాశూరుండును, ధర్మపరాయణుండును,
విద్యానురక్తుండును నగు భూపాలుడు అస్త్రవిద్యయం దద్వితీ
యుండగు తన నిజాత్మజుండగు సిద్ధార్థుని సహిత మావిద్య
యం దసమానపాండితీవిశేషుని గావించియు దనివిదీఱక, అభి

నవధనంజయ బిరుదాంకితుని గావింప గృతనిశ్చయుండయి, శస్త్రచాలనా నైపుణ్యయుక్తుండగు నుపాధ్యాయు నొక్కని నిజ పుత్రి శిక్షణమునకై నియుక్తుని గావించెను. సిద్ధార్థు డహర్ని శములు విద్యాధ్యయనముతో బాటు గురు, గురుపత్నీ సేవాశు శ్రూషల గురుకులపద్ధతుల ననుసరించి సేయుచుండువాడు మోక్షప్రాప్తికి సద్గురుసేవకూడ నొక్కసోపానము కాగలదని యతని విశ్వాసమయియుండెను. భావిభూపాలుడయి యుండి యు సిద్ధార్థు డభిమానకీటకమును హృత్కమలంబున నేయవస్థ యందును బ్రవేశింపనీయలేదు సమస్తవిధ సద్గుణసమన్వి తుండగు సిద్ధార్థుడు స్వల్పసమయమునందే స్వకీయాదర్శచరిత్ర మాహాత్మ్యంబున సమస్తజనాదర పాత్రుండయ్యెను. వేయేల? స్వప్నావస్థయందయిన నతడు తానొక్క భూపాలచంద్రుని ప్రాణసమానుండనగు కుమారుండనని కాని సర్వతోముఖ పాం డిత్య విరాజితుండనని కాని, రాజసింహాసనంబున కుత్తరాధి కారి నని కాని యెంచి, స్వాభిమానపూరితహృదయుడయి, జన సామాన్యము యొక్క యాదర్శదృష్టినుండి పతితుడు కాలేదు. పదునేడేండ్లప్రాయంబయిన సరిగ బ్రాప్తింపక పూర్వమే యపూర్వలావణ్య శేముషీ విలసితుండయి సర్వజనసంస్తవా ర్హుండాయె నన్న మానవజాతి కాశ్చర్యసంభ్రమంబుల నొదవ కుండునా? మహాత్ముల జీవితము లింతియేకదా!

బాల్యావస్థయందే తాను గ్రహించిన "సర్వజనసౌభ్రా తృత్వము" (universal brother-hood) ను యుక్తప్రాయ ము ప్రాప్తించినంతనే తరుణవయస్క ప్రపంచసామాన్యం బగు మోహాంధకారంబునకు జిక్కి విస్మరింపలేదు. అతనియం

డు వెలయు ధర్మనిష్ఠ యొక్క స్థిరత్వమే యతని కాసద్గుణము నొసంగినది. సత్యము భాతి, మణివలె సర్వకాల సర్వావస్థలయం దు వాతావరణపరిస్థితుల సరకుగొనక స్థిరమయి ప్రకాశించు సద్గుణమేకదా యథార్థంబగు సద్గుణము. విశ్వసోదర ప్రేమనే మానవజీవిత నిర్వహణోచిత ధర్మంబులలోనికెల్ల శ్రేష్ఠతరం బని బాల్యకాలమునందే సహచరులకు బోధించి మించిన బాల భాగవతశేఖరులలోనికెల్ల సిద్ధార్థకుమారుడే ప్రథముండు. "ఆత్మవత్సర్వభూతాని" యనెడి గురుజనసూక్తినే యాచరణచే లోకమునకు జూపించి వాగ్రూపంబున బ్రపంచమునకు కర్ణింపజేయుచు, గార్యరూపంబున పొలిక్కి సేయు మిథ్యా ధ్యాత్మిక శిష్యార్థులను దలవంపుయగునట్లు సిద్ధార్థుడు ముక్తి మార్గ మద్దానియందే కలదని యాత్మీయ మిత్రబృందమున కెల్ల బ్రబోధించెను. నశ్వరంబగు కాయమును విశ్వసింప రాదనియు, బరోపకార సేవపరమార్థప్రాప్తికి మూల హేతువగు ననియు, నత డెల్లరకు జాటెను. మూత్రపురీషాదులతో సంభరి తమయియున్న కాయము భగవదర్పణమువలననే సార్థకంబగు ననియు, హస్తములు పాత్రదానంబు నిచ్చుటం జేసియు, దీను ల నుద్ధరించుటవలనను, శ్రవణములు ధర్మసిద్ధాంతశ్రవణం బునను, వాణి సత్యభాషణంబునను, జిహ్వ భగవద్భక్తి మాధు ర్యరసాస్వాదనంబునను, పాదములు పుణ్యపురుష సందర్శ నార్థమగుటంజేసియు సార్థకంబులగునని సిద్ధార్థు డెల్లవారిసమ క్షంబున నుపన్యసించుటగాంచి, శుద్ధోధనభూపాలుండును, గౌతమీదేవియు నత్యంతప్రసన్నచిత్తు లగుచుండిరి. భగవ త్సాక్షాత్కార ప్రాప్తికి దయాశూన్యుండును, హింసానురక్తుం

డును నగు పురుషు డన ర్హుండని యాతడు నొక్కి వక్కాణింపు చుండువాడు. అనారతమీచందమున సద్విషయంబుల నెల్లరకుప దేశించుటంజేసి సిద్ధార్థుని చిత్తమునందొక్కయలౌకికంబగు శాంతిరాజ్యము సేయగడంగెను. అనతి కాలమునందే రాకుమారుం డొక్క మహాపురుషాగ్రేసరుండగునని గురుజనులెల్లరు భావింప దొడంగిరి. సిద్ధార్థకుమారుడు సమస్తజనులతో నల్పాధిక భావదూరుడయి సమత్వభావపూరిత హృదయుడయి, మధురంబుగను, మృదులంబుగను భాషించి, నిరానందమయంబులగు వారి సంకుచితహృదయభాండముల నపూర్వానంద పీయూష ప్లావితంబులు గావించివేయుచుండువాడు. అతని జిహ్వాగ్రమునుండి విస్మృత్యవస్థయందయిన నొక్క కటువాక్యమయిన బహిర్గతమయి యుండ లేదు. సంభాషణమునకు మాధుర్యము, మార్దవత్వము వ్యక్తిదేహమున కాత్మవలెనుండి వికాసమును గల్గించునని యే సిద్ధార్థుని యూహ. భావమునందుగాని యద్దా నిరూపంబగు కార్యమునందుగాని పరిహాసంబునకయిన సిద్ధార్థుడు కాఠిన్యమును బ్రకటించియే యుండలేదు. దివారాత్రములుచ్ఛ్వాస నిశ్వాసములవలె నతనివెంటనంటియుండు సహచరులతనికి వినయవిధేయతలె. జననముతో సృష్టికి బ్రాప్తించిన మణులవి యని సిద్ధార్థుడు భాషింపుచుండువాడు. ధైర్యస్థైర్యములెప్పుడు నతనిహృదయమున నెలకొనియే యుండెడివి. సంతత దయార్ద్రచిత్తుడయి సర్వజీవ దయాపరుడయి నిరంతరము వర్తించు సిద్ధార్థుని జీవితచరిత్ర మద్వితీయ మహిమాతిశయ పరిపూర్ణంబుగదా! స్వకీయసాధిక సౌఖ్యసంపాదనార్థ

మయి హింసనేయుట మహాదోషమనియు, మానవజీవిత పతన మునకును నరకప్రాప్తికిని మూలకారణంబనియు, నాహింసాసక్తియే మానవుని హృదయదౌర్బల్యమును కాముకప్రవృత్తులను లోకమునకు జాటి, యవ్వానిని భ్రష్టుని గావించుననియు నత డెప్పుడు దోడిబాలుర కుపదేశించుచుండెను. బాల్యక్రీడలసలుపు సమయంబుల బాల్యసఖులయెడ గుద్ధుడను మఱచియయిన సిద్ధార్థుడెప్పుడును దూషణవాక్యముల శ్రీముఖమునుండియుచ్చరించియుండలేదు. రసనేంద్రియాగ్రభాగంబునుండి కటువచనమును బహిర్గతమొనరించు మానవుడు హింసాప్రభావంబున బరలోకచ్యుతుండగునని యాతనియభిప్రాయము. కాశివ్యాసను శబ్దోత్పత్తియే పండితకోటిచే విరచింపబడిన నిఘంటువులలేదని యతని విశ్వాసము. పరుషవచనంబులబల్కి, పరహృదయంబుల నొవ్వజేయుటసహిత మాంతరికహింసయనియు సూక్ష్మహింసయనియుజెప్పబడుననియే యతనియూహ. పరజనహృదయంబునకు జింతనాపాదించుటబాహ్యదేహమును ఖండించుటకంటె దోషమనియే యాబాల భాగవతుని తలంపు. స్థూలంబగు బాహ్యశరీరముపైబడు ప్రహారంబుకన్న నాంతరికంబగు సూక్ష్మతర కోమల శరీరముపై ప్రయోగింపబడిన కటువాక్యశరాఘాతమే మిన్నయని బోధించుచు సిద్ధార్థుడాత్మీయ బుద్ధిసూక్ష్మతను, కుశలతను వెల్లడింపదొడంగెను. అభ్యుదయమున బడయుటకే జననమందిన మానవసంఘమునకు హింస త్యాజ్యమనియు, నహింసయే గ్రాహ్యమనియు నదియే మానవుని దుర్గుణపూరితంబును, సంకుచితంబునునగు హృదయమును బరిశుద్ధము గావించి ముక్తినొసంగుననియు నతడు సిద్ధాంతీకరించెను.. హింసయే లేకున్న సృష్టియం

దేమాత్రము నన్యాయమే నెలకొనియుండజాలదనియు, న్యాయమే చతుర్దిశల దాండవము సేయుచుండుననియు, నప్పుడీ దుఃఖమయంబగు సృష్టియే శాశ్వతానంద పరిపూర్ణమయి బ్రహ్మలోకంబున నైక్యముజెందుననియు నత డెల్లయుపాసకులకు నుద్బోధించెను. సమస్తవిధదుర్భావ దుష్కార్యసముదాయంబులకు మూలమవివేకంబనియు, నట్టి యవివేకాంధకార ప్రభావంబున నరు డీసంసారక్షేత్రమున యుక్తంబగు ముక్తిపథమును గుర్తింపజాలడనియు, వివేక జ్యోతిర్మయంబగు నాత్మ ప్రాప్తి వలననే మానవు డుచితపథాన్వేషియయి, బ్రహ్మ సాక్షాత్కారంబునంద సశక్తుండగుననియు సిద్ధార్థుడు గురుముఖంబున నాకర్ణించియున్న సిద్ధాంతములవలనను, సద్గ్రంథపఠనంబునను, స్వల్పంబును స్థిరంబునునగు నల్పానుభవంబున మిత్రులకెల్ల రకు నుపదేశింపజొచ్చెను.

అల్పప్రాయంబుగల సిద్ధార్థుని శ్రీముఖమునుండి వెలువడిన నీతివాక్యములు వినశ్వరంబులగు రత్నములకంటె నమూల్యంబులుకదా! బాలభక్తశేఖరుండగు సిద్ధార్థుని విశాలంబును సర్వజీవహితకరంబును నుభయలోక ప్రాప్త్యనుకూలంబునునగు నీతికవికల్పనకతీతమైనది. భావాతీతంబగునాదివ్యశక్తి యామహనీయునకు జన్మతోడనే ప్రాప్తించియుండెనా యను సందియము నామది కొడముచున్నయది. సిద్ధార్థుని జీవనచరిత్రమునందలి యీయంశములే ప్రధానంబులని గుర్తువెట్టజాలము. జీవితచరిత్రమునందలి సమస్తాంశములు ముఖ్యతములే. ఏతజ్జీవనచరితాంతర్గత ప్రతిశబ్దము జీవకళాయుక్తమయి వెలయుచున్నది. సిద్ధార్థుని మహద్గుణముల దేటతెల్లమొనర్పనింక

కొన్ని వృత్తాంతముల జెర్కొనుచున్నాడ. పాఠకులారా! శ్రద్ధ నాలకింపుడు. ఒకతూరి రాజదంపతులు (శుద్ధోధన గౌతమీ దేవులు) గురుగృహంబునకు గుమారునిపరిస్థితుల బరికింపన భిలషించి చనియుండిరి. గురుపత్ని గృహకృత్యములనిర్వహించు కొనుటయందు లగ్నమనస్కయయియుండెను. వృద్ధుడగు నుపాధ్యాయుడు దేహస్వాస్థ్యమొకించుక సన్నగిలుటంజేసి నిరానందమయుడయి పర్యంకమున శయనించియుండెను. భూపాల సుతుండును భావియావచ్ఛాకస్రమహీచక్రపరిపాలకుండును నగు సిద్ధార్థుడు సాధారణ ఛాత్రవేషధారియయి గురుపాదములచెంత గుశాసనంబున బద్ధాసనాసీనుడయి గురుపాదసరోజయుగ్మము నల్లనల్లన నొత్తుచుండెను. అతనివదనారవిందమునుండి సాధుభావమకరందమొలుకుచుండెను. గంభీరభావహృదయుడయి గురుసేవాశుశ్రూషలదగిలియున్న నారాకుమారుని సౌమ్యమూర్తి చూపరుల డెందముల సప్రయత్నముగనే గురుభక్తి బీజముల నాటునట్లుండెను. గురుసేవజేయుచు నొక్కమార్గంబున నుభయకార్యములు సిద్ధించులాగున గురూపదేశిత సిద్ధాంతవాక్యముల నస్ఫుటముగ జింతనసేయుచుండెను. జననీజనకులు స్వాత్మజుని కార్యనిష్ఠమును, గురుభక్తిని, విద్యాసక్తిని, వినయవిధేయతాయుక్త సద్వర్తనమునకును బహ్మానందపరవశులరయి, తమ్ముబోలుభాగ్యశాలు రీసృష్టియందింక నుండబోరని నభిమానోన్నతమస్తకు లగుచు, నానందబాష్పధారల నేత్రయుగ్మములనుండి స్రవింపజేయదొడంగిరి. రాకాసుధాకరసందర్శనంబున సాగర ముప్పొంగురీతియే సుపుత్రప్రాప్తిచే మాతాపితలు హర్షాబ్ధినోలలాడ కుందురా? సిద్ధా

ర్థకుమారుని సమస్తవిధక్రీడలుగూడ సార్థకములయి యుండెను. అతడు ప్రాయికంబుగా సమయము యొక్కయమూల్యతనుగ్రహించి, సత్వరకర్తవ్యనిర్వహణోపక్రమణమే యాత్మోద్ధానమునకు మూలసాధనమనియు నట్టి కర్తవ్యనిర్వహణంబునకు సమయము పరమావశ్యకంబనియు సంభావించి విశాలభావస్వాంతుండగు సిద్ధార్థుడు విశేషకాలము నానందమయక్రీడలకై వృథా పుచ్చక సజ్జనులును, జ్ఞానానుభవపరులును నగు కోవిదోత్తముల దివ్యసన్నిధికరిగి సద్గోష్ఠియందే నిజసమయమును వ్యతీతముసేయ నభ్యస్తుడయియుండెను. ఆహా! ఏమి యామహాత్ముని యలౌకిక గుణవిశేషప్రభావము? ఇట్టి కుమారరత్నముల గాంచియేకదా మాతాపితలు పున్నామనరకమునుండి యుద్ధరింపబడి, మహదానందసంభరిత హృదయారవిందు లగుదురు. వినయ సౌశీల్యాది గుణరహితులగు పుత్రులు పలువు రుండుటకంటె శీలస్వభావి యగు పుత్రుడొక్కడుండుటయే శ్రేయస్కరంబు. సత్కుమారు నాధారంబుగజేసికొని తరింపజూచుటకంటె జ్ఞానసుతుని బడసి ముక్తి బడయనెంచుట హితకరము. అగణితంబులగు తారకల యల్పప్రకాశంబున నంధకారాచ్ఛాదితంబగు సంసారము ప్రకాశవంతము కాజాలక సంపూర్ణజ్యోతిర్మయుండగు చంద్రనాధుని జ్యోత్స్నచే గాంతిమంతమయినటులనే సహస్ర సంఖ్యాకులగు కుమారులకార్యము నొక్క సిద్ధార్థుడే యాచరించి మించెను.

మాననీయుండగు భూపాలు డిదివఱకే పుత్రుని శస్త్రాది విద్యలయందును రథచోదనమునందును నసమాన పాండితీ విలసితుని గావించియుండుటంజేసి, సిద్ధార్థుడు నవాపారుడౌగు

రాకుమారులతో నుత్తమహయారూఢుడయి మృగయా విహారార్థము నగరపరిసర సాంద్రాటవులకు జనుచుండువాడు. పశుహింస మానవధర్మముకాదని గుర్తెఱింగినవాడయియుండియు, మిత్రుల నిర్బంధమువలన నిర్మలంబగు వాయువు నయిన సేవింపవచ్చుంగదాయని యతడు విపినభూముల కవ్వారితో నరుగుచుండెడివాడు. కాననంబులజేరి తక్కుంగల రాజకుమారు లెక్కుడు మక్కువతో బాణముల నెక్కువెట్టి, పశుల వధింపుచుండ, సిద్ధార్థుడు వలదని వారల వారింపుచు, శక్తికొలది యకార్యమునుండి వారలవిముఖులగావించి, రిక్తహస్తముల తో ఖిన్నమానసుడయిహతోత్సాహియై స్వగృహమున కేతెంచుచుండువాడు. నిత్యము భూపాలనందను లరణ్యప్రాంతాంతర్భాగముల శరాసనంబుల దీక్ష్ణశరపరంపరల సంధించి, అపరాధమన్న స్వప్నమందయిన నెఱుంగని సాధుమృగముల సంహారము సేయుచుండ, "హింససేయువాడు హంతకుడనజెల్లునని యు నట్టి హంతకప్రివృత్తిగలవ్యక్తి వైరసమయుండగు పరాత్పరుని దివ్యదృష్టినుండి పతితుడయి రౌరవాదినరకబాధల జెందుననియు బోధసేయుచుండెడివాడు." సిద్ధారుని గంభీరంబును, జిత్తాకర్షకంబునునగు దివ్యపరిబోధశ్రవణంబున బురాణవైరాగ్య మొదవ దత్సమయంబుమాత్రి మారాకుమారులు హింసాత్మకకార్యము నుండి పరాఙ్ముఖులగుచుండెడివారు. పచ్చికబయళ్ళపై బరమ సాధుస్వభావంబుతో జూడ నతిముచ్చటకల్గునట్లు బూరిమేయు హరిణశాబకములు కాలమృత్యువాతం బడనలసివచ్చెంగదా యని సిద్ధార్థుడు దీనమృగముల దుస్థితికయి, యత్యంతమ్లానహృదయుడయి వాపోవుచుండువాడు. అల్పప్రాయముగల

యాసిద్ధార్థుఁడు రాజనందనుల యవివేకకృత్యముల గుఱించియు యాథార్థ్యములగు రాజధర్మముల గుఱించియు, శ్రుతిస్మృతీతిహాస పురాణాంతర్గత భూపాలావతంస మృగయావిహారాది రాక్షస ధర్మములగూర్చియు దీర్ఘముగ విచారింపుచుండెడివాఁడు. మానవులసృజియించిన సర్వేశ్వరుఁడే పశుపక్ష్యాదుల సృష్టించియున్నాఁడనియు నట్టి సాధుస్వభావముఁగల పశుపక్ష్యాది జీవములు వధార్హములు కావనియు, సమస్త జీవరాసులకు దండ్రియాపరాత్పరుడేయనియు, దయామయుని సంతానమగు జీవకోటిని హింసించుట మానవధర్మమునకు విరుద్ధమనియు నట్టి విపరీత ధర్మస్వీకారంబున వ్యక్తి సర్వేశ్వరుని న్యాయ నిలయంబగు సభాభవనంబున మహాపరాధిగ నిశ్చయింపబడి, ఘోరదండనలకు బాత్రుఁడగుననియు గౌతముఁడు యువజన మండలికి బోధింపగడంగెను. సిద్ధార్థుని మహత్వపటుత్వసమన్విత ప్రబోధపీయూషధారాపానంబున నిజదుష్కృత్యములకు జింతించి, రాకొమారులు పశువులపై నెక్కిడిన బాణముల దూణములందునిచి, రిక్తహస్తులయి నిజభవనంబుల జేరదొడంగిరి. తద్దివసమాదిగ సిద్ధార్థ దివ్యప్రబోధవాక్యశ్రవణంబున నీషణ్మాత్ర జ్ఞానసంచలనము హృదయాంతరాళముల నొదవ రాజకుమారులెల్లరు వేటకరుగుట నీచకార్యమని తెలిసి, తదుల్లాసకృత్యమును బరిత్యజించిరి. తాత్కాలిక వ్యామోహబద్ధులయి నిత్యత్వమును, శాశ్వతానందమును గల్గియుండు యథార్థపరమార్థతత్వ స్వీకారంబునగల్గు నానందమును భాసి చరించుట వివేకమండలికి దగనికార్యమని సిద్ధార్థుఁ డుద్ఘోషించెను. శుద్ధోదనభూపాలుడు పుత్రుని సంసార

వ్యామోహరాహిత్యమును, భాగ్యభోగ్యానుభవ వైముఖ్యమునుగాంచి దిగులొంది శీఘ్రమే కాలవిలంబనముసేయక సిద్ధార్థునకు శాసకశాసిత ధర్మతత్వపరిజ్ఞానమును విశదముసేయు రాజనీతిశాస్త్రమును గఱప నేర్పాటుగావించెను. ఆత్మజుని రాజనీతివిశారదునిగావించి, రాజనీతి వైదగ్ధ్యప్రభావంబున విశాలరాష్ట్రమునకు సార్వభౌమునిగావింపవలయునని యెడి ప్రగాఢాభిలాష భూపాలునిమది నావహించెను. రాజాను మత మటుండ, సిద్ధార్థున కనుదినము నైహికకాంక్షా నము దాయమునెడ నీర్ష్య జనింపదొడంగెను. అతడు రాజశాసన పరిజ్ఞానముబడయ నభిలాషలేనివాడయి, సత్కార్య నిష్ఠాగరిష్ఠుండయి భగవద్ధ్యానమునందే చిత్తశాంతినిబడయ వాంఛించి, విశేషకాలము వ్యతీతముసేయుజొచ్చెను. సిద్ధార్థుడు సాధుజనోచిత కృత్యములయం దనారతము నిరతుడయియుండి "భాగ్యభోగ్యము లస్థిరంబులనియు, నహంకార మమకారములు మానవుని ప్రబలశత్రువులనియు, సాంసారికభోగవిలాససౌఖ్యములు బుద్బుదసదృశము లనియు, క్షణభంగురములనియు, బవిత్రాంతఃకరణమును గల్గియుండుమానవుని జీవితమే నిత్యానంద దాయకంబనియు, మోక్షప్రాప్తి కర్హంబనియు" బోధసేయుచుండెను. మృత్యుదేవత సాక్షాత్కరించినంతనే మిథ్యాభిమానుల యహంకార మమకార పూరిత దుష్టచేష్టలును, భూపాలశేఖరుల యంబర చుంబిత రాజప్రాసాదములును సంతర్హితములయి పోవునని యతడెల్లరకు జాటుచుండెను. సిద్ధార్థు డన్యభూపాల ఘనులమాడ్కి భూపాలోచిత నశ్వరసౌఖ్యంబుల నపేక్షింపక, సాధువేషమును,

నిష్కపటభాషణమును, సర్వోచ్ఛభావ సముదాయమును
గల్గి యక్కరణియే యన్యభ్రాతల జరింపజేయ నిరంతరకృషి
సేయుచుండెను. అతఁ డహోరాత్రములు దారిద్ర్యావస్థయం
దుండి, కష్టపరంపరలకుఁజిక్కి, కడుస్రుక్కు దీనజనుల దిక్కు
లేనితనమునుగాంచి, ఘోరముగ దురపిల్లుచుండువాఁడు. స్వ
పరభేదభావదూరుండగు నారాకుమారు డన్యజనులకు సంఘ
టియించు కష్టతతిని దనదిగ భావించి, చూర్ణీకృతహృదయుం
డగుచుండెను. దీనజను లెట్టికఠోరదేహపరిశ్రమ గావించినను
గుక్షింభరత్వమునకు వలయు నాహారము లభింపక క్షుత్పీడచే
దపించుచుండ, ధనాఢ్యు లుదరపోషణమాత్రంబున మనస్తుష్టి
సందక భాగ్యంబుల విలాసచేష్టలకయి వెచ్చింపుచు, నద్దానినే
విహితధర్మంబని వక్కాణించుటెంతయు నీచాతినీచంబనియు,
మౌఢ్యమనియు, బశుత్వమనియు సిద్ధార్థుడు సిద్ధాంతీకరించె
ను. తమకాయములపై నధికారమును గల్గియుండని నరులెట్లు పరు
లవలన బ్రాప్తించు కామినీకాంచనాది ద్రవ్యములపై స్వత్వ
ముగలవారయి యుందురని యతఁడా లేబ్రాయముననే సం
సారుల బృచ్ఛించెను. సమస్తమానవులు నుదరంభరత్వమునకే
వలయువిత్తమును తమకుసంప్రాప్తించిన ధనమునుండి గ్ర
హింపహక్కుగల్గియున్నారనియు, బొట్టనిండిన యనంతరము
శేషించిన యర్థమును తిరిగి సర్వవస్తుప్రదాతయగు సర్వేశ్వరు
నికే ప్రసాదింపవలసియుండుననియు సిద్ధార్థుడు మిత్రులకు
బోధింపజొచ్చెను. దాతకిచ్చుట యన దేవాలయంబుల మూ
ర్తులనామములజెప్పి పూజారుల కొసంగుటకాదనియు సర్వే
శ్వరసంతానమగు ప్రాణికోటికి హితార్థము [illegible]ాంగ.

పఱచుటయే యనియు నుపదేశించెను. సాంసారిక వ్యామో
హపాశబద్ధులరయి, అజ్ఞానావృతహృదయులరయి చరించు
మూఢమానవుల దుస్థితిని వీక్షించినంతనే సిద్ధార్థుని హృదయ
భాండము బ్రద్దలయిపోవుచుండెను. చదువరులారా! బాలు
డగు సిద్ధార్థుని కింతటి యాధ్యాత్మిక పరిజ్ఞానమెట్లు లభించె
నందురేమో! కాష్ఠసదృశంబును, మృత్తికానిర్మితంబును నగు
దేహముయొక్క వివిధాంగములకు వివిధశక్తు లెవ్వాని మహి
మాతిశయంబున లభించెనో యట్టికరుణాసాగరుని సంకల్పం
బుననే లభ్యమయ్యెనని వేరుగ వచింపవలయునా? వాస్తవ మా
లోచించిన సిద్ధార్థు డప్పటికి యువకు డనదగినవాడుగా నుండె
నుకాని బాలుడనదగియుండలేదు. బాల్యావస్థ, యౌవనావస్థ
వివాహము అనుమూడువిషయంబులగూర్చి ప్రత్యేకించి వ్రా
యుటంజేసిగ్రంథము విస్తరించిపోవునని యెడి భీతిచే దరుణ
ప్రాయమందలి విషయముల సహిత మీబాల్యమును ప్రకరణ
మునందే వ్రాయసాహసించితి.

పాఠకులారా! రండు. వేగిరింపుడు! సిద్ధార్థుని స్వ
ల్పప్రాయమందలియుత్తమోత్తమంబులగు నాధ్యాత్మిక భావం
బుల నాలకింపుడి. మానవజాతి సిద్ధార్థుని సద్భావంబుల ననుస
రించినచో దుఃఖములన్నియు మటుమాయమగునుగదా!
గృహస్థులయినంతమాత్రంబుననే ద్వేషమాత్సర్యాది దుర్భా
వంబులను, ప్రగాఢవ్యామోహంబును గల్గియుండవలయునని
యెడి సిద్ధాంతములు శాస్త్రముల గలవా? అట్టిభావంబులనే
శాస్త్రములు కల్గియున్నచో నవిప్రబోధము గొలుపు శాస్త్ర
ములుకాక మానవకంఠముల నఱకు శస్త్రంబులుగ బరిగణింప

బడును. గృహస్థుడు రాజయోగియగుచో శాశ్వతానంద పదవిని బడయనేర్వడా? జనకమహర్షి నిస్మరియింపుడు. సిద్ధార్థుని బాల్యమును గూర్చి వ్రాయప్రారంభించి లేఖకుడా! నీవేల లోకాభిరామాయణమును జెప్పుచుంటివని పాఠకులవశ్యమందురనియే భావించెదను. లోకహితము సభిలషించి యే యాయాదర్శజీవిత చరిత్రచిత్రిణమునకు బూనుకొంటిని గాని మిథ్యాగౌరవప్రపత్తిని బడయనెంచికాదు. సిద్ధార్థుని లీలానిచయంబును వీక్షింపగోరు భారతలారా! మీదృక్కుల నీదిక్కు బ్రసరింపజేయుడి! సిద్ధార్థుడు ప్రపంచముయొక్క యస్థిరత్వమును, అజ్ఞానభావపూరిత దృశ్యమును గాంచి దివారాత్రములు జననమరణముల యొక్క దుర్జ్ఞేయరహస్యమును గూర్చి విచారింపదొడంగెను. విలాసకాంక్షల విషతుల్యములుగ నెంచి వానికిదూరమునుండియే నమస్కరింపజొచ్చెను. సిద్ధార్థుని పరిస్థితులగాంచి, భూపాలుడత డల్పకాలమునందే సంసారవ్యామోహాభిలాషను బాసి రాజ్యతృష్ణను కామినీకాంచనాది యన్యకాంక్షలరోసి నిర్లోభియయి నిస్సంగుడయి నశ్వరజగత్తునుండి విముఖుడగుననియు వైరాగ్యభావంబు హృదయంబున నావిర్భూతమయినంతనే సన్యాసియగుననియు భావించి ఖిన్నుడాయెను. ఏతద్ధేతువుచే శుద్ధోధనుడు దుఃఖితస్వాంతుడయి యౌదాసీన్యము నాశ్రయించియున్న సిద్ధార్థుని హృదయమును రంజింపజేయ సంకల్పించి నగరబాహ్యప్రదేశంబున నొక్క యానందమయంబగు విలాసమందిరమును నిర్మింపజేసి సిద్ధార్థునందు వసియింప నాజ్ఞాపించెను. పితృరాజ్ఞాపరిపాలనాగత ప్రాణుండగు సిద్ధార్థు డందుల కియ్యకొనెను. ఇంద్రవైభవ సముపేతం

బులగు నావిలాస మందిరాంతర్భాగముల సవిలాసముగ విహారము సలుపుచుండుటం జేసి, సత్వరంబె భోగాభిలాష పుత్రుని మది నుత్పన్నము కాగలదని భూపాలుని యాశ. భూపాలుడు పుత్రవాత్సల్య జనితంబగు నిట్టిభ్రమకు జిక్కెనే కాని యాతని కోర్కెలన్నియు రిత్తకోరిక లాయెను. అంతటితో నసంతృప్తిజెందక, ఆశాపిశాచమింకను బాధింపుచుండ శుద్ధోధనుడు సమస్తవిధభోగ విలాసమయంబులగు శృంగార పదార్థసందోహములతో నా మందిరమును బరిపూర్ణముగావింప దొడంగెను. ఈశ్వరసంకల్ప మొకటియైయుండు, మానవుడువృథాగా నన్యథా భావింపుచుండును. భూపాలుని ప్రయత్నములు పెంపొందుచుండిన కొలది సిద్ధార్థుని వైరాగ్య భావములు సహిత మభివృద్ధి నందసాగెను.

ఒకతూరి సిద్ధార్థకుమారుడు పితృవ్యకుమారసహితుడయి స్వకీయవిలాసమందిర పరిసర పుష్పోద్యానవనమునకు విహారము సేయు కాంక్షతో నరిగెను. రాజకుమారు లట నవవికసిత పుష్పమార్దవ సౌందర్యసుగంధముల నమితానందముతో స్వీకరింపుచు బరస్పర సరససల్లాపముల నాడుకొనుచుండిరి. తత్సమయమునందే రాజమరాళ సందోహం బొం డంబరపథమున హిమాద్రి దిక్కునకు ద్రుతగమనంబున నరుగుచుండుట సిద్ధార్థుని పితృవ్యకుమారుండగు దేవదత్తు డవలోకించి కఠోరచిత్తుడయి నిజశరాసనమున దీక్ష్ణశరంబొండు సంధించి రివ్వున దారకాపథంబున నేగుచున్న యారాయంచపిండుపై దయమాలి విడిచెను. తీక్ష్ణబాణ ప్రహారంబున మరాళసంఘమునుండి యొక్క సుందరరాజహంస రక్తసిక్తమై దీనానముతోడ సిద్ధా

ర్థుని పాదపద్మసన్నిధిని గూలంబడియెను. సహజదయార్ద్రహృదయుండగు నా రాకుమారుడు మెల్లగా నామరాళరాజమును మృదులహస్తాంబుజమున లేవనెత్తి, నిజకోమలకరపల్లవంబున నవ్యాజవాత్సల్యంబున దువ్వి, వ్యత్యస్తంబయి యున్న పక్షద్వయమును సరిచేసెను. రుధిరపూరితంబగు నావిహంగరాజము యొక్క దేహమును నిజదుకూలంబున దుడిచెను. సహజనిర్మలానురాగంబున రాకుమారు డాత్మీయ కరకమలంబు వద్దాని మేను నిమురగా నయ్యది నిష్కల్మషానురాగ కృతసిద్ధార్థకుమార సేవాశుశ్రూషల గాంచి, యపరిమితానంద పరవశం బాయెను. సమీపంబున నత్యంత వేగముగ నవ్యక్తధ్వానములగావింపుచు స్రవింపుచున్న తరంగిణీతీరంబున కరిగి, సిద్ధార్థుడు శీతలజలంబుల నంజలిం గొనివచ్చి వ్యధిత మరాళరాజమునకు బానముసేయ నొసంగెను. కొంతవడికి బాణాఘాతజనితవ్యథ యుపశమింప నారాయంచకాయమునుండి శరమును సిద్ధార్థుడు మెల్లగా నూడబెరికెను. రాజమరాళవ్యథకు గారణం బగయగోరి సిద్ధార్థుడా శరాగ్రభాగంబును స్వశరీరంబున గ్రుచ్చుకొనియెను. శరీరమును గ్రుచ్చుకొనుటచే గల్గిన బాధ యపార మగుటం జేసి, పశుపక్ష్యాదులను హింసించుటచే వానికిగల్గు యపారదుఃఖమును గూర్చి తలపోయుచు సిద్ధార్థుండెంతయు డెందమున గుందెను. ఖిన్నుడగు నాసిద్ధార్థుడు సృష్టియందలి జీవకోటి యొక్క హింసాత్మకంబగు కార్యములగూర్చి దీర్ఘముగ విచారింపుచు, నావ్యధితవిహంగమును గరములయందిడుకొని, సమీపమునందున్న నొకవృక్షము యొక్క కిసలయంబుల దెచ్చి గాయంబుపై వేసికట్టుగట్టెను. సిద్ధార్థుని ప్రేమమయంబగు కార్యమును

దదేకదృష్టితో వీక్షింపుచున్న దేవదత్తుడు కుపితుడయి నారాజహంసను నాకిమ్మని నిర్బంధింపదొడంగెను. సిద్ధార్థుని ప్రేమమయంబగు శుశ్రూషచే నించుక సుఖించిన విహంగము హంతకుని గాంచినంతనే కంపింపదొడంగెను. సిద్ధార్థుడంతజ్ఞానమను పదార్థము సమస్త జీవరాసులయందును గలదనియు, వివేకశూన్యంబుగ సంహారులచే భావింపబడు విహంగపు సహితము తమ యిరుపురియందున్న సంరక్షకభక్షక భావమును గుర్తెఱుంగ గల్గినదనియు దెలిసి ప్రత్యక్ష దైవస్వరూపులగు నరులే జ్ఞానస్వరూపుండగు దేవుని సంతానమును భ్రష్టులయి సంహరించుట కెంతయు జింతింపదొడంగెను. మౌనముద్రితుడయి, దీర్ఘాలోచనా నిమగ్నుండగు సిద్ధార్థునితో రాజహంసమునకయి దేవదత్తుడు జగడమాడ నారంభించెను. సిద్ధార్థుడతని కటువచనపుంజము హృదయమును భేదింపుచుండ గడువగచి, నీతి నుపదేశింపజొచ్చెను:—"ప్రియసోదరా! కోపము జెందకుము. ఈ రాజహంసము న్యాయశాస్త్రోక్తంబుగ విచారింప నాయది; నీస్వత్వమెంతమాత్రమును గానేరదు. సమస్తవిధముల దీనిపై నాకే యధికారము కలదు. పక్షిని గుక్షింభరత్వాపేక్షచే శిక్షింపనెంచి, యద్దానిని సంహరింపజూచువానికంటె నద్దానికి ప్రియంబులగు నుసురుల రక్షింపబూనువానికే దానిపై నెక్కుడధికారముండును. జీవికి మరణదాతకంటె బ్రాణదాతయె ప్రేమాస్పదుండగును. కాన నక్రమంబుగ నాస్వామ్యము నాక్రమింపనభిలషించి, న్యాయమును, ధర్మమును విస్మరించి, దూరదృష్టి నెడబాసి, వాదులాడుట నాసహోదరుండవగు నీకు విహితధర్మముకాదు." సిద్ధార్థుని యుక్తియుక్తములును

శీతలంబులునగు వచనముల నాలకించి సహింపలేక దేవదత్తుడు యుద్ధమునకు సన్నద్ధుడగుచు నిట్లు నుడివెను:— "సిద్ధార్థా! నీవు మూర్ఖుడవయి నాచే బడగొట్టబడిన హంసము నేల స్వాధీనముగావించుకొనియెదవు? ఏమానవుడు నిర్భయముగా నరుగు పక్షులగాని పశువులగాని సంహరించునో వానికే యవ్వానిపై బూర్ణాధికార ముండునని గ్రహించునంతటి వివేకమయిన లేకపోవు టెంతయు లజ్జాకరము. పక్షు లాకాశంబున స్వచ్ఛందవిహారము సేయుచుండును. ఆకాశము నీయది కాదు. కనుక నాయాకాశంబున నరుగు విహంగముల నేవీరుడు నిజశరసంధాన నైపుణ్యమున వధించునో వానికే వానిపై సంపూర్ణస్వత్వముండును. వితండవాదముల సేయక నాసొత్తు నిచ్చివేయుము. లేదా, నీవవశ్యము నాచే బరాభవింపబడియెదవుసుమా!" మూఢుండును, గ్రూరచిత్తుండునునగు దేవదత్తుని దుర్భాషలకెంతయు ఖిన్నుడయి సిద్ధార్థుడతని వెంటనిడికొని, వాదవివాద హేతువును న్యాయాధీశునకు విన్నవింప సంస్థాగారమున కరిగెను.

తత్కాలమునం దాయాలోచనామందిరమున రాజసభాకర్మచారులును సచివశేఖరులును విద్యాధికులగు ప్రజాప్రతినిధులును సమావేశమయియుండిరి. అయ్యెడ నాసీనులయి యున్న కోవిదు లెల్లరు న్యాయాధీశుని యనుమతినిబడసి తమకు దోచినరీతి న్యాయమును జెప్పిరి. కాని వారితీర్పు లెంతమాత్రమును న్యాయయుక్తములుగ నుండని హేతువుచే న్యాయాధికారి యపరిసన్నుండయ్యెను. ఇంతలో ధర్మశాస్త్రమర్మభేదియు నతివృద్ధుండును నగు సభాసదుడు లేచి నిలువబడి

యిట్లు నుడువదొడంగెను :—న్యాయాధిపా ! సహోదరు లారా ! వాదవివాదంబుల న్యాయమును బడయజాలక న్యాయార్థులయిమన చెంతకరుదెంచిన రాజకుమారులిరువురును దరుణవయస్కులే. న్యాయాన్వేషణపరునకు బాహ్యకబుద్ధితోడ నిమిత్తము లేదు. వీరిరువురు వాదులాడున దొక్క జీవముకొఱకు. అయ్యది సర్వేశ్వరసృష్టియం దొక్కయంశమే. ఇందుద్దానిని భక్షింపనెంచి శిక్షించువారును సంరక్షింపనెంచి లక్ష్యముంచువారును గలరు. ఈయుభయులయం దెవ్వారికి విహంగముపై సంపూర్ణంబగు నధికారమున్నదో యాలకింపుడు. ధర్మాను కూలంబుగ వచింపుచున్నాడ. ప్రతిప్రాణికి నిజజీవితమన్న నెక్కుడు ప్రియము. ఏజీవము నేయవస్థయందును మరణమును గోరిమింపదు. ప్రాణి యనారతము స్వీయ సంరక్షణోపాయంబులనే యరయుచుండును. అది నిత్యము సంరక్షణము లభించుస్థానమునే కాంక్షింపుచుండును. ప్రస్తుత మీరాజహంసమును నిర్దయుడయి, ప్రాణికొదవు భయ విషాదంబును గ్రహింపక వివేకాంధుడయి సంహరింపనెంచు ధీరుడు దేవదత్తకుమారుడు. సహజదయార్ద్రహృదయుడయి శ్రమజేసి శ్రద్ధతోడ నిస్స్వార్థియయి యీవిహంగమును సంరక్షింపనెంచువాడు ప్రేమసూత్రబద్ధుండగు సిద్ధార్థకుమారుడు నిర్దయునికంటె దయార్ద్రచిత్తుడే వేయిమడుంగు లధికము బూజింప నర్హుడు. సంహారకునియందుకంటె సంరక్షకునియందే దయాన్వితుడగు సర్వేశ్వరుని స్వరూపంబగు సత్య మధికముగా సుస్థిరంబయి యుండును. సంసారమందలి సమస్తమానవధర్మంబులు భక్షకునికంటె రక్షకుని యాదరింప నుద్ఘోషింపుచున్నయవి. ప్రాణి

దైవస్వరూపము. దైవము జ్ఞానమయుడు. జ్ఞానమప్రతిబంధక
మయినది; యనగా స్వేచ్ఛాపరతంత్రమయినది. కనుక నీవిహంగ
మునకు సహితము స్వాతంత్ర్యమున్నది. దీనియభిలాష యెద్ది
యో గుర్తెఱింగి మనము ప్రస్తుతకర్తవ్యమును నిర్ణయింప
వచ్చును. ఈవిహంగము సంహరింపబోవ భీతిజెందుచున్న
యది. రక్షింపబోవ నానందపరవశం బగుచున్న యది. సంహారకు
నుండి దూరముగనుండగోరుటే దీనికాంక్షయని నిశ్చయమ
యినది. సంరక్షకుండగు సిద్ధార్థునకే రాజహంసముపై బూర్ణ
ముగ హక్కుగలదని విజ్ఞులకు నొక్కి చక్కాణింపవలయునా?
వృద్ధుని సద్ధర్మ పరిజ్ఞానచాకచక్యమున కెంతయు న్యాయాధి
పతి సంతసించెను. ధర్మజ్ఞానశూన్యులయి మిథ్యాభిమానపూరిత
దృక్కుల సంసారము నానాతరము వీక్షింపుచు బాహ్యాడం
బరధారులయి సభాభవనమునం దాసనముల నాసీనులయి
యున్న వారెల్లరు దమ జ్ఞానరాహిత్యమునకును స్థూలదృష్టికిని
నెంతయు లజ్జావనతమస్తకులయిరి. ప్రతిపక్షీయగు సిద్ధార్థకు
మారునే విజయశ్రీ వరియించెంగదా యని డెందమున నత్యం
తము గుందుచు దేవదత్తుడు స్వయంకృతాపరాధనమునకై
వాపోవుచు రిక్తహస్తములతో స్వగృహమునకు మరలెను.
మిథ్యాభిమానపూరిత హృదయమునకు స్వకీయానుచిత కార్యం
బున ధర్మప్రభావంబున విజయము హస్తగత మగుటకు మారుగ
నపజయమే లభ్యమగుచో నదియే వానిమనమునందు విషా
దము నొదవచేసి యధఃపతితుని గావించివేయును. సర్వేశ్వ
రాంశసంభూతంబగు పక్షిరాజమును సత్యప్రభావవిశేషంబున
సంరక్షింప శక్తుండనయితిగదా యని స్వాంతమునం దత్యంతా

నందమునందుచు దానిని వెంటగొనిపోయి కొన్నిదివసంబుల పర్యంతము బాగుగ బోషించి నిందుదేహస్వాస్థ్యము ప్రాప్తించినంతనే యద్దానికి సంపూర్ణంబగు స్వేచ్ఛనొసంగ నభిలషించి యనుకూలతరుణంబునకయి సిద్ధార్థుడు వేచియుండెను. అల్పకాలమునందె దయామయుండగు దేవదేవుని దయావిశేషంబునను సిద్ధార్థుని యకృత్రిమప్రేమమయ పాలనంబునను మరాళము స్వస్థశరీరమునుబడసి, స్వేచ్ఛనుబడయ నువ్విళ్లూరుచుండుట నవలోకించి యొక్కదివసంబు సిద్ధార్థుడు నిజమందిరబాహ్యప్రదేశంబున కద్దానిని గొనిపోయి, తొల్లి రాయంచ పిండుయెగిరిపోయినదిక్కున కెగురవైచెను. ఆ విహంగరాజ మాత్మానందము నందుచు మంచుకొండదండ కెగిరిపోయి నిజసంఘమును చేరెను.

ఏతత్కథను బఠించుటం జేసి బాల్యకాలము నందే సిద్ధార్థుని విశాల హృదయసీమయందు నెలకొనియున్న సర్వజీవ దయాళుత్వంబును, గరుణాళుత్వంబును నతురజ్ఞానశూన్యండగు మాధునికయిన సువ్యక్తము కాకపోదు. మహాత్ములగు వారి దృష్టియందు పిపీలికాది బ్రహ్మపర్యంత మాజ్ఞానజ్యోతియె ప్రకాశింపుచుండుట కానగుచుండును గదా! ఏతత్కథానంతరంబు భూపాలుడగు శుద్ధోధను డొక్కదివసంబు ఋతురాజమగు వసంతర్తువునందలి సుక్షేత్రనిచయంబును, సస్యతతిని, నానావిధప్రాకృతిక దృశ్యచ్ఛటను వీక్షింప నశ్వారూఢుడయి తన్ను నుగమింప గుమారునాజ్ఞాపించెను. సర్వాంగ సుందరియగు నావాసంతికాదేవి నిజావయవ సంపూర్ణతారుణ్య లావణ్య మహిమంబుచే దర్శకబృందమున కమందానందము

నోదవజేయుచుండెను. వాసంతికా దివ్యసాక్షాత్కారంబున భూలోకస్థిత సమస్తదృశ్యములు నానావిధ వర్ణరంజితములయి దర్శనేంద్రియోత్సాహమును ద్విగుణిత మొనర్చుచుండెను. తద్దృశ్య దర్శనసౌభాగ్యప్రాప్తిచే హృదయభాండ మమృతరసోద్వేలితమయినట్లు లగుచుండెను. అట్టిశుభావసరంబున జనకనందనులగు శుద్ధోధన సిద్ధార్థకుమారు లిరువురు నుచిత వేషధారులయి, యుత్తమ హయంబుల నధిరోహించి విశాలంబులును మనోజ్ఞంబులును నగు పుష్పవాటికలతోడను, నసంఖ్యాకాగాధ కూపములతోడను ,కోమలహరిత వర్ణవిరాజిత తృణరాసులతోడను నేత్రానందపర్వంబగు సస్యసందోహముతోడను నానావిధ ఫలపుష్పసంభరిత తరుసంతానముల చేతను బరిపూర్ణమయి భూలోకనందనవనంబువలె శోభింపజేయు విశాలోన్నత క్షేత్రసందోహ మధ్యమార్గమునుండి పయనము సేయగడంగిరి. విచిత్రవస్తు సందోహసందర్శనమాత్రంబున విలక్షణంబును సుస్నిగ్ధంబును నగుశోభ నందు నిజతర శదృక్కుల జతుర్దిశల బఱపుచు నేగుచుండి రాపితాసుతులు. సిద్ధార్థకుమారుడు విలక్షణంబగు సౌందర్యముచే నొప్పారు యాదృశ్యమున కెంతయు హృదయమున నబ్బురపడజొచ్చెను. అతనియానందము హృదయభాండమునుండి పొంగిపొరలుచుండెను. ప్రాకృతిక సౌందర్యమునకు నిష్కల్మషచిత్తుండగు నారాకుమారుడు సంతోషాక్రాంతస్వాంతుడయి కన్ను

గొలుకులనుండి యానందబాష్పరాశిని స్రవింపజేయుచు జన
కుని వెనువెంటనే చేనుచుండెను. అంబరవీధిని విహంగబృంద
ములు స్వచ్ఛందవిహారము సేయుచు గావించు కలకలనినాద
ములు క్షేత్రస్థితభూరుహ విలసిత పుష్పగుచ్ఛంబులపై వ్రా
లినభ్రమరగణముల ఝుంకారధ్వనుల సమ్మిళితములయి శ్రో
త్రలగానప్రియంబులగు కర్ణేంద్రియముల కొక్క విలక్షణంబ
గు హర్షము నొడఁగూర్చుచుండెను. ప్రాణికోటి యానిత్యా
నందమయకాలంబున నానందవార్థిం దేలియాడుచుండెను. సహ
కార వకుళమందారాది వృక్షములపై నుపవిష్టములయియున్న
శారికాబృందముల శ్రావ్యతరంబులగు నిస్వనంబు లోంకార
రవమును స్మృతికిఁ గొనివచ్చుచుండెను. బాలరసాలసాల
విశాలశాఖల నధిష్ఠించియున్న గీరము లత్యధికానందము
తోడ బరస్పరము గిలకిలాలాపము సేయుచు బరవశత్వము జెందు
చుండెను. గృధ్రసంఘము లంబరపథమున వలయాకారంబుగ
విహారము సేయుటయందు సంలగ్నమయియుండెను. అటనట
గల దేవళంబులపై గేకులు క్రేంకారముల జేయుచుండ గువ్వ
లు గూండ్లయందుండి వాని యవ్యక్త మధురసంగీతమునకు
లయ నెరవుచందాన గూయుచుండెను. సామీప్యజానపదముల
నుండి మంగళతూర్యధ్వానములు శ్రోత్రరసాయనంబుగ శ్రుతి
పుటముల బడుచుండెను. అట్లు కర్ణసుహారములజొచ్చిన సంగీత
రవము శాంతింపక హృత్తంతువుల సహితము మ్రోయిం

పుచుండెను. వేయేల ఆసమయము చూపరుల డెందము నెంత యు నాహ్లాదపఱచుట కనుకూలమయి యుండెను.

అట్టిసమయమునందే యొక్క కర్షకుడు జర్జరితదేహంబు గల నొక్కవృషభమును నాగలిని గట్టి, బలముగా దండముతో నద్దానిమూపుపై మోదుచు, వేవేగ బొలము దున్నుటకు యత్నము సేయుచుండెను. శక్తియిసుమంతయయిన దేహంబున లేకపోయి, వార్ధక్యమునందున్న యావృషభము మెల్లమెల్లగ నడు గిడుచుండెను. కార్యాతురుండగు నామూఢకృషీవలుండావృష భము యొక్క మందగమనమునకు గినిసి, దండమునెత్తి మోపి కకొలది దండింప నారంభించెను. అంతకుబూర్వమే వెన్నుమీా దనున్న పెద్దపుండు యాకర్రిదెబ్బలకు బ్రద్దలయినంతనే రక్తధా రలవిరళముగ స్రవింపదొడంగెను. చూచుచుండగనే ధవళవర్ణ విరాజితంబగు నా వృషభము యొక్క కాయవర్ణమంతయు రక్త రంజితమయ్యెను. కార్యాతురముచే నాపాలము కాపు కనికరము సుంతయులేక కాఠిన్యముచే నద్దాని దిరిగి బాధింప మొదలిడి యెను. దబ్బుదబ్బునబడు దెబ్బలచే గొబ్బున జావనున్న యానో రులేని పశువు దీనాననయయి దయామయుండును, సౌమ్యస్వ రూపుండును నగు సిద్ధార్థునివంక నిజదైన్యమును దెల్పు కాతరదృ ష్టులబఱపుచు నేత్రయుగ్మమునుండి బాష్పధారల విరామములే కుండవిడువజొచ్చెను. సిద్ధార్థుడద్దాని నరకబాధనుగాంచి, హృ దయమునుండి పొంగిపొరలివచ్చుచున్న దుఃఖాతిరేకమును నిరో

ధించుకొనజాలక నిజదృష్టి నాదిక్కునుండి మరల్చి, శిరము నధో ముఖము గావించికొనియెను. ఉదరంభరత్వాపేక్షచే ధాన్య ము నుత్పన్నము సేయనెంచి కార్యాతురుండయి వృషభమును పీడింపుచున్న యాకృషికారుని వారించిన బ్రయోజనముండ దనియెంచి, తూర్ణీకృత హృదయుడయి ముందునకు నడచెను.

సిద్ధార్థుడొకించుకదూర మరిగినంతనే జనపథమున బల్లి యొకటి చీమలగుంపులబట్టి నిరాతంకముగ భక్షణము సేయు చుండు టత డవలోకించెను దయారస పరిపూర్ణ హృదయుం డగు నత డాహత్యాకాండమును సందర్శింపుచుండగనే భుజంగ మొండు సమీపస్థంబగు బిలమునుండి వెలువడివచ్చి యాబల్లి నకస్మాత్తుగామ్రింగి భక్షింప నారంభించెను. దీర్ఘకాలమునుండి యాహారాన్వేషణంబున నాకాశపథంబున వలయాకారంబుగ విహరింపుచున్న గృధ్రము సర్పమును బిలమునుండి బహిః ప్రదేశమున కేతెంచుటగాంచి యత్యానందముతో భూమి కవ తరించి యాయహిరాజమును గోళ్లతోబట్టి యెగురదన్నుకొని పోయెను. ఇవ్విధంబుగనే సిద్ధార్థుడాయల్పకాలముననే చిత్రవిచిత్రంబులగు ననేకహింసల వీక్షింపుచు నిర్విణ్ణుడయి శిలామూర్తివలె నిలబడిపోయెను. సిద్ధార్థుని పూర్వానందము నశియింప మహావిషాదాంబుదము లతివృష్టిచే నతనిముంచివై చెను. సిద్ధార్థుడు ప్రాకృతికదృశ్యముల నవలోకింపుచున్నాడ ను సదుద్దేశముచే భూపాలుడు వృద్ధులగు సహచరులు కొంద

లు వెంటనంటి రాముందునకరిగెను. అత్తఱి వివేచనాపరుండును, హింసాదూరుండును నగు సిద్ధార్థుడు సృష్టియొక్క చిత్రాతిచిత్రకార్యక్రమము ను గూర్చి దీర్ఘముగ విచారింపదొడంగెను. అతని శ్రీముఖంబునుండి నవ్యక్తముగా నీవాక్యములు వెలువడియెను :—"ఈ నానేత్రములకు గానసగు సమస్తప్రపంచము నపారంబగు హింసతో బరిపూర్ణమయి యున్నది. మనుష్యకోటియందును బశుపక్ష్యాదులయందును, వేయేల, సమస్తజీవరాసులయందును నిత్యము హింస సంఘటిల్లుచునే యున్నది. ప్రపంచము హింసాకార్యాచరణమందే నిజాల్పక్షణిక సౌఖ్యమును బడయుచున్నది. పరస్పరసంహారమే జీవకోటి యొక్క నిత్యనైమిత్తిక కార్యమైయున్నట్లు బ్రస్తుతహత్యాకాండ సందర్శనంబున విశదమాయెడిని. ఒకజంతువు మరియొక్క యల్పజంతువును, నాజంతువును మహాబలియగు మానవుండును, వానికంటెబలాఢ్యంబగు ఘాతుకమృగ మామానవుని వధించి యానందింపుచున్నట్లు సువ్యక్తమాయెడిని. హింసయే సంసారము యొక్క నీతిగ బరిగణింపబడుచున్న యది. ప్రత్యక్షంబుగనేమి పరోక్షంబుగనేమి నిరంతరము హింస ప్రబలుచునే యున్నది. ప్రాణికోటి స్వార్థాంధకార పూర్ణమయి యున్నది. ప్రాణి స్వకీయాల్ప సౌఖ్యము నిమిత్త మెట్టినీచకార్యముల దా నాచరింపు చున్నయదియు గ్రహింపనేరకున్నది."

సిద్ధార్థుడీరీతి నేకాంతప్రదేశమున నుండి స్వాంత,

మున జర్పించుకొన మొదలిడియెను ప్రతిపదార్థమును గాంచి యు విచారపరిపూర్ణహృదయు డతడు కాదొడంగెను. అతడీరీతి మనస్తుష్టికయి సిద్ధాంతీకరించుకొన నారంభించెను. "సృష్టియం దు ప్రేమను రూపుమాపునట్టి హింసయను నికృష్టపదమునకు స్థానముండరాదు. పండితజనవిరచిత శబ్దకోశములయందు స హిత మీశబ్దముండదగదు. హింసాశూన్యంబైనపుడే సర్వేశ్వ రనిర్మితంబగు నీవిస్తీర్ణతమ సంసార మపూర్వానందభరితమయి యొప్పును. పరస్పర వైషమ్యమునకు హింసయే హేతుభూత మగుచున్నది. ప్రేమయను కోమలకమలముపాలిట నిదియే కీటకసదృశము." సిద్ధార్థు డీరీతి విచారింపుచుండగనే యతని విశాలంబగు దృష్టిపథంబున ససంఖ్యాకంబులగు జీవరాసుల హత్యాకాండ దృశ్యము గానసగుడు, నతని కరుణారసపూరితం బులగు నేత్రములు నిమీలితములయ్యెను. చిత్తము స్మృ తివిహీనమయి భగవధ్యానమునందు నిమగ్నమయిపోయెను. హృదయవిదారకంబగు హింసాదృశ్యమే యతని నట్లుగావించి వైచెను. అత డొక జంబూవృక్షతలమున నట్లే స్మృతిదూర డయి బాహ్యసంసారమును మఱచి సమాధిస్థుని చందమున భగవంతునిధ్యానింపుచు గూర్చుండిపోయెను. క్షేత్రదృశ్య ము నవలోకింప సహచరులతో దూరమరిగిన భూపాలుడు సిద్ధార్థునికొఱకయి క్షేత్రములన్నియు నన్వేషించెను. అన్వే షణానంతరంబు శుద్ధోధనభూపాలుడు జంబూవృక్షచ్ఛాయ

యందు ముకుళితహస్తుఁడయి నిమీలితనేత్రింబుల ధ్యాననిమ గ్నుండయియున్న కుమారునివీక్షించెను. సమగ్రసంసారమును ప్లావితమొనర్ప నపారకరుణారసవికాసభాసురంబగు నతని వదనారవిందముయొక్క యపూర్వశోభాతిశయమును సౌమ్య తరసుస్నిగ్ధతనుగాంచి శుద్ధోధను డపారాశ్చర్యపారావారని మగ్నుండయ్యెను. దీర్ఘకాలానంతరంబు రాజసహచరకోలాహల ధ్వనులచే ధ్యానము భంగమయినంతనే లేచి సిద్ధార్థుడు జన కుని సమక్షంబునవీక్షించి వినయపూర్వకంబుగ బ్రణమిల్లి, కా రుణికస్వరంబున నిట్లునుడివెను :— "జనకా! ప్రపంచమంతయు హింసాత్మకంబుగదా! ప్రేమ కిట స్థానమే కానరాకున్నది!" అల్పవయస్కుండగుకుమారుని విరక్తభావగాంభీర్యమునకును, ఆధ్యాత్మికభావచింతనాపాటవమునకును మదియందు భావి రాజ్యభారవహమున కంతరాయమును గల్గించునేమోయని సం దేహింపుచు గుమారునివెంటనిడుకొని శుద్ధోధనుడు స్వగృ హమునకు జనియెను.

ఒకదివసమున సిద్ధార్థుడు జనకునియనుమతినిబడసి విశాల నగరమునం దన్ని ప్రాంతములయొక్క దృశ్యముల నవలోకింప స్వనికేతనము నెడబాసి యతిదూరమరిగెను. కొంతదూర మరిగి నంతనే మార్గమధ్యంబున జలిబాధచే నాచ్ఛాదనవసనములేక కంపించుశరీరముతో నమితబాధ జెందు నొక్కవృద్ధభిక్షుకుని సిద్ధార్థుడుగాంచెను. ఆభిక్షుకుని శరీరము శిధిలమయియుండెను.

దైన్య మాతని వదనమండలమున దాండవమాడుచుండ, రాకు
మారాగమనమునుగాంచి సొల్పుడగు తన్నత డటబడియున్నం
దులకు శిక్షించునేమోయని భయపడ దొడంగెను. భిక్షుకుని
దుస్థితినిగాంచి సిద్ధార్థుడు ఘోరముగా దుఃఖించెను. ఆవృద్ధుడు
సహితము దనవలె నొక్క మానవు డయియుండ, దనవలెసుఖ
పడక దుఃఖించుటకు హేతు వేమయియుండునాయని యతడు
విచారించెను. ఒక్క సృష్టియందే జననమంది ఒక్క రూపంబునే
గల్గియున్న మానవ సమాజమునందే యిట్టిభిన్నములగు పరిస్థితు
లుండ, నింక నీచములుగ సంసారులచే భావింపబడు పశుపక్ష్యా
దులగూర్చి విచారింపవలసినపనియే యుండదని యతడు భావిం
చెను. దుఃఖమే సృష్టియొక్క స్వరూప మయియున్నందుల కత
డెంతయు వాపోవుచు ముందునకుసాగెను. అటనుండి కదలి,
కొంతద వ్వేగినంతనే శవవాహకులుకొందఱు మానవమృతకళే
బరమునొండు మోసికొని పోవుచుండుట దృక్పథంబున బడి
యెను. విషాదాక్రాంతుడగు సిద్ధార్థకుమారు డావిచిత్రదృ
శ్యమును గాంచి స్తంభీభూతుడయి, వారలెందు కారీతి నొక్క
మనుష్యుని బంధించి వెంటగొనిపోవుచున్నారో నవలోకింప నభి
లషించి వెంట నరిగెను. వవాహకు లాశవమును గొంపోయి
శ్మశానవాటికయందు మట్టిగప్పివచ్చిరి. సిద్ధార్థుడాదృశ్యమును
గాంచి దిగులొంది, మానవుని యంతిమావస్థయొక్క యథా
ర్థంబగు తాత్పర్యము గోచరింపక విచారింపసాగెను. ఆతని

హృదయమునం దించుకంతయయిన హర్షము మందునకయిన లే కయుండెను. అతని కోమలంబగు హృదయమును భయంకర దృశ్యసంజనిత దుఃఖాతిరేక ప్రచండానల జ్వాలలు దహింపజేయ నారంభించెను. అత డటనుండి నడువశక్తిలేనివాడయి సత్వరంబ మ్లానవదనంబుతో నిజారామమందిరమున కేగెను. ప్రపంచము యొక్క వాస్తవిక చరిత్రమునంతయు స్వానుభవంబున దెలియ గోరి మరొక్కతూరి నగరసందర్శనమున కరుగ నతడు నిశ్చయిం చెను. ఆ రామమందిరమం దిట్లు యొకింత కాలముగడిపెను.

ఒకదివస మతడు విహారార్థము మందిరము నెడబాసి నగ రాంతరాళమున కరిగెను. అత్తరి సూర్యభగవానుని తీక్ష్ణకిరణా తపంబు విశేషముగ బృథ్విపై బడుచుండెను. విహారము నకు సమయాసమయంబుల విచారింపక యతఁడు భిన్నోద్దేశ పేరితుండయి యామండు టెండయందే బయలుదేరెను. నగరమధ్యమున కరిగి, యచట మనమున కానందము లభిం పకపోమి, సత్వరమే నగర బాహ్యస్థితంబులగు క్షేత్ర ముల దిక్కయి పయనమయ్యెను. ఏకాకియయి చను రాకు మారునిగాంచి నగరవాసులెల్లరు నాశ్చర్య మందసాగిరి. అతడు వడివడిగ నడచి యొక క్షేత్రమును సమీపించెను. ప్రచండ సూర్యాతపంబు ఘోరముగ బాధింపుచుండ, విశేష కష్టదాయకంబగు శారీరక పరిశ్రమను సేయుచున్న కర్షకబృం దము నతడు గాంచెను. వారి శరీరములన్నియు స్వేదకణ సిక్త

ములయి యుండ, సుదారాన్న ప్రాప్తికయి వారల్లాడుచుండిరి. పొట్టకూటికయి నరులెట్టి కష్టపరంపరల నీ భూమిపై నుదయించి యనుభవించుచున్నారో సిద్ధార్థుడట ప్రత్యక్షముగ నవలోకించెను. అట్టి దీనులగు కృషీవలుల నుండి కప్పమును బలాత్కారముగ గొని, వారిసౌకర్యార్థ ముపయోగింపక, స్వీయభోగ విలాసములకయి దుర్వినియోగముసేయు భూపాలుర నింద్యములును, నీచాతినీచంబులును నగు చరిత్రముల స్మరించి కడు దురపిల్లజొచ్చెను. నృపాలశేఖరుల జీవితములు పరావలంబన యందే సౌఖ్యము ననుభవింపుచుండ గృషీవలులు స్వావలంబనయందే సుఖము ననుభవింపుచున్నారను మర్మమును సిద్ధార్థుడు గుర్తెఱింగెను. ఒక మానవుడు ధనాఢ్యుడయి హంసతూలికా తల్పంబుల శయనించుచు షడ్రసోపేతాన్నముల నారగింపుచు దేవేంద్ర వైభవోపేత మందిరముల నధివసింపుచునుండ, మరియొక మానవుడు బండరానేల బండుచు జన్మదరిద్రుడయి శుష్కాహారమును భుజియింపుచు నుండుటెంతయు నన్యాయమనియు, నధర్మమనియు నతడు తలపోయజొచ్చెను. శాసకుల యథేష్టాచరణము నతడెంతయు దూర మొదలిడియెను. స్వార్థ పరతంత్రుని జీవితము గర్హితమనియు, దూష్యమనియు నతడు భావింపదొడగెను. ప్రపంచమునందు ప్రాణికోటి న్యాయాన్యాయవిచక్షణబాసి, స్వార్థసిద్ధికయి యథేచ్ఛముగ వర్తింపుచుండునని యతడు గ్రహించెను. మాయావాగురంబగు సం

సారములో బలాఢ్యులు, నిర్బలుల బాధింపుచుండుట నైజమ యినదని యతడు నిశ్చయించెను. సూర్యభగవాను డస్తాద్రి జేరెను. సంధ్యారాగము సర్వత్ర వ్యాప్తమయ్యెను. ఆహార ము నన్వేషింప నలుదిక్కుల కరిగిన విహంగబృందములు - కిల కిల ధ్వనుల నుప్పతిలజేయుచు స్వాశ్రయంబుల జేర దొడగెను. గృహముల దీపమాలికల ప్రకాశము నగర బాహ్యసీమకు గాన నగుచుండెను. కాని యింకను సిద్ధార్థు డాక్షేత్రములయందే ధ్యాన నిమగ్నుడై యుండెను. రాజ సేవకు లన్వేషింపుచు సిద్ధార్థునిచెంత కేతెంచిరి. సిద్ధార్థుడు ఖిన్నహృదయు డయి, వారితోబాటు గృహాభిముఖుం డయ్యెను. అనుదిన మారాకుమారుని హృదయక్షేత్రమున ప్రపంచము యొక్క నైచ్యము సువ్యక్తమగుచు వైరాగ్యభావ బీజము లగణితంబుగ మొలకలెత్తసాగెను. పుత్రుని వైరాగ్య భావముల గాంచి భూపాలు డప్రసన్నచిత్తుండయ్యెను. నిరం తరవిచారమగ్నుండగు సిద్ధార్థుని విరక్త చిత్తమును సాంసారి కభోగవిలాసములవైపున కాకర్షింప నుపాయ మేమియుండు నని శుద్ధోధనభూపాలు డాత్మీయ సచివశేఖరుల బ్రశ్నింప వారలిట్లు ప్రత్యుత్తర మొసంగిరి. "భూపాలా ! ప్రాపం చిక సౌఖ్య రసాస్వాదనానుభవ దూరుడయి యున్నంత పర్యంతము సిద్ధార్థుని వైరాగ్యభావోదయ మభివృద్ధిజెందు చునే యుండును. భవదాత్మజుని విశాలహృద్గత వైరాగ్య

భావసముదాయ నివృత్తికి వివాహమే పరమ ప్రియో జనకారి యగును. మీ రాలసింపక సత్వరోద్వాహప్రయత్నము లాచరింపుడు. సిద్ధార్థు డింకను జ్ఞానమును బడసియున్నను, ననుభవమును బడసి యుండలేదు. జ్ఞానానుభవములు రెండును సమ్మిళితము లయినపుడు వ్యక్తికి సన్యాసమే శరణ్యమగును. అప్పుడు మన విశ్వప్రయత్నములు విఫలంబు లగును. దీపముండగ నేగృహమునుజక్క బెట్టుడు." భూపాలుడు వివేక సంపన్నులగు మంత్రులయుద్దేశము లెంతయు సంస్తవనీయములని భావించి యట్లాచరింప గృతసంకల్పుం డయ్యెను.

## వివాహము.

సమస్త వేదవేదాంగోపనిషచ్ఛాస్త్రాంతర్గత సద్విషయ రసాస్వాదనానంతరంబు గురుజనకథనానుకూలంబుగ బురాణ వైరాగ్యమను పదముసిద్ధార్థునియెడ సార్థకంబయ్యెను. సిద్ధార్థుని హృదయమందిర మచంచలభావపూరితంబయి యొకింతకాలము విరాజిల్లెను. వైరాగ్యభావాంబుధి నిమగ్నుండగు సత్కుమార రత్నము భౌతికప్రపంచసుఖ విముఖత్వము నుపలక్షించి కౌమ్రవల్లభుండగు శుద్ధోధనుడు ప్రియకుమారుని పరిణయమహోత్సవము గావింప నిశ్చయించెను. పాణిగ్రహణమహోత్సవ మద్భుతానందప్రదమగు నొకవిచిత్రభావవిలసిత వ్యాపారము; సమస్తభువన రక్షాదక్షుండగు శ్రీహరుని యపూర్వ శోభావిభాసిత లీలావిశేషము. పరిణయప్రభావ మనంతము; అపారము,

అత్యద్భుతము. పరిణయమందలి విశేష ప్రభావంబున లీలా మానుష విగ్రహుని నిర్వ్యాజకరుణాకటాక్ష ప్రపత్తి శతవిధం బుల విశదమగుచున్నయది. భిన్నముఖంబుల నవ్యక్తానంద ప్రదంబులగు కలకలనిస్వనంబుల స్రవించు దివ్యప్రణయ భావ వాహినీద్వయ మీ పరిణయకాలంబుననే యేకోన్ముఖంబయి భిన్నత్వముబాసి, యేకత్వమునంది సృష్టియొక్క దివ్యగుణగణ సంకీర్తనము చేయుచుండును. పరిణయమను పరమపవిత్ర పం చాక్షరీ మహామంత్ర మపరిచిత వ్యక్తిద్వయ హృదయాంతరాళ విరాజిత ద్వైతభావ నివహంబు జూపుటమ్మల దుంచి నేత్ర చతుష్టయంబు నేకము గావింపుచుండును. బాహ్యాలోచనంబు లకు గోచరించు గౌణదేహముల భిన్నత్వము నేకీభవింప జేయక పోయినను, దేహగేహంబుల వసియించు నంతరాత్మల నేకీభవిం ప జేయునది పరమాద్భుతశక్తి సంపన్నంబగు నీ పరిణయ మహాత్మ్యమె. పరిణయకాలంబుననే మానవమూర్తి ద్వయ హృద్గతసమస్తభేదభావంబులువిలుప్తంబులగుటయథార్థము. త త్సమయంబుననే భేదత్వమునం దేకత్వమే సృష్టివిధాన (Unity in diversity is the plan of creation) మను మహారహస్య ము సువ్యక్తంబగును. చర్మచక్షువులకు భిన్నవర్ణరూప విలాసప్రకారంబులవిలసిల్లుసమస్తసాంసారికపదార్థసంగ్రహము భిన్నత్వయుక్తమగుచున్నట్లు విస్పష్టమగుచున్నను, బ్రహ్మాండ భాండ మణుమయం బను గూఢసిద్ధాంతము ప్రకృతితత్వ శాస్త్ర

వేదులగు విజ్ఞుల జ్ఞానలోచనంబులకు గోచరింపక పోదు. అ
హంకార మమకారాజ్ఞాన భావవిశేషజన్యంబగు భిన్నత్వమను
గర్హితపదము నష్టభ్రష్టమగుడు మునిజనదుర్లభజ్ఞానసంజాత
మగు నేకత్వమను శబ్దరత్న మీ పరిణయతరుణమునందే కోటి
సూర్యప్రభాభాసితమయి ప్రకాశించు. ఏతత్సమయంబునందే
కన్యావరహృదయ విరాజిత ఖండానురాగ ప్రవాహద్వయ
మలౌకికసమ్మేళనంబున బూర్వ మందగమనంబు నుడిగి, దివ్యగ
మనంబున జగన్నియంతయగు సర్వాంతర్యామి పాదపద్మ పరా
గానురాగ దివ్యపారావార పవిత్రజలంబుల సమ్మిళితంబగు
ను. ఏతదవసరంబుననే పాంచభౌతికకాయ ప్రధానావయవ
చంచలస్వభావజన్య దుష్కార్య పరిణామస్వరూపంబులగు సుఖ
దుఃఖముల ననుభవింప గన్యావరులిద్దఱు సమభాగులయి, సహి
ష్ణుత, సహానుభూతిత్యాదిసద్గుణగణ ప్రసూనగ్రథిత పుణ్య
మాలికల గంఠసీమల నలంకరించుకొనియెదరు. వాస్తవమగయ
దాంపత్యప్రణయ మత్యంత విస్మయోత్పాదకశక్తియుక్తము!
ఏతద్దాంపత్య ప్రేమభావబంధన స్వరూపమిట్టిదని యభినుతింప
గవిలేఖినికి వశమా? వర్షాకాలవాహినీప్రవాహ స్వభావమును
బోలునైజ మీదాంపత్యప్రణయరస ప్రవాహంబున వెలయుననవ
చ్చు. ఏదియెటులున్న నేమి? ప్రణయప్రవాహంబుపు లతిపవిత్రము
లు; నిత్యానందప్రవర్ధకములు; నిఖిలబ్రహ్మాండవిలసితరసయుక్త
ములు. ఏతజ్జలపానంబున వసంతర్తువునం దేరీతి శుష్కభూరు

హము నవారుణకోమల పల్లవసంశోభితమయి ప్రేక్షకగణహ్లా దయానందకరమయి తనరారునో యదియేచందమున నూతనజీవ కళాస్ఫూర్తివిభాసితుడయి మానవుడు పునరుజ్జీవింప బడు నను నుడువు వాస్తవము. ఈపరిణయపరివాహంబున కెన్ని యో మహాదాత్మలు సమర్పితములయినవి. ప్రచండ ప్రభంజనా హతిచే సువిశాలోన్నత వృక్షపతనంబున దదాచ్ఛాదిత నవపల్లవ సంశోభిత మాధవీలతిక విచ్ఛిన్నమయిపోవు, దివ్యఫలంబులు భూతలపతితంబులైవిధ్వంసంబులగును, పరమాణుసంయుక్తం బులగు సమస్తపదార్థములు వియుక్తంబులగును. కాని,అద్వి తీయంబును, నిరుపమానంబును, సర్వేశ్వరాంశ యుక్తంబును నగు పవిత్రదాంపత్య పరిణయంబున బరిణితంబగు హృదయము పరివర్తనము బడయునన్న స్వప్నవార్త. దాంపత్య పరిణయ భావోద్రేక సంభూత ప్రభావంబున నాత్మస్వరూపులగు వరనారీమణుల మనంబు లేకంబు లగును. తదంతఃకరణ సమ్మే ళన మపూర్వానంద ప్రదమును నూతనచైతన్య గుణోత్పాద కమును పవిత్రభావ సమ్మేళన స్వరూపము. వివాహానంతరము విరక్తభావ సందోహావృత వ్యక్తి హృదయారవిందము సహిత మలౌకిక దాంపత్య పరిణయానంద మకరందనిలయం బగును. తత్సమయంబున వరునియెడ "భార్యాసమంనాస్తి శరీరతోష ణ"మ్మను గురుజనోక్తి సంపూర్ణముగా సార్థకం బగును.

పాణిగ్రహణ మహోత్సవమందలి యద్భుతానందప్రద

దశక్తిని, వైరాగ్యభావ ఖండనసామర్థ్యమును గుర్తెఱింగి శుద్ధోధనుడు నిజసుతవివాహ ప్రయత్నములు గావింప దొడంగెను. శాక్యవంశీయుల రాష్ట్రములయందున్న నెల్ల రాజపుత్రికల సందర్శనమును సిద్ధార్థునకు గలుగజేసి, యవ్వారియం దతని హృదయము నాకర్షింప గల వనితాలలామతో నుద్వాహము గావింప భూపాలుడు సంకల్పించెను. శుద్ధోధనుడు, తన విశాలనగరంబగు కపిలవస్తుపురం దొక్క యానందోత్సవమును గావింపుచున్నాననియు, దనయందును బవిత్రంబగు శాక్యవంశముయెడను నాదరముగల నెల్ల శాక్యవంశ భూపాలురు బంధుమిత్ర పుత్రపుత్రికా సమేతులరయి యాకళ్యాణోత్సవమును సందర్శింప, నతిశీఘ్రము వేంచేయవలయుననియుఁ జాటబంచెను. సుప్రసిద్ధ విఖ్యాతిపరుండగు శుద్ధోధనుని ఘనతమమగుశాసము విశదమయినంతనే శాక్యవంశజులగు సమస్తరాష్ట్రాధిపతులు పరివారసమేతముగా గళ్యాణోత్సవసందర్శనార్థము కపిలవస్తుపున కేతెంచిరి. సమస్తజనులు నుత్సవమండపమున విద్యమానులయియుండ, భూపాలుని సేవకబృందము రత్నమణిమయ జటిత సువర్ణాభూషితంబులగు నలంకారములచే బరిపూర్ణములయియున్న పేటికలగొనివచ్చి శుద్ధోధనుని సమక్షమున నుంచిరి. నానారాష్ట్రాగత సామంత భూపాలబృందమును, వారి పరివారజనమును నుద్దేశించి, శుద్ధోధను డీరీతినుడువదొడంగెను :— "ప్రేమాస్పదులగు నోమిత్రులారా! నేడు మనమందర

మిట నానందోత్సవంబను పేరిట సమావేశ మగుటకు హేతు వొందుకలదు. దీర్ఘకాల మీారాజ్యసింహాసమున కుత్తరాధి కారిని బడయలేక విచారాంబుధి దేలియాడితి. మత్ప్రియాప్రి బోధంబున జగదీశ్వరారాధనముగావింప నుపక్రమించిన యన తికాలంబునకే యీాయిదింరాసుందరుని నిర్వ్యాజకరుణావిశేషం బున మనోభీష్టము సిద్ధించినది. తన్మనోభీష్ట సిద్ధియొక్క సత్ఫ లమే యీానాసిద్ధార్థకుమారుడు: లేకలేక దైవానుగ్రహంబున లభించినయీాకుమారుడు యుక్తప్రాయసంపన్నుండయినాడు. సత్వరమే వివాహముగావింప గృతసంకల్పుండనయితిని. పరిణ యము గావించుటకు బూర్వమే బంధుమిత్రాదులగు మీా యాశీర్వాదములబడయుట యతని కర్తవ్యమయియున్నది. మీా పుత్రికారత్నములు మీాసోదరుండనగు నాకుసహితము సుతా సదృశలే! ప్రేమపూర్వకంబుగ నిటకేతెంచిన భూపాల తన యలకెల్లరకు నాకుమారుడు సువర్ణాభూషణముల వితరణము గావింపనున్నాడు. ఏతత్కారణంబుననే నేడు మన మందర మియ్యెడ సమావేశమయినారము.

పితాజ్ఞనుబడసి సిద్ధార్థకుమారుడు నిజాసనంబు నుండి లేచి, పరిచారకులిచ్చు భూషణంబుల గొనుచు నొక్కొక్క టిచొప్పున రాజపుత్రికలకు గ్రమముగా బ్రసాదింప నారం భించెను. శుద్ధోధను డాసమయమున ననుభవజ్ఞాన సంపన్నుం డగు నొక్క సచివశేఖరుని బిలిచి, యుక్తప్రాయమునందున్న

సిద్ధార్థకుమారుడే కుమారి విశ్వమోహన విగ్రహానూనద్యుతి కలరి ముగ్ధహృదయుండగునో రహస్యముగా నరయుచుండు మని కట్టడిజేసెను. సిద్ధార్థుడాసమయమునం దేరాకుమారి నవ లోకించి ముగ్ధుండగునో నాభూపాలతనయతోడనే తనయుని కళ్యాణమహోత్సవము గావింప నిశ్చయించి యుండె నా శుద్ధోధనభూపుడు. పితృకథనానుకూలంబుగ సిద్ధార్థుడ వేక భూషణముల రాజపుత్రికలకు బంచిపెట్టెను. కాని తత్సమయము నం దా కుమారుని ముఖబింబమునం దణుమాత్రమయిన మోహప్రకాశము కానరాకుండెను. సువర్ణాభూషణ వితరణకాల మునం దా రాకుమారుని ముఖారవింద మత్యంతశాంతి యుక్తమయి దివ్యముగ నొప్పారుచుండెను. అంతమునకు దండపాణి భూపాలాత్మజయగు యశోధరాదేవిచెంతకు సిద్ధార్థుడలం కారముల బ్రసాదింప నరుదెంచినంతనే సభాస్థిత సచివశేఖరులును భూపాలురును ననిమేషనేత్రులయి యాదేవిభాగ్య మెటులున్నదో యని యత్యాతురముతో వీక్షింపనారంభించిరి. యశోధరాదేవి యనూనాపూర్వ సౌందర్యచ్ఛటను వీక్షించి నంతనే సిద్ధార్థుని హృదయ మొకించుక చలించెను. అతని స్నిగ్ధతర మనోజ్ఞవీక్షణము లాదేవిసుందరముఖారవిందమున బ్రతిబింబితములు కాదొడంగెను. ఆత డాదేవి దివ్యస్వరూపము నత్యధికౌత్సుక్యముతో జూడ నారంభించెను. యశోధరాదేవి యు నన్యరాజతనయలమాడ్కి పారితోషకమునుబడయ సి

ద్ధార్థునిపాదారవింద సాన్నిధ్యమున కతిపయవిధేయత లొప్ప
సాక్షాల్లక్ష్మియో యను భ్రమ యెల్లవారికి గలుగునట్లు లేతెం
చెను. కాని పురస్కారంబు నీయ సిద్ధార్థుని యొద్ద నాభూషణ
ములు కొఱంతవడియెను. అతడు రిక్తహస్తుడయి, యశోధరా
దేవి సౌమ్యమూర్తి ననిమేషదృష్టితో నవలోకింపదొడంగెను.
తత్కారణంబున నతడు నిజకంఠసీమ నలంకరించుకొనియున్న
బహుమూల్యరత్నహారము నాయువతీలలామ కత్యంతాను
రాగపురస్సరంబుగ నర్పించెను. రాజనందను డాదివ్యసుందర
విగ్రహమును ద్రికరణశుద్ధిగ మోహించెను.

సౌందర్య మనుపదమే పరమాద్భుత ప్రభావసమన్వితం
బు. మానవకోటి నతిసులభంబుగ నప్రయత్నముగ నాకర్షింప
గల్గుపదార్థము సౌందర్యమునకంటె నేదియుగాన రాదు. సౌంద
ర్యమునకయి సృష్టినిజజీవనసర్వస్వమును సహితము సమర్పింప
సంసిద్ధమయి యుండునుగదా! మాదకద్రవ్యములన్నియు సౌం
దర్యమునుగాంచి సిగ్గుజెందును. సౌందర్యమే సిద్ధార్థుని కోమల
హృదయమును నయస్కాంతము లోహము నాకర్షించుచంద
మునముగ్ధుని గావించెను. సభాగతజను లెల్లరు సిద్ధార్థుడు దండ
పాణిభూపాలునిపుత్రికను మోహించె నని పరస్పరము జెప్పు
కొనదొడంగిరి. పారితోషకవితరణానంతరము సభాగత భూపా
లు రెల్లరు రాజానుమతిని స్వస్థానముల కరిగిరి.

యశోధరాదేవి దివ్యమూర్తి సిద్ధార్థహృదయఫలక మున్న

ంపబడియె నన్న రహస్యము నగరవాసుల కెల్లరకును వ్యక్తమాయె డిని. సచివశేఖరులు సిద్ధార్థుని మోహావిషయక రహస్యవార్తను శుద్ధోధనభూపాలునకు దేటతెల్లము గావించిరి. గౌతమీదేవి పుత్రుని సంసార సౌఖ్యాభిలాషోదయమున కెంతయు ముద మందెను. శుద్ధోధనభూపాలుడు దండపాణి (ఇతనికే ప్రబుద్ధుడను నామధేయముసహితము కలదు) ధరణీనాథుని సన్నిధికి నిజపుత్రికారత్నమును సిద్ధార్థునకొసంగి వివాహము సేయవలసినదిగా వర్తమాన మనిపెను. దండపాణిమహాశయుడు నిజకుమారీపరిణయ మహోత్సవమును క్షత్రియధర్మోచితంబుగ సలుపనిశ్చయించెను. జననీజనకులు యోగ్యదాంపత్యమునకయి ప్రయత్నము సేయ బాధ్యతను గల్గియున్నారని యతని తలంపు. అతడు ప్రప్రథమమున సిద్ధార్థుని నిజపుత్రికకు దగిన వరుడు కాడని పరిహాసించెను. సిద్ధార్థుడయోగ్యుడనియు నతని యందు క్షత్రియోచిత లక్షణములు లేవనియు, శస్త్రవిద్యయందతడనర్హుండనియు, నవహేళనము సేయగడంగెను. శుద్ధోధనుని నిర్బంధమువలన సేయునది లేక యొక కపటవ్యూహమును రచించెను. అత డిట్లు సమస్తభూపాలురకు వర్తమానము జేసెను :—"రాజన్యులారా! నేను నా ప్రియసుతయగు యశోధరాదేవి పరిణయముగావింప నిశ్చయించినాడను. ఏ రాకుమారుడు శస్త్రవిద్యయందసమానపాండితీసంపన్నుడని వివాహమహోత్సవసమయంబున నిర్ణయింపబడునో యట్టి ధీరునికి

నాసుతనొసంగి కళ్యాణముగావింప నభిలషించితిని. కాన నా వంశీయులగు మీరెల్లరు ప్రేమపూర్వకంబుగ నేతెంచి, మత్సమర్పిత సమ్మానములబడసి, నన్నానందింపజేయుదురుగాత!"

తదాప్రజస్యకృత కళ్యాణమహోత్సవమునకు సిద్ధార్థుడు సహితము శుద్ధోధనభూపాల సమేతముగా నాహ్వానింపబడియెను. తనకు దూరమయిపోవుచున్న యశోధరాదేవి వివాహమహోత్సవమునకు జనుటకెంతమాత్రము నభిలాష లేకపోయినను క్షత్రియాహ్వానము దిరస్కరింపరాదని భావించి సిద్ధార్థకుమారుడు జనకునితోగూడి, దండపాణిరాష్ట్రమున కరిగెను. బంధుమిత్ర నిమంత్రణము నకాలమువారు తృణీకరించుట ధర్మవిరుద్ధమని యెల్లరు భావింపుచుండువారు. స్వయంవరమహోత్సవమున బాల్గొన నానాదేశవిదేశములనుండి సహితము భూపాలురును విశేషించి, యుక్తప్రాయమునందున్న రాజనందనులును నేతెంచియుండిరి. తత్కాలమున యశోధరాదేవి సద్గుణసంపత్తియు, సద్విద్యాప్రపత్తియు, సౌందర్యవృద్ధియు, నెల్లజనుల చిత్తములపై నాధిపత్యము వహించియుండెను. క్షత్రియవంశజులగు భూపాలురకు బరమపావన శాస్త్రముగ భావింపబడు శస్త్రవిద్యయందు నాడొక మహాపరీక్ష కానుండెను. ఆపరీక్షయం దేరాకుమారుడు నిజాద్వితీయ శస్త్రచాలనానైపుణ్యమును దర్శింపజేసి యపూర్వంబగు విజయమునందునో యతడే యశోధరాదేవి హృదయేశ్వరుం డగును. శస్త్రవిద్యయందు

సమస్త రాజకుమారులకన్న మిన్నయగువానికే రాకుమారి లభ్య మగునని దండపాణిభూపాలు డంతకు బూర్వమే యుద్ఘోషిత ము గావింపజేసియున్న కారణంబున భూపనందనులెల్లరు దమ తమ విద్యాప్రౌఢిమను జాటదొడంగిరి. సంయోగవశమున సిద్ధార్థుడే క్షత్రియోచితంబులగు సమస్తవిద్యలయం దగ్రేసరుం డుగ నుత్తీర్ణుండయ్యెను. శ్రీరామచంద్రుని ధనుర్భంగకాల మున జనకునికివలెనే దండపాణిభూపాలునకు సహితము దల వంపయ్యెను. తనచే నయోగ్యుడుగ సంభావింపబడిన సిద్ధార్థు డు క్షత్రియవంశోద్భవ రాజకుమారచూడామణి యయ్యెను. తద్వివాహమహోత్సవ మహామండప విరాజిత సమస్తభూపా లశేఖరులు సిద్ధార్థుని శక్తిసామర్థ్యముల కత్యాశ్చర్యము నంది శిలాప్రతిమలవలె నిశ్చేష్టులయియుండ, ప్రేక్షకబృందములు కరతాళధ్వనులజేయుచుండ, తన్నగరసభాసదుల హర్షధ్వాన ములు మిన్నుముట్ట, రాజపరివారము జయలక్ష్మీకరగ్రహణ భాగ్య సంపన్నుండగు సిద్ధార్థునిపై సుమనవృష్టి గావింప, దండ పాణి భూపాలుని ప్రియతనూజయగు యశోధరాదేవి పితా్రి పుమలిని నిజదివ్యాననకాంతులు రాజనందనులనేత్రముల మెఱ సుతీగంబోలి మిలమిలమెఱయుచుండ భావిబుద్ధభగవానుడగు సిద్ధార్థకుమారుని విశాలకంఠసీమను నిజకరపల్లవవిభాసిత పుష్ప మాలికచే నలంకరించెను. సుమనోమాలికాధార ణానంత నంబు దేవేంద్రవైభవముతో యశోధరాసిద్ధార్థకుమారుల

కళ్యాణమహోత్సవము గావింపబడియెను. భూతతృప్తి యా దివసంబున బుష్కలంబుగా నయ్యెడిని.

నిజోద్వాహానంతరంబు సిద్ధార్థుడు తులలేని భాగ్యభోగ్య పరంపరా ప్రాప్తిచే నల్పకాలంబుదనుక సంసారసౌఖ్యంబుల జూరగొనియెను. నిత్య మతని యానందమందిరమున నృత్యగీతములు నిరాతంకముగా సలుపబడుచుండెడివి. గుణవతియు, మహాపతివ్రతయునగు యశోధరాదేవిని జీవితసహచరిణిగా బడసి సిద్ధార్థుడాత్మీయ సౌభాగ్యము నెంతయు సంస్తుతించుకొనియెను. హితైషిణియు, బతిభక్తిపరాయణయునగు సతీతిలకము ప్రాప్తించుటంజేసి యతనిజీవిత మానందమయమయ్యెను. గృహస్థజనోచిత సుఖభోగంబుల నతనిగార్హస్థ్య జీవితచరిత్రయందలి కొన్నిప్రకరణములు గతించెను.

సంసారసౌఖ్యమును జవిజూచినపిదప నతనిహృదయమున వైరాగ్యభావములు మరల జనింపదొడంగెను. ప్రాయికంబుగా నతడు స్మృతిపథంబున నలినీదళగతజలసదృశచంచలంబులగు సంసారసాగరోద్భూతాస్థిగసుఖదుఃఖతరంగమాలికలు బొడసూపినంతనే ప్రచండశోకానలజ్వాలాదగ్ధమానసుండగుచుండెను. గౌతము డొకప్పుడు ప్రియావదనారవిందసందర్శనానంద మగ్నమానసుండయి యుండినను, మరొకప్పుడు గిరివరలతా వృక్షవిరాజిత కాననస్థిత సర్వసంగపరిత్యాగులభాతి వైరాగ్యభావసాగరంబున నోలలాడుచుండెను. నిజనంద ను

హృదయమున కాహ్లాదము నొదవజేయుటయందే సంతతము సంలగ్నమయియుండు శుద్ధోధనభూపాలుడు పుత్రుని విరక్తస్థితినిగాంచి, మర్మాహతుడయి, యప్రతిభుడయి సేయునదిలేక మదినొక నూతనోపాయస్ఫురణ కల్గినంతనే యొకించుక మతిస్థైర్యమునంది, సిద్ధార్థునికి నివాసార్థము ప్రాచీనానందమందిరమును గేలిసేయునట్టి మరొక్క విస్తీర్ణ రామణీయకహర్మ్యమును నిర్మింపజేయించెను. తద్రాజప్రాసాదమునకు జతుర్దిశలయందును సుందరతరనానావిధ వృక్షలతానికుంజ విలసితంబులగు నుద్యానవనముల వేయించెను. ఆవిలాసమందిరాంతర్భాగముల నలుగెలంకుల మనోహరంబులగు కుడ్యముల నిర్మింపజేసి తత్ప్రాసాదమునంతయు హృదయాహ్లాదకర మనోజ్ఞవస్తుతతిచే బూర్వమువలె నింపసాగెను. తన్మందిరాంతర్గతమ్లానపదార్థములన్నియు శీఘ్రమే దూరీకృతము గావింపబడియెను. భూపాలుడంతటితో శాంతినందక పరులెవ్వరు నామందిరమును సమీపింపరాదని తానుకట్టడిజేయుచు, సంథాగారసభ్యులచే సహితము జేయించెను. భూపాలుడిట్టి కట్టుదిట్టముల జేయుటయతని పుత్రునిసంతతావిరళ చింతాకారణమే సర్వకాలసర్వస్థలయందు గౌతమున కావిశాలారామమందిరమునందును, బహిస్థప్రదేశములయందును నిత్యానందకరంబులును నుత్తమశోభఃపుంజవిరాజితంబులును నగు పదార్థములే దృష్టిగోచరమగు

చుండెను. తదుత్తమోత్తమారామమందిరమునకు 'విసంభ్రవన'
మని నామధేయము. తత్సదనాంతరాళమునుండియే పరమనిర్మ
ల సలిలభరితమగు రోహిణీతరంగిణి యస్ఫుటంబులగు కలకల
నినాదముల జేయుచు, నిత్యము స్రవింపుచుబోయి గిరిరాజతనయ
యగు పునీత భాగీరథిం సమ్మిళితంబగును. దీర్ఘకాలంబుదనుక
సిద్ధార్థకుమారు డీయలోకసామాన్య ప్రతిభాసాశోభితంబగు
దివ్యమందిరావాసంబున విశేషకాలనగర పరిభ్రమణజనిత వై
రాగ్యభావ సందోహసంస్మరణమును విస్మరించి యైహిక
భోగంబుల గాలము వ్యతీతముసేయ జొచ్చెను. యశోధరా
దివ్యవదన నిర్గతవాగమృత రసపానాభిలాషియగు సిద్ధార్థుని
మ్లానవదనేందుబింబము, హృదయేశ్వరీ నిర్మలానురాగచంద్రి
కా ప్రసారంబున షోడశకళావిరాజితంబగు సుధాకరబింబము
ను హాసియింపజేయ నుద్యుక్తమగుచుండెడిది. అతని విశాల
హృదయభాండ మపూర్వానంద రసప్లావితమగుచుండెను. సూన
శరుని శరాసన నిర్గతమృదుల కుసుమబాణ ప్రహార ప్రభావం
బున ప్రియమందహాసవిలసిత సుందరవదనారవింద సందర్శ
నా సంఘటిత నిర్మలానంద విశేషంబునను దీర్ఘకాలపర్యంతము
సిద్ధార్థకుమారుడు భౌతికప్రపంచాంతర్గత కల్పనానిస్తుల సౌఖ్య
రసాస్వాదనము దగిలి నిత్యనైమిత్తికక్రియలుగూడ మఱచి
పుచ్చెను. ప్రచండమారుతాహతిచే డోలాయమానంబగు చంచ
చల తరంగమాలికాచంద్రమున నస్థిరంబగు నతనిమన మొక్కొ

క్కప్పుడు చలించిపోవుచుండుట ప్రకృతినాట్యరంగమున ఘటి యింపుచుండు చిత్రవిచిత్రములయందలి యొకానొక యల్ప ఘటనమేకదా!

యథార్థమారసిన సర్వజీవదయామయుండగు సర్వేశ్వర సంవర్ధిత విశాలసంసారమే యొకయగాధరత్నాకరమువంటిది. మానవజీవితమే యందు బ్రయాణముసేయు నొక్క నావ వంటిది. మనశ్శాంతియే (సంపూర్ణమనశ్శాంతిని బడయుటనే సిద్ధియందురు, అనగా సంసారాశాశ్వతత్వమును గుర్తెఱింగి మనశ్చాంచల్యమును బాసి స్థిరచిత్తుండగుట యని తాత్పర్య ము) చుక్కాణినిబోలియుండును. అస్థిరమనోజన్యభావములే సాగరజనిత తరంగమాలికలను సరియగును. వాంఛలు బుద్బు దసదృశములు; ఉత్థానపతనములే యవ్వానిధర్మములు. సా గరమునందలి వీచిక లెక్కుడయినకొలది నౌక డోలాయమాన మయి గమ్యస్థానమునకరుగుట కనుకూలపథముగానక విషమ పథమునంబడి విపత్సంకటముల జిక్కుట సహజమగును. సంసా రమునందు సహితము మదిసేభాతి జంచల భావోదయంబున, నందుసాగుచున్న జీవితము చలించిపోవును. చలించినజీవితము భ్రమాసమన్విత దుర్భావతరంగమాలికల మధ్యంబునబడి, యిచ్చవచ్చిన యిక్కకు గొట్టుకొనిపోయి జలగతంబగును. దుర్దమనీయ మహావిపత్సంకటావస్థయందు వ్యక్తికి మతిస్థైర్యమే యున్నచో నదియే నావకు జుక్కాణివగిది సంరక్షణికారిణియ

గుట ధ్రువము. పలుపలుకులేల? సంసారసాగరమున జీవననౌకా సంచాలనార్థము మనస్థైర్యమను చుక్కాణియే లేనిచో, గష్టపరంపరలు సంఘటియించుట సహజమగును. నుడివినసుడువులే వాకొనుట చర్విత చర్వణంబగును. సదసద్వివేక రహితుండనయి యలోకసామాన్య మూల్యవంతంబగు కాలమును వృథానేయుట మదభీప్సిత భావంబుగాదు. జీవన వేదమునందలి ప్రత్యేక పాఠాంశముల బాఠకమహాశయులకు గర్ణగోచరము నేయు ప్రగాఢాభిలాషయే యేతద్వచశ్చణా లేఖనోపక్రమణమునకు మూలము. పూర్వోక్తోదాహరణానుకూలంబుగ జంచలతరంబగు జీవితమున సిద్ధార్థుడు హృదయేశ్వరీ పీయూషవాగ్ఝురీ రసపానమదమత్తుడయి, అస్థిరహృదయ భావాతిరేకంబున నాంతరిక ప్రపంచజ్ఞానదూరుడయి, ఐహికసౌఖ్య సంపాదనయే జీవితపరమావధియా యన్నయట్లు భోగవిలాసములకు జిక్కి, ద్వాదశవర్షపర్యంతము నిజామూల్యసమయమును దుర్వినియోగపఱచెను. తదనంతర విచిత్రఘటనాపరంపరా పరీతమగు కథ నాలకింప మాపాఠకబృంద మువ్విళ్లూరుచుండును గాన గథాక్రమంబున కుపక్రమించుటయే మద్ధర్మము.

నృపాలనందనుండగు గౌతమునకు దీర్ఘకాలైహిక భోగానుభవానంతరం బొక్క దివసమున దివ్యాంగనాముఖోద్గత వేదాంత భావాన్విత ప్రభాతమాంగలిక గీతాశ్రవణంబున నిద్రితవైరాగ్య భావస్ఫూర్తి జాగృతంబయ్యెను. గభీరజ్ఞాన భావ

పూరిత గీతాశ్రవణానంద రసప్రవాహంబున దేలియాడు సిద్ధా ర్థునిహృదయము మానవజీవితాశాశ్వతత్వమును గూర్చి విచారింప నువ్విళ్లూరజొచ్చెను. ఈశ్వరసంకల్ప మొకటి యయి యుండ మానవు డెన్నిప్రయత్నముల గావించినను, దద్విరుద్ధ ముగా గార్యోన్ముఖుండయి విజయమును బడయజాలడు కదా!

## ఈజగము నిస్సారము.

"ద్వంద్వార్థ భూయిష్ఠంబును, బాహ్యాడంబర సుసజ్జితం బును నగు నీసృష్టియందు సౌఖ్యము లేదు. ఈజగము నిస్సా రము" అను భావములు సిద్ధార్థునిహృదయమునం దుదయించె ను. నృపాలనందనుండగు సిద్ధార్థు డొకదివస మాకస్మికంబుగ నిజనగరమును సందర్శింప మదియందు నిశ్చయించుకొని యెను స్వకీయాభిలాషను సిద్ధింపజేసికొన వలయునని యెడి వాంఛ తో సారథియగు ఛన్నునిబిలిచి, యిట్లనిరణి నొక్కి వక్కా ణించెను :— "ఛన్నా! నేడు నేను నగరమును సాంగోపాంగ ముగా సందర్శింప సంకల్పించినాడను. నేడెట్టి యవసరకార్య ములున్నను నీ వాలసింపక రథమునుగొనిరమ్ము. నగరమునం తయు జుట్టుముట్టిరావలసియున్నది. కాలినడకనరిగిన నాలస్యం బగును. గతదివసమునుండియు నగరమునందలి యెల్ల చిత్ర విచిత్రముల నవలోకింప మామకంబగు చిత్తము ఉవ్విళ్లూరుచు న్నయది. నీవువిలంబము సేయక సత్వరము వాజిశాలకరిగి యుత్త

మాశ్వంబుల బూన్పి. తే రాయుత్తముగావించుకొని యిటకు వేంచేయుము. ఆలస్యముసుంత యుజేయజనదు; చనుము." భృత్యసంఘము సిద్ధార్థుని దృఢసంకల్పమును సత్వరంబరిగి, భూపాలుని కెఱుకపఱచిరి. భూపాలు డంతకు బూర్వమే ప్రియసందనుని ప్రార్థనాభిలాషను గర్ణాకర్ణిగనాకర్ణించి, స్వాంతమునందత్యంత విషాదమువడసెను. కుమారునివాంఛను నిరాకరించిన నతని కాత్మగ్లాని యుద్భవిల్లుననియు, సంసారవ్యవహార కాండము నెడ నిరసనభావ ముదయించుననియు సందేహించి శుద్ధోధన భూపాలుడు మదినించుకయయిన గాంక్ష లేనివాడయ్యు గుమారుని, కిక్కరణి సానుకూలప్రత్యుత్తరం బొసంగెను. "కుమారా! త్వదీయమనోభీష్టము నాలకించితిని. హర్ష మాయెడిని. మదాజ్ఞ బాటించి, నేడే నగరసందర్శనార్థము ప్రయాణమగుట జాలించి, మరుసటిదివసము సూర్యోదయకాలంబున రథారూఢుడవగుచు సారథీద్వితీయుడవయి విహారార్థమరుగుట శుభప్రదంబు. జనకుండనగు మదాజ్ఞను దృణీకరింపక, ధర్మసంగతంబగు త్వదీయాభిలాషను నేటికి భంగమొనర్చితి నని శంకితస్వాంతుడవు కాక యొకింత తడవు వేచియుండుము. ఇదియే యుక్తకార్యంబ." సిద్ధార్థున కత్తఱి 'పితృదేవోభవ, మాతృదేవోభవ' యను గురుజనోక్తులు స్మృతిపథంబున దట్టినంతనే పితృదేవుని యాజ్ఞ, అందును ననిష్టప్రదంబు కానియనుజ్ఞ నవశ్యము బాలించుటయే పుత్రుండనగు నావిహితధర్మ

మని గ్రహించి సిద్ధార్థుఁ డందులకు సమ్మతించెను. భూపాలు డు తనవచనంబులకు విధేయుఁడయి 'వల్లె' యనుట కెంతయు బుత్రుని స్వాంతమున సంస్తుతించుకొనియెను. తద్దివసము జనకుని వచనంబుల కియ్యకొని సిద్ధార్థుఁడు వెడలిపోయెను. పి తాజ్ఞాబద్ధుండగు సిద్ధార్థుఁడు విశేషజ్ఞానసంపన్నుఁ డయ్యు, దం డ్రివచనంబులకు శిరముపంకించుట దక్క వేరొండు ప్రత్యు త్తర మొసంగెడివాఁడు కాఁడు. తదాత్రపరంబు సిద్ధార్థుఁ డాత్మీ యారామమందిరస్థిత పుష్పోద్యానముల విహారముసేయుచు చారుకృతిక రామణీయతను నేత్రపర్వంబుగను, నవవికచ మల్లి కాది ప్రసూనపుంజముల నాశ్రయించు భ్రమరగణముల సర సనంగీతరవసంభరిత ఝుంకారములు శ్రవణానందకరంబుగను, సృష్ట్యంశమగు పుష్పోద్యాన నిర్మాణకౌశలమును దర్కవిత ర్కములందేల్చుచుమదినభావానుభవానందముతోఁడవ్యతీతము జేసెను. శుద్ధోధననరపాలుఁ డాదివస మాత్మీయ భృత్యగణ మును రావించి, నిజనగరమునం దెయ్యెడను వికలాంగులుగాని శోకతప్తులుగాని దీర్ఘరోగపీడితులుగాని వేయేల? ఏవిధమయి న వ్యాధిగ్రస్తుఁడును నుండరాదనియు; వీధులన్నియు నత్యంత పరిశుద్ధముగను, గృహాంగణములన్నియు వింతవింత ముగ్గుల తోఁడను, కలయంపితోఁడను, గృహద్వారములన్నియు శుభ సూచకంబులగు నామ్రతమాలపత్రగ్రథిత తోరణమాలికల తోఁడను నలంకరింపబడి యుండవలయుననియు గఠినముగ శా

సించెను. ద్వితీయవాసరమున నుషఃకాలంబుననే లేచి నగర వాస్తవ్యులెల్లరు ప్రాతఃకాలమగుసరికి నగరవీధులన్నియు నానాప్రకార చిత్రవిచిత్ర వస్తుసంచయముచే నలంకరించిరి. క్రొత్తగానున్నను గొట్టబడిన గృహమాలికలు భాలభాస్కరారుణ ప్రచండకాంతులతోడ ధవళధావళ్యమానమయి మిలమిల మెఱయజొచ్చెను. పురమునందలి యువతీజన బృందములు దివ్యప్రకాశవిలసిత విచిత్రభూషణ భూషితములయి అమూల్యాంబరముల ధరించి నిజగృహాంగణములనిలిచి పరమ శాంత స్వరూపుండగు తమభావిమహీపతిని దర్శింప నుల్లములు వెల్లుగ దల్లడిల్ల తమ చంచలదృక్కుల నలుదిక్కుల బ్రసరింప జేయసాగిరి. యువరాజాగమనంబున కొంకింత కాలవిలంబనమగుకతన జతుర్దిశ ప్రసారిత పురజనతరళనయన నిర్గతదృష్టులు నిజాభీష్టము భగ్నంబగుటగాంచి నిరాశంజెంది, తమయధిపతుల జేరుచుండెను. పురమున సర్వత్ర వివిధవర్ణసంశోభిత పుష్పగుళుచ్ఛంబులే దృక్పథంబున బడుచుండు కారణంబున దర్శనేంద్రియము లత్యంతము హర్షోత్ఫుల్లము లగుచుండెనన్న వింతయేముండును? విద్యాగంధముగల బాలికామణు లెల్లరు నలువు రేసి యొక్కొక్క గృహద్వారమునజేరి, సిద్ధార్థుని యాహ్వానించు నిమిత్తము మంగళహారతుల బాడుచుండిరి. వారి హస్తముల కర్పూరతైలోద్దీపిత దీపకళికా విరాజితంబులగు పళ్లెరములు సుప్రకాశితములయియుండెను. పలుపలుకు లేల

పత్తన మేదిక్కు బరిశీలించినను, సమస్తమంగళసూచక వైభవో పేతమయి నందనోద్యానము భాతియు నింద్రపురంబువలెను, భూతలసాకేతంబు పగిదియు గన్నుల పండువుగనుండెను. నా యీయభివర్ణనమునం దెంతమాత్రము నత్యుక్తికానరాదు. ఆ బాలవృద్ధు లా దివసమున రతీపతిని హసియించు తరుణారుణ లావణ్యతనుగల్గి, నూతనాంబరధారులయి ప్రసన్నవదనారవిం దముల మందహాసచంద్రికా వీచు లుప్పతిల్ల యువరాజసందర్శ న కుతూహలులయి, వీధులవెంట నడయాడుచుండిరి. తత్స మయమం దానంద దేవతయే యానగరమున నవతరించి, యద్దా నినే నాట్యరంగస్థలము (క్రీడాప్రదేశము)గ గావించుకొని, లాస్యమాడుచున్నదో యన్నట్లు సర్వత్రసౌందర్యచ్ఛటయు హర్ష బాహుళ్యమును దృగ్గోచరమయి నయనమనోపర్వంబుగ బ్రతీత మగుచుండెను. తత్పురి కేతెంచిన నవాగంతుకు లాదివస మా నగరరాజశోభను, చకోరవిహంగములు నిశానాథుని చంద్రి కాప్రసారల బానందరసమును గ్రోలుచందమున నే ననిమేష నేత్రులయి తిలకింపజొచ్చిరి. రాజభటు లంతకుబూర్వమే దారిద్ర్యదేవతాభక్తులను, జరాభారావనత కటీవిరాజితులను, నిరంతర విషాదగ్రస్తులను, జర్జరకాయులను గృహాంతరాళముల యుండే సమయము వ్యతీతము సేయునట్లు లాక్షంబడిక జేసియుం డిరి. అందుల కియ్యకొనని వారల నిర్బంధింపుచు, రాజశాసన తిరస్కారోపణము వారిపై మోపి వారినత్యంత భయభ్రాంతు

ల గావించి నిజాజ్ఞాపరిపాలనాసంసిద్ధులుగ జేయుచుండెను. ఆ దిన మాశుద్ధోధనభూపాలశాసిత నగరరాజ మొక భూతల స్వర్గ సదృశంబుగ నుద్భాసితమగుచుండెను. తత్సమయమం దలి కపిలవస్తు నగరస్థిత సౌధావలీపారిశ్రస్త్యమును, ఆబాల వృద్ధవనితాహర్షపారావా రోత్తుంగతరంగమాలికా బాహు ళ్యమును, నగరనిరాజిత సమస్తవస్తుసందోహ శౌందర్యాతిశ యంబును, నేత్రహృదయానంద పరివర్ధకామూల్య పదార్థసంచ య సందర్శనాజన్య మహదానందాతిరేకమును జిత్తరువుపగిది జి త్రింప గవికులకమలదివాకరుండగు కాళిదాస కవిశేఖరుని దివ్యతేజశ్శక్తి యుక్తంబగు లేఖినిచే యర్హంబగును గాని, మమాదృశ కవికింకరకరవిరాజిత నీరసలేఖని విశేపప్రయోజ నీయము కాజాలదు. శ్రీ సిద్ధార్థాగమనంబునకు బూర్వము కపి లవస్తునగర మనన్య సామాన్య సౌందర్య చ్ఛటావిలసిత సర్వో త్కృష్ట పదార్థసంశోభితంబయి, స్వర్గసాకేతంబులను దివ్యనగర ముల ధిక్కారయుతదృష్టుల వీక్షించియుండెనన్న నతిశయో క్తికానేరదు.

సరిగా నాసమయముననే సిద్ధార్థకుమారుడు రథారూఢు డయి సవిలాసముగ నగరవీథుల సంచరింపనేతెంచెను. సర్వ సద్గుణసంపన్నుడగు నృపాత్మజునిరాకకు బౌరతతి యమితానం దమునంది యతనికి దీర్ఘాయువును సమస్తవిధైశ్వర్యారోగ్య ముల నొడగూర్పుగాతమ్మని సర్వేశ్వరుని బరిశుద్ధాంతః

కరణములతో బ్రార్థింపసాగిరి భక్తి గద్గదకంఠములతో జయజయధ్వానపరంపరల గావింపుచు దన్ను దర్శింప సత్యౌత్సుక్యమును గల్గి చెంతకరుదెంచిన యువతీయువకులను, వృద్ధావృద్ధులను సంతోషాయత్తచిత్తులరయి యుండుట సిద్ధార్థుడు పలకించెను. సమస్తపురజనులు జననమాదిగ దారిద్ర్యదుఃఖముల నెఱుంగనివారిచందమున నాడు నూతనాలంకార వసన సుసజ్జితులయి, మందహాసవదనములతోడ గృహంబులనుండి లెక్కకుమిక్కిలిగ నక్కజమొదవురీతి వచ్చుచుండుట యక్కుమారుడటగాంచెను. సిద్ధార్థుని కప్పటి దృశ్యము యొక్క పరిస్థితులవలన నాపురంబు సమస్తసంపదలకును, నిస్తులానందమునకును గాపురంబాయె ననుభ్రమ యొదవెను. భగవత్సృష్టియందు దుఃఖోత్పత్తియేలేదని యత డప్పటి నగరస్థితిగతుల నవలోకించి తర్కవితర్కములచే మనమున నిశ్చయించుకొనియెను. ఆధ్యాత్మిక సిద్ధాంతవాదుల వాదము లత్తటి నతనికి నిర్హేతుకంబులుగను నశాస్త్రీయములుగను, నిరుపయోగంబులుగను బ్రతీతముకాదొడంగెను. కాని సత్యమెంత కాలము రహస్యస్థానమున నుండగలదు? నవనీలనీరదమాలికాచ్ఛాదితంబగు దివాకరబింబము పునర్దర్శనము నొసంగకుండునా? కల్పితవర్ణరంజితంబగు నాభూషణము సువర్ణమునకు దులదూగునా? విజ్ఞానమయ నేత్రములకు సత్యాసత్యములు యథార్థ స్వరూపంబుల గాన్పించుచున్న గురుజనముఖోద్గత నిర్వచనం

బు వృథయగునా? కాదు. తాత్కాలిక దృశ్యసందర్శనా ప్రభా వంబున సంసారులు ప్రాయికంబుగానుడువు 'సంసారీ సుఖీ' 'సన్యాసీ దుఃఖీ' యను స్థూలసిద్ధాంతములే సిద్ధార్థునకు బునీత ములనియు, శ్రుతి స్మృతీతిహాస పురాణాది ప్రమాణగ్రంథ కథితవాక్యంబులకన్న నెక్కుడు మహత్వముగలవనియు దోప సాగెను. తత్సమయమం దతనికి సంసారుల నిరాధారములగు ప్రమాణములే విశ్వసనీయములుగా స్ఫురించెను. తత్సమయ కపిలవస్తునగర ప్రజానందమును, నగరభూరివైభవంబును గాం చి, సిద్ధార్థుడు వివేకసంపన్నుండగు ప్రతిమానవునకు సంసార ధర్మ స్వీకారమునందే వాస్తవికానందప్రాప్తి యొదవుననియు నక్కార్యమే సర్వోచ్చతమ సుఖప్రదంబనియు, నదియే ముక్తి భుక్తులకు, మూలంబనియు స్పష్టముగ భావించునంతటి జ్ఞాన దూరుండయ్యెను. ప్రకృతికాంధకార మతిని దివ్యదృష్టిని బం ధించివైచెను. భూపాలునిశాసన నిర్మితంబగు కృత్రిమానంద భవననిర్మాణమును సందర్శించుటంజేసి సిద్ధార్థు డొకింతకాలప ర్యంతము స్తంభీభూతుండయ్యెను. అతని కపుడు పరమార్థ తత్వ ప్రబోధం బవాఙ్మానసగోచరంబగుడు, మిథ్యాభిభూ తంబనియు, ప్రత్యక్షముగ జర్మచక్షురింద్రియములకు గోచ రించు స్వార్థభూయిష్ఠంబగు భౌతికప్రపంచ సంపద్విశేషమే మానవప్రపంచమున కాధారభూతంబనియు, సంతత సత్సుఖ సంధాయకంబనియు గోచరమయ్యెను. సిద్ధార్థకుమారుని దీర్ఘ

కాలలబ్ధముఖ చంద్రబింబసందర్శనముచే శుక్లపక్ష సుధాకరా వలోకనంబున నుప్పొంగి పొరలు సాగరమువాడ్కి ప్రజాసాగరము హర్షమును బట్టజాలక యుండెను. వారిహృదయములు ప్రమోదరసపరిప్లుతములయి పొంగి పొరలుచుండెను. ప్రజా సముదాయము వర్షింపజేయు సుమనవృష్టిచే సిద్ధార్థుని రథమ శ్వసమేతముగ సంభరితమయిపోయెను. జయజయధ్వనులవలనను, హర్షనాదములచేతను, భూమ్యంతరిక్షములు ప్రతిధ్వనితములగుచుండు, దిక్కులు పిక్కటిల్లజొచ్చెను. ప్రజాసంరంభ కోలాహలధ్వానము సాగరఘోషను గేలిసేయు నట్టులుండెను.

వీథులయందుజరుగు నామహోత్సవమును, బ్రజా సమూహమును వీక్షింప జర్జరపర్ణకుటీరమునుండి నిరుపేదయగు నొక వృద్ధభిక్షుకుడు తృణశయ్యనుండి దిగ్గునలేచి, ద్వారము చెంతకేతెంచి, మహాతురముతో నా యుత్సవమును నవలోకింప నారంభించెను. అతడు కించిత్కాలంబుదనుక సమస్తజ్ఞాన కర్మేంద్రియముల కార్యమును నేత్రియుగ్మాధీనముజేసి నిశ్చేష్టుడయి, శిలానిర్మితప్రతిమవలె నిలువబడియుండెను. వైభము నెప్పుడు ననుభవించియెఱుంగని యాతని కా దివసముగాన వచ్చిన విభవత్సమృద్ధినిగాంచే నత్యాశ్చర్యమొదవెను. వాడత్యంతవార్ధక్యావస్థయందుండుటవలనను, జరాభారంబున గల్గు శక్తి రాహిత్యజనిత బాధచలనను నిలువశక్తిలేక ధనురాకారమును బోలియున్న కటిసీమనుద్వారబంధమున కానిచి మూల్గుచు

నే తృష్ణావశుడయి, యుత్సవమును దిలకింపజొచ్చెను. జీవి తాంతిమావస్థయందు వైభవోపేతంబులగు భూపాలోత్స వములుగాంచ మది నిచ్చ్రెజనించుటచే నిలువ నోపికలేకపోయి నను నోరిమితో నటనే దీర్ఘకాలపర్యంతము నిలువబడియుం డెను. వాని దేహచర్మ మెముకలనంటియుండెను. వాని కాయమునందు మాంసకండరములే గానరాకుండెను. రుధిర మొక్క బిందుపయిన నున్నటులే గోచరింపకుండెను. శరాసన ముచందమున నతని కటిప్రదేశము వంగిపోయియుండెను. తేజో రహితంబగు నతని వదనబింబవిరాజితచక్షుద్వయము వికాసవిహీ నమయి సమ్ముఖస్థిత వ్యక్తినయిన గురుతింపశక్తిలేనంతటి దుస్థి తియందుండి గుంటలువడియుండెను. దంతశ్రేణి యదృశ్య మయిపోయియున్నకతన నా దరిద్రవృద్ధవ్యక్తి యుచ్చరించు పదముల స్పష్టములయి యర్థశూన్యంబులగు పదములవలె నిరుపయుక్తము లగుచుండెను. శక్తివిరహితుని క్షయవ్యాధి బాధింపుచుండుట స్వాభావికంబేకదా! క్షయోత్పత్తి శక్తి రాహిత్యమునుండియు, దూషితరక్తమునుండియు గల్గుచుండు ననియు నారోగ్యశాస్త్రవిదులు వాకొనుచుందురు. ఆముసలి యతడు పదేపదే పొడిదగ్గుచే బహుయాతన నందుచు ద్వార మువద్ద నిలబడి ప్రజాసమూహము తన్ను సమీపించిన నవ్వాడి నాలకించి డగ్గుత్తికతో నిట్లు వేడనారంభించెను "ఓసదయహృద యులారా! క్షుద్బాధచే మ్రగ్గుచున్న యీ దీనుని సంరక్షింపుడి.

క్షుధార్తుని రక్షించుటయే ధనాఢ్యుల ధర్మంబుగదా? వృద్ధాప్యమునందు మృత్యుముఖంబున బడనున్న యీదరిద్రునకు భిక్ష యొసగి కాపాడుడి. ఆహారములేక, కడుపుమంటచే నీ యా కుటీరమునబడి, రేబవలు సుగ్రుక్కుచున్నాడను కుక్షింభరగణమున కొక్కనాణెము నొసంగి పుణ్యమునుగట్టుకొనుడు; లేనిచో రేపో మాపో, యుసురుల నన్యాయముగా బాసెదను. విగత జీవుడగుట కుద్యుక్తుడనయి యున్ననన్ను రక్షింపబూనినపుడే మీవైభవములు సార్థకంబులగును. పుణ్యాత్ములారా! మాటలు తడబడుచున్నయవి, శరీరము కంపించుచున్నయది, తల తిరిగిపోవుచున్నది. రక్షింపుడు రక్షింపుడు." రాజకుమారు డల్లదిగో రథారోహియయి యేతెంచుచున్నాడు, నీవి త్తతి నిజదరిద్రముఖమునుజూపి, వారియాత్మకు విషాదము నొదవ జేయకుమా! శీఘ్రమే కుటీరమున జొరబడుమని రాజభటుల ధికార యుక్తకర్కశస్వరమున నావృద్ధభిక్షుకుని, మరణాసన్నుండగు నా వృద్ధుని, దైన్యావతారమూర్తియగు నా వృద్ధిని, కరుణాజనక స్వరూపధారియగు నావృద్ధుని, మెడపై జెయివైచి, బలాత్కారముగ గెంటుచుండుట సిద్ధార్థునిదృష్టియందు బడియెను.

వివేచనాజ్ఞానపరుండును, సహజకారుణిక స్వభావుండును నగు నా రాకుమారుడక్రమంబును, అమానుషంబును నగు రాక్షసకృత్యమును దూరమునుండియే గాంచి "ఆ నిరుపేద సేవ

రును ముట్టరాదు. అతని నటనే స్వేచ్ఛగానిలుపనిండు, నా యా
జ్ఞగా నతని నెవడును స్పృశింపజనదు." అని గట్టిగశాసించెను.
శుష్కకాష్ఠతుల్యమయి చూడనేవగొల్పు బీదవాని పాంచభౌ
తికకాయమును దర్శించినంతనే సహజమార్దవ దయార్ద్రీ భూ
తుండగు సిద్ధార్థునిపై వజ్రాఘాతమున శనిపాతము నొక్క
సారిపడినట్టులయ్యెను. అతడు విగతధైర్యుడయి, అపహృతా
నంద సర్వస్వుడయి దుఃఖాశ్రుల నేత్రకమలములనుండి జల
జలరాల్చుచు, సారథియగు ఛన్ను నిట్లు ప్రశ్నించెను:—
"ఛన్నా! ఆ జర్జరపర్ణకుటీర ద్వారమున నిలబడియున్న
మూర్తికాయ మట్లున్న దేమి? ఆ వికృతాకారము నవలో
కింప నా హృదయానందమంతయు నంతరించిపోవుచున్న యది.
ఆ మూర్తి మానవాకృతియా? లేక వికృతరూపంబును దా
ల్చిన మరియొక ప్రాణియా? అయ్యో! ఈవల కెన్నడు
నిట్టి భయంకరాకృతిని నేను గాంచియుండలేదు. నేడే
నేనీ విషాద చిహ్నయుక్తంబును, నసహ్యాకరంబును నగు
సజీవాకృతిని గాంచినాడను. రేపో మాపో మరణింతునని
యామూర్తి నుడువు పదములకు సముచితార్థ మెయ్యది?
నాకీ విచిత్ర భీభత్సదృశ్య మత్యంత భయంకరముగ నున్నది.
ప్రియసారథీ! శీఘ్ర మీ ఖేదయుక్తంబగు దృశ్యము యొక్క
మర్మమును విదితపఱచి, మదీయాందోళిత హృదయావేగ
మును దూరీకృతముగావింపుము."

మాయామోహ విరహాజ్ఞానశూన్యుండును శాదివ్య సుందర విగ్రహుండును నగు సిద్ధార్థు నవలోకించి, ఛన్నుం డంజలిఘటియించి వినమ్ర మృదుమధురస్వరమున నిట్లు ప్రత్యుత్తర మొసగెను. "ఓ భూపాలతిలకనందన శ్రేష్ఠా! మనము గాంచు నీ వికృతరూప మొక వృద్ధుండగు దరిద్రమానవునిది. ఎనుబదివత్సరములకు దొల్లి యీవృద్ధుడు మనవలెనే దృఢకాయుడయి, సర్వాంగసౌష్ఠవమును, అవయవ పరిపూర్ణత్వమును అసమాన బలవిశేషమును గల్గియుండి, సమస్తవిధ మానవోచిత సౌఖ్యరసాస్వాదనము ననుభవించుచు, కటిప్రదేశమునెంతమాత్రము వంచక, దృష్టిదౌర్బల్య మను శబ్దమునే యెఱుంగక, రక్తమాంస బాహుళ్యపూరితశరీరుండయి యొప్పియుండెడిని. ప్రకృత మా ప్రారంభావస్థ నతిక్రమించుటంజేసి యనగా జీవితకాలపరిమితి దాటిపోవుటవలన తైలశూన్యంబగు దీపకళికంబోలి జీవితనాటకము నీ సృష్టినుండి ముగింప సంసిద్ధుడయియున్నాడు. వసంతర్తువునందు సహితము గిసలయంబుల బొసగని పత్రపుష్పశూన్యంబగు జర్జరిత శుష్కనిస్సారవృక్షంబు మాడ్కి వీని జీవితనౌక కాలసాగరగర్భంబున జొర సంసిద్ధమయి యున్నది. శుష్కభూరుహ మేరీతి సాధారణప్రభంజన ప్రహారంబున నేలగూలునో యదియేచందంబున విగతబలుడయి యున్న మీాబీదవానిజీవిత మల్పకష్టమునయిన సహింపజాలకభూతల పతితంబగుట ధ్రువము. ప్రపంచాకాశంబున దీర్ఘకాలంబు

దనుక సుప్రకాశితమై యొప్పియున్న వీని జీవిత సుధాకరబింబ మింక శీఘ్రకాలమునందే కాలనీరదమాలికాగ్రసితము కాను న్నది. ఇద్దానినే, యీ వికృతరూపధారణావస్థనే వార్ధక్యమని ప్రాజ్ఞప్రపంచము వాకొనుచున్నయది. తమ రిద్దానికయి వగ చు టనుచితము. స్వభావసిద్ధములగువానికయి మానవుడు పరి తపింపజనదు. ఇదియే ప్రకృతియందలి విచిత్ర గుణవైలక్షణ్య మే కాని వేరొండుగాదు. పంచభూతముల స్వభావమును గూర్చి వగచుట వివేకసంపన్నుని లక్షణముకాదు. మీ రెన్నడు వృద్ధుల బరికించియుండకపోవచ్చును. ఆనందభవనమున నివసిం పుచు సాంసారిక సౌఖ్యవారధిం దేలియాడు యుష్మదాదృశ రాకుమారుల కిట్టివారితో నేమిపని ?"

సిద్ధార్థు డా నిగూఢంబులును, విపరీతంబులును నగు వచనముల నాలకించి, యవి నిజహృత్కమలమునకు ములుకు లయినాట, పునః సారథి నిట్లాత్రముతో బ్రశ్నించెను: "ఛన్నా ఇట్టి విషమస్థితి సర్వజన సాధారణమయినదా లేక కొందఱికే బ్రాప్తించునదియా? ఒకవేళ సమస్త పృథ్వీతలనరులకు దఱచు లభించుచుండదుగదా? వేగ మిద్దాని కుచితప్రత్యుత్తమొసంగి మచ్చిత్తతాపోపశాంతిని గలుగజేయుము. శాంతోపలబ్ధి లేకపోమి మద్హృదయ మపారదుఃఖప్రపూరిత మగుచున్నది" సార ధియా నిష్కాపట్యభావసమన్వితప్రశ్నంబున కిట్లుత్తర మొసం గెను :—"పరమాత్మస్వరూపియగు నో యవతారపుణ్యపురు

ఘాగ్రేసరా! ఈ బీదవానికి సంప్రాప్తమయిన ప్రాయంబుద
నుక జీవించు ప్రతివ్యక్తికి నట్టిగతియే సంభవింపుచుండుట ప్ర
కృతియందలి నైజగుణము. సమస్తమానవులు స్వకీయజీవిత
కాలాతిక్రమణానంతరంబున నిట్టి విషమావస్థకే చెందెదరు.
ఏతద్వాక్యమస్మదీయంబుగాదు. స్వభావసిద్ధోక్తి.'' సిద్ధార్థుడా
మాటలనాలకించి భయప్రకంపితస్వరంబున నిట్లు పృచ్ఛించెను:
"ప్రియసహోదరా! ఛన్నా! ఈ వికృతరూపధారి యగు దుర్బ
లవ్యక్తి జీవించినంతకాలపర్యంతము సజీవుడయి యుండు ప్రతి
వ్యక్తియు నిట్టులే వికారస్వరూపమును దాల్చునాయేమి? నేను
కూడా నిట్టి నీచస్థితికే పాల్పడుదునా? నా ప్రాణప్రియ యగు
యశోధరాదేవిసహిత మిట్టి దుర్గతినే చెందునా?-నీకును నిట్టిగతి
యే సంభవించునా?'' ఛన్నుడాయాశ్చర్యజనకప్రశ్నమాలి
క నాకర్ణించి, నిర్విణ్ణుడయి, సిద్ధార్థునితో నిట్లు వక్కాణింప
దొడంగెను:—"ఓమహాత్మా! దివ్యపురుషపుంగవా! మీరు
నిష్కపటులు. బాల్యకాలమాదిగ వివాహకాలము పర్యంతము
సాధారణవిపత్సంకటములను, ప్రాణికోటిపరస్పరము స్వార్థసి
ద్ధికయి కావించు హింసాత్మక కార్యకలాపమును గాంచి,
ఖిన్నులయి విరక్తిభావాంబుధి మునుగుచుండువారు. అట్టిమీరు
కోమలహృదయులగుకతన వివాహమైనంతనే యశోధరాదేవి
మనోజ్ఞమూర్తికి ముగ్ధులరయి, అశాశ్వతంబగు సృష్టినిగూర్చి
విచారింపజాలకపోయితిరి. సమస్తజనులును, మనమందఱమును
నిట్లే. యగుట నిక్కువము, ఇది శిలాక్షరము."

ఛన్నునితుట్టతుదవాక్కు నాకర్ణించి రాకుమారుడు దిగ్భ్రమజెంది, ఖిన్నమనస్కుడయి తేరును గృహాభిముఖంబుగా నడుప నాజ్ఞాపించెను. ఛన్ను డరదమును స్వనికేతనమునకు మరలింపుచుండ, సిద్ధార్థుడు చింతాక్రాంతస్వాంతుడయి యిట్లు చెప్ప మొదలిడియెను :—"నేను స్వప్నావస్థయందగుఐన భావింపని భయంకరవిషయముల నేడు గాంచవలసివచ్చినది. జగన్నాశ్రయ నెఱుంగ నెవ్వారికి శక్యమోగదా! ఈజగత్తునందలి సౌఖ్యంబులన్నియు శాశ్వతములుకావు; క్షణభంగురములు. నా బాల్యకాలమునందే నా కీజగముపైన విశ్వాసము జనించెను. కాని వివాహమాడినదాదిగ నశ్వరసౌఖ్యముల బడయుచు నిస్సారమునే సారమయమని భ్రమించితిని. నిత్యము పరివర్తనము జెందుచుండ యేపదార్థమును సారవంతమయినదికాదు. ఈ సృష్టియను మహాకావ్యమున నిత్యపరివర్తనములే పారటలు. సోదరా! చెచ్చెర రథమును మందిరమునకుమరలింపుము. వేగిరింపుము. కాలవిలంబనము సేయుకొలది మనస్తాపము వృద్ధియగుచున్నయది. నేటినగరదృశ్యసందర్శనపరిణామమునా మనస్తుష్టినిబూర్ణముగ నశింపజేసినది." రాజసూనునిత త్తరపాటును, మనోవ్యాకులమును గాంచి, ఛన్నుడు తామసించిన సమస్య విషమించునని యు నద్దానిచే భూపాలునిహృదయమున కవశ్యము విషాదమొదవుననియు. గ్రహించి, యశ్వముల రాజప్రాసాదాభిముఖముగా వాయువేగ మనోవేగంబుల బర్వెత్తించెను. స్వకీయసౌధ:

మును జేరినదాదిగా సిద్ధార్థుఁడహోరాత్రములు మానవజీవితమునుగూర్చియు, మరణమునుగూర్చియు, దీర్ఘముగ విచారింపుచు, నన్నపానీయముల స్పృశింపక, సకాలమున నిత్యకృత్యముల నిర్వర్తించుకొనక, రాజానుమతమునయిన యథోచితంబుగ గుడువనొల్లక, చింతాక్రాంతస్వాంతుఁడయి నిజామూల్యసమయమును వెచ్చింపదొడంగెను. పదేపదే సిద్ధార్థుఁడు సంసారము యొక్క నశ్వరత్వమును, అశాశ్వతత్వమును మది దలపోయుచుండెను. నిరంతర హృదయాంతర తర్కవితర్కంబుల నీ విశాలమయంబగు జగము నిస్సారమని నిశ్చయమగుడు, నిరాశ హెచ్చుజొచ్చెను. అతని చింతాగ్ని దినదినము గావించు విచారమువలన నభివృద్ధి కాదొడంగెను. నిరంతరము నస్థిరత్వంబను పదమునే సంస్మరింపుచు, వార్ధక్యమును, వికటవికృతరూపోత్పాదకంబగు నా వృద్ధాప్యమును, సౌఖ్యభంజకంబగు నా జరాభారమును నష్టభ్రష్టముగావించుట యెటులా యని సిద్ధార్థుఁడాలోచించుటయందే దివారాత్రములు లగ్నమనస్కుఁడయియుండెను. సిద్ధార్థున కీవిధముగ దలపోసినకొలఁది జిత్తచాంచల్యము, మనస్తాపము మెండగుటకు మొదలిడియెను. ఇది యేరీతి నిరంతరము సృష్టియందలి సమస్త పదార్థముల గాంచుచు వాని వేర్వేరు తత్వముల గ్రహింపుచు వాని సృష్టిస్థితిలయములకు హేతువు నన్వేషింపుచుండెను. అనుదినము విరక్తభావము లీ యతని యంతఃకరణమున నధికారమును బడయజొచ్చె

ను. విరక్తభావభటప్రాబల్యమునుగాంచి యనురక్తభావ యోధబృందము భీతావహమయి, చిత్తసమరక్షేత్రమును బరిత్యజించి క్రమక్రమముగా బారజొచ్చెను.

## వై రా గ్యో ద య ము.

ధర్మశూన్యమయి, భక్తిరహితమయి, దుష్టాచారపరిపూర్ణమయి, నిర్జీవమయియున్న సమగ్రమానవ జాత్యభ్యుదయమునకయి భువి నవతరించిన పుణ్యపురుషుని దా నవలంబింపనున్న మహత్కల్యాణకరంబగు వ్రతానుష్ఠానంబునుండి విముఖుని గావించి, దుష్కామపరతంత్రుని క్షణికంబులగు ప్రాపంచిక భోగవిలాసములు నేయుననన్న స్వప్నవార్త. అట్టి మహాపురుషుడు, ధర్మావతారమూర్తి, జ్ఞానభ్రష్టమయియున్న మానవసమాజక్షేత్రమున సత్యధర్మబీజముల నాట నవతరించియుండ నయథార్థంబును, మృగతృష్ణాసమానంబును నగు బాహ్యసంసారమునకు బద్ధుడయియుండునా? అట్టిపురుషుడు మానవసంఘమున విహరింపుచున్నను నిస్సంగుడయి స్వకీయాదర్శ ధర్మతంత్రజ్ఞత నెల్లవారికి హృదయగోచరము గావించుటకే యత్నింపుచుండును. భాగవతశ్రేష్ఠుండగు శుకమహర్షి ఆధ్యాత్మిక సామ్రాజ్యవిహారియయి, యాత్మానందముచే దాదాత్మ్యమునందజనసమందియుండ జనకుని కఠినతమంబగు పరీక్ష కాని, దుష్టప్రపంచకామిక పదార్థములు గాని యమ్మహాత్ముని నిజపావనకార్యమునుండి నిరోధింపగల్గినవా? శుద్ధోధనభూపాలునికి ప్రియా-

త్మజుండయి జననమంది, సిద్ధార్థుడు స్వార్థమయంబగు నశ్వరా
నంద సాగరమున దేలియాడుచునేయుండి జీవిత కాలమును వ్య
తీతము సేయుచో, బుద్ధుడను మహాపురుషుని సత్యధర్మస్వరూప
మెట్లు మానవకోటికి సాక్షాత్కారమయ్యెడిది? సర్వేశ్వరసంకల్ప
మెట్లు సిద్ధింపగల్గెడిది? అధర్మము ప్రబలి, శిష్టత్వమును రూపు
మాపి, దుష్టత్వము నభివృద్ధిజేసినపుడు కదా ధర్మసంస్థాపనా
ర్థమవనిపై సర్వజ్ఞుండగు దయామయుం డవతరింపుచుండునని
యోగిప్రవరుండగు శ్రీకృష్ణభగవానుడు గీతయందుపదేశించినది.
మనరాకుమారుండగు సిద్ధార్థుడు జననమరణ నిగూఢరహస్యము
నుగ్రహించి నిర్మలానందకందమగు నిర్వాణపథము నన్వేషింప
బుద్ధుని బడయ విశ్వప్రయత్నముల జేయ నుంకింపుచుండ బ్రా
పంచికుండగు శుద్ధోధనుని మనోభీష్టములు సఫలీభూతంబు
లగునా?

అంతఃపురము యొక్క నానావిధంబులగు రాజకీయ
భోగవిలాసములయం దధివసించి యుండుచున్నను బాల్యము
కంబుగా సిద్ధార్థుని హృదయము కారుణికభావసముదాయ
ముచే నిండిపోవుచునే యుండెను. అప్రయత్నముగనే రాకు
మారునిహృదయమున సహజంబగు కరుణారసము పొంగి పొ
రలుచుండెను. వృద్ధాప్యము, వ్యాధి, మృత్యువు మొదలగు
భయంకర పిశాచములు సమస్తప్రాణికోటి నాకర్షించు
కొని యవ్వాని జీవితముల భయవిషాదమయంబులు గావిం

చెననియు, నాభయంకరపిశాచహ_స్తములనుండి జీవకోటి ము_క్తి నెట్లు బడయనేర్చునా యని నిత్య మతడు విచారిం పుచుండెను జీవితాస్థిరత్వముగూర్చి విచారింపమొదలిడినం తనే విద్యుద్వేగంబున నతనిచి_త్తమును దుఃఖమాక్రమిం చివేయుచుండెను. జీవితముయొక్క సర్వోచ్ఛంబగులక్ష్య మతని సమీపంబున నతిసూక్ష్మరూపంబున మనోజ్ఞమయి వెలుంగుచుండెను. విచారమయంబగునట్టి యవస్థయం దెంత మాత్రమును భోగవిలాసము లతనిహృదయమును శాం తముగావింప జాలకపోయెను. అగాధమగు దుఃఖభారముచే నతని జీవననౌక వైరాగ్యసాగరంబున మునుగుసూచన లప్పుడ ప్పుడు దృష్టిగోచరంబగుట కారంభించెను. ఒకానొకదివసమున స్వప్నావస్థయందతనికిట్లు వినవచ్చెను :-"ఓసిద్ధార్థ రాకుమారా! నీవి_త్తటి జీవప్రపంచ దుఃఖమూలోచ్ఛేదనము గావించి, సౌ ఖ్యప్రప_త్తి నార్జింపుము. దుఃఖతచిత్తులగు నీసోదరమానవుల ను, సమ_స్త ప్రాణులను సుస్థిరానందానుభవమున కర్హులుగా జేయుటయే నీవిహితధర్మము అనుదినము భూతలంబున జ్ఞాన ము నశియింప నస్థిరంబులగు భోగవిలాసములకు మూలమయి న నజ్ఞానమభివృద్ధియయి వేరుబారి మహావృక్షమగుచున్నయది. ఈయజ్ఞానమహావృక్షము ఫలించు విషమయఫలంబుల నారగించి ప్రాణికోటి మృత్యువాతంబడి, దుఃఖించును. మత్యువాతంబడి యాప్రాణికోటి స్వేచ్ఛానందములు లేక నరకయాతనల నను

భవించి పునర్జననమరణచక్రమున జిక్కి నుగ్గుచుండును. జ్ఞానప్రాప్తిచే మానవులు సమస్తజీవహిత పరతంత్రులయి తమజీవితముల వ్యతీతము జేయుచు, వార్ధక్యమునందు సహిత మత్యంతానందపరీత హృదయారవిందులయి జననమరణములకు వశవర్తులుగాక, నిర్వాణమును బడయుదురు. శాశ్వతసౌఖ్య సౌభాగ్యమునంది సోదరమానవుల సహితము సందజేసి యుత్త మమానవుడవయి మనుము లెమ్ము! మేల్కాంచుము. అప్ర మత్తుడవయి యుండుము.” సిద్ధార్థు డాప్రచ్ఛన్నదివ్యపురుషావ తంసుని భవ్యవాక్ప్రవణంబున మనమునందమితాహ్లాదముబడసి తా నంతకుపూర్వమునుండియు నపారముగా విచారించుచు వచ్చినవిషమసమస్యాజనిత విషాదమును బాసెను. కొన్ని దినము లిట్లానందపథాన్వేషణానుకూలతత్వ మీమాంసయందే సిద్ధా ర్థుడు కాలముగడపెను.

కొంతకాల మీరీతి గతించినంతనే రాకుమారునకు జ్ఞా నానుభవంబుల బడయ సంసారముయొక్కపరిస్థితుల బూర్ణ ముగా బరికింపవలయునని యెడి వాంఛజనింప శుద్ధోధనావనీ శునిసన్నిధి కరిగి యిట్లు నివేదించుకొనియెను. పూజనీయుండ వగుజనకా! గతసమయమున మీరు నగరమునంతయును కృత్రి మవేషములచే నలంకరింపజేసియు సమస్తప్రదేశముల బరిశు ద్ధమొనరించియు నికృష్టపదార్థతతి నెల్ల దొలగద్రోసియు దుః ఖరోగపీడితుల దృష్టిదూరుల గావించియు సంసారముయొక్క

దుఃఖమయంబులగు యథార్థపరిస్థితుల గప్పిపుచ్చి నాహృదయ
మున కాహ్లాదమునొదవజేయ భృత్యవర్గసమేతముగా నమితకృ
షి గావించియున్నారు. భవత్కల్పితశాసనాప్రభావంబున దుఃఖ
మయంబగు నగర మొకింతకాలపర్యంతము సుఖమయంబుగా
బ్రతీతమయియున్నను దదనంతరంబయిన సృష్టియొక్క వాస్త
వికస్వరూపము జిజ్ఞాసువునగు నాకు గోచరింపకపోలేదు. నాడు
సంయోగవశంబున దృష్టిపథమునబడిన యొకానొక దరిద్ర
వృద్ధవ్యక్తియొక్క దుస్థితినంతయు గాంచియున్నాడను. తత్స
మయంబున నే గాంచిన పరిస్థితు లనారతము భూమండలమున
జనసామాన్యమును జుట్టుముట్టియుండు పరిస్థితు లెంతమాత్ర
మును గావనినాడే నాకు విస్పష్టమయ్యెను. తాత్కాలికముగా
మద్హృదయాహ్లాదమునిమిత్తము మీరు పన్నిన పన్నుగడలన్ని
యు గోచరించెడిని.. యథార్థ మయార్థమగునా? విజ్ఞానమయ
దృష్టియం దట్లుగానరాదు. పూజాస్పదుండగు నోపితృదేవా!
నాకోరుకోర్కె నీడేర్చుము, శీఘ్రమనుమతిని బ్రసాదింపుము.
నేడు నేనే స్వయముగా నగరమందలి యెల్లవీధులకరిగి పురజనుల
వాస్తవికంబగు వాతావరణము నరసివత్తు." అంత భూపతి ప్రి
యనందనుని వచనములనాలకించి, చిత్తమునం దీభాతి వితర్కిం
చుకొనదొడంగెను :— సహజముగ జ్ఞానము నార్జింపనెంచు
నీకుమారుడు జనసామాన్యమును వాస్తవికంబగు సర్వసాధా
రణస్థితి యందుండుట గాంచునేని, మహావిషాదాక్రాంత

స్వాంతుడగుట వాస్తవము. ధీరోదాత్తంబగు వీనిమనోభీష్టము దృఢీకరింతుమన్న బ్రయోజనము కానరాదు. ఈశ్వర సంకల్పమొక్కటియయియుండ గించిజ్ఞుండనగు నే నద్దానికి భిన్నముగా నెట్లు వర్తింప శక్తుండనగుదును. దయామయుండగు నాసర్వేశ్వరుని యవ్యాజకృపాకటాక్ష వీక్షణమే నాపై బ్రసరించియుండుచో సంసారము యొక్క స్వభావసిద్ధంబగు స్థితిని సందర్శించి, సహజములగు విషయములకయి వాపోవుట యనర్థకంబని గుర్తెఱింగి, హృదయమున వ్యాప్తమయియున్న దుఃఖాతిరేకమును బరిత్యజించుటకూడ సంభవింపవచ్చును.”

కాన సిద్ధార్థున కనుమతినొసంగుటయే యుక్తమని భావించి, కుమారుని పురసంచారమునకు సమ్మతినొసంగెను. రాజానుమతినందిన ద్వితీయవాసరంబుననే రాజనందనుండగు సిద్ధార్థుడు పూర్వముభాతి రథారూఢుడయి బయలుదేరుటకు మారుగ, ఛన్నునితోఁగూడి సాధారణవేషధారుడయి పురవీథుల సంచరింప నరిగెను.

సిద్ధార్థుడొక్క వణిక్కువలెను, ఛన్నుడతని లేఖకునివలెను వేషముల, రహస్యసంచారంబునకయి వాస్తవిక పరిస్థితుల గుర్తెఱుంగ, ధరించియుండిరి. వారిరువురట్లు ప్రచ్ఛన్నవేషధారులయి, పురవీథుల సంచారముసలుపుచు శాక్యజాతీయులతో లోకాభిరామాయణమును గూర్చి ముచ్చటించుచు సాంసారికస్థితిగతుల గడు సూక్ష్మదృష్టితో నరయుచు నేగుచుండిరి.

సిద్ధార్థు డాశాక్యులతో గావించు వార్తాలాపముల ననుస
రించి ప్రతివిషయమునుగూర్చియు సత్య మనుగ్రహింప హృ
దయమునందు తర్కవితర్కముల గావింపుచు నేయుండెను.
కొంతసేపట్లు సంచరింపుచు నిరువురును బత్తనమునకు బ్రధానం
బగు వీధి కేతెంచిరి. ఆకాలమున గ్రామములయందు బ్రాచీ
నార్యాదర్శసిద్ధాంతములు విశేషించి ప్రబలియుండ బత్తన
ములయం దటనట సధర్మాన్యాయములు గానవచ్చుచునే యుం
డెను. అవియును బ్రత్యక్షముగా గాక నప్రత్యక్షముగనే యని
సెప్ప నొప్పును. ఆవీధియందు ధాన్యరాసులబోసికొని, కాళ్లు
జాచుకొని కూర్చుండియున్న బేరగాండ్రును, ధాన్యాదుల
గ్రయమునకు గ్రహింప నరుదెంచిన జనసముదాయంబును,
వివిధపదార్థముల విక్రయించు వణిక్కులను మనపథికులిరువు
రు నుపలక్షించిరి. పూబోడులు బావులనుండి బిందెలతో నీరు
ను స్వగృహములకు సత్యాతురముతో గొనిపోవుచుండిరి. వారి
సహజసౌందర్యగరిమ కలరి, వీధుల సంచరించు పురుషులంద
ఱును దదేకదృష్టితో వారలమూర్తులపై దమచంచలంబుల
గు దృక్కుల బ్రసరింపజేయుచుండిరి. సహజముగ లజ్జావతులగు
నామదవతులు పురుషులచంచలస్వభావంబుల నవలోకించి సిగ్గు
జెంది, చేయునదిలేక ముఖకమలములబిందెలమాటునడాచి
ద్రుతగమనంబున స్వనికేతనముల కరుగుచుండిరి. విలాసపరులగు
వ్యాపారులును గ్రాహకులును నాతలిరుబోడులు దృష్టిపథము

నుండి దూరమగునంతపర్యంతము శేరములమాటయే విస్మ
రించి యనిమేషనయనులయి యాదివ్యాంగనల ముఖేందుబిం
బోత్పన్నచంద్రికాసందర్శనానందరసమును మనసార గ్రో
లుచుండిరి. మిష్టపదార్థములతో నిండియున్న నంగళ్లలో నీగలు
గుంపులుగుంపులుగా ముసురుకొని బుజ్‌మని రొదసేయు
చుండ నంగడివాండ్రవ్వానిని జేగుడ్డతో విసరి కొట్టుచుండిరి.
భిక్షుకులు బాటసారులకడ్డముగవచ్చి భిక్షను బ్రసాదింప బ్రార్థన
సేయుచుండిరి. జనులు విశేషముగా నేకత్రితంబగు ప్రదేశము
లవికలాంగు లుపవిష్టులయి, సమ్ముఖంబున జీర్ణవసనముల
బఱచుకొని "రామరామా నారాయణా"యని గొంతెత్తి
భిక్షకయి యడలుచుండిరి. యాచకుల యార్తనాదముల నాల
కించియు నాలకింపన ట్లెల్లరు మార్గమును దొలగిపోవుచుండిరి.
దుకాణముల చెంత బారవేయబడియున్న నుచ్ఛిష్టపదార్థముల
బీదబాలు రత్యంతాసక్తితో నారగింపుచుండిరి. పూటకూటిండ్ల
యొద్ద బారవేయబడియున్న నెంగిలివిస్తళ్లయందు శేషించియు
న్నహారమునకయి గ్రామసింహములు పరస్పర ద్వంద్వయుద్ధ
ముల జేయుచుండెను. 'మొద్దేపెద్ద'యన్న లోకోక్తి ననుసరించి
బలముగల శునకములు బలములేనివానిపై బడి యాహారము
నులాగి తినుచుండెను. వీధిబడిపంతులు గృహవేదికలపై బది
మంది శాక్యబాలుర గూర్చుండబెట్టుకొని, నీతిపద్యముల వల్లె
వేయింపుచుండెను. వీధివైపులకున్న వేదికలపై గూర్చుండి బ్రా

హ్మణవిద్యార్థు లనేకులు వేదవేదాంగ శాస్త్రాంతర్గత పుణ్య
శ్లోకముల గంతస్థము సేయుచుండిరి. వీరవేషధారులగు క్షత్రి
యకుమారులుకొందఱు పీతాంబరధారులయి కటిప్రదేశముల
ఖడ్గములు సవిలాసముగ వ్రేలాడుచుండ, నభిమానపూరితము
లగు దృక్కుల నల్దెసల బ్రసారింపజేయుచు, మీసముల వామ
హస్తముల సవరింపుచు నరుగుచుండిరి; బీదసాదలనేకులు నిజ
శీర్షములపైబరువులనెత్తుకొని, వ్యాపారుల దుకాణములచెంత
గఠోరపరిశ్రమ సేయుచుండిరి. వీథికిరుపైపుల వ్యాపించియున్న
యంబర*చుంబిత సౌధోపరిబాహ్యప్రదేశంబుల గూర్చుండి
యటనట నీతిబాహ్యలగు వనితలు తళుకుబెళుకుల గొలుపు
నట్టియు, బంగారుచాయను గేరునట్టియు కాయములజూపి వీ
థులవెంట నరుగు మదమత్తగజ సదృశులగు మూఢయువకుల
మనములకు వలపుగొలుపుచుండిరి. లజ్జామానములు రెండును
లోకమున బుట్టియేయుండలేదో యన్నరీతి నావారకాంతలు
(అనగా నీతిబాహ్యలగు స్త్రీలు) స్త్రీజనసహజమగు వ్రీడాభా
రమును బోనాడి, విలాసయుక్త కామచేష్టల గావింపుచుండిరి.

---

* వాక్యులను శీర్షికతో గ్రంథాదిని వ్రాయబడిన యాదర్శగ్రామం
బులకు విరుద్ధాచారములు నగరముల వ్యాప్తమయియుండెనాయని పాఠకులకు
సందేహముదవును. తత్సమయంబున జనసామాన్యముయొక్క వృత్తులు, ఆ
చారవ్యవహారములు నవియైయుండిన, దుష్టాచారములప్పుడు సహితము మూ
థులలో లేకపోలేదని పాఠకులు గ్రహింతురుగాతమ్మని నావిజ్ఞప్తి.

కార్యభారంబున నరుగుయువకులు వేశ్యకాంతల దివ్యమోహ నవిగ్రహములవీక్షించి ముగ్ధులరయి స్వీయకార్యభారమును విస్మరించి దుకాణములలో నేదియో పదార్థమును గ్రయము సేయు వ్యాజమున నట గొలదిసమయము వేచియుండి, వేశ్యాంగనా సౌందర్య రససాగరావగాహనము గావించి, తని విదీరక వ్యాకులచిత్తులగుచు నటనేకూర్చుండి, దర్శనేంద్రియ ముల నాకులటల కర్పించుచుండిరి. మూఢులగుయువకుల ముగ్ధావస్థను గుర్తెఱింగిన కొలది గణికామణులు నిజసౌంద ర్యచ్ఛటల దర్శింపజేయనెంచి, కుచకుంభములశోభను వెలి బుచ్చు వక్షస్థలములపై నాచ్ఛాదితమయియున్న వసనముల గొంచెము కొంచెముగా దొలగింపుచుండిరి. వేశ్యకాంతలకా మోత్పాదిక నికృష్టశృంగార రససమన్విత విలాసముల నవలో కించి, యువకులు మోహితులయి "కామాతురాణాం నభ యం నలజ్జా" యన్న చందంబున లజ్జాభయంబుల బాసి వారిని గూడి సుఖింపనెంచి, దండపరిహారమును దిన్నశునకము లేరీతి బునర్గ్రహము బ్రవేశింపుచుండునో యదియేమాడ్కి వార కాంతల విలాసభవనంబుల బ్రవేశింపుచుండిరి. తత్సమయంబున సాంసారిక వ్యామోహజనిత దురాచారమునియెడి మ్రిక్క డిరక్కసి యావీధియందే నవతరించి భీభత్సముగా దాండ వమాడుచుండుటను మహాతీక్ష్ణబుద్ధియగు శ్రీసిద్ధార్థకుమారుడు కనులారగాంచెను.

శోకపీడితహృదయుండగు సిద్ధార్థుఁడాప్రదేశమును బాసి కొంతదవ్వేగెను. సకలభూతదయార్ద్రహృదయుండును, నిష్కల్మష విశ్వసౌభ్రాత్రుత్వానురాగియును నగు నాసిద్ధార్థుఁడు పూర్వానందముల మఱచి, తాత్కాలిక విషాదోత్పాదక దృశ్యసందర్శనంబున జింతాసాగర నిమగ్నుండయ్యెను. సంసారములో వాస్తవికంబగు యానందమే లేదని యతఁడు నిశ్చయించుకొనియెను. అటుపిమ్మట మఱికొంతదవ్వేగ నట నసుఖాస్థలింబడి శక్తివిహీనుఁడయి మరణవేదనచే బహుయాతనల బడుచు నార్తారవమొనరింపుచు నటునిటుదొర్లుచున్న యొక్క దరిద్రివ్యక్తిని వారుభయులును గాంచిరి. వాఁడు మహాభయంకరంబుగను, మానవుని హృదయము ద్రవీభూతమగు చందమునను బొబ్బరిలుచుండెను. వాఁడు స్వహస్తముతో దేహమును స్పృశింపుచు నుదరమునణచిపట్టి "అయ్యో! ఈపీడ నేనెట్లు సహింతును? ఓపుణ్యాత్ములారా! సాయముజేసి నన్ను సంరక్షింపుఁడి. ప్రాణవాయు వెగిరిపోవుచున్నయది." అనికేకలు పెట్టుచుండెను. భయంకర రోగోద్భూత ప్రచండతాప జ్వాలావృతంబగు నతనిదేహ మగ్నింబడు దగ్ధమగు శుష్కకాష్ఠ సదృశంబుగ భస్మీభూతమగుచుండెను. ఆదరిద్రరోగ పీడిత వ్యక్తి దీనాలాపముల నెవ్వరును నాలకింపక, స్వార్థాంధులరయి వజ్రతుల్యకఠోరచిత్తులరయి వినియు విననట్లు తమమార్గమున దామరుగుచుండిరి. తత్పథమునసరుగువ్యక్తుల ధిక్కారమును

నిరసన, నిర్దయభావమును రోగగ్రస్తుండగు నావ్యక్తి శోకానలమునకు దైలమథవాఘృతము గావించు సాహాయ్యమును గావించెను. విషాదాగ్ని ప్రజ్వరిల్లినంతనే రోగిచుఱంత పెద్ద పెట్టున నాక్రందన ధ్వనిసేయదొడంగెను. వానిరోదన మరణ్యరోదనమగుట వీక్షించి, సిద్ధార్థకుమారు డవ్వానినిసమీపించి వానియుత్తమాంగమును దనతొడపైనిడుకొని సానుభూత్యమృతరసపూరితసాంత్వనావచనంబుల నిక్కరణి బృచ్ఛించెను :—"భ్రాతృడా! నీకుసంభవించిన బాధయెద్ది? లేవ నీయందులేశమయిన శక్తిసామర్థ్యములు లేవా? నీదుఃఖమును వీక్షింప నాహృదయము శతధాభిన్నమయి పోవుచున్నది. దుఃఖము మానవజాతిరక్తమునుబీల్చి పిప్పిజేసివేయుచున్నది. నీవు ధైర్యస్థైర్యముల గల్గియుండుము." సహజదయార్ద్రస్వాంతుండగు సిద్ధార్థునిప్రేమమయ శీతలవచనంబులు, చందన కర్పూరాది శీతల సుగంధ పదార్థలేపనములకంటె వేయిమడుంగు లెక్కుడు చల్లదనమును సంప్రాప్తింపజేయ, వ్యాధిపీడితున కొకింత యూరటయును, దాపోపశాంతియును లభ్యమయ్యెను. గద్గదస్వరముతో సిద్ధార్థునిప్రశ్నముల కుచితోత్తర మొసంగ నాయత్తపడియెగాని గుద్ధకంఠ మగుటయును, బాధ ప్రవర్ధమానమగుటంజేసియు నిరుత్తరుడయ్యెను.

దుఃఖతుండగు నావ్యక్తినుండి సముచితప్రత్యుత్తరము లభింపకపోయె, సర్వభూతహితాకాంక్షియగు నా రాకుమారు

డాత్మీయ సారథియగు ఛన్నుం గూర్చి యిట్లు నుడువదొడం గెను:— "ఛన్నా! అయ్యో! మన యీ సహోదరు డిట్లు మూల్గుచు బాధపడుచున్నాడేమి? వీని కేమి విపత్తు సంభవించి నది? దీనునివగిది నితడు దీనాలాపములాడుటకు హేతువెద్ది?" నిపుణుండును, లౌకికజ్ఞాన సంపన్నుడునునగు ఛన్ను డానిష్కల్మషంబులగు వచనంబుల కచ్చెరువంది, యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను:— "అలోకసామాన్య సద్భావవిలసితాత్ముడవగు నో రాజనందనా! ఈ మన దరిద్ర సహోదరుని కెద్దియో యస్పృశ్య భీషణవ్యాధి సంప్రాప్తించియుండనోపు. ఏతద్ధేతు బలంబుననే జానపదులందఱు వీనిం డాయక, దూరదూరముగ ననహ్యభావముతో నీ వికృతశరీరాకృతు దిలకింపుచు సాహాయ్యము జేయకయే యరుగుచున్నారు. ఇట్టి దుస్థితియందు వీనిని దాకుటవలన దమకుసహిత మట్టి ఘోరవ్యాధియే ప్రాప్తించును. ఏతత్కారణంబుననే సమస్తపధికులు రోగము తమ్ముగూడ బాధించుననియెడి భీతిచే బారిపోవుచున్నారు. శరీర లక్షణ శాస్త్రవిదు లిట్టి భయంకర వ్యాధులనే సాంక్రమిక రోగములని పేర్కొనుచున్నారు. వీని వ్యాధిగ్రస్తమగు దేహమును స్పృశింప నాకు సాహసము లేదు. నా శరీరము కంపాయమానమగుచున్న యది. ఉపకారముసేయు భావముతో నెవ్వారు వీనిని స్పృశింతురో వారు సహిత మిట్టి భయంకరవ్యాధిచే బీడితులయి యకాల మరణమును జెందెదరు." సిద్ధార్థుడు

సారథిచెప్పు చిత్రవిచిత్ర ప్రసంగముల కబ్బురమందెను. కొంత సేపటిదనుక దీర్ఘవిచార పరీతమనస్కుడయి యుండి, తిరిగి సారథి నిట్లు ప్రశ్నించెను :— "భ్రాతృసమానుండవగు నో సారథీ! సంసార క్షేత్రమున నీ భీషణవ్యాధి వీని నొక్కనినే బాధించుచున్న యదా? లేక యనేకులు బాధింపబడుచున్నారా? ఇట్టి రోగిని స్పృశింపకున్నను గాలానుక్రమంబున సమస్త వ్యక్తులకు నీరోగమువాటిల్లి పీడింపజేయునా? ఇట్టి వ్యాధిబాధితు లింకను జగమునగలరా?" రాకుమారుని నిర్మలంబులగు వచనముల నాలకించి, యతని లౌకికజ్ఞానరాహిత్యమునకు మహదాశ్చర్య పరిపూర్ణ చిత్తుడయి, ఛన్నుడు పునఃప్రత్యుత్తర మిట్లొసంగెను :— "రాకుమారాగ్రణీ! ఏతద్విధవ్యాధిరాజము లీ యిహలోకమున శతసహస్ర సంఖ్యకు మిక్కిలిగ నున్నవి. ఈ భయంకరవ్యాధికంటె నెక్కుడుభీతి నుత్పతిల్లజేయు ఘోర వ్యాధులు వేనవే లీజగమున వ్యాపించియుండి, తమ రాక్షస కార్యముల నిర్విఘ్నముగ గొనసాగించుకొనుచుండుట నేగను లార గాంచియున్నాడను. ఇట్టి వ్యాధులవలననే మానవు లనేకులు ఘోరసంకటములకు వశీభూతులయి యమయాతనల బడ యుచు హృదయముల సర్వదా గుందుచుందురు. వేయేల? గురుజనులే "శరీరమ్ రోగమందిర"మ్మని వాకొనుచుందురు. ఈ నా వచనములు మీకు నాశ్చర్యముగొలుపునవియే యయి యున్నను సర్వసాధారణులగు సంసారులకయిన నెంతమాత్రము

నాశ్చర్యము నుత్పన్నము సేయజాలవు. సహజోద్భవంబులగు వ్యాధుల కబ్బురపడనేల? సృష్టి యంతయు నిట్టి లోపముల తోడనే నిండియుండ జింతింప బనియేమున్నది?" రాకుమారు డావాక్యముల నాలకించి, విషణ్ణహృదయుడయి, గంభీరనీలనీర దగ్రసితచంద్రబింబము పగిది, తేజోవిహీనముఖమండలుడయి తిరిగి, సారధితో నీరీతివచింప నారంభించెను :—సోదరా! ఛన్నా! సమస్తజనులకు గాదు కాదు సమస్తప్రాణులకు వృద్ధాప్యమువలెనే వ్యాధులుసహితము సంభవింపుచుండునని నీమాటలవలన దేటపడినది. నాకును, నీకును, నా ప్రేయసి యగు యశోధరాదేవికిని, సమస్తప్రాణులకును సమయము జూచి వ్యాధులుప్రాప్తించునని గ్రహింపగల్గితిని. సమస్తప్రాణులును వ్యాధినుండి విముక్తినందుటదుర్లభము. సంభవించు సమస్తవిధంబులగు కష్టపరంపరలకు సంసారులు తలయొగ్గి యుండవలయును. ఈనామాటలన్నియు యథార్థములేకదా! ఛన్నా! "రాజపుత్రా! తమరుసెలవిచ్చిన వాక్యములన్నియు సత్యములే. భేదమిసుమంతయయినవట్టివానియందు లేదు. సమస్తపృథ్వీతలస్థిత ప్రాణికోటికి వ్యాధి యవశ్యభోక్తవ్యము. వ్యాధియనెడి ముక్కిడిరక్కసికి గార్ధక్య కార్శ్యములే ప్రియపరిచారికలు; అయ్యది యెవుడును దాక్షిణ్యమను శబ్దమునే నాలకించియుండలేదు. కాలానుకూలంబుగ రోగములు సమస్తజనులను వెతలబెట్టుచుండును. దానిస్వభావ మతిభయంక

రము; ప్రాణాపాయకరము. అద్దానిస్వభావంబెట్టిదనిన సమయము చిక్కినపుడు దండతాడితహాలాహలభరిత భయంకర సర్పంబువలెను, హృత్పిండవిదారక భయంకర రవోత్పాదకాశనిపాతంబువలెను హఠాత్తుగా మీదవిఱిగిపడును. దానిప్రకృతి దారిగొట్టు దోపిడికానిం బోలియుండునన్న సరిపోవును" అని ఛన్నుడు నుడివెను. సిద్ధార్థుఁడాపల్కుల నాలకింప నవి మృదులపల్లవమునుబోలు నుల్లమునకు ముల్కులవలె దోప, గొంతతడవు మౌనముద్రితుడయి, విశాలవదనమండలమున గంభీరభావమాలికలు నృత్యముసేయుచుండ నిరుత్సాహ విరసపూరితవచనంబుల నిట్లు వక్కాణింపమొదలిడియెను:—

"ఛన్నా! అస్థిరంబగు సృష్టినిగూర్చి విచారించినకొలది మామకంబగు చిత్తము చింతాకుల మగుచున్నయది. నీవుసహితము నాకొక్క నశ్వరదేహధారివగు క్షణభంగురసుహృద్వరుడవేయయితివా? నేనింతపర్యంతము జ్ఞానరాహిత్య జనన్యంబులగు నహంకార మమకారములచే నారథసారథి, నాఛన్నుడుయని భావింపుచుంటిని. నేను నీవాడనుగాననియు నీవునావాడవుకావనియు మనమిద్దఱము సృష్టియను పుష్పవాటికకు దూరదూరప్రాంతములనుండి ఫలములనిమిత్తమే తెంచి క్షణికంబగు మైత్రినిగల్గియుండు విహంగములవంటివార మనియు సృష్టియను ధర్మశాలకు దూరదేశములనుండి యాత్రసేయుచువచ్చి కలసిన బాటసారులమనియు నిప్పటి కిసుమంతగ్రహిం

పసమర్థుండనయితిని. తాత్వత్కథితానుసారంబుగ విచారింప సం
సారమందలి యానన్మంది మనుష్యులును సంతతము భయభ్రాం
తులయి యుందురని సంపూర్ణముగా విశదమాయెడిని. నీవెల్ల
రహస్యముల నాకంటెముందుగనే గ్రహించియుండియు నజ్ఞా
నాంధకార బంధురంబగు గహ్వరమున బడిపోవుచుంటివేమి
నీయందు భ్రాంతివిశేషించియుండుటయే యిద్దానికి హేతువ
యియుండునని భావించెదను. "నిశాసమయంబున శయ్యపై
హాయిగ బరుండునే వ్యక్తియు గంభీరహృదయుడయి రేపు
నురక్షితముగానుండగలను సత్కార్యములగావించి చిరానం
దమును బడయుదును," అనివచింపజాలడు. ప్రతిప్రాణి
యొక్కయు భవిష్యత్తును, అగమ్యగోచరంబగు నంధకారము
లో సర్వేశ్వరునిచే దాచేబడియున్నది. ఒకవేళ నేవ్యక్తిమా
త్రుడయిన గొంతకాలంబుదనుక సత్కార్యప్రభావంబునగాని
సంయోగవశంబునగాని రోగజాలమునకుజిక్కక సుఖముగనుం
డినను, తదనంతరంబయిన వార్ధక్యావస్థకు వశీభూతుడయి,
కడు నిడుమలబడి నడుము వంగిపోవ, నడువశక్తిలేక జరా
దుఃఖ మిద్దికదరాయని మది దలపోయుచు, ఖేద మవశ్యము బడ
యగలడు.

ఛన్న డాదూరదృష్టిగల రాకుమారుని యుక్తియుక్త
ములగు సహేతుక వచనంబుల కిటు మాఱుపలికెను:—
"భూపాలతనయా! కేవలము వృద్ధుడు పర్యంకమునబడి శక్తి

దూరుడయి దుఃఖమునందుటయేకాదు ; ప్రాణవిసర్జనము సహి తము గావింపవలసియే యుండును. ఈజగమునందున్న పర్యం త మేమానవు డెట్టికార్యము లాచరించినను దుద కిటనుండి పయనము సేయవలసియేయుండును." సిద్ధార్థు డామాటల నాలకించి మౌన మొకింతసేపు వహించి, యనంతర మిట్లు ప్రత్యుత్తర మొసంగెను:—"ఛన్నా! నేను నీవు వక్కా ణించు సమస్తవిషయములతో నేకీభవింపుచున్నాడను. నీచే వచింపబడినవన్నియు సాధారణముగా నీసృష్టియందు గోచరిం చునవియేకాని భిన్నవిషయములుకావు. నీకున్న యనుభవమును బట్టి మరణమన్న నెద్దియో విశదముగ స్పష్టపఱచి, నాసందేహ ముల నివృత్తిసేయుము." "ఓ నృపాత్మజా! సకలభూత దయాపరా! నడచి, నడచి మన మిప్పటికి నగరబాహ్య ప్రదే శంబుల కరుదెంచితిమి. మరణమునుగూర్చియా, తమ రిపుడు నన్ను ప్రశ్నించునది? అల్లదిగో నటు జూడుఁ కాల బఱపుము. ఒక మృతకళేబరమును గొందఱుమనుష్యు లేకీభవించి భుజము లపై నిడికొని రుద్రభూమికి గొంపోవుచున్నారు. వారు భుజ ములనిడుకొనితీసికొనిపోవుభారమే వృద్ధాప్యముచే మరణించిన నసగా భౌతికలీలలనెల్ల గట్టిపెట్టిన యొక మానవుని నిష్ప్రాణ శరీరము. సజీవుడగు వ్యక్తి విగతజీవుఁడై, యట్టి యవస్థకు బాల్ప డుటనే మరణమనియు, గాలమనియు నెప్పుచుందురు. ఆమృత కళేబరము సజీవముగ నున్నంతపర్యంత మెందఱో యాత్మీ

యులచే బోధింపబడి, మనవలెనే సంసార నాటకరంగమున గ్రీడించి, తుదకు గాలసాగరగర్భంబున నదృశ్యమయిపోవుచున్నయది. సమస్తనరు లవశ్య మీదివసముననే గాకపోయినను, మఱొకప్పుడయిన దప్పక కాలవాహినీ తరంగప్రహారములచే జూర్ణీకృతము గావింపబడుటయే ధ్రువము. కించిజ్జ్ఞులీమరణదేవతను మఱచి, యల్పకాలనశ్వర తుచ్ఛసుఖంబుల నపేక్షించి, పాపకార్యానుష్ఠానమున బ్రవిష్టులగుచుందురు. రాకుమారా! తమరు నాయీ ప్రబోధవాక్యములకును, నాయాచరణమునకును మధ్యనెలయు భేదమునుగాంచి నా యవివేకమున కవశ్యము బరిహసింతురు. మనూదృశుండగు నల్పజ్ఞుడు పడయునది పురాణవైరాగ్యము. భ్రాంతికి దాసుండనగు నేను వివేకసంపన్నుండ ననిపించుకొన నసమర్థుడను" అని ఛన్ను డుత్తరమొసంగెను. సిద్ధార్థుడా నవ్యతరంబులగు విచిత్రవాక్యముల నాలకించి, నిజదృక్కుల జింతితస్వాంతుడయి శవవాహకబృందము దిక్కునకు సారించెను. తద్దిక్కు జూడ్కుల నిగుడించినంతనే మరణదేవత భయంకర తాండవచర్య కానవయ్యెను. సిద్ధార్థున కదియే ప్రథమ మృతదేహ సందర్శన దివసము. సుస్పష్ట విగతజీవ ప్రథమావలోకనంబున నతని హృదయమొకించుక చలించినమాట వాస్తవంబు.

రాజనందను డటనే దీర్ఘకాలపర్యంతము నిస్తబ్ధుడయి నిలబడియుండి మనమునం దెద్దియో విచారించుకొని, సారథి

నుద్దేశించి యిట్లు నుడవనారంభించెను :— "ఓఛన్నా! మరణ మునిశ్చయమని గ్రహించియు, బుద్ధిచలించుచునే యున్న దేమి? నేనుసహితము భ్రాంతికి వశుడనయి యున్నాడను. నేనుకూడ గొంతకాలము గతించినంతనే మరణింతునుగాబోలును; నా మనోహారిణియగు యశోధరాదేవి సహితము కరాళకాల గ్రాసమగును; నాప్రియసారధివగు నీవు నదియేగతి. సమస్తజ నులకు పాపాత్ములకు మరణమే శరణ్యమాయెను. సందేహ మింకను నాహృదయమును బాధింపుచునేయున్నది. మానవు లకు నేతన్నీచావస్థ యవశ్యసంభావ్యమా?" ఛన్నుడిట్లు వక్కా ణించెను. "మానవజాతి యొకటియేకాదు, సమస్తప్రాణికో టులు కాలమరుదెంచినంతనే నీటిబుగ్గలవలె జూచుచుండగనే యంతర్హితములయి పోవుటయే వాస్తవము. ఈనాడుజీవించి యుండి క్షణికంబగు సౌఖ్యవారిధిని బుత్రమిత్రకళత్రాదుల తోడను, ధనధాన్యైశ్వర్యములతోడను దేలియాడుచున్నను ప్రాణులు రేపోమాపో మరణించుటయే నిక్కువము. లోక మందలిసమస్తబాధలును, పురుషకారంబునను, సర్వేశ్వరకృ పావిశేషంబునను దూరముగావచ్చును. కాని మరణదేవతను నిరోధింప మనలసృజించిన విధాతకయినశక్యముకాదు. తమరు యశోధరాదేవి, నేను యిప్పుడుకాకపోయినను మఱొకప్పుడ యిన మృత్యుదేవతను సాక్షాత్కరింపజేసికొనవలసినవారమే. ఇందు సుంతయు నబద్ధములేదు. ఇహలోకమునుండి నేయు

యాత్రియే మానవుని యాత్రిలలోనికెల్ల నంతిమది. ఎట్టిమ హాత్ముడును మరణమును డీకొని సంగ్రామరంగమున జయము ను బడయజాలడు. సూర్యుడు నిశాసమయంబునను, సుధాక రుడు దివసకాలంబునను నుదయించిన నుదయించుగాక, మృ త్యుపుమాత్రము సమస్తప్రాణికోటుల భక్షించియేతీరును. అనుభవింపవలసియున్న దానిని దృణీకరించిన మనకు లభ్యమగు ఫలను కేవల మనమానము; దుఃఖము. కనుక మృత్యుదేవత మనగృహముల కతిథియయి యేతెంచినపుడు మనమభ్యాగతుని పగిది నత్యాదరముతో సన్మానింపవలసియుండునట. నే నాది నుండియు దెలుపుచువచ్చిన విషయములన్నియు మహాత్ముల శ్రీముఖములనుండి బహిర్గతములయి నాకర్ణపుటముల బడినవి యేకాని మద్హృదయాంతర్గములుకావు. బుద్ధిబలశూన్యుండగు నాకింతటి తత్వవిచారణ జ్ఞానమెక్కడిది? మృత్యుదేవత నాద రించు విషయమయి యొకానొక కవిశేఖరుండెటుల సెలవిచ్చి యున్నాడో వినుండు :—

"నీదువాకిలి పురణంబు • నిలిచి తట్ట
నేమి యొసగెదు కాన్కగా • నీవె చెపుమ?
అట్టు లరుదెంచునట్టి యా • యతిథిముందు
బాత్రిసంపూర్ణ జీవిత • పాత్రి నిడుదు."

మహాత్మా! సిద్ధార్థరాకుమారా! ఆలకించితిరా, ప్రాణి యేరీతి మృత్యువు నానందముతో నాదరింపవలయునో: మరణ

దేవత కీ ప్రపంచరంగమున సమస్త ప్రాణికోటులు భీతిజెందు చుండును. ఎట్టి రణధీరుడకయిన, నవక్రపరాక్రమక్రమోపే తునికయిన మృత్యుశబ్దము కర్ణగోచరమయినంతనే గుండె గుభి ల్లుమనుచుండును. సూర్యకిరణములనుండి శైత్యమును, సుధాక రుని చంద్రికనుండి తాపమును బ్రాప్తించుట సహజమయినను నగుగాక! మృత్యువు యేప్రాణిని భ్రేమింపదని వక్కాణిం చియే యుంటినిగదా! భూపాలుగ మహాపరాక్రమప్రౌఢిమ యామృత్యుదేవత వేడినిట్టూర్పులముందు క్షణకాలమయిన స్థిరముగ నుండజాలదు. ప్రపంచమందలి సమస్తశక్తులు నేకీభ వించినను, మృత్యుదేవత యొక్క చండప్రచండ బలాధిక్యతలో సాగరమునందలి శుష్కతృణమువలె బరీతమగుచుండును. సంసారవ్యామోహము నెడబాసి, సర్వసంగపరిత్యాగులయి, వాయువును భక్షించి జీవించు తపస్సంపన్నులే యెపుడో యొక ప్పుడు మృత్యువునకు కెఱ గావలసి యున్నపుడు సాధారణుల విషయమయి విచారింపనేల?"

మహాత్ముల సాంగత్యంబున గ్రహించి, తనకు స్పష్ట ముగ విశదముగావించిన ఛన్నుని వాక్కుల నాలకించి, రాకు మారుడు, దివ్యతేజోవిలసిత ంబగు నేత్రద్వయమునుండి బాష్పకణంబు లొక్కొక్కటిగ ధారారూపంబున స్రవింప జేసెను. సిద్ధార్థుని యాసహజవిశ్వసోదరానురాగమును గాంచి సారథికూడ నేత్రములనుండి బొటబొట బాష్పముల బ్రవ.

హింపజేసెను. "ఉదారచరితానాంతువసుధైవ కుటుంబక" మ్మను నార్యోక్తి సిద్ధార్థునియెడ బూర్ణముగ సార్థకమయిన ట్లుల ఛన్నుడు గ్రహించెను. సిద్ధార్థుడు మరణమునకు బ్రతి క్రియ నాలోచింప గంభీరభావ హృదయుడయి, భూమ్యాకా శముల విశాటస్వరూపముల దిలకించి, మాటిమాటికి శ్రీముఖ మునుండి యస్పష్టశబ్దముల నుచ్చరింపుచు, గల్పనా నేత్రము లతో బ్రపంచపరిస్థితుల మూర్తీభవించియున్నటుల గాంచెను. తత్సమయమున నిస్తబ్ధ బాహ్యస్వరూపధారియగు సిద్ధార్థుని మనోగతభావము లత్యంతాందోళితములయి యున్నట్లు ముఖా కృతింబట్టి తెలియనగుచుండెను. ఎంత గంభీరముగను, దీర్ఘము గను విచారించినను దుఃఖరాహిత్యమున కతని హేతువు కాన రాదయ్యె. అత్తరి నతనికి మరణవిముక్తి దుస్సాధ్యంబని విస్ప ష్టమయ్యెను. అంతట నిజసారధిని సంబోధించి రాకుమారు డిట్లు నుడివెను :—

గీ॥ పం॥ చాలు జాలును సారధి • జగతిచర్య
సుఖము సుంతయు నియ్యెడ • జూడలేము
మరణదేవత సతతంబు • నరుల నుర్వి
వెతలబెట్టుచునుండును • విపులముగను
భ్రమను గ్లాడివారలు • భ్రష్టులన్న.

గీ॥ నడుపు మింకను శీఘ్రంబె • యరయ జగతి
గాంచుయే చింత నవనిలోఁ • గలుగజేయుఁ

గాంచఁ లేనట్టివారలె • ఘనులుసుమ్మి
ధరణి నందఱ మరణంబు • దప్పకుండ
వెతలఁ బెట్టెడి మర్మంబు • విశదమయ్యె.

సోదరా! ఛన్నా! శీఘ్రము గృహమునకు నడువుము. నా మనస్తాప మనుక్షణ మభివృద్ధి జెందుచున్నయది "సిద్ధార్థుని వైరాగ్యస్వభావమును, బశ్చాత్తాప సంజనిత దుఃఖాతిరేకమును గాంచి ఛన్నుడు సహింపలేక గృహోన్ముఖుండయ్యెను. సిద్ధార్థుడుదాసీనభావముతో నిముస మొక్కయుగముగ నాట గోలె వ్యతీతము సేయదొడంగెను.

యతిసందర్శనము; సుజ్ఞానపీయూష పానము.

సిద్ధార్థుడాత్మీయ సదనమునందే సర్వదా యేకాకియయి కూర్చుండి, మానవుల మానసిక దౌర్బల్యజన్య విషాదమును గుఱించియు, బ్రాపంచికుల కించిజ్జ్ఞతను గుఱించియు దీర్ఘముగ విచారింపుచు హృదయమున వ్యాప్తమయియున్న యొక్కొకసందేహమునుదూరీకృతముగావింప గృషిసేయుచుండెను. నిరంతర విచారణంబున నతనియాలోచనాశక్తియు నిర్మాణశక్తియు ననుదిన మభ్యుదయము నందదొడంగెను. అతనిహృదయ సరోవరమునందనేక భావవీచిక లుత్పన్నమయి, మగుడ నస్తమించుచుండెను. కళత్రమును గూర్చినచింత యొండ తనిమది శోకించుక వ్యాకులత నొదవజేయుచుండెను. యశోధరాదేవి గర్భమును ధరించినటుల గౌతమీదేవివలన శుద్ధో

ధనభూపాలునకు దెలియవచ్చెను. ప్రేమమయమగు సంతానము నవలోకించినంతనే జనకునకు సహజముగనే మమకార మొదవుననియు నామమతవలననే జనకుడుసంసారబంధముల గట్టువడియుండుననియు నిట్టిస్థితియందు దివ్యసుందరవిగ్రహుండగు కుమారుడు సిద్ధార్థున కుదయమగుచో నిజమనోభీష్టము సిద్ధించుననియు శుద్ధోదనభూపాలుడు భావించెను. ఎట్టివిరక్త భావసంపన్న గృహస్థునకయినను, బుత్రజన్మోత్సవమును గాంచినంతనే హృదయము ద్రవీభూతమగుననియే భూపాలుని దృఢవిశ్వాసము.

దుఃఖము ననుభవించుటకే జననమందితినిగదాయని భావించు సిద్ధార్థుడు విహారార్థ మాత్మీయపుష్పోద్యానమున కరిగియటనున్న సరోవరతీరవిరాజిత। చంద్రకాంత శిలావేదికపై గూర్చుండి, బ్రహ్మాండమహాకావ్య శ్లోకముల గూఢార్థమును గూర్చి విచారించుకొనుచుండెను. శోకార్తిబాహుళ్య పరిపూరితంబగు బ్రహ్మాండమహాకావ్య తాత్పర్యము మహాక్లిష్టమయి యతనిధీశక్తి కతీతమయి యున్నటుల బ్రతీతమయ్యెను. తత్కాలమున నా రాజకుమారుని హృద్గతభావవిషాద స్ఫూర్తి నతనిముఖారవిందము చెప్పకయే చెప్పుచుండెను. పశ్చాత్తాపమున కాతని హృత్కమల మాటపట్టయి యున్నటుల స్పష్టపడుచుండెను. తుషారబిందుతతిస్పర్శంబున ముకుళితంబగు సరోజముభాతి సిద్ధార్థుని హృదయాంబుజము సాం

సారిక వ్యామోహజనిత విషాదభావ తుషారకణ స్పర్శముచే ముకుళితంబయి స్వాభావికాభాసము దక్కియుండెను. భూలోకమందుండు సమగ్రవిషాదము మూర్తీభవించి యతని హృదయసీమను నివాసస్థానముగ నేర్పఱచుకొని యున్నటుల విదితమయ్యెను. అతని హాస్యరాహిత్యమునకు యావత్ప్రపంచమున నెలమికొనియున్న విషాదభయములే హేతుభూతములు.

సౌమ్య శాంతస్వరూపుఁడయి సిద్ధార్థుడచట నాసీనుడయియున్న తరుణమునందే కాషాయవసనధారియయి, ముండితశీర్షముగల యొకానొక యతిచంద్రుడాయారామమందిర సమీపపథమున నేగుచుండెను. రాకుమారుడాయతిచంద్రు నాదరపూర్వకంబుగ గావించి యిట్లు పృచ్ఛించెను:—"మహాత్మా! తమరెవరు? ఎటనుండి యొటకరుగుచున్నవారలు? దాసుని యీ యల్ప ప్రశ్నంబుల కుచిత ప్రత్యుత్తరమునొసగి, ధన్యాత్ముని గావింప నభిలషింతు." "రాకుమారా! నేనొక శ్రమణుడ (సన్యాసి) ను; కపిలవస్తువునుండి శ్రావస్తీనగరమున కేగుచున్నాడ"నని సన్యాసి జవాబు నిచ్చెను. అంత సిద్ధార్థకుమారునకును సన్యాసికిని క్రింద నుదహరింపబడు చందమున సంభాషణక్రమము జరిగెను.

సి. కు:—మహాత్మా! దీర్ఘకాలమునుండి సజ్జనపురుషుల సాంగత్యమును బడయునభిలాష నామదిని బీడింపుచున్నయది. చందనవృక్షమునకు సమీపమునందుండు వృక్ష

ములుసహితము సుగంధపూరితము లయినటుల, సభ్యు
న్నతి నంద నభిలషించు వ్యక్తులుసహితము సత్పురుష
సందర్శన సాంగత్యంబుల నతీతమగు వికాసమును బడ
యుదురని గురుజనులవలన నాలకించియుంటి. అప్రయ
త్నముగానే నాయభిలాష సిద్ధించినది. తామొక యతి
చంద్రులనియా నుడివియుంటిరి? అయినచో తమ వృత్తి
యేమి ?

యతి:—కుమారా! నీ సద్బుద్ధికి నే నెంతయు బ్రమోదము
నందితి. నీహృదయ మమోఘమయినది ; సహజకరుణా
భావ విలసితమయినది ; సత్వర భవసాగరతరణార్థ మయి
నది. నిన్నానందపఱచుటయే మామకంబగువిధి. శ్రద్ధ
నాలకింపుము. నే నీభువిపై జననమందిన దాదిగ నగణి
తంబులగు భయవిషాదముల ననుభవించితిని. దుస్స
హంబగు సాంసారిక దుఃఖానలజ్వాలచే బీడితుడనయి
విరక్తిజెంది, యనశ్వరంబగు రూపమునుబడయ సంక
ల్పించి, నిస్సార సంసార పరిత్యాగంబున గించిత్కాల
మునకు బూర్వమే సన్యాసవ్రతస్వీకారము జేసితి. తదా
దిగ నేసలిపిన కృషివలన సత్యజ్ఞానపథంబుదక్క వేరొండు
మార్గమును గ్రహించుటవలన నిత్యానందము ప్రాప్తిం
పదనియు నద్దానికి భిన్నముగా వర్తించుట యథార్థ
వ్యక్తిత్వసంపన్నుండగు మానవునకు యుక్తకార్యంబు

గాదనియుగూడ నేను స్వానుభవంబున నిశ్చయింప సమర్థుండనయితిని. జగమున వ్యాప్తమయి యనుదిన మభివృద్ధిజెందు విషాదమునుగూర్చి విచారింపగడంగి నంతనే యతిశయ విషాదాయత్తచిత్తుండ నగుచుండెడి వాడను. ప్రస్తుతము నేనంతగా జగమున వేరునాటి యున్న యవివేకసంకటముల గుఱించి విచారింపక, వాని మూలమును విధ్వంస మొనరింప యత్నముసలుపుచు న్నాఁడ. సంసారమునకు సహజముగ బ్రాప్తించు సౌభా గ్యములలో మరణమొకటి. అట్టిమరణము నవలోకించి, భీతిలువారేకాని సంతసించు మానవుం డొక్కఁడయిన గానరాకున్నాఁడు. లోకములో ముమ్మరము యొక్క మర్మమును గ్రహించియున్న ముమూర్షువు లత్యంత స్వల్పసంఖ్యాకులయి యున్నారు. ఆనందచిత్తులరయి, నిర్వాణపదతత్త్వ ప్రబోధశ్రవణము నభిలషించు త్వా దృశోత్తమనరులకు నేనత్యంత భక్తిశ్రద్ధలతోడ సన్మా ర్గోపదేశము సర్వకాలసర్వావస్థలయందు సర్వత్రనే యుచు బర్యటనము సలుపుచున్నాఁడను నేనీకార్యము నే మానవజాతిహితమునకయి, యుక్తధర్మంబుగ నెఱింగితి. ఆత్మప్రబోధానుకూలంబుగ వర్తింపజేయు నదియే యుత్తమగ్రంథము. పౌరుషేయంబులగుమహో త్కృష్ట మతగ్రంథములకంటె నపౌరుషేయంబగు

నంతఃకరణమే సర్వభూతహిత పరతంత్రింబగు సర్వోత్త
మ శాస్త్రగ్రంథము. అల్పప్రాయమునందే రాకుమారు
డవయి యుండియు నీవు సేయు వేదాంత ప్రసంగమునకు
నేనచ్చెరువందుచున్నాడ. కుమారా! నేనడుగు ప్రశ్న
ములకు నీయల్పానుభవమును బట్టి సముచిత ప్రత్యు
త్తర మొసంగుము. నీవింతపర్యంతము నుదాసీనభావంబు
నను, సర్వేశ్వ రారాధనవలనను బడయగల్గినదెద్దియో
విచారించెదను:

యతి:—మనోజ్ఞంబును, హృద్యంబును నగు నీవిశాలప్రపంచ
ము స్థిరమయినదా? మనము పడయు సమస్తానందములకు
నిలయమగు తనువు శాశ్వతమా? యశాశ్వతమా?

సి. కు:—మహాత్మా! క్షణమున కొక్క రూపమున వెలయు
ప్రతిపదార్థము నశాశ్వతమె. శాశ్వతమయినదానికి పరి
వర్తనము లేదుకదా? మనయీకాయము నహితము
స్థిరమయినది కాదు. అనిత్యంబగు నీవిశాలసంసారమునం
దెద్దియో శాశ్వతమయినపదార్థ మవశ్యము ప్రాణి
కోటి హితమునకయి దాగియేయున్నది.

యతి:—మానవునకు దుఃఖానుభవము విశేషముగ నేయవస్థ
యందు సంభవించును?

సి. కు:—ప్రాయ మధికమయినంతనే మానవుని జరాభార మ
ణచివేయ నారంభించును. తత్సమయంబున నావృద్ధుని

దేహము శక్తిరహితమయి, రక్తమాంసశూన్యమయి యస్థిపంజరమగును. జ్ఞానకర్మేంద్రియముల సాహాయ్య మపుడు క్షీణింప మానవుడు యమబాధలజెంది, దుః ఖించుచుండును. ప్రతిప్రాణికి నీయవస్థ తప్పదు.

యతి :—అరిషడ్వర్గము యొక్క వికాసమనెడి యౌవనము ప్రాప్తించినంతనే మానవుడు జ్ఞానాంధుడయి, శరీర ము యొక్క యంతిమ పరిణామదశనుగూర్చి విచారింపక మృత్యుసందర్శనమయినంతనే విషాదవారిధిని గూలు చున్నాడు. నీవు వక్కాణించిన దింతయును సత్యమె. వ్యాధిసంసారులకుండు నిమ్నోన్నతభావంబుల విడనాడి సమస్తజనులను బాధించునా? ధనవంతులను, ఆరోగ్య వంతులను, పండితులనుజూచి పాక్షికబుద్ధిని వహిం చునా?

సి. కు:—వ్యాధి, మృత్యుదేవత యొక్క ప్రియపరిచారిక. దీని కి దయాదాక్షిణ్యములుకాని, నిమ్నోన్నతభావములు కాని లేవు. నశ్వరంబులగు నైశ్వర్యముల గల్గియు న్నంతమాత్రంబున నిది యెవరిని గాంచియు భీతిజెం దదు. ప్రాణికోటిని నిత్యము హింసించుటయే దీని విధి. దీని ప్రభావంబుననే ప్రాణికోటి సర్వదా యొకే యవస్థయందుండజాలకున్న యది. మనమెల్లరము నొకప్పు

డిద్దానిచే నాక్రమింప బడవలసినవారమే యని వేఱుగ వచింపవలయునా?

యతి:—కుమారా! వ్యాధియనున దెల్లప్రాణులకు స్వాభావికంబుగనే సంప్రాప్తమగుచుంటివి. వాస్తవమె. స్వేచ్ఛగా విహరించిన శరీర మెపుడు స్వతంత్రమయి, ఆపాద మస్తకపర్యంతము వస్త్రముచే నాచ్ఛాదితము గావింప బడుచున్న యది?

సి. కు:—స్వామీ! మానవుని శ్వాసకోశములు విగతధర్మము లయినపుడు అనగా ప్రాణవాయువు శరీరగృహము నెడబాసి చనినపు డయ్యది నిష్ప్రయోజనము పోవు చున్నయది. శుష్కకాష్ఠమువలె నదియు భూమిపై బడి పోవును. అపుడు దానికి విలువయుండదు. ఒకప్పుడు ప్రేమించినబంధువులే యద్దానినిగాంచి యేవగించుకొం దురు. అత్తటి నయ్యది యాపాదమస్తకము వసనముచే నాచ్ఛాదితమయి దగ్ధముసేయ శ్మశానవాటికకు గొని పోవబడును.

యతి:—నాయనా! ఆనందముగా బరస్పర ముఖావలోకనము సేయుచు సంభాషించుకొను యీ మనమే మృత్యువు వాతను బడెదమా? మనమెల్లరము బంధుమిత్రాదులను, ధనధాన్యైశ్వర్యములను బహిష్కరించి, దగ్ధమైపోదుమ

దమా? బిడ్డా! చూడ జక్కగానున్న నునుపయిన యీదేహము భస్మమగునా?

సి. శు:—దేవా! సమస్తమును గుర్తెఱింగియు మీ రిట్లు నన్నీ రీతి బృచ్ఛసేయుచుండ నల్పజ్ఞుండనగు నాకు లజ్జయొదవు చున్నయది. గురుదేవులు ప్రశ్నించినపుడు శిష్యు డుత్తర మొసంగుటయే యుక్తముకదా! ఈ పాంచభౌతిక శరీరము యొక్క యంతిమపరిణామమే మృత్యువు. అప్పుడే కాయము భస్మముగావింపబడునది. ఫలించిన వృక్షమెట్లు కొలదికాలము గతించినంతనే జర్జరమయి విధ్వంసమగునో, యదియేచందమున జీవము జననమం దినపిదప మరణము సహితము నందుచుండును. పుట్టున వన్నియు గిట్టునవియె. సాగరమున గలియవలసియున్న నదీనదము లెట్లాసాగరమువైపునకే దురితగమనంబున నరుగుచుండునో, అదియేరీతి జీవకోటులన్నియు గాల సాగర గర్భంబున మిళితంబులగును. కార్య కారణ ములు రెండు నేకమగును. నదీనదముల కుత్పత్తిస్థానము సాగరము. క్షయమునకు సహిత మద్దియే మూలము. మృత్తికానిర్మితంబగు ఘటము నశించినంతనే మృత్తి కయే యగునుగదా? కోలాహల పరిపూర్ణంబును బాప మయంబును నగు నీ విశాల విశ్వంబున నెయ్యెడ బరికిం చినను నాకరిందనధ్వనులే కర్ణపుటముల బడుచున్నవి;

ఎట దిలకించినను విషాదమయదృశ్యములె. ధనాఢ్యుల యొక్క యంబర చుంబితములగు ప్రాసాదములు మొదలుకొని నిర్ధనుల జర్జరకుటీరముల వఱకును, సర్వ సంగ పరిత్యాగులగు తాపసశ్రేష్ఠుల తపోభూములు మొదలుకొని, విషయాసక్తుల భోగమందిరముల పర్యం తమును సూక్ష్మదృష్టినారసిన నాక్రిందనధ్వను లేవినబడు చున్నవి. రోదనమే యీసంసారము యొక్క సారము. విలపించుటకే మనము జననమొందిన ట్లున్నయది.

యతి:—సజీవు డయియున్నంతపర్యంతము విషాదాగ్నిచే స్పర్శింపబడక జీవితాంతమున శాశ్వతానందనిలయమగు నిర్వాణమును బడయగల్గువ దెవ్వాడు?

సి. కు:—సాంసారిక దేహపాశములగు పుత్రమిత్ర కళత్రాద్యాత్మీయ వర్గానురాగమునుధనధాన్యైశ్వర్యములను ఆరామక్షేత్ర గృహాదులను దృణప్రాయముగ విసర్జించి, సర్వసంగపరిత్యాగియయి, కామక్రోధాద్యరిషడ్వర్గ విజేతయయి, ధర్మతత్వ మీమాంసయం దెవ్వాడు శేషజీవితకాలమును వ్యతీతము సేయునో యతడే జీవితాంతము పర్యంతము దుఃఖభయదూరుడయి, జీవితాంతమున సుగతిబడయును.

యతి:—కుమారా! అల్పప్రాయమునందే నీవెఱింగిన సత్యమత్యద్భుతము. నీయందున్న బుద్ధివికాస మొక్కసాధా-

రణ తాపసునియందు సహిత ముండదనియే చెప్ప నొప్పు.
నీవింతటితో సంతృప్తిసహింపక, సత్యముయొక్క సం
పూర్ణతత్త్వము ననుభవంబున గ్రహించి, లోకకళ్యాణ
ము సేయగల్గుదువనియే నీప్రత్యేకభావఖండము చాటు
చున్నయది. ధర్మసిద్ధాంతముల సమగ్రతత్త్వ మింకను
గోచరింపనిహేతువుచే నిన్ననేకసందేహములు పట్టి
బాధించుచున్నయవి. శీఘ్రమే నీకు సంపూర్ణజ్ఞానమును
బడయ దరుణము హస్తగతమగును. నానావిధభావము
లచే నీమస్తిష్కమిపుడు పరిపూర్ణమయి నీచిత్తమునకు
వ్యాకులత నొదవజేయుచున్నది. సంపూర్ణముగా విక
సించిన పుష్పమునుబోలు తనూభవుని ముఖారవిం
దము పరమేశ్వరుని పారిశుద్ధ్యముయొక్కయు, బవి
త్రిమూర్తియొక్కయు ధ్యానమును మానవుని చిత్త
మునం దుత్పన్నము సేయుచున్నను, ప్రేమస్వరూపిణి
యు, మనోజ్ఞస్నిగ్ధరూపిణియు నగు సహధర్మచారిణి
యొక్క విశుద్ధప్రేమయోగము సర్వజ్ఞుండును, బరమ
పితయునగు సర్వేశ్వరుని యోగానందముయొక్క
శుద్ధాభాసస్వరూపమే యయియున్నను, అహంకార
మమకారముల బరిత్యాగముసేయని యీసౌందర్యము
ల యథార్థతత్త్వము హృదయంగమము కాజాలదు. ఏ త
త్కారణంబుననే సంసారమునం దసంఖ్యాకులగు మాన

వు లిందిరియోపభోగులయి, పుత్రకళత్రాదుల సేవా శుశ్రూషల దవిలియుండి, ప్రచండా సహ్య శోకతాపంబున దగ్ధులయి పోవుచున్నారు. సంసారము యొక్క సమస్తపదార్థములు నస్థిరములయియుండ, చిరకాల బాంధవులు లేరనువాక్యము సత్యమయియుండ, మూఢులగు మానవులెందుకు శరీరావయవ సౌష్ఠవమును గాంచియు వసనాభూషణముల ప్రకాశము నవలోకించియు, మిథ్యాభిమాన పూరితు లగుచుందురు. "వినాశకాలే విపరీతబుద్ధిః" అనికదా గురుజనులు సెప్పునది. అధోగతికి బాలగుటకే మూర్ఖులు నశ్వరపదార్థములజూచి మురియుచుందురు. వారనుభవింపనున్నది వారికేమి యెఱుక? నేడనుభవించియు రేపు విస్మరింపుచుందురు. తృష్ణయను పెద్దమ్మ నెత్తిపై గూర్చుండియుండ మూఢులగువారికి మతిస్థైర్య మెట్లుండ నేర్చును? ఉపదేశకు లీజగమున వేనవేలున్నారు. ఒకటి రెండు మాటలు నేర్చినవారెల్లరు నుపదేష్టలె. ఆచరించువారు లేరు. "పరోపదేశే పాండిత్యం" అనికదా జ్ఞానానుభవపరులు వక్కాణింతురు? సంసారమున ధార్మికులగు మహాపురుషులు చంచలంబులగు పదార్థముల గన్నెత్తియయిన విలోకింపక, ధర్మపథము ననుసరింపుచుందురు. ధర్మపథము ననుకరించు పథికుడే యుపదేశింప నర్హుడు.

నిత్య మసంఖ్యాకంబులగు జీవులు జరావ్యాధులచే సుత్పీడితములయి మృత్యువుయొక్క భయంకర ముఖ గహ్వరమున బ్రవేశింపుచున్నయవి. భయంకరంబులగు నీ యుపాధులనుండి పరిత్రాణమును బడయ నుపాయ మవశ్య మన్వేషింప దృఢసంకల్పచిత్తుఁగువారికి లభ్య మగుట నిక్కువము. కుమారా! నీవు గ్రహించిన సత్య ములనెల్ల నిరంతరము నీచెంత కరుదెంచు మిత్రులకు బోధసేయుచుండుము. కాలవిలంబన మయినది. నీకు శుభమగుగాత. పోయివచ్చెద.

సిద్ధార్థకుమారు డతిశ్రద్ధతోడ నాయతిచంద్రుని యుప దేశవాక్యముల నాలకించి, మననముసేయ దొడంగెను. రాకు మారు డాయతి కసంఖ్యాకప్రణామంబు లాచరించి, సెలవు గైకొని సాగసంపెను. యతిశ్రేష్ఠు డయ్యెడబాసి, యదృశ్యు డయినపిమ్మట సిద్ధార్థు డర్ధనిమీలితచక్షుడయి, స్థిరసంకల్పసిద్ధు డయి, గంభీరాలోచనా పారావార సంలగ్నుడయ్యెను. పిల్ల గాడ్పు లల్లనల్లన నుల్లమును బల్లవింపజేయుచుండెను. మారుత కిశోరస్పర్శంబున నలకావళి మోమున ముచ్చటగొల్పునట్లు కల్లోలముజేయుచుండెను. ఆసమయమున ధ్యాననిష్ఠాగరిష్ఠుం డగు రాకుమారునికి సమగ్రసంసార *మోంకార రవధ్వనిత

*ఓంకారము:— ఓం యను రవము సోహమ్మను పరము పునీత తారకమంత్రజనితము. ఇయ్యది సంస్కృతభాషాపదము. దీని కర్థ మేమన:— అది నేనే, నేనదియే. అనగా పరమాత్మయే జీవాత్మ, జీవాత్మయే పరమాత్మ

మగుచున్నట్లు వినవయ్యెను. కండ్లు తెఱచిచూడ సమగ్రసంసా
రము నిస్తబ్ధముగను, శూన్యముగను నున్నట్లు విశదమయ్యెను.
సిద్ధార్థుని హృదయసరోవర మశాంతితరంగమాలికలచే నాందో

---

సోహమ్మను పదమును సంక్షిప్తముగా జేయుటెంచి యార్యులు స, హ యను
రెండు వర్ణములను దొలగించిరి. అంత ఓమ్ శేషించియున్నది. ఏతద్వర్ణ
ద్వయ సమ్మేళనమునే ఓంకార మనియెదరు. ఓమ్మనుదానినే హూణ
భాషయందు "That I am, I am that" అనియందురు. తాత్పర్యము. అది
నేనే, నేనదియే. పతితమాత్మ మానవుడు "పరమాత్మయే నేను. నేనేపరమాత్మ
భేద మెంతమాత్రము లే" దనిబోధ సేయుచుండును. ఆత్మప్రబోధమిద్దియని నేను
ముఖోక్తినే వినిపించుటలేదు. మానవుడా! నీఘ్రాణేంద్రియములనుండి యు
చ్ఛ్వాసము గొనునపుడు సహజముగనే సో అనియు నిశ్వాసమున హమ్
అనియు, స్పష్టముగ నొక రవ ముత్పత్తి ఐచున్నయది. నీవది ధ్యానముతో బరి
క్షించుకొనుము. అదియే యాత్మప్రబోధమని ప్రాజ్ఞప్రపంచము వాకొను
చున్నయది. మతగ్రంథము లిద్దానినే ప్రబోధము సేయుచున్నను. నీయవివేక
పూరితచర్యలగాంచి దేవు డన్యత్ర హుళక్కి, దేవళంబులకేగి పరాత్పరునన్వే
షింపవలదు. నేనే సర్వాంతర్యామిని. నీవు గమ్మనులేనండ నీయందే వెలయు
చున్నాడ. కాని నీవు నన్ను లెక్కింపకున్నావు. నాజెప్పహితోక్తుల నాల
కించి ముక్తిగనుము. పరమాత్మచే వక్కాణింపబడు నీవచనముల లెక్కసేయక
మూఢులు బాహ్యసంస్కారములకయి పరుగిడుచుందురు. అట్టివారికి "మేడి
పండుజూడ మేలిమైయుండును, బొట్టవిచ్చిచూడ బురుగులుండు" ననుగతియే
పట్టును. తారకమంత్రపఠనము మోక్షప్రదమని సంసారుల ప్రతీతి యిదియే. దీనిని
గూర్చి విపులముగ వ్రాయుట కిందుదావులేదు. వివిధవిషయముల లిఖియించి
యిప్పటికే గ్రంథమును విస్తరింపజేసితిని. నాచేవ్రాయబడు ప్రాణాయా
మ శాస్త్రంబున నీ విషయమును విశేషముగా ముచ్చటించెదను.

ళితము కాదొడంగెను. అంతమున కత దైహికవిషయవాసనల సంపూర్ణముగ బహిష్కరించుటయే శ్రేయస్కరంబని మది యందు భావించుకొనియెను సాయంతనమగుటగాంచి యత ్డాపుష్పవాటికను బాసి, స్వనికేతనమునకుఖిన్నుడై యరిగెను.

పుత్రజననము; శుద్ధోధనప్రబోధము.

సిద్ధార్థుడు ప్రతిదినము ప్రాతస్సమయమునుండి సూర్యా స్తమయ సమయపర్యంతము నేకాంతస్థలమున గూర్చుండి, యస్థిరంబును, మాయాకల్పితంబును నగు ప్రపంచమును గూర్చి గంభీరముగ నాలోచింపదొడంగెను. నిత్యము సాయం తనసమయంబున మందమారుత సేవనంబున నతని కొంకించుక తాపోపశాంతి లభ్యమగుచుండెను. విలాసమందిరమందలి భో గోచితపదార్థసంఘము నెల్ల నాకుమారు డంతటినుండి హేయ దృష్టితో వీక్షింపదొడంగెను. అట్టిపరిస్థితులయందే యశోధ రా దేవికి నవమాసములునిండ నొక్కపుత్రరత్న ముద్భవించి, త న్మాతృవదనారవిందమును మఱింత సాంసారికవ్యామోహ భా వస్ఫూర్తిచే నుద్యోగింపజేసెను. ఆకుమారరత్న మాదేవీలలామ కల్హారు భెల్లమగుటం జేసి, యా దేవి యనారతము దనయమూల్య సమయమును బ్రసూతికాగృహమున బ్రియపుత్రరత్న వదనేం దుబింబమును సందర్శించుటయందే యహోభాగ్యమని భావిం పుచు వ్యతీతముసేయుచుండెను. ఆమె కాప్రియాత్మజుండు ప్రాణసమానుడయి, దీపకళికాతుల్యమయి తనరారు తనజీవి

తమున కాధారమయియుండెను. గౌతము డాయమపాలికేగి నపుడెల్ల నా లలనాశిరోమణి భక్తిపురస్సరంబుగ నతని సుఖాసనాసీనునిగావించి, సంసారసౌఖ్యతత్త్వ ప్రిబోధముసేయుచుండెడిది. అనారత మాశశివదన నానావిధ శృంగారరస ప్రిపూర్ణలోకాభిరామాయణముల జెప్పుచు భర్తృస్వాంతమున కమందానందముగలుగజేయ శతవిధముల విశ్వప్రియత్నములు సలుపుచుండెడిది. భర్తకు హృదయాహ్లాదకరంబుగ నుండు నిమిత్త మాకుటిలకుంతల భూపాలనందనుల మనోజ్ఞభావమయ చరిత్రింబుల జెప్పుచుండును. ప్రాయికంబుగా నామదాశగామిని హృదయేశ్వరు నవలోకించి "మనోహరా! నాకు దమయుదాసీనభావమును వీక్షించుకతన స్వప్నావస్థయందయిన సుఖముకలుగుటలేదు. నిత్యము దుఃఖాగ్ని శరీరమును దహించి భస్మముజేసి వేయుచున్నది. పూర్వమొకప్పుడు స్మరించినంతనే స్వర్గీయసౌఖ్యానుభవమును బ్రిసాదించియున్న భవదభిధేయమే ప్రిస్తుత మత్యంతవిషాదమును నాహృదయమున కొదవజేయుచున్నది. ఆనందము మఱచియుయిన నన్ను సమీపించుటలేదు. నిత్యము భవన్నామమును సంస్మరించినంతనే ఖేద ముద్భూతమగుచున్నయది. గతం బెద్దియన దమరను దినము సంసారమునెడ వైముఖ్యభావమును వహించుచున్నట్లు నాకు భవదాచరణమునుబట్టి తెలియనగుచున్నయది. విజ్ఞులును, పరదుఃఖగ్రిహణ శక్తిసంపన్నులును నగు మీకు

నేనేమని విన్నవించుకొందును? భవదాకృతిని బ్రత్యక్షముగగాక కల్పనా నేత్రములచే గాంచినంతనే నామదిని వైరాగ్యభావ సంజనిత విషాద ముదిత మగుచున్నయది. సంసారమందలి సమస్త భూపాల కుమారులకంటె మీరు సకలైశ్వర్య సమన్వితులరు. సురేంద్ర వైభవోపేతులరు. సమస్తవిధ పవిత్రసాంసారిక సౌఖ్యానందములు దమంతట దామే స్వయముగ నేతెంచి, మిమ్ము వరింపుచుండును. అట్టి స్థితియందు మీ కేపదార్థాభావము తటస్థింపనేర్చు? సమస్తము హస్తగతమయియున్న నిట్టి శుభసమయంబుననే, జగన్నియంతయగు సర్వేశ్వరుని కృపావిశేషంబున లోకసామాన్య సుందరవిగ్రహుండగు పుత్రుడు సహితము నుద్భవించియున్నాడు. రారాజుల కెన్ని వైభవానుభవంబులున్నను, సంకష్టలమునం దిడికొని, లాలనపాలనము సేయ సంతానభాగ్యము లభ్యముకాదనెడి లోకోక్తి నిరర్థమగుడు, మీయంకసీమను దయామయుడు సార్థకమొనరించెను. మీకీ విరించిసృష్టియందు గొఱంతవడియున్న పదార్థ మెద్దియు గోచరింపదు. అట్లు గలదేని సమస్తవిధ పదార్థభండారములు తృటిమాత్ర కాలంబున బ్రాప్తించును. శుద్ధోధన భూపాలుడు పుత్రగత ప్రాణుడయి, మీపాలిటి సురద్రుమ (కల్పతరువు) మయియున్నంతపర్యంతము మీ సుఖమునకేమియు వాంతరము. వాటిల్ల నేర్చును? వాస్తవమటయి సమగ్రసంసారముయొక్క పరిస్థితులు

భవాదృశ పురుషోత్తములకు సృష్ట్యాదినే యా యిందిరాసుంద
రుని కృపవలన సానుకూలముగనే నిర్మింపబడియున్నవి. తమ్మం
బోలిన భాగ్యశాలురగు భూపాలనందను లీజగమున వినరారు;
కనరారు" అని మృదుమధుర కంఠస్వరంబున బల్కుచుండెను.

తద్వాక్య శ్రవణంబున సిద్ధార్థుని వదనబింబము పవిత్రా
సంస్కృత సువర్ణముపగిది శేషించియున్న వ్యామోహాకల్మ
షముబాసి చన, వైరాగ్య తేజఃకాంతులచే నొక వింతసౌంద
ర్యమును బడసి మిలమిల మెఱసిపోవుచుండెడిది. మమకార
మును గొల్పు యశోధరాదేవి పల్కులు, గంభీరభూధరము
నమితవేగముతో ప్రవింపుచు డీకొను సాగరోత్పన్న తరంగ
మాలికాచందమున నించుకయయిన సిద్ధార్థుని జలింపజేయజా
లకపోయెను. నిశ్చలభావ నిబిడీకృత హృదయుడయి, యా దేవి
మాటల నాత డాలకించి మిన్నక మౌనముద్రితుడయి యుండు
వాడు. దేవియు హృదయేశ్వరుని వైరాగ్యవ్యాధి కౌషధమును
గానక, నిరాశాప్రచండప్రభంజన ప్రహారంబున భూమింగూలు
కదళీతరువుంబోలె భూతలపతితయయి మూర్ఛజెందుచుండెడు.
దీర్ఘదృష్టినారసి, యశోధరాదేవి వైరాగ్యమునకు శృంగార
రస భూయిష్ఠంబులగు భోగములే జన్మశత్రువులని గ్రహిం
చినదయి, యనుదిన మాత్మీయ శయన సదనమును సతిరమణీ
యముగ గామోత్పాదక శృంగార పదార్థములచే నలంకరిం
చుటయందు నిజబుద్ధిచాతుర్యమును బ్రదర్శింపజొచ్చెను.

కాలచక్రము రయమున బరుగిడిపోవుచుండెను. ప్రకృతీదేవి నిజానూనాద్భుత సామర్థ్యమును సంసారమునకు నిరంతరము జాటుచునేయుండెను. పంచభూతములు దైవాజ్ఞచేనేమి, స్వభావసిద్ధంబుగనేమి ప్రపంచ హితాహితముల గావించుటయందే లగ్నమయి యుండెను. అమావాస్యనాటి రాత్రి గగనమండలమున నగణితంబుగ నుదయించు తారకాసముదాయంబుల పగిది వేనవేలుగ జీవరాసులుదయింపుచు నస్తమింపుచుండెను. భాస్కరుడు నిరంతరము విశ్రాంతియనునది లేక యుదయాద్రినుండి యస్తాచలమునకును నస్తాద్రినుండి యుదయాద్రికిని దీర్ఘప్రయాణము సలుపుచు, లోకకళ్యాణము గావింపుచునే యుండెను. మృగతృష్ణనుబోలియుండు మాయాప్రపంచ మనిశము జీవకోటిని, వారకాంత విటునాకర్షించుచందమున నిజమాయవాగురమున బడజేయుచునే యుండెను. కాని సిద్ధార్థునకు వింతగొలుపవలసిన సంసారము యొక్క స్థితిగతులే విషాదమును గలుగజేయుచుండెను. ఎంతప్రయత్నించినను, విచారించినను సిద్ధార్థునకు సృష్టితత్వ మిదమిద్ధమని విస్పష్టపడదయ్యెను. ఒకవంక ప్రపంచనిరసనభావము, మరియొకదిక్కు పుత్రకళత్ర, జననీజనకాదుల ప్రేమభావము సిద్ధార్థుని హృదయమున ద్వంద్వ యుద్ధము సేయుచుండెను. అస్థిరప్రపంచ నిషేధభావమునకే ప్రాయకంబుగా విజయమొదవుచుండెను.

రాకుమారు డొక్కదివస మిట్లాలోచింప దొడంగెను :-
"నాహృదయము సాంసారిక భయవిషాదములచే నిప్పటికే యెంతయో కుంగి కృశించిపోయినది. ప్రియమా దృష్టికి గోచరింపకుండగనే గతించిపోవుచున్నయది. వాస్తవ మాలోచింప ధర్మమును, నిర్వాణమును బడయ వాంఛించు పురుషోత్తమునకు బాల్యముతోడ నిమిత్తములేదు. వృద్ధాప్యము నిర్వాణమార్గాన్వేషమున కంతరాయమును గల్పింపజాలదు. కాని ధర్మకార్యము నాచరింప దరుణప్రాయమే యుక్తమయి నది. వార్ధక్యమునం దాయువు క్షీణించును. బుద్ధియు, సర్వేంద్రియశక్తులును శుష్కించిపోవును. కనుక యుక్తప్రాయమే మాయని ప్రచండశక్తిని డీకొని విధ్వంసముగావింప నర్హమయినది. యుక్తప్రాయమునందే యప్రమత్తుడయి, స్వోత్కృష్టచే సద్ధర్మానుష్ఠానము గావించునరుని యాయురారోగ్యైశ్వర్యము లభివృద్ధిజెందును. అయినచనగా నిష్ప్రయోజనమును దుష్కార్యాసక్తంబును నగు సమయముకాదు. భగవచ్చింతన యందు సంలగ్నమయియుండు శుభకాలము. ఐశ్వర్యములన నశ్వరంబులగు భౌతికసంపదలుకావు, శాశ్వతములయిన నీశ్వరీయశక్తులు. నేనింక కాలవిలంబనముసేయక, యుక్తధర్మపథము ననుసరించుటయే శ్రేయస్కరంబుగాని పుత్రకళత్ర జననీజనకులకు విషాదము నెట్లు కలుగజేయుదునా యని మది శంకింపుచున్నయది. నేను గృహస్థాశ్రమమును బహిష్కరిం

తునేని మాతాపితలకు దీరని క్లేశంబును, హృదయేశ్వరికి మర ణబాధయు నవశ్యమొదవును.'' తనదగు నుద్దేశమును యశోధ రా శుద్ధోధనుల సముఖంబున నతడు వెల్లడించెను. పుత్రుని హృదయవిదారకంబగు ప్రసంగము నాలకించి, సహజపుత్ర వాత్సల్య భరితహృదయుండగు శుద్ధోధనభూపతి గద్గదకంఠు డయ్యెను. శ్రీముఖమునుండి మాట వెలుపడదయ్యెను. కో మలహృదయము నతడు పాషాణముగావించుకొని, కుమారుం డగు సిద్ధార్థునితో నిట్లు మెట్టువెట్టుకొన జొచ్చెను. ''కుమా రా! ఎంతమాటనంటివి; జననీజనకుల మరణమును, యశోధరా మృత్యువును నీ వభిలషింపుచుంటివాయేమి? నీహృదయమింత కాఠిన్యము నెట్లుసహింపనేర్చినది? సంసారము నెడబాయవల సిన యావశ్యకత యిపుడేమికల్గినది? ఏకారణముచే నిన్నా రతము దుఃఖము బాధింపుచున్నయది? నీకీసంసారమున నేపదార్థ ము కొఱవడియున్నది? అతులైశ్వర్యమున కధీశ్వరుడనయి యుండ, రమణీమణులెందరో వీణాదిసంగీత సాధనములచే నీకు శ్రవణానందకరంబులగు గీతములబాడి వినిపించుచుండ, హాయిగ సమయమును వ్యతీతముసేయక దుఃఖించెదవేల? లెక్కకుమిక్కిలిగ దాసదాసీజనులు నీకుసేవజేయ ముకుళిత హస్తులయి వేచియుండ నీకుకొఱంత యేమివాటిల్లును? గుణవ తియు రూపవతియునగుయశోధరాదేవి నీకుపత్నియయి, సమస్తో పచారములుసేయుచు, నీహృదయమున కాహ్లాదమునొదవజే

యుచుండ జింతింపఁబనియేమి? పృథ్వియందే భూపాలకుమారు నకు లభ్యముకాని సమస్తవిధసౌఖ్యములు నీ యందజేరియుండ నీ వెందులకు దూరదృష్టిలేక, సంసారమును దిరస్కారభావం బుతో వీక్షించుచున్నాడవు? నిన్నుబడసి నేను స్వర్గీయసౌఖ్యా నందముల ననుభవింప సమర్థుండ నయితిని. నిన్ను గాంచియే, ప్రాణసమానయగు త్వన్మాతృవియోగమును సహితము విస్మ రింపగలిగినాడను. నీవే నాకు ధనమాన ప్రాణసర్వస్వము. నీవీ సంసారమును వర్జించి, తపమాచరింపజనుచో నాకుమరణమే శరణ్యము." శుద్ధోధనభూపాలుని ముఖమునుండి యీమాటలు బహిర్గతమయినంత నేడగ్గుత్తికయయ్యెను. మరి మాటలాడజాలక పోయెను. చాలాసేపటివఱకు నేత్రయుగ్మమునుండి బాష్ప కణములు జలజల రాలదొడంగెను. పితృదేవుని యాదుఃఖితా వస్థను విలోకించి సిద్ధార్థుడిట్లు ప్రబోధింప మొదలిడియెను:—

సిద్ధా:—జనకా! నన్ను మీరు భయవిషాదములనుండియు, మహాభయంకరంబులగు వ్యాధిసమగణములనుండియు సంరక్షింతురేని నేను స్వప్నమంద్రైన బ్రపంచమునెడ నిరసనభావమువహింపక, గృహస్థాశ్రమ మందే శాశ్వ తముగనుందును.

శుద్ధో:—కుమారా! నీవచనము నాలకించి నేనిపుడు కింకర్తవ్య విమూఢుండనయితిని. ప్రకృతి యొక్క నియమములనుల్ల ఘించు సామర్థ్య మీసృష్టియం దెవనికిగలదు? మహా పురుషులు సహితము సర్వసంగపరిత్యాగులయి, కఠో

రతపము లాచరించియుండియు, మృత్యుముఖమునుండి తమ్ము సంరక్షించుకొనజాలకపోయినది. వారు ప్రలోభనాత్మకంబగు సంసారమును, ధర్మసాధనమునకు బ్రతిబంధకమని గ్రహించి, కోలాహలశూన్యంబులగు గిరి గహ్వరములను, వృక్షసంఘ సమాకులంబులగు నరణ్యములను, దపోభూములుగ నేర్పఱచికొని సాధనము జేసియుండిరి. కాని మృత్యువునుండి తప్పించుకొనగల్గిరా? సుతుడా! నావాక్కునాదరించి, నాసుఖము నపేక్షించి, యెటకునరుగకుము. ఇందే యుభయులహితము రక్షితమయియున్నది.

సిద్ధా:—తండ్రీ! ఏనాడు నేనీ నశ్వరంబును, పరివర్తనశీలంబును నగు నికృష్టప్రపంచమును చిత్రవిచిత్రము లగు ఘటనాపరంపరలను, కోలాహల పరిపూర్ణంబగు బాహ్యదృశ్యమయ ప్రపంచమునుగాంచి, ఉద్భ్రాంతభావపరిత్యాగము గావించి ధైర్యస్థైర్యముల నాత్మాంతరాళమున బ్రవేశించి సాంసారిక విషయములగూర్చి దీర్ఘముగ విచారించితినో నాడే నాహృదయమునందు ప్రయత్నముగ నీప్రశ్న యుత్పన్నమయినది:—

శుద్ధో:—సిద్ధార్థా! ఈయశాశ్వతంబగు సంసారమున శాశ్వతమైనపదార్థ మదెద్దికలదు? ఈ సృష్టియందుస్థిరముగానున్నంటియుండు శాశ్వతానందసంధాయకంబగు పదా

ర్థ మేదియయిన గలదా? ఆత్మ కనాగత మానంద ముదయింపజేయు వస్తువేది?

సిద్ధా:—పితృదేవా! నాయంతఃకరణ మడుగు నీ ప్రశ్నముల కేమి యుత్తర మొసగెదవు?

శుద్ధో:—నాయనా! అల్పప్రాయంబున రాజ్యమును, భాగ్యమును, పుత్రుని, కళత్రమును, జననీజనకులను, ప్రజలను విడనాడిపోవుట పాడియా? పితాప్రజ్ఞా పరిపాలనము పుత్రధర్మము కాదా? శ్రీరామచంద్రుని విస్మరించితివా? ఆత డాదర్శపురుషుడుగ బ్రపంచముచే నారాధింపబడుచుండుట లేదా? భౌతిక ప్రపంచము సహిత మొకవిధముగ సుఖకరమయినదే..

సిద్ధా:—జనకా! నేజేయు యన్యాయ మదెద్ది? స్వకీయహితమున పేక్షించియు, ప్రాపంచిక శ్రేయము నభిలషించియు నేను సత్య ధర్మముల నన్వేషింప నరుగుచున్నాడను. ఇందు నాదోష మేమియున్నది? పరహితమునకయి ప్రాణము లర్పించుట సత్పురుషుని ధర్మముగాని పరాహితమునకయి కాదు. నేనిటనుండుటం జేసి మీకుగల్గు హితమేమియు లేదు. నన్ను ను నా భార్యాపుత్రాదులను గాంచి మీరు మరింత విషయలంపటులరయి, వ్యామోహమున జిక్కి, వ్యామోహఫలితమగు దుఃఖమును లేక, నరకమును బడయుదురు. నా యొడబాటు

నకు సహింతు రేని, మీహృదయముల మమకారభార మొకింత క్షీణించి, మిమ్ము నిర్వాణప్రాప్తికి సన్నద్ధుల జేయును. సర్వజ్ఞుండును, సర్వజీవ దయాపరుండును, సర్వభూతములకు సాక్షియు నగు నప్పరమేశ్వరుని యాజ్ఞల బాటింప నుద్యమించు నేను మీయాజ్ఞను దృణీకరింతునా? నేనెల్లర బ్రేమించెద. అవసరమగు నేని యెల్లర బరిత్యజించెద. ఎల్లరహితమునకయి యసువుల నర్పించెద. పుత్రకళత్రాది యాత్మీయులును, సంసారము యొక్క సమస్త సౌభాగ్యములును నీచాతినీచములు; దుఃఖకరములు. ఈవిధమయిన యాత్మచింత జాగృతమయినపుడే మోహము పటాపంచలయి పోవును. సంసారబంధనము ఖండితమగుడు, వైరాగ్యము చిత్తము నాక్రమింపుచున్నయది. సంసారము నసిత్యమని భావించుటయే ధర్మాంకురమును హృదయ క్షేత్రమున నాటుటయయియున్నది. ఒక్కసారి శిధిలముగానున్న సౌధమునుండి పారిపోయి, సురక్షితమగు భవనమ్మున బరిత్రాణమును బడయ మానవుడు దృష్ణచిత్తుడగు చందముననే, ధర్మపిపాసార్తుడగు మానవుడు జరామరణ సంభరితంబగు సంసారమును దృజియించి వేయుచున్నాడు. పితృదేవా! యుక్తాయుక్తముల బాగుగ గుర్తెఱింగి, మీరు నాకాజ్ఞ యొస

గీ:చో నేను సత్వరమరిగి, చిదానందమయంబును, చిర సుఖపూరితంబును, శోకతాపజరామరణ శూన్యంబును నగు పీయూషధామంబు నన్వేషించి గ్రహించి లోక కల్యాణమును గావించెదను. స్వార్థమయంబగు నస్థిర సౌఖ్యమునకయి లోకముయొక్క శాశ్వతానందమును భంగమొనర్చుట విహితధర్మముకాదు. తండ్రీ! సర్వము నెఱింగిన నీకేమి విన్నవింతును? పుత్రుని మనోభీష్టము సిద్ధింప నన్నాశీర్వదింపుడి." శుద్ధోధన భూపాలుడు దృఢసంకల్పచిత్తుడగు పుత్రుని నిజధర్మమునుండి విముఖునిగావింప బ్రయత్నించియు, దనచే గాదని గుర్తెఱింగి, మౌనముద్రితుడయ్యెను. "మౌనం అర్థాంగీకారమ్మ"ని సిద్ధార్థుడు భావించుకొని, శుద్ధోధ నోపదేశమును బెడచెవిని బెట్టెను.

## సిద్ధార్థుడు మూఢుడగు సుహృద్వరునికి బోధించుట.

ఒకదివసమున సిద్ధార్థకుమారుడు పుష్పోద్యానమున నేకాంతముగ గూర్చుండి, నిజప్రయాణమును గూర్చి విచారింపుచుండెను. తత్సమయమునందే యొకరమణీమణి యాధ్యాత్మిక గీతంబుల బాడుచు, నామార్గముననే యరుగుచుండెను. అది దివ్యసుందర ప్రభాతసమయము. తద్దివ్యాంగనాముఖోద్గత వేదాంత భావాన్విత ప్రభాతమాంగలిక గీతాశ్రవణంబున సిద్ధార్థుని వైరాగ్య భావములు మఱింత హెచ్చెను;

అతని నిద్రితభావంబు లన్నియు జాగరితంబులగుడు, నతడు గంభీర జ్ఞానభావపూర్ణ సులలిత గీతాశ్రవణానంద రస ప్రవాహంబున దేలియాడ జొచ్చెను. అత డంత నిమీలితనేత్రుడయి సర్వేశ్వరుని ధ్యానించి, మానవజీవితము ను గూర్చిన పునర్విమర్శనమునకు గడంగెను. తత్సమయమున కే సిద్ధార్థుని మిత్రుడొక్కరుం డతని నన్వేషింపుచు నచ్చోటి కరుదెంచెను. అతడు రాకుమారుని బంధుకోటిలోనివాడే. సిద్ధార్థునియెడ నతని కపూర్వంబగు వాత్సల్యమును, శ్రద్ధ యుగలదు. కాని వారిరువురి భావములయం దింతపర్యంతము నైక్యత యేర్పడకపోవుటయే కడువింత. మిత్రాగమనమునుగాంచి, సిద్ధార్థు డతని నాదరపూర్వకంబుగ వనపరిక్షాసీనుని గావించుకొనియెను. క్రింద నుదహరింపబడు చందమున సిద్ధార్థునికిని, విలాసపరుడగు నతని యాసుహృద్వరునకును సంభాషణము సంఘటియించెను :—

సుహృ:— నేస్తమా! సుధాకరబింబమును హసియించు వదనారవిందమునుగల్గి వహ్నిసంస్కృత సువర్ణచ్ఛాయను గేరుశరీరమునుగల్గియుండు మానవునిజీవితము సంస్తవనీయముకదా! ఈ మనదేహమే యమందానందకందమని నాయూహ. ఈకాయంబు నాధారముగజేసికొని, మానవకోటి యిహలోకంబున ననుభవించు మహాసౌఖ్యముల వర్ణింపనేరితరము? సమస్తవిధసౌఖ్యానందము

లనిరంతర మనుభవింప మనకీదివ్యమానవత్వము ప్రసాదించిన నిర్వ్యాజకరుణాసాగరుండగు సర్వేశ్వరునికెంతయు మనముకృతజ్ఞులమైయుండవలయును. వాస్తవమగయ దేహముయొక్క సాహాయ్యంబుననే శాశ్వతానందము లభ్యము కాగలదు. తనుధారిజన్మ మెంతయు ప్రశంసనీయము; సార్థకము. దేహేంద్రియజనితానందగరిమ కేవల మనుభవైకవేద్యమేకాని, కల్పనాచతురులగు కవుల నేర్పు కలవియయినదికాదు. దేహేంద్రియంబుల సాహాయ్యంబున మానవుడుపడయు మహద్భాగ్యములనే శాశ్వతంబులగు స్వర్గీయసౌఖ్యంబులనజెల్లును. బుద్ధిమంతుడయి మానవుడు దైహికసౌఖ్యముల ననుభవించుటయే హితకరము.

సిద్ధా:— జ్ఞానకిరణాభేద్య మేధాశిఖామణివగు నో నెచ్చెలీ! ఏమందును? యుష్మద్వాక్యంబు లర్థశూన్యంబులగు వ్యర్థప్రలాపములు; సాంసారిక వ్యామోహపరీత హృదయసంజనిత నికృష్టవచనములు. భయంకర పరిణామప్రదములు. యుష్మన్ముఖోద్గతనీరసవచన ప్రకారంబున నీయందు మానవోచిత భావస్ఫూర్తి లేనట్టు గ్రహింప శక్తుండనయితి. వినుము. మానవదేహ మశాశ్వతము; క్షణభంగురము. నిరంతర పరివర్తనశీలము. అజ్ఞానముచే నాచరింపబడు కర్మపరిణామస్వరూపమగు

నీ చూపుడుగుఱ్ఱమే యాత్మస్వరూపులమగు మనకు సంప్రాప్తమయ్యెడిని. "నామరూపక్రియ లరయ నశ్వరము" లను వచనానుసారంబుగనే కర్మానులబ్ధమగు నీదేహము నశ్వరంబని వేఱుగ వక్కాణింపవలయునా? కౌమార, యౌవన, వార్ధక్యాది నిరంతర పరివర్తన గుణములే ధ్రువముగ దేహముయొక్క యశాశ్వతత్వమును సహస్రముఖంబుల నుద్ఘోషింపుచున్నయవి. నిరంతరము పరివర్తనమగు పదార్థము లేవియు శాశ్వతములు కావు. అపరివర్తనశీలంబగు జ్ఞానస్వరూపం బొక్కటియే నిత్యంబును, సుస్థిరంబును, శాశ్వతానంద ప్రవర్థకరంబును, గ్రాహ్యంబును నయి సర్వత్రి వెలయుచుండును. సచ్చిదానందస్వరూపమగు నాత్మను కామక్రోధాది నీచచిత్తవృత్తులును, కర్తృత్వ భోక్తృత్వాది నశ్వరాభిమానంబులును, భూత భవిష్యద్వర్తమానకాలత్రియంబును అవస్థాభేదంబులును సంసార చక్రపరివృతగుణత్రియంబును, దివ్యప్రకాశ భాసురంబగుకతన స్పృశింపనేరవు. అనాత్మ నిత్యము పరివర్తనమగుచుండును. ఆత్మ నిరంతరాపరివర్తనశీలము, అద్వితీయము, అపార గుణప్రభావమండితంబు; నిరుపమానము, నిర్వికారము, నిర్వికల్పము, నిరంజనము, నిర్గుణము, నిత్యము, నిశ్చలము, నిర్మలానందచంద్రికావిల

సితము. ఆనాత్మ, అనృత జడదుఃఖమయము. ఆత్మ, సూనృతచైతన్య సుఖపరిపూర్ణము. దేహ మనాత్మాంశ సంభూతము, రజస్సత్వ తమోగుణాచ్ఛాదితము. ఏతద్గుణత్రియము నే సృష్టిస్థితిలయంబులకు హేతుభూతంబులగుడు నార్ష మతానుకూల సిద్ధాంతప్రోక్తంబగుహిందూమతము బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తులుగ భావించి యారాధింపుచున్నయది. వీనితో మనకిట బని లేదు. జీవాత్మ పరమాత్మస్వరూపమె. జీవాత్మ పరమాత్మల యందు వ్యష్టి సమష్టి భావములే గోచరమగుచుండును.

కలిమిలేములును, అహర్నిశములును, కృష్ణ శుక్లపక్షములును నెట్లు సర్వదా పరివర్తనమగుచు నిజాస్థిరత్వమును వెల్లడింపుచున్నయవో యదియేచందమున సుఖదుఃఖము లశాశ్వతములు. వీని ననుభవించు దేహముసహిత మంతియే యని గ్రహింపనగును. అశాశ్వతంబును, చైతన్యగుణరహితంబును నగు మృత్తికావినిర్మిత కాయ మెట్లు నిత్యంబును, జ్ఞానస్వరూపంబును నగు పరమేశ్వరాంశ సంభూత సుస్థిరానందమును బడయనేర్చు? దృశ్యసంపర్కనంబున ద్రష్ట యనుభవించు సౌఖ్యానందములన్నియు గల్పితములె సాంసారికజనులచే సుఖమని భావింపబడునదియే వాస్తవమగు దుఃఖము. దుఃఖముగ బరిగణింపబడునదియే యథార్థమగు సుఖము. నిత్యమగు పరమాత్మాంశసంభూతం బగు నానందమునకు పరివర్తనము లేదు.

నీవు దేహముచే శైశవావస్థయందు బడసిన యానందానుభవము నిపుడు వడయుచుంటివా? నీ పూర్వవయోరూపక్రియల యందును, ప్రకృత వయోరూపక్రియలయందును భేదము దృష్టిగోచర మగుచుండుటలేదా? నిన్నావహించిన పూర్వోదాహృతంబులగు నవస్థలు మూడును బ్రాణికోటికి విధాతయే విధించినట్లు స్పష్టమగుచున్నయది. దేహభ్రాంతిని గల్గియుండుటయే యవివేకము లేక యజ్ఞానము నాబఱగు. ఏతద్విధభ్రాంతిని వర్జింపగల్గుటయే జ్ఞానప్రాప్తి యనబడుచున్నయది. సంసారరంగ ప్రాప్తంబులగు సమస్తవిధ చిత్తవికారముల బడయునది దేహమెగాని పవిత్రాత్మ కాదు. నశ్వరంబగు దేహమును నశ్వరంబులగు గుణములే చుట్టుముట్టియుండును. ఆన్లికశాఖయని భ్రమించి, కునగబొమ్మను గేలంబూని యూగులాడువాని గతియే దేహభ్రాంతిచే బవిత్రాత్మతత్వమును గ్రహింప నశక్తుండగువాని నావహించుట నిక్కువము. నేను నీవను భేదము నశ్వరంబగు తనువునకు జెందునట్టి మిథ్యాభిమానమేగాని వేరొండుకాదు. అదియు దేహమునకే చెందును. మిథ్యాభిమానపూరితంబగు దేహమునకు బద్ధమయియున్న యాత్మకు ముక్తివలయునన్న నట్టి యహంకార మమకారముల బహిష్కరింపవలయును. నిన్ను నీవెఱుంగుటయే జ్ఞానము, లేక పరమేశ్వర సాక్షాత్కారము. నిన్ను నీవెఱుంగకుండుటయే యజ్ఞానమనియు, బ్రకృతియనియు, దమస్సనియు, మాయయనియు

దేహమనియు నార్యులు చెప్పుచుండ నాలకించియుంటిని. ఇద్దా నినే నశ్వరంబులగు నానానామములచే బిలుచుచుందురు. మాయయన సత్యమును నసత్యముగను, అసత్యమును సత్యము గను దృగ్గోచరము సేయునది. అద్దాని స్వభావము మృగతృష్ణను బోలియుండును. మాయ యొక్క పరిభావంబుననే మానవకోటికి రజ్జు సర్పభ్రాంతి యొదవుచుండును. ఉన్న దున్న రీతిగ దర్శింపజేయునదియే జ్ఞానము. అజ్ఞానవిశేషంబున రాగద్వేషాది కుప్రవృత్తులును, వానిచే గర్మయు గర్మవలన గాయధారణయు సంఘటియింపుచున్నయది. చిత్తశుద్ధిచేగల్గు సమస్తవిధ భక్తిపూజాది సత్కర్మలవలన జిత్తశాంతి లభ్యమయి, సుగతిని బ్రాప్తింపజేయును. శాంతియుక్తుండగు మానవుడాత్మానాత్మమీమాంసవలన నిత్యమగు జ్ఞానప్రసాదమును బడయుట యథార్థము. కామాదిదుర్గుణగణ పరిభావకృత దుష్కార్యపరిణామము ననుభవించునది మానసమె. దుష్కార్యములకు సమస్తవిధేంద్రియముల బ్రోత్సహించునదిసహిత మదియె. మానసముపై నాధిపత్యమువహించితిమేని మనము మాయయను జవనిక నతిక్రమించి, యద్దానికి బాహ్యముగ నున్న దివ్యజ్యోతిని దర్శింపగలమట. తెర మరుగుననున్న సూత్రధారుని దర్శక బృందము నీక్షింపజాలని చందముననే, మనస్సునకు వశులయియున్న మానవులుసహిత మద్దానికి విభిన్నమయియున్న స్వయంప్రకాశమును గాంచ నశక్తులు.

మిత్రుడా! బంధనముక్తులకు సహితము మానసమే మూలకారణమగుచున్నయది. సంయమవ్రతమున కధీనమయి పోయినట్టి మానసమును గల్గియున్న వ్యక్తి సత్తముం డద్వితీయానందమును బడయును. నిరంకుశముగ జరించు మనమును గల్గియున్నంతపర్యంతము నరుడు నశ్వరంబగు దేహబంధనముల నుండి విముక్తిని బడయలేక జననమరణ చక్రమున బడునందురు, ధర్మజ్ఞాన పిపాసార్తులు సజ్జనసాంగత్యమును బడసి, వివేకము నంది, భవసాగరమునుండి తరింప శక్తులగుదురు. జిజ్ఞాసువు కానిమూఢుడు జీవన్ముక్తిని బడసినవ్యక్తి నాశ్రయించినను లాభము హుళక్కియే యగును. బధిరునిచెంత నూదిన శంఖము యొక్కధ్వని సార్థకము కాదుగదా! మూర్ఖులవిషయమయి పెద్ద లేమనుచున్నారు:—

"అధీత్యాపి చతుర్వేదం। సర్వశాస్త్రాణి సర్వశః,
బ్రహ్మతత్వం నజానాతి। దర్వీపాకరసంయథా।"

తాత్పర్యము:—చతుర్వేదముల సాంగోపాంగముగ నధ్యయనము జేసినవాడయ్యును, సమస్తశాస్త్రంబుల నాద్యోపాంతముగ బఠియించినవాడయ్యును, మానవుడు, పాకసాధనమయ్యు బాకరసాస్వాదనశక్తి విరహితమగు నబకవలె పరబ్రహ్మతత్వ యాథార్థ్యమును గ్రహింపజాలడు. అనగా పరబ్రహ్మ యాథార్థ్యమును బడయ జిత్తశుద్ధిచే గావింపబడు సత్కర్మలేనిదే వేదాధ్యయన శాస్త్రపఠనంబులచే దెలియనేరడని

భావము. సంగడీడా! నేను నిన్ను దూరుటలేదు. పరిహసిం చుటయు నామతముకాదు. వినియు నాచరింప బ్రయత్నము సేయనివారి దుస్థితినిగూర్చి విలపించుచున్నాడను. నీ వచనము లన్నియు మిథ్యాభిభూతములు; నిర్హేతుకములు. అజ్ఞాన స్వరూపంబగు వ్యామోహముచే బూర్ణమయియున్న హృద యము యొక్క భావములన్నియు మిథ్యాన్వితములయి యుం డక యథార్థము లెట్లగును? అజ్ఞాని యెన్నిమాటలు నేర్చి యున్నను బ్రయోజన మీషణ్మాత్రమయిన లభింపనేరదు. అతని సమస్తభావములు, కార్యములు నవివేక ప్రకాశవిలసిత ములయి యుండును. ఇప్పటికయిన దేహ మస్థిరంబనియు, నస్థిర దేహలబ్ధసౌఖ్యంబులుసహిత మట్టివే యనియు, బరబ్రహ్మ లేక జ్ఞాన మొక్కటియే సుస్థిరంబనియు దెలియుము. అట్టి నిత్యం బగు పదార్థాన్వేషణ ప్రయత్నమే సర్వోత్తమము. బద్ధాత్ముం డగువాడు విహితధర్మ మిదియేయని భావింపుచున్నాడు. నేను సహిత మీ ప్రయత్నమునందే యుంటిని. ఆర్యుల సందర్శించి జ్ఞానవిషయిక ప్రసంగముల జఱుపుచుంటిని. కాని యింతపర్యం తము ననుభవసిద్ధమయిన జ్ఞానము లభింపలేదు "ఉద్యమేనహి సిద్ధ్యంతి కార్యాణిన మనోరథైః" యను గురుజనవాక్యము ను బాటించి, ప్రవృత్తిలేక యుద్యమమునకయి ప్రయత్నింపు చున్నాడను. పురుషకారము నిష్ప్రయోజనము కాజాలదు. ఫలాపేక్షనువీడి, యాచరింప మనియెదరు విజ్ఞులు. నీచే సుస్థిరా

నంద సంధాయకంబులని భావింపబడు సౌఖ్యంబులన్నియు దుఃఖోత్పాదకములే; నశ్వరములె; భ్రమాన్వితములె. చెలి కాడా! వ్యామోహమును బాయుము. అది సర్పముసందుండు విషముకంటెను, వజ్రము యొక్క యాఘాతముకంటెను, భయంకరంబగు నశనిపాతముకంటెను, ప్రచండాగ్ని జ్వాలా స్పర్శముకంటెను, బాధ యొదవుచు నేయున్నది. నిద్రింపకుము. మేల్కొనుము. శోకరివగు టనుచితము. ఉద్యోగివగుము. దుష్కార్యమును సేయకుము. సత్యజ్ఞానబీజముల హృదయ క్షేత్రమున వెదజల్లుము. విషఫలముల ననుభవింపవు. అమృత రసోపేతములగు ఫలములనే యారగించి, సుఖింతువు.

సుహృ:—ప్రియసహోదరా! సిద్ధార్థా! నీకువందనము లాచ రింపుచున్నాడ. శ్రావకంబగు శ్రీముఖమునుండి వెలువ డిన వాక్యము లమూల్యరత్నములు. ఏతద్రత్న దివ్యప్ర కాశ సాహాయ్యంబున నేను—కర్తవ్యజ్ఞానదూరుండన గు నేను-దేహభ్రాంతి యుక్తుండనగు నేను—ఇహలౌకి క సౌఖ్యానందానుభవాభిలాషినగు నేను, అవివేకాంధ కారబంధురంబగు సంసారక్షేత్రమున ధర్మపథము నన్వేషించుటయందు సఫలీభూతుండ నగుదునని యే విశ్వసింపుచున్నాడను. నిరంతరాశాశ్వతమందిర భోగ ముల నాకాంక్షించు మూఢమానవులకు సహిత ము దయామయుండగు సర్వేశ్వరు డవివేకతమ పట

లాచ్ఛాదితంబగు సంసారమున మార్గము నన్వేషింప నా శ యను నొక్క కరదీపికను బ్రసాదించియున్నాడుకదా! ఆ విశ్వాసమే నా మదియందు వెలయుచున్నది. ఆత్మా నాత్మవిచారణకు బూర్వము చిత్తశుద్ధి వలయునంటివి కదా. అద్దాని విషయమయి నీవు పెద్దలవలన గ్రహిం చిన విషయమును దెల్పుము. నేడు నిన్ను దర్శించుటెం తయు బ్రయోజనీయంబాయెను.

సిద్ధా:—ప్రియభ్రాతా! ఆత్మ నిత్యమనియు, అనాత్మ యని త్యమనియు వ్యక్తీకరించితినే యుంటిని. ప్రకృతి-అన గా ననాత్మ సర్వదా వికారస్వరూపిణియనియు, నాత్మ ని త్యశాశ్వత జరామరణ రహితంబనియు నిప్పటికి నీకు హృదయంగమ మయి యుండనోపు. ప్రకృతిస్వరూపం బగు దేహ మవస్థాభేదమునకు సంప్రాప్తమయి, మృత్యు వాతం బడుచుండుట మనము కనులారగాంచుచునే యున్నారము. ఏతదనిత్య పదార్థమున కతీతమయినదియే యోంకార స్వరూపంబగు నాత్మ. తదాత్మజ్ఞాన మును బడయుటయే మానవుని విధ్యుక్తధర్మము. పురు షార్థ చతుష్టయంబులగు ధర్మార్థ కామమోక్షములు సహితము నాచరణీయములే యని యార్యులు వక్కాణిం పుచున్నారు. నిజానిజంబుల గుర్తెఱుంగని మానవుని జన్మము వృథాయగును. ఆత్మసందర్శనమునకు శమద

మాదిషట్కసంపత్తిని, భక్తిజ్ఞానవైరాగ్యముల బడ యుటయే మానవుని ధర్మము. ధర్మమాహాత్మ్య మెట్టి దనిన.

శ్లో॥ "నజాతుకామ న్నభయా న్నలోభ।
ధర్మం త్యజే జ్జీవిత స్యాపి హేతోః॥"

తాత్పర్యము :— కామముచే నేమి, భయముచే నేమి, ధనాశచే నేమి తుదకు ప్రాణనుమీది యాశచే నేమి, యొకప్పు డయిన ధర్మమును బరిత్యజియింపజనదు. ధర్మస్వీకారంబువల ననేగదా మానవునకునిత్యమగు పదార్థము కరతలామలకంబగున ది. ధర్మమనగా నిజమగుశమదమాదులబోధించి, కామక్రోధా దుల దూరము సేయ మనునదియే. శాశ్వతంబగు బ్రహ్మతత్వ మును సంప్రాప్తింపజేయు ధర్మము మహాత్వపటుత్వ సమన్వి తంబు :—

శ్లో॥ నిత్యోధర్మః సుఖదుఃఖే త్వనిత్యే
జీవోనిత్యో హేతురస్యత్వ నిత్యః॥

తాత్పర్యము :— ధర్మముశాశ్వతమయినది సుఖదుఃఖ ములు రెండును ననిత్యములు. జీవుడునిత్యుడు. వానికి గారణ భూతుడయినవాడు (ఈశ్వరుడు) నిత్యుడు. కనుక సోదరా! ఆ త్మానాత్మ విచారణయే మానవుని సత్యధర్మము. తద్ధర్మ నిర్వ హ ణోపక్రమణమునకుబూర్వ మంతఃకరణ పారిశుద్ధ్యమును

బడయవలయును. కాన సద్ధానికి ప్రతిబంధకములగు చిత్తవృత్తుల బరిత్యజించుట శ్రేయస్కరము.

చిత్తవృత్తులను గూర్చియే నీవు ప్రశ్నించియుంటివి. అవి ద్వివిధములయి పరగుచున్నవి. 1 దుర్విషయాసక్తంబులు, 2 భగవద్విషయక పవిత్రభావాన్వితములు. వానివాని స్వభావాదులచే బేర్కొనుచున్నాడను. శ్రద్ధతో నాలకింపుము :— 1 కామము 2 క్రోధము 3 లోభము 4 మోహము 5 మదము 6 మాత్సర్యము 7 రాగము 8 ద్వేషము 9 ఈర్ష్య 10 అసూయ 11 దంభము 12 దర్పము 13 అహంకారము 14 ఇచ్ఛ 15 శ్రద్ధ 16 భక్తి, ఈ షోడశగుణములనే చిత్తవృత్తులనియెదరు. ప్రథమ త్రయోదశ చిత్తవృత్తులు మానవజీవితమును దూషితమొనరించునవి. తదనంతర గుణత్రయము మానవజ్ఞాన వికాసమునకు హేతుభూతమగును. మానవహృదయాంతర్గత పవిత్రశక్తుల విజృంభింపజేయు మంగళప్రదగుణ స్వీకారంబును, మానవవికాస వినాశకరంబులగు వానిత్యాగమును మానవకోటి విధ్యుక్తధర్మమని నేను ఘంటాపథముగ నుడువగలను. వినుము భారితా! పూర్వోక్త చిత్తవృత్తులు స్వభావవిధంబులు. 1 కామము :—గృహారామ క్షేత్రార్థ వస్తువాహన పుత్రకళత్రాది ప్రాపంచిక భోగోపార్జనాభిలాష. ఏతదనుచిత చిత్తవృత్తికి వశీకరణమయి మానసము నిత్యము నీప్సితార్థప్రాప్తి లభింపకపోవుటంజేసి వాపోవుచుండును. ఆ

శాశహార్మ్య నిర్మాణమే దీని కార్యము. 2 క్రోధము :— సంసారసమరాంగణమున నిజమనోభీష్ట ప్రాప్తికయి, కావించు కార్య ప్రణాళికను భగ్నమొనర్చువానిపై గల్గు తమోగుణ ప్రభావబాహుళ్య జన్యచిత్తవికారము. దీనిస్వభావ మతితీవ్రము. ప్రచండాగ్నియన్న, స్పృశించిన పదార్థమునే దగ్ధము సేయుచుండ మన యీక్రోధాగ్ని తన్నుపోషించు స్వామిని నఖశిఖాగ్రపర్యంతమును, తత్స్వామితో సంబంధముగల్గియున్న సమస్తాప్తమండలిని సహితము భస్మీపటలము గావించివేయును. (3) లోభము :— సృష్టియందలి సమస్తమానవులు సహోదర తుల్యులని భావమునందెంచి, పురాణవైరాగ్య జనితౌదార్య విశేషంబున, నొకపదార్థము నన్యసోదరమానవునకు సమర్పించియు, బునః తత్పదార్థప్రాప్త్యర్థ మహోరాత్రములు డెంద మందలి యమందానందము నినుమడింపజేయుటకు మారుగ విధ్వంస మొనర్చు దాతయొక్క చిత్తవికారము. (4) మోహము :— ఆయురారోగ్యైశ్వర్య ప్రాభవాధిక్యతచే గర్తవ్యాకర్తవ్య జ్ఞానమును దూరీకృతమొనర్చి, మానవుని దుష్పథగామిని సేయు చిత్తవికారము (5) మదము :— నశ్వరభౌతికాధికారైశ్వర్యోపలబ్ధిచే గల్గు మిథ్యాభిమానంబున, మదాచరిత కార్య ప్రకారమే సర్వోత్తమమని వ్యక్తికిబ్రబోధించు చిత్తవికారము. (6) మాత్సర్యము :— సృష్టిస్థితిలయకారుండగు సర్వాంతర్యామిచే సర్వసమాన నిర్వ్యాజ కరుణా విశేషంబున

బరిపాలింపబడునట్టియు, సృష్ట్యాంశమగునట్టియు, సర్వసద్గుణ భూషణాభూషిత వ్యక్త్యభ్యుదయమును నవలోకించినం తనె భావమునందు జుగుప్స (మచ్చరము) నుద్భూతము నేయు చిత్తకల్మషము. (7) రాగము:—నవయౌవన రూప లావణ్యసంశోభితానయవసౌష్ఠవ విరాజిత యగు కీరవాణిం బడయ జిత్తము నాయత్తపఱచు మనోవికారము. (8) ద్వేషము:—అజ్ఞాన భావోద్భూతోద్రేకంబున ధూర్త మానవు డొనర్చు యవకృతికి బ్రతిక్రియ నాచరింప మా నవుని బ్రోత్సహించు హృద్రోగము. (9) ఈర్ష్య:— తన్ను బోషించు వ్యక్తి సకలైశ్వర్య సంపన్నుండయి, నిరంత రానూన సౌఖ్యానందానుభవమును బడయుచుండ నన్యుల సం తతావిరళ దుఃఖాక్రాంతులయి యుండ జూడవలయునని యెడి దురభిలాష. (10) అసూయ:—తనవలె నితరులు సమస్తవిధ మానవోచిత లక్షణ లక్షితులరయి, శాశ్వతానంద ప్రాప్త్యర్ష కృత్యముల గావింపుచుండ, జూచి, చిత్తమునం దసహనశీలత నావిర్భూతము నేయు దుర్గుణవిశేషము. (11) దంభము:— ఆత్మశ్లాఘ్యుచితాభిమాన ప్రాబల్యంబున సర్వత్ర సంతతము నిజకార్య ప్రణాళికా సంసక్తవాక్యంబుల నాకర్ణింపవలయునని యెడి దురభిలాష నుత్పన్నము నేయు దుశ్శక్తి. (12) దర్ప ము:— మమాదృశ శక్తిసంపన్ను డీధరావలయంబున నుద్భ వించియే యుండలేదను మిథ్యాభిమానమును వ్యక్తికి హృద

యమున నొదవజేయు చిత్తవికారము. (13) అహంకారము:- నావలన నిహలోకంబున గానికార్యమే లేదని గర్వించి, నాదెబ్బకు నిలబడువా డెవండని ప్రగల్భవాక్యముల మానవుని ముఖతః చెప్పించు కృత్రిమాభిమానాటోపము. (14) ఇచ్ఛ:— అవాఙ్మానసగోచర వేదాంతోత్తమ భావవిరాజిత సకలశాస్త్ర పఠనసంజాతోత్సాహ పరిణామస్వరూప శౌచాదికార్యాచరణాభిలాషావిశేషము. (15) శ్రద్ధ:—ఆధ్యాత్మిక శిక్షాంతర్గత రసాస్వాదనాశక్తియుక్తులగు గురుజనులనెడను, వేదాంతాది సర్వభూతహితానుకూల శాస్త్రవాదవివాద గోష్ఠిపట్లను గల్గియుండు సత్వగుణ ప్రధానవిశేషంబగు విశ్వాసము. (16) భక్తి:— నిర్హేతుకజాయమాన కరుణాకటాక్షవీక్షణుండును, పరేంగితజ్ఞానభాసమానుండును నగు సర్వేశ్వరునెడను గల్గు నిర్మలభావసందోహజనిత ప్రగాఢ దివ్యానురాగ విశేషము.

చెలిమికాడా! పూర్వోక్త త్రయోదశ చిత్తవికార ప్రతిపాదక దుర్గుణంబుల బహిష్కరించుటయు, దదనంతర నిర్మలభావ ప్రతిపాదకంబులును, సుఖోత్పాదకంబులును నగు సత్వగుణ ప్రతిపాదక సంపద్విశేషంబుల బడయుటయు శ్రేయస్కరంబు. మోక్ష సామ్రాజ్య ప్రవేశంబునకు మూలంబగు సాధన చతుష్టయ సంపద్విశేషమునుగూర్చి సహితము నాయెఱింగినంతవఱకు వినిపించెద నాలకింపుము (1) నిత్యానిత్య పదార్థ విచక్షణము:— జగమనిత్యమనియు, క్షణభంగురమనియు

బ్రహ్మ [పరమాత్మ, జీవాత్మ, లేక జ్ఞానస్వరూపము] నిత్య మనియు, నిరంతరానూన తేజఃపుంజ విలసితంబనియు గుర్తెఱింగి సంపూర్ణతావస్థకు బ్రాపించుట. (2) ఐహికానిత్యభోగానుభవ వైరాగ్యప్రాప్తి:— ధన కనక వస్తు వాహన వనితాది నిరంతర పరివర్తనశీల పదార్థానుభవ సుఖవిముఖత్వముచే గల్గు స్వేచ్ఛ యథవా యాత్మ స్వాతంత్ర్యోపలబ్ధి లేక సంగమరహితమగు భోగానుభవము (ఇది సద్గృహస్థులకే చెందును). (3) శమద మాది షట్కసంపత్తి:— 1 శమము, 2 దమము, 3 ఉపరతి 4 తితీక్ష, 5 సమాధానము, 6 శ్రద్ధ. [వీని స్వభావాదు లియ్యవి. 1 శమము:— నానావిధ సాంసారిక చింతాజాలములనుండి మనమునకు విముక్తి నొడగూర్చి యద్దాని నొక్క సద్విషయ మునందు సంలగ్నము గావించు చిత్తైకాగ్రత. 2 దమము:— బలవత్తర కామవికార రసప్రిషాహాయుక్తంబులగు నింద్రియం బుల బూర్ణముగ నిరోధించి వానిని సంపూర్ణముగ సత్వగుణ ప్రిధానంబులగు చిత్తవృత్తులయం దాసక్తముగావించునది. 3 ఉపరతి:— అనిత్యంబగు కర్తృత్వాద్యభిమానశూన్యుడయి యుండు సత్పురుషునకు నిష్కామకర్మచే నాత్మసన్యాసము నావిర్భూతముసేయు విధ్యుక్త ధర్మసంగ్రహ నిర్వాహణోచిత శక్తి. 4 తితీక్ష:— స్వాభావికంబుగనే యనగా విలక్షణ లక్షణ లక్షితంబగు ప్రకృతిప్రభావంబున, మానవకోటికి బ్రా ప్తించు సుఖదుఃఖాది ద్వంద్వముల జయించి, దైవికంబుగనో,

ప్రారబ్ధవశంబుననో, స్వయంకృతాపరాధ పరిణామస్వరూపం బుగనో, సంఘటియించు కష్టపరంపరల నానందపురస్సరంబుగ ననుభవింప మానవు నుద్యుక్తునిజేయు దివ్యశక్తి. 5 సమాధానము :— చంచలస్వభావ విలసితేంద్రియ వాంఛిత దుర్వృత్తులనుండి, సమస్తేంద్రియముల వాంఛలకు మూలమగు మానసము నావృత్తులనుండి మరల్చి, తదనంతరము సత్పరిణామదాయకంబులగు సద్విషయ చింతనయందు సుస్థిరముగావించు మహాద్భుతశక్తి. 6. శ్రద్ధ:— సదుపదేశప్రదాతలగు సద్గురువులయందును, వేదాంతవాక్య ప్రసంగములయందును, నైతిక, ధార్మికాధ్యాత్మిక సద్విషయగోష్ఠియందును, విశేషించి సర్వజ్ఞుడగు సర్వేశ్వరుని పవిత్రసంతానమునెడను సంపూర్ణ విశ్వాస ప్రేమల నొదవజేయు సామర్థ్యము.] 4 ముముక్షుత్వము :— సంతీప్తార్థము మోక్షేచ్ఛ. సంసారవ్యాప్తతాపత్రయాదవ్యగ్ని జ్వాలాపరివేష్టిత హృదయారవిందుడయియున్న వ్యక్తిబంధనములనుండి విముక్తిని బడయుటకు బూర్వము బడయు పశ్చాత్తాపము లేక పరితాపము. అదియే యాత్మసంస్కారమని మహాత్తము జెప్పబడును. ఉపర్యుక్త చతుర్విధ సద్గుణములు కైవల్య (నిర్వాణము) పదప్రాప్తి కనుకూలభావ విరాజితములు. సంయోగ వియోగముల జిత్తమున కేవిధమయిన వికారమును గొలుపని యా చతుర్విధగుణముల, మానవు డార్జింప వలయును.

భౌతిక ప్రపంచాసురయుద్ధక్షేత్రమున యోధుడగు మానవుడు క్షాత్రధర్మోచిత ధైర్యస్థైర్యోత్సాహ విశేషంబు నజ్ఞానవశంబున బహిష్కరించినచో, విజయశ్రీకోమల కర పల్లవగ్రహణసౌభాగ్య మతని నెడబాయును. కార్యనిర్వాహణోచిత సామర్థ్యయుక్తంబగు కర్మ (కృషి) నాశ్రయించుట యే మానవధర్మము. అదృష్ట దురదృష్టములతో మానవునకు నిమిత్తములేదు- అవి లేవనియే యార్యులు నుడువుచున్నారు. మానవుని హృదయాంతరాళమున డాగియున్న కర్తవ్యసామర్థ్య మనంతమయి, నిర్నిరోధమయి, భూధరోత్పన్న వర్షాకాల ప్రవాహగమనమును బోలియుండును. ధనంజయుడు కురుక్షేత్రమున, కౌరవయోధకేసరీబృందము నవలోకించి భయభ్రాంతుడగుటకు మూలహేతువు కర్తవ్య పరాయణత్వమున కాధారభూతమయిన నిచ్ఛాశక్తిని విస్మరించుటయే. నిత్యానిత్యపదార్థ వివేచనానంతర మనిత్యపదార్థ బహిష్కారమును, నిత్యవస్తుతత్వస్వీకారము సేయవలయు నన్న పరమేశ్వర ప్రదత్తంబును, భావాతీతకార్యకరణ శక్తి యుక్తంబును, అపూర్వగుణాంశ సంభూతంబును నగు నిచ్ఛాశక్తి మహత్వమును గ్రహింపవలసియుండును. ఏతద్దివసము దనుక సంసారక్షేత్రమున నిజదివ్య యశఃకాంతుల వెలయించి నట్టియు, బ్రస్తుతము గావింపుచున్నట్టియు బుణ్యపురుషులు (అవతారపురుషులు) కేవలము నిచ్ఛాశక్తి ప్రభావంబును

హృదయంగమము గావించుకొనుటవలననే సాధారణ మానవ భావాతీత విజయమందిరోన్నతభాగము నలంకరించి, సార్థకాహ్వాయు లయిరని వేలుగ విశదము సేయవలయునా? నీవు సహితము భీతిజెందక, నిరుత్సాహమును బడయక, నిస్తేజమును దరిజేరనీయక, నీరసత్వమును పదమును స్మరింపక మనఃపూర్వకంబుగ గర్తవ్యపరాయణుడ వగుము. "జయాపజయములు దైవాధీనము"లని భావమునం దెంచి, నిష్కామకర్మ నాచరింపుము. మనశ్చాంచల్యమును బాప దేవా, దేవా, యనుటయొక రీతి లాభప్రదమే యయినను నంతమాత్రముననే మానవుడు సంపూర్ణవిముక్తిని బడయజాలడు. నిష్కామకగణమే నిర్వికారుండగు సర్వేశ్వరుని ప్రాణప్రియ బాంధవశ్రేణికి జెందనివారనియే తెలియనగును. క్షణకాల మమూల్యమనియు, గతించిన బుసః ప్రాప్తించుట దుర్లభంబనియు గ్రహించి, సత్వరము కార్యోన్ముఖుడ వగుము. "కాలమ్ బ్రహ్మస్వరూప"మన్న వాక్యనం దెంతయో సత్య మిమిడియున్నది. రేపు సేయవలయునన్న దానిని నేడు, నే డాచరింపవలయు ననుకొని నదాని నిప్పుడు జేసిచూపించుట యుక్తము. ఏక్షణమందు గుణత్రయావస్థయగు ప్రళయ ముద్భూతమగునో యెవరికెఱుక!

సుహృ:—మిత్రరత్నమా! నే నెన్నడు నాలకింప నోచేనివిషయంబుల నెన్నొటినో నీవలన నేడాలకింపగల్గితి. బ్రహ్మానందమయ్యెడిని. ఆత్మోత్కర్షకయి దయావృత్తి

నవలంబించుట పరమావశ్యక మయియున్నది. తావకం
బగు గంభీరోపదేశము నాలకించియు, నిన్ననాపతము
సందర్శింపు చుండుటవలనను బ్రయోజనము నుంత
యును లేదు. కార్యాచరణంబునసే మానవునకు మహా
త్సంపత్సిద్ధి కలుగనేర్చును. నేటినుండి నిష్కళంక చరి
తుండనయి, సర్వభూతహితకార్య పరతంత్రుండనయి,
సదాచార నీతియుక్తుడనయి, సత్యపథానుగామినయి
సంచరింపయత్నించెదగాక! సేవామార్గమునందే విజయ
రహస్యము డాగియున్నటు లెన్నియోమార్లు నీవు చెప్పి
యుంటివి. సృష్టియందలి సమస్తజీవులు సర్వేశ్వరాంశ
సంభూతములే యనియు, భేద మిసుమంతయయిన లేద
నియు గ్రహింపగల్గితిని. ఇంక నాచరింపగడంగెద. సృ
ష్టియెడనుండు భేదబుద్ధి నశియించినంతనే యహంకార
మమకారములు దూరమగునండ్రు. ఆచరించిచూచెద.
లెమ్ము! మన మిటకే తెంచి దీర్ఘకాలమయినది. గృహము
నకరుగుదము. భూపాలుడు నీకొఱకయి నిరీక్షింపుచుం
డును." సిద్ధార్థుడు మరలవెంటనే మ్లానవదనుడయి గృ
హమునకు మిత్రునితోడ నడచెను.

## గృహపరిత్యాగము - దేశపర్యటనము.

ఒకానొక దివసంబు నిశాసమయంబున రాకుమారుడు
దీర్ఘకాల పర్యంతము నికృష్టసాంసారిక వ్యామోహబంధనవి

షయిక తర్కవితర్కముల స్వాంతమున గావించుకొనుచుండ
ప్రాయకంబుగా సంసారమందు విద్వద్వరులమనియు, సర్వజ్ఞుల
మనియు, వితండవాద వివాదనైపుణీవిశేషంబున విర్రవీగు
చుండ నజ్ఞశిఖామణుల యదూరదర్శిత్వమును, అల్పజ్ఞతయు
ను స్మృతిపథంబున దోచినంతనే వ్యాకులచిత్తుడయి పరిపరి
విధంబుల వాపోవజొచ్చెను. ప్రపంచములో సమస్తమాన
వులు విధ్యుక్తధర్మ నిచయమును, మూర్ఖమతులయి విస్మ
రించి, భోగవిలాసాపేక్షజన్య కామాతురముచే గండ్లుగాన
రాక, వివేకశూన్యులగుచున్నట్టి దుర్వార్త భగవత్ప్రేరణా
వశంబున శ్రుతిపుటములబడినంతనే సిద్ధార్థుడు సంసారవ్యా
మోహము భ్రమాత్మకంబనియు, వ్యామోహపంకమున జిక్కి
యున్న నరు డుద్ధరింపబడడనియు, హృదయమున ధ్రువపఱచు
కొనియెను. యుక్తాయుక్తవిచక్షణ జ్ఞానసంపన్నులని సంభావిం
పబడు మానవులు ఘాతుకమృగములకంటె నీచప్రకృతి గల
వారయి, భ్రష్టులగుచున్న విషయము స్మరణకు వచ్చినంతనే
సిద్ధార్థుని సహజమృదులహృదయము పరితాప మందసాగెను.
నిరంతర మతని కీసృష్టియం దేపార్శ్వము దిలకించినను, దుఃఖ
మే దృగ్గోచర మగుచుండెను. పరమాత్మసంభూతులగు మా
నవులు ప్రపంచాభ్యుదయమునకయి, సర్వతోముఖ ప్రయత్నం
బున, ధర్మవిజయమును బడయుట మంగళకరంబని యాతడు
విశ్వసించెను. తుచ్ఛవిషయంబుల నపేక్షించి, హంతకులగు న

రులుకొందఱ మనస్సుగలవాడు మానవుడనియు, మనస్సనునదిప ట్టిబూటకమనియు మట్టిబొమ్మయగు మానవు డీశ్వరాంశ సం భూతుడు కాడనియు, జడపదార్థమనియు మిట్టవేదాంత ప్ర సంగముల జేయుచు నిజకామమును దీర్చుకొనుచుండు విషయ ము మదికి స్ఫురించినంతనే సిద్ధార్థునిపై వజ్రాఘాత మయినట్టు లయ్యెను. అతని నేత్రము లశ్రుజలపూరితములయ్యెను. విశేషకాల మీరీతి స్వాగతంబున జర్పించుకొని, క్లాంతశరీరు డయి సులభముగనే, యప్రయత్నముగనే మాయాదేవియగు నిద్రాదేవి కోమలగాత్రస్పర్శంబున సత్వంతసుఖము నంది, పులకాంకితగాత్రుడయి, తన విశాలకోమల బాహులత నామె కంఠమునకు జుట్టి బాహ్యస్మృతివిరహితు డయ్యెను. నిద్రాదేవి యు నాసుకుమారుని దివ్యమనోహరమూర్తి నంకసీమయం దిడి కొని నిదురపుచ్చెను. నిద్రాదేవి విశ్వమోహనకరంబులగు బాహుపాశములకుం జిక్కి సిద్ధార్థు డల్పకాలమునందే గాఢ నిద్రాపరవశుం డయ్యెను. ప్రపంచములో నిత్యము దటస్థించు చుండు కష్టపరంపరలవలన దుఃఖితచిత్తు లగుచుండెడి నరులకు, నిద్రావస్థ మండువేసంగినందు పిపాసార్తుడగు దీనునకు శీతల జలము గావించు సాహాయ్యమునే చేయుచుండును.

శయనమందిరమునందలి దీపకళికాదివ్యజ్యోతిసమ్ముఖం బున నా మహనీయుని దివ్యవదనారవిందమును, సుస్నిగ్ధకపోల యుగమును మిలమిల మెఱయుచు ననుక్షణము వింతవింత

ద్యుతుల నుప్పతిల్లజేయుచుండెను. శాంత మానసమయమున సిద్ధార్థుని వదనబింబమున నావిర్భవించి లాస్యముచేయుచున్నదో యన్నటు లాపురుషపుంగవుని సహజసౌమ్య స్వరూపము ప్రశాంతమయి, గంభీరమయి, నిస్తబ్ధమయి వెలయుచుండెను. ఆ దివ్య పురుషుని, ఆ భావి మహాధర్మసంస్థాపనాచార్యుని, ఆ శాక్యవంశాబ్ధి పూర్ణచంద్రుని, ఆ యతులిత మహత్తర శక్తియుక్తుని దివ్యతేజోవిరాజిత ముఖమండలము సుగంధమయ కర్పూర తైలోద్దీపిత దీపకళికాప్రకాశంబును హసించుచున్నట్టు లుండెను. సిద్ధార్థకుమారుని మానస మొకింతకాలము దీర్ఘాలోచనాజనితశ్రమంబునకు జిక్కి, సొక్కి, నిస్తబ్ధంబుగా నిద్రాసౌఖ్యరసాస్వాదనమునందే సంలగ్నమయియుండెను. కొంతతడవయినపిదప స్వప్నావస్థయందశరీరవాణి యాతనింగూర్చి స్పష్టముగ నీరీతి నొక్కివక్కాణించెను:— "ఉత్తమతరుణ మాసన్నమయినది. సిద్ధార్థా! సంసారమునందు నీవిషమపరీక్షాసమయమే తెంచినది. ఏతదగ్నిపరీక్షయందు దుత్తీర్ణుడవయితివేని, నీ కితరేతరపరీక్షలు తృణప్రాయములు. ఈ కఠోరసమస్యను సుకరముగ ఖండింప శక్తుడయిన వ్యక్తియే ధన్యతముడు. భూపాల నందనుండవయిన నీవు ప్రపంచములో మహా ధనాఢ్యుడవయి, సకల భాగ్యభోగ్య విలాసచేష్టలయందు రతుడవయి, షడ్రసోపేత భోజనముల నారగించుటయందెక్కుడు మక్కువగల్గి విశాల ధరావలయ పరిపాలనమే నృపాత్మజ ధర్మమని సంభా

వించి, కీర్తికాయుడును, విస్తీర్ణ పృథ్వీతల చతుర్దిశవ్యాప్త యశోవిరాజితుండును నగు రఘుకుల కమలదివాకరునిచంద ముగ విశేషానందప్రద రాజ్యలక్ష్మీకరకమలగ్రహణ సౌభాగ్యము బడసి దిగంతవిఖ్యాతింబడయుదువో లేక విషాదభయ బాహుళ్య యుక్తంబును నిస్సార మాయాకల్పితంబును, క్షణికంబును నగు సంసారమును బరిత్యజించి, కామినీ కాంచన పుత్రికళత్రమిత్రబంధువర్గాది ప్రగాఢ వ్యామోహపాశముల బూర్ణముగ ఖండించి, సర్వసంగపరిత్యాగివయి క్షణికంబును, నవిశ్వసనీయంబును నగు మానవజీవితమును బ్రహ్మాండసేవకే నిర్మింపబడినదని యెంచి తత్సేవార్థమయి, శ్రీమణప్రతాను ష్ఠాన గరిష్ఠుండవయి, నిత్యైకాంతవాసస్వీకారము నభిలషించి, సమగ్రసంసారమున హితబోధాప్రచారము సేయుచు జీవనపరిమితిని వ్యతీతము సేయుదువో మనమున దృఢముగ నిశ్చయించు కొనవలసిన సమయ మేతెంచినది. కర్తవ్యాకర్తవ్య నిర్ణయంబున బుద్ధిమంతులగు నరులు కాలవిలంబనము లు సేయనొల్లరు. సత్వ రాచరణీయ సత్కార్యమునెడ గురుజనసూక్తియగు "శీఘ్రం శుభస్య" అనునది సంపూర్ణముగ జరితార్థమగును తామసించిన "ఆలస్యం అమృతం విష"మ్మను కోవిదోక్తి సఫలంబగును. కాన శీఘ్ర మాత్మీయ కర్తవ్యానుష్ఠానమున కుపక్రమింపుము. మదుద్ధృతవాక్యములు యథార్థములని త్రికరణముల విశ్వసింపుము. ఆలసించిన నమృతమే హాలాహలమగును.

సిద్ధార్థుఁడు నిద్రావస్థయం దీవిచిత్రంబును, నిగూఢరహస్య యుక్తంబును నగు స్వప్నమును మూఁడుసార్లుగాంచి, యద్భుతానంద పరవశుండయ్యెను. అశరీరవాణి సిద్ధార్థుని హృదయమందిరమందును, శ్రుతికుహరములయందును జీటికిమాటికి బైనుచ్చరించిన వాక్యములనే ప్రతిధ్వనితములు గావింప దొడంగెను. పదేపదే రాకుమారున కాప్రబోధవాక్యధ్వని సాగర ఘోషమువలె విననగుచుండెను. తద్ఘోషబహిరాంతర ప్రపంచముల వ్యాప్తమయి యున్నటులసహిత మతఁడు గ్రహించెను. అతని సందేహములన్నియు నంతరింప వైరాగ్యము ద్విగుణితమయి కార్యరూపముధరింప నుద్యుక్తమయ్యెను. ప్రపంచములో దైన్యావస్థకుంజిక్కి దిక్కులుపిక్కటిల్ల నొక్కపెట్టున గొల్లుమని రోదన ధ్వనులజేయుచు "త్రాహి. త్రాహి"యని బహుశతసహస్ర సంఖ్యాకులగు స్త్రీపురుషులు, ఆ సిద్ధార్థుని వినమ్రభావముతో వేడుకొనుచున్నట్లు సహిత మాస్వప్నావస్థయందు వీక్షించెను. సిద్ధార్థు డేదిక్కు భావనాదృష్టితో వీక్షించినను సర్వత్ర సమస్తనరనారీమణులు "సిద్ధార్థా! రక్షింపుము! శీఘ్రము రక్షింపుము! నిరంతరాపార చింతాక్రాంతుల మగు మమ్ము దయార్ద్రహృదయుఁడ వయి, సంరక్షించి, మానవోచిత ధర్మనిర్వాహుండవయి, సర్వేశ్వరునిదృష్టియం దాదరము బడయుము; వెనుదిరిగిపోకుము; జీవితము శాశ్వతమని భ్రమించి మావలె గామాగ్నిని రగుల్కొల్పి యందు

దగ్ధమగుచు వాపోవుచుము; రమ్ము. మాకు జేయూత నొసం గుము." అని ఘోరముగ దురపిల్లుచు, బ్రార్థించుచున్నట్లు మాటిమాటికి సిద్ధార్థకుమారునకు గర్ణగోచర మగుచుండెను. తదాకర్ణిందనథ్వానశ్రవణంబున గర్ణపుటములు వ్రయ్యునట్లుండ, హృదయము కంపింపదొడంగెను. అతడు వెంటనే కనులు విప్పి నలుదిశల జూచెను. సమస్తము శూన్యమయి యుండెను.

స్వప్నమందున నతడు సంసారుల విషాదసాగరనిమగ్నులగు సంసారుల దీనాలాపముల నాలకించి, సహజభూత దయార్ద్రహృదయుండగు కతన నప్రయత్నముగనే ముఖమునుండి యీ సుడులు బహిర్గతములయ్యెను. "సమస్తలోక పరిపాలకుండవగు నో సర్వేశ్వరా! నీ మహిమ యపారము, అనంతము, అద్వితీయము, అమలభావవిలసితము, అత్యద్భుతము, అఖిలలోకవిరాజితము. నిర్వికారుండవును, నిరంజనుండవును నగు నీయలౌకిక లీలానిచయము సాధారణ మానవబుద్ధికగోచరంబు. స్వయంభూ! సత్యస్వరూప! సర్వశక్తి సంపన్నుండవగు నో సర్వేశ్వరా! నీ శక్తిసామర్థ్యము లతిశయప్రభావసంపన్నములు. సంసారక్షేత్రమున నీ చెయుకృత్యములు చిత్రవిచిత్రభావ సంశోభితములు. త్వదీయసద్గుణగణసంకీర్తనము సేయ సామర్థ్యములేక వేదవేదాంగోపనిషద్బృందములు బేలవడియె. ఆత్మస్వరూపుండవయి, సంసారములో నోతప్రోతభావం

బున, సంచరించు నీ మహత్త్వసమన్విత సామర్థ్యవిశేషంబును గ్రహించుశక్తి ప్రాణికోటికివమ్ళక్క. నిరంతర త్వదీయపాదపద్మ పరాగాభిలాషులగు సంయమచంద్రులే యోద్ధులును బూంద్లును గఠోరజపతపముల నాచరించి, తావకంబగు శుభసందర్శనము జేయజాలక పోయిరి. పురాణపురుషుండవగునీ లోకోత్తరాగాధ సాగరమును దరింప నెవ్వారు శక్తిసంపన్నులు? నీదివ్యచరితాంతర్గత మహద్విషయముల గానముసేయ సహస్రముఖునికయిన సాధ్యముకాదు. నీదగు మహత్తర ప్రభావంబుననె సమస్తభూమండలము నేకచ్ఛత్రాధిపత్యముగ బరిపాలించు భూపాలశేఖరు డల్పకాలమునందె జీర్ణవసనధారియయి, కఠోరపృథ్వీతలంబున శయనింపుచుండ గనులార గాంచుచున్నాము. నీ మహిమాతిశయంబుననే సంతత క్షుద్బాధా పీడితుండగు మహాదరిద్రవ్యక్తి క్షణమాత్రకాలంబున సమగ్రభూవలయంబున కధినాథుడగుచున్నాడు. నీ శక్తివలననే యోడలు బండ్లును బండ్లు ఓడలును నగుచున్నయవి. ఓ జగన్నాటకసూత్రధారీ! ఓ దీనరక్షకా! ఓ దుష్టశిక్షణ శిష్టరక్షణ సమర్థుండవగు సర్వాంతర్యామీ! నీవు సర్వాంతర్యామివయ్యు, నిజభక్తజన మనోరంజకుండవయ్యు మనోవాక్కాయకర్మల కందనివాడవు. నిరాకారుండవయ్యు సమయోచితముగా సందర్భానుకూలముగ దీనజనోద్ధరణ కవనిపై నవతరించి, ఘోరదురాచారపూరిత సంసారక్షేత్రమున సద్ధర్మ విజయధ్వజమును స్థాపింతువు. సమస్తలో

కముల కక్షయానందభండారమివి. నీవు సర్వకాల సర్వావస్థల యందు దరు లతాగుల్మాకృత పుష్పోద్యానములయందును, నదీనద నిర్మలసలిల ప్రవాహజనిత గభీరధ్వానములయందును, మహోచ్చభూధరగహ్వరారణ్య ప్రాంతముల యందును చరాచరాది సమస్త ప్రపంచమందును భూమ్యా కాశానల సలిలానిలముల యందును సూక్ష్మాతిసూక్ష్మరూపం బున నిష్కళంకుడవయి, దివ్యజ్యోతివలె వెలుంగుచుందువు. అద్వితీయ మంగళస్వరూపుండవగు నో యాది పురుషపుంగవా! నీవు సమస్తరూపధారివి. సమస్తనామధారివి. క్షణమున కొక రూపమును భక్తహృదయాహ్లాదార్థము, వారభిలషించుచంద మున దాల్చుచుందువు. ఏరూపమున ధ్యానించిన నారూపం బుననే దృష్టిగోచరంబగు నీ మాహాత్మ్యమును సంస్తుతింప నే నెంతటివాడను. కాంక్షించిన బృహదూపంబున సభోరేత స్కులకు దక్క జితేంద్రియులగు పురుషోత్తములకు దర్శనభా గ్యము నొదవజేయుచుందువు. సంతతాధ్యవసాయుండగు నో కృపామయా! నీ వనారతము సమస్తలోకముల సమానభావ ముతో సధ్యక్షించుచు జీవకోటికి హితము నేయుచుందువు. ఓదయాసాగరా! పరమపురుషా! ఆదిమధ్యాంత రహితుండవౌ నో యాదిమూర్తీ! నీనామము లెంత భావగర్భితములు! అక్షయామృత రసపరిపూరితములు. కరాళకాలమునకు నీవె కాలయముడవు. సృష్టిస్థితిలయములకు హేతుభూతుండవగు

నో పరమపితా! మానవసంకుచిత హృద్గతభావ సందోహావే
రేపకుండవగు నో కృపానిధీ! నీకిదే భక్తిపురస్సరంబుగ కృతాం
జలినయి ప్రణమిల్లుచున్నాడను. దీనజనగణముఖంబున నీవు
నాకుపదేశించిన " విశ్వభూతసేవాప్రబోధ " మనంత మాహాత్మ్య
మండితంబు. అట్టి వినిర్మలభగవత్ప్రేరిత సర్వోత్కృష్ట సర్వజీవో
చిత హితసేవయందే మానవదృష్టి కగోచరంబగు వైకుంఠ సదన
మున్నదని నేటికి సంపూర్ణముగ గ్రహింపశక్తుండనయితి. సర్వభూ
తహితపరతంత్రుండగువ్యక్తిని కామక్రోధాదులు సహజముగా
నెడబాసి చనును. కనుకనే విజ్ఞప్రపంచము " సేవాధర్మము "నే
యుత్తమోత్తమముగ భావింపుచున్నయది. మూర్ఖజను లీప్రపం
చమున మర్మమును గ్రహింపక, మృగతృష్ణనుజూచి సలిలమని
భావించి, భ్రమించుపగిది, శిలాప్రతిమావిరాజిత దేవాలయ
ప్రవేశంబుననే సాకేతమున్నదని భావింపుచున్నారు. భోగ
విలాసతత్పరులగు తుచ్ఛకవిజనకల్పిత సాకేతపురంబున బ్రా
ప్తించు కల్పితానందము "విశ్వజీవ సేవామార్గ ప్రాప్తసుధా
తుల్య నిర్మలానందాతిరేకము నెదుట దుచ్ఛాతితుచ్ఛము.
ఏతద్వసుధాంతరాళముల హస్తిమశకాంత తారతమ్యము
కలదు. విశాలవిశ్వసేవయె శాశ్వతానందయుక్త బ్రహ్మలోక
పథమునకు మూలమని నేడు సంపూర్ణముగ సర్వేశ్వరుని కృప
చేత గ్రహింపనేర్చితి. బ్రహ్మమందిరారోహణమునకు సహాను
భూతియే ప్రథమ సోపానము. ఆత్మోత్కర్షయు దాని కాధా

రభూతమగు సర్వజీవ దయావృత్తియు నిర్యాణమునకు హేతు భూతములగును. సమస్తలోకములయందు దారకమంత్రమగు నోంకారనినాద ముద్ఘోషితమయి, కర్ణపుటములబడి, మానవ హృదయములకు సద్ధర్మనిర్వహణోచిత ప్రబోధమును నిత్యము సేయుచు నే యుండును. కాని దుర్విషయలోలురగు మానవు లద్దానిని గ్రహింపకుండు టెంతయు శోచనీయము. వ్యామోహా పరీతులగు వారికి వ్యామోహాతీతమయిన రవమెట్లు కర్ణగోచ రంబగును? సర్వభూతహితాను రక్తుండవగు నో సర్వేశ్వరా! అజ్ఞానాంధకార బంధురంబగు మానవవిశాల ప్రపంచమునందు జతుర్దిశల త్వదీయప్రభావోద్భాసిత మయి యున్న దివ్యజ్యో తి వెలయుచుండుట నేను స్థూలదృష్టిచే గాక సూక్ష్మదృష్టి (జ్ఞానేంద్రియము)చే సందర్శింపగల్గితిని. ప్రభూ! కాలయాపన ము సేయరాదు. కాలదుర్వినియోగము నరకమునకు (ఆత్మ గ్లాని) మూలము. ఇప్పుడే లేచి వచ్చుచున్నాడను. త్వదీయకథ నానుసారంబుగ విస్తీర్ణంబగు విశ్వక్షేత్రమున సంచారము సేయుచు మూఢజనుల కపారసౌఖ్యప్రదంబగు నాధ్యాత్మి క ప్రబోధముసేయుదును." సిద్ధార్థుడించుక సేపు పరాత్పరపదా రవింద పరాగధ్యానతత్పర హృదయారవిందుడయి, పునః సర్వేశ్వరునకు నమస్కరించెను. నూతనోత్సాహపూరిత హృద యుడయి, సర్వాంగాలింగిత భూతలుండయి, లేచి నిలువబడి యెను. నిబిడాంధకారమున శయనగృహమును బాసి యశ

డు రయమున నిజసారథీభవనంబున కరిగెను. సారథి మేల్కాంచి సిద్ధార్థకుమారుని యకాలాగమనమునకు హేతువేమి యని పృచ్ఛింప, సిద్ధార్థుడు తానుగృహపరిత్యాగము సేయనుంటినని యు, సంసారమునం దుండరాదనియు దెలియబల్కెను.

అంతటవారిరువురకు నీ క్రిందివిధమున సంభాషణక్రమము నడచెను.

ఛన్నుడు :—ప్రభూ! నేను భవదాజ్ఞను శిరసావహింప జాలనందులకు మన్నింపుడు. భూపాలాజ్ఞలేనిదే తమప్రయాణమునకు రథాశ్వముల నెప్పుడును సిద్ధము సేయరాదను కట్టుదిట్టము లింతకుబూర్వమే సేయబడినవి. గృహబాహ్యప్రదేశమునకయినసిద్ధార్థుని వెడలనీయకుండ నిరీక్షింపుచుండుమా యని నాయనగా రాజ్ఞాపించి యున్నారు. భూపాలశాసనము తృణీకరించుట రాజభక్తియుక్తుండగు సేవకుని కుచితమా?

సిద్ధా:—ఛన్నా! నీకు నాయెడ నకృత్రిమంబగు ప్రేమయే యున్నచో, నీహృదయమందు ప్రేమబీజములే యున్నచో నాయభిప్రాయమునకు విరుద్ధముగా భాషింపక నా కీపవిత్రకార్యంబున సాహాయ్య మొనరింపుము. సంపత్కాలమునందు లోకులెల్లరు మనకు స్నేహితులు, బాంధవులునయి యుందురు. కాని వాస్తవ మాలోచింప నకాలమున మిత్రునకు దోడ్పడగల్గినవాడే యథార్థమగు సుహృద్వరుడు. నీదగు కపటప్రేమ స్వార్థమయమయినటుల దెలియవచ్చుచున్నయది.

ఛన్నుడు:—మహాత్మా! తమవచనములు నా హృదయమును జూర్ణీకృతము గావించివైచినవి. తమయందు నాకుప్రేమయే కాదు, భావాతీతంబగు భక్తియే కలదు. రాజశాసనమనుల్లంఘనీయమని భావించియే నేనట్లనుడువ సాహసించితి. క్షమింపుడు. తమరు గృహమున కరిగి, సిద్ధముగనుండుడు. శీఘ్రితో త్తమాశ్వ సమేతుండనయి భవద్గృహద్వారముచెంత వేచియుండెద.

సిద్ధార్థుడు ఛన్నుని ప్రత్యుత్తరమున కానందించి గృహాభిముఖుడయ్యెను. అంధకారము దూరమగుడు చంద్రనాథుడు ప్రకాశింపదొడంగెను. నిశాదేవి యప్పటికే నిర్దిష్టప్రయాణమున నర్ధభాగము ముగించి, హృదయేశ్వరుండగు సుధాకరునితో సరససల్లాపము లాడజొచ్చెను. నిర్మల కౌముదీప్రసారంబున సమస్త ధరాతలవిలసిత పదార్థములు రజతవర్ణమును గొరుమేలువన్నె చే సుస్పష్టముగ గానసగుచుండెను. సిద్ధార్థునికి రహస్య ప్రయాణమున కాజ్యోత్స్న ప్రతిబంధకముగానున్నట్లు దోచెను. మెల్లమెల్లన జల్లని పిల్లతెమ్మెరలు వీచుచు ప్రకృతీదేవి కోమలగాత్రమునకు హాయినొడగూర్చుచుండెను. వాయుకిశోరమృదులస్పర్శంబున, భూరుహములనుండి నవవికసిత సౌరభయుక్త పుష్పసంచయము భూమిపై బడుచుండెను. అనిలాఘాతంబున నపుడపుడు భూరుహ విశాల శాఖాంతరాళములనుండి శుష్కంబులును, బరిపక్వంబులును నగు పత్రసముదాయ

ములు వసుధాస్థలింబడుచుండెను. వృక్షావళులపై నానావిధ విహంగబృందములు బాహ్యప్రపంచజ్ఞానచైతన్యమును దక్కి భావనాప్రపంచమందలి చిత్రవిచిత్ర దృశ్యముల సందర్శింపుచు ముగ్ధములయినటుల నీరవాంబుధిని మునిగియుండెను. ఘూకసమూహము భీకరముగ గూయుచు నటునిటు బర్వులెత్తుచు, నిశాచరసంఘవిహారభ్రమను మూఢుల కొదవజేయుచుండెను. తారకమండలి చంద్రనాథుని భయభక్తు లొక్కమ్మడి బెనగొన, వినయవిధేయతలతో గైంకర్యము సలుపుచుండెను. తత్కాలమున బ్రపంచమునందెల్లెడల శాంతిప్రబలి నిరంకుశ రాజ్యపాలనము సేయుచుండెను. గంభీర స్వరూపమునుగల్గియున్న దిగ్గజములుగూడ నిద్రాదేవి విశ్వమోహన సౌందర్య సందర్శనమున జేతనాశూన్యములయి, మదిరాపాన జనిత ప్రమత్తతంబోలు లాహిరిచే నిశ్శబ్దతను భజియింపుచుండెను. కేవల మా సమయమున భావనాప్రపంచ విహారులగు మునిసత్తముల కర్ణేంద్రియముల నోంకారము ప్రతిధ్వనింపుచుండెను. మానవుడు చిత్తనైర్మల్యమును, శాంతినిబడయ యత్నము సేయుట కెంతయు నాసమయ మనుకూలమయి యుండెను. ప్రకృతిరామణీయకమును వర్ణింప దత్స్వభావపరిజ్ఞాతలకే సాధ్యమగునుగాని తక్కుంగల శబ్దాడంబరముచే నొప్పు నమాదృశ కవికింకరులకు వలనుపడదు.

రాజప్రాసాదాంతర్భాగమునం దంతటను నీరవత వ్యాప్తమయియుండ, మద్దానిచెంతనే గభీరతలాస్యము సేయుచుండెను. దాసదాసీజనంబులు సంపూర్ణముగ దివసమంతయు బరిశ్రమ జేసియున్న కతన, మిక్కిలి డస్సినవారలయి, గాఢనిద్రయందు దవిలియుండిరి. ఆ విశాలదివ్య భవనాంతరాళమునం దొక్క యత్యల్పకాంత్యుక్త దీపకళికమాత్రము మిణుకుమిణుకుమని ప్రకాశింపుచు, బ్రపంచాస్థిరత్వమును జాటుచున్నట్టులుండెను. సిద్ధార్థుడు నెమ్మదిగ నుడ్వి బదములిడుచు యశోధరాశయనమందిరమున బ్రవేశించెను తత్సమయంబున నాదేవి దివ్యతమంబగు పర్యంకమున నవోదితనందనునితోగూడ బవ్వళించియుండెను. దీపకళికాల్పప్రకాశంబున రాకుమారుడు హృదయేశ్వరీమందహాస విలసితసుందర వదనారవిందమును, నందనుని మార్దవకాంత్యుక్త ముఖేందుబింబమును, నవనీత సదృశస్నిగ్ధకపోలయుగ్మ కాంతివిశేషమును గాంచి, యొకింతతడవు నిశ్చేష్టుండయ్యెను. అతని హృదయమునుండి ప్రేమప్రవాహము పొంగిపొరలుచుండ, నేత్రద్వయమునుండి బాష్పకణములు ముత్యములవలె బొటబొట వర్షింప నారంభించెను. పృధ్వినవతరించిన రమాదేవియోయను భ్రమను గొలుపుచున్న నా యశోధరా సందర్శనమున సిద్ధార్థునకు దివారాత్రములు విలాసమందిరమున దేవమందారమకరంద మాధుర్యమును ధిక్కరించునట్టియు, శిరీషకుసుమపేశల తుల్యంబును

నగు మృదుమధురోక్తులను, విలాసచేష్టలును స్మృతిపథమున నడయాడ నారంభించినంతనే వైరాగ్యభావ ప్రాధిమచే బాషాణతుల్యమయి యున్న యతని హృదయము ద్రవీభూతము పరిణింపదొడంగెను. అతడు ముగ్ధహృదయుడయి, యొకించికాలపర్యంత మటులనే శిలాప్రతిమవలె నిస్తబ్ధుడయి యుండి, ప్రేయసీ వదనేందుబింబసందర్శన పీయూషపానము సేయదొడంగెను. పూర్ణిమనాటి చందురునిగేరు బాలుని మోమొకింత మోహమును గలుగజేసెను. చీటికిమాటికి నిమీలిత నేత్రుడయినను హృదయేశ్వరీ నవయౌవనతారుణ్య లావణ్య సంశోభితాదివ్యమూర్తి కన్నులకు గట్టినట్టు బొడకట్టసాగెను. సిద్ధార్థకుమారుడు వనితాశయనమందిరమున కేతెంచుటకు బూర్వమే సర్వాలంకారవసన సుసజ్జితుడయి యుండెను. ప్రయాణమునకు సంసిద్ధమయియున్నను సిద్ధార్థుని ప్రేమమయదృక్కులు మాటిమాటికి జాయాసుతులపైకి సౌందర్య రసాస్వాదనాపేక్షచే బరుగిడుచుండెను. సతీసుతుల దివ్యప్రతిమల నెంత వీక్షించినను సిద్ధార్థునకు దనివితీరకుండెను.

సంసారమందలి సమస్త మోదకద్రవ్యములలోనికెల్ల సౌందర్యమే మానవకోటిని స్మృతిదూరులగావింపగల పదార్థమని సిద్ధార్థుడా స్వల్పానుభవంబుననే గ్రహించెను. పుత్రకళత్రాదులపై సహజోద్భవ వాత్సల్యాధిక్యతవలన నతని నేత్రయుగళమునుండి బాష్పాంబుకాశి ధారరూపంబున బ్రవ

హించి యతని విశాలవక్షస్థలాచ్ఛాదిత దివ్యవసనము నార్ద్రీభూతముగావించెను. పశ్చాత్తాపజలముచే హృదయకల్మషమంతయు దూరీకృత మయినంత నే స్థిరసంకల్పచిత్తుడగు నాతనిమనంబున నవోదిత ధైర్యస్థైర్యస్ఫూర్తి యప్రయత్నముగ నొదివినంత నే సంయోగ వియోగంబులును, సంకల్ప వికల్పములును, జననమరణములవలె సహజములే యని గ్రహించి, యిట నాలసింపరాదని యెంచి, మందగమనమున బదధ్వనియొదవకుండ శయనమందిర కవాటాంతరాళమునుండి మరలివచ్చెను. అతడు వ్యాయామాము నొక్క ముక్కడిరక్కసిగ భావించి సత్వరము స్వనికేతనమును సమీపించెను. అట సారథిని గని సత్వర మొక్క వాజిని గొనిరా ననుజ్ఞ యొసంగెను. ఛన్ను డంతకుమున్నే తురంగశాలకరిగి, దివ్యఘోటకము నొకదానిని బల్యాణమును గట్టి ద్వారముదండనే నిలిపియుంచితినని చెప్పుచు నశ్రుధారను బ్రవహింపజేయజొచ్చెను. సిద్ధార్థు డతని దైన్యస్థితిని గాంచి, యిట్లు నుడివెను :—ఛన్నా! మూర్ఖునివలె యొందులకు విలపించు చున్నాడవు. మానవులమగు మనకు విలాపముతో నిమిత్తమేమి?

ఛన్ను:—ప్రభూ! అర్ధరాత్రిసమయమున బ్రయాణము నేయు టంత హితకరమయిన కార్యము కాదు. ప్రాతఃకాలమయినంత నే భూపాలుని సమ్మతపఱచి, గృహమును త్యజియించుట శ్రేయస్కరము. మీ తత్తరపాటు నుపలక్షింప,

నాకు భయమగుచున్నయది. బాల్యకాలము నుండియు నేను మిమ్ము గంటికిరెప్పవలె సాకుచువచ్చితిని. నేడు వియోగము.

సిద్ధా:—ఛన్నా! అర్ధరాత్రిముతో నాకేటిపని? కర్మవీరునకుగాని ధర్మమునకుగాని విశ్రాంతి స్వప్నావస్థయందయిన నుండునా? కర్మవీరునకు సర్వకాల సర్వావస్థలు సంతసప్రదములే యని గుర్తెఱుంగ జాలకపోయితివా? చిత్తముపై నాధిపత్యము వహింపనున్న నాకు సంతసప్రదంబగు సమయమెందుకలదె? సంసారము భ్రిమాత్మకంబులగు దృఢతర పాశములచే బంధింపబడి విషాద భయాది విషమపరిణామములకు వశమయి, డెందమున గడు గుందుచున్నయది. ఈశ్వరాదేశముచే నేనా వ్యామోహాంధకార పటలమును, దివ్యశిక్షాజ్యోతిచే దూరీకృతముగావింప ననుకూల సాధనమునకయి, యన్వేషణము సేయ నరుగుచున్నాడను. అవివేకగహ్వరమున బలితులయిపోవు సాంసారిక భ్రాంతల నుద్ధరించుటయే మత్కర్తవ్యమని సర్వేశ్వరు డనేక పర్యాయములు నాకు స్వప్నావస్థయందు నుపదేశించియున్నాడు. స్వార్థమ మభావంబులబాసి, సుస్థిరానంద ప్రదంబగు పరమార్థలాభము నన్వేషించుటకొఱకే సత్పథమును గ్రహింప సర్వసంగపరిత్యాగినయి రాష్ట్రాంతరగతుడ నగుచున్నాడను. భార్యాపుత్రులను, సమస్తభాగ్యములను, వేయేల, సమస్తైహిక సంబంధములను వర్జించి, మానవోచితంబగు సత్యధర్మ

పథపరిజ్ఞానమును, బడయ సంకల్పించి; జ్ఞానిసత్తముల దివ్య
సన్నిధి కరుగుచున్నాడను. ప్రస్తుతము నేను భార్గవాశ్రమాశ్రి
యమును బడయ నేతెంచితిని. నీ సాహాయ్యంబుననే నే నింతద
నుక వైరాగ్యమునం దొకించుక యానందము ననుభవింపగల్గితిని.
నీవలననే నేడు రహస్యముగ బయలుదేరగల్గినాడను. వాస్తవ
ముగ దావకంబగు ప్రేమ ప్రశంసనీయము. నీ సాహాయ్యము
నకు బ్రత్యుపకృతి నే నేమిసేయగల్గుదును? సంసారులు ప్రాయి
కంబుగా స్వార్థాంధులయి పరుల బ్రేమింపుచుందురు. భూపా
లురు సహితము పాలితులను స్వార్థము నభిలషించియే పరిపా
లింపుచుందురు. ప్రజాసముదాయమును బ్రేమించుటంజేసియే
భూపాలురకు సమస్తైహికైశ్వర్యములు కరగతమగుచున్నవి.
వార్ధక్యమున దన్ను పోషించుననియే కదా జననీజనకులు సం
తానమును గని పోషింపుచుండునది. ప్రతిప్రాణియు స్వార్థ
ము నభిలషించియే ప్రపంచమునం దన్యప్రాణుల బ్రేమింపు
చుండును. స్వార్థము నభిలషింపక ప్రేమనే శాశ్వతపదార్థము
గను. మానవజీవితలక్షణముగను భావించు సంసారుల బ్రేమిం
చువా డొక్కడయిన నీ సృష్టియందు గానరాడు. నీవునాయెడ
జూపిన ప్రేమ సంసారుల స్వార్థమయప్రేమ నుండి భిన్నమయి
నది. నే నిందుల కనేక సాధువాదముల నర్పించుచున్నాడను.
నా వియోగమునకు విలపింపక, నా హితము నభిలషించియే న
న్నెడబాపి, శీఘ్రము గృహమున కరుగుము. సర్వేశ్వరాజ్ఞను-

ల్లంఘించు మూఢునకు మరణమే శరణ్యము. మరణించినవానికి జన్మించి, దుఃఖించుటయే ధాతయొక్క విధానము. నే నిక నిలువనొల్లను.''

సిద్ధార్థుని దృఢసంకల్పము నాకర్ణించి, ఛన్నుడు భయభీతుడయి, అతని నా ప్రయత్నమునుండి యనేకప్రయత్నముల చే నిరోధింపజూచెనుగాని ప్రయోజన మిసుమంతయయిన లేక పోయెను. ఆతని విన్నపములన్నియు బూడిదబోసిన పన్నీటిచందమయ్యెను. సిద్ధార్థునకు జీటికిమాటికి "సిద్ధార్థా! వేగిరింపుము. తామసింపకు" మను ప్రబోధవాక్యములు విననగుచునే యుండెను. రాకుమారు డింక నాలసించుట మహానుచితంబని గుర్తెఱింగి తనవద్దనున్న చంద్రహాసముతో లంబాయమానములయియున్న తన శీర్షముయొక్క కేశముల ఖండించివైచెను. తానంతకు బూర్వమే ధరించియున్న రాజాలంకారములును దివ్యపీతాంబరములును సన్యాసి ధరింపరానివని యెంచి, వానిని సహితము బరిష్కరించి, వల్కలములు ధరింపవలయుననియు నవి యెచ్చోటబ్రాప్తించునా యనియు విచారింపుచుండగనే వృద్ధభిక్షుకుం డొక్కరుడు జీర్ణవసన ధారియయి యా మార్గమునే వెళ్ళుచుండుటగాంచి, నిజాంబరముల నతని కొసగి వాని మలినవస్త్రముల దాను ధరించెను. చూచుచుండగనే నిరుపమానాభాసావిలసితుండగు చంద్రినాథుడు నీరదమాలికా గ్రస్తుడయి దృష్టిపథమును బాయుచంద

మునసే సిద్ధార్థకుమారుని ప్రకాశయుక్తంబగు సుందరవదనారవిందము మలినవస్త్రధారణంబునను, కేశఖండనమువలనను రూపు మాసిపోయెను. గాకుమారుడట తన పార్శ్వమునందే నిలువబడిన కంటకాహ్వయంబుగల ఘోటకము నధిరోహించి క్షణమాత్రకాలంబున దృష్టిపథము నెడబాసి వాయుమనోవేగంబుల జనియెను. తురంగపృష్ఠభాగమున నాసీనుడయియున్న సిద్ధార్థుని హృదయాంతరాళమున నంతరిక్షమునుండి పూర్వోక్తంబులగు నుపదేశవాక్యములే ప్రతిధ్వనితములగుచుండెను. ప్రకృతి తత్వపరిబోధజ్ఞానసార్థకమగు రాకుమారుని స్వయముగ బ్రకృతీదేవియే మనుష్యాకారముదాల్చి పృథ్వికవతరించి, యాతని కాదరపురస్సరంబుగ నాహ్వానమొసంగుసట్లు నభోమండలమున ప్రకాశించు నక్షత్రసముదాయమనురాగదృష్టులతో వీక్షించుచున్నట్టును శీతలమందానిలమత్యంత ప్రేమపూర్వకంబుగా దేహమును స్పృశించి "జ్ఞానకుమారా! భయపడవలదు. సదభిప్రాయ సంపన్నునకు సర్వేశ్వర సాహాయ్య మవశ్యము సంప్రాప్తమగు"నని బోధించుచున్నట్టును, వాయు సంచలనంబున నటునిటు నల్లలలాడుభూరుహనందోహము శుష్కపత్ర పుష్పచయమును భూతలపతితముగావించుచు నతనికి స్వాగత మొసంగుచున్నట్టును శుష్కపత్ర పరస్పర సంఘర్షణోద్భూత ధ్వానములే యతని నవలోకించి జయజయధ్వనులు సేయుచున్నట్టును, పలుపలుకు లేల, సమస్తదృశ్య

పరిపంచము సిద్ధార్థా! నీకుశుభ మొనగూడుతమ్మని సంబోధిం పుచున్నట్టును రాకుమారునకు స్పష్టపడియెను. అంత నతనిహృ దయ మానందసాగర, వీచికాపరంపరల దేలియాడసాగెను. అదంతయు సర్వజ్ఞుండగు సర్వేశ్వరుడే ధర్మాన్వేషణార్థ మరుగుదుస్న. తన హృత్కమలమును బ్రఫుల్లముగావించుటకే సేయుచున్నాడని భావించెను. ఈచందమును బ్రకృతిదృశ్య చ్ఛట నవలోకింపుచు, బ్రయాణము సేయుచుండగనే ప్రభాత మయ్యెను. బాలభాస్కరుని కిరణమాలికలు సర్వత్ర లాస్యము జేయుచుండెను. నిర్మానుష్యమగు స్థానమును సూర్యోదయం బునకు పూర్వమే చేరగల్గితిమికదాయని ముదమందుచు నజ్ఞాత మార్గాతిక్రమణంబున నిప్పటి కీప్రదేశము చేరితి, నింకముందు సర్వేశ్వరు డేమిసేయనున్నాడోయని విచారింపదొడంగెను.

సిద్ధార్థుడు తన్నెడబాసి యొక్కయుదుటున సైంధవము నెక్కి పరుగిడివచ్చినంతనే రాజభక్తియుక్తుడగు ఛన్నుడు నిర్జనప్రదేశము ప్రతిధ్వనింపుచందమున గొంతెత్తి రోదనము సేయ నారంభించెను. ఆక్రిందనము సేయుటవలన బ్రయోజ నము లేదనియు, సిద్ధార్థు నెడబాసి తుచ్ఛజీవములతో నుండుట కంటె నుసురుల బాయుటయే యుత్తమంబనియు నతడు భావిం చుకొన నారంభించెను. తానుకూడ ప్రేమమయుండగు సిద్ధా ర్థుని గోల్పోయిన సంసారమును దృణప్రాయముగ ద్యజి యించి, మహాత్ముండగు సిద్ధార్థుని పాదారవింద సన్నిధినే

యుండి, సేవాశుశ్రూషల జేయుచు ముక్తిమార్గమునుబడయ నిశ్చయించెను. అతడు భావమునం దట్లు సిద్ధార్థుని సందర్శన సౌభాగ్యము కరతలామలకంబగునని నిశ్చయించుకొని నవ్య తరోద్రేకపూరితుడయి, ద్విగుణితోత్సాహముతో రయమున బర్వెత్తివచ్చి, రాకుమారుని పాదరాజీవముల వ్రాలెను. సిద్ధార్థు డతనిరాకకు మహదాశ్చర్యమునందెను. హయము కంటె నతివేగమున వచ్చుటంజేసి ఛన్నుని శరీరమంతయు స్వేద జలసంచితమయియుండెను. సిద్ధార్థుడు ఛన్నునకు దనయం దున్న గాఢానురాగము స్వీయప్రాణములయందయిన లేదని గ్రహించెను. అతని నా యనురాగమే యింత దుఃఖింపజేయు చున్నదని సహిత మతడు గ్రహింపకపోలేదు. నోటమాటలేక ఛన్నుడు విలపింపదొడంగెను. సిద్ధార్థు డెన్నిపర్యాయములు పునరాగమనంబునకు హేతువేమని పృచ్ఛించినను నిరుత్తరు డయి రోదనము సేయుచునేయుండెను. అంత నాత డీచంద మున గంభీరముగ ఛన్ననికి బ్రబోధింప దొడంగెను:—

"సోదరా! ఛన్నా! వగవకుము. ఇది విలపింపవలసిన తరుణ ముకాదు. జనులు ప్రాయికంబుగా నశుభసమయములయందే వందురిలుదురు. నీవట్లుగాక శుభసమయమునందు విలపింతు వేమి? ఇయ్యది హర్షింపదగిన శుభముహూర్తము నేను వేద వాక్కగు "ఆత్మవత్సర్వభూతాని" యను నాచరణీయధర్మ మును నెరవేర్ప జ్ఞానమునార్జించి, నమత్వముచే నిర్వాణమును

బడయుట కొరకే బంధు పుత్రమిత్రకళత్రాదుల నెడబాసి యటవీ ప్రాంతముల దపమాచరింప జనుచున్నాడను. ధర్మార్థ కామమోక్షముల విస్మరించి మూఢు లగు సంసారు లైహిక భోగవిలాసంబుల మగ్నులరయి స్వార్థాంధులయి మహా కృత్రిమాభిమానపరు లయి, అవివేకాంధకార బంధుగ హృదయులయి, భ్రమాత్మక సంసారవ్యామోహ పరీతచిత్తులయి, యంతమున కవ్వానిపరిణామంబులగు భయవిషాదముల బడసి ఘోరముగ దురపిల్లుచున్నారు జ్ఞానశూన్యులయి ఘాతుకమృగములనలె జీవించుటకన్న బంచభూత నిర్మితకాయమును మగుడ వానియందే లయము గావించుట యుక్తము.

ధన్నా! ప్రపంచమునందు సహితము సుస్థిరానందమును బడయ వాంఛించు నరులకు విజ్ఞానముకంటె జ్ఞానమే విశేష లాభదాయకంబు. (జ్ఞాన విజ్ఞాన భేదము:— మోక్షే ధీర్జ్ఞానమ్— మోక్షసాధనమగు బుద్ధినే జ్ఞానమందురు, అన్యత్ర విజ్ఞానం విరూపమ్ జ్ఞానం విజ్ఞానమ్. మానవునకు మోక్షప్రాప్తికయి యుపయోగించు జ్ఞానమే విశేషహితప్రదంబు గాన దదితర జ్ఞానమును విజ్ఞానమందురు విజ్ఞులు). ప్రస్తుతము జ్ఞానమను పదమే స్మృతిపథమునుండి యెడబాసిపోవ నద్దాని స్థానమున మోహావేశ పూరితంబగు మాయాప్రపంచము, యద్దాని పర్యవసానంబులగు భోగవిలాసములు వాసము సేయుచున్న యవిజ్ఞానవ ట్లుండ, విజ్ఞానముసహిత మదృశ్యమయి పోయినది.

వైషమ్యబుద్ధి స్వయముగా వేతెంచి మానవసంఘమును వరించినది. మారునిదాస్యమున కెల్లరు వల్లెయన్నట్లు గోచరింపుచున్న యది. ధర్మజ్ఞానశూన్య మయినది. వాస్తవమరయ జాతి యెట్లు కానేర్చును? (పాఠకులారా! నాకియ్యెడనొక పండితోత్తమునిసోదాహరణోక్తి జ్ఞప్తికివచ్చుచున్న యది:—"జాతిర్జ్ఞాతంచసామాన్యం." సమానభావము గలదియే జాతి. భేదమునకు జాతియందుస్థానములేదని తాత్పర్యము.సర్వభూతహితము సిద్ధార్థుని ప్రతివాక్యమునందు కలదు. రూపభేదముండినను హానిలేదు. కాని భావభేదముండిన సుఖోత్పత్తికి దావులేదు. అసుఖమును గల్గించునది జాతియేకాదు. దీనికొక్క వ్యాఖ్యానముగలదు—'జాయతే అనయా సుఖంజాతి' సుఖమెద్దానివలన ప్రాప్తించునో నదియే జాతి. సమానభావమునందే కాని ప్రతికూలభావమునందు సుఖోత్పత్తిశూన్యము). మానవులు జాతిధర్మములబాసి వర్తింపుచున్నారు అనుదినము వ్యామోహపంకిలమునబడి తాత్కాలిక తుచ్ఛసౌఖ్యంబుల ననుభవింపుచు, దీర్ఘకాలపర్యంతము దుఃఖవారిధిని గూలుచున్నారు. వ్యామోహము హెచ్చుటకు హేతు వవిద్య (అజ్ఞానము) ప్రబలుటయేయని వక్కాణింపవలయునా? నరుల * కవిద్య

* అవిద్య యను పదనిరూపణమున కొక్క వ్యాఖ్యానము కలదు.—So finally Avidya does not mean mere ignorance, mere absence of knowledge but perverted knowledge" The Science of social organisation" ప్రస్తుతము సహితము సిద్ధార్థుని వాక్యముల

చేనెంతమాత్రము నానందము ప్రాప్తింపజాలదు. విపరీతజ్ఞానమునహిత మజ్ఞానముగనే పరిగణింపబడి దుఃఖోత్పత్తికి మూలమగును. నీయందవిద్య వేరు నాటియుండుటవలననే నశ్వరంబగు నామూర్తికయి విలపించుచున్నాడవు. మానవజీవిత ధర్మవివేచన పరిజ్ఞానశూన్యులగు వ్యక్తులు స్వరూపమాత్రముచే మానవశబ్దమున కర్హులు కారు జన్మకును, ముక్తికిని మూలమగు బుద్ధియే ప్రధానము.

అజ్ఞానముచే నాచరింపబడు సమస్తకార్యములు నిష్ప్రయోజనకరములు. అర్థములేనట్టి వ్యర్థకార్యముల సేయుట మానవధర్మమునకు విరుద్ధము. ("ప్రయోజన మనుద్దిశ్య మందోఽపి ప్రవర్తతే" మందుడయిన ప్రయోజనము లేనిదే యే కార్యమును సేయ నభిలషింపడని గురుజనులు సెప్పువాక్యము సిద్ధార్థుని భావమును బలపఱచుచునే యున్నది.) సత్వమూలమయినట్టి కృషివలన సహితము మానవున కహితమే చేకూరుచున్నయది. ధర్మభ్రష్టులయిన మానవులు సజీవులయి యుండుటకంటె మరణించుటయే వేయిమడుంగు లుత్తమము. అట్టివారు మృతి జెందినను సుఖమునందలేరు. ఇహపరదూరులగుదురు. ఛన్నా! నే నస్యసోదర మానవులపగిది "రెంటికిచెడ్డ రేవడు" అగుటకు సమ్మతింపక, పరమ ప్రయోజనీయంబగు పరమార్థతత్త్వమును

కనుటూలముగనే నరుస్తనరులు విద్యాదూరులయి యవిద్యకే ప్రాధాన్యమి
చ్చి జీవితవేదమునం దొసగి అనుదినము భ్రష్టత్వమునకే పాల్పడుచున్నారు.

గ్రహింప నరుగుచున్నాడను. మానవుడు యుక్తాయుక్త జ్ఞానశూరుడయి, నశ్వరంబులగు భౌతికైశ్వర్యములనే జీవనసర్వస్వముగ భావించి వర్తించుట నీచకార్యంబుగాదె? సుస్థిరంబుగ నిహలోకమున జీవించు సౌభాగ్యము జీవకోటికి లేదని గ్రహించియు, బంధుమిత్రాదులతో సర్వదా నెడబాయక యుండ వలయునని యెడి యభిలాషను గల్గియుండుట యల్పజ్ఞత కాదె? అస్థిరంబగు పదార్థమును ప్రేమింపుచు నద్దాని ప్రాప్తికయి యల్లాడుట మానవునకు యుక్తకార్యమె? అల్పప్రాయమందే జననీజనకులకు ప్రాణసమానులయి మరణించిన బాలు రెందరు కలరు? జీవితమే శాశ్వతమయియున్న జనకు డుండగనే పుత్రుడు మరణింపనేల? ఛన్నా! నా మాతృదేవి మాయ యెట్టిది. శక్తిస్వరూపిణి కదా? ఆదేవి యెన్నియో యుపవాసములు జేసియు, నెన్నియో రాత్రులీశ్వరధ్యానమునందు జాగరణము జేసియు, శరీరసౌఖ్యముల దృణప్రాయముగ త్యజించియు నన్ను గని, చూచి యానందింప జీవించదో యెటకరిగినది? ప్రేమస్వరూపిణియగు నామాతృదేవి యకాలకాలగర్భంబున గలియనేల? ఇంక నీజీవితమును విశ్వసించదగునా? సత్యమును గ్రహింపక, మిథ్యాభిమానపరులయి క్షణభంగురములగు శరీరములపై సంపూర్ణమగు విశ్వాసమును గల్గియుండుట వివేకము కాదె? ఛన్నా! అపారపారావారమధ్యంబున జుక్కాణియు చెడ్డును లేని నావగతినిబోలినదే యీ

చేనెంతమాత్రము నానందము ప్రాప్తింపజాలదు. విపరీతజ్ఞాన మునహిత మజ్ఞానముగనే పరిగణింపబడి దుఃఖోత్పత్తికి మూల మగును. నీయందవిద్య వేరు నాటియుండుటవలననే నశ్వరంబగు నామూర్తికయి విలపించుచున్నాడవు. మానవజీవిత ధర్మ వివేచన పరిజ్ఞానశూన్యులగు వ్యక్తులు స్వరూపమాత్రముచే మానవశబ్దమున కర్హులు కారు జన్మకును, ముక్తికిని మూల మగు బుద్ధియే ప్రధానము.

అజ్ఞానముచే నాచరింపబడు సమస్తకార్యములు నిష్ప్రయోజనకరములు. అర్థములేనట్టి వ్యర్థకార్యముల సేయుట మానవధర్మమునకు విరుద్ధము. ("ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే" యందుడయిన ప్రయోజనములేనిదే యేకార్యమును సేయ నభిలషింపడని గురుజనులు సెప్పువాక్యము సిద్ధార్థుని భావమును బలపఱచుచు నేయున్నది.) సత్యదూరమయినట్టి కృషివలన నహితము మానవున కహితమే చేకూరుచున్నయది. ధర్మభ్రష్టులయిన మానవులు సజీవులయి యుండుటకంటె మరణించుటయే వేయిమడుంగు లుత్తమము. అట్టివారు మృతి జెందినను సుఖమునందలేరు. ఇహపరదూరులగుదురు. ఛన్నా! నేనన్యసోదర మానవులపగిది "రెంటికి జెడ్డ రేవడు" అగుటకు సమ్మతింపక, పరమ ప్రయోజనీయంబగు పరమార్థతత్వమును

---

తెనుగూలముగనే సమస్తనరులు విద్యాదూరులయి యవిద్యకే ప్రాధాన్యము ను జీవిత వేదమానం దొసగి అనుదినము భ్రష్టత్వమునకే పాల్పడుచున్నారు.

గ్రహింప నరుగుచున్నాడను. మానవుడు యుక్తాయుక్త జ్ఞాన శూరుడయి, నశ్వరంబులగు భౌతికైశ్వర్యములనే జీవనసర్వస్వముగ భావించి వర్తించుట నీచకార్యంబుగాదె? సుస్థిరంబుగ నిహలోకమున జీవించు సౌభాగ్యము జీవకోటికి లేదని గ్రహించియు, బంధుమిత్రాదులతో సర్వదా నెడబాయక యుండవలయునని యెడి యభిలాషను గల్గియుండుట యల్పజ్ఞత కాదె? అస్థిరంబగు పదార్థమును ప్రేమింపుచు నద్దాని ప్రాప్తికయి యల్లాడుట మానవునకు యుక్తకార్యమె? అల్పప్రాయమందే జననీజనకులకు ప్రాణసమానులయి మరణించిన బాలురెందరుకలరు? జీవితమే శాశ్వతమయియున్న జనకుడుండగనే పుత్రుడు మరణింపనేల? ఛన్నా! నా మాతృదేవి మాయ యెట్టిది. శక్తిస్వరూపిణికదా? ఆదేవి యెన్నియో యుపవాసములు జేసియు, నెన్నియో రాత్రులీశ్వరధ్యానమందు జాగరణముజేసియు, శరీరసౌఖ్యముల దృణప్రాయముగ ద్యజించియు నన్ను గని, చూచి యానందింప జీవించెనో యెటకరిగినది? ప్రేమస్వరూపిణియగు నామాతృదేవి యకాలకాలగర్భంబున గలియనేల? ఇంక నీజీవితమును విశ్వసించవలదగునా? సత్యమును గ్రహింపక, మిథ్యాభిమానపరులయి క్షణభంగురములగు శరీరములపై సంపూర్ణరుగు విశ్వాసమును గల్గియుండుట వివేకముకాదె? ఛన్నా! అపారపారావారమధ్యంబున జుక్కాణియు దెడ్డునులేని నావగతినిబోలియే యీ

మున జీవితనౌక సంసారసాగరమున బ్రయాణము సేయుచు వివే
కమను తరణీపంచాలనాపరికరమును, మనశ్శాంతియను చుక్కా
నిని లేక డోలాయమానమగుచున్నది. ఎప్పు డేసంకటమునకు
పాలగునో యెవ్వరికెరుక? ఇట్టి యస్థిరంబగు నౌకను విశ్వ
సించి, తీరమును సమీపింప వాంఛించు మూఢుని సమస్య,
మెడకొక బండనుగట్టుకొని సాగరమును దరింప యత్నించు
వానిని బోలియుండును. అనుదినము బ్రాపంచికులు పతితు
లయిపోవుచున్నారు. విశ్వ సౌభ్రాతృత్వమునే జీవనసర్వస్వ
మని భావించి, నేను మానవహృదయముల నధివసించు కామ
క్రోధాది యరిషడ్వర్గమును బారద్రోలి, మారుని సింహాసన
భ్రష్టునిగావించి యారాచగద్దెపై సత్యస్వరూపిణియగు ధర్మ
లక్ష్మి నధిష్ఠింపజేయ గృషిసలుపుటకే యరుగుచున్నాడను.
మారుని సామ్రాజ్యముపై దండెత్తి శమదమాది యోధాగ్రేస
రుల సాహాయ్యంబున ధర్మరణదుందుభి మ్రోయించి పైబై
కొన నేతెంచు మారుని కామక్రోధాది యోధుల సమేత
ముగా దునిమి, పరిపాలనాధికారమును బడయ యత్నించు
టకు సత్యధర్మమును గ్రహింప, మహాత్ముల నాశ్రయింప,
నరుగుచుండ నానందింపక ఛన్నా! మూఢునివలె వాపోవనేల!
సత్కార్యము నాచరింప జను మిత్రు నవలోకించి, సంతోష
యుక్త చిత్తుండగుటయే మిత్రుని ధర్మము.

మానవులు దయాదాక్షిణ్యభావ రహితులయి, అవివే కజన్యవికార సంపన్నులయి అరిషడ్వర్గదాస్యమును స్వీకరించి, మానవపదచ్యుతులయి వర్తింపుచుండుట వీక్షించిన జింతింప వలయునుగాని జ్ఞానస్వరూపమునందు విలీనులయి 'పరోపకా రార్థ మిదంశరీరం" అను మహద్వాక్యమును సార్థకపరవు చుండ మూర్ఖమానవుని కరణి వివేకమొకించుక గల్గియున్న నీవును దుఃఖింపజెల్లునే? క్షణికంబగు సంసారసంబంధము విడి పోవుచున్నదనియా నీవు విలపించుట; అయ్యో? యెంతవేల ఐయితివి! సంసారమందలి సమస్తజనులును నా సోదరులై సర్వసమానత్వమే నాజీవితలక్ష్యము. సంపత్కాలమున గాక, విపత్కాలమున ననగా, నెల్లవారు నజ్ఞానాంబుధి మునిగిపోవ నుద్యుక్తులయి యుండ నుద్ధరింప నరుగుట శ్రేయస్కరము కాదె? నన్ను సంసారబంధనములయందే తగుల్కొని కాముక వృత్తిచే జీవింపుమనియా నీవభిలషింపుచున్నయది? తుచ్ఛసుఖ ము లనుభవింప నభ్యస్తుండనగుచో నా కావ్యసనమే జీవితపర్య మావధియగును. ఇంతలో నేవ్యాధియో, మరణమో సంప్రా ప్తమగుచో వ్యసనాభిలాషచే మన మెంతయో దుఃఖింపుదుము గదా? వ్యసనమను దానికి దూరముగనే యుండుచో జీవనము యొక్క సహజావస్థలగు జరామరణవ్యాధుల నమితానందపర వశహృదయుడనయి స్వీకరింపగల్గుదుముగదా! కాంక్షకాధీనమ గుటయే దుఃఖము నుత్పన్నము జేసికొనుటయని గ్రహింప

చగును. నా బాల్యావస్థలో నీవె ప్రాయికంబుగా జీవితాశాశ్వ
తత్వమునుగూర్చి యల్పముగనో, ఘనముగనో, బోధసేయుచు
నుండెడి వాడవు. అట్టిబోధకుడవగు నీవే తరుణమాసన్న
మయినపుడు మూర్ఖునిపగిది రోదనము సేయుటుచితమె ! ఆప
త్కాలమున నుండు విజ్ఞాన మొక్క జ్ఞానమే ! మాటల నుడువు
టకుపకరించు జ్ఞానము జ్ఞానము కాదు. కేవల మది వాచాలత్వ
మనబడుగును. కార్యరూపమునుదాల్పని జ్ఞానమునే యజ్ఞానమం
డ్రార్యులు. ఆపత్సమయమునందే ధర్మము, ధైర్యము, మిత్రు
డు, పత్ని యీ నాలుగు పదార్థముల యాథార్థ్యము విస్పష్టము
కాగలదు. శుభసమయ మేతెంచిన, యిపుడా నీవేదాంతప్రసం
గముల గట్టిపెట్టునది? నాకొఱకై శోకించు నీవె మృత్యువా
తను బడినపిదప తిరిగి దర్శింపనయిన గల్గుదువా ? ముప్పదియేం
డ్లకు బూర్వ మీ నా యాకృతిని గాంచితివా? అభావము
నుండియేకదా యీనా యాకృతి వెడలివచ్చినది. తిరిగి యిది
యచటికే పోవునని గ్రహింపజాలవా ? జగన్నాటక రంగస్థల
మున భ్రమాత్మక వ్యామోహమే యవనిక. యవనికచాటు
తొలగినంతనే దర్శకులు పాత్రధారుల గాంచగల్గినటులే,
మనము సహితము జగమను రంగస్థలమున యవనికరూపమున
నున్న వ్యామోహమును దోసిపుచ్చితిమేని, జ్ఞానస్వరూప
మును బడయగలము. రంగస్థలమున భూపాల వేషధారియే
యొప్పకాలమునందు భృత్యువేషధారి యగుచున్నాడు ; భృ

త్ర్యుడే తిరిగి భూపాలోచితవసనముల ధరించి, నాట్యస్థలమున కేతెంచి, నృత్యము సేయ నారంభింపుచున్నాడు. ఇదియేరీతి మనము సహితము లీలామయుని నాట్యరంగమగు సంసారమం దలి చిత్రవిచిత్ర వేషముల ధరించియున్న నశ్వరులగు పాత్ర ధారులము. నిత్యపరివర్తనమే మన లక్షణము. ప్రపంచములో నిత్యము మన దృష్టికి గానవచ్చు సమస్తము మిథ్యయనియే తెలియనగును.

మానవులు భ్రమను బాసినపుడే బక రూపముల నెడ బాసి రాజమరాళసూలయి దుగ్ధనీరముల యథార్థస్వరూపము నవలీలగ గ్రహింప శక్తులయ్యెదరు. ఒకానొకదివస మీ విశా లప్రపంచమంతయు బంచభూతములయందే విలీనము కావలసి యుండ, నందులో నొక్క యల్పాణువు నగు నా కొరకయి నీవు పరితపించుట పరమమౌఢ్యము కాదె? "జగన్మిథ్యా బ్రహ్మం సత్య"మ్మను గురుజనోక్తిని స్వానుభవంబున గ్రహించియే సత్యపదార్థాన్వేషణమునకయి, యేగుచుండ నానందించుటనా శ్రితవగు నీ కర్తవ్యము గాదె? "యద్దృష్టం, తన్నష్టమ్" అని తె లిసి యిప్పటికైన జ్ఞానస్వరూపమాహాత్మ్యము నెఱింగి గృహోన్ముఖుడవగుము. దర్శనేంద్రియము లనేకరూపముల దృష్టిగో చరంబగు దృశ్యమంతయు మృత్తికయందు గలియునదియే. తన పాదముల గాష్ఠములని భ్రమించి యవ్వానిపై గుఠారాఘా తము గావించుకొనువానిని బోలియె వ్యామోహపరీతు డగు

వ్యక్తి సహితముండును. అంధకారబంధురంబగు జగమున మోక్షసామ్రాజ్యపథము నన్వేషింప వాంఛయున్న మానవులెల్లరు జ్ఞానమును బడయవలదే? దూరదృష్టిగలవాడ వయి సంకుచితములగు దుర్భావములబాసి, వ్యామోహమును రోసి, మద్వాక్యములయందలి సారాంశమును గని సుఖింపుమా చన్నా!

గీ॥ పం॥ కామక్రోధంబు లన్నింటి • గాలదన్ని
నశ్వరంబైన సంసార • భావమణచి
సంయమంబును గల్గియే • సంతతంబు
బరుల కుపకారమును సలు • పగల నరుడె
మోక్ష సామ్రాజ్య సౌఖ్యంబు • బొందగలడు.

ప్రపంచములో మనల దీక్ష్ణకరవాలమున కెరజేయనెంచువారికన్న మనలకు మన యంతశ్శత్రువులే ఘోరరిపులు. ఈశత్రువుల నంతమొందించువారనే విజయు లనజెల్లును. పశుబల సాహాయ్యంబున సధర్మ రణప్రాంగణమున, శాత్రవగజయూథపీరసింహముయి, నరమారణంబు సేయువాడు వట్టిపిరికిపంద. మనము జ్ఞానరహితమగు పశువుగ భావించుకుంజరమే వేనవేలు జీవముల నల్పకాలమునందే మర్గ్గజేయును. అంతమాత్రంబుననే దానిని పరాక్రమము గలదానిగా భావింపదగునా? భావింపదగినచో బశుబలమును గలిగియున్న శూరుడుపశువుకంటె నల్పుడయ్యెంగదా? సోదరా! ఛన్నా? కామక్రోధాదుల జయించిన మన కపారసౌఖ్యము లభ్యమగును.

అనూయాగ్రస్తులగు మానవులనుద్ధరింప సంకల్పించితిని. అనూయకంటె ననురాగమే మహాద్భుతశక్తియుక్తమగు సంపత్తి. అనూయ రాష్ట్రపతనమునకు మూలహేతువగుచో, ననురాగము నూతనరాష్ట్ర నిర్మాణమునకును, తదభ్యుదయమునకును మూలహేతువగును. నాబాల్యమున దేవదత్తునకును నాకును మరాళసమస్యా విషయమయి కల్గిన జగడమునకయి న్యాయాధిపతి సంహారమున కంటె సంరక్షణమునకే యెక్కుడుప్రాధాన్యము నొసగియున్నాడు. దుష్టుడొక్కడు చెంపగొట్టిన బహుబలముగలవాడు క్షమయేలేనిచో దండతాడిత భుజంగము పగిది క్రోధోన్మత్తుడయి, తెలియక దోషముగావించిన మూర్ఖుని సంహరించు స్వభావము సంసారమున వ్యాప్తమయియున్నది. ఆత్మబలసంపన్నుడు (జ్ఞానసంపన్నుడు) తన్నొకదుష్టాత్ముండు కినిసి, చెంపగొట్టిన గుపితుడుకాక, తిరిగి మరియొకచెంపనిచ్చి దుష్టమానవునకు దా నాచరించు దూషితకార్యమునెడ ననూయాభావమును జనింపజేసినవాడగును. అంతట మూర్ఖుడు నిజపశుబల ప్రయోగము వ్యర్థయగుటను గాంచి, లజ్జితుడయి, తన్నీచకార్యమును విడనాడును. ఆత్మబల ప్రయోగంబున నాత్మసంరక్షణమే కాక పరజన సంరక్షణము సహితము వెలయుచున్నయది. అట్టి యాత్మబలప్రాప్తికి జ్ఞాన మావశ్యకము. అద్దానిని బడయుటకే తపశ్చర్యగావింప నరుగుచున్నాడను.

పశుబల మొక్క మానవజాతికే కాదు, పశుజాతికి సహితము బాలుని హస్తమందలి తీక్ష్ణతర కరవాలము వంటిది. ఆత్మ బలము పసిబిడ్డచేతియందున్న వెన్నముద్దను బోలియుండును కాన, ఛన్నా! ఇప్పటికి నీకు నాత్మబలము యొక్క సహచరులగు నీతి, పాపభీతి, శాంతి, సహనశీలతాది సద్గుణగణముల యొక్కయు పశుబలము యొక్క సహచరులగు కామక్రోధాదుల యొక్కయు తత్వము విశదమయి యుండనోపు! కాన నో ఛన్నా! లోకకల్యాణముసేయు నిమిత్తమే సంసారమును త్యజియించు నన్గాంచి, నీవు వివేకదూరులగు సంసారులవాడ్క తాత్కాలిక వ్యామోహ జనితానందము నే సుస్థిరమనియు సుకరమనియు, భ్రమించి కడు నిరుమల బడవలదు. మనము దేనిని సుఖమని భావింపుచున్నారమో యదియే వాస్తవమాలోచించిన దుఃఖము; దుఃఖమని సంభావింపబడునదియే యథార్థమగు సుఖము. ఒక క్షణికమగు పదార్థము ననుభవింపుచు నద్దానివలననే యేదో యొకవిధమయిన సుఖమును బొందుచున్న గొంతకాలమున కాపదార్థము నిజాస్థిరత్వంబున భోక్త నెడబాసి చనినంతనే వానిచిత్తమున కపారమగు దుఃఖము వాటిల్లునుగదా? ప్రిప్రథమమునుండియు మన మా పదార్థమునే క్షణికమని గ్రహించి యనుభవించు వ్యసనమునకు బాల్పడకయే యున్నచో మన కాపదార్థవియోగ సంయోగంబుల దుఃఖ మెట్లు వాటిల్లనేర్చును! స్వప్నావస్థయందయి

మనము తాత్కాలికంబును, నస్థిరంబును, నయథార్థంబుననగు సుఖమును బడయకయే యున్నచో మన కేవిధమయిన విషాదము తటస్థింపజాలదు. ఒకతూరి యనుభవించి సుఖించి, తిరిగి యనుభవింప వాంఛించి పడయలేనపుడుగదా దుఃఖ ముత్పన్న మగునది. తాత్పర్య మేమన :— కామము— కోర్కెయే సంసారులకు వాటిల్లు భయదుఃఖములకు గారణభూతమగుచున్న యది. దీనిని నశింపజేయగల్గినవాడు మరణించియు సుఖముగ జీవించుచున్నవానికంటె నుత్తమోత్తముడు. కామమును జయింపలేనివాడు జీవన్మృతుడే. జ్ఞానము కామాదిదుర్గుణ వితతిని రూపుమాపుటకు తిమిర సముదాయమునకు బ్రిభాకరోదయమువంటిది యగును. జ్ఞానము దేహమందరమున వ్యాప్తమయియున్న సమస్త వికారముల, లోహమున బట్టియున్న తుప్పు నగ్ని నశింపజేయుపగిది, రూపుమాపి సారవంతమగు పదార్థమును శేషింపజేయును. ఉభయలోకముల హస్తగతము గావింపగల లోకాతీతమగు సామర్థ్య మీజ్ఞానమును మూడక్షరముల పదమునందే యున్నది. కేంద్రీకృతమయిన లోకాతీతశక్తియే జ్ఞానమని చెప్పిన నతిశయోక్తి కానేరదు. అవ్యక్తమగు జ్ఞానమునే సాకారోపాసకులు నిజాభిరుచి ననుసరించి మూర్తీభవింప జేసి త్రిమూర్తు లనుచున్నారనియే నా యభిప్రాయము. మానవు నధోముఖంబుగ గొనిపోవు స్వభావముగల కామము యొక్క పరిభావాతిశయమే మనలకు

సంయోగ వియోగములయందును, జననమరణములయం దును, స్వర్గనరకములయందును, విశేషతారతమ్యమును దర్శిం పజేయుచున్నది. కామపరిభావంబున లోకముయొక్కయు లోకమున కతీతమయియున్న నిర్వికార పదార్థముయొక్క యు వాస్తవిక స్వరూపంబుల నవలోకించు బాహ్యాంతరిక దృష్టులు నిరోధింపబడును. కామరహితుని కనగా వివేక వంతునకు మరణము, జననముకొరకేయనియు. జననము మరణము నిమిత్తమే యనియు, విచారింపకుండగనే త్రుటి మాత్రకాలంబున స్ఫురించును. మరణించు నాత్మీయునకయి విలపించు మూర్ఖమానవుడు పడయు మహాదౌర్భాగ్యమేమి! వివేకవంతుడు దుఃఖింపక పడయు దుర్భాగ్యమేమి! మూ ర్ఖుడు విషాదముచే నాత్మానంద గరిమను గోల్పోయి, నూత నంబగు వ్యామోహమును నిజానందమును వెచ్చించి, క్రయము సేయుచున్నాడు. వివేకవంతుడు సహజములగు ఘటనలకయి దురపిల్లక, తనకున్న యానందమును నభివృద్ధి జేసికొనుచు, మానవుని స్వాభావికంబుగనే జుట్టిముట్టియున్న సంసారవాతా వరణస్థితి పరిభావంబున వ్యామోహ కల్మషమును వికరియిం చివేయుచున్నాడు. కామమన్నను దుఃఖమన్నను, రహస్య ముగ నెక్కడను దాగియుండలేదు. ఇవి మన ప్రత్యక్షజన్మ శత్రువులే. కాయమును ఛాయయంటియుండు చందముగనే కాంక్షా దుఃఖములు రెండును మనల నిత్యము వెంటాడుచునే

యున్నవి. వీనినే సంసారులు గ్రహింపజాలక, యనుదినము దుఃఖసాగరమున నిమగ్నులయి పోవుచున్నారు. సోదరా! ఛన్నా! వినుము శ్రద్ధతో నాలకింపుము. పెడచెవిం బెట్టకుమా!

గీ॥ జ్ఞాన మిసుమంతయైనను • గాంచకుండ
కామినీ కాంచనంబులఁ • గాంక్షజేసి
మూర్ఖుఁడై యుండి తాఁ గష్ట • ములనుగాంచి
చింతలొం బొందు సంసారి • క్షితితలమున.

గీ॥ పం॥ చింత నిసుమంత నొందక • సంతసమున
గృహమునకుఁ జేరి నావార్త • గృహిణితోడఁ
దల్లిదండ్రులకును విశ • దముగఁ జెప్పి
వందనంబుల వారికి • నందజేయ
వాంఛ సేయుదు నుంటెన • వశ్యముగను.

నశ్వరంబును, క్షణికంబును నగు తుచ్ఛసంబంధమును సంస్మరించుకొనుచు, దుఃఖాబ్ధిం గూలుచుండక, శీఘ్రము గా జనగరియందలి ప్రాసాదమున కరగి నా జననీ జనకులకును బంధుమిత్రాదులకును, కళత్రమునకును నా యీ యానందదాయకంబగు శుభసమాచారమును విశదము సేయుము. కార్యము నేవిధముగ నయిన జేయవలసియే యుండ గాలవిలంబన మేటికి? నీవలన నిటనే దీర్ఘకాలము గతించిపోయి

నది. నేజెప్పు ఈ యంతిమవాక్యముల నాపితృదేవుండగు శుద్ధోధనభూపాలునకు నేను జెప్పినట్లుగా నివేదింపుము.

పితృదేవా! నీసుతుడు భగవద్వాక్య పరిపాలకుండగు నీ సుతుడు, జననమరణ కారణ గ్రిహణాభిలాషియగు నీసుతుడు భక్తిపురస్సరంబుగ బ్రిత్యక్షదైవ స్వరూపులగు మీకు బ్రిణమిల్లుచున్నాడు. కన్నతండ్రీ! పుత్రివ్యామోహంబునబడి యనేకోపవాసవ్రితానుష్ఠానంబుల మాయాదేవీగర్భంబున నన్నుబడసినాడవు. నా మాతృదేవి మజ్జన్మాంతరము సప్తమదివసంబుననే దివి కరుగ, హృదయేశ్వరి గతప్రాణుండవగు నీవు నన్నుజూచి యానందింపుచు ప్రాణసమానయగు నామాతను సహితము విస్మరించితివి. శైశవమాదిగ నన్నెత్తి పెంచి పెద్దవానిని గావించితివి. సకలవిద్యల నభ్యసింపజేసితివి. సమస్తభోగంబులననుభవింప చేసితివి. నిఖిలైశ్వర్యముల నాసన్నిధిని జేర్చితివి. అనన్యసామాన్య లావణ్యవతియు, నసాధారణ రూపయౌవన విద్యావతియు నగు యశోధరాదేవిని బత్నిగా నొనర్చితివి. వేయేల! పుత్రిగత ప్రాణుండగు జనకు డాచరించు సమస్తహితముల నాకు గావించితివి. మానవాసాధ్యమగు నీ యనురాగమును సంస్మరించినంతనే భక్తి గద్గదంబగు నాకంఠమునుండి యప్రియత్నముగనే "ధన్య పితృదేవ! ధన్యపితృదేవ" యను సాధువాదములు వెలువడుచుండును. నశ్వరంబులును భయవిషాదోత్పాదకంబులును నగు భాగ్యభోగ్యముల నను

భవింపుచు, సద్గ్రంథపఠనంబును, సజ్జన సాంగత్యమును, దేశ పర్యటనమును సలుపక కూపస్థమండూకము వలె నున్నంతపర్యం తము నాదగు విజ్ఞాననేత్రము మూతపడియే యుండెను. పర్య టనానంతరము నేను లోకము యొక్క యశాశ్వతత్వమును బూర్ణముగ గ్రహింపశక్తుండ నయితి. నిరంతర ముదాసీనభావ మునందుండు నన్నుగాంచి జనకా! నీ వనేకపర్యాయములు విచారింతు వేల? యని పృచ్ఛించినపుడు, ఈ సంసారము మిథ్య యనియు, భాగ్య భోగ్యములన్నియు బూటకములనియు, దెల్పుచు, "నా యౌవనమును వార్ధక్య మాక్రమింపకుండుగాత. వ్యాధులు నా దేహస్వాస్థ్యమును నిర్మూలింప కుండుగాత. మృత్యువు నాయుసురుల గొనకుండుగాత. విపత్కాలము నాదగు సంపత్కాలమును హరింపకుండుగాత." ఈ వరచతు ష్టయమును నాకు బ్రసాదింతువేని జగము నెడబాయనని నీతో విన్నవింప, నీవు మానవశక్తి కసాధ్యములను గోరితి వేలయని నన్ను బృచ్ఛించియుంటివి. తండ్రీ! నీవపుడు నాప్ర శ్నములకు సముచిత ప్రత్యుత్తరంబు నొసంగక నసంభవము లగు నిగూఢవిషయముల గూర్చి విచారింపుచు సుఖసంభోగ ముల నెడబాసి, సన్న్యాసప్రతిగ్రహణము నేయకురా నాయనా! యని చెప్పియుంటివి. తదాదిగ నిస్సారసంసారముపట్ల నాకు వైరాగ్యము జనించి కించిత్కాలమునందే పరిపక్వమయ్యెను. తద్వైరాగ్యభావ పరిణామమే నాదగు యీ గృహపరిత్యాగ

ము. బాల్యమునుండియు నీ వేచందమున నన్ను లాలనపాలనము జేసితివో యదియేమాడ్కి పితృదేవుడయిన నీవు నీసంతానమగు ప్రజాసముదాయమును రాజ్యమందలి తదితర సమస్తభూతరాసులను వాత్సల్యపూర్వకంబుగ బాలింప, దీనుడగు నీ పుత్రు డత్యంతభక్తిమై ప్రార్థన సేయుచున్నాడు. సమస్త దరిద్రమానవుల బోషించు బాధ్యత భూపాలుర దయియున్నది. భూపాలుడు కేవలము బాధ్యతాయుత రాజ్యపరిపాలనమునిమిత్తము సర్వేశ్వరప్రేషిత ప్రతినిధి. భూపాలుడేయవస్థయందును స్వమనోరంజనానుకూల పరిపాలనా స్వత్వసంహితుడు కాజాలడు. భూపాలురకయినను గుణశుంభరత్వోచితోదారాహార స్వీకారమునకే స్వామ్యము కలదుగాని షడ్రసోపేతాన్నముల హాయిగ గుడువ నధికారములేదు. పరమేశ్వర ప్రదత్తభాగ్యంబుల దుర్వినియోగము సేయక, పరమేశ్వర సంతసప్రదకార్యంబులకే వినియోగించుట మానవ ధర్మము. సాక్షాద్దైవస్వరూపులగు ఋషులచే విరచింపబడిన నీతిశాస్త్రములు బోధించున దిదియె. సంతత సాత్వికాహార ప్రకారముల స్వీకరించువారే యథార్థమగు భూపాలురు. భావాతీతమగు క్షమను హృదయముగను, అపారమగు పరోపకారమును దేహముగను ధరించియున్న భూదేవిపై నాధిపత్యము వహింప భూతదయార్ద్రచిత్తులును, సత్వగుణ సంపన్నులును నగు మానవోత్తములకే హక్కు కలదు. నిరంతర భోగ

విలాసపరులగు భూపాలురు సర్వేశ్వరద్రోహులు; నాస్తికులు. జనకా! సంతానాభ్యుదయము నపేక్షించి, కృషిసలుప నట్టి మాతాపితలును, రోగగ్రస్తుని శరీరతత్త్వమును బరిశీలింపకయే ధనోపార్జననిమిత్త మౌషధమొసంగు భిషగ్వరుడును, ఛాత్రహితాహిత పరిజ్ఞానశూన్యుడగు నుపాధ్యాయుడును, శాంతములేని సంయమచంద్రుడును, దూరదృష్టియు, రాజనీతిశాస్త్రజ్ఞానశూన్యుండగు మంత్రియు, ప్రజాసౌఖ్యము నభిలషింపని భూపాలుడును హంతకబిరుదాంకితులయి సర్వేశ్వరుని విశాల న్యాయాలయంబున మహాదోషులుగ నిశ్చయింపబడి దండింపబడుదురు. ఈ లోకముతోడనే మన బాధ్యతాబాధ్యతలన్నియు బూర్తియయ్యెనని భావింపజనదు.

(ఆర్షనీతి శ్లోక మొకడు జ్ఞప్తికి వచ్చుచున్నయది. సిద్ధార్థుని భావస్ఫూర్తి యిందును గలదు. "శ్లో॥ వైద్యోగురుశ్చ మంత్రీచ, యస్యరాజః ప్రియః సదా। శరీరధర్మకోశేభ్యః క్షిప్రం స పరిహీయతే." అనుత్తములగు వైద్య సచివోపాధ్యాయులవలన శరీర రాజ్య ధర్మములు మూడును నష్టభ్రష్టములగును.) అట్లు భావించిన దప్పక ముందు నరకమనుభవింపవలసియే యుండును. సేవకధర్మమందుండు సౌఖ్యము రాజధర్మమునందుండజాలదు. సేవకుడు నిస్సంగుడయి రాజసేవ జేయుచున్నను "ఆత్మవశం సర్వం సుఖమ్, పరవశం సర్వం దుఃఖం" అను గురువాక్యమును భజియింపు

చు నేయుండును. వానిమీద నేవిధమయిన బాధ్యతయు నుం డనేరదు. తండ్రీ! రాజగౌరవము నెట్లు సంరక్షించుకొని యిహపరములసుఖింతునో తెలియజాలకున్నాడను రాజకీయ మంతయు బాధ్యతాయుతమయి యున్నది. బాధ్యత యను శబ్దము భయంకరమయినది. అది సంయమవ్రతానుష్ఠానమును బోలియుండును. ఇట్టి భయోత్పాదకమయిన వృత్తిని సాత్విక బుద్ధిచే నాచరించువారు జీవితానంతమున నిర్వాణమును బడయ సమర్థులే యగుదురు. పెద్ద లొక రొక పదార్థమును భద్రము సేయుడని మనకీయ మన మద్దాని నపహరింపవలయునా లేక యా కోవిదుని స్వాధీన మతడు వాంఛించినపుడు సేయు టుత్త మమా! ఈ నా ప్రశ్నమునకు నీవ సదుత్తరమునే బ్రసాదిం తువని విశ్వసింతు. రాజ్యము సర్వేశ్వరునిది. మన కందలి యేపదార్థమును నపహరింప వలనుపడదు. స్వపరభేదంబును బాసి "జగత్సర్వం దైవాధీన" మ్మను గురుమంత్రమును బఠి యించుచు నీచప్రకృతి నెడబాసి, వర్తించు మానవుడే పరమే శ్వర భక్తుడు. దేవా! దేవా! ఈశా! ఈశా! యని నామ మును భజించినంతమాత్రంబున నాచరణశూన్యుడు భక్తుడు కాజాలడు. పితృశాసనమును మన్నింపని సుతు డెన్నిమార్లు తండ్రీ! తండ్రీ! యని స్మరించినను జనకునిచే క్షమింపబడడు. పితాజ్ఞా పరిపాలనచేతనే గదా రాము డాదర్శపురుషు డ య్యెను. నీవు పరమ పితాజ్ఞను బాలించి, యిహపరలోకా

దగ్నపురుషుడ వగుము. పరమపితాదేశ మెద్దియందువేమోవి నుము:— జగమున "నాది నేను" యను నహంకార మమ కారముల పరిత్యజించి దేహాత్మల సమేతముగా సమస్త భాగ్య ముల సర్వేశ్వరునివేయని భావించి "త్వదీయ వస్తు గోవింద తుభ్యమేవ సమర్పిత" మ్మని భగవదర్పితము గావించివైచుట హితకరము. తండ్రీ! సమస్త విషయంబుల గ్రహించియు వ్యామోహాగూనే సహజముగ నభిలషించు నేను నీకు బోధింప నర్హుడనా? మూఢుడనగు నేనింతపర్యంతము దైవ సమానుడ వగు నీయెడ గావించిన యశిష్టాచారంబు లన్నింటిని మన్నింప జేమోడ్చి నమస్కరించి, విపినాంతరముల కరుగుచున్నాడను. ప్రియమాతకు వందనశతంబులు ఆ తల్లికి నాయందుగల నిర్వ్యాజ వాత్సల్యమే ప్రజాగణమునెడసహిత మున్న నెంతయు శుభంబగును. యశోధరకు నుపదేశింపుడు.

ఛన్నా! యింక నీవు స్వగృహమున కరుగుము. వేగి రింపుము. సర్వేశ్వరోపాసనా శుభముహూర్త సమయము గతించిన ప్రయోజనములేదు. సన్న్యాసినగు నాకు సాధువేషో చితంబులగు వసనములే లభియించినవి. ఈ కంటకాహ్వాయ హయమును సహితము వెంటగొని రాచనగరి కరుగుము. నీదగు భావము ననుసరించి విచారింప నాసేవా శుశ్రూష యందే శేషజీవితమును వ్యతీతముసేయు నభిలాష నీ హృదయ మును బాధింపుచున్నట్లు నేను గ్రహించితిని. వలదు, నీవు

పితృసన్నిధి కరిగి, వారి కూరటగల్గింపుము. నేను పరోపకా రార్థము—పాఠబడితిని, స్వధర్మ నిర్వహణార్థము క్షణభంగుర ములగు తుచ్ఛసుఖంబుల మఱచియయిన స్మరింపక శాశ్వత బ్రహ్మానందపదవి నలంకరించుటకును, తదనంతరము లోక మున కీశ్వరాదేశమును జాటుటకును ధర్మ రహితమగుచువెల యు మానవ సమాజ క్షేత్రమున సత్యబీజముల నాటుటకును, భువి దయాధర్మముల నెలకొల్పుటకు ననుకూలంబగు జ్ఞానము నార్జింప కృతసంకల్పుండ నయితినని యశోధరకు సహితము విశదీకరించి, యాదేవి హృదయమును శాంతపఱచుము. సిద్ధార్థు డను సుతుడే జనింపలేదని భావింపవలసినదిగా నాజననీ జనకులకును సిద్ధార్థుడను వానితో దన కుద్వాహమే కాలేదని భావింపవలసినదిగా వేమార్గ్రహృదయయగు యశోధరాదేవి కిని నివేదింపుము. కాని కార్యమునకయి కలవరపడవలదనియు సందరాని పండ్లకయి యఱ్ఱుచాచుట యల్పజ్ఞుని కృత్యమనియు వారికి నివేదింపుము. మాతాపితలయందును, సతీసుతులయం దుందును భూలోకమనియెడి యీ విద్యాలయంబున నున్నంత పర్యంతము ప్రేమను గల్గియే యుందుననియు, విసర్జింపనొల్ల ననియు విన్నవించుము. కామక్రోధ మదమాత్సర్యాద్యరిష డ్వర్గమున కొకవిధముగ హేతుభూతంబును, కష్టనష్టదాయ కంబును నగు రాజత్వమును మనఃపూర్వకంబుగ బహిష్కరించి భిక్షుత్వమును స్వీకరించితినని వ్యక్తీకరించుము. మనోవా క్కాయకర్మల నొక్కరీతి వర్తింప నెంచువారికి సన్యాసవ్రత

స్వీకారమే సంతత సంతోషదాయకంబని నొక్కి వక్కాణింపుము. సంసారులు స్వాభావికంబుగనే సర్వదా మనోవాక్కాయకర్మల భిన్నత్వమునకు సుస్థిరంబగు స్థానమునొసగి, ముక్తిపథమును విస్మరించి పరమేశ్వరునికి దూరులగుచున్న వార్తయు సత్యేతరము కాదని తెలియబల్కుము. సర్వులు లోకోత్తర పురుషాగ్రేసరులు ప్రయత్నించినచో నగుటకుం దెంతమాత్రము సందేహము లేదనియు, మహాత్మ, దురాత్మయను పురుషులమధ్యవెలయు భేదము త్రికరణశుద్ధి, త్రికరణాశుద్ధియే యనియు విశదీకరింపుము. ("మనస్యేకమ్ వచస్యేకమ్ కర్మణ్యేకమ్ మహాత్మనామ్ । మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యద్దురాత్మనామ్". ఈ శ్లోకాన్వయం బెంతయు సిద్ధార్థుని భావముతో నేకీభవింపుచున్నయది.) విషాదగహ్వరమునుండి జీవసృష్టి నుద్ధరింప బ్రాణములనయిన సమర్పింప సంసిద్ధుడనయి యుంటిననియు, నానందమయ సత్యధర్మపథమును బడయనిదే కపిలవస్తునగర రజమునయిన స్పృశింపననియు గట్టిగా జెప్పుము. ఛన్నా! త్వరితముగా మహాత్ముల సందర్శింప నామనము ఱ్ఱూతలూగుచున్నయది. పరమేశ్వర కార్య ప్రారంభమున గాలవిలంబనమగుట వీక్షించి ప్రభాకరుడు క్రుద్ధుడయి నిజతీక్ష్ణదృక్కుల నెటుల నాపై బ్రసరింపజేయుచున్నాడో తిలకింపుమా? వివేకవంతులకు ధర్మచ్యుతులన్న క్రోధ మెక్కుడు కాబోలు!" సిద్ధార్థుడు ఛన్నుని కరద్వయమును గేలంబూని

చూపి, సెలవనిచెప్పి యతని వీడుకొలిపి, అరణ్యప్రాంతము నుద్దేశించి, గమనోన్ముఖుడయ్యెను.

ఛన్నుడు నేయునది లేక ఖిన్నుడయి, గృహాభిముఖుడయ్యెను. అతని వదనము వికాసవిహీనమయి, హృదయావృత విషాదచిహ్నముల దెలుప దర్పణమువలె నుండెను. నడువ నతని పాదములు తడబడజొచ్చెను. దృష్టి చీటికిమాటికి నేత్రము లశ్రుజలపూరితము లగుచుండుటవలన సరిగా గానరాకుండెను. అతనికి వసుధయంతయు గిఱ్ఱున దిరిగిపోవుచున్నట్లును, సూర్యు డస్తమించిపోవనున్నట్లును దృష్టి గోచరమగుచుండెను. అతడు రాకుమారుని శీలగుణగణ సంశోభిత స్వభావమును బదేపదే సంస్మరించి విలాపముసేయుచుండెను. అతనికి సమతలముగనున్న పథమే నిమ్నోన్నతమయి యున్నటుల గానవచ్చుచుండెను. సిద్ధార్థుని యమృతమయంబును, ప్రభావాతిశయ భరితంబును నగు వాగ్జాలము ఛన్నుని హృదయాంతరాళమున బ్రతిధ్వనింప దొడంగెను. "ఆవిశ్వమోహన సౌందర్యమూర్తి, ఆసద్వర్తనాసంశోభితవ్యక్తి, ఆయలౌకిక లక్షణాంకితవిలక్షణానురక్తియుక్త విగ్రహము, ఆసహజానురాగవిలసిత పరమాత్మస్వరూప భూతలజగన్నియంత, ఆమహత్వ పటుత్వ సమన్వితానూనశేముషీ సంశోభితమూర్తి ఆ శుద్ధోధనభూపాల చంద్రుని యనుంగుబిడ్డడు, ఆశిష్టజనోచిత సద్భావసందోహ సంవర్ధితుండగు సిద్ధార్థుడు మగుడ స్వకీ

య దివ్యసందర్శన సౌభాగ్యము నెపుడో సంగునా" యని ఛన్నుడు డెందమున బెద్దగగుంద నారంభించెను.

సిద్ధార్థపరిత్యక్త కపిలవస్తునగరి.

ప్రాతఃకాలమగునంతనే శుద్ధోధనభూపాలుడు నిత్యాభ్యాసానుసారముగ సిద్ధార్థుని విలాసమందిరమున కేతెంచెను. మందిరద్వారములన్నియు దెరువబడియుండెను. భూపాలునకు సిద్ధార్థుడటనుండి యర్ధరాత్రిసమయమున సారథీ ద్వితీయుడయి యెటకో యరిగినటుల దెలియవచ్చెను. ఛన్నునిగృహమునకు వర్తమానమంప, నతడు రాత్రి రెండుగంటల సమయమందే లేచి సిద్ధార్థకుమారునివెంట వెళ్లినటుల నతని గృహిణివలన దెలియవచ్చెను. శుద్ధోధన గౌతమీదేవులును, యశోధరాదేవియును నీడు శోకసాగరమున దేలి యాడసాగిరి. సిద్ధార్థాన్వేషణార్థ మనేకపరిచారకులును, చారులును నలుదిక్కుల బరువెడలిరి. ప్రజాసముదాయము సహితము సిద్ధార్థుని వియోగమునకయి విచారింపదొడంగెను. రాజప్రాసాదమంతయు నార్తధ్వనులతో మారుమోగుచుండెను. శోకదేవతయే మూర్తీభవించి నాడు కపిలవస్తునగరమున నాట్యము సేయుచున్నదో యన్నరీతి నాబాలగోపాలము సఖశిఖాగ్రపర్యంతము దుఃఖవారిధిని గూలబడియుండెను. రాజహర్మ్యము స్త్రీపురుషులతో గిక్కిరిసియుండెను. రాజపరిచారకులెల్లరు వ్యాకులచిత్తులయి, యటునిటు కార్యాతురులవలె బరుగులిడుచు

నుండిరి. సిద్ధార్థుని ప్రాణేశ్వరియగు యశోధరాదేవి దుఃఖా
తిరేకమును వర్ణింపమొదలిడుట కవిశక్తి కతీతమయిన కార్య
మగును ఆయమ భర్తృపూర్వ ప్రేమాతిశయమును సంస్మ
రించి, దుఃఖమును ద్విగుణితము గావింపుకొనుచు, గుండె
బాదుకొని బెద్దపెట్టున నాక్రిందనముసేయుచుండెను. గౌత
మీదేవియును, సచివధర్మపత్నులును, రాజపరివారమునందలి
యన్యాన్యవనితాలలామలును నెంతవారించినను శాంతిాపక,
భర్తృగతప్రాణయు, మహాపతివ్రతాశిరోమణియు, ప్రేమైక
స్వరూపిణియు నగు యశోధరాదేవి పెల్లుగనుల్లమునను దల్లడిం
పజేయుచుండెను. నాల్గుదినము లదియేరీతి రోదనధ్వనులతో
నగరము మారుమ్రోగిపోయెను. సిద్ధార్థునిజాడ యింకను.
దెలియదయ్యెను. శుద్ధోధనభూపాలుడు హతాశుడయ్యెను.
నాల్గుదినములు గతించినంతనే ఛన్నుడుకంటకాశ్వసమేతముగా
నగరముబ్రవేశించెనన్న వార్త రాజపరివారమునకు గర్ణాకర్ణికగ
దెలియవచ్చెను. దిక్కుమాలినపక్కివలె విషాదాయత్త చిత్తుడ
యి, యేతెంచుఛన్ను నవలోకించి, నగరవాసులెల్లరు దాడో
పతండములుగ బర్వెత్తివచ్చి సిద్ధార్థుడేమయ్యెనని యతనిని
నిర్బంధింపసాగిరి. సిద్ధార్థుడు సంసారముపట్లవైరాగ్యభావోద
యంబగుటంజేసి గృహపరిత్యాగము గావించె నని ఛన్నుడు
ప్రత్యుత్తర మొసంగినంతనే ప్రజలెల్లరు గొల్లుమనుచు రాజ
ప్రాసాదమునుద్దేశించి నడువసాగిరి. తామసించు టనుచిత

మని భావించి, ఛన్నుఁడవనతమస్తకుఁడయి మందగమనమున రాజమందిరమున కరిగెను. రాజమందిరమందలి రోదనధ్వనులు కర్ణకుహరములఁబడినంతనే ఛన్నునిగుండియ లవియజొచ్చెను. ఛన్నాగమనంబున రాకుమారుఁడు సన్యసించెనన్న వార్త విద్యుద్వేగమున నగరమందంతట క్షణమాత్రకాలమునందె వ్యాపించిపోయెను. ప్రజాసముదాయమంతయు శుద్ధోదనభూపాలుఁడు వార్ధక్యమునందుండఁగనే భావిభూపాలునిఁగోల్పోయితిమిక దాయని పెల్లుగనుల్లమున దల్లడిల్లఁదొడంగిరి. శుద్ధోదన యశోధరాదేవుల కానిశ్చయంబగు వార్త సుస్పష్టమయినంతనే వారి దుఃఖసాగరమునఁబొంగి పొరలుచు నెల్లరనందుముంచివేయుచుండెను. అమాత్యశేఖరులుసహితము సిద్ధార్థుని ధర్మపత్నిని విశ్వప్రయత్నంబుల నూరడింప యత్నించుచుండిరి. కాని ఫలముశూన్యమగుచుండెను. భావిమహారాజ్ఞి కావలసియున్న యశోధరాదేవికి ప్రాణసమానుండగు హృదయేశ్వరుని వియోగంబునసమస్తసంసారము నిస్సారముగను, తీక్ష్ణ కంటకాకీర్ణముగను ప్రతీతము కాజొచ్చెను. ఆదేవికి సుధామయరాజాన్నము విషపూరితముగను పూఁసెజ్జలంబోలు హంసతూలికాతల్పములు తీక్ష్ణకంటకావృత కఠోరపృథివీశయ్యలుగను, బంధుమిత్రాదులందరు క్షణికవిలాసపదార్థములుగను గానవచ్చుచుండెను. సిద్ధార్థునితోడిదే యాపె కిహలోకవాసము. భూతలస్వర్గలోక నివాసంబుగ దెలియవచ్చుచుండెడిది.

సతి కేకమాత్రిగతి పతియేయని యాపె భావము. అహా! ప్రాచీనార్యావర్తమున సతీమణు లెంత యనన్య సామాన్య పాతివ్రత్యభావ విరాజితలు! వారి పతివ్రతానుష్ఠానంబుననె, నిర్మల చరిత్ర మహిమాతిశయంబుననె సత్వగుణసంపన్న బుద్ధివైశద్యముననే పూర్వకాలము నందీభవ్యభారతవర్షమున బాలధ్రువ ప్రహ్లాద శుకు డాదిగాగల మహాభాగవత శిరోమణులును, భీష్మాంజనేయాద్యాజన్మ బ్రహ్మచారులును, రామచంద్రాది పితాజ్ఞా పరిపాలనాదక్షులును, ఏకపత్నీవ్రతావలంబులును, శ్రీకృష్ణ చంద్రాది రాజనీతి విశారదులును ఆధ్యాత్మిక జ్ఞానాఢ్యులును, శిబిహరిశ్చంద్ర దధీచి కర్ణాది దానశౌండులును, ధనంజయాది వీరశేఖరులును జన్మించి తమ దివ్య యశఃకాంతుల సంసార క్షేత్రమున జతుర్దిశల వ్యాపింపజేసి, పరమపదించియుండిరి. ఆకాలపు వనితామణులెల్లరు విద్యావతులయి, యుక్తాయుక్త పరిజ్ఞానంబున బ్రకాశించుచు నెల్లవేళల హృదయేశ్వరుల హృద్యమగు మూర్తుల హృదయపీఠంబుల నెలకొల్పి, భక్తి పురస్సరంబుగ దైవసదృశులని యారాధించుచుండువారు. తత్కాలపు నరనారీమణులయెడ "భార్యా భర్త" లను శబ్దములు సంపూర్ణముగ సార్థకము లయినవి. ఆకాలమున:—

గీ॥ సతికిఁ బతి నిలఁ బూజించు • సరణిఁ దెల్పి
పతికి సతి నెప్డుఁ గాచెడి • ఫక్కిఁ జూపి

దంపతుల నలౌకికసౌఖ్య • ధనులఁజేయు
భవ్యమై యొప్పు దాంపత్య • ఫణితి యపుడు.

యశోధరా సిద్ధార్థుల దాంపత్య మట్టి యనూనా సామాన్య ప్రేమభావ సంభరితమై యుండుటంజేసియె యశోధరకు భర్తృనియోగ మసహ్యమయ్యెను. తత్కాలపు సతీపతుల కాయములు భిన్నములయినను, మృత్తికా నిర్మితంబులగు జడదేహముల కాధారభూతంబును, బరమాత్మాంశ నిర్మితంబును నగు నాత్మ యొక్కటియె. వారు పారస్పరిక సహానుభూతిగలవారయి, సహజానురాగ ధనసంపన్నులరయి నరక సదృశంబులగు దుఃఖమయస్థానంబులగూడ దమ నిష్కల్మషాత్మీయ దివ్యానురాగ ప్రసారంబున నలౌకిక నానందభాసమానముల గావింపుచుఁడిరి. ఆకాలపు సతీపతుల యవినాభావ సంబంధ మెట్టి ప్రేమభావబంధన స్వరూపమయియున్నదో యీ శ్లోకఖండపఠనంబున సువ్యక్తముకాగలదు. ఉద్వాహకల్యాణసమయంబున మాంగళ్యధారణము సేయునపుడు బతిపత్నులీశ్లోకఖండము నుచ్చరింపుచుండువారు. "మమవ్రతే తే హృదయం దదామి మమచిత్తం మనుచిత్తం తేస్తు." ఏతద్వాక్యము జాయాపతుల జిహ్వాగ్రమునుండి వెలువడినదికాదు. శ్రద్ధాభక్తి సపూరితమయి హృదయాంతరాళమునుండి త్రికరణముగ నేతెంచిన భగవద్వాక్కు. తత్సమయము వివాహమండల విశాలమండప విరాజిత గురుజనసముదాయ

సమక్షంబున గన్యావరు లిరువురు నా సూత్రము నుచ్చరించి సతీపతులగుచుండిరి. తత్సూత్రమునే జీవితాదర్శప్రాయముగ నెంచ, భార్యాభర్త లిరువురును దదనుకూలంబుగ జీవితకాల మును వెలిబుచ్చుచు, మహత్తరానందానుభవమును బడయు చుండిరి. "ధర్మార్థకామమోక్షాణామ్ వివాహం మూలసా ధన" మ్మని యక్కాలపు స్త్రీ పురుషజనము విశ్వసింపు చుండెను.

బాపురే! అర్వాచీనకాలోద్వాహ విధాన మెంత కల్పి తము? పతి పత్నీ కల్పితానురాగము, అయోధ్య కన్యావర సమ్మేళనము, అననుకూల దాంపత్యము దృష్టిపథమునబడిన యశోధరాదివ్య దాంపత్యమున కొకింతుక కళంక మాపాదిత మగునేమోయని సందేహ మొదవుచున్నయది. స్త్రీ పురుష సమ్మిళిత కాయమే సంపూర్ణ శరీరంబనియు నందువలననే స్త్రీ కర్ధాంగినియను పదవి యొసంగబడెననియు విశదమగుచున్న యది. ఆకాలపు లలనామణుల పాతివ్రత్య మాహాత్మ్యము, వారి యనూనావ్యాజ భర్తృసేవాపారీణతయు, అసాధారణా కల్పిత దాంపత్య ప్రేమస్వరూపంబును మిక్కిలి సంస్తవనీయ ములు. శ్రుతి స్మృతీతిహాసాంతర్గత వచనపుంజ మీ దేవి నిశ్చలాంతఃకరణానురాగంబుననే సత్యాభిభూతమని స్పష్టమగు చున్నయది యశోధరాదేవి పతిపాద గతప్రాణయగుటంజేసి "నాపితా నాత్మజో నాత్మా నమాతా నసఖీజనః । ఇహాప్రే

త్యచ నారీణాం పతిరేకోగతిః సదా॥" యను వాలకామా యణమందలి ప్రాచీన సతీధర్మ సూత్రము నే వల్లింపుచు నాచ రింపుచుండెడిది. తాత్పర్యము :— పితాసుతులు, స్వకీయాత్మ మాతాసఖు లాదిగాగల యాత్మీయులున్నను సతికి బతి యే యేకమాత్రగతి. "పతిర్హి దేవతానార్యాః పతిర్బన్ధుః పతి ర్గురుః":— సతికి బతియే దైవము, పతియే బంధువు, పతియే గురువు, పతియే సర్వస్వమను భావముగల సూత్రము నే యశో ధరాది తత్కాలపు సతీమణులు యాదరింపుచుండిరి. నిష్క ల్మషమగు నిట్టి దాంపత్యప్రేమకు పశవర్తినియగు యశోధరా దేవి పతిభక్తి యిట్టిదె. ఆదేవి పాతివ్రత్యమాహాత్మ్యము ను పాఠకలోకమునకు దేటతెల్లము గావింప నభిలషించియే యింతపర్యంతము గ్రంథవిషయమునుండి ధ్యానమును మరల్ప సాహసించితిని. శ్రీ బుద్ధుని నామంబున నెల్లసద్విషయముల నభ్య సించు టంత హాస్యాస్పదము కాదనియే నాయూహ. పాఠకులు విషయసీమ నుల్లంఘించి, ఇతివృత్తము (plot) నకును, స్వాభా విక వర్ణనము ( Natural Description ) నకును గ్రమభంగము గావించు చంచల ప్రకృతి యీ గ్రంథకర్తయందు కలదని భావింపకుందురుగాతమ్మని నా విజ్ఞప్తి. యశోధరాదేవి యను దిన మన్నపానీయముల వర్జించి శుష్కించిపోవుచుండుట గాంచి భూపాలుడు భీతిల్లెను. కపిలవస్తువు పూర్వానంద మును గోల్పోయి, వైధవ్యదుఃఖము ననుభవించు తరుణీ

మణిం బోలియుండెను. సిద్ధార్థుని నెటులయిన రావించి పుత్రవధూ దుఃఖమును దూరముజేయ శుద్ధోధనుడు సంకల్పించెను. ఇంక సిద్ధార్థకుమారుని వృత్తాంతము నారయుదము.

మహాత్ముడగు సిద్ధార్థకుమారుడు ఛన్నుని వీడుకొలిపి యరిగి దీర్ఘప్రయాణంబున రాజగృహారణ్య ప్రాంతభూముల జేరెను. ఆ మహనీయుడు ముండితశిరస్కుడయి, సర్వసాధారణ వస్త్రధారియయి, యటవీప్రాంతమందలి వన్యమృగములతో గ్రీడాసక్తుడయియుండి, విశేషకాలమును దపోధ్యాననిష్ఠయందు వ్యతీతము సేయదొడంగెను. కందమూలఫలాదులే యతని షడ్రసోపేతాహారములు. లతానికుంజములే రాజప్రాసాదములు. కఠోరభూతలమే హంసతూలికాతల్పము చంద్రతారకలే దివ్యములగు దీపములు. వల్కలములే పీతాంబరములు. నిశ్చలమగు మనస్సుతోడ సర్వేశ్వరుని భజియించుటే తపమని యతడు తొలుదొల్త విశ్వసించెను. మనశ్శాంతి బడయ ద్రికరణముల గృషిసలుపు పుణ్యాత్ములకు, కోలాహల పరిపూర్ణములగు జననివాసస్థానములకంటె, నిర్జనంబులగు సాంద్రాటవీప్రాంతములే విశేష లాభదాయకంబులని యతడు విశ్వసించెను. అటవీపరిసరస్థిత గ్రామములందెల్లెడల సిద్ధార్థాగమనవార్త వ్యాపించిపోయెను. నిత్యము భాగవతులనేకులటకేతెంచి యాదివ్యసుందర విగ్రహమును సందర్శింపుచు, వేదాంతగోష్ఠిసలుపుచు మహదానంద సంభరితస్వాంతు

లరయి తమతమ సదనములకు మరలుచుండిరి. సిద్ధార్థు నచటి వారెల్లరు బాలస్వామియని పిలుచుచుండిరి ఛన్ను నెడబాయు సమయమున దరిద్రపథికునుండి కయికొనిన సాధారణపరిధాన మును సహితము నిరసించి సిద్ధార్థుడు సన్యాసి కర్హంబులగు శుద్ధ కాషాయవసనముల ధరించెను. తదటవీ ప్రాంతస్థలంబుల గు గ్రామాదులనుండి, నిత్యము జనులు తండోపతండము లుగా నవాగత మహాత్ముండని చేరెన్నికగన్న తన్ను సందర్శింప నేతెంచి, భక్తిస్నేహముల నర్పించు ఫలభక్ష్యాదుల స్వీకరిం పుచు, యవ్వాశివలననే శరీరమును బోషించుకొనుచు, రాకు మారుడు భక్తియోగమును సాధింపగడంగెను.

నిరంతర మారాజనందనుడు సమగ్ర సంసారమును బ్రేమమయంబుగను, ప్రేమనే సర్వేశ్వర స్వరూపంబుగను, సమస్తమునకు మూలము ప్రేమయేయనియు మది దలపోయ జొచ్చెను. ప్రేమవలననే విషము సుధాతుల్యంబుగను, దుఃఖ ము సుఖముగను బ్రతీతమగుట నిక్కవంబని యతడు గ్రహిం చెను. కామినీకాంచనాదులయందు నొదవు ప్రేమ భ్రమాత్మ కంబనియు, పరమార్థభావశూన్యంబనియు, సర్వము నొక్కె దృష్టితో జూచుటకు మూలమగు నంతఃకరుణ శక్తియే వాస్త వికంబగు ప్రేమయనియు నట్టి పరిశుద్ధానందమయ ప్రేమయే భక్తిస్వరూపంబనియు నాభాగవతోత్తముడు గ్రహింబుకు జాటెను. ('సాత్వస్మిన్పరమ ప్రేమరూపా' యని నారదనీతియందు

వ్రాయబడియున్నది. ఆత్మస్వరూపమున వెలయు పరమప్రేమ యే భక్తియని చెప్పబడును. ఓంకారస్వరూపంబులును, అద్వైతంబులునునగు జీవేశ్వరుల ప్రేమస్వరూపములనియే యతడు భావించెను. అతడు సంసారమందలి సమస్త పదార్థముల వీక్షించి, విజ్ఞాననేత్రంబున నవ్వాని బాహ్యాభ్యంతరిక స్వరూపములగనుచు, సృష్టియందలి యెల్లప దార్థములు మానవ జీవిత యాత్ర కుపయుక్తంబుగ గ్రహించి, సర్వేశ్వరుడు నిర్హేతుక జాయమాన కరుణా కటాక్షవీక్షణుండనియు సృష్టియందెన్ని యోవిధముల ప్రాణికోటిహితార్థమయి ప్రయోజనీయంబు లగు పదార్థముల సృజియించెననియు, దనసన్నిధి కేతెంచు గ్రామవాసులకెల్లరకు బోధసలుపుచు ననుదినము సర్వేశ్వర భక్తిగుల్మమును సద్గోష్ఠిసలిలంబున సించిత మొనర్చుచు, దిన దినాభివృద్ధి నందజేయ నుపక్రమించెను. దీర్ఘముగ విచారించిన కొలది మజ్జిగను మధించినంతనే నవనీతము కరగతమగు చంద మున సర్వేశ్వరుని దివ్యోపకార తత్త్వజ్ఞానము లభింపజొచ్చెను. అతడు సర్వేశ్వరుని నిరుపమాన నిఖిలలోక సుప్రకాశిత దివ్య గుణగణసంకీర్తనము సేయుచు, దన్మయత్వమునొంది తురీయ ప్రభావంబున బాహ్యప్రపంచ చైతన్యముందక్కి యాధ్యాత్మిక ప్రపంచమున స్వచ్ఛంద విహారము సేయుచు స్వేచ్ఛానంద ముల బడయుచుండెను. సిద్ధార్థుని సందర్శింప నటకేతెంచు జనులు సర్వదా యతని నిశ్చల నిర్మలముఖమండలమున సర్వేజ

నాకరణీయ పరమదయాళుత్వమును, పరదుఃఖాపహిష్ణుత్వమా
దిగాగల యలోకసామాన్య సద్గుణ గణ తేజఃపుంజమును బహిర్కా
శమానముగా నుండుట వీక్షించిరి. ఎల్లవారు నతని సంతత
నిష్కల్మష శాంతస్వభావమును, నిరంతర పరోపకార పారీణ
తను గుర్తెఱింగినవారయి, యతని మహదుద్దేశముల కానం
దపరవశులయి, యతని కీర్తిచంద్రికల నలుగెలంకుల వ్యాపిం
పజేయుచు నతని నొక మహర్షిగ నిశ్చయించి భక్తి
గేల్మోడ్చి యారాధింప నారంభించిరి. సర్వదా సిద్ధార్థు
డీరీతి సాయంతన సమయంబుల దన్ను దర్శింప నేతెంచు
భారితల కెల్లఱకు బేరిమనయుండగు సర్వేశ్వరునిమూర్తియు,
నశ్వరంబగు భౌతికైశ్వర్యాధిదేవతను గర్హించియు బోధ
సేయుచు, దక్కుంగల సమయముల నటవీప్రాంత భూముల
నెల్ల గుహిమ్మగుచు గంటబడిన సన్యాసుల నెల్లర వేదాంత తత్వ
రహస్యమును దెలుపుండని వినమ్రుడయి మృదుమధుర వచనం
బుల వేడుచుండువాడు. సత్యాసత్యబోధకంబగు వేదాంత
తత్వ మీమాంసయే మానవజీవిత పరమావధియని యతడు
పూర్ణముగ విశ్వసించియుండెను.

ఆశ్రయించువారెల్లరు నల్పులని భావించునంతటి మంద
బుద్ధిగల సన్యాసులందరు సిద్ధార్థుని వినయవిధేయతలకు మురి
తాత్ములయి యా రాజసూనున కీరీతి నుపదేశింపదొడంగిరి:—
" రాకుమారా! మేము సర్వసంగపరిత్యాగులమగు యోగు

లము. వివేకము నార్జించి, తాత్త్వస్పృశ భక్తిపిపాసువులకు బోధించుటయే మాదగు విహితకృత్యము. మోక్షము నంద గోరు నరుడు సర్వకాల సర్వావస్థలయందు విశేషోపవాస పరిధానజీవితమునే వ్యతీతము సేయవలసియుండును. కండర ములచే నిండిన యీ గండుదేహమున గామక్రోధాదు లధి వసించుచున్న యవి. శరీరమున రక్తమాంసాదులు పుష్కలముగ నున్నంతపర్యంతము నయ్యవి సహితము మదించి మత్తిల్లి, పవిత్రాంతఃకరణమును గలుషిత మొనర్చును. వానిని రూపు మాపదలంచిన వాని కాశ్రమస్థానమగు కాయముయొక్క పటుత్వమును నశింపజేయుటయే లాభకరము. శుష్కదేహమున వేయు సమస్తదుర్గుణములు సముచితాహారంబును బహియజాల కక్షీణించినంతనే భక్తిజ్ఞానవైరాగ్యములు సహజముగనే మాన వునకు నలవడును. అంత ముక్తి తృణప్రాయం బేయగును. కనుక మానవుని జీవితధర్మములలోని కెల్ల నుపవాసములే ప్రాధా న్యమును గన్నవనియు దెలియుము. వీనిప్రభావ మనంతము. వీనిచే మానవసంఘమునకు బ్రాప్తమగు సుఖశాంతు లింతింత యని వక్కాణింప నలవికాదు. శరీరమును బశుబలముచే స్థూలతరంబు గావింపక నిరంతరము శుష్కింపజేయవలయును. జ్ఞానిసత్తమునకు బుద్ధిబల మావశ్యకంబుగాని పశుబలము తో నేటిప్రయోజనము? సర్వాంగముల నెల్లవేళల దపింపజేయు ము. స్థూలశరీరము శుష్కింపజేయబడినకొలది సూక్ష్మశరీ

రము వసంతర్తువునందు నవనవలాడుచు బెలుగు లతికవలె దినదినాభ్యుదయమును బడసి శాశ్వతానంద సంధాయకంబగును. కామక్రోధాద్యరిషడ్వర్గ నిలయంబగు కాయంబును గూలద్రోయు యుక్తిచే జిక్కును. సిద్ధార్థా! ఈ నీమేను కండలందక్క జర్జరముకాని దే స్థిరముగ జ్ఞానమును, సంసారసుఖవిముఖత్వంబును హస్తగతము కాజాలవు. మేల్కాంచుము. ఇప్పటికే నీదేహము మదించిపోయినది. ఆలసింపకుము. శుభంబగును.'' మిథ్యాసన్యాసుల స్థూలభావగుంభిత ప్రబోధముల నాలకించి, వారి మాధ్యమును గూర్చి, సిద్ధార్థుడు మదినెంతయు విచారించెను. సన్యాసిబృందప్రబోధితోపదేశ వాక్య జాలంబుల నొక్కతూరి మనంబున దర్క వితర్కముల విచారించుకొని యంతమునకు సిద్ధార్థుడీనిమ్నలిఖిత విషయమును నిర్ధారణజేసెను. సన్యాసులు వేదాంత తత్వాంతర్గత రసాస్వాదనము గావింప వివేకములేనివారలయి స్థూలదృష్టిచే నిశ్చయించిన భావంబులెంతయు మృగ్యములు. సన్యాసులప్రబోధానుకూలంబుగ నాచరించు మానవులు విషాదభయములనియెడి ముక్కడిరక్కసులకు గురియయ్యెదరు. పాంచభౌతికంబగు మానవస్థూలదేహము గేహమువంటిది. జీవాత్మ గృహమున నివసించు నరుని బోలియుండును. ఉపవాసములచే నంగవైకల్యము గావించుట కేవలము దాను వసియించు గృహము యొక్క కవాటవాతాయనముల భగ్నము సేయుటను

బోలియుండును. భగ్నగృహమునందు వసించు మానవునకు సుఖము నకు మారుగా విషాదభయములే భోక్తవ్యము లగు చందమున శుష్కదేహధారియు సుఖలేశమునయిన బడయ జాలడు. ఉపవాసాశ్రితస్వీకారమువంటి యవివేక కృత్యంబు వలన నీషన్మాత్రమయిన సౌఖ్యము లభింపజాలదు. జ్ఞానశూన్యులయి, మానవులిట్టి యనుచితధర్మము ననుకరించి, యధోగతికి బాల్పడజనదు. సిద్ధార్థుడు తన్నాశ్రయించువారి కెల్లరకును నీరీతి బోధసేయుచుండెను. శిరోముండనమున గాషాయాంబరధారులయి సర్వసంగపరిత్యాగులమని గర్వింపుచు ననుచితపథముల ద్రొక్కుచు నన్యులకు దుష్ప్రబోధముల జేయు కపటవేషధారులకును సిద్ధార్థునిబోలు నాత్మసన్యాసులకును భేద మెంతయోకలదు. సాత్వికాహారస్వీకారప్రాప్త దైహికబలమును, అంగసౌష్ఠవపటుత్వాదులు లేనిదే మానవకోటికి మేధాశక్తి లభ్యముకాదనిన సిద్ధార్థునివాక్య మెంతయు సంస్తవనీయము.

సిద్ధార్థకుమారునిశరీరబలవిషయికంబగుదివ్యప్రబోధమును బ్రాచ్య పాశ్చాత్య వేదాంత జ్ఞానసంపన్నుడును, ప్రాచీనాధునాతన మతజ్ఞాన విరాజితుండును, సర్వజన సమ్మత మతప్రచారకుండును నగు వివేకానందస్వామి యెటుల సార్థకపఱచెనో పాఠకమహాశయులారా! యొకసారి వీక్షింపుడు:—

"Our young men must be strong first of all, religion will come afterwards. Be strong, my young friends;

that is my advice to you. You will be nearer to Heaven through foot ball than through the study of gita........you will understand gita better with your mus-cles a little stronger. You will understand the mighty genius and the mighty strength of Kristna better with a little of strong blood in you. You will understand the glory of Atman, when your body stands firm upon your feet and you feel your-selves as men." తాత్పర్యము:— "సమస్త విషయముల కంటె ప్రప్రథమమున మన నవయువకులు మహాబలాఢ్యు లయి యుండవలయును. మతము తదనంతర మదియే వచ్చును. కనుక మిత్రపుత్తములారా! బలవంతులయి మనుడి. ఇదియే నేను మీకు గావించు దివ్యప్రబోధము. గీతాపఠనంబు కంటె శరీర వ్యాయామము వలననే మీ రతిశీఘ్రము స్వర్గపథ మును సమీపింపగలరు. మీ మేను కండలు బలిసియున్నపుడే మీరు గీతారహస్యమును జెచ్చెరగ్రహింప సమర్థు లయ్యెదరు. పరిశుద్ధరక్తప్రభావంబున పరమేశ్వరుండగు శ్రీకృష్ణచంద్రుని మహత్తరాలౌకిక సామర్థ్యాతిశయమును, తన్మహాబలాఢ్యతను దెలియ శక్తులయ్యెదరు. మీరు శక్తిగలవారలయి, నిజపాద ములపై స్థిరముగ నిలువబడగల్గినపుడే యుపనిషత్సారమును, ఆత్మవిజయమును బడయసమర్థులగుదురు." సారాంశ మేమనశా రీరకబలసమృద్ధిలేనిదే దానిపై నాధారపడియుండు నాత్మకు బుద్ధిబలము సంప్రాప్తము కాజాలదు. వివేకానందస్వాముల

వారి భావము సిద్ధార్థుని ప్రాచీనతమంబగు విషయమునెంత యు సమర్థించుట శుభోదావహము. ప్రాచీనార్యభావంబు నకును, అర్వాచీనయుగభావమునకును సిద్ధార్థుడు సమ్మేళ ము నొదవజేసి స్తవనీయగుణాఢ్యుడయి మించినాడు. ప్రకృతి కాలమున ననేకులు వేదాంతశాస్త్ర విదులమనియు, నాధ్యా త్మిక పురుషావతంసులమనియు బ్రిగల్బములఁ గొట్టుచు వాగా డంబర వాచాలత్వముల నధికముగా బ్రేమించు మూఢజనా వళుల నయుక్తికంబులగు తార్కిక సిద్ధాంతములచే ముగ్ధుల గావింపుచు, కుక్షింభరులయి వర్తింపుచున్నారు. మఱికొందఱు దేహ మశాశ్వతమని వాకొనుచు, శరీరముల నెండగట్టుచు ముక్తిప్రాప్తికి మూలములు హఠయోగములనియు శరయో గములనియు వితండవాదముల జేయుచు నిర్వాణప్రాప్తి తమ కు నర్లేసుపై బండినదుపుటవలె నతిసుకరముగ బ్రాప్తించునని యూహించి, మిథ్యాభిమాన ప్రేరితులయి మానవప్రపంచ మున విహరించుటెంతయు నింద్యము. తన శారీరకశక్తుల నష్టభ్రష్టము గావించువాడు హంతకు డనబడుగును.

శ్రీరామతీర్థస్వాములవారు శరీరబలమునుగూర్చి వివ రించి యెట్లుచెప్పియున్నాడో చూడుడి.— "Every man must try to get three kinds of powers, before we try to get the knowledge of Atman. We have to get the physical power first. Three powers are:—Physi

cal, mental and spiritual. The Human developement knowledge depends upon these three Powers. Without the aid of physical power no body can get the two other powers. The second and the third powers depend upon the first. Without studying the first book, how can a boy get success in studying philosophical books." తాత్పర్యము: "ప్రతిమానవుడు త్రివిధములగు శక్తుల నార్జించు టావశ్యకంబు: " ఆత్మజ్ఞానమును బడయనుంకించుటకు బూర్వము దైహికశక్తిని బడయుట విధియయియున్నది. శారీరకమానసిక, దైవికములే త్రివిధములగు శక్తులు. ప్రథమంబగు దైహికశక్తిసాహాయ్యంబు లేనిదే యన్యశక్తిద్వయము లభ్యము కాజాలదు. ద్వితీయ తృతీయ శక్తులు ప్రథమశక్తిమీదనే యాధారపడియుండును. ప్రథమ వాచకమును బఠియింపలేనిదే బాలుడెట్లు నిగూఢంబులగు వేదాంతగ్రంథములబఠియింపనేర్చు?" శరీరావయవములన్నియు బుష్టిగలవయి వికసించియున్నపుడే మానవుని చిత్తము నిర్మలముగను, నత్యంత శాంతముగను నుండ సమర్థంబగును. అట్టి తరుణమునందే వేదాంతవిచారణ కావశ్యకంబగు మానసిక శక్తియు బలపడును. అట్టి మానసికశక్తిబాహుళ్యంబుననే బ్రహ్మసాక్షాత్కారమునకు మూలమగు దైవికశక్తి కరతలామలకంబగును. నరకప్రాప్తికెట్లు శరీరము హేతుభూతము కాగల్గినదో యటులనే శాశ్వతానందపదవికి సహితము కార

ణభూతమగును. రక్తమాంసములు లేక శుష్కించి స్వాభావికకళను దక్కియున్న మానవున కెట్టి యానంద ముండనేర్చునో, చిత్తమునం దెట్టిశాంతి వెలయుచుండునో జరామరణవ్యాధుల ననుభవింపనేర్చిన పాఠకులే యూహించుకొనియెదరు గాత.

సాత్వికాహార స్వీకారంబున బరిశుద్ధరక్తంబును, రక్తము నుండి శుక్ల శోణితంబులును, అవ్వానినుండియే యోజస్సును, ఓజస్సునుండి బ్రహ్మతేజస్సును, బుట్టునని ప్రాచీనార్యవిరచిత గ్రంథముల వ్రాయబడి యుండుట మనకు స్పష్టముగా గానవచ్చుచున్న యది. దేహమే సద్గతికిని, దుర్గతికిని మూలమగునని సిద్ధార్థుడు తెలిపియుండెను. గ్రామవాసుల కత డిట్లు యిహపర సాధనంబగు దేహమును గూర్చి ప్రబోధించెను విద్యయున్న దుష్కార్యములకును, సత్కార్యములకును, రెంటికి నుపయోగించును. కాని యొక్కటి స్వాభావికమయినది. మఱొక్కటి స్వభావమునకు విరుద్ధము. కత్తియున్న నద్దాని భయంకరరూపముచే దుష్టుల భయభీతుల జేసి, యాత్మసంరక్షణము జేసికొని, దుష్టులను వారి నీచబుద్ధులనుండి మఱల్పవచ్చును. చంద్రహాసము నీరీతి ప్రాజ్ఞు డుపయోగింప, దుర్మార్గు డాస్వపరపరిపోషణకరంబగు ఖడ్గముచే నిరపరాధులగు పథికుల కంఠముల ఖండింప నుపయోగింపుచున్నాడు. మానవునకు పదార్థము యొక్క

తత్వయుగ్మ పరిజ్ఞానము లభింపనిచో, యథార్థమయినయా నందము లభ్యము కాజాలదు. నిబిడాంధకార తత్వము ను గ్రహింపనిశ్శక్తి చంద్రజ్యోత్స్నవలన నానందము ననుభ వింపలేని చందముననే దేహము యొక్క ప్రయోజ నాప్ర యోజనముల గుర్తెఱుంగజాలనివాఁడు స్వర్గపథదూరుఁడగుచుం డును. పరిశుద్ధంబగు నారోగ్యముచే వీర్యమభివృద్ధిజెంది, యో జస్సుగా బరివర్తనమయి, మేధాసంపత్తిని మెండుసేయును. తన్మేథాప్రపత్తివలననే వేదాంత తత్వ వివేచనా కార్యము సులభముగ సాధింపబడగలదు. శరీరబల పటుత్వ విరహితుని యారోగ్యధనము వ్యాధిశత్రువుల స్వాధీనమయి పోవుట ధ్రువము. శరీరపాటవము తక్కినవానికి మోక్షప్రాప్తికలుగ నేరదు. (కోవిదజనయుక్తి వృథాయగునే? "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" "ధర్మార్థ కామమోక్షాణాం ఆరోగ్యం మూల సాధనం." శరీరమున కెట్టి మాహాత్మ్యముకలదో ప్రాచ్యఖండ వాసుల యీ సంస్కృతవాక్యమే తెలుపుచున్నయది. పాశ్చా త్యులు సహిత మీవిషయమున మనతో బూర్ణముగ నేకీభ వించియున్నారు. "Health is wealth" ఆరోగ్యమే మహా భాగ్యము. సమస్త మతావలంబకులు దేహమును నశింపజే యుట మహాదోషమే యగునని బోధించియే యున్నారు.

ప్రస్తుతకాలపు మూఢయోగుల (అనగా నాభావ ము:—సన్యాసులు, సాధువులు, యోగులు, బైరాగులు,

ఫకీరులు, తాపసులు, మతగురువులు, పీఠాధ్యక్షులు, స్వాము లు, పరమహంసలు, వేదాంతులు మొదలగు కల్పిత వేషధా రులు,) భావంబులును, గుత్సితచేష్టలును నికృష్టంబులనియు నింద్యములనియు, త్యాజ్యంబులనియు, నిరూపింప నింతదనుక సిద్ధార్థుని భావములపై వ్యాఖ్య వ్రాయవలసి వచ్చినది. నీతి కిని, ధర్మజ్ఞానములకును నిలయంబులగు సిద్ధార్థుని ప్రబోధ ముల వ్రాయుచు, తన్మహత్వమును జెందుటంజేసి విషయసీ మ నుల్లఘింప నీటికిమాటికి సాహసింపుచున్నాడను. నామము ను సార్థకముసేయక "చెప్పెడివి శ్రీరంగనీతులు, దూరెడివి దొమ్మరగుడిసె"లను సామెతను సార్థకముజేయు వికటకుటిల నటశేఖరుల విమర్శింప నే ననేకస్థలముల నిర్దేశిత గ్రంథాభి ప్రాయసీమను దాట సాహసించితిని.

సిద్ధార్థుడు దీర్ఘకాలంబు దనుక తాపసుల తపశ్చర్యల గురించి వివేచనజేయుచు నా యటవీప్రాంతమునందే యుం డెను. భూపతి అట గపిలవస్తునగరమున యశోధరాదేవి యపా ర దుఃఖమునుగాంచి, సహింపనేరక, సచివశేఖరులను సైన్య మును దోడిచ్చి, తత్క్షణమే సిద్ధార్థుని గృహమునకు గొనిరా నను మతి యిచ్చిపంపెను. మంత్రిపుంగవులు కొన్నదివసము లెడ తెగని ప్రయాణముజేసి, సిద్ధార్థుని రాజగృహారణ్యమం దొం డు విశాలప్రదేశంబున బల్లవితంబును, గుసుమితంబునునగు లతావళీమధ్యంబున నుపవిష్టుండయి యుండుట నుపలక్షించిరి.

సమస్తరాజ కర్మచారులు దివ్యపురుషుని గాంచినంతనే పుల
కితగాత్రులయి, భక్తి గేల్మోడ్చి ప్రణామంబు లాచరింప,
సిద్ధార్థుడు వారియందఱును స్నేహపూర్వకంబుగ దక్షిణకరాంబు
జమునెత్తి 'కళ్యాణమస్తు' యని యాశీర్వదించెను. అంత స
మాత్యశేఖరులు భక్తివినమ్రులయి, సిద్ధార్థునితోడ నీరీతి నివే
దింప నారంభించిరి :— మహాత్మా! ప్రాయమునందు మేము
మీకంటె నధికులమయినను జ్ఞానమునం దల్పులమె. భవదాశీర్వా
దమువలన మాకు నిరాఘాటముగా సౌఖ్యశాంతులు లభ్యమగు
ను. మేము విన్నవించుకొను విన్నపము నాలకించి, మాసమ్మతి
కియ్యకొని, మమ్ము గృతార్థుల జేయుదురనియే మావిశ్వాసము.
భవద్వియోగజనితాగ్నిజ్వాలా సంస్పర్శంబున యశోధరా
దేవి సౌరభాన్విత సుకుమారశరీరము రేబవలు తప్తమయి, నీర
సించిపోవుచున్నయది. షడ్రసోపేతంబుగ సకాలమున గుడుచు
నాదేవి యన్ననీరముల గ్రోలనొల్లక, సిద్ధార్థనామస్మరణంబు
జేయుచు, కాంక్షఫలోన్ముఖమగు నాశలేదుకదాయని డెంద
మున గడు గుందుచున్నయది. స్వయముగ నంతఃపురాంత
రాళమునకు జని భూపాలుడు దుఃఖింపవలదని సాంత్వనావచ
నంబుల నెంత నివారింప జూచినను, బ్రయోజనము నుంతయు
గానరాకున్నయది. అనుదిన మాదేవిస్వాంతము దుఃఖసంభరిత
మయి పోవుచుండుటయే కానగుచున్నయది. ఎవ రెన్ని భం
గుల బోధించినను, ప్రాణసంరక్షణమునకయిన నల్పాహారమును

గూడ స్వీకరింపక, పన్నీటను జలకమాడుట విసర్జించి, మలిన వసనధారిణియయి, సుగంధద్రవ్య సమ్మిళిత తైలంబుచే కేశ పాశసంస్కారము గావింపనిదయి, అటవీప్రాంతభూముల నుపవాసవ్రతానుష్ఠానంబున దపమాచరించు తాపసిని బోలి, శుష్కించియున్నది. దేవిస్థితిగతు లిటులుండుట నవలోకించి, భూపాలు డాత్మగతమున నిత్యము గడూ వాపోవుచు కాలము గడుపుచున్నాడు. అతడు సహితము నిత్యము సకాలమున కాహారపానీయముల ననుభవింపక, రాజకార్యములయెడ నప్రసన్నుడయి, సంతతము తనదగు నిర్భాగ్యజీవితమునకయి విధాతను దూరుచు, నుదాసీనభావముతో వానప్రస్థుని చందమున గాలము వ్యతీతము సేయుచున్నాడు. కొంతవఱ కూరటజెంది యున్న గౌతమీదేవి భర్తృవిషాదభయముల గాంచినంతనె ఖిన్నయయి, నిరత మానందశూన్యయయి, చింతానల ప్రభావంబున శరీరమును దగ్ధమొనరించుకొనుచున్నయది. రాజ కార్యములన్నియు నవ్యవస్థజెందుట యటుండ, రాజదంపతుల నిరంతర విషాదబాహుళ్య మండితస్వరూపంబుల గని, విగత సంతోషులరయి ప్రజలు దైనికకృత్యముల యథోచితముగా శాల్గొనక దుఃఖాబ్ధింబడి కొట్టుకొనిపోవుచున్నారు.

విషాదసాగరతరణోపాయ విరహితులగు సమస్తజనులకు భవత్పునరాగమన వార్తాశ్రవణము, మహానౌకారాజము కాగలదు. దాని నధిరోహించి సర్వులు చింతాసాగర తర

ణము నేయ సమర్థులయ్యెదరు. తమదివ్యదర్శనప్రాప్తిచే రాజ
దంపతులును, యశోధరాదేవియు సమస్తదుఃఖంబుల విస్మరించి,
పూర్వానందమును బడసి జీవితముల హాయిగ సంరక్షించు
కొనఁ గల్గుదురు. "యథా రాజా తథాప్రజా" యను గురుజన
వచనము ననుసరించి ప్రజాసముదాయము సహితము తొల్లింటి
హర్షమునంది, సుఖింపగలదు. భవద్వియోగమే మాదగు
కర్మ యగుచో నెన్నిజీవులను బాధింపజేసిన వారలయ్యెదరో
విచారించుకొనుఁడి. తమ్మెడబాయుటంజేసి కపిలవస్తు నగర
స్థిత విశాలవృక్షరాజంబుల నాశ్రయించియున్న విహంగబృంద
ములు సహితము తొల్లింటి ప్రకృతి కానందము నెడబాసి,
ఆహారసంపాదనముకయి గూండ్లనుండియయిన వెడలక, యుప
వాసములచే మనోవ్యథ ద్విగుణితంబగుడు నిరంతరము స్రు
క్కుచు గలకలధ్వనుల మఱచి పక్షచ్యుతములగు నభశ్చర
ములవలె నాక్రిందనధ్వనుల నుప్పతిలజేయుచున్నయవి. అనా
రతము బాలితస్నాయంసమయముల భవద్దివ్యదర్శనమును
బడయుచువచ్చిన విశాలతమంబులగు పుష్పోద్యానములు సహి
తము దమయభినేతృయగు వాసంతికాశాసనముల లెక్కింపక
యభినవోద్యానము లను నామమే నిరర్థకమగుడు దర్శింప నస
హ్యముగా నున్నయవి. వాసంతికయు వలవల నేడ్చుచున్న
యది. ఇన్నియమంగళములకు భవద్వియోగమే హేతుభూత
మయ్యెనని వేఱుగ వచింపవలయునా? భవత్సన్న్యాసవ్రత పరి

గృహాణంబున నెంతలేసియనర్థకములు కపిలవస్తువునకు వాటి
ల్లినవో వర్ణింపశక్యముకాదు. నగరమును సందర్శించినవారికే విశ
దమగును. సమస్తజనులకు నతిశయవిషాదము నొడగూర్చు
సన్యాసమునకు జలాంజలియొసంగి, మరణాసన్నుల సంరక్షింప
గంకణబద్ధుడవగుము. మృత్యుశయ్యంబడియున్న మాతాపితా
త్మజులను శీఘ్రము హంసతూలికా తల్పంబుల బండునట్లుజేసి
దయార్ద్రహృదయుండు సిద్ధార్థుడని యెల్లవారు సంస్తుతింప
నిజనామమును సార్థకమొనరించుకొనుము! పరిశుద్ధహృదయా!
సిద్ధార్థరాకుమారా! నీయందు మాకెట్టి శ్రద్ధాభక్తు లున్న
యవో నీకే తెలియును.

వివిధవర్ణ ప్రకాశితాంబరధారణమును వర్జించి, జర్జ
రమలిన వసనధారిణియయి, కుంకుమ కేసరీతిలకవిహీనలలాట
యయి, నవనీ నీరదకుంతల సంస్కారదూరయయి ప్రత్యక్షవిషా
దమూర్తియనందగు బాలవిధవనుబోలియున్న కపిలవస్తునగర
మును బూర్వలావణ్యవిరాజితను గావించి, "జననీజన్మ భూ
మిశ్చ స్వర్గాదపి గరీయసీ" యను దివ్యవాక్యమును జగితార్థ
ము గావింపుము! సర్వజ్ఞుండవనియే మాచే నారాధింపబడు నీకు
హితోక్తుల నుపదేశించుశక్తి లేనివారలమయ్యు, నిజబాధా
నివారణార్థమయి, వినయపురస్సరంబుగ స్వకీయదుస్థితిని గూర్చి
నివేదించుకొనుచున్నారము. కరుణాంతరంగుడవగు నీవస్వ
స్థా భావింపవనియు, దూషణభూషణ తిరస్కారంబుల సమ

ముగా వీక్షించు యభేదదృష్టి నీయందున్నదనియు, మేమెఱుంగకపోలేదు. ఆలసింపక సత్వరము మ మ్మనుసరించి, రక్షింపుము. వేలకొలదియాత్మల కపారసౌఖ్యంబు నాపాదింప నహింసావ్రతానుష్ఠానోద్యమమునకు నుపక్రమింపనున్న నీకు మా హృదయములకు దాపము నొదవజేయుట కళంకము నాపాదించును. యుష్మచ్ఛ్రీముఖోద్గత వచనములు చింతాసాగరమునబడి కొట్టుకొనుచున్న మాకు (కపిలవస్తునగరవాసులు) నావయగునో లేక మెడకొక్క పెద్దబండయయి వ్రేలాడునో తెలియజాలకున్నాము. ఇంక నీచిత్తము, మాప్రాప్తము. విధివిధానము సహితము మమ్ము బాధింపకుండ యుండలేదు.

సిద్ధార్థుని శ్రీముఖమునుండి సముచిత ప్రత్యుత్తరము లభింపకుండుట నవలోకించి, రాజభక్తి పరవశులగు నాసచివాగ్రణులు రాజదంపతు లవశ్యము పుత్రవధూసహితంబుగ దనువుల దొరంగుదురని నిశ్చయించుకొనిరి. మంత్రులయందు సహజానురాగముగలవాడయి యుండియు, నవ్వారివచనంబుల నాలకింప నీషణ్మాత్రమయిన నభిలాషలేనివాడయి సిద్ధార్థుడు భగవధ్ధ్యానమునుండి విముక్తుండగుటకు మాఱుగ నిమీలితనేత్రుడయి, నిశ్చలమగు వదనారవిందముతో నటులనే సంచలనము లేక యొకింత కాలపర్యంతము నాసీనుడయి యుండెను. విజ్ఞులగు సచివుల విశ్వప్రయత్నము లన్నియు విఫలములయ్యెను. పరమేశ్వరధ్యానస్థుండగు గౌతముడు వారి

నుడువుల నాకర్ణించియు నాకర్ణింపన ట్లుండెను. హృద్గతభావములఁ గ్రహింప ముఖబింబము దర్పణమువంటిదికదా! అతని హృదయభావంబు లన్నియు జాంచల్యమునకు దూరమయి శాంతమును ముఖారవిందమున బుంజీకృతము గావించియుండెను. సిద్ధార్థుని నిశ్చలంబగు చిత్తమును నయస్కాంతము లోహము నాకర్షించు చందాన నాకర్షింప సచివు లెన్నియో యుక్తుల బ్రయోగించిరి కాని యవన్నియు వమ్మయ్యెను. వారలంతట నిర్విణ్ణులయి శిలానిర్మిత విగ్రహముల చాడ్పున నొకింతసేపటులనే కూర్చుండియుండి, మౌనముద్రను దాల్చి యనిమిషనేత్రులయి, రాకుమారుని యతులిత సౌందర్యాన్విత మనోజ్ఞవిగ్రహంబును దిలకింపుచు నుండిరి.

సిద్ధార్థు డొకింతతడవునకు భగవద్ధ్యానమునుండి విముక్తుడయి, నేత్రముల దెఱచి చింతాక్రాంత స్వాంతులును పితృభక్తిపరాయణులును నగు మంత్రివరేణ్యులగాంచి యీ రీతి నుపదేశింప జొచ్చెను. సత్యపథాన్వేషణమునకయి నేను ఘోరకృషి సలుప దృఢకరణంబుల భావించితిని. భావించుటయేకాదు సంకల్పించితినని చెప్పనొప్పు. సంకల్పము తనబాల్యావస్థ లేక ప్రాథమికావస్థయందున్నయపుడే ప్రయత్నము వలన బరివర్తనమయిన గావచ్చును. బాల్యావస్థయన నది కేవల మభిలాషగానున్నపుడని తాత్పర్యము. మది జనించిన వాంఛయే పరిగాఢమయి కార్యోన్ముఖముగా నున్నపు డద్దానినే

సంకల్పమని చెప్పుదురు. వికల్పమగునదియే యభిలాష. తరం గస్వభావముగలది. వైకల్యము లేనిదే సంకల్పము. (పాశ్చాత్యుల మతముగూడ నిదియె. భావమునందుత్పన్నమగు కాంక్షయే దృఢతరమయి సంకల్పముగ బరివర్తనమగును. పరిపక్వ ముత్పన్నమగునదియే Wish అనియు బిదప నదియే Will సంకల్పమగుననియు Ethics of Westners చెప్పుచున్నమది)- అట్టి నా సంకల్ప మాచరణతో సమ్మిళితమయినది. అనగా గార్యరూపము దాల్చినయది. నాభావమభిన్నమయినది. నేను భువిపై సద్ధర్మము నెలకొల్పుటకు బూర్వము సత్యము (Realization) నన్వేషింప బ్రయత్నము సలుపుచున్నాడ. ఇదియే మానవుని యథార్థమగు ధర్మము. కనుక నే నహోరాత్రములు కార్యమునందే పరతంత్రుడనయి యుండవలసి యుండును. ఏతత్కార్యమున సాఫల్యత సర్వేశ్వర కృపచేతను నిరంతరావిరళకృషిచేతను బ్రాప్తించిన సంతోషమే లేదేని నేనగ్నిలో బ్రజ్వలింపుచున్న నిప్పుకణముల భక్షించి ప్రాణవిసర్జనము సేయుటకే నిశ్చయించుకొనినాడను. యథార్థ మారసిన మానవజాతి కసాధ్యంబులగు కార్యము లీభూవలయంబున సర్వేశ్వరునిచే సృజియింపబడియే యుండలేదు సమస్త కార్యములు మానవసాధ్యములే యని రూఢిగ వచింపగలను. మనదృష్టికిని, మనమునకును దుస్సాధ్యంబులుగ

గాన్పించు సమస్తకార్యములు క్షణమాత్రకాలంబున సాధన మాత్రంబుచే సఫలంబులగును.

సాకారనిరాకారతత్వములమధ్య వెలయుసన్నికటసంబంధమే జ్ఞానకర్మలయందునుగలదు. (సిద్ధార్థునియీభావము చెట్టు ముందా విత్తుముందా యను నిక్కాలపు వేదాంతులప్రశ్నకు సరిపడియున్నది) చంద్రచంద్రికల పరస్పరావినాభావ సంబంధమే జ్ఞానకర్మలయందు వెలయునన్నను యుక్తమే. హ్రస్వభావ విలసిత దృష్టివలనను, ధైర్య స్థైర్యాభావంబువలనను విజయము మానవసంఘమునుండి దినదినము దూరమగుచునే యున్నది. సామర్థ్యమనగా గార్యోచితశక్త్యభావంబు దటస్థించినను, సంపూర్ణవిశ్వాసముచే నూతనోత్సాహము, నూతనోత్సాహంబున నవీనోద్రేక పూరితకార్యకరణస్ఫూర్తియు లభించును. మానవహృదయంబిచ్ఛాశక్తిచే బరిపూర్ణమయియుండును. ఇచ్ఛాశక్తియొక్క ప్రభావంబును గుర్తెఱింగి, కార్యక్షేత్రమున గర్మవీరునివలెని జరించు మానవుడు వాంఛించుచో నాకాశమునయిన దృటిమాత్రకాలంబున భేదింప సమర్థుండగును. నేటిదనుక సంసారములో మహాత్ములయిన వారలందరు హృద్గతిచ్ఛాశక్తిని గ్రహించుటంజేసియే యనిగ్రహింపుడి. మానసికదౌర్బల్యము (Mental weakness or weakness of mind) వలనను విషయవికార జన్యావివేకంబు వలనను మానవజాతికార్యకరణశక్తిం గోలుపోయినది. మానవులెంత

పర్యంతము జ్ఞానకర్మల యవినాభావసంబంధమును గ్రహిం
పజాలరో యంతవఱకు యథార్థమగు విజయమను శబ్దమే యీ
సంసారమున మందుకైననుండకుండ నశించును. అద్దానికి కేవల
ము శబ్దప్రపంచమునందే స్థానముండియుండును. జిజ్ఞాసకలిగినంత
నే యంతటితో సంతుష్టిచెందక, తజ్జిజ్ఞాసను సఫలీకృత మొనరింప
దృఢసంకల్పచిత్తుండగు నరుడే పురుషోత్తముండగును. అవివే
కాంధకార బంధురంబగు ప్రపంచమున గార్యక్షేత్రమున కేవల
మాత్మ విశ్వాసమే దక్షిణభుజంబుగనుండి. భావాతీతంబగు
సాహాయ్యమొనర్చి, విజయశ్రీకరగ్రహణభాగ్యమును బ్రసా
దించును. ప్రధానముగా నీభూవలయంబున దమ్ము సాధారణ
మానవులుగా భావించుకొనువారలు సహితము స్వశక్తిపై
సంపూర్ణంబగు విశ్వాసమునుగల్గియుండి, సంపూర్ణోత్సాహ
ముతో బ్రవృత్తిమార్గము ననుసరింపుచో విజయశ్రీప్రాప్తి
యత్యంతము సహజమేయగును. కార్యావసరంబుల జిత్తము
చలించిన మనచే మహాత్ములుగను, అవతారపురుషులుగను
భావింపబడు యుత్తమోత్తములగు మానవులు సహితము భ్రష్టు
లగుదురు.

సమస్తసంసారమునకు మూల మాత్మయే. ఆత్మదర్పణ
మునందు సమస్తము సుస్పష్టముగా నున్నదియున్నయటుల
గానవగుచుండును. సత్యస్వరూపములను దిలకింప హృదయద
ర్పణమును వీక్షింప జర్మచక్షువులవలనగాదు. అట్టితరి విజ్ఞాన

నేత్రమావశ్యక మయ్యెడును. జ్ఞానదృక్కుల వాస్తవమును తెలియుటకుబూర్వము హృదయ నైర్మల్య మెంత యావశ్యకంబో వివాకు తెలిసియే యున్నదికదా! ఆత్మయందే వాస్తవ మాలోచించిన భుక్తికిని, ముక్తికిని అనురక్తికిని వేయేల, సమస్తమునకు మూలమార్గము డాగియున్నది· భువిపై బహిర్గతములయి, సుప్రసిద్ధములయిన మార్గములకు మూలస్థాన మాత్మయే యని తెలియుడి· నేనా పవిత్రతమంబును, నిగూఢంబును నగు నాత్మశక్తిని శుద్ధాంతఃకరణముల విశ్వసించి, యాశ్రయించి యారాధింపుచున్నాడను. అద్దాని నాధారము గావించుకొనియే, సత్యానందపథము నన్వేషింప గృహపరిత్యాగము గావించినాడను. ఆత్మవిశ్వాసమే జీవితసర్వస్వము· ఆత్మవిశ్వాసమే శాశ్వతానంద బ్రహ్మనిలయము. ఆత్మవిశ్వాసదూరుడగు హతభాగ్యుడే సంసారౌన్నత్య పథచ్యుతుడగుట ప్రాయికంబుగా సంభవింపుచుండును· ప్రపంచములో నసంఖ్యాకులగు వీరవరేణ్యులు కేవల మాత్మవిశ్వాసమునే పేరకునిగ భావించి, స్థూలదృష్టి కగమ్యగోచరంబులుగ నుండు కార్యముల నెన్నింటినో యవలీలగ సాధించి, నిస్సంగులయి, యిహపరములబడసి మించినారు· ప్రతివ్యక్తికి జనన కాలమునందే పరాత్పరునిచే బ్రదానము సేయబడు, యిచ్ఛాశక్త్యంతర్గత ప్రభావవిశేషమును జనులు గ్రహింపజాలక, తాత్కాలిక వ్యామోహజనిత వస్తుసందర్శన ప్రభావంబున

సమస్తకార్యతత్వపరిజ్ఞాన దూరులయి, కంటకాకీర్ణంబులును, నిమ్నోన్నతంబులును నగు దుష్పథముల ననుసరించి, యవ్వాని పరిణామంబులగు విషాదభయములకు బాల్పడుచునేయు న్నారు. స్థిరసంకల్ప చిత్తుండనగు నన్ను మీరు పవిత్రకార్యము నుండి విముఖు నెట్లు గావింపసమర్థులయ్యెదరు? కానికార్య ములేదంటిని. జ్ఞానమెల్ల వానిని సాధించునుగాని యద్దానిని సాధింప నెద్దానికి శక్తియుండనేర్చు? అదియే శక్తిస్వరూపిణి యగు నాదివిరాట్టుకదా? నాకు సంపూర్ణముగనే యాత్మశక్తి రహస్యగ్రిహణపటుత్వతమే లభ్యమగుచో గంభీరభూధరము నయిన నవలీలగ డీకొని స్థానవిచలితంబు గావింపగల్గుదు. ప్రపంచములో దమ్ముదామే శక్తివిహీనులుగను, దురదృష్టవంతు లుగను భావించి, నిరసనదృష్టికి బాత్రుల గావించుకొనువా రలే నరఘాతుక మృగములు లే కజ్ఞానము లేని ద్విపాదపశువులు. అదృష్టమనియును, దురదృష్టమనియు, బ్రహ్మ వ్రాతయనియు కర్మయనియు మూఢులగు సంసారులచే భావింపబడున వన్ని యు మనోమాలిన్యచాంచల్యంబుల బ్రాప్తించిన మనో వికార పరిపాకంబులే సుమా!

వర్తమానమును దక్క భూతభవిష్యత్తుల గ్రిహింప మానవులకు శక్యము కాదు. అదృష్టము దురదృష్టమని వేరిలు సోమరులే దృగ్గోచరమగుచుందురు. వానిస్వరూపాదుల గూర్చి కాని, లక్షణముల గుఱించి కానివక్కాణింపగల్గినవా డొక్కడు

ను గానరాడు. ఏవఁగానవుని మన మీా నియమసంబున మహాదృ
ష్టవంతుడని పేర్కొనుచున్నామో వానిని క్షణమాత్రకాల
ము గతించినంతనే స్వాభావికంబుగ మృత్యుదేవత కబళించి
వేయుచో, దురదృష్టవంతుడని చెప్పసాహసింపుచున్నారము.
క్షణమునకు బూర్వము సర్వేశ్వర కృపాఫలితంబగు సదృష్ట
ము వానియందనుండ నింతలోనె వాడెట్లు దురదృష్టదేవతచే
నాక్రమింపబడగల్గినాడో యించుక దూరదృష్టితో విచారిం
చిన సుస్పష్టము గాగలదు. దురదృష్టాదృష్టముల కేవలము
నామభేదంబు దక్క మరెద్దియును గానగాదు. వ్యామోహ
మునే నిరంతర మారాధ్యముగా సంభావించు ప్రాపంచికులు
తమ స్వార్థమయాల్పసౌఖ్యంబుల కనుకూలించినవానినెల్ల
నదృష్టములనియు, దమకు బ్రతికూలముగ నున్నవానినెల్ల
దురదృష్టములనియు బేర్కొనుచుందురు. అదృష్ట దురదృష్ట
ములు విశేషించి సోమరులును, మందులును బ్రేమింపదగిన
పదార్థములే కాని జ్ఞానయోగులును, కర్మయోగులును బ్రే
మించు పదార్థములు కావు. "కృషితో నాస్తి దుర్భిక్ష" మన్న
రీతిగనే కృషిసేయుటచేతనే సంసారములో ఘనమున కభ్యు
దయమున కావశ్యకంబులగు పరికరంబులన్నియు బ్రాప్తిం
చును. సుముహూర్త మనియు దుర్ముహూర్త మనియు
ప్రాపంచికులు ఏమేమో పలవరింపుచుందురు. జ్ఞానోపా
ర్జనకయి కృషిసేయుచు, పవిత్రాచరణంబున మెలంగుచు

నిమిత్త మాత్రింబులగు కర్మలపట్ల నిస్సంగుడయి చరింప, గార్యోన్ముఖుడగు వానికి ముహూర్తముతో నిమిత్తమేమి? ఉదరంభరత్వమునకయి ప్రాపంచికులచే సిద్ధమొనరింపబడిన జ్యోతిషమేరీతి గారడీవిద్య యయియున్నదో, పురోహితాది మందులు, పరావలంబితజీవులు చెప్పు ముహూర్తములు సహితమట్టివే సుమా! శుభాశుభ ముహూర్తము లేగ్రంథముల యందును వ్రాయబడి యుండవు. ఈశ్వర ప్రదత్తంబగు నంతఃకరణమే మానవులపాలిటి వేద గ్రంథమయియుండి, ప్రకృత్యవస్థ కనుకూలంబులగు సమయంబులనెల్ల శుభముహూర్తములనియు, బ్రతికూలంబుగనున్నవియే యశుభముహూర్తంబు లనియు బ్రబోధింపుచుండ భూతభవిష్యత్ జ్ఞానశూన్యుండును, కించిజ్ఞుండును నగు మానవుని వచనంబుల విశ్వసింపనేల? భయంకరంబులగు నశనిపాత సమయంబులును, కుంభవృష్టిసమయంబును, ప్రచండసూర్యాతపసమయంబును యేదేని యొక్క ప్రయాణము సేయుటకు బయలుదేర శుభముహూర్తంబగునని యెవ్వాడు వచింపసాహసించు? ప్రకృతకాలమున బాపంచికుల యాచారవ్యవహారములును ఊహాపోహాలును నిరర్థకములయి యున్నవి.

అసంఖ్యాకులగు జనులకు నేను కష్టము నొదవజేయుచున్నానని చెప్పు మీవాక్యమునసహిత మర్థములేని ప్రలాపముగనే యున్నవి. సత్యమునకు దూరమగు వాంఛను మీరు

గల్గియుండ నద్దానిని నేను బూర్తి సేయనిచో, మీ మనంబులకు సహజముగనే వ్యామోహపూరితంబులగుకతన, బాధ కలుగ వచ్చును. అట్లు కల్గుబాధకు నేనే హేతుభూతుండననియు, నందుచే హింసాత్మకుండ నయితిననియు నిక నహింసాధర్మా నుష్ఠానమున కెంతమాత్రము దగననియు జెప్పుటెంతయు మౌఢ్యము. యథార్థము విచారించిన దమున్మదామే మూఢు లుగ భావించుకొనువారు తమచే భావింపబడునంతటి మూఢ స్థితియందు లేరు. వారి సంకుచిత నీచాభిప్రాయములే వారి సాంసారికవ్యామోహజనిత వికారమయచేష్టలే హృదయాంత రాళ విరాజితాపూర్వేచ్ఛాశక్తిని గప్పివుచ్చుచున్నయవి. నేను భోగవిలాసరతుడనయి, సంకుచితభావయుక్తుడనయి యున్నంత పర్యంతము నిరుపమానంబగు నాశక్తి ఛద్మరూపంబున నజ్ఞాత వాసము జేసెను. భ్రమాత్మకంబులగు నికృష్టభావంబుల బహి ష్కరించినంతనే యాశక్తి ద్విగుణిత బలసమన్వితమయి, దృష్టి పథమున బడియెను. అప్పుడే నాకు జీవితవేదమునందలి ప్రథా నాధ్యాయంబున గర్మేచ్ఛాశక్తుల సుస్థిరంబగు సంబంధము బొడకట్టెను. సంసారములో గర్మవీరులనియు, భగవదవతార స్వరూపులనియు, మనచే భావింపబడువారందరు మనవంటివారే. కేవలము వారు మూఢులవలె సమయము దుర్వినియోగపఱ పుచు, సంచరింపక, తమ యాంతరికశక్తిని గ్రహించి, విశ్వా సంబునను, ధైర్యస్థైర్యంబులవలనను విజయము నందియుండిరి.

శాశ్వతంబును, అజరామరణంబుననగు నాశక్తినే గ్రహింపవల
సిన బాధ్యత మానవకోటియందే విశేషించి వెలయుచున్నది.
స్వశక్తిని గుర్తెఱుంగుటయే పరమాత్మ సాక్షాత్కారమును
గనుట, లేక బ్రహ్మలోకప్రాప్తిం బడయుట యని తెలియుడి.
మూఢజను లసంఖ్యాకులు దుష్టకాంక్షాపూర్తికిని, స్వార్థసిద్ధికిని
జపతపముల నెపంబున బకతపముల నాచరింపుచు, నాత్మ
విశ్వాసము లేక దైవమను శబ్దమునయిన నెఱుంగక, పతితు
లయిపోవుచుండుట నేను కండ్లార గాంచియుంటిని. అట్టి
సోదరమానవుల దుష్టాభిప్రాయముల సంస్కరింప నొక్క
ధర్మాచార్యుని పరమావశ్యకతకలదు. ఆ పదవి నే నాక్రమించి,
యెల్లప్రాణులకు సుఖశాంతినిలయంబగు నిర్వాణధర్మముల
నెలమితోడ బోధింప సంకల్పించియున్నాడను.

సమస్తలోకములు మానవాత్మకు లోబడియేయుండ,
మూర్ఖులనేకులు సంసారసంబంధము నెడబాసి, వన్యభూముల
జరింపుచు సర్వసంగపరిత్యాగులమని వాకొనుచు, దాంభిక
వృత్తిచే సంచరింపుచుండుట నవలోకింప, నాకెంతయు లజ్జ
యగుచున్నయది. నే నవ్విరిచందమున వన్యభూముల నాశ్ర
యింపకపూర్వమే సన్యాసమునందారి తేర నిశ్చయించినవాడ
నయి సమస్తమనోవృత్తుల సంపూర్ణముగ జయించి, గోస్వామి
నయితిని. కాంక్ష యను మానవునిజన్మశత్రువున కుత్పత్తి
స్థానము చిత్తసీమకాని ప్రపంచరంగ మెంతమాత్రమును గాజా

లదు. ఆర్యులు వనములవంటి యేకాంత ప్రదేశంబులను, ప్రకృతీదేవి క్రీడాలయంబులను వైకల్య మెంతమాత్రములేని తపశ్చర్యలకు లాభప్రదంబులని యెంచియే వానిని దపోవనంబులని సంబోధించియున్నారు. వారలీరీతి వన్యభూముల దపాశ్రమంబులుగ నిర్ణయించుటకు హేతువదెద్దియన నచ్చట కోలాహలంబులును, సంసారుల యాక్రందనధ్వానములును లేక నిత్యము శాంతిశ్రీ నాట్యముసేయుచు కన్నులపండువుగాను హృదయాహ్లాదకరంబుగను నుండును. పుణ్యధనము నార్జించుటయే విహితధర్మముగా నెంచు పురుషోత్తములకు దపమాచరింప వనముల వాతావరణస్థితి యెంతయు సానుకూలమయి యొప్పుచుండును. ప్రస్తుతకాలపు పురుషులనేకులు సాంసారికవాంఛలు సఫలీకృతంబులుగానికతన గపటమునివేషధారులయి, గోముఖవ్యాఘ్రములయి, యరణ్యాశ్రయులగుచున్నారు. (ఆంగ్ల కవిసార్వభౌముండగు గోల్డుస్మిత్తుచే రచియింపబడిన వనవాసిని [Hermit] యను ఖండకావ్యమున గథానాయకుడు ప్రియసీప్రాప్తిం బడయలేక యేకాంతవాసయోగియయ్యెను. సిద్ధార్థుడు వచించు సంసారుల సన్యాసమట్టిదే). నేనట్టి కపటవేషధారినగు నేకాంతవాసినిగాక ఆత్మవిశ్వాసమనియెడి సౌభాగ్యమునంది, సర్వైహికకాంతాసముదాయము నెడబాసి, బ్రహ్మానందపథము నన్వేషింప దృఢసంకల్పచిత్తుండయిన సన్యాసిని నేనని గుర్తెఱుంగుడి.

నేనవశ్యము సత్యమున న్వేషించి, ఫలముబడసి మానవప్రపంచ
మునకు జాటనిశ్చయించితిని. ప్రపంచమంతయు మానవాధీ
నమే. కేవలము భ్రమనుబాసి చరించుటయే యాలస్యము.
మరణదేవత మానవకోటిని నిజగృహమున కతిథులుగ గొని
పోవ నిమంత్రణము బంపకపూర్వమే వారు, జీవితపరమావధి
యగు శాశ్వతానందబ్రహ్మ నిలయమార్గము నన్వేషించి,
సమస్తవిధముల సిద్ధముగనుండవలయును. ఆత్మ విశ్వాసప్రే
రిత ధైర్యభావంబుననే కొండలన్నింటి బిండి పిండిగ గొట్ట
వచ్చును. సచివోత్తములారా! నే, మానవప్రపంచ మజ్ఞా
నముచే విస్మరించిన సత్కార్యమందిరమును బునర్నిర్మాణము
గావింప యత్నము సలుపుచుండ, మీరు బ్రహ్మానంద పరవశు
లగుటకు మారుగ విలపింపుచు, జననీజనకుల దుఃఖవార్తను
వినిపింపదగునె? విషాదము భ్రమాత్మకభావసంజనితంబనియు
నజ్ఞానపూరితంబనియు నేనింతపర్యంతము మీకందఱకు బోధిం
చియుండ బునః విలపించుట బేలతనంబుగాదె? ఇట్టి మిథ్యాభి
భూతంబగు వ్యామోహమును బాయుటయే ముక్తియని
నే ననేకమార్లు నొక్కి వక్కాణించియుండ దిక్తటములంతట
విషాదభావంబుల వ్యాపింపజేయు మిమ్ముల నేమనగవచ్చు?
చింతిలకుడు, హర్షించుడు. నాకీపునీతకార్యంబున శీఘ్రంబు
శుభంబువాటిల్లులాగున సర్వేశ్వరుని నైక్యకంఠముతో భక్తి
గద్గదహృదయములతో ధ్యానింపుడు. నిజనివాసస్థానంబుల

కరిగి, స్వకార్యపరతంత్రులరగుడి. మానవునకు జింతింపవల
సిన యావశ్యకతలేదు. చింతవలననే పరమేశ్వరప్రదత్తం
బగు కాయము క్షీణించిపోవును. దేహము కర్మనిర్మిత మం
దురేమొ. అయినను దేహమున వ్యాప్తమయియున్న చైతన్య
ము సర్వేశ్వరాంశమె. మానవుడు చింతించి నిజశరీరమును
నష్టభ్రష్టము గావించినవాడయి హంతక నామధారియగును.
చితి (సొద) మరణించినవానినే భస్మీభూతమొనరింపుచుండ
జింతజీవితునే దగ్ధమొనరించివేయును కనుకనే మానవుడు
స్వప్నావస్థయందయిన జింతయను నామమును స్మరింపరాదు.
ఆత్మానందవృక్షమున కియ్యది వేరుపురుగు వంటిది. సాంసా
రిక లీపదమునే, బ్రహ్మానందహంతకియగు నీశబ్దమునే మనో
వ్యాధియనుచు దీని కిహమున నౌషధమే లేదనియు గురు
జనులు వాకొనుచుందురు. ఈలోకోక్తి యంచ దినుమంతయు
నసత్యము కానరాదు. చింతయను వింతపదమును విశేష
కాల విలంబనముసేయక శబ్దప్రపంచము నుండియే దూరీ
కృతము సేయవలయును. భాషోద్యానమునుండి యీశబ్దప్ర
సూనము నెల్లవారు బట్టి రూపుమాపివేయవలయును. సచివ
పుంగవులారా! చెచ్చెర మీరు స్వపురికేగి, జననీజనకులకును,
జాయకును, మదీయ ప్రబోధమును విశదీకరింప నభిలషింతు.
నేడే మీరునన్ను కాటనిడుకొనిపోయిన మాతాపితలు కౌగి
లించుకొనినను, రేపు మృత్యుముఖంబున బడకతప్పకుకదా!

మరణము లేపోమాపో తటస్థించుననను నుడువు సత్యమని గుర్తెఱింగియు, నిట్లు భ్రమాత్మక ప్రేమ విహ్వలురగుట యశుభంబుగాదె? ఇట్టిభ్రమనుగల్గి యుండువారలే నరకగాములగుదురు. భ్రమయే విషాదభయములకు మూలహేతువని గుర్తెరుంగజాలని నరుడు నరుడా? స్వరూపమాత్రి మానవుడేకాని, సేయుచేతలవలన నరణ్యఘాతుకపశుగము. వర్ణవిభాగము గుణకర్మల ననుసరించి సేయబడినరీతియే స్వరూపముకంటె భావమునకెక్కుడు ప్రాధాన్యమొసంగబడి, మానవమానవేతర జీవనిర్ణయము సేయబడియున్నది. "ధర్మేణహీనాః పశుభిస్సమానాః" అనునార్యోక్తి ననుసరించియే ధర్మములేనివాడు పశుతుల్యుడు. భ్రమనుగల్గినవానికి ధర్మస్వీకారాభిలాష యెట్లుజనించును? భ్రమనుబాసినపుడేమానవునకు ధర్మస్వీకార పరిజ్ఞానము లభ్యమగును. భ్రమోత్పన్నమే కాంక్ష. కాంక్షాప్రేరిత కార్యపర్యవసానమే విషాదభయములు. వీనినే నరకమనియెదరు సంయోగవియోగ సంకల్పవికల్పముల సహజములని గ్రహించియు నాతండ్రిపడయు వికటవిషాదమే నరకముయొక్క ఫలితమని నొక్కివక్కాణింపుచున్నాడను ప్రస్తుతము నేను, జననమరణములు, సుఖదుఃఖములు, కలిమిలేములు రెండుతెగల సంఘటనలును స్వభావజన్యములేయని గ్రహింపనేర్చితి. నేనశాశ్వతంబులగు నీద్వివిధాజ్ఞాన జనితమనోవికారంబుల బాసి, భౌతికప్రపంచమున కతీతంబగు సుస్థిరానందరసా

స్వాదనాకార్యతత్పరమతినయి యుంటిని. నాకుబ్రాప్తించు యీ యలౌకికానందమే కల్మషరహితముయియున్నది ఇద్దియే స్వర్గము లేక వైకుంఠము. కవికల్పనలయందు దీని కనంతనామములు కలవు. అస్థిరంబులగు ప్రాపంచిక సౌఖ్యములు భ్రాంతిని ననుభవింపుచున్నంత పర్యంతము దినదినాభివృద్ధి నందుచుండును. నాపదయు నీస్వర్గీయానంద మక్షయము. అజరామరణము ; అద్వితీయము ; అనుభవైకవేద్యము. మీకలిప్పట్టున నా చాటులేని మాటలతేటను గ్రహించి, స్వగృహమునకరిగి, నా యానందసమాచారము నాత్మీయులకెల్లరకు దెలుపవలసినది గానెన్ని మార్లువిన్నవించినను, ఖేదమునశింపకుండట నుపలక్షింప నాకెంతయు నబ్బురమగుచున్నయది. కాలయాపనమగుచున్నయది. ప్రబోధవిషయమతి విస్తరించినది. వేగ జనుడు.”

రాజమంత్రు లత్యంత విషాదాక్రాంత స్వాంతులయి తేజోవిహీన వదనారవిందులయి, వివశత్వమున గపిలవస్తునగరాభిముఖులయిరి. అప్పటివారి దీనావస్థను వర్ణింపశక్యము కాదు. వారి తాత్కాలికదశ యెంతయు గరుణాజనకమయి యుండెను. అమాత్యశేఖరులు దీర్ఘప్రయాణము జేసి, దివసత్రయానంతరము శుద్ధోధనభూపాలుని సౌధము జేరిరి. అచట శుద్ధోధన గౌతమీ యశోధరాదేవుల నపారవిషాద సాగరమున మున్గితేలుచుండుట గాంచి, తామునసహితము విషాదాయత్తచిత్తులయిరి. వారునే మునదేమియు లేక కంపితస్వరమున

సిద్ధార్థుని వైరాగ్యదీక్షను, దృఢసంకల్పమును విశదీకరించిరి. ప్రజ్వలితాగ్ని కింధనఘృతములు లభ్యమయిన నదియెట్లు ద్విగుణీకృతోద్రేకముతో బ్రజ్వరిల్లునో, యదియే కరణి రాజపరివారముయొక్క దుఃఖానలము సిద్ధార్థకుమారుని గృహనిగమన తిరస్కార వార్తాశ్రవణంబున మరింత హెచ్చి, వారి కోమలగాత్రములు దపింపజేయదొడంగెను. మృదుల పల్లవగాత్రులగు రాజపరివారమువా రెల్లరు నాక్రందన ధ్వనుల నేయ మొదలిడిరి. పిడుగువంటి భయంకరవార్త రెప్పపాటు కాలమునందే నగరమునందంతట వ్యాపించిపోయెను. ప్రజాసంఘ భూరుహము నంతపర్యంతము నల్లిబిల్లిగ నల్లుకొనియున్న హరితవర్ణ ఫలపుష్పిత వికసిత యాశాలతికాసమూహమీ చ్ఛేదన మీభయంకరవార్తా కుఠారుతాపాతిం బూర్తియయ్యెను. వారల యాశలన్నియు నడుగంటెను. కాలముగతించినకొలది గపిలవస్తునగర వాసుల సిద్ధార్థ వియోగోద్భూత శోకావేగము మందగిల నొడంగెను. సమస్తజనుల ముఖాకృతులు బూర్వాభాసము బడయసాగెను. భ్రమాత్మకంబగు సంసారమునగల్గు సమస్త సంఘటనలు సంపూర్ణముగ మాయాపూరితములే గదా! సిద్ధార్థుని యెడగల నశ్వరంబగు ప్రేమ నశ్వరంబును దాత్కాలికంబును నగు విషాదమునే బడసెను. చెట్టొకటియు విత్తొకటియు నుండునా? క్రీస్తుభగవానులు నుడివిన వాక్యరత్న మొండిపుడు స్మృతిపథమున గానవచ్చు చున్నయది:—"నీప్ర

ఏవిత్తనము నాటుదువో యాపంటనే పడయుదువు." అగ్నిలో జేయిడినగాలును, చందనకలశమున గరమిడిన జల్లగనుండును. కర్మపరిభావంబున నుత్తమ, మధ్యమ, అధమ యను భేదంబులున్నను నాటినబీజములే లభించును. గోధుమవలన గోధుమయే ప్రాప్తించునుగాని వేరొండుధాన్యము లభింపనేరదుకదా! వ్యామోహము నశ్వరంబగుటం జేసియేకదా యద్దాని ఫలితము సహితము స్థిరత్వమును బాసినదయియున్నది.

రాజగృహారణ్య పరిసరప్రదేశస్థిత వటవృక్షచ్ఛాయయందు సిద్ధార్థుడు సిద్ధాసనాసీనుడయి, నిరంతర మవికలమగు ధ్యానముతో జగన్నియంతను గరతలామలకము గావించుకొను విశ్వప్రయత్నము, విశ్వాసపూరిత హృదయుడయి సేయనారంభించెను. నిత్య మా సుస్థిరచిత్తుండగు సిద్ధార్థుడు కందమూలఫలంబుల నమృతోపేతాహారంబు భక్షణములుగ మదినెంచి, మిక్కిలిమక్కువతో మెక్కుచు సత్యపథాన్వేషణాయత్తచిత్తుండయి యుండెను. ఆయరణ్యభూముల ననేక తపోధనులు సేద్యము సేయుచు, నాధాన్యముచే దినమునగ జీవననిర్వాహము గావించుకొనుచు, నహోరాత్రము లాయీశ్వరుని భజియింపుచుండిరి. క్వాచిత్కముగా నదీనద గభీరప్రవాహ మధ్యంబునను, నవోదిత భానుకిరణాతపంబునను, లతాగుల్మావృత సాంద్రతమ వృక్షసందోహ మధ్యస్థలంబునను, భయో

త్పాదక భీషణానల జ్వాలావృత వలయమధ్యంబునను, జర్జర పత్రాచ్ఛాదితోటజములయందును గూర్చుండి, నిమీలిత నేత్రులయి, భగవత్పాదారవింద ధ్యానతత్పరులయి యుండు సాధుపురుషులనేకుల సిద్ధార్థకుమారు డాయరణ్యముల వీక్షించెను. నిర్జనప్రదేశస్థితపర్వతకందరాంతరాళముల దపశ్చర్యల గావించు మునీశ్వరుల సహితమత డవలోకించెను. వారలందరు నిహలోకయాత్రాంతరంబు ననగా మరణానంతరము శాశ్వతానందపదవి నలంకరింప నెంచియే దారీతి జరింపుచున్నట్లు సహితము సిద్ధార్థుడు గ్రహించెను. కేవలమైహిక వాంఛలబాసినంతనే స్వర్గీయసౌఖ్య ప్రాప్తికలుగునని యా సాధుపురుషవరేణ్యులు భావింపుచున్నట్లుగూడ నత డెరింగెను. స్నాన సంధ్యావందన హోమాదుల గావించు తాపసేంద్రులను దేహదండనాది హఠయోగాచరణంబున గైవల్య పదప్రాప్తింబడయ వాంఛించు యతిచంద్రులగూడ గౌతము డవలోకించెను. అంతియేకాక సిద్ధార్థు డట సాంఖ్యవాదులను వేదాంతవాదులను సందర్శించి, వారి ధర్మతత్వముల సారాంశమును గ్రహించెను. వారి ధర్మాంతర్గత తత్వ విచక్షణానంతరంబు యుక్తవిషయంబుల స్వీకరించియు నయుక్తముల ద్యజియించియు సిద్ధార్థు డల్పకాలమునందే విశేషప్రఖ్యాతి నందెను రత్నము మేటిప్రకాశయుక్తమయి యుండుటం దత్యాశ్చర్య మదెద్దికలదు? సిద్ధార్థు డనారతము ధ్యానమ

ననాదులచే వస్తుతత్త్వము గ్రహించియు, దర్క వితర్కములచే బ్రత్యేకపదార్థముల వెలయు సారాసార నిర్ణయంబు జేసియు గాలము వ్యతీతము సేయ నుపక్రమించెను. ప్రాయికంబుగా నతడు ఋషీశ్వరుల సందర్శించి, వారివారి ధర్మముల తత్త్వాదుల విచారించి, పరిశీలించి యందెవ్వి యేవి దోషాదులున్న విమర్శింపుచు భువిపై భావష్ఠాలిత్యముల కతీతంబును, సత్య ధర్మ జ్ఞానానందమయంబును నగు నొక్క మతమును నెలకొల్ప బహుయత్నపరంపరల సేయదొడంగెను. సిద్ధార్థుడు మునీశ్వరులుసెప్పు వచనంబులన్నియు నిర్వచనంబులని బాహ్యాడంబరముల చే ముగ్ధహృదయుడయి విశ్వసింప నొల్లక, ఎల్లవిషయంబుల స్వబుద్ధిబలమను తార్కిక దృష్టిచేతను నాటినాటికి బరిశోధింపుచు సముచితంబులని గ్రహించినవాని నాచరించి విశేషలాభప్రదంబులుగ బ్రతీతమయిన తదనంతరమే ప్రజాసంఘమున కుపదేశింపుచుండెను. సత్పరిణామ దాయకంబులుకాని వాక్యములు త్యాజ్యములనియు, మహద్గ్రంథంబుల వ్రాయబడియు, వ్రాయబడుచున్నను నిందార్హంబులనియు నీచాతినీచంబులనియు, సిద్ధార్థుడాత్మయందు సిద్ధాంతీకరించుకొనియెను. తానాచరించియే రాకుమారుడు సర్వదా సహచరులకు నుపదేశింప నభ్యస్తుడయి యుండెను.

ఉపదేష్టకుండదగిన లక్షణావళులన్నియు నతని యందుండెను. ఆత్మవికాసమునకు బ్రతికూలంబు లగు విషయ

ములు వేదాదులయందున్నను, వెంటనే త్యజింపదగినవనియు నట్లు సేయనిచో మానవు డధఃపతితుడయి పోవుననియు, నెల్ల రకు దెల్లమొనరించెను. సత్యముయొక్క వాస్తవిక మార్గము నన్వేషించుటయందు విజయము లభింపని హేతువు చేనతడెల్ల వేళల మహాత్ములగు ఋషిప్రవరుల చెంతకరిగి త్రికరణంబు లకు సాధారణముగా గోచరింపని గూఢవిషయంబుల తత్వ ముల సమన్వయింపజేసికొన గృషి సలుపుచుండెను. అతడిట్లనే కమునుల సందర్శించుచు హృద్గతసందేహ సందోహ నివృత్తి కనుకూలాభిప్రాయంబుల బ్రసాదింపు డని వారిని వేడియు, ననుకూల భావంబులు లభింపనందున వారల గపటవేషధారులు గను మిథ్యాభిభూతఋషి సత్తములుగను గుర్తెరింగి వారికిభగవ దాస్తిక్యమునుగూర్చి ప్రబోధించి, మోక్షప్రాప్తికయి సత్యప థాన్వేషణము సేయుటు చితంబని నొక్కివక్కాణించెను. సంస్కా రమున కాస్కారము లేని మిథ్యావాక్కుల బరిత్యజింతుమని వా రలచే శపథంబుల సిద్ధార్థుడు చేయించుకొనియెను. అట్లనేకవిధ ములయత్నించి, సిద్ధార్థుడు సత్యమునుబడయ నూతనోపాయం బులనన్వేషింపజొచ్చెను. నూతన విషయంబుల గ్రహియింప, విశేషకాలము వ్యయమయినను విసువుజెందక గట్టిపట్టుదల తోడ గార్యమును గొనసాగించుటయం దభిరతుడయి, సిద్ధా ర్థుడు మెలంగుచుండెను. ఆచందమున వర్షపంచకము పర్యం తము గౌతము డసంఖ్యాకంబులగు మతములను వాని ముఖ్య

ధర్మములను నిష్పాక్షికబుద్ధితో శోధించుటయందే గడపెను. తత్పంచవర్ష ప్రవాసకాలమునందు సిద్ధార్థుడనేకనరుల బ్రచలితధర్మముల సాంగోపాంగముగ విచారించుచు, ప్రాపంచికుల యాచార వ్యవహారముల నాధారముగజేసికొని సంస్కార కార్యోన్ముఖుడగుటకు యత్నించెను. తత్సమయంబుననున్న యాచారవ్యవహారంబుల నెన్నింటినో బూర్వపక్షము గావించెను. కేవలము లోకమందలి యాచారముల నవలోకించినంతనే విశ్వసింపరాదనియు, సర్వేశ్వరప్రదత్తంబగు వివేచనాబలంబున వాని లాభాలాభంబుల గ్రహింపవలయుననియు సిద్ధార్థుని యూహ "వినదగునెవ్వరుసెప్పిన, వినినంతనె వేగపడక వివరింపదగున్" అను నార్యోక్తి సిద్ధార్థుని వాక్యములయెడ సార్థకమయ్యెను. సిద్ధార్థుడు సంసారములో సత్యాసత్యవిచక్షణమును, కర్తవ్యాకర్తవ్య వివేచనంబును జేయువారే లేరనియు, సమస్తజనులు పామరులు మొదలుకొని పండితులవఱకు నంధ విశ్వాసజనితప్రభావంబున జగమున వ్యవహరింపబడు నాచారవ్యవహారములనే గ్రాహ్యములనియు, ప్రాపంచికుల స్థూలదృష్టికగోచరంబులగు సమస్త విషయములును నీతిదూరములనియు, ముక్తిభంజకంబులనియు భావించుచు నికృష్టాచరణయుతులయి, సంచరించుచుండుట గాంచి కడు వగచెను. అత్యంత సూక్ష్మదృష్టితోడను, నిష్పాక్షికబుద్ధితోడను సిద్ధార్థుడు జగత్ప్రచలిత మతాంతర్గత సత్యా

సత్యముల నిర్ణయించుటయే యభ్యుదయమునందనాకాంక్షించు
యెల్లరిధర్మమని గ్రామీణులకు బోధించెను

అతడు సర్వకాల సర్వావస్థలయందు ఖ్యాతివహించిన
వారినెల్లరిని దర్శించి, వారిభావంబుల గ్రహించుకొని నిజభావంబు
లతో సమ్మిళితము గావించుకొని, విచారింపుచు దనకార్య
మును జక్కబెట్టుకొన నెంతయు బ్రయత్నించెను. గౌతముడు
పన్యాహారమునే ప్రాయికంబుగా నారగింపుచు, సమయ మరు
దెంచినపుడు; అనగా గ్రామముల నుపన్యసింప జేరినపుడు మధు
కరవృత్తిచే నుదరపోషణము గావించుకొనుచుండెను. తఱచు
సిద్ధార్థుని మనోభావప్రవాహ మన్యవిషయములదిక్కునకు
నకు బ్రవహింపక సంతతము సౌమ్యగతిని బరమేశ్వరచరణ
కమలధ్యానమువైపునకును, అధ్యాత్మికతత్వ విచారణమ
వైపునకును బ్రవహింపుచుండెను. అత డొకించుక సమయము
నిత్యము ప్రాతస్సాయంతనములు నేకాంతస్థలమున గూ
ర్చుండి, యాందోళిత హృదయంబులకు నుపశాంత్యోపలబ్ధిం
గల్గింపజేయ గృషి సేయుచుండువాడు. అట్టి నిర్మల క్రియా
చరణంబులే యాదివ్య మనస్సంకల్పాత్మునికి హృదయాహ్లాద
కరము యుండెను. ఎన్నికార్యంబుల సేయుచుండినను, సుఖ
శాంతుల కెయ్యది సత్యమార్గమో యట్టి సన్మార్గము నన్వే
షింపవలసిన కార్యభారము నతడు స్వప్నావస్థయందయిన
విస్మరించి, కార్యరూపంబునగాక పోయినను, భావరూపంబున

సయిన ధర్మచ్యుతుడు కాలేదు. సంతతమతడు ప్రపంచదుస్థితి కయి వగచుచు విచారించుటవలన ప్రయోజనము సుంతయు లేదని గ్రహించినవాడయి యానందమార్గమునుగను యత్నము నందే తవిలి యుండెను. నిశ్చల చిత్తులును, దృఢసంకల్ప విరాజితులును సాధారణ మానవ భావాతీత కార్య ధౌరంధర్య సమన్వితులును, సాహసోచ్ఛృంకర సమానులును నగు మహాత్ములన న్నిట్టివారేకదా! సిద్ధార్థకుమారుని నాగరహితర్థంబగు వా భక్తిజ్ఞాన వైరాగ్య సంపదల యనుమాన మహత్వమును సంకీర్తనము సేయ సహస్రముఖునికయిన వశము కాదుగదా ? పురుషోత్తముండన నతడుదక్క మరొక్క డాకాలమునందు లేకయుండెను. చరిత్రనాయకుని పవిత్రగుణగణముల జితించి స్వయముగ జరిత్రకారుడే సంస్తుతించుటకంటె గుణగ్రహణ పారీణులగు పాఠకమహాశయులే చరితాంతర్గత సత్యాసత్యములు గ్రహించి చరిత్రనాయకుడు స్తవనీయ గుణభూషితుండేయని స్ఫురించునెడల నతని సద్గుణ సంస్తవము సేయుచు నాచరించుచు చిత్తశాంతి నిబడయుట శ్రేయోదాయకము. గుణహీనుడో బండితుడొక్కరుండు సంస్తుతించినంత మాత్రమున వివేకాజ్ఞానవిరాజితంబగు విశాలవిశ్వ మట్టికృతిమ స్తోత్రములు విశ్వసింప గడంగునా. అర్యోక్తి యున్నదికదా !

"వాణీ మమైవసరసారంజయితి, నపార్థయే రసవిధావధానదానం । సాయంతనేషు మకరందతీషు భృంగాః కిం మల్లికాసు పరమంత్రణ మారభన్తే॥"

గీర్వాణభాషాకవీశ్వరుడు సెప్పిన యుక్తియెంతయు సార్థకమయినది. సరసకవిత్వమును గాంచి సహజముగనే రసికజనమండలి యానందపారవశ్యమును జెందుచుండుగను, బాలప్రభాకరాగమనంబున దోయజసంఘము వికాశభాసురంబగుభాతియు, బవిత్రచరిత్రధన సంపన్నుండగు సత్పురుషుని స్వాభావికంబుగనే మానవ ప్రపంచము స్తుతియింప నారంభించును. వన్నె లేనిదానికి గృత్రిమంబగు వన్నెను గల్పించినను నయ్యది స్థిరముగా రక్షింపబడజాలదు. కనుకనే గుణావగుణ నిర్ణయభారంబును బాఠకమహాశయులకే వదలివేయుచున్నాను. మహాత్ముండని భావించు నొక్కసద్వ్యక్తి సద్గుణముల భూషించుటయందే సమయమును వినియోగింపజేయుట కంటె దన్మహాత్మునిదివ్యప్రబోధ వాక్యముల మనోవాక్కాయకర్మల భేదము సుంతయును గలుగనీయక యాచరించు టెంతయు లాభప్రదంబు. పాఠకబృందమునకు, నందును విశేషించి ప్రపంచకర్మక్షేత్రమున రేయనక బవలనక కృషిచేయు బాధ్యతను గల్గియున్న యువజన సంఘమునకు, సచ్చరిత్రకథన సంజనిత దివ్యాభిలాషయే మోక్షమంది రారోహణమునకు బ్రథమసోపానమగును. సంసారములో మహత్కార్యముల గావించి భావాతీతంబగు శక్తిచే నద్వితీయంబగు విజయమును బడసిన యవతార పురుషాగ్రేసరుల దివ్యరూపముల బుధ ప్రపంచమునకు దర్శింప జేయగల సామర్థ్య మొక్క చరిత్రయందే కలదు.

మహాపురుషుల జీవితచరిత్రములు దేశ చరిత్రముల యొక్క యంతర్భాగములయి యుండి, భూతకాలము యొక్క సర్వాంశములను, ఆచారవ్యవహార జ్ఞానవిజ్ఞానముల జూపింప బవిత్రితమంబగు దర్పణమయి తనరారుచుండును. సచ్చరిత్రలేఖనమే మానవాభ్యుదయమునకును, స్వర్గీయసౌఖ్య ప్రాప్తికిని, దేశౌన్నత్యమునకును, సత్యజ్ఞాన యుక్తంబగు నైహికాముష్మిక ధర్మజీవిత నిర్వహణమునకును హేతుభూతంబగును. మహాపురుషుల జీవితచరిత్రల బుణ్యాంశములే ప్రణపథ్యానము నాలకించు కర్ణపుటముల బడకయే యున్నచో మానవప్రపంచ మల్పకాలమునందే నిజోన్నతిని గోల్పోయి, జ్ఞానశలాస్యవశిష్టమయి, రసాతలంబున కరుగగలదన్న నాశ్చర్యము సుంతయు నుండబోదు. సచ్చరిత్ర పఠనసంభూతోత్సాహాదేకముల నుండియే సాధారణమానవశక్తి కతీతంబగు కార్యకరణ పాటవము సులభముగనే లభ్యమగును. చరితమే హృదయమున డాగియున్న యిచ్ఛాశక్తిని జాగృతము గావింపగల సామర్థ్యము గల్గియున్నది. సచ్చరిత్ర మహిమాతిశయమును వర్ణింపబూనిన వేఱే మఱొక్క గ్రంథమే సిద్ధముకాగలదు.

భక్తిజ్ఞానయోగ సాధకుండగు సిద్ధార్థుడు, బింబసారనరనాథుడు.

ఒకానొకదివసము సిద్ధార్థుడు రాజగృహారణ్య ప్రాంత భూముల గ్రుమ్మరుచు గోపాలురు కొందఱు గొఱ్ఱెలమంద నొకదాని నాయటవీపరిసర మార్గంబున దోలుకొనిపోవుచుం

జుట గనెను. దీర్ఘప్రియాణము సలుపుచు వచ్చియున్న హేతువుచే నామందయందలి యల్పప్రాయముగల గొఱ్ఱె పిల్లయొక్కటి నడువశక్తిలేక, దుఃఖితస్వాంతముతోడ మాతృదేవి వెనువెంటనే యతిమందగమనమున జనుచుండెను. కుంటుచు, నతిదీనవదనముతో వెంటనరుదెంచుచున్న బిడ్డబాధను గాంచి, మాతృకయగు నామేషి, కడునారినొందు, "సర్వభూత దయాపరుండవగు నోసర్వేశ్వరా!" నాకీసంకటావస్థయందు సల్పసాహాయ్య మొనరించి నాబిడ్డను సంరక్షింప, యుష్మత్ప్రేషిత జనులెవ్వారును లేరా?" యని విలాపము సేయుచున్నదో యన్నరీతి మెడ బైకెత్తి, హీనకంఠస్వరంబున నడలుచు, బాటప్రక్కనే సౌమ్యస్వరూపుడయియున్న సిద్ధార్థునిదిక్కున కతిదైన్యదృష్టితో వీక్షించెను. సిద్ధార్థుడా కరుణాజనకంబును, హృదయపాషాణమును ద్రవీభూత మొనరించు దైన్యదృశ్యము నవలోకించి, హృదయభాండమునుండి కరుణారసము పొంగి పొరల, గరద్వయమ్ము నొక్కుమ్మడి జాచి, యాదీనశక్తిహీనమేషశాబకమును నవలీలగ మూపుపై నెత్తుకొని, దీనమేషివెనువెంటనే నడువదొడంగెను. గోపాలురాయద్భుతకృత్యము వీక్షించి చకితస్వాంతులయి, సిద్ధార్థ నదియేమని పృచ్ఛింప, నిర్వ్యాపారులయి వృథాగా నమూల్యసమయమును దుర్వినియోగము సేయుటకన్న నత్యంతదుఃఖము ననుభవింపుచున్న జీవకోటికి దుఃఖోపశాంతిని గల్గించుట

కయి పరిశ్రమసేయుటయే మానవులకు యుక్తధర్మంబనియు నడువశక్తిలేక నెదగుందు మేషశాబకమున కుచితసాహాయ్యము జేయుటయే తన ప్రకృతధర్మంబనియు నిశ్చయించుకొని తా నట్లాచరింపు చుంటిననియు నందుల కనుమ్మతిని దెలుపవలదనియు వారలతో నుడివెను. ప్రచండ సూర్యాతపంబున కోడి, నడువలేక గష్టింపుచున్న యా గొఱ్ఱెల దీనావస్థ నుపలక్షించి, డెందమున గొందలమంది, సిద్ధార్థుడా గోపకుల నీప్రకార మత్యంత మృదు మధురంబులగు వచనంబుల బృచ్ఛించెను :— "నాప్రియభ్రాతలారా! మీరీతీక్ష్ణ సూర్యాతపంబున గొఱ్ఱెల బాధించి, నిర్దయహృదయులయి యేల తోలుకొనిపోవుచున్నారు? గోపకులెల్లరు సాధారణముగా బ్రచండపుటెండలో జీవముల కత్యంతాయాస మొదవునని గోధూళివేళనే గొఱ్ఱెమందల స్వగృహములకు మఱలించుకొనిపోయెదరు. మీరెందుల కిట్టికాలప్రయాణము సేయుచున్నారు? ప్రతికార్యమునకు సమయాసమయంబులుండ నవ్యాహత శక్తియుక్తులముగదాయని వికటముగ వ్యవహరింపదగునె?" తామొనరించు కార్యం బయుక్తంబనియు, నట్లు సేయరాదనియు నపేక్ష జేయుచున్న సిద్ధార్థకుమారు నాలోకించి, విలక్షణవచనంబుల సిద్ధార్థున కీ దిగువ ప్రత్యుత్తర మొసంగిరి:— "సాధుపురుషావతంసమా! మేమీగొఱ్ఱెల స్వగృహములకు మఱలించుకొని పోవుచుండుటలేదు. ఈ విశాల

సామ్రాజ్యమునకు జక్రవర్తియయిన బింబసారుం డొక్క క్రతు
వునేయ సమకట్టి, తత్క్రతునిమిత్తమయి, బలిదానమునేయు
మమ్ము నూరు మేకలను, నూరు గొఱ్ఱెలను శీఘ్రము గొనిరా
నాజ్ఞాపించియున్నాడు. మాభూపాలునకు బశుమాగణమునం
దెక్కుడుమక్కువ. అదియునుగాక మాయారాధ్యదేవతలే
స్వయముగ, బశువుల నాహారముగ గోరుచుండును. ఏతద్ధే
తువుచేతనే, భావిసౌఖ్యమునుసహితము నపేక్షించు మేము
పశువధకియ్యకొంటిమి. ప్రస్తుతము మేమీమంద నాభూపాలు
నిచెంతకే తోలుకొని పోవుచున్నారము. రాజశాసనమును,
దైవశాసనమును దప్పింప నెవ్వారితరము?"

మేషపాలకుల యా జ్ఞానదూరములగు వచనముల నాల
కించి సిద్ధార్థు డతిశయ విషాదపరీతచిత్తుడయి వారితో నిట్లని
యెను:—"అన్నలారా! నేనుగూడ మీతోడనే యాబలి
వెట్టు స్థానమున కేతెంచెదను. దయాంతరంగులరయి మీరలీ
యీనావచనంబుల కంగీకృతిని దెల్పుడీ." గోపకులావాక్కులకు
సమ్మతింప, సిద్ధార్థుడు హర్షితస్వాంతుడయి, యా మేషశాబక
మును భుజములపై భద్రముగా నిడుకొని, తన్మాత వెనువెం
టనే గోపకులాశ్చర్యము జెందుచుండ నడువజొచ్చెను. దీర్ఘ
కాలపర్యంతము సిద్ధార్థు డాచందమున భాస్కర తీక్ష్ణాతపం
బున ధూళిధూసరితకాయుడయి, స్వేదబిందుకణ సందోహము
గాత్రముపై మౌక్తికములవలె మిలమిల మెరయుచుండ, మేష

శాబక వాహకుడయి, రాజపథము ననుసరించెను. సమస్తలోక హితకరుండగు దినకరు డుదయాద్రికి సమ్ముఖంబున విరాజిల్లు నస్తగిరి కేగు సమయంబునకు మంద మలయానిలము స్వాగత మొసంగుచుండ, వారందరు బింబసారభూపాలుని పురమును బ్రవేశించిరి. భుజములపై మేషశాబకము నిడుకొని పుర మధ్యభాగంబునుండి యేగు సిద్ధార్థుని సౌమ్యస్వరూప దివ్య ప్రభలగాంచి, తన్నగరవాసు లత్యంతాశ్చర్యసాగరనిమగ్నులు కాజొచ్చిరి. పశుమారణ కార్యోచిత కలాకుశలులగు నా నగర వాస్తవ్యులందరును సుందరాకారుడగు సిద్ధార్థు డెందుల కా యస్పృశ్యంబును, పథార్హ్మణంబును నగు నీచపశువును మోయుచున్నాడా యని యబ్బురపడ దొడంగిరి. రాకొమరుని విలక్షణ కార్య సందర్శనాపేక్షాపరులగు పౌరులనేకులు గుంపులు గుంపులుగా గుమిగూడి, యాతనిపొంత కరుదెంచుచుండిరి. క్షణమాత్రకాలమున నసంఖ్యాకులగు స్త్రీ పురుషాదులు మేషశాబకవాహకుండగు బాలసన్యాసి యొక్కరుడు నగరమధ్య ప్రవేశమునకు వచ్చెనని కర్ణాకర్ణికగ నాకర్ణించి తండోప తండములుగా నేతెంచి రాకుమారుని జుట్టుముట్టిరి. సిద్ధార్థుని యలోకసామాన్యంబును సౌమ్యంబును నగునవోజ్జ్వల ముఖమండలము నవలోకించి, నిర్విణ్ణులై కొందఱతని భూలోకమున కవతరించిన కరుణాసాగరుండగు సర్వేశ్వరుండనియు, గొందఱు పర్వతప్రాంతములదపమాచరించు ఋషిసత్తముండ

నియు, మఱికొంద ఱతడు మొట మొన్న నే సన్యసించిన రాజనంద నుండనియు బలువురు బహుభంగుల బరస్పర సంభాషణములు గావించుకొన దొడంగిరి. క్షణమాత్ర కాలంబున, వేడ్కతో విచిత్ర దృశ్యము నవలోకింప బరుగెత్తినచ్చు బాలకులరీతి బ్రజాసంఘమంతయు గట నేకత్రితమయ్యెను. అటకేగుదెంచిన వారిలో గొందఱు భూపాలసన్నిధికేగి, మీరు దేవతార్చన మునకై తెప్పించుచున్న గొఱ్ఱెలమందతో, వన్యభూముల దప మాచరించు బ్రహ్మతేజ స్సంపన్నుండగు నొక్కఋషివర్యుడు సహితము మనపురంబున కేతెంచియున్నాడు. అతని యనూన మహత్తర తేజోవిలసితం బగు మూర్తి దర్శనీయ మయియున్న దని విన్నవించిరి. యజ్ఞకార్య ప్రారంభమునకింకను రెండుదిన ముల సమయమున్నదనియు విచారింప బనిలేదనియు నెంచి, భూపాలుడు సిద్ధార్థుని సభామందిరమునకు గొనిరా నిజసచి వోత్తము ననిపెను. రాజాజ్ఞ నాలకించి, రాకుమారు డానం దించి సచివోత్తముని వెంట సభామందిరమున కరిగెను.

సభామందిరమున భార్గవాశ్రమమునుండి యేతెంచి, భూపాలుని మఖకార్యమును నిర్వహింప దపశ్శాలి యొకండు రాజగృహమున వేచియుండెను. భూపాలు ననుజ్ఞచే సిద్ధార్థు నతడిట్లు ప్రశ్నింపగడగెను :—

సాధుపుంగవా ! తమరెవ్వరు ? ఎటనుండి యెట కరుగు చున్నారు ?

సిద్ధా :—అయ్యా! నేనొక సాధువును, సత్యపథాన్వేషణ కార్యపరతంత్రుడను, సంసార పరిత్యాగినగు వియోగిని. అటవీప్రాంతమునుండి భూపాలుని దర్శింప నిటకేతెంచియుంటిని. అరణ్యకుల మిథ్యామార్గముల ననుసరించు కపట యోగులను, మూఢులగు తాపసులను వీక్షింప నామనము వ్యాకులతను జెందియున్నది. మీరునహిత మా తాపసుల పద్ధతి ననుసరించు వారలా యేమి ?

తాపసుడు :—అయ్యా, మీ భావముల యర్థము నాకు స్పష్టమయినది. బాహ్య సంస్కారముల వలనను, శరీర పీడనమునను, యోగాచరణంబునను ముక్తి లభ్యము కాదని యా మీ యూహ? తమరు భ్రమపడుచున్నారు. తమకింకను యోగానుభవము లేదనియే తెలుపవలసి వచ్చినందుల కెంతయు జింతింపుచున్నాడను. దేహదండనాది యౌగికక్రియాచరణంబున ముక్తి యవశ్యము లభింపగలదు.

సిద్ధార్థుడు :—స్వర్గప్రాప్తి నిమిత్తము మనుష్యుడు దుఃఖపరంపరల ననుభవింపదగునా? సుఖప్రాప్తికి దుఃఖమే మూలమా? దేహము శుష్కించుటవలన గల్గునది దుఃఖమే గాని సుఖమెట్లు లభింప నేర్చు? సుఖమున్న స్థానమందే దుఃఖము సహితము వెలయుచుండుట నైసర్గికము. సుఖదుఃఖములు రెండును నలినాభావసంబంధమును గల్గియున్నవి. స్వర్గము

గా దండనాది యోగికక్రియలవలన గురుతర కష్టానుభవంబు ను, కోమలశరీర శోషణంబునుదక్క వేరొండు ప్రయోజన ము శూన్యము. మానవప్రపంచ మనుచితకార్య పరతంత్రి మయియున్నది. నిస్సందేహముగా సృష్టి యగణితదుఃఖముల ననుభవింపుచున్నయది. కారణము, యోగు లనువారు సత్య ధర్మజ్ఞాన దూరులయి, వికటమార్గము ననుసరింపుచున్నారు. అరణ్యప్రాంతముల వసియించు సమస్త మౌనీంద్రులను యో గాభ్యాసంబుననే మోక్షప్రాప్తిం బడయ నభిలషింపుచున్నట్లు నేనుగ్రహించితిని. అట్టివా రనాతరము ముక్తిమార్గమునకు దూరులగుచునే మనుచునుందురని నాతలంపు. వ్యర్థములగు ప్రయత్నముల సలుపుటకంటె గర్తవ్య శూన్యుడయి మౌనము ద్రినువహించియుండుటయే హితకరము. రాజసభామందిరమున నాసీనుడయియున్న యొక్క జ్ఞానిసత్తముండగు గృహస్థుడు సిద్ధార్థుని దివ్యప్రబోధవాక్యముల నాలకించి యతిప్రసన్ను డయి యిట్లు నుడివెను. దివ్యపురుషా! బాహ్యాడంబర విరహి తా! ఆత్మసంస్కారప్రియా! ప్రాయమునం దధికుడయిన యీదాసుడు నీకు బ్రణమిల్లుచున్నాడ. అల్పప్రాయమునందే మోక్షసామ్రాజ్య ప్రవేశోచితలక్షణంబుల నెన్నింటినోగుర్తె ఱుంగ సమర్థుడవయితివి. ఇంకను జ్ఞానాంశముల గుర్తెఱుంగ కృషిసేయు చున్నాడవు. ఇం దావంతయు సందేహము లేదు. మోక్షాపేక్ష గల్గినవ్యక్తియే యారాధ్యుడని నాతలంపు. సాం

సారిక సుఖాపేక్షచే దేహదండనాది యోగికక్రియల నాచరించు నతడే మహామూఢుడు. సాంసారిక సుఖాన్వేషణంబున, శాశ్వతానందప్రాప్తి తలక్రిందుగ వేయివత్సరములు తపమాచరించినను బ్రాప్తించుట కడుదుర్లభము." సిద్ధార్థు డావృద్ధగృహస్థుని సాత్వికవచనంబుల కుల్లము పల్లవింప ముఖారవింద మానందప్రకాశముచే నుద్యోతింప మౌనము వహించెను.

సాంసారిక భోగపరతంత్రుడును, మూఢభక్తిపరాయణుండును నగు. బింబసారభూపాలు డంత సిద్ధార్థునిచెంతకేతెంచి సమీపమునందున్న సుఖాసనంబున నాసీనుడయి యిట్లు పృచ్ఛించెను :—"మహాశయా! తమయొక్క ప్రకృతి యుత్తమస్థితియందున్నయదా?

సిద్ధార్థుడు :—భూపాలా! మామకంబగు శారీరక పరిస్థితి సరిగనేయున్నది. నన్ను దమరొక వ్యాధిగ్రస్థునిగ భావించుచుంటిరా యేమి?

భూపా :—సాధువేషధారివగు నోభూపాలతనయా! నీవృత్తాంతమునంతయు మిత్రులవలన దెలియగల్గితిని. శుద్ధోధన భూపాలునిముద్దుబిడ్డడవగు సిద్ధార్థకుమారుడు నీవేయను సంగతియునాకు దెలియనిదికాదు. నీ యీకోమలదేహము సృష్టియందలి సమస్తసౌఖ్యానందముల విసర్జించి దుఃఖబంధనముల చే బంధింపబడుట కర్హమయినదికాదు. నీయీయల్పప్రాయము వనవాసయోగ్యము కాదుసుమా! నీ వీరీతి దేహవికాసమును

క్షీణింపజేసి, ఆయుర్వృద్ధిని బడయ యత్నించుటకు మారుగ, సంసారసౌఖ్యముల నిరసించుట శ్రేయోదాయకముకాదు. వివేకదూరుడవయి, సర్వేశ్వర కృపచేతను, శుద్ధోధనుని నిత్యారాధనంబునను బ్రాప్తించిన సువర్ణతుల్యంబగు నీ దేహమును ధరాగత మేల సేయుచున్నాడవు? శీఘ్రమే స్వగృహమున కరిగి, నవనీత సదృశ కోమలంబును, సుస్నిగ్ధంబును నగు నీ దేహమును బోషించుకొనుచు, సంసార సౌఖ్యాంబుధిం దేలియాడు చుండుము. స్వగృహంబున కరుగ లజ్జింపుచున్నచో మన్నికేతనమునందే, సౌఖ్యానందముల ననుభవింపుచు గాలయాపనము సేయుచుండుము. వలయునన్న నాచే బరిపాలింపబడు ధరావలయంబున నర్థభాగము నుచితముగ గైకొని, హాయి ననుభవింపుము. నీదగు మనోజ్ఞమూర్తి నాహృదయమును ముగ్ధముగావించివైచినది. భోగానుభవంబున కియ్యదియే యనుకూలంబగు శుభసమయము. నిరర్థకంబులగు సమస్యలకు వశీభూతుడయి, యన్యదుర్లభంబులగు భోగంబుల దృణీకరించునంతటి యవివేకి యెవ డీజగతీతలంబున నుండనేర్చును? సుఖమును వర్జించి, దుఃఖమును వరించువాని నేమనగవలయును? సిద్ధార్థా! నీయందు నాకు శుద్ధోధనునికంటె వేయిమడుంగు లెక్కుడు వాత్సల్యము కలదు. అందువలననే నీకింతగా బోధింపవలసి వచ్చినది. జగమున భ్రష్టులయిపోవువా రెందఱు లేరు? కాని వారితో నాకు నిమిత్తమేమి? త్వదీయ తరుణావస్థ నతిక్రమింప

నిమ్ము! యౌవనావస్థయందు మన్మథుడు మన చిత్తసీమల నిరంతరము విహారము సేయుచుండును. ప్రతిమనుజుడును ప్రకృతి సిద్ధాంత ప్రభావంబున యుక్తప్రాయము లభ్యమయినంతనే ముఖ్యముగా గామమునకు వశుడయి సాంసారిక సౌఖ్యానందముల బడయవలసియే యుండును. కామప్రభావయుక్తంబగు తరుణప్రాయమునం దాచరింపడు సమస్తవిధ వైరాగ్యములు వృథయే యగును. ఎన్నివిధముల బ్రయత్నించినను బ్రకృతికి విరుద్ధముగా జరించి యువకుడు స్వేంద్రియములపై నాధిపత్యమును వహింపజాలడు. ప్రాయికంబుగ వాని స్వభావంబగు చలనము వ్యక్తిని బ్రహ్మచర్య నిష్ఠనుండి పతితుని గావింపుచునే యుండును. మద్వాక్యములు నిరర్థకములు కావనియు, సార్థకంబులనియు గ్రహించి శీఘ్రమే దృఢసంకల్పమును బహిష్కరించి హితమును బడయుము. శాస్త్ర సిద్ధాంతములను సహితము బాల్యావస్థయందే ప్రతివ్యక్తియు నేర్వవలసి యుండును. తరుణావస్థయందు నవోత్పన్న కాంక్షల సఫలీభూతములు గావింపుచు, ధర్మార్థ కామమోక్షదాయకంబగు విద్య నార్జింపవలయును. సృష్టిక్రమమును భంగమునుండి సంరక్షింప బ్రతిమానవుడు నుత్తమ సంతానము నుత్పన్నము చేయవలసియుండును. కాన నో రాకుమారా! యౌవనావస్థయందు నీచే బ్రారంభింపబడిన కార్యము నెరవేరునన్న స్వప్నవార్త. నీ యుద్దే

శ్యములు ఫలింపనేరవు. నీవిపుడు చేయుకార్యము వృద్ధావస్థ యందాచరింపబడుచో నిర్మలానందప్రాప్తి కలుగనేర్చును. అట్టి స్థితియందు నీధర్మము దివ్యప్రకాశంబున వెలుంగును. నీ యీ యవస్థ యొక నూతన వృక్షమును బోలియున్నది. నీ విపుడు వహించియున్న భార మమోఘము అల్ప ప్రాయముగల యామ్రవృక్షం బెట్లు యేండ్లుగతించిన వృక్షముమాడ్కి ఫలభారంబు వహింపనేర్చు? సమస్తవిధానుభవజ్ఞాన సంపన్నుండగు వృద్ధుడు వహింపవలసిన కార్యభారమును ననుభవజ్ఞానదూరుడవును, తరుణవయస్కుండవును నగు నీవు వహించి, బేలవయి యేల పతితావస్థను జెందెదవు? నా మాటల బాటించి సదనోన్ముఖుండ వగుము. గురుజన కథనానుకూలంబుగ సంచరించు తరుణుడే సుఖించును. గురుజనులవాక్యముల నాలకింపని యువకుడు పురాణవైరాగ్య ప్రభావంబున ననుచిత పథానుగామియయి, కార్యానంతర విషమపరిణామ సందర్శనంబున దుఃఖాక్రాంత స్వాంతుడయి నిర్జీవప్రతిమవలె శేషజీవితకాలమును గడుపగలడు. అల్పవయస్కులు దీర్ఘకాలము నుండి, సంసారతత్వానుభవమును బడసిన నధికప్రాయుల వచనముల నాలకించి, తదనుకూలంబుగ నాచరించుటయే యుక్తమని ధర్మశాస్త్రగ్రంథములు ప్రబోధింపుచున్నయవి. పెద్ద లాజ్ఞాపించు చందమున వర్తించు పిన్నల దుఃఖము స్వప్నమందయినఁ స్పృశించుటకయిన సాహసింపజాలదు. మోక్షప్రాప్త్యభిలాష

యున్నచో భిక్షాటనము బాసి, సాధువేషముల రోసి, యజ్ఞ యాగాదుల జేయుచు రారాజువయి యష్టైశ్వర్యంబుల ననుభవింపుచు గృతకృత్యుడ వగుము. ద్వారద్వారమున కరిగి మూల్యములేని యల్పాహారము నార్జించుకొనజూచుటచే జీవితమంతయు వృథయగును. భిక్షాటనము దరిద్రులయెడనే శోభించునుగాని త్వాదృశ రాకుమారులయెడ రాణింపదు. కేవల మీవృత్తి నీశ్వరుడు వికలాంగుల నిమిత్తమే విధించియున్నాడు. రాకుమారుడవగు నీవు భిక్షనెత్తుకొనుట కెంతయు గడునింద్యము. సమస్తవిధముల నీవు భగవదుద్దేశములకు భిన్నముగా వర్తింపుచు నిర్వాణమును బడయ వాంఛించుటెంతయు హాస్యాస్పదమగును. ఈ నీయల్పప్రాయము భయంకర ఘాతుకమృగావాసంబులగు సాంద్రారణ్యముల దపమాచరింప నర్హమయినది కాదని యుప్పటికయిన గ్రహింపుము. సృష్టితత్వరహస్యభేదన జ్ఞానప్రాప్తికలుగుదనుక సంసారమును బహిష్కరించుటకు దగు నర్హత నీకు లభింపజాలదు. అంతపర్యంతము ననగా జ్ఞానమునం దనుభవసిద్ధమయిన పూర్ణత్వము లభ్యమగునంతపర్యంతము, విరక్తభావంబులకు మదియందు దావునీయరాదు. మదీయ భుజబల పరాక్రమ సంపాదితంబగు మగధదేశమును బరిపాలింపుచురమ్ము. సకలైశ్వర్యములబడసి, దేవేంద్రవైభవముతో జీవితమును గడుపుము. భక్తిజ్ఞానవైరాగ్య సంపాదనాసమయ మేతెంచినపుడు నీవు

గృహమును బరిత్యజించి యథేచ్ఛం జనవచ్చును. తత్సమయం
బున నిన్ను నిరోధించువా డెవడును నుండడు. దివ్యముగా
ప్రవహింపుచు సమీపమునందున్న పదార్థముల విధ్వంసము
గావింపక, సాగరదిశకు స్వేచ్ఛగా నేగు నదీనదముల నెవ్వరు
నిరోధింప నభిలషించును? వక్రగమనంబున బ్రవహింపుచు,
సన్నికటవస్తువినాశనము గావించుతరంగిణీప్రవాహవేగమును
నిరోధింప సమస్తజనులు ప్రయత్నము సేయుచుందురుగదా?
ప్రస్తుతము నీచిత్తము తరుణప్రాయ సంభూత కామో
ద్రేక పూరితమయియున్నది. కామభావప్రవాహమును ని
రోధింప యత్నించుటవలన హాని కల్గును. దానిసమయ మే
తెంచినపు డదియే సహజముగ వక్రగమనము నుడిగి సాత్విక
గమనంబున బ్రవహింప నారంభించును. లెమ్ము! పొమ్ము!
గృహమున కరిగి పూర్వాశ్రమ పద్ధతుల దిద్దుకొనుము.

రాకుమారుండగు సిద్ధార్థుడు బింబసార భూపాలుని
పరిగల్భములను, శుష్కవచనంబులను నాలకించి, యతనియ
దూరదృష్టికిని, నవివేకభావపూరిత సంభాషణమునకును
ఖిన్నుండయ్యెను. అతనికి దక్షిణాలమందలి సమస్తరాజన్యుల
బుద్ధిబలపాటవం బెట్టుండునో సుస్పష్టమయ్యెను. అంత
నతడు క్ష్మావల్లభు నవలోకించి యీరీతి బ్రత్యుత్తర మొసంగ
నారంభించెను :—"భూపాలావతంసమా! నాహృదయభావ

ము పటుత్వవిహీనమయినచో, నాసంస్కారము చిత్తసం బంధమయినది కాక బాహ్యశరీర సంబంధమయినదే యగుచో నా భావమందిరభిత్తికల పరిపక్వ ప్రవృత్తి కానిర్మితోపలసమన్వి తములే యగుచో, నాహృదయసంకల్పము పురాణ వైరాగ్య సంజాత భావోద్రేక స్వరూపమే యగుచో, భవద్వాక్యంబు లన్నియు సంపూర్ణముగ నాయెడ సార్థకంబు లేయగును. మీరు భావించునంతటి హీనస్థితియందు నేను లేననియె రూఢిగ విశ్వ సింప బద్ధాంజలినయి వేడుచున్నాడ. మీవాక్యంబు లన్నియు నాయెడ నిరర్థకములె. నేనొకతూరి దృఢసంకల్పచిత్తుండనయి విషయవాసనాజాలమును త్రికరణశుద్ధిగ బరిత్యజించితిని. మానవుడనయి యుండియు, నికృష్టంబనియు త్యాజ్యమనియు గ్రహించి పరిత్యజించిన ధర్మము నెట్లు తిరిగి స్వీకరింపగలను? విషయభోగమునిరంతర దుఃఖానలజ్వాలాసమావృతంబు; సార హీనము. విషయ వాసనా యుక్తుడగు మానవుడు సుఖమునకు మారుగఘోరదుఃఖపరంపరలకు జిక్కి, డెందమున బెద్దగ గుం దుటనిక్కువము. విషయవాసనాభాండము పూర్ణమయి యొక్క సారిబ్రద్దలయి, దుఃఖోత్పత్తికి హేతుభూతమగును. ఆవిషయ వాసనాభాండమే నిండనిచో వ్యక్తికి మనస్తుష్టియే లభింప జాలదు. విషయవాసనాసంపన్నుం డగు మనుజుడు సమస్త విధముల ఖేదపరితాపములచే బాధింపబడుచుండును. విషయ వాసనయను శబ్దము యొక్క స్వరూపము మహాభయంకరమ

యునది. మోహము సర్వదా దుఃఖము యొక్క మూలాకృతి యయి విరాజిల్లుచున్నయది. ఇయ్యదియే బహుదుర్లభంబగు మానవజీవితమును ధరాగతము సేయును. దీనిస్వభావమఃతిదారుణము.

శలభ మేరీతి దివ్యమగు దీపజ్యోతి యెడ నిర్మలభక్తిని గల్గియుండి, నిత్య మద్దానిచుట్టును దిరుగుచు, తుదకు దానియందే దగ్ధమయి, నికృష్టంబగు మరణమునకు గుఱియగుచున్నదో, అదియే చందమున మానవుడు విషయవాసనాజాలమున జిక్కి, దగ్ధమయిపోవుట యథార్థము. శలభము అగణితంబులగు కష్టముల సహించియు, నిండుభక్తిచే బ్రకాశించియు, సహసశీలతను గలిగియుండియు నంతమున కేచందమున ననాథయయి మరణించుచున్నయదో అదియేప్రకారముగ విషయతృష్ణకాధీనుడయి యున్నవ్యక్తి తాత్కాలికంబులగు నికృష్టసుఖముల ననుభవించి, కించిత్కాలమునందే విషాదభయముల జెంది మరణించును. అట్టిమానవుడు బడయగల్గునది కేవలము దుఃఖమేగదా! ప్రేమయనగా బంధనస్వరూపమగు ప్రేమను సాధింప యత్నించు మనుజుడు నానావిధంబులగు దుఃఖోత్పాదక ప్రయత్నముల నాచరింపవలసియుండును. అట్టిభయంకరంబులగు ప్రయత్నముల నలువునవు డప్రయత్నముగనే ప్రాణముల గోలుపోవలసివచ్చును. భూపాలా! గుర్తెఱింగియుండియు గష్టమయ సముద్రమును

నీరసస్థితియందే లంఘింప నుంకించు టెంతహానికరమో విచారించుకొనుమా! స్వాశ్రయశాఖను ఖండింప యత్నించు మూఢు డెట్టివాడో, సత్యధర్మపథము నెడబాయు పశుప్రాయుడు సహిత మట్టివాడే యయియుండును. అల్పప్రాయుండనగు నేను హితకార్యపరతంత్రుడ నగుచుండ, భవాదృశులు సాహాయ్య మొనర్చుటకు మారుగా ప్రాతికూల్యమును గల్గి వర్తింపజెల్లునే? నాహితము నభిలషింపరా మీరు? అనివార్యంబులగు దుఃఖముల ననుభవింపుచు జీవితమును గడుపుచున్న నన్నుజూడ మీకు మోద మొనగూడుచుండునా? భవాదృశ భూపాల శేఖరులుమమాదృశాల్పవ్యక్తులకిట్టి పవిత్రతమంబులగు కార్య కలాపంబుల జేదోడువాదోడుగానుండి సాహాయ్య మొనర్పవల సియుండ, నీరీతి సంభాషించుట న్యాయసంగతమే? భూపాలురు ప్రాయికంబుగా దుఃఖగ్రస్తుల నుపలక్షించి, సహానుభూతి నే ప్రకటింపుచుందురని విశ్వసింతు భూపాలురు సహజముగనే కారుణికోత్తములయి యుందురుగదా? జరామరణ రోగగ్రస్తు లగు సాంసారికుల దుస్థితిని గాంచినంత నే నా హృదయము కంపించుచున్నది. ఏతత్కారణంబుననే, నేనీ దీక్షను మనఃపూర్వకంబుగ నవలంబించితిని. ఇప్పుడు సాధనావస్థయం దున్నాడను. విషయతృష్ణయను పదమును స్మరించి నంతనే కల్గునంతటి భయవిశేష మీజగమునం దేభయంకర పదార్థమును వీక్షించినను నాకు గలుగజాలదు.

అభిలాషయనునది చిత్తసీమను వీడిపోవనంత పర్యంత ము ప్రబలశత్రువులగు కామక్రోధాదులు విజృంభించి, చిత్త మనియెడి క్షేత్రమును విధ్వంసమొనరించి, భక్తిబీజముల నాటుటకు స్వర్గానుకానిదిగా జేసివైచును. అభిలాషను గల్గియుండు మనుజుడు, ఐహికభోగపంకమున జిక్కి మోక్షమార్గమును బడయ నశక్తుండగును. ఏతదభిలాషయే మానవునకు నిరర్థకాశాపరికాశమును దృగ్గోచరము గా వింపుడు స్వభావసిద్ధంబగు విజ్ఞానమయదృష్టిపరిసరణశక్తిని నిర్మూలించివేయును. దురాశ యుత్పన్నమయిన తత్క్షణ మే మోహ ముద్భవించుట సహజమగును. అట్టిమోహమే యనురాగ మనజెల్లును. అనురాగముండు స్థానమునందే స్వాభా వికంబుగ దుఃఖము వాసముసేయుచుండును. భూపాలా! దుః ఖమయంబగు స్థానమున నివసింప నెవ్వ డభిలషించును? కామనా ధీనులగుటవలననె జగమునం దనేకమానవులు పారములేని దుఃఖమునకు వశులయి, జననమరణచక్రమున బడుచున్నారు. ఒకానొకభూపాలున కొక్క రాజ్యఖండము ప్రాప్తమగుచో నత డంతటితో దనివిజెందక, తిరిగి సాగరాంబరరాజ్యముల వశమొనరించుకొన బ్రయత్నములు సేయ గడంగును. దురా శయే వాని నట్లు ప్రేరేపించుచుండును. వాంఛితరాజ్య ప్రాప్తి కలుగనిచో, నతడు దుఃఖాబ్ధిం మున్గి తేలుచుండును. అసంఖ్యాకములగు దుష్పరిణామములకు మూలము తృష్ణయే.

తృష్ణ, దురాశ, కాంక్ష, కామము, మోహము యివన్నియు నేకశబ్దసంభూతములే. ఇంచుమించుగా నన్నియు మానవపత్ర నమునకు హేతుభూతమగు నజ్ఞానజన్యములేయన్న నరిపో వును. శీఘ్రము సాధనము నన్వేషింపగఁ గలుండినచో నిత్యము కాంక్ష యభివృద్ధిజెందునేకాని క్షీణింపనేరదు. నిరంతరావిరళ వికాసమే కాంక్షయొక్క స్వభావము. నిరంతర ప్రవర్ధమానం బగు కాంక్షతోఁ బాటుగ దుఃఖముసహిత మభివృద్ధిజెందుచుం డును. ఏతత్కారణంబుననే మానవుఁడు ప్రమత్తుఁడును, మంద డునుగాకయుండి, సత్యము నన్వేషింప యత్నము సలుపుచుండ వలయును. ప్రవృత్తినుండియే నివృత్తి లభ్యమగునుగాని వృద్ధా ప్యమునందు తృష్ణాశోషణమువలన గానేరదని తెలియుఁడి సాకారార్చననుండి నిరాకారోపాసనోత్పత్తియయిన చందము ననే లోకానుభవమునుండియే యీ నావైరాగ్యభావోదయ మయినది.

కాంక్షల నొకతూరి చిత్తము స్పృశించినచో నిరంతర మవి మానవుని వీడక, ఛాయవలె వెంటాడుచుండగలవు. నిరం తరము విషయవాసనాంకురములు చిత్తక్షేత్రమునం దుదయ మగుచునేయుండును. భూపాలోత్తమా! సృష్టిక్రమము యొక్క యు, తత్వముయొక్కయు మర్మమును గుర్తెఱింగిన నన్నెటుల దిరిగి, జన్మచక్రమున బడద్రోయ సాహసించితివి? ఒకతూరి విముక్తిజెందిన నన్నెటుల దిరిగి తీక్ష్ణకంటకాకీర్ణపథము ననుస

రింప బ్రివృత్తునిజేయ గృషిసలుప నెంచితివి. వ్యామోహపరీ తంబులగు సాంసారికాచారవిచార వ్యవహారములతో నాకు నిమిత్త మేమియున్నది? సంపూర్ణ జీవితకాలమును దపోనిష్ఠాది సత్కర్మల వ్యయపఱచియు, అల్పాహారభోక్తలయియుండియు, స్వర్గప్రాప్త్యర్థ మహోదారాత్రిములు కృషి సలిపియుండియు ననేకఋషిపుంగవు లంతమునకు దుఃఖమునకు వశీభూతులయి, మృత్యువాతం బడియుండుట నే గాంచితిని. శతసహస్రసంఖ్యా కులగు నృపాలురుసహిత మిట్టి దుర్మరణమునకే పాల్పడి యుండిరి. ఇన్ని రహస్యంబుల నెఱింగియుండియు నే నేరీతి దుఃఖగ్రస్థమగు ప్రపంచ వ్యవహారమున బాల్గొందును? "సిరిగా మోకాలొడ్డువా రుందురా!" అప్రయత్నముగనే సర్వేశ్వరుని కృపచేత సంసారముయొక్క మాయారహ స్యము సువ్యక్తమయియుండ విచారింపవలసినపని యేమున్నది? సహా! పంజరబద్ధమగు విహంగము సంయోగవశంబున గాని, దీర్ఘకాల ప్రయత్నంబునగాని విముక్తి సౌభాగ్యము నందగల్గినచో, దిరిగి యా పంజరమునే ప్రవేశింప నభి లషించునా? కాంక్షయను పదమును స్మరించినంతనే, దుఃఖము ననుభవింప గడంగువ్యక్తి కాంక్షాన్వితంబగు కార్యక్షేత్రమున బ్రవేశించిన నెంతటి దుఃఖమునకు గురికావలసియుండునో మీరలే యూహించుకొనుడి. హృదయమున జనించిన కాంక్ష విశ్వప్రయత్న మొనరించినను బూర్తికాజాలదు. కాంక్షల

గల్గియుండియు, ఫలీభూతము గావింపఁజాలని వ్యక్తి తిరిగి భువిపై జన్మింపవలసియే యుండును. జననము కల్గునపుడే మరణముసహిత మవ్వానివెంట నంటికొనుండును. జనన మరణము లుండుతావున గల్గుదుఃఖముల గూర్చి విచారింప నేల? దుఃఖోత్పాదకంబగు స్థానమున మోక్షగంధ మెట్టులుండనగు? ప్రాపంచిక వ్యామోహ మభివృద్ధిజెందినకొలది జననమరణముల సంఖ్య హెచ్చి, భావాతీతమగు విషాదము నావిర్భవింపఁజేయును. కాంక్షాన్వితుండగు వ్యక్తి నిరంతరము జననమరణ చక్రమువెంట గంగిరెద్దువానివెంట బసవన్న తిరుగుచందమున దిరుగుచుండును. కామనాజన్యములకు క్షణికసౌఖ్యముల, శాంతియను పదమునకే స్థానములేదని గ్రహింపుడి. అట్టి నిరర్థకంబును, నిమిత్తమాత్రింబును నగు క్రియను స్వీకరించునంతటి మూఢుడనుగాను నేను. కాంక్షాజన్యసౌఖ్యము, దాహముగొన్నవానికి తుషారకణసముదాయ మెంతటి లాభకారియగునో, మోక్షము బడయనెంచువానికి సహిత మంతియే ప్రయోజనకారియగును. కాంక్షాన్వితుండగు వ్యక్తి మాటిమాటికి జననమందుచు స్వకర్మానుకూల పరిణామము ననుభవింపుచు హాహాకారముల నేయుచుండును. నే నీతరుణమున (భమాన్వితుడనయి, కాంక్షను స్వీకరింతునేని, పునర్జన్మ నందినపుడద్దానిఫలమగు దుఃఖమనియెడి దారిద్ర్యము ననుభవింపగల్గుదును. తత్సమయంబున బునర్జన్మయే నాకు శరణ్యమగునుగదా!

గృహారామాది ప్రాపంచిక సౌఖ్యములు మృగతృష్ణను బోలియున్నవని మీ రింకను గ్రహింపలేకపోవు టెంతయు చింతనీయము. ఉత్తమజనుల కసమ్మతంబగు మతమే మీకు సమ్మతమా? విముక్తి నెద్దానినుండి పడయగల్గితినో దానిని దిరిగి స్వీకరింపజాలను. ముమ్మాటికిని దాని నామమునయిన స్మరింపజాల. వృథా ప్రయాసమేల? యజ్ఞయాగాదులవలన మోక్షసిద్ధి యగునని మీరును నాయాప్తు లనేకులును నొక్కి వక్కాణించియుండిరి. భవదుద్దేశము వ్యామోహ భావోద్భూతము, నిరాధారము, నింద్యము. నిర్దోషులగు జీవముల బలిగొను హత్యాకార్యమగు యజ్ఞము, నరునకు జ్ఞానముచే లభ్యమగు బ్రహ్మానందము నొసంగగల్గునది? దయారహితమగు ప్రవృత్తియే యజ్ఞయాగాదుల నీతియయి యుండ నయ్యవి మానవునకు గారుణ్యరసపరిపూర్ణమగు నిర్వాణమును బ్రసాదింపగల్గునా? రక్తసిక్తావయవ పరిపూర్ణ గాత్రుండగు వ్యక్తి కుఠారాఘాతంబున స్వస్థావస్థయందయిన బునరారోగ్యధనప్రాప్తిం బడయనేర్చునా? శరీరముపై గావింపబడిన యాఘాతమునుండి రుధిరము స్రవింపుచుండ, నారుధిరమును నిరోధింప దిరిగి శరీరముపై బ్రహారము గావించిన నెట్లుండునో విచారించుకొను మో నృపాలా! శాంతియను మహోజ్జ్వలరత్నమును గోల్పోయిన వ్యక్తి, కర్తవ్యాకర్తవ్య జ్ఞానదూరుడయి సంచరింపుచుండ, నశాంతప్రదమగు

హింసనొనర్చి, అహింసావ్రతానుష్ఠానమహిమంబున బ్రాప్తమగు మోక్షమును బడయు టెట్లు? గగనపుష్పప్రాప్తి వంధ్యాపుత్రోదయము, శశవిషాణాయుధము మొదలగునవి సంభవమయినను గావచ్చునేమో గాని చిత్తశుద్ధిలేనిదే ముక్తి కలుగనేరదు. ఈ నావచనమునం దావంతయు నసత్యము లేదు. స్వప్నమందయిన దోషమునెఱుంగని పశువుల వధించుటంజేసి, మహాపాపముకంటె నెక్కుడన్యాయ మీసృష్టియందే గానరాకున్నయది ప్రాణిహత్యచే గావింపబడు సమస్తయజ్ఞయాగాదులు నరునకు నరకము నొసంగు రాక్షసకృత్యములని వివేకమునుగల్గియున్న మానవునకు వేఱుగ వచింపవలయునా? స్వయంకృత కర్మానుసారముగనే మానవకోటికి సుఖదుఃఖాది సర్వమనోవికారములు సృష్టియందు ప్రాప్తింపనయియుండ అవివేకాంధకారజన్య హత్యాకాండములగు యజ్ఞములనాచరించుట మహామౌఢ్యముకాక మరి యేమగును? సర్వేశ్వరాంశమగు చైతన్యమునుగలిగియున్న ప్రాణికోటిని వధించి పూర్వమే, మీపైనున్న పాపభారము నేల వృద్ధిజేసికొనియెదరు? మూఢత్వమునకును ముక్తికిని గడు దూరము సంభవాసంభవంబుల గుర్తెఱుంగజాలని మానవుని జన్మమేల? అట్టిద్విపాదపశువు యొక్క జీవితము బూడెబోసిన పన్నీటిచందమున వ్యర్థమగును.

సిద్ధి నిమిత్తమయి యాచరింపబడు దుష్కార్యము

యొక్క పరిణామము దుష్పరిణామమయి యుండక సత్పరి ణామ మెట్లు గానేర్చును ? గోధుమల నాటి తిలముల బడయ గల్గువాడెవ్వడయిన నీసృష్టియందు గలడా ? దుఃఖింపజేయు వాడు, దుఃఖింపకుండునే ? పగులకు దుఃఖము నొందజేయు కార్యము యజ్ఞమనజెల్లునే ? దుఃఖోత్పాదకమగు కార్యమును సత్వరంబె విడనాడవలదా ? భూపాలా ! సర్వేశ్వరప్రతినిధులగు ధరణీనాథులే యీరీతి వ్యామోహమున ము నిగియుండ వారి వశము నందున్న పౌరులగూర్చి వచియింపనేల ? పరులకు దుఃఖమును గల్గించుటకంటె, వారలకు సహజముగనె వాటిల్లు దుఃఖాదుల దూరము గావించుటయందు స్వార్థ రహితమగు బుద్ధితోడ సాహాయ్యమొనరించుట యుక్తము. రాజా ! పరులకొరకు దుఃఖముల మనమే యనుభవింపవలయును. ఇదియే త్యాగము. త్యాగమన మూఢమానవులు ధర్మాధర్మార్జితంబగు విత్తమును విసర్జించుటయే యని స్థూలబుద్ధిచే సిద్ధాంతీకరింతురు. యథార్థమూరసిన సమస్తవిధములగు స్వార్థమును నిషేధించుటయే మహా త్యాగము. "నాస్తి త్యాగసమంధర్మం" అను గురుజనసూక్తి యందెంతమహత్తరంబగు భావము గర్భితమయియున్నదో విచారించుకొనుడి. స్వసుఖాపేక్షీయయి, పరులకు దుఃఖము కలుగవలయుననెడి ఘోరభిలాషను గల్గియుండు మానవునికంటె వేరొండారణ్యక ఘాతకమృగము దుష్టస్వభావమును గల్గియుం

డునే? పరులనిమిత్తము మనజీవనసర్వస్వముల సమర్పింపవలసి యుండ, నచ్చోట బరులజీవములనే బాధించుట యుక్తమా? పరోపకారమునకయి స్వాయమర్పితంబగుటయే మోక్ష మనబడును. శాస్త్రోక్తుల పద్ధతి యొకటియు నాచరణము యొక్క విధానము మరొక్కటియు నయియున్న నీచము కాదె? ఏతద్విధానాచార ప్రచారంబున, బాలితుల గృహంబులన్నియు దుఃఖములకు నిలయంబులగుట లేదే? శాసకా! పాలకపాలిత ధర్మపరిజ్ఞాన దూరుండవయి, సంభాషించితి వేమి? ధర్మదూరు నేమని దూరవచ్చు? సర్వోత్తమంబగు నాధర్మము నతిచులకనగా జూడదగునా? నిస్సందేహముగా నాయెడ దమకున్న యనురాగ మత్యధికంబగు ప్రశంసకు బాత్రమయినదియె. కాని మీయనురాగమే మిమ్ము ధర్మజ్ఞానశూన్యునిగావించి వేయుచున్నది. ప్రథమమునుండియు నేనీయనురాగ పరిత్యాగమును గూర్చియే సంభాషింపుచు వచ్చియున్నాడను.

దృష్టాంత రహితములకు బోధన లాత్మలు లేనట్టి దేహములవంటివి. కనుక ప్రత్యక్ష ప్రమాణముల సహితముగ నేజేయు ధర్మవిషయక నిర్వచనముల నాలకింపుడి :—నాయెడ దమకు విశేషమగు ప్రేమయుండుటంజేసియే కదా తమకింతటి వృథాశ్రమయు, విపరీత దుఃఖమును వాటిల్లుట. ప్రేమయె లేనిచో దమ రింతశ్రమ యేలగై కొనియెదరు? నే నెటనున్న నేమయిపోయిన మీ కేమి విచారముండెడిది? ప్రేమపాశము లే

మీహృదయమును నాపై పునకీడ్చుకొని వచ్చుచున్నయవి. అను రాగబంధన మతికఠినము. అద్దానిని ఖండించుట సాధారణ శక్తికతీతమాయిన కార్యము. సమస్తబంధనములు చందరిహాస పరిహారంబున విడిపోవగల్గినను ప్రేమపాశములట్లుగాక మొండి వయియుండును. పరికృతచర్యచే దమకిప్పటికయిన ననుభవమ యియుండును. ప్రేమబంధనముల దార్ఢ్యతను గుర్తెఱింగి, దూర దృష్టినిగలిగియుండి సత్వరమే మోహబీజముల హృదయక్షేత్ర మునుండి నిర్మూలమొనరించుట యుక్తము. చిత్తశాంతినంద వాంఛ కలదేని తమరు నన్ను స్వపుత్రునిగ భావించి నాయెడనున్న ప్రేమను రూపుమాపివేయుడి. శీఘ్రము జీవన్ముక్తింబడయ గోరువారి కిదియే సరళోపాయము. నే నీరహస్యమును గ్రహించినాడను. ఇపుడు సాధకుడనయి యున్నాను. దీనినే సర్వోత్త మంబును సత్వరానందదాయకంబును నగు మోక్షసాధనమని గ్రహింపవేడుచున్నాడను. పుడమిరేడా! శాంతచిత్తుడవయి, వ్యాకులత నెడబాసి ప్రజ నాత్మీయ సంతానముగ భావించి పోషించి జ్ఞానము నుపదేశించి, ధర్మమును నిర్వహించుకొనిన వాడవగుము. సమస్తజీవరాసుల యెడ దయారసమును వెల్లివిరి య జేసి తన్మయుడవయి నిత్యానందమును బడయుము. నన్ను క్షమించి, శీఘ్రము సెలవొసంగుము. జాగుసేయరాదు." సిద్ధా ర్థుడాసనము డిగ్గి, దురితగమనంబున నెచటికో యరిగెను. బింబ సారభూపాలుడు శిలాప్రతిమవలె నిజాసనంబున గూర్చొనియే

యుండెను. నోట మాట వెలువడలేదు. నేత్రములనుండి యానందబాష్పధారలు స్రవింపజొచ్చెను. కాని యాతనిహృదయమున బూర్వాచారంబులును, నవీనాచారంబులును దుములయుద్ధముసేయ నారంభించెను. నాటికతడు సభామందిరమును బాసి రాజమందిరమున కరిగెను. కాని యతనికి యజ్ఞయాగాదులపట్లనున్న మూఢవిశ్వాసము సశించకుండెను. అతనిచిత్తము మాత్రము ప్రథమస్థానమునుండి కొంచెము సంచరించినది మాత్రము వాస్తవము.

సిద్ధార్థు డహింసనుగూర్చి ప్రబోధము సేయుచున్నాడు.

సిద్ధార్థుడు బింబసారుని సభామందిరము నెడబాసి చని యిప్పటికి రెండుదివసము లయినది. బాలస్వామి భూపాలున కెద్దియో బోధించి, నిజాశ్రమంబున కరిగెనను కింవదంతి జనులయందుదయమయ్యెను. నేడు భూపాలుడు మహాయజ్ఞమును సలుపనున్నాడు. వధింపబడు పశువుల నవలోకింప నగరవాసు లెల్లరు దృష్టిగగుడిచ్చి, భూపాలునిచే సమస్తవిధముల నగరవాసుల రాకపోకల కనుకూలముగ సిద్ధముగావింపబడిన యజ్ఞశాల కేతెంచుచుండిరి. భూపాలుడొక్కచో సర్వోచ్చాసనాసీనుడయి, యజ్ఞమును సేయింప నెల్లర శాసింపుచుండెను. పశువుల శుద్ధిజేసి బలియిచ్చుటకు గొనివచ్చుటయందించుక కాలవిలంబన మగుటంజేసి యతడు ప్రచండ రుద్రరూపమును దాల్ప నారంభించెను. భూపాలుడు కోపోద్దీపితుడగు సమయ

మునకు రాజపురోహితు డొక డేతెంచి పశువులన్నియు వచ్చి
నవనియు, క్రతువున కావశ్యకంబగు సామగ్రియంతయు దేవర
వారి కనుసైగయయినంతనే సన్నద్ధమయిపోయినదనియు విన్న
వించెను. యజ్ఞము నారంభించుటయందు జాగుయగునెడల
రౌరవాదినరకముల గర్త యనుభవింపవలసియుండుననని, భయ
పడు బింబసారుడు యజ్ఞమును బ్రారంభింప శాసించెను. వేద
మంత్రపాఠకులగు విప్రవర్యు లనేకులు మంత్రముల బఠియిం
పుచు, యజ్ఞశాలను ప్రతిధ్వనింప జేయుచుండ, బురోహిత
గణము హోమకుండమునందు ఘృతాది సుగంధద్రవ్యమువై
వేయుచు, హోమాగ్నిని బ్రజ్వలింపజేయుచుండిరి. అగ్ని
హోత్రమునకు సమీపముననే వామభాగమున నధ్వర్య
డొక్కరుడు యజుర్వేదమంత్రమును బఠింపుచు, నిజహస్త
మున బ్రచండధారాయుతంబగు ఖడ్గమును బూని సమ్ముఖం
బున నిలువబెట్టబడియున్న మేషమును వధియింప నుద్యుక్తు
డయియుండెను. ఆ యాజకు డాపశువును ఖండింప నిజఖడ్గ
మును నూర్ధ్వముఖంబు గావింపగనే సిద్ధార్థకుమారు డత్యంతము
గళవళపడుచు, పాదములు తడబడ, శరీర మంతయు
గంపించుచుండ, స్వేదజలసిక్తశరీరముతో, ధూళిధూసరిత
వదనముతో నాయజ్ఞశాలను హఠాత్తుగా బ్రవేశించియజ్ఞ
మండపమంతయు నుద్ఘోషింప నీరీతి నెలుగెత్తిపల్కెను:—
ఓ యధ్వర్యుడా! ఆగు మాగుము! వధింప వలదు!

సిద్ధార్థు డిట్లనుచు, రెప్పపాటుకాలమున నాస్థలముజేరి యా
మేకపశువు బంధనముల ఖండించి, యద్దాని నాక్రూరాత్ముం
డగు నధ్వర్యుని బారినుండి తప్పించివేసెను. గంభీరభూధర
సదృశ నిశ్చలభావ సమన్వితహృదయుడయి, నిర్మలమనస్కు
డయి, భయభావ మిసుమంతయయినలేక, బలిపీఠముపై
నిలువబడియున్న సిద్ధార్థకుమారు నాకార్యమునుండి వారింప
సాహసముగల వారెవ్వరును నట లేరయిరి. విశాలతమంబగు
నాయజ్ఞశాలయందు సమావేశమయియున్న సమస్తజను లా
సిద్ధార్థుని యనిర్వచనీయాద్భుత మహానుభావత్వమును, ముఖా
రవింద విస్పష్ట తేజోకాంతులను నీశ్వరకటాక్షములబోలు నా
తని దివ్యావ్యాజకరుణా రసపూరిత వీక్షణా పరంపరలను
గాంచి, నిస్తబ్ధులరయి, వాక్శూన్యతంజెంది చిత్తరువులపగిది
నివ్వెరగంది, యనిమేష నేత్రములతో నామహాత్ముని దర్శింప
నారంభించిరి.

యజ్ఞశాలాస్థితజనులు నిశ్చేష్టులయి యుండుటగాంచి,
నిర్మలాంతఃకరణుడగు సిద్ధార్థుడా నృపాలు ననుమతిని బడసి
యిట్టులనుపదేశింపదొడగెను :—"అప్పలారా! సహజముగనే
నీచకార్యముల సేయువారనేకు లీజగతీవలయంబున గలరు
కాని, సత్కార్యముల నాచరింపగలవారి సంఖ్య బహుస్వల్ప
ము. సమస్తజనులును సహజముగనె నిర్దయులయి, భూతదయ
యనునట్టిదో యెఱుంగజాలక, జీవుల సంహరింప గడంగుదు

రేకాని, వానిని బరిరక్షింప నుద్యుక్తులగువా రొక్కరయిన
గానరాకున్నారు. ఇక్కాలపు వివేచనాదూరులగు మానవు
లకు జీవహింస యొక నిత్యకర్మంబయినది. కంటగాఘాతంబున
నరు డత్యంతమగు బాధజెందునే కాని శతసహస్రాల్ప జీవుల
మ్రగ్గజేసియు జింత నిసుమంతయు బడయకున్నాడు. స్వసుఖ
ము నపేక్షించి, దోషరహితంబులగు జీవముల నశియింప
జేయువాడు మహా హంతకుడయి, సర్వేశ్వరునిచే శిక్షింప
బడును. ఒక జీవమును బీడించువాడెట్లు హింసా శూన్యమగు
నిర్వాణమును బడయ సమర్థుండగును? సామాజికప్రాణి యగు
నరుడు క్షుద్రజీవముల సంహారము జేయుచు మెలగుచుండు
కతన నతని మనుష్యత్వము నష్టభ్రష్టమయి చెన్నారు. ఉదార
చరితునకు విశ్వమంతయు బరివారమువలె దోచునని గురుజ
నులు వాకొనుచుండ, బాపకార్యముల సేయు టుచితమ
గునె? జీవకోటియసువుల దీయు మానిసియే రక్కసి నాబ
అగు. ప్రస్తుతము మానవసంఘమున నుపకారపారీణులకంటె
నపకారపరాయణులే మెండుగ నున్నారు. "అపకారికి నుపకార
ము నెపమెన్నక సేయువాడె నేర్పరి" యను గురుజనసూక్తి
ప్రచలితమయియుండ, నపకారమును స్వప్నమందయిన దలచి
యెఱుంగని పశువుల వధియించు టెంతటి రాక్షసకృత్యమో
మీరలే యూహించుకొనుడి. రాక్షసకృత్య మాచరించు మాన
వునకును ఘాతుకమృగమునకును గల తారతమ్య మేమి? మాయా

ప్రపంచమున భ్రమకు జిక్కియున్న ప్రతి ప్రాణికి జీవమనిన నతిమధురముగనే యుండును. ప్రాణవిసర్జనంబనిన మశకమాది యల్పజీవులు మొదలుకొని దంతిమొదలగు విరాట్స్వరూప ముగల జంతువులపర్యంతము మహాభయవిషాదములే పొం దుచుండును. జీవమును విషతుల్యముగా భావించు ప్రాణి యీ యిహలోకమునందే గానరాకున్నయది. పశువులయినను నిజప్రాణసంరక్షణమునకయి యనేకయత్నములు సేయుచునే యుండును. కాని తమజాతికన్న బలముగల మానవజాతికి జిక్కి యుసురులుపోయుచుండును. ఇయ్యది స్వభావసిద్ధమయిన విష యమె. "బలవంతమైన సర్పము చలిచీమలచేత జిక్కి చావదె" యన్నరీతి నల్పప్రాణి యధికబలముగల ప్రాణికి జిక్కి, మర ణించుచున్నయది. శక్తియున్నంత మాత్రంబున జీవితాభ్యు దయమును బడయనెంచు స్త్రీగాని పురుషుడుగాని దుర్విని యోగము సేయరాదు. ప్రత్యేకనరుడు దైహికబలసంపన్ను డయి యుండవలయునుగాని, యాబలము నుచితమగురీతి నుపయోగించుకొన సహనశీలత్వము (ఓరిమి, క్షమ) యత్యంతా వశ్యకమయి యున్నది. ఓర్పులేనివానిని నరుండనిసెప్పు టనుచి తము. మానవధర్మము సహనమయియుండ, నోరెరుగని పశు వుల సంహరించు టెంతటి దుష్కృత్యము? అధమాధములగు నరులకే తమజీవితము లత్యంత ప్రియములయియుండ, సుదా నజీవితమునుగల్గి, పరోపకారమును సేయుచుండు మేషములు

నిజప్రాణముల సంరక్షించుకొను సామర్థ్యము లేక, మూకీ భావంబున నేత్రముల నశ్రుధారల బ్రవహింప జేయుచు, జీవనభిక్ష బ్రసాదింపుడని మనల వేడుచుండ, దయమాలి హంతకవృత్తికిం బాల్పడుట యుక్తమె? అహింసావ్రతానుష్ఠానముకంటె మానవునకు వేఱు పరమధర్మము లేదని శాస్త్రములు విశదము సేయుచుండ, శాస్త్ర సిద్ధాంతములకు విరుద్ధముగా జరించి, శాస్త్రసమ్మతంబగు దైవకృపాకటాక్ష వీక్షణము నెట్లుపడయగలరు? మానవులవలె హృదయమందలి పరితాపమును వెల్లడించుకొను శక్తిలేక, మూగవాండ్రబలె నిలుచబడి యుండి కన్నీరుమున్నీరుగా దుఃఖించుచుండ మీపాషాణతుల్యములగు హృదయములు ద్రవీభూతమగుచుండుట లేదే? కరుణారహితులు మానవులే?

క్షీర దధి ఘృతముల నుచితముగ బ్రసాదించు పశువుల న్యాయాన్యాయ విచక్షణాజ్ఞానదూరులయి, హతమార్చుట శుభమే? "అహింసా పరమోధర్మః" అను శాస్త్రోక్త వచనమును లెక్కసేయనివారు దైవదండనకు బాత్రులగుట నిక్కువము. ధర్మచ్యుతునకు నరకమే శరణ్యము. హంతకునకు సంసారమున సుఖశాంతు లెట్లు లభ్యమగును. పూర్వమునుండియు వచ్చుచున్న ధర్మములే శ్రేయోదాయకములని భావించునట్టి యావివేకము ప్రజాసమూదాయమున వ్యాప్తమయి యున్నది. ప్రస్తుతము ధర్మపక్షము నవలంబించి మేషముల

సంరక్షింప, సహేతుకమగు గంభీరోపన్యాసము నొసంగ సం
సిద్ధుడనయి యున్నాడను. నావాదము సహేతుకంబును, న్యా
యయుక్తంబును శాస్త్రీయమును గానిచో మీరెల్ల రేకీ
భవించి, ఖండింపవచ్చును. మీర లతిశ్రద్ధతోడ నాదగు
వక్తృత్వము నాలకింప నభిలషింతు:— హింసయను గర్హిత
పద మైహికాముష్మికసౌఖ్య సంపాదనమునకు బ్రతిబంధకము.
తిర్యగ్జంతువుల జన్మంబులకు శ్లోకకరంబులగు కార్యములు
సేయు మర్త్యుడెన్నడు సుస్థిరానందమును బడయజాలడు.
మర్త్యుడెట్టి కార్యంబుల సేయునో యట్టిఫలంబునే బడయును.
పరిణామము కార్యమునననుసరించియే యుండును. స్రోపేక్షికం
బగు సంసారమున సమస్తజనులు బశుపక్ష్యాది జీవకోటి సాహా
య్యంబువలనసహిత మొకప్పు డనంత సౌఖ్యముల బడయ
గలరు. చిట్టెలుకవలననే యొకప్పుడు సింహమునకు బరమోప
కారము కాగలదు. హింసాపరుడగు నరుడు స్వప్నమందయిన
శాంతచిత్తుడయి యుండజాలడు. "సంఘే శక్తిః కలౌయుగే"
యన్న రీతి స్వాశ్రయ సంసారకార్యనిర్వహణార్థము పశుప
క్ష్యాదుల సాహాయ్యముగూడ నరులు పడయవలయును. మనచే
హింసింపబడువారు మనకెటుల సహాయముజేయ సంసిద్ధులగు
రురు? అహింసయే మానవజాతియను దేహము నత్యంత ప్రకాశ
మానము గావింప రత్నమణిమయ జటితాలౌకికాభరణంబు.
సమస్తజనస్తోత్రభాజనంబును, పరివిమలభావపూరితంబును నగు

నహింస శాశ్వత సద్యశస్సౌఖ్య సంపదల బ్రసాదించును. అహింస నాకవమోధిగ బోల్చినను బోల్చవచ్చును. సత్యము, పరోపకారము, వినయము, భూతదయాదిగాగల సమస్త ధర్మాంగములు అహింసారత్నాకరమందలి రత్నములు. సమస్తజనులు సంసార రంగమున వాక్కుచేగాక త్రికరణంబుల జీవకోటి యొక్క హితముసేయ సంసిద్ధతను జూపుచుండవల యును. వివేకసంపన్నుండగు నరున కత్యంత శీఘ్రకాలమునందె హింసాహింసాస్వరూప నిర్ణయము విదితంబగును. సాధారణ ముగా హింస ద్వివిధములు. ఒకటి బాహ్యముగ గాన్పించు నది, ద్వితీయ మాంతరంగికముగ నగునది. సోదాహరణముగా నీరెండు తెగల హింసల బేర్కొనుచున్నాడ. తీక్ష్ణాయుధప్రహా రంబున శాత్రవునికంఠమును దెగనఱకుటగాని ప్రహారము గావించుటగాని చర్మచక్షువులకు గోచరించు బాహ్యహింస నాబఱగు. ఒకవ్యక్తిని నిర్హేతుకముగ నేదో యొక వ్యాజ మున వాగ్బాణముచే బాధితుని గావించుటయే ద్వితీయ హిం సకు జెందును. కఠోరవాక్యప్రయోగంబున సమస్తేంద్రియము లకు బ్రధానమగు మానసమెంతయు ఖేదము జెందును. మనో ఖేదమునకు మూలమగు ప్రవృత్తియు హింసాత్మకంబేయగును. పరుల దూషించుటయే హింసాభాగమునకు జెందిన జీవముల నిర్హేతుకముగ, నిర్దాక్షిణ్యముగ వధించుట హింసయనబడదని సాహసించి చెప్పగలయట్టి రాక్షసు లెవరుందురు?

రజోగుణాధిక్యంబునను తమోగుణ బాహుళ్యంబునను దుష్కార్యముల నాచరింపువారు లేకదా మనవారిచే బండ్రెండు శిరసులగల్గియు, ఇరువదినాల్గు హస్తములగల్గియు నరుల నమలి వేయు రాక్షసులని చెప్పబడువారు. సత్వగుణ మెట్టియవస్థ యందును హింసకు మానవుని బ్రేరేపింపదు. హింసాచరణ మునకు బ్రేరేపించునవి రజోతమోగుణములే. సత్వము సచ్చి దానంద స్వరూపము. సత్త్వముయొక్క పరిణామమె యహింసా తత్వము. హింసచేయువాని మానసమహోరాత్రములు దూషితమయి, ఆందోళితమయి, ఆత్మవికాసమును గోల్పోవుట యథార్థము. హింసవలన కేవలము సంసారములో హింసింప బడుచుండువారలకే దుఃఖమనివార్యముగ సంభవింపుచుండుట లేదని గుర్తెఱుంగుడి. హింసాపరులుసహితము స్వల్పకాలము నందే సత్వగుణాశయము క్షీణింప, మానసిక దౌర్బల్యమను మహాభయంకర వ్యాధికి వశమయి యంతమునకు గడు నిడుమల గుడుచుటకు బద్ధులగుదురు. హింస, పాపమునకు మూల మగుకతన నద్దానిని విహితధర్మముగ మనోవాక్కాయకర్మల నెంచు మానవుని చిత్తము కలుషితమయిపోవును. కలుషితా త్మయం దెపుడును సద్భావము లుదయింపజాలవు సద్భావో దయశూన్యంబగు హృదయమునం దానందమునకు స్థానమెట్లుం డనేర్చు? ఆనందము లేనివాడు జీవచ్ఛవంబుగ నిది మనుచుం డును. అట్టివాడు జీవితాంతము పర్యంతము లెక్కలేని యిక్క-

ట్టుల ననుభవించి వార్ధక్యము సమీపించినంతనే కాలునిచే బంపబడు భటులచే భయంకర ప్రచండానలజ్వాలాపరివేష్టితంబగు నరకగుండమున బడద్రొబ్బబడును. ప్రపంచములో హింస కేవలము బ్రత్యక్షముగనేగాక సూక్ష్మరూపంబుల ననేక విధముల సేయబడుచుండుట నే గాంచితిని. కొందఱు మానవులు యజ్ఞయాగాదు లను వ్యాజంబునను, ఇంక గొందఱు దేవతాసమర్పణముల నిమిత్తమును, మఱికొంద రాహారనిమిత్తమును, కొందఱు రోగవిముక్తియను మిషచేతను, అనేకు లనేకవిధముల జీవరాసుల మట్టుపెట్టుచున్నారు. హింస యీ రీతి బ్రపంచమున వ్యాప్తమగుటకు హేతువు అవివేకము. అవివేకప్రభావంబుననే మానవులకు దూరదృష్టి నశియింప బరమార్థమునే విస్మరించి, క్షణిక సౌఖ్యదాయకంబగు నైహిక తత్వమును, స్వార్థమును బ్రేమింప నారంభించినారు. భూతదయాశూన్యులగు మానవులు, భూతసృష్టికి మూలపురుషుడగు సర్వేశ్వరునిచే దప్పక దండింపబడగలరు. హింసగావించిన తత్క్షణమే కూరునకు దండన లభియింపక పోయినను, అట్టివాడు గురుజనసంఘమున దూషింపబడుట మాత్రము వాస్త

సమస్త పారమార్థిక ధర్మాగ్రగణ్యములలో నహింసకే సిద్ధాంతము ప్రాధాన్య మొసగినాడు. మన ప్రాచీనులు పంచమ వేద మహింసను గూర్చి నిర్వచించు ఫక్కి నవలోకింపుడి.

గీ॥ దంతియడుగులోఁ దక్కినజంతు చాయంబునడగు లెల్ల నడిగియుండు నట్లు ధర్మకోటులన్ని యహింస లోనగు| సిద్ధగుణ! యహింస కీర్తనిజము.

వము. సర్వజనదూషణాస్పదుడయి మనువాని జీవితము నింద్య
ము. * అహింసనే సర్వోత్తమధర్మముగ భావించి యాచరిం
పుచు సోదరమానవులచే నాచరింపజేయ యత్నించు వాని
జీవితము సుఖశాంతులతోగూడి నిత్యానందనిలయ మయి
యెప్పుడుండగలదు. భూతదయయే అహింసకు మూలము.
భూతదయకు స్థిరాస్థిరపదార్థజ్ఞానమును, అణుమయసృష్టితత్త్వము
ను, జీవేశ్వరావినాభావసంబంధమును మానవులకు గోచరము
కావలసియుండును. అహింసావ్రతానుష్ఠానమును నిషేధించు
భూతదయాశూన్యులగు కఠినచిత్తులు బహుజనద్వేషంబున, సం
సారమున గర్హ్యులయి, యైహికాముష్మిక సుఖములనెడబా
సి, చింతాగ్నిం దగ్ధమగుచుందురు. పిపీలికాది మనుష్యపర్యంత
మెప్పుడును మఱచియయిన హింస సలుపరాదు. ప్రపంచమున
గొందఱు నిర్వ్యాపారులయి, సేయునదిలేక విలాసార్థము జీవ
జంతువుల హింసింపుచుందురు. మూఢులనేకులు సంసారమున
మానవహితార్థమయి, సర్వేశ్వరుడు కందమూలఫలాది శాకా
హారంబుల సృజియించియుండ, నుదరంభరత్వాపేక్షచే బశు
వుల వధియించి మాంసాది తామసాహారముల భుజియించి,
రాక్షసస్వభావులయి మోక్షదూరులగుచున్నారు. విజ్ఞానమయ
బుద్ధిచే విచారింప, మన జిహ్వేంద్రియమును, దంతపఙ్క్తియు
మాంసాహారమున కనువుగా నీశ్వరునిచే నిర్మితము కాకట్లే
తెల్లమగుచున్నయది. జ్ఞానవిజ్ఞాన శాస్త్రసిద్ధాంతములు రెం

డును మానవుని మాంసభక్షణమునుండి నిషేధించుచున్నవి. మార్జాలము మాంసభక్షక జంతుకోటికి జెందియున్నది. దానిస్వభావాదులగూర్చి విచారించి యవ్వానితో మానవుని స్వభావమును శరీరనిర్మాణమును బోల్చిచూచెదము గాక! మానవుని దంతములు కొనలుతేరియుండక, పదను తక్కువ గల్గియుండును. మార్జాలము యొక్క దంతములు వాడిగల్గి యుండి, సన్నముగానుండి బల్లెపుకొనలను పోలియుండును. అనగా నవి మాంసఖండములను స్వేచ్ఛగాజీల్చుట కనువుగానున్నవి. మానవుని దంతములు కడు కురుచలయి మొద్దుబారియున్నవి. మానవుని రసనేంద్రియము గరుకుదనము లేక నుపరిభాగము మృదుత్వముగలదయి స్నిగ్ధముగానుండును. బిడాలము యొక్క నాలుక యట్లుగాక ఆకురాయినవలె గరుకుగానుండును. బిడాలము యెముకలనంటియుండు పలుచనగు చర్మము దంతములతో గీకుకొనవలనుపడక, నాలుకతో నాకినంతనే యాచర్మము పొట్టుపొట్టుగా వీడివచ్చును. మానవునకు నమలుటకయి దంతముల కేర్పడియున్నంత సౌకర్యము మాంసఖండముల జీల్చుటకు లేకయున్నది. నాలుకయు మార్జాలము యొక్క జిహ్వేంద్రియములనుండి భిన్నముగానే యున్నది. ఈకారణములచే మనిషి మాంసాహారి కాడనియు, బ్రాకృతికంబగు సాత్వికాహారమును స్వీకరించువాడే యనియు దేటపడినది. మార్జాలాది మాంసభక్షక జంతుసముదాయమును

యొక్క యన్నమయకోశము మానవుని యన్నమయకోశముకంటె నధికోష్ణమును గల్గియున్నది.

ధాన్యము, ఫలములు కందమూలములు, ఓషధులు మొదలగు ప్రకృతిసిద్ధములయిన సాత్వికాహార పదార్థముల యందెక్కుడు పాచనశక్తికలదు. ఇవి మిక్కిలి ఘనమయిన యాహార పదార్థములు కావు. వీనిలో నేపదార్థమయిన బాగా నమలబడినపిదప, జలకలశమున వైచి పిసికిన, నీషణ్మాత్రకాలము నందే జలములో గరిగి మిళితమయిపోవును. ఎంతశీఘ్రముగ జలములో గరిగి పోవునో, యాపదార్థ మంత శీఘ్రము సులభముగా జీర్ణమయి, యన్నమయకోశమును సరియయిన స్థితియందుంచగల్గునదని గ్రహింపనగును. పక్వముగావింపబడిన మాంసఖండముల గొనివచ్చి, జలపాత్రములో వైచి ఎడ తెగకుండ మూడుదివసముల పర్యంతము పిసుకుచుండినను జలములోగరిగి మిళితముకాకుండును. కారణము దాని యందు నధికముగా జిగటపదార్థముండుటయెగాక నారపీచువలె సాగుగుణము విశేషించియున్నది. నమలిన కొలది, పీచువలె సాగుపదార్థమెద్దియు మానవుని కోమలంబగు నన్నమయకోశమునజేరి, శీఘ్రము జీర్ణమయి, రక్తము నభివృద్ధిపఱచి, శరీరవికాసమును బెంపొందింపజాలదు. శాకాదులు హాయిగా జీర్ణమయి, ద్రవపదార్థములు పోయి రక్తనాళముల సృవించు రుధిరప్రవాహమున కేవిధమయిన యవరో

ధమును గల్పింపక, వికాసము నొదవజేయును. మాంసమట్లు గాక రక్తగమనావరోధమును గల్పించును. ఒక్క యాసనముపై విశాలముగ నొక్కపురుషుడే గూర్చుండిన హాయి సహజముగనే కల్గును. ఆసనముయొక్క విస్తీర్ణతనుగూర్చి విచారింపకయే యిరువురో ముగ్గురో యద్దానిపయి క్రిక్కిరిసినట్లు గూర్చున్న నెంత సౌఖ్యభంగమగునో మనకు దెలియుచునే యున్నదికదా! రక్తనాళములు వలయునంత వైశాల్యమును గల్గియుండ, నవ్వానియందు మందగమనంబున రుధిరము సర్వదా ప్రవహింపుచుండును. సాత్వికాహారపదార్థము లారగింపబడిన యనంతరము ద్రవమయి రక్తరూపంబునుదాల్చి, బిందురూపంబున రక్తనాళములలో మిళితంబగును. మాంసమట్లుగాక పురుగులతుట్టెలై, రక్తనాళముల నావహించి, బిందురూపకంబగు నారక్తధారయందు మిళితముగాక యుండును. కొంత పదార్థము యించుమించుగా నమలబడి నలుగుటచేత సన్నని పురుగులవలెనుండి జలాశయ సోపానశ్రేణివంటివిప్పయుండు నాదులై రక్తనాళముల నంటియుండును. ఉచ్ఛ్వాసనిశ్వాసముల కంతరాయముగల్గిన మానవుని జీవమునకెట్టి సౌఖ్యము వాటిల్లునో యదియేచందమున, మాంసపుతుట్టెలచే ముట్టడింపబడిన రక్తనాళములు స్వేచ్ఛగ లోలోపల ఉక్కిరిబిక్కిరి యగుచుండును. కండలు దండిగా మెండయి రక్తవాయుసంచాలనమునకు శరీరమున వలయునంతటి సౌక

ర్యము నశింప స్థూలమభివృద్ధిజెందును. ఆ స్థూలమును గాంచియే మూఢులు దేహము బలాఢ్యమయినదని భ్రమింతురే కాని వాస్తవ మది కాదు. అట్టి స్వభావవిరుద్ధమగు స్థూలమును బడయు వ్యక్తికి మాంద్య మభివృద్ధియగును. ఆ మాంసము మెండగును. మితిమీరిన నిద్రాసక్తి యొదవి, యనుదినము దేహస్వాస్థ్యమును నశింపజేయును. అల్పకాలమునందే యట్టివాడు, అజీర్ణవ్యాధికి గురియగును. అట్టివానికి నరకానుభవమప్పుడే విశదమయి పోవును.

మూత్రపురీషాదులతో నిండిన మాయాశరీరము యొక్క మాయకాంతినిగాంచి మిట్టిపడి, మూర్ఖులగు నరులు విలాసప్రియులయి, నోరెరుగని జీవముల జంపి, యారగించి, జిహ్వాచాపల్యము యొక్క ప్రభావమును గుర్తెరుంగకున్నారు. జీవముల బాధనుగూర్చి విచారింపకుండుట యటుండ, మాంసాహారులు పడయు శరీరనష్టమును గూర్చి తెలిసియున్నాడను గదా! అధర్మమును స్వీకరింప దేహక్షయము వాటిల్లక, వికాసమెట్లు కలుగనేర్చును? మాంసాహారులయందు తమోగుణమును, రజోగుణమును వికసించియుండక తనవారికి జన్మించు సంతానము సహితము విశేషించి రాక్షసబుద్ధిగలదై యుదయమగుచుండును. అట్టి రాక్షస సంతానముచే సృష్టిక్రమము కలుషితమగును. భగవదాస్తిక్యచింత నశియించి నాస్తిక్య విచారణమే మానవకోటియందు పెంపొందును.

మన యీ మానవాకృతి, గతభావపరిణామమే యయినచం దమున శరీరముయొక్క వికాసక్రమము సహితము త్రివిధా త్మకంబగు నాహారస్వీకారముయొక్క ఫలితమే యని గ్రహింపుడి. రజస్తమోగుణంబుల విసర్జించుటయే యభ్యుద యాపేక్షులగు మానవుల విహితధర్మము. జీవితాభ్యుదయ మున కావశ్యకంబులగు నాహారవ్యవహారము లతిసాత్వికంబు లయి యుండవలయునని, యార్యులు సెప్పు నీతులబాటింప వలదే? "ఆహార శుద్ధౌ సత్వశుద్ధిః సత్వశుద్ధౌ స్థిరామతి" సుస్థిరంబగు చిత్తమును గల్గియున్నపుడెగదా మానవు డైహి కాముష్మిక ధర్మసంగ్రామంబున విజేత కాగల్గునది. పాశ్చా త్యులేమి వచింతురు? "A Sound mind in a sound body." ఇహమునం దహింసనే నట్టి విపరీతంబగు నష్టము ప్రత్యక్షమగు చుండ నింక నాముష్మిక సౌఖ్యము లభ్యమగునని భావించు నంతటి మూఢుడెవ్వడుండును? పునాదులే కూలిన నింక సౌధో పరిభాగము భద్రముగా నెట్లుండనేర్చు? ఆముష్మిక జీవితము నకు * సాధువర్తనము నుచ్ఛభావము లావశ్యకమయి యుండ వాని నెడబాసి, దామసప్రకృతిని ముక్తిపాలిటి యురిక్కడి రక్కసిని, హింసాచరణంబున బడయు టెంత యవివేకము? ప్రపంచములో గార్యమునకు మూలకారకులగు కర్త, కార

* ఆంగ్ల నీతిశాస్త్రవేత్తయును సిద్ధార్థుని భావముల కనుకూలముగనే మానవోన్నతికి Plain living and High thinking అధారభూతమనిరి.

యిత, ప్రేరకుడు, అనుమోదకుడు నను సలర్వగను దుష్కా ర్యపరిణామానుభవంబున సమభాగులే యయి యుందురు. కాన హింసాభావమునకు హృదయమున స్థానమొసంగిన వారె ల్లరు మహాపాపులే యగుదురు. అన్నలారా! వినుడు యిం కను వినుండు. మానజీవితములు క్షణభంగురములు. నేడున్న రేపున్న. ఇట్టి విశ్వాసదూరములగు మాయ తిత్తులకే గర్విం పుచు, కండ్లు గానరాక, ఘాతుకమృగములనయి, నీతిదూరు లమయి, ఛండాలురమయి, జీవకోటుల బాధ నెరుంగక కర్క శబుద్ధి నవలంబించి, మారణక్రియకు బాల్పడుచుందుము. నేటికాలపు మానవులు వివేకములేక జ్ఞానము లేదని మనచే భావింపబడు పశువులకంటెను, జడములని మనచేనెన్నబడు పాషాణములకంటెను, నింద్యులయినారు. శిల యేస్థానమున బడి యుండునో యాస్థానమందే మానవుడు దానిని స్పృశిం చునంతపర్యంతము, జీవకోటికి హాని నిసుమంతయయిన గల్గిం పక పడియుండును. మానవుడు స్వప్రయోజనార్థ మద్దానినెట్లు పయోగించుకొనినను యది యుపయోగపడును. దాని తత్వ మంతయు బరోపకార పరిపూర్ణమేకాని పరుల కపకారము గావించు భావముకలది కాదు. స్వార్థము నాజడ మనుభవింప జాలదు. పశువులు సహితము నుదరపోషణంబును దక్క సం సారమున సంతకుమించిన స్వార్థము నహియు నభిలషింపవు. అవి కేవలము ప్రకృతి సంబంధమయిన యానందమునే యను

భవింపుచుండును. తృణాదియోషధులే యాహారము. పృథ్వి యే శయ్య. నిర్మలంబగు జలమే పానీయము. పరిశుద్ధమగు వాయువే యాఘ్రాణించు పదార్థము. సూర్యచంద్రతారకలే యవ్వాని మైదానగృహముల వెలుంగుదీపములు. మానవపేవరయే వాని జీవనపరమావధి. చూచితిరా! వనచే జ్ఞానములేనివనియు, బశువులనియు భావింపబడు జీవములే యెట్టిపవిత్రమైన స్వచ్ఛంద జీవితమును, నిస్స్వార్థ విధానము ననుసరించి గడుపుచున్నవో. జ్ఞానముగలవాడ నని చెప్పుకొనుచు మానవుడెట్టి నీచకార్యముల నాచరింపుచున్నాడో విచారించుకొనుడి. మానవుడన్ననో షడ్రసయుక్తంబగు మాంసాహారమును, బ్రకృతివిరుద్ధమగు హంసతూలికాతల్పంబును, ఇంకనెన్నియో కృత్రిమసౌఖ్యంబులను ననుభవింపుచు జీవకోటిని హింసించుటయే జీవిత పరమావధిగా నిర్ణయించుకొనియున్నాడు. పశుధర్మముకంటె మానవధర్మమే నింద్యమయినట్లు విశదమగుచున్నయది. మానవుడు యజ్ఞయాగాదులను నెపంబున, బశువుల సంహరింపుచు, దేవతలకయి చంపబడిన యాపశువుల మాంసము నా దేవతలనిమిత్తమే వదలివేయుచున్నాడాయన్న-లేదు. బంధుమిత్రాదులు పరస్పరవిభాగంబుల నారగింపుచున్నారు. కర్మకాండము నధికముగా బ్రేమించునట్టియు, సాకారోపాసనా తత్పరమతులయినట్టియు, బూజారుల దేవాలయంబుల షడ్రసోపేతమగు భోజనమును సిద్ధ

పెంచి, సర్వేశ్వరుని నైవేద్యమని చెప్పుచు నిజోదరముల నింపుకొనుచందమునవే యజ్ఞయాగాదుల గావించువారు నేటివరకు నేయుచున్నారు. ధర్మవిరుద్ధమగునదియే స్వార్థముగాని ధర్మానుకూలమయి యున్న ప్రయోజనము మానవాభ్యుదయమున కావశ్యకంబేగాన నయ్యది విచారణీయాంశము కాదు. మానవుడు మాంసాహారి కాడనియు, హింసనేయుట యతని యంతఃకరణమునకు బ్రతికూలమగు కార్యంబనియు నిప్పటికయిన దెల్లంబాయెనా?

వినుడు. మేషశాబకము సాధుజంతుకోటికి జెందినది. దానియాహారము తృణాదియోషధులు. దానివలన మానవున కెన్నియో ప్రయోజనీయంబులగు పదార్థములు లభ్యమగుచుండును. సింహము ఘాతుకమృగమయి చరించుచున్నది. సింహము ఘాతుకమృగ మగుటంజేసి, దానినిగాంచి సాత్వికాహారమును భక్షించు మేషశాబకము భీతిల్లుచున్నయది. కారణమేమనగా సింహమునకు దమమాంసమే రుచించునని మేషశాబకమునకు గ్రహించునంతటి సామర్థ్యమును సర్వేశ్వరుడు జన్మతోడనే ప్రసాదించియున్నటుల దెలియుచున్నది. ఆ మేషశాబకమే సాత్వికాహారమును గొను నేప్రాణిని గాంచినను భీతిజెందదు. కుక్కనుజూచినను నయ్యది భయపడును కాని మానవునిజూచి భయము జెందదు. మానవుడు తనజాతికి జెందిన యాహారమును భక్షించువాడనియే యది యూహించుచుం

కును. చూచినారా! జన్మతోడనే మానవుడు సాత్వికాహారము-
నారగించి జీవించుజ్ఞానమునే గొనివచ్చి, మూఢుడయి, పశువుల-
కంటె ధర్మాచరణమున వెనుకబడిపోవుచున్నాడు. సర్వజనుల-
యనుభవమునబడు నీ విషయమును వినుడి. మాంసముచేతనే
జీవించుప్రాణులు దివాసమయంబున నిద్రించుచు, రాత్రిసమయ-
ముల మేల్కాంచియుండి, పవలు మేల్కాంచియుండునట్టియు,
సాత్వికాహారముచే శరీరముల బోషించుకొనునట్టియు నిశా-
సమయంబున నిద్రించునట్టియు జీవులసంహరించి, పొట్టనింపు-
కొన యత్నింపుచుండును. విజ్ఞానమయసృష్టితో వీక్షించిన
మానవుడు రేయి నిద్రించువాడే కాని పవలు కాదు. దీనివలన
సహితము మానవుడు మాంసాహారి కాడనియు, నహింసాత్మక
జీవితమునే ప్రధానముగా భావించువాడనియు, స్పష్టమగుచు-
న్నయది. గోమేషీమహిషాదులవలన గృహస్థకోటికి రక్తోత్ప-
త్తికి మూలహేతువులగు దుగ్ధదధిఘృతములు ప్రాప్తించు-
చుండ, వానిని గళితచిత్తులరయి వధియింప జేతులెట్లాడునో?
వృషభాదులాజీవనము విసువుజెందక, బుభుక్షాపిపాసా పీడి-
తంబులయినను, ఘోరసూర్యాతపంబుల బరువులమోసి, మాకు
సహితమును సేకరింపుచుండ, వానినే దయమాలి హింసింపనౌ-
ల్లునే? సర్వేశ్వరసృష్టిలో సాధారణముగా సమస్తజీవరాసులు
మానవునకు హితము గావించుటయందే లగ్నమయి యున్న-
టుల మనము విజ్ఞానమయనేత్రమును విప్పినచో నవలోకింప-

గలము. నరనారీమణుల జ్ఞానవశంబున స్వార్థసిద్ధులకయి, సేయు వ్రతంబు లన్నింటికంటె నహింసావ్రతానుష్ఠానమే మహత్తరమయినది. హింసయందు స్వార్థము సహితము దూరమాలోచించిన లేదనియే ప్రతిమూఢునకును గోచరింపకపోదు. అహింసయే స్వర్గమును భూలోకమునకు గొనిరాశక్తిగల్గిన యద్వితీయంబగు వ్రతరాజము. ఏతద్వ్రతవిరాజిత భూమండలమభినవస్వర్గంబుగ బ్రతీతమగుట యాధి.

'ఓ నాప్రియభ్రాతలారా! తండ్రులారా! మీరనారతము సేయు యజ్ఞయాగాదుల పరిణామ మేమయియుండునో వ్యాయముగా నూహించుకొనుడి. భగవద్భక్తియు, ముక్తియును దేనిపై నాధారపడియుండునో గ్రహించితిరా? మోక్షమందిరమునకు బునాది యహింసయనియే గుర్తెరుంగుడి. అహింసయనగా హృదయము యొక్క నైర్మల్యమే యనియు శ్రేష్ఠోండు గాదనియు దెలియుడి. నేడు మీరు పశుబలమున్న దికదాయని భావిజీవిత సౌఖ్యమునుగూర్చి విచారింపకయే పశుమారణమునకు బాల్పడుచున్న ముందుమీకంటె బలవంతుడగు దేవుడు మిమ్ము దుష్కార్యాచరణమునకయి శిక్షింపక వదలివేయుననుకొంటిరా? నిష్కల్మషంబులగు చిత్తముల గల్గియుండు మేషములు మనల నారాధ్యులుగ నెద దలంచి పూజసేయుచున్నవి. తమజీవితములను మనహితార్థము వినియోగము సేయుచున్నవి. అయ్యవి యల్పాహార

ములతో సంతుష్టి జెంది, మూఢమానవులవలె నీచపరిణామ దాయకంబులగు భోగవిలాసముల నపేక్షింపకయు మానవుల వలె ద్వేషమాత్సర్యాది దుర్గుణగణములకు దూరములయి యుండి స్వీయరక్త సంజాతమగు క్షీరాదిక మిష్టాహార ముల మనలకు బానము సేయనిచ్చుచు, హృదయముల కమితానందము గొలుపుచున్న యవి. సృష్ట్యాదినుండి మా నవుడే కాలమున కొక్క యాచారమును వ్యవహారమును ఆహారమును స్వీకరించుచు వచ్చియున్నాడు గాని మేష ములు మొదలగు పశువులు తొల్లింటి యాహారమునే సర్వోత్తమంబగు ప్రకృతి సిద్ధాహారముగ భావించుచున్న యవి. అనుదినము మానవు లింద్రియదాస్యమునకు గురి యగుచునే యున్నారు. కాని, పశుపక్ష్యాదులు సృష్ట్యాదిని ప్రాప్తించిన తమధర్మ సిద్ధాంతముల నెప్పటరీతిగనే పూజిం చుచు నాచరించుచున్నయవి. గొఱ్ఱెలు మనలకు బానమునకు క్షీరమును శీతవాతభయమునుండి సంరక్షించుకొన రోమా వళిని బ్రసాదించుచున్నయవి. వానివెంటచే క్షేత్రముల కమిత బలము లభించుచున్నయది. గొఱ్ఱెల యెరువువలననే ఫలపు ష్పంబుల నొసగు వృక్షజాతులు నూతనవికాస భాసురములయి, హరితవర్ణ విలసనంబున నవనవలాడుచు వృద్ధిజెందుచున్నయవి. గొఱ్ఱెలనుండి మన మపారలాభమును బడయుచుండియు, నిర్ద యచిత్తులమయి సంహరింపజూచు టెంతయు మహాఘోరము.

యుక్తాయుక్త వివేచనాజ్ఞానవిలసితులే మానవులని గురుజను లుపదేశింపుచుండ, మనము మర్త్యులమయ్యు దోషరహితములగు జీవముల వధించుట ఘోరహత్యాచారమని గ్రహింపకుండుటెంతయు లజ్జాకరము. పరమేశ్వరుని దయకు పాత్రులగుటకు బలికార్యమే మానవులకు ముఖ్యసాధనమయినట్లు మీకు బోధకట్టెనా? సర్వేశ్వరుడే, మేషముల సృజియించియుండియు, వానివధనే తిరిగి కాంక్షించునా? మనము పరమేశ్వరుని సంతానమును సంహరించి, వానిని సంతసింపజేసి, వానివలననే వరముల బడసి, ముక్తి కనుకూలమార్గమును బడయ వాంఛించుచున్నారము. మనకాంక్ష భ్రమాన్వితము. స్వాశ్రయశాఖను ఖండింపజేయువా డధఃపతితుడు కాకుండునే. తనచే సృజియింపబడిన బిడ్డల హత్యగావింపుచుండుట గాంచి, పతితపావనుండును, న్యాయైక గుణసమన్వితుండును, దుష్టశిక్షక శిష్టరక్షకుండును నగు నాపరాత్పరుండు మనల నతికఠినముగ దండింపక వదలివేయునే? సర్వేశ్వరుడు నిర్హేతుకజాయమానకరుణార్ద్రచిత్తుండయి యుండ ప్రాణివధ కెట్లు సహింపనోపు? తాను సృజియించుజీవముల బునః నరులు దయమాలి బలివెట్టుచుండ, జగన్నియంత పశ్చాత్తాపమును బడయక నిర్మలానంద చంద్రికావిలసిత వదనారవిందు డగుచున్న వెఱ్ఱితనంబుగాదే? తనబిడ్డలు సంహారింపబడుచుండుట గాంచి, తండ్రియనువాడు క్రుద్ధుడగును గాని స్వప్నమందయిన సంతుష్టాం

తరంగుడగునే ? శక్తిలేనట్టియు, నోరులేనట్టియు, పరితాపమును శబ్దములచే వెల్లడించి, ప్రతీకారము సేయలేనట్టియు జిహ్వ సహోదరుల హింసించు నగ్రజునిగాంచి, మాతాపితలు మహోగ్రము నందకుందురే ? అట్లగుట మానివైచి హంతకుడగు పెద్దకుమారునికి బ్రహ్మానందముతోడ సలని పశుబల పటుత్వమునకయి శాశ్వతముగా భుజింపుము మనుమని యాశీర్వాదముల నొసంగుదురే? జననీజనకులు పెద్దకుమారుని హంతకునిగ డెందమున భావించి వానివలన సంసారమున కనారతము * గీడుమూడునని సంశయాత్ములరయి, వానినే తక్షణము పరిమార్చకుందురే ? అదియే నడుమున సమస్త లోకాధారభూతుండగు సర్వేశ్వరసంజాతజీవకోటి నిలపై లయము గావింప నెంచు దుష్టహంతక మానవబృంద మాకరుణాసాగరుని నిర్మలభావనివిడీకృత నిష్కల్మష విశాలదృష్టినుండి పతితమయిపోవుట నిక్కువము. సృష్టిస్థితిలయములకు హేతుభూతుండగు విధాత సమస్తజీవుల భూలోకమనియెడి పుష్పవాటికయందు విహారము సేయుచు నానందించుటకే సృష్టించియున్నాడు. అత్క్రియ సృష్టియందత్యాచారములు సంఘటింపబడు

* హిందువులచే మహోత్కృష్టములుగ భావింపబడు రామాయణ భారతాదులు పతితులు లోకమునకు గీడొనరించువారిని బరిమార్ప సర్వేశ్వరుడు సంసిద్ధుడను సిద్ధార్థుని వచనమును బలపఱచుచున్నవి. భగవద్గీతయు నీమార్గమునే యనుసరించినది.

చుండుటఁగాంచి, విశేషకాలపర్యంత మాదేవదేవు డోరిమి గల్గియుండు టసంభవము.

అట్లుపేక్షవహించుటయు సమస్తలోకపాలకుడగు వానికి యుక్తమునుగాదు. దుష్టమండలియొక్క దుండగముల దుష్టజనమర్దన బిరుదాంకింతుండగు నాజనార్దనుండు దూరీకృతము గావింప సర్వదా సంసిద్ధుడయియుండును. ఈశ్వరుడు మేషజాతి నిహమున సుఖియింపుచు, మానవకోటికి హితము ను నేకూర్ప రచియించియుండెగాని, హంతక శిరోమణులగు నరోత్తముల కరాల కరవాలధార కెఱగవ్వని సృష్టించియుండలేదు. భగవంతుని మహత్తరంబగు నీవిశాలసృష్టి నిర్వ్యాజానురాగ విలసితంబుగాని, కాఠిన్య గుణగణ విభ్రాజితంబుగాదు. జనకుడు దాను జన్మింపజేసిన శిశువులవధ గనులారగాంచి, సహింపనోపనట్టే, పరమకృపాలుండగు పరాత్పరుండుగూడ దన సంతానమగు మేషముల నిరాతంకముగ నంతమొందింపుచుండుట నీక్షించి సైపనోపడు. ఏజీవమయిన విలపించుచుండ సజ్జనుడైనపురుషు డదిగాంచి సహించునా? మాతృదుఃఖబాహుళ్యమును వీక్షించి, యాత్మజుండు రోదనము నేయు చుండుటలేదా? బాధచే నొక్కయనాథుడు విలాపము నేయుచుండ మన మదిగాంచి, యుత్తప్తబాష్పవారికణముల విడుచుటలేదే? సర్వేశ్వరనిర్మితసృష్టి నిర్మలానురాగాధారకృతంబుగాదే? ప్రేమమయన నాతాత్పర్యము వ్యామోహ

స్వరూపంబగు ననురాగమని కాదు; విశ్వసోదర ప్రేమయనియె. సమస్తమునకు బ్రేమయే యాధారము. సచరాచరములతో గూడిన విశ్వమునకు బ్రేమయె మూలము. వేయేల? సృష్టిప్రేమ మయము; ఈశ్వరుడు ప్రేమమయుడు; సమస్త జీవరాసులు ప్రేమమయములు. విశ్వమని యెడి సౌధము ప్రేమయను పునాదులమీదనే నిర్మితమయినది. హింస నభిలషించునరులు ప్రేమ శూన్యులు. నిజ జీవనోదయమునకు మూలహేతువగు ప్రేమ నెడబాసినపుడే మానవుడు హింసానురక్తుండయ్యెనని గ్రహింప వచ్చును. హింసాభావమను విషబిందువును స్పృశించకపూర్వము హృదయభాండ మలౌకికప్రేమదుగ్ధరస సంపూర్ణమయియుండును. విషబిందు స్పర్శంబున దుగ్ధమెట్లు హాలాహలమగునో యదియేవిధము హింసానురక్తిం గల్గినంతనే, పరిపూర్ణప్రేమభావ మకరందవిరాజితంబగు హృత్కమలము శుష్కించిపోయి, కళా విహీనంబగును. అనగా మకరందవిరాజితంబగు కమలము పుష్పాడిని బాసినంతనే యేరీతిసమస్తజనులచే నాదరింపబడదో, యది యేసూక్ష్మప్రేమయనెడి మకరందమును గల్గియున్న హృత్కమలము తన్మకరందమును, హింసయనియెడి కీటకప్రవేశంబునఁగోల్పోయినంతనే సమస్తజనావళిచే ననాదరమును బడయును. జనులారా! దైవస్వరూపంబగు * ప్రేమ హింసయను రక్కసిచే

* ఒకానొకకవి ప్రేమతత్వము నిట్లు స్తుతియించుచున్నాడు:—నిర్మలంబయిన ప్రేమయెదుట:—

హాతము గావింపబడుచున్నయది. పశువుల నధించికాని ప్రాణా వశిష్టంబుల గావించికాని దైవమును మీరు పడయజాలరు. ప్రేమను సంరక్షించుకొని, యద్దాని మహాత్వపటుత్వ సమన్విత తత్వశక్తిని గ్రహించుటయే యీశ్వరునిం గనుట. ప్రేమ యున్నపుడే కరుణ యుద్భవించును. సర్వేశ్వరుని సృష్టిలో నల్పాంశమగు మానవుడే జీవకోటిదుఃఖమును గాంచి విలపించు చుండ, సమస్తమునకు మూలకారణుండగు నప్పరమేశ్వరుం డేల విషాదాయత్తచిత్తుండు కాకుండును? సంసారములో నత్పురుషునికే యింత భూతదయ, నిర్వ్యాజ కరుణాళుత్వము నుండ దజ్జనకుండగు హరి కద్దాని కెన్నిగుణము లెక్కు డుండునో సభాసదులారా! మీరలే యూహించుకొనుడి. మేషములను నిర్నైతుకముగ వధించి, నిజపాపపుంజ భార మును వానిపైనిడి విముక్తి బడయవచ్చుననియా, మీరు సంతసించుచున్నారు? జనకుడు పుత్రులలో నొక్క డపరాధము గావించియుండ మరొక్కని శిక్షించుట యుక్తకార్యమే!

కాలకాకోదరము పూలకీమాల యగును,
దారుణారణ్య మభినవోద్యానమగును,
జ్వలనకుండంబు చందనకలశమగును,
బండరానేల యవిరళపానుపగును,
మందువేసవియెండ శీతమౌ యెండయగును,
మృత్యుదేవతే పరమాప్త మిత్రమగును"
ప్రేమచేత నేగదా భాగవతోత్తముల మక్తిగన్నది.

అట్టి యధర్మకార్యమును గ్రహించిజ్ఞుండగు మానవుఁడే యాచరిం
పఁజేయుఁడ, సర్వజ్ఞుండగు సర్వేశ్వరుం డెట్లుగావించును?
నిరాకారంబులగు వాదములు వితండవాదములు కావె? పాప
కార్యములగావించి, వానిని గప్పిపుచ్చుటకు జీవహింసయే
లాభప్రదంబని భావించి మూర్ఖులరయి నరులు నోరులేని
యేపాపమెఱుగని గొఱ్ఱెల వధియింపుచుండ, వారికి న్యాయా
న్యాయవిచక్షణగల కృపానిధి యర్హదండన మొసంగక కలన
యిన ముక్తినొసంగునే? చేసినపాపమునకయి పశ్చాత్తాపపడిన
దోషహరణంబగునుగాని దానిని గప్పిపుచ్చుటకు పరోక్ష
దుష్కృత్యము గావించిన మొదటిపాపము ద్విగుణితమయి
నరకప్రాప్తిం గలుగజేయదే? వివేచనాదూరుఁడగు బాలుఁడు
విద్యాలయమునందు గావించిన కొంటెపనిని రహస్యముగ
దాయనెంచి, మరియొక బొంకు బొంకి యంతమానకు విజ్ఞుడగు
నుపాధ్యాయునిచే శిక్షను బడయుచుండుట లేదే? హింసింపబడు
వారు హింసింపబడుదురని యెఱుంగరే? మానవధర్మమును
ద్రోసిపుచ్చుట విహితకార్యమే? జీవహింసను మించిన వేఱొండు
పాపమిద్ధరణి లేదు. గొఱ్ఱెలవధించు హేతువుచే బాపాత్ముని పా
పభారంబు హెచ్చుచుండునుగాని క్షీణింపజాలదు. లాభాలా
భంబులగ్రహింపజాలక, మూఢులగు మానవులు తమపాదము
లపై దామే కాష్ఠములని భ్రమించి, ప్రచండతరకుఠారాఘాత
మును గావించుకొనుచున్నారు. స్వర్గనరకభేదమునే విస్మ

రించి, పీయూషమనిహాలాహలమును బానము సేయుచున్నారు. సంతతము సత్కార్యముల జేయుటయే సజ్జన పురుషోచిత లక్షణము. సంసారములో నహింసాతత్వప్రచారము సలుపు సజ్జనుల కృత్యంబులు పరోపకార సంపాదనా పూర్వకంబులయి, దేహళీ దీపన్యాయంబుచే స్వోపయోగపర్యవసితంబులగుట సార్వజనీనంబు.

సుకృతములే స్వర్గమందిరమునకు సోపానములయియుండ, దుష్కార్యానురక్తులగు మూఢజను లెట్లు స్వర్గార్హులగుదురు? స్థాలీపులాకన్యాయంబుచే బ్రపంచమే స్వార్థభూయిష్ఠమయి వెలయుచున్నట్టు విశదమయ్యెడిని. ఈలోకమునందుగాని మఱి యేలోకమునందునుగాని మానవుడు తాజేయు పాపములకు దానే బాధ్యుడు కావలసియుండును. కనుక సమస్తదోషములకు నుత్తరవాదులగు మనుష్యులు సంసారమున గర్తవ్యాకర్తవ్య జ్ఞానహీనులయి, పాపకార్యాచరణంబు గావించు టెంతయు నశుభప్రదంబు. మానవుడు కింకర్తవ్య విమూఢుడయి యుండుటకంటె జీవదయాపరుడయి, మూఢులకు నహింసావ్రతమాహాత్మ్యమునుగూర్చి ప్రబోధము సేయుటయుక్తకార్యంబ. సమస్తజనులు నైక్యభావముతో జీవహింసాతత్పరుల నకార్యమునుండి నిరోధింప యత్నించిన, సర్వేశ్వరు డట్టివారినే తనయథార్థమగు భక్తశేఖరులుగ భావించి, యానందించి, వరమును బ్రసాదించును. సంసార

ములో సమస్తప్రాణుల జీవితములకంటె మానవజీవితమే యత్యుత్తమంబని వక్కాణించుటకు గతంబెద్దియన నరు డుచితానుచిత జ్ఞానసంపన్నుడయి, పురోభివృద్ధి తత్వపరిజ్ఞాత యయి చెన్నారుచున్నాడు. ఈశ్వరకటాక్షంబున ద్వివిధేం ద్రియముల నహింసాకార్యమున సిద్ధినిబడయ ననుకూలము గావించుకొన శక్తిసంపన్నుడయి యున్నాడు.

సర్వేశ్వరుడు మానవజాతికి యుక్తాయుక్తముల నుపదే శించు నంతఃకరణము నొకదానిని బ్రసాదించియున్నాడు. ఈ యంతఃకరణమే సంతతము మానవుని మానసికప్రవృత్తుల నికృష్ట కార్యాచరణమునుండి మఱలింప నవిరళప్రయత్నము నేయుచుం డును. కాని నరు డాయాత్మపరిబోధమును సరకుగొనక పాప భీతిదూరుడయి, పతితకార్యముల నాచరించి యంతమునకు నధఃపతితుడయి పోవును. మానవునకు బురోభివృద్ధికయి పరా త్పరు డొక యలౌకికశక్తిని బ్రసాదంచియున్నాడు. హృద్గత భావసందోహ ప్రకటనార్థమయి పరమ పునీతంబగు వాణిని ద యచేసియున్నాడు. ఇంకను ననేక సూక్ష్మతమంబులగు శక్తుల నొసంగి యున్నాడు. ఇంతయేల? పశువులకన్న మిన్నగా నరుల సృజియించి మానవపక్షపాతియయి వెలయుచున్నాడు. ధర్మా ధర్మ విచక్షణగలవాడె నరుడు. దయాదాక్షిణ్య శూన్యుం డును, నికృష్టకార్య తత్పరుండును, హింసాత్మకుండును నగు వ్యక్తిస్వరూపమాత్రంబుచే మానవుండనియు, గుణకర్మాదు

లయందు ఘాతుకవ్యాఘ్రంబుకంటె కడుంగడు నీచముగ నెన్న
బడును. అట్టికార్యములనేయు నరులు నీతిమంతుల దృష్టియం
దున్, పరాత్పరుని యుదారంబగు విశాలదృష్టియందును
నరపశువులవలె గాన్పించుచుందురు. జగన్నాటక సూత్రధా
రుండగు దయాసాగరుడు నరుల నుత్తమజీవితముగల వారుగా
సృజియించియుండ, వారుత్తమపదవినుండి భ్రష్టులరయి
గర్హిత పదవి నలంకరించి దండనార్హు లగుచున్నారు. సర్వే
శ్వర ప్రదత్తంబులగు సమస్తమహత్తరశక్తుల నత్యంతశ్ర
ద్ధాభక్తులతో సంరక్షించుకొనుచు బెంపొందింప జేయుటయే
మానవుని ధర్మము. మానవుడు నిజధర్మ స్వభావానుకూల
శక్తియుక్తుడయి పెలయుచున్నంతపర్యంతము శ్రీహరిసహితము
వానికెల్ల విధముల సాహాయ్యమొసరింప గటిబద్ధుడయి యుండు
ను. నరు డెప్పుడు నిజధర్మచ్యుతుడగునో యప్పుడేయతడు పర
మేశ్వరుని కఠోరశాపదండనములకు గురికావలసియుండును.

పరాత్పరుని కఠోరశాసనము లవశ్యాచరణీయములు.
ఈశ్వరశాసనములకు బ్రతికూలంబుగ జరించువారికి దయామా
యుండిచ్చు కఠినదండన లవశ్యభోక్తవ్యములు. ఈశ్వరునిశాస
నములలోనికెల్ల నహింసావ్రతానుష్ఠానము అనగా హింసా
బహిష్కారమే యుత్తమోత్తమము. మానవు డిహలోకమున
బరోపకారమునే జీవితలక్ష్యముగ నేర్పరచికొనియుండుట సన
వానినిస్వార్థజీవితము పరమార్థప్రాప్తికర్హంబగును. హింసను

జేరిరేచునట్టి స్వార్థసంపన్నుండగు వ్యక్తి పరమార్థమునకు బాతురిదుకాదని శాస్త్రము లుద్ఘోషించుచుండ నిత్యము హింసాచరణమునందే సమయమును వినియోగముసేయు బ్రహ్మరాక్షసు డెట్టుల ముక్తిని బడయనేర్చును? అహింసయను శబ్దమునందే సమస్తప్రపంచ ధర్మతత్త్వసారము ఘనీభవించియున్నది. ఈ పరమపావనంబగు పదరాజమునందే సర్వేశ్వరాంశసంభూతములగు సమత్వసత్త్వగుణ ప్రతిపాదకశక్తులు కేంద్రీకృతములయి, ప్రచ్ఛన్న రూపమున వెలయుచున్నవి. అహింసయే (యనగా బరోపకార మనినను యనగవచ్చు) ముక్తిసోపానము. పరుల, కనగా నేజీవులకును నపకార మొనరింపకుండుటయే మహాత్యాగము. తెలియకచేయు హింస మనలకు జెందదు. * శ్వాస పీల్చునపు డనేకంబులగు సల్పజీవరాసులు మనశరీరం

* ప్రపంచములో సహజముగ సంభవించు హత్యాదోషము మానవజాతిపై నారోపింపబడదు. మానసమునందయిన హింసాశక్తిని గలుగనీయకయే నర్తించుట మానవవిధి. తెలిసియు త్రికరణంబుల ద్వివిధంబులగు హింసాకార్యములను బాల్పడకుండుటయే మానవధర్మము. సిద్ధార్థుని భావమునే హిందూమతగ్రంథానుగ్రంథములు మహాభారతము బలపరచుచున్నయది. ధర్మవ్యాధుడు కౌశికుని కిట్లుపదేశించెను :—

"చం|| పలిలము లుర్వి యాకసము సర్వము జంతుమయంబు గావునన్
గలుగు సవశ్యము న్సకల కర్మములందును హింస, హింసకుం
దొలగిన దేహయాత్రలను దుర్ఘటమై చటులుండు, నింతయుం
దలపకు హింసజేసు మని తాదుచరించుచు గోండ తీమ్మహిన్.

బున ప్రవేశించి మరణింపుచున్నయవి. ఇట్టిహింస లనివార్య ములే యని తెలియుడి. బాహ్యదృష్టికిని, ఆంతరికదృష్టికిని గోచరమగుచున్నంతపర్యంతము హింససేయుట తగదు. ధరణీ తలమున ననేకజీవకోట్లు మానవులు పానముసేయు జలమునం

గీ॥ హింస సేయనివాడు లేడిజ్జగమున,
నొక్కఁడైనను దమతమ యోనినట్లు,
హింసతెరువునకెడగల్గి యేగవలయున
దిదియెచూవెయహింసనా నతిశయిల్లు.

భారతాది ప్రాచీనతమ గ్రంథములు సహిత మహింసాప్రాశస్త్యము నెట్లుగొనియాడి యున్నవో చూచితిరా! బుద్ధయుగమునకు బూర్వమే భారతీయు లహింసాప్రతిమానం దతిభక్తిగలవారైనట్లు తెల్లమగుచున్నయది. అహింసారక్షణార్థము, అసత్యమాడినను యది సత్యముగనే పరిణమించునని భగవద్గీతారహస్యమున లోకమాన్య బాలగంగాధరుడు సెలవిచ్చినరీతిగనే భారతముసహితము వాకొనుచున్నయది.

ఉ॥ భూతహితంబుగాఁబలుకు బొంకును సత్యఫలంబునిచ్చుఁ ద
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యముబొంకు నట్లగుక"

పాఠకులారా! ఇందెంతటి మహదర్థ మిమిడియున్నదో విచారించు కొనుడి. హిందూమతగ్రంథములు సహితమట్లుబోధింపుచుండ, హిందువుల యందెన్నియో దురాచారములు వేలుబారియున్నవి. పొట్టేళ్లపోరాటములు కోడిపందెములు, గుఱ్ఱపుపందెములు మొదలగు విలాససంబంధములయిన హింసలును, గంగానమ్మ, పోలేరమ్మ మొదలుగాగల పెద్దమ్మలకయి కావింపబడు జాతరలును యెంతినింద్యములగు హింసాత్మక కార్యములో పాఠకులే యూహించుకొందురుగాక!

చుండి యుదరమున బ్రవేశించి, జీవముల గోల్పోవు చున్న యవి. ఇట్టి యవశ్యంభావ్యములగు హింసలసహితము నెడ బాయుట మానవశక్తి కతీతమయిన కార్యము. వాస్తవ మా లోచింప మానవజీవితమే హింసాత్మకమయినది. పంచభూత ములయందును హింసాత్మకంబులగు భావములే గోచరమ గుచున్నయవి. దేహయాత్రికయి, యేదియో యొకవిధముగా గొన్ని జీవములు ధరాగతములే యగుచున్నయవి.

కొన్నిదివసముల పర్యంత మొకగృహస్థుడు స్వకీయ నికేతనమును మూసివైచి, కాష్టాంతరగతుడయినా డనుకొ నుడి. ఆ గృహముయొక్క కవాటవాతాయనంబులు బంధింప బడియుండుటచేత వాయువందుబ్రవేశించు సౌకర్యము నశించి నది. కతిపయవాసరంబులు వ్యతీతమయినంతనే యా యుత్తమ గృహస్థుడు సతీసుతాదులతోడ స్వగృహమున కేతెంచెను. గృహమున వాసముసేయ నిశ్చయించెను. ఆ గృహ మనేక దినములనుండి మూయబడియుండుటచేతను, వాయుప్రవేశ మునకును, సూర్యకిరణ ప్రసారమునకును వీలులేకుండుటవల నను, ఆహావాతరిము లంధకారబంధురంబయి యుండుట వలనను సూక్ష్మతరంబులగు క్రిమికీటాదు లసంఖ్యాకము లా గృ హమంతయు నిండిపోయినవి. ఆయుత్తమ గృహస్థుడు భార్యా పుత్రాదులతో బూర్వముపలె నందు బ్రవేశించి వాసముసేయ నిశ్చయించుకొని యున్నాడు. అట్టితరి గృహముయొక్క

కవాటములను, వాతాయనములను దెఱువవలసి యుండును. గృహము నారీతి దెఱచుటచే వాయువును, ప్రభాకరుని రశ్మి ప్రసారము నందు బ్రవేశించి క్రిమికీటాదుల రూపుమాపును. శేషించియున్నవి గృహము నితరవిధముల సంస్కరించుట తోడనే మరణించును. వృథాగా హింసయగునని, శంకించి గృహమున బ్రకాశము నొదవజేయకయే వాసము సేయ నారంభించినచో నల్పకాలమునందే యాగృహస్థుడు జాయాసుతుల తోడ రోగగ్రస్తుడయి, యకాలమృత్యువాతంబడును. అప్పుడదియు నరహత్యయే యగును.

కాన నోభ్రాతలారా! ధర్మనీతియుక్తంబగు జీవిత నిర్వహణమున వాటిల్లు హింసయు నొక్కహింసకాదు. శరీర నిర్వహణమే యథార్థ మాలోచింప హింసవలననే కాగల్గినది; స్వాభావికంబగు హింస మన యీదేహములు నశియింప నంత పర్యంతము వాటిల్లుచునే యుండును. కాని మానవులు తెలిసియు దుష్టబుద్ధులతోడ విలాసపరులయి, కాముకులయి జిహ్వాలోలురయి, మూఢభక్తి ప్రేరితులయి హింస సేయరాదు. దేవతల బలులకనియు, నాహారమునకనియు నౌషధనిమిత్తమనియు, విలాసార్థమనియు జీవములయసురుల, నక్రమముగ గొనుట మహాపాపము. స్వేచ్ఛగ విహారము సేయ నలవడిన నభశ్చరముల బంజరముల బంధించి, క్షణికంబగు నానందప్రాప్తి నిమిత్తము వాని స్వాతంత్ర్యముల కపహారంబగు చింత నొడగూర్చు

టయు హింసనాబలగు. భూపాలురు కొందఱు విలాసార్థ ము లై, సుందర విహంగావళిని బంధించి, నిజ రాజమందిర ముల బోషింపుచుందురు. ఇవ్విధముగ బక్షుల యానందము ను, స్వేచ్ఛను నష్టభ్రష్టమొనరింపుచు, వాని కమృతోపేయం బులగు నాహారంబుల నిడినను వానినివధించుటకంటె నెక్కు డు పాపమునకు హేతుభూతమగును. ఇయ్యెడ జీతాచింతఁ భేదమే సమన్వయించును. సమస్తజీవులకు ననగా చైతన్యము గల యెల్ల పదార్థములకు "ఆత్మవశం సర్వం సుఖం, పరవ శం సర్వం దుఃఖం" అను గురుజనవాక్యము సమానమేయ గును. (మహాత్ముడును, కర్మయోగియు, ధీరోదాత్తుడును నగు నబ్రహాము లింకనుమహాశయునివాక్య మిచట స్మృతి పథమూన దట్టుచున్నయది. if slavery is not wrong nothing is wrong :—దాస్యమే—పరవశము) దోషముకాని చో నేదియు నక్రమముకాదు.) సంసారహితార్థము వృష భాదులు పాటుపడవలసియే యున్నవి. అవి లేనిచే మానవజీవన నిర్వాహము దుర్ఘటమయిపోవును. సేద్యమునశించును. సృష్టికార్యక్రమమున కొంకించుక భంగము వాటిల్లును. వాని వలన ధర్మవిరుద్ధముగానట్టియు, శరీరపీడనమునకు హేతు భూతముగానట్టియు నుచితసాహాయ్యముంగొని తిరిగి వానికి బ్రత్యుపకారము సేయుట మంచిది. ప్రతిప్రాణియు మానవునిచే కాదు, ధర్మానుకూలంబగు నుదరపోషణనిమిత్తము దేహ

పరిశ్రమము సేయవలసియే యుండును. తనయాహారమును దానార్జించుకొనలేని ప్రాణి జడపదార్థముకంటె హేయమగు ను. వృషభములచే సాహాయ్యమును బడయుట యేమానవుని ధర్మముకాదు. వానిని బోషించుటయు మనవిధియే యగుచున్న యది. పశువుల స్వేచ్ఛను భంగపఱచి వానిని బంజరముల బంధించుటవలన సాత్వికంబగు మానవజీవితమున కించుకయు లాభముగాని వికాసముగాని వాటిల్లనేరదుకదా! సేవామార్గమున జరింపుచు హాయిననుభవించు వృషభముల స్వేచ్ఛగా విడిచిపుచ్చిన నవి క్రమక్రమముగ నాబోతులయి, పరస్పరకలహాగ్నిం దగ్ధమయిపోవుట నిక్కువము. వృషభశతంబు నొక దాని నొక్కక్షేత్రమున విహరింపవదలిపెట్టిన నవి కలహించి మ్రగ్గును. కాన వృషభాదులనుండి యుచితసాహాయ్యంబును గొని, వానిని బోషించుట యుక్తము. జవసత్వములున్నతఱి వానిని సేవామార్గమున నియుక్తముగావించి, వార్ధక్యమున వానికాహారము సక్రమముగ మహదానందముతో నొసంగుచుండిన బ్రిత్యుపకారప్రాప్తిలేదుకదా యని భావించి, వానిని బోషింపకుండుట మహాపాపము. మానవుని న్యాయాన్యాయబుద్ధి యట్టిసందిగ్ధావస్థయందే సుస్పష్టమగును. సంసారులనేకులు జవసత్వములుడిగిన వృషభముల బీడించియు, జర్మాపేక్షచే మాదిగలకు విక్రయించియు మహాదోషము సలుపుచున్నారు. కఠినాత్ముల లోకప్పుడు కఠినచిత్తులకే వశమ

గుట రూఢి. గోబ్రాహ్మణ సేవయే మానవధర్మము కాదు. (బ్రాహ్మణుడన, బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః) గోవులమాదిరి నెల్ల జంతువుల భావింపవలయుననియే తాత్పర్యము. పశుపక్ష్యాదులు, క్రిమికీటాదులు పర్వతారణ్యములు, నదీనదములు మొదలగునవన్నియు బరోపకార తత్వద్యోతకములయి యుండ వివేచనాపరులగు మానవులు హింసాపరులగు టెంతయు నిందనీయము.

ఓ నాస హెూదరులారా ! మీరలేరీతి సంసారమున సౌఖ్యమును బడయ నభిలషింపుచున్నారో యదియే చందమున నెల్లజీవుల నిరభ్యంతరముగ జీవింపనిండు. అట్లాచరించుటకే యహింసావ్రతానుష్ఠాన మని పేరు. * కష్టదశయందున్న జీవుల ప్రాణముల సమర్పించియైన సంరక్షించుటయే మానవధర్మమయియుండ నట్లు రక్షించుటకుమారుగ మీరలే దయాశూన్యులరయి, ధర్మదూరులరయి వానిని సంహరింపుచుండ, దీన దయాళుండగు భగవంతు డెందులకు గ్రుద్ధుడు కాకుండును? పరమేశ్వరోద్దేశ్యమునకు భిన్నముగ జరించువానికి స్వర్గప్రాప్తి యేడ? మిమ్ముల నెవడయిన నొక్క చెంపగొట్టిన మీకెంత

* పూర్వకాలమున శిబిచక్రవర్తి డేగయొక్కటి కపోతము నొండు దరుముకొని రాగా నాపావురము తన్నాశ్రయింప, నదాని కభయమొసంగి డేగ యాహారమును బడయలేక చింతించుననియెంచి, తన శరీరముయొక్క మాంసఖండముల గోసియిచ్చియుభ్ఛ యువిహంగములరక్షించెను. సిద్ధార్థుడు సెప్పిన యుత్తమానవు లిట్టివారె.

రెూ బాధకలుగుచుండ దీక్ష్ణఖడ్గధార కెరయగు పోషము లెట్టి బాధకు గాతియగునో మీరలే యూహించుకొనుడి. మాట్లాడ వాక్కు లేకయుండుటచే తన వానిబాధ మానవుని దృష్టికి గోచరింపక యున్నది. పలుపలుకు లేల! నను సమానవులు సర్వకాల సర్వావస్థలయందు "ఆత్మవత్సర్వ భూతాని" యను మంత్రరాజమును బఠింపుచు, దదనుకూలంబుగ జరించుచో ఏతన్మంత్రపరిభావంబున వ్యక్తి తాదాత్మ్యము జెంది సుఖించును. భూతదయ ముక్తినొసంగ సమర్థమయినది. నేనింతకు బూర్వమే సత్కార్యదుష్కార్యాచరణంబున మానవునకు లభ్యమగు ప్రత్యుపప్రయోజనమును గూర్చి ప్రసంగించి యుంటిని. భూతదయాపరుడగు మానవు డెంతటి నిరుపేదయయినను, గురూపియయినను, వికలాంగుడయినను, నీచజాతిసంభవు డయినను, (అనగా, మూర్ఖులచే సంభావింపబడు జన్మ చేగల్గు నీచజాతియని తాత్పర్యము) భూలోకమునందే యటనీచాంతముల దప మాచరించు తాపసశ్రేష్ఠులకంటె భూరికైవల్యసౌఖ్యమును బడయుట నిక్కువము. ఇం దెంతమాత్రము నసత్యము లేదు. ఇంతటితో నేను వక్తవ్యమునుండి విరమించుచున్నాడను."

రాజరాజప్రియతనూభవుండగు సిద్ధార్థకుమారు డీరీతిం బున మానవధర్మమగు నహింసావ్రతానుష్ఠానమును గూర్చి గంభీరముగనుపన్యసింప, బింబసారభూపాలు డా మహాత్ముని చెంతకు జెంచి బద్ధాంజలియయి, వినయ వి ధే యతాయుక్తభక్తిభా

వమ్ము లొక్కుమ్మడి ముఖారవిందమున నృత్యము సేయ, సగౌ రవముగ బరిణతులర్పించి, యిట్లు దాసానుదాసునిపగిది విన్న వింప దొడంగెను:— "సాక్షాత్పరాత్పరసదృశుండవగు నోమ హాత్మా! భవచ్ఛ్రీముఖంబునుండి వెలువడిన వాక్యములు వేద వాక్యములు. ఇట్టి పునీతంబులగు వాక్యజాలముల నేను విని కని యెఱుంగను. ఏతద్వాక్య సందోహమునం దలౌకికోత్తమ భావంబులు నిబిడీకృతమయి యున్నవి. అనేకశాస్త్రములను, అనేక మహాత్మనామధారులగు కపటమునిజన పరిబోధితోప దేశములను నాలకించియుంటినిగాని మున్నెన్నడును నిట్టి యపారసారగర్భిత సద్వాక్యముల నాకర్ణించి కర్ణముల కపూ ర్వానందము నొసగూర్చియుండలేదు. భవత్స్వరూపంబు నేత్రపర్వంబయియుండ నిసిర్మలనీతివాక్యావళి వీనులకు విందు గొల్పినది. నాపూర్వులు, జ్ఞానదూరులగు నాపూర్వులు, యజ్ఞ యాగాదులే మానవధర్మములని బోధించియుండుకతన మేమా నీచకార్యముల నాచరించి, స్వకీయజీవితముల గిల్బిషయుక్తము ములుగను, కళంకితములుగను జేసికొనియుంటిమి. లేనిచో మే మిట్టి నికృష్టకార్యములకు బాల్పడియుండెడి వారలమే కాము. సంసారములో ననేకులు పండితవరుల మనియు, ధీమంతుల మనియు, సంయమీంద్రుల మనియు, శాస్త్రకారుల మనియు, వగరిజాతివారల మనియు డంబముల గొట్టుచునే యుందురుకాని యొక్కడును మూర్ఖులకు బోధించువాడు

లేడాయె. ప్రపంచములో శతసహస్రసంఖ్యాకులు జనసంఘమున బండితవేషధారులయి, వేదవాక్కులని నీతివచనముల గఱపుచు గృహముచేరినంతనే తమ యుపదేశవాక్యముల దామే విస్మరించి, కిక్కురుమనకుండ సాధుజంతువుల జంపి కుక్షి నింపుకొనుచున్నారు. భవాదృశ సజ్జన సందర్శన సౌభాగ్యాభావంబున వివేకశూన్యులమగు మే మీ యంధకారబంధురంబగు నీచకార్యక్షేత్రమున విహరించుచున్నారము. అహింసయే పరమధర్మ మను గురుజనవాక్కు నేటికి మాకర్ణములకమృతమును వర్షింప జేయునదయినది.

మహాత్మా! సంసారములో బండితోత్తముల మని విర్రవీగు పామరుల మిథ్యావచనముల, మేము విశ్వాసార్హంబులుగ భావించి యుండలేదు. మనోవాక్కాయకర్మల నాచరించి కదా యథార్థమయిన పండితులు నిజధర్మమును బ్రపంచమునకు దెల్లముగావించునది. తమ భుజములపై మేషశాబకము నిడుకొని మండు వేసంగిదినములలో నందును మధ్యాందినకరాతపంబున ధూళిధూసరిత శరీరులయి, రేతెంచుచుండ గాంచితిమి. వాగ్మిత్వముకన్న కార్యశూరత్వమునే మిన్నగనెంచు భవాదృశోత్తమ పురుషపుంగవులే భూలోకమున కవతరించి స్థూలదృష్టినే సర్వస్వముగ భావించునరులకు దర్శన మొసంగి ధర్మసంస్థాపనము సేయు సర్వేశ్వరుని బోలియున్నారు. ధర్మసంస్థాపనార్థము పరమేశ్వరుడు యుగయుగము

సం దవతరించునని యెడివాక్కు యథార్థంబయ్యెడిని. పశుహింస సేయుటే నరకబిలద్వారమును దెరచుటయని, మాకిపుడు బూర్ణముగ విశదమయ్యెను. జీవహింస సేయుచు మోక్షము నభిలషించు వ్యక్తికంటె మూర్ఖుడీ ప్రపంచమున లభింపబోడు. అగ్నిలో బదము నిడి, చల్లగనుండవలయునని యీశ్వరుని బ్రార్థించుటవలన గల్గుఫలము మాకిపుడు మహాత్ములగు తమ దివ్యప్రబోధామృతధారాపానంబున సువ్యక్తమాయె డిని.

"ఓ మహానుభావా ! పిపాసార్తులమగు మాకింకను భవదీయోపదేశ పీయూషపానంబున దనివి తీరకున్నయది. దయాళురయి తమరు మరియొకసారి యుపదేశింప దీనుల మును, హీనులమును నగు మేము ప్రార్థింపుచున్నారము. నేను భవద్దాసాను దాసుండనుగాన నామనవి నాలకింపవేడెద" అంతట సిద్ధార్థుడు పునరుపదేశము సేయదొడంగెను :—

"అహింసావ్రతమును గుఱించి విశేషముగా వాకొనవలసిన దేమియున్నది ? మానవులు తమహితమును దాము వాంఛించు చందముననే పశువులను, పక్షులను, క్రిమికీటాదులను దక్కుం గల మఱి యేయితరజీవులను హింసింపక వానిని సహితము హృదయపూర్వకంబుగ జీవింపజేయ బ్రార్థింపుచున్నాడను. సమస్తజనులు ప్రాణికోటిహితమునే నిరంతర మపేక్షింపుచు వానిసుఖమునే తమసుఖముగ భావించుపక్షమున బ్రపంచ

మెంతసుందరముగను, సుఖప్రదముగను, సంక్షోభరహితం బుగను నుండునో మీరలే యూహించుకొనుడి. జీవహింస యను కఠోరశబ్దమును బ్రపంచము విస్మరించి, నిజహృదయ కోశముః సం దీశబ్దమునకే స్థానమునీయక వెలయునపుడే సర్వత్ర సుఖశాంతులు వెలయగల్గును అట్టి యవస్థయందుండు సంసార మొకవేళ నిస్సారమను విశేషణమును బాసి సారవంతమను విశే షణమును ధరియించునన్న నాశ్చర్య మేమియుండును ? అట్టి దశయందే భూతలము స్వర్గసదృశముగ వెలుంగగలదు. మాన వు లన్యోన్యద్వేష మాత్సర్య వైరభావంబుల నెడబాసి పో రాడి యొండొరుల జంపుకొనక, హింసయను నీచపదమునే స్మరింపక సర్వభూతహిత కార్యతత్పరులయి, పాపరహితంబగు పరిశుద్ధజీవితముల వ్యతీతము నేయువారగుచో సంసారమున సంతతము సంఘటిల్లుచు సంతాపవిషాద భయములును, దుర్ద శయును, అశాంతియును-వేయేల ? సమస్తాహితములును సహ జముగనే క్షణికమాత్రకాలంబున దూరీకృతంబు లగును. అప్పుడు మానవసమాజము సమస్తాన్యజీవములతో సహిత మపూర్వానందమును బడయుట వాస్తవంబగును. తత్సమయ మునందే సంసారులకు స్వర్గీయసౌఖ్యరసాస్వాదనసౌఖ్యంబు సత్వ రమె ప్రాప్తించుట సత్యమగును. భూపాలా ! మీకొక్క విష యమునుగూర్చి ప్రధానముగా విన్నవింప గుతూహలపడుచుం టిని. సామ్రాజ్యములు మనవికావు. అవి యీశ్వరుని భౌతికసంప

దలు. వానిపై మనకు బూర్ణాధికారము హుళక్కి. వానిని ధా
ర్మికదృష్టితో బరిపాలించుటకే మనకు హక్కు కలదు. సా
మ్రాజ్యము లాత్మసామ్రాజ్యానందమునకు భంగకరము ల
గుచో, నవి నీతిబాహ్యములయినవి. పృథ్వీ ఖండవిభాగములు
కేవలము జీవకోటి యానందములే యనియు భూపాలుర స్వా
ర్థమయంబగు విలాసములకు గాదనియు గుర్తెఱుంగుడి. మీరా రా
జ్యముపై మీకెంత యధికారముకలదో యంతియే స్వత్వమొ
క్క మానవునికుండగలదని మీరెంతదనుక గ్రహింపకుండు టెంత
యు శోచనీయము. ప్రథమావలోకసమయంబున మీరు "నా
భుజాదండ పరాక్రమ సంపాదితంబగు రాజ్యమును బాలింపుచుం
దుము" అని స్వాభిమానాహంకార మమకారపూరిత హృద
యులరయి నాతోడ బల్కియుంటిరి. అపుడు నే నెంతయు ఖేద
పడితిని. ప్రబోధశ్రవణంబున వెంటనే మేల్కాంచిన మ మ్మవ
లోకింప నాకెంతయు ముదమగుచున్నయది. పరస్పరాసూయా
గ్రస్థులయి, పరధనాకాంతఁ చే బ్రేరితులయి, భూపాలురు యు
ద్ధములకియ్యకొని రక్తధారల బ్రవహింపజేసి, భూఖండముల
సంపాదించుటెంతయు గడునీచము. అట్టిరాజ్యములు రాక్షస
రాజ్యములుగ బరిగణింపబడును. అసంఖ్యాకంబులగు నశ్వ
ములను గజములను పదాతులను బలిగొని రక్తమాంసాదుల
బ్రవహింపజేసి, రాజులు పడయునది రాజ్యరమాకరకమల
గ్రహణంబుగాదు. భయంకర మృత్యుదేవతా లోహదండ సదృశ

కఠినహ_స్తస్వీకారము, సామ్రాజ్యములు సుస్థిరములయియుండ నవ్వాని కాధ్యాత్మిక సామర్థ్యాతిశయము ప్రధానముగా గావలసి యుండును. పరసుతాసహాన మెట్టి నింద్యకర్మమో యదియే చందమున ధరణీపతులకు బరరాజ్యాపహరణాసక్తి కడుహేయము. ప్రజాకల్లోలమునకు మూలమగు యుద్ధము రాజులకు నరకము నొసంగును. దండెత్తుట ఆక్రమణము సేయుట యనుపదముల ద్రోసిపుచ్చి సర్వత్ర శాంతమును నెల కొల్ప నహోరాత్రములు కృషిచేయుచు సర్వేశ్వరభక్తిని మూర్తీభవింప జేయుటయే రాజుల ధర్మము.

పాలకులయందు వేరొండు దురాచారము బాగుగా నాటియున్నది. వారు రాజ్యపరిపాలనము కెక్కుడు రజస్తమోగుణములకే ప్రాధాన్యము నొసగుచుందురు కాని, సత్వము గుణమున కొసంగుచున్నట్లే గానరాకున్నది. అజ్ఞానులయి జనులెవరయిన బ్రజాకల్లోలమును గావింప రాజద్రోహులయి మహోపద్రవముల గావింపయత్నించుచున్నను, జారచోరత్వాదినీతిబాహ్యములగు కార్యముల జేయుచున్నను, ప్రాణిహత్యకియ్యకొన్నను వారినిబట్టి గతప్రాణుని సేయుట ప్రభువులకు నీతిదాయకంబయిన కార్యము కాదు. అట్టిదండనలు విచారించి సేయబడునవి కావు. విత్తము నార్జించుట కంటె వినియోగించుటయే కష్టసాధ్యమయినటులే రక్షించుటకంటె నుచితానుచితంబుల విచారించి శిక్షించి, శిక్షితుని సక్రమపద్ధ

తికి గొనివచ్చుటయే కష్టతరమయిన కృత్యము. అపరాధము గావించిన వానినిబట్టి హతమార్చుటవలన వాడీ జన్మమున నేర్వగల్గిన విషయమెద్ది? మూఢు లనేకు లందుచే దుష్కార్యముల నాచరించి కామతృప్తిని దీర్చుకొని బాధలేకుండ నొక సారి మరణింపవచ్చునని భ్రమింపుచుందురు. అనగా బ్రాణభీతిని వీడి దుష్కార్యముల నాచరింప గడంగుదురు. కాన నట్టి వారిని బట్టి చంపక, కారాగారములయందే సుశిక్షనొసంగి వారిచే వారి యాహారమునకును బోషణమునకును మారుగా వలయునంత సేవనుగొనుట యుత్తమము. ఇట్లు కావించుటం జేసి దుండగిండ్రెల్లరు నల్పకాలమునందే సంస్కరింపబడి కారాగారములనుండి విముక్తిని బడసినంతనే, తాము గావించిన దుష్కార్యముల కెంతయు లజ్జించి, తమకుగల దుష్టమిత్రులకు సహిత ముపదేశింపగలరు. ఇట్లు భూపాలురు కావించుటవలన నరహత్యాపాపము రూపు మాసిపోవును. అపరాధకుల నంత మొందింప జేయుటకంటె నపరాధముల గావింప వారిని బ్రేరేపించిన నపరాధకశక్తినే నిర్మూలింపజేసి, వారల బుద్ధిమంతులుగ సిద్ధమొనరించి, సృష్టికి వికాసప్రకాశముల నొదవజేయుట యుత్తమము. నృపాలా! అహింసను గూర్చి ప్రబోధింప నెంచుట సాగరముయొక్క పరిమాణమును గను గొన నెంచుటయే సుమీ! రాజా! ఆలకించితిరి, ఇంక నాచరింపుడి"

సిద్ధార్థుడీవిధముగ సభాసదుల హితార్థమయి ధర్మోప దేశమును సంక్షిప్తముగ జేసెను. రాజతనూజ కథితవాక్య శ్రవణంబున రాజాజ్ఞకుబూర్వమే హంతకుల హస్తములనుండి కరవాలములు భూమిపయి పడిపోయెను. కరములనుండి హేతులు భూతలపతితంబు లయినంతనే పురోహితులు రిక్తహస్తులరయి, నిశ్చేష్టతంజెంది, తదేకదృష్టితో సిద్ధార్థకుమారుని సౌమ్య శాంతస్వరూపమును, వీక్షింపదొడంగిరి. రాజనందనుని ధర్మోపన్యాసము పరిసమాప్తమయినంతనే సభామండపమున విరాజితులగు యున్న సమస్తజనులును బ్రణమిల్లి యాదివ్య పురుషపుంగవుని బహూకరించిరి. తత్క్షణమే సమస్తపౌరుల రావించి, బింబసార భూపాలుడా జనసమూహమును సంబోధించి యీరీతి నుద్బోధించెను.

ప్రియభ్రాతలారా!

1. గీ॥ జీవహింసను మనుజులు • నేయదగదు
జీవహింసను జేసిన • క్షితిని మనకు
సుఖమొకింతయు గలుగదు • సుజనులార
కాన నే జెప్పువాక్యము • గారవించి,
చేయకుడు హింస నెప్పుడు, • క్షేమమొదవు.

2. సకలజీవులు భగవంతు•నకు సమంబె
దేవదేవుని బూజింప • భావమందు

గాంతుకలదేని నెంతేని • కరుణగలిగి
జీవహింసను వీడుచు • భావుకముగ
భూతదయ గాంచివరలరే • పురుషులార!

3. ప్రాణిచయమున కెంతయు • బాధగొలుప
హాని వాటిల్లఁగల్గుసు • మానవులకు
స్వర్గమందలి సౌఖ్యముఁ • బడయువాంఛ
యున్న సత్కార్య దీక్షతో • నుర్వియందు
యజ్ఞయాగాదు లన్నింటి • నణచవలయు.

4. దేవదేవుడె మనలకు • దివ్యబోధ
సేయ బ్రత్యక్ష దైవమై • చెన్నుగాంచె
గాన నీదేవు డేరీతి • గరుణ నొసగు
బోధలఁ భక్తి జేకొని • ముక్తిగనుడు.

ఓ నాప్రజలారా! నేటిదనుక మనమెల్లరము మూర్ఖుల మయి, యథార్థమగు మానవధర్మము నెఱుంగక, పూర్వులనే పుణ్యపురుషులుగ మదినెంచి, వారల్పమతిజేసిన నిరుపయోగం బులగు నాచారవ్యవహారంబులనేగల్గియుండియు, వారాచరించి యున్న నికృష్ట కార్యములనె యాచరించియు, జీవితగళంక యుక్తులమయితిమి. అజ్ఞానవశంబున మనము "తా వలచినదే రంభ, తా మునిగినదే గంగ" యనుసామెతల ననుసరించి, మూఢ మార్గమున జరించి, సమస్తవిధముల భ్రష్టులమయితిమి. నేటి పర్యంతము మనము గావించిన కృషియొక్క ఫలితమటుండ,

సత్ఫలమునకు మూలుగ బాప జనోచితదండనయే సర్వేశ్వరుని చే మనలకు బ్రసాదింపబడనున్నది. మోక్షాపేక్షను గల్గియే మన మిట్లీయధర్మ కార్యముల సలిపియుంటిమిగాని, వేఱుద్దేశ్య మునగాదు. వివేకశూన్యులు కావించు కార్యములు సహితము వారి నడవడివలెనే కడునీచఫలముల బ్రసాదించునవయి యుండునని, యిప్పటికయిన దెలియనయ్యెనా? ముక్తికి మార్గ మాత్మయందే వెలయుచుండ, బాహ్యాడంబరముల యందును, శిరోముండనాదులయందును, గాషాయాదివస్త్రధారణము నందును, బశుమాగణమునందును విలసిల్లుచున్నట్లు లల్పబుద్ధి చే నూహించి, పొరబడితిమి. సర్వేశ్వరుని బిడ్డలమగు మనము మూర్ఖులమయి, పతితకార్యముల నాచరింపుచుండుట నవలోకించి, పరమేశ్వరుడే శీఘ్రముః మనల నుద్ధరింప, నీమహాత్ముని రూపమును ధరించి, వసుధ నవతరించినాడు. ఇంక మీరువిన్నన్న చెప్పినదే వేదమను వ్యర్థవాదమును బహిష్కరించి యీదేవుడు నేడు మనలకు 'అహింస' యందే ముక్తి ప్రచ్ఛన్న వేష మున వసియింపుచున్నట్లు విశదీకరించి, తదహింసనే సలుపవల యునని బోధించెను. నేటికి మనము జీవితముల దరింపజేయు హితోపదేశము నాలకించు భాగ్యమును గని చరితార్థులమయి తిమి. సృష్టియందలి యేపదార్థము వృథా కాదన్న వాక్కు నేటికి యథార్థమయ్యె. భూపాలుడనగు నేనింతదనుక బిడ్డలగు మిమ్ము, ల బాపకృత్యములకు బాల్పడజేసి మహాద్రోహినయితిని. గత

జలసేతుబంధనమునకయి చింతింపరాదు. పాపమునకు బశ్చా త్తాపమే పరిహార మని పెద్దలు వచింతురు. పాపభావకల్మషా వృతహృదయ దర్పణము, పశ్చాత్తాప సంజనిత బాష్పకణముల చే బరిశుభ్రపడును. పాపమనియెడి మురికి, కన్నీటిధారాస్పర్శం బుననే శుద్ధమగుట రూఢి. ఇప్పుడు నాకట్టిపశ్చాత్తాపమే మది జనించినది. ఇదియే పాపాత్ములకు దివ్యమగు పరిత్రాణము. ఇయ్యదియె లేనిచో సంసారమే యల్పకాలంబున రసాతలం బున కరుగుట ధ్రువము. నావలెనే మీరందఱుగూడ బశ్చా త్తాపమును బడయవలయును. లేనిచో నరకమునకు బాల్పడి యెదరు. నేనింతపర్యంతము గావించినట్టియు, నన్యులచే గావిం పజేసినట్టియు హింసకు మితియేలేదు. 'యథారాజాతథాప్రజాః' యన్న నూక్తికనుకూలముగనే మీరందఱును హింసాపరులయి తిరి. నేడు నేజేయు బోధ నాలకించి, నిర్మలభక్తి పరవశులరయి, జీవహింసనేకాక, సమస్తవిధములగు హింసల బాసి, అహింసయం దే ముక్తికలదని విశ్వసించి, భూతదయాపరులయి వర్తించుడి. 'నావిష్ణుః పృథివీపతిః' అను నార్యధర్మమును దలపోసి, మదా జ్ఞను శిరసావహింపుడి. ఎప్పటివలె నాశాసనము నిరర్థకమయి నది కాదనియు మహత్తర మయినదనియు దెలిసి పాలింపుడి. రాజశాసనము శిరోధార్యమయి యున్నది. నీతిశాస్త్రవిశార దుండును, అనన్య సామాన్యభావ విలసితుండును, సకలశాస్త్రాం తర్గత ధర్మతత్వజ్ఞుండును, సహసస్వోపన్యాసా జ్ఞానవిరాజితు

డును నగు నీమహాత్ముని యుత్తమోత్తమ వచనములే మోక్ష మందిరమునకు ప్రధానసోపానములు." బింబసారభూపాలుడిట్లు పన్యసించి ఘోషకుల రావించి సమస్తజీవములును బరమపవిత్రభావ యుక్తంబులనియు, జీవహింసమహాపాపమనియు దయావిరాజితులకే దేవుడు దర్శనమొసంగుననియు, నిందుచే నేటినుండి దేవతాసమారాధనార్థమై జీవమును హింసింప రాదనియు దనరాష్ట్రమునం దంతట జాటఁబుచ్చెను. రాష్ట్రమునం దెల్లెడల హింసాత్మక కార్యాచరణంబు వర్జింపదగినదని ప్రచారముసేయ ననేకధర్మప్రవక్తల భూపాలుఁడు పంపెను. తదాదిగా రాజగృహమున బశుహింసలు, బలులు, బాహ్యంబులగు దేవతారాధనములు క్షీణింప దొడంగెను. పశుపక్ష్యాదులన్నియు నత్యంత స్వేచ్ఛనుగల్గి సుఖముగ జీవించుచు జీవితానందప్రాప్తసౌఖ్యంబున దమ యవ్యక్త మృదుమధుర కంఠస్వరంబుల దయామయుని యపారదాక్షిణ్య సమన్వితవిశాలభావ సంకీర్తనము నేయగడంగెను. దేవళంబుల నర్చకులెల్లరు రక్తమాంసపిండముల దేవతాగణముల కర్పించుటకు మారుగ రాజాజ్ఞ ఫలపుష్పాదుల నర్పించి, భూతదయాపరులయి వర్తింపసాగిరి. బింబసారుని ప్రజలందఱు నాటగోలె భూతదయోపాసకులయిరి. సిద్ధార్థుడు దివసపంచకము పర్యంతము బింబసారునిపురమున మధుకరవృత్తిచే నాహారమును సంపాదించుకొనుచు దివ్యమగు ప్రబోధములగావించి యనంతరము స్వాశ్రమంబున కరిగెను.

తదనంతర చరితము నాకర్ణింపుడి. సిద్ధార్థు డింక బ్రహ్మానందపథవర్తనుఁడయి విజయమును బడసి, సిద్ధార్థ నామధేయమును బాసి బుద్ధాహ్వయుం డగుచున్నాఁడు. సిద్ధార్థుడు బింబసార భూపాలుని వీడ్కొని, స్వాశ్రమము జేరెను. వైశాలీ నగరమున హిరణ్యవతీ నదీప్రాంతమున నాకాడకాలా మను పేరుగల శాస్త్రజ్ఞుండగు ఋషివరేణ్యుడు మున్నూర్గురుశిష్యులతో వాసము చేయుచున్నట్లు సిద్ధార్థు డాలకించెను. సిద్ధార్థుడు ముక్తిసంబంధమయిన యనేకవిషయములగ్రహింప నాసక్తి గలవాడగుటచే వెంటనే పయనమయిపోయి యాఋషీశ్వరుని పద్ద శాస్త్రాధ్యయనము సేయ నారంభించెను. అసాధారణమేధాబల ప్రభావంబున నల్పకాలమునందే ఋషీశ్వరు డెఱింగియున్న సకలవిద్యల నామూలాగ్రముగ గ్రహించెను. కాని ముక్తివిషయికంబగు నతనికి వాటిల్లిన సమస్య యచటను బరిష్కరింప బడవయ్యెను. అనంతరము సిద్ధార్థుడాఋషీశ్వరు నెడబాసి యాప్రాంతమందే పర్వతకందరమున దపమాచరించు రామపుత్రరుద్రకుం డను వాని దర్శించెను. రామపుత్రరుద్రకునకు నేడువందలమంది శిష్యులుండిరి. అల్పకాలమునందే రామపుత్రరుద్రకుని యొద్ద సమస్తశాస్త్రముల నధ్యయనముజేసి, శాస్త్రములయం దుత్తమంబగు పరిజ్ఞానము నార్జించెను. అంత రామపుత్రరుద్రకుడు సిద్ధార్థు నాయాశ్రమమునందే యుండి, శిష్యుల కెల్లరకు బోధింప నిర్బంధించెను. కాని తాను

నచంద్రుని యనురోధము నిష్ప్రయోజనమయ్యెను. గురూ
పదేశముల శ్రద్ధ నాలకించియు, నాత్మోత్సర్గంబున దా బడయ
నెంచిన ముక్తిమార్గమును బడయలేక, సిద్ధార్థుడు ప్రసన్ను
డయ్యెను. తదాశ్రమముసహితము సిద్ధార్థుడు బహిష్కరిం
చెను. ఆధ్యాత్మిక జ్ఞానప్రాప్తికయి సిద్ధార్థుడు కావించు
నేకాంతమగు నిష్ఠనుగాంచి, రుద్రకుని శిష్యకోటియం దేవురు
సిద్ధార్థునిశిష్యులయి యతనిని వెంబడించిరి. క్రమముగ వారి
నామధేయము లియ్యవి :—కౌండిన్యుడు, అశ్వజితుడు,
భద్రికుడు, వప్రుడు మఱియు మహానాముడు. దైహిక సుఖా
భిలాష సాధనమార్గమునకు బ్రతిబంధకమయ్యెను. ఇందువలన
గఠినసాధనముచే దేహమును శుష్కింపజేయుటను స్వభావ
విరుద్ధమగు నుపాయము నవలంబించువిధాన మొకప్పుడు భార
తవర్షమున విశేషప్రచారమునం దుండెను. కఠోరమగు తపో
బలంబుననే సిద్ధార్థుడు సమస్తేంద్రియముల వశము గావించు
కొని, సర్వవిషయవాసనావిముక్తుండగుటకు స్వాంతమునందే
సంకల్పించెను. అట్లాచరించుటవలననే మహత్తరంబగు చిత్త
శాంతి లభ్యమగునని యతనివిశ్వాసము. ఘోరమగు తపమా
చరింప యుక్తప్రదేశము నన్వేషించుచు, గయాశీర్ష పర్వత
మునకు సమీపముననే నైరంజనానది ఫల్గునదితో గలియుచో
టనున్న నురబిల్వమను గ్రామమును జేరెను. అచ్చటి స్వాభా
వికంబగు ప్రకృతిరామణీయకం బెంతయు నతనిహృదయము

నాకర్షించెను. పరిశుద్ధ సలిలభరితయగు నైరంజనానదీతీరంబుననే సిద్ధార్థుడు వర్షషట్కము పర్యంతము ఘోరమగు తపమాచరించెను.

## సాధనము, బోధిప్రాప్తి.

ప్రభాకర ప్రభావిహీనంబగు ప్రపంచమువలెను, సుధాకరశూన్యంబగు నిశాసమయంబు మాడ్కియు, దీపంబులేని నికేతనంబుపగిదియు, మహాపురుషులులేని మానవసంఘము జ్ఞానశూన్యమై, తేజోవిహీనమయి, నిర్జీవమయి యొప్పారుచుండును. అజ్ఞానాంధకారబంధురంబగు మాయాప్రపంచ గేహమునుబ్రకాశవంతము గావింప బవిత్రతమంబులగు మహాపురుషుల జీవితచరిత్రములే విద్యుద్దీపికలవంటివి. తజ్జీవితచరితాంశశ్రవణము, వ్యామోహాపరీతచిత్తులగు సంసారులకు తారకంబగు నోంకారప్రభావంబు నొదవజేయును. తజ్జీవితపఠనమే మోహాబ్ధిని బడి కొట్టుకొనిపోవు కాముకప్రపంచమునకు హస్తావలంబనము. మహాపురుషులు జన్మతోడ దమకు లబ్ధమైన మనుష్యత్వమును బరిష్కృతమొనరించి, దాద్వానిని నవ్యుత్తరానూనశోభాన్వితము గావించి వేయుచున్నారు. చక్కెర జలమునందు మిళితమయినంతనే యాసలిలమును మాధుర్యయుక్తముగ జేయుచందముననే మహాపురుషులు సహితము మానవజాతియొక్క సాధనసాగరమున బ్రవేశించి, అందు దమజీవితముయొక్క సాధనాప్రవాహమును బ్రవహింప

జేసి యద్దానికి నూతనగౌరవము నాపాదింపుచున్నారు. తదే కనిష్ఠతోఁగూడిన సాధనాబలంబుననే మానవుఁడు కర్మ నా చరించి విజయముయొక్క చరమసీమను జేరుచున్నాఁడు. మానవుఁడు తనభాగ్యమునకు దానే సాధకుఁడు. దుఃఖజాలము నుండి విముక్తిని బడయుట కతఁడే కర్త. ముక్తినిబడయుట కతని కెట్టి పరావలంబనయు నావశ్యకమయి యుండదు. స్వావ లంబనమే ముక్తిని మానవునకు శీఘ్రకాలమునందే ప్రసా దింప సర్వమయిన యుత్తమోత్తమ సాధనము. మహాపురుషు ఁడగు సిద్ధార్థుని దివ్యతమంబగు సాధనము మనుష్యత్వమునె ట్టిగౌరవమకుటముచే విభూషిత మొనరించి సార్థకతను బడయ గల్గినదో పాఠకులారా! రండు ; విచారింతము.

మానవజాతిని దివ్యగౌరవ పర్వతశిఖరంబున నధిష్ఠింప జేయు సమర్థంబయిన సాధనమును, తద్విధానమును సాధించుట యం దెన్నియో యవాంతరములును, ఘోరతరంబులగు కష్ట పరంపరలును సిద్ధార్థునకు వాటిల్లెను. వర్ణింప శక్యముకానట్టి విఘ్నంబు లెన్నియో యతనికా సాధనావస్థయందు దటస్థించెను. ఆమహాపురుషుఁడు శాస్త్రములబాసి, గురూత్తముల విశ్వా సంబుల రోసి, నిజాభ్యుదయమునకు దానే మూలపురుషు ఁడయ్యెను. స్వావలంబనమే మహాభాగ్యమనియు, మానవున కాశ్రయంబొసంగ నద్దియే పాత్రమయినదనియు మఱి యె వ్వానికి సర్వమత లేదనియు నతఁడు నిశ్చయించుకొనియెను. విష

మతరంబులగు విషయవాసనాశరంబుల జిత్తమునుండి పెక లించివేయ నత డప్రమత్తుడయి, కఠినతమంబగు సాధనమునందు బ్రవృత్తుడయ్యెను. మహాత్ముండగు సిద్ధార్థుని శాంతమయ స్వభావంబును, సరళప్రయత్నంబును, మనోదార్ఢ్యమును విలో కించి, యాదేవుని శిష్యపంచకము విస్మయము జెందెను. తదా దిగ సిద్ధార్థు డొక్క మహాయోగి యను ప్రఖ్యాతిని దేశదే శాంతరములసహితము బడయ సమర్థుండయ్యెను. శరీరారో గ్యమును సంరక్షించుకొనుటయే ముక్తిసాధము నధిరోహిం చుటకు ప్రథమసోపానమని యెన్నియోమార్లు బోధించిన సిద్ధార్థుడే ప్రగాఢమగు భక్తిప్రభావంబునను, ధ్యానమననాధి క్యతవలనను బాహ్యచైతన్యశూన్యు డనుదినంబును గాదొడం గెను. ప్రాయికంబుగా నతడు దేహస్మృతిని విస్మృత మొనరించి, భగవద్ధ్యానమునందు తత్పరుడయి, సమయమును వ్యతీతము సేయుచుండెను. అతడు పాంచభౌతికంబగు కాయముయొక్క ధ్యానమును బూర్ణముగా ద్యజియించి యోగాసనాసీనుడయి, జీవకోటికి సంభవించు దుఃఖమును దూరీకృతము గావింప యుక్తపథమునుగూర్చి దీర్ఘముగ విచారింప నుపక్రమించెను. జననమరణమను నగాధసాగరమును దరించి, నిర్వాణపదమును బడయ గఠోర యోగసాధనంబున దేహమును స్వాధీనము గావించుకొన నవిరళకృషి సలుప దొడంగెను. ఆహారపానీయ ముల స్మృతియే యా దివ్యపురుషున కల్పసమయమునందే నశిం

చిపోయెను. దినములు సప్తాహములు, పక్షములు, మాసములు సంవత్సరములు గతించినవి. కాని సిద్ధార్థునికి భోజన పానీయాదులయం దనురక్తియే కలుగకుండెను. కఠోరంబగు సాధనమునందే యథోచితాహార రాహిత్యంబున సిద్ధార్థునకు వత్సరషట్కము వ్యతీతమయి పోయెను. అత డెన్నియో ప్రచండ సూర్యాతపంబులను, భీషణవృష్టులను, శీతవాత ప్రహారంబులను, ఝంఝామారుతములను నిశ్శంకితమతియయి అచంచలహృదయుడయి సహించెను. సంపూర్ణముగా నతనికి బాహ్యప్రపంచజ్ఞానము నశియించిపోయినందున నేవిధమయిన విషాదభయములును నతనిహృదయమును జలింపజేయజాలక పోయెను. సిద్ధార్థుని సువర్ణవర్ణరంజిత శుభగాత్రము శుష్కించి, వికాసవిహీనమయి, శుష్కకాష్ఠసదృశంబున జేతనాశూన్యయయ్యెను. కదలుటకుగాని మెదలుటకుగాని యాతనిదేహమునందించుకయయిన శక్తిలేకుండెను. జవసత్వము లుడిగిన వృద్ధునికంటె నతనికాయ మత్యంతమగు దౌర్బల్యమును వహించెను. బలిష్ఠంబగు నతని కాయమున కేవలము యెముకలు మాత్రము శేషించియుండెను.

అగణితంబులగు క్లేశములను, ఘోర కష్టపరంపరలను యనుభవించినపిమ్మటకూడ సిద్ధార్థునకు జిరవాంఛిత బోధిసత్వజ్ఞానము లభింపదయ్యెను. అతని చిత్తవ్యాకులత యెన్నివిగ్రహముల బ్రయత్నించిరను దూరము కాదయ్యెను. అంత

మున కతడు కఠోరతపోబలంబున విషయవాసనానలజ్వాల లుపశమింపజాల ఁడని గ్రహించెను. ఏతత్సాధన ప్రభావంబున సత్యము యొక్క పరిశుద్ధమగు ప్రకాశము దృష్టిగోచరమ గుట దుస్సాధ్యమనిసహిత మతడు గుర్తెఱింగెను. ఒక్క దివస మతడు వృక్షతలంబున నుపవిష్టుఁడయి తన సాధనము యొక్క స్థితినిగూర్చియు, కఠినతపము యొక్క ఫలాఫలముల గుఱించియు విచారింపదొడంగెను. నిరంతరోపవాసవ్రత స్వీకారంబునను, దేహారోగ్యసంరక్షణమున నిర్లక్ష్యము వహిం చుటంజేసియును వికాసభాసురంబగు దేహము పూర్వాభాస మును దక్కినదనియు ముక్తిమార్గాన్వేషణంబున నెంతయు విజయసూచనయయిన లోచరగోచరము కాలేదనియు సిద్ధా ర్థుడు గ్రహించెను. మోక్షమార్గప్రాప్తినిమిత్తము తా నవ లంబించిన సాధనావిధాన మీషణ్మాత్రమయిన ప్రయోజ నమును గూర్చజాలకపోయెనని యతడు బూర్ణముగా నెఱిం గెను. యథోచితాహార స్వీకారమే ముక్తిమార్గాన్వేషణంబున విశేషప్రయోజనీయము కాగలదని ప్రప్రథమంబె గుర్తెఱింగి యుండియు నిరంతరావిరళ ధ్యానమననాదులవలన దా నా హారగౌరవమును విస్మరించు టెంతయు హానికరమయ్యెనని య తడు తెలిసి, ఘోరముగా విచారించెను. అత డనుదినము భోజ నపానాదులయం దధికశ్రద్ధవహింప నిశ్చయించెను. అత డీరీతి నిశ్చయించుకొని నైరంజనా నిర్మలసలిలంబుల స్నానమాచ

రించెను. శరీరమత్యంతము దుర్బలమయి పోవుటచేసి యతడు నదీజలమునుండి తీరమునకు రాజాలకపోయెను. ఎంతప్రయత్నించినను నిష్ప్రయోజనమయ్యెను. అంతమున కతడు నదీతటంబుల వెలయు వృక్షము యొక్క వివిధశాఖలు నదీజలోపరిభాగంబు పర్యంతము వ్యాపించియుండుకతన నొకశాఖాగ్రంబును గరంబున బూని తరంగిణీకూలమున కెక్కి వచ్చెను. అతడంత నదీతీరము నెడబాసి స్వకీయోటజము నుద్దేశించి, గమనోన్ముఖుడయ్యెను. శరీరమునం దిసుమంతయయిన శక్తిలేకపోయి సిద్ధార్థుడు మూర్ఛితుడయి ధరణివ్రాలెను. గురుదేవు నన్వేషింపుచువచ్చిన శిష్యపంచకము సిద్ధార్థుడు మరణించెననియు, నతని మృత్యువునకు హేతు వతని తపోభంగమేయనియు మది దలపోయుచు నట నుండరాదని భావించి, యటనుండి నూతన గురువు నన్వేషింప దరలి చనిరి.

మృతప్రాయుండగు సిద్ధార్థుని దేహ మొక మానవుని మృతకళేబరమువలె జూపరులకు గాననగుచుండెను. బాలసూర్యరశ్మిమాలాప్రసారంబున గనకవర్ణమును గేరు నతని శుష్కదేహము సౌదామినీకాంతి నీనుచుండెను. తత్సమయమునందా పథమునుండియే యొక్క గోపాలబాలుడు మేకల మందను దోలుకొనిపోవుచు నదీతీరమునకు సమీపమందు బడియున్న సిద్ధార్థుని చైతన్యశూన్యమగు దేహమును గాంచి, ప్రప్రథమము భీతిల్లెను. కాని తెలివియు, దయయుగల యా

బాలుడు శీఘ్రము మందలోని కరిగి, యొకమహిషిని గొని వచ్చి, పృథ్విపై మృతమానవతుల్యముగ బడియున్న సిద్ధార్థుని ముఖగహ్వరమున బాలనుబిండెను. నులివెచ్చగనున్న యామ ధురదుగ్ధ ధారాపానంబున సిద్ధార్థున కొకించుక నూతనశక్తి యొదవ, బాహ్యస్మృతికలిగెను. అప్పు డతడు మెలమెల్లగా నేత్రద్వయమును దెఱచి తనకు సమీపమునందే నిలువబడి యున్న గోపాలుని వీక్షించి, మందస్వరంబున మృదుమధురంబు లగు వాక్యముల నీరీతి నుడివెను :—"సోదరా! క్షుద్బాధా పీడితుండనగు నాకు నీహస్తమునందున్న మృత్తికా పాత్రము నందలి దుగ్ధమును బానము సేయనొసంగి, ప్రాణముల సంరక్షిం పుము. ఏతన్నిర్మల క్షీరపూరిత మృత్తికాపాత్రి సందర్శనం బుననే గొంతవఱకు క్షుత్పీడ శాంతించినది." గోపాలబాలుడా సిద్ధార్థుని యమృతసమంబులగు వచనంబుల నాలకించి యచ్చె రువంది వినయపూర్వకంబుగా నీపగిది విన్నవింపదొడంగెను:— "మహాత్మా! నీవగ్రజాతి సంభూతుడవు. అందును మహర్షివి. ప్రస్తుతము నీదేహమున యజ్ఞోపవీతము దృష్టిగోచరము కాకు న్నను నీముఖవైఖరియే నీద్విజత్వమును వేనోళ్ల చాటు చున్నయది. నేనొక నీచకుల సంజాతుడను. ఏతత్కారణంబున నేను ముంతలోనిపాలను నీకొసంగి నరకమును బడయ నాకభి లాషలేదు. తమ్ముస్పృశించుట మహాపాపమని గ్రహించియే నిమ్నజాతీయుడనగు నేను మేకచంటిపాలను నీనోటియందు

బిండియుంటిని. జన్మచేతనే మహాల్పుడనగు నేను మహాత్ము డవును, జ్ఞానిసత్తముడవును నగు నిన్ను స్పృశింపజాలను. నాచే దాకబడిన యీ పాత్రమును మీరు స్పృశింతురేని మైలపడు దురు. వేదోక్త సిద్ధాంతానుకూలంబుగ విచారించి చూచినను మమాదృశ మూఢజనులకును నావస్తుసామగ్రికిని నగ్రజన్ముల దాక నధికారమెంతమాత్రమును లేదు. కనుక మైలబడిన యీ ముంతను నేనీయజాలను. వర్ణభేదమునుగూర్చియు జతు ర్వర్ణములవారి కర్తవ్యాకర్తవ్యముల గుఱించియు నేను బ్రాహ్మణశ్రీముఖంబుననే యాలకించియుంటిని. శూద్ర వర్ణస్థులు సేవార్థమే పరమేశ్వరునిచే సృజియింపబడినటుల నేను బ్రాహ్మణ వంశోద్భవుండగు మామక గురుసత్తముని వద్ద నిదివఱకే గ్రహించియుంటి. కనుక నేను నా ముంతనిచ్చి పాపమును బెంచుకొన జూచుటలేదు. మానవ శుశ్రూష జేయుటకు మేము సృష్టింపబడినారమనియు, వేదాదుల బఠింప రాదనియు, వేదాదిగ్రంథములయందును, పురాణేతిహాసోప నిషత్తులయందును వ్రాయబడియున్నట్లును దెలియుచున్నది. నీచోటివారల స్పృశించిననే నవశ్యము స్వర్గదూరుడ నయ్యె దను. కాన నో సంయమిచంద్రా! నీచుడనగు నేను నాముంత నీయజాలను, క్షమియింపుడి. దైవాజ్ఞబాయ నెవ్వారితరము? శునకమునకు గనకపు సింహాసనము తగునే? శూద్రుడీలో కమున నుత్తమజాతి సంభూతులగు నవనీసురులముట్ట నర్హుడై

ట్లగును? మహాత్మా ! ఏటి కీవ్యామోహము ? కుడి యెడమల
మఱచినా రేమి ?"

సిద్ధార్థుడా గొల్లవాని బేలతనమును అతనిబ్రాహ్మణ
(నామకా బాపలు) దాస్యపు వచనములను నాలకించి యాశ్చ
ర్యమును జెంది మందహాసవదనారవిందుడయి యిట్లుపదేశింప
దొడంగెను:—"నా ప్రియసహోదరా ! అమాయకుడవును
ప్రాపంచికుల మిథ్యావచనముల కధీనుండవును నగు నీవాక్య
ములన్నియు నిష్కాపట్యముతో గూడిన యవివేకపు పలుకులు.
జన్మచే వర్ణమేర్పడినమాటకల్ల. మానవసంఘమంతయు నొక్క
విధముగ జన్మించినది. భేదము నుంతయును గానరాదు. స్త్రీపు
రుషభేదంబుదక్క మానవులయందు లేదు. భేదంబుగలదని ను
డువు నీవాక్యములు నాకెంతయు నాశ్చర్యమును, విషాదమును
గూర్చునవయి యున్నవి. పుట్టుకచే జాతియేర్పడినదని వివేకము
గల యేమానవుడును వచింప సాహసింపజాలడు. నీవచన మా
ధారరహితము, భ్రమాన్వితము, వంశపరంపరాగత మూఢ
విశ్వాసము. స్వాభిమానపూరితహృదయ ప్రచలిత కపటాచా
రము. జన్మచే మానవులెల్లరు నొక్కజాతివారే యను విష
య మాబాలగోపాలమునకు స్మృతియందున్న విషయమే.
జన్మకాలమునందు బ్రాహ్మణు డనబడువాడెవ్వడును, లలా
టమున గుంకుమ తిలకమును ధరించికాని, శరీరమున యజ్ఞో
పవీతమును ధరించి కాని, సువర్ణవర్ణరంజిత దేహమును గల్గి

యుండిగాని లేక జ్ఞానసముపేతహృదయుడయికాని వచ్చి యుండలేదని తెలియజాలక పోయితివా? సమస్తజనులు నొక్కే విధముగ జననమంది యున్నారు. జన్మానంతరమే చపలచిత్తు లగు నరులు భిన్నవేషములను, భిన్నాచార వ్యవహారము లను బరస్పరము గల్గియుండి భిన్నంబులగు తమ యభిరుచుల ననుసరించి వర్తింప నారంభించినారు. కేవలము వ్యవహారము చేతనే జాతులన్నియు గల్పింపబడినవి. గుణకర్మ విభాగము ననుసరించియే వర్ణమనునది తమ సౌకర్యమునకో లేక యభి రుచుల ననుసరించియో పాలించికులు వర్ణము నేర్పఱచు కొని యుండ నీవిటుల భ్రమింపనేల? సత్త్వగుణ సంపన్నులై సత్కార్యాచరణమును గల్గియున్న పరోపకారపారీణులే విప్రోత్తములు. రజస్తమోగుణముల గల్గి నీచకార్య పరతంత్రులగు జ్ఞానదూరులే యబ్రాహ్మణులు లేక శూద్రులు యథవా నీచజాతికి జెందినవారు. సమస్తజనులు నీచభావముల బాసి, సత్క్రియారతులగుచో క్షణికమాత్రకాలమునందే బ్రాహ్మణులనియు, నగ్రజాతిసంభవులనియు జెప్పబడుదురు. నిమ్నోన్నతవర్ణములవార లని భావింపబడువారి రక్తమాంస ములయందు భేదమావంతయయిన గోచరింపకున్నయది. కేవల మాంతరిక బాహ్యభావభేదమే కానవచ్చెడిని. మూర్ఖులగు మానవు లనేకులు సంసారరంగమున నీచకార్యముల జేయు చుండియు జన్మచేదా ముత్తమజాతీయుల మని గర్వింపుచుం

దురు. వారి యభిమానము తృణప్రాయము. వారి భావము లన్నియు భ్రాంతిమయములె! మిథ్యాభిభూతములె. నిమ్నోన్నత జాత్యభిమానము లజ్ఞానజన్యములే గాని వేఱొండు గావు. పుట్టుకయందే యెవ్వానికి జాతినిర్ణయము తెలియ నేరదు. పుట్టుకచే ఛండాలుడని యవివేకులచే భావింపబడు వ్యక్తియే సద్గుణములచేతను. సద్వృత్తివలనను బ్రాహ్మణోత్తముడు కావచ్చును. జ్ఞానబలంబున నీవిషయము విచారించి తెలిసికొనదగినదనుమాట యటుండ, మన శాస్త్రాదులే గుణ కర్మల ననుసరించియే వర్ణవిభాగమేర్పడియెనని గర్జింపుచుండ, సంసారులు వివేకములేనివారయి, మిథ్యాభిమానమునకు బాల్పడుటెంతయు నింద్యము; నికృష్టము! నీచము. మానవుడు జన్మచే విప్రుడయ్యు గర్మచే ఛండాలుడు కావచ్చును. కర్మకున్న యాదరము జన్మకెంతమాత్రము లేదని మనము గ్రహింపవలయును. ఎల్లర కాయములు మూత్రపురీషాదులతోనిండిన కర్మపరిణామములయియుండ వానినిగూర్చి జ్ఞానదూరులగు మానవులు మేము గొప్పజాతి వారలము, మీరల్పజాతీయులని మదించి, భ్రమించి పలుకుటెంతయు గర్వాఢ్యము. గ్రుడ్డిచూపుల (బాహ్యదృష్టి) తో జూచిన గడు సుందరముగా గానవగు మన యీ దేహము మలమునకు నిలయమని గుర్తెఱుంగక విజ్ఞానమయనేత్రవిహీనుడయి మానవుడు జాత్యభిమానపూరితుడయి ప్రేమతత్త్వపరిజ్ఞానమును,

ఈశ్వరీయబ్రిబోధమగు సర్వసోదరభావమును విస్మరించు టెంతయు దూష్యము. సోదరా! జన్మతోడనే యుత్తము డనియు ననుత్తముడనియు నెట్లు భావింపనగును? ఉత్తమా నుత్తము లెవ్వారలో యెఱుంగుదువా? మన యీదేహము మురికిగుంట. అవయవములన్నియు దుర్గంధపూరితములు. పైచర్మము మెరుగుపూత. నాసికనుండి చీమిడియు, కర్ణముల నుండి గులిమియు, నేత్రములనుండి పుసియు, ముఖమునుండి పాచియు, రోమకూపాదులనుండి స్వేదము, గుదస్థానము నుండి యాహారకల్మషమును, మర్మేంద్రియమునుండి యాల్పా చమానము వెలువడుచున్నవనియు నీదేహమంతయు గల్మష ముతో నిర్మింపబడినదనియు, రజస్వలయగు స్త్రీ మర్మేంద్రియ మునుండి వెలువడు రజస్సు(మట్టురక్తము) నుండియే మన యీ కాయమేర్పడినదనియు గ్రహించి యిద్దాని నశాశ్వతముగా భా వించి, దీనికయి గర్వింపక శాశ్వతమయినదియు నీదుర్గంధపూరితం బగు మలగృహమును సార్థకపరచునదియు నగు జ్ఞానము నార్జిం చునట్టియు వ్యక్తియే యుత్తముడు. దీనికి విరుద్ధముగా జరించు వాడే యనుత్తముడు. మనయొక్క విద్యాధికుని గాంచి బ్రహ్మానంద పరవశులమయి భక్తిభావరస మొలుకుచుండ నమస్కరింపనేల? వాని చర్మమునకును మన చర్మమునకును భేదము సుంతయయిన గలదా? అదెట్టి మలగృహమో మనదియు నట్టిదే. వానికి గౌరవము లభించుటకు హేతువెద్ది?

వానియందున్న జ్ఞానవిశేషమె. శరీరము మనదియు వానిదియు నొక్కటియె కాన మానవునికి సంప్రాప్తమగు గౌరవమునకు మూలము గుణమేయని తెల్లమయినది.

సోదరా! వినుము, నీకు బోధపడులాగున వర్ణమున నెట్టిదియో నీగృహమున వ్యవహృతములయియున్న ప్రత్యక్ష ప్రమాణములచే నుపదేశించెదను.:—"నీకొక్క గృహము కలదనుకొనుము. నీకిరువురు కుమారు లున్నా రనుకొనుము. నీ కుమారులలో నొక్కరుండు బుద్ధిమంతుడయి, నిత్యము విద్యాశాల కరిగి, విద్యోపార్జన నేయుచుండ, ద్వితీయుడు పాఠశాల కరుగక గ్రామమంతయు వృథాగా దిరుగుచు, విద్యాభ్యసనమునుండి విముఖుడయి, కాలమును దుర్వినియోగము నేయుచుండును. అట్టితరి నీవు నీరెండవ కొమరుని గాంచి, యతని చేష్టలకు గుపితుడవయి, ఛీ గాడిదా! యందువా లేదా? అవశ్య మట్లనియెదవు. ఆబాలకుని గాడిదా యని నీవు సంబోధింతువే, యథార్థముగా నతడు గార్ధభమేనా? కాదు. మనోజ్ఞమగు మానవాకృతిని దాల్చియున్న నాకురవానిని గాడిదాయని పిల్చుటకు హేతు వేమయియుండును? నీకొమరునకు గాడిదయను నుపాధిలేక పదవి నొసంగినది యాకృతియా లేక బుద్ధియా? వానిస్వరూపమాయన్న మానవస్వరూపమే. జనించినదా, మానవుండవగు నీకే, కాని బుద్ధి చేతను, వృత్తిచేతను గాడిదయని పిలువబడినాడు. కాన మానవు

నకు గౌరవాగౌరవములు స్వరూపమాత్రముచే లభ్యము గావనియు, గుణము ననుసరించియే ప్రాప్తమగుననియు తేటతెల్లంబయ్యెగదా!

ఈరొక్కదృష్టాంతమును శ్రద్ధాళుడవయి, యాలకించి, వర్ణమనునది జన్మతోడ ప్రాప్తించునదికాదని గ్రహింపుము. ఈశ్వరసృష్టియంతయు సార్థకమయినది యనగా నర్థము గలదని తాత్పర్యము. ఈసృష్టియందు గాననగు నేపదార్థము నిర్హేతుకముగా సృజియింపబడి యుండలేదు. ప్రతిపదార్థముయొక్కయుత్పత్తికి నెద్దియో ప్రయోజనముండియే తీరును. కుక్కుటమునకు మణి యుపయోగపడనంతమాత్రమున నయ్యదియద్దానిని ధాన్యపుగింజకంటె విలువ తక్కువదానిగా భావింపరాదు. పవలాకాశమండలమున నక్షత్రమండలి దృష్టిగోచరముకానంతమాత్రంబున నవి పగలు గగనమున లేనే లేవని చెప్ప వలనుపడదు. అదియేచందమున సృష్టియందలి పదార్థములన్నింటియొక్క తత్వము తన సాధారణదృష్టికి గోచరింపకపోయినంతమాత్రంబున సృష్టియందలి కొన్నివస్తువులు నిరుపయోగంబులేయని వక్కాణింప మానవుడు సాహసింపరాదు. విజ్ఞాననేత్రమునకు సహితము గోచరింపనంత నిగూఢముగ సర్వేశ్వరు డేపదార్థమును సృజియించియుండలేదు. స్థూలములగు పదార్థముల తత్వము సులభముగనే మానవులెల్లరకు స్ఫురింపుచునేయున్నది. అతడు పదార్థములయొక్క

తత్త్వము నవాఙ్మానసగోచరంబుగ నునిచి సంతానమగు మానవకోటిని ద్వివిధావస్థయందు బడవైచి పెనగులాడుకొను నట్లు సేయునంతటి దయాశూన్యుండును, కర్కశచిత్తుండును గాడు. మానవహితార్థమయి సృష్టియందు సృజియింపబడిన నగణితంబులును, నానావిధ చిత్రవిచిత్ర స్వభావయుక్తంబు లునునగు పదార్థతతులే యాదేవదేవుని నిర్వ్యాజమగు కరుణాళుత్వమును, దయాళుత్వమును సహస్రముఖంబుల నుద్ఘోషించుచు నేయున్నవి. బద్ధాత్మకు విముక్తిని జ్ఞానసంపాదనానంతర మొసంగుటయే కర్తవ్యముగా గొన్న సర్వేశ్వరుడు జ్ఞానవిజ్ఞానముల నార్జింప భేదమును స్పష్టముగా గ్రహించుసంతటి సామర్థ్యమును మానవకోటికి బ్రసాదించియేయున్నాడు.

గన్నేరుపుష్పము, గులాబిపుష్పమువలెనే సృష్టింపబడి యున్నను గులాబికంటె నది యల్పశ్రేణిపుష్పములకే చెందిన దని యెట్టి మూఢమానవుడయిన గ్రహించుచునే యున్నాడు. సృష్ట్యాదినే గన్నేరుకంటె గులాబియందు మనోజ్ఞమగు సౌందర్యమును సారస్యమును, సౌకుమార్యమును సుగంధమును వెలయింపజేయు టీశ్వరసంకల్పమే యయియున్నట్లు గన్నేరు పుష్పమును గులాబీపుష్పమును గాంచిన మానవుడు స్వాభావికంబుగనే, యప్రయత్నముగనే గ్రహింప సమర్థుం డగుచున్నాడు. ఈశ్వరసంకల్పము ప్రతిపదార్థముయొక్క స్వభావిభవ స్వరూపాదులయందు స్థూలముగనో సూక్ష్మముగనో

ప్రతిబింబించియే యుండుచున్నయది. సంకల్పము నాకృతిబద్ధము సేయగలశక్తి యా సర్వేశ్వరునియం దున్నరీతి మానవకోటియందు గానరాదు. సృష్ట్యాదియందే యీశ్వరసంకల్పము జన్మతోడనే మానవకోటియందు వర్ణభేదమును బ్రదర్శించుటయే యగుచో స్త్రీ పురుషాదులమధ్య ప్రత్యక్షముగా గానవగునట్టి తాగతమ్యమునే బ్రాహ్మణ బ్రాహ్మణేతరులయం దేల జూపకుండును? బ్రాహ్మణాధిక్యతను యజ్ఞోపవీతధారణంబుననో, కుంకుమతిలకవిరాజిత లలాటంబుననో జన్మతోడనే సర్వము నెఱింగిన నా సర్వేశ్వరు డేల చూపకుండును? సోదరా! సంసారుల స్వార్థమయంబులగు కపటోక్తులను, నికృష్టంబులగునాచార వ్యవహార విచారంబులను విశ్వసింతువేని నీ యాదర్శజీవితము నిర్మూలమయిపోవును. అంధకార బంధురంబగు నిశాసమయంబున వీచికా పరంపరలచే నుబ్బూతలూగు సాగరజలోపరిభాగంబున బ్రయాణము సేయు నౌకను, గమ్యస్థానమునకు జేర్చు కాంక్ష మది నావహించియున్నచో నావికుడగువాడు, ధృవనక్షత్రమునే, లక్ష్యమునం దునిచికొని నావను నడుపయత్నించవలెను కాని తక్కుంగల దారకల జూచి కాదు. అటులనే వాస్తవమునకు దూరము కానట్టి యాదర్శమునకు జీవితమునం దాధిక్యత నొసంగ నభిలాషయున్నచో, పవిత్రతమంబగు నంతఃకరణమునకే ప్రాధాన్యత నొసంగవలయునుగాని యగణితంబులగు తరళభావవీచికాడోలికల నుయ్యె

లలూగు ప్రాపంచకుల కీయజనదు. అట్లాచరించుచో నుత్థా
నమునకుమారు పతనమే శరణ్యమగును.

నీవు బేలవయి సంసారుల మాయమాటల విశ్వసించి
యాదరించి దూషితము కానట్టి పరిశుద్ధ బుద్ధజీవితమును గడుప
నెంచితివి. కాని యది యట్లు వాటిల్లనేరదు. ఆదర్శమునకును,
జగమునకును గడు దూరము. నీవు "నాకు కుడి యెడమ
తెలియదా" యనుచు నీ యాత్మశక్తి నవమానపఱచితివి.
మానవులలో మానవుడవు "అందును భూతదయార్ద్రచిత్తుడవ
యి, జనించి నీయందువెలయు దైవికచైతన్యమును ధిక్కరించుకొ
ంటివి. మానవజాతిలో నిన్ను నీవే యంటరానివానిగా భావిం
చుకొని, యీశ్వరీయ చైతన్యము నల్పదృష్టితో జూచినాడవు.
పిపీలికాది బ్రహ్మపర్యంత మా జ్ఞానసంచలనశక్తి వ్యాప్తమ
యియుండ జీవకోట్యం దెక్కుడు శక్తిసంపన్నమయి మానవ
కోటకి జెందినవాడవయి నిన్ను నీ వొక్క యంటరానివానిగా
భావించుకొనునంతటి దుర్భాగ్యమేల నిన్ను వరించినది? జన్మాం
తరమే, బ్రాహ్మణా బ్రాహ్మణ వర్ణవిధానము గుణకర్మల
ననుసరించియే, యార్యులచే గావింపబడి యుండ నయ్యి
దిక్కాలమున విపరీతార్థబోధకంబయ్యెను. గుణకర్మల నను
సరించియే వర్ణవిభాగ మేర్పడి యుండనిచో, జన్మచేతనేఅయి
యున్నచో బ్రాహ్మణకులమునందు జన్మించిన యొక్క దుష్ట
ప్రకృతిగల నరుడే సమస్తప్రపంచమును రెప్పపాటు కాలము

నందు నాశనము గావించివేయును. అట్లగుచో క్షణిక సౌఖ్యం బుల నాకాంక్షించువారెల్లరు ధర్మమును బహిష్కరించి దుష్టాత్ములయి, దుండగములు జేయుచు, తమ యగ్రజాత్యాధిక్యత యెన్నడును నశియింపదుగదా యని గర్వింపుచుందురు. అట్టి తత్త్వ స్వల్పకాలమునందే పాపభీతి మటుమాయమయి పోవును. అజ్ఞాన మచలంబగు రాజ్యపరిపాలనము సేయగడంగును. ఈశ్వరరాజ్యముయొక్క పునాదు లుద్రూతిత లూగిపోవును. మానవత్వమునందు రాక్షసత్వ మావిర్భవించి ప్రళయము నుద్భూత మొనరించును. పాపమునకే విజయము కలుగ నారంభించును. ఈశ్వరుడే మహాద్రోహి యగును. దుష్టుడగును. పాక్షపాతియని యెల్లజీవరాసులచేత దూషింపబడును. దుష్ట జనమండలిచే ప్రపంచము మోసగింపబడును. మృత్యుదేవత యొక్క నాట్యరంగముగను, అవిద్యా సరస్వతీయొక్క క్రీడాలయంబుగను, రణచండికయొక్క సమరక్షేత్రముగను బ్రపంచమే మారిపోవును. అట్టిచో క్రిందుమీదు మీదుక్రిందున గును. స్వార్థపరులగు దుష్టులచే నీవర్ణాభిమానావేశ పిశాచము జనసమంది, పోషింపబడి, ప్రాయముగలదయి, నేటికసంఖ్యాకములగు సంతానముల గని సంసారమునంతను నింపివైచినది. నేను దుర్మార్గుల, మోక్షదూరుల, జ్ఞానహంతకుల రాక్షస ప్రబోధముల నిర్హేతుకములని న్యాయపరులగు మహాజనులకు బోధించి, నిరూపించి, నిర్మూలింప గంకణబద్ధుడ నగుట

కొరకే సత్యమార్గాన్వేషణమున దవిలియున్నాడను. దుష్టు డన్నను రాక్షసుడన్నను, మూర్ఖుడన్నను, ఘాతుకవన్యమృగమ న్నను వేరుగ నవనిపై జన్మించియుండలేదు. తన్ను గ్రజాతివాడ నియు, మానవులందరును దన్ను స్పృశింప నర్హులు కాగనియు వక్కాణించు మిథ్యాభిమానియే యట్టి ఘాతుకమృగము.

భారితా! నీవు మరణాసన్నుండనగు నాయెడ నిర్హే తుకంబుగ మానవోచితంబగు సహానుభూతిని దర్శింపజేసి ఉదారపరికృతిచే బ్రాహ్మణుడ వయితివి. జన్మచే బ్రా హ్మణుండ నని గర్వించి, విర్రవీగు మిథ్యాభిమాని నీపాదరజోలేశమునకయిన సరిరాడు. నీదగు హృదయభాం డము నిర్వ్యాజకరుణారసపరిపూర్ణము. నిర్వ్యాజ కరుణా శత్వము బ్రహ్మయందును, బ్రహ్మజ్ఞానముగల ప్రాణియం దునుదక్క మరి యేజీవులయందు లభియింపదు. నీయందు సర్వేశ్వరునియందుగననగు దయాళుత్వము వెలయుచుండు టం జేసి, నీవే బ్రాహ్మణుండవని చెప్పదగినవాడవు. జన్మచే నుత్తముడనని గర్వించువానిహృదయము హాలహాలసంభరిత మయి, జీవదయాశూన్యమయి యొప్పుచుండును. ఆతని మిథ్యా హంకార మమకార సంపన్నంబగు స్పృశ్యాస్పృశ్యభావమే యతని హృదయమును కరుణాశూన్యము గావించివైచును. నిన్నే నేనగ్రజాతివానిగ భావింపుచున్నాడను. దాన మపే క్షించినవాడను నేను, దాతవు నీవు. పరిగృహీతనగు నాయం

దలిగుణములకంటె నీయందు స్వాభావికంబుగనే వెలయు పరోపకారగుణవిశేషమే మిన్నయని తెలియుము. సహోదరా! సంసారములో భ్రష్టులయి, జ్ఞానదూరులయి చరించు మిథ్యాభిమానులవలె నీవు గర్వింపక, ఆత్మగౌరవమును సంరక్షించు కొంటివి. నిజమాలోచించిన, నీవు తలచునంతటి దుస్థితియందు నీవు లేవు. నిజాధిక్యతను నీవు గ్రహింపలేదు. ఇదియే నీనిష్కపట స్వభావమును వేనోళ్ల జాటుచున్నయది. పుణ్యపథమున జరించు నీవే ద్విజుడవు. సర్వాంతర్యామియు, సదసద్వివేకసంపన్నుండును నగుసర్వేశ్వరుడు నిరంతరము మానవుని హృద్గతభావంబుల బరీక్షించునుగాని నశ్వరంబులును, మాయాపరీతంబులునునగు బాహ్యశరీరచిహ్నములవైపునకు ధ్యానమొసంగడు.” గోపాలబాలు డామహాత్ముని హితబోధ నాలకించి సంతుష్టాంతరంగుడయి భక్తిపూర్వకంబుగ స్వీయదుగ్ధపాత్రి నాతని సమ్ముఖంబున నునిచెను. సిద్ధార్థు డాపాత్రిమునందలి క్షీరమును సంపూర్ణముగ నాతురతతో గ్రోలెను. గోపాలు డుపదేశామృత పానానంతరంబు వికసితవదనారవిందుడయి, యాప్రదేశమును బాసి, యథేచ్ఛం జనియెను. సిద్ధార్థు డనంతర మటనుండి లేచి నెమ్మదిగా నడచి నిజకుటీరమును జేరెను. సకాలమున కతడాహారమును స్వీకరింపుచు, జనన మరణములనుగూర్చియు, విషాదభయములగురించియు విచారింపసాగెను.

సిద్ధార్థు డీరీతి నానందపథమును గూర్చి విచారించు కాలమునందే యొక్కయానందకరంబగు ఘటనము సంఘటించెను. సిద్ధార్థుడు తపమాచరించు వాహిని కావలియొడ్డున సేనానియను గ్రామమొకటి యుండెను. ఆగ్రామమునందు ధనాఢ్యుండగు ధర్మాత్ము డొక్కడుండెను. నిత్య మావ్యక్తి సత్తముడు దరిద్రులగు యాచకు లకనేకవిధముల దానము సేయుచుండును. ఆరోగ్యసంపన్నుడును, దృఢకాయుండును నగుమానవుడు దరిద్రుడు కాడనియే యతనియూహ. అతడు ప్రాయికంబుగా వృద్ధులకును, వికలాంగులకును, వ్యాధిగ్రస్తులకును దానమొసంగుచుండును. దానధర్మాసక్తితోబాటు ఆ యుదారవ్యక్తికి మోక్షప్రదంబగు భగవధ్యానమునందు సహితమత్యాసక్తి యుండెను. నిరంతర మతని జీవిత మానంద పూర్వకంబుగ గడువజొచ్చెను. భాగవతుడగు నాతని కిహపర సౌఖ్యానుకూలంబగు సామగ్రియంతయు జెంతనుండెను. గాని కేవల మొక్కయభావము స్పష్టముగా నెల్లవారికి గానగుచుండెను. అది యెద్ది? మరేమి కలదు? సంతానభాగ్యమేకదా! ఆధర్మాత్ముని హృదయేశ్వరి మహాపతివ్రతామతల్లి. అట్టి సుగుణైకరాశి, భక్తిజ్ఞానవైరాగ్యసక్తహృదయ, ధర్మగతప్రాణ భూలోకమున మఱెచ్చటను వినుటకుగాని కనుటకుగాని లేకుండెను. ఆలలనామణి శుభాభిధేయము సుజాతాదేవి. ఆమె నిత్యము సుస్నాతయయి, ప్రాతఃకాలమున బరాత్పరపాదారవింద

ద్వయమును నిజవిశాలహృదయపీఠంబున నెలకొల్పి, పూజ సేయుచుండెను. కేవల మాదేవి భక్తిజ్ఞానయోగంబులకేకాక, కర్మయోగంబునకుసహితము నిజహృదయంబుననెడమిచ్చియుండెను. భక్తిజ్ఞానసమ్మిళితమైన కర్మయోగమే సర్వోత్కృష్టంబనియు, నాముష్మిక సచ్చిదానందప్రదంబనియు నా పెయూహ. లేనిచో గర్మయోగము వైకల్యము జెందునని యాదేవిదృఢ విశ్వాసము. ఏతద్ధేతువుచే నాదేవి నిత్యము నిఖిలలోకనాథునకు నిరంతరనిలయంబగు దరిద్రజనమండలికి నన్నదానమును దానికంటె నుత్తమోత్తమంబైన శిక్షాదానము సేయుటయందే సమయమును, విత్తమును వినియోగించుచుండెను. తద్దేవి నిరంతర పరోపకారపారీణతను, సత్యసంధతను, వినయ వివేకయుక్త సర్వజనసమాదరణీయ సద్భావాభిలాషను గ్రామవాసులందఱు శతముఖంబుల సంస్తుతింపుచుండిరి. ఆదేవి శోకించుకసమయము వ్యతీతమయినంతనే సత్సంతానాభిలాష యుద్భవించెను. సమస్తసౌఖ్య సౌభాగ్యసమన్వితయగు నాముద్దరాలు తనకొక్కపుత్రరత్నమున్న నత్యంతానంద మొదవునని భావించి, నిత్యము దేవదేవుని బ్రథమమునకన్న వేయిమడుంగులధికముగ బూజింపదొడంగెను. సంతానాభావసంజనిత సంతాపమాసాధ్వీమణిని సంతతము బాధింపజొచ్చెను. ఆత్మీయగ్రామమునకు సమీపమునను దున్న వనమునం దొక్క దేవత వెలయుచుండునని యాగ్రామీణుల మూఢవిశ్వాసము. సాకారోపా

సనాయత్తచిత్తయగు నాదేవియు నాయందవిశ్వాసముతోడనే యాదేవతను సంబోధించి యిట్లు వేడుకొనియెను:— "ఓ కనక దేవతా! స్వాంతమునం దానమునందిసంతానరహితనగు నాకొక్కపుత్రరత్నమును బ్రసాదింపవే; కరుణాంతరంగుడవయి దీనురాలి మొరాలకించి బిరాన వరమును బ్రసాదింతువేని నేను సువర్ణపాత్రను సిద్ధముజేయించి యందు షడ్రసోపేతముగ నుత్తమపదార్థములనెల్ల గొనివచ్చి మహాదేవతవగు నీకీయరణ్యమందలి వృక్షచ్ఛాయయందే యుపహారమును సమర్పించుకొనియెదను." దేవతను బ్రార్థించిన యల్పకాలంబునకే సంయోగ వశంబున నాదేవి నిండుచూలాలయి, నిజాభీష్టము సిద్ధింప నొక్కకుమారుని గనెను. ఆయర్భకునకు సుమారు మాస త్రయప్రాయము ప్రాప్తించినంతనే నాయలివేణి దేవోపహారోచిత సమస్తోత్తమ భోజ్యపదార్థముల సేకరించుకొని, యరణ్యమునకు బయలుదేరుటకు బూర్వము పరిచారికయగు రాధను బిలచి, యటవీప్రవేశంబున కరిగి, ప్రాయికంబుగా దేవత నివసింపుచుండు వృక్షతలప్రదేశమును శుద్ధమొనరించి యచ్చట కాజ్ఞాపించెను.

పరిచారికయగు రాధ పూర్వోక్తంబగు భూరుహమును సమీపించినంతనే దానినీడయందొక్క మహాత్ముని మోకాళ్ళపయి నిజకరముల నిడికొని, నిమీలితనేత్రుడయి భగవద్ధ్యానము సేయుచుండ వీక్షించెను. ఆదివ్యపురుషుని వదనారవింద

విరాజిత దర్శనేంద్రియద్వయమునుండి తేజఃకాంతులు వెలువడి ప్రేక్షకుల హృదయముల నావహించియున్న యజ్ఞానాంధకారమును బారద్రోలున ట్లుండెను. సందర్శించువారి కతడొక సిద్ధపురుషుడో లేక భూలోకమున భక్తిజ్ఞానవైరాగ్యముల నెలకొల్ప, వసుధాస్థలి కవతరించిన సర్వేశ్వరుడో యను సందేహ మొండు స్వాంతమునం దప్రయత్నముగా నొదవుచుండెను. శాంతసౌమ్యస్వరూపుండగు నాసిద్ధార్థకుమారుడా రాధకు దేవునివలె గానవచ్చెను. ఆ తలిరుబోడి బ్రహ్మానందము నందినదయి, యాదేవుని కాత్మగతమున ననేకమార్లు భక్తిపురస్సరంబుగ నమస్కరించి, దురితగమనంబున స్వామినికీ శుభవార్తను దెలియజేయ గడునుత్సాహముతో స్వగృహమునకు మరలెను. కార్యాతురవయి, వెళ్లియున్న నీవింత శీఘ్రమే మరలిరాగతంబేమని సుజాతాదేవి పరిచారికను బ్రశ్నించెను. అంత నాదాసి యిట్లుత్తర మొసంగెను:—"మాతా! మన సౌభాగ్యము నేమని సంస్తుతించుదానను? ఆడబోయిన తీర్థ మెదురయినట్లు; వెదుకబోయినతీగ కాళ్ళకు దగుల్కొనినయట్లు మనము నిరంతరము భక్తినారాధించు వనదేవతయే ప్రత్యక్షమయి, వనమునందలి మహావృక్షతలమున నాసీనుడయి మనకొఱకు బ్రతీక్ష సేయుచున్నాడు. ఆదేవుని దివ్యస్వరూపమాహాత్మ్యము నే నేమని యీయల్పముఖంబుతో వర్ణింప సాహసింతును? ఆపురుషోత్తముని వదనారవింద దివ్యతేజః

కాంతి పరంజ్యోతివలె, దేదీప్యమానముగ బ్రజ్వలితమగు చున్నయది. వేవేగ నరిగి దేవుని దివ్యదర్శనముల బడసి, భక్తి ముక్తులగనుట శుభప్రదంబ." రాధ యావిశ్వాసోత్పాదక వచనంబుల నాకర్ణించి, కడుహర్షించి, సుజాతాదేవి పూజా ద్రవ్యంబుల గొని, గ్రద్దన సిద్ధార్థ డాసీనుడయియున్న వృక్ష ముచెంత కరుదెంచెను.

సిద్ధార్థుని దివ్యస్వరూపసందర్శనంబున బ్రాప్తించినంత నే యాదేవి భయభక్తులతో సాగిలబడి యిట్లు నుడువదొడం గెను:—"ఓదివ్యపురుష శ్రేష్ఠా! కోరవికోటిప్రతిమాన తే జా! దాసురాలినొరాలకించి ధన్యాత్మను గావింపుము. నే నతిభక్తిపూర్వకంబుగ సమర్పించుకొను నీయల్పాహారము స్వీ కరించి నన్ను గృతకృత్యను సేయుము. సదయహృదయుండవు ను, భక్తజనమనోరంజనుండవును నగు నోప్రభూ! భక్తితో స మర్పింపబడు నీయాహారము నారగించి, నాకు ముదము గూర్చు ము. నీవేభక్తులపాలిటి కల్పవృక్షమవు. బత్తిచే నే నీ క్షీరాన్న మును భవన్నిమిత్తము సిద్ధముజేసి వెంటగొనివచ్చితిని" ఈరితి నుడువుచు సుజాతాదేవి యొకసువర్ణపాత్రమున బవిత్రతమం బగు క్షీరాన్నమును బోసి, సిద్ధార్థుని సమ్ముఖమునం దునిచెను. సిద్ధార్థకుమారు డేమియు మారుపలుకక, హర్షోత్ఫుల్ల ముఖార విందుడయి, క్షుధార్తి పూర్ణముగా దొలంగునట్లు క్షీరాన్న మును గ్రోలెను. ఉత్తమంబగు నాక్షీరాన్నము నారగించి

సంతనే యామహాత్ముని ముఖమండలమున నూతనంబగు నొక వింతకాంతి యుప్పతిల్లెను. చక్షుర్ద్వయమునుండి మఱింత కాంతి బహిర్గతము గాదొడంగెను. ఆకలిచే బాధితుడయియున్న యతని ముఖవర్చస్సు హెచ్చెను. సుజాతడెందం బమందానంద తుందిలితంబయ్యెను. అంత నాదేవి కరద్వయమును జోడించి యిట్లు సిద్ధార్థుని బ్రశ్నించెను:—"మహాత్మా! నీవు నిశ్చయముగ మానవదేవతవు. భక్తురాలి మొఱాలకించి, దర్శనము నొసంగుటకు బ్రత్యక్షమయితివి. దేవా! నేనర్పించిన యుపహార మానందకరంబుగనుండెనా? సర్వేశ్వరుడు కరుణామయుండన్న గురుజనోక్తి సార్థకంబాయెడిని. కరుణాసాగరా! వ్యామోహాపరీతులగు ధనవంతులు నశ్వరపదార్థంబగు నర్థమును వెచ్చించి, బాహ్యాడంబరముల జేసి, రిక్తహృదయములతో భవద్దర్శనసౌభాగ్యమును బడయ వాంఛింపుచుందురు. అట్టిమూఢుల కాంక్షలు రిత్తకోరికలే యగును. భక్తిచేతనే పరమేశ్వరుండవగు నీదర్శనము లభించునుగాని, నీచంబులగు బాహ్యాడంబరముచే లభ్యమగుట దుర్లభంబని గ్రహింపగల్గితి. పరమేశ్వరా! నిన్ను బడయుటకు మతసంబంధమగు రాద్ధాంతసిద్ధాంతంబులును, బాహ్యాచార వ్యవహారంబులును, మూర్తిపూజలును నిమిత్తమాత్రములేకాని హేతుభూతములు కాజాలవు. నీయపారకరుణావిశేష మిప్పటికి బూర్తిగా నాకు విశదమయ్యెడిని."

సుజాతవచనముల నాలకించి, మోమున చిరునగవుప్పొ తిల్ల సిద్ధార్థు డీరీతి వాకుృచ్చెను:—"ఓ నాప్రియసహోదరీ! నేను దేవుడనుగాని, పురాణపురుషుడనుగాని కాను. నేనును, సత్యమార్గము నన్వేషింప సాధనముజేయుచున్న యొకానొక సాధారణమనుష్యమాత్రుడనే. నేను నీకు సహోదరుడను. సోదరీ! నీప్రియతనూభవు నిట గొనిరమ్మా." సిద్ధార్థుని యా ప్రేమరసయుక్తవచనంబుల నాలకించినంతనే శిశువును సుజాత కొనిపోయి యతనియంకతలంబునం దిడి, నారాకుమారు డా యర్భకుని శీర్షముపై నిజదక్షిణహస్తము నునిచి, యాశీర్వ దించి, యాబాలుని శాశ్వతానందపరీతుని గావింపుమని యల్ప కాలంబుదనుక నిమీలితనేత్రుడయి, సర్వజీవదయాపరుండగు నాసర్వేశ్వరుని బ్రార్థించెను. ఆశీర్వాదానంతరంబు సిద్ధార్థు డాకుటిలకుంతలదిక్కయి, "ఓనాప్రియభగినీ! త్వదీయముఖార విందమానందమున కాటపట్టయి వెలయుచున్నయది. నీదివ్యా ననమునం దొక యపూర్వానందరసప్రవాహము వెల్లివిరియు చున్నయది. నిత్యానందప్రాప్తికయి, యనేక జపతపంబుల గావించియు, నద్దానిని బూర్ణముగ బడయజాలక నేనల్లాడు చున్నాడ. నీవన్నయో విషాద మిసుమంతయైనలేక నిరంతరము నిర్మలానందచంద్రికావిలసిత ముఖారవిందవయి భాసురంబుగ భాతిని శోభిల్లుచుంటివి. తావకంబగు హర్షంబునకు హేతు వెద్దియో విశదముగావింప వాంఛింతు" నని యడిగెను.

"స్వామీ! నాదుహృదయ మల్పమగు పాత్రివంటిది. అల్ప మగు సాఫల్యతనే, నేనత్యధికంబగు విజయముగ మదినెంచి, విశేషసంతోషాయత్తచిత్త నగుచుందును. మనస్తృప్తియే మానవున కిహపరముల దుఃఖమును దూరమొనరించి, యపూర్వానందమును గల్గింపగల పదార్థమనియే నాదువిశ్వాసము. సహజోత్పన్నంబులగు కార్యపరిణామంబుల నుపలక్షించి, నేను స్వప్నమందయిన జింతనందక, సంతోషస్వాంతనయి, యనారత భగవద్ధ్యానతత్పరనయి, కాలము వెలిబుచ్చుచుందును. కార్యము యొక్క పరిణామమనుకూలమయినను, బ్రతికూలమయినను, నేనవి సహజములేయని భావించి, మదియం దెంతమాత్రమును ఖేదమును బడయకుందును. ఇంతపర్యంతము నాకు నాజీవితసమయమునందు విషాద మనునదియే తటస్థించియుండ లేదు. నేను నిరంతరము నిజశక్త్యనుసారంబుగ నాత్మకర్తవ్య పరిపాలనముఖం దనురక్తనయియుండి విజయశ్రీ నపేక్షింపకయే దృఢప్రియత్నాభిలాషనే వాంఛింపుచుందును. నేను కర్తవ్య పరాఙ్ముఖత్వభావమును స్వప్నావస్థయందయిన స్మరియించి యుండలేదు. ఈశ్వరు డెల్లజీవులయందును సమానముగనే దయాదాక్షిణ్యభావమును గల్గియుండుననియు నట్టితఱి నా యందుసహిత మవశ్య మాసర్వేశ్వరుని కరుణావిశేష ముం డియే యుండుననియు, భావింపుచుందును. సమగ్రివిశ్వమును నిరీక్షింప నపూర్వంబగు సామర్థ్యమును గల్గియున్న దేవదేవుని

దృష్టియందు భేదభావంబునకుసహితము స్థానము లేదనియు నేనాదియందే గ్రహించియుంటిని. సంసారములో మేలువలన మేలును, గీడువలన గీడును సంభవింపుచుండును. ఇది ప్రకృతి యొక్క సహజస్వభావము లేక గుణము. నేనుత్తమగుణసప న్నితనయి భగవద్భక్తిపరాయణనయి వర్తింపుచున్నదాన నను నాత్మవిశ్వాసము హృదయమునందు వెలయుచుండ నిరంత రంబు నాకానందమే లభ్యమగుగాని విషాద మెట్లు లభించును? విషాదము దుష్కార్యము యొక్కయు నజ్ఞానము యొక్కయు పరిణామముగాని, సత్కార్యము యొక్క పరిణామమెట్లగును? నిత్యము జీవితము నీశ్వరసంపత్తిగ భావించి, పరోపకారార్థ ముపయోగించుచుండుకతన, నాకు బరమార్థస్వరూపంబగు నిత్యానందము హస్తగతమగుచున్నయది. స్వార్థము నశించు టయే పరమార్థమనికదా యనుభవజ్ఞులుసెప్పుట. అద్వైతం బున మెలంగు నాకు వాస్తవ మాలోచింప, బరోపకారమని యు స్వోపకారమనియు రెండుపదార్థములు దృష్టిగోచరమగు చుండుటలేదు. స్వపరభేదమే నాకు సృష్టియందు లేనటులే గోచరింపుచున్నయది. నిరంతర పరోపకార పరతంత్రినగు నాకు సుఖదుఃఖములు రెంటిని సమదృష్టితో జూడగల్గు సామర్థ్య భాగ్య మానిరామయుని కృపచే గరతలామలకమయినది. తల వనితలంపుగా నాగృహమునకు మరణదేవతయే విజయము సేయుచో, నేనానందపూర్వకముగ నాపెనాహ్వానింతును. నేను

హర్షోన్ముఖినయి యాదేవిపాదప్రక్షాళనము గావించి, ఉత్త
మాసనంబున నధిష్ఠింపజేసి యాపెయుత్తరువుల నొదల దాల్చె
దను. స్వభావసిద్ధము లగువాని నెల్ల నే ననారతము మహాత్సంప
దలుగ భావింపుచుందును. నిరంతరము నేను దుఃఖమునే
యానందముగ భావింపుచుండుచో, వేఱుగ నాకవనిపై భయ
విషాదము లెట్లు సంభవింపనేర్చును? కలిమి ననుభవింప నభ్య
స్తుండయినవానికి, లేమి ననుభవించుట దుస్తరంబుగాని, లేమి
ననుభవించువానికి గలిమి ననుభవించుట సుఖకరమె. నాకు
జననమరణములయందును, సుఖదుఃఖములయందును నుంతయ
యిన భేదము గాననగుటలేదు. బాహ్యక్రియలయందు భర్తృ
సంబంధము ననుసరించి నిస్సంగనయి, యాచరింపుచుంటినే
గాని యనురక్తనయి కాదు. అనుదినము విషయలంపటులయి
పోవు సంసారుల నవలోకించి, వారికి హితబోధ గఱపుచుం
టిని. జ్ఞానపరివేష్టితంబగు వాతావరణయందు నుదయింపజేసి,
పోషించి, విద్యాబుద్ధులగఱపి, లోకహితార్థమయి దేవదేవు
నికి సమర్పించ నొక్కపుత్రుదున్న నెంతయు నానందసంధాయ
కంబుగ నుండునని భావించితిని. సంయోగవశంబున వాంఛ
యీడేరినది. లేకపోయినను నేను పరితాపమునకు గురియయి
యుండదానను గాను. నాకు మరణమే శీఘ్రము లభియించిన
నీలోకముకంటె బరలోకమున విశేషానందము ప్రాప్తించునని
నావిశ్వాసము. జ్ఞానము నార్జింపని జనులకు నిహమును బాసి

మంతనే నిర్వాణప్రాప్తి యుండదనియు, బునర్జన్మయే వారికి శరణ్యమగుననియు నేనెఱుంగకపోలేదు. జీవితము విశేష కాలంబుదనుక నిహమునందే స్థిరమయియున్నచో బరమందు గల్గు సౌఖ్యానందముల భక్తివలనను, బ్రయత్నమువలనను బడయవచ్చునని విశ్వసించి, నిత్యము హర్షించుచుందును.

* సూక్ష్మంబగు బీజంబునుండియే మహాశాఖాన్వితంబును, ఫలపుష్పభరితంబును నగు విటప ముద్భూతమగుచందముననే, ఈలోకమున మానవమాత్రు డాచరించు సత్కార్యమనియెడి బీజమునుండియే పుణ్యమను మహావృక్షరాజ మొండుదయమయి, పరలోకమున బీజమును నాటిన వ్యక్తికి శాశ్వతానందమనెడి సత్ఫలంబునొసంగి యానందింపజేయును. సత్కార్యబీజోత్పన్న వృక్షమే నిత్యానందఫలప్రదంబు. పరమేశ్వరుడు నన్నీలోకమున కనిపియున్నాడు. అందులకుమాఱుగ నేనా యాదిపురుషునియెడ నేగురుతరమయిన భక్తిని గల్గియుండవలయును. సృష్టించినవాడు మనము సరియగు బుద్ధినిగలిగి మెలంగుచున్నచో నవశ్యము ముక్తిని బడయుమార్గమును దర్శింపజేయగలడు. నాహృదయమునం దెంతప్రేమయున్నదో

---

* ఈ గీతసత్త్వాంశము వేమనభావము సుజాతాదేవియొక్కయు సిద్ధార్థునియొక్కయు భావమును స్పష్టముగ నిట వ్యక్తీకరించుచున్నయది :—

ఆ॥ చిత్తశుద్ధిఁ గలిగి చేసినపుణ్యంబు । కొంచెమైన నదియుఁ గొదువకాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత ? । విశ్వదాభిరామ వినర వేమ ॥

యంతయు నంతకంటె సహస్రగుణము లధికముగ విశ్వప్రేమ
యా దేవదేవునియం దున్నటుల నే గ్రహించితిని. తత్ప్రేమరసా
స్వాదనా సౌభాగ్యము మానవులకు గలదు. బుద్ధిమంతు లద్దా
నిని స్థిరబుద్ధితోడ సత్కార్యముల నాచరించి, యనుభవింప
గల్గుచున్నారు. దుష్టులు, జ్ఞానదూరు లాభాగ్యమును గోల్పో
వుచున్నారు. పద్మబాంధవుం డొక్కరుండే యయినను జల
పూరితంబులగు సమస్తతటాకముల బ్రతిబింబించుపగిదినే
యఖండమగు సర్వేశ్వరుని ప్రేమమయజ్యోతి యెల్లజీవులయం
దును, నాయందును వెలుంగుచున్నంతపర్యంతము, నన్నే యం
ధకార పటలంబును నాక్రమింపజాలదనియే నాదృఢవిశ్వాసము.
ఇదియే కారణంబుగ నేనువిషాద మనుదాని ననుభవింపకయే
నిత్యము నిర్మలానందము నానిర్వికల్పుని కృపావిశేషంబున
ననుభవింపుచున్నదానను. కాన నాకేది లభించినను నేనత్యం
తానందముతో హృదయపూర్వకముగా సమ్మతించి, యనుభవిం
చెదను. జననమరణములు రెండును మానవసుఖము నపేక్షిం
చియే యీశ్వరునిచే నిర్మితములయినటుల దెలియనగుచున్న
యది. ప్రాపంచకులు తమక్షణికంబులగు సౌఖ్యముల కనుకూ
లించనివానినెల్ల నింద్యములుగను, దుఃఖోత్పాదకంబులుగను
భావింపుచుందురు. వాస్తవ మదికాదు. చెడులోనే మంచి యం
తర్భూతమయియుండును. కండలనూడ బెఱుకుకొని తినిపారవే
సిన మామిడిటెంకనుండియేకదా తిరిగి తియ్యనయినట్టియు మాన

వుల జిహ్వను జలింపజేయునట్టిగ్రు నామఃఫలములు ప్రాప్తిం చునది. మహాత్మా! నీయల్పప్రాయమునం దనుభవపూర్వకంబుగ నేను గ్రహించిన విషయంబు లివ్వియె. ఇవ్వాని వలననే నాకీప్రస్తుతానందము లభ్యమగుచున్నయది. నాయం దెట్టి మాహాత్మ్యమును లేదు. నీతియుక్తమగు స్వధర్మమును నిర్వహించుటంజేసియే నాజీవితము సుఖమయమయినది."

సిద్ధార్థు డాదేవి దివ్యమగు వాగ్ఝరి కలరి, "ఓసాధ్వీమణీ! నీహితోపదేశ మెంతయు మానవప్రపంచమునకు హితమును గూర్చునదయి యున్నది. త్వదుపదేశితోపదేశ మలోకసామాన్యము, అనిర్వచనీయానందప్రదంబు. ఐహికాముష్మిక రసాస్వాదనాసౌభాగ్యకరంబు, వేయేల? తాపసజన దుర్లభంబు. దేవీ! నీవు వివేకులకు వివేకమును బోధింపుచున్నావు. నీవు శీఘ్రకాలమునందే సర్వేశ్వరకృపాకటాక్ష వీక్షణప్రభావంబున నత్యంతసౌఖ్యమును బడయగలవు. నీకు సర్వదా మన శ్శాంతి కలుగుగాతమ్మని నే నాగమ్యామయుని వేడుచున్నాడ. 'ఆనందము'నకు యథార్థమయిన మార్గము నన్వేషించి నీవనతి కాలంబునందునే జీవన్ముక్తిని బడయగల్గినావు. శాశ్వతానంద పథము నన్వేషించుటయందు విజేతలగువారలే నిర్వాణమును బడయుటకర్హులు. సంసారమందు సర్వసంగ పరిత్యాగులయి (బాహ్యసంబంధములనెల్ల బాసినవారలనియే తాత్పర్యము) నిత్యకాషాయాంబరధారణ సేయుచు, నన్నపానాదుల గ్రమ

ముగ స్వీకరించుట వీడి, యటవీప్రాంతముల నర్థశూన్యంబు లగు జపతపముల నాచరింపుచు, శుష్కకాయులయి, వికార స్వరూపులయి చేసిన కృషియంతయు నిరర్థకమగుట వీక్షించి చింతించుమూఢతాపసచంద్రులకు సిగ్గు కల్గునటుల నీవు గృహ స్థాశ్రమమందే యుండి, బంధుమిత్రాదుల స్నేహసౌఖ్యామృ తమును గ్రోలుచు, సంయమవ్రతధారిణివయి, నిశ్చల భగ వద్భక్తి విరాజితహృదయవయి మోక్షస్వరూపంబగు శాశ్వ తానందమార్గమును బడసి ధన్యాత్మవయితివి. సోదరీ! నేను త్వదీయభాగ్యము నుతింప నితాంత మయోగ్యుడను. వాస్త వమును గుర్తెఱింగిన నీదే భాగ్యమనిన భాగ్యము. జగన్ని యంత యెల్లవేళల నీకును నీపుత్రరత్నమునకును శుభము లొదవజేయుగాత! నీకుమారుడు ప్రాయముకలవాడయి యెల్ల విద్యలయందారితేరి సత్యధర్మజ్ఞానసంపన్నుండయి, నిస్సంగు డయి, స్వార్థదూరుడయి, ప్రపంచహితార్థమయి, స్వీయజీవిత మును సమర్పించువాడు కాగలడు. విశేషకాలవిలంబన మయి నది. స్వనికేతమునకు మరలిపొమ్ము” యని వచించి, యా యన్నులమిన్నను వీడ్కొలిపి, తానాయరణ్యమందా బోధివృక్ష తలంబుననే ధ్యానము సేయగడంగెను.

అతని చిత్తమున కొంకదివ్యానందానుభవము కలుగ దొడంగెను. సుజాతను సందర్శించుటకు బూర్వము చిత్తసీమ పైనిరంకుశ రాజ్యపరిపాలనము సేయుచున్న వ్యాకులత దూర

మయిపోయెను. నవ్యతరంబగు శాంత మాచిత్తము నావహిం చెను. అతడానందమార్గమును బడయుట కనువగు సాధన సామగ్రిని గూర్చియు, సుజాతభావసందోహమునకును, నిజో ద్దేశావళికిని గలతారతమ్యమును గుఱించియు దీర్ఘముగ విచా రింపగడంగెను. విచారించినకొలది సతనిచిత్తమునం దొక యపూర్వానంద పీయూషధార ప్రవహింపుచున్న ట్లనుభవం బయ్యెను. వర్షషట్కమునుండి గావించిన ఘోరపరిశ్రమవలన గల్గిన యథార్థమగు వివేకము యొక్క యానంద మాక్షణము నందే యించుకించుక సిద్ధార్థునకు లభింపజొచ్చెను. సుజాతా దేవి పరిశుద్ధభావముల కనుకూలంబులగు భావతరంగములే యామహాత్ముని హృత్సరోవరంబున నుదయమయి, కల్లోలి తము కాసాగెను. సిద్ధార్థుడీరీతి నపూర్వానందము నించు కించుక యనుభవించు తరుణమునందే వేశ్యాంగనలు కొందఱా మార్గముననే వీణె వాయింపుచు బోవుచుండిరి. వీణె వాయించు వారాంగన వీణె యొక్క తీగెను బిగువుగా బిగియించి వాయింప సాగెను. తంతువు మిక్కిలి బిగిసియుండుటచే గర్కశధ్వని వెలు వడ నారంభించెను. అంత నాగణకామ శ్రేణిలో నొక్కర్తుక యిట్లు నుడివెను:—"సోదరీ! వీణె నంత హెచ్చుస్వరంబున మ్రోా యించిన మధురమగధ్వని వెలువడనేరదు. కొంచెము తగ్గించుట మంచిది" అంత నావీణె మ్రోయించు వారాంగన తీగెను వదులుజేసి వాయింప నాధ్వని, తీగె మిక్కిలి సడలిపోవుట

వలన దేలిపోయెను. అది విని యనుభవముఁనుగల్గిన యాగణిక మరల యిట్లు వాక్రుచ్చెను :—భగినీ! తీగె విశేషించి బిగి యింపబడినపుడు కర్ణకటువగు శబ్దము బహిర్గతమయినది. తిర్గి నీవిపుడు తీగెను హద్దుమీరి సడలింపజేసినకతన సరియగు స్వరమె వెలువడలేదు. నీవు వీణెను వాయించి, యానందము ననుభవించుటయందు విశేషానుభవము లేనట్లు తెలియుచున్న యది. వీణె నంత హెచ్చుస్వరముననగాని, హీనస్వరముఁనగాని మ్రోయించుట యానందదాయకమయిన కార్యముకాదు. అనారతము వినువారల వీనులకు విందుగొల్పుటయం దధిక నైపుణ్యమును సంగీతశాస్త్రమునందు గల్గియున్న ప్రతివ్యక్తియు వీణెను సమానమగు (మధ్యస్థము) స్వరమున వాయించుట యుక్తము. అప్పుడే శ్రవణప్రియంబును, ఎండుమోళ్లను జిగురింపజేయునట్టియు పాషాణముల సహితము ద్రవీభూత మొనరించునట్టియు మృదుమధురంబగు స్వరము వెలువడును.

బోధివృక్షతలంబున నుపవిష్టుడయి, యానంద మార్గము నుగూర్చి విచారించుచున్న సిద్ధార్థుడు గణికామణుల సంభాషణ మును శ్రద్ధాళుడయి, సాంగోపాంగముగ నాకర్ణించెను. అతని నేత్రకమలయుగ్మమునుండి బ్రహ్మానంద బాష్పధారలు స్రవింపదొడంగెను. ముఖారవిందము నవ్యతర ప్రకాశ భాసురంబయ్యెను. హృత్కమలము వికసించి, దివ్యానంద మకరంద మునకు నిలయంబయ్యెను. అతని శరీరమునందున్న బలహీనత

మటుమాయమయిపోయెను. వేయి యేనుగుల బలమతని కప్రయత్నముగా లభ్యమయ్యెను. భూమ్యాకాశములు రెండును సిద్ధార్థునకు వామహస్తగతమయినట్లయ్యెను. అతని హృదయము పరిశుద్ధ సత్యజ్యోతిచే దేదీప్యమానమయ్యెను. సాధనము యొక్క సోదారంబగు మధ్యమార్గమతని మానసికదృష్టి సమ్ముఖంబున బ్రత్యక్షమయ్యెను. భోగవిలాసంబులకును, కఠోరసాధనంబులకును మధ్యవర్తినియగు మార్గావలంబనము వలన నతడు బోధిప్రాప్తికి సంసిద్ధుండయ్యెను.

కఠోరంబగు సాధనవలనగాని, నియమరహితంబుగ నాహారపానీయముల స్వీకరించుటవలనగాని స్వాస్థ్యము భంగమగుననియు నద్దానిచే ననేకంబులగు నవాంతరములు వాటిల్లుచుండుననియు, గాన శరీరమును దృఢతరంబు గావించునంతపర్యంతమయిన తపోధ్యానాదులవలవైపునకు ధ్యానమొసంగుటయే యహితకరమనియు నతడు సిద్ధాంతీకరించుకొనియెను. దేహమును బలాన్వితంబు గావించుటయు, మానసమును దృఢతరమును, చైతన్యశీలమును జేయుటయు దనవిధియని సిద్ధార్థుడు సంకల్పించుకొనియెను. నూతనసాధనమునందు బ్రవృత్తుడగుటకు పూర్వ మతడు సంపూర్ణంబగు స్వాస్థ్యమునందెను. అనుదినము సిద్ధార్థుడు గృహస్థులవలె నాహారపానీయముల స్వీకరింపుచున్నాడనియు, శరీరావయవములన్నియు బలిష్ఠములయి, కామక్రోధాదుల నభివృద్ధిపఱచినవనియు సమీపారణ్య

ములయందు జపతపములనాచరించు తాపసశ్రేష్ఠులెల్లరు జెప్పఁ జొనదొడంగిరి. సిద్ధార్థు నెడబాసిపోయిన యతనిశిష్యు లయిదు గురును గురువును దూషింపసాగిరి. సిద్ధార్థు నను దినము సందర్శించువారలుసహిత మతడు జీవితోద్దేశ్యమునుండి భ్రష్టుడయిపోయినాడనియే భావింపదొడంగిరి. తాపసుల దూషణ వాక్యభాషణము లెన్నియో సిద్ధార్థుని శ్రవణేంద్రియకుహరముల బ్రవేశింపనారంభించెను. కాని యపూర్వంబగు సహనశీలతను గల్గియున్న నతినాముల్కులవంటి పలుకులు బాధింపజేయజాలకపోయెను. సిద్ధార్థుడు వారి యజ్ఞానోచ్చరితవాక్యజాలముల నాలకించి, మందహాసముజేయుచు, మౌనము వహింపుచుండనేగాని వారల దూషింపుచుండువాడు కాడు. ప్రశాంతంబగు నతనిచిత్తమును ద్వేష మెట్లు స్పృశింప నేర్చును? దూషణభూషణంబుల నరకుగొనక, సిద్ధార్థుడు నవీనసాధనమునందు బ్రవృత్తుడయ్యెను.

నిరాశ యొక్క వినీలాంబుదపఙ్క్తి యంతర్హితమయి పోవుటంజేసి, యతనిచిత్తము పరిశుద్ధానందపరిపూర్ణమయ్యెను. ఆమహాత్ముని మనోగత దివ్యానందముచే విశ్వప్రకృతి ప్రసన్నమూర్తిని ధరించెను. నిరంతరము మందగమనంబుతోడ బోధి (అశ్వత్థవృక్షము) వృక్షతలంబున నడచు సిద్ధార్థుని యానంద పులకితపాదపద్మ స్పర్శంబున విస్తీర్ణతమంబగు ధరణిసహితము పులకాయమానమయిన ట్లుండెడిది. మహావిజయప్రాప్తివిషయ

మగు సందేహగంధలేశమయిన సిద్ధార్థుని హృదయమున వెల యకుండుకతన, నతనికి బాహ్యాభ్యంతరికాశాఝుంకారము లీరీతి శ్రుతిగోచరములగుచు నతనిహృత్తంతువుల బ్రతిధ్వ నింపజేయగడంగెను. "ఓదివ్యమయినసాధకుడా! యోమహా త్మా! యో నవీనధర్మప్రవక్తా! భక్తాగ్రేసరా! సిద్ధి లభించు నట్టి విజయముహూర్తము సమీపించినది. విలంబనము కించి న్మాత్రమయిన లేదు. మహాసాధనబలంబున సిద్ధి (బుద్ధిలేక పరి శుద్ధజ్ఞానము అదియే సచ్చిదానందస్వరూపము) ని బడసి మంగ ళాకరంబగు నిర్వాణమును గరతలామలక మొనరించుకొ నుము." ఒకానొకదివసము సిద్ధార్థుడు మనోజ్ఞంబగు సూర్యా స్తమయసమయంబున నశ్వత్థవృక్షముక్రిందనే కోమలములగు నవ్యతరతృణములచే నొక యాసనము నేర్పరచుకొని, యద్దా నిపై నాసీనుడయ్యెను. సాధనమునందు బ్రవృత్తుడగుటకు బూర్వ మత డీరీతి సంకల్పించుకొనియెను.

"ఇహాసనే శుష్యతు మే శరీరం
త్వగస్థిమాంసం ప్రలయంచ యాతు
అప్రాప్యబోధిం బహుకల్పదుర్లభాం
నైవాసనాత్ కాయమతశ్చ లిష్యతే॥

తాత్పర్యము :— ఈయాసనముమీద నాశరీరము శుష్కించిపోయినను ; అస్థులు, చర్మము, మాంసము ద్రవీ భూతమయిపోయినను సమ్మతమేగాని, నేను వివిధోపాయము

లచే లభింపనట్టియు ననేక కల్పాంతములపర్యంతము దుర్లభమయి యుండునట్టియు బోధి (అనగా బోధివృక్షముక్రిందనే బడయనెంచిన సిద్ధిని బడయనిదే, యీ యాసనమునుండి లేవబోను.

పురుషసింహుండగుసిద్ధార్థుడు దృఢసంకల్పమనియెడి కవచముచే నిజశరీరావయవముల సంరక్షించుకొని, సాధనసంగ్రామోన్ముఖుం డయ్యెను. పరిశుద్ధహృదయుండును, పాపరహితుండును నగుటకొఱకు హృదయాంతర్గతమగు పాపలాలసను మూలసమేతముగ బెకలించి, సాధనమునందు లగ్నమనస్కుడయ్యెను. ఆరిపోవుటకుబూర్వము దీపశిఖ యతితీవ్రముగ బ్రజ్వరిల్లుచందముననే సిద్ధార్థుని పాపలాలసలన్నియు నొక్కసారి ప్రదీప్తములయ్యెను. ఈపాపలాలస లనియెడి మహాశత్రువులతో సిద్ధార్థు డొనరించిన కురుక్షేత్రముయొక్క తుములయుద్ధమునుగూర్చిన వర్ణనము లెన్నియో బౌద్ధసాహిత్యమున గావ్యాకృతులను, ధర్మశాస్త్రస్వరూపములను ధరియించి, యిప్పటికిని వెలయుచున్నయవి. పాపసైన్యముతోడ సిద్ధార్థుడు సలిపిన ధర్మయుద్ధమును గూర్చినవర్ణనల, బఠించు మానవు డెట్టికార్య, ధర్మ, యుద్ధభీరువయినను నిజహృదయమునం దొక్కయపూర్వంబగు బలసంచలనము గలుగుచుండుట నవలోకింప సమర్థుండగును. నానావిధంబులగు ప్రలోభంబుల జూపించి, కామలోకాధీశ్వరుండగు మారుడు సిద్ధా

ర్థుని ధర్మసంగ్రామక్షేత్రమున విగతజయుని గావింప బ్రయ
త్నించినపుడు సిద్ధార్థు డీరీతి ముక్తకంఠముతో వక్కాణిం
చెను:—

మేరుః పర్వతరాజస్థానతు చలేత్ సర్వం జగన్నో భవేత్
సర్వే తారకసంఘభూమి ప్రవతేత్ సజ్యోతిషేన్ద్రాస భాత్
సర్వే సత్త్వకశేయ ఏకమతయః శుష్యేన్మహాసాగరో
సత్త్వేవ దుమరాజమూలో పగతశ్చాపిర్యైత అస్మద్విధః॥

తాత్పర్యము:—"పర్వతరాజమగు మేరువు స్థానచ్యుత
మయినను, సఃుగ్రసంసారము శూన్యమయిపోయినను, సమస్త
తారకాసముదాయ మింద్రసమేతముగా భూతలపతితమయిపో
యినను, సంసారముయొక్క సమస్తజీవరాసుల యుద్దేశ్య మేకీ
భూతమయినను, వేయేల? మహాసాగర మింకిపోయినను నన్నె
వడును నీవృక్షతలమునుండి విచలితుని గావింపలేడు." అతిశ
యోక్త్యలంకారభూషితంబగు నీశ్లోకమునం దెంతటి భావ
గాంభీర్యము వెలయుచు, సిద్ధార్థుని భీష్మప్రతిజ్ఞా పటుత్వ
మును దెల్లముగావింపుచున్నయదో విచారించుకొనుడి.

క్రమక్రమముగా మారుని సేవకావృత్తియందున్న పా
పంబులన్నియు, నానావిధములయిన ప్రలోభంబుల, సిద్ధా
ర్థుని దృఢసంకల్పమును బరివర్తనముగావింప విశ్వప్రయత్న
ముల జేసెను. కాని మహాత్ముండును, ధర్మయుద్ధమునం
దపూర్వయోధప్రవరుండును నగుసిద్ధార్థుడు పాపలాలసలను

సత్యధర్మజ్ఞానశత్రువుల కపటచాతుర్యాతిశయమును దృటి మాత్రకాలంబున నిరర్థకము గావించి వైచెను. నిజసైన్యము యొక్క సమస్తయోధులు సిద్ధార్థునిచే బరాజితులు గావింప బడుట నవలోకించి లజ్జితుండును, ఖిన్నుడును నయి మూసళ రుడే స్వయముగ జిరకాలార్జితంబులగు నానావిధోత్తమాస్త్ర శస్త్రసజ్జితుండయి, సిద్ధార్థుని దృఢసంకల్పదుర్గము నాక్రమింప దండెత్తి బోధివృక్షరాజమును సమీపించెను. తన్నుఢీకొని, పరాభవింప నగ్రసరుండగు మకరకేతు నుపలక్షించి, దండ తాడితోరగముపగిది క్రోధోద్దీపిత మానసుడయి వీరకేసరి యగు సిద్ధార్థుడు భూమ్యాకాశము లుద్ఘోషింప నీరీతి గర్జించి పలికెను. దుష్టా! నీతివిదూరా! నీవొక్కండవే కాదురా!

సవేయం త్రిసాహస్రిమేదినీ యదిమారైః పరిపూర్ణాభవేత్
సర్వేషాం యథ మేరుపర్వతవరః పాణీషు ఖంగోభవేత్
తే మహ్యం నసమర్థ లోమచలితుం ప్రాగేవ మాం ఘాతితుం
కుర్యాచ్చాపిహి విగ్రహేస్మ వర్మి తేన దృఢమ్॥

తాత్పర్యము :—పృథ్వి త్రిసహస్రసంఖ్యాకులగు కామధేనువులతో బరిపూర్ణమయిపోయినను, ప్రత్యేక మారుని హస్తమునందు మేరుపర్వతాకారమును బోలియున్న భయంకరంబులగు ఖడ్గరాజములున్నను దృఢసంకల్పమను కవచముచే సంరక్షింపబడుచున్న నన్ను బరాజితుని గావించుట యటుండ నారోమము నయిన సంచరింపజేయజాలవోయీ!

మారుడు సిద్ధార్థుని ధైర్యస్థైర్యములను, యవక్రమో క్రమ పరాక్రమ పటిమను విలోకించి, భయభీతుడయి పిక్క బలమును జూపెను. సమస్తవాసనలును, నానావిధములగు బంధనములును బటాపంచలయిపోయెను. ఎల్లవిధముల విముక్తుండయిన సిద్ధార్థుని చిత్తము సత్యముయొక్క స్వచ్ఛమగు ప్రకాశముచే నిండిపోయెను. సాధనమువలన నతడు సిద్ధిలేక బుద్ధిని బడసి, పూర్వనామంబగు సిద్ధార్థపదమును బహిష్కరించి, బుద్ధుడయ్యెను. అతని కపుడు వారాంగనావార్తాలాపశ్రవణ సంజనితానంద గరిమయే తత్సిద్ధియొక్క యంశమేకదాయని సిద్ధార్థు డిపుడు గ్రహింప సమర్థుండయ్యెను. సంసారములో శరీరమును విశేషముగ విషయవికారము లనావృతము గావించుటయు దోషమే; ముక్తిమార్గాన్వేషణము నభిలషించి, ప్రాణాంతక కష్టగ్రసితముగ జేయుటయు మౌఢ్యమే యనియు నతడపుడు గ్రహింపగలిగెను. తటస్థముగ జరింపుచు "అతి సర్వత్ర వర్జయే" త్తను గురుజనోక్తి ననుసరించి, ప్రవర్తింపుచు, శరీరసంరక్షణమును నిర్లక్ష్యముగజూడక, ధ్యేయమగు నిర్వాణమును విస్మరింపకయుండుట సమస్త నరనారీమణుల కర్తవ్యమని బుద్ధుడు సిద్ధాంతీకరించెను, ఆహా! ఫలసిద్ధిస్వభావ మెంత చిత్రాతిచిత్రము. సర్వసంగపరిత్యాగియయి, సమగ్రసంసారమున కంతటికి భావిధర్మాచారుడయిన బుద్ధదేవునకంతమునకు వారాంగనాప్రబోధితవాక్యములే ధ్యేయములై నొడ

గూర్చి మించె. వీక్షణలక్షణలక్షిత మను విశేషము ప్రకృతి యెడ బూర్తిగ సార్థకతను వహించినది. అపహృతారోగ్య సంపన్నుడయిన యనంతరమేగదా, నూతనంబగు సాధనంబున సిద్ధార్థుడు బుద్ధుడు కాగల్గినది. బుద్ధునికంత మానసికనేత్రము యొక్క సమక్షమున జీవులయొక్క సమస్తవిధ దుఃఖహేతువు గోచరమయ్యెను. మానవుడు జ్ఞానదృష్టిచే శుభాశుభకర్మల ఫలాఫలంబులవీక్షింపగల్గినపుడే విషయవాసనాక్రమణము నుండి సంరక్షణోపాయము నన్వేషింపగడంగునని బుద్ధుడు గ్రహించెను. భోగవిలాసాభిలాషయే దుఃఖోత్పత్తికి మూలమని యెనతడు. విషయవాసనాక్షయమునకు బూర్వము మానవుడుమృత్యుముఖంబున బడినను, వాడంతటితో శాంతిని బడయలేడనియుఁ వానికి జీవింపవలయునను కాంక్ష యొకటుండుటచే బునర్జన్మకు వశుడు కావలసియె వచ్చుననియు నతడు గుర్తించెను.

బుద్ధభగవానుడు ధర్మమే సత్యమనియు, ధర్మమే పవిత్రమగు విధియనియు ధర్మముమీదనే సమస్తప్రపంచము ప్రతిష్ఠితమయి యున్నదనియు, ధర్మమును స్వీకరించుటవలననే మానవుడు భ్రాంతి, పాపము, దుఃఖము, భయము మొదలగు వికారములనుండి స్వేచ్ఛను బడయగల్గుచున్నాడనియు తెలిసికొనియెను.

బుద్ధదేవుని జ్ఞానదర్శనేంద్రియ సమ్ముఖంబున జననమరణయుల యొక్క నిగూఢరహస్యభేదనమయ్యెను. అత

నికి "దుఃఖము దుఃఖహేతువు, దుఃఖనిరోధము దుఖో పశమనోపాయము" అను నార్య సత్య చతుష్టయము గోచరమయ్యెను. అంతమున కతడిట్లు నిశ్చయించుకొని యెను: (1) జననమందు దుఃఖము వెలయుచున్నయది. జరా వ్యాధులయందు దుఃఖమున్నయది. ప్రియపదార్థవియోగ మున దుఃఖము వసియింపుచుండును. అప్రియపదార్థప్రాప్తి యందును దుఃఖము కలదు. (2) తృష్ణవలననే దుఃఖోత్పత్తి యగుచున్నయది (3) తృష్ణావినాశనంబుననే దుఃఖోపశమనము కాగల్గుచున్నయది. (4) దుఃఖనివృత్తి కష్టవిధోపాయము లావశ్యకమయియున్నవి. వానివివర మిద్దియ:— 1 సమ్యగ్దృష్టి, 2 సమ్యక్సంకల్పము, 3 సమ్యగ్వాణి, 4 సమ్యక్కర్మాంతము, 5 సమ్యగాజీవము, 6 సమ్యగ్వ్యాయామము, 7 సమ్యక్స్మృతి, 8 సమ్యక్సమాధి.

బుద్ధదేవు డీరీతి స్వాంతమున దలపోయుచుండగనే యస్పష్టముగ నీధ్వని హృదయాంతరాళము నుండియే వి నసయ్యెను. " మహాత్మా ! మానవుడు నేయు నిమ్నో న్నత కార్యముల ననుసరించియే పరిణామములు సం ప్రాప్తమగుచున్నయవి. మానవు డెద్దేని కార్యము నాచరింప బూనుటకు బూర్వము భావము నార్జించుచున్నాడు. సదాచార సంపన్నుండగు మానవుడే యుచ్చకులసంజాతుడు; పూజ్యుడు, మానవదేవత. ధర్మార్థకామముల సక్రమముగ వర్తించు వివేక

సంపన్నుండగు వ్యక్తికి జతుర్థపురుషార్థమగు మోక్షము కర తలామలకమే యగునుసుమీ! క్షేత్రమును మిట్టపల్లములు లేకుండ, సమతలప్రదేశంబుగ జేసి, విత్తి, దానికి వలయునంత జలమును సకాలమున నొసంగుచు, వచ్చిన సత్త్యుత్తమంబగు సస్యము హస్తగతమగుటయం దాశ్చర్య మదెద్దికలదు? ప్రపంచికులెల్ల రీరీతి వర్తించిన జగమెంత యానందకందమయి విలసిల్లగలదో విచారించుకొనుము. నీవు తరుణప్రాయము నందే కాముని బరాభూతుని గావించి, మిథ్యాసంపత్తులనెల్ల దృణప్రాయంబుగ విసర్జించి, కష్టమును వరించి, మోక్షమును సాధించిన మహాధీరుడవు. నీవు మఱెవ్వరవును గాదు. మూర్తీభవించిన దృఢతరంబగు సత్సంకల్పమవు. ఆకృతిబద్ధమయిన సత్యమవు. అవతరించిన యాదిశక్తివి. మానవరూపమునందున్న సచ్చిదానందస్వరూపమవు. సర్వజీవదయాపరుండవగు నీవలననే దబ్బరగురువులచే మోసగింపబడి, దుష్టపథమున వర్తింపుచున్న జగ ముద్ధరింపబడగలదు. ఆలసింపక సత్వరము జీవకోటిహితము నపేక్షించి ధర్మజ్ఞానప్రచారమును మానవసంఘమున గావింప నుద్యుక్తుడవగుము." బుద్ధదేవు డాయస్పష్టములగు ప్రబోధ వాక్యముల నాలకించి, పులకితశరీరుడయి, సత్వర జ్ఞానప్రచారమును గావింప సంకల్పించుకొనియెను. బుద్ధదేవునకు నిజాంకతలంబునం దాశ్రయ మొసంగి, జ్ఞానప్రాప్తి నొదవజేసియున్న యాబోధివృక్షము జగద్విఖ్యాతిని గనెను. బుద్ధదేవుని తదా

చిగ గౌతమబుద్ధుడనియు, శాక్యమునియనియు, తథాగతుడ
నియు జనులెల్లరు బిలువనారంభించిరి. గౌతమబుద్ధు డంతః
కరణపరిబోధవాక్యముల నాచరింప నున్ముఖుండయ్యెను.

## శ్రీ బుద్ధభగవానుడు, తద్దేవుని శిష్యపంచకము.

జ్ఞానవిజ్ఞానములకు మానవుని మేధాసంపత్తియే మూలా
ధారము. ఆత్మవిశ్వాసరాహిత్యమునకు మానసికదుర్బలత్వమే
మూలము. మానసికబలాధిక్యతచే దనరారు వ్యక్తి కాత్మబల
మును, విశ్వాసమును, స్థైర్యమును విశేషించియుండును. మాన
సికదుర్బలత్వమును దూరీకృతమొనరించి, పరిశుద్ధంబగు నాత్మ
బలమును బడయవాంఛించు వ్యక్తికి యుక్తాయుక్తపరిజ్ఞానమవ
సరమయియున్నది. మానవు డుచితానుచితజ్ఞానమును గల్గియుం
డనిచో ధర్మదూరుడయి, విషయాలపటుడయి ధ్యేయమగునంతః
కరణపటుత్వమును బడయజాలడు. అంతఃకరణపాటవము లేనిము
క్తి కిలాతలంబున సమస్తకార్యములు దుస్సాధ్యములే యగును.
వ్యఅల్పమాత్రపరిశ్రమంబున సాధింపబడు కార్యమే విశ్వాసాభా
వంబున భారవహంబయి, సాధింపబడరానిదిగ వ్యక్తికి బ్రతీతం
బగును. జ్ఞానవిజ్ఞానములకు మానవుని మేధాస్థానమే మూలో
త్పత్తిస్థానమయియుండ, నాజ్ఞానవిజ్ఞానములకు బ్రపంచమందలి
యెల్లసమస్యలు బరిష్కరింప సాధ్యములే యయియుండ మాన
వుడు కర్మక్షేత్రమును జూచి భయపడనేల? “కష్టే ఫలే

యన్న గురుజనోక్తియం దెంత నిగూఢభావ మంతర్భూతమయి యున్నదో కర్మవీరులకే తెలియును. బుద్ధదేవుడు, సంకల్పబలంబున వేలకొలది వత్సరములనుండియు నసంఖ్యాకులగు పురుషోత్తములచే జపతపంబుల సాధింపబడని జ్ఞానమార్గమును సాధింపశక్తుండయ్యెను. దేవునియం దారంభశూరత్వము లేదు. కార్యశూరత్వమే మెండు. ఆరంభశూరత్వ ముదయపుటెండను కార్యశూరత్వము సాయంతనసూర్యాతపంబును బోలియుండును. ఉత్తమకార్యపరిణామ మొక్కసారి లభింపక క్రమక్రమంబుగ లభ్యమగును. నీచకార్యపరిణామము ప్రథమము సుఖదాయకంబును, బహుళంబును నయియుండి క్రమక్రమంబుగ క్షీణింపుచు కర్తకు దుఃఖము నొదవజేయును. బుద్ధదేవుని నిరంతర దృఢప్రయత్నబలంబున వేలకొలది మహాపురుషులచే సాధింపబడిన జ్ఞానమార్గము సులభముగ వత్సరషట్కమునందే సాధింపబడియె. ఆత్మబలశూన్యులగువారికి జ్ఞానప్రాప్త్యభిలాష యున్నచో బుద్ధదేవుని సాధనమార్గవిధానావలోకనం బెంతయు లాభదాయకంబు కాగలదు.

విముక్తియొక్క విమలానందరసముచే శ్రీ బుద్ధభగవానునిహృదయభాండము నిండిపోయెను. అతడు మహాబోధివృక్షతలంబున సాధనముచే బుద్ధత్వమునుబడసి, రమారమి మాసద్వయ కాలపర్యంతము నవలబ్ధపీయూషఝురము యొక్క రసధారను బానము సేయుచు నటనే గూర్చుండి యుండెను.

తదమృతధారోపభోగము సలిపిసకొలది నయ్యది కొలువడక, అభివృద్ధి జెందనారంభించెను.

బుద్ధదేవు డింతటి కఠినసాధనాచరణానంతరంబె విశ్వవ్యాపకంబగు నానందామృతరసము నాస్వాదింపగల్గెను. సమస్త సంస్కారములను, వాసనలను లయింపజేసియే యతడు నిర్మలానందమును, శాశ్వతజీవితమును బడసి రాణించెను. నిర్వాణము యొక్క సత్యతరంబులగు నీ మంగళ మహోపదేశములనెటుల జనసామాన్యమునకు బోధింతునాయను చింత బుద్ధదేవుని మది యందు బొడసూపెను. మానసపరిదేశమునుండి యహంబుద్ధి యొక్క సంపూర్ణస్వరూపమును దొలగింపజాలనివారికి బూర్ణముగా చిత్తశాంతి లభ్యముకాదని యతడు నిశ్చయించెను. అహంకారమే సమస్తపాపములకును, సర్వాశుభములకును నిఖిలభ్రాంతులకును మూలకారణంబని యతడు నిరూపించుకొనియెను. నీలాంబుదశకలము స్వరూపంబునందు చిన్నదే యయినను సూర్యమండలము నాచ్ఛాదించివేయు చందమునన్నే యహంబుద్ధియు నాకృతియం దల్పమయియుండియు విశ్వవ్యాపకంబగు పరిశుద్ధానందము నదృశ్యముగను, నజ్ఞేయముగను జేసివేయుచున్నయది.

తాను గ్రహించిన మహత్సత్యము యొక్క జ్ఞానమును సత్వరము జీవకోటికి బోధింపనిచో నద్దానివలన బ్రయోజనమేమియు గలుగనేరదని బుద్ధదేవుడు స్వాగతంబున భావించు

కొనియెను. జీవకోటికి హితము నొడగూర్పజాలని స్వీయజ్ఞానాధిక్యత నిష్ప్రయోజనమని యతడు నిశ్చయించుకొనియెను. దుఃఖజాలములకు జిక్కి జన్మజన్మాంతరములవలన విషయవాసనాపంకమున దొరిక్కుడు పడుచు, నిరంతరావిరళ కష్టపరంపరల ననుభవించు జనులకు నిర్వాణము యొక్క పరిశుద్ధంబగు వాణి నుపదేశింప దేవుడు సంకల్పించుకొనియెను. దుఃఖముల దూరీకృతమొనర్చుటయేగాక, మఱుమాయముజేయ నుపయుక్తంబగు నిట్టి జ్ఞానోపదేశంబు నొక్కతూరి స్వీకరించినంతనే ప్రాపంచికులు పరమశాంతిని బడయ శక్తిమంతులగుదురని బుద్ధదేవుడు తలంచెను.

బుద్ధదేవుని నవ్యతరజ్ఞానపరబోధ ప్రచారము నెవుడు గావింతునాయను సందేహ మొండు బాధించెను. కాని యాదేవుడు సత్వరము సలుపుటయేయని తత్క్షణమే నిశ్చయించుకొనియెను. తృష్ణాభిభూతులగు సంసారులజ్ఞానగమ్యమగు గంభీరధర్మమును గ్రహింపజాలరనియు, వారి తరళతరంబగు బుద్ధి సంసారము యొక్క కార్యకరణముల నియమమును, బూర్వజన్మార్జితంబగు కర్మయొక్క వాసనోపాధుల నిరోధించు విధానమును, సంయమనిర్వాణముల పద్ధతిని గుర్తెఱుంగుసమర్థమయినదికాదనియు బుద్ధదేవుడు నిశ్చయించెను. ఇట్టి పరిస్థితులయందు నిజధర్మప్రచారము నిరుపయోగంబగునని యతడు భావించెను. ఒకవైపున నీసంశయమును మఱియొకవైపున జీవ

కోటియెడ నపారంబును, నిర్వ్యాజంబును నగు దయయును బుద్ధదేవుని కోమలంబగు హృదయమును బీడింపదొడంగెను. ద్వివిధభావాక్రమణంబున నతనిచిత్త మొకించుక వ్యాకులతను జెందెను. స్వాంతమునం దతడు దీర్ఘసమయంబుదనుక తర్కవితర్కములచే నంతమునకీసిద్ధాంతమునే నిశ్చయించుకొనెను. "తొలుదొల్త నేను సత్యానురాగులును, శ్రద్ధాళురును, అప్రమత్తులును నగువారి చెంతకరిగి, యీనూతనధర్మము యొక్క సారాంశమును బోధించెదను;" అనంతరము సత్యము తనంతట దానే క్రమక్రమంబుగ వికాసమునొందుచు సర్వత్ర దివ్యమగు కీర్తి నార్జించి మించును. కాని ప్రస్తుత మాశక్తిశాలియు, శ్రద్ధాళుండునునగు పురుషవరేణ్యు డెటలభించునా యని యతడు విచారింపదొడంగెను.

ప్రథమమున బుద్ధదేవునకు రామపుత్రరుద్రకుని యొక్కయు నడారకాలాముని యొక్కయు స్మృతి కలిగెను. అనంతర మత డవ్వారినిగూర్చి విచారింపగా, వారిరువురును విగతజీవులయినటుల దెలియనయ్యెను. పిదప దేవునకు దన యేవురుశిష్యుల ధ్యానము కలిగెను. ఒకప్పుడు శ్రద్ధాళురును విశ్వాసపాత్రులును నగు నాశిష్యులు ధర్మ, శుద్ధోపశాంతికయి బుద్ధదేవు ననుసరింప సమ్మతించియుండిరి తత్సమయంబున బుద్ధుని రహస్యమయంబగు నాభ్యంతరిక భండార మమృతాన్నముచే బరిపూర్ణమయి యుండలేదు. తద్దే

తువుచే దేవు డాశిష్యుల ధర్మక్షుధా_ర్తిని జ్ఞానాహారమునొసంగి దూరము గావింపజాలకపోయెను. కాని ప్రస్తుతము బుద్ధదేవుని రహస్యమయభండారమున జేరియున్న జ్ఞానపీయూషాహారము కేవల మేవురుశిష్యుల కే కాదు, సమగ్రసంసారమందలి స్త్రీపురుషాదుల ధర్మక్షుధా_ర్తిని దొలగింప సర్వ్హమయియున్నది. సమగ్రసంసారమునకు దృ_ప్తినొదవజేయజాలినంత యాహార మతని యొద్ద జేరియుండెను. ఒకదివసమెవ రప్రసన్నులయి, తన్నెడబాసియుండిరో వారల నన్వేషింపవలసిన యవసర మే బుద్ధదేవునకు దటస్థమయ్యెను. బుద్ధు డంత ఋషిప_త్తనమును గూర్చి పయనమయ్యెను.

శ్రీబుద్ధాగమన సమాచార మెల్లెడల నల్పకాలమునందే విద్యుద్వార్తాసమానంబుగ వ్యాపించిపోయెను. సిద్ధార్థుడే, దృఢసంకల్పముచే సాధనమాచరించి, బుద్ధుడయ్యెనన్న శుభ సమాచార మెవరికిని విశదమయియుండలేదు. సిద్ధార్థుడు తపో భ్రష్టుడయి, విషయలంపటుడయి, వచ్చుచున్నాడనియే ఋషు లెల్లరు భావింపదొడగిరి. సిద్ధార్థుని గౌరవింపవలదనియు, నతనిని పరాభవించుటయే యు_క్తమనియు నేవురుశిష్యులును మది దలంచియుండిరి. కాని సమయప్రభావము నుల్లంఘింప నెవ్వారి తరము! మన మొందువిచారింప మఱొండు సంఘటియించును గదా! శ్రీబుద్ధదేవుని యొక్క సుప్రసన్న వదనారవిందజ్యోతి నవలోకించినంతనే శిష్యపంచకము యొక్క సందేహములన్ని

యు దూరమగుడు, వారలచిత్తములు గురునిపట్ల శ్రద్ధాన్వి తంబులయ్యెను. గురుదేవు నవలోకించినంతనే వారి శీర్షములు భక్తిభావభారావనీతములయ్యెను. హృదయములు భక్తిభావ సంచలనమున వికసించెను. బుద్ధుడు వారిసమ్ముఖమున కేతెం చినంతనే భక్తిపరాయణులగు నాఛాతుర్లాదేవుని పవిత్రత మంబులగు పాదారవిందముల స్పృశించి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించిరి.

అంత బుద్ధచంద్రు డీరీతి శిష్యపంచకముతో నుడివెను: "నాప్రియమయిన శిష్యులారా! కఠోరసాధనమునకును, భోగ విలాసాధిక్యతకును మధ్యస్థంబగు మంగళమయపథమును నేను బడసినాడను. ఏతన్మంగళమయంబగు పథమే నిర్వాణమార్గము. నిర్వాణపదమును బడయు నుపాయమును నాప్రియశిష్యులరగు మీకు విశదము గావింప నే నిట కేతెంచితిని." బుద్ధదేవుని ప్రభావోత్పాదకంబులగు నుపర్యుక్తవచసంబుల నాకర్ణించినం తనే శిష్యులహృదయములు శ్రద్ధాభక్తులచే నిండిపోయెను. వారు శీఘ్రమే నూతన ధర్మదీక్షను గ్రహింప నుత్సుకులయిరి.

అనంతర మొక్క దివసము సాయంతనమగుటకుబూర్వ ము బుద్ధభగవానుడు తన యేవురుశిష్యుల వెంటనిడుకొని ఋషిపత్తనంబునకు సమీపమునందున్న సరోవరము చెంత కరి గెను. సరోవరము యొక్క యావలితీరంబునం దొక్క మహో న్నతంబగు స్థానముండెను. తదున్నతస్థానమునకుసరిగా క్రిందనే

నీటిరేవుండెను. ఆరేవునందే ఋషాృదులు ప్రాయికంబుగా స్నాన మాచరింపుచుందురు. దీక్షార్థులగు శిష్య లేవురను సరోవరజలంబున బ్రవేశించి, స్నాన మాచరింప సంసిద్ధులయి నంతనే దేవుడు వారల నవలోకించి యీరీతి నుడివెను :— "వత్సలారా ! నేటి మీస్నానము నిత్యస్నానమువలె సాధారణ మయినది కాదు. నేడు కేవలము బాహ్యశరీరకల్మషము ప్రక్షాళనము గావింపబడినంతనే కార్యసిద్ధి కలుగనేరదు. నేడు మీరు బాహ్యదేహము యొక్కయు, మానసము యొక్కయు మాలిన్యమును జలప్రక్షాళనంబున శుద్ధపఱచి, బాహ్యాభ్యంతరిక పారిశుద్ధ్యమును బడయవలయును." గురుదేవుని వచనముల నాలకించి, ప్రసన్నవదనులయి, శిష్యులు స్నానమాచరించి జలమునుండి తీరముపై కెక్కివచ్చిరి. బుద్ధదేవుడంత వారల నిట్లు పృచ్ఛించెను ; "బిడ్డలారా ! మీరు బాహ్యాంతరికశుద్ధి నిపుడు బాగుగా బడయగలిగినారా ? "శిష్యు లిట్లుత్తరమొసంగిరి :— "దేవా ! భవత్కృపచే నట్లే బడయగల్గితిమి" తిరిగిదేవుడు వారల నుద్దేశించి యీచందమున మారుపలికెను. గంభీరమగు నాదేవుని వాక్పాటవమున కచ్చెరువందుచు, నాదేవుని వచనముల శ్రద్ధాన్వితులయి యాలకింపజొచ్చిరి :— "కుమారులారా ! ప్రపంచమునందధికముగా ద్వివిధములగు శిష్యులు గానవచ్చుచున్నారు. ఒకశ్రేణివారు తిరుగబడియున్న కుండను బోలియున్నవారు. బోర్లబడియున్నకుండ

నీటియందు మునిగినను జలపూరితము కానిచందము ననే ప్రథమ శ్రేణి యొక్క శిష్యుల మనము సహితము గురూపదేశంబులనుండి విముఖత్వమును వహించుటంజేసి, యామన మేయవస్థయందును గురూపదేశామృతముచే బరిపూర్ణము కాజాలదు. అట్టివారు, యుగానుయుగముల పర్యంతము గురూత్తముల సన్నిధినుండియు, సత్ఫలమును బడయజాలరు. మీరుసహిత మీ శ్రేణి యొక్క శిష్యులరేయగుచు సత్ఫలమునకు దూరులగుదురా?" "దేవా! మే మీ శ్రేణి నభిలషించువారలము గాము." అని శిష్యు లుత్తర మొసంగిరి. అంత బుద్ధభగవానుడు ద్వితీయశ్రేణి యొక్క శిష్యులనుగూర్చి వాకొనదొడంగెను:—

"వీరు నిరుత్సంగమగు మూటను బోలియుందురు. గ్రంథిరహితంబగు పండ్లమూటను గల్గియున్నవాడు నిలుపబడినంతనే యామూటయందలి ఫలములు స్వాభావికంబుగనే క్రిందపడిపోవును. అదియేచందమున నీ శ్రేణి యొక్క శిష్యులు గురువుగారి పరిశుద్ధంబగు నాశ్రమమునం దున్నంతపర్యంతము నాచార్యునియందుండు గుణముల బాహ్యమునకు స్వీకరింపుచుందురు. తత్సమయంబున వారి మనోవాక్కాయకర్మల సౌజన్య విశేషమే గానవచ్చుచుండును. కాని వారుమాత్రి మాచార్యుని యొక్క వివిధంబులగు సద్గుణములను సదుపదేశములను భక్తిపూర్వకంబుగ హృదయసీమయందు నెలకొల్ప బ్రయత్నము సలుపరు. అట్టివారు గురుసన్నిధినిబాసి, దూరదేశమున

కరిగినంతనే హృదయస్థితముగానట్టియు, క్షణికస్థిరత్వమును గల్గి యున్నట్టియు నాచార్యునిగుణముల, ముడివేయని మూటనుండి నిలువబడినంతనే ధరణిపై జారిపడిపోవు పండ్లవలె జారవిడిచె దరు. తత్సమయంబున వారిస్వభావము సంపూర్ణముగ బరివర్త నమును బడయుచున్నయది. బిడ్డలారా! మీరీశ్రేణియొక్క శిష్యత్వమునే బడయ వాంఛింపుచున్నారా?" "మహాత్మా! మా కీశిష్యత్వము వలదు, వల" దని శిష్యులు నొక్కివక్కాణించి రి. పునః దేవుడు గంభీరంబును, సహజమృదుమధురంబును నగు కంఠస్వరంబున నీపగిది వాక్రొసదొడంగెను :— తృతీయశ్రేణి యొక్కశిష్యు లూర్ధ్వముఖంబునుగల్గియున్న కుండతో బోల్ప బడుచున్నారు. సరిగానున్న కుండను నీటియందు ముంచినంతనే యది త్రుటిమాత్రకాలంబున సలిలంబుతో సంభరితమయిపోవు రీతియే, యీశ్రేణియొక్క శిష్యులుసహితము తమ మనమును నిర్నిరోధముగ గురూపదేశిత వాక్యామృతఝురమునందు బ్రవేశింపజేసి బ్రహ్మనందసుధారసధారసు బానము సేయు చున్నారు. నిండినకుండ తృషార్తులయొక్కయు సంతప్తులయొ క్కయు పిపాసను, తాపమును సహజముగనే దూరముసేయ గల్గుచందముననే యీశ్రేణియొక్క శిష్యుల హృద్ఘటస్థితా మృతరసము కోటానుకోట్ల పాపతాపసంతప్తహృదయులగు నరనారీమణులకు దివ్యంబును, నిరుపమానంబును నగు ప్రశాంతి నొసంగగలదు. నాయనలారా! మీర లీశ్రేణియొక్క శిష్యత్వ

మును జేరిమింపుచున్నారా ?" అంత శిష్యులు వినీతభావము తోడ సుదృఢచిత్తులయి, యీవిధమున నుడివిరి:— "ప్రభూ! మే మీ శ్రేణియొక్క శిష్యత్వమునే వినిర్మలచిత్తులమయి, శ్రద్ధాభక్తుల నాదరింపుచున్నారము. ఇద్దానిని బడయుట కొఱకే దేవా! మాజీవితసర్వస్వముల హృదయపూర్వకంబుగ సమర్పింప గటిబద్ధులరము. భవదాజ్ఞకయి దాసాధములు నిరీక్షింపుచున్నారు." ఈరీతి నాచార్య ఛాత్రసంభాషణము సంఘటిమింపుచుండ బ్రభాకరు డస్తమించెను. క్రమక్రమంబుగ నభశ్చరముల కలకలారవములు క్షీణింపుచుండ, వృక్షశాఖా శిఖల లాస్యము సేయుచున్న యరుణవర్ణము మందగమనంబున బశ్చిమాకాశముజేరి యదృశ్యమగుడు నిశాసమయముయొక్క సుస్నిగ్ధతయు, నిస్తబ్ధతయు సర్వత్రవ్యాప్తమయ్యెను. అంత నాశిష్యులేవురును సరోవరతీరాంచలమునుండి లేచివచ్చి, భక్తిరసమొలుకుచుండ బుద్ధదేవుని పాదసన్నిధికడ కరుదెంచి, తమ హృదయపాత్రముల ముఖములదెఱచి మౌనమును భజింపుచు నాదేవుని సమక్షంబున నునిచిరి. అంత గురుదేవుడు సత్యధర్మముయొక్క రసధారనందు వర్షింపజేసెను.

శిష్యులంత హృదయముచే సత్యధర్మాభ్యంతరముల బరమకల్యాణము వెలయుచున్నటుల గ్రహించిరి. గురూపదేశ శ్రవణంబున దీర్ఘకాలమునుండియు వారి హృత్సీమల వేరు బారియున్న మహాసందేహ వృక్షములు మూలసహితంబుగ

విచ్ఛేదము గావింపబడియెను. అంతట వారు సంసారమున వ్యాప్తమయియున్న (1) దుఃఖాస్తిత్వమును (2) దుఃఖోత్పత్తి హేతువును (3) దుఃఖాతిక్రమపథమును (4) దుఃఖనివృత్తి యొక్క యుపాయమును గ్రహించిరి. సంసారమందు సుఖ దుఃఖములు రెండును వాటిల్లుచుండుట వాస్తవంబనియు, సత్యమనియు, దుఃఖోపశమనమగుటయు యథార్థమనియు, దుఃఖమును దూరముసేయుట కావశ్యకంబగు నుపాయము సహిత మున్నదనుటయు, సత్యేతరము కాదనియు, దుఃఖక్షయమునకు బ్రిధానముగా నష్టాంగమార్గము లావశ్యకంబులనియు గ్రహించిరి. ఇంతియేగాక శిష్యులు దుఃఖోపశమనంబునకును, పరిశుద్ధాద్యుతానంద ప్రాప్తికిని, అపూర్వశాంత్యుపలబ్ధికిని గావింపవలసియున్న సాధనము సత్వశూన్యంబగు బాహ్యను ష్ఠానంబు కాదనియు, నాసాధనమును స్వీకరించుటకును, తద్ద్వారా సిద్ధిని బడయుటకును దృష్టిని, సంకల్పమును, వాక్యమును, కర్మను, జీవికను, వ్యాయామమును, స్మృతిని మఱియు ధ్యానమును బరిశుద్ధము గావింపవలసి యుండుననియు గుర్తెఱుంగ సమర్థులయిరి. అపూర్వానంద సాగరమున నిమగ్నులయి, శిష్యులారేయి యంతయు జాగరముసలిపి హృదయమును దదేకనిష్ఠయందునిచ్చి, దేవుని శ్రీముఖబిలమునుండి బహిర్గతంబగు నూతనధర్మామృతమయ వాఙ్మరీరసమును బానము సేయుటయందే దవిలియుండిరి. అరుణోదయమగుటతో

డనే వారు శ్రీబుద్ధదేవసమేతంబుగ సరోవర సలిలంబున సుస్నాతులయి ఋషిపత్తనమునకు మగుడ నేతెంచిరి. గుర్వా జ్ఞచే వారాప్రదేశమునందే పూర్వదిశాభిముఖులయి నిలుప బడిరి. అంత వారు గురుదేవుని చరణకమలములస్పృశించి, భక్తిభావంబులు ముఖకమలంబున బ్రస్ఫుటితమగుచుండ, నవ నతమస్తకులయి గురుదేవుని, తద్వారా బోధింపబడిన మహా సత్యమును హృదయపూర్వకంబుగ స్వీకరించిరి. ఆస్థానము నందే రాజర్షియగు నశోకచక్రవర్తి శిల్పకళాచాతుర్యమును వెల్లడిసేయునట్టి మనోహరంబులగు స్తూపంబుల నిర్మింపజేసెను. ఇప్పటికిని సారనాథస్తూప మనుపేర నొక్కమహోత్తుంగంబగు స్తూపము వెలయుచున్నయది.

## శ్రీ బుద్ధభగవానుడు ; ఉపదేశారంభము

శ్రీ బుద్ధభగవానుడు శిష్యసమేతుడయి విరివిగా ధర్మ ప్రచారముసేయ గడంగుటకుబూర్వమే యుపదేశించిన సద్బో ధలు కొన్నికలవు. వానినిట సంక్షిప్తముగా జేర్కొందును. దేవుడు ధర్మప్రచారమును బ్రారంభించుటకు శిష్యుల బ్రో త్సహించి, తానుసహితము తన యోగసాధనావస్థయందు పరి చితులయిన ఋషీశ్వరుల కొందరిని సందర్శించి, నూతనధర్మ ప్రబోధముసేయు సంకల్పముతో నొక్క జనపదమునుండి చనుచుండ నాగ్రామమందలి స్వాభిమానియగు బ్రాహ్మణుం డొక్కడాదేవునిచెంత కేతెంచి కుత్సితబుద్ధితో దేవునిట్లు

ప్రశ్నించెను:—ఓసాధూ! నీవు జన్మతోడ వర్ణమేర్పడియుండ లేదనియు, గర్మననుసరించియే ప్రపంచవ్యవహార జ్ఞానసంపన్నులద్దాని నేర్పఱచుకొనియున్నారనియు, నెల్లవారికి బోధింపుచు బోధింపనున్నావట. బ్రాహ్మణు లనువారు జన్మతోడనే పవిత్రులయినట్లును, వారు భూసురులని పిలువబడదగినవారనియు, బ్రహ్మముఖమునుండి జననమందినవారనియు సకలశాస్త్రములు వేయేల? సర్వేశ్వరనిర్మితంబులగు వేదములే వాకొనుచుండ, నీవీరీతి వాకొనుటయం దర్థమేమి? ఇక్కాలమున నొకటిరెండు శాస్త్రముల బఠియించినవారెల్లరును దత్వవేత్తలుగనే బరిగణింపబడుచున్నారు. నీవుసహిత మాశ్రేణికిజెందిన వేదజ్ఞానదూరుడవగు సన్యాసివలెనే కాన్పించుచున్నావు. నీవలె దంభోక్తుల బల్కుటకు మాకుసహితము సామర్థ్యము లేకపోలేదు. కాని వేదము లీశ్వరవిరచితములయియుండ వానియందున్న సిద్ధాంతముల నుల్లంఘించుటకుగాని, విమర్శించుటకుగాని వశమా? నీవెన్నిబోధించినను వర్ణము కర్మానుసారముగ నిర్మింపబడినదను వాదమున కామోదించువారు వివేకులయందు లభించుట దుర్లభంబని గుర్తెఱుంగుము. వేదాంతమునుగూర్చి నీవు బోధింపనారంభింతువేని శీఘ్రకాలమునందే ప్రఖ్యాతినంది, ధనధాన్యాదుల నార్జించి, సుఖింపగల్గుదువు. పరులచెంతకరిగి ధనోపార్జనములేక భిక్షనెత్తికొని జీవించుటయు గళంకదాయకమేయని గ్రహింపజాలకపోయితివేమి? వ్యవ

సాయవృత్తియు సాధువుల కనుకూలమయినదియె. అందు
స్వాతంత్ర్యమునకు భంగము కలుగనేరదు. నీలక్షణములన్ని
యు నవలోకింప నీయందు సాధుత్వమునకు దగు సామర్థ్యము
లేనటులే విశదమగుచున్నయది." నిరక్షరకుక్షియగు నావిప్రుని
జ్ఞానశూన్యంబులగు నావచనముల నాలకించి, బుద్ధదేవుడు
ప్రాపంచికుల యవివేకమునకును, అహంకార మమకారాధిక్య
తకును డెందమునం దెంతయు గుంది, శిష్యులున్న స్థానమునకు
సత్వర మరుగవలసియుండుటంజేసి, వాని కీరీతి గుప్తముగ నుప
దేశించెను :—"కుమారా! నీముఖమునుండి వెలువడిన వాక్య
ములన్నియు నర్థశూన్యములె. అజ్ఞానముచే నీపల్కినవచన
ములు నామనమున కీషణ్మాత్రమయిన దుఃఖము నొదవజేయ
జాలవు. జ్ఞానమును బడయని నీవు వర్ణమునుగూర్చిగాని, కర్మ
నుగూర్చిగాని బోధించినను గ్రహింపలేనట్టి స్థితియందున్నా
డవు. జననీజనకులు బ్రాహ్మణులయినను, సుతులు జ్ఞానమును
నార్జింపక మనుచో బ్రాహ్మణేతరులగుదురన్న నాశ్చర్యమ
దెద్ది కలదు? అజ్ఞానమునకు జిక్కియున్న నీవవశ్యము సుఖదుః
ఖముల ననుభవించియే తీరుదువు. వత్సా! రెండుదినముల
బ్రిదుకు కీదంభాహంకారములతో నిమిత్తమేమి? నేజెప్పు
యీవాక్యముల సారాంశమును గ్రహించి ధన్యుడవగుము.

బౌద్ధధర్మప్రచారము విరివిగా సేయనున్నారము. నీసం
దేహములన్నియు దూరముకాగలవు. కామము, మోహము,

భ్రమ యను నీదుష్టపదత్రియంబునకు జిక్కియే సంసారులు దుఃఖము ననుభవించు నిమిత్తము భువిపై జన్మించి, జరామరణవ్యాధులకు వశులయి, ఖేదితాత్ములగుచుందురు. మరణము జననము నుండియు, జన్మ కర్మసమూహమునుండియు, గర్మసంఘము అభిలాషనుండియు, నభిలాష యాశనుండియు, నాశ యనుభవమునుండియు, ననుభవము స్పర్శమునుండియు, స్పర్శము దుఃఖసందోహము నుండియు, దుఃఖావళి నామరూపములనుండియు, నామరూపములు విజ్ఞానమునుండియు విజ్ఞానము చర్యనుండియు, జర్య యవివేకమునుండియు నుత్పన్నములగుచున్న యవి. కాన జన్మరాహిత్యమునకు మరణమును, కర్మసంఘరాహిత్యమునకు జన్మమును, అభిలాష విముక్తికి గర్మసమూహమును, ఆశావినాశమునకు నభిలాషయును, అనుభవశూన్యతకు నాశయును, స్పర్శరాహిత్యమున కనుభవమును, దుఃఖవిముక్తికి స్పర్శమును, నామరూప రాహిత్యమునకు విషాదమును, విజ్ఞానవిముక్తికి నామరూపంబులును చర్యావిముక్తికి విజ్ఞానమును, అజ్ఞానవిముక్తికి జర్యయును గారణభూతములయియుండు కతన గ్రమముగా నొక్కొక్కదానిని నొక్కొక్కదానిచే దూరము గావింపవలయును. ఆర్యసత్యచతుష్టయంబును, అష్టాంగమార్గములును బంధనవిముక్తికిని, నిర్వాణప్రాప్తికిని మూలములగును. మోక్షదాయకంబును, మిథ్యాభిమానశూన్యంబును సర్వజన హితానుకూలంబును,

జీవకోటి కమందానంద సంధాయకంబునునగు బౌద్ధధర్మము యొక్క పరిశుద్ధంబును, పవిత్యతుంబునునగు నీతి నీ కచిరకాలంబునందే తెలియగలదు. నీవపుడే నాధర్మమును గుర్తెఱుంగగల్గుదువు. నీవు కృషీవలుడవయి యున్నావు కాబోలు! నేను భిక్షాటనము జేయుచున్నాననియు నియ్యది సాధువులకు గళంకదాయకంబనియు, స్వావలంబనయే యత్కృష్టమయినదనియు గృషియే సాధువులకు యుక్తమగు వృత్తియనియు గదా నీవు వక్కాణించియుంటివి. నాయనా! నేనుసహితము కృషీవలుడనేయని గుర్తెఱుంగలేకపోయితిని. నేనుసహితము కృషికార్యమే సేయు స్వతంత్రజీవిననియు నీవు గ్రహింపకుండుటకు నీచిత్తముపై నాధిపత్యము వహించియున్న యజ్ఞానమే మూలకారణము. బిడ్డా? వినుము! నేనురైతును, మానసమే దివ్యమగు క్షేత్రము, హాలము ధర్మము, నమ్రత్వమును జ్ఞానమును బడయుటయే దుక్కిదున్నుట, నిరంతరకృషియే వృషభద్వయము, మనస్సే వృషభముల నడుపు ముక్కుదారము, సత్యమే మునికోల, శ్రద్ధ విత్తనములు, బీజముల మొలకలెత్తించి వృద్ధిసేయు సాధనమగు వర్షమే సత్కార్యము. సస్యతతిని నాశనమొనరించు కలుపే మోహము, వ్యవసాయముయొక్క ఫలితమగు పంటయే నిర్వాణము లేక శాశ్వతానందపదవి; ఇదియే సకలదుఃఖనివారిణి; జననమరణరహితము? ఆదిమధ్యాంతశూన్యము. దీనినిమిత్తమయి సుజ్ఞానసంపాదనమే నీదగు విహి

త్ధర్మము. కాలవిలంబమయినది పోయివచ్చెద" నని చెప్పి బుద్ధ
భగవానుడు ముందునకు సాగిపోయెను. బుద్ధదేవుడొకించుక
దూర మరిగి, శ్రావస్తీ నగరమునకు సమీపమునందున్న పుర
వారామను పేరుగల స్థానమునందు విశ్రమించెను. ఆస్థానము
నకుసమీపమునందేయున్న గ్రామమునం దొక్క ధనికుడుండెను.
ఆధనాఢ్యుని పుత్రవధువున కొక్క ప్రేమాస్పదుండగు కుమా
రు డుండెను. అల్పప్రాయమునందే యాప్రియసుతుండు
వ్యాధిగ్రస్తుడయి మరణించెను. పుత్రగతప్రాణయగు నాకృ
ష్ణాదేవియాక్రందనధ్వనులు గ్రామమంతయు మారుమ్రోగు
చుండెను. గ్రామవాసులలో నొక్క డామె చెంత కేతెంచి,
పురవారామమువద్ద బుద్ధదేవుడను మహాత్ముండొక్కడన్యత్రి
జనుచు బ్రస్తుతము వేచియున్నాడనియు, నాదేవుని పాదము
లపై బడి, ప్రార్థించిన మృతసుతుని సజీవుని గావింపగలడని
యు, నొక్కి వక్కాణింప నాదేవి కుమారాశావేశపిశాచంబు
నకు వశీకృతయయి, యుక్తాయుక్త పరిజ్ఞానము నశియింప, సత్వ
రమే మృతపుత్రుని కళేబరమును హస్తములనిడుకొని, పాషా
ణములుసహితము ద్రవీభూతమగు చందమున విలాపముసే
యుచు, బుద్ధదేవుని పాదసన్నిధి కరుదెంచి, యాకళేబరము
నాదేవుని పాదరాజీవంబుల బడవైచి :—"దేవా! అనాథనగు
నాకు పుత్రభిక్షను బ్రసాదింపుడు; లేనిచో నేనింక భువిపై
జీవింపజాలను. మహాత్మా! ఆర్తత్రాణనగు నన్నురక్షించి

ఘనాత్ములరగుడి." దేవుడాజ్ఞావశూన్యయు, ప్రేమకాతరయు గతసుతయునగు వనిత నవలోకించి, యిట్లుత్తరమొసంగెను:—

"కుమారీ! నీపుత్రుని జీవింపజేయుట యొకఘనమయిన కార్యము కాదు. దుఃఖింపవలదు. శాంతింపుము. మృతజీవుల సంరక్షించుట కొక్క పదార్థ మావశ్యకమయియున్నది. అద్దాని నీవు సంపాదించి తెత్తువేని కార్య మవలీలగ సాధింపబడగలదు. దేవుని శ్రీముఖంబునుండి వెలువడిన యాయభయ వాక్యార్థము గ్రహింపజాలక, పెన్నిధిని బడసిన పేదవలె, పరమానందభరితయయి, యానందబాష్పముల గనుగొలంకులనుండి స్రవింపజేయుచు, దేవా! మాగృహమునం దేపదార్థమును గొఱవడియుండలేదు. సకలపదార్థములు నగణితములయి పడియున్నవి. వజ్రవైడూర్య మాణిక్యంబులును, సువర్ణ, రౌప్యాభూషణంబులును లెక్కకు మిక్కిలిగా బడియున్నవి. శీఘ్రము సెలవిండు. సత్వరమే గొనివచ్చి భవత్పాదంబుల నర్పించెద."

బుద్ధదేవుడు:—సర్వసంగ పరిత్యాగినయి, శాశ్వతానందకందమగు నిర్వాణతత్వమును గరతలామలకంబుగావించుకొనిన నాకు నశ్వరంబులును, మిథ్యాసౌఖ్య ప్రతిపాదకంబులును నగు ధనధాన్యములతో నిమిత్తమేమియున్నది? మదభిలషితంబగు పదార్థమెద్దియో విశదీకరింపుచున్నాడ, ఆలకింపుము—నేను వాంఛింపునదొక్క మహత్పదార్థము కాదు. కేవలమొక గుప్పెడు తిలముల నేగృహమునకయిన నరిగి, కొనిరమ్ము!

ఒక్క విషయముమాత్రము ధ్యానమునం దునిచికొమ్ము.
నీవు తిలముల యాచించు గృహమునం దెప్పుడును, ఎవ్వా
డును మరణించియుండరాదు. మృత్యుదేవత నింతపర్యంతము
స్పృశించియుండని గృహముయొక్క తిలములే మన దివ్యౌష
ధమున కుపయోగించును.

అంత నాకృష్ణాదేవి ప్రసన్నచిత్తయయి, తిలముల గొని
రా గ్రామమునకు వాయువేగంబున నరిగెను. ఆమె ధనా
ఢ్యునిపత్ని యయియుండియు, గృహాగృహమున కేగి గుప్పెడు తి
లముల బ్రసాదించి, పుత్రభిక్షను బెట్టుడని ప్రార్థింపజొచ్చెను.
దేవుడుసెప్పిన రహస్యవిషయముసహిత మెల్లగృహస్థులతో
నాదేవి చెప్పుచునేయుండెను. గ్రామమందలి ప్రతిగృహము
నం దెవరో యొకరు మరణించియే యున్నట్లు స్పష్టపడియెను
ప్రతిగృహస్థుడును మానికేతనమునందు మాపితామహుడు
పోయెననియు, మాతామహి నశించెననియు, మాత దివికరిగె
ననియు, కుమారు డసువుల బాసెననియు, ప్రియపత్ని యస్త
మించెననియు జెప్పుచుండుట నాలకించి, కృష్ణాదేవి ఖిన్న
యయి, లజ్జితయయి, మరణ మెంతటివారికయిన నవశ్యభో
క్తవ్యమను వివేకమును బడసినదయి, శరీర మశాశ్వతమని
తెలిసి, రిక్తహస్తములతో దేవుని పవిత్రసన్నిధి కేతెంచెను.
బుద్ధదేవు డాస్త్రీనచ్చుట నవలోకించి, మృదుమధురంబగు
స్వరమున నిట్లు పృచ్ఛించెను:—"పుత్రీ! నేజెప్పినచోటనున
ధిలముల గొనివచ్చితివా?"

కృష్ణా :—దేవా ! తమ రాజ్ఞాపించినచందమున గ్రామమందలి గృహములన్నియు గాలించివేసితిని. మృత్యుముఖమును సందర్శించని గృహంబుగాని, కుటీరముగాని, గ్రామమం దెచట నన్వేషించిన లభింపకపోయెను. సర్వత్ర మృత్యుదేవతయే నిరంకుశరాజ్యపరిపాలన మెల్లకాలముల నేయుచున్నటుల విస్పష్టమయినది. ప్రభూ ! దాసురాలి మనోరథము సిద్ధించుయోగ మింకలేదనియే భావించెద.

బుద్ధ :—తల్లీ! ఏమి నీయమాయకత్వము ! అమ్మా! నీవింకవ్యామోహాంబుధియందేపడియుండి, యిటునటు దీరము జేరలేక యీదులాడుచునే యుంటివా ? సృష్టిరహస్యమును గ్రహింప నోతల్లీ! భౌతికంబున కతీతంబగు నాధ్యాత్మిక జ్ఞాన మావశ్యకంబయి యున్నది. అజ్ఞానస్వరూపంబగు వ్యామోహపిశాచము నీదగు జ్ఞానము నణచివైచినది. నీవిజ్ఞాననేత్రము బంధింపబడిపోయినది. నీకుమారు డొక్కడే యకాలమృత్యువాతం బడినట్లును, తీరనిదుఃఖము నీకే వాటిల్లినట్లును, నీదగు సౌఖ్యవల్లరియే, ప్రచండ ఝంఝామారుతాహతిచే భిన్నమయిపోయినట్లును, జ్ఞానశూన్యవగు నీవు భావింపుచుంటివి. నీవలెనే యీలోకమునం దనేక వనితాలలామలు పుత్రహీనలయి, యహోరాత్రములు దుఃఖవారిధిని బడి కొట్టుకొనుచున్నటుల — నీవు గ్రహింపజాలకపోయితివా ? ఎందఱెన్నివిధముల నాత్మీయుల గోల్పోయి, యెట నెట నెన్నిర

తుల వాపోవుచున్నారో నీకు దెలియకపోయెనా ! జీవించిన
నాల్గుదినములయిన దృప్తిగా నారగించుటకయిన నీకు వలయు
నంత ధనమున్నయది. అదియును లేక బంధుమిత్రాదులకు దూ
రులయి త్రావగంజియు, ధరింప వస్త్రములును, నివసింప
గృహమును లేక భయంకరవ్యాధులచే నాక్రమింపబడి, యెంద
రీదుఃఖమయంబగు సృష్టియం దాక్రందనధ్వనులచే భూమ్యా
కాశముల బ్రతిధ్వనింప జేయుచున్నారో కుమారీ ! గ్రహింప
జాలకపోయితివా ? నైజమునకయి విలాపము సేయక, సత్వర
ము శోకతాపముల విస్మరించి, జరామరణవ్యాధులనుండి పరి
త్రాణమునంది, సుస్థిరంబగు శాంతిని జేపట్టుము. అదియే నీకు
సర్వస్వము కాగలదు. కుమారుడయినను, భర్తయయినను
జననీజనకులయినను నీకు దుఖమునొసంగక నిర్వాణమును
బ్రసాదించు జ్ఞానమే కాగలదు. తదుత్తమ జ్ఞానసంపాదనమే
నీకర్తవ్యము. లెమ్ము, ఇంక నీచుట్టిబొమ్మ నేభూమినుండివచ్చి
నదో యాభూమియందే భస్మముగావించి, మిళితము జేసివే
యుము. కాలవిలంబన మయినది. పోయివచ్చెద.

అంత బుద్ధదేవుడటనుండి పయనమయి శీఘ్రమే శిష్యు
లున్న స్థానమునకు నూతనధర్మ ప్రచార కార్యక్రమమును
గూర్చి విచారింప నరిగెను.

## నూతన ధర్మప్రచారము, వ్యాపనము.

శ్రీ బుద్ధభగవానుని యొక్క యేవురు శిష్యులలోను
దొలుదొల్త కాండిన్యనామధేయముగల యతడే నూతన ధ

ర్మము యొక్క తత్వమును స్పష్టముగా గ్రహించెను. తదనం తరము క్రమముగా శేషించిన నల్వురు శిష్యులుసహితము ధర్మతత్వమును హృదయంగమము గావించుకొనిరి. ఉద్యోగ ప్రభావంబున వారలేవురును భయవిషాదభంజకంబును, కల్యాణమయంబును, అమందానందకందంబును నగు నూతనధర్మమును స్పష్టముగా, సందేహ మావంతయు లేకుండ, బుద్ధభగవానుని కృపావిశేషంబున గ్రహించిరి. శిష్యుల నెల్లవిధములం దత్వవేత్తలయి యుండుట వీక్షించి, దేవుడు వారల నుద్దేశించి యీరీతి వక్కాణింప నుపక్రమించెను:— "ఓ భిక్షువులారా సత్యజ్ఞానయుక్తంబగు నూతనధర్మమునందు దీక్షితులరయి, మీరు పునర్జన్మను బడసినారు; మీర లొండొరు లనేకమాతృగర్భజనితులగు సహోదరులుగ భావమునం దెంచుకొనుడి. ప్రేమయందును, పారిశుద్ధ్యమునందును, సత్యమునందును నిశ్చలంబగు నిష్ఠను గల్గియుండి, మీహృదయముల నైక్యము గావించివేయుడి.

సమ్యక్సంకల్పమును స్వీకరించి, మానవుడేకాకియయి సత్యసాధనమునందు బ్రవృత్తుడయినపుడు, అతడు మధ్యమధ్య దుర్బలుడగుచుండును. భయమతని హృదయము నావహించుచుండును. సత్యమార్గమునుండి భ్రష్టుడ నగుదునను సందేహ మతనిచిత్తము నాక్రమించును; కనుకనే మీరు విడివిడిగానుండి సాధనమునందు బ్రవేశింపక, పరస్పర సాహాయ్య

ము గావించుకొనుడి; పరస్పరము సహానుభూతిని గల్గియుండి, సాధుప్రయత్నములయం దొండొరులు ననుకూలురయి మ నుడి. మీయొక్క భ్రాతృభావ మత్యంత పరిశుద్ధమయి యుండు గావుత! మీదగు నీసంఘము మున్ముందు శ్రద్ధాళురగు పురుషావతంసములయొక్క సమావేశస్థానంబగుత!"

శ్రీ బుద్ధభగవానుడు శిష్యసమేతముగా ఋషిపత్తనము నం దెల్లరికి నూతనధర్మమును గూర్చి ప్రబోధింప నారంభిం చెను. తత్సమయమునందే యొక్కదివసము కాశీధామమున నివసించు యొక్క ధనాఢ్యుండగు వణిజుని కుమారుడు, య శుడనువాడు సంసారమునుండి విరక్తుడయి, గృహమునందలి వారెల్లరు గాఢనిద్రాపరవశులయి యుండ, గృహమును రహస్యముగా బరిత్యజించెను. ఋషిపత్తనమున నివసించు బుద్ధదేవుని సన్నిధి కతడువచ్చి యీరీతి నుడివెను. "మహాత్మా! ఎట్టివిఘ్నము! ఎంతటి యుపద్రవము!" అంత బుద్ధదేవు డా యువకుని కిట్లుబోధించెను:— "కుమారా! భీతిజెందకుము, ఇట నుపద్రవ మెద్దియునులేదు. విఘ్నమ దెద్దియును వాటిల్ల నేరదు. నీవు నాచెంతకు రమ్ము; నిన్ను నేను ధర్మశిక్షచే దీక్షి తుని గావించెదను." అంత నాతరుణ వయస్కుడు బుద్ధదేవుని చెంత కరుదెంచి, భూమిపై నాసీనుడయ్యెను. బుద్ధదేవు డా యువకునకు దుఃఖనివారణము యొక్క శుభోదంతమును గూర్చి యుపదేశించెను. యశుని జ్ఞాననేత్రములు దెఱచు

కొనియెను. అతడు బుద్ధదేవుని కృపావిశేషంబున శాంత చిత్తుడయి, సాంత్వనోక్తుల బడసి, యాదేవుని దివ్యతమ పాదారవిందముల దన్నుదాను సమర్పించుకొనియెను.

ధనాఢ్యుని పుత్రుడగు యశుడు విలువగల యాభూష ణముల శరీరమంతయు నలంకరించుకొని యుండెను. తన వేష మునకును, భాషకును, మిథ్యాశృంగారమునకును స్వాంత మునం దెంతయు లజ్జితుం డయ్యెను. బుద్ధదేవు డా ప్రియశిష్యు నవలోకించి యిట్లు నుడివెను:— "వత్సా! పవిత్రతమంబును, జీవితోత్థానకరంబును నగు ధర్మము బాహ్యపదార్థములతో నెట్టి సంబంధమును గల్గియుండదు. ఆభ్యంతరిక వేషంబు లన్నియు మనముతో నెయ్యమున కియ్యకొని యుండును. బహుమూల్యవంతములగు నాభూషణాంబరములచే సజ్జి తుండయిన వ్యక్తిసహితము నిజాభీష్టముపై విజయము నవశ్య ము బడయగలడు; కాషాయవసనధారియగు శ్రమణునియొ క్క మానసముసహితము సాంసారిక భోగవిలాసముల దవిలి యుండుటయందును నాశ్చర్యము లేదు. వాస్తవమరయ సన్యాసి యందును గృహస్థునందును విశేషమగు తారతమ్యము కాన రాదు. అహంకారము హృత్సీమనుండి దూరమొనరింప గల్గిన వ్యక్తియే కల్యాణమయంబగు సత్యమార్గమును బడయ గలడు.

కాశీధామనివాసియు, ధనికుండునునగు నావ్యాపారి, పుత్రుడగు యశు నన్వేషింపుచు ఋషిపత్తమున కేతెంచెను.

అతడుసహితము శ్రీ బుద్ధచంద్రుని ప్రభావోత్పాదకంబు లును, దివ్యతమంబులును, మృదుమధురంబులును నగు సదుపదేశముల నాలకించి ముగ్ధహృదయు డయిపోయెను. బుద్ధదేవునివలన బౌద్ధ ధర్మదీక్షను గైకొన్నవారిలో నితడే ప్రథముడు. యశుడు స్వగృహమునకు మగుడ రాలేదు. అతడును నూతన ధర్మమునందు దీక్షితుడయి, దేవునిచే స్థాపింపబడిన సంఘమునందు సభ్యుడుగా జేరెను.

కతిపయ దివసములయందే శ్రీ బుద్ధదేవుని సత్కీర్తి చంద్రికలు చతుర్దిశల వ్యాప్తమయ్యెను. తద్దేవుని శ్రీ ముఖమునుండి వెలువడు పీయూషరసాన్విత మృదుమధుర ధర్మోపదేశవాక్యముల నా ల కిం ప, దూరదేశములనుండియు జనులు తండోపతండములుగా వేంచేయ నారంభించిరి శాంతిప్రదంబగు నిర్వాణమును బడయ నభిలషించి, యసంఖ్యాకులగు భక్తజనులు ప్రచలిత ధర్మమతముల విడనాడి, నూతన ధర్మమును హృదయపూర్వకంబుగ స్వీకరింప నారంభించిరి. దశమాసములసమయమునందే దేవుని శిష్యులసంఖ్య యరువదికి మించెను. అత డంత వర్షాకాల మంతయు శిష్యులతో గూర్చుండి, నూతనధర్మపరిశీలనము గావించెను. సత్యమార్గముయొక్క పథికులును, శ్రద్ధాళురును నగు పురుషోత్తముల హృదయముల నీధర్మముయొక్క శుభవాణి స్థిరస్థాయిగా నాటుకొని పోయెను. వర్షర్తువు గతించినంతనే దేవుడు శిష్యుల

కిట్లు బోధించెను:—భిక్షువులారా! సంసారముయొక్క హితముకొఱకు, సంసారులగు మనుష్యుల సౌఖ్యమునిమిత్తము, జీవకోటియందు దయగలవారయి, నూతనంబును, ఆదికల్యాణకరంబును, మధ్యకల్యాణకరంబును, అంత్యకల్యాణ కరంబును, నిత్యకల్యాణదాయకంబును నగు నా యీ ధర్మముయొక్క సత్యోపదేశముల దేశదేశములయందు, గ్రామగ్రామములయందు శ్రమయనక, కష్టమని యెంచక, నిష్ఠూరముల లెక్కింపక ప్రచారము గావింపుడి. మీసంఘముసందిరువురుకలసి యొక్కదిక్కున కరుగవలదు. తృష్ణయనియెడి ధూళిచే ధూసరితములుకాని నేత్రముల గల్గియున్న మానవులెల్లరు ననాయాసముగనే ధర్మముయొక్క సత్యస్వరూపము నవలోకింప సమర్థులయ్యెదరు. అమృతముయొక్క యపూర్వ రసాస్వాదనము సేయగల్గినంతనే మానవుడు విషయోపభోగముల దాసత్వమును నిరసించి, నిర్వాణ (ముక్తి) మార్గముయొక్క పథికుడగుటయం దెంతమాత్రమును సందేహము లేదు. మీరలదమ్యోత్సాహవిజృంభణముతోడ మానవుల గృహగృహమునందును పరిత్రాణకరంబగు మామక ధర్మోపదేశవాక్యధ్వనిని బ్రతిధ్వనింప జేయుడి.

శ్రీబుద్ధభగవానుడు ధర్మప్రచారమునకయి తా నురువిలను నుద్దేశించి పయనంబయ్యెను. శిష్యసముదాయము సహిత మాచార్యాదేశమును బడసినంతనే ధర్మప్రచారార్థము

భిన్న భిన్న రాష్ట్రములకును, దేశములకును విజయముజేసిరి. తత్కాలమున నురుబిల్వము అగ్నిదేవోపాసకులగు జటిలురను సాంప్రదాయకులకు ప్రధానస్థానమయి యుండెను. సుప్రసిద్ధ పండితమండలాగ్రగణ్యుండును, దార్శనికుండును నగు కాశ్యపు డీమతమునకు ప్రధానాచార్యుడయి యుండెను. శ్రీబుద్ధభగవాను డీప్రవీణుండగు జటిలాచార్యుని యింటి కతిథి కావచ్చెను. తద్దేవుని శాంతిభావమయంబగు ముఖంబును, ప్రభావోత్పాదకంబగు కాంతియును మృదుమధురవ్యవహారంబును, ఆనందప్రదంబులగు ధర్మోపదేశవాక్యములును, కాశ్యపుని విమోహితుని గావించివైచెను. వయోవృద్ధుడును, జ్ఞానవృద్ధుడును నగు కాశ్యపుడు తరుణవయస్కుండగు బుద్ధదేవుని ప్రబోధముల కాశ్చర్యమును జెంది, యాదేవుని శిష్యత్వమునకు సమ్మతించెను. ఆకాశ్యపుని యనుచరులును, అగ్నిపూజాధురంధరులును నగు బ్రహ్మచారులెల్లరు దేవుని శరణాపన్నులయిరి. వారలందరంత నగ్నిపూజయొక్క సమస్తవిధోపకరణంబులను నదీగర్భంబున వాని నిరుపయోగతను గ్రహించి, విసరివైచిరి.

ఉరుబిల్వమునందు కాశ్యపుని యొక్క సహోదరులిరువురు నదీకాశ్యప, గయాకాశ్యపులనువారు సమీపమునందే నివసింపుచుండిరి. వారలు నదీప్రవాహజలోపరిభాగంబున దేలిపోవుచున్న యగ్రజునియొక్కయు దదనుచరులయొక్క

యు బూజాపాత్రింబుల గాంచి, చింతిత చిత్తంబులతో శిష్య సమేతముగా సహోదరునియాశ్రమంబున కేతెంచిరి. తత్సమయంబున శ్రీ బుద్ధభగవాను డట భిక్షువుల కుపదేశింపుచుం డెను :— "ఓభిక్షువులారా! జీవములన్నియు నఖశిఖాగ్రపర్యంతము బ్రచండాగ్నియందు దగ్ధమయిపోవుచున్నయవి. ఎల్లరు దృష్ణాగ్నియందును, ద్వేషానలమందును, వ్యామోహాగ్ని యందును, దగ్ధమయి పోవుచున్నారు. మీరెల్లరు జనన మరణ జరా రోగ శోకభయాగ్నుల దగ్ధమయిపోవుచుండుట నేనవలోకించి నాడను. ప్రతిమానవు డీరీతి నాత్మీయదుఃఖమయచారిత్రమును గూర్చి విచారించుకొనినంతనే వైరాగ్యోదయంబగుడు. చిత్తము ముక్తికయి వ్యాకులతను జెందనారంభించును. బుద్ధదేవుని మధురంబును, సార్థకంబును నగు దివ్యోపదేశముల నాలకించి యగ్నిపూజాపరతంత్రులగు నాజటులెల్లరు ముగ్ధులయిపోయిరి. వారలందఱు నైక్యకంఠముతో శ్రీబుద్ధ జయజయ ధ్వానముల గావింపుచు దేవునిచే దత్కాలమునందే నవీనధర్మమున దీక్షితులయిరి. తదాదిగ నగ్నిదేవతోపాసనయందు వారలకు ద్వేషభావ ముదయింప, బౌద్ధధర్మము చిరకాలశాంతిప్రదం బగు నాశ్రయస్థానమయ్యెను. కాశ్యపసమేతముగా శ్రీబుద్ధదేవుడసంఖ్యాకులగు ఛాత్రుల వెంటనిడుకొని, ఉరుబిల్వమునుండి రాజగృహమున కరిగెను.

శ్రీ బుద్ధాగమన శుభసమాచారము నాలకించి, సిద్ధార్థభక్తుండగు బింబసార భూపాలుడు సచివానుచర సమేతుడయి

దేవునిసన్నిధి కేతెంచెను. శ్రీ బుద్ధదేవుని నవ్యతర సౌమ్యతే జోవిలసితంబగు ముఖారవిందమును, దివ్యాకృతినిగాంచి, ఆ గతజనులు భూపాలసహితంబుగ భక్తిభావప్రేరితులయి, యొక్కసారి యాదేవుని పాదాంబుజముల వ్రాలిరి. అంత బుద్ధభగవానుడు వారల లేవనెత్తి, బింబసారుని పూర్వస్వరూపంబునకును, ప్రస్తుతస్వరూపంబునకును గల తారతమ్యమును వీక్షించి, ప్రసన్నచిత్తుడయి, వారలకు నూతనధర్మమర్మముల నీచందమున గ్లుప్తముగ నుద్బోధించెను :—"నాయనలారా! సమస్తపాపములయొక్క పరిత్యాగము, శుభకార్యముల సంపాదనము, అంతఃకరణముయొక్క పారిశుద్ధ్యము, యివియే సంక్షేపముగా విచారించిన ధర్మమని చెప్పబడును. స్వప్రాణములనయిన సమర్పించి పుత్రునియసురుల సంరక్షించు మాతవలె సత్యధర్మపరిజ్ఞాతలగు సాధుపురుషోత్తములు స్వీయజీవితములయొక్క యశాశ్వతత్వమును గ్రహించి, జీవకోటియెడ దయనుగల్గి ప్రేమభావభరిత హృదయులయి, మనుచునుంద్రు. అట్టిపురుషపుంగవులయొక్క హింసాశూన్యంబును, ద్వేషరహితంబును, బాధావిహీనంబును నగు ప్రేమ యీ లోకమునందే కాదు; లోకలోకాంతరములయందును వ్యాప్తమయి యుండును. వారలెప్పుడును ప్రేమలోకమునందే స్వచ్ఛందవిహారము సలుపుచుందురు.

దేవుని సుమధురంబగు ధర్మవాణి నాలకించినంతనే బింబసార భూపాలుని యంతఃకరణము భక్తి సంభ్రమభావపరీత

మయ్యెను. ఆసిద్ధార్థుడే యీ బుద్ధదేవు డను జ్ఞానమతనికి గల్గి నంతనే యతనికాయ మొక్కమ్మడి, పులకాంకితంబయ్యెను. అతడు శ్రీ బుద్ధభగవానుని పాదకమలముల శీర్షమును వంచి, దేవునిశిష్యత్వమున కియ్యకొనియెను. బుద్ధదేవున కా భూపాలుడు భిక్షుసముదాయముతోడ వసియించుటకు నగరబాహ్యప్రదేశమునందున్న మనోజ్ఞంబగు పుష్పోద్యానము నొండు భక్తిపూర్వకముగ సమర్పించుకొనియెను. సరిగా నీసమయమునకే దేవుని శిష్యపంచకములోని యొక్కండగు నశ్వజిత్తనువాడు జంబూద్వీపంబున బరిభ్రమణము సలిపి, రాజగృహమున ధర్మపరిబోధము నేయుచున్న గురుదేవుని సన్నిధికి మరలివచ్చెను. అతడొక్కదివసము కరమునందు భిక్షాపాత్రి నిడకొని, నగరమధ్యంబున ద్వారద్వారమున కరిగి, భిక్షనెత్తికొనుచుండెను. తత్సమయమందే యుపతీష్యుడను నామాంతరముచే నొప్పు యొక్క విరక్త బ్రాహ్మణ జిజ్ఞాసువు, అశ్వజిత్తుయొక్క సౌమ్యంబును, బ్రశాంతంబును నగు నాకృతినిగాంచి విస్మితుండయ్యెను. ఈభిక్షువున కవశ్యముసత్యమార్గము యొక్కజ్ఞాన మలవడియె యుండు నను దృఢవిశ్వాస మాబ్రాహ్మణుని హృదయమునం దొదవెను. అంత నతడు వినీతుడయి, భక్తిపురస్సరంబుగ బౌద్ధశ్రమణునకు నమస్కరించి, యిట్లడిగెను :— మహాత్మా! తమ రేమహానుభావుని శిష్యులరు? " అంత నశ్వజిత్తు బుద్ధదేవునిశుభాభిధేయము నుచ్చరించెను. ఉపతీష్యుడు

ర్ఘుం బుద్ధభగవానుని నూతనధర్మము యొక్క విశేషతత్వాంశ ముల గ్రహింప గొన్నిప్రశ్నల భిక్షువు నడిగెను. ఉపతీష్యుడు నూతనధర్మమును ఖండింప నుంకించియున్నటుల బౌద్ధభిక్షువు సంశయించెను. అందువలన నతడు సంకోచభావముతో నిట్లు త్తరమొసంగెను :—"ధర్మము యొక్క తత్వ మతి గంభీరమ యినది, నేనల్పప్రాయముగల మూర్ఖుడను. విజ్ఞులును, వయో వృద్ధులును నగు తమసమక్షంబున ధర్మతత్వము యొక్క వ్యా ఖ్యానమునుగాని, శాస్త్రార్థమునుగాని సలుపసమర్థుడనుగాను" ఉపతీష్యుడంత నీరీతి బ్రత్యుత్తర మొసంగెను :—"మహా శయా! తమ రేవిధమయిన సంకోచమునకును హృదయమున దావొసంగకుడు. తమరు నిజధర్మమునుగూర్చి సానుగ్రహ చిత్తులరయి, వక్కాణింపుడు. నేనద్దానిగూర్చి యాలకించి పరమానందభరితుడ నయ్యెదను." అంత నశ్వజిత్తు నూతన ధర్మము యొక్క శుద్ధ బుద్ధానందదాయకంబులగు నిర్వాణగీ తంబుల గానముసేయ నాలకించి, విమోహితాత్ముడయి యుపతీష్యుడు నూతనధర్మమున దీక్షితుడగుట కెంతయు నుద్విగ్నచిత్తుడయ్యెను. అంత నతడు క్షణమాత్రమయిన కాల విలంబనముసేయ నభిలాషలేనివాడయి, సత్వరమె కాలితు డను నామధేయముగల తనసుహృద్వరుని చెంతకరిగి దీర్ఘకా లము గతింప నిప్పటికి నిర్వాణము యొక్క సత్పథము విశద మయ్యెనని వ్యక్తపఱచెను. కాలితుడు యావద్వృత్తాంతము

నాలకించి బ్రహ్మానంద పరవశుడయి, దేవుని చెంతకు మిత్రస మేతంబుగ నరిగి, నూతనధర్మమున దీక్షను గైకొనియెను. దీక్షా నంతరము నుపతీష్యుడు సారీపుత్రుడను నామమును, కాలి తుడు మౌద్గల్యాయను డను నామధేయమును బడసిరి. ఈ మిత్రులిరువురును స్వీయాచల ధర్మనిష్ఠా ప్రభావంబున ననతికాలమునందే బౌద్ధసంఘమున బ్రధానులయిరి.

ఈఘటనము వాటిల్లిన కతిపయదివసములకు బిదప పూర్ణిమనాడొక్కరేయి బుద్ధదేవుని శిష్యులెల్లరు రాజగృహ మునకు సమీపమునందున్న పర్వతగుహయందు సమావేశ మయిరి. సమావేశమయిన సమస్తసాధువుల సమక్షమున దేవు డు నూతనధర్మతత్వముయొక్క వ్యాఖ్యానము సలుపుచు, తొలుదొల్త నిట్లు నుడివియుండెను :—

సర్వపాపస్స అకరణంకుసలస్స ఉపసం పదా
సచిత్తపరియోదపనం ఏతం బుద్ధాన సాసనమ్॥

సమస్తవిధముల బాపము నెడబాయుట, శుభకర్మాను ష్ఠానమునకుగడంగుట, చిత్తబుద్ధినిబడయుట. ఇదియే బుద్ధాను శాసనము

మగధదేశమునం దసంఖ్యాకులగు జనులు నూతనధర్మ దీక్షావలంబులగుచుండుట నుపలక్షించి వారల యభిభావకుల యం దపరిసన్నత గాఢముగ నలమికొనియెను. వారలు "శాక్య ముని జ్ఞానసంపన్నుడయి యుండియు సతీపతులయందు విచ్ఛే

దము నుద్భూతముజేసి, సృష్టియొక్క కార్యక్రమమును నశింప జేయుటెంతయు శోచనీయమనిరి.” వారు బౌద్ధభిక్షువుల నవలోకించి “మీ యాచార్యుడు మీలావణ్యమయంబగు తారుణ్యము యొక్క తారళ్యమును, సారళ్యమును రూపుమాపివేయుచున్నాడనియు, బుద్ధదేవుడు సమ్మోహనవిద్య నభ్యసించి యెల్లరచిత్తముల నిజోద్యోగ ధర్మములనుండి యాకర్షించి, నిజధర్మమతాభివృద్ధిని గావించు కొనుచున్నాడనియు, బుద్ధుడు గారడీవిద్యయందారి తేరినవాడనియు నున్మత్తులవలె బ్రేలుచు సన్న్యాసుల యానందానుభవమును భంగపఱుప నెంతయు గృషి సలిపిరి. ద్రోహులగువారల మాటల నెల్ల వినుచున్న బుద్ధదేవుడు వారలయవివేకమునకై విచారించి శిష్యుల నెల్లర సంబోధించి యిట్లు నుడివెను :—నాయనలారా! శాంతమునే నిత్యాభూషణముగా భావింపవలసిన మీరు వారలయర్థములేని వృథావచనముల నాలకించి, యభిమానపీరితులయి చింతింపకుడు. ప్రజలయొక్క యాయసంతోషము దీర్ఘకాలంబుదనుక సుస్థిరమయి యుండజాలదు. పరులునేయు యుపహాసములను, దూషణములను మీర లానందపూర్వకంబుగ నభినందనవాక్యములుగ స్వీకరింపుడి.— “బుద్ధుడు జనసముదాయమును సత్యమార్గము ననుసరింపజేయుటకు బ్రయత్నము సేయుచున్నాడు; సంయమంబును, ధర్మనిష్ఠయు, బరిత్రాణమును బడయు నుపాయప్రచారము సలుపుచున్నాడు”

ఒకదివసము సత్యధర్మానురాగియు, ధనాఢ్యుండును సుదత్తనామధేయుండును నగు పురుషుడు మహాపురుషుండగు బుద్ధదేవుని యశోవైశాల్యస్తుతి నాలకించి ప్రసన్నుడయి, యాదేవుని సందర్శింప రాజగృహమున కేతెంచెను. అధికైశ్వర్య సంపన్నుడును, ధర్మాత్ముండును నగు నావ్యక్తి కోసలరాజ్యమునకు రాజధానియగు శ్రావస్తీనగరముయొక్క నివాసియయియుండెను. అతడు దరిద్రులయొక్క మిత్రుడును, నిరాశ్రయులయొక్క యాశ్రయదాతయు నను ప్రఖ్యాతి నారాష్ట్రమునం దెల్లెడల బడసి యుండెను. అనాథుల కత డనారత మన్నదానము సేయుచుండు హేతువుచే నత డనాథపిండదుడను నామముచే బ్రసిద్ధిజెందెను. శ్రీబుద్ధభగవాను డాధర్మాత్ముండగు ధనికునిహృదయవైశాల్యమును, సాధుత్వమును శిష్యులవలన దెలిసి, యాదాతను మధుర ధర్మోపదేశంబున నమితానంద పరవశుని గావించెను. బుద్ధదేవుని హృదయాకర్షకంబగు నుపదేశము నాలకించు భాగ్యమును బడసి, యనాథపిండదుడు ముగ్ధహృదయుడయ్యెను. అంత నతడు నిశ్చలభావముతో నిట్లు వక్కాణించెను :— ప్రచురసంపద్విశేషంబున కధికారినగుటంజేసి, సర్వదా నాచిత్తమును జింత యాక్రమించుచున్నయది; అయినను గార్యము నాచరించి నే నానందమును బడయుచున్నాను. నేను నిత్యము నిరుద్యోగినయి యుండక యెద్దియో యొక్క కార్యమును సేయుచునే యుందును.

అసంఖ్యాకులగు మనుష్యులు నాయధీనమందుండి పనిసేయు చున్నారు; నావిజయముమీదనే వారలభాగ్య మాధారపడి యుండుచున్నది.

"దేవా! తమశిష్యులు గృహము నెడబాసిన సాధుపుల జీవితఫలమగు శాంతియొక్క ప్రశంసయు, సాంసారిక జీవిత పరిణామమగు నశాంతియొక్క నిందయు సేయుచుందురు. తమరు నానాప్రకారంబులగు సాంసారిక విపులైశ్వర్యముల బరిత్యజించి, భోగవిలాసముల నెడబాసి, ధర్మసామ్రాజ్య మును స్థిరముగ స్థాపించి, సంసారులకొఱకు నిర్వాణప్రాప్త్యు చితంబగు పథముయొక్క దృష్టాంతమును జూపియున్నా" రని వారెల్లపుడు వాకొనుచుందురు.

"ప్రభూ! శుభకర్మయందు నియుక్తుడనయి యుండి యు, నేను నిరంతరము లోకసేవకై వ్యాకులపడుచునే యుం దును. పరమకల్యాణ ప్రాప్త్యర్థము నేను ధనధాన్యాదులను, గృహారామక్షేత్రములను, వ్యవసాయ వాణిజ్యములను బహి ష్కరించి, యాసమయమునందుదాసీనుడనగుటయే శ్రేయో దాయకమయిన కార్యమా, కాదా?" అంత శ్రీబుద్ధభగవాను డీ ప్రత్యుత్తర మొసంగెను:—"ఆర్యమార్గావలంబకు డయిన వాడే స్థిరశాంతిని బడయగలడు. ఐశ్వర్యమునే శాశ్వతమైన పదార్థముగా భావించి, ధనోన్మాదమున గాలము వ్యతీతము సేయుచుండు వ్యక్తి శీఘ్రమే ధనధాన్యైశ్వర్యముల బహిష్క

రించి వేయుట యుక్తము. ధనధాన్యాదు లున్నను వానియం దాసక్తిని గల్గియుండక, సుప్రసన్నంబగు చిత్తముతో సాధన మును లోకోపకారమునకయి వెచ్చింప సమర్థుండగు వ్యక్తి సంపదల విడనాడవలసిన యావశ్యకతయే లేదు. సంపదల నంటిపట్టి యుండగోరువాడే వానిని సత్వరము బరిత్యజించి వేయవలయును.

"నాయనా! వినుము. నామాటవినుము. నీవు నీతిపరుడవయి, పూర్వపదవియందే ప్రతిష్ఠితుడవయి యుండి స్వశక్త్యనుసారముగ వాణిజ్య వ్యవసాయములను శ్రీ వృద్ధిని గావింప యత్నించుము. వ్యర్థముగ ననగా నిర్హేతుకముగా నాధర్మమెవ్వరిని గృహహీనుల జేయ సమ్మతింపదు. కేవలము నాధర్మము అహంకారమును, మాలిన్యమును, భోగవిలాసములను బరిత్యజింపజేసి, సన్మార్గము ననుసరించుటకే జనసముదాయమును సర్వదా యాహ్వానింపుచుండును.

"గృహారామ క్షేత్రముల మనఃపూర్వకంబుగ విడనాడి వచ్చిన భిక్షువయినను, పురుషార్థహీనుడయి, నిరుద్యోగియయి, మందుడయి, విలాసప్రియుడయియున్న నట్టివానికి సహితము కళ్యాణప్రాప్తి స్వప్నావస్థయందయిన గలుగనేరదు."

"గృహస్థులేమి, గృహత్యాగులేమి, మఱి యెవరయిననేమి, నిరంతరము పవిత్రతమంబగు ధర్మచింతన గల్గియుండి, ధర్మార్థమే నిమిత్తమాత్రంబులగు సకలకర్మల నాచరింపుచు,

సలిలమునందు వెలయు కమలదళములచందమున సంసారము నందుండియు ననాసక్తభావ పరతంత్రులయి విహరింపుచున్న వారే నిస్సందేహముగా పరమానందమును, పరమకళ్యాణము ను, సుస్థిరంబగు శాంతిని బడసి కృతార్థులగుదురు."

"శ్రీ బుద్ధభగవానుని నిత్యానందదాయకంబగు పవి త్రోపదేశము నాలకించి, అనాథపిండదు డతులనీయానందాతి రేకమున బులకితగాత్రుడయ్యెను. అత డత్యంతశ్రద్ధాళుడయి, వినయవిధేయత లొప్పారుచుండ నిట్లు నుడివెను:— నేను బౌద్ధభిక్షువులు నివసించుటకయి శ్రావస్తీనగరమునం దొక్క మహావిశాలతమంబగు విహారమందిరమును నిర్మింపజేసి యొస గెదను. ఈ నావిన్నపమును దేవా! తమరు సార్థకమొనరింతు రేని నన్ను నేను ధన్యునిగా భావించుకొనియెదను.

అనాథపిండదుని యుదారహృదయము సంపూర్ణము గా నుద్ఘాటితమయ్యెను. తన దివ్యదృష్టిప్రభావంబున పుణ్య శీలుండగు నాథనాథ్యుని సహజౌదార్యాధిక్యత నవలోకించి బుద్ధదేవుడు ప్రసన్నుడయ్యెను. ధనాఢ్యు డొసంగు సత్పాత్ర దానమును స్వీకరింపుచు, దేవు డిట్లు వక్కాణించెను:—"దాతలు ను, ఉదారపురుషులును సర్వజనప్రేమపాత్రులయి వెలయు చుందురు. అట్టివారి సాంగత్యమును, బంధుత్వమును మితిలేని విలువను గల్గియున్నవి. మరణానంతర మట్టివారు బాధింపబడరు. వారలకు మృత్యుదేవతయొక్క భయమే లేదని చెప్పవచ్చును.

దేహాంతమయిన పిమ్మట వారల జీవాత్మ బ్రహ్మానందమునకు, సుస్థిరశాంతిని బడయగల్గుచున్నయది. వారలు తామాచరించిన శుభకర్మ యొక్క సత్ఫలము నీలోకంబునను బరలోకమునను బడసి యానందింపుచున్నారు.

"క్షుధార్తుల కన్నదానము సేయుటవలన బలవృద్ధి కల్గును విషయంబును, వస్త్రవిహీనులకు వసనంబుల బ్రసాదించుటం జేసిం సౌందర్యవృద్ధియగునన్న విషయంబును, గృహహీనులగు దీనులకు నివాసార్థమయి, ధర్మశాలల నిర్మింపజేయుటకయి విత్తమును వినియోగించుటం జేసి, ధనవృద్ధి యగునన్న విషయమును జనులెవ్వరును వివేకశూన్యతచే విశ్వసింపకున్నారు."

"సుచతురుండగు యోధుడు యుద్ధకళయందు సమస్తవిధముల నసమాన నైపుణీవిలసితుం డగుచో, సమరక్షేత్రమున నసాధారణ ప్రజ్ఞతోడ సంగ్రామకార్యమును నిర్వహింపుచుండును. అటులనే సాధుశీలుండును, బుద్ధిమంతుడును నగుదాత సమయాసమయములయొక్కయు, పాత్రాపాత్రములయొక్కయు జ్ఞానమును గల్గియున్న నిజపుణ్య వ్రతానుష్ఠానము నెల్లవిధముల సురుచిరరూపంబున నిర్వహింప సమర్థుండగును. ప్రేమ దయార్ద్రచిత్తముతో శ్రద్ధాపూర్వకంబుగ దానమొనరించు వ్యక్తి యొక్క హృదయసీమనుండి, నిష్ఠురత్వము, హింస, ద్వేషము, క్రోధము మొదలగు దుర్గుణములు దూరమయిపోవును.

దానశీలురగు సాధుపురుషులయొక్క శుభకర్మయే వారి ముక్తికి సోపానమగును. వారు నాటినశుభకర్మస్వరూపంబగు వృక్షముయొక్క బీజము అంకురించి, పెరిగి, పెద్దదయి భవిష్యత్తునందది వారికి ఛాయను, పుష్పములను, ఫలములను బ్రసాదించును."

అనాథ పిండదుడు దేవునిచే దీక్షితుడయి, స్వస్థానంబయిన కోసల కేగునపుడు బౌద్ధవిహార మందిరమును నిర్మింపజేయ స్థానమును నిశ్చయింప దేవుని ప్రియశిష్యుండగు సారీపుత్రుని వెంటగొనిపోయెను.

శ్రీ బుద్ధభగవానుడు రాజగృహమునందున్నాడను సమాచారము దెలిసి, జనకుండగు శుద్ధోధన భూపాలుడొక్క చారునిద్వారా కుమారుని చెంత కీసమాచారమును బంపెను:— "కుమారా! నేనిపుడు వృద్ధుడనయిపోయినాడను. జరాభారము నన్నణచివేయుచున్నది. శీఘ్రకాలమునందే యస్తంగతుడ గానుంటి. ఏ దినమునందీగూటినుండి జీవవిహంగ మెగిరిపోవునో యెవ్వారికెఱుక? మరణమునకుబూర్వ మొక్కసారి కుమారుడవగు నిన్నవలోకింప నాచిత్త ముత్కంఠితమగుచున్నయది. నీ నవీన ధర్మోపదేశముల నసంఖ్యాకులగు జను లాలకించి, యుపకృతులగుచున్నారు; కాని నీవాయానందానుభవభాగ్యము నీ యీ వృద్ధజనకునకును, బంధుమిత్రాదులకును గలుగనీయవయితివి." దూతవలన నాపలు

కుల నాలకించి, జనకుని హృదయగతాభిప్రాయమును గ్రహించి, బుద్ధదేవుడు తత్క్షణమే జన్మస్థానమగు కపిలవస్తునగరి కరిగెను. అత డచటికరిగి నగరబాహ్యప్రదేశమునం దున్న యొక్క పుష్పోద్యానమునందు శిష్యసమేతముగా విడిసెను.

సంసారమును బరిత్యజించిన సప్తవర్షముల యనంతరము జనకుడు మరల బుత్రుని సంసార ధర్మస్వీకారము గావింప నిర్బంధించెను. కాని సర్వజ్ఞుండగు బుద్ధదేవు డా యనురోధముల స్వప్నమందయిన బాటించునా ? దేవుడు వినీతభావముతో జనకున కీరీతి బ్రత్యుత్తర మొసంగెను :—బాబా! మీ హృదయము స్నేహభావాధికత్యచే ద్రవీభూత మగుచున్నయది. మీరు నానిమిత్తము నిర్హేతుకముగ దుస్సహంబగు క్లేశము ననుభవింపుచున్నారు. మీరు నాయందే యపార స్నేహభావంబును గల్గియుండు కతన, నావియోగమునకయి ఖేదపడుచున్నారో, ఆస్నేహభావమునే జీవకోటియందు వితరణము గావించివేయుడి. ఇందువలన మీ సామాన్యుడగు సిద్ధార్థుడు దృష్టిదూరుడయి పోయినను మహాత్ముండగు సిద్ధార్థుడు సహజముగనే ప్రాప్తించును. వానివలననే నిర్వాణము యొక్క శాంతి మీ చిత్తమున బ్రవేశించి, మిమ్ముల నానందవారిధి నోలలాడించును."

పుత్రుని శ్రీముఖమునుండి బహిర్గతములయిన సుధారసమయవాక్కుల నాలకించినంతనే భూపాలుని నేత్రము

లానంద బాష్పపూరితము లయ్యెను. రోమములు గగుర్పా డిచెను. అంత నాభూపాలుడు గద్గద కంఠస్వరంబున నీచంద మున నుడివెను :— "కుమారా! నీవు సామ్రాజ్యమును దృణ ప్రాయముగ బరిత్యజించి, ప్రాపంచిక భోగవిలాసముల బహి ష్కరించి; మహానిష్క్రమణంబున బరమకళ్యాణప్రాప్తిని బడసినాడవు. నీ వనేక కష్టపరంపరల నానందపూర్వకంబుగ ననుభవించి ఋషిగణ దుర్లభంబగు నిర్వాణపథము నన్వేషించి, యంతమునకు దానిని బట్టినాడవు. ఇంక నీ వెల్లజీవులకు ముక్తి పథము యొక్క సదుపదేశముల నాలకించు భాగ్యమును బ్రసాదించుము."

శుద్ధోధన భూపాలు డీచందమున బుద్ధదేవునకు బోధించి నగరబాహ్యస్థానమున వెలయు పుష్పోద్యానమునుండి స్వనికే తనమునకు మరలివచ్చెను. బుద్ధదేవుడు జనకుని వెంట స్వగృహ మును వీక్షింప నేతెంచక, యచటనే భిక్షువులతోగూడి, ధర్మ ప్రసంగంబుల సలుపుచు నానందమును బడయుచుండెను.

ద్వితీయవాసరము బుద్ధదేవుడు ప్రాతఃకాల సమయ మగుటతోడనే భిక్షాటనమునకయి నగరము బ్రవేశించెను. కుమారుడు ద్వారదారమునకరిగి భిక్ష నెత్తుకొనుచున్నాడని యాలకించి, శుద్ధోధనుడు బుద్ధదేవు డున్నతావున కేతెంచి, యప్రసన్నవదనముతో బుత్రు నిట్లు ప్రశ్నించెను:— "నా యనా! నీవు రాకుమారుడవు యుండియు, మానాభి

మానసుల విడనాడి, యేల ద్వార ద్వారమున కరిగి, భిక్ష నెత్తుకొనుచున్నాడవు? కేవలము నుదరనిమిత్తమయి నీవింత క్లేశముల ననుభవింపుచు, భూపాలుడనగు నన్నేందు లకు లజ్జితుని గావింపుచున్నాడవు? నీకును, నీశిష్యబృందము నకును వలయు నాహారపానీయములకు మేము ప్రబంధము సేయజాలమనియా నీవు దరిద్రులకుదగు నీభిక్షుకవృత్తి కియ్యకొంటివి?" అంత దేవుడు జనకుని యజ్ఞానమునకును, యపార ప్రేమకును మందహాసముజేయుచు నీచందమున నుత్తరమొసంగెను:—"తండ్రీ! భిక్షాటనమే మమాదృశులగు సాధువులకు నిత్యవృత్తి; ఇదియే పరంపరాగతమయి వచ్చుచున్న నా పద్ధతి." శుద్ధోధనుడామాటల నాలకించి, విస్మయచిత్తుడయి యిట్లు పృచ్ఛించెను:— "ఏమంటివి? నిత్యవృత్తియనియా? అయ్యో నాయనా! యేమి యీనీ బేలతనము? నీవు రాజకులమునందు జననమందినాడవు. ఇంతపర్యంత మేవ్యక్తియయిన నభిమానధన సంపన్నంబగు నీకులమునందు జన్మించి, భిక్షాటనమునే జీవిక కర్హమగువృత్తిగా స్వీకరించినాడా!" దేవుడీప్రత్యుత్తరము నొసంగెను:—"భూపాలా! నీవు, నీజనకుడు, నీపితామహుడు రాజకులమునందే జన్మించియున్నారను విషయము సత్యేతరమయినది కాదు. నేనుమాత్రము రాజవంశమున జననమందియుండలేదు. బుద్ధులవంశమునందే నాదగు జన్మ కల్గినది. బుద్ధులు భిక్షవలననే స్వోదరపోషణము గావిం

చుకొందురను మాట నిక్కంబని నీవెఱుంగనిది కాదు" శుద్ధోధనుఁ డావాక్యముల నాలకించి నిస్తబ్ధుఁడయ్యెను. బుద్ధుఁ డిట్లు చెప్పనారంభించెను:—"నృపాలా! పుత్త్రుఁడనువాని కెద్దియేని నమూల్యంబగు రత్నము హస్తగతమగుచో నతఁ డద్దానిని భక్తిపూర్వకంబుగ జనకుని చరణకమలంబుల సమర్పింప నభిలషించును. నేనహోరాత్రము లనేకవత్సరములు ఘోరపరిశ్రమ జేసి, సాధనబలంబున బ్రాప్తింపజేసికొన్న ననన్యసామాన్యంబగు నుత్తమధనమును, వేయేల? ఆధనభండారమునే నాజనకులగు మీకు సమర్పించుకొనియెదను. మీ రాజ్ఞాపింతురేని, యే తత్క్షణమే ధనభండారగృహము యొక్క ద్వారమును దెఱచివేయుదును. పుత్త్రునియందు వాత్సల్యముగల మీరు శీఘ్రమే మత్సమర్పితవిత్తము నానందపూర్వకంబుగ స్వీకరించి నన్ను పితృఋణబంధవిముక్తుని గావించి, కృతకృత్యుని గావింప నంజలి ఘటియించి, ప్రార్థింపుచున్నాఁడ." బుద్ధదేవుఁడు నిజహృదయాంతస్థలంబున డాఁగియున్న సత్యధర్మము యొక్క వ్యాఖ్యానమును జనకుని సమక్షంబున స్పష్టముగ, సుమధురంబులగు శబ్దముల సాంగోపాంగముగ గావించెను. అంత నా నూతనధర్మమునందు శుద్ధోధనున కత్యంతాసక్తి యొదవెను. అంత నతఁడు ప్రసన్నవదనుఁడయి, బుద్ధదేవుని వెంటనిడుకొని, రాజభవనమున కేతెంచెను.

అట పురవాసులెల్లరు నేకత్రితమై బుద్ధదేవునకు శ్రద్ధా

భక్తుల సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించిరి. తత్సమ యంబున బుద్ధదేవుని సందర్శించుటకు నగరవాసులెల్లరు నాబా లగోపాలముగ రాజభవనమునకు విచ్చేసియుండిరి. కాని సిద్ధా ర్థుని సహధర్మిణియగు యశోధగాదేవిమాత్రము విచ్చేసి యుండలేదు. బుద్ధదేవుడాదేవివిషయమయి విచారింప నాదేవి భర్త తనచెంత కేతెంచనిదె, స్వయముగా దానుసహితము హృదయేశ్వరుని సందర్శింప విచ్చేయనని శపథము బట్టియున్న దని తెలియనయ్యెను. మిథ్యాభిమానశూన్యుండును, భూతద యార్ద్రచిత్తుండును నగుదేవుడు యశోధరానిష్కపటప్రేమను గుర్తెఱిగియున్నవాడు కాన, నాదేవి యవివేకముచే గావించిన ప్రతిజ్ఞ నాలకించి, మందహాసముజేసి తత్క్షణమే యాదేవి యం తఃపురమున కరిగెను. చిరవియోగానంతరము ప్రథమావలో కన సమయంబున యశోధరాదేవి హృదయభాండమునుండి పొంగి పొరలివచ్చు దుఃఖావేశమును నిరోధింపజాలకపో యెను. ఆమె తన పరమారాధ్యదేవుని పరమపవిత్ర పాదార విందముల వ్రాలి రోదనము సేయగడంగెను. శోకావేగ మొకిం చుక క్షీణించిన పిదప దేవి యధోమస్తకయయి యొక్క పార్శ్వ మున నొదిగి, కూర్చుండెను. స్వామియొక్క శ్రీముఖమునుండి వెలువడు ధర్మోపదేశ శుభవాక్యజాలముల నాకర్ణించినంతనే దేవిహృత్పాత్ర మానందరస పరిపూర్ణమయ్యెను. ఆమె సృష్టి యొక్క యశాశ్వతతత్వ మర్మమును, వ్యామోహము యొక్క

క్షణభంగురంబును, దుఃఖభయపూరితంబును న గు స్వరూపం బును వీక్షింపగల్గినదయి శోకమునెడబాసి, సుప్రసన్నవదనయయి శాంతచిత్తయయి, బుద్ధదేవ ప్రబోధిత నూతనధర్మమును స్వీకరించెను.

కపిలవస్తునగరమునం దనేకులు భక్తులు, భగవచ్చింత నాపరులు శ్రీబుద్ధోపదిష్టమగు నూతనధర్మమును గ్రహించిరి. ఇందు బుద్ధదేవుని సవతితల్లియగు గౌతమీదేవి యొక్క కుమారుడగు నందుడును, పితృవ్యకుమారుండగు దేవదత్తుడు ను, క్షౌరకర్తయగు నుపాలియును, దార్శనికుండగు ననిరుద్ధుడును మఱియు నుపస్థాయకుండగు నానందుడును బౌద్ధేతిహా సంబున విశేషప్రఖ్యాతిని బడయగల్గినారు

బుద్ధదేవునకు శిష్యకోటిలోనికెల్ల నానందుడే మనసు నచ్చిన ప్రియఛాత్రుడు. ఆనందుడే గురుదేవుని మనోభా వానుకూలంబుగ వర్తింప నధికసమర్థుడయి యుండెను. ఆనం దుడు సహజముగనే బుద్ధదేవుని హృదయగత భావంబులను నదుపదేశంబులను గ్రహింపగల్గు చందమున నాకాలమున బౌద్ధులయందు మఱియెవ్వరును లేకుండిరి. అతని చిత్తము శ్రద్ధావినయంబులకు నిలయము. అతడు బుద్ధదేవుని జీవనావ శేషపర్యంతము నిరంతరము ప్రతిబింబమువలె ననుకరింపుచు, దేవునిసేవాశుశ్రూషల భక్తిపురస్సరంబుగ సలిపి, ధన్యాత్ము డయ్యెను.

కపిలవస్తునగరమునందు బుద్ధదేవు డొక్కదినము రాజ ప్రాసాదమునకు సమీపమునందున్న ప్రదేశమున నాహారమును స్వీకరింప నాసీనుడయ్యెను. రాజభవనోపరిభాగ వాతాయనము నుండి యశోధరాదేవి యాదృశ్యమును వీక్షించి, సప్తవర్ష ముల ప్రాయముగల కుమారుని జేరబిలచి, రాజోచితవసనా భూషణంబుల వానిని సుసజ్జితుని గావించి, వానితో నిట్లు నుడివెను :—"కుమారా! రాహులూ! ఆ స్థానమున నాసీను డయి, యారగింపుచున్న సౌమ్యమూర్తియగు సాధుపురుషా గ్రేసరుడే నీప్రియజనకుడు. ఈమహాత్ముడు రత్నభండార చతుష్టయమును బడసియున్నాడు. నీవుసహిత మీ దివ్యపురు షుండగు నీజనకుని దివ్యసన్నిధికరిగి, పితార్జిత సంపద్విశే షముపై నధికారమును బడయుము."

మాతాజ్ఞాప్రాప్త్యనంతరంబు రాహులుడు జనకుని దండకరిగి, ధనము నీయవలసినదిగా బ్రార్థించెను. అంత బుద్ధ దేవు డిట్లుత్తరమొసంగెను:— "కుమారా! నాచెంత ప్రాపం చిక ధనధాన్యాధిసంపదలు లేవు. ధర్మరూపంబగు నుత్తమ విత్తమును నీవభిలషింపుచో శీఘ్రమే ప్రసాదింప సంసిద్ధుడను." రాహులుడు జనకు డొసంగనున్న ధర్మవిత్తమునే స్వీకరింప నుద్యుక్తుడయ్యెను. బాల్యకాలమునందే రాహులుడు రాజ్యముయొక్కయు, సంసారముయొక్కయు సమస్త భోగాను భవంబుల బరిత్యజించి, గృహహీనుడయి, పితానుగమనము

గావించెను. ప్రాణముకంటె ప్రియుడును, విశాలరాజ్యమున కుత్తరాధికారియునగు పౌత్రుడు—రాహులుడనువాడు బౌద్ధ ధర్మమున దీక్షితుడయినట్లు పౌరులవలన నాలకించి శుద్ధోధనుడు ఖిన్నుడయ్యెను. అంత శుద్ధోధనుడు బుద్ధదేవుని చెంతకేతెంచి, మనోవేదనమును వెల్లడించెను. వృద్ధుడగు శుద్ధోధనుడు క్రమక్రమముగా సిద్ధార్థుని, నందుని, సోదరపుత్రుండగు దేవదత్తుని, పౌత్రుని గోల్పోయి, స్నేహపాత్రులెల్లరు సన్న్యాసులుగా పోయెంగదాయని విలాపము సేయదొడంగెను. జనకుని పారములేనివ్యాకులతను, శోకతాపములను వీక్షించినంతనే బుద్ధదేవుని హృదయము ద్రవీభూతమయ్యెను. అంత నతడు జనకు నుద్దేశించి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను:— తండ్రీ! ఏతద్దివసమాదిగ నేను నాసంఘమునందు, అప్రాప్తవయస్కుల ననగా బాలకుల, వారి జననీజనకుల యొక్కగాని, సంరక్షకులయొక్కగాని, అభిభావకుల యొక్కగాని సమ్మతి లేనిదే చేర్చుకొనజాలను. నేడే నేనీవిషయమును నిశ్చయించినాడను. నాయనా! అపరిపక్వావస్థయందున్నవారు దీక్షితులు కాజాలరు.

కోశలవాసియగు ననాథపిండదునితో గలసి, బౌద్ధవిహారమందిర నిర్మాణమున కనువగు ప్రదేశమును నిశ్చయింప, సారీపుత్రుడు రాజగృహమునుండి కోసలరాజ్యమున కరిగియున్నటుల పైన వ్రాసియేయున్నాడను. అతడు శ్రావస్తీ

నగరమునకరిగి యానగరమునందు విహారమందిరమున కుప యుక్తమగు స్థానము నన్వేషింపగడంగెను. నానావిధములగు తరులతాసంతానములచే శోభాయమానమయి నేత్రపర్వముగ నొక్క తరంగిణీకూలమున వెలయు రమణీయోద్యానము నవలోకించి, ముగ్ధుడయ్యెను. కోశలదేశ పరిపాలకుని పుత్రుడగు జేతు డావనమున కధినాయకుడు. "సాధువులు నివసించుట కటనే బౌద్ధవిహారమందిరనిర్మాణమును గావించుట యుక్త" మని అనాథపిండదుడు స్వాంతమున సంకల్పించుకొనెను. అతడు యథేష్టమగు మూల్యమునొసంగి రాకుమారునివద్ద నావిశాలోద్యానమును స్వాధీనపఱచుకొనగోరెను. రాకుమారుడు ధనాఢ్యుడగు ననాథపిండదుని వాంఛను దిరస్కరించెను. కాని, యనాథపిండదుడు స్వీయసంకల్పమునుండి విముఖుడగుటకు నసమ్మతింపడయ్యెను. ఉద్యానమును స్వాధీనముగావించుకొన నతడు చీటికిమాటికి నాంతరికాగ్రహమును వెల్లడింపదొడంగెను. రాజకుమారుడగు జేతు డిదియే సమయముగదాయని ధనికుండగు ననాథపిండదుని విశేషమూల్య మడిగెను. నిప్పాలిఖితంబగు నాఖ్యానమునం దిట్లు వ్రాయబడియున్నది :—

"అనాథపిండదుడా! నీవు వాంఛించు పృథ్వియొక్క వైశాల్యమునంతయు సువర్ణముద్రికలతో బఱచివైచి యా ధనమునంతయు నాకొసంగిన నాదగు నుద్యానము నొసంగెదను." అని రాకుమారుడనియెను. రాకుమారుని యసంభ

వమగు నీకాంక్ష నాలకించియు, నంతమాత్రంబుననే మన ధని కుడు వెనుకంజవేయక సమ్మతించెను. అనాథపిండదు డాజ్ఞా పించినంతనే యసంఖ్యాకులగు భృత్యులు సువర్ణముద్రికలతో నిండియున్న పేటికల గొనివచ్చి, ఉద్యానభూమి నంతయు ముద్రికలతో నాచ్ఛాదితము గావింపదొడంగిరి. ప్రపితామ హుని యొక్కయు, పితామహుని యొక్కయు, జనకుని యొ క్కయు, తన యొక్కయు నార్జితంబగు సువర్ణమంతయు సమా ప్తమయిపోయెను. ఉద్యానమందలి యర్థభాగము సువర్ణము ద్రికాచ్ఛాదితమయి, దేదీప్యమానముగ బ్రకాశించుచు, దర్శ కుల నేత్రములకు మిరుమిట్లుగొలుపుచుండెను. ఈ సంవా దము నాలకించి, రాకుమారు డుద్యానవనమున కేతెంచి యాశ్చర్యజనకంబగు నాదృశ్యమును సందర్శించి, విస్మయచిత్తు డయ్యెను. అనాథపిండదుని యొక్క సీమారహితంబగు నాయా దార్యమును గాంచినంతనే, రాకుమారుని మస్తకము లజ్జా నతమయ్యెను. అతని హృదయమునందు నూతనంబగు నొక్క శుభబుద్ధి సంచలనము కలిగెను. అత డానందపరవశుడయి యనాథపిండదునిగాంచి, యిట్లు నుడివెను:— మహాశయా! ఈ యుద్యానము మీ స్వాధీనము గావింపబడినది. మీవంటి నిశ్వరీయధనముతో నాకు నిమిత్తము లేదు. పరమార్థ ప్రియు లగు మీవిత్త మాసర్వేశ్వరునిదే యనియు, మీకాంక్షయ స్వలాభశూన్యమయిన దనియు నిప్పటికి గ్రహింపశక్తుండనయి

త్రిని. ఉద్యానము నింక నిస్సందేహముగా మీరు స్వీకరింప వచ్చును. ఈయుద్యానమునకు జతుర్దిశల వ్యాప్తమయియున్న నామ్రవృక్షములును, చందనవృక్షములును నా స్వాధీనము నందే యుండవలయును. శ్రీబుద్ధభగవాను డిచేటికి విజయము చేసినపుడు నేను వీని నన్నింటి నామహాత్మునికర్పించుకొని రెదను.

అనాథపిండదు డపారమగు ధనమును వినియోగించి, విశాలతమంబగు బౌద్ధవిహార మందిరమును నిర్మింపజేసెను. రాకుమారు డాపరిదేశము నుచితముగా నొసంగెను. అత డధికవిత్తమును వెచ్చించి, యావిహార మందిరమునకు జతుర్దిశల నత్యున్నతంబులగు చతుస్స్తంభముల గట్టించెను. బౌద్ధ సంఘమున కీమనోహరంబగు విహారమందిరమును సమర్పింప బుద్ధదేవు నాహ్వానించెను. శ్రీబుద్ధదేవుడు రాజగృహము నుండి శ్రావస్తీనగరమునకు గాలినడకనే విచ్చేసెను. శ్రావస్తీ నగరము యొక్క సమస్తబాలకులును, వృద్ధులును స్త్రీపురు షాదులును సమారోహములతోడ బుద్ధదేవున కెదురేగి, య భ్యర్థనా పూర్వకంబుగ నాదేవుని విహారమందిరమునకు గొని వచ్చిరి. మహోత్తుంగధ్వజములతోడను, పతాకములతోడను, తోరణమాలికలతోడను శృంగారింపబడిన విహారమందిరమున దేవు డానందచిత్తుడయి ప్రవేశించెను. అనాథపిండదుడు సంసా రమందుండు సకలసన్యాసుల క్షేమ మర్థించి, యా విశాలతమ

మందిరమును బుద్ధదేవుని చరణకమలముల సమర్పించుకొని యెను. బుద్ధదేవు డాదానమును స్వీకరించి సుధాసిక్తమగు కంఠస్వరమున నీచందమున వచించెను :—"కుమారా! పరోప కారపారీణా! నీయొక్క సమస్తామంగళములు దూరమగు గాత! ఈమహాదానము ధర్మరాజ్య ప్రతిష్ఠాపనమునం దనన్య సామాన్య మగు సాహాయ్యమునొనర్చుగాత! సర్వోత్తమంబగు దానమునందలి ప్రభావము దాతలకే యచిరకాలమునందు తెలియగలదు."

## అంతిమజీవితము.

జరాభారాక్రమణంబున మహాపురుషుడగు బుద్ధదేవుని శరీరము పూర్వపటుత్వమును, వికాసమును బాసి శిథిలమయి పోయెను. అత డింతపర్యంతము భారతవర్షమున వివిధరాష్ట్ర ముల ననగా వంగ, కళింగ, మగధ, ఉత్కళ, కోశల, వార ణాసీ రాజ్యములయం దధికముగా బౌద్ధధర్మ ప్రచారము గావించెను. ఆకాలమున భారతమున నార్యులనియు, ననా ర్యులనియు శ్రేణీద్వయమున వెలయుచున్న జనులెల్లరు భేద భావమును బాసి, నూతనధర్మమున దీక్షితులయి, సోదరభావ రసము వెల్లివిరియ, విశ్వసోదరప్రేమ భావబీజముల సమస్త మానవ హృదయక్షేత్రములనాటి, యనుదివసము దోహద మొనరించి యుండిరి. ఒకానొక సమయమున శరదృతు

పునందు బుద్ధదేవుడు గృధ్రకూటపర్వతముమీద నివాసము సేయుచున్నాడను వార్తనాలకించి, బింబసారభూపాలుని పుత్రుడగు నజాతశత్రువు పర్వతప్రాంతమునకు సచివసమేతుడయి వచ్చి మంత్రితో నిట్లనియెను:—"మంత్రిశేఖరా! వర్షాకారా! మనము మనజన్మశత్రువు లగు వృజ్జివంశీయుల ఘోరసంగ్రామంబున హతమార్ప సంకల్పించియే యున్నారము. మహాపురుషుడగు బుద్ధదేవు డీపర్వతోపరిభాగంబున వాసము సేయుచున్నాడు. నీవు సత్వరమామహానీయుని చెంతకరిగి, నావందనముల నాదేవునికి సమర్పింపుచు, కుశలప్రశ్నలడిగి, నాయభిప్రాయము నాదేవునికెఱింగింపుము. ఆదేవుడు మనయభిప్రాయమున కేమిప్రత్యుత్తర మొసంగునో, నీవు శీఘ్రము నాచెంతకేతెంచి తెలియజేయుము. మహాపురుషుల వాక్యము లెప్పుడును వృథాకానేరవు" వర్షాకారు డంత బుద్ధదేవుని పవిత్రసన్నిధి కేగి, పాదాంబుజముల కెఱగి, యజాతశత్రుని వక్తవ్యమును వినిపించెను. బుద్ధదేవుడు ప్రియశిష్యుండగు నానందుని సంబోధించి, యిట్లు నుడివెను:—"కుమారా! ఆనందా! వృజ్జివంశజులు యెల్లపుడు సాధారణ సభయందు సమావేశమగుచున్నటుల నీవాలకించి యుండలేదా?"

ఆనందుడు:—"మహాప్రభూ! వినకేమి, వినియేయుంటిని." బుద్ధదేవుడు తిరిగియిట్లు వచియించెను:—"ఆనందా! ఈ

ప్రకారముగా వృజ్జివంశీయులు, ప్రసన్నచిత్తులయి, ఐక్యబంధనమును స్వీకరించి సాధారణ సభయందు సమావేశమగుచున్నంత పర్యంతము వారల పతనమగుట యసంభవము, ఉత్థానమే సంభవమగుచుండును. వారు వృద్ధుల భక్తితో జూచుచున్నంతదనుక, స్త్రీప్రపంచము నాదరింపుచున్నంత పర్యంతము, శ్రద్ధాభక్తుల ధర్మానుష్ఠానము సలుపుచున్నంత వఱకు, సాధుజనుల సేవాశుశ్రూషల సేయుచున్నంత వఱకు, వారు క్షీణదశకు రాజాలరు; అనుదిన మభ్యుదయపర్వతశిఖరమునే యధిష్ఠింపుచుందురు." దేవు డనంతరము సచివశేఖరునితో నిట్లు నుడివెను. "బాబూ! నేను వైశాలీనగరమునందున్నపుడు వృజ్జివంశీయులకీ సాంఘిక నిబంధనలగూర్చి ప్రబోధించియుంటిని. వార లెంత కాలంబుదనక యాశుభనియమంబుల విస్మరింపక, యాదరింపుచు, శుభమార్గము ననుసరింతురో, అంతపర్యంతము వారు నిరంతర వికాసము నవశ్యము బడయుదురు.

దేవుని యావచనముల నాలకించి, సచివశేఖరుడు సెలవుగైకొని, యచ్చోటుబాసి చనియెను. మంత్రి యాస్థానమును వీడిచనినంతనే రాజగృహమునుండి భిక్షువుల నేకులు దేవుని సన్నిధికేతెంచిరి. బుద్ధదేవు డంత వారల సంబోధించి యిట్లు వాకొనియెను:— శ్రమణులారా! నేడు సంఘముయొక్క శ్రేయోదాయకంబులగు నిబంధనల గుఱించి మీకుబోధింప నభిలషించుచున్నాడ. మీరు నావచనములవైపునకు విశేషమగు ధ్యా

నమొసంగుదురనియే విశ్వసించుచున్నాడను:—మీరందఱు నేకాభిప్రాయులయి, యుపస్థానశాలయం దుండునంతవఱకు, పరస్పరసహానుభూతిని గల్గియుండునంతవఱకు, ఎల్ల రేకీభవించి, ధర్మోన్నతికయి యుద్యోగము సేయుచున్నంత దనుక, సర్వులునైక్యభావముతో నభ్యుత్థానమునకయి కృషిసలుపుచున్నంతపర్యంతము సంఘముయొక్క సమస్తకార్యకలాపముల సక్రమముగ నిర్వహింపుచున్నంతవఱకు, మీయొక్క యవనతి వాటిల్లనేరదు; బాగుగా విచారించి, శుభకార్యపాలనము నుండి విముఖులు కానంతపర్యంతము, పరీక్షింపనిదే, పరిశోధింపకయే నూతనవిధానముననవలబించి ప్రయోజనమును బడయకున్నంతవఱకు, విద్వాంసుల శ్రద్ధాభక్తులతో సేవాశుశ్రూషలజేయుచు వినీతభావముతో వారి యాదేశముల నాదరించి తదనుకూలంబుగ వర్తింపుచున్నంత పర్యంతమును మీపతనము కానేరదు; ఎంతపర్యంతము మీరు కామలాలసలనుండి దూరులయి యుందురో, ఎంత దనుక మీరుధర్మానుష్ఠానమునందే యానందమును బడయుచుందురో, ఎంతకాలము మీచెంతకు సాధుజనాగమనము సాగుచుండునో, ఎంతపర్యంతము మీరు మాంద్యమును, నిరుద్యోగమును విడనాడి, చిత్తమును నిరంతరము సత్యాన్వేషణమున లగ్నమొనరించి యుందురో, అంతవఱకు మీరు పతనోన్ముఖులు కాజాలరు. కాన నోసాధువులారా! మీమానసముల విశ్వాసము, వినయము నను

భూషణములచే శృంగారించుకొనుడు. పాపాచరణము నుండి భయము జెందుచుండుడి; జ్ఞాన ప్రాప్త్యర్థము మనముల జాగ్రదావస్థ యందుంచుడి. మీయుత్సాహ మనమ్యమయి, మీచిత్తములపవిత్త్రములయి యుండుగాత! మీకు సమాధిసౌఖ్యము ప్రాప్తించుగాత!"

గృధ్రకూటమును బాసి, బుద్ధదేవు డనేకస్థానముల సంచారము జేసి, యంతమునకు గొన్ని దివసంబుల పర్యంతము నాలందమునం దుండిరి. అటనుండి పాటలీపుత్రము (పాట్నా) నకు విచ్చేసెను. శిష్యానురోధంబున దేవు డట విశ్రామభవనమున గతిపయ దివసముల పర్యంతము విడిసెను. శ్రీబుద్ధోపదేశముల నాలకింప నచటి యుపాసకు (అర్చకు) లెల్లరు నేకత్రితమయిరి. వారల నందఱి నుద్దేశించి, బుద్ధదేవు డిట్లు మృదుమధురంబు లగు వచనంబుల నుపదేశించెను:— నాయనలారా! ధర్మమార్గమునుండి భ్రష్టులయి, అశుభకర్మల నాచరించు వారి కయిదువిధంబులగు పరాభవములు సంభవించుచున్నవి. వాస్తవ మఱయు, దుష్కార్యమాచరించువారిని సంసారము విశ్వాసపాత్రులుగ భావింపదు. శక్తిరాహిత్యము వారల నాక్రమించుటం జేసి, దుర్భరమగు దారిద్ర్యము వారల జతుర్దిశలనుండి ముట్టడించి బాధించును. ప్రత్యక్షంబగు ప్రథమనష్ట మిద్దియ. ద్వితీయము— అట్టివారి దుర్యశము దూరదేశములపర్యంతమువ్యాపించును. తృతీయము— సంఘము.

చం దట్టివారికి స్థానములేకుండ నశించును. సమాజ మెట్టిదను
నను, అట్టివారిని చోరులనియు, నింద్యులనియు, ధూర్తులనియు
నిరంతరము దూరుచుండును; అట్టివాండ్రు జనసముదాయము
నుండి ముఖముదప్పించుకొని తిరుగవలసియుండును. చతు
ర్థము—మరణకాలమునందుసహిత మట్టివారికి జీవితకాలము
నందు దామాచరించిన దుష్కార్యములు మూర్తీభవించి స్మృతి
పథమున భీభత్సముగ దాండవమాడుచుండ, చిత్తశాంతి
లభ్యమగుటయే దుర్ఘటమైపోవును. అజ్ఞాతభయవిశేషంబు
నను, ప్రచండోద్వేగంబునను వారి మృత్యులీల పరిసమాప్త
మగును. పంచమము—మరణానంతరమునసహిత మట్టివారిచిత్త
ములు శాంతిశ్రీ నారాధించుభాగ్యము నే బడయజాలవు. పాప
సంజనితఖేదము, వేదన, యు రెండును మిళితములయి భయంకర
రూపధారిణియగు మ్రొక్కడిరక్కసియాకృతిని దాల్చి చిత్త
మును ఛేదించి, రక్తమును గుటగుట దాగ్రివుచు పీడింపుచుం
డును.

ఓగృహస్థులారా! ధర్మమార్గానువర్తనులగువారి కయి
దువిధములగు విజయములు సంప్రాప్తగుచున్నయవి. ప్రథ
మము— ప్రజావిశ్వాసమును బడసి,సత్కర్మలచే బుద్ధినిబాగ్రిప్తిం
పం జేసికొనసమర్థులగుచున్నారు. ద్వితీయము-- వారి సత్కీర్తి
కౌముది దూరదేశముల సహితము వ్యాప్తమగుచున్నయది.
తృతీయము-- సంఘము సన్మానపురస్సరంబుగ వారికున్నతస్థాన

ము నొసంగుచున్నయది; సువ్యవస్థితులయియుండుకతన వారు సుప్రసన్నులయి, నిస్సంకోచభావముతోడ, సమస్తగురుజనుల సమక్షమునుండియే సభాసమాజముల సమావేశమగుచుందురు. చతుర్థము—మరణకాలమునం దట్టివారి కేవిధమయిన క్లేశమును, ఉద్వేగమును వాటిల్లజాలవు. పంచమము—మరణానంతరము వార లనన్యసామాన్యమగు చిరప్రశాంతిని బడయుచున్నారు, గతమెద్దియన వారు తమజీవితకాలమునందు సలిపిన శుభకార్యముల యొక్క సత్పరిణామమును దలపోయుచు బ్రహ్మానందానుభవమును బడయుచుందురు. ఇట్టివారి నెల్లవేళల, నిఖిలలోకముల నిర్వికారములగు సుఖశాంతులు వెంటనంటి, ప్రతిబింబమునుబోలి యుండుచుండును.

అనంతరము శ్రీబుద్ధదేవుడు పాటలీపుత్రమునుండి కోటియను గ్రామమున కరిగెను. మార్గమునం దతఁ డొక్క విశ్రామస్థానంబున మార్గాయాసమును నివృత్తి జేసికొని, యటనుండి వైశాలీనగరమున కేగెను. ఇచట దేవుఁ డామ్రపాలి యను వారాంగనయొక్క రమణీయోద్యానమున శిష్యబృంద సమేతముగా బసజేసెను. ద్వితీయవాసరము వేశ్యాంగనయగు నామ్రపాలి బుద్ధదేవుని దివ్యసన్నిధి కేగి, భక్తిపూర్వకంబుగ నాత్మీయగృహమునకు విందునకయి విచ్చేయ బ్రార్థించెను. సాధారణ స్త్రీపురుషులదృష్టియం దామ్రపాలి పతితవలె బ్రతీత మగుచున్నను, సమస్తజను లా స్త్రీని హేయదృష్టితో

వీక్షింపుచున్నను, మహాపురుషుడగు బుద్ధదేవుడావనితకు జన సముదాయమునందున్న పరిస్థితులను, గౌరవాగౌరవముల గూర్చియు, విచారింపకయే యామె విన్నపము నాలకించి, ప్రేమ పురస్సరంబుగ నిమంత్రణమును స్వీకరించెను. ఆదేవుని సహజోదారమగు హృదయమునం దేహ్యభావ ముదయింపనేలేదు. అనాథులకు శిక్షనొసంగుటయే దీక్షగాఁగొన్న నా మహాత్మునకు నిమ్నోన్నతభావములతో నిమిత్తమేమియున్నది? లిచ్ఛవివంశీయులగు భూపాలురు శ్రీబుద్ధాగమన శుభసమాచారము నాకర్ణించి బ్రహ్మానంద పరవశులయి, మహాట్టహాసముతో నాదేవుని యెదురేగి, సన్మానించిరి. వారు దేవుని రాజభవనమునకు విచ్చేసి తామొసంగు నాహారమును స్వీకరింపవలసినదిగా బ్రార్థించిరి. బుద్ధదేవుఁడంతకు బూర్వమే భక్తురాలగు నామ్రపాలియొక్క నిమంత్రణమును స్వీకరించి యుంటిననియు, బ్రస్తుతము మీనిమంత్రణమును స్వీకరింపజాలననియు విశదీకరించెను. అధికులగు తమ నిమంత్రణమును ద్రోసి పుచ్చి, భ్రష్టయగు నొక్క వేశ్యాగృహమునకు జనుటకు శ్రీబుద్ధదేవు డుద్యుక్తుడయినాడని లిచ్ఛవీయులెంతయువిషాదాయత్త చిత్తులయిరి. ఈసంవాదము నాలకించిన క్షత్రియులెల్లరు సప్రసన్నులయిరి.

ద్వితీయవాసరము బుద్ధదేవుడు యథాసమయమునకు గణికాగృహమునకేగి విందారగించెను. దేవుని శ్రీముఖోద్గత

దివ్యవాణి నాలకించినంతనే వేశ్యయొక్క యాత్మ జగృతినం దెను. బోధిప్రాప్తమయ్యెను. తదాదిగ నామ్రపాలియొక్క మనోగతికల్యాణమయ నూతనపథమువైపునకు బ్రధావింప నారంభించెను. ఆమె నిజోద్యాన భవనమును సాధువుల విశ్రామస్థలమునకయి సమర్పించి, తన్ను గృతకృత్యగ భావించుకొని యానందించెను. శ్రీబుద్ధదేవుని ప్రాయ మిప్పు డెనుబదివత్సరములు నిండినది. శరీరము శిథిలమయి పూర్వలావణ్యమును, దార్ఢ్యమును బూర్ణముగ గోల్పొయెను. మరణాసన్నమగు చిహ్నము లాదేవుని కాయమునందు బ్రత్యక్షముగ గానవగుచుండెను. దేవుని ప్రవీణులగు శిష్యులెందరో యాసమయంబుననే మరణముయొక్క సంధిస్థానమును సమీపించిరి. ఆవత్సరమే దేవుని ప్రధానశిష్యుండగు సారీపుత్రుడును, మౌద్గల్యాయనుడును గోలోకవాసులగుచిరి. వీరిరువురు తనువు లెడబాయుటంజేసి, సంఘమెంతయు దుర్బలస్థితిని బడసెను. అంత బౌద్ధసంఘముయొక్క బలాఢ్యులును, జ్ఞానానుభవసంపన్నులును నగు ప్రాచీన నవీన సభ్యులెల్లరు నూతనోత్సాహముతో సాధనముద్వారా సంఘమును గొప్ప యభివృద్ధికి గొనిరా యత్నించిరి. శ్రీబుద్ధు డావత్సరమందే భయంకరంబగు సాంఘాతిక వ్యాధిచే బీడితుడయ్యెను. ఆమహాపురుషుడు, జగదేకచక్రవర్తి, మానవస్వరూపంబున బోధసలుప భువికవతరించిన సచ్చిదానందమూర్తి, విశ్వకుటుంబజనకుడు

శయ్యాగతుడయి యుండియు, వసన్యలభ్యంబగు మానసికబల పటుత్వంబున నాభయంకరవ్యాధి వలన గలుగు బాధను నిస్తబ్ధుడయి, యనుభవించుట యం దలౌకికంబగు సహనశీలతను గల్గియుండెను. ఈసమయమునం దాదేవుడు వైశాలీనగరము నం దొక్క బౌద్ధవిహారమందిరమున విశ్రమించియుండెను. ఆనం దలాభప్రాప్తికలిగినయనంతర మొక్క దివసము ప్రియశిష్యు డగు నానందుడిట్లు దేవుని ప్రశ్నించెను:—ప్రభూత్తమా! భయంకరమగు వ్యాధిచే దమశరీరము యొక్క యపూర్వ కాంతి యంతయు రూపుమాసిపోయినది. తమ్ము బీడించిన యామహా భయంకరమగు వ్యాధి స్మృతికివచ్చినంత నే యిపుడు సహితము నా కెల్లదిశల ఘోరాంధకారపటలము దృష్టిగోచరమగుచున్న యది. కాని సంఘమును సమస్తవిధముల సంరక్షించుట కుచిత మగు నుపాయమును వ్యక్తీకరింపకుండ నిజమానవలీలను బరిసమాప్తము గావింప రనుదృఢవిశ్వాసము నాచిత్తమునందు మాత్రము బాగుగా నెలకొనియున్నది.” అంత బుద్ధదేవుడు ప్రత్యుత్తరమిట్లు లొసంగెను:— “బాబూ! ఆనందా! నీకు సంఘమునందును, ధర్మమునందును, బుద్ధునియందును గడు ప్రేమయున్నటుల నీప్రత్యేక వచనంబువలన విశద మగుచున్న యది. సంఘమున కింక నాపైనాశయున్నదా? నేను నిష్కపటభావముతో సమస్తజనులసమ్ముఖంబున నవీనోపలబ్ధ సత్యస్వరూపమును సాక్షాత్కరింప జేసియుంటిని. ప్రపంచమునకు జాటని

మర్మమెద్దియు నాహృదయమున డాగియుండలేదు. నే నేయవ స్థయందును నేనే సంఘము యొక్క పరిపాలకుండననియు, అధి నాయకుండననియు విస్మరించియయిన దలంచియుండలేద. ఇట్టిభావమును గల్గియున్న బుద్ధుడెవడయిన నున్నచో సంఘ మున కధినాయకుడయి, బాధ్యతల శిరమున వహించి, సంఘమును దృఢరూపంబున వెలయించుటకు నిబంధనప్రణా ళిక నేర్పఱచుటయు నాకు సమ్మతమే. సంఘము యొక్క సం రక్షణము గావించునిమిత్తము నేను విధ్యుక్తంబగు నేనిబంధ నము నేర్పఱచిపోవుటకు సమ్మతింపను."

"ఆనందా! నే నెనుబదివత్సరముల వృద్ధుడను. మామ కంబగు దీర్ఘయాత్రాసమయ మాసన్నమయినది. ఇపుడు నాదగు శరీరము భగ్నంబగు స్యందనమును బోలియున్నది. కడు జాగరూకుండనయి, అసావధానతయను పదమునయిన స్మరింపక, చెల్లాచెదరుకానున్న యెముకల నేర్చి, కూర్చి యెటులో సమాప్తమగుటకు సిద్ధముగనున్న జీవితయాత్రను సాగింపుచున్నాడను. నాచిత్తము బాహ్యవిషయంబులనుండి విశ్రాంతినంది, ప్రగాఢమగు ధ్యానమునందు లగ్నమయిన వుడే నాశరీర మీషణ్మాత్రకాలపర్యంతము, స్వస్థతను జెంది యుండును."

"నాయనా! ఆనందా! మీరు మీరే యాశ్రయమ నొసంగ సమర్థులు. స్వావలంబనమును విస్మరింపకుడు. మీరు

మీరే యాధారభూతులు. పరుల సాహాయ్యము నిట్టి యా భ్యంతరిక కార్యములయం దపేక్షింపకుడు. మిమ్ము బ్రకా శింపజేసికొనుటకు మీరే ప్రదీపకులగుడి. ధర్మ మే హెచ్చు తగ్గులులేక నిరంతరము జాజ్వల్యమానముగ వెలుంగుదీపము. ఆదీపమును జలింపనట్టి హస్తముతో బట్టుకొనుడి. సత్యమునే యాధారముగాగొని ముక్తిమార్గము నన్వేషింపుడి."

"బిడ్డా! స్వయంప్రకాశులగుటయు, స్వారంబులగు టయు మానవులకు శక్యముకాదని భావింపకుము. సంఘము యొక్క సాధువులెల్లరు ధర్మసాధనముద్వారా తమ హృద యస్థమగు శక్తిని గ్రహించినిగూఢమగు నివాసమును సేయనా రంభింపుచో, దైహికక్లేశ మును, ప్రవృత్తి యొక్క తాడనము ను, తృష్ణోత్పన్నములగు దుఃఖజాలములను మఱచి, మహనీయుం డగఁరు." "కుమారా! నేను మరణించినంతమాత్రింబుననే దృఢవిశ్వాసబలంబునను జ్ఞానవిశేషంబునను స్థాపింపబడి, చల నములేని దశయందు వెలయు సంఘము పతనోన్ముఖంబగునన్న గాని, మహానిష్టమును బడయునన్నగాని, నేను విశ్వసింపను. ఇట నీభావ మాత్మోత్సర్గమును సలిపినవారికి దగినది కాదు. కేవ లము భ్రమాన్వితమె. బోధిప్రాప్తికయి చిత్తమున గౌతూహల మును గల్గియున్నవారును, బాహ్యావలంబనాభిలాష నెడబాసి అవిచలాధ్యానసాయంబున, నిర్వాణప్రాప్తికయి, నిరంతరకృషి

సేయువారును, భావాతీతంబగు శ్రేయమును బడయుదురన్న విషయము సత్యేతరమయినది కాదు. "

బుద్ధదేవుని నిర్వాణశుభసమయ మాసన్నమయినది. మృత్యుదేవత సమితానందచిత్తముతో గౌగిలింప నాదేవుడు సంసిద్ధుడయి, సమస్త ప్రయత్నముల గావించియుండెను. ప్రసంగవశంబున నొక్క దివసము బుద్ధదేవుడు ప్రియశిష్యుండగు నానందునితో నిట్లు నుడివెను:—"నాయనా! నానిర్వాణము యొక్క పుణ్యముహూర్తము సమీపించినది." గురుదేవుని శ్రీముఖంబునుండి వెలువడిన వచనము నాలకించినంతనే యానందుని కోమలహృదయము శోకభారంబున విదీర్ణమయ్యెను. అప్రయత్నముగనే సర్వోత్తమభక్తుండగు నానందుని నేత్రయుగ్మమునుండి బాష్పకణములు ముత్యములకరణి భువిపై రాలదొడంగెను. శోకాకులుండగు ప్రియశిష్యునవలోకించి, బుద్ధదేవుడు గంభీరమగు స్వరంబున నిట్లు వాకొనియెను:— "బిడ్డా! ఆనందా! నీవాత్మవిశ్వాస శూన్యుడవయి పోయితివా? నీతో నేనెన్ని యోమారులు సంసారమునకు బ్రియవస్తువియోగ మవశ్యము వాటిల్లుచుండునని చెప్పియుండ లేదా? జన్మించినవా డెప్పుడో యొకప్పుడు మరణించునని యెఱుంగవా? సంయోగవియోగముల స్వభావమును గ్రహింపజాలకపోయితివా? ఉత్పత్తి, స్థితి, లయము-యీమూడును సంసారము యొక్క సహజగుణములు. సహజమునకయి వాపోవుటెంత

యు భరిమాణావృతము. ఇట్టి స్థితియందు నే నజరామరుడనయి శాశ్వతముగ నీమర్త్యలోకమునం దెట్లుండగలను? "

అనంతరము శ్రీబుద్ధాదేశానుసారంబుగ నానందుడు వైశాలీనగరమునకు సమీపమునందున్న భిక్షువుల నెల్ల బౌద్ధవిహారమందిరమున సమావేశపఱచెను. సమావేశమయిన శ్రీమణులనెల్ల సంబోధించి యిట్లు బోధించెను:—" ఓ నాప్రియము యిన భిక్షువులారా! నేను మీ కుపదేశించిన సత్యధర్మమును స్వీకరించి, యీ ధర్మశకటమున నారూఢులయి, సత్యము యొక్క సాధనమనకముల గావింపుడి. ఈసద్ధర్మమును సుస్థిరముగావింప సర్వత్ర ప్రచారము సలుపుడి. సమగ్రమానవజాతికి సుఖమును, కల్యాణమును బ్రసాదించు నీధర్మము ననంత కాలపర్యంతము శాశ్వతముగా నుంచు పవిత్రోద్దేశ్యముతో జీవకోటియెడ నప్రమేయంబగు ప్రేమను, దాక్షిణ్యమును గల్గియుండి, బౌద్ధధర్మప్రచారము గావింపుడి."

"గ్రహములను శుభాశుభములయొక్క కారణమని గుర్తె ఱుంగుడి. ఫలితమునందును, జ్యోతిషమునందును విశ్వాసము గల్గియుండుట, హస్తరేఖాదుల నవలోకించి భవిష్యద్విషయములను, శుభాశుభఫలములను జెప్పుట కేవలము బూటకము లనియే తెలియుడి. గణితము విశ్వసింపదగినదె. మానవుని కివన్నియు నిషిద్ధకార్యములు."

"చిత్తప్రవృత్తుల నిరోధింప సంయమమని యెడి కళ్ళెము నొక్కి సారిసడల జేయువారు స్వప్నమందయిన నిర్వాణమును బడ యజాలరు. మీరు మీ చిత్తముల వశమునం దుంచుకొనుడి. భోగవిలాసోద్రేకముల నుండి చిత్తముల సంరక్షించుకొనుడి. నిరంతరము జిత్తముల శాంతిని, స్థిరత్వమును నెలకొల్ప నవిరళ ప్రియత్నము సేయుడి."

"మీ రాహారపానీయముల యెడ మితమును గల్గియుండుడి. దేహము యొక్క యవసరముల నెల్ల సంపూర్ణమగు సంయమమును గల్గి తీర్చుకొనుచుండుడి. భ్రమరగణములు పుష్పముల యొక్క సుగంధమునకును, సహజ రామణీయకమునకును పుష్పములచుట్టునున్న మృదులములగు పత్రములకును కించిన్మాత్రమయిన హానికలుగకుండ, నా పుష్పములనుండి వలయు ప్రయోజనము నెట్లు పడయుచున్నవో, అది యే చందమున మీరు సహిత మెవ్వరికిని బాధకలుగకుండ సాత్వికజీవితముల నిర్వహింపుడి. మీ జీవితయాత్రలు పరుల సౌఖ్యానందముల కవాంతరముల గలుగ జేయునవయి యుండకుండుగాత! పరపీడనా సంజనిత సౌఖ్యాభిలాష పాపమునకు మూలహేతువగును."

"ఓభిక్షువులారా! మన మింతపర్యంతము నార్యసత్య చతుష్టయమును గ్రహింపకుండుట చేత హృదయపూర్వకంబుగ సాధనము సలుపలేకపోయితిమి. ఇందువలననే జన్మజన్మాంతరముల నసత్యమార్గానుసరణమం దే దవిలియుండు చున్నారము."

"నేను మీకు ప్రేమపూర్వకంబుగ నొసంగిన ధ్యానము యొక్కయు సాధనము యొక్కయు, శిక్షను బాగుగా నభ్యసింపుడి. సాధనంబుననే యాశిక్ష యొక్క పరిభావమును మీరు గుర్తెఱుంగ సమర్థులగుదురు. పాపమునకు విరుద్ధముగా యుద్ధ మొనరింప నిరంతరము సంసిద్ధులరయి యుండుడి. ధర్మమార్గమున జరించి శీలవంతులగుడి. మీహృదయముల జ్ఞానదీపము యొక్క జ్యోతిని బ్రసరింపజేయుడి. జ్ఞానము యొక్క ప్రభావంబున మీహృదయములు ప్రకాశవంతము లయినంతనే యష్టాంగ మార్గముల నవలంబించి, నిర్వాణమును బడయుడి."

"నానిర్యాణము యొక్క దివసము సమీపించినది. సంయోగముచే నుత్పన్నములగు పదార్థములన్నియు నశించునవియే యని నేను దృఢచిత్తముతో వచింపుచున్నాడను. నేడుగాక పోయినను రేపయినను జన్మతో సంబంధమును గల్గియున్న మృత్యువు తటస్థించుటయే నిక్కువంబని తెలియుడి. నశించని పదార్థమునకయి యన్వేషింపుడి. అధ్యవసాయముద్వారా నిర్వాణపదవిని బడయుడి."

ఆసన్నమృత్యువు యొక్క శాంతియు, గాంభీర్యమును శ్రీబుద్ధభగవానుని యొక్క చిత్తము నాచ్ఛాదితము గావించెను. ఆశుభముహూర్తమునందే యాదేవుఁడావిష్కృతధర్మము యొక్క సంక్షిప్తచరిత్రమును సమస్తజనుల సమ్ముఖంబున వర్ణించెను. ఇందువలననే వైశాలీనగరంబున నుపస్థానశాలయందు

దేవు డుపదేశించిన బోధలయం దపారమగువిశేష మంతర్భూత
మయినది. దుర్భాగ్యవశంబున నీమహత్తరోపదేశముయొక్క
కేవల మొక్కయంశమే లభ్యమయినది. ఆయంశమయిన మహా
పరి నిర్వాణసూత్రమునందు వర్ణితమయి యున్నది. ఈయుపదే
శమునందు దేవుడు సాధకులనిమిత్తము చతుర్విధములగు
ధ్యానముల గూర్చియు, చతుర్విధములగు ధర్మప్రయత్నము
లగుఱించియు, చతుర్విధములగు బుద్ధిపాదముల గూర్చియు,
పంచవిధములగు నైతికబలంబుల గూర్చియు, బోధియొక్క
సప్తాంగముల గుఱించియు, సప్తవిధమార్గముల గూర్చియు నిర్దే
శించి యున్నాడు. అనంతరము శ్రీబుద్ధదేవుడు శిష్యులతో గూడి
వైశాలీనగరమునుండి కుశీనగరమునకరిగెను. అతడు మార్గమధ్య
మున భండాగ్రామము, ఆమ్రగ్రామము, జంబూగ్రామము, భోగ
నగరము మొదలగు స్థానముల విశ్రమించెను. మహాప్రయాణము
నకుబూర్వ మాదేవు డాత్మీయోదారధర్మమతమును శిష్యుల
హృదయసీమల దృఢరూపంబున నంకితముగావింప ననేకవిధముల
బ్రయత్నించెను. విచారింపకుండగను నాజ్ఞానానుభవసంపన్నుల
సమ్మతిని స్వీకరింపకుండగను దనమతమునే యెల్లరు స్వీకరింపవల
యుననెడి యభిలాష దేవునికిలేదు శంకరాచార్యునిబుద్ధి బుద్ధుని
యందు లేదు. బుద్ధదేవునకు బరమతసహనము మెండు. అతడుతన
జీవితకాలమునందు నిర్బంధమతస్వీకృతి కియ్యకొనలేదు. మతపత
నోన్ముఖములకును, నైతికబలశోషణములకును నిర్బంధమత

స్వీకారమే మూలమని యాదేవుని యుద్దేశ్యము. * బుద్ధదేవుడు స్వానుభవంబున "క్షమ" కంటె మహోత్కృష్టమగు సంపద యిహపరముల లేదని సిద్ధాంతీకరించెను.

తనమహాపరినిర్వాణానంతర మనేకు లా దేవుని పేరిటనే యనేక ధర్మముల నెలకొల్పి నూతనంబగు సత్యధర్మమును గలపితి మొనరించి వేయుదు రనియెడి భయంబున బుద్ధదేవుడు జీవితాంతమున శిష్యులకు బోధించి యిట్లు నుడివెను:—"శిష్యులారా! జాగ్రత! జాగ్రత! యను పదము జీవనాభ్యుదయమున కెన్ని యోరీతుల నుపయోగించును. ఎవండయిన నొక్క ధర్మవాక్యమును బోధించి యిది నాదికాదనియు నేను బుద్ధుడు జీవించి యుండగనే యతని శ్రీముఖంబునుండి వెలువడుచుండగా నాలకించియుంటిననియు, ఈవాక్యమే సత్యమయినదనియు, ఇదియే విధ్యుక్తమయినదనియు, ఇదియే బౌద్ధమతము యొక్క సర్వోత్తమవాక్యంబనియు నొక్కివక్కాణించిన, మీరావాక్యమును దూషణభూషణంబులగాని నిందాస్తుతులగాని బాధింపకుడు. ఆచెప్పుబోధకుని కథనము యొక్క ప్రత్యేక వాక్యమును, ప్రత్యేక శబ్దమును మనోయోగపూర్వకంబుగ నాలకింపుడు. అనంతర మతని ముఖ్యోద్దేశసారాంశము నామూలాగ్రముగ

---

* ఏసు భగవానుని సహనశీలతావాదమును, సోక్రాతుమహాశయుని క్షమావాదమును గాంధిభగవానుని శాంతివాదమును బుద్ధదేవుని యపూర్వమగు సహనమునుండి వచ్చినవియే.

గుర్తెఱుంగ యత్నింపుడు. ధర్మము యొక్కయు, వినయము యొక్కయు నిబంధనములతో నాయుపదేశకుని వాక్యముల సమ్మిళితము గావింప యత్నించుడు. ఆబోధకుని యుపదేశవాక్యములు సంఘము యొక్కయు ధర్మము యొక్కయు నియమములతో సరిపోల్చిచూచిన భిన్నముగానున్న మీారు వెంటనే యా యుపదేశవాక్యములు నావి కావని గ్రహింపుడి; ఆబోధకుడు నాయుపదేశముల యొక్క వాస్తవికం బగు ధర్మతత్వమును గుర్తెఱింగి యుండలేదనియే తెలియుడి.'' బుద్ధుడు నుఱింత స్పష్టముగా నీ వాక్యముల శిష్యుల కెల్లరకు బోధించెను:—

"ఓ భిక్షువులార! మఱి యెవండయిన బోధకుడు కొన్ని ధర్మవాక్యముల బోధించి, వీనిని బుద్ధుని ప్రియశిష్యులద్వారా వింటిననిగాని బౌద్ధవిహార మందిరముల నుపన్యసించు బౌద్ధ విద్వాంసుల శ్రీముఖంబుల నాలకించియుంటి ననిగాని వచించినచో, మీారావాక్యములను, శబ్దములను మనఃపూర్వకంబుగ దూరదృష్టిని గలిగియుండి విని, విచారించి, యావాక్యములను, పదములను నాయుపదేశములతోడను, వినయ సౌశీల్యములతోడను, ప్రధానమగు బౌద్ధనీతితోడను బోల్చి చూడుడి. అనుకూలంబుగనున్న బౌద్ధులవేయనియు లేనిచో నాయుపదేశకుడు నావాక్యముల యొక్కగాని నాప్రియశిష్యుల బోధల యొక్కగాని గుప్తస్వరూపమును గ్రహింపలేదనియే గ్రహింపుడి." బుద్ధదేవుడు శిష్యసమేతముగా సంచారము

సేయుచు పావాగ్రామమందలి చుందడను నామధేయంబు గల యొక్కలోహకారుని లోహవస్తునిర్మాణశాలను జేరెను. ఈశుభసమాచారము నాలకించినంతనే చుందడు మహాభక్తి శ్రద్ధలతో దేవుని పాదారవిందముల సాష్టాంగ దండప్రణామం బాచరించెను. అతడు మహాపురుషుని పాదపద్మ రజోలేశమును దీసికొని శిరంబున ధరించెను. శ్రీబుద్ధదేవుని శ్రీముఖమునుండి వెలువడిన శుభవాక్యముల నాలకించి, బ్రహ్మానంద పరవశుడయి యా భక్తుడు దేవుని శిష్యసమేతముగ స్వగృహమున నాహారము స్వీకరింపవలసినదిగా బ్రార్థింపనందులకు దేవుడు సమ్మతించెను. మరునాడు దేవుడు శిష్యసమేతముగా నాచుందని గృహమునకు విందారగింప నరిగెను. మూఢభక్తిచేత చుందడు దేవుని వృద్ధాప్యము వైపునకు ధ్యానమొసంగక పౌష్టికాహారము నొసంగెను. భక్తజనప్రియుడగు బుద్ధు డాయాహారము నానందపూర్వకముగ నారగించెను శిష్యులెల్లరు ప్రాయమునందు బిన్నలగుటంజేసియు దృఢశరీరు లగుటంజేసియు నాపౌష్టికపదార్థమును జీర్ణింప జేసికొన గల్గిరి. కాని వృద్ధుడగు దేవుని కా కఠినపదార్థము జీర్ణముకాక, యన్నమయకోశమును నిర్జీవము గావించెను. బుద్ధదేవు డనభ్యస్తపదార్థ స్వీకారమే యజీర్ణమునకు మూలహేతువని గ్రహించెను. అస్వస్థతావస్థయందు బుద్ధదేవుడు కుశీనగరమునకు బయనమయ్యెను. అత డత్యంత ప్రస

న్నచిత్తుడయి యాయజీర్ణరోగమువలన గలుగు భయంకర యాతనల ననుభవించెను. కుశీనగరమును జేరుటకుబూర్వము బుద్ధదేవుడు మార్గమధ్యమునందొక్క వృక్షచ్ఛాయయం దాసీనుడయి ప్రియశిష్యుండగు నానందునితో నిట్లు నుడివెను:— "నాయనా! ఆనందా! నేను మిక్కిలి డస్సియున్నాడను. నేనింక ముందంజ వేయజాలను. నా యీ దుప్పటిని సమతలంబగు ప్రదేశమున బఱచుము. నే నించుకసేపు విశ్రమించెదను. ఆనందు డట్లుగావించెను. బుద్ధదేవు డాసెజ్జపై బవ్వళించి యానందుని శీతలజలంబుల గొనిరా ననుజ్ఞ నిచ్చెను. శిష్యుడు గొనివచ్చిన మధురజలమును బానముసేసి విశ్రమించెను. ఈసమయమునందే పుక్కసు డను నామాంతరముగల యొక్క యువకు డామార్గముననే పోవుచుండెను. అతడు ఆడారకాలాము తపస్వియొక్క శిష్యుడు. వృక్షతలమునందు విశ్రమించియున్న బుద్ధదేవుని ముఖమండల తేజోవిలసనమును గాంచి, యాసాధు వత్యంత విస్మయుం డయ్యెను. అంత నాయువకుడు దేవునిచెంత కరిగి, చరణకమలముల కెఱగి యిట్లు నుడివెను:—"ప్రభూ! గృహత్యాగులగు సాధువుల యొక్క ధ్యానప్రభావ మపూర్వము. వార లతివిచిత్రంబగు మానసిక శాంతిమయ సుఖోపభోగమును గల్గియుందురు." అతడు తిరిగి ఆత్మీయాచార్యుండగు నాడారకాలాముని యొక్క ధ్యానశక్తి మాహాత్మ్యమును దెలుప నీరీతి వచిం

చెను:—"ఒక్క దివసము మాగురుదేవుడు ధ్యానమగ్నుడయి యుండ, వేయిబండ్లు కటకటధ్వనుల నుప్పతిలజేయుచు పార్శ్వమునుండియే యరిగెను. ధూళిపటలము వాయువేగముతో మిళితమయి, గురుదేవుని శరీరమునంతయు గప్పివైచెను. కాని ధ్యానస్థుండగు మాగురుదేవునకు దనసమీపమునందు జరుగు విషయము తెల్లమగుటకాని ధ్యానము భంగమగుటగాని తటస్థింపలేదు."

పుక్కుసుని వచనముల నాలకించి, పరమోల్లసితుడయి బుద్ధదేవు డిట్లు వచించెను:— "బిడ్డా! ధ్యానముయొక్క శక్తి మహాద్భుతమయినది. ధ్యానముయొక్క ప్రభావమువలన మానవుడు చిత్తముయొక్క సంపూర్ణాభ్యంతరిక రూపముచే, సచేతనుడయి యుండియు బాహ్యజ్ఞాన శూన్యుడయి, వర్తింపుచుండును. బాహ్యమగు పదార్థమెద్దియు గోచరించుటగాని, బాహ్యమగు ధ్వనిమెద్దియు గర్ణపుటముల బడుటగాని వాటిల్లుట దుస్తరము. నే నొక్కతూరి ధ్యానమునందు నిమగ్నుడనయియుంటిని; అపుడు కుంభవృష్టి వర్షింపుచుండెను. మేఘములు గర్జింపుచుండెను. సౌదామిని దేదీప్యమానముగ మెఱయుచుండెను. వేయేల? ప్రచండమగు నావృష్టి యెట్టిదన నాడు దుర్యోగముచే సమీపగ్రామ మందలి రెండువృషభములును, మఱియిద్దఱు కృషీవలురును మరణించిరి. ధ్యానమునందు తదేకచిత్తుడనై, సమస్తేంద్రియముల నాపవృత్తియందే ప్రవేశింపజేసి

యుండుకతన నాకు బయట సంఘటింపుచున్న దెద్దియు గోచరింప దయ్యెను. ఏతద్దేవు చేత నే నాకు సమీపమునందే తటస్థించిన దుర్ఘటన మెంతమాత్రము తెలియదయ్యెను. అనంతరము ధ్యానమునుండి విముక్తుడనయి యొక్క స్థానమునం దనేకజనులు సమావేశమైయుండి, కోలాహలము సేయుచుండుటగాంచి, నేనొక్క మనుష్యు నదేమియని ప్రశ్నింప, నాత డాశ్చర్యాన్వితుడగుచు నిట్లు నన్ను బ్రశ్నించెను:—"వహ్వా! మీరింతకుబూర్వ మిచట లేరా? ఇటనే కూర్చుండియుంటిరికదా! భయంకరవర్షపాతంబున వజ్రము పడుటచే రెండువృషభములును, ఇద్దఱు మనుష్యులును తనువుల బాసిరి." అంత నేనావిషయ మెద్దియు గ్రహింపజాలకపోయితిననియు, ప్రగాఢమగు ధ్యానమందు లీనుడనయి యుంటిననియు విశదీకరించితిని. ఆకృషీవలుడు ధ్యానప్రభావ మిట్టిదా యని యాశ్చర్యము జెందుచు వెడలిపోయెను. బుద్ధదేవుని యాయనన్యసామాన్యమగు ధ్యానశక్తినిగూర్చి విని పుక్కసు డాదేవుని యద్భుతచరిత్రకు బరమానందభరితుడయి, శిష్యత్వమున కియ్యకొనియెను. పుక్కసుని హస్తసంకేతము నవలోకించినంతనే యొక్క మనుష్యుడు రెండు పీతాంబరముల గొనివచ్చి పుక్కసుని కొసంగెను. పుక్కసు డా పరిశుద్ధములగు పీతాంబరములగొని, బుద్ధదేవుని పాదారవిందముల నవనతమస్తకుడయి, వాని నర్పించి, వానిని స్వీకరించి, తన్ను ధన్యాత్ముని గావింపవలసి

నదిగా బ్రార్థించెను. "బుద్ధదేవుడంత ప్రత్యుత్తర మీరీతినొసం గెను:—"కుమారా! నీవొసంగు వస్త్రములయం దొక్కటి నాశరీరముపై గప్పి, మరొండు ప్రియశిష్యుడగు నానందునకు గప్పుము" పుక్కసు డట్లే యాచరించెను. బుద్ధదేవు డంత మృదుః స్వరంబున బుక్కసునకు ధర్మము యొక్క నిగూఢ తత్వసారాంశము నాద్యోపాంతముగ నుపదేశించెను.

అనంతరము శ్రీ బుద్ధదేవుడు భిక్షువులతో గూడి ముం దునకు బయనమయ్యెను. వారందరు శీఘ్రకాలముసందే కుకు త్థమను నామముఃగల తరంగిణీతీరమును సమీపించిరి. అచట వారెల్లరు స్నానసంధ్యాదుల నాచరించి, అల్పాహారమును స్వీకరించినవారయి, ప్రయాణప్రయాసమునుండి విముక్తుల రయి, యొకింత కాలము విశ్రమించిరి. ఒకానొక యామ్ర వృక్షతలంబున శయనించి యానందుని బిలిచి దేవు డిట్లు వచిం చెను:—"బాబూ! ఆనందా! నిర్యాణసమయ మేతెంచినది. నేనుసహితము దీర్ఘకాలమునుండి యీ శుభముహూర్తమున కయి నిరీక్షణము సేయుచు నేయుంటిని. ఆమభీష్టమును సఫ లంబగు సమయంబాసన్నమగు టెంతయు సంతోషదాయకము. నామృత్యువుచే శోకాభిభూతులయి జనులెల్లరు చుందనిభోజన స్వీకృతిచేతనే బుద్ధుని ప్రాణవియోగము తటస్థించినదని భ్రమింతురు. ఇట్లు భావింతురేని, మహాభక్తుండగు చుందని హృదయమునకు దీరనిశోకము వాటిల్లును. నామరణానంతరము

స్వయముగా నీవొక్కసారి ప్రియభక్తుండగు చుందని గృహమునకరిగి, తథాగతుడు నీ నికేతనమునందే యంతిమభోజ్జనమును స్వీకరించి నశ్వరంబగు జర్జరకాయమును విసర్జించి, సచ్చిదానందనిలయంబగు నిర్వాణమును బడసెనని చెప్పుము. బుద్ధుడు మరణకాలమునందు ప్రియశిష్యుండవగు నీకొసంగిన హితోపదేశవాక్యరత్న మిద్దియే యని చెప్పుము. పరుల నిందను లెక్కసేయవలదనియు బోధింపుము. నీయాహారమే బుద్ధునకు మహత్కల్యాణదాయకంబును అతులితానంద సంధాయకంబును నయ్యెనని నాతుదివాక్యముగా దెలియబల్కుము. నాజీవితకాలమునందు రెండు భోజనములే మహోత్కృష్ట ఫలప్రదంబులును, తుల్యామోదకరంబులును నయ్యెనని విశదముసేయుము. ఉదరంభరత్వమునకయి ప్రార్థించిన తక్కుంగల షడ్రసోపేతాన్నములకంటె నే వచించిన రెండే శ్రేష్ఠతమంబయిన వని వచింపుము. ప్రథమాహారము సుజాతదనియు నందుచే బ్రహ్మానందానుభవమార్గము తెల్లమగుడు జీవన్ముక్తి కలిగెననియు, ద్వితీయాహారము నీయదే యనియు నిద్దానిచే నిర్వాణమే లభ్యమయ్యెననియు, నాప్రియశిష్యుండగు చుందనకు నావచనంబులుగా స్పష్టీకరింపుము."

ఆమ్రవృక్షచ్ఛాయయం దొకించుకసేపు విశ్రమించి, బుద్ధదేవు డానందునితో నిట్లువచించెను:—"నాయనా! ఆనందా! నడువుమింక కుశీనగరమున కేగుదము. అంతదూరము జనుట

కష్టసాధ్యమగుచో నానగరమునకు సమీపమునందున్న శాల వనము నకరుగుదము.” యథాసమయమునకు బయనమయి, దేవు డాత్మీయ శిష్యబృందసమేతముగా, మల్లజాతీయు లధివసించు శాలవనము బ్రవేశించెను. దేవుననుజ్ఞను బడసి, శిష్యులు నవ పల్లవంబులతో వృక్షములఛాయయం దొక్కశయ్యను సిద్ధ పఱచిరి. అంతట నాసెజ్జపై బుద్ధదేవు డుత్తరముఖంబుగా శయ నించెను. అత డత్యంత గంభీరమగు స్వరంబున నానందునితో నిట్లునుడివెను :—“నేటిరాత్రి తుదిఘడియయందు నానిర్వాణ ము కలుగుట నిశ్చవము. కుశీనగరమునందున్న మల్లులకెల్ల రకు నీవిషయము నెఱింగింపుము. ఈసమయమునందే సుభద్రుడ నునామముగల పరివ్రాజకుడు కుశీనగరమునందు వాసముసేయు చుండెను. అతడు, బుద్ధదేవుడు సమీపస్థంబగు శాలవనమున కేతెంచి యున్నాడనియు నద్దేవుని నిర్వాణముయొక్క శుభ ముహూర్తము సన్నిహితమయి యున్నదనియు. నాలకించి, ధర్మవిషయంబున దన మదియందున్న సందేహంబుల గొన్ని నివారణముజేసికొన నెంచి, శాలవనమున కేతెంచెను. సుభ ద్రు డెన్నిరోవిధముల బుద్ధదేవుని సన్నిధికరుగ యత్నిం చెను. ఆనందు డతని నిరోధించి యిట్లువచించెను :— మహా త్మా! ఈసమయమునందు బుద్ధదేవుడు మిక్కిలి డస్సియున్న వాడు; తమరిట్టి స్థితియందు భక్తజనమనోరంజనుండగు నాదే వుని హింసించుట యుక్తముకాదు.” సుభద్రాగమనవార్త

యు నతని యభిలాషయు, నానందుడు వలదని నివారించు టయు బుద్ధదేవుడు గ్రహించి, యానందునితో నిట్లనియె ను:—భిక్షా! ఆనందా! సుభద్రుని నాచెంతకురానిమ్ము. అత నికి నాతోడ సంభాషింపవలయు ననియెడి యెంతటి యభిలా షయున్నదో యెవరికెఱుక? ఆనందు డంత సుభద్రుని దేవుని చెంతకుగొనివచ్చెను. సుభద్రుడు దేవునికయ్యకు సమీపమునం దే యాసీనుడయి, దేవునిసత్యధర్మమతమునకు విరుద్ధములగు ననేకప్రశ్నలవేసి నిజహృదయగత సందేహముల వెల్లడింప గడంగెను. బుద్ధదేవు డంత నిట్లుత్తరమొసంగెను:—"నాయనా! సుభద్రా! నీప్రశ్నలయొక్క మీమాంసను సలుపదగిన సమ యము గతించినది. నేను నీకు గేవలము సత్యబోధ నుపదే శింపు చున్నాడను. నీవు శ్రద్ధతో నాలకింపుము:—"సమ్య గ్దృష్టిని, సమ్యక్సంకల్పమును, సమ్యగ్వాణిని, సమ్యక్కర్మాం తమును, సమ్యగాజీవమును, సమ్యగ్వ్యాయామమును సమ్య క్స్మృతిని, సమ్యక్సమాధిని గల్గియుండని ధర్మము నుపాసిం చువారియందు మందునకొక్క శ్రమణుండయిన లభించుట దుస్తరము. ఈయష్టాంగధర్మమార్గముయొక్క పథికులే నిర్వాణమును బడయుట కర్హులు. సుభద్రా! నే నిరువది తొమ్మిదియ వత్సరప్రాయమునందు గృహత్యాగినయి, పరమ పదము నన్వేషింప, బ్రవృత్తుడనయి యుంటిని; పరివ్రాజకుని రూపంబున నే నేబదియొకటవ వత్సరప్రాయంబు దనుక ధర్మ

క్షేత్రమునందు భ్రమణమును సలిపియుంటిని. ఉపర్యుక్తము లగు నార్యధర్మాష్టాంగమార్గముదక్క వేరొండు సాధనము నిర్వాణప్రాప్తి కుపయోగించునది నేనెఱుంగ జాలను." సుభద్రుడంత విస్మితుడయి యిట్లు నుడివెను :— ప్రభూ ! మహాశాంతముతోడను, ప్రేమతోడను దమ రుపదేశించిన సద్ధర్మమునం దెంతయుమహిమాతిశయ మంతర్భూతమయియున్నది. దూరదృష్టి నరయువారికే యది గోచరించును. నేడు మహాప్రభువులగు భవత్కృపావిశేషంబుననే సత్యధర్మము మహావిచిత్రముగా నాసమ్ముఖంబున బ్రకాశించినది. మార్గమును మఱచిన నాకు దివ్యమగు పథము నేడు దృగ్గోచరమయినది; గుప్తమగునది ప్రత్యక్షమయినది; సందేహము సంతసముగా బరివర్తనమయినది. ఇదంతయు భవదీయంబగు నిర్వ్యాజ కరుణాభూత్వమేయని నేను గ్రహింపకపోలేదు. భవదుపదేశిత దివ్యజ్ఞానప్రకాశంబున మద్హృదయవ్యాప్తాజ్ఞానాంధకారతమఃపటల మదృశ్యమయిపోయినది. దేవా! తమరు జీవితకాలమునందే యీ దాసు నాత్మీయశిష్యకోటియందు జేర్చికొని, మదభీష్టమును బూర్ణ మొనరింపుడి." బుద్ధాదేశానుసారంబుగ సుభద్రునకు సంఘమునందు సమ్మిళితుండగుట కధికారము ప్రాప్తమయ్యెను.

అనంతరము శ్రీ బుద్ధభగవానుడు ప్రియశిష్యుండగు నానందుని సంబోధించి యిట్లు నుడివెను :— "నావత్సా !

ఆనందా ! నేను మరణించినంతనే సమస్తబౌద్ధులును భిక్షువు లను నిజాభిప్రాయానుకూలంబుగా నడుపుశక్తి నశియించి పోవునుగదాయని డెందమునం దావంతయు జింతనందబోకు ము. నేను మీకు ప్రేమపూర్వకంబుగ నొసంగిన సత్యధర్మ ము యొక్క శిక్షయు, సంఘము యొక్క నియమావళియు నిన్ను సమస్తబౌద్ధులను సర్వదా సత్పథమునన్నే నడుపగలదు.

నేటివఱకు సంఘమునం దెల్లభ్రాతలు పరస్పరవాత్స ల్యంబుననే వర్తింపుచున్నారు. పరస్పర హృదయక్షేత్రముల ప్రేమభావబీజములు బాగుగా నాటబడియున్నవి. కాని నేటి నుండి సంఘమునజేరు యల్పవయస్కులగు నూతనభిక్షువులు ప్రథమమునుండియు సంఘమునందు జేరియున్న భిక్షువుల "భన్తే లేక ఆయస్మా" అనగా గురుశ్రేయా లేక ఆర్యాయని సంబోధించునట్లు సేయుము. అధికప్రాయముగల భిక్షువు లల్పప్రాయముగల నూతనభిక్షువుల, బిలువవలసివచ్చినపుడు 'ఆబుసో' ప్రియభ్రాతాయని చెప్పవలయును. అనంతరము భిక్షుసంఘమును, బుద్ధదేవుడిట్లు మృదులంబును, వందంబును నగు స్వరంబున బ్రశ్నించెను :—"ఓనాప్రియమయిన భిక్షువు లారా ! నాచే మీకు నుపదేశింపబడిన ధర్మమునం దెవ్వరి కయిన నెట్టిసందేహమయిన యున్నచో నిశ్శంకితమతులయి ప్రశ్నింపుడి." బుద్ధదేవుడీ ప్రశ్న నే మూడుసార్లు నొక్కి శిష్యు లనడిగెను, కాని ప్రత్యుత్తరము రాలేదు. ప్రశ్నించువారు

లేకుండుటఁజూచి, యానందుడు దేవునితో నిట్లనుడివెను :— ''మహాప్రభూ! తమ రుపదేశించిన మహాసత్యధర్మమునం దేయంశమునను భిక్షువులయం దెవ్వరికిని నీషణ్మాత్రమయిన సందేహము లేదు. మున్మాత్రటికి సంశయము లేదు బుద్ధదేవుని ముఖమండలము నొక్క దివ్యతమంబగు తేజస్సు ఆవహించెను. అంత నాదేవు డీవాక్యముల నుడివెను :— "నాయనలారా! సంసారమునందు సంయోగముచే నావిర్భవించు సకల పదార్థతతు లవశ్యము నశించునవియేయని గ్రహింపుడి. మీర లెల్లరు నిశ్చలాధ్యవసాయము నవలంబించి, సచ్చిదానందకందమగు నిర్వాణపదవిని బడయుఁడి. బుద్ధుని మఱువవలదు. సంఘమును స్మరించుట బాయజనదు. ధర్మమును విస్మరింపరాదు.

"బుద్ధం శరణం గచ్ఛామి,
ధర్మం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి"

మహాపురుషుండగు బుద్ధదేవుని యంతిమవాక్యము లివియె. ఉపర్యుక్తవాక్యముల నుచ్ఛరించి, యాదేవుడు గంభీరంబగు నగాధధ్యానమునందు నిమగ్నుఁడయ్యెను. ఆదేవుని యా మహాధ్యానము తిరిగి భంగము కాలేదు. అతడు ధ్యానప్రభావంబున నానందలోకమునకు బ్రస్థాన మొనరించెను.

"నమోబుద్ధాయ. నమోధర్మాయ"
"నమస్సంఘాయ నమోనమః॥"

# శ్రీ బుద్ధగీత.

"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి."

యమకవగ్గో

మనో పుబ్బంగమా ధమ్మా మనోసేట్ఠా మనోమయా,
మనసాచే పదుట్ఠేన భాసతివా కరోతివా,
తతోనం దుక్ఖ మన్వేతి చక్కంఽవ వహతో పదమ్. ౧
మనోపుబ్బంగమా ధమ్మా మనోసేట్ఠా మనోమయా,
మనసాచే పసన్నేన భాసతివా కరోతివా,
తతో నం సుఖ మన్వేతి ఛాయాఽవ అనపాయినీ. ౨
అక్కోచ్ఛి మం అవధి మం అజిని మం అహాసి మే,
ఏతం ఉపనయ్హన్తి వేరం తేసం నసమ్మతి. ౩
అక్కోచ్ఛిమం అవధి మం అజిని మం అహాసి మే,
ఏతం న ఉపనయ్హన్తి వేరం తెసూపసమ్మతి. ౪
నహి వేరేన వేరాని సమ్మన్తీధ కుదాచనం,
అవేరేనచ సమ్మన్తి ఏస ధమ్మో సనాతనో. ౪
పరేచ నవిజానన్తి మయమేత్థ యమామసే,
యేచ తత్థ విజానన్తి తతోసమ్మన్తి మేధగా. ౬
సుభానుపస్సిం విహరన్తం ఇన్ద్రియేసు అసంవుతం,

భోజనమ్హి అమత్తఞ్ఞుం కుసీతం హీనవీరియం,
తంవే పసహతి మారో వాతో రుక్ఖంఒవ దుబ్బలం. ౭
అసుభానుపస్సిం విహరన్తం ఇంద్రియేసు సుసంవుతం,
భోజనమ్హిచ మత్తఞ్ఞుం సద్ధం ఆరద్ధవీరియం,
తం వే నప్పసహతి మారో వాతో సేలంఒవ పబ్బతం. ౮
అనిక్కసావో కాసావం యోవత్థం పరిదహేస్సతి,
అపేతో దమసచ్చేన నసో కాసావ మరహతి. ౯
యోచ వన్తకసావస్స సీలేసు సుసమాహితో,
ఉపేతో దమసచ్చేన సవే కాసావ మరహతి. ౧౦
అసారే సారమతినో సారే చాసార దస్సినో,
తే సారం నాధిగచ్ఛన్తి మిచ్ఛాసఙ్కప్పగోచరా. ౧౧
సారంచ సారతో ఞత్వా అసారంచ అసారతో,
తేసారం అధిగచ్ఛన్తి సమ్మాసఙ్కప్పగోచరా. ౧౨
యథాఒగారం దుచ్ఛన్నం వుట్ఠి సమతి విజ్ఝతి,
ఏవం అభావితం చిత్తం రాగో సమతివిజ్ఝతి. ౧3
యథాఒగారం సుచ్ఛన్నం వుట్ఠి న సమతి విజ్ఝతి,
ఏవం సుభావితం చిత్తం రాగో నసమతి విజ్ఝతి. ౧౪
ఇధ సోచతి పేచ్చ సోచతి పాపకారీ ఉభయత్థ సోచతి,
సో సోచతి సో విహఞ్ఞతి దిస్వా కమ్మ కిలిట్ఠ మత్తనో. ౧౫
ఇధ మోదతి పేచ్చ మోదతి కతపుఞ్ఞో ఉభయత్థ మోదతి,
సోమోదతి సోపమోదతి దిస్వా కమ్మ విసుద్ధి మత్తనో. ౧౬

ఇధ తప్పతి పేచ్చ తప్పతి పాపకారీ ఉభయత్థ తప్పతి,
పాపం మేకతంతి తప్పతి భియ్యో తప్పతి దుగ్గతిం గతో. ౧౭
ఇధ నన్దతి పేచ్చనందతి కతపుఞ్ఞో ఉభయత్థ నన్దతి,
పుఞ్ఞం మేకతంతి నన్దతి భియ్యో నన్దతి సుగ్గతిం గతో. ౧౮
బహుంపి చే సహితం భాసమానో
నతక్కరో హోతి నరో పమత్తో,
గోపోఽవ గావో గణయం పరేసం
నభాగవా సామఞ్ఞస్స హోతి. ౧౯
అప్పంపి చే సహితం భాసమానో
ధమ్మస్స హోతి అనుధమ్మచారీ,
రాగంచ దోసంచ పహాయ మోహం
సమ్మప్పజానో సువిముత్తచిత్తో,
అనుపాదియానో ఇధవా హురం వా
సభాగవా సామఞ్ఞస్స హోతి. ౨౦
ఇతి ధమ్మవగ్గో పఠమో

యమకవర్గము (యుగ్మవర్గము)

శ్రీబుద్ధభగవాను డొకానొకదివసంబు ప్రాతఃకాలమున, తపస్సంధ్యాద్యనుష్ఠానాది నిత్యకృత్యములనుండి నివృత్తుడయి; విశాలామ్రవృక్షచ్ఛాయయందు సిద్ధాసనాసీనుడయి, బాల

భాస్కరునిపగిది ప్రకాశించుచు విరాజమానమయి యుండెను. అత్తఱి, భగవానుని ప్రియభ్రాతృండగు నానందుడు వెంట నసంఖ్యాకులగు భిక్షువు లరుదెంచె, నిజగురు సమ్ముఖంబున కేతెంచి, భక్తి గేల్మోడ్చి, వినమ్రుడయి, యీరీతి నివేదించెను :—"పూజాస్పదుండవగు నోదేవా! మానవుని మానసిక పరిస్థితులను గూర్చియు, తత్కర్మవిషయిక పరమపునీత సిద్ధాంతముల గుఱించియు, నీభిక్షుమండలికి సందేహము లనేకములు హృద్గతములయి యున్నవి. తమ రాదేశించినచో, భవత్కారుణ్యపూరిత కటాక్ష వీక్షణపరిసార పరిభావంబున నిజహృదయస్థ సందేహ సందోహమును దూరీకృతముగావింప నీశ్రమణు లభిలషించుచున్నారు. ఏతత్కారణంబున దాసుడు భవదాజ్ఞకయి నిరీక్షణ సేయుచున్నాడు." అంత బుద్ధచంద్రునిచే ననుజ్ఞాతుడయి గౌరవర్ణ విలసితదేహుండగు నొక్కనవయువక శ్రమణుం డిట్లు ప్రశ్నించెను:—"పరమాత్మ స్వరూపివగు నోగురుదేవా! మానసమన నేమి? సుఖదుఃఖము లుప్పతిల్లుటకు గతం బెయ్యది? కర్మసిద్ధాంతంబు లెయ్యవియో, భిక్షుధర్మమన్న నెద్దియో సుబోధకముగ విశదీకరింప బద్ధాంజలినయి, ప్రార్థించుచున్నాడ." శ్రమణుని దివ్యాభిలాషను నెఱింగి, బుద్ధదేవుడీరీతి నుపదేశింపదొడంగెను :—"కుమారా! నాచెప్పు హితోక్తుల శ్రద్ధతోడ నాలకింపుము.

(1) మనప్రకృత (ప్రస్తుత) స్థితి, మనమానసము మఱి యు మానసిక పరిస్థితులును మనహృదయమందలి భావముల యొక్క పరిణామస్వరూపమే. వీనికన్నింటికి మూలాధార ములు మన భావసంస్కారములె. మన మేరీతి దలంచుచు న్నారమో యడియేచందమున గార్యవాఙ్మనప్రముల బున రాచరింపుచున్నారము. మన ప్రస్తుత మానసిక పరిస్థితులు నిజమనోభావములచే నిర్మితము లయినవియె. శకటమును లాగు వృషభముల వెనువెంటనే శకటము యొక్క చక్రము లెట్లు పరుగిడి వచ్చుచున్నవియో, అదియేకరణి దుర్భావము లను, దుష్కార్యాచరణమును గల్గియుండుమానవుని వెను వెంటనే దుఃఖము లంటివచ్చుచున్నవి.

(2) మనము యెవరము? మనము కేవలము భావముల యొక్క పరిణామస్వరూపమయి యున్నారము. అథవా మన ప్రస్తుత మానవాకృతి గతభావజనితఫలము. ఏచందమున భవనము పునాది ననుసరించి దృఢతరముగనో, దుర్బలముగనో శోభిల్లుచుండునో అదియేమాడ్కి; మన మానసిక పరిస్థితులు మన భావపటుత్వాపటుత్వములపై నాధారపడి యుండును. భావానుకూలంబుగనే పరిస్థితు లుత్పన్నమగును. మానవుడు, ధర్మసంగత భావానుకూలంబుగ భాషింపుచు, తదనుకూలం బుగ దిరిగి, కార్యోన్ముఖుండగుచో సుఖశాంతులు ప్రతిబిం బము భాతి సర్వకాల సర్వావస్థలయందు వానివెంటనంటి

యుండగలవు. ఏస్థితియందును మానవు నెడబాసి యుండజాలవు. ఏతత్సిద్ధాంత మవికృతము, సార్వకాలికము, సార్వదేశికము.

(3) "వాడు నన్ను దూషించినాడు, వాడు నన్ను గొట్టినాడు, వాడు నన్ను బరాజితుని గావించినాడు, వాడు నన్ను దోచినాడు." ఓభిక్షువులారా! యేమూఢమానవు డీచందమున వెలయు సంకుచితభావములకు హృదయమున స్థానమొసంగునో, అట్టివాని నెల్లవేళల ఘృణ (మాత్సర్యము లేక మచ్చరభావము) వెంటనంటియుండి ఘోరముగ బీడించుట నిశ్చయము. అట్టివానిహృదయమం దనారతము క్రోధాగ్ని ప్రజ్వరిల్లుచునేయుండి వానిని దగ్ధముసేయ గడంగును.

(4) పూర్వోక్తవచనములకు నేమానవుడు విరుద్ధముగా "వాడు నన్ను దూరినాడు, హింసించినాడు, పరాజితుని గావించినాడు, దోచినాడు" అను హీనస్వభావములకు మదిదావొసంగడో, అట్టివాని హృదయసీమనుండి యనారతము వైరభావములు సహజముగనే దూరమగుచుండును.

(5) ఎందుచే ననః—ఆర్యజనకధితానాదిసిద్ధాంతము కలదు గదా! ద్వేషము ద్వేషమువలన నుపశాంతి నొందజాలదు. ద్వేష మద్వేషంబుననే యనగా ద్వేషరాహిత్యంబుననే శాంతినందుట ధ్రువము. జీవితాస్థిరత్వమును గుర్తెఱింగి, ద్వేషాగ్నిని ప్రేమసలిలాధారంబున జల్లార్పవలయును.

(6) మనయందఱి నాశన మియ్యెడనే సంఘటించుట స్థిరమని సాంసారికమనుష్యులు అథవా విషయలంపటులు గ్రో

హింప నశక్తులు. ఏమానవు డీగూఢరహస్యమును సుబోధ కము గావించుకొన సమర్థుడో, అతడే భూలోకమునందుం డియే నిజహృద్గతాందోళనసందోహమును దిరోహితంబు గావించి మించుసు.

(7) ఏమానవుడు తుచ్ఛవిషయ సుఖముల ననుభవిం చుటయందు రతుడయియుండునో, ఏనరు డనారత మింద్రియ లోలుడగు, అజితేంద్రియుడయి వెలయుచుండునో, ఏమానవ మాత్రు డన్నపానాదులయందు రసనేంద్రియమును వశీభూ తము గావించుకొన ననమర్థుడయి యుండునో, ఏవ్యక్తి మందు డయి, శారీరక దౌర్బల్యసహితుడయి యొప్పుచుండునో, అట్టి నికృష్టమనీషి, ప్రచండ మారుతాహతిచే భూతలపతి తంబగు శుష్కభూరుహంబుమాడ్కి కామదేవు (సైతాను) ని భీషణాఘాతాహతుడగును. అనగా మారునికఠోర ప్రహా రంబున నథఃపతితుండగుట వాస్తవము.

(8) ఏనరపుంగవుడు విషయవాసనాదూరుడయి, సం సార క్షేత్రమున విహారము సలుపుచుండునో, ఏమానవోత్త ముడు స్వీయేంద్రియములపై నాధిపత్యము వహించి, జితేం ద్రియుడయి యుండునో, ఏనరు డన్నపానాదులయందు నిత్య ము రసనేంద్రియలోలత నెడబాసి సంయమవ్రతానుష్ఠాన పరుడయి వర్తించునో, ఏవ్యక్తిపుంగవుడు శ్రద్ధాన్వితుడయి, సర్వోత్తమారోగ్య ధనసంపన్నుండయి యుండునో, అట్టి

యుత్తమపురుషావతంసుడు ప్రచండ ప్రభంజనా ప్రహార మును సరకుగొనని గభీరభూధరంబు మాడ్కి కాముని తీక్ష్ణ శరాఘాతముల లెక్కసేయక సుస్థిరానందపూరితచిత్తుడయి, వసుధ విలసిల్లు

(9) తన్ను దాను విముక్తిగావించుకొనక, విషయవా సనా పాశబద్ధుడయి, కాషాయాంబరధారణాభిలాషియయి, సం యమవ్రతమును, సత్యమును నధిక్షేపించు వ్యక్తి కపటసన్యాసి యనబడును. ఇట్టివ్యక్తి, కాషాయవసనధారణకు నితాంత మన ర్హుడు. బాహ్యసంస్కారము నిష్ప్రయోజనము.

(10) ఎవ్వాడు నశ్వరంబులగు భోగవిలాసములనుండి సంపూర్ణవిముక్తిం బడయునో, ఏమానవుడు సమస్తవిధసద్గుణ గణభూషణా భూషితుడయి వెలయుచుండునో, ఏనరోత్త ముడు సంతతము సంయమమును, సత్యమును నత్యంతాదర దృష్టితో వీక్షించునో, అట్టిధీరపుంగవుడు నిశ్చయముగ బరమ పునీత కాషాయ వస్త్రధారణ కర్హుడు. అట్టిదానినే యాత్మ సన్యాసమందురు. బాహ్యవేషము సర్వదా వృథయగును.

(11) సత్యమునందు సత్యమును, అసత్యమునం దసత్య మును గుర్తింప సమర్థుండగు నరు డాస్తిక్యముం బడయుట నిక్కవము. అట్టిమానవుడు శుభప్రదంబులగు పరిశుద్ధాభి లాషల ననుసరించి, యిహమున వర్తించి శుద్ధానంద పరిపూర్ణ హృదయుడగును. సత్యాసత్య పరిజ్ఞానశూన్యుండగు జడుడు కర్మబంధములజిక్కి నిరంతరము వాపోవుచుండును.

(12) అశాస్త్రీయముగా ననగా ననుచితపద్ధతిని గృహ మునాచ్ఛాదితము గావింపుచో, వర్షాపాతం బెట్లు గృహాంత ర్భాగమున బ్రవేశింపగల్గుచున్నయదో, అదియేచందమున వివే కశూన్యుండగు నరునిమనమునం దనేక విషయవాసనాస్రవం తులు ప్రవహించును.

(13) శాస్త్రీయముగ నాచ్ఛాదితమగు భవనముపై కప్పునుండి వర్షబిందుతతి యెట్లు గృహాంతరాళమున బడుట దుస్సాధ్యమో, అదియేరీతి సంపూర్ణ వివేకసంపన్నుండగు మానవుని చిత్తమున విషయవాసనారసబిందువులయిన బ్రవే శింపజాలవు. దుర్బలకాయునే వ్యాధి పీడించుట నైసర్గికంబగు లాగుననే, వివేకశక్త్యభావయుక్తుడగు నరునే విషయతృష్ణా వ్యాధి పీడించును.

(15) ఓ భిక్షువులారా ! దుష్క్రియానురక్తుడగు నరుడీలోకమునను, బరలోకమునను బశ్చాత్తప్తుడగుననియెడి నుడువు యథార్థము. అట్టి నీచప్రకృతిగల నరుడుభయలోక భ్రష్టుడయి, యనగా నిహపరసౌఖ్యదూరుడయి, సంతతవిషా దాయత్తచిత్తుండగుట సత్యము. అట్టివాడనారతము కల్మష పరిపూర్ణకార్యముల గావించి విషమపరిణామ స్వరూపసందర్శ నంబున ఖిన్నుడయి, యత్యంత కష్టముల ననుభవించుట ధ్రువము.

(16) సదాచారసంపన్నుండగు నరు డీలోకమునను, బర లోకమునను భావాతీతంబగు సౌఖ్యంబునందును, అట్టివాఁడు విషాదభయంబులబాసి, వైహికాముష్మిక సౌఖ్య సౌభాగ్య సంపన్నుండయి యొప్పుచుండును. అట్టివా డనవరతము స్వకీయ కార్య పారిశుద్ధ్యము నవలోకించి, యమందానంద కందళిత హృదయారవిందు డగుచుండును.

(17) దుష్కార్యానురక్తుండగు నరు డీలోకమందును, బరలోకమందును దుఃఖితుడయియుండును. ఉభయలోకముల యందు దుఃఖప్రాప్తియే యట్టివానికి బ్రిహ్మ వ్రాత. అట్టిజడ మతి నిజదుష్టకార్యానుకూల దుష్ఫలమును వీక్షించినంతనే వ్యాకులచిత్తుడయి, యపార విషాదాక్రాంతస్వాంతుడయి, సత్కార్యాభిలాష నశియింప విషమపథము ననుకరించి, యస హానీయ కష్టపరంపరలకు గురియగుచుండును.

(18) సుకృతానురక్తుడగు నరు డీ జన్మయందును, పర జన్మయందును, బరమహర్ష సమన్వితుడగుచుండును. లోక ద్వయమం దహర్నిశము బ్రిహ్మానందము ననుభవించుచుం డును. అట్టినరుడు నిజసద్భావసమన్విత సత్కార్యానుకూల సత్ప రిణామము నుపేక్షించి సహజోద్భవ పరమానందభరిత చిత్తుం డగుచుండును. వాడు స్వీయహృదయమును శాంతినిలయము గావించుకొని, దివ్యతమంబగు మణివలె ప్రకాశించుచుండును. వాడు సంతతము నిజధర్మమును విస్మరించక, విశుద్ధ ధర్మ

పథానుగామియయి, లోకాతీతశాంతమునంది, తుదకు శాశ్వతానందపదవిని జేరును.

(19) ఏ భిక్షువు మానవధర్మపథానుకూలాసంఖ్యాక విశిష్టసిద్ధాంతపుంజముల గంఠస్థము జేసియు, దదనుకూలంబుగ గార్యోన్ముఖుడగుటకు శంకితస్వాంతుడగునో, అట్టి మూఢ మానవు డేస్థితియందును శ్రమణపదవి కర్హుడు కాజాలడు. అట్టియల్పుని నీచజీవనము పరుల పశువులసంఖ్యను గణించుటే కర్తవ్యముగా గల్గియున్న గోపాలుని (వెఱ్ఱిగొల్లవాడు) బోలియుండి, సంపదార్హము కాజాలదు. అనగా భావానుభవంబు కన్న గార్యానుభవంబె మిన్న. భావముచేగల్గుఫలము శూన్యము. భావము, నదియు సద్భావము కార్యరూపంబును దాల్చినపుడే ఘనంబగు.

(20) సత్యధర్మ పథానుయాయి ధర్మశాస్త్రాంతర్గత శ్లోకముల గంఠాగ్రము జేయకపోయినను కామక్రోధాద్యరిషడ్వర్గమును జయించి సదసద్వివేకమును, నిర్మలభావసంపాదనాజనిత మనశ్శాంతిని బడసి సుఖించును. అనగా వాక్శూరత్వమువలన మానవ హృదయాంతర్గతేచ్ఛాశక్తి నష్టభ్రష్టమగును. కార్యశూరత్వమున మానసము భవ్యతరానూన వికాసప్రాప్తిని జెందును. ఐహికాముష్మిక సుఖాభిలాషారాహిత్యమే యథార్థమగు భిక్షుపదధారణ కర్హతనొసంగును. అనగా నిహపరసౌఖ్యాకాంక్ష లేకయే ధర్మసంగతమగు నిష్కా

మకర్మ సేయువాడే సత్యమయిన శ్రమణుడు (భిక్షువు), పరి
వ్రాజకుడు లేక సన్యాసి యనబడును.

యమకవగ్గము పరిసమాప్తము



## అప్పమాదవగ్గో

అప్పమాదో అమతపదం పమాదో మచ్చునోపదం,
అప్పమత్తా నమీయన్తి యేపమత్తా యథా మతా. ౧

ఏతం విసేసతోఞత్వా అప్పమాదమ్హి పండితా,
అప్పమాదే పమోదన్తి అరియానం గోచరే రతా. ౨

తే ఝాయినో సాతతికా నిచ్చం దళ్హ పరక్కమా,
ఫుసన్తి ధీరా నిబ్బాణం యోగక్ఖేమం అనుత్తరం. ౩

ఉట్ఠానవతో సతిమతో సూచికమ్మస్స నిసమ్మకారినో,
సఞ్ఞతస్సచ ధమ్మజీవినో అప్పమత్తస్స యసోభివడ్ఢతి. ౪

ఉట్ఠానేనఽప్పమాదేన సఞ్ఞమేన దమేనచ,
దీపం కయిరాథ మేథావీ యం ఓఘో నాభికిరతి. ౫

పమాద మనుయుఞ్జన్తి బాలా దుమ్మేధినో జనా,
అప్పమాదంచ మేథావీ ధనం సేట్ఠంఽవ రక్ఖతి. ౬

మాపమాద మను యుఞ్జేథ మాకామరతిసన్థవం,
అప్పమత్తో హి ఝాయన్తో పప్పోతి విపులం సుఖమ్. ౭

పమాదం అప్పమాదేన యదా నుదతి పణ్డితో,
పఞ్ఞాపాసాద మారుహ్య అసోకో సోకినం పజం,

పబ్బతట్ఠోఽవ భుమ్మట్ఠే ధీరో బాలే అవేక్ఖతి. ౮
అప్పమత్తో పమత్తేసు సుత్తేసు బహుజాగరో,
అబలఽస్సంఽవసీఘస్సోఽహిత్వా యాతి సుమేధసో. ౯
అప్పమాదేన మఘవా దేవానం సేట్ఠతం గతో,
అప్పమాదం పసంసన్తి పమాదో గరహితో సదా. ౧౦
అప్పమాదరతో భిక్ఖు పమాదే భయదస్సివా,
సంయోజనం అణుం థూలం డహం అగ్గీఽవ గచ్ఛతి. ౧౧
అప్పమాదరతో భిక్ఖు పమాదే భయదస్సివా,
అభబ్బో పరిహానాయ నిబ్బాణస్సేవ సన్తికే. ౧౨

ఇతి అప్పమాదవగ్గో

---

## పరిశుద్ధ భక్తివర్గము (అప్రమాదవర్గము).

ఒండొకదివసంబు శ్రీ బుద్ధభగవానుడు విహారాభిలాషచే స్వస్థానము నెడబాసి, కొంతద వ్వేగి తుదకొక భిక్షుకూటము జేరెను. అయ్యెడ సోమరులును, బ్రమత్తులునునగు కొందఱుభిక్షువుల నవలోకించి, దయార్ద్రహృదయుండగు బుద్ధభగవానుడు, వారి పశుతుల్యమగు జీవితమునకయి విచారించి వారల నుద్ధరింప నీచందమున మృదుమధురంబుగ నుపదేశింప నారంభించెను :—

(1) నాయనలారా! సద్భక్తియే యమరత్వపదప్రాప్తి (కైవల్యప్రాప్తికి) మూలసాధనము. అనగా నప్రమాదావ

స్థయె మోక్షోపలబ్ధికి మూలము. ప్రమాదమే భయవిషాద నిలయంబగు మరణమునకు మూలకారణ మగుచున్నయది. సద్భక్తియుక్తుడగు శ్రేష్ఠమానవుడు యిహలోక తత్వజ్ఞానము నందనిదే శీఘ్రము మృతిజెందబోడు. సద్భక్తిరహితుండును, ప్రమాదావస్థకు వశుండుననగు జడుడు సజీవుడయ్యు మృత సమానుడె. అనగా జీవన్మృతుడు లేక జీవచ్ఛవము.

(2) అప్రమాదపథమున నగ్రేసరుడయి, తత్స్వభావ మాహాత్మ్యమును సుస్పష్టముగ గ్రహించు మానవుడు, సంత తము సంసారమందు సద్భక్తియందే నిమగ్నుడయి యుండ గలడు. అట్టి యుత్తమోత్తమ పురుషవరేణ్యుడే హ్రీచీనాగ్ర జనసంపాదిత జ్ఞానామృతరసాస్వాదన సౌఖ్యముం బడయ నర్హు డగును.

(3) పై నుదహరింపబడినట్టి చింతాశీలుడును, సుస్థిర చిత్తుడును, మఱియు సర్వదా మహత్తర శక్తియుక్తుండును నయి వెలయు ధీమంతుడు సర్వోత్కృష్టంబగు నిర్వాణపదవి నలంకరింపగలడు.

(4) ఏనరు డనారతము జాగ్రదవస్థయందుండునో, స్వప్నావస్థయందయిన దప్పిదముగావింప నభిలషింపడో, అనా రతము బరిశుద్ధకార్య తత్పరుడయియుండునో, యుక్తాయుక్త విచక్షణజ్ఞానానుకూలంబుగ వర్తించునో, సంయమవ్రతధారి యయి విలసిల్లుచుండునో మఱియు ధర్మానుకూలంబగు

ఋజువర్తనమునుగల్గి వ్యవహరించునో యట్టి యప్రమత్తుని సద్భక్తుని సత్కీర్తి సంతత మనూనంబగు తేజంబుతో సంవర్థితం బగుచుండును.

(5) జాగ్రిదవస్థయం దుండుటవలనను, అప్రమాదస్థితి యందు వెలయుచుండుటం జేసియు, ఇంద్రియనిగ్రహుం డగుట చేతను సంయమవతానుష్ఠానపరత్వ బుద్ధివికాసమును గల్గి యుండుటవలనను మానవుడు తనచుట్టును వెల్లువలయి పారి వచ్చు దుఃఖమనియెడి వెల్లువరదను లెక్కసేయనట్టి యొక విశాలద్వీపంబును సిద్ధము గావించుకొనగల్గును.

(6) వివేకశూన్యుండగు మానవు డెల్లవేళల నశ్వరం బగు చిత్తాకర్షక సుందరవస్తుతతి నే హృదయపూర్వకంబుగ బ్రేమింపగడంగును. కాని వివేకసంపన్నుడగు నరు డప్రమాదమునే మానవజాతికి సర్వోత్కృష్ట శిరోభూషణంబుగ భావించి, తత్ప్రాప్తికయి భగీరథప్రయత్నముల జేయుచుండును.

(7) మనుజుడు కృత్రిమ (అస్థిర) పదార్థబాహ్యాడంబరమును గాంచి ముగ్ధుడయి యవ్వాని ప్రాప్తికయి, యల్లాడ జనదు. విషయభోగపాశములకు జిక్కి, జ్ఞానాంధుడగుట నుచితము. చింతాశీలుడును, అప్రమత్తుడునునగు మానవున కలౌకికానందము కరతలామలకంబగును. ఇద్దానినే సిద్ధియందురు.

పేతత్సిద్ధివలన లభించు సుస్థిరానందమైహ లౌకికానందమునుండి భిన్నముగనుండును.

(8) ధీసంపన్నుండగు వ్యక్తిసద్భక్తి వలనను, వివేకప్రభావంబునను, స్వకీయ మిథ్యాభిమానమును దూరీకృత మొనరించి, శోకరహితుడయి, జ్ఞానమనియెడి మహోత్తుంగ పర్వత శృంగము నధిరోహించి, తత్పర్వత నిమ్నప్రదేశ స్థితమూర్ఖ మండలిని వీక్షింపగలడు. ఉచ్చభూధర శిఖరము నారోహించి యున్నవ్యక్తి యేరీతి, మైదానమునందు నిలువబడియున్న జన సమూహమును గాంచగలడో, అదియేచందమున వివేకసంపన్నుండగునరుడు విషయవాసనాపంకిలమున జిక్కి కర్మేంద్రియశక్తి విముక్తి కర్హంబుగాని హేతువుచే బెనగులాడు మూఢజనసంఘమును నిరాతంకముగా విలోకింపగలడు.

(9) ప్రమత్తులలో నప్రమత్తుడును, నిద్రించువారిలో మేల్కాంచియున్నవాడును, బందెమునకయి పరుగిడు బలహీనమగు ఘోట్టిగుఱ్ఱమును రెండు దుముకులలో దాటిపోవు నిపుణాశ్వమును బోలియుండును.

(10) సచ్చింతాప్రభావంబుననే యింద్రునకమరులలో సర్వశ్రేష్ఠపద ప్రాప్తికలిగినది. ప్రజాసమూహము సచ్చింతాస్తవము దివారాత్రములు సేయుచుండును. ప్రమాదావస్థను సమస్తసుజను లనారతము దూషింపుచుందురు. ఇయ్యది గర్హితపదము. సద్వర్తనమే మానవోన్నతికి మూలమగును.

(11) సచ్చింతయందు నిత్యము సంలగ్నుడయి, ప్రమత్తతను స్వప్నమందయిన జెంత రానీయని భిక్షు వగ్నిమాడ్కి స్వకీయాల్పాధిక వ్యామోహబంధనములనెల్ల భస్మీపటలము గావించి, యిచ్ఛవచ్చిన చొప్పున వర్తించును. అనగా స్వాతంత్ర్య సౌఖ్యంబు నందును.

(12) ఏభిక్షు వప్రమాదావస్థయం దపారసౌఖ్యంబు ననుభవింపుచుండునో, అసావధానతను భయకంపిత దృష్టితో వీక్షింపుచుండునో, యట్టివాడు సంపూర్ణముగ శ్రమణపదవినుండి భ్రష్టుడుగాక శీఘ్రకాలమునందే నిర్వాణపద పథమును సమీపించును.

అప్రమాదవర్గము పరిసమాప్తము.



## చిత్తవగ్గో

ఫన్దనం చపలం చిత్తం దురక్ఖం దున్నివారయం,
ఉజుం కరోతి మేధావీ ఉసుకారోఽవ తేజనం. ౧

వారిజోఽవ థలే ఖిత్తో ఓకమోకత ఉబ్భతో,
పరిఫన్దతిఽదం చిత్తం మారధేయ్యం పహాతవే. ౨

దున్నిగ్గహస్స లహునో యత్థకామనిపాతినో,
చిత్తస్స దమథో సాధు చిత్తం దన్తం సుఖావహం. 3

సుదుద్దసం సునిపుణం యత్థకామనిపాతినం,
చిత్తం రక్ఖేథ మేధావీ చిత్తం గుత్తం సుఖావహం. ౪

దూరఙ్గమం ఏకచరం అసరీరం గుహాసయం,
యేచిత్తం సఞ్ఞమేస్సన్తి మోక్ఖన్తి మారబన్ధనా. ౫

అనవట్ఠి చిత్తస్స సద్ధమ్మం అవిజానతో,
పరిప్లవ పసాదస్స పఞ్ఞా న పరిపూరతి. ౬

అనవస్సుతచిత్తస్స అనన్వాహతచేతసో,
పుఞ్ఞపాప విహీనస్స నత్థి జాగరతో భయం ౭

కుమ్భూపమం కాయమిమం విదిత్వా
నగరూపమం చిత్తమిదం ఠపేత్వా,
యోధేథ మారం పఞ్ఞాయుధేన
జితంచ రక్ఖే అనివేసనోసియా. ౮

అచిరం బత యం కాయో పఠవిం అధిసేస్సతి,
ఛుద్ధో అపేతవిఞ్ఞాణో నిరత్థంఽవ కళిఙ్గరం. ౯

దిసో దిసం యంతం కయిరా వేరీ వా పన వేరినం,
మిచ్ఛాపణిహితం చిత్తం పాపియో నం తతో కరే. ౧౦

నతం మాతా పితా కయిరా అఞ్ఞేవాపిచ ఞాతకా,
సమ్మాపణిహితం చిత్తం సేయ్యసో నం తతో కరే. ౧౧

ఇతి చిత్తవగ్గో.



## చి_త్తవర్గము (భావసంయమవర్గము)

తరంగిణీతటమున బరమశాంతచిత్తుడయి, తదేకధ్యాన నిష్ఠాగరిష్ఠుడయియున్న బుద్ధదేవు నొకగృహస్థు డేతెంచి, యిట్లు ప్రశ్నించెను :—మహాత్మా! చంచలంబగు చి_త్తమును వశీభూతము గావించుకొను విషయము యొక్క పునీత సదుపదేశమును బ్రసాదింపుడి. విచారసంయమ మెట్లు గావింపబడును? తన్నష్టలాభముల విషయము సహిత ముపదేశించి భగవద్దాసాధముండనగు నన్ను గృతకృత్యుని గావింప బద్ధాంజలినయి వేడుచున్నాడ. దేవుడంత బ్రసన్నచి_త్తముతో నీచందము నుపదేశించెను :—

"కుమారా!

(1) శరాసనము నిర్మించువా డేపగిది గోదండము నభిలాషమాత్రంబున వక్రముగ జేయగల్గుచున్నాడో, అనగా నద్దానిని వంపగలుగుచున్నాడో, అదియేచందమున ధీమంతుడగు పురుషావతంసముడు చంచలతరంబులును, నశాశ్వతంబులును, సాధారణకృషి కసాధ్యంబులును నగు భావంబుల నభిలాషమాత్రంబున సుస్థిరముగావింప సమర్థుండు. చంచలమగు చి_త్తము ధీమంతుని పరిజ్ఞకు వశవ_ర్తినియయి చెలంగు.

(2) స్వకీయ నివాసస్థానమగుజలాశయమునుండివియోగమునందినమత్స్య మేచందమున బృథ్వీపైబడి, ఘోరవ్యాకు

లతం జెందునో, అసెరియే చందమున మానవచిత్తము కామదేవుని వ్యామోహబంధన విముక్తిం జెంద, నిత్యము వ్యాకుల పడుచునే యుండును.

(3) మానసమును సాధ్వీనము గావించుకొనుటయే మానవుని విధ్యుక్తధర్మము. మానసము స్వాతంత్ర్యమును బాసి నిరంకుశముగ వర్తింపక, ధీశక్తికనుకూల మయినపుడే యాత్మతత్వంబు సువ్యక్తంబగును. చిత్తము చంచలంబగుకతన నయ్యది సంఖ్యాక కష్టపరంపరలకు గురియగుచుండును. అట్టితటి సర్వసాధారణ ప్రియత్నంబువలన జిత్తము వశీభూతము కాజాలదు. కష్టములనంది, సుశిక్షుచుండు చిత్తము తన యిచ్ఛవచ్చిన మద్భున సంచరింపుచుండును. ధీశక్తికి వశీభూతంబయిన మానసమే స్థిరమగు సౌఖ్యమును బరిసాదించును.

(4) ధీమంతుడగు వ్యక్తి సూక్ష్మగతితోడ జరించు స్వేచ్ఛానురక్తమగు కుటిలమానసమును సంరక్షించుకొనుటుచితము. గతంబెద్దియన సురక్షితంబును, వశీకృతంబును నగు మానసము స్వర్గీయసంపద నిడును.

(5) మానసము సంతతము కాంక్షానుకూలంబుగ విహారము సేయుచుండును. ఇయ్యది యేకాకినియయి దిరిమ్మరుచుండును. దీనికి శరీరముగాని, స్వరూపముగాని లేదు. హృదయాంతరాళమున రహస్యముగ వాసము సేయు

చుండును. ఇట్టి గుణగణములచే దనరారు మానసమును వశీకృతము గావించుకొను మనుజుడు మారుని మాయావాగురంబుల దగుల్కొనక, ముక్తిని బడయగలడు.

(6) మానవోద్దేశ్యముల స్థిరంబులగుచో, నరుడు సత్యమగు ధర్మపథమును గ్రహింపకున్నచో, వాని హృదయాంతరాళమున వెలయు సహజమగు శాంతి భగ్నమగుచో సంపూర్ణమగు జ్ఞానము ప్రాప్తించుట శుద్ధాబద్ధమగును. ఉపర్యుక్త విషమపరిస్థితులయందు జ్ఞానప్రాప్తిని వాంఛించు మానవుని కాంక్షలనే రిత్తకోర్కెలనియెదరు. ఏతత్కార్యసాఫల్యత గగనపుష్పసదృశము.

(7) సుస్థిరభావంబుల గల్గి, మనోవ్యాకులతనువర్జించి, సత్కార్యదుష్కార్య పరిణామముల నపేక్షింపక, సావధానచిత్తుడయి, వర్తించు వ్యక్తికి కీషన్మాత్రమయిన భయము కలుగబోదు.

(8) పంచభూతాత్మకంబగు నీకాయము మృత్తికానిర్మితఘటముభాతి క్షణభంగురము. ఏతద్రహస్యమును గ్రహించి మనుజుడభేదభావనిర్మిత దుర్గమును నిర్మాణమొనరింపవలయును. అంతటితో నుపేక్ష వహించి, మానము దిగ్రుడయి యుండక, దాని బురుజులపై జ్ఞానశతఘ్నుల నమర్చి, మనోదుర్గము నాక్రమణసేయ నపేక్షించి, దాడివెడలయత్నించు ధూర్తశిఖామణియగు కామదేవుని నిర్జితుని గావిం

పవలయును. జ్ఞానశతఘ్నిం బ్రేల్చినంతనే కాముని దుర్భావము
లను సైనికులు గుండియలవిసి యొక్కసారి నిహతులగుదురు.
తద్దురాత్ముని సైన్యసమేతంబుగ ధర్మసమరాంగణమున బరా
స్తముగావించినపిదప, నరుడు అసావధానచిత్తుడయి, స్వకీయ
సద్భావనిర్మితదుర్గమును దిరిగి కామునివశము గాకుండ సంర
క్షణము జేసికొనవలయును. దుర్గాధిపతియగు మనుజుడు
ప్రమత్తుడగునేని రెప్పపాటుకాలమునందే మారుడు రహస్య
ముగ దుర్గమున బ్రవేశించెను. అట్టితఱి దుర్గాధ్యక్షుడగు
మనుజుడు శాత్రవుని జయింప శక్తి హుళక్కియగుడు మారు
నికి దాసానుదాసుడగును. తప్పక దాస్యమే వానిజీవితవిధి
యగును.

(9) అయ్యో! బ్రహ్మస్వరూపంబగు కాలమును
వృథాపుచ్చుటెంత యవివేకము. అల్పకాలమునందే యీమనో
హరంబగు దేహము జడమగు శుష్కకాష్ఠసదృశంబుగ
భూతలపతితంబయి, నిరర్థకంబగును. అట్టితఱి నాకాయము
విచారశూన్యమయి సమస్తజన తిరస్కృతమయి పడియుండ
గలదు. కాన శీఘ్రమే సద్భావముల సంపాదింప యత్నించుట
శ్రేయస్కరము.

(10) ద్వేషి ప్రతిద్వేషికిని, శత్రువు విపక్షికిని గావించు
మహాపకారముకంటె, దుష్పథగమనాభిలాషియగు వ్యక్తియే

తన్ను దా నధికము జెలఁచుకొనును. అనగా నిరంకుశముగా వర్తించు చిత్తమే మనుజు నధోగతికి బాల్పడజేయును.

(11) సన్మార్గానురక్తయగు చిత్తమువలన మానవ ప్రపంచమునకు లభించునట్టి పరమశ్రేయము మాతాపితల వలనగాని, తదితర బంధుమిత్రాదులవలనగాని ప్రాప్తించుట కడుదుర్లభము.

చిత్తవర్గము పరిసమాప్తము.



పుప్ఫవగ్గో

కో ఇమం పఠవిం విజేస్సతి
యమలోకంచ ఇమం సదేవకం
కోధమ్మపదం సుదేసితం,
కుసలో పుప్ఫమివ పచేస్సతి. ౧

సేఖో పఠవిం విజేస్సతి,
యమలోకంచ ఇమం సదేవకం,
సేఖో ధమ్మపదం సుదేసితం
కుసలో పుప్ఫమివ పచేస్సతి. ౨

ఫేణూపమం కాయ మిమం విదిత్వా
మరీచిధమ్మం అభిసమ్బుధానో,

ఛేత్వాన మారస్స పపుప్ఫకాని
అదస్సనం మచ్చురాజస్స గచ్ఛే. 3

పుప్ఫాని హేవ పచినన్తం వ్యాసత్తమనసం నరం,
సుత్తంగామం మహోఘోఽవమచ్చు ఆదాయ గచ్ఛతి. ౪

పుప్ఫాని హేవ పచినన్తం వ్యాసత్తమనసం నరం,
అతిత్తం యేవ కామేసు అన్తకో కురుతే వసం. ౫

యథాఽపి భమరో పుప్ఫం వణ్ణగన్ధం అహేఠయం,
పలేతి రస మాదాయ ఏవం గామే మునీ చరే. ౬

న పరేసం విలోమాని నపరేసం కతాకతం,
అత్తనోఽవ అవేక్ఖేయ్య కతాని అకతానిచ. ౭

యథాఽపి రుచిరం పుప్ఫం వణ్ణవన్తం అగన్ధకం,
ఏవం సుభాసితా వాచా అఫలా హోతి అకుబ్బతో. ౮

యథాపి రుచిరం పుప్ఫం వణ్ణవన్తం సగన్ధకం
ఏంవసుభాసితా వాచా సఫలా హోతి సకుబ్బతో. ౯

యథాఽపి పుప్ఫరా సిమ్హా కయిరా మాలాగుణే బహూ,
ఏవం జాతేన మచ్చేన కత్తబ్బం కుసలం బహుం. ౧౦

న పుప్ఫ గన్ధో పటి వాత మేతి
నచన్దనం తగరం మల్లికావా,
సతంచ గన్ధో పటివాత మేతి
సబ్బా కసా సప్పురిసో పవాతి. ౧౧

చన్దనం తగరం వాఽపి ఉప్పలం అథ వస్సికీ,
ఏతేసం గన్ధ జాతానం సీలగన్ధో అనుత్తరో. ౧౨
అప్పమత్తో అయం గన్ధో యాఽయం తగర చన్దనీ,
యోచ సీలవతం గన్ధో వాతి దేవేసు ఉత్తమో. ౧౩
తేసం సపన్న సీలానం అప్పమాద విహారినం,
సమ్మదఞ్ఞావిముత్తానం మారో మగ్గం నవిన్దతి. ౧౪
యథాసఙ్కారథానస్మిం ఉజ్ఝితస్మిం మహాపథే,
పదుమం యత్థ జాయేథ సూచిగన్ధం మనోరమం. ౧౫
ఏవం సఙ్కారభూతేసు అన్ధభూతే పుథుజ్జనే,
అతిరోచతి పఞ్ఞాయ సమ్మాసమ్బుద్ధ సావకో. ౧౬

ఇతి పుప్ఫవగ్గో



## పుష్పవర్గము.

ఋతురాజమగు వసంతము విలక్షణలక్షణ లక్షితమయి, స్వకీయనైసర్గిక సౌందర్యప్రభావంబున జీవకోటికి బరమాహ్లాదము నొడగూర్చుచుండెను. బింబసార భూపాలుని పుష్పోద్యానమున నవాగత భిక్షుసముదాయముతోడ శ్రీ బుద్ధచంద్రుఁడు విరాజమానుడయి యుండెను. నానావిధవర్ణ నవవికసిత పుష్పగుళుచ్ఛములనుండి బ్రహ్మానందకరంబగు దివ్యతమ

సౌరభము నిర్గతమయి, ఘ్రాణేంద్రియముల బ్రవేశించి, డెం దముల కదుంబానంద ప్రదాయకం బగుచుండెను. నల్దెసల వ్యాప్తమగు భవ్యతరసౌరభము మారుతకిశోరముతో సమ్మి ళితమయి, వేవేగ భిక్షువుల గాఢాలింగన మొనర్చి, వారి చిత్త ములబకాయత్తముల గానీయక, బుద్ధభగవానుని స్వర్గీయ ప్రబోధవాక్యసముదాయః శ్రవణంబున కాయత్తపఱచు చున్నట్టులుండెను. ప్రాగ్దిశయందు జతుర్దశభువన చతుర్దిశ వ్యాప్తాంధకారపటల విధ్వంసకుండగు బాలప్రభాకరుడు నలుగెలంకుల నిజానూనప్రకాశచ్ఛట లలమికొనుచుండ నుది తుడాయెను బాలభాస్కర సందర్శనానంతరంబు బుద్ధదేవు డాప్రత్యక్ష దైవమునకు, సుగుణరాశికి పరోపకార తత్వనిధికి బ్రణమిల్లి, తత్ప్రదేశాగత పరివ్రాజకమండలి నుద్దేశించి, యీచందమున నుపదేశింప గడంగెను :—

బిడ్డలారా!

(1) లోకత్రియ విజయలక్ష్మిని వరింపగలవాడెవ్వడు? (భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము—వీనిని పృథ్వి, నరకము, వైకుంఠము లేక నిర్వాణమని సహితము సాధారణ మానవప్రపంచము నుడువుచుండును.) చతురుండును, సచ్ఛీ లుండునునగు వ్యక్తి యేచందమున స్వహృదయాకాంక్షితకుసు మమును బుష్పోద్యానమునుండి యన్వేషించి, సంపాదింప

శక్తుడగుచున్నాడో, అదియేభాతి మానవజాతి బ్రియమగు సత్యము నెవ డన్వేషింపనేర్చు ?

(2) ముముక్షునగు మనుజుడు పృథ్వియందును, యమలోకమందును, దేవలోక (త్రివిష్టపము) మందును విజయమును బడయుట నిక్కువము. అట్టి వ్యక్తియే పరోపకారానుకూల సత్పథమును, కుశాగ్రబుద్ధి యేరీతి మనోవాంఛిత సుమనమును పుష్పరాశినుండి బడయ యత్నించుచున్నాడో, అదియేరీతి గృషిచే నన్వేషింప శక్తుడగుచున్నాడు.

(3) ఎవ్వాడు పాంచభౌతికంబగు కాయమును (మృత్తికానిర్మితఘట సదృశమయినది) జలబుద్బుదప్రాయంబుగను క్షణభంగురంబుగను విజ్ఞానదృష్టితో వీక్షించి, గ్రహింపగలడో, ఏమానవోత్తముడు జీవితమును మృగతృష్ణవంటిదిగ గ్రహించి మించునో యట్టి పుణ్యపురుషపుంగవుడు కామదేవుని తీక్ష్ణతమంబులగు సూనశరముల దృటిమాత్రకాలంబున నిర్మూలనమొనర్ప సమర్థుండగును. ఎవ్వేళయందును యమరాజసందర్శనం బట్టి పురుషోత్తమునకు సంభవింపనేరదు.

(4) పుష్పసంగ్రహమునందు విలీనుడయియుండియు, నస్థిరచిత్తుండయి యుండు మానవుని నిద్రావస్థయందు చైతన్యశూన్యమయియుండు గ్రామమును వెల్లువలయి పారివచ్చు నీటివరద ముంచివేయురీతి, మరణమని యెడి ముక్కడిరక్కసి యొక్కుమ్మడి విజృంభించి మ్రింగివేయును.

(5) ప్రాపంచికేచ్ఛానుమనోభిలాషియును, విషయభోగానురక్తుడయియుండు నున్మత్తుండును, నిజహృదయాభిలాష లీడేరుటకుబూర్వమే మృత్యుదేవత భయవిషాదపూరిత గభీర సదనంబున కలిథులయి చనియెదరు.

(6) మధుమక్షికాబృంద మేవడువున బుష్పనిచయ వికాసప్రకాశములకును సౌరభమార్దత్వములకును క్షతి నొదవజేయకుండగనే, మకరందపానము సేయుచున్నదియో, అదియే ప్రకారము నిరంతరము సచ్ఛీలుండును, సత్యపథానువర్తకుండును, సాధుసత్త్వముండును నగు బౌద్ధభిక్షుగ వాడవాడలయందు ననింద్యమగు నుత్తమజీవితమును గడుపుచు, గ్రామవాసులకు గష్టములొదవకుండనుండులాగున మాధుకరవృత్తిచే శరీరపోషణము గావించుకొనవలయును.

(7) పరుల దౌర్బల్యముతట్టునకుగాని, అన్యజనకృత దుష్కార్యపుంజమువైపునకు గాని, పరజన పరిత్యర్జిత కార్యకలాపము దిక్కునకుగాని భిక్షువయినవాడించుకయయిన ధ్యానమిడరాదు. స్వకీయ దుష్క్రియాసమూహము నెడను విభ్రమజనితప్రమాదముపట్లనుసంపూర్ణ ధ్యాన చిత్తుడయివర్తించుటయే యథార్థమగు శ్రమణుని విధ్యుక్త సత్యజ్ఞాన పరిపూర్ణధర్మము.

(8) ఏవ్యక్తి నిజసంభాషణము ననుసరించి, కర్తవ్యతత్త్రమున వర్తింప శంకితస్వాంతుడగుచుండునో, అనగా వాక్కర్మల భిన్నత నెడబాసి యొక్కచందమున వ్యవహరింపడో,

యట్టి యల్పబుద్ధియగు మందుని మనోజ్ఞవచనములు సుగంధరహితములగు సుందరపుష్పములంబోలి యుండును. తావిలేని పూలనేరీతి సంసారము నిష్ప్రయోజనమని మది భావించి త్యజించునో, అదియేమాడ్కి కార్యశూన్యుని వాక్యముల బ్రజలు బహిష్కరింతురు.

(9) ముఖోద్గతవచనానుసారంబుగ వర్తించు వ్యక్తియొక్క వాక్కులత్యంతపరిశుద్ధములయి, సౌరభసమన్వితంబులగు సుమములరీతి సార్ధకతం జెందు.

(10) మానవుడు పుష్పరాశినుండి సహస్రానుసహస్రంబులగు పుష్పమాలల నేరీతి సిద్ధముసేయ సమర్థుండగునో, అదియేచందమున నొక్కసారి జీవితధారణము జేసినంతమాత్రింబున నే నరు డనేక సద్గుణముల సంప్రాప్తింపజేసికొన శక్తుడగుచున్నాడు.

(11) పుష్పసౌరభముగాని, చందనాగరు కర్పూరాది సుగంధద్రవ్య నిర్గతసౌరభముగాని మారుతగతికి విరుద్ధంబుగ నేగజాలదు. కాని సత్పురుషుని సచ్ఛీలముయొక్క సత్కీర్తి యనెడి సుగంధము ప్రచండవాయువేగమునకుసహితము ప్రతికూలముగ శరవేగంబున నరుగగలదు. సజ్జనుని పరిశుద్ధంబగు జీవితము సర్వవ్యాపకమయి యొప్పారుచుండును.

(12) చందనాగరు కర్పూరాది ద్రవ్యములయొక్కయు మల్లికాదికుసుమముల యొక్కయు సుగంధముకంటె సత్పురుషు

ని సౌజన్య సౌరభము వేయిమడుంగు లుత్తమము. ఇద్దానిపాశి
స్త్యమును మానవు డభినుతింపజాలడా.

(13) పుష్పాదిసుగంధ మతినీచము. సజ్జనపురుషుని
సత్కీర్తి సౌరభమత్యుత్తమ కతమయందు బరిగణింపబడుచున్న
యది. ఇయ్యది స్థానభేదంబు లేక సమస్తలోకంబుల వ్యాప్తమ
గుచుండును. ఇద్దానికి దుర్గమస్థానములేదు.

(14) సదాచార సంపన్నుండును, విచారశీలుండును,
జ్ఞానాధారంబున బంధనవిముక్తి నందినవాడును సైతానువలన
నెట్టిస్థితియందును భయభీతుడు కాజాలడు. మారుడే స్వయ
ముగా నట్టి ధీమంతుని చపలంబగు చిత్తముపై స్వాధికారము
నెఱపువాడు గాంచి, భయాకాంతుడయి, దిగ్గున బిక్క
బలముజూపును.

(15) మార్గమధ్యమున బడియుండు మలినరాసుల
యందు గమల ముదయించి, యేవిధముగ నిజసౌరభకాంతుల
నల్దెసల వ్యాపింప జేయుచుండునో, అదియేమాడ్కి చరిత్ర
భ్రష్టులును, జ్ఞానగంధదూరులునగుమూఢజనావళులయందు
బౌద్ధసన్యాసి స్వకీయ సత్యధర్మజ్ఞానపరికాశ ప్రభావంబున పరి
శుద్ధ వైభవోపేతుడయి వెలయుచుండును.

పుష్పవర్గము పరిసమాప్తము.



## బాలవగ్గో.

దీఘా జాగరతోర త్తి దీఘం స న్తస్స యోజనం,
దీఘో బాలానం సంసారో సద్ధమ్మం అవిజానతం. ౧

చరంచే నాధిగచ్ఛేయ్య సేయ్యం సది సమ త్తనో,
ఏకచరియం దళ్హం కయిరా నత్థి బాలే సహాయతా. ౨

పుత్తా మఽత్థి ధనం మఽత్థి ఇతిబాలో విహఞ్ఞతి,
అత్తాహి అ త్తనో నత్థి కుతో పుత్తా కుతో ధనం. ౩

యోబాలో మఞ్ఞతి బాల్యం పణ్డితోవాపి తేన సో,
బాలో చ పణ్డితమానీ సవే బాఽలోతి వుచ్చతి. ౪

యావజీవంఽపి చే బాలో పణ్డితం పయిరుపాసతి,
ఖిప్పం ధమ్మం విజానాతి దబ్బీ సూపరసం యథా ౫

ముహు త్తమపి చే విఞ్ఞూ పణ్డితం పయిరుపాసతి,
ఖిప్పం ధమ్మం విజానాతి జివ్హా సూపరసం యథా. ౬

చర న్తి బాలా దుమ్మేధా అమి త్తేనేవ అ త్తనా,
కరోన్తా పాపకం కమ్మం యం హోతి కటుకప్ఫలం. ౭

నతం కమ్మం కతం సాధు యంకత్వా అనుతప్పతి,
యస్స అస్సు ముఖో రోదం విపాకం పటిసేవతి. ౮

తంచ కమ్మం కతం సాధు యం కత్వా నానుతప్పతి,
యస్సపతీతో సుమనో విపాకం పటి సేవతి

మధు వా మఞ్ఞతీ బాలో యావ పాపం నపచ్చతి,
యదాచ పచ్చతీపాపం అథబాలో దుక్ఖం నిగచ్ఛతి. ౧౦

మాసే మాసే కుసగ్గేన బాలో భుఞ్జేథ భోజనం,
నసోసఙ్ఖత ధమ్మానం కలం అగ్ఘతి సోళసిం. ౧౧

నహి పాపం కతం కమ్మం సజ్జుఖీరంఒవ ముచ్చతి,
డహన్తం బాల మన్వేతి భస్మచ్ఛన్నోఒవ పావకో. ౧౨

యావదేవ అనత్థాయ ఞత్తం బాల స్సజాయతి,
హన్తి బాలస్స సుక్కంసం ముద్ధ మస్స విపాతయం. ౧౩

అసతం భావన మిచ్ఛేయ్య పురేక్ఖారంచ భిక్ఖుసు,
ఆవాసేసుచ ఇస్సరియం పూజా పరకులేసుచ. ౧౪

మమేవ కత మఞ్ఞన్తు గిహీ పబ్బజితా ఉభో,
మమేవ అతివసా అస్సు కిచ్చాకిచ్చేసు కిస్మిచి,
ఇతి బాలస్స సఙ్కప్పో ఇచ్ఛామానోచ వడ్ఢతి. ౧౫

అఞ్ఞాహి లాభూపనిసా అఞ్ఞా నిబ్బాణగామినీ,
ఏవ మేతం అభిఞ్ఞాయ భిక్ఖు బుద్ధ స్ససావకో;
సక్కారం నాభి నన్దేయ్య వివేక మనుబ్రూహయే. ౧౬

ఇతి బాలవగ్గో పఞ్చమో.

---

బాలకవర్గము (మూఢవర్గము)

శ్రీబుద్ధభగవానుని ప్రియశిష్యుండగు నానందు డొక దివసము బద్ధాంజలియయి, మూఢామూఢజ్ఞాన తత్వప్రబోధ ప్రసాదప్రాప్తికయి, భక్తిరసముట్టిపడ, గురుదేవు నిట్లు పృచ్ఛిం

చెను :— "పూజ్య గురుదేవా! మూఢుడన నెవండు? నిర్వ్యా జకృపాంతఃకరణులగు తమ రీవిషయమును, నాకు బ్రబోధము సేయుడి. జనులు ప్రాయికంబుగా దమతమ వచనంబుల బాటిం పనివారిని మూఢులని దూరుచుందురు. ఏతచ్ఛబ్దము నుచిత రీతిని బ్రయోగింప ననుకూలమార్గమును జూపించి, దాసాధ ముని వినమ్రనివేదనమును సార్థకము సేయ వేడుచున్నాడ." అంత బుద్ధభగవాను డీచందమున నుపన్యసింపదొడంగెను :— "అనుంగు బిడ్డా! నేజెప్పువిషయ మాకర్ణింపుము :—

(1) రాత్రి జాగరము సేయువానికి ఘటికాసమయంబు సహిత మొక్కయుగముంబోలె దోచుచుండును. అట్టివానికి రాత్రి గడచుటయే దుర్లభంబుగనుండును. కఠినపరిశ్రమచే నలసియున్నవానికి ముందంజవేయుటయే కష్టముగనుండును. ధర్మతత్వజ్ఞానశూన్యుని జీవితకాలమునందలి యొక్కొక్క నిమేష మొక కల్పమయి కడచును.

(2) ప్రయాణము సేయుతఱి మార్గమధ్యమున బథికు నకు దన్నుబోలునట్టి వ్యక్తికాని, తన్నుమించిన యుత్తమ విద్వాంసుడుగాని లభింపనిచో, ప్రయాణికుడు దృఢసంకల్ప చిత్తుడయి, పరుల సాహాయ్యము నపేక్షింపకయే, గమ్య స్థానముజేరు టుచితము. గతంబెద్దియన మూర్ఖులతోడి మైత్రి మ పృనకు మూలకారణమగును. మూఢజనసాంగత్యము నభి

లభించుటకంటె సుహృద్వ్యవహారరహితుడయి, మెలంగుటయే శ్రేయస్కరము.

(3) "వీరు నాయాత్మజులు, ఇది నా ధనధాన్యసంపత్తి" మూర్ఖమానవుండిట్టి స్వార్థమయంబులగు సంకుచితభావముల చేతనే సంతతము వ్యథితుడగుచుండును. నాదియని శరీరముపై నభిమానము గల్గియుండు మానవుడు మహామూఢుడు. వాస్తవమాలోచించిన దేహముపై మానవున కెంతమాత్రము స్వత్వము లేదు. అట్టిస్థితియందు పుత్రకళత్రబంధుమిత్రాది వర్గమును, ధనధాన్యైశ్వర్యసంపదలును మానవుని కెట్లు సంబంధింపగలవు? నిత్యము దేవతగా నర్పించు శరీరమేబూటకమయినపుడు నరునకు సంసారమందలి సమస్తముమిథ్యయే. ప్రాపంచికులు సత్యమని భావించునదియే యసత్యము.

(4) మూఢమానవుడు తనయవివేకమును గ్రహింపగల్గుచో నదియొకపక్షమున నుత్తమమనియే చెప్పనొప్పు. మూఢుడయియుండియు దన్ను దానే వివేకసంపన్నుండుగ మది భావించుకొను మూర్ఖుడే నిశ్చయముగ భ్రష్టాచార్యుడు. ప్రథమవ్యక్తియే ద్వితీయునికంటె నుత్తముడు.

(5) షడ్రసయుక్తములగు శాకపాకముల సర్వకాల సర్వావస్థలయందు గలసిమెలసియుండుగరిటె యెట్లు రసాస్వాదనము గావింపజాలదో, అదియే చందమున నవివేకి జీవనాంత

ముపర్యంతము వివేకసంపన్నులతో గలసి మెలసి యుండినచో ధర్మతత్వజ్ఞాన రసాస్వాదనము సేయనశక్తుం డయియుండును.

(6) రసనేంద్రియ (జిహ్వ) మెట్లు షడ్రసోపేత భోజన స్పర్శమాత్రంబున దదంతర్గతరసాస్వాదనమును గ్రహింపగలుగుచున్నయదో, అదియేరీతి యుక్తాయుక్త విచక్షణ జ్ఞానసంపన్నుండగు వ్యక్తి యల్పకాలంబునందే విద్వాంసుని సాంగత్యసౌభాగ్యమును బడసినచో, సత్యానుభవము బడయగలడు.

(7) అల్పవివేకముగల మానవుడు తనకుదానే బద్ధశత్రువు. కారణమేమన నట్టివాడు కుఫలములనొసంగు దుష్క్రియ లనారత మాచరింపుచుండును.

(8) దుఃఖము నుత్పన్నముసేయు ధర్మ మేయవస్థయందును సర్వోత్కృష్టముగా భావింప వలనుపడదు. తాత్పర్యమేమనగా పరిణామప్రాప్తికాలమున గన్నీటిధారల బ్రవహింపజేయు ధర్మ మతినికృష్టము.

(9) కార్యానంతరము అనగా పరిణామకాలంబున బశ్చాత్తాపము నొదవజేయక, పరమహర్షము నుద్భూతముసేయు ధర్మమే సర్వోత్తమభావ సంహితము. సద్ధర్మానుకూల కార్యాచరణంబున మానవు డత్యంత ప్రసన్నచిత్తుడగును. అట్టిధర్మము దుఃఖబాష్పధారలకు మారుగ నానందబాష్పధారల స్రవింప జేయును

(10) దుష్కార్యము, దుష్పరిణామమును బలిదానము సేయకుండునంతపర్యంతము మూఢునకు దుష్కృత్యమే యాలాకికానందప్రాప్తి నిడుచున్నట్లు లుండును. కాని దుష్కర్మ, ఫలోన్ముఖమయినపుడు మూర్ఖుడు నెత్తి బాదుకొని, ఘోరముగ దురపిల్లును.

(11) మూఢు డెవడయిన మహాత్యాగపురుషుని చందాన శుష్కతృణభోజనమునే స్వీకరించి, జీవితనిర్వాహణము సేయుచున్నను, ధర్మపథానుగామియగు సత్పురుషుని యంశములో షోడశాంశమయిన బోలియుండడు.

(12) తత్క్షణమే పితికిన గోదుగ్ధ మేరీతి బరిశుద్ధమయియుండి, సత్వరము దూషితముకాదో లేక శీఘ్రమే దధిరూపమును దాల్పజాలదో, అదియేమాడ్కి దుష్కార్యము శీఘ్రకాలమునందే కుఫలముల నొసంగజాలదు. కాని యది (అనగా దుష్పరిణామము) భస్మమధోభాగంబున డాగియుండు ప్రచండపావకము చందమున, మూఢుని వెంటాడుచునే యుండుట వాస్తవము.

(13) దుష్కార్యపరిణామ రహస్యము సువ్యక్తమయిన యనంతరము మూర్ఖునకు కేవలమాత్మగ్లానియే కాక తన్నావరించియున్న సద్భావసౌఖ్యము సహితము నష్టభ్రష్టమగుడు, నతని కృషియంతయు బూడెబోసిన పన్నీటిచందమగును. దుఃఖభారముచే నంతమునకు మూర్ఖుని జీవితభాండము శతథా భిన్నమయి నశించును.

(14) వివేకశూన్యుఁడనవరత మధర్మసంగతముగ గీర్తి నపేక్ష సేయుచుండును. భిక్షుమండలి కధినాధుఁడుగావలయునని యెడి వాంఛ యతనిహృదయము నెల్లపుడు బాధింపుచుండును. మఠాధిపత్యమునకయి యామూర్ఖుఁడు నిత్యము విశ్వప్రయత్నముల సలుపుచుండును అట్టి మూఢవ్యక్తి యెప్పుడును బరజనాదరప్రాప్త్యభిలాషయే యుల్లంబున బల్లవింపుచుండును. అనగానందని పండ్లకయి యఱ్ఱు చాచును.

(15) గృహస్థుఁడుగాని, సర్వసంగపరిత్యాగి యగు సన్యాసికాని "ప్రాయికంబుగా కార్యము సలుప నభిలషించువారెల్లరు మత్కథనానుసారంబుగ జనులెల్లరు వర్తింతురు గాత" మ్మనియెడి దురభిమానమును, మూఢభావమును గల్గియుండరాదు. ఏతద్దురభిమానభావస్వీకారంబున మానవున కహంకారతృష్ణ లభివృద్ధిజెందును.

(16) ఒకపథము కామినీకాంచనాదుల వైపునకును, వేరొండుతెన్ను వినిర్మల నిర్వాణపథ పార్శ్వంబునకును గొనిపోవును. బుద్ధుఁడగు భిక్షు వీమర్మమును గుర్తెఱుంగ శక్తుండగుచో, నతడు కల్పితప్రతిష్ఠకయి కృషిసలిపి, వెతలంబడ నొల్లఁడు. కేవలము నశ్వరసంసారసాగర తరణమున కవిరళ కృషి సలుప నుద్యుక్తుఁడగుచుండును.

బాలవర్గము పరిసమాప్తము.



## పణ్డితవగ్గో.

నిధీనంఽవ పవత్తారం యం పస్సే వజ్జదస్సినం,
నిగ్గయ్హవాదిం మేధావిం తాదిసం పణ్డితం భజే;
తాదిసం భజమానస్స సేయ్యో హోతి నపాపియో. ౧
ఓవదేయ్యాను సాసేయ్య అసబ్భాచ నివారయే,
సతంహి సో పియో హోతి అసతం హోతి అప్పియో. ౨
నభజే పాపకే మిత్తే నభజే పురిసాధమే,
భజేథ మిత్తే కల్యాణే భజేథ పురిసుత్తమే. ౩
ధమ్మపీతి సుఖం సేతి విప్పసన్నేన చేతసా,
అరియప్పవేదితే ధమ్మే సదా రమతి పణ్డితో. ౪
ఉదకం హి నయన్తి నేత్తికా
ఉసుకారా నమయన్తి తేజనం,
దారుం నమయన్తి తచ్ఛకా
అత్తానం దమయన్తి పణ్డితా. ౫
సేలో యథా ఏకఘనో వాతేన నసమీరతి,
ఏవం నిన్దాపసంసాసు న సమిఞ్జన్తి పణ్డితా. ౬
యథాఽపి రహదో గంభీరో విప్పసన్నో అనావిలో,
ఏవం ధమ్మాని సుత్వాన విప్పసీదన్తి పణ్డితా. ౭
సబ్బత్థ వే సప్పురిసా చజన్తి
నకామకామా లపయన్తి సన్తో,

సుఖేన ఫుట్ఠా అథవా దుఖేన
న ఉచ్చావచం పణ్డితా దస్సయన్తి. ౮

న అత్తహేతు నపరస్స హేతు
నపుత్త మిచ్ఛే నధనం రట్ఠం,
న ఇచ్ఛే అధమ్మేన సమిద్ధిమత్తనో
ససీలవా పఞ్ఞవా ధమ్మికో సియా. ౯

అప్పకా తే మనుస్సేసు యే జనా పారగామినో,
అథాయం ఇతరా పజా తీరమేవానుధావతి. ౧౦

యేచ ఖో సమ్మదక్ఖాతే ధమ్మే ధమ్మానువత్తినో,
తే జనా పార మేస్సన్తి మచ్చుధేయ్యం సుదుత్తరం. ౧౧

కణ్హం ధమ్మం విప్పహాయ సుక్కం భావేథ పణ్డితో,
ఓకా అనోకం ఆగమ్మ వివేకే యత్థ దూరమం. ౧౨

తత్రాభిరతి మిచ్ఛేయ్య హిత్వా కామే అకిఞ్చనో,
పరియోదపేయ్య అత్తానం చిత్తక్లేసే హి పణ్డితో. ౧౩

యేసం సమ్బోధి అఙ్గేసు సమ్మా చిత్తం సుభావితం,
ఆదాన పటినిస్సగ్గే అనుపాదాయ యేరతా,
ఖీణాసవా జుతీమన్తో తే లోకే పరినిబ్బుతా. ౧౪

ఇతి పణ్డిత వగ్గో ఛట్ఠో.



## పండితవర్గము.

ఒకదివసము శ్రమణు లనేకులొకచోట నేకత్రితమయి యుండిరి. పరమాత్మస్వరూపుండగు బుద్ధచంద్రుఁ డొకయున్నతాసనము నధిష్ఠించియుండెను. తత్సమయమునం దొకవిప్రవర్యుఁ డటకేతెంచి, భక్తివినయమ్ముల లొక్కుమ్మడి ముప్పిరిగొన, కృతాంజలియయి, దేవునితో నిట్లు నివేదించెను:— "ఓపాపభంజకా! చిత్తానురంజకా! యోయతిచంద్రమా! నేఁడు తమరు పండితులగూర్చియు, వివేకసంపన్నులగు శ్రేష్ఠపురుషవరేణ్యుల గుఱించియు, విశదముగ దాసులమగు మాకుబోధించి, మమ్ముఁ గృతార్థుల జేయుఁడి. నిజహితోపదేశ వాగమృతధారల మాకు గ్రోలఁ బ్రసాదింపుఁడి మేము పండితులయొక్కయు, జ్ఞానాఢ్యులయొక్కయు వాస్తవికస్వరూపంబుల గుర్తెఱుంగుటెట్లు? జ్ఞానపథ మేరీతి గ్రహింపబడగలదు!" అంత బుద్ధదేవుఁ డీరీతి నుడువఁదొడంగెను:—

"కుమారా!

(1) అక్షయానంద (సత్యధర్మము) భండారముయొక్క యథార్థమగు స్వరూపమును బ్రత్యక్షమొనరింప శక్తుండగు నొకానొక వివేకసంపన్నుఁడగు పండితునితో బరిచయము నీకు దటస్థించిన, నీవేమి సేయవలయునో తెలియునా? త్యాజనీయములగు విషయముల నిషేధింపవలసినదిగా నీకతఁడు బోధించిన గాని, లేక నిన్ను ధిక్కరించిన గాని, క్రోధాంధుఁడవు కాక

వాని, ననుసరించిపోవుటయే శ్రేయస్కరము. ఎప్పటికయిన నట్టి వివేకవంతు ననుకరించుటవలన నీకు భావాతీతంబగు సద్గతి మే సంప్రాప్తమగును గాని స్వప్నమందయిన నీతికి భిన్నంబుగ హాని వాటిల్ల నేరదు. అట్టి వివేకసంపన్నుని సేవా శుశ్రూష నిరతియే నీవిధ్యుక్తధర్మము.

(2) ఆపండితుని తిరస్కారవచనముల, నత్యంతశాంత భావముతో నాకర్ణింపుము; వాని యుపదేశముల జెవియొగ్గి, యతిశ్రద్ధాళుడవయి, యాలకింపుము. నీయందు వేరువాటి యున్న దుర్భావముల దూరీకృతము గావింప నిమ్ము; స్వాత్మ సంస్కారమునకు నీకాస్కారము లేదు. సత్పురుషుడయిన ప్రతిమనుజుడు వివేకవంతుని సాంగత్యంబున బ్రాప్తించు మహల్లాభమును గ్రహించి, తత్పురుషు నారాధించును. కాని దుర్జనుడీ మర్మమును గ్రహింపజాలక వానిని దూరుచు, నిజ హితదూరుడయి, భ్రష్టత్వమునకు బాల్పడును.

(3) దుష్టుని (చరిత్ర భ్రష్టుని) తోడి సాంగత్యము దుఃఖమునకు జేటు. పొరబడియయిన నీచప్రకృతిగల మానవుని నేస్తముగా జేసికొనరాదు. అభ్యుదయమునకు సజ్జనసాంగత్యమే పరమావశ్యకము. మానవు డనారతము సర్వోత్తమాచరణ సంయుతుడగు పండితునే సుహృద్వరునిగా బడయవలయును. సర్వారసౌఖ్యముల నాశించి, దుష్టసాంగత్యమునకు

గడంగువాని జీవితము దూషితమయి పునరుద్ధరింపబడుట కష్ట సాధ్యమగును.

(4) జ్ఞానసాగరమున నీదులాడు వ్యక్తియే స్థిరసంకల్ప చిత్తుడయి, సుఖపురస్సరంబుగ జీవితయాత్రను సాగింపగలడు. ఆర్యజనప్రోక్త ధర్మోపదేశానుకూల సత్పథస్వీకారమే మానవున కమితానందము నొడగూర్చును.

(5) కాలువ త్రవ్వువా డెట్టుల నిచ్చవచ్చిన తెఱంగున నీటిని ప్రవహింపజేయగల్గుచున్నాడో, కోదండమును నిర్మించువా డేభంగి వద్దానిని వక్రముగా సిద్ధమొనరింపగల్గుచున్నాడో, వడ్రంగి యేరీతి గొయ్యపదార్థమును గాంక్షితాకృతికి దీసికొనిరాగల్గుచున్నాడో, అదియేప్రకారముగా బుద్ధిశాలి లేక ధీమంతుడగు వ్యక్తి నిజమనోభీష్టానుకూలంబుగ దన జీవితభవనమును నిర్మాణమొనరింప శక్తుడగుచున్నాడు.

(6) సుస్థిరంబయిన గిరిరాజము నెట్లు ఝంఝామారుతము చలింపజేయజాలదో అదియేచందమున మూఢజన నిందాస్తవములు ధీమంతుని ధీరహృదయమును సంక్షుభితమొనరింపజాలవు. పండితునకు లౌకిక దూషణభూషణ తిరస్కారంబులతో నిమిత్తములేదు.

(7) ధీమంతుడగు పండితుడు సద్ధర్మోపదేశ శ్రవణానంతరంబు గభీరంబును, సమతలంబును, సుస్థిరంబును నగు

సరోవరముభాతి పరమశాంతచిత్తుడయి, యీషణ్మాత్రమయిన ప్రాపంచికపరిస్థితుల నవలోకించి చలింపకయుండును.

(8) విషయభోగతృష్ణాభిలాషచే బరిస్థితులెట్లు పరివర్తనము జెందినను, పండితుడగు సత్పురుషుడు స్వకార్య నిర్వహణార్థ మనుదిన మనూనోత్సాహముతో ముందంజవే వేయుచుండును. అసంబద్ధప్రలాపము (వితండవాద వివాదము) లనేయ నభిలషింపడు. సుఖదుఃఖములయందు బండితుడగు వ్యక్తి గర్వవిషాదములకు మదియందు సుంతయు దావొసంగజాలడు. అట్టి ప్రజ్ఞావంతుడు సుఖదుఃఖముల రెంటిని జననమరణములభాతి సహజముగ బ్రాణికోటికి సిద్ధించు సౌభాగ్యములేయని సంభావించును.

(9) నిజోత్థానమునకయి, అధర్మసంగతముగ జరించి, వనితావిత్తాధికృతలను సంతానమును బడయ వాంఛగల్గియుండని వ్యక్తియే మహాపండితుడు, సాధువు జ్ఞాని లేక ధర్మాత్ముడు.

(10) భవసాగరతరణంబుగావించి, పరిశుద్ధ సంపూర్ణజ్ఞానపదవి నలంకరించి సత్పురుషుల సంఖ్య యీ ధరణీ మండలమున బహుస్వల్పము విశేష సంఖ్యాకు లగుప్రాపంచకు లీయపార సంసారపారావారమునుండి దరింప శక్తిలేనివారలయి, తీరమున నేభ్రమణము సేయుచుందురు. అట్టివారికి భవాబ్ధి దరించిపోవగాంక్షయే యొదవుట సంభవము. ఒక్కడ నభిలాష

యొదవినను శక్తియుండదు. పక్షవిహీనంబగు విహంగ మెగుర నేర్చునా?

(11) ధర్మరహస్యంబును గ్రహించి, తద్రహస్యాను కూలంబుగ జరించువ్యక్తి కాలుని దుర్గమదుర్గపరివేష్టితంబగు విశాల సామ్రాజ్యమును సహితము దాటిపోవ సమర్థుండగుట యథార్థము.

(12) వివేక సంపన్నుండగు వ్యక్తి, సర్వసాధారణ మానవోచిత జీవితాంధకారబంధురావస్థను వీడి, భిక్షుపదప్రకాశవిలసిత జీవనధారణంబుసేయుట యుక్తము; ఆనంద ప్రదము. గృహస్థాశ్రమమునుండి వియోగమును బడసిన యనగా బంధుమిత్రపుత్రకళత్రాది వ్యామోహ బంధనవిముక్తుండయినపిదప మానవుడు శ్రమణధర్మానుష్ఠానురాగ పరిపూర్ణహృదయుఁడగుటయే హితకరము. అంతటితో మనస్తుష్టినందక, నిర్జనప్రదేశంబున గూరుచుండి, సద్భావంబుల సంపూర్ణానందానుభవము జెందుటుచితము. అట్టివ్యక్తి సమగ్రసంసారజనిత విషయవాసనా పరిత్యాగంబు గావించి, "నా పదార్థము, నా సంపత్తి" యను నహంకార మమకారాది మిథ్యాభిమానమును రోసి, త్రికరణముగ సమస్తవిధ మానసిక పరితాపములబాసి, యిలాతలంబున వర్తించుట యుత్తమము. ఇయ్యది గృహాది సాంసారిక సంబంధముల బరిత్యజించు సాధుపుంగవుని సద్ధర్మము.

(13) వినిర్మల జ్ఞాన సప్తతత్వజనిత ప్రకాశభాసురహృద యుండగు వ్యక్తికిని, ప్రపంచాశాశ్వత సుందరపదార్థ సందోహ సందర్శనసంభూత వ్యామోహమునకు వశీభూతుడుగాక నివృత్తియందే నిర్మలంబగు నిత్యానందానుభవమునందు వ్యక్తికిని విషయవికారదూరునకును, సుజ్ఞానభావపరీత హృదయునకును సంసారమునందే, జీవితావస్థయందే ముక్తి లభించును. ఇద్దానినే జీవన్ముక్తియందురు అజ్ఞాన భావమండిత మానవహృదయంబే భయవిషాదంబులకు మూలోత్పత్తి స్థానంబుగాని సంసారక్షేత్ర మెంతమాత్రము గాజాలదు కేవలము ప్రపంచము నిమిత్తమాత్రమే యయియుండును.

పండితవర్గము పరిసమాప్తము.



అరహన్తవగ్గో

గతద్ధినో విసోకస్స విప్పముత్తస్స సబ్బధి,
సబ్బగన్థప్పహీనస్స పరిళాహో నవిజ్జతి. ౧

ఉయ్యుఞ్జన్తి సతీమన్తోన నికేతే రమన్తితే,
హంసాఽవ పల్లలం హిత్వా ఓకమోకం జహన్తితే. ౨

యేసం సన్నిచయో నత్థి యే పరిఞ్ఞాతభోజనా,
సుఞ్ఞతో అనిమిత్తోచ విమోక్ఖో యస్స గోచరో;
ఆకాసేఽవ సకున్తానం గతితేసం దురన్నయా. 3

యస్సాసవా పరిక్ఖీణా ఆహారేచ అనిస్సితో,
సుఞ్ఞతో అనిమిత్తోచ విమోక్ఖో యస్స గోచరో;
ఆకాసేఽవ సకున్తానం పదం తస్స దురన్నయం. ౪

యస్సిన్ద్రియాని సమథం గతాని
అస్సా యథా సారథినా సుదన్తా,
పహీణమానస్స అనాసవస్స
దేవాఽపితస్స పిహయన్తి తాదినో. ౫

పథవీ సమో నో విరుజ్ఝతి
ఇన్దఖీలూపమో తాది సుబ్బతో,
రహదోఽవ అపేతకద్దమో
సంసారా నభవన్తి తాదినో. ౬

సన్తం తస్స మనం హోతి సన్తా వాచా చ కమ్మ చ,
సమ్మదఞ్ఞా విముత్తస్స ఉపసన్తస్స తాదినో. ౭

అసద్ధో అకతఞ్ఞూచ సన్ధిచ్ఛేదోచ యో నరో,
హతావకాసో వన్తాసో సవే ఉత్తమపోరిసో. ౮

గామేవా యదివారఞ్ఞే నిన్నేవా యది వాథలే,
యత్థారహన్తో విహరన్తితం భూమిం రామణేయ్యకమ్.
రమణీయాని అరఞ్ఞాని యత్థ న రమతీ జనో,
వీతరాగా రమిస్సన్తి నతే కామగవేసినో.

ఇతి అరహన్త వగ్గో



## అర్హతవర్గము (పూజ్యవర్గము)

సమస్త లోకాంధకారపుంజ వినాశకుండగు భాస్క-
రుడు నిజప్రయాణము జాలించి యస్తాద్రి నధిరోహింప నరుణ
వర్ణ భాసురపటసజ్జితుడయి సంసిద్ధముగ నుండెను. ఉదరపోషణ
మున కాహారోపార్జనార్థ మన్యత్ర సంచరింప నరిగిన విహంగ
బృందము కలకలనినాదముల నవ్యక్తముగ, కర్ణరసాయనంబు
జేయుచు వృక్షోపరిభాగంబుల విరాజిల్లు నిజవాసంబుల జేరు
చుండెను. బాలబాలికలందరు నుపాధ్యాయుల బంధనములనుం
డి విముక్తినంది గ్రామబాహ్యసీమల జిత్రవిచిత్రముగ బాల్య
క్రీడల దవిలియుండిరి. పశులకాపరులు సంధ్యాసమయం బయ్యె
గదాయని తమతమ పశుబృందముల స్వనికేతనములకు మర
లించుకొని వచ్చుచుండిరి. గ్రామస్థిత గృహమాలికాపటల
విరాజిత ఛిద్రోద్గత ధూమ్రపుంజములు గ్రామజనదర్శ
నేంద్రియ ప్రభావమును క్షీణింపజేయుచు సంధ్యాసమయాగ
మన సూచన నొసంగుచుండెను. పలుపలుకులేల? గోధూళివేళ
శ్రీబుద్ధభగవాను డాసమయమున కాగ్రామ మేతెంచెను.
శ్రీబుద్ధచంద్రాగమన శుభవార్త శ్రుతిపుటంబుల బడినంతనే
పరమహర్షిత స్వాంతులరయి, తద్గ్రామవాస్తవ్యులెల్ల రయ్యెడ
కరుదెంచి, దేవుని పవిత్ర వాక్సుధా రసాస్వాదనాప్రబలాభి
లాషను వెల్లడించిరి. దివసమంతయు బ్రచండసూర్యాతపంబున
శ్రమయనక సంచారమొనరించియున్నకతన శ్రీచరణకమలయు

గ్రమము ధూళిధూసరితమయి యుండెను. వదనారవిందము ఘర్మ బిందు సందోహావృతంబయి, గత డొకింత దీర్ఘప్రయాణము సలిపి యలసియున్నట్టి సూచన నిచ్చుచుండెను. అచ్చోటి కేతెంచిన గ్రామవాసులలో బ్రిథాను లత్యంత భక్తిపురస్సరంబుగ దేవుని పాదప్రక్షాళనము గావించిరి. తదనంతరము బుద్ధభగవానుడే జలపాత్రమును గైకొని స్వేదకణవిలసితంబులగు హస్తద్వయమును, వదనారవిందమును శుభ్రపఱచికొని యర్హత్వర్గమునుగూర్చి యిట్లుపదేశింప నారంభించెను:—

(1) ఎవ డీలోకయాత్రను బరిపూర్ణము గావించి మించెనో, ఎవ్వాడు భయవిషాదముల సంపూర్ణముగ నెడబాసి యున్నాడో, ఏనరోత్తముడు సమస్తవిధంబుల స్వీయేంద్రియముల సంయమంబున వశము గావించుకొనియున్నాడో, ఏమనీషి సమస్తవిధంబుల స్వేచ్ఛానువర్తియో, ఏమానవుడు సాంసారిక వ్యామోహబంధనముల మూలోచ్ఛేదన మొనరించియున్నాడో, అట్టి యుత్తమపురుషవరేణ్యునకు స్వప్నావస్థయందయిన హాని వాటిల్లుట కల్ల.

(2) అట్టి యుత్తమపురుషునకు వ్యామోహాభావపరీతంబగు గృహమున వాస్తవికంబును, సుస్థిరంబునునగు సౌఖ్యము లభింపని హేతువుచే, గొంతదవ్వు దీర్ఘముగా విచారించి యం

తమున కతడు గృహమును, రాయంచ పంకిలరుయంబగు సరో వరమునువీడుచందమున నిశ్శంకితమతియై బహిష్కరించును.

(3)అర్థమును సంపాదింపనభిలషింపక పరోపకారపారీణులౌనగు సాధారణాహార స్వీకారంబుననే జీవికను సాగించుకొను నుత్తమపురుషు డాత్మను వశము గావించుకొని, నిర్వాణము ననతికాలమునందే బడయగలుగుచున్నాడు. అట్టిపుణ్యపురుషుని తత్త్వము తారకాపథమున విహరించు విహంగ గమనసదృశంబుగ దుర్గ్రాహ్యమయి యుండును.

(4) విషయవాసనాగ్ని నుపశమింపజేసినట్టియు, విషయ భోగాభిలాషా రాహిత్యమున వర్తించునట్టియు, సంపూర్ణ స్వేచ్ఛాపరతంత్రభావ సంశోభితుడయినట్టియు నుత్తమపురుషుని వ్యాపారము వాయుమండలమున సంచారమొనరించు పక్షులగతిని బోలి యూహాకందరానిదయి యొప్పుచుండును.

(5) మదాశ్వమును మచ్చికకు గొనువచ్చురీతి జంచలతమంబులగు స్వేంద్రియముల దమనము గావింప గల్గినట్టియు, అభిమానశూన్యతయందే యాత్మానందమును బడయునట్టియు, విషయవాసనాబీజముల హృదయక్షేత్రమునుండి సమూలముగ విధ్వంస మొనర్పగల్గినట్టియు నుత్తమపురుషుడు లేక యర్హుడు పడయు మహోన్నతపదవి నవలోకించి సుర

బృందము సహితము స్పర్థించును. కాని తమ శక్తిని మించిన నలౌకికంబగు సామర్థ్యమును గల్గియుండుటంజేసి యమరులవ్వాని సమ్ముఖంబున నిలువనయిన సమర్థులు కారు.

(6) ఉపర్యుక్త సద్గుణగణవిరాజితుండగు కర్తవ్య పరాయణోత్తమ వ్యక్తి భూదేవిచందమున ననూనంబగు సహనశీలతను గల్గియుండి బురదలేనట్టి తటాకమువలె నిర్మలముగను, శాంతముగను నుండును. అట్టివాడు పునర్జన్మకయి నిరీక్షింపవలసిన యావశ్యకతయే వాటిల్లదు. అట్టిపురుషోత్తముడు పునర్జన్మబంధనము నుండి విముక్తుడయి, యిహమునందే ముక్తిపదవికి బ్రాప్తించును.

(7) అట్టివానివచనములు, కర్మలు క్షోభారహితంబులగుడు, అనగా శాంతమయంబులగుటంజేసి యవ్వానిభావములు సహితము పరిశుద్ధములయి సుస్థిరత్వమును వహించియుండును. అట్టి శాంతచిత్తుడు సత్యజ్ఞానాసితీక్ష్ణాకుంఠితధారాప్రహారంబున దృటిమాత్రకాలమునందే మాయామయంబులగు సంసారబంధనముల నెల్ల ఖండించివేసి, మానియను పునీతపదవిని ధరించి, ప్రకాశించును.

(8) అంధవిశ్వాసరహితుండును, అస్పష్టంబును అవ్యక్తంబును నగు మోక్షము నవలోకింప సామర్థ్యముగలవాడును,

సమస్తవిధ బంధనవిముక్తుండును, సర్వకామదూరుండును నగు వ్యక్తి సృష్టసృష్టియందలి యుత్కృష్ట ప్రాణికోటియగు మానవ కోటియందు సర్వోత్తముడుగ బరిగణింప బడుచుండును. అట్టివానిచేతనే సృష్టి ప్రకాశింపగలదు.

(9) పైనజెప్పబడిన పురుషోత్తముఁడు జర్జరపత్రి నిర్మిత కుటీరంబున నివసించినను; భయంకరపర్వతారణ్య సాగరముల నధివసించినను లేక శుష్కప్రదేశంబున వాసమొనర్చినను నిత్య మచ్చోట బ్రహ్మానందమునే తన్మయుడయి యనుభవింపుచుం డును. అట్టి యుత్తమపురుషునిచే స్పృశింపబడిన ప్రదేశమెల్ల బ్రహ్మానందమున కధివాసమయి తనరారుచుండును.

(10) సాంసారికవ్యక్తికి అనగా విషయభోగానురక్తున కు స్వప్నమందయిన మచ్చునకయిన హర్షము లభింపని భయం కర పర్వతారణ్యములయందే నిర్వికారపురుషుని కలౌకికానంద ప్రాప్తి కలుగుచుండును. గతంబెద్దియన నట్టిపురుషునికై హాలౌ కిక సుఖాన్వేషణాసక్తి కలుగబోదు. అట్టివానికి బండయే బం గారమగును.

అర్హతవర్గము సమాప్తము

---

## సహస్సవగ్గో

సహస్సమపి చే వాచా అనత్థపదసంహితా,
ఏకం అత్థపదం సేయ్యో యం సుత్వా ఉపసమ్మతి. ౧

సహస్సమపి చే గాథా అనత్థపదసంహితం,
ఏకం గాథాపదం సేయ్యో యం సుత్వా ఉపసమ్మతి. ౨

యోచ గాథాసతం భాసే అనత్థపదసంహితా;
ఏకం ధమ్మపదం సేయ్యో యం సుత్వా ఉపసమ్మతి. ౩

యోసహస్సం సహస్సేన సఙ్గామే మానుసే జినే;
ఏకంచ జేయ్య మత్తానం సవే సంగామజుత్తమో. ౪

అత్తా హవే జితం సేయ్యో యాచాయం ఇతరా పజా;
అత్తద న్తస్స పోసస్స నిచ్చం సఞ్ఞత చారినో. ౫

నేవ దేవో నగన్ధబ్బో నమారో సబ్రహ్మునా,
జితం అపజితం కయిరా తథారూపస్స జన్తునో. ౬

మాసే మాసే సహస్సేన యో యజేథ సతం సమం,
ఏకంచ భావితత్తానం ముహుత్త మపి పూజయే;
సాఏవ పూజనా సేయ్యో యఞ్చే వస్ససతం హుతం. ౭

యోచ వస్ససతం జన్తు అగ్గిం పరిచరే వనే,
ఏకంచ భావితత్తానం ముహుత్తమపి పూజయే;

సా యేవ పూజనా సేయ్యా యఞ్చే వస్ససతం హుతం. ౮
యం కిఞ్చి యిట్ఠం వ హుతంఽవలోకే
సంవత్సరం యజేథ పుఞ్ఞపేక్ఖో,
సబ్బంఽపి తం న చతుభాగమేతి
అభివాదనా ఉజ్జుగతే సుసేయ్యా. ౯
అభివాదనసీలస్స నిచ్చం బద్ధాపచాయినో,
చత్తారో ధమ్మా వడ్ఢన్తి ఆయు వణ్ణో సుఖం బలం. ౧౦
యోచవస్ససతం జీవే దుస్సీలో అసమాహితో,
ఏకాహం జీవితం సేయ్యో సీలవన్తస్స ఝాయినో. ౧౧
యోచ వస్ససతం జీవే దుప్పఞ్ఞో అసమాహితో,
ఏకాహం జీవితం సేయ్యో పఞ్ఞావన్తస్స ఝాయినో. ౧౨
యోచ వస్ససతం జీవే కుసీతో హీనవీరియో,
ఏకాహం జీవితం సేయ్యో విరియ మారభతో దళ్హం,
యోచ వస్ససతం జీవే అపస్సం ఉదయవ్యయం,
ఏకాహం జీవితం సేయ్యో పస్సతో ఉదయవ్యయం. ౧౪
యోచ వస్ససతం జీవే అపస్సం అమతం పదం,
ఏకాహం జీవితం సేయ్యో పస్సతో అమతం పదం. ౧౫
యోచ వస్ససతం జీవే అపస్సం ధమ్మముత్తమం,
ఏకాహం జీవితం సేయ్యో పస్సతో ధమ్మముత్తమం.
ఇతి సహస్సవగ్గో.

## సహస్రవర్గము.

రాజగృహనగరమునకు సమీపమునందున్న బౌద్ధవిహార మందిరము దూరదూరమునుండి బుద్ధసందర్శనాభిలాషచే నేతెంచియున్న నసంఖ్యాకులగు బౌద్ధపరివ్రాజకులచే బరిపూర్ణమయి కడుకోలాహలముగా నుండెను. గృహస్థులు, సన్యాసులు, శిష్టులు, దుష్టులు వీరువారననేల? సమస్తవిధాస్థలయందున్న ప్రజలు తథాగతుని యమృతతుల్య వాగ్క్షీరరస పానాభిలాషచే గడునాతురతను బడుచుండిరి. తనయుపదేశముల నాలకింప గడుశ్రద్ధాభక్తులతో నిరీక్షించుచున్న ప్రజాసముదాయము నవలోకించి దయాసాగరుండును, ప్రాపంచికజనహృదయ వ్యాప్తాజ్ఞానాంధకారపటల ప్రభాకరుండును నగుబుద్ధదేవు డీచందమున నుదోబ్ధసేయ నుపక్రమించెను:—

(1) నాయనలారా? ఉపదేశము సహస్రానుసహస్ర మృదుమధురంబులగు శబ్దముల గల్గియున్నను, అతిదీర్ఘంబును గంభీరంబును నయి యొప్పుచున్నను నిరర్థకంబులగు పదముల తో సమ్మిశ్రితమయి యున్నచో నద్దాని కీషణ్మాత్రమయిన విలువలేదు. సార్థకభావ పరిపూర్ణమగు శబ్దమొక్కటియయినను మానవుని యస్థిరంబగు చిత్తమునకు శాంతిని బ్రసాదింపగలదు. కనుక నిరర్థకంబులగు వేయిపదములకంటె, సార్థకంబగు నొక్క పదమే శ్రేష్ఠతమము, శ్రేయస్కరము, సంపూజ్యము.

(2) ఒకగాథకాని యొకకవితకాని నిరర్థకశబ్ద నిబిడీకృతమయి యున్నచో నయ్యవి మూల్యరహితములై యొప్పుచుండును. వినువారి వీనులకు విందుగొల్పి, చంచలములగు చిత్తములకు శాంతి నొదవజేయు కవితయొక్క యొక్కపదము సహితమమూల్యము. ధీశక్తికి నూతనవికాసము గొలుపజాలని వేయికవితలకంటె నొక్క నీతిదాయకంబగు పదమే వేయిమడుంగు లుత్తమము.

(3) నిరర్థకంబులగు సహస్రశాస్త్రంబుల గంఠస్థము సేయుటకంటె మానవహృదయమునకు శాంతిని బ్రసాదింపగల్గు నొక్కశాస్త్రాంతర్గత నీతిపదమే శ్రేష్ఠము; లాభదాయకము. వేయివత్సరములు ధర్మహీనుడయి, జ్ఞానశూన్యుడయి, నీతిబాహ్యుడయి జీవించుటకంటె నిమేషమాత్రకాలంబు ధర్మాత్ముడయి, స్థితప్రజ్ఞుడయి, అచంచలుడయి మనుట యుత్తమము.

(4) సహస్రంబులగు సమరాంగణముల సహస్రసహస్ర మహాయోధుల బరాజితులగావించు యోధునికంటె మానవు నధోలోకంబునకు నిజచంచలప్రవృత్తులచే గొనిపోవు స్వకీయేంద్రియములపై నాధిపత్యము వహింపగల్గిన సంయమ చంద్రుడే యథార్థమగు వీరకేసరి.

(5) సోదరమానవుల నజ్ఞానవశంబున జయింప యత్నించుటకంటె, మానవుడు తన్నుదానే జయింపగోరుట యుత్త

మము. మానవుని భ్రష్టునిగావించునది తనయందలి ఘోర రిపులేకాని భ్రమచే శత్రువులని భావింపబడు సోదరమానవులు కారు.

(6) సురాసుర లోకమ్ములు విజృంభించి రావణుని చండప్రచండ యోధావళిని, మహేంద్రుని యపారసైన్య సాగరమును వెంటనిడుకొని వచ్చి యెదిర్చినను, సంయమపురుషుని విషయవికారవిహీనుని నిర్మలచిత్తుని ధర్మసంగ్రామమున బరాస్తుని గావింపజాలరు.

(7) మాసమాసము సహస్రంబులకొలది రూప్యముల విని యోగపఱచియు, కఠినపరిశ్రమ జేసియు, యజ్ఞయాగాదుల జేయుటకంటె గేవల మొక్క రెప్పపాటుకాలము సత్పురుషుని సేవాశుశ్రూషయందు దవిలియుండుట శ్రేయస్కరము, మోక్షప్రదము. సహస్రంబులకొలది జీవములబలిదానమొసరించి సచ్చిదానందస్వరూపమగు నిర్వాణము నందజూచుట వెఱ్ఱి.

(8) వేలకొలది వత్సరములు లటవీప్రాంతముల జపతపముల సేయుటకంటె గేవల మొక్క క్షణికమాత్రకాలంబు సుస్థిరభావ సంపన్నుడును, నిత్యానంద పరిపూర్ణహృదయుండును, విషయవికార దూరుండును నగు విద్వాంసున కభివందనము లాచరించుటయే సత్ఫలప్రదాయకము కాగల్గును. ఇద్దానిచే శాశ్వతానందకందమగు మోక్షము లభ్యమగును.

(9) ప్రాపంచికము లగు యజ్ఞయాగాదులు సహస్ర ములు గావించుట కుస్థిర చిత్తు నాదరించుటతో శతాంశమయిన సరిరాదు.

(10) వృద్ధులగు పురుషుల కనారతము నమస్కారము సేయుచు, వారి నత్యంతమగుభక్తితోడ సేవించుటంజేసి మానవుని వరించియుండు పదార్థచతుష్టయము (ఆయువు, సౌందర్యము, బలము, సౌఖ్యము) అనుదిన మభివృద్ధిజెందును వార్థక్యమున నుండువారికి హర్షము నొడవజేయుటయే యుత్తముండగు పురుషవిధి.

(11) సంయమపవిత్రానుష్ఠానానురాగ రాహిత్యంబున సహస్రవత్సరములు నశ్వరంబులగు సౌఖ్యముల ననుభవింపుచు మను మనీషి దీర్ఘజీవితముకంటె వివేకమును, సదాచారమును, నీతిని, సంయమమును గల్గియుండు మానవుని యొక్క నిమేషమాత్ర జీవితకాలమే యాదరాస్పదంబు, లాభదాయకంబు.

(12) మానవుడు అజ్ఞానపరీతచిత్తుడయి, సంయమపవిత్ర దూరుడయి సహస్రవర్షములు సజీవుడయి యుండుటకన్న ధీశక్తిని, వివేకమును గల్గి యొక్కనిముసమయిన జీవించుటయే యుత్తమము.

(13) మందుడయి, నిర్బలుడయి సహస్రవర్షములపర్యంతము బ్రదికియుండు మానవునికంటె నపరిమాటుడయి, ఆరోగ్యసంపన్నుడయి, వీర్యపటుత్వయుక్తుడయి జీవించు వ్యక్తి యొక్క దివసమాత్ర జీవిత కాలమే పరిశుద్ధమును, పరమానంద ప్రదమును నయి యొప్పుచుండును.

(14) ఆద్యంతవివేకశూన్యుడు నగా జననమరణక్లేశ గ్రహణశక్త్యనుకూల వివేచనారహితుడయి జీవించు వ్యక్తి యొక్క దీర్ఘజీవితంబుకంటె, జననమరణాది విషమసమస్యను గ్రహింప సమర్థుండగు మానవశ్రేష్ఠుని యొక్క దివసమాత్ర జీవితయాత్రయే శ్లాఘనీయమయినది.

(15) మృత్యుదేవతా సందర్శన భాగ్యదూరుడయి, నిర్వాణపద సుఖానుభవ విహీనుడయి సహస్రవర్షములపర్యంతము జీవించు నరునికంటె నిర్వాణము యొక్క పరిశుద్ధానంద సౌఖ్యానుభవశాలి యగు పురుషోత్తముని యొక్క ఘడియ కాలమే యుత్కృష్టమయినది.

(16) సహస్రవత్సరములు పరమపవిత్రంబగు బౌద్ధధర్మమును స్వీకరింపక సజీవుడయి యుండుటకంటె బౌద్ధధర్మావలంబియయి మానవుడొక్క నిముసమయిన బ్రదుకుటయే శ్రేయ

స్కారము. మానవుడు మరణించుటకు బూర్వమయిన బుద్ధుడ గుట విశేషపరియోజనీయమె.

సహస్రివర్గము పరిసమాప్తము



## పాపవగ్గో

అభిత్థరేథ కల్యాణే పాపాచిత్తం నివారయే,
దన్ధం హి కరోతో పుఞ్ఞం పాపస్మిం రమతీ మనో. ౧

పాపంచే పురిసో కయిరా నతం కయిరా పునప్పునం,
నతమ్హి ఛన్దం కయిరాథ దుక్ఖో పాపస్స ఉచ్చయో. ౨

పుఞ్ఞం చే పురిసో కయిరా కయిరాథేతం పునప్పునం,
తమ్హి ఛన్దం కయిరాథ సుఖో పుఞ్ఞస్స ఉచ్చయో. ౩

పాపోఽపి పస్సతి భద్రిం యావ పాపం నపచ్చతి,
యదాచ పచ్చతి పాపం అథ పాపో పాపాని పస్సతి. ౪

భద్రోఽపి పస్సతి పాపం యావ భద్రిం న పచ్చతి,
యదాచ పచ్చతి భద్రిం అథ భద్రో భద్రాని పస్సతి. ౫

మాఽవమఞ్ఞేథ పాపస్స న మం తం ఆగమిస్సతి,
ఉదబిందునిపాతేన ఉదకుమ్భోఽపి పూరతి;
పూరతి బాలో పాపస్స థోకథోకంఽపి ఆచినం. ౬

మాఽవమఞ్ఞేథ పుఞ్ఞస్స న మం తం ఆగమిస్సతి,
ఉదబిన్దునిపాతేన ఉదకుమ్భోఽపి పూరతి;
పూరతి ధీరో పుఞ్ఞస్స థోకథోకఽంపి ఆచినం. ౭

వాణిజోఽవ భయం మగ్గం అప్పసత్థో మహద్ధనో,
విసం జీవితుకామోఽవ పాపాని పరివజ్జయే. ౮

పాణిమ్హి చేవణో నాస్స హరేయ్య పాణినా విసం,
నాబ్బణం విస మన్వేతి నత్థి పాపం అకుబ్బతో. ౯

యో అప్ప దుట్ఠస్స నరస్స దుస్సతి
సుద్ధస్స పోసస్స అనఙ్గణస్స;
తమేవ బాలం పచ్చేతి పాపం
సుఖుమో రజో పటివాతంఽవఖిత్తో. ౧౦

గబ్భ మేకే ఉప్పజ్జన్తి నిరయం పాపకమ్మినో,
సగ్గం సుగతినో యన్తి పరినిబ్బన్తి అనాసవా. ౧౧

న అన్తలిక్ఖే నసముద్ద మజ్ఝే
నపబ్బతానం వివరం పవిస్స,
న విజ్జతీ సో జగతిప్పదేసో
యత్రట్ఠితో ముఞ్చేయ్య పాపకమ్మా. ౧౨

న అన్తలిక్ఖే నసముద్దమజ్ఝే
నపబ్బతానం వివరం పవిస్స,

నవిజ్జతీ సో జగతిప్పదేసో
యత్రిట్ఠితం నప్పసహాదే మచ్చు. ౧3

ఇతి పాపవగ్గో.

---

## అఘువర్గము (పాపవర్గము)

బుద్ధదేవుడు బౌద్ధమతప్రచారము సేయ ప్రారంభించి నప్పటి కాదేవుని ప్రియతనూజుండగు చిరంజీవి రాహులుని ప్రాయము ద్వాదశవత్సరములు. బాలకగణ సామాన్యమగు బుద్ధిచే నాకుమారుడు గావించు దుశ్చేష్టల నవలోకించి, బుద్ధదేవు డతనికిట్లు యుపదేశింప నారంభించెను:—

"కుమారా!

(1) మానవునకు సుకృతము నేయవలయుననియెడి యుత్కటాభిలాషయే యున్నచో, ప్రప్రథమమున నిజహృద్గత భావ సముదాయమును దౌష్ట్యమునుండి మఱలించుకొన వలయును. శుభకార్యముల నాచరించు తరుణమునందు నిరుత్సాహము, విసువు గల్గియుండు మనుష్యునిచిత్తము దివారాత్రములు దుష్క్రియాచరణమునందే హర్షబాహుల్యము నందు చుండును. అనగాకర్మవీరుడయినను మానవుడు త్రికరణశుద్ధిగా

శుద్ధాచరణము నే గల్గియుండనిచో, లాభమునకు మారు మహా నష్టమునే బడయును.

(2) మానవుఁ డొకతూరి పాపకార్యము గావించి యున్నచో, నంతమాత్రింబున నే సమస్తము పాపమయంబా యెగదా యని భ్రమించి, పునః పాపకార్యముల నాచరింపబూను టుచితముకాదు. సంతతము పాపాచరణమునందే పాయిజెం డుటనుచితము. దుఃఖము దుష్కర్మల యొక్క దుష్పరిణామ మేయని వేఱుగ వచింపవలయునా ?

(3) పాపాత్ముఁడు తానుగావించిన కార్యములు ఫలో న్ముఖములయి, కుఫలముల నొసంగునదనుక తత్కృత్యముల యందే మహత్తర సౌఖ్యానందప్రాప్తి నందుచుండును. కాని పాపకార్యములు పరిపక్వమయి, పాపఫలముల బ్రదానము సేయు తరుణ మాసన్నమయినపుడు, పాపాత్ముఁడు స్వయం కృతాకృత్యములచే వాటిల్లు మహాపదలవముల గ్రహించి, భయవిషాదార్ణవ నిమగ్నుఁడగును.

(4) సాధువు తానాచరించు సుకృతములు ఫలించి శుభ పరిణామము నొసంగనంతపర్యంతము దా నోపికతో గల్గు సమస్తకష్టపరంపరల సహింప సంసిద్ధుడయి యుండును. ఫలిం చుదనుక కష్టపరంపర లొదవుచుండినను, తదనంతరము శుభ

కార్యము పరిపక్వమయి సత్ఫలము నొసంగుచు సాధువునకు లోకాతీతంబగు సౌఖ్యము నాపాదించును.

(5) పరిహాసమునకయినను "నష్ట మింతమాత్రింబున నే వాటిల్లనేరదు" కదాయని భ్రమించి, దుష్టకార్యాచరణంబు నకుగాని దుర్వాక్య ప్రకటనమునకుగాని మానవుడు గడంగరాదు. గతమదెద్దియన—బిందువు వెంట బిందువు పడుటవలననే ఘటము జలపూరితము కాగల్గుచున్నయది. అదియేచందమున నల్పపాపసంచయమే కాలము గతించినకొలది భావాతీతమగు నధికపాపసంచయమునకు గారణభూతమగును. కనుక పాపచింతానాపరుడగు వ్యక్తి కిహపరములయందు సుఖము లభింపజాలదు. కారణమేమన నతనిజీవితము దుర్భావపూరితమయి యొప్పుచుండును. దుర్భావముయొక్క పరిణామము దుస్సహంబగు దుఃఖమేకదా!

(6) మూర్ఖునిసాంగత్యంబున విశేషలాభప్రాప్తి యొదవకపోయినను, స్వల్పంబగు లాభమయిన హస్తగతంబగుగదా యని భావించి, సుకృతము (సత్యస్వరూప సందర్శనానుకూల పవిత్రసాధనమును) సంకుచితదృష్టితో వీక్షించి, నిరసింపరాదు. బిందువువెంట బిందువు పడుటచే పాత్రము సలిలభరితమగుచందముననే నల్పమగుపుణ్యమే కాలము గతించినకొలది నధికపుణ్యప్రాప్తికిఅథవామోక్షప్రాప్తికి హేతుభూతమగును.

35

(7) ఏప్రకారము విశేషవిత్తమును వెంటనిడికొని, ప్రియాణము సేయువణిక్కు యేకాకినిగదా యని భీతుడయి, భయంకరారణ్యమార్గము నెడబాసి, సాధుమార్గము (రాజబాట) ననుసరించి ప్రయాణము సలుపుచుండునో, ఏరీతి మరణపదము నాలకించినంతనే భయభీతుడగు వ్యక్తి హాలాహలమునుండి నిరతము తన్ను సంరక్షించుకొనుచుండునో, అది యేచందమున మానవుడు నిజాభ్యుదయము నపేక్షించి, పాపకార్యాచరణమున స్వాత్మకొదవు మహాపదవిమును గుర్తెరింగి, యద్దానినుండి దూరముగ నుండుటయే శ్రేయస్కరము.

(8) పుండులేని హస్తముతో విషమును స్పృశింపవచ్చును. గాయములేని మానవుని చర్మముపై విషము యెంత మాత్రము బనిసేయజాలదు. అటులనే దుష్కార్యములయెడ నేవగింపును, సత్కార్యాచరణమునెడ నధికానురాగంబును గల్గియుండువానికి దౌష్ట్యముయొక్క ఫలితమగు విషాదము యెంతమాత్రము హాని సేయజాలదు. అగ్నిని జెదలు స్పృశింపగల్గునా? చెదలుయొక్క స్వభావము పదార్థమును క్షయముగావించుటయే యయినను, అగ్నిని గాంచి భీతిజెందులాగుననే సత్యవ్రతునిగాంచి దౌష్ట్యము భీతిజెందును.

(9) నిర్దోషియు, సదాచారియు, సాధుజనోచిత వ్యవహారియు నగు వ్యక్తిని, నిష్కారుణుడయి బాధపెట్టు మానవు

డంతమునకు దా గావించిన ఘోరాన్యాయపరిభావంబున దానే క్రూరముగా హింసింపబడుట నిక్కము. ప్రచండమారుతగతికి విరుద్ధముగా ధూళి నెగురగొట్టినచో దిరిగి యది మన కండ్లయందే పడుట వాస్తవముకదా !

(10) మానవులు కొందఱు జననమరణాదిక్లేశములకు వశమయి వాపోవుచుందురు. పాపులు నరకగాములగుట నిశ్చయము. ధర్మాత్ములు స్వర్గపదవి నందుదురు. సాంసారిక విషయవాసనావికారవిహీనులు నిర్వాణమును బడయుట యథార్థము; నిస్సంశయము.

(11) దుష్కార్యానురక్తుడు దుష్కర్మయొక్క దుష్ఫలము ననుభవింపకుండ భూమ్యాకాశ పర్వతారణ్య సాగరములయందెచ్చటను హాయిగ దాగియుండ శక్యముకాదు. కర్మయొక్కఫల మవశ్యభోక్తవ్యము.

(12) భూమ్యాకాశ సాగర పర్వతారణ్యములయం దెచ్చోట డాగినను మృత్యుముఖంబున మానవుడు పడక తప్పదు. జననమందినదాదిగ మానవుడు స్వాభావికసంపత్తియగు మరణమునకయి నిరీక్షించుచుండుట శ్రేయస్కరము. సమస్తప్రాణికోటికి మరణ మవశ్యభోక్తవ్యము.

అప్రవర్గము పరిసమాప్తము.



## దణ్డవగ్గో

సబ్బే తసన్తి దణ్డస్స సబ్బే భాయన్తి మచ్చునో,
అత్తానం ఉపమం కత్వా న హనేయ్య న ఘాతయే. ౧

సబ్బే తసన్తి దణ్డస్స సబ్బేసం జీవితం పియం,
అత్తానం ఉపమం కత్వా న హనేయ్య న ఘాతయే. ౨

సుఖకామాని భూతాని యో దణ్డేన విహింసతి,
అత్తనో సుఖ మేసానో పేచ్చ సో న లభతే సుఖం. 3

సుఖకామాని భూతాని యో దణ్డేన నహింసతి,
అత్తనో సుఖమేసానో పేచ్చ సో లభతే సుఖం. ౪

మాఽవోచ ఫరుసం కఞ్చి వుత్తా పటివదేయ్యు తం,
దుక్ఖాహి సారమ్భకథా పటిదణ్డా ఫుసేయ్యుతం. ౫

సచే నేరేసి అత్తానం కంసో ఉపహతో యథా,
ఏస పత్తోఽసి నిబ్బాణం సారమ్భో తే న విజ్జతి. ౬

యథా దణ్డేన గోపాలో గావో పాచేతి గోచరం,
ఏవం జరాచ మచ్చుచ ఆయుం పాచేన్తి పాణినం. ౭

అథ పాపాని కమ్మాని కరం బాలో నబుజ్ఝతి,
సేహి కమ్మేహి దుమ్మేధో అగ్గిదడ్ఢోఽవ తప్పతి. ౮

యోదణ్డేన అదణ్డేసు అప్పదుట్ఠేసు దుస్సతి,
దసన్న మఞ్ఞతరం ఠానం ఖిప్పమేవ నిగచ్ఛతి. ౯

వేదనం ఫరుసం జానిం సరీరస్సచ భేదనం,
గరుకం వాఽపి ఆబాధం చిత్తక్షేపంఽవ పాపుణే. ౧౦

రాజతోవా ఉపసగ్గం అబ్భక్ఖానంఽవ దారుణం,
పరిక్ఖంయ వజాతీన భోగానంవ పభఙ్గురం. ౧౧

అథవఽస్స అగారాని అగ్గి దహాతి పావకో,
కాయస్స భేదా దుప్పఞ్ఞో నిరయం సో ఉపపజ్జతి. ౧౨

న నిగ్గచరి యా నజటా నపఙ్కా
నానాసకా థణ్డిల సాయికావా,
రజోచ జల్లం ఉక్కుటికప్పధానం
సోధేన్తి మచ్చం అవితిణ్ణ కఙ్ఖం. ౧౩

అలఙ్కతోచేపి సమం చరేయ్య
సన్తో దన్తో నియతో బ్రిహ్మచారీ,
సబ్బేసు భూతేసు నిధాయ దణ్డం
సో బ్రాహ్మణో సో సమణో సభిక్ఖు. ౧౪

హిరీ నిసేధో పురిసో కోచి లోకస్మిం విజ్జతి,
యో నిద్దం అప్పబోధతి అస్సో భద్రో కసా మివ. ౧౫

అస్సో యథా భద్రో కసానివిట్ఠో
ఆతాపినో సంవేగినో భవాథ,

సద్ధాయసీలేనచ వీరియేన
చసమాధినా ధమ్మవినిచ్ఛయేనచ,
సమ్పన్న విజ్జాచరణా పటిస్సతా
నహాస్సథ దుక్ఖమిదం అనప్పకం. ౧౬

ఉదకం హి నయన్తినేత్తికా
ఉసుకారా నమయన్తి తేజనం,
దారుం నమయన్తి తచ్ఛకా
అత్తానం దమయన్తిసుబ్బతా. ౧౭

ఇతి దండవగ్గో

## దండనవర్గము

భిక్షువుల యారామమందిరమున కొకతూరి దండధరుండగు రాజకీయోద్యోగి యొకండు సవిలాసముగ శాపకోచితంబగు తీవితోడ నేతెంచెను. అత డాదివసము మహాత్ములగు శ్రమణుల గొందఱిని సందర్శింప సంకల్పించియుండెను, భిక్షువు లతని నవలోకించి ప్రేమపురస్సరంబుగ నుచితాసనాసీనుని గావించిరి. అంతట పరస్పర సంభాషణము ప్రారంభమాయెను. వార్తాలాపసందర్భమున బౌద్ధసన్యాసులు కొందఱు ప్రేమపూర్వకంబుగ నతని కహింసావ్రిత మహాత్మ్యమును గూర్చి విపులముగ వర్ణించి హితోపదేశ మొనరించిరి. అంతట రాజకర్త

చారి యవ్వారిబోధలకు ముదమంది దండనావిషయమయి కొన్ని ప్రశ్నలడుగ, భిక్షువు లానందించి, యామహాత్త్రంబుల గు ప్రశ్నలకు సముచితప్రత్యుత్తరంబు నీయ దాముసహిత మసమర్థులమనియు శ్రీబుద్ధభగవానులే భక్తులహృదయమందలి సమస్తసందేహముల దూరము సేయ నెల్లవిధముల సమర్థులని యు దెల్పి, యారాజకీయోద్యోగిని పరివ్రాజకులెల్లరు వెంట నిడుకొని, యేకాంతప్రదేశమున నాసీనుడయి యున్న బుద్ధదే వునిసన్నిధికి గొనిపోయిరి. ఎల్లరచ్చోట కరిగినంతనే దేవుని మూర్తికి బ్రణమిల్లి, దండనావిషయమయి యుపదేశింపవలసిన దిగా బ్రార్థింప, దేవుడందుల కానందించి రాజకీయోద్యో గిని బ్రధానముగా సంబోధించి, యీచందమున నుద్బోధింప దొడంగెను:—"కుమారా! దండనవిషయమయి నీకున్న సందే హము లీనాయుపదేశశ్రవణంబున దూరమగును. నీవు శ్రద్ధ తో నాలకించి, యందలి సారాంశమును గ్రహించి, యంతటి తో మనస్తుష్టినంది, మౌనము వహింపక కార్యరూపంబున నా చరించి, ధన్యాత్ముడవగుము. ఆలకించినంతమాత్రంబున లాభ ము లేదు. ఆచరింపవలయును.

(1) దండనయన్నంత మాత్రంబున సమస్తజనులు భీతా వహులగుచుండుట గాంచుచునే యున్నారము. మానవుడు మరణమనినంతనే నిజోత్సాహమును గోల్పోయి, కంపితగాత్రు

డగుచున్నాడు. ప్రతిమానవునకు స్వప్రాణమన్న నత్యంత మధురము. అన్యజీవుల ప్రాణములు సహితము తమకదియే రీతి నత్యంతప్రియములయి యుండును. మానవు డీరహస్యమును గ్రహింపవలయును. నరుడు తానెట్లు తనప్రాణమును సర్వదా సంరక్షించుకొనుటకయి యాతురతపడుచుండునో, అదియేమాడ్కి సమస్తప్రాణులజీవము విషయమయి సహితము సహానుభూతిని గల్గియుండవలయును. హింసించునరుడు హింసింపబడును. పదిరెట్లు యెక్కువ పీడింపబడుట వాస్తవము. ప్రాణికోటిని హింసించుట మానవధర్మమునకు విరుద్ధమగు రాక్షసకృత్యము.

(2) ప్రాణమనిన సమస్తజీవులకు బ్రియమే. ఎవ్వాని ప్రాణ మవ్వానికే యెక్కుడు ప్రేమాస్పదంబుగ నుండును. హింసించి, ధర్మదూరుడయి మానవుడు పాపభాజనుడగుట శ్రేయస్కరముకాదు. ఎల్లప్రాణుల దనప్రాణముతో సమానముగా భావించి, స్వపరభేదభావ శూన్యుడగుటయే యుత్తమము. మానవుడు మఱచియయిన ప్రాణిహింసను కారణభూతుడు కారాదు.

(3) ధర్మమునకు భిన్నమగు నిజసుఖము నపేక్షించి, సన్మార్గమునెడబాసి, ప్రేమ మయుండగు సర్వేశ్వరుని నరకు గొనక, ప్రాణికోటిని దండించుటగాని, వధించుటగాని, హిత

కరముగాదు. హింస మానవహిత భంజకమేయగును. కాని హితదాయకము కాజాలదు. హింసయందే సౌఖ్యము ననుభవించు పాపహృదయునకు మరణానంతరము లేశమయిన సుఖము లభింపక, క్లేశమే ప్రత్యక్షమగును.

(4) స్వసుఖము నపేక్షించి, యితరప్రాణుల నిర్దయుడయి వధించుటకుగాని, హింసించుటకుగాని, భావమునందయిన సమ్మతింపనట్టియు, ధర్మజ్ఞుడు మరణానంతరము, అపారసౌఖ్యాపారావారంబున దేలియాడును. అత్తటి సత్కర్మయగు నహింసయొక్క దివ్యతమ మాహాత్మ్యమును గుర్తెఱింగి, యద్దానిని ధర్మాత్ముడు ముక్తకంఠముతో బ్రశంసింప నుపక్రమించును.

(5) ప్రేమభావశూన్యంబులగు కటువచనముల నేయవస్థయందును సత్యమునకయి రచింపబడిన శ్రీముఖముతో నుచ్చరింపజనదు. నీవెవ్వనితోడనయిన గర్వోక్తుల సంభాషింతువేని యతడు సహిత మాగ్రుడయి, హింసాత్మకంబులగు కటువచన శరప్రయోగంబున నీహృదయమును నొవ్వజేయును. అకారణముగ నుభయులచిత్తములు మృదుమధుర ప్రియసంభాషణముచే నాహ్లాదించుటకు మారుగ, వ్యథజెందును. క్రోధజనితవాక్యప్రయోగమే వృథావ్యథకును, దుఃఖోత్పత్తికిని మూలమగును. చెంపగొట్టిన గినియక సహనశీలతా బలంబున రెండవచెంపబట్టి క్రోధోన్మత్తుడగు వ్యక్తిని, నిజదూషిత

కర్మచే లజ్జితుని గావించి యద్దానినుండి వానినుద్ధరించుటయే దండనపద్ధతిని గుర్తెరింగిన ధీరునివిధి.

(6) కాలిక్రిందబడి పగిలిపోయిన ఘంట మేచందమున గణగణ మ్రోగజాలదో, అదియేచందమున దుష్టుని ప్రహార పరంపరలకును, క్రోధవాక్యశరసముదాయమునకును జలింపక, శాంతహృదయుడయి, కటువచనప్రయోగమున కియ్యకొనుటే హితము నాకాంక్షించు మానవుని పవిత్రతమంబగు విధి. శాంతనిలయంబగు స్థానమున గ్రోధమెక్కడ? శాంతచిత్తుడు నిర్వాణము నందును.

(7) గోపాలు డేచందమున హస్తమున దండమును బూని, యద్దాని సాహాయ్యంబున బశువుల మందలింపుచు, నిరాతంకముగా దొడ్డికి దోలుకొని పోవుచున్నాడో అదియే వడువున కరాళమూర్తియగు కాలుడు జరాదండమును గేలం దాల్చి మానవజీవితముల మరలించుకొని పోవుచున్నాడు.

(8) మూఢుడు, అస్థిరచిత్తుండు దుష్కార్యముల సలుపుసమయమందు నీషణ్మాత్రమయిన వివేకప్రజ్ఞను గల్గియుండడు. తత్సమయంబున జిత్త మస్థిరప్రవృత్తులకు వశీకరణమగుడు యుక్తాయుక్తము లవ్వానికి గోచరింపవు. దుష్టు డగ్నిజ్వాలా సముదాయంబున బడి దగ్ధమగురీతి, దుష్కార్యాన

లము ప్రచండముగ సర్వదా ప్రజ్వరిల్లుచునే యుండును. అగ్ని వలె దుష్కార్యానల మెప్పుడును శాంతింపదు.

(9) నిర్దోషులును, నిరపరాధులును, అహింసాత్మక కార్యవిధానపరతంత్రులును, శాంతచిత్తులును నగు సత్పురుషుల కోమలహృదయములకు దుఃఖము నొదవజేయు దుష్టాత్ముడీక్రింది చేర్కొనబడు పదివిధములగు దండనములలో నేదియో యొక్కదానికయిన నవశ్యము గురియగును:—

(10) పదివిధములగు దండనలవివరణ మిద్దియ:—

(1) దారుణదుఃఖము సంభవించును. 2 మహానర్థము వాటిల్లును. 3 శరీరక్షయ మొదవును. 4 అసహనీయంబగు వేదన ముద్భూతమగును. 5 మానసికవిషాదము తటస్థించును. 6 రాజదండనము లభించును. 7 భయంకర దోషారోపణమునకు గురియగుట సంభవించును. 8 బంధుమిత్రాదులవియోగము ప్రాప్తించును. 9 ధనాగారము నష్టభ్రష్టమయి, తీరనట్టి యార్థికహాని నొదవజేయును. 10 భయంకరాశనిపాతముచే స్వనికేతనము దగ్ధమయి, భస్మీపటలమయిపోవును. వీనికి గురియగుటయే కాక సాధుపుంగవుల హింసించు లేక దూషించు పాపాత్ముడు స్వకీయ కలుషితకర్మచే నరకమున బ్రవేశించి, తాజేసిన కుకర్మల కనువగు విషమఫలము ననుభవించితీరును.

(11) సమస్త సాంసారికతృష్ణల నిరసించని వ్యక్తి దిగంబరుడయియున్నను, మౌనిచంద్రునివలె జటామకుటధారియయియున్నను, స్నానస్పర్శనారహితుడయియున్నను, ఉపవాసవ్రతస్వీకారంబున గఠినమగు భూమిపై శయనించియున్నను, భస్మవిలసితదేహుడయియున్నను, నిరంతర మౌనవ్రతానుష్ఠానపరతంత్రుడయియున్నను లేశమయిన లాభమును బడయజాలడు. ఈ పై నుదహరింపబడిన నాచారవ్యవహారములేవియు దృష్ణాబద్ధునియెడ శోభింపజాలవు. శోభ చిత్తపారిశుద్ధ్యాదులపై నాధారపడియుండును గాని కేవలము బాహ్యాచారసముదాయముపై గాదు.

(12) ఆడంబరయుక్తములగు బాహ్యవేషముల ధరియింపని వాడయినను శాంతస్థిరచిత్తుండును, జితేంద్రియుండును, సంయమవ్రతానుష్ఠానగతప్రాణుండును, పవిత్రభావసమన్వితుండును, పరజనగత దోషవివేచనాదూరుండునునగు మానవోత్తముడే వాస్తవమారయ బ్రాహ్మణుడు, శ్రమణుడు లేక సన్యాసి.

(13) వశీభూతమయియున్న యుత్తమాశ్వమును రయంబున బరుగిడ జేయుట కెట్లు కొరడా యనావశ్యకమో యట్లనే వినయసంపన్నుండును, జితేంద్రియుడును నగుపురుషవరేణ్యునకు నిందాపాత్రుడు కావలసిన యావశ్యకత వాటిల్ల

నేరదు. అనగా నిజస్థితప్రజ్ఞా బలంబున ననుచితవిధానము ననుకరించి లోకదృష్టియందు కంటకసదృశుడు కాజాలడని తాత్పర్యము.

(14) సమస్తవిధముల సాధింపబడిన యశ్వ మేరీతి గొరడాస్పృశించినంతనే తుళ్ళిపడి, పూరోత్సాహమును ద్విగుణీకృతమొనరించి, పర్వెత్తుచున్నయదో అదియేచందమున శ్రద్ధ, సత్ప్రవర్తనము, ఉత్సాహము, ధ్యానము మఱియు ధర్మజ్ఞానము మొదలుగాగల పవిత్రసాధనంబుల నాధారముగ గొని సత్కార్యములయెడనుండు నిరుత్సాహమును నిషేధించి మానవుడు దుఃఖభంజనము గావింపవలయును. స్వప్నమందయిన మానవుడిట్టి యుక్తధర్మమును విస్మరింపరాదు.

(15) కాలువదవ్వువాడు మనోభీష్టము ననుసరించి నీటిని బ్రవహింపజేయు చందమునను, ధనుర్నిర్మాత స్వకీయేచ్ఛానుసారంబుగ శరాసనమును వక్రముగ నిర్మింపగల్గుపగిదియు, వడ్రంగి స్వాభిలాషానుకూలంబుగ గాష్ఠముచే బదార్థమును సిద్ధమొనరించుభంగియు ధీమంతుడును, శాంతప్రియుండునునగు వ్యక్తిపుంగవుడు యిచ్ఛవచ్చినమచ్చున జరిత్రనిర్మాణము గావించుకొన సమర్థుడు. తనభాగ్యాభాగ్యములకును, ఉత్థానపతనములకును స్వయముగ మానవుడే హేతుభూతుడగుచున్నాడు.

దండనవర్గము పరిసమాప్తము



## జరావగ్గో.

కోను హాసో కిమానన్దో నిచ్చం పజ్జలితే సతి
అన్ధకారేన ఓనద్ధా పదీపం న గవేస్సథ. ౧

పస్స చిత్తకతం బిమ్బం అరుకాయం సముస్సితం,
ఆతురం బహుసఙ్కప్పం యస్స నత్థి ధువం ఠితి. ౨

పరిజిణ్ణ మిదం రూపం రోగానిడ్డం పభంగురం,
భిజ్జతి పూతిసన్దేహో మరణన్తం హి జీవితం. ౩

యానిఽమాని అపత్థాని అలాపూనేవ సారదే,
కాపోతకాని అట్ఠీని తాని దిస్వాన కా రతి. ౪

అట్ఠీనం నగరం కతం మంసలోహిత లేపనం
యత్థ జరాచ మచ్చుచ మానో మక్ఖోచ ఓహితో. ౫

జీరన్తి వే రాజరథా సుచిత్తా
అథో సరీరంఽపి జరం ఉపేతి,
సతంచ ధమ్మో నజరం ఉపేతి
సన్తో హవే సబ్భి పవేదయన్తి. ౬

అప్పస్సుతాఽయం పురిసో బలివద్దోఽవజీరతి,
మంసాని తస్స వడ్ఢన్తి పఞ్ఞా తస్స న వడ్ఢతి. ౭

అనేకజాతిసంసారం సన్ధావిస్సం అనిబ్బిసం,
గహకారకం గవేసన్తో దుక్ఖా జాతి పునప్పునం. ౮

గహకారక! దిట్ఠోఽసి పున గేహం నకాహసి,
సబ్బా తే ఫాసుకా భగ్గా గహకూటవిసజ్ఞితం,
విసఙ్ఖారగతం చిత తణ్హానం ఖయమజ్ఝగా. ౯

అచరిత్వా బ్రిహ్మచరియం అలద్ధా యొబ్బనే ధనం,
జిణ్ణకోఞ్చాఽవ ఝాయన్తి ఖీణమచ్ఛేఽవ పల్లలే. ౧౦

అచరిత్వాబ్రిహ్మచరియం అలద్ధా యొబ్బనే ధనం,
సేన్తి చాపాతి ఖీణాఽవ పురాణాని అనుత్థునం. ౧౧

ఇతి జరావగ్గో.

---

## జరావర్గము.

ఒకదివసము శ్రీ బుద్ధభగవాను డాత్మీయశిష్యుండగు నానందునితో నొక యేకాంతప్రదేశంబున గూరుచుండి వివిధంబులగు నాధ్యాత్మిక విషయంబులఁగూర్చి ప్రసంగింపుచుండెను. శ్రీ గురూపదేశితాధ్యాత్మికోపదేశ శ్రవణంబున నానందుడు తన్మయుడయి యుండెను. సరిగా నాసమయమునకే తరుణవయస్కుండగు నొక బౌద్ధశ్రిమణు డొకకంపితగాత్రుండగు వృద్ధునిహస్తమును నిజకరమునం దిడికొని మెల్లమెల్లగ నడిపించుకొనుచు దేవుని సన్నిధి కరుదెంచెను. ఆవృద్ధుడతిదూరమునుండి శ్రీబుద్ధసందర్శనార్థమే తెంచియుండెను, కడుదుఃఖితుడయి

యున్న నావృద్ధగృహస్థుని సౌమ్యాకృతి నవలోకించి బుద్ధ దేవు డాతనిహృదయమున కొంకింత శాంతినొడగూర్ప నభిల షించి యీరీతి మృదుమధురంబులగు వచనంబుల నుపదేశింప బ్రారంభించెను :—

(1) ఈసంసారము మండుచున్న యగ్నివంటిది. చతు ర్దిశల మహాపద్రవకరంబులగు పరిస్థితులే నెలకొనియున్నవి. ఈలోకమున నామోదప్రమోదములకు సుంతయు స్థానము లేదు. ఓసంసారీ! నీజీవితము చతుర్దిశలనుండియు నవివేకాం ధకారావృతమయియున్నది. నీకుమార్గము దృష్టిగోచరమగుట లేదు. ఏతద్దశయందు సుజ్ఞానదీపకళికాజ్యోతి నన్వేషించు టయే నీయుక్తధర్మమని నీకు వేఱుగ నుపదేశింపవలయునా?

(2) మానవుడా! అంతులేని గాయములతో నిండి నట్టియు, భయంకరంబులగు వ్యాధులతో గూడియున్నట్టియు, ఎండిపోయిన కట్టెవలె శక్తిని హీనంబును, కళాశూన్యంబు నయియున్నట్టియు, వస్త్రాచ్ఛాదితమయి యున్నట్టియు మాంస పిండరూపంబగు నీశరీరమును జూచుకొనుము. ధరించిన వస్త్ర ములేకాని దేహము కానరాకున్నది.

(3) సంసారీ! నీయీదేహము శాశ్వతమయినదిగాదు! వ్యాధుల కాలవాలము జలబుద్బుదప్రాయము। క్షణభంగు

రము. దీర్ఘకాలమునుండి నగణితంబులగు దుష్కర్మల నాచరించి వృద్ధావస్థకు జిక్కి దుర్గంధపూరితమయి కుళ్లిపోవుచున్నది. మృత్యుముఖంబున బడుటయే యిద్దానికింక గర్తవ్యము.

(4) శిశిరఋతువులో నిష్ప్రయోజనమని భావింపబడి దూరముగ బారవేయబడు నానపకాయను బోలియే యస్థిపంజరముగు నీదేహమున్నది యో సంసారీ! శక్తివిహీనమయి, శుష్క కాష్ఠసదృశంబుగ నుండు నీకాయ మంతిమావస్థయందు దిక్కుమాలి పృథ్వింబడి యుండజూచుట కానందదాయకముగ నుండునా?

(5) నీవగు యీదేహ మస్థులచే నిర్మింపబడిన యొక యస్థిరమగు మందిరమువంటిది. రుధిరమాంసాదు లాగృహమునకు బాహ్యాడంబరమునకయి పూయబడిన పూతలు. ఈమందిరమునందు వార్ధక్య మరణాభిమాన కపటములు నిరంతరము వాసము సేయుచుండును. ఈగృహమునుండియే సమస్తమగు దుష్కర్మలు నాచరింపబడుచున్నయవి. వేయేల? మోక్షమార్గప్రతిబంధకములగు సమస్త దుర్గుణముల కీదేహమందిరమే నివాసస్థానము.

(6) భూపాలచంద్రుల సూర్యకిరణసదృశ తేజస్సంపన్నములగు రథము లస్థిరత్వంబునకు బాల్పడి, లయమొందు

లాగుననే మానవదేహ మనుదినము, అవస్థాభేదంబునకు వశీభూతమగుచు లయపథమును సమీపించుచుండును. కాని సజ్జనుల సద్ధర్మము, వారికీర్తికాయము నశింపక శాశ్వతములయి యొప్పుచుండును. శాంతస్వభావుడుసహితము నిజదేహశాశ్వతత్వమును గ్రహింపగలడు.

(7) శిక్షాశూన్యుండును, సక్రియవిధాన దూరుండును నగుమానవునకు వివేకము ప్రాప్తించుట దుస్తరము. అడవిమృగమువలె నట్టివాడు కండరముల బెంచుకొని దండివాడనని మిడిసిపడుచుండును. అట్టివాని మాంసమే యనుదిన మభివృద్ధి జెంది మిథ్యాభిమానము నభివృద్ధిసేయునుగాని జ్ఞానకాయము నశించుటంజేసి శీఘ్రకాలమునందే జరావస్థకు బాల్పడి, మృత్యువాతంబడును.

(8) ప్రత్యేకమానవుడే తద్భవన (శరీరగృహము) నిర్మాత నన్వేషించునిమిత్త మనేక పర్యాయములు జన్మచక్రమున బడవలసియే యుండును. సంపూర్ణజ్ఞానపూరిత హృదయు డగునంతపర్యంతము మానవునకు జన్మాంతరమే శరణ్యము. జన్మాంతరంబు బడయవలసిన వివేకమును నేనుసద్ధర్మానుష్ఠానంబున బడయగల్గితిని. ఓశరీరగృహనిర్మాతా! నిన్ను నేను బూర్తిగ సందర్శించి మించినాడ. నీవింక నాయీ యస్థిర దేహమందిరమును బునర్నిర్మింప నశక్తుండవేసుమా!

(9) ఓ దేహరచయితా! నీచే నిర్మింపబడిన మందిరము భగ్నమయి పోయినది. దృఢతరంబులని భావింపబడిన స్తంభములు ఖండఖండములయి పోయినవి. కవాటవాయసములు సహితము భిన్నములయి పోయినవి. మందిరనిర్మాణమునకు నీచే గూర్చబడిన సమస్తసాధనములు శిథిలములయి యెక్కడివక్కడనే నశించినవి. నాపవిత్రతమంబగు యాత్మ సమస్తంబులగు సాంసారిక విషయవాసనలనుండి సంపూర్ణమగు విముక్తినంది, నిర్వాణపథమును సమీపించినది. ఇంక నాజీవితము సుస్థిరమే, శాశ్వతమే, సచ్చిదానందస్వరూపమేసుమా!

(10) జీవిత ధర్మకార్యక్షేత్రమునుండి దూరుడయి, ఐహికాశాశ్వత భోగవిలాస తత్పరమతియును ధర్మమనియెడి ధనము నార్జింపనట్టి మూఢచిత్తుండును, యుక్తప్రాయము నందే సత్యసజ్ఞానమను పారమార్థికసంపత్తిని సంపాదింపని ద్విపాదపశువును, మత్స్యశూన్యంబగు సరోవరతీరంబున వాసము నేయుచు నిరాహారంబున శుష్కించి, మరణించు బకముచందమున మృత్యువాతంబడుదు విషాదభీతులకు గుఱియయ్యెదరు.

(11) నిజామూల్యజీవితమును సక్రమవిధానము ననుసరింపజేయక, యుక్తప్రాయమున ధర్మార్థసంగ్రహకార్యదూరుడయి వర్తించు మానవుడు దురవస్థకు బాల్పడినంతనే భగ్న

శరాసనంబుమాడ్కి స్వకీయ గతజీవితముఁనుగూర్చి విచారించు కొనుచు వేడినిట్టూర్పులు విడుచుచుండునుగదా !

జరావర్గము పరిసమాప్తము.



## అత్తవగ్గో.

అత్తానం చే పియం జఞ్ఞా రక్ఖేయ్య తం సురక్ఖితం,
తిణ్ణమఞ్ఞతరం యామం పటిజగ్గేయ్య పణ్డితో. ౧

అత్తానమేవ పఠమం పటిరూపే నివేసయే,
అథఞ్ఞ మనుసాసేయ్య నకిలిస్సేయ్య పణ్డితో. ౨

అత్తానం చే తథా కయిరా యథఽఞ్ఞ మనుసాసతి,
సుదన్తో వత దమేథ అత్తాహి కిర దుద్దమో. ౩

అత్తాహి అత్తనో నాథో కో హి నాథో పరో సియా,
అత్తనాహి సుదన్తేన నాథం లభతి దుల్లభం. ౪

అత్తనాఽన కతం పాపం అత్తజం అత్తసంభవం,
అభిమన్థతి దుమ్మేధం వజిరం వఽహ్మమయం మణిం. ౫

యస్స అచ్చన్త దుస్సీల్యం మాలువా సాలమివోతతం,
కరోతి సోతథత్తానం యథా నం ఇచ్ఛతీ దిసో. ౬

సుకరాని అసాధూని అత్తనో అహితానిచ,
యంవే హితంచ సాధుంచ తంవే పరమ దుక్కరం. ౭

యో సాసనం అరహాతం అరియానం ధమ్మజీవినం,
పటిక్కోసతి దుమ్మేధో దిటిం నిస్సాయ పాపికం.
ఫలాని కట్ఠకస్సేఽవ అత్తఘఞ్ఞాయ ఫల్లతి. ౮

అత్తనాఽవ కతం పాపం అత్తనా సంకిలిస్సతి,
అత్తనా అకతం పాపం అత్తనాఽవ విసుజ్ఝతి,
సుద్ధి అసుద్ధి పచ్చత్తం నాఞ్ఞో అఞ్ఞం విసోధయే. ౯

అత్తదత్థం పరత్థేన బహునాఽపి నహాపయే,
అత్తదత్థ మభిఞ్ఞాయ సదత్థపసుతో సియా. ౧౦

ఇతి అత్తవగ్గో.

---

## ఆత్మ వర్గము

ఒకానొకదివసము నవయువకుండగు శ్రమణుడొకడు బుద్ధదేవునిచెంత కరుదెంచి యిట్లు నివేదించుకొనియెను:— "దేవా? నే నన్యసోదరమానవుల సన్మార్గానురక్తుల గావించుటకు బూర్వ మాత్మసంస్కరణము గావించుకొన సంకల్పించి యున్నాడ. అన్యుల కుపదేశించి, వారల నుత్థానపదవిం జేర్చుటకు బూర్వము మానవుడు స్వయంశిక్షితుడును, స్వాత్మ

సంస్కారియు నయియుండవలయునుగదా! ఆత్మసంస్కారశూన్యునకు బరసంస్కారణాధికారమెట్లు లభింపగలదు? భవచ్ఛ్రీముఖంబునుండి యాత్మసంస్కరణోచిత వేదవాగ్జాలము నాలకింప నభిలషించుచున్నాడ. మహాత్మా! ఆత్మవశీకరణవ్రతానుష్ఠాన పరుండనగుటకు నాకు సుకరమగు పథమును విశదీకరించి కించిజ్ఞుండనగు నన్ను ధన్యాత్మునిగావింప నంజలిఘటియించి ప్రార్థించుచున్నాడ. తమయెడ నీభృత్యు డనవరతము గృతజ్ఞుడయి యుండగలడు.'' అంత శ్రీ బుద్ధభగవాను డాశ్రీమణుని విన్నపము నాలకించి, ముదితాత్ముడయి యీచందమున నుపదేశింప నారంభించెను :—

"కుమారా!

(1) మానవుడు తన్ను దానుద్ధరించుకొనుటకు వాంఛగల్గియున్నచో సర్వదా జాగరూకుడయి వర్తించుట హితప్రదము. స్వహితాకాంక్షియగు వివేకసంపన్నుం డవస్థాత్రయమందు (కౌమార యౌవన, వార్ధక్యములు) జాగరూకుడయి మెలంగుట శ్రేయస్కరము.

(2) ప్రత్యేకమానవుడు పరుల హితకార్యపరతంత్రులగావించి, పరోపకారపారీణు డగుటకు యత్నించుటకు బూర్వమే తన్ను దానే యుచితకార్యమునందు నిరతునిగావించుకొనుట యుక్తము. నిజజీవితవిధానమును సక్రమమార్గమున

నడుపగల్గినవ్యక్తియే పరజనప్రబోధమున కర్హుడు. ఇంద్రియ ములపై నాధిపత్యము వహించి, తోడిభ్రాతల నుద్ధరింప నుప దేశించుటకు నుపక్రమించు వ్యక్తిపుంగవుడు కష్టపరంపరల కేస్థితియందును గుఱికాజాలడు.

(3) ప్రత్యేకవ్యక్తి తానెట్లన్యుల కుపదేశించునో అవి ధముగనే ప్రప్రథమమున దా నాచరింపవలయును. ఆచరించి యాచరింపజేయ బ్రబోధమునకు గడంగుటయే సాధుజనలక్ష ణము. వాక్శూరుండును, ఆచరణదూరుండును నగు పరోప కారాభిలాషి వృథావ్యథకు జిక్కుట నిక్కువము. స్వయ ముగా జితేంద్రియుడయి, అప్రమత్తుడయి ముందు దానాచ రించి హితోపదేశముసేయు వ్యక్తిని సమస్తజనులు సన్మా నింప సంసిద్ధులగుదురు. యథార్థమారసిన సమస్తవిజయముల లోనికెల్ల స్వాత్మవిజయము స్వయంవశీకరణమే సర్వోత్తమం బగు విజయము. వాస్తవమీవిజయమును బడయుట కష్ట సాధ్యమే.

(4) గోస్వామి (గో=యింద్రియములను, స్వామి వశము గావించుకొనినవాడు) యగువానిపై శాసనము నెఱపగలవా డెవడుండును? తనకుదానే స్వామియగువానిపై వేరొండు ప్రభు వెటనుండును ? ఆత్మవిజయమును బడసినవాని కనతికాలము

నందే మహాదుర్లభంబగు మహాస్వామి సందర్శనము సంప్రాప్తమగును.

(5) స్వయముగా సంపాదించిన దౌష్ట్యమే మూఢచిత్తుని వజ్రి మమూల్యములగు రత్నసముదాయముల జూర్ణీకృత మొనరించుచందమున, విధ్వంస మొనర్చివేయునుకదా!

(6) ఇరుగుపొరుగున వ్యాప్తమయియుండు లతావలియెట్లు పరిచండ వృక్షశాఖాగ్రముల కెగబ్రాకి, యావృక్షోన్నతమస్తకము నూర్ధ్వముఖమునుండి యధోముఖము గావించివేయుచున్నదో, అదియేచందమున సీమారహితమగు పామరత్వము నీచప్రకృతి గలవ్యక్తి నధోముఖుని గావించివేయును. అనగా పాపభారంబున మానవు డణగిపోవుట వాస్తవము. తానాచరించిన దుష్కర్మలే తన్నడచివైచుట గాంచినరు డప్పుడవియే తనశత్రువులని గ్రహింపనేర్చును.

(7) దుష్కర్మల నాచరించుట సులభసాధ్యమేకాని, సత్కర్మల నాచరించుట మహాకష్టసాధ్యము. హానిప్రదంబులగు దుష్కార్యములే లాభకరంబులును, శ్రేయోదాయకంబులునునగు సత్కార్యములకంటె సుకరముగ నాచరింపబడగలవు. పర్వతముపైనుండి పడుట సుకరమేయగును. కాని

పర్వతారోహణ మెంత కష్టసాధ్యమో యూహించుకొనుమా! కాని ఫల మధికంబుగదా!

(8) ఏమూఢమానవుడు సత్యమార్గావలంబుల యొక్కయు, ధర్మపరాయణులగు నార్యుల యొక్కయు, సచ్చరిత్రులును జ్ఞాననైపుణీవిలసితులును నగు సజ్జనుల యొక్కయు, నుపదేశరత్నముల దిరస్కారదృక్కుల వీక్షింప సాహసించునో, వాడు వెదురువృక్షమువలె నిజక్షయమునకు హేతుభూతుడగునని నొక్కి వక్కాణింపవలయునా?

(9) మానవుడే, మూఢ్యముచే నిజహృదయక్షేత్రమున దుష్కర్మబీజముల నాటుకొనుచుండును. తానే నాటినవా డగుటంజేసి మానవు డాబీజములొసంగు ఫలముల సహిత మనుభవింపకదప్పదు. నరుడు దుష్క్రియానురక్తు డగుటకు మూలహేతువు తానేయని గ్రహింపవలయును పరిశుద్ధహృదయు డగుటకు సహిత మతడే కారణభూతు డగుచున్నాడు. ప్రాపంచిక వాతావరణస్థితి నిమిత్తమాత్రము. ప్రియత్నమువలన సాధుత్వ దుష్టత్వములు మానవునకు స్వాధీనములు కాగలవు. ఒకరొకరిని సంస్కరింపజాలరు. ప్రబోధము కేవలము నిమిత్తమాత్రమే. నేనుసహితము నిమిత్తమాత్రుండనే.

(10) అన్యుల కర్తవ్య మెంత గురుతరంబయినదయినను, మానవుడు నిజకర్తవ్యమును విస్మరించి, కార్యోన్ముఖుడగుట శ్రేయస్కరము కాజాలదు. సమస్తకార్యముల నాచరింప నభిలషించుటకుబూర్వమే మానవు డాత్మీయకర్తవ్య నిర్వహణమునకయి ముందంజవేయుట లాభదాయకము. పరధర్మాచరణంబుకంటె స్వధర్మాచరణమే మానవుని యుత్తమోత్తమవిధి.

ఆత్మవర్గము పరిసమాప్తము.

---

## లోకవగ్గో.

హీనం ధమ్మం న సేవేయ్య పమాదేన న సంవసే,
మిచ్ఛాదిట్ఠిం న సేవేయ్య న సియా లోకవద్ధనో. ౧

ఉత్తిట్ఠే నప్పమజ్జేయ్య ధమ్మం సుచరితం చరే,
ధమ్మచారీ సుఖం సేతి అస్మింలోకే పరమ్హిచ. ౨

ధమ్మం చరే సుచరితం నతం దుచ్చరితం చరే,
ధమ్మచారీ సుఖం సేతి అస్మిం లోకే పరమ్హిచ. 3

యథా బుబ్బులకం పస్సే యథా పస్సే మరీచికం,
ఏవం లోకం అవేక్ఖంతం మచ్చురాజా నపస్సతి. ౪

ఏథ పస్సథిమం లోకం చిత్తం రాజరథూపమం,
యత్థ బాలా విసీదన్తి నత్థి సంగో విజానతం. ౫

యోచ పుబ్బే పమజ్జిత్వా పచ్ఛా సో నప్పమజ్జతి,
సో౽మం లోకం పభాసేతి అబ్భా ముత్తోవ చన్దిమా.
యస్స పాపం కతం కమ్మం కుసలేన పిథీయతి,
సో౽ముం లోకం పభాసేతి అబ్భా ముత్తోవ చన్దిమా. ౭

అన్ధభూతో అయం లోకో తనుకేఽత్థ విపస్సతి,
సకున్తో జాలముత్తో౽వ అప్పో సగ్గాయ గచ్ఛతి.

హంసా౽దిచ్చపథే యన్తి ఆకాశే యన్తి ఇద్ధియా,
నీయన్తి ధీరా లోకమ్హా జేత్వా మారం సవాహినిం. ౯

ఏకం ధమ్మం అతీతస్స ముసావాదిస్స జన్తునో,
వితిణ్ణ పరలోకస్స నత్థి పాపం అకారియం. ౧౦

నవే కదరియా దేవలోకం వజన్తి
బాలా హవే నప్పసంసన్తి దానం,
ధీరోచ దానం అనుమోదమానో
తేనేవ సో హోతి సుఖీ పరత్థ. ౧౧

పథవ్యా ఏకరజ్జేన సగ్గస్స గమనేనవా,
సబ్బ లోకాధిపచ్చేన సోతాపత్తిఫలం వరం. ౧౨

ఇతిలోకవగ్గో

———

## లోకవర్గము.

మహాధనాఢ్యుఁడగు వణిజుఁ డొక్కరుండు బుద్ధదేవుని సర్వజనసంస్తవము గర్ణాకర్ణిగ నాకర్ణించెను. అతఁడు మానవ జీవితాభ్యుదయమునకు వివేకసంపాదన మావశ్యకమని గుర్తెఱిగియుండెను. అపారసంసార పారావార తరణార్థము జ్ఞాననౌక పరమావశ్యకమని గ్రహించి, యాతఁడొక్క దివసము శ్రీ బుద్ధదేవుని సన్నిధి కేతెంచి, సుజ్ఞానప్రబోధము సేయ స్వనికేతనమునకు విజయము సేయవలయునని ప్రార్థింప వణిక్కు సౌభాగ్యంబున దేవుఁ డందుల కియ్యకొనియెను. శ్రీ బుద్ధభగవానుఁ డావ్యాపారిసదనమునకరిగి, యాతఁడు భక్తిశ్రద్ధలసమర్పించు నాతిథ్యసత్కారములనంది, భోజనాదికములనుండి నివృత్తుఁడయి, బంధుజనమిత్ర పరివేష్టితుండగు వ్యాపారిని సంబోధించి, యిట్లుపదేశింప నారంభించెను:—

"కుమారా!

(1) దుష్కార్యముల నాచరింపకుము; వివేచనా జ్ఞానదూరుఁడవయి దుష్పథమున వర్తించి, దుఃఖమునకు బాత్రుఁడవు కాకుము; దుశ్చరిత్రమునుగల్గి నిరంకుశముగ వర్తింపుచు నధర్మమున కియ్యకొనకుము; అయథార్థనియమానుకూలముగ సంచరింపకుము; నశ్వరంబగు జగత్తు నపేక్షించి తన్మిత్రుఁడవు గావలదు.

(2) లేచి కూర్చుండుము; అలసుడవు కాజనదు; విలక్షణ జ్ఞానప్రకాశ భాసుర హృదయుడవగుట కుద్విగ్నుడవగుము; సద్వర్తనార్థము నార్జింపుము, సద్భావముల ననుసరింపుము; సద్గుణగణ విరాజితుండును, సుస్థిర చిత్తుండును నగుసత్పురుషు డీలోకమునను బరలోకమునను బరమసౌఖ్యభాజనుడగుట వాస్తవము. సత్యమునే శాశ్వత సౌఖ్యము వరించును.

(3) సత్యానుకూల నియమావళిం బాటింపుము; పాపమార్గమున జరింపకుము; సాధుపురుషు డైహికాముష్మిక సౌఖ్యంబుల ననుభవింపగలడు.

(4) సంసారమును జలబుద్బుదముగ మదినెంచుము; జగత్తు ననారతము మృగతృష్ణాతుల్యమని గ్రహించుము; అయథార్థంబగు జగత్తును నశ్వరంబనియు, దుఃఖదాయకంబనియు, నీ విశాలతమంబగు విశ్వంబున వింతవింత ద్యుతులతో విరాజిల్లు సమస్తపదార్థములు సహిత మస్థిరంబులనియు భావించు వ్యక్తినిగాంచి యమరాజుసహితము భయభీతుడయి పారిపోవును. అట్టి ధీరునెదుట మృత్యువు తృణప్రాయము.

(5) మానవుడా! రా! రమ్ము. సత్వరమిటు నవలోకింపుము! భూపాలుర స్యందనములచందమున నస్థిరమయి, మెఱవు మెఱసినచందాన మెఱసి యొక్కత్రుటిమాత్ర కాలంబున నదృశ్య

మయిపోవు యీ సంసారసాగరమును సందర్శింపుమా! ఒక్క సారి కన్నెత్తిచూడుమా! మూర్ఖజనమండలి నఖశిఖాగ్రపర్యంతము మునింగియున్నది. కాని ధీమంతులును, సుస్థిరచిత్తులును, సుఖదుఃఖ జననమరణాది వికారవిహీనులును, సుజ్ఞాననౌక నధిరోహించి యెట్లు తరించిపోవుచున్నారో మానవుడా! విజ్ఞాననేత్రమును దెఱచి యొక్కసారి వీక్షింపుమా!

(6) ప్రప్రథమమున జ్ఞానభ్రష్టుడయి సంచరించిన వ్యక్తి యల్పకాలానంతరము బ్రథమావస్థనువీడి, వివేకమును సంపాదించిన నీలనీరధ మాలికాచ్ఛాదిత నిశానాథుడు విముక్తింజెంది, ప్రకాశించువిధమున వెలుంగగలడు.

(7) ఈ విశాలవిశ్వ మజ్ఞానాంధకారబంధుర మయియున్నది. అల్పసంఖ్యాకులగు వ్యక్తిపుంగవులే యీ విశ్వముయొక్క యథార్థస్వరూపమును సందర్శింపసమర్థులు. మూఢులదృష్టి దూషితమయిపోయినందున, వారికి సత్యమార్గమగోచరముగ నున్నది. వేటకాని జాలమునుండి విముక్తినంది, యానందించు విహంగముచందమున జ్ఞానసంపన్నులగు మనీషులీసంసార కారాగారబంధనములనుండి సంపూర్ణముగ విడివడి, స్వేచ్ఛాపరతంత్రులయి సుఖింతురు.

(8) రాజమరాళములు తారకాపథమున స్వేచ్ఛావిహారము సేయుచున్నవి. తన్మరాళసంఘ స్వేచ్ఛావిహారమునకు మూలహేతు వవ్వానియందు వెలయు నద్భుతసామర్థ్య విశేషంబె. రాయంచ స్వకీయ శక్తిపరిభావంబుననే నిర్భయముగ సూర్యమండలమున సంచరింప సశక్తంబయిన చందముననే వివేకసంపన్నుండును, విదేహియునగు పురుషశేఖరుండు విరాటసైన్యసమేతముగ గామదేవుని ధర్మసమరాంగణమున బరాజితుని గావించి, సత్యజ్ఞానస్వరూపంబగు స్వేచ్ఛాసామ్రాజ్యస్థిత సింహాసనాసీను డగుచున్నాడు. అనగా సంసారబంధనచ్యుతుడయి, మృత్యువునుండి దూరమయిపోవుచున్నాడు.

(9) ఏ మూఢవ్యక్తి మానవ సత్యధర్మోల్లంఘనమును, అసత్యభాషణమును, పారలౌకిక సంపత్పరిహాసమును గావించునో, అట్టి నీచప్రకృతిచే జెన్నొందు కాముకుడు భయంకరంబగు పాపకార్యాచరణమునకు సహితము భీతిజెందడు. అట్టి నీచు డెట్టి నికృష్టకార్యమునయిన సానందచిత్తుడయి యాచరింప నుద్యుక్తుడగును. నిరంతర మట్టి జ్ఞానదూరుడు సహజముగనే యభ్యుదయపదవినుండి భ్రష్టుడయిపోవుచునేయుండును. సంతతమట్టి వివేచనా జ్ఞానశూన్యునకు నుత్థానపథ సంస్మరణయే యుండదు.

(10) ఉదారభావరహితుండును, కృపణుండును నగు దుష్టమానవుడు దేవలోకప్రాప్తిం బడయనర్హుడు. దానశీలుం డగు వ్యక్తిపుంగవుని మహత్తరానూన కీర్తిచంద్రికాప్రకాశము కేవలము విజ్ఞప్రపంచమునందే కాక మూఢజనప్రపంచమందు సహితము ప్రసరించుట వాస్తవము. దానశీలతను సంస్తుతింపనోచని జాతియే యీ యిలాతలంబున నవతరించియేయుండలేదు. దానమను శబ్దమందలి మాహాత్మ్యము సాధారణ మానవబుద్ధి కగోచరము. దానమే మానవజాతికి శిరోభూషణసదృశము. దీనిప్రభావంబున బరలోకమునం దపారసౌఖ్య ప్రపత్తి దాతకు నిర్విఘ్నముగా లభ్యమగును. దానమనగా తాత్పర్యము ధర్మదానము. అపాత్రదానము కాదు.

(11) ధర్మదానము విజ్ఞప్రపంచము యొక్క స్వాభావికసంపత్తి జ్ఞానిప్రపంచమందలి సమస్తములగు సంపదలలోని కెల్ల ధర్మదానమునే వాస్తవికైశ్వర్యముగ భావించి, పూజించును. పృథ్వీతలంబున నపార పారావార పరివేష్టిత భూవలయంబున కధినాథుడగుటకంటెను, మహత్తరశక్తియుక్తంబును, దివ్యానూన సౌఖ్యసంధాయకంబును నగు స్వర్గధామాభిలాషాన్వితహృదయుం డగుటకంటెను సమస్తభూమండలవిరాజిత దిగంత విఖ్యాతపండిత మండలాగ్రగణ్యులపై నాధిపత్యము

వహింప గాంక్షించుటకంటెను మానవుడు నిర్వాణమందిర ప్రథమసోపానారోహణాభిలాషను గల్గి తదనుకూలంబుగ వర్తించుట హితకరము.

లోకవర్గము పరిసమాప్తము.



## బుద్ధవగ్గో.

యస్స జితం నావజీయతి
జిత మస్స నోయాతి కోచి లోకే,
తం బుద్ధ మనన్తగోచరం
అపదం కేన పదేన నేస్సథ. ౧

యస్స జాలినీ విసత్తికా
తణ్హా నత్థి కుహిఞ్చి నేతవే,
తం బుద్ధ మనన్తగోచరం
అపదం కేన పదేన నేస్సథ ౨

యే ఝానపసుతా ధీరా నేక్ఖమ్మూపసమే రతా,
దేవాఽపి తేసం పిహాయన్తి సమ్బుద్ధానం సతీమతం. 3

కిచ్ఛో మనుస్సపటిలాభో కిచ్ఛం మచ్చాన జీవితం,
కిచ్ఛం సద్ధమ్మసవణం కిచ్ఛో బుద్ధానం ఉప్పాదో. ౪

సబ్బ పాపస్స అకరణం కుసలస్స ఉపసమ్పదా,
సచిత్త పరియోదపనం ఏతం బుద్ధానసాసనం. ౫

ఖన్తీ పరమం తపో తితిక్ఖా
నిబ్బాణం పరమం వదన్తి బుద్ధా,
నహి పబ్బజితో పరూప ఘాతీ
సమణో హోతి పరం విహేఠయన్తో. ౬

అనూపవాదో అనూపఘాతో పాతి మోక్ఖే చ సంవరో,
మత్తఞ్ఞుతాచ భత్తస్మిం పన్తంచ సయనాసనం,
అధిచిత్తేచ ఆయోగో ఏతం బుద్ధానసాసనం. ౭

నకహాపణవస్సేన తిత్తి కామేసు విజ్జతి,
అప్పస్సాదా దుక్ఖా కామా ఇతి విఞ్ఞాయ పణ్డితో. ౮

అపి దిబ్బేసు కామేసు రతిం సో నాఽధిగచ్ఛతి,
తణ్హాక్ఖయరతో హోతి సమ్మాసమ్బుద్ధసావకో. ౯

బహుం వే సరణం యన్తి పబ్బతాని వనానిచ,
ఆరామ రుక్ఖచేత్యాని మనుస్సా భయతజ్జితా. ౧౦

నేతం ఖో సరణం ఖేమం నేతం సరణ ముత్తమం,
నేతం సరణ మాగమ్మ సబ్బదుక్ఖా పముచ్చతి. ౧౧

యోచ బుద్ధంచ ధమ్మంచ సంఘంచ సరణం గతో,
చత్తారి అరియసచ్చాని సమ్మప్పఞ్ఞాయ పస్సతి. ౧౨

దుక్ఖం దుక్ఖసముప్పాదం దుక్ఖస్సచ అతిక్కమం,
అరియంచఽ ట్ఠాజ్గికం మగ్గం దుక్ఖూపసమగామినం. ౧౩

ఏతం ఖో సరణం ఖేమం ఏతం సరణ ముత్తమం,
ఏతం సరణ మాగమ్మ సబ్బదుక్ఖా పముచ్చతి. ౧౪

దుల్లభో పురిసా జఞ్ఞో న సో సబ్బత్థ జాయతి,
యత్థ సో జాయతి ధీరో తం కులం సుఖమేధతి. ౧౫

సుఖో బుద్ధానం ఉప్పాదో సుఖా సద్ధమ్మ దేసనా,
సుఖా సంఘస్స సామగ్గి సమగ్గానం తపో సుఖో. ౧౬

పూజ రహే పూజయతో బుద్ధే యది వ సావకే,
పపఞ్చ సమతిక్కన్తో తిణ్ణసోకపరిద్దవే. ౧౭

తే తాదిసే పూజయతో నిబ్బుతే అకుతోభయే,
న సక్కా పుఞ్ఞం సఙ్ఖాతుం ఇమేత్త మపి కేనచి. ౧౮

ఇతి బుద్ధవగ్గో.

---

బుద్ధవర్గము. సిద్ధవర్గము.

ఒకానొక దివసము శ్రమణు లనేకులు బౌద్ధవిహారమం దిరమున గూర్చుండి, బుద్ధత్వపదప్రాప్తివిషయమయి యన్యోన్య వాదవివాదముల సేయదొడంగిరి. పరస్పరము నైక్యభావం

బు లేక యే కావించు తర్క వితర్కములచే సత్యాసత్యనిర్ణయ
మగుట యతిదుర్లభంబని వారలకు దెల్లమాయె. వైయక్తి
(వ్యాక్తేయ) ద్వేషభావ బాహుళ్యంబున భావాతీతంబగు
నిగూఢ సత్యవిషయము సువ్యక్తమగుట దుస్సాధ్యమని యెల్ల
రొక్క పెట్టున విశ్వసించి, శ్రీబుద్ధచంద్రాగమనమునకై ని
క్షింప సాగిరి. శ్రీబుద్ధదేవుడే మానవహృద్గత దుర్భావపుం
మత్తకుంజరయూథంబు పాలిటి పంచానన రాజమను శుభవా
ను వారెల్లరు సన్యసించుటకు బూర్వమే విశ్వసించియుండిరి
నిరీక్షణసమయమునందే బుద్ధదేవుడావిశాల బౌద్ధసన్యాసమంది
మున బునీతపాదార్పణము సేయ, శ్రీమణు లెల్లరు నిజాసనంబు
ల వీడి, భక్తివినమ్రులై, సాష్టాంగదండ ప్రణామము లా
రించి, యాదేవుని యుచ్చాసనాసీనునిగావించిరి. అంతట బుద్ధ
దేవుని యానందుడిట్లు ముకుళిత కరకమలుండయి, భక్తిపూ
స్సరంబుగ బృచ్ఛించెను:—"దేవా! బుద్ధత్వమును గూర్చియు
నద్దానిబడయువిధానమును గుఱించియు నింతదనుక బరస్ప
వాద వివాదంబుల జేసికొనుచుంటిమి. అల్పజ్ఞులమగు మా
తులకు దివ్యతమంబును, సుజ్ఞాన సంధాయకంబును, భౌతికా
తానంద ప్రదాయకంబును నగు బుద్ధత్వము యొక్క తత్వము
దురవగాహనంబయ్యెడిని. సౌభాగ్యవశంబున ననుమంజస్థి
తి యందున్న దాసులమగు మాకు సమస్తకలుషహరం బగు
భవచ్ఛుభదర్శనంబాయెడిని. అవ్యాజకరుణాసాగరులగు తమ

బుద్ధత్వమును గూర్చి విశదముగ నుపదేశించి, మమ్ము ధన్యాత్ములజేయ వేడుచున్నాడ." అంత శ్రీబుద్ధభగవానుడు ప్రియశిష్యుండగు నానందుని విన్నపము నాలించి, ముదమంది తత్సభాభవన సమావేశిత బౌద్ధపరివ్రాజకుల నుద్దేశించి, యిట్లు ఉపదేశింప నారంభించెను:—

పరివ్రాజకులారా! పరాస్తము కానట్టి విజయమును గల్గినట్టియు, సత్యాసత్య నిర్ణయమును జేయగల్గు పరిపూర్ణజ్ఞానసంపన్నత్వముచే విలసిల్లునట్టియు, కామక్రోధాద్యరిషడ్వర్గదూరుండయినట్టియు, అప్రమాదమునే స్వకీయధర్మముగ నెంచునట్టియు, సాధారణ మానవబుద్ధి కగోచరంబగు సత్పథము ననువర్తించునట్టియు బుద్ధుని, ప్రబుద్ధుని - భ్రష్టుని గావింపగలవారలెవ్వరు?

(2) విషపూరితంబులును, బంధనయుక్తంబులును నగువిషయవాంఛల నతిక్రమించిన ధీరోదారుండగు బుద్ధుని దృష్ణయను ముక్కిడి రక్కసి నిజమాయాబంధనముల బంధించి, సత్పథచ్యుతుని గావింప నేయవస్థయందును సమర్థము కాజాలదు. సుజ్ఞానమునె ప్రాణప్రదముగా భావించి, యారాధించునగమ్యాతీతకాలజ్ఞుడగు బుద్ధుని సన్మార్గభ్రష్టుని గావింప గలవారలెవ్వరు?

(3) జీవితాంతము పర్యంతము భావమునందయిన బాప కార్యాచరణాభిలాష లేనట్టియు, నిరంతరము మానవోచిత సత్కార్యముల సలుపునట్టియు, సుజ్ఞానమునార్జించి సుస్థిరంబగు చిత్తముతో ధ్యానమననాదుల లగ్నమనస్కుండయినట్టియు, బాహ్యాంతశ్శుద్ధములగు ధర్మముల నాదరించునట్టియు బుద్ధుని గాంచి యమరబృందము సహితము లజ్జావనతమస్తకంబగుట నిక్కవము.

(4) పరిబుద్ధుడును (జాగ్రదవస్థయందుండు వాడు), అప్రమత్తుడును, స్వకీయోత్తమకార్యానుకూలధ్యానతత్పరుండును, ధీమంతుడును మఱియు నిరంతరైకాంతవాసాభిలాషియు నగు బుద్ధునిగాంచి దేవతలు సహితము స్పర్ధాళురయి యుందురు.

(5) పృథ్వీతలంబున మానవజన్మనుబడయగల్గుట కడు దుర్లభము; మానవోచితంబగు సద్ధర్మనిర్వహణ సామర్థ్యమును సంపాదింపగల్గు టంతకంటె గష్టసాధ్యము. సత్యధర్మమును గుర్తెఱుంగు టంతకంటె దుస్తరము. వీనియన్నింటికంటె బుద్ధుడు లేక సిద్ధుడగుట యంతకంటె కష్టతరంబుగదా!

(6) ధైర్యస్థైర్యము లేక కష్టానుభవమునందు సహనశీలతయే సర్వోత్తమంబగు తపమనియు, క్షమయే నిర్వాణపదస్వరూపమనియు, బరుల హింసించునట్టియు, దూషించునట్టియు

మానవుడు శ్రమణుడుకాడనియు బౌద్ధమతావలంబకు లెల్లవేళల బ్రిజాసంఘమున కుపదేశింపుచుందురు. ఇవ్విధంబుగ బోధించు టయే మామకంబగు ధర్మము.

(7) మఱచియయిన బరనింద కుపక్రమింప కుండుట, ప్రాణికోటిని హింసింపకుండుట, సద్ధర్మానుకూలంబుగ జితేం ద్రియుడయి వర్తించుట, రసనేంద్రియలోలుపతను బాసి మితా హారవ్యవహారముల గల్గియుండుట, ఏకాంతవాసమును, మా నవ్రితానుష్ఠానము నధికముగ బ్రేమించుట, సాధుభావంబుల జ్రింతనసేయుట మొదలుగాగల సుజ్ఞాన దాయకంబులగు భావ ములే బౌద్ధధర్మోపదేశమందలి సారాంశము.

(8) మానవుని, పుణ్యవశంబున నిలాతలంబున జ్ఞానో పార్జనకయి జననమందిన మానవుని భ్రష్టునొనరించు తృష్ణ యపారపారావారమును బోలియుండును. దీనిదురాశకు హద్దులేదు. అవిరళ కనకముద్రికావర్షపాతమును వీక్షించి నను తృష్ణాబద్ధుండగు మానవునకు దనివి తీరదు. తృష్ణాభిరు చిని క్షణభంగురమనియు, దుఃఖప్రదమనియు గ్రహింపశక్తుం డగు నరుడు స్వర్గమందలి సౌఖ్యములనయిన నభిలషింపడు. అట్టి వివేకవంతునికి స్వర్గీయసౌఖ్యసముదాయము సహితము సంతసము నొదవజేయజాలదు. అట్టి యలౌకికపురుషోత్తముడు సమస్తవిధముల దృష్ణను సమయజేయును, నాత్మేంద్రియ

దమనమునందే మహత్తరంబగు సర్వతానందసాగరమున నీదులాడుచుండును.

(9) ఆత్మానందప్రతిబంధకంబగు తృష్ణావిసర్జనమే నిర్వాణపదప్రాప్తికిమూలము. తృష్ణారాహిత్యమే మానవునకు స్వర్గీయసౌఖ్యమును హాసియింపజేయు విషయవికారవిహీనంబును, నిత్యానందశాంతినిలయంబును నగు నిర్వాణమును బ్రసాదించును.

(10) విషయవికారజనితవిషమపరిణామసందర్శనంబున భ్రాపంచికులు భయభీతులయి, శాంతినిమిత్తము జనాకీర్ణములగు స్థలములకు దూరముగానుండు పర్వతారణ్యవనవృక్షమూలముల యాశ్రయమునందుచుందురు. అనగా నట్టివిషయలంపటుల జ్ఞానాధిక్యంబున దుష్కార్యపరతంత్రులయి, విషమపరిణామకాలంబున ఖేదితాత్ములయి, సమస్తార్తుల దూరీకృతమొనరింప నభిలషించి, నిర్జనభూముల శరణుజొచ్చుచుందురు.

(11) కాని యట్టివారికి పర్వతములును, భయంకరాటవులును, నికుంజములును భూరుహములును యెంతమాత్రము సుఖదాయకంబులగు నాశ్రయములు కాజాలవు. స్వప్నావస్థయందయిన నిట్టి యాశ్రయములజేరు నరులు ప్రచండవిషయవికారస్వరూపంబగు దుఃఖమునుండి విముక్తి నందజాలరు

విషాదోత్పత్తికాంతుపరిభావంబున నంతరంగమున నుద్భూత మగుచుండును గాని జనసమ్మర్దంబగుమానవలోకంబున గాదని గుర్తెరుంగగల్గు సామర్థ్యము బుద్ధునియందే వెలయుచుండును. కాంత్యాన్వితునకు జనాకీర్ణనిర్జనపరిదేశములు రెండును సమములేసుమీ !

(12), (13) సత్యజ్ఞాన సమన్వితుండగు బుద్ధుని, వాని ధర్మమును, సంఘమును భక్తిపురస్సరంబుగ నాశ్రయించి, సత్యజ్ఞానమును, చిత్తచాంచల్యరాహిత్యమున నార్జించి, యద్దానితోబాటు నార్యసత్యచతుష్టయమును, బవితాష్టాంగ మార్గములను జేకొను బుద్ధిమంతుడే సంసారమున వాస్తవికంబగు సురక్షితాశ్రయమును బడయగల్గుట నిక్కువము. అద్దియే శ్రేష్ఠతమంబగు సదాశ్రయము. ఏతదాశ్రయంబున మనీషి సమస్తక్లేశపుంజములనుండి సంపూర్ణవిముక్తిం బడయుట యథార్థము. పాఠకగణసౌకర్యము నభిలషించి బౌద్ధ ధర్మవిభాగమును బోధించు వివరణము నిటనే చేర్కొనుచున్నాడ :— ఆర్యసత్యచతుష్టయము- 1 దుఃఖము 2 దుఃఖమూలము 3 దుఃఖాంతము లేక నాశనము 4 దుఃఖోపశమనోపలబ్ధి కర్హములగు నష్టాంగమార్గము లియ్యవి :— 1 సమ్యగ్దృష్టి 2 సమ్యక్సంకల్పము 3 సద్భాషణము 4 సత్కర్మ 5 సజ్జీవితము, 6 సత్యవ్యాయామము, 7 సత్యస్మృతి. 8 సత్సమాధి.

(14) సుజ్ఞాననిలయంబగు బౌద్ధధర్మవృక్షమూలము నాశ్రయించు వ్యక్తిని సాంసారికభయవిషాదములు స్పృశింప నేరవు. అవ్వానిని మృత్యుభయసహితము వీక్షించినంతనే భీతి జెందును. జన్మరాహిత్యమే వానికి లభ్యమగు సుస్థిరానంద ప్రదాయకసత్ఫలము.

(15) భౌతికప్రపంచమున కతీతంబగు తేజస్సంపన్నుం డగు బుద్ధుడు సర్వస్థానముల జననమందుట కడు దుర్లభము. ఆ పుణ్యపురుషుడు, ఆ విషయవికారదూరుడు, ఆ నిశ్చల ధ్యానతత్పరుడు, ఆ సత్యజ్ఞానమూర్తి సర్వత్ర జన్మించుట స్వప్నవార్త. అట్టి మహత్తరజ్ఞానప్రభాభాసితుండగు బుద్ధు డుత్పన్నమయిన ప్రదేశము, వంశము, శుక్లపక్షవిభావరీమనో హారుంబోలి శోభిల్లుట నిక్కువము.

(16) సద్ధర్మము లుప్తమగుడు, అధర్మము విజృంభించి అసత్యము, అన్యాయము, నిర్దయ, కాఠిన్యము, మొదలగు సహ చరుల జేదోడువాదోడుగా గొని రాజ్యపరిపాలనము సేయు ప్రళయావస్థయందు మానవహితార్థమయి బుద్ధు లవతరింపు చుందురు. అట్టితఱి శ్రీ బుద్ధాగమనము సుఖప్రదము. అతని సద్ధర్మోపదేశము సుఖదాయకము. సాంఘికశాంతి సౌఖ్యా వహము. స్థిరచిత్తులకు బుద్ధునియెడ భక్తి శాశ్వతానంద

ప్రదాయకము. బుద్ధుని విశ్వసించువారిజీవితములు సంసార సాగరమునుండి తరించి, యభ్యుదయము జెందుట వాస్తవము.

(17) అజ్ఞానాంధకారబంధురంబగు సంసారమును దాటి జ్ఞానజ్యోతిర్మయంబగు నిర్వాణమందిరప్రవేశము సలుపగల్గినట్టి బుద్ధుడును, అతని ధర్మము నాలకించి, దదనుకూలంబుగ వర్తించు నిశ్చలచిత్తులగు బౌద్ధులును నాదరింపదగినవారు. అట్టివారిని సన్మానించువారికి చిత్తశాంతి లభ్యమగును.

(18) నిరంతరము బుద్ధసేవాపరతంత్రుడును, కామదేవుని సైన్యసమేతముగ సద్ధర్మసమరక్షేత్రమున బూర్ణముగ బరాజితుని గావించినట్టివిజేతయును, దుఃఖసాగరతరణమునందు సాఫల్యత నందినట్టివాడును, మోక్షసామ్రాజ్యస్వరూపంబగు సుజ్ఞానము నందినవాడును, నిర్భయచిత్తుండును నగు వ్యక్తియే బుద్ధుడు. అట్టి బుద్ధుని పుణ్యమునకు హద్దులేదు. అతడు నిత్య పూజార్హుడు. బుద్ధుని పుణ్యచంద్రికా దివ్య తేజః కాంతులు ముల్లోకంబుల సమస్త దిగ్వలయంబుల బ్రసరింపుచుండును. అట్టి బుద్ధునారాధించువాని పుణ్యమునకు హద్దు లేదుకదా!

బుద్ధవర్గము పరిసమాప్తము.

---

## సుఖవగ్గో

సుసుఖం వత జీవామ వేరినేసు అవేరినో,
వేరినేసు మనుస్సేసు విహరామ అవేరినో. ౧

సుసుఖం వత జీవామ ఆతురేసు అనాతురా,
ఆతురేసు మనుస్సేసు విహరామ అనాతురా. ౨

సుసుఖం వత జీవామ ఉస్సుకేసు అనుస్సుకా,
ఉస్సుకేసు మనుస్సేసు విహరామ అనుస్సుకా. ౩

సుసుఖం వత జీవామ యేసంనో నత్థి కించనం,
పీతిభక్ఖా భవిస్సామ దేవా ఆభస్సరా యథా. ౪

జయం వేరం పసవతి దుక్ఖంసేతి పరాజితో,
ఉపసన్తో సుఖం సేతిహిత్వా జయపరాజయం. ౫

నత్థి రాగసమో అగ్గి నత్థి దోససమోకలి,
నత్థి ఖన్ధాదిసా దుక్ఖా నత్థి సన్తిపరం సుఖం ౬

జిఘచ్ఛా పరమారోగా సఙ్ఖార పరమా దుఖా,
ఏతం ఞత్వా యథాభూతం నిబ్బాణం పరమం సుఖం ౭

ఆరోగ్య పరమా లాభా సన్తుట్ఠిపరమం ధనం,
విస్సాస పరమా ఞాతి నిబ్బాణం పరమం సుఖం. ౮

పవివేకరసం పీత్వా రసం ఉపసమస్సచ,
నిద్దరో హెూతి నిప్పాపో ధమ్మపీతిరసం పిబం. ౯

సాధు దస్సన మరియానం సన్నివాసో సదా సుఖో,
అదస్సనేన బాలానం నిచ్చమేవ సుఖీ సియా. ౧౦

బాలసఙ్గత చారీ హి దీఘమద్ధానం సోచతి,
దుక్ఖో బాలేహి సంవాసో అమిత్తేనేవ సబ్బదా,
ధీరోచ సుఖసంవాసో ఞాతీనంఽవ సమాగమో. ౧౧

తస్మాహి
ధీరం చపఞ్ఞంచ బహుస్సుతంచ
ఘోరయ్హసీలం వతవన్త మరియం,
తం తాదిసం సప్పురిసం సుమేధం
భజేథనక్ఖత్తపథంఽవత చన్దిమా. ౧౨

ఇతి సుఖవగ్గో.

---

సుఖవర్గము

యావనకాలమునందలి, చిత్తపరివృత్తుల పరిణామం బతి విలక్షణము కదా! సముద్రతరంగమాలికాతారుణ్య తారళ్య ము మానవుని ద్వితీయావస్థయందే నెక్కుడు సార్థకంబగు ను. ప్రచండముగ వీచు వాయువునందలి హరితపత్రఫలపుష్ప

భరితంబగు భూరుహము మాడ్కి తారుణ్యము (యౌవనము) మానవశరీరవృక్షము నొక్కుమ్మడి ద్విగుణిత పరిభావంబున నూపివైచును. నవయువక బౌద్ధభిక్షువు లిద్దరు పారస్పరిక విద్వే షంబున దగవులాడి, నాటినుండి వాగ్బంధము గావించుకొని చరింపసాగిరి. అనుదినము వారివైషమ్య భావమినుమడించి ప్రేమభావమును శతమత మొనర్చి, విషాదము నొదవజేయు చుండెను. ఏతద్విషయ మల్పకాలమునందె శ్రీబుద్ధభగవాను నికి విశదమయ్యెను. దేవుడంతట నవివేకులగు శిష్యుల మనో మాలిన్యమును దూరమొనరించి, యుభయుల హృదయముల నవ్యతర ప్రేమ భావోదయము గావింప నభిలషించి, బౌద్ధసన్యా సులనెల్ల నొక్కచో సమావేశపఱిచి, వారిహృత్కమలము లు బ్రఫుల్లితమగు నీరీతి నుద్బోధింప గడంగెను:—

"బిడ్డలారా!

(1) మనల హృదయపూర్వకంబుగ సమస్త విధముల ద్వేషించుమనుజుల బునః మనము ద్వేషింపక ప్రేమింపవలయు ను. మానవులమగు మనము ద్వేషభావపరీత హృదయుల, సంఘమునందు ద్వేషరహితులమై, సంపూర్ణప్రేమ ప్రపూర్ణ చిత్తులమయి,నిరంతరము వర్తింపవలయును. ఇది యొసల్లక్షణము

(2) పీడితవ్యక్తులలో మనము బాధాశూన్యులమయి వ్యవహరింపవలయును; వ్యాధిగ్రస్తులలో వ్యాధిరహితులమయి

మెలంగుచుండుట శ్రేయస్కరము; విషయవాసనాపరతంత్రులయందు సంయమవ్రతానుష్ఠానపరులమయి, అచంచల చిత్తులమయి వర్తించుట హితకరము. ఏతద్విధాన స్వీకారమే శ్రేయోదాయకము.

(3) ఆసక్త (అనురక్తులు) పురుషులలో రాగరహితుల మయి మనుట యుక్తము. లోభపరిపూర్ణ హృదయులమధ్య నిర్లోభులమయి, పూర్ణోదారులమయి సంచరించుటయే శ్రేయస్కరము.

(4) "ఈప్రపంచమున నేదియు నాయది కాదు" యని తెలిసి సుఖపూర్వకంబుగఁ మిథ్యాభిమానము నెడబాసి, భ్రమను రోసి, మసలుట సుఖప్రదంబు. నాది, నేను యనునహంకార మమకార శూన్యుడయి వర్తించు వ్యక్తిపుంగవుడు శాశ్వత సౌఖ్యానుభవపరాయణుఁ గు దేవతలవలె స్వయంజ్యోతిస్వరూపుడయి, మహత్తరానందము ననుభవింపగలడు.

(5) విజయమనారతము విద్వేషాగ్ని రగుల్కొలుపును గతంబదెద్ది యన జయించిన వ్యక్తి సుఖింప, పరాభూతుడగు వ్యక్తి ఖిన్నుడగును. ఏతత్సుఖదుఃఖద్వయముమధ్య నుద్భూత మగునదే ద్వేషము. జయాపజయములు స్వభావసిద్ధములని

యెంచి, తద్వికారద్వయ పరిత్యాగము సల్పు మానవోత్తముం డు దివ్యతమానంద సాగరవీచి కాడోలికల నుయ్యెలలూగును.

(6) విషయభోగ మొక్క ప్రజ్వరిల్లుచున్న భూధరము వంటిది. విషయభోగానల జ్వాలలంబోలు భీషణాగ్నిజ్వాలలు సృష్టియందున లేవు. భయంకరకలహముల కక్షయభండారమగు ద్వేషమునుబోలు మఱియొక దుర్గుణాగారము లేదు. సమస్త కిల్బిషములకు మూలము విద్వేషమె. దేహధారణమును మిం చిన దుఃఖములేదు. మానవస్కంధమే దుఃఖోత్పత్తి స్థానము కదా! శాంతిని బోలు మహాస్వర్గము లేక నిర్వాణము లేదు.

(7) పృథ్వీతలమందలి సమస్తవ్యాధులలోనెల్ల దృష్ణ యే మహాప్రచండ రోగము; దీనికారణంబుననే సంతతము కాయమునకు జననమరణాది క్లేశము లుప్పతిలుచున్నవి. దుఃఖ ములలోనెల్ల దేహమే యసహనీయదుఃఖ భండారము. నిర్వా ణపదమే సమస్తవిధసౌఖ్యములకంటె సర్వోత్కృష్ట సౌఖ్యా నంద సంధాయకంబు.

(8) ఆరోగ్యమే సర్వోత్తమంబగు సంరక్షణము; నిరం తర నిస్త్రైతుకానందానుభవమే ధనధాన్యసంపత్తి; విశ్వాసమే యుత్తమోత్తమ బంధుత్వము; నిర్వాణమే యతులితానూన పరిశుద్ధానందప్రదాయకంబు.

(9) ఏకాంతవాస జనితసౌఖ్యము ననుభవించువాడును, శాంత్యంతర్గత రసాస్వాదనము సేయువాడును మఱియు ధర్మామృతపానము సేయువాడును పాపభీతులనుండి సంపూర్ణ విముక్తి నంది ఘనముగ సుఖించుట నిక్కువము.

(10) శ్రేష్ఠగుణ సంపన్నార్య సందర్శనము శుభప్రదంబు; తత్సాంగత్య మత్యంత శ్రేయస్కరము; దుష్టజనసందర్శన మత్యంత విషాదకరము; మూర్ఖజనసందర్శనము బడయని వ్యక్తి పుంగవుడు సుఖసంపన్నుండగుట సత్యము.

(11) దుష్టజనసాంగత్యము నభిలషించువాడు విశేష కాలము పర్యంతము విషాదాయత్తచిత్తుండయి పఱగగలడు; మూర్ఖజనుల స్నేహము శాత్రవుల మైత్రివలె నసహనీయ విషాదప్రదాయకము; సుఖప్రదంబగు నాత్మీయజనసాంగత్యము చందమున సజ్జనసాంగత్యము పరిశుద్ధానందప్రదంబు. దుర్జన సాంగత్యము మృత్తికానిర్మిత ఘటసదృశంబుగ నల్పకాలము నందే ఖండ ఖండములయి చిత్తమునకు జింత నొడగూర్చును; సజ్జనసాంగత్య మట్లుకాక కనకకలశమువలె బదిలముగనుండి మది కామోద మొదవజేయును.

(12) కనుక బుద్ధిమంతులును, ప్రజ్ఞావంతులును, పండిత ప్రవరులును, ధైర్యవంతులును, గర్తవ్యపరాయణులును నగు

మహాత్ముల ననుసరించుట హితకరము. కమలారి యేరీతి దారాపథము ననుసరించుచున్నాడో, అదియేచందమున సమస్తజనులును, ధీమంతులును, సచ్ఛరిత్రులును నగు పుణ్యపురుషుల ననుకరింపవలయును. సత్పురుష కార్యానుసరణమునందే మానవాభ్యుదయము డాగియుండును. సజ్జనకార్యానుకరణమే సమస్తవిధసౌఖ్యముల కాలవాలము. ప్రభాకరోదయంబున ముకుళితసరోజము వికసించు పగిది సజ్జనసందర్శనంబున మానవహృదయము వికసించును.

సుఖవర్గము పరిసమాప్తము

---

## పియవగ్గో

అయోగే యుఞ్జమత్తానం యోగస్మించ అయోజయం,
అత్థం హిత్వా పియగ్గాహీ పిహేతఽత్తాను యోగినం. ౧

మా పియేహి సమాగఞ్ఛి అప్పియేహి కుదాచనం,
పియానం అదస్సనం దుక్ఖం అప్పియానంచ దస్సనం. ౨

తస్మాపియం నకయిరాథ పియాపాయో హి పాపకో,
గన్థా తేసం నవిజ్జన్తి యేసం నత్థి పియాప్పియం 3

పియతో జాయతీ సోకో పియతో జాయతీ భయం,
పియతో విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౪

పేమతో జాయతీ సోకో పేమతో జాయతీ భయం,
పేమతో విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౫

రతియా జాయతీ సోకో రతియా జాయతీ భయం,
రతియా విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౬

కామతో జాయతీ సోకో కామతో జాయతీ భయం,
కామతో విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౭

తణ్హాయ జాయతీ సోకో తణ్హాయ జాయతీ భయం,
తణ్హాయ విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౮

సీలదస్సనసమ్పన్నం ధమ్మట్ఠం సచ్చవాదినం,
అత్తనో కమ్మ కుబ్బానం తం జనో కురుతే పియం. ౯

ఛన్దజాతో అనక్ఖాతో మనసాచ ఫుటో సియా,
కామేసుచ అప్పటిబద్ధచిత్తో ఉద్ధం సోతోఽతి వుచ్చతి. ౧౦

చిరప్పవాసిం పురిసం దూరతో సోత్థి మాగతం,
ఞాతిమిత్తా సుహజ్జాచ అభినన్దంతి ఆగతం. ౧౧

తథేవ కతపుఞ్ఞంఽపి అస్మాలోకా పరం గతం,
పుఞ్ఞాని పటిగణ్హన్తి పియం ఞాతీఽవ ఆగతం. ౧౨

ఇతి పియవగ్గో

---

## ఆసక్తవర్గము (అనురక్తవర్గము)

శ్రీ బుద్ధభగవానునిచే నాదేశింపబడి యాదేవుని శిష్య ఛాత్రుండగు నానందుడు దేశమునందు బర్యటనము సలుపుచు, బౌద్ధమతప్రచారము సేయ స్వస్థానమునుండి బయల్వెడలెను. మాసచతుష్టయానంతరము స్వస్థానమున కరుదెంచి, స్వానుభవవిశేషంబున బ్రపంచ క్షేత్రంబున వీక్షింపగల్గిన చిత్రవిచిత్రముల భగవానునికి భక్తిపూర్వకంబుగ విన్నవింప గడంగెను. కామక్రోధ మదమాత్సర్య తృష్ణాది దుర్గుణగణ దుఃఖోత్పాదక దృశ్యసందర్శనంబున బాపమానందుని హర్షబాహుళ్య మస్తమింప, విశేషవిషాదపరీతహృదయుండయ్యెను. శ్రీ బుద్ధదేవు డానందుని దుఃఖాతిరేకము నుపలక్షించి, డెందమున సందేహమంది, యాతని దుఃఖమును దూరీకృతమొనరింప గాంక్షించి యిట్లు నుడువదొడంగెను :—

"కుమారా!

(1) స్వకీయజీవితాదర్శధర్మమును విస్మరించినవాడును, నిరర్థకవిషయానురక్తుడయి యుండువాడును, నిరంతర సద్ధ్యానాయత్తచిత్తుడయి యుండుటకు మారుగ ధ్యానదూరుడయి మెలంగువాడును, ఇంద్రియసుఖానువర్తియయి చరించువాడును, నిజనికృష్టజీవితప్రభావంబున గాలము గతించినంతనే పరమపునీతభావసంపన్నుండగు సత్పురుషునియెడ స్పర్ధగల్గి మెలంగుచుండును.

(2) మానవుడు సర్వకాలసర్వావస్థలయందును ప్రియాప్రియ పదార్థాన్వేషణమునకయి యత్నంబు సలుపరాదు. గతంబెద్దియన, ప్రియపదార్థప్రాప్తికలుగనియెడల బ్రియత్నము సలిపిన వ్యక్తి మానసమున కమితవిషాదము వాటిల్లును. అప్రియపదార్థప్రాప్తివలన సహజముగనే మానవునకు ఖేదము సంభవించును. కనుక ప్రియాప్రియవస్తువాంఛ దుఃఖమునకు మూలము.

(3) ఏతత్కారణంబున నీసంసారమున మానవు డభిలషింపదగిన పదార్థమెద్దియు గానరాదు. వాంఛిత ప్రియపదార్థ వియోగమే విషాదోత్పత్తికి హేతుభూతమగును. ప్రియాప్రియ వస్తుకాంక్షారహితుడయి, యేవస్తువునెడను మమకారమును గల్గియుండని వ్యక్తియే సమస్తవిధముల సంసారబంధన విముక్తుండయి సుఖించును

(4) ఆసక్తివలననే శోకమును, భయమును నుత్పన్నములగుచున్నయవి. ఆసక్తియను మహాసంకటమునుండి సంపూర్ణముగ విముక్తినందిన నరుడు భయవిషాదములకు వశీభూతుడు గాక స్వేచ్ఛానువర్తియయి, సచ్చిదానందము ననుభవించును.

(5) స్నేహము (అనురాగము) నుండియే భయోత్పత్తియగుచున్నది; విషాదముసహిత మీయనురాగమునుండియే

యుద్భవింపుచున్నయది. స్నేహమును స్వప్నావస్థయందయిన గాంక్షింపక సంపూర్ణముగ విస్మరింపగల్గిన నరుడే ధన్యుడు. అట్టి వివేకవంతుడును వ్యామోహశూన్యుడును, పరిశుద్ధాంతఃకరణుడును భయవిషాదములనుండి విడివడి స్వేచ్ఛానంద పరతంత్రుడయి మెలంగగలడు.

(6) విషయభోగాసక్తియే శోకోత్పత్తికి మూలము; భయమునకుసహిత మదియే హేతువు. విషయభోగానురక్తి (మైధునేచ్ఛ) నుండి సంపూర్ణ స్వాతంత్ర్యసౌభాగ్యము నందగల్గిన ధీమంతుని, నిశ్చలచిత్తు నేయవస్థయందును శోకభీతులనియెడి ముక్కడిరక్కసులు స్పృశింపనేరవు.

(7) కామమే విషాదము నుద్భూతము సేయుచున్నయది; భయమునుసహిత మద్దియే వాటిల్లజేయుచున్నది. కామమే మానవజాతి నీవసుధాస్థలి నావహించియున్న భయవిషాదాగ్నిజ్వాలోదయమునకు గారణభూతము. కామక్రియానురక్తి శూన్యుడగు వ్యక్తియే భయవిషాదములనుండి విడుదలనంది, నిర్వాణమునకు శ్రాపించును.

(8) తృష్ణయే దుఃఖమునకు మూలహేతువు; తృష్ణవలననే మానవకోటి కిలాతలంబున భీతి నొందవుచున్నయది. తృష్ణాజాలమునుండి విముక్తివడసిన మహాధీరుడే సమస్తవిధముల వికారదూరుడయి సంసారమున జీవన్ముక్తినందును.

(9) సద్గుణసంపన్నుండును, ధీమంతుడును, న్యాయపరాయణుండును, యథార్థవాదియును, నిరంతరనిజకర్తవ్యపరిపాలనాసక్తియుక్తుండును నగు నరపుంగవుడు విరించి వినిర్మిత విశాలవిశ్వమునం దెల్లెడల బూజ్యుడయి, సమస్తజన ప్రేమాస్పదుడయి మెలంగుచుండును.

(10) అనిర్వచనీయానందకందంబగు నిర్వాణపదప్రాప్త్యభిలాషాయుక్తుండును, నిరంతరము మనస్తుష్టిచే నొప్పునట్టియు, విభ్రాంతభావ సందోహజనిత వ్యామోహరహితుడయినట్టియు బురుషసత్తముని యూర్ధ్వరేతస్కుడ (వాసనారహిత సద్భావనస్రవంతి యందు మజ్జనమొనర్చిన వాడు) చెప్పుదురు. అట్టివా డెల్లవేళల వినిర్మల భావప్రవాహంబున స్నానమాచరింపుచు, పరిశుద్ధానందము ననుభవింపుచుండుట వాస్తవము.

(11) దీర్ఘకాలము పర్యంతము స్వగృహము నెడబాసి, దేశాంతరము సంచారమొనర్చి, పునర్గృహాభిముఖుడయి వచ్చునాత్మీయుని వీక్షించి, సహజముగనే బంధుమిత్రాదివర్గ మపరిమితానందము ననుభవించునుగదా ?

(12) అదియేచందమున సత్కర్మానురక్తి యుక్తుడగు నరు డీ యిహలోకయాత్రను జాలించి యనగా దేహము నెడ

బాసి స్వర్లోకమును బ్రవేశించినంతనే యతడాచరించిన శుభ కర్మలు (సుకృతములు) సుహృద్వరరూపమును దాల్చి, తమ కర్తకు సుస్వాగతము నొసగుచు స్వస్తి కొడగూర్చును. సుకృతమే నిర్వాణము నొసంగును.

ఆసక్తవర్గము పరిసమాప్తము.

---

కోధవగ్గో

కోధం జహే విప్పజహేయ్య మానం
సంయోజనం సబ్బ మతిక్కమేయ్య,
తం నామరూపస్మిం అసజ్జమానం,
అకించనం నానుపతన్తి దుక్ఖా. ౧

యో వే ఉప్పతితం కోధం రథం భన్తంఽవ ధారయే,
త మహం సారథిం బ్రూమి రస్మిగ్గాహో ఇతరో జనో. ౨

అక్కోధేన జినే కోధం అసాధుం సాధునా జినే,
జినే కదరియం దానేన సచ్చేన అలికవాదినం. ౩

సచ్చం భణే న కుజ్ఝేయ్య దజ్జాప్పస్మింఽపి యాచితో,
ఏతేహి తీహి ఠానేహి గచ్ఛే దేవాన సన్తికే. ౪

అహింసకా యే మునయో నిచ్చంకాయేన సంవుతా,
తే యన్తి అచ్చుతం ఠానం యత్థ గన్త్వా నసోచరే. ౫

సదా జాగరమానానం అహోరత్తానుసిక్ఖినం,
నిబ్బాణం అధిముత్తానం అత్థం గచ్ఛన్తి ఆసవా. ౬

పోరాణ మేతం అతులం నేతం అజ్జతనా మివ,
నిన్దన్తి తుణ్హీ మాసీనం నిన్దన్తి బహుభాణినం,
మితభాణినంఽపి నిన్దన్తి నత్థి లోకే అనిన్దితో. ౭

నచాహు నచ భవిస్సతి న చేతరహి విజ్జతి,
ఏకన్తం నిన్దితో పోసో ఏకన్తం వా పసంసితో. ౮

యంచే విఞ్ఞూ పసంసన్తి అనువిచ్చ సువే సువే,
అచ్ఛిద్ద వుత్తిం మేధావిం పఞ్ఞాసీల సమాహితం. ౯

నేక్ఖం జమ్బోనదస్సేవ కోతం నిన్దితు మరహాసి,
దేవాఽపి నం పసంసన్తి బ్రహ్మునాఽపి పసంసితో. ౧౦

కాయప్పకోపం రక్ఖేయ్య కాయేన సంవుతో సియా,
కాయదుచ్చరితం హిత్వా కాయేన సుచరితం చరే. ౧౧

వచీపకోపం రక్ఖేయ్య వాచాయ సంవుతో సియా,
వచీదుచ్చరితం హిత్వా వాచాయ సుచరితం చరే. ౧౨

మనోపకోపం రక్ఖేయ్య మనసా సంవుతో సియా,
మనో దుచ్చరితం హిత్వా మనసా సుచరితం చరే. ౧౩

కాయేన సంవుతా ధీరా అథో వాచాయ సంవుతా,
మనసా సంవుతా ధీరా తేవే సుపరిసంవుతా. ౧౪

ఇతి కోధవగ్గో.

---

## క్రోధ వర్గము.

క్రోధోన్మత్తుడయి, బాలభిక్షువగు రాహులుడు సంతత మసంబద్ధప్రలాపము లాడుచుండెడివాడు. వేయేల? ఉచితానుచిత వివేచనాదూరుడయి మూర్ఖునిపగిది నతడు గర్హితపక్షప్రయోగమునందే నిరతిశయానందానుభవము నందుచుండెను. అనేకమార్గ్లీదోషారోపణ మసహ్యతరుణవయస్కులగు భిక్షువులచే రాహులునిపై గావింపబడియుండుట శ్రీబుద్ధభగవానుడు వీక్షించెను. ఆత్మజు సన్యాయక్రోధపూరితవాగ్విలాసప్రాధిమ నవలోకించి, బుద్ధదేవుడు నిజకుమారోద్ధత స్వభావమునకు విచారించి, యొకానొకదివసము నానాదేశాగత భిక్షువుల సమక్షంబున నత్యంత హృదయాహ్లాదకరంబును, శిక్షాప్రదభావ సమన్వితంబుననగు నుపదేశము నొసంగెను. నవాగతశ్రమణగణ సంకుచిత భావసంభరిత హృదయము లాసదుపదేశశ్రవణంబున సూర్యోదయకాలమందలి వారిజములపగిది వికాసభాసురంబులును, విశాలతమసద్భావపూరితంబులును నయ్యెను. తద్దివ్యోపదేశమందలి సారాంశ

పీయూషమును బాలకభ్రాతలారా! రండు! పానముజేసి నిర్జీవత్వము నెడబాసి సజీవత్వమునకు బాల్పడుడు:—

(1) మానవుడు క్రోధమును హాలాహాలభరిత భుజంగరాజముమాడ్కి సత్వరంబె బహిష్కరింపవలయును. అహంకారము (అభిమానము లేక గర్వము) ను జన్మశత్రువుగ భావించి శీఘ్రమే త్యజించు టుత్తమము. సంసారమందలి సమస్తవిధంబులగు బంధనముల బూర్ణముగ ఖండించి సంపూర్ణ విముక్తిని బడయుటయే మానవుని విధి. నామరూప వికార ప్రకారములకు వశీభూతుడుగాక, ప్రపంచక్షేత్ర విరాజిత మనోజ్ఞ వస్తువాంఛను గల్గియుండక, శాంతమూర్తియయి, సత్యజ్ఞానసంపన్నుడయి మెలంగు మానవుని భయంకరంబులగు భయవిషాద పిశాచము లెంతమాత్రమును స్పృశింపనేరవు.

(2) దురితగమనమున బరుగిడు నరదమును నిరోధింప శక్తుండగు వ్యక్తియే సార్థకుండగు యథార్థసారథి. అట్టివాడే సార్థకమయిన రథచోదకు డనబడగును. అదియేచందమున నవాగతతీక్ష్ణ క్రోధావేశమును నిరోధింపగల్గినవాడే యుత్తమపురుషుడు లేక సంయమచంద్రుడగు బుద్ధుడు. శీఘ్రగమన మున నరుగు రథమును నిరోధింప సామర్థ్యము లేనివాడు కేవల మారథమున బూనబడియున్న యశ్వములనోటి కళ్లెముల మ్మాత్రికానిర్మిత మూర్తింబోలి పట్టియుండు గుఱ్ఱపువానిని

బోలియుండును. క్రోధావేశము సరికట్టజాలనివాడు సహితు మంతియే సుమీ!

(3) క్రోధమును ప్రేమవలనను, జెడుగుతనమును మంచితనమునను, లోభము నౌదార్యగుణ విశేషంబునను, నసత్యమును సత్యప్రభావంబునను వశీభూతము గావించుకొనగల్గు వ్యక్తియే భూతలంబున సౌఖ్యమార్గానువర్తకుండయి సంచరింపగల్గును.

(4) మానవుడా! నీ వనారతము సత్యమునే సర్వేశ్వర (నిర్వాణము లేక జ్ఞానస్వరూపంబని తాత్పర్యము) స్వరూపంబుగ భావించి, యారాధింపుచుండుము. క్రోధమును నారకీయగుణముగ గుర్తెఱింగి హింసాత్మకుడవుగాక యద్దానిని శీఘ్రమే విసర్జింపుము; పరులు యాచించు సాధారణపదార్థములకయి లోభగ్రస్తుడవుగాక, వానిని స్వయముగ నీవే నిర్లోభివయి, పరులకు బ్రదానముసేయ సంసిద్ధుడవయి యుండుము. ఏతత్సోపానత్రయము నారోహించువాడు శీఘ్రమే నిర్వాణమందిరమును సమీపించును.

(5) పరజనాపకారమును మానసమునందయిన నసగా భావము చేసనయిన వాంఛింపనట్టియు,సర్వకాలసర్వావస్థలయందు నస్థిరంబగు చిత్తముపై సంపూర్ణాధిపత్యము వహించి యున్న

ట్టియు వ్యక్తి ధర్మాత్ముడని చెప్పబడును. అట్టి ధర్మాత్ముం డగు మానవోత్తముండె శాశ్వతానందనిలయంబగు నిర్వాణ మును బడయనర్హుండు. ధర్మాత్ముడగు వ్యక్తి పరమపదించిన వెంటనే సమస్త భయవిషాదములనుండి విముక్తిజెంది, స్వేచ్ఛా నంద పరతంత్రుడగును.

(6) సర్వదా, అప్రమాదావస్థ (జాగరూకుడయియుం డుట) యందుండువాడును, అహోరాత్రము లధ్యయనము నందు సంలగ్నుడయి యుండువాడును, నిరంతరము సద్బుద్ధి బలంబున నిర్వాణప్రాప్తికయి సత్క్రియాచరణంబున కుపక్రమించువాడును నగువ్యక్తి యనతికాలంబుననే సుకరముగ జీవ న్ముక్తిచే సుఖించియుండును.

(7) నాయనలారా! మామకంబగు నీకథన మర్వాచీన మయినది కాదు. అనాదికాలమునుండియు బ్రహ్మలోకమున బ్రచారమునం దున్నయదియే. మానవమిత భాషణంబుననే ముక్తి ప్రాప్తించునని భ్రమించి, మాధ్యమును, సవివేకమును బహిష్కరింపని పురుషుని, సంసారము గర్హించును. అధిక ప్రసంగానురక్తుని బ్రపంచము వాచాలు డనును. అత్యల్ప ముగ సంభాషించుమనుజు నాప్రపంచమే మూఢుడని వక్కాణిం చును. మానవు డెట్లు సంచరించినను లోకనిందా వాక్యబాణ ములకు గురికాక తప్పించుకొనజాలడు. లోకనిందనుండి

విముక్తింజెందిన వ్యక్తి లెక్క కొక్కరుండయిన నీలోకమున వినరాడు, కనగాడు. సంసారస్వభావ మతివిచిత్రము కదా!

(8) సంసారమునందు సర్వదా ప్రశంసాపాత్రుడయి నట్టికాని, నిత్యము నిందాభాజనుడయినట్టికాని వ్యక్తిని మన మొక్కనినయిన నవలోకింపజాలము; చూచియు నుండలేదు; చూచుచుండుటలేదు. అనగా నట్టివ్యక్తి భూతభవిష్యద్వర్త మానముల గడుదుర్లభుడు.

(9) నిష్కళంక చరిత్రసంపన్నుడును, ధీమంతుడును, వివేక ధురీణుండును, సమస్తసద్గుణాలంకార ప్రియుండును నగుపురుషోత్తముని సమగ్రసంసారము సర్వదా సన్మానించి, సంస్తుతింపుచుండును. అట్టి యలౌకికపురుషుండగు సిద్ధుని దూర గలవార లెవ్వ రుండురు? నిందింపగలవాడు వేలు మడచి లెక్కింప నొక్కరుండయిన లభించుట దుస్తరంబు. గతంబెద్ది యన రత్నమునందు దూషణార్హంబులగు దుర్గుణము లెటను న్నవి? అది దివ్యతమకాంత్యుక్తంబుగదా! రత్నముకల్మషరహి తము; సుప్రకాశభాసురంబు; మానవహృదయాహ్లాదకరంబు; సద్గుణ సంపన్నుండగు సత్పురుషుడునహిత మదియేచందమున సంసారసాగరమునుండి వెలికి దీయబడిన రత్నము. నిర్జరులు సహితము సత్పురుషుని సంస్తవమొనరింపుచునే యుండురు.

బ్రాహ్మణసంఘ మట్టిధర్మాత్మని దివ్యనామసంకీర్తనము సర్వత్రి సంతతము సలుపుచుండుట సత్యము.

(10) మానవుడా! నీవు శారీరకక్రోధానలమునుండి సావధాన చిత్తుండవయి, మసలుము. నిజకాయము ననారత మపరిమత్తుండవయి వశమునం దునిచికొమ్ము. నిత్యము శారీరక దోషపుంజబహిష్కారమునకయి యుద్యమింపు చుండుము. దేహము నెల్లపుడు సద్గుణాభూషణభూషిత మొనర్పుము. కృత్రిమాలంకారములచే వాస్తవికంబగు దైహికశోభ ప్రవర్ధమానము కాజాలదు. నిత్యత్వమును గల్గియుండు సద్గుణాలంకారములే కాయము యొక్క శృంగారము ననుదిన మభివృద్ధిపఱచును. పరమేశ్వరాంశసంభూతములగు సద్గుణభూషణ ధారణముచే గాత్రము యొక్క చిన్నెలు, వన్నెలు బెంపొందును. సద్గుణములచే నలరారు జీవితనౌకయే యీప్రచండ ప్రళయావహంబగు సంసారసాగరంబున బ్రయాణ మొనరించి, యంతమునకు నిర్వాణకూలము జేరగలదు.

(11) మానవుడు రసనేంద్రియ చాంచల్యజనితప్రచండ క్రోధావేగమునుండి నిత్యము జాగ్రత్తగా మెలంగు చుండుట హితకరము. జిహ్వ నేయవస్థయందును స్వేచ్ఛగా నుండనీయరాదు. మానవుడు నిజోత్థాన ప్రాప్తికయి శీఘ్రమే నిరంకుశరసనేంద్రియోత్పన్న సమస్తపాపజాలముల విస

ర్జింపవలయును. అనవరతము జిహ్వాగ్రభాగమునుండి సత్య వాక్యములనే వెలువఱచుచుండవలయును. అట్టిచో మానవునకు హితము సేకూరును.

(12) మనుజుడా! మానసిక క్రోధావేశమునుండి సావధానుండవయి మెలంగి నిన్ను నీవుద్ధరించు కొనుము. మానసమును సంపూర్ణముగ వశము గావించుకొనుము. మానసిక దోషముల నాంతరంగికమహారిపులుగ గుర్తించి, రయమున వానిం బారద్రోలుము. మనఃపూర్వకంబుగ బరిశుద్ధంబగు జీవితమునే వ్యతీతము సేయుట నభ్యసింపగడంగుము. శుభమగును. ఉచ్ఛభావస్వీకారము, సాధుజీవితము, మానవాభ్యుదయంబునకు హేతుభూతంబు లగును. రసనేంద్రియమానస కాయముల బూర్తిగ వశీభూతము గావించుకొనిన వ్యక్తిసత్తముండె జితేంద్రియుడు; అట్టివానినే సంయమవ్రతానుష్ఠానపరుండనియు, యతిచంద్రుడనియు జనులు వాకొనుచుందురు.

(13) నరుడా! రాగమును మనమున బ్రవేశింపనీయకుము; మనోనిగ్రహమును గల్గియుండుము. మానసికపాపాచరణముల గాలదన్నుము; పుణ్యాచరణంబున సదాశివమూర్తివయి సంచరింపుము.

క్రోధవర్గము పరిసమాప్తము

---

## మలవగ్గో.

పణ్డుపలాసోఽవ దానీఽసి
యమ పురిసాఽపిచ తం ఉపట్ఠితా,
ఉయ్యోగముఖేచ తిట్ఠసి
పాథేయ్యంఽపిచ తే నవిజ్జతి. ౧

సో కరోహి దీప మత్తనో
ఖిప్పం వాయమ పణ్డితో భవ,
నిద్ధన్తమలో అనఙ్గణో
దిబ్బం అరియభూమి మేహిసి. ౨

ఉపనీతవయోచ దానీఽసి
సంపయాతోఽసి యమస్స సన్తికే,
వాసోఽపిచ తే నత్థి అన్తరా
పాథేయ్యంఽపిచ తే నవిజ్జతి. ౩

సో కరోహి దీప మత్తనో
ఖిప్పం వాయమ పణ్డితో భవ,
నిద్ధన్తమలో అనఙ్గణో
నపున జాతిజరం ఉపేహిసి. ౪

అనుపుబ్బేన మేధావీ థోకథోకం ఖణేఖణే,
కమ్మారో రజతస్సేవ నిద్ధమే మల మత్తనో. ౫

అయసాఽవ మలం సముట్ఠితం
తదుట్ఠాయ తమేవ ఖాదతి,
ఏవం అతిధోనచారినం
సానికమ్మాని నయన్తి దుగ్గతిం. ౬

అసజ్ఝాయ మలా మన్తా అనుట్ఠానమలా ఘరా,
మలం వణ్ణస్స కోసజ్జం పమాదో రక్ఖతో మలం. ౭

మలిత్థియా దుచ్చరితం మచ్ఛేరం దదతో మలం,
మలా వే పాపకా ధమ్మా అస్మిం లోకే పరమ్హి చ. ౮

తతో మలా మలతరం అవిజ్జా పరమం మలం,
ఏతం మలం పహాత్వాన నిమ్మలా హోథ భిక్ఖవో. ౯

సుజీవం అహిరీకేన కాకసూరేన ధంసినా,
పక్ఖన్దినా పగబ్భేన సంకిలిట్ఠేన జీవితం, ౧౦

హిరీమతా చ దుజ్జీవం నిచ్చం సుచిగవేసినా,
అలీనేనఽప్పగబ్భేన సుద్ధజీవేన పస్సతా. ౧౧

యో పాణ మతిపాతేతి ముసావాదం చ భాసతి,
లోకే అదిన్నం ఆదియతి పరదారంచ గచ్ఛతి, ౧౨

సురామేరయపానం చ యో నరో అనుయుఞ్జతి,
ఇధేఽవమేసో లోకస్మిం మూలం ఖణతి అత్తనో. ౧౩

ఏవం భో పురిసజానాహి పాపధమ్మా అసఞ్ఞతా,
మాతం లోభో అధమ్మోచ చిరం దుక్ఖాయ రన్ధయు. ౧౪

దదాతి వే యథాసద్ధం యథాపసాదనం జనో,
తత్థ యో మఙ్కుభవతి పరేసం పానభోజనే,
న సో దివా వారత్తింవా సమాధిం అధిగచ్ఛతి. ౧౫

యస్సచేఒతంసముచ్ఛిన్నం మూలఘచ్చం సమూహతం,
సవే దివావా రత్తింవా సమాధిం అధిగచ్ఛతి. ౧౬

నత్థి రాగసమో అగ్గి నత్థి దోససమో గహో,
నత్థి మోహసమం జాలం నత్థి తణ్హాసమా నదీ. ౧౭

సుదస్సం వజ్జమఞ్ఞేసం అత్తనోపనదుద్దసం,
పరేసం హి సోవజ్జాని ఓపుణాతి యథాభుసం,
అత్తనో పన ఛాదేతి కలింవ కితవా సఠో. ౧౮

పరవజ్జానుపస్సిస్స నిచ్చం ఉజ్ఝానసఞ్ఞినో,
ఆసవా తస్స వడ్ఢన్తి ఆరా సో ఆసవక్ఖయా. ౧౯

ఆకాసే పదం నత్థి సమణో నత్థి బాహిరే,
పపఞ్చాభిరతా పజా నిప్పపఞ్చా తథాగతా. ౨౦

ఆకాసే పదం నత్థి సమణో నత్థి బాహిరే,
సఙ్ఖారా సస్సతా నత్థి నత్థి బుద్ధాన మిఞ్జితం. ౨౧

ఇతి మలవగ్గో.

## అపరిశుద్ధవర్గము (కల్మషవర్గము)

ఒకానొకవ్యక్తి మధుమాంసభక్షణమునందును, బర దారాగమనమునందును ననురక్తుడయి యుండెను తదాచరణ మతి నీచమని గ్రహించియు దుర్వ్యసనమున కభ్యస్తుడయి యుండుటం జేసి విముక్తినంద నశక్తుడయి యుండెను. దుర్మార్గుడగు నాపురుషుడు సర్వదా స్వకీయ నింద్యకార్యాసక్తిని మదిదలచి కడు దుఃఖింపుచుండెను. ఒకతూరి యతడు శ్రీ బుద్ధభగవానుని సద్గుణస్తవము బ్రజాగణముఖంబున నాకర్ణించి, ముగ్ధహృదయుడయి, యా దేవాంశసంభూతుని దివ్యముఖారవింద సందర్శన ప్రభావంబున నిజదుర్గుణగణవికాసము క్షీణించిపోవుగదా యని భావించి, సత్వరసందర్శనమునకయి కోరిక లీరికలెత్త భిక్షుమందిరము నుద్దేశించి, బయలువెడలెను. అతండత్యాతురముతో దేవుని సందర్శింప నభిలషించి, మందిరమున బ్రవేశించెను. మండపమున విరాజితులరయియున్న బౌద్ధపరివ్రాజకు లెల్లరా నింద్యచరిత్రు నవలోకించినంతనే కుపితులయి, వానిని వెడలనడచిరి. వ్యభిచారకార్యపరతంత్రుండగు నాదుష్టమానవుడు ఖిన్నుడయి, తన్మందిరమును బాసి, స్వనికేతనమునకు మఱలెను. ఒకదివసము దేవుడాత్మీయచ్ఛాత్రులనందఱ నేకత్రితముగా వింప నరుగు తరుణమున మన పరిచిత దుర్జనుడా దేవుని చరణకమలముల దీనుడయి, నేత్రయుగ్మమునుండి కన్నీటిధారలు

కాల్వలయిపార వారిలెను. దేవుడా యాశ్రితవ్యక్తిని విల పించుటకు హేతువెద్దియని పృచ్ఛింప, నతం డధమాధముండ నగు నన్నుద్ధరింపవలయునని కరములు మోడ్చి, వేడుకొని యెను. దేవుడాతని విన్నపము నాలకించి దయార్ద్రహృద యుడయి యాతనిని లేవనెత్తి, నిజకోమలహస్తంబున శిరంబు దువ్వి, యిట్లు ప్రత్యుత్తర మొసంగెను :—"కుమారా! దేవు హారితఃకాలము నీవు భిక్షుమండలి వాసముసేయుబౌద్ధమందిర మున కేతెంచుము. నిన్నట శిక్షచే దీక్షాబద్ధుని గావించెదను. ద్వితీయవాసర మా విషయలంపటుండగు మూఢవ్యక్తి బుద్ధ కథనానుసరణంబుగ మఠమున కరుదెంచి, సుశిక్షామృత పానా తురుడయి, బుద్ధాగమనంబునకయి వేచియుండెను. అతడట్లు నిరీక్షింపుచుండగనే బుద్ధభగవానుడు మందిరము బ్రవేశిం చెను. సమస్త బౌద్ధసన్యాసులు నిజాసనంబుల డిగ్గి, యాదేవు నికి జోహారు లర్పించిరి. దేవుడంత స్వకీయాసనము నధిష్ఠించి, పాపపురుషు (మన పరిచితజారుడు) నిదిక్కయి, యిట్లు నుడువ నారంభించెను :—

(1) భ్రష్టుడా! నీవు పరిపక్వమయిన తమలపాకును బోలియున్నావు. భయంకరరూపధారులగు యమదూతలు నీసన్నిధి కేతెంచి, పరిపక్వావస్థయందున్న నీకయి నిరీక్షణము సేయుచున్నారు. కాని జ్ఞానదూరుండవగు నీవు మరణద్వారము

చెంతనే ఁలివియుండియు, యమపుర ప్రయాణమున కనువగు సామగ్రినే సేకరించుకొని యుండలే దిదేమి వింత ?

(2) అపారసంసారపారావారమున మున్గి తేలుచున్న నీవు స్వకీయ సంరక్షణార్థము శీఘ్రమొక్క ద్వీపమును నిర్మించుకొనుము. మానవోచిత ప్రయత్నప్రభావంబున విశేష పరిశ్రమజేసి, ధీశక్తి నార్జించుము. నీ దేహస్కంధము నావృతమయియున్న దుర్గుణవల్లరుల ద్రెంచి పారవేసి, దోషవిముక్తుండవయి, తేజరిలుము. ఇన్ని ప్రయత్నపరంపరల నాచరించి, నిష్కళంకచరిత్రసంపన్నుండవగునపుడే నీవు సుకరముగ నార్యజన పునీతధామమును బ్రవేశింప నర్హుడవగుదువుసుమీ!

(3) నీజీవితము సంపూర్ణముగా నున్నది; నీ వనుదినము మృత్యు దేవ్యాలయమును విషాదభయమూర్తుల నర్చింప సమీపించుచునే యున్నావు. నీ చింతపర్యంతము వివేకశూన్యుడవయి, మార్గమధ్యంబున విశ్రాంతిబడయ, విశ్రాంతిభవనముల నిర్మించుకొనియే యుండలేదేమి ? ప్రయాణమున కనువగు వస్తుసామాగ్రిని సహితము సమకూర్చుకొనలేదేమి ?

(4) నీవిపుడే కాలవిలంబనముసేయక, స్వీయ సంరక్షణనిమిత్తము విశాలతమంబగు నొక్క ద్వీపమును సిద్ధము గావించుకొనుము. పరిశ్రమ నేయుటయందు గష్టమొదవు

నని శంకించిన, నీ జీవితపరియాణసమస్య విషమించి, మహాపదరివోత్పత్తికి కారణభూతమగునుసుమా. చెచ్చెర బుద్ధిమంతుడవు గమ్ము. నిన్నాక్రమించియున్న దుర్విషయాసక్తంబులగు సమస్తదుర్గుణముల దూర మొనరింపుము. సంపూర్ణముగా మలము (అపరిశుద్ధత) నుండి నీవు విముక్తుడవగుచో బునః జన్మచక్రమున బడక సుఖించుతువు. మానవప్రయత్నము లేనిదే సర్వేశ్వరకృపయు, ఫలమును సిద్ధించుట దుస్తరము.

(5) స్వర్ణకారుడేరీతి సువర్ణరజతములపై నావృతమయియున్న కల్మషము ననుదినము వహ్నిసంస్కారంబున దూరము సేయుచున్నాడో, అదియేచందమున ధీమంతుడును, గర్మయోగియునగు వ్యక్తిపుంగవు డనుదినము మనోమాలిన్యమును గ్రమక్రమంబుగ దూర మొనరింపుచుండునుగదా! మానవుడా! నీవగసాలెవాని బుద్ధిచాతుర్యమును విస్మరింపక నాదర్శప్రాయముగ భావింపుమా !

(6) లోహమున నుత్పన్నమగు తుప్పులోహమును స్పృశించినంతనే యద్దానిని సంపూర్ణముగ గబళించివేయుచున్నదికదా ! అదియేమాడ్కి సత్యమార్గోల్లంఘన మొనర్చువానిని, వానిదుర్బుద్ధియే (అనగా సత్యపథాతిక్రమణబుద్ధి) దుర్గతిపాలు గావించివేయుచున్నది. సత్యమార్గము నతిక్రి

మించు మూఢుడు స్వవినాశనమునకు దానే హేతుభూతు డగునుగదా!

(7) అభ్యాసము సతతము సలుపకుండుట సాధనమునకు గళంకము నాపాదించును; సంస్కారము (మరమ్మతు) లేకపోవుటయే సదనమునకు గళంకమునొదవజేయును; సోమరితనమే దేహమునకు గళంకమునుత్పన్నము నేయును; ప్రమత్తుడై యుండుటయే ద్వారపాలకునికి గళంకము. సాధ్వీలోకమునకు గళంక మగమ్యాగమనము (వ్యభిచారము); దాతకు గళంకము లుబ్ధత్వము (ఔదార్యరాహిత్యము); సమస్తపాపములకు మూలం బగు కలుషితపథ ముభయలోకములయందు గళంకపరిపూర్ణ మయియుండి, గర్హింపబడునుగదా!

(9) కాని, పూర్వోక్తపాపసముదాయమునకంటె నధిక పాపనిలయం బొండు కలదు. అదియేఅవిద్య -( అజ్ఞానములేక వ్యామోహ ప్రతిపాదకశక్తి) మలము లన్నింటికంటె నిదియే ఘనమయినది. ఓభిక్షువులారా! ఈ యవిద్యామలమును రూపుమాపి, శుభ్రదేహులును నిష్కళంక చరిత్రసంపన్నులును నగుడి!

(10) లజ్జావిహీనులును, మిథ్యాభిమాన పరిపూరిత చిత్తులును, వాయసముచందమున నుద్ధతప్రకృతియుక్తులును,

హింసాత్మక కార్యపరతంత్రులును, ఆందోళనపరులును, పరావమానకార్యనిరతులును, క్షుద్రభావ ప్రపూర్ణహృదయులును నగు ఛండాలుర జీవితయాత్ర బహుసుకరముగా సాగుచున్నట్లు ప్రతీతమగును. (వాస్తవమది కాదు) అట్టి కాకవృత్తిని గల్గిన నీచుల జీవితయాత్ర బహు దుర్ఘటము; కష్టతరము.

(11) సహజ వినయవిధేయులును, నిష్కళంక చరితులును, బుద్ధిమంతులును, సుస్థిరచిత్తులును నిస్పృహహృదయులును, శాంతమనస్కులును, నిపుణులును నగు పురుషావతంసముల జీవితయాత్ర కష్టతరముగ బ్రతీతమగుచుండును (యథార్థమాలోచించిన నంత కాదు) మహాసులభము; హర్షప్రదాయకము

(12), (13) ప్రాణికోటిని వివేకశూన్యులయి హింసించువాడును, అనవరత మసత్యభాషణము సేయువాడును, అనుమతినందకుండగనే పరవస్తుగ్రహణము సేయువాడును, బరవనితాగమనాకాంక్షియును, మదిరాది మాదకద్రవ్యములసేవించువాడును, యీలోకమునందే సజీవులయి యుండగనే స్వీయజీవిత వృక్షమూలోచ్ఛేదనము స్వహస్తములవలననే గావించుకొందురు.

(14) ఓపతితుడా! తనపై నన కధికారము లేనివాని స్థితి కడు శోచనీయము. దుర్మార్గానురక్తుడగు మానవుడు స్వీయేంద్రియదాసుడయి, విశ్వప్రియత్న మొనర్చినను విషయ వాసనావిముక్తినందుట కడు దుస్తరము. అట్టివానిని నిరంతరము ప్రలోభదురాచార మహాపిశాచము వెంటనంటి యుండి, వా డర్ధనిమీలితనేత్రుడయినంతనే దయమాలి, యగాధంబును, గభీరంబునునగు విషాదకుండమున బడద్రొబ్బును. కనుక పేరాశకు వశుడవయి, దుష్కార్యముల నాచరింప జనకుము.

(15) సంసారులు తమకుండు శ్రద్ధామోదముల ననుసరించియే దానము సేయుచుందురు. పరులచే బ్రసాదింపబడు భోజనపానీయముల గాంచి మాత్సర్యముఁ జెందు మూర్ఖుడు దివారాత్రములు చిత్తశాంతి లేక, యసహనీయంబగు విషాదము ననుభవింపుచు గృశించును.

(16) మచ్చరమును, దుర్భావసమితిని సమూలముగ విధ్వంస మొనర్చినవా డహర్నిశములయం దపారానందానుభవమునందుచు సుఖించును. అట్టివానికి, సర్వదా చిత్తము ప్రశాంతమయి, విషాద భయరహితమయి యుండుకతన దివ్యతమసౌఖ్యము ప్రాప్తించును. చిత్తశాంతియే యంతము

నకు మోక్షదాయకము కాగలదు. దుర్వ్యసనదూయునకు, మాత్సర్యభావసంహితునకుబలె, పదేపదే నిద్రాభంగమగుట కట్టువడిపోయి, హాయిని గూర్పగల సుఖనిద్ర లభ్యమగును.

(17) విషయవికారానలమునుబోలు నగ్ని మఱియొకటి లేదు. ఇయ్యదే మానవుని స్పృశించినంతమాత్రంబుననే భస్మీపటలము గావించివేయును. ద్వేషమునుబోలు మహా పిశాచము లేదు. ఇది మానవుని గ్రసించివేయును. అజ్ఞానము నకు సాటియగు బంధనము (పాశము) లేదు. అభ్యుదయపద వికి నరుగనీయక మానవజీవితము నియ్యది బంధించివేయును. తృష్ణనుబోలు ప్రచండప్రవాహము లేదు. ఇయ్యదియే మానవ జీవితనౌకను ముంచివేయును.

(18) సహజముగనే నరుడు పరుల దోషముల గణింప నేర్చును. కాని తనయందు వేరునాటియున్న దోషపుంజముల గుర్తింపనయిన లేదు. మానవుడు సమ్ముఖమునందున్న సోదర మానవుని నేత్రమందు డాగియుండు మృత్తికాకణమునయిన గుర్తింప సమర్థుండగునుగాని నిజచక్షువునందలి పర్వతమున యిన నవలోకింపజాలడు. వేయేల? నరుడు స్వాభావికంబుగనే పొరుగింటివాని దోషముల, ధాన్యము జల్లించునట్లు వెదకి

పట్టుకొనుచున్నాడు. కాని నిజదోషముల గపటుండగు జూద గాని పాచికవలె గోపనీయముగ నుంచుకొనును.

(19) సర్వదా పరులదోషముల నన్వేషింప గడంగు వాడును, బరు లజ్ఞానవశంబున దనకుగావించు యవమానము నకు గుపితుండగువాడును, నిరంతరము క్రోధాగ్ని కాహుతి యగువాడును, దినదినము విషయవికారము లభివృద్ధిజెంద విషాదమునకు బాల్పడును. అట్టివాని దుర్గుణములు దూర మగుటకు మారుగ ననుదినము ప్రవర్ధమానమయి, ఆత్మవినా శనమునకు మార్గమగును.

(20) ఆకాశమునందు మార్గము లేదు. అటులనే బా హ్యాకృతి (బాహ్యవేషాడంబరము) చే మానవుడు శ్రమణుడు (సాధువు) కాజాలడు. మానవుడు సాంసారిక వ్యాపారంబు నకు వశుడయి, దుఃఖపరంపరలకు గురియగును. తథాగతుడు బాహ్యసంసారమున లభించుట దుస్సాధ్యము. బుద్ధుడు సర్వదా ప్రపంచమునుండి ముక్తుడయియుండును. ప్రాపం చికధర్మదూరుడే బుద్ధుడు.

(21) ఆకాశమున బథము దృష్టిగోచరంబగుట దుస్సా ధ్యముగదా! బాహ్యాకారంబగు కాషాయ వసనధారణంబు

నను, ముండితశీర్షంబునను మానవుడు శ్రమణుడు కాజా లడు. ప్రాణికోటి శాశ్వతమయినదికాదు. కాని బుద్ధుడు (సంపూర్ణజ్ఞానపదవి నలంకరించినవాడు) సంస్కారబంధన విహీనుడయి, సుస్థిరుడయి, ఆచంద్రతారార్కంబుగా నాకల్పన పర్యంతము ప్రకాశింపగలడుగదా!

అపరిశుద్ధవర్గము పరిసమాప్తము.

---

## ధమ్మట్ఠవగ్గో

న తేన హోతి ధమ్మట్ఠో యేనఽత్థం సహసానయే
యోచ అత్థం అనత్థంచ ఉభో నిచ్ఛేయ్య పణ్డితో. ౧

అసాహసేన ధమ్మేన సమేన నయతీ పరే
ధమ్మస్స గుత్తో మేధావీ ధమ్మట్ఠోఽతిపవుచ్చతి ౨

న తేన పణ్డితో హోతి యావతా బహుభాసతి
ఖేమీ అవేరీ అభయో పణ్డితోఽతి పవుచ్చతి. 3

న తావతా ధమ్మధరో యావతా బహు భాసతి
యోచ అప్పంఽపి సుత్వాన ధమ్మం కాయేన పస్సతి
స వే ధమ్మధరో హోతి యో ధమ్మం నప్పమజ్జతి. ౪

నతేన థేరో హోతి యేనఽస్స ఫలితం సిరో
పరిపక్కో వయో తస్స మోఘజిణ్ణోఽతి వుచ్చతి. ౫

యమ్హి సచ్చంచ ధమ్మో చ అహింసా సఞ్ఞమో దమో
సవే వన్తమలో ధీరో థేరోఽతి పవుచ్చతి. ౬

నవాక్కరణ మత్తేన వణ్ణ పోక్ఖరతాయవా
సాధూరూపో నరో హోతి ఇస్సుకీ మచ్ఛరీ సఠో ౭

యస్స చేతం సముచ్ఛిన్నం మూలఘచ్చం సమూహతం
స వన్తదోసో మేధావీ సాధురూపోఽతి వుచ్చతి. ౮

న ముణ్డకేన సమణో అబ్బతో అలికం భణమ్
ఇచ్ఛాలోభసమాపన్నో సమణో కిం భవిస్సతి ౯

యోచ సమేతి పాపాని అణుం థూలాని సబ్బసో
సమితత్తా హి పాపానం సమణోఽతి పవుచ్చతి. ౧౦

నతేన భిక్ఖు సో హోతియావతా భిక్ఖతే పరే
విస్సం ధమ్మం సమాదాయ భిక్ఖు హోతిన తావతా. ౧౧

యోఽథపుఞ్ఞంచ పాపంచ బాహేత్వాబ్రహ్మచరియవా
సఙ్ఖాయ లోకే చరతి సవే భిక్ఖూఽతి వుచ్చతి. ౧౨

న మోనేన మునీ హోతి మూళ్హరూపో అవిద్దసు
యోచ తులంఽవ పగ్గయ్హ వర మాదాయ పణ్డితో. ౧౩

పాపాని పరివజ్జేతి స మునీ తేన సోమునీ
యో మునాతి ఉభో లోకే మునీ తేన పవుచ్చతి. ౧౪

నతేన అరియో హోతి యేన పాణాని హింసతి
అహింసా సబ్బపాణానం అరియోఽతి పవుచ్చతి. ౧౫

న సీలబ్బత మత్తేన బాహుసచ్చేన వా పున
అథవా సమాధిలాభేన వివిచ్ఛ సయనేన వా. ౧౬

ఫుసామి నేక్ఖమ్మ సుఖం అపుథుజ్జన సేవితం
భిక్ఖు విస్సాస మమాపాది అపత్తో ఆసవక్ఖయమ్ ౧౭

ఇతి ధమ్మట్ఠవగ్గో



## ధర్మట్ఠవర్గము (న్యాయవర్గము)

సోమదత్తుడను రాకుమారుడు ప్రాయికంబుగా బుద్ధ భగవానుని దర్శింప, బౌద్ధవిహారమందిరమున కనుదినము నరు దెంచుచుండువాడు. వానిస్వభావ మతితీక్ష్ణము. అత డనారతము నిజసహచరులనెల్లర స్వకీయోద్దండప్రకృతిచే మున్నాతిప్పల బెట్టుచుండువాడు. ఒకానొక దివసము విహారార్థ మరుగు తరుణమునందు సోమదత్తుని సంగడీ డొక్కరుం డాతనితో నిట్లనియెను :—"మిత్రమా! శ్రీ బుద్ధదేవుడు బోధిం

చిన పవిత్రోపదేశముల నీవాలకించి యుండలేదా ? దేవుడు విశేషముగా న్యాయసత్యముల మహిమాతిశయమును గూర్చి జనుల కుద్బోధన సలుపుచుండును. బుద్ధచంద్రుడు మానవుడు కాడు. అతడు ధరను వ్యాప్తమగు భయవిషాదములను, అవ్వానికి మూలమగు నధర్మప్రవృత్తిని నిర్మూలన మొనరింప భువి కవతరించిన నాదిమధ్యాంతరహితుండును, సృష్టిస్థితి లయకారుండును నగు పరబ్రహ్మమూర్తి. మానవుడయి వసుధ జననమందిన ప్రతిప్రాణియు నా దేవ్రుని సందర్శించి, యాత డొసంగు దివ్యోపదేశముల భక్తిశ్రద్ధల నాలకించినచో నజ్ఞానాంధకార పూరితంబగు పతితజీవితము నెడబాసి, పావనజీవిత యాత్రను గడుపగల్గును. ఆ దేవుని దివ్యాభిధేయమును సంస్మరించినంతనే యతని సుజ్ఞానతేజోమయమంగళమూర్తి నా దృష్టిపథమున లాస్య మొనర్చుచు వికాసశూన్యంబగు నామది కొక యద్భుతానందప్రదంబగు నుత్సాహశక్తి నొసంగుచున్నయది. నాయనుంగు చెలికాడా! నీ వవశ్యము నావచనముల బాటించి, జాగుసేయక నొకతూరి దేవుని దర్శింప నరుగుము, నీవు తరింప శక్తుండ వగుదువు."

చెలిమికాని యీ మృదుమధురంబులగు హితోక్తుల నాకర్ణించి, మదియందు బుద్ధదర్శనాభిలాష గాఢమగుడు, ఘోషదత్తుడు చివాలున లేచి, బౌద్ధ విహారమందిరమునుగూర్చి

గమనోన్ముఖుం డాయెను. అప్పటికి సంధ్యాసమయ మయి, విహారార్థము గృహబాహ్యప్రదేశముల కరుదెంచిన మను జుల మంజులహృదయముల సంధ్యారాగ మొకింత యానం దపఱచుచుండెను. బౌద్ధవిహారమందిరబాహ్యప్రదేశవిరాజిత పుష్పవాటికయందు తత్సమయమున శ్రీ బుద్ధభగవానుడు మహా ప్రజాసమూహమునకు సౌభాగ్యవశంబున న్యాయసత్య ములగూర్చి ప్రబోధముసలుపుచుండెను. జను లెల్లరు సుస్మిత వదనారవిందులయి, తదేకధ్యానముతోడ, శ్రద్ధాభక్తులు నిజాననంబుల మూర్తీభవించియుండ శ్రీ బుద్ధచంద్రోపదేశిత ప్రబోధము నాకర్ణింపుచుండిరి. దేవుని శ్రీముఖంబునుండి బహిర్గతంబగు నద్వితీయ ప్రభావసమన్విత పీయూషసదృశ వాగ్జాలశ్రవణంబున సోమదత్తునకు నూతనజీవితంబును, నవ్య తరోత్సాహ స్ఫూర్తియు బ్రాప్తించెను. క్షణమాత్రకాలము నందే యతనిభావపరివర్తనముతోబాటు ముఖాకృతియు బరివర్తన మయ్యెను. అతనివదనారవిందగాంభీర్యము విలుప్తమ గుడు, సౌమ్యతరంబగు స్నిగ్ధత యచ్చోటవెలయ నారంభిం చెను. తదుపదేశ సారాంశ మిద్దియు:—

(1) హితాహితముల నారయక సత్వరము మదియం దొదవు తరంగము ననుసరించి కర్తవ్యమును నిర్ణయించువ్యక్తి ధర్మాత్ముడు కాజాలడు. దూరదృష్టి, ననగా, నచంచలంబగు

జ్ఞానబలంబున సత్యాసత్యముల గుర్తెఱింగి, కార్యాచరణంబు నకు నుపక్రమించువాడే ధర్మశీలుడు. సత్యాసత్య జ్ఞానదూరు డయి కర్తవ్యమును నిర్వహింప బూనువాడు న్యాయభ్రష్టుడన బఱగు.

(2) విద్వాంసుడును, ధర్మతత్వనిర్ణయంబున దూర దర్శిత్వసంపన్నుండును, న్యాయమును, ధర్మమును జనసము దాయమునకు బలాత్కారంబున గాక ప్రేమచేతను, శాంతము తోడను బోధించి, త న్ననుసరింప జేసికొనువాడును; సర్వ దా ధర్మసంరక్షితుండును మఱియు ధీసంపన్నుండును నగు వ్యక్తియే బుద్ధిమంతులయందు ధర్మశీలుడయి వర్తించును.

(3) వాక్చాతుర్యంబున నధికప్రసంగముల చేయు వాడు పండితుడు కాజాలడు; సహనశీలతాసంపన్నుండును బరుల విస్మరించియయిన దిరస్కారభావంబున నరయని వాడును, భయవిషాదశూన్యుండును నగువాడే యథార్థమగు పండితుడు.

(4) గంభీరోపన్యాసముల నొసంగుచు, వాక్ప్రౌఢిమను వెల్లడించినమాత్రంబున మనుజుడు ధర్మశీలుడు కాజాలడు. స్వల్పావస్థయందయిన ధర్మము నుపేక్షసేయ సాహసింప నట్టియు, ధర్మానుసారంబుగ నాచరింప గడంగునట్టియు, వ్యక్తి

సత్తముడే ధర్మశీలుడు; అట్టివాడే ధర్మమునకు మూలము. అట్టి న్యాయశీలుండగు వ్యక్తిసత్తమునకు ధర్మశాస్త్రాధ్యయనం బల్పమయియుండినను హాని వాటిల్ల నేరదు. మితభాషణమును గల్గియున్నను ధర్మానుకూలంబుగ వర్తింపుచు, నే యవస్థయందును ధర్మమార్గచ్యుతుడు గాని వ్యక్తియే ధర్మాత్ముం డనబఱగును.

(5) శిరమునందు కుంతలములు వినీలవర్ణదూరములయి, శ్వేతవర్ణ విరాజితము లయినంతనే మానవుడు వృద్ధుడు కాజాలడు. అధికప్రాయము గతించినంతనే మూఢులగు సంసారులు స్వాభావికంబుగనే, నరుని వృద్ధుడని వాకొను దురభ్యాసము గలవారయి యుందురు. అమూల్యమగు ప్రాయమును వ్యర్థముగా గోల్పోవు వ్యక్తి, వాస్తవ మాలోచింప వృద్ధు డెంతమాత్రము గాజాలడుసుమా!

(6) సత్యధర్మపరాయణుడు, సద్గుణసంపన్నుడు, ప్రేమభావయుతుడు, సంయమచిత్తుడు, అహింసాపరుడు నియమానుసరుడు, సోదరభావాన్వితుడు నగు సర్వోత్తమ గుణాలంకారభూషితుండగు వ్యక్తిపుంగవుడే యథార్థ మాలోచించిన సమస్తవిధముల వృద్ధుడని పేర్కొన నర్హుడు.

(7) తర్కవితర్కముల నసాధారణ ప్రజ్ఞావంతుడయినను, లోకాతీత సౌందర్య విలసిత దేహుడయినను మాత్సర్య

భావగ్రస్తుండును, మహాలోభచిత్తుండును, అప్రమాణికుండును నగు నీచమానవు డేస్థితియందును మన్నింపదగిన పుణ్యపురుష పుంగవుడు కాజాలడు.

(8) తనహృదయసామ్రాజ్యమున నెలకొనియుండు సమస్తదోషముల మూలసమేతముగ విధ్వంస మొనర్చినట్టియు, రాగద్వేషాది చిత్తప్రవృత్తుల నణయజేసినట్టియు, స్వధర్మనిరతుడయినట్టియు, జ్ఞానమును సముపార్జించి మించినట్టియు, శ్రేష్ఠమానవుడే సమస్తవిధముల సాధువు లేక మహాతపస్వి యనదగినవాడు.

(9) అసత్యభాషణానురక్తుండును, సంయమవ్రతానుష్ఠానదూరుండును నగు చంచలచిత్తుడు శిరోముండనాది బాహ్యసంస్కారమాత్రంబున శ్రమణుడు కాజాలడు. తృష్ణాలోభపాశబద్ధుండగు మూఢమానవు డెట్లు పరివ్రాజకుడు కాగల్గును.

(10) మానవజీవితాంతర్గతంబులగు సమస్తపాపపుంజముల నామూలాగ్రముగ నల్పాధికభేదమును బాసి, నిర్మూలింపజేసిన వానినే శ్రమణుడు (శాంతచిత్తుడు) అని నుడువుదురు. గత మెద్దియన, నతడు సమస్తపాపముల శమింపజేసియున్నాడు గదా!

(11) అన్యులచెంత కరిగి, భిక్షను యాచించినంత మాత్రంబున మనుజుడు భిక్షువన నర్హుడు కాజాలడు. స్వావలంబనా మాహాత్మ్యమును గ్రహింప నశక్తుండగు నలసుడు భిక్షాటన స్వీకారమాత్రంబున భిక్షుకుడు లేక బౌద్ధసన్యాసి కాజాలడు. సాంగోపాంగముగ బౌద్ధధర్మనిగూఢ సిద్ధాంతరహస్యమును గ్రహింపగల్గిన పురుషావతంసుడే భిక్షు వనదగినవాడు.

(12) పుణ్యపాపములనుండి దూరముగనుండి, బ్రహ్మచర్యవ్రతానుష్ఠానపరుడయి, జ్ఞానముచే నిహలోకమున బవిత్రతమంబగు సత్యజీవితయాత్రను సాగించువ్యక్తియే వాస్తవంబగు బౌద్ధభిక్షువుగదా!

(13) మూఢుండును, జ్ఞానగంధశూన్యుండును నగు నరపశువు కేవలము నిమీలితనేత్రుండయి, ముకుళితహస్తుడయి, పద్మాసనాసీనుడయి, మౌనవ్రతధారణమాత్రంబున మౌనిచంద్రుడుగా బరిగణింప నర్హుడు కాజాలడు సుమా!

(14) సుజ్ఞానవిత్తసముపార్జనంబున సుకృతదుష్కృతములస్వభావమును సాధనాబలంబున నారసి, ధర్మాన్వితంబగు పుణ్యమును గ్రహించి, అధర్మయుక్తంబగు పాపమును దవ్యజియించి, సద్ధర్మపథానుగామియగు వ్యక్తిసత్తముడే మునిగా బరిగణింప బాత్రుడు. అట్టివానికే స్వధర్మనిర్వహణాస

క్తిచే మునిత్వము సిద్ధింపుచున్నయది. తన్మూలమునందరిచందురిడే యుభయపక్షవివేచనాపరుడయి, యుభయలోకములయందు మునియని పిలువబడును.

(15) ప్రాణికోటి నేయవస్థయందును హింసింపగడంగువాడార్యుడు కాజాలడు. సమస్తజీవులపట్ల దయగల్గి, వానిహితమునే సర్వదా నాకాంక్షించువాడే యథార్థముగా నార్యుడను సంజ్ఞను ధరింప భాజనుడగుచున్నాడు.

(16) మానవునకు హృదయక్షేత్రమున నంకురించి, దుర్మార్గానుసరణంబునను జ్ఞానరాహిత్యంబునను బరివర్ధమానమయియున్న విషయవాసనాబీజములు నిర్మూలింపబడు పర్యంతము సర్వసాధారణప్రాపంచకజనుల కతీతంబునగు, విషాదభయశూన్యంబును నగు నపూర్వానందానుభవప్రాప్తి కలుగనేరదుకదా!

(17) నియమపాలనంబునగాని, సద్వ్రితప్రక్రియానుష్ఠానంబునగాని, సమస్త వేదవేదాంగ పురాణేతిహాసాధ్యయనలభ్యంబగు విజ్ఞానంబునగాని యోగికక్రియాచరణంబునగాని, నిరంతరైకాంతవాసస్వీకృతిచేగాని మనుజునకు భౌతికప్రపంచాతీతమగు నిర్వాణపదసౌఖ్యము లభింపజాలదు ఐహికవిషయవాసనాబంధనరాహిత్యంబుననే మానవున కిలాతలంబున

నైష్కర్మ్యసౌఖ్యశాంతులు సులభముగ హస్తగతమగును. తృష్ణాబద్ధుండగు వ్యక్తి కెంతమాత్రము నేబడయు, ననిర్వాచనీయాపూర్వానందము ప్రాప్తించుట దుస్తరము.

న్యాయవర్గము పరిసమాప్తము

---

## మగ్గవగ్గో

మగ్గానఽట్ఠఙ్గికో సేట్ఠో సచ్చానం చతురో పదా
విరాగో సేట్ఠో ధమ్మానం ద్విపదానంచ చక్ఖుమా. ౧

ఏసోఽవ మగ్గో నత్థఽఞ్ఞో దస్సనస్స విసుద్ధియా
ఏతమ్హి తుమ్హే పటిపజ్జథ మారస్సేతం పమోహనమ్. ౨

ఏతమ్హి తుమ్హే పటిపన్నా దుక్ఖస్సన్తంకరిస్సథ
అక్ఖాతో వే మయా మగ్గో అఞ్ఞాయ సల్లకన్తనమ్. 3

తుమ్హేహి కిచ్చం ఆతప్పం అక్ఖాతారో తథాగతా
పటిపన్నా పమోక్ఖన్తి ఝాయినో మారబన్ధనా. ౪

సబ్బే సఙ్ఖారా అనిచ్చాఽతి యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిన్దతి దుక్ఖే ఏస మగ్గో విసుద్ధియా. ౫

సబ్బే ఖన్ధా దుక్ఖాతి యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిన్దతి దుక్ఖే.ఏస మగ్గో విసుద్ధియా ౬

సబ్బే ధమ్మా అనత్తాఽతి యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిన్దతి దుక్ఖే ఏస మగ్గో విసుద్ధియా. ౭

ఉట్ఠానకాలమ్హి అనుట్ఠహానో
యువా బలీ ఆలసియం ఉపేతో
సంసన్న సంకప్ప మనో కుసీతో
పఞ్ఞాయ మగ్గం అలసో న విన్దతి. ౮

వాచానురక్ఖీ మనసా సు సంవుతో
కాయేనచ అకుసలం న కయిరా
ఏతే తయో కమ్మపథే విసోధయే
ఆరాధయే మగ్గ మిసి ప్పవేదితమ్. ౯

యోగా వే జాయతే భూరి అయోగా భూరిసఙ్ఖయో
ఏతం ద్వేధాపథం ఞత్వా భవాయ విభవాయచ
తథత్తానం నివేసేయ్య యథా భూరి పవడ్ఢతి. ౧౦

వనం ఛిన్దథ మారుక్ఖం వనతో జాయతే భయమ్
ఛేత్వా వనంచ వనథంచ నిబ్బనా హోథ భిక్ఖవో. ౧౧

యావంహి వనథో న ఛిజ్జతి
అణుమత్తోఽపి నరస్స నారిసు,
పటిబద్ధ మనోఽవ తావసో
వచ్ఛోఖీరపకోఽవ మాతరి. ౧౨

ఉచ్ఛిన్ద సినేహ మత్తనో
కుముదం సారదికంఽవ పాణినా
సన్తిమగ్గమేవ బ్రూహయ
నిబ్బాణం సుగతేనదే సితమ్. ౧౩

ఇధ వస్సం వసిస్సామి ఇధ హేమన్త గిమ్హిసు,
ఇతి బాలో విచిన్తేతి అన్తరాయం నబుజ్ఝతి. ౧౪

తం పుత్తపసుసమ్మత్తం వ్యాసత్తమనసం నరమ్,
సుత్తం గామం మహెూఘోఽవ మచ్చు ఆదాయగచ్ఛతి.
నసన్తి పుత్తాతాణాయ నపితా నపి బన్ధవా,
అన్తకేనాధి పన్నస్స నత్థి ఞాతీసు తాణతా. ౧౬

ఏత మత్థవసం ఞత్వా పణ్డితో సీలసంవుతో;
నిబ్బాణగమనం మగ్గం ఖిప్పమేవ విసోధయే. ౧౭

ఇతి మగ్గవగ్గో.

---

## ధర్మపథవర్గము

నిరంతర జపతపధ్యానమననాదుల సంలగ్నచిత్తుండయి, రాకుమారుండగు సిద్ధార్థుడు పుణ్యతీర్థంబగు గయాక్షే త్రిమునందలి యొకానొక యశ్వత్థ వృక్షతలంబున నాసీను

డయియున్న సమయంబునందే సుజ్ఞానప్రాప్తి నందెను. జ్ఞాన ప్రాప్త్యనంతరము సిద్ధార్థకుమారుడు తొల్లింటి నామధేయ మును వర్జించి, బుద్ధుడను నూతనశుభాభిధేయమును వహించెను. అజ్ఞానాంధకారపటలావృతంబగు హృదయాకాశంబున, జ్ఞాన భాస్కరోదయంబగుడు, నవ్యతరానూన పరిశుద్ధానందము సహజముగనే బుద్ధభగవానునికి బ్రాప్తించెను. తదానంద మలౌకికంబయి, నిష్కల్మషంబయి, పరివర్తనశూన్యమయి యుండుట గాంచి బుద్ధుడు నిస్తబ్ధుడాయెను. భయవిషాదని లయంబగు విస్తృతవిశ్వక్షేత్రమున బ్రాపించిక జనసంఘ మును జ్ఞానోపదేశంబున నుత్థానపదవికిం జేర్చి, తా ననుభ వించు పరిశుద్ధ బ్రహ్మానంద రసానుభవము నవ్వారికి సహిత మొదవజేయుటయే ప్రేమమయుండును, జ్ఞానజ్యోతిర్మయుం డును నగు ప్రత్యేకబుద్ధుని యుక్తధర్మమని సహితము బుద్ధ దేవుడు విశ్వసించెను. "ప్రేమగతజీవుండును, రాగద్వేషాది కుప్రవృత్తుల నిషేధించినవాడును, స్థితప్రజ్ఞుడునునగు బుద్ధుడు నశ్వరంబులగు లౌకికసౌఖ్యపాశబద్ధులగు నరుల నుద్ధరింప గటి బద్ధుడు కావలయును. ప్రపంచాభ్యుదయము నపేక్షించి, జ్ఞానానందవితరణ మొనరించు సిద్ధుడే బుద్ధుడుకదా!" యను సదౌదార్యభావవీచికలు బుద్ధుని హృదయసరోవరమును గల్లో లమొనరింప గడంగెను. ఉద్ధరింపబడిన తాను స్వోత్కర్షచే నిజానందరసాధిక్యతను క్షేమమయులగు మానవుల కవ్యాజ

కరుణావిశేషంబున బ్రసాదింప నిరంతరావిరళపర్యటనము సలుప గృతనిశ్చయుండయ్యెను. "సంసారసాగరమును జ్ఞాన నౌక నధిరోహించి లీలామాత్రంబున దరించి, ఉదారగుణాతిశయంబున సోదరమానవుల దరింపజేయువాడే వాస్తవికంబగు బుద్ధుడు, ధర్మాత్ముడు. స్వసుఖాన్వేషణమునకయి కృషి సేయుచు, బరానందప్రాప్తికయి, యుద్యమింపని నరుడు స్వార్థాంధుడు; పతితుడు. నేనుబడయు నేతచ్ఛుద్ధానందమున గాని, సాంసారికవ్యక్తిబృందము, ప్రాపంచిక వ్యామోహాలబ్ధ భయవిషాదపరంపరలనుండి విముక్తమయి, నిర్మలంబును, నిశ్చలంబును, ఆదిమధ్యాంతరహితంబునునగు నిర్వాణపదవిం బడయ సశక్తంబు గాజాలదు." ఏతద్విధోత్తమోద్దేశప్రేరితుండయి బుద్ధభగవానుడు మోక్షప్రాప్తి. కనుకూలంబును, జ్ఞానాధిక్యతానిలయంబును, బునీతసిద్ధాంతయుక్తంబునునగు బౌద్ధ ధర్మప్రచారము, నధర్మపూరితమానవసంఘమధ్యంబున సలుప నున్ముఖుండయ్యెను. తత్సమయంబున శ్రీబుద్ధభగవానుడు ప్రజాసంఘమున కుపదేశించిన సద్బోధలును, దన్మహాత్మకథిత భిక్షుజనోచిత విశుద్ధధర్మమార్గమును, సత్సిద్ధాంతాంతర్గత దివ్యజ్ఞాన సారాంశమును, నిమ్నోదాహృతసద్వాక్యసందోహ పఠనంబున బాలక ప్రపంచమునకు సుకరంబుగ సువ్యక్తంబగు :—

(1) 'సంసారులారా! సంసారమున ధర్మప్రవక్తలచే నుపదేశింపబడు సమస్తమార్గములలోనికెల్ల నష్టాంగమార్గమే శ్రేష్ఠతరము. యావజ్జగత్ప్రచలిత సత్యములలోనికెల్ల నార్య సత్యచతుష్టయమే సంపూజ్యము; సత్వరాచరణీయము సమస్తవిధ సద్గుణరాజియందు వైరాగ్యమే సర్వోత్తమంబయి నది. సర్వాంసహావలయమందలి మనీషులలోనికెల్ల గన్నువిప్పి, వీక్షింప శక్తుండగు నరుడే యుత్తమోత్తముడు; అధికసమ్మాన భాజనుడు.

(2) మానవుని దృష్టిని వివేకజ్యోతివిలసితంబొనరించు యీ మార్గరాజమే యత్యుత్తమమయినది. వేరొండు పథము గర్హ్యము. ఏతన్మార్గానుసరణంబున మానవుని కల్మషపరి పూర్ణంబగు చిత్త మతినైర్మల్యమును బడయును. సత్యము న న్వేషింప నభిలషించు వారి కీ మార్గమే ప్రయోజనమొడగూ ర్చును. భ్రాంతికి జిక్కక యీ మార్గము ననుసరించువారు కామదేవుని భయవిషాద ప్రతిపాదకంబులగు వ్యామోహపాశ ములకు వశులుగాక, యుద్ధరింపబడుట నిక్కువము. రాగద్వే షాది చిత్తవికారవిధ్వంసనానంతరమే నేనీ మార్గమును బడసి, మీకు సహితము విశదము సేయనౌత్సుక్యము నందితి.

(3) మానవులారా! మీరు సత్వర మీపథమునే యను కరింప నుద్యమింపుడు. ఏతత్పథానుకరణంబున సమస్త విధ

పాపంచిక దుఃఖములు నిర్మూలమగును. నిర్మలానందము మీపాదయుగ్మమును స్వయముగ నేతెంచి యాశ్రయించును. స్వానుభవంబుననే భయవిషాదముల విధ్వంసమొనరింపగల నీ మార్గమును బ్రిపథమమున గ్రహించి పునః మీకు బోధింపు చున్నాడ.

(4) పృథ్వీతలంబున మానవుని సద్ధర్మము సదుద్యోగ మొనరించుటయే యని కర్మయోగశాస్త్రరహస్యము నవగాహనము జేసికొని మీరుసహితము ప్రయత్నము సేయుడి. తథాగతులు కేవల ముపదేశకులేగాని సత్కార్యముయొక్క సత్ఫలమును బ్రసాదించు బాధ్యతాయుతులు కారు. యుక్తాయుక్త వివేచనాపరులగు నరులు స్థిరసంకల్పచిత్తులయి, సదుద్యోగంబున మత్కథితాపూర్వ పథము ననుసరింతురేని శీఘ్రమే మానవుని వ్యామోహబంధనములనుండి ముక్తదేహులయి సుఖింతురు.

(5) నశ్వరంబగు బ్రపంచమున బాదుర్భవించు సమస్త పదార్థములు క్షణభంగురములేయను రహస్యంబును సుజ్ఞాన ప్రభావంబున గుర్తింప సమర్థుండగునరుడు సమస్తభయవిషాద పరంపరలయెడ నసదృశంబగు సహనశీలతను గల్గి మెలంగును. అట్టిచో నవ్వానికి సుఖదుఃఖములు సమానమయి యొప్పు

విషయవికారములు దూరమగును. పారిశుద్ధ్యమును బడయని దిమే యుత్తమపథంబు సుమీ!

(6) భువిపై నశింప నుద్భూతములగు సమస్త పదార్థములు భయవిషాద సంభరితములయి యెప్పుడున్నవి. ఏతద్రహస్యమును గ్రహింప సశక్తుండగు మానవోత్తముండు దుఃఖాది కష్టపుంజముల నానందపూర్వకంబుగ ననుభవింపగలడు. గ్రహించియు నాచరణశూన్యుండగు వానికీ మార్గము ప్రయోజనకారి కాజాలదు. వాస్తవికంబగు చిత్తశుద్ధిని బడయనిదియే సర్వోత్తమంబును, సత్ఫలదాయకంబును నగు పథము.

(7) ఆకృతిబద్ధములగు సమస్తపదార్థములు నశ్వరంబులే యను తత్త్వరహస్యమును సుజ్ఞానదృక్కుల వీక్షింప సమర్థుండగునరుడు చిత్తశుద్ధినంది, దుఃఖానుభవము యెడసంపూర్ణంబగు సహనశీలతనుగల్గి మెలంగును. తాత్కాలికానందము నొదవజేయు దృశ్యములన్నియు నశ్వరంబులని గ్రహించి, యాచరించు మానవుడు దుఃఖమును సరకుగొనడు. ఇట్టిరహస్యము నుద్బోధించు పరమపవిత్రంబగు మార్గరాజ మిదియే యని గ్రహింపనగును.

(8) దృఢశరీరుండును, తరుణవయస్కుండును, నయముండియు!స కాలమున బ్రమత్తచిత్తుండును, మందుడును, జ్ఞాన

దూరుండునునయి నిరంకుశము సుప్పథము ననుకరించుచి త్త మును, యద్దాని విజృంభిత ప్రవృత్తులను వశీభూత మొనరించు కొనజాలని భీరువు జ్ఞానమార్గమును బడయజాలడు. అట్టివానిని వానిసంకల్పములును, భావములును నిర్బలములును, చంచల ములును నయియుండి యుక్తమార్గభ్రష్టుని గావింపుచుం డును.

(9) నరులారా! మీర లాలసింపక నస్థిరంబగు జిహ్వాపై సంపూర్ణాధికారమునంది, చిత్తము యొక్క చాంచల్యమును గుర్తెలుంగుడు. అద్దానిని స్వతంత్రముగ వర్తింపనీయకుడు. దుష్కార్యాచరణంబునకు గడంగకుడు. త్రికరణముగా నీధర్మ త్రియంబు నాచరించిన వ్యక్తిపుంగవుడే మునిపుంగవులచే బ్రదర్శింపబడిన సత్పథము ననుకరింప సమర్థుండగును.

(10) అచంచలంబగు ధ్యానమననాదులవలన నలౌకి కంబగు సుజ్ఞానోదయం బొదవును. ధ్యానమననాదులకు దూర మగు సుజ్ఞానమనుదినము శుష్కించిపోవుట వాస్తవము. జ్ఞాన క్షయ మధఃపతనమునకు మూలంబగును. జ్ఞానవృద్ధిక్షయము లకు మూలంబులగు నీయుభయపదముల గ్రహించి, ప్రధ మంబగు జ్ఞానప్రదాయకపథము నధికోత్సాహంబుతో ననుస రింపవలయును.

(11) విషయవికారం బొక్క భయంకరసాంద్రాటవిం బోలియుండును. అందుండు తృష్ణావృక్షము నొక్కదానినే జ్ఞానకుఠారాఘాతంబున విధ్వంసమొనరించిన బ్రియోజనము పాళక్క. విషయవికారారణ్యమును సాంగోపాంగముగ నష్ట భ్రష్టమొనరింపవలయును మూలమున్న నదియే వృద్ధికి హేతు భూతమగును సుమా! అల్పాధికదృష్టి నెడబాసి, పూర్ణముగా నీతృష్ణాటవిని నిర్మూలింపజేయ సమర్థులగుచో నోభిక్షువు లారా! మీరు సత్వరంబే యీనిబిడావివేకాంధకార పూరిత భయంకరవిషయ వికారారణ్య మధ్యంబునుండి వెలుపలకు విచ్చేసి, సంపూర్ణస్వేచ్ఛాపరతంత్రింబగు ముక్తిపథమును దర్శింప సమర్థులగుదురు.

(12) వనితాసాహచర్యాభిలాష నల్పంబుగ నయిన జిత్తమున భ్రాంతివశంబున గల్గియుండు మూఢమానవుండు, దుగ్ధపానము చేయుచుండు గోవత్సమొక్క క్షణకాలంబయిన మాతృవియోగంబు సహింపజాలనిచందమున విషయవికారా టవీ వియోగము నందక వెలయుచుండును. వనితాసంపర్కా కాంక్షసహితము విషయారణ్యమందలి యొక్కవృక్షమూలమే యని గ్రహింపనగును.

(13) మనుజులారా! మీహస్తములు శరదృతువు నందలి కమలములదుంప నుంకించునట్లు, హృదయముల వ్రా

ప్తమయియున్న స్వోద్భవ వైరిభావపాశముల లీలామా త్రింబున దుంచివేయుడి. సర్వతోముఖ సత్యహితయుక్తం బగు శాంతిమార్గము నవలంబించి, శీఘ్రమే నిర్వాణసౌఖ్యా నందసాగరమున దేలియాడుడి.

(14) మూఢుండగు మానవుడు "వర్షాకాలము, శీతా కాలము నే నిట నేయుందును. వేసవి సమీపించగనే యన్యత్రి చనియెద" అను సంకుచిత భావంబులకు వశుడయి ప్రలపించు చుండును. కాని యతడు వెంటనంటివచ్చు భయంకరంబగు మృత్యువును గ్రహింపజాలకయే యున్నాడు.

(15) ప్రచండవేగముతో బ్రవహింపుచువచ్చు నీటి వెల్లువ నిద్రావస్థయందున్న గ్రామమును గ్రసియించు వేయు చందముననే ధనధాన్యైశ్వర్యములను, జరాచర సంపద్విభవ ములను, బుత్రమిత్రకళత్రాది బంధువర్గమును సంతతము నిజహితాసక్తపదార్థంబులుగ భావించి, స్మృతిపథమునం దిడి కొని, ప్రమత్తచిత్తుండయియుండు కించిజ్ఞుని ముక్కడిరక్కసి యగు మృత్యువు భయంకరాకృతినిదాల్చి యేతెంచి, యక స్మాత్తుగా మ్రింగివేయునుగదా!

(16) ముక్కడి రక్కసియగు మృత్యువు ప్రచండ రూప ధారిణియై వచ్చి నీవక్షోపరిభాగంబున గూర్చుండి,

హృదయమును భేదించి రక్తము పానము సేయుచుండ మాపునడా! నిన్ను రక్షింప బంధు మిత్రి పుత్రికళత్రాదులు గాని, ధనధాన్యాది సకలైశ్వర్యంబులుగాని, ప్రాపంచిక సౌఖ్యపముదాయంబుగాని శక్తిలేక నిస్తబ్ధతను దాల్చి భయకంపితదృక్కుల వీక్షింపుచుండుగడా!

(17) ధీమంతుండును, సచ్చరిత్రుండునునగు మానవోత్తము డీ తత్వనిగూఢరహస్యవిదుడయి, సంయమ పరిత్రాను ష్ఠానంబునను, జ్ఞానసముపార్జనంబునను సత్వరంబె సాంసారిక వ్యామోహపాశ విముక్తిం జెంది, భయంకరంబగు మృత్యువును బాహాబాహి ఢీకొని, ధర్మసంగ్రామమున బరాస్తము గావించి, నిర్వాణసామ్రాజ్యంబున బ్రవేశింపగలడుసుమీ!

ధర్మపథవర్గము పరిసమాప్తము.



పకిణ్ణకవగ్గో

మత్తా సుఖపరిచ్చాగా పస్సే చే విపులం సుఖం,
చజే మత్తా సుఖం ధీరో సంపస్సం విపులం సుఖం. ౧

పరదుక్ఖూపదానేన అత్తనో సుఖ మిచ్ఛతి.
వేరసంసగ్గ సంసట్ఠో వేరాసో న పరిముచ్చతి. ౨

యంహికిచ్చం అపవిద్ధం అకిచ్చం పన కయిరతి,
ఉన్నలానం పమత్తానం తేసం వడ్ఢన్తి ఆసవా. 3

యేసంచ సుసమారద్ధా నిచ్చం కాయగతా సతి,
అకిచ్చం తే న సేవన్తి కిచ్చే సాతచ్చకారినో
సతానం సమ్పజానానం అత్థం గచ్ఛన్తి ఆసవా. ४

మాతరం పితరం హన్త్వా రాజానో ద్వేచ ఖత్తియే,
రత్థం సానుచరం హన్త్వా అనీఘో యాతిబ్రాహ్మణో. ५

మాతరం పితరం హన్త్వా రాజానో ద్వేచ సోత్థియే,
వేయ్యగ్ఘ పఞ్చమం హన్త్వా అనీఘో యాతిబ్రాహ్మణో. ౬

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమ సావకా,
యేసం దివాచ రత్తోచ నిచ్చం బుద్ధగతా సతి. ౭

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమసావకా,
యేసం దివాచ రత్తోచ నిచ్చం ధమ్మగతా సతి ౮

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమ సావకా,
యేసం దివాచ రత్తోచ నిచ్చం సంఘగతా సతి. ౯

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమసావకా,
యేసం దివాచ రత్తోచ నిచ్చం కాయగతా సతి. ౧౦

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమసావకా
యేసం దివా చ రత్తో చ అహింసాయ రతో మనో. ౧౧

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమసావకా,
యేసం దివా చ రత్తో చ భావనాయ రతో మనో. ౧౨

దుప్పబ్బజ్జం దురభిరమం దురావాసా ఘరా దుఖా,
దుక్ఖో౽సమానసంవాసో దుక్ఖానుపతితద్ధగూ,
తస్మా న చద్ధగూ సియా దుక్ఖానుపతితో సియా. ౧౩

సద్ధో సీలేన సంపన్నో యసో భోగసమప్పితో,
యం యం పదేసం భజతి తత్థ తత్థేవ పూజితో. ౧౪

దూరే సన్తో పకాసేన్తి హిమవన్తో౽వ పబ్బతో,
అసన్తో౽త్థ నదిస్సన్తి రత్తిఖిత్తా యథా సరా. ౧౫

ఏకాసనం ఏకసేయ్యం ఏకో చరమతన్దితో,
ఏకో దమయమత్తానం వనన్తే రమితో సియా. ౧౬

ఇది పకిణ్ణకవగ్గో.



## ప్రకీర్ణకవర్గము (వివిధవర్గము)

శ్రీబుద్ధదేవుని ప్రియశిష్యుండగు సారీపుత్రు డతిభీష ణంబును, సాంద్రంబును నగు చంపారణ్యప్రాంత భూముల

గుప్రిమ్మరిల నలవడియుండెను. అప్పటి కామహాత్ముని ప్రాయ
ము నలుబదేబది వత్సరములకు మించియుండదు. గురుభక్తి
పరాయణుండును సద్ధర్మానురక్తుండును నగు సారీపుత్రుడు
దివారాత్రములు బౌద్ధమతప్రచారము దేశదేశములయందును,
వాడవాడలయందును గావింప నత్యధికప్రయత్నము సలుపు
చుండెను. వారి యాకార మత్యద్భుతానందప్రదము.
వాగ్ధోరణి యతివిలక్షణము. ఆమహాత్ము డయస్కాంతము
మాడ్కి దర్శకుల డెందముల క్షణమాత్రకాలంబున స్వీయ
వాక్చాతుర్య ప్రభావంబున నాకర్షించుచుండెను.

గండకీతరంగిణీతీరంబున నొక్కదివసము ప్రాతఃకాల
మున సారీపుత్రుడు బాలభాస్కర కిరణమాలికా ప్రకాశ
ప్రసారంబు నవలోకించుచు, గమలాకరుని సహజ సర్వభూత
హితకార్య పారతంత్ర్యమున కచ్చెరువందుచు, బ్రకృతిని గుఱిం
చి దీర్ఘముగ నాలోచించుచుండెను. తద్వాహినీ పరిసరగ్రామ
వాసులు కొందఱచ్చోటికరుదెంచి, భక్తిగద్గద కంఠులరయి,
బద్ధాంజులరయి, సారీపుత్ర మహాశయునితో నిట్లు నివేదింప
గడంగిరి ;—"సాధూత్తమా! తమరు బుద్ధభగవానుని ప్రియ
శిష్యులరు. తద్దేవుని దివ్యముఖారవింద సౌందర్య తేజఃపుంజము
భవదీయ విశాల వదనమండలమున మూర్తీభవించియున్నది.
ఆదేవుని యనన్య సామాన్యకరుణారసపూరిత సుస్నిగ్ధదృక్కుల

దమచూడ్కు_లెంతయు బోలియున్నవి. ఆభగవానుని యమృత రసోపేతమార్దవ వాక్సరణిని భవదీయ మృదుమధురవచన ప్రకారము పోలియున్నది. వేయేల? తమరభినవబుద్ధచంద్రు లరయి యధునాతన నాగరక ప్రపంచమున బ్రకాశింపుచు న్నారు తమరు దయాంతరంగులరయి దేవుని దివ్యతమ ప్రబో ధములయందలి కొన్ని సద్వాక్యముల వినిపించి, వేడ్క_తో నాలకింపనున్న శ్రవణేంద్రియముల సంతృప్తబఱుప వేడుచున్నా రము. విశేషించి శ్రీబుద్ధభగవానుని వాక్యము లమూల్యము లనియు, జీవన్ముక్తికి మూలసాధనంబులనియు, దద్వాక్యజాల ముల దమరే సరసముగ, సంక్షిప్తముగ, సర్వసాధారణ జనస ముదాయమునకు సహితము సంతసంబొదవజేయురీతి నుపదే శింప సమర్థులరనియు విజ్ఞసముదాయముచే నాలకించి, యిచ్చో టి కేతెంచినారము. సహజదయార్ద్రహృదయారవిందులును, భక్తజనమనోభీష్ట ప్రదాతలును నగు తమరవశ్యము మాసదభి లాషను సఫలోన్ముఖము గావించి, మమ్ము గృతకృత్యుల గావింతురని విశ్వసింపుచున్నారము."

పరమవినయ సౌశీల్యాది సద్గుణ గణవిలసితులగు పౌ రుల నమోక్తుల నాకర్ణించి సంతుష్టాంతరంగుడయి, సారీ పుత్రు డిట్లు నుడివెను:— "ఓ ప్రియగృహస్థ భ్రాతలారా! మీసార్థక విన్నపంబుల నాలకించి మదియం దెంతయు ముద

ము౦దితి. మీకుఁగల్గిన సద్ధర్మ జిజ్ఞాస ప్రశంసాపాత్రము. ముముక్షువుల విహితధర్మము మోక్షప్రాప్త్యనుకూల సత్సిద్ధాంత ప్రచారకులవనిపై సలుపుటయే కదా! బ్రహ్మజ్ఞానము నంది ధ్యానమననాదులచే నాజ్ఞానబీజములకు దోహద మొసంగి, జ్ఞానవృక్షమున ఫలించు నిర్వాణ సత్ఫలంబు నారగించి, యంతటితో మౌనముద్రను వహింపక, నమాయకు లగు సంసారులకు సహిత మా యానందమందలి రసాస్వాదన సౌభాగ్య మొదవజేయుటయె బౌద్ధుని విధ్యుక్తధర్మము. అట్టి తఱి మీదు విజ్ఞప్తులన్నియు మామకంబగు ధర్మాభిలాషా ప్రాధిమను ద్విగుణిత మొనర్చునవయి యున్నవి. దోడ్తోడ మీకు హితము నొడగూర్చునవి సహిత మయియున్నవి. ధర్మ జిజ్ఞాసువుల ధర్మకార్య నిర్వహణమునందు దీకరణముగ సాహాయ్యము గావించు సాధువే యథార్థమగుసాధువు. జిజ్ఞాసా పూర్త్యనంతర మద్దాని కనుకూలంబుగ నాచరించు జిజ్ఞాసువే యథార్థమగు జిజ్ఞాసువు. ఇయ్యెడ నావిధి యనుకూల సద్ధర్మ ప్రబోధము గావించుటయు, మీ కర్తవ్య మాయుపదేశము నాలకించి శ్రద్ధాళురయి యాచరించి, యుద్ధరింప బడుటయు నయియున్నది. భగవానుడగు బుద్ధదేవు డుపదేశించు శుభావ సరంబున నేనా దేవుని తత్త్వోపదేశంబుల బ్రజా సముదాయ

మునకు సరళముగ నుపదేశింపుచుండువాడను. తద్దేవప్రోప దేశిత సమస్త సిద్ధాంతంబుల నేను కంఠస్థము గావించి, యాచరించి ధన్యుండ నయితిని. శ్రీ బుద్ధదేవ ప్రదత్త సిద్ధాంతభండా గమునుండి కొన్ని యుపదేశ వాక్యరత్నముల నేర్చి మాలగా గూర్చి మీకంఠసీమల నలంకరింప జేసెద. మీ రలా దివ్యతర రత్నమాల ప్రకాశంబున నంధకార బంధురంబగు సంసార క్షేత్రమునుండి నిర్వాణమందిరమున కరుగ ననుకూలంబగు సత్యపథము నన్వేషింప సమర్థుల రయ్యెదరు.

అప్పలారా! బౌద్ధమతబోధనముల నెల్ల నాకర్ణించి సంతుష్టాంతఃకరణులయి పురాణవైరాగ్యంబున నుత్తర ప్రతిజ్ఞల సేయుటవలన బ్రయోజనమునకు మారు హాని వాటిల్లుట సత్యంబగును. ఆచరణము, యిదియే మానవకోటి నుద్ధరింప గలది. దృఢసంకల్ప మిద్దాని కావశ్యకము. ఆచరణమును పదమునందే యభ్యుదయము డాగియున్నదని గుర్తెఱుంగుడీ:—

(1) ప్రియ సహోదరులారా! అల్పసౌఖ్యమును సిపేధింప నత్యధికంబును, శాశ్వతంబును, నిర్వికారంబును నగు సౌఖ్యము హస్తగతమగుచో, వివేక సంపన్నుండగు మానవుడు నిశ్శంకితమతియయి, యల్పసౌఖ్యమునకు జలాంజలి యొసంగును.

(2) పరులకు దుఃఖము గల్గించి, స్వీయ సౌఖ్యాభిలాషను సఫలీభూత మొనరింప నభిలషించు మానవుం డభేద్యంబులగు దృఢతర ద్వేషపాశములచే బంధింపబడి, యేయవస్థయందును బరియత్నపరంపరానుభవంబున విముక్తిం బడయజాలక వాపోవుచు, సుఖమునకు దూరమగుచుండును.

(3) విహిత ధర్మమునుండి పరాఙ్ముఖుం డగువాడు (స్వధర్మోపేక్షాపరుండు) ను, నధర్మంబును, నన్యాయభావపూరితంబును నగు కార్యమునం దపేక్ష గలవాడునునగు నియమశూన్యుని దుర్వాసన లనుదిన మభివృద్ధిజెంది, యవ్వానిని భ్రష్టత్వమునకు బాల్పడజేయుట వాస్తవము.

(4) సముచితకార్యములయెడ సుముఖత్వము వహించువాడును, దుష్కార్యములపట్ల నిరసనభావయుతుండయి మెలంగువాడును, ధీమంతుడును, గర్మవీరుండును నగు పురాణపురుషుండును, శరీరవిషయిక కార్యములయందు జైతన్యము గలవాడయి, యపరిమత్తుడయి, వెలయు ధీరుండును దురాశాబంధనములనుండి విముక్తింజెంది, స్వేచ్ఛానందముల బడయుచుండును.

(5) * జననీజనకుల నిర్దయుండయి వధించునట్టియు నవకోపరాకోమోపేతులగు భూపాలద్వయమును మర్గజేయు నట్టియు, బోజాసమేతంబుగ సమస్తరాజ్య విధ్వంసమొనర్చు నట్టియు సద్బ్రాహ్మణు డెంతమాత్రము దండనార్హుడు కాజాలడు.

(6) * మాతాపితల హత్యగావించునట్టియు, శ్రోత్రియ (వేదవేదాంగపారంగతులు) ధరణీపాలయుగ్మమును సంహ రించునట్టియు, యశశ్చంద్రికావిరాజితుండగు పురుషోత్తమును మడియజేయునట్టియు సద్బ్రాహ్మణుడు శిక్షార్హుడు కాజాలడు. అనగా నట్టి నరహంతకశ్రేష్ఠుండగు బాపడు దండింపబడరాదని తాత్పర్యము.

---

*సూచన :— 5, 6 శ్లోకముల యదార్థతాత్పర్య మియ్యది :— శ్రీబుద్ధభగవానుని జీవితకాలమునందు భారతీయ ప్రజాసముదాయమధ్యంబున గర్మకాండపరిచార మత్యధికంబుగానుండెను. తత్కాలంబున విశాటసంఖ్యా కులగు భారతీయుల సమస్తవిధోచ్చమత స్వత్వంబులన్నియు నగరిజాతియుని సంభావింపబడు బ్రాహ్మణవర్ణాధీనమయి యుండెను. ఆసమయంబున బ్రాహ్మణుని ప్రత్యక్షదైవస్వరూపంబుగ, గల్పితశాస్త్రగ్రంథము బందోధిం పుచుండ మూఢజనావళి భావించి యారాధింపుచుండెను. బ్రాహ్మణుడు సమ స్తశక్తివిరాజితుండనియు, సమస్తలోకపాలకుండనియు, గర్మసూత్రముల కధినాథుండనియు, విపరీతతర భారతజాతీయులెల్లగు మది విశ్వసింపుచుండెడి వారు. మహాదరిద్రులనేమి, ధనాఢ్యులనేమి, మూర్ఖులనేమి, జారచోర

గ్రామవాసులెల్లరు సారీపుత్రుని శ్రీముఖమునుండి వెలువడిన యా రెండుశ్లోకముల యథార్థతాత్పర్య మతివికట ముగ నుండుటగాంచి, యతివిస్మయాకుల చిత్తులయిరి. విస్మితులయినవారినోట నొక్క మాటయయిన వెలువడనే లేదు. ఆశ్లోకముల సారీపుత్రుఁడు విమర్శనార్థముల నియే యుచ్చరించినాడని గ్రహించిన కొందఱు తమజ్ఞానరాహిత్యమున కెంతయు లజ్జావనత మస్తకులయిరి. సారీపుత్రుఁడవ్వారి విస్మయావస్థను గ్రహించి, మందహాస వదనారవిందుఁడయి యిట్లుపన్యసింపదొడంగెను :—"భ్రాతలారా! భవద్విస్మయంబునకయి నేనబ్బురపడుటలేదు; అది స్వాభావికంబే. తథాగతుని

---

భిక్షువులనేమి, వీరువారననేల? బాపలు సమస్తమానవుల నిచ్ఛామాత్రంబున లీలాసదృశంబుగ స్వర్గలోకమునకనుపుట యాకాలపుబ్రాహ్మణులకు నల్లేరుపై బండినడపుటకంటె నతిసుకరమని భావించునంతటిమూఢులుఁగ గల్పితశాస్త్రప్రబోధంబులచే బ్రాహ్మణేతరభ్రాతల గావించియుండిరి. నరకమునహిత మాభూసురోత్తముల యాధీనమునందే యుండెను. మహానీచాతినీచుండయినను ధూర్తశేఖరుండయినను నామకాబ్రాహ్మణవంశమునందు జననమందు వ్యక్తికి భూదానంబుల నొసంగికాని, స్వకీయ సతీమణులతో సంభోగింపజేసికొని మరియేవిధంబుగనయిన నాబాపని యిచ్ఛవచ్చినపచ్చున వర్తించికాని బ్రాహ్మణేతరులు తృణమాత్రకాలమునందే నిర్వాణమందిరమున జేరవచ్చునని యాకాలపుహారులూహింపుచుండెడివారట. స్వర్గనరకాధిపతులా బ్రాహ్మణులే యాకాలమునందయియుండిరి. బ్రాహ్మణుఁ లేరీతి సంచరించినను, నరహత్యలగావించినను, పతివ్రతాలోకమానాపహారులయినను, రాజద్రోహులయినను, దండవా

శ్రీముఖమునుండి 5, 6 సంఖ్యగల శ్లోకద్వయము బహిర్గతమయినపుడు నేనుసహితము మీవలెనే యధికాశ్చర్య సంభ్రమలకు క్షణమాత్రకాలంబు వశుండనయియుంటిని. తచ్ఛ్లోకముల నాకర్ణించిన ప్రతివ్యక్తియు నమితాశ్చర్య పరవశుండగుట సహజమే. పైనుదహరింపబడిన శ్లోకద్వయము స్వార్థసిద్ధహస్తులగు నామకాబాపలచే విరచింపబడినవి. వానిని దేవుడు సంపూర్ణముగా విమర్శించి, నిషేధించి, ప్రజాదరణమునకు

---

ర్హులుకారని యాకాలపుబ్రాహ్మణేతరులు భావింపుచుండెడివారు. తత్కాలపు ప్రజామాధ్యమునకయి యవ్వారిని దూషింపబనియేమున్నది? గురుపీఠములనధిష్ఠించియున్న బాపలే స్వార్థాంధులయి, యుదరంభరత్వమునకుగాను బ్రాహ్మణేతరుల ద్విపాద పశువుల గావించియుండ కృతఘ్నులును, నిరంతర మానవ సేవాధర్మ పరతంత్రులును నగు బ్రాహ్మణేతరుల దూరఖనిదేమి? ఆకాలపు బ్రాహ్మణజాతి దుష్టాశిష్టచర్యాతతికి బ్రస్తుతకాలము నాడు నుళయాళమునందు జారత్వమునే జీవితవిధిగా భావించునామకాబాపలచర్యలే పరమప్రమాణములు. బ్రహ్మజ్ఞానసంపన్నులరయి, నిరాడంబరజీవులయి యుండవలసిన బ్రాహ్మణుల వృత్తులేమయియున్నవో యధునాతనకాలంబున, బాఠకులారా! యూహింపుడి. పైనుదహరింపబడిన శ్లోకద్వయమునందే శ్రీబుద్ధభగవాను డాకాలపు బ్రాహ్మణుల యహంకార మమకారపూరిత దురభిలాషను, దుశ్చేష్టాపరంపరలను, సాంఘికదుస్థితిని జిత్రరువుసగిది చిత్రించియున్నాడు. బ్రాహ్మణులచే నెలకొల్పబడిన యానికృష్టధర్మమును దద్విప్రజన విరచిత స్వార్థభావమయ ధర్మగ్రంథజాలమును బూర్ణముగా విమర్శించెను. 5, 6, శ్లోకములే సంఘప్రజలచే నాదరింపబడుచున్నవనియే బుద్ధుడుద్ఘోషించియుండెనుగాని తానాచరింపవలసినదిగా నుపదేశించినవి మాత్రముగావు.

చాత్రముగాకుండ జేసివైచెను. అనాదినుండియు బ్రిజ లాశ్లో కముల ననుసరించియే వర్తింపుచున్నారు. శ్రీబుద్ధభగవానుడు శైధిల్యమునందిన ధర్మధ్వజమును భారతంబున బునః ప్రతిష్ఠింప నుదయించి, పూర్వోక్తబ్రాహ్మణవంశ ప్రచారిత ధూర్తజనోచిత సిద్ధాంతంబుల విషమతత్వభేదంబు సమస్త జనులకు సువ్యక్తము గావించెను. బ్రాహ్మణుడు మాతాపితృహంతకుడయినను, బరదారాసక్తుండయినను నీచాతినీచుండయినను నవధ్యుండని కర్మకాండాభిలాషులరగు బ్రాహ్మణులచే విరచింపబడిన స్మృతీతిహాసంబుల వ్రాయబడియున్నది. విప్రు లుపనిషన్మతంబును, నుపనిషత్సిద్ధాంతంబులను స్వార్థసిద్ధికయి, పుక్కిటిపురాణములు (కల్పితగాథలు)గ గావించియున్నారు. యజ్ఞయాగాదికృత్యముల నాచరించు బ్రాహ్మణోక్తముల యాకల్పితశాస్త్రముల సంబోధించియే బుద్ధదేవు డీరెండుశ్లోకముల నుచ్చరించియుండెను. నిర్జీవజాతి హృదయమును సారవంతము గావించు నిమిత్తమే దేవు డీశ్లోకముల బోధించియున్నాడు.

మహాత్ముండగు సారీపుత్రుని యాదివ్యతమంబగు వ్యాఖ్యానము నాలకించి, రెండములయం దపరిమితానందము నంది, గ్రామీణులిట్లు యా సాధుసత్తమునికి విన్నవించిరి:—

"మహాత్మా! బ్రాహ్మణరూపధారులగు బ్రహ్మరాక్షసుల,

శ్రమణవేషావలంబులగు గోముఖవ్యాఘ్రముల, దీనజనోద్ధరణ కంకణబద్ధ రూపధారులగు కాలకాకోదరముల, భాగవతోత్తమ సాధువేష సుసజ్జితులగు భ్రష్టాచార్య శిఖామణుల, నామకా బ్రాహ్మణుల ధూర్తజనోచిత కార్యకలాపంబు హృదయంగమ మాయెడిని. దయార్ద్రహృదయులయి, సత్వరము ప్రకీర్ణకవర్గమందలి శేషాంశముల సహితము బోధించి, సంసారమునందలి కపటవేషధారుల మాయావాగురముల నుండి మమ్ము సంరక్షించి, ధన్యాత్ములరగుడి. భవదుపదేశ శ్రవణమాత్రంబున మే ముద్ధరింపబడుదుము. ప్రజాగణము నావహించియున్న నూతనోత్సాహ శ్రద్ధాభక్తుల వీక్షించి, సారీపుత్రుడు ద్విగుణిత హర్షోత్ఫుల్ల హృత్కమలుండయి యుపదేశింపదొడంగెను :—

(7) గౌతమ బుద్ధుని శిష్యులహోరాత్రము లప్రమాదులయి జాగ్రదవస్థయందే యుందురు. వారి భావములన్నియు నాదేవుని ధ్యానించుటయందే లగ్నమయియుండును. మా భావము లాదేవుని సద్ధర్మము ననుసరించునంత పర్యంతమే సంపూజ్యములు.

(8) శ్రీ గౌతమబుద్ధుని శిష్యులెల్లరు నప్రమత్తులయి, చైతన్యపరిపూర్ణహృదయులరయి ధర్మము నాదరింపుదు నాచ

రింపుచుందురు. ధర్మమే వారి లక్ష్యమయియుండ, వారి భావం బులన్నియు నా ధర్మాదర్శ పీఠచ్ఛాయనే లాస్యము సేయుచుండును.

(9) తథాగతుని ఛాత్రులెల్లరు సర్వకాల సర్వావస్థల యందు మేల్కొనియే యుందురు. వారెప్పుడు విస్మరించియున దేహము నచేతనావస్థయందుండనీయరు. వారి పవిత్ర భావములు దివారాత్రములు సంఘము ననుసరించియే యాచరింపబడుచుండును.

(10) గౌతమబుద్ధుని శిష్యులెల్లవేళల జాగ్రదవస్థయందే యుందురు. వారి హృద్గత భావంబులన్నియు నిజదేహముల విస్మరించియుండక, గుర్తెఱింగియే యుండుచుండును.

(11) గౌతముని ఛాత్రులనారతము జాగ్రదవస్థయందే మెలంగుచుందురు. వారనాతరము దయాదాక్షిణ్యములనుండి నేమరియుండక, భూతదయాపరతంత్రులరయి యుందురు.

(12) దివారాత్రములు గౌతమబుద్ధునిశిష్యులు చైతన్యస్థితియందే యుండి, శుద్ధభావాచరణమును, నిరంతర ధ్యానమననాదులను గల్గియే వర్తింపుచుందురు.

(13) సంసార వ్యామోహబంధనముల నెడబాసి, సాధు వగుట కష్టతరము. సంసారయాత్రను నిశ్చింతగా గడపుటయు గష్టసాధ్యమె. మఠమునం దుండుటయు గష్టమే. గృహమునం దధివసించుటయు దుస్తరమే. మూర్ఖులగు సహచరులతో సమయము గడపుటయు దుస్సాధ్యమే. ఏకాంతవాసము సేయుటయు సుకరముకాదు. జననమరణ చక్రగతుడగుటయు శుభప్రదంబుగాదు. పై నుదహరింపబడిన కార్యములన్నియు నెట్లు కష్టపరంపరావృతములో, అదియేచందమున మానవుడు భిక్షువయి మెలంగుట సహితము కష్టసాధ్యమయిన కార్యము.

(14) ధనాఢ్యుండును, సద్గుణవిరాజితుండును, కీర్తిమంతుడును నగు వ్యక్తి కేవలము తానధివసించు స్థానమునందే జనులచే యాదరింపబడుచుండును.

(15) కాని సజ్జనపురుషుండు (సత్యము నారాధించు వ్యక్తి) దూరస్థంబును, హిమాచ్ఛాదితంబునునగు భూధరంబుమాడ్కి దూరదూరమువఱకు బ్రకాశింపుచుండును. దుర్జనుడు (సత్యదూరుడు) నిబిడాంధకారబంధురంబగు నిశాసమయంబున బ్రయోగింపబడిన శరంబువలె దృష్టికి గోచరముకాజాలడు.

(16) నిర్జనారణ్యమునం దధివసించువాని చందమున సర్వదా యేకాంతవాసము సేయువాడును, ఏకాంతముగా

శయనించువాడును, నీచంబులును, నతి చంచలంబులును నగు చిత్తపరివృత్తులపై నాధిపత్యము వహించువాడును, విషయ వాసనలనెల్ల దమనముగావించి, స్థానకాలభేదంబులేక సర్వత్ర సుస్థిరానందమును బడయుచుండును.

ప్రకీర్ణకవర్గము పరిసమాప్తము.



## నిరయవగ్గో.

అభూతవాదీ నిరయం ఉపేతి
యో వాఽపి కత్వా న కరోమీఽతి చాహ.
ఉభోపి తే పేచ్చ సమా భవన్తి
న హీనకమ్మా మనుజా పరత్థ. ౧

కాసావకణ్ఠా బహవో పాపధమ్మా అసఞ్ఞతా,
పాపా పాపేహి కమ్మేహి నిరయం తే ఉపపజ్జరే. ౨

సేయ్యో అయోగుళో భుత్తో తత్తో అగ్గిసిఖూపమో,
యఞ్చే భుఞ్జేయ్య దుస్సీలో రట్ఠపిణ్డం అసఞ్ఞతో. ౩

చత్తారి ఠానాని నరో పమత్తో
ఆపజ్జతి పరదారూపసేవీ,

అపుఞ్ఞ లాభం చ నికామసేయ్యం
నిన్దం తతీయం నిరయం చతుత్థం. ४

అపుఞ్ఞలాభోచ గతీచ పాపికా
భీతస్స భీతాయ రతీచ థోకికా,
రాజాచ దణ్డం గరుకం పణేతి
తస్మా నరో పరదారం నసేవే. ౫

కుసోయథా దుగ్గహితో హత్థమేవాను కన్తతి,
సామఞ్ఞం దుప్పరామట్ఠం నిరయాయు పకడ్ఢతి. ౬

యం కిఞ్చి సిథిలం కమ్మం సంకిలిట్ఠంచ యం వతం,
సఙ్కస్సరం బ్రహ్మచరియం నతం హోతి మహప్ఫలం. ౭

కయిరంచే కయిరాథేనం దళ్హ మేనం పరక్కమే,
సిథిలో హి పరిబ్బాజో భియ్యో ఆకిరతే రజం. ౮

అకతం దుక్కతం సేయ్యో పచ్ఛా తపతి దుక్కతం,
కతంచ సుకతం సేయ్యో యం కత్వా నానుతప్పతి. ౯

నగరం యథా పచ్చన్తం గుత్తం సన్తరబాహిరం,
ఏవం గోపేథ అత్తానం ఖణో వే మా ఉపచ్చగా,
ఖణాతీతాహి సోచన్తి నిరయమ్హి సమప్పితా. ౧౦

అలజ్జితాయే లజ్జన్తి లజ్జితాయే న లజ్జరే,
మిచ్ఛాదిట్ఠి సమాదానా సత్తా గచ్ఛన్తి దుగ్గతిమ్. ౧౧

అభయే భయ దస్సినో భయేచాఽభయదస్సినో,
మిచ్ఛాదిట్ఠి సమాదానా సత్తా గచ్ఛన్తి దుగ్గతిమ్. ౧౨

అవజ్జే వజ్జమతినో వజ్జే చాఽవజ్జ దస్సినో,
మిచ్ఛాదిట్ఠి సమాదానా సత్తా గచ్ఛన్తి దుగ్గతిం. ౧౩

వజ్జంచ వజ్జతో ఞత్వా అవజ్జంచ అవజ్జతో,
సమ్మాదిట్ఠి సమాదానా సత్తా గచ్ఛన్తి సుగ్గతిమ్. ౧౪

ఇతి నిరయవగ్గో.

---

## అధోగతిమార్గవర్గము (నరకవర్గము)

ఒకానొకదివసము శ్రీబుద్ధభగవాను డాత్మప్రియపిరియ శిష్యుండగు సారీపుత్రునితోఁగూడి, భాగీరథీతటమున నుపవిష్టుడయి యుండెను. జహ్నుతనయ యమితవేగంబున నవ్యక్త మధురధ్వాన పరంపరల నుత్పతిలజేయుచు, ప్రవింపుచుండెను. మలయమారుత కిశోరములు తరంగిణీప్రవాహ శీతల జలశీకరములతో సమ్మిశ్రితమయి, నల్దెసల వ్యాప్తమగుచు, గాత్ర స్పర్శంబున నమితానందము నొదవజేయుచుండెను. సంధ్యా సమయమగుడు నరుణవర్ణవిరాజితుండగు వృద్ధభాస్కరుండు నపరదిక్కున కరుగుచుండెను. దీర్ఘకాలపర్యంతము బుద్ధదేవు

డాతరంగిణీ ప్రవాహ ప్రచండవేగోద్ధూత చంచలతరంగ మాలికాజన్య నశ్వర జలబుద్బుదపంక్తుల ప్రాదుర్భావ పతనంబులగూర్చి గంభీరహృదయుండయి, నిమీలిత నేత్ర యుగ్మ మాదేవుని గభీరహృదయ వ్యాప్తాధ్యాత్మిక చింతన మునుగూర్చి సాక్ష్యమొసంగుచుండ, విచారింపుచుండెను. మౌనముద్రితుండును, గభీరాలోచనాసాగర నిమగ్నుండును నగు గురుదేవుని విలక్షణావస్థంగాంచి, సారీపుత్రు డధోముఖుండయి యొకింత కాలపర్యంతము దేవుని వాగమృత రసాస్వాదనాపేక్షాపరుండయి నిరీక్షింపసాగెను. అల్పకాలానంతరము దేవు డాలోచనవారధినుండి విముక్తుడయి శిష్యునిచే నభిలషింపబడిన నిరయ (నరకవర్గము) వర్గమును గూర్చి యీ విధంబుగ నుపదేశింప నారంభించెను :—

(1) అసత్యసంభాషణము నొనరు గడంగువాడును, దానొక్క దుష్కార్యము నాచరించియుండియు సేయలేదని యన్యులు పృచ్ఛించినపు డుత్తర మొసంగువాడును, నరకగాములగుచున్నారు. పరలోకమునం దుభయులును దుష్కార్యములకు హేతుభూతులగుటంజేసి, సమానకష్టపరంపరలకే గురిజేయగుదురు సుమా!

(2) కాషాయాంబరధారులయందును, శిరోముండనాది బాహ్యసంస్కృత వేషాడంబరావలంబుల యందును

సంయమవర్జితదూరులును, విషయలంపటులును, పాపకార్యా సక్తులును నగు నసంఖ్యాకవ్యక్తులు విద్యమానులయి యున్నారు. బాహ్యవేషభాషా వ్యవహారములచే సాధుపుంగవులవలె దృష్టికి గోచరంబగు వ్యక్తులయందు సహితమనేకులు నియమ రహితులయి వెలయుచున్నారని తాత్పర్యము. ఇట్టిపాపాత్ము లాత్మీయదుష్కార్యాచరణంబున నరకము నందుచున్నారు.

(3) దుర్మార్గానురక్తుడయి, మందుడయి, స్వేచ్ఛాభిలాషాన్యుడయిన మానవుడు పరజనపరిపాదిత పరిపాదమును స్వీకరించి, యద్దాని సహాయ్యంబుననే నుదరంభరత్వము గావించుకొనుచు, సజీవుడయియుండుటకంటె బ్రచండానల తప్త లోహకందుకమునొక్కతూరి కబళించి, యిహలోకలీల ముగించుటయే శతసహస్రపు మడుంగులుత్తమోత్తమంబుగదా.

(4) ధర్మాధర్మవివేకదూరుడయి లంపటుడయి చంచలంబులగు చిత్తపరివృత్తులకు వశీభూతుడయి పరదారనభిలషించి మెలంగువ్యక్తి చతుర్విధదండనములకు బాల్పడుట యథార్థము. అవియెవ్వియన :—1 అపకీర్తి, 2 సుఖనిద్రాభంగ మొనర్చు తీవ్రతరంబగు మానసికచింత, 3 అసహనీయదండనము, 4 అంతిమావస్థయందు నరకము.

(5) మానవుడా! నిస్పథోగతి బాల్జేయునట్టి పరకాంతాభిలాషను దృజింపుము. భయభీతయు, నపరిసన్న చిత్తయు నగువనితతో సాహచర్యమునందుటంజేసి నీకు మహాభీతి, దుర్గతి, ఘోరమగు రాజదండనము, అపకీర్తి లభించుటయేగాక సరియగు నానందమయిన హస్తగతము కాజాలదు. అరిష్టదాయకంబును, సౌఖ్యరహితంబును, సమస్త విధోపద్రవకరంబును నగు పరజాయాగమనాభిలాష కడు నింద్యమయినది. సమస్తానుచితంబులలో నియ్యదియే యగ్రస్థానము వహించుచున్నయది.

(6) అసావధాన చిత్తుడయి, యనగా బరాకున దర్భను గరతలంబునం బట్టి నఱచేయి చీఱుకుపోవునట్లు సన్యసించిన వ్యక్తి సంయమపరీక్షానుష్ఠానంబున బ్రమత్తుడయి యుండుచో నవశ్యము నరకమునకు బాల్పడును.

(7) ప్రమాదావస్థయందు గాని, విచార శూన్యావస్థయందుగాని యాచరింపబడిన కార్యము, భంగ మొనరింపబడిన వ్రతాచరణము, నియమదూరంబగు బ్రహ్మచర్య పాలనము మొదలగు కృత్యములు మానవున కెట్టిఫలము నొసంగజాలవు.

(8) మానవుడు విహితధర్మముగ భావించినకార్యము నాలసింపకయే సత్వర మాచరించుట శ్రేయస్కరము. సత్వర విహిత ధర్మాచరణమే సుఖదాయకము శిథిలాచరణాన్వితుం డగు శ్రమణుడు విషయవికార రజమును సర్వత్రి నెగులజేసి కండ్లగప్పుట నిక్కువము.

(9) దుష్కార్యము నాచరింపకుండుటయే యుత్త మోత్తమము. గతం బెద్దియన, దుష్క్రియాచరణంబున మానవునకు బశ్చాత్తాప మొదవుచున్నయది. శుభకార్యము నాచరించుట విశేష లాభప్రదంబు. హేతు వెద్దియన సత్కా ర్యాచరణము యొక్క సత్పరిణామము మానవునిహృదయము నావహించియున్న దుఃఖజాలమును దూరీకృత మొనరించి, అనిర్వచనీయంబగు సౌఖ్యము నొసంగును.

(10) భూపాలురు స్వకీయ సామ్రాజ్యముల బాహ్యాం తరిక భాగముల శాత్రివాకరిణమునుండి సంరక్షించుకొను చందమునసే మానవుడు సహిత మనారతము జాగరూకుడయి, తన్ను దానే రక్షించుకొనుచుండవలయును. ఏత దుత్తమ కార్యాచరణప్రారంభమునం దొక్క క్షణికమయిన కాల విలంబనము సేయరాదు. శుభావసరమును గోల్పోవువారు నరకమునకు బాల్పడుదురు.

(11) లజ్జింపరాని పదార్థమును గాంచిగాని, దృశ్యము నవలోకించిగాని లజ్జించు సిగ్గరియు, వీక్షించినంత లజ్జింపవలసిన దృశ్యము నవలోకించినంతనే సిగ్గు నీషణ్మాత్రియయిన బడయని లజ్జాశూన్యుండును, తమ యదూరదర్శిత్వమున దుర్గతికిం జిక్కి, కడునిడుమల బడుచుందురు.

(12) భయోత్పాదకంబులగు పదార్థముల గాంచి సుంతయు భీతావహుండు కానట్టియు, భీతిగొలుపు వస్తువుల వీక్షించి, భయభీతు డగునట్టియు వ్యక్తులు నిజ దుష్ప్రవర్తనంబునను, అసత్యస్వీకారంబునను దుర్గతికి జిక్కి సుక్కుదురు.

(13) నిషేధింప నర్హుడుకాని వానిని నిషేధించియు నిరసింపరాని పదార్థమును నిరసించి మెలంగునట్టి వ్యక్తియు నిషేధింపదగిన దుర్విషయాసక్తంబులగు కార్యముల బహిష్కరింపక స్వీకరించునట్టి మూఢుండును నిస్సందేహముగా నధోగతికి బాల్పడుచున్నారు.

(14) నిషేధానిషేధతత్వమును గుర్తెరింగినట్టియు, ఉచితానుచితముల గ్రహింపనేర్చినట్టియు ధీమంతుడు సన్మార్గానురక్తుడయి, సత్వరకాలమునందే సద్గతిని బడయుట వాస్తవము.

అధోగతిమార్గవర్గము పరిసమాప్తము



## నాగవగ్గో.

అహం నాగోఽవ సఙ్గామే చాపాతో పతితం సరం,
అతివాక్యం తితిక్ఖిస్సం దుస్సీలో హి బహుజ్జనో. ౧

దన్తం నయన్తి సమితిం దన్తం రాజాభిరూహతి,
దన్తో సేట్ఠో మనుస్సేసు యోఽతివాక్యం తితిక్ఖతి. ౨

వర మస్సతరా దన్తా ఆజానీయ్యాచ సిన్ధవా,
కుఞ్జరాచ మహానాగా అత్తదన్తో తతో వరం 3

నహి ఏతేహి యానేహి గచ్ఛేయ్యం అగతం దిసం,
యథాత్తనా సుదన్తేన దన్తో దన్తేన గచ్ఛతి. ౪

ధనపాలకో నామకుఞ్జరో
కటుకప్పభేదనో దున్నివారయో,
బద్ధో కబలం నభుఞ్జతి,
సుమరతి నాగవనస్స కుఞ్జరో. ౫

మిద్ధీ యదా హోతి మహగ్ఘసోచ
నిద్దాయితా సమ్పరివత్తసాయీ,
మహావరాహోఽవ నివాపపుట్ఠో
పునప్పునం గబ్భ ముపేతి మన్దో. ౬

ఇదం పురే చిత్త మచారి చారికం
యే నిచ్ఛకం యత్థకామం యథాసుఖమ్,

తదజ్జఽహం నిగ్గహేస్సామి యోనిసో
హత్థిప్పభిన్నం వియ అంకుసగ్గహో. ౮

అప్పమాదరతా హోథ సచిత్త మనురక్ఖథ,
దుగ్గా ఉద్ధరథఽత్తానం పఙ్కే సత్తోఽవ కుఞ్జరో. ౯

సచే లభేథ నిపకం సహాయం
సద్ధిం చరం సాధువిహారిధీరం,
అభిభుయ్య సబ్బాని పరిస్సయాని
చరేయ్య తేనత్తమనో సతీమా. ౯

నో చే లభేథ నిపకం సహాయం
సద్ధిం చరం సాధువిహారిధీరం,
రాజాఽవ రట్ఠం విజితం పహాయ
ఏకో చరే మాతఙ్గఽరఞ్ఞేఽవ నాగో. ౧౦

ఏకస్స చరితం సేయ్యో నత్థి బాలే సహాయతా,
ఏకో చరే నచ పాపాని కయిరా
అప్పోస్సుక్కో మాతఙ్గఽరఞ్ఞేఽవనాగో. ౧౧

అత్థమ్హి జాతమ్హి సుఖా సహాయా
తుట్ఠీ సుఖా యా ఇతరీతరేవ,
పుఞ్ఞం సుఖం జీవితసఙ్ఖయమ్హి
సబ్బస్స దుక్ఖస్స సుఖం పహాణం. ౧౨

సుఖా మత్తేయ్యతా లోకే అథో పేత్తేయ్యతా సుఖా,
సుఖా సామఞ్ఞతాలోకే, అథో బ్రిమ్మఞ్ఞతా సుఖా. ౧౩

సుఖం యావ జరా సీలం సుఖాసద్ధా పతిట్ఠితా,
సుఖో పఞ్ఞాయ పటిలాభో పాపానం అకరణం సుఖం. ౧౪

ఇతి నాగవగ్గో.

---

నాగవర్గము (దంతావళవర్గము)

బౌద్ధమతప్రిచారకధర్మసంఘము విశ్రాంతిసమయం బగు చాతుర్మాస్యమును వ్యతీతముజేసి, పునః సంసారము నం దెల్లెడల స్వకీయపునీతధర్మప్రిచారము గావింప సంకల్పించి, స్వస్థానము నెడబాసి, చనిరి. శ్రీబుద్ధభగవాను డావిశాల తమసంఘమున కధినాయకుడు. కోశ్రీశపట్కప్రియాణానంత రంబు మహారణ్యం బొందు మార్గమధ్యంబున దటస్థింప, బౌద్ధ మతప్రిచారకు లందఱు నొక్క మహావాహినీతీరము సమీ పించిరి. ఆ వాహిని కావలితీరమునకు సమీపమునందున్న గ్రామమునుండి జమీందా రొక్కడు నిజభృత్యజనపరివేష్టి తుండయి, తథాగతుని సందర్శించి, యాదేవుని దివ్యోపదేశ ముల నాలకింప నదీప్రాంతమున విడిసియుండెను. దేవుడు శిష్యగణపరివృతుండయి, యీవలియొడ్డునే బసచేసియుండిరి.

తరంగిణీతరణమున కావలితీరమున దంతావళములు జమీం దారు ద్రుహశయునిచే సంసిద్ధము గావింపబడియుండెను. తన్మ హాజంతుసాహాయ్యంబున బుద్ధదేవు డాత్మీయఛాత్రగణసమే తుడయి, నదినిదాటి, యావలితీరము జేరెను. జమీందారు తాను బసచేసియున్న నదీప్రాంతమున కనతిదూరమునందే నిజవిశాలపుష్పోద్యాన మొండు వెలయుచున్నదనియు, సమస్త జనుల కుపదేశించుట కాస్థాన మెంతయు ననుకూలమనియు దేవు నికి విన్నవింప నత డందుల కియ్యకొనెను. బుద్ధభగవాను డను చరసమేతముగా నాపుష్పవాటిక జేరెను. మనోజ్ఞంబగు నామ్ర వృక్షచ్ఛాయయం దుపవిష్టుడయి బుద్ధదేవుడు దర్శకబృందము నుద్దేశించి, నిజవాగమృతాంబుధి వెల్లివిరియ నీరీతి నుపదేశింప గడంగెను :—

(1) సమరాంగణమున యోధావళిచే బ్రయోగింప బడిన కార్ముకతీక్ష్ణశరపరంపరల దంతావళము నతియోరిమిచే సహించునట్లు, శ్రమణుండనగు నేను చంచలస్వభావయుక్తం బగు లోకముగావించు మహాపమానములను సహింపుచున్నా డను. సమగ్రసంసారము దుష్టస్వభావవిరాజితంబుగదా!

(2) దీర్ఘకాలంబుదనుక పోషింపబడిన దంతావళము నధిరోహించియే భూపాలుడు యుద్ధరంగమునకు బయలువెడ

లును. సమస్తవిధముల మచ్చికచే స్వాధీనమయి యున్న నాగ రాజముపై నధిష్ఠించియున్న భూపాలుడు నిర్భయచిత్తుడయి యుండును. శాంతహృదయుడయి నిందావాక్యబాణముల సహింప ననవరతము నుద్యుక్తుడయి యుండుసహనశీలుడే మానవకోటియందు శ్రేష్ఠుడు.

(3) యుద్ధరంగమున కెట్లు వన్యగార్ధభములు మచ్చిక సేయబడినను, ప్రయోజనీయములుగాక, సింధుస్థానోత్త మాశ్వములును, దీర్ఘంబులగు దంతముల గల్గియున్న కరు లును బ్రయోజనీయములయి యుండునో, నదియేచందమున మానవజీవితసంగ్రామరంగమున కాత్మనిగ్రహుండగు పురు షోత్తముడే విశేషప్రయోజనీయుడు. మానవుడు విజయప్రా ప్తికి గజతురగాదుల బోషించుటకంటె నాత్మేంద్రియదమన శక్తిని బెంపొందింపజేయుటయే శ్రేయస్కరము.

(4) పశువులసాహాయ్యంబున మానవు డత్యంతదుర్గ మంబగు నిర్వాణమందిరమును సమీపింపజాలడు. సంయమ చరితానుష్ఠానపరుండగు వ్యక్తి, యింద్రియనిగ్రహ సామర్థ్య ప్రభావంబున, బాహ్యప్రపంచికశక్తుల కతీతంబగు నిర్వాణ ము నవలీలగ బడయగల్గుచున్నాడు. దాంతుని యాత్మసంయ మనమే నిర్వాణమునకు మూలము.

(5) నిరంతరము స్వీయగండస్థలమునుండి మదద్రవము ను స్రవింపజేయు ధనపాలిక మను నామముచే నొప్పు మదగ జమును మహాకృషిచే బట్టి, బంధించిన నయ్యది యాహారపానీ యముల విసర్జించి, స్వీయవాసస్థానంబగు నిబిడారణ్యమునకయి వ్యాకులపడుచుండును.

(6) స్థూలభావయుక్తుండగు లోభియు, స్థూలకాయుం డును, కుంభకర్ణనిద్రాపరవశుండును, మందుడునునగు మూర్ఖుడు మలాదికముల నారగించి మనెడి నీచసూకరంబు పగిది చీటికి మాటికి జన్మచక్రంబునబడి, వ్యథజెందుచుండుట వాస్తవంబు.

(7) ఒకప్పుడీ నా మానసము స్వేచ్ఛావిహారము సేయు టయందే లగ్నమయియుండెడిది. ప్రధానేంద్రియమగు దాని ననుసరించియే సమస్తేంద్రియములు నిరంకుశములయిపోయె డిని. కాని మావటీడు తీక్ష్ణాంకుశప్రహారంబున మదగజమును స్వాధీన మొనరించుకొనుచందముననే, నేనుసహితమా నా ని రంకుశమానమును సంయమంబున వశము గావించుకొనియెద.

(8) మానవుడా! అసావధానచిత్తుడవయి యుండకుము. భావము నెప్పుడును, స్వతంత్రము గానీయక, వశముగావించు కొనియే యుండుము. అగాధపంకిలమయకుండమునుండి దన్ను

దా నుద్ధరించుకొను గజముచందాన నిన్ను నీవే కుమార్గము నుండి సంరక్షించుకొనుము.

(9) బుద్ధిమంతుడును, గ్రంథసాంగుడును, హితాహిత జ్ఞానాన్వితుండును, సదాచారసంపన్నుండును నగు మార్గదర్శకుఁడు లభింపుచో మానవుడు తన కొదవు సమస్తవిధకష్ట పరంపరల దాంతుడయి సహింపుచు నాతని ననుసరింపవల యును.

(10) జయింపబడిన ప్రాంతములనెల్ల విడిచి ముందున కేకాకియయి సాగిపోవుభూపాలునిచందమునను, భయంక రారణ్యభూముల నొంటరిగా స్వచ్ఛందవిహారము సేయు గజ ముభంగియు, సత్యవంతుడును, సచ్ఛీలుండును నగు మిత్రుని బడయజాలని మానవు డేకాకియై యుండుట హితకరము. మా నవుడు సజ్జనసాంగత్యము బడయజాలకపోయినంతమాత్రం బున దుర్జనసాంగత్యము నపేక్షింపరాదు. ఏకాకియై మనుటయే దుష్టమైత్రికంటె హితప్రదము.

(11) ఒంటరిగానుండుటయే శ్రేయోదాయకము. కాని మూఢజనమైత్రి మోసమును గల్గించునుగదా యని గుర్తెరింగి, దాని నపేక్షింపరాదు. మానవుడు దురాచారముల చేయక, సద్బుద్ధియు, విషయవాసనాశూన్యతయు గల్గి యటవీప్రదేశం

బున నొంటరిమైచరించు దంతిపగిది నేకాంతవాసము నభిలషించుట యుక్తము.

(12) వాగుడ్రిపంబుగాక సంకటావస్థయందు సాహాయ్యం బొనరించు సుహృద్వరు లతిశ్రేష్ఠులు. మనస్తృప్తి సౌఖ్యావహము. అంతిమావస్థయం దాచరింపబడు సత్కర్మ సౌఖ్యానందప్రదము. సమస్తవిధదుఃఖనిరసన మత్యంతానందకరము. మనోవికార త్యాగమే మహదానంద ప్రాప్తికి మూలము.

(13) మాతృధర్మము సుఖకరము. పితృధర్మమానందప్రదము. సన్యాసవ్రతస్వీకార మలౌకికహర్షదాయకము. బ్రాహ్మణధర్మపరిగ్రహణముసహిత మదియేచందమున మోదోత్పాదకంబు కాగలదు.

(14) మానవుడు బాల్యమాదిగ వార్ధక్యముపర్యంతము సచ్ఛీలుడయి మనుట శుభావహము. నిష్ఠాన్వితంబగు శ్రద్ధయు నానందకరమె. సుజ్ఞాన సంపాదనము సహిత మానందమునకు మూలమె. దుష్కార్యాచరణవిముఖత్వమును మానవకోటి కతీతానందప్రతిపాదకమే సుమా!

దంతావళివర్గము పరిసమాప్తము.

---

## తణ్హావగ్గో.

మనుజస్స పమత్తచారినో
తణ్హావడ్ఢతి మాలువా వియ,
సో ప్లవతి హురాహురం
ఫలమిచ్ఛంఽవ వనస్మిం వానరో. ౧

యం ఏసా సహతీ జమ్మీ తణ్హా లోకే విసత్తికా,
సోకా తస్స పవడ్ఢన్తి అభివడ్ఢంవ బీరణం. ౨

యో చేతం సహతీ జమ్మిం తణ్హాం లోకే దురచ్చయం,
సోకా తమ్హా పపతన్తి ఉదబిన్దూఽవ పోక్ఖరా. ౩

తం వో వదామి భద్దం వో యావన్తేత్థ సమాగతా,
తణ్హాయ మూలం ఖణథ ఉసీరత్థోఽవ బీరణం;
మావో నలంఽవ సోతోఽవ మారో భఞ్జి పునప్పునం. ౪

యథాఽపి మూలే అనుపద్దవే దళ్హే
ఛిన్నోఽపి రుక్ఖో పునరేవ రూహతి,
ఏవంఽపి తణ్హానుసయే అనూహతే
నిబ్బత్తతీ దుక్ఖ మిదం పునప్పునం. ౫

యస్స ఛత్తింసతీ సోతా మనాపస్సవనా భుసా,
వాహా వహన్తి దుద్దిట్ఠిం సంకప్పా రాగనిస్సితా. ౬

సవన్తి సబ్బధీసోతా లతా ఉబ్భిజ్జ తిట్ఠతి,
తంచ దిక్ఖా లతం జాతం మూలం పఞ్ఞాయ ఛిన్దథ. ౭

సరితాని సినేహితానిచ
సోమనస్సాని భవన్తి జన్తునో,
తే సాతసితా సుఖేసినో,
తేవే జాతి జరూపగానరా. ౮

తసినాయ పురక్ఖతా పజా
పరిసప్పన్తి ససోఽవ బాధితో,
సఞ్ఞో జన సజ్జసత్తా
దుక్ఖముపేన్తి పునప్పునం చిరాయ. ౯

తసినాయ పురక్ఖతా పజా
పరి స్సప్పన్తి ససోఽవ బాధితో,
తస్మా తసినం వినోదయే
భిక్ఖు ఆకఙ్ఖీ విరాగ మత్తనో. ౧౦

యో నిబ్బనథో వనాధిముత్తో
వనముత్తో వనమేవ ధావతి,
తం పుగ్గలమేవ పస్సథ
ముత్తో బన్ధన మేవ ధావతి. ౧౧

న తం దళ్హం బన్ధన మాహు ధీరా
యదాయసం దారుజం బబ్బజంచ,

సారత్తరత్తా మణికుణ్డ లేసు
పుత్తేసు దారేసుచ యా అపేక్ఖా. ౧౨

ఏతం దళ్హం బన్ధన మాహు ధీరా
ఓహారినం సిథిలం దుప్పముఞ్చం,
ఏతంఽపి ఛేత్వాన పరిబ్బజన్తి
అన పేక్ఖినో కామసుఖం పహాయ. ౧౩

యేరాగరత్తాను పతన్తి సోతం
సయం కతం మక్కటకోఽవ జాలం,
ఏతంఽపి ఛేత్వాన వజన్తి ధీరా
అనపేక్ఖినో సబ్బదుఃఖం పహాయ. ౧౪

ముఞ్చ పురే ముఞ్చపచ్ఛతో
మజ్ఝే ముఞ్చ భవస్స పారగూ,
సబ్బత్థ విముత్త మానసో
సపున జాతిజరం ఉపేహిసి. ౧౫

వితక్కపమథితస్స జన్తునో
తిబ్బరాగస్స సుభానుపస్సినో,
భియ్యో తణ్హా పవడ్ఢతి
ఏస ఖో దళ్హం కరోతి బన్ధనం. ౧౬

వితక్కూపసమే చ యో రతో
అసుభం భావయతి సదా సతో,

ఏస ఖో వ్యన్తి కాహితి
ఏస చ్ఛేచ్ఛతి మార బన్ధనం. ౧౭

నిట్ఠంగతో అసన్తాసీ వీతతణ్హో అనఙ్గణో,
అచ్ఛిద్ద భవసల్లాని అన్తిమేఽయం సముస్సయో. ౧౮

వీతతణ్హో అనాదానో నిరుత్తిపదకోవిదో,
అక్ఖరానం సన్నిపాతం జఞ్ఞా పుబ్బాపరానిచ;
సవే అన్తిమసారీరో మహాపఞ్ఞో మహాపురిసోఽతివుచ్చతి. ౧౯

సబ్బాభిభూ సబ్బవిదూఽహమస్మి
సబ్బేసు ధమ్మేసు అనూపలిత్తో,
సబ్బఞ్జహో తణ్హాక్ఖయే విముత్తో
సయం అభిఞ్ఞాయ క ముద్దిసేయ్యం. ౨౦

సబ్బదానం ధమ్మదానం జినాతి
సబ్బం రసం ధమ్మరసో జినాతి,
సబ్బం రతిం ధమ్మరతీ జినాతి
తణ్హాక్ఖయో సబ్బ దుక్ఖం జినాతి. ౨౧

హనన్తి భోగా దుమ్మేధం నో చే పారగవేసినో,
భోగతణ్హాయ దుమ్మేధో హన్తి అఞ్ఞేఽవ అత్తనం. ౨౨

తిణదోసాని ఖేత్తాని రాగదోసా అయం పజా,
తస్మాహి వీతరాగేసు దిన్నం హోతి మహప్ఫలం. ౨౩

తిణదోసాని ఖేత్తాని దోసదోసా అయం పజా,
తస్మాహి వీతదోసేసు దిన్నం హోతి మహప్ఫలం. ౨౪

తిణదోసాని ఖేత్తాని మోహ దోసా అయం పజా,
తస్మాహి వీతమోహేసు దిన్నం హోతి మహప్ఫలం. ౨౫

తిణదోసాని ఖేత్తాని ఇచ్ఛాదోసా అయం పజా,
తస్మాహి విగతిచ్ఛేసు దిన్నం హోతి మహప్ఫలం. ౨౬

ఇతి తణ్హావగ్గో.

---

తృష్ణావర్గము.

నేడు శ్రీబుద్ధభగవానుఁడు ధర్మతత్వప్రచారము సలుపునిమిత్తము వైశాలీనగరమున కేతెంచుచున్నాఁడనుశుభవార్త వీనులసోకినంతనే బ్రహ్మానందపరవశులరయి తన్నగరనివాసులెల్లరు నగరబాహ్యప్రదేశమున నేకత్రితమయిరి. ప్రతిమానవునిహృదయ మానందమున కాటపట్టయి యుండెను. వారు గావించు కోలాహలధ్వను లవ్వారి హృదయోత్సాహాధిక్యత నుద్ఘోషింపుచుండెను. పటగృహము లెన్నియో క్షణమాత్రకాలంబున నిర్మింపబడియెను. శ్రీబుద్ధోపదేశము నాలకింప జనులెల్ల రొక్కవిశాలతమంబగు పటగృహంబున

సమావేశమయి యుండిరి. ఆనందరసాధిదేవతా దివస మా సభాగృహమున మూర్తీభవించి, లాస్యము సేయుచున్నదో యన్నచందమున దత్సభాగతప్రత్యేకవ్యక్తి వికాసభాసుగం బగు ముఖారవిందము చెప్పకయే చెప్పుచుండెను. తత్సభాభవన మధ్యభాగంబున నుచ్చాసనము సుసజ్జితమయి యుండెను. అద్దాని కిరుపార్శ్వముల నమూల్యములగు తివాచీలు పఱుపబడి యుం డెను. నియమితసమయమునకు సరిగా లోకబాంధవుడు పశ్చి మాబ్ధిగుంకుటకు బూర్వము బుద్ధదేవుని మనోజ్ఞంబగు పర మపావనమూర్తి శిష్యగణసమేతంబుగ నరుదెంచుచుండుట సభికులకు గోచరంబయ్యెను. ఆదేవుని ప్రకాశభాసురంబగు స్వర్గీయమూర్తి నవలోకించినంతనే సభాభవనమంతయు భక్తి రసప్రవాహప్లావిత మగుడు, సభికులెల్లరు మౌనమును భజింప నుపక్రమించిరి. భగవాను డేతెంచినతత్క్షణమే జనుల జయ జయధ్వానములు సేయ నవసరము లేదని నిషేధించెను. దేవుని పవిత్రదక్షిణహస్తకమలమునందు భిక్షాపాత్రము వెలయు చుండెను. పాదసరోజయుగ్మము ధూళిధూసరితమయి యుం డెను. విశాలముఖమండలమున గాంభీర్యతేజఃకాంతులు నాట్య ము సేయుచుండెను. విస్తీర్ణంబులగు నేత్రములనుండి యపూ ర్వకాంతులు వెలువడుచుండెను. సమస్తసంసారస్థితప్రాణి కోటిదుఃఖభారమును నిజశీర్షమున వహించియున్న శ్రీబుద్ధభగ వానుడు—సర్వసంగపరిత్యాగియు, దైవాంశసంభూతుండును

సహజ సమస్త భూతదయార్ద్రీహృదయారవిందుడును నగు బుద్ధభగవానుడు నేడమందానంద కందళితచిత్తుండయి వైశాలీ నగరప్రజాసముదాయమునకు స్వీయప్రేమ సందేశమును కర్ణరసాయనంబుగ వినిపింప నేతెంచెను. దేవుడు గద్దెపై నధిష్ఠించి, ప్రేమరసవాహిని వెల్లివిరియ నీరీతి మృదుమధురంబుగ నుపదేశింపగడంగెను :—"బౌద్ధధర్మోపదేశములలోని కెల్ల దృష్ణావిసర్జనప్రబోధమే యుత్తమోత్తమము. బౌద్ధమత తత్వసారాంశము తృష్ణాబహిష్కారమే. కవాటము మాటున డాగియున్న బిడాల మేచందమున గేహిని దుగ్ధపాత్రమును గృహమునం దుంచి, వెడలిపోయినంతనే దబ్బాటున నామార్జాలము క్షీరభాండమును సమీపించునో నదిరయేరీతి దృష్ణ మానవదేహమను గేహమును బాసినంతనే ముక్తికన్య కాకర కమలగ్రహణసౌభాగ్యము కరతలామలకం బగును. 'తృష్ణ' యను హాలాహలపూరితపదమును నిర్మూలింప జేయుటయే మానవుని సర్వోత్తమంబగు ధర్మము. పిమ్మట మానవుడు సేయవలసిన దేమియు నుండదు. సమస్త మదియంతట నదియే చక్కబడును. తృష్ణాప్రబోధాంశముల శ్రద్ధాభక్తుల నాలకింపుడి:—

(1) ప్రమత్తుడును, వివేకశూన్యుండును నగువాని తృష్ణ వసంతర్తువునందలి లతికవలె దినదినప్రవర్ధమాన మగుచుం

డును. ఫలాపేక్షచే మర్కటము యొకవృక్షశాఖాగ్రము నుండి మఱియొక్క భూరుహశాఖపైకి లంఘించుచుండు చందమున నలసుండ నేకజన్మముల బడయుచు దిరుగుచుం డును.

(2) మానవుడా! నీవు విషపూరితంబును, దుష్ఫలదా యకంబును నగు తృష్ణకు బద్ధుడవు కాకుము. తీక్ష్ణతమంబగు తృష్ణకు వశీభూతుండయిన వ్యక్తియొక్క దుఃఖసముదాయ మతిశీఘ్రగతి నవురుగడ్డివలె వృద్ధియగును.

(3) భయంకరంబును, గఠోరంబును నగు తృష్ణను వశీభూతము గావించుకొనుట మహాకష్టసాధ్యమయిన వ్యా పారము. కాని యట్టివిషయంబగు విషమతృష్ణపై నాధిపత్యము వహింపగల వివేకసంపన్నుని, విషాదసముదాయము నళినీదళగత జలకణములచందమున స్పృశింపక, నశించును.

(4) ఇయ్యెడ సమావేశమయియున్న మీయందఱి హితము నభిలషించియే, కల్యాణకరంబులగు వచనముల బేర్కొ నుచున్నాడను. నాహితోక్తుల నాకర్ణించి, మీకోమలంబు లగు హృదయక్షేత్రములనుండి నీచములగు తృష్ణాబీజముల సమూలముగ విధ్వంస మొనర్పుడి. ఏలయనగా వట్టివేరుల సుగం ధము నాఘ్రాణించు భాగ్యమునందగోరు వ్యక్తి దాని నలువై పులదట్టముగా బెఱిగియున్న నవురుగడ్డిని కూకటివేళ్లతో బెల్ల

గించివేయునుగదా! అదియేచందమున మీరు మూలసమేత ముగా మీహృదయక్షేత్రముల మొలకరించిన విషయవాసనాబీజముల బెఱికివేయుడి. అట్లుగావించినపిదప భయంకర రూపధారిణియగు మృత్యుదేవత మిమ్ముల ననేకపర్యాయముల బాధింపజాలదు.

(5) వృక్షము ఖండింపబడినంతమాత్రంబున శుష్కించి, నశించిపోవదు. పృథ్వియందున్న మూలము నాధారముగ జేసికొని, యల్పకాలమునందే సంగతింపబడి, చిగిర్చి యంతమునకు ఫలపుష్పభరితంబయి, నవీనవికాసముతో బూర్వాకృతిని దాల్చును. అదియేచందమున సంపూర్ణముగ దృష్ణాబీజములు నశింపజేయబడకపోయినచో నల్పకాలమునందే పెరిగి, పెద్దవయి, కుఫలముల నొసంగును. దుష్ఫలము నారగించువ్యక్తికి పునర్జన్మయే ధాతవ్రితయగును.

* (6) తృష్ణాబద్ధుండగువ్యక్తిని ముప్పదియాఱు ప్రవాహములు నైహికసౌఖ్యము వైపున కాకర్షింపుచుండును. విషయ

---

* 6:— ముప్పదియాఱు ప్రవాహములివ్వి :—1 చక్షువు, 2 శ్రోత్రము 3 నాసిక 4 జిహ్వ 5 మనస్సు 6 కాయము 7 రూపము 8 శబ్దము 9 గంధము 10 రసము 11 స్పర్శము 12 ధర్మము యనెడి పండ్రెండు యింద్రియసంబంధులు. ఈపండ్రెండును గామతృష్ణ, భవతృష్ణ, వైభవతృష్ణలను భేదత్రయంబున వ్యవహరింపబడుచుండును. వైవానిలో నొక్కొక్కటి మూడువిధములు.

వికారసంభరితంబులగు నాసరివంతుల దేలియాడు వ్యక్తి నందలి చంచలతమంబులగు వీచికాపరంపరలు డోలాయమాను నునిగావించి జలగ్రస్తుని గావించివేయుట వాస్తవము.

(7) ఏతత్ప్రవాహము యొక్క శాఖలు చతుర్దిశల వ్యాప్తమయియున్నవి. ఈ ప్రవాహజలములచే సించితము లయి, విషయవాసనాలతిక లనుదినం బనూనంబగు వికాసము నందుచు బ్రవర్ధమాన మగుచుండును. తల్లతికాభివృద్ధిని గాం చేగల్గినంతనే, మానవుడా! శీఘ్రము నీ వప్రమాదుండవయి సుజ్ఞానకుఠారంబును హస్తంబున గొని మూలసహితంబుగ వానిని ఖండించివేయుము.

(8) నరునివిషయసుఖాభిలాష లప్రతిబంధకములయి విలాసమయంబులయి నిరతము వెలయుచుండును. అవ్వాని యందే సౌఖ్య మున్నదని భ్రమించి, వానికి వశీభూతుండయి, సంచరించు నరు డవశ్యము జన్మమరణ చక్రంబున బడి స్రుక్కు చుండును.

(9) జాలమున జిక్కుపడి విముక్తినంద నటునిటు బర్వు లెత్తుచు వ్యాకులపడు కుందేలుచందమున తృష్ణాపాశబద్ధుడగు నరు డసంఖ్యాకములగు దుఃఖపరంపరలకు గురియయి, ఖేద మునందుచుండును.

(10) అభేద్యంబులగు తృష్ణాపాశములచే బంధితుడయినవ్యక్తి, వలనుజిక్కి సుళిక్కు కుందేలుపగిది నిటునటు విముక్తికయి పరుగులిడును. కాని పాశములు దృఢతరంబగుటంజేసి, ముక్తిని బడయజాలక కడువాపోవును. తృష్ణాపాశములనుండి సంపూర్ణవిముక్తి నంద నభిలషించు శ్రమణుడు శక్తికొలది విషయవాసనల నాశపఱచవలయును.

(11) విషయవికారసంఘటితారణ్యమున జిక్కువడిపోయినవ్యక్తి ప్రయత్నంబున విముక్తినంది, మూర్ఖుడయి పునరారణ్యప్రవేశము సేయుచో నట్టివా డెన్నిమారు లనంతరము విముక్తినందఁగలిగినను నిరంతరము తృష్ణాధీనుడే యగుచు, దుఃఖసముదాయము ననుభవింపుచుండును.

(12) కాష్ఠలోహాది నిర్మితంబులును, రజ్జువుచే నిర్మింపబడినట్టియు బంధనముల వివేకవంతు లెపుడును దృఢతరపాశములుగ భావింపరు. అవలీలగ ఛేదింపబడు నీబంధనములకంటె మానవుని గామినీకాంచనసంతానైశ్వర్యాది సాంసారికవాంఛలే గట్టిగ బంధించివైచును. దీర్ఘకాలాభేద్యంబులగు నీబంధనముల జిక్కు నరునకు మోక్షస్వాతంత్ర్యము లభింపజాలదు.

(13) దుర్గతికి మానవుని బాల్పడజేయునట్టియు, ఖండింప శక్యము కానట్టియు, వహింప నసాధ్యమయినట్టియు, శృంఖల

ములనే జ్ఞానవంతులగు సుత్తమనరులు దృఢతమంబులగు పాశ ములుగ భావింతురు. విషయవాసనాశృంఖలంబులగు నీబంధనముల దెంచివేయునరుడు, తృష్ణను, సుఖోపభోగములను సంపూర్ణముగ త్యజియించి, సమస్తవిషాద సంకటములనుండి విముక్తుడయిపోవును.

(14) సాలీడు తా నల్లినగూటిదారము యొక్క సాహాయ్యంబుననే భూమిపై బడిపోవునట్లు విషయవాసనాదాసుడగు మానవుడు తృష్ణాప్రవాహంబున కొట్టుకొనిపోయి యథోగతికి బ్రాప్తించును. ఈ బంధనముల ఖండించివేసిన ప్రజ్ఞావంతుడు సమస్తవ్యామోహాపరిత్యాగముగావించి, వైరాగ్యము నవలంబించి, సంసారమునుండి సంపూర్ణముగ దరించిపోవును గదా!

(15) సంసారసాగరతరణంబున నావలితీరమును జేర యత్నించు మానవుడా! నీవు నీకు ముందుభాగమునందున్న తృష్ణనుబాసి చనుము; వెనుకనున్న తృష్ణను గూడ వర్జించి యడుగిడుము; మధ్యనున్నదానిని సహితము నిరసించి సాగుము అనగాభూతభవిష్యద్వర్తమాన తృష్ణలనెల్ల వీడుము. సంపూర్ణముగ నీమానసము విముక్తమగుచో నద్దానికి దిరిగి జననమరణచక్రంబున బడు దుర్భాగ్యము ప్రాప్తింపదు.

(16) సంశయోపేతుండును, ప్రబల విషయవాసనాను రక్తుండును, సౌఖ్యాభిలాషాపూరితహృదయుండును నగు మానవునితృష్ణ యూహాతీతముగా నభివృద్ధిజెంది మానవు నంతకుబూర్వమే బంధించియున్న బంధనముల మఱింత దృఢంబుగను, నభేద్యములుగను గావించివేయును.

(17) చిత్తమున వ్యాప్తమయియున్న సందేహసముదాయనివృత్తిని గావించుకొని సర్వదా పవిత్రతమంబగు నానందమునందుచు, శరీరముయొక్క మలవాసనాదుల దుఃఖమయంబులుగ గ్రహించు వ్యక్తిసత్తముడు, మారుని దృఢతరంబులగు పాశముల శీఘ్రమే ఖండింప సమర్థుండగును. అట్టివానికి దుఃఖాదిమనోసంకటము లింక వాటిల్లనేరవు.

(18) పూర్ణావస్థ (నిర్వాణము) కు బ్రాపించి, నిర్భయుండును, రాగదూరుండును, దోషశూన్యుండును నగు పరిశుద్ధహృదయుండును, సమస్తవిధ సాంసారిక కంటక దూరుండును నగు వ్యక్తి కీజన్మతోడనే ముక్తి లభించును. అట్టివానికీ దేహమే యంతిమంబగును.

(19) నిజవాసనల నష్టభ్రష్ట మొనరించినట్టియు, సంగరహితుండయినట్టియు, ధర్మజ్ఞానసంపన్నుండయినట్టియు, శబ్దార్థముల బూర్వాపరసంబంధమును గుర్తెఱుంగగల్గినట్టియు మేధా

సంపన్నుండగు వ్యక్తిపుంగవుడు తిరిగి జనింపడు. అతడు దాల్చి యున్న కాయమే యంతిమంబని గ్రహింపనగును. అట్టి పురుషోత్తముని విజ్ఞపరింపనని మహాపురుషుండనియు, సిద్ధపురుషుండనియు నవతారపురుషుడనియు బేర్కొనుచుండును.

(20) నేను సమస్తమును జయించినాడను, నేను సర్వజ్ఞుండను, జీవితప్రాయము యొక్క సమస్తావస్థలయందు నేను నిష్కళంకుడను. నేను సమస్తమును ద్యజించి మించినాడను. విషయవాసనల నిర్మూలన మొనరించుటం జేసి నేను విముక్తుండ నయితిని. స్వయం శిక్షితుండను. ఇట్టిచో నే నెవరిని శిక్షితుల గావింతును ?

(21) సమస్త దానములయందును ధర్మదానమే సర్వోత్తమ మయినది. అదియే కల్యాణకరమయినది. సమస్త రసమాధుర్యములలోనికెల్ల ధర్మరసమాధుర్యమే మిన్న. సర్వవిధములగు నానందములలోనికెల్ల ధర్మముచే బ్రాప్తమగు యానందమే యుత్తమోత్తమమయినది. విషయవాసనల సమూలముగ నష్టమొనరించుటయే సమస్త దుఃఖభంజకంబగును. తృష్ణావిసర్జనమే మానవుని కర్తవ్యము.

(22) సంసారసాగరము యొక్క యావలి తీరము (నిర్వాణము) ను జేర నభిలషింపనట్టి ధర్మజ్ఞానశూన్యుండగు

మూఢుని, సుఖోపభోగాభిలాషయే విధ్వంసము సేయును. సుఖోపభోగాసక్తిపరుండగు వ్యక్తి నావిషయవాసనయే ప్రాణశత్రువువలె బట్టి మ్రిగ్గజేయును. తృష్ణను గల్గియుండుటే మానవుని స్వవినాశనమునకు హేతుభూతమగును.

(23) గడ్డి గాదరవలన క్షేత్రము నిరర్థకమయిపోవుచున్నయది. కామముచే మానవుడు భ్రిష్టుడయిపోవుచున్నాడు. కనుక నిష్కాముకులును, దయార్ద్రహృదయులును నగు సత్పురుషులకు బ్రిసాదించిన దాన మద్వితీయ ఫలప్రద బగుచున్నయది.

(24) గడ్డి గాదర మొలచుటచే క్షేత్రము నిష్ప్రయోజనమయిపోవుచున్నయది; ద్వేషముచే మానవులు భ్రిష్టత్వమును బడయుచున్నారు. కాన గతద్వేషుల కిడిన దాన మనంత సత్పరిణామప్రదము కాగల్గుచున్నయది.

(25) తుంగ మొదలగు గడ్డిచే బొలము చెడిపోవుచున్నయది; గర్వముచే మానవజాతి పతితమయిపోవుచున్నయది. కావున గర్వదూరుల కర్పింపబడు దాన మత్యుత్తమము శుభావహంబగు ఫలము నొసంగును.

(26) గడ్డివలన క్షేత్రముదూషితమయిపోవుచున్నయది. తృష్ణాబద్ధతచే మానవలోకము పతితమయిపోవుచున్నయది.

కనుక కాంక్షాశూన్యుల కిచ్చు దాన మసామాన్య సత్ఫలంబు నొసంగుచున్నది.

తృష్ణను విసర్జింప జ్ఞానముప్రాప్తించి పతితు నుద్ధరించును.

తృష్ణావర్గము పరిసమాప్తము.



భిక్ఖువగ్గో.

చక్ఖునా సంవరో సాధు సాధు సోతేన సంవరో,
ఘాణేన సంవరో సాధు సాధు జివ్హాయ సంవరో. ౧

కాయేన సంవరో సాధు సాధు వాచాయ సంవరో,
మనసా సంవరో సాధు సాధు సబ్బత్థ సంవరో;
సబ్బత్థ సంవుతో భిక్ఖు సబ్బదుక్ఖా పముచ్చతి. ౨

హత్థ సఞ్ఞతో పాదసఞ్ఞతో
వాచాయ సఞ్ఞతో సఞ్ఞతుత్తమో,
అజ్ఝత్తరతో సమాహితో
ఏకో సన్తుసితో తమాహు భిక్ఖుం. 3

యో ముఖసఞ్ఞతో భిక్ఖు మన్తభాణీ అనుద్ధతో,
అత్థం ధమ్మంచ దీపేతి మధురం తస్స భాసితం. ౪

ధమ్మారామో ధమ్మరతో ధమ్మం అనువిచిన్తయం,
ధమ్మం అనుస్సరం భిక్ఖు సద్ధమ్మా నపరిహాయతి. ౫

సలాభం నాతి మఞ్ఞేయ్య నాఽఞ్ఞేసం పిహాయం చరే,
అఞ్ఞేసం పిహాయం భిక్ఖు సమాధిం నాధిగచ్ఛతి. ౬

అప్పలాభోఽపిచే భిక్ఖు సలాభం నాతి మఞ్ఞతి,
తంవే దేవా పసంసన్తి సుద్ధా జీవం అతన్దితమ్. ౭

సబ్బసో నామరూపస్మిం యస్స నత్థి మమాయితం,
అసతాచ నసోచతి సవే భిక్ఖూఽతి వుచ్చతి. ౮

మేత్తా విహారీ యోభిక్ఖు పసన్నో బుద్ధసాసనే,
అధిగచ్ఛే పదం సన్తం సఙ్ఖారూపసమం సుఖం. ౯

సిఞ్చ భిక్ఖు ఇమం నావం సిత్తా తే లహు మేస్సతి,
ఛేత్వా రాగంచ దోసంచ తతో నిబ్బాణ మోహిసి. ౧౦

పఞ్చ ఛిన్దే పఞ్చ జహే పఞ్చ చుత్తరి భావయే,
పఞ్చ సఙ్గాతిగో భిక్ఖు ఓఘతిణ్ణోఽతి వుచ్చతి. ౧౧

ఝాయ భిక్ఖు మాచ పమాదో
మాతే కామగుణే భమస్సు చిత్తం,
మా లోహగుళం గిలీ పమత్తో
మాకన్ది దుక్ఖ మిదంఽతి డయ్హమానో. ౧౨

నత్థి ఝానం అపఞ్ఞస్స పఞ్ఞా నత్థి అజ్ఝాయతో,
యమ్హి ఝానంచ పఞ్ఞంచ సవే నిబ్బాణస న్తి కే. ౧౩

సుఞ్ఞాగారం పవిట్ఠస్స స న్తచి త్తస్స భిక్ఖునో,
అమానుసీ రతీ హోతి సమ్మా ధమ్మం విపస్సతో. ౧౪

యతో యతో సమ్మసతి ఖన్ధానం ఉదయబ్బయం,
లభతి పీతిపామోజ్జం అమతం తం విజానతం. ౧౫

తత్రాయ మాది భవతి ఇధ పఞ్ఞస్స భిక్ఖునో,
ఇన్ద్రియ గు త్తీ సన్తుట్ఠీ పాతిమోక్ఖేచ సంవరో;
మి త్తే భజస్సు కల్యాణే సుద్ధజీవే అతన్ది తే. ౧౬

పటిసన్థార వు త్తస్స ఆచారకుసలో సియా,
తతో పామోజ్జ బహులో దుక్ఖస్స న్తం కరిస్ససి. ౧౭

వస్సికావియ పుప్ఫాని మద్దవాని పముఞ్చతి,
ఏవం రాగంచ దోసంచ విప్పముఞ్చేథ భిక్ఖవో. ౧౮

స న్తకాయో స న్తవాచో స న్తమనో సుసమాహితో,
వ న్తలోకామిసో భిక్ఖు ఉపసన్తోఽతి వుచ్చతి. ౧౯

అ త్తనా చోదయత్తానం పటిమాసే అ త్త మ త్తనా,
సో అ త్తగు త్తో సతిమా సుఖం భిక్ఖు విహాహిసి. ౨౦

అత్తాహి అ త్తనో నాథో అత్తాహి అ త్తనో గతి
తస్మా సఞ్ఞమ యత్తానం అస్సం భద్రంఽవ వాణిజో. ౨౧

పామోజ్జ బహులో భిక్ఖు పసన్నో బుద్ధసాసనే
అధిగచ్ఛే పదం సన్తం సఙ్ఖారూప సమం సుఖం 22

యో హవే దహరో భిక్ఖు యుఞ్జతి బుద్ధసాసనే
సో ఇమం లోకం పభాసేతి అబ్భా ముత్తోఒవ చన్దిమా.

ఇతి భిక్ఖువగ్గో పఞ్చవీసతిమో.



శ్రీమణవర్గము (భిక్షువర్గము)

ఒకానొక దివసము శ్రీ బుద్ధభగవానునిచెంత కిక్ష్వాకు వంశ రాజకుమారు లిరువురు బౌద్ధమతదీక్షాబద్ధులగుట కేతెంచిరి. వారు స్వగృహముల నెడబాసి, గమనోన్ముఖులయి సరిగా బౌద్ధవిహారమందిరమునకు వచ్చిచేరిరి. తత్సమయంబున శ్రీ బుద్ధదేవుడు బౌద్ధమతదీక్ష నవలంబింప నేతెంచిన జనుల కెల్లరకు భిక్షుధర్మతత్వమును గూర్చి సుబోధకముగ, మృదుమధురంబుగ, నుపదేశించుచుండెను. రాజకుమారు లాహితోపదేశము నాలకించుటయందు సంలగ్నులయిరి. తదుపదేశ సారాంశమునిట బొందుపరచుచున్నాడ :—

(1) దర్శనేంద్రియ సంయమవ్రితపాలనము సుఖకరము. ఘ్రాణేంద్రియదమనము సుఖోత్పాదకము. శ్రవణేంద్రియవశీకరణమంత్రపఠనము సౌఖ్యదాయకము. రసనేం

ద్రియసంయమవ్రతనిర్వహణము సమ్మోదసంధాయకము. ఏతచ్చతుర్విధేంద్రియవశీకరణశక్తి నార్జించుట మహోత్తర సౌఖ్యప్రాప్తికి మూలము.

(2) దేహమును, వాక్కును, మానసమును వశీభూత ము గావించుకొనుటయే మంగళప్రదకార్యము. సమస్తవిధ ముల నాత్మసంయమమును గల్గియుండుటయే మానవునకు శ్రే యస్కరంబు. ఎల్లవిధముల నిజాత్మపరిపాలకుండగు భిక్షు వఖిలదుఃఖములనుండి విముక్తుడయి సుఖించును.

(3) సమస్తవిధసంయమవ్రతపరిపాలకుండును, సమ స్తేంద్రియములపై బూర్ణాధికారమును వహించియున్నవా డును, నాత్మికభావమునందే యమందానందము నందువా డును, మనస్తృప్తియుక్తుండును, స్థిరచిత్తుండును నేకాంతవాసి యయి సమాధానవృత్తిచే నుండువాడును నగు వ్యక్తిసత్త మునే భిక్షు వనియెదరు.

(4) వాణిని వశమునం దునిచికొని, శాంతబుద్ధితో డను, మేధాశక్తితోడను భాషించుచు, జనులమనముల నాక ర్షించునట్టి ధర్మతత్వ హితోపదేశముల గావించుచు మెలంగు శ్రమణుని భాషణమునందు భావాతీతంబగు మాధుర్య ముండును.

(5) ధర్మవివేచనాపరుండును, ధర్మచింతనయందే పక్షము నందువాడును, ధర్మతత్త్వమీమాంసాయుక్తుండును, ధర్మసిద్ధాంతానుకూలవర్తకుండును నగు బౌద్ధపరివ్రాజకుడు, సత్యధర్మస్థానమునుండి భ్రష్టుడు కాజాలడు.

(6) తనకు లభ్యమయినపదార్థ మల్పమయినను భిక్షువయినవా డద్దానిని నిరసనభావముతో వీక్షింపరాదు. పరులకు ప్రాప్తించిన గురుతరపదార్థము నవలోకించి, మత్సరగ్రస్తుడగుట బౌద్ధభిక్షువున కుచితముకాదు. పరులనుగాంచి, ద్వేషించునట్టి భిక్షు వేయవస్థయందును మనశ్శాంతిని బడయజాలడు.

(7) ప్రాప్తించిన యల్పపదార్థమునయిన, నల్పముగ నవలోకింపక, మహాప్రసాదముగ భావించి, మహదానందముతో స్వీకరించునట్టియు, బరిశుద్ధాచరణ యుక్తుండయినట్టియు, నిరంతరోద్యోగతత్పరహృదయుం డయినట్టియు, భిక్షువును దేవతాబృందము సహితము హృదయపూర్వకంబుగ సంస్తుతించును.

(8) నశ్వరంబులును, మిథ్యాభిమానప్రోక్తంబులును నగు నామరూపాదివికారంబుల నేకీభవింపనట్టి పరిశుద్ధాంతరంగుండును, గతకాలమునకయి ఖేదము జెందని ధీరుండును నగు వ్యక్తిసత్తమునే భిక్షువని వక్కాణింపదగును.

(9) సహజదయార్ద్రహృదయుండును, సర్వకాలసర్వావస్థల బుద్ధోపదేశముల సుస్థిరచిత్తుడయి, వర్తించునట్టియు, వాస్తవికభిక్షువుయొక్క సమస్తదుర్వాసనా సముదాయమంతరించిపోవును. అవ్వాని కిహమున, నమితసౌఖ్యము లభింప, ననంతర మనంతసుఖశాంతినిలయంబగు నిర్వాణ మతిసులభంబుగా గరతలామలకం బగును.

(10) ఓశ్రమణుడా! సంసారసాగరమున బ్రయాణము సేయుచున్న నీజీవననౌకను రాగద్వేషాదికల్మషభారము నుండి ఖాళీచేయుము. భారమెక్కుడగుటంజేసి, యది జలగతము కానున్నదిసుమా! నీజీవితమును సాగరనిమగ్నముగావించు నాకల్మషభారము దూరమయిన, నౌక యతిశీఘ్రగమనంబున గమ్యస్థానంబగు నావలితీరము (నిర్వాణము)ను జేరును. రాగద్వేషాదిశూన్యుండేగదా సంసారసాగరమును దరించి, నిర్వాణమును బడయగల్గునది!

(11) ఓశ్రమణుడా! పంచేంద్రియముల నణచివేయుము. పంచవిధపాశంబుల ఖండించివేయుము. పంచేంద్రియంబులపై సంయమవ్రతానుష్ఠానంబున నాధిపత్యము వహింపుము. ఏతద్విధపంచేంద్రియబంధనములనుండి విముక్తిజెందిన భిక్షువే సంసారసాగరోత్తీర్ణుడు కాగలడు.

(12) ఓశ్రీమణుడా! సానందచిత్తుండవయి, ధ్యానము సలుపుము. స్వేచ్ఛాచారి (ప్రమత్తుడు లేక మందుడు) వి కాకుము. క్షణభంగురంబగు తుచ్ఛకామాదిసౌఖ్యంబుల బ్రీతిపాదించు పదార్థములవైపునకు దృష్టినయిన బ్రసరింపజేయకుమా! నిరంకుశుండును, బ్రమత్తుండును నగువాడు నరకలోకమున బ్రచండానల తప్తలోహకందుకముల మ్రింగుచు, హాహాకారధ్వనుల గావింపుచుండునని గుర్తెఱుంగుము. ఓభిక్షుకుడా! నీవలసుడవుకాక, స్థితప్రజ్ఞుండవగుచో నిట్టిదుర్గతికి బాల్పడవుగదా!

(13) జ్ఞానదూరునకు ధ్యానము లభ్యమగుట దుస్సాధ్యము. ధ్యానములేనిదే జ్ఞానము లభింపజాలదు. ధ్యానజ్ఞానసంపన్నుండగు భిక్షువు సత్వరమతిసులభముగ నిర్వాణమును సమీపించును.

(14) శూన్యంబగు సదనమున బ్రవేశించినవాడును, సుస్థిరచిత్తసంపన్నుండును, ధర్మజ్ఞానవిదుండును నగు వ్యక్తి సత్తముం డపూర్వానందమును బడయును.

(15) శాశ్వతనిర్వాణపదమును బడయు వ్యక్తి పొందు సౌఖ్యానుభవములను, బాంచభౌతికంబగు శరీరోత్పత్తిని గూ

ర్చియు, శరీరనాశనమును గుఱించియు జ్ఞానమునందిన భిక్షు వచిరకాలమునందే బడయునుగదా!

(16) చంచలంబులును, హానిప్రదంబులును నగు నింద్రియార్థములపై సంపూర్ణధ్యానమును గల్గియుండుట, మనస్తుష్టిం గల్గియుండుట, ధర్మానుకూలంబుగ వర్తించుట, పవిత్రాచరణయుక్తులును, నప్రమత్తులును నగు సజ్జనపురుష వరేణ్యులతోడి సాంగత్యము బడసి మెలంగుట మొదలగునవియే ధీమంతుడగు శ్రమణుని కిహలోకమున సత్ఫలప్రదాయకంబులగు నాద్యధర్మంబులుసుమా!

(17) నిరంతర పరోపకారంబునను, ధర్మకార్యాచరణంబునను, ప్రేమమయజీవితనిర్వహణంబునను భిక్షువున కిలాతలంబున ప్రాప్తించిన నలౌకికంబగు మహదానందమే యవ్వాని కొదవుచుండు క్లేశముననదాయము నంత మొదింపుచుండును.

(18 ఓశ్రమణులారా! వాసంతికాలతిక, వాడిపోయిన సుమసముల బరిత్యజించువడువున, మీర లతిశీఘ్రము తృష్ణావైరముల బరిత్యాగము సేయుడి.

(19) ప్రశాంతములగు త్రికరణములగల్గినట్టియు, సుస్థిరచిత్తుం డయినట్టియు, సాంసారికవిషయవాసనాదూరుడయి

నట్టియు, భిక్షువే సమస్తవిధముల నుపశాంతుడు లేక దాంతుడన నర్హుడు.

(20) ఓశ్రీమణుడా? నీవు స్వయముగా జాగరూకుండవయియుండి, పరియత్నముగావించుటయందు దత్పరమతివయిమనుము. నిన్ను నీవేపరీక్షించుకొనుచుండుము. నీవీపరికారము స్వసంరక్షణము గావించుకొనుటయందు దక్షుడవగుదువేని, నిశ్చింతతోడ నీజీవితము నానందమయము గావించుకొని వ్యతీతముసేయ గల్గుదువుసుమా!

(21) కారణ మదెద్దియన, మానవుడు తనకుదానే స్వామి. తన్నుదానే తరింపజేసికొనుటకు గర్త. అశ్వారోహి సైంధవమును వశీభూతము గావించుకొనుచందమున శ్రీమణుడా! నిన్ను నీవే పశపఱచుకొనుమా! స్వాత్మాధిపత్యసంపాదనమే నీదగు విహితధర్మంబని గుర్తెఱుంగుమా!

(22) సానందచిత్తుడయి, బుద్ధోపదేశంబుల నిశ్చలహృదయముతో నాచరించు భిక్షువుయొక్క సంస్కారము (వాసనాదిసౌఖ్యాభిలాష) లు పటాపంచ లగుడు, శాశ్వతంబును, నాదిమధ్యాంతరహితంబును, నిర్వికారంబును, సుస్థిరానందశాంతి నిలయంబునునగు నిర్వాణమును బ్రాప్తింపజేసికొనుచున్నాడు.

(28) పరమపవిత్రంబులగు బుద్ధుని యుపదేశములను, ధర్మములను సంపూర్ణానందచిత్తుడయి, యాచరించుశ్రమణు డల్పవయస్కుండయియున్నను, నవనీలనీరదమాలికావిముక్తం బగు సుధాకరబింబము పగిది నీ సంసారము నత్యంత తేజోవిలసితంబుగావించి, మించుచున్నాడు.

శ్రమణవర్గము పరిసమాప్తము



## బ్రాహ్మణవగ్గో

ఛిన్ద సోతం పరక్కమ్మ కామే పనుద బ్రాహ్మణ,
సఙ్ఖారానం ఖయం ఞత్వా అకతఞ్ఞూఽసి బ్రాహ్మణ. ౧

యదా ద్వయేసు ధమ్మేసు పారగూ హోతి బ్రాహ్మణో,
అథఽస్స సబ్బే సంయోగా అత్థం గచ్ఛన్తి జానతో. ౨

యస్స పారం అపారం వా పారాపారం నవిజ్జతి,
వీతద్దరం విసంయుత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. 3

ఝాయిం విరజ మాసీనం కతకిచ్చం అనాసవం,
ఉత్త మత్థం అనుప్పత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౪

దివాతపతి ఆదిచ్చో రత్తిం ఆభాతి చన్దిమా
సన్నద్ధో ఖత్తియో తపతి ఝాయీ తపతి బ్రాహ్మణో,
అథ సబ్బ మహోరత్తం బుద్ధో తపతి తేజసా. ౫

బాహిత పాపోఽతి బ్రాహ్మణో
సమచరియా సమణోఽతి వుచ్చతి,
పబ్బాజయ మత్తనో మలం
తస్మా పబ్బజితోఽతి వుచ్చతి. ౬

నబ్రాహ్మణస్స పహరేయ్య నాస్స ముఞ్చేథ బ్రాహ్మణో,
ధీ బ్రాహ్మణస్స హన్తారం తతో ధీ యస్స ముచ్చతి. ౭

న బ్రాహ్మణ స్సేత దకిఞ్చి సేయ్యో
యదా నిసేధో మనసో పియేహి,
యతో యతో హింస మనో నివత్తతి
తతో తతో సమ్మతి మేవ దుక్ఖం. ౮

యస్స కాయేన వాచాయ మనసా నత్థి దుక్కటం,
సంవుతం తీహి ఠానేహి తమహం బ్రూమి బ్రాహ్మణం. ౯

యమ్హా ధమ్మం విజానేయ్య సమ్మాసం బుద్ధదేసితం,
సక్కచ్చం తం నమస్సేయ్య అగ్గిహుత్తంఽవ బ్రాహ్మణో. ౧౦

నజటాహి నగోత్తేన నజచ్చా హోతి బ్రాహ్మణో,
యమ్హి సచ్చంచ ధమ్మోచ సోసుచీ సోచ బ్రాహ్మణో. ౧౧

కింతే జటాహి దుమ్మేధ, కింతే అజిన సాటియా,
అబ్భంతరం తే గహనం బాహిరం పరిమజ్జసి. ౧౨

పంసు కూలధరం జన్తుం కిసం ధమనిసన్థతం,
ఏకం వనస్మిం ఝాయ_న్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౩

సచాహం బ్రాహ్మణం బ్రూమి యోనిజం మ_త్తిసంభవం,
భోవాదీ నామ సో హోతి సచే హోతి సకిఞ్చనో;
అకిఞ్చనం అనాదానం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౪

సబ్బసంయోజనం ఛేత్వా యో వే నపరితస్సతి,
సంగాతిగం విసఞ్ఞు_త్తం త మహం బ్రూమిబ్రాహ్మణం. ౧౫

ఛేత్వా నన్ధిం వర_త్తంచ సన్దానం సహనుక్కమం,
ఉక్ఖి_త్త పళిఘం బుద్ధం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౬

అక్కోసం బన్ధ బన్ధంచ అదుట్ఠో యో తితిక్ఖతి,
ఖ_న్తీబలం బలానీకం త మహం బ్రూమి బ్రాహ్మణం. ౧౭

అక్కోధసం వతవ_న్తం సీలవ_న్తం అనుస్సదం,
ద_న్తం అ_న్తిమసారీరం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౮

వారి పోక్ఖర ప_త్తే_వ ఆరగ్గేరివ సాసపో,
యో నలిమ్పతి కామేసు తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౯

యోదుక్ఖస్స పజానాతి ఇధేఽవ ఖయ మ_త్తనో,
పన్నభారం విసఞ్ఞు_త్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౦

గంభీరపఞ్ఞం మేధావిం మగ్గామగ్గస్స కోవిదం;
ఉ_త్తమత్థం అనుప్ప_త్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౧

అసంపట్ఠం గహట్ఠేహి అనాగారేహి చూభయం,
అనోకసారిం అప్పిచ్ఛం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౨

నిధాయ దండం భూతేసు తసేసు థావరేసుచ,
యోనహన్తి నఘాతేతి తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౩

అవిరుద్ధం విరుద్ధేసు అత్తదణ్డేసు నిబ్బుతం,
సాదానేసు అనాదానం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౪

యస్స రాగోచ దోసోచ మానో మక్ఖోచ పాతితో,
సాసపోరివ ఆరగ్గా తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౫

అకక్కసం విఞ్ఞాపనిం గిరం సచ్చం ఉదీరయే,
యాయ నాభిసజేకిఞ్చి తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౬

యోఽధదీఘం రస్సం వా అణుం థూలం సుభా సుభం,
లోకే అదిన్నం నాదియతి తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౭

ఆసా యస్స న విజ్జన్తి అస్మిం లోకే పరమ్హిచ,
నిరాసయం విసఞ్ఞుత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౮

యస్సాలయా నవిజ్జన్తి అఞ్ఞాయ అకథం కథీ,
అమతోగంధం అనుప్పత్తంతమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౯

యోఽధపుఞ్ఞంచ పాపంచ ఉభో సఙ్గం ఉపచ్చగా,
అసోకం విరజం సుద్ధం తమహం బ్రూమి బ్రాహ్మణమ్. ౩౦

చన్దంఒవ విమలం సుద్ధం విప్పసన్న మనావిలం,
నన్దీభవపరిక్ఖీణం తమహం బ్రూమి బ్రాహ్మణం. 3౧

యో ఇమం పలిపథం మగ్గం సంసారం మోహ మచ్చగా,
తిణ్ణో పారగతో ఝాయీ అనేజో అకథంకథీ;
అనుపాదాయ నిబ్బుతో తమహం బ్రూమి బ్రాహ్మణం. 3౨

యోఽధ కామే పహత్వాన అనాగారో పరిబ్బజే,
కామభవ పరిక్ఖీణం తమహం బ్రూమి బ్రాహ్మణం. 33

యోధతణ్హాం పహత్వాన అనాగారో పరిబ్బజే,
తణ్హాభవపరిక్ఖీణం తమహం బ్రూమి బ్రాహ్మణం. 3౪

హిత్వా మానుసకం యోగం దిబ్బం యోగం ఉపచ్చగా,
సబ్బయోగ విసఞ్ఞుత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. 3౫

హిత్వా రతించ అరతించ సీతిభూతం నిరూపధిం,
సర్వలోకాభిభుం వీరం తమహం బ్రూమి బ్రాహ్మణం. 3౬

చుతిం యో వేది సత్తానం ఉపపత్తించ సబ్బసో,
అసత్తం సుగతం బుద్ధం తమహం బ్రూమి బ్రాహ్మణం. 3౭

యస్స గతిం న జానన్తి దేవా గన్ధబ్బమానుసా,
ఖీణాసవం అరహంతం తమహం బ్రూమి బ్రాహ్మణం. 3౮

యస్స పురేచ పచ్ఛాచ మజ్ఝేచ నత్థి కిఞ్చనం,
అకిఞ్చనం అనాదానం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౩౯

ఉసభం పవరం వీరం మహేసిం విజితావినం,
అనేజం నహాతకం బుద్ధం త మహం బ్రూమి బ్రాహ్మణం. ౪౦

పుబ్బే నివాసం యో వేది సగ్గాపాయంచ పస్సతి,
అథో జాతిక్ఖయం పత్తో అభిఞ్ఞా వోసితో మునీ;
సబ్బ వోసిత వోసానం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౪౧

ఇతి బ్రాహ్మణవగ్గో ఛబ్బీసతిమో

ఇతి ధమ్మపదం నిఠ్ఠితం

---

## బ్రాహ్మణవర్గము.

జటాజూటధారియు మునిబాలకుండును నగు విష్ణుమిత్రుడు పిత్రాదేశానుసార మొక్క దివసము హోమాగ్నినిమిత్తము సమిధల సంగ్రహముసేయ వనమున కరిగెను. వనమున గొంతద వ్వేగినంతనే దీర్ఘ కాయుండగు నామునిబాలకుం డొక్కచో వృక్షచ్ఛాయ నుపవిష్టుడయియున్న బౌద్ధసన్యాసిని వీక్షించెను. విష్ణుమిత్రు డంతకుబూర్వ మెన్నడును బౌద్ధపరివ్రాజకుని సందర్శించి యుండకపోమి గడునాశ్చర్యసాగర

నిమగ్నుండాయెను. అతనికి బౌద్ధశ్రీమణప్రథమావలోకనం బద్ధియ. ముండితశిరస్కుండును, గాషాయవసనధారియు, శాంతస్వరూపియు నయి సాక్షాచ్ఛంకరుంబలె దేదీప్యమాన ముగ బ్రకాశింపుచు, నిమీలితనేత్రుడయి ధ్యానమునందు నిమగ్నుడయియున్న బౌద్ధసన్యాసిని సమీపించి, విష్ణుమిత్రు డొకింతసే పటనే గూర్చుండియుండెను. విష్ణుమిత్రు డనేక పర్యాయములు నిజపితృశ్రీముఖంబున—భారతచతుర్దిశవ్యాప్త యశోవిశాలుండును, అవివేకాంధకారపూరితకృత్రిమధర్మ సిద్ధాంత సముదాయవిరోధకుండును, సర్వజనసమ్మతమతసం స్థాపకుండును సంపూజ్యుండును నగు బుద్ధదేవుని సంస్తవవా క్యంబుల నాలకించియే యుండెను గాని ప్రత్యక్షముగ సం దర్శించి, జన్మసాఫల్యము నందియుండలేదు. ఈబుద్ధదేవుడే యీమహనీయు డయి యుండునాయను సందేహంబొండు మది నావహించెను. శిలాప్రతిమంబోలి నిస్తబ్ధుడయి తదే కదృష్టితో విష్ణుమిత్రు డాబౌద్ధసన్యాసి నవలోకింపుచుండ నాదివ్యపురుషాగ్రేసరుండు నేత్రముల విప్పిచూచెను. విష్ణు మిత్రు డంత లేచి భక్తిపురస్సరంబుగ నాతనికి బ్రణమిల్లెను.

విష్ణుమిత్రు డాబౌద్ధసన్యాసికి నమస్కరించి, విధేయతా పూర్వకంబుగ నతని నిట్లు పృచ్ఛించెను:— "మహాత్మా! తామెవరయినదియు నాకు స్పష్టముగా దెలియకపోయె మనము

తెలిసికొొన సుట్టూతలూగుచున్నయది. తమ శుభాభిధేయ
మును వ్యక్తీకరించి, దాసుని ధన్యునిగావింప వేడెద.'' సర్వ
తోముఖసంస్తుతి నందినట్టియు, స్వల్పకాలమునందే సమస్త
ధరణీవలయంబున స్వకీయాదర్శధర్మతత్వప్రచారంబున గీర్తి
చంద్రికాప్రకాశమును బ్రసరింపజేయగల్గినట్టియు, సనిర్వచనీ
యంబును, ననన్యసామాన్యంబును, నలౌకికంబుననగు దివ్యో
పదేశమును జనులకు బ్రసాదింపుచుండునట్టియు శ్రీబుద్ధభగ
వానుని శిష్యార్థముండనని యాశ్రమణు డుత్తరమొసంగెను.
విష్ణుమిత్రు డాతనివిలక్షణలక్షణలక్షితసౌమ్యమూర్తికిని, స
త్స్వభావంబునకును భావంబున ముదమందెను. ఆసన్యాసి
మునిబాలకునివినయవిధేయతాదిసద్గుణముల కానందించి, యిం
చుకసేపు మిష్టభాషణముసేయ గడంగెను. సంభాషణానం
తరంబు విష్ణుమిత్రుని బుద్ధదర్శనాపేక్ష ప్రగాఢమయి యాతుర
పెట్టసాగెను. అటకు సమీపమునందే యున్న పితృదేవుని
సన్నిధికరిగి శ్రీబుద్ధదర్శనమున కనుజ్ఞబడసి, విష్ణుమిత్రుడు
ద్వితీయదివసము ప్రాతఃకాలము బౌద్ధవిహారమందిరమున కరు
గుచున్న నాయా పరిచిత బౌద్ధసన్యాసిని వెంబడించెను. సాయం
తన మగుసరికి వారిరువురు వేవేగనడచి బిహారుపట్టణ ప్రాకార
కుడ్యముల సమీపింపగల్గేరి. దీర్ఘప్రయాణజనితదేహశ్రమ
నుపశమింపజేసికొని, వా రుభయులు బుద్ధసందర్శనమున కమిం
తోత్సాహస్వాంతులరయి, బౌద్ధమందిరమును బ్రవేశింప్రరి.

అచట భగవానుని సౌమ్యస్వరూప ముచ్చాసనాసీనమయి యుండి, శ్రోతల కమితానందకరముగ నుపదేశింపుచుండెను. తదుపదేశము బ్రాహ్మణునిగూర్చి చెప్పబడినది. ఏతద్దివ్యోప దేశపఠనంబున బాఠకలోకంబునకు బ్రాహ్మణుడన నెవ్వడో సంపూర్ణముగ సువ్యక్తము కాగలదు:—

(1) ఓబ్రాహ్మణుడా! విషయవాసనాప్రవాహమును నిర్ధారుడవయి, నిరోధింపుము. ఆలసింపక విషయవికారసరింతిని ధైర్యస్థైర్య పరిభావంబున నిరోధింప హితమొనగూడును. సమస్తవాంఛల నిర్మూలింపజేయును. సంసారక్షేత్రంబున నుద్భవంబగు సమస్తపదార్థములను నశ్వరములని నీవు గ్రహింపగల్గినపుడే యనిర్మితంబును శాశ్వతంబును నగు నిర్వాణమును గ్రహింపగల్గుదువు సుమీ!

(2) ఆత్మనిగ్రహంబుయొక్కయు, ధ్యానముయొక్కయు ధర్మతత్వముల సంపూర్ణముగ గ్రహించి, జ్ఞానసంపన్నుండయిన బ్రాహ్మణునియొక్క సమస్తవిధసాంసారిక మోహపాశములు ఖండఖండములయిపోవును.

*(3) ఏపురుషున కీవలి యావలి తీరముల భేదము నశించినదో, అట్టి నిర్వికార చిత్తుండగు ముక్తపురుషపుంగవునే

---

* ఈవలి యావలి తీరములనగా నాన్తరిక బాహ్యేంద్రియములని తాత్పర్యము. కర్మేంద్రియములచేగాని, జ్ఞానేంద్రియములవలనగాని సంప్రా

నేను యథార్థమగు బ్రాహ్మణుడని నొక్కి వక్కాణింపు చున్నాడను.

(4) విచారశీలుండును, నిష్కళంకచరితుండును, సుస్థిర చిత్తుండును, సహజదయార్ద్రి హృదయారవిందుండును, గర్త వ్యపరాయణుండును, విషయవికారబంధనవిముక్తుండును, సుచ్ఛుతమాదర్శప్రాప్తినందినవాడును నగు పురుషపశ్రేణ్యునే నేను వాస్తవికంబగు బ్రాహ్మణుడని రూఢిగ సిద్ధాంతీకరింపు చున్నాడ.

(5) సూర్యభగవానుడు దివసకాలమునందే దేదీప్యమానముగ బ్రకాశించును. చంద్రనాథుడు నిశాసమయంబున వెలుంగును. కవచధారణంబుననే యోధుని వదనేందుబింబము వీరరసస్ఫూర్తి కాలవాలమయి నవ్యతరతేజంబున బ్రకాశించును. బ్రాహ్మణుడు నిరంతర ధ్యానప్రవృత్తిచే బ్రకాశించును. కాని బుద్ధుడు సర్వకాల సర్వావస్థలయందు నఖండ దివ్యజ్యోతివలె వెలుంగుచుండును.

---

ప్తములగు సుఖదుఃఖములయెడ నేపురుషుడు రాగద్వేషదూరుడయి వర్తించునో, అట్టి వ్యక్తియే యథార్థమయిన బ్రాహ్మణుడు. కల్పితవేషధారి బ్రాహ్మణుడు కాజాలడు. సంసారమున జన్మచేతనే బ్రాహ్మణులమని విఱ్ఱవీగువారు, తమ్ము దాసు యల్పులుగ భావించు చండాలురకన్న నింద్యులు.

(6) పాపజాలమునుండి సంపూర్ణముగ విముక్తిజెందిన వాడు బ్రాహ్మణుడు. శాంతస్వభావవిరాజితుడే శ్రమణుడు. మనోమాలిన్య దూరుడే ప్రవ్రజితుడు (సన్యాసి) యనబడు గును.

(7) బ్రాహ్మణుని హింసింపజనదు. మూఢుడెవడయిన దన్ను హింసించిన బ్రాహ్మణుడయినవా డంతమాత్రంబున వానిపై గ్రోధము వహింపరాదు. బ్రాహ్మణుని హింసించిన వానిజీవితము ధిక్కారార్హమయినది. తన్ను హింసించిన మూఢుని దిరిగి హింసింపబూను బ్రాహ్మణుండు మొదటి మూర్ఖునికంటె మూఢుడయి పరిభవింపబడును.

(8) సంసారసుఖోపభోగపరిత్యాగము గావించి మెలంగు బ్రాహ్మణుడు నిశ్చలానందప్రాప్తిని బడయుట నిక్కవము. పరాపకారవాంఛ యుడిగినకొలది, వ్యక్తినిదుఃఖము లెడబాసి పోవుచుండును. పరులదుఃఖింపజేయు చిత్తప్రవృత్తి నిర్మూలమయినంతనే మానవునకొదవు దుఃఖపరంపరలు స్వాభావికంబుగనే దూరమగును.

(9) మనోవాక్కాయంబుల నేరియెడల గ్రుద్ధుడుగాక, శాంతచిత్తుడయి, సమస్తవిధముల నాత్రికరణముల సంయమ ప్రతిబంధనముల బంధించివేయు వ్యక్తినత్తమునే నేను బ్రాహ్మణుడని నొక్కివక్కాణింపుచున్నాడను.

(10) హోమాగ్ని జ్వాలలగాంచి, పరమాహ్లాదరసపరి పూర్ణహృదయుడయి బ్రాహ్మణుడు నమస్కరించుచందముననే బుద్ధప్రబోధితోత్తమధర్మతత్త్వజ్ఞానమునందినట్టియు, దదను కూలాచరణాశక్తి ధౌరంధర్యమును గల్గియున్నట్టియు బుధ పవరేణ్యుని గాంచినంతనే జ్ఞానసంపన్నులెల్లరు నర్చింతురు.

(11) మానవుడేయవస్థయందును గేవలము జటాజూట ధారణంబున గాని, ఉచ్చకులంబున జననమందుటచేత గాని జన్మ సంస్కారముచేతగాని బ్రాహ్మణుడు కాజాలడు. సత్యధర్మ శౌచాదిసద్గుణాలంకారములచేతనే బ్రాహ్మణుడు లేక పుణ్య శ్లోకుడు కాగల్గును. (మానవుడు జన్మచేతనే బ్రాహ్మణుడు కాగలడను లోకప్రవాద మాదర్శప్రాయము కాజాలదు.) ఏతద్విధమిథ్యాభిభూత బ్రాహ్మణపదవి నింద్యము.

(12) మిథ్యాభిమానివగు నో కల్పితబ్రాహ్మణపద ధారీ! చిత్తశుద్ధియన్ననేమో యెఱుంగక, జటాజూటమృగ చర్మకౌపీనధారణంబును గాంక్షించుటవలన నీకు సంప్రాప్తం బగు లాభ మదెద్దికలదు? త్వదీయమానసక్షేత్రమున దృష్ణా వృక్షము పెరిగి పెద్దదయి, వేరులువాఱియుండ నీకు బాహ్యా డంబరములగాని, బాహ్యశుద్ధులచేగాని శుభంబొదవు టయ థార్థము.

(13) జీర్ణాంబరధారియు, దుర్బలావయవసంఘటితకాయుండును, రూపరేఖావిలాసశూన్యుండును, ఏకాంతప్రదేశంబున నిశ్చలంబగు ధ్యానమునం దభిరతుడయి యుండునట్టియు స్థిరప్రజ్ఞునే నేను బ్రాహ్మణుడని పునర్వచింపుచున్నాడను.

(14) జన్మవలనగాని, కులీనమాతృగర్భసంభూతుం డగుటచేగాని, మానవుడు బ్రాహ్మణుడు కాజాలడు. వాడు యథార్థ మారసిన కేవలమొక్క యుద్ధతుండగు శ్రీమంతుడుగనే భావింపబడును. కాని గర్భదరిద్రుడయినను, (నిర్ధనుడని తాత్పర్యము) సర్వసంగపరిత్యాగియు, విగతాహంకారమమకార హృదయుండును నగు వ్యక్తిసత్తముడే యథార్థమగు బ్రాహ్మణశ్రేష్ఠుడు.

(15) సమస్తబంధనముల భగ్నమొనర్చినట్టియు నిర్భయహృదయుడయినట్టియు, నిస్సంగుడయినట్టియు, సమస్తవిధశృంఖలముల ఖండించి మించినట్టియు, వ్యక్తిసత్తమునే నేను బ్రాహ్మణుడు లేక భూసురుడని సిద్ధాంతీకరింపుచున్నాడను.

(16) ద్వేషమనియెడి రజ్జువును, రాగమనియెడి బంధనమును, అశ్రద్ధయను శృంఖలమును మఱియు వానితో సంబంధమును గల్గియున్న యెల్లపాశములను; అజ్ఞానమనియెడి యాటంకమును, తృష్ణయనెడి యాపదను నెడబాసి, జాగరూ

కుడయి, నిరంతరస్వాధీనావస్థయం దుండువానినే నేను బ్రాహ్మణుడని చెప్పుదును.

(17) తా నెట్టియపరాధము నాచరింపకపోయినను, దనపై ధూర్తులు ప్రయోగించు నిష్ఠురోక్తులను, నిందావాక్య బాణములను, బ్రహారములను మహదానందముతో సహించు నట్టియు సహనమనియెడి చండప్రచండమహాచమూవాహినిం గల్గియున్నట్టియు, క్షమాన్వితంబులగు ధైర్యస్థైర్యాదులచే బ్రకాశించునట్టియు, బురుషాగ్రేసరునే నేను బ్రాహ్మణసత్త ముండని వక్కాణింపుచున్నాడ.

(18) క్రోధరహితుండును, గర్తవ్యపరాయణుండును, సదాచార సంహితుండును, దృష్ణావిహీనుండును స్వాత్మనిగ్రహపరుండును, నంతిమశరీరధారియు నగు వ్యక్తిసత్తమునే నేను సత్యమగు బ్రాహ్మణుండని పేర్కొనుచున్నాడను.

(19) కమలదళముపైనుండు నంబుకణముభాతియు, సూదియగ్రభాగంబుపై నావగింజచందంబునను, క్షణికంబులును, భయవిషాదోత్పాదకంబులును నగు విషయసుఖంబుల నభిరతుడు కానట్టి ధీరవరునే నేను యథార్థమగు బ్రాహ్మణుం డని నుడువుచున్నాడను.

(20) ఇహలోకమునందే యనగా దనువుండగనే దుఃఖాంతమును గ్రహింపగల్గినట్టియు, విషయవాసనా భారంబు నెడ్డబాసినట్టియు, బంధనవిముక్తుడయినట్టియు విరక్తపురుషునే నేను బ్రాహ్మణుడని వక్కాణింపుచున్నాడను.

(21) గంభీరాగాధజ్ఞానసముపేతుండును, ధీమంతుండును, సారాసారవిచక్షణజ్ఞానపరీతుండును, సర్వోత్తమ పథాధ్యుండును, పురుషార్థ సాధకుండును నగు పురుషోత్తమునే నేను బ్రాహ్మణుడని తెల్పుచున్నాడను.

(22) గృహస్థులయందును, శ్రమణులయందును భేద భావంబు లేక, సమానభావంబున మెలంగుచు, నాయుభయులతో నేకీభవింపక, భిన్నముగానుండియు, ద్వారద్వారములఁ గ్రుమ్మరుచు, భిక్షను యాచింపనట్టియు, నిచ్ఛాగుచ్ఛంబుల జిచ్చుపఱ బడవేసినట్టియు, బరులచే బ్రాప్తించు నల్పముసే అత్యధికాదరంబున స్వీకరించి మనస్తుష్టిం జెందుచుండునట్టియు నుత్తమ పురుషునే నేను బ్రాహ్మణుడని నుడువుచున్నాడను.

(23) బలాబలప్రాణుల నేయాపంబుగనయిన హింసింపనట్టియు, న్యాయముగ హింసాత్మకజీవితమును గడుపనట్టియు, బరులచే హింస నాచరింపజేయనట్టియు, నేహత్యకుగాని, హింసకుగాని, భావముచే నేమి, కర్మముచే నేమి, హేతుభూ

తుడు కానట్టియు, సత్వగుణసంపన్నునే, నేను బ్రాహ్మణోత్త ముండని రూఢిగ విశదముసేయుచున్నాడను.

(24) శాత్రవులయెడ మిత్రుడయి మసలునట్టియు, క్రోధానలజ్వాలాపరివేష్టిత హృదయులయెడ శాంతిని, సహన శీలతను గల్గి వర్తించునట్టియు, దూషించువారిపట్ల నిర్దోషి యయి మెలంగునట్టియు, గాముకులయెడ నిష్కాముకుడయి పరివర్తించునట్టియు, వ్యక్తిసత్తమునే నేను బ్రాహ్మణుడను చున్నాడ.

(25) సూదియగ్రభాగంబున నిలువనియావగింజను బోలి, యెవ్వానిహృదయసీమనుండి రాగము, ద్వేషము, గర్వమ్ము, మాత్సర్యము మొదలగు దుర్గుణను లస్థిరములయి దూరమయిపోయినవో, యట్టి నిర్వికారునే నేను బ్రాహ్మణు డని తెల్పుచున్నాడను.

(26) సత్యాభిభూతంబులును, హితకరంబులును, శీత లంబులును, మధురంబులును నగు వచనంబుల నిరంతరము నుచ్చరించునట్టియు, బరులహృదయముల కీషణ్మాత్రమయిన దుఃఖము నొదవజేయనట్టియు, వహింసాపరతంత్రునే, నేను యథార్థమగు బ్రాహ్మణవరుండని మేఘగంభీరస్వనమున వచింపుచున్నాడను.

(27) ఏవరు డీబ్రివాస్మ్రండమునం దన్యులచే బ్రిసాదింప బడనిదే, వారి యుత్కృష్టమగునట్టికాని, నికృష్టమయినట్టికాని పదార్థమును, దాని సౌందర్యమునకు ముగ్ధుడయికాని, తదంతర్గతరసాస్వాదనాపేక్షచేగాని, తత్ప్రాప్తిచేగల్గు లాభాకాంక్షచేగాని త్రికరణంబుల స్వీకరింపక, నిర్లోభియయి, సంచరింపుచుండునో, యట్టి యుత్తమపరికృతిసంపన్నుండగు మానవోత్తమునే నేను బ్రాహ్మణశ్రేష్ఠుడని వక్కాణింపుచున్నాడను.

(28) ఐహికాముష్మిక సౌఖ్యాకాంక్షాదూరుండును, సమస్తవిధప్రాపంచిక భావశూన్యుండును నగు లోకోత్తర వైరాగ్య ధనసంపన్నునే, నేను బ్రాహ్మణశ్రేష్ఠునిగ స్పష్టీకరింపుచున్నాడను.

(29) తృష్ణారహితుండును, సత్యస్వరూపమును దర్శింపగల్గి "ఎక్కడ, ఎట్లు?" అను సందేహముల నివృత్తింపజేసికొన్నవాడును, నిర్మలానందకందమగు నిర్వాణపద పథానుకూలజ్ఞానమును సముపార్జించినవాడును నగు ధీరవరునే, నేను బ్రాహ్మణుడని వ్యక్తీకరింపుచున్నాడను.

(30) ఈలోకమునందే పాపపుణ్యబంధనముల నెడబాసినట్టియు, కిల్బిష విషాద మాలిన్యముల రూపుమాపినట్టియు, బురుషునే బ్రాహ్మణుడనుచున్నాడను.

(31) చంద్రినాథునిచందమున నిర్మలుండును, బరిశు ద్ధుండును, సుప్రిసన్నుండును, గళంకరహితుండునునయి, సాం సారికభోగవిలాసముల రతుడుగాక, దంభాదిదుర్గుణగణలేశ మును వర్జించు వ్యక్తిపుంగవునే, బ్రాహ్మణోత్తముండని నేను విశదము సేయుచున్నాడను.

(32) నిస్సారసంసారము యొక్క మోహామని యెడి పంకమయదుర్గమమార్గము నతిక్రిమించి, భయభీతావహాభవ సాగరతరణంబున నీవలితీరమునుండి యావలితీరము జేరినట్టి యు, విచారశీలత్వమును గల్గినట్టియు, ధ్యాననిష్ఠాగరిష్ఠుడయి నట్టియు, సందేహారాహిత్యముచే శోభించునట్టియు, నిరతిశయా నందసాగరనిమగ్నుడయినట్టియు, నిష్కపటుండును, నిరా సక్తుండును నగునట్టియు బురుషవరేణ్యునే నేను నిక్కమగు బ్రాహ్మణుండని వక్కాణించుచున్నాడను.

(33) ఇహమునందుండియే సమస్తవాసనల నిర్మూల మొనరించి, గృహ బంధుమిత్రిపుత్రి కళత్రాదుల బరిత్యజించి నట్టియు, సన్యాసాశ్రిమమును స్వీకరించునట్టియు, గామదేవు ధర్మసంగ్రామంబున నిర్జించినట్టియు, బురుషోత్తమునే నేను బ్రాహ్మణుడని వక్కాణించుచున్నాడను.

(34) సర్వావస్థలయందు సమస్తాసక్తులబాసి, సమస్తవిధ సంసారపాశముల రోసి, సన్యాసమునే సర్వస్వమని యెంచి,

మోహాంధకారమును దివ్యజ్ఞాన దీపికాజ్యోతిపరిసారంబున మటుమాయఁజేసి సంచరించు రాగరహితుఁనే, నేను బ్రాహ్మణోత్తముండని చెప్పుచున్నాఁడను.

(35) మానవుల యొక్కయు, దేవతల యొక్కయు బంధనముల, ననఁగా సమస్తవిధంబులగు పాశముల నెల్ల, ఖండించి, ముక్తస్వాతంత్ర్యుఁడయి, చరించు మానవోత్తముఁనే నేను బ్రాహ్మణుండని స్తువ్యక్తపఱచుచున్నాఁడను.

(36) సుఖ దుఃఖములకు మూలంబులగు సమస్తపదార్థముల నెడఁబాయఁగల్గినట్టియు, నిరంతర శాంతచిత్తుండయి నట్టియు, సమస్తోపాధుల విసర్జించినట్టియు, బునర్జన్మనుండి విముక్తుండయినట్టియు, విరక్తుండయినట్టియు, సమస్తభువనంబుల విజయలక్ష్మీకరకమలగ్రహణము నందినట్టియు, బురుషవరేణ్యునే నేను బ్రాహ్మణోత్తముండని చెప్పుచున్నాఁడను.

(37) సంసారములో సర్వత్ర ప్రాణికోటి సృష్టిస్థితిలయముల గ్రహించినట్టియు, సమస్తవిధంబులగు చిత్తవికారముల రోసినట్టియు, సన్మార్గానురక్తుండయినట్టియు, జాగరితయయినట్టియు, సద్గతినందినట్టియు, జ్ఞానాంజనమున దివ్యతమంబగు సంతర్దృష్టినంది, బుద్ధుఁడయినట్టియు, వ్యక్తిసత్తముఁనే, నేను బ్రాహ్మణుండని గంభీరముఁగ నుద్ఘోషింపుచున్నాఁడను.

(38) దేవగంధర్వ మానవులకు దురూహ్యమయినట్టి సూక్ష్మతమోత్తమ మార్గమును గల్గినట్టియు, విగతవాసనా హృదయుండును, సమస్తవిధార్ణ్మతుండునునగు ప్రబుద్ధునే నేను బ్రాహ్మణుండనుచున్నాడను.

(39) భూతభవిష్యద్వర్తమాన విషయంబుల మమకారమును బరిత్యాగము సలిపినట్టియు, ననగా నాశక్తిరహితుండును, మహానిర్ధనుండును, సమగ్రసంసార స్థితంబగు నేపదార్థమును దనదిగా భావింపనినిష్కాముకుండును. నగు వ్యక్తినే, నేను బ్రాహ్మణుండని చెప్పుచున్నాడను.

(40) పురుషార్థియు, సర్వశ్రేష్ఠుడును, శూరవీరుడును విజేతయును, నిష్కపటుండును, సిద్ధుండును, శుద్ధుండును విద్యాసంపన్నుండును, ఆంతరికజ్ఞానసంపన్నుండును నగు పురుష శేఖరునే నేను బ్రాహ్మణుండని వక్కాణించుచున్నాడను.

(41) పూర్వజన్మజ్ఞానము నార్జించినట్టియు, స్వర్గ నరక తత్త్వవివేచనాశక్తి సంపన్నుండయినట్టియు, జనన మరణబంధన దూరుండయినట్టియు, సంపూర్ణజ్ఞాన తేజోవిలసితుండయినట్టి యు, సిద్ధుడయినట్టియు, సర్వాంగపరిపూర్ణుడయినట్టియు బూజ్యు

మహర్షి చంద్రునే, నేనుత్తముండగు బ్రాహ్మణుండని నొక్కి వక్కాణించుచున్నాడను.

బ్రాహ్మణవర్గము పరిసమాప్తము

---

బ్రాహ్మణశబ్దము మహాత్వపటుత్వసమన్వితంబు. పరిశిష్టము: విశేషాంశముల నొక్కతూరి ప్రియపాఠకులారా! యవలోకించి సారాంశమును గ్రహింప భక్తిగేల్మోడ్చి, ప్రార్థించుచున్నాను.

# పారిభాషిక పదసంగ్రహము.

శ్రీబుద్ధదేవుని సిద్ధాంత వాక్యముల బ్రయోగింపబడినక్లిష్టతరం బులగు శబ్దములకిట బ్రతిపదములవ్రాయు చున్నాడ, నిది యు బాఠకసౌకర్యము నపేక్షించియే యని గ్రహింపనగును.

శ్రీబుద్ధాచార్యుని కిన్ని నామాంతరములు కలవు :—

శ్లో :—సర్వజ్ఞ స్సుగతో బుద్ధో ధర్మరాజ స్తథాగతః
సమన్తభద్రో భగవా న్మారజి ల్లోకజి జ్జినః॥
షడభిజ్ఞో దశబలో ఽద్వయవాదీ వినాయకః
మునీన్ద్ర శ్శ్రీఘన శ్శాస్తా ముని (శ్శాక్యమునిస్తు యః।)
సశాక్యసింహస్సర్వార్థసిద్ధ శ్శౌద్ధోదనిశ్చ (సః)।
గౌతమశ్చార్కబన్ధుశ్చ మాయాదేవీ సుతశ్చ (సః)॥

పదవిభాగము, తాత్పర్యము :—సర్వజ్ఞః = సర్వజ్ఞుడు, సుగతః = సుగతుడు, బుద్ధః = బుద్ధుడు, ధర్మరాజః = ధర్మ రాజు, తథాగతః = తథాగతుడు, సమన్తభద్రః = సమన్తభ ద్రుడు, భగవాన్ = భగవానుడు లేక దేవుడు, మారజిత్ = మారజిత్తు, లోకజిత్ = లోకజిత్తు, జినః = జినప్రభువు, షడ భిజ్ఞః = షడభిజ్ఞుడు, దశబలః = దశబలుడు, అద్వయవాదీ = అద్వైతవాది, వినాయకః = వినాయకుడు, మునీన్ద్రః = ము నీంద్రుడు, శ్రీఘనః = శ్రీఘనుడు, శాస్తా = లేక శాసకుడు, బుద్ధ

దేవుడు (Buddha or Jina) శాక్యసింహః = శాక్యసింహుడు, సర్వార్థసిద్ధః=సర్వార్థసిద్ధుడు, శౌద్ధోదనిః = శౌద్ధోదని = శుద్ధోదన పుత్రుడగుబుద్ధుడు, గౌతమః = గౌతముడు, అర్కబన్ధుః = అర్క బంధువు (శాక్యవంశము సూర్యవంశ శాఖయే), మాయాదేవీసుతః = మాయాదేవిసుతుడగు బుద్ధుడు, శాక్యమునిః = శాక్యముని. "శాకవృక్షప్రతిచ్ఛన్నంవాసం యస్మాచ్చ చక్రిరే। తస్మాదిక్ష్వాకువంశ్యాస్తే శాక్యాఇతి భువి స్మృతా" అనిచెప్పబడిన శాక్యవంశమునబుట్టిన బుద్ధావాంతరభేదముగల శాక్యమునియొవఁడో వానిపేర్లు Buddha, the founder of the Religion named from him.

—"నామలింగాను శాసనము."

(1) శ్రమణుడు, = పరివ్రాజకుడు, ప్రవ్రజితుడు, భిక్షువు = సాధువు లేక బౌద్ధసన్యాసి.

(2) జిజ్ఞాసువు = సత్యాసత్యముల దెలియ నభిలషించువాడు

(3) పిపాసువు = ధర్మజ్ఞాన దాహపీడితుడు

(4) ముముక్షువు = మోక్షేచ్ఛగల వ్యక్తి

(5) నిర్వాణము, మోక్షము, సుగతి, అమృతధామము, కైవల్యము, పరము, ముక్తి, జన్మరాహిత్యము = సచ్చిదానందమగు శాంత్యవస్థ

(6) జీవన్ముక్తి = కాయమున్నయప్పుడే మాయాముక్తు డయిన వ్యక్తిపడయు స్వేచ్ఛ

(7) బోధి, మహాబోధి = ఆత్మసాక్షాత్కారము, బ్రహ్మజ్ఞానము, సత్యస్వరూపసందర్శనము, బ్రహ్మానంద ప్రాప్తి. ఇదిబోధ (అశ్వత్థవృక్షము) వృక్షతలంబున సిద్ధార్థునకు ప్రాప్తించినది కాన నాటినుండి బోధియనియు బోధిసత్వుడనియు విశ్వమునందు విఖ్యాతమయ్యె.

(8) స్వర్గము = ఆనందనిలయము, శాంతిస్థానము, శివాలయము

(9) నరకము = భయవిషాదస్థానము లేక జననమరణమ్ముల పరిణామప్రదమగు కేంద్రము

(10) ఈశ్వరుడు, విధాత, సృష్టికర్త = సమష్టిశక్తి, అఖండజ్ఞానజ్యోతి, విశ్వసత్త, అథవా పిపీలికాదిబ్రహ్మపర్యంతము వ్యాప్తమయి వికాసభాసురంబగు జీవకళాస్ఫూర్తిని ప్రసాదింపుచుండు చలనశక్తి

(11) ప్రకృతి=స్వభావము, వర్తనము మఱియు సృష్టిధర్మము

(12) సంయమచంద్రుడు, ముని, యతి, విజేత, గోపాలుడు, కామపాలుడు= కామక్రోధాదు లను షడ్రిపుల నణచివేసినవ్యక్తి

(13) ప్రకృతి = మాయ, మిథ్య

(14) అంతఃకరణవేదము = దేహగేహమున కాధారభూత మయిన పరిశుద్ధమగుశక్తి; అథవా స్వయంజ్యోతిస్వరూపము, సత్వాదిగుణాతీతమను యంత్రము

(15) వేదము = విశదపఱచునది (తృష్ణాభిభూతములగు మాయోపాధులనుండి జీవకోటికి విశ్వసత్తను దేటపఱచునది)

(16) శాస్త్రము = మానవకోటిని సంసారధర్మ సంగ్రామంబున శాసించునది లేక విహితావిహితముల బేర్కొనునది

(17) మలము = కల్మషము, అపారిశుద్ధ్యము = అవిద్య, అజ్ఞానము

(18) ఓదేవా, ఓపరాత్పరా! = సకలమున కతీతమయి మూలమగుచుండు నో విశ్వసత్తా!

(19) సత్తు = సత్యమయినది, అసత్తు = మిథ్య, మృగతృష్ణాసమానము

(20) బోధిసత్త్వుడు = శ్రీబుద్ధభగవానుడు

(21) బ్రాహ్మణుడు = నిర్వాణ మను బ్రహ్మపథము నెఱింగినవాడు లేక బ్రహ్మజ్ఞాని

(22) జీవేశ్వరులు = అహంబద్ధమగు చలనశక్తి, అహం దూరమగు చలనశక్తి అథవా వ్యష్టి సమిష్టి సత్తలు (వ్యక్తిగతసత్త, విశ్వసత్త)

(23) ఆనందకందము = సచ్చిదానందపదవి = నిర్వాణము (ఈనిర్వాణము శూన్యత్వవాచక మయినదికాదు)

(24) నిర్వైరి = నిస్సంగుడు, అనాసక్తుడు. మారజిత్తు = కామువిజయించిన వ్యక్తి

(25) నిర్వీర్యుడు = నిస్తేజుడు, ప్రమత్తుడు; అలసుడు = సోమరి = మూఢుడు

(26) మతము = తన్ను దాగనుటకు లేక నిజాత్మస్వరూపము నవలోకింప మానవున కేర్పడిన సుస్థిరాభిప్రాయము

(27) సాధనము = ధ్యానమననయుక్తమగు నాత్మశుద్ధి ప్రదకార్య ప్రణాళిక లేక జ్ఞానకృషి

(28) వేదాంతి = సాధకుడు, జ్ఞానకృషి కారుడు

(29) అధోరేతస్కుడు = నిష్ఠాశూన్యుడు, కామదాసుడు, విషయలంపటుడు

(30) ఊర్ధ్వరేతస్కుడు = అస్ఖలితబ్రహ్మచారి

(31) జీవాత్మ = జీవకోటియందుండు ఖండచలనశక్తి

(32) పరమాత్మ = నిర్వాణగతుడు, విశ్వసత్త లేక బ్రహ్మము

(33) బ్రాహ్మణుడు = జ్ఞాననేత్రమును దెఱచినవాడు, పరిష్కృతంబగు నంతర్దృష్టి నందినవాడు

(34) బుద్ధుడు, సిద్ధుడు, శుద్ధుడు, ప్రబుద్ధుడు = కల్మషమును బాసి భావముల నతీతమగు నిష్పాపంబును, సుస్థిరంబునగు పదవినందినవాడు

(35) షట్కసంపత్తి = శమదమాది షడ్గుణైశ్వర్యము

(36) సమస్తేంద్రియప్రధానము = జ్ఞానకర్మేంద్రియాధిపతి, చిత్తము

(37) భావజుడు, సూనశరుడు, మకరకేతుడు - మారుడు - కామదేవుడు - (వీనినే మహాత్ముడగు టాలప్టయి దయ్యముల ఱేడనియెను.) కామక్రోధాదుల కభినేతయగు సైతాను. క్రీస్తుభగవానుడు సైతాను అనియెను. అనగా జీవుల సతాయించువాడు

(38) వృద్ధుడు = వయఃపరిపాకము చేగాక జ్ఞానము చే నధిక ప్రాయము నందినవాడు - జ్ఞానబలుడు

(39) బాలుడు = మూర్ఖుడు, అపండితుడు లేక పామరుడు

(40) పండితుడు = పూజ్యగుణుడు, మాన్యుడు = ఉత్తముడు

(41) యజ్ఞము = త్యాగము, స్వయంసమర్పణము, బలి దానము (వాస్వానీపండితు డీయర్థమును సమర్థించియున్నాడు.)

(42) ఆర్యుడు = శ్రేష్ఠమానవుడు, ధర్మశీలుండగు మానవుడు

(43) యోగము = భక్తిజ్ఞానకర్మలసాధనము (దీనినే అశ్వినీకుమారదత్తను వంగీయదార్శనికుడు సమర్థించియున్నాడు

మనబుద్ధపురాణమందు వ్రాయబడిన యజ్ఞము, యోగము బుద్ధునిభావమునకు విపరీతార్థబోధకములయి యున్నవి. ఆ మూఢులయజ్ఞము హింసాత్మకంబగు క్రతువు, యోగము దేహదండనాత్మకంబగు దుస్సహతపశ్చర్య.

(44) సర్వాంతర్యామి = సర్వవ్యాపకుడు = చరాచరాత్మక ప్రపంచమునవెలయు విశుద్ధవిశ్వసత్త

(45) దేవత = మూర్తీభవించిన సత్త్వగుణము

(46) రాక్షసుడు, శ్వపచుడు, చండాలుడు = క్రూరుడు రజోతమోగుణ పూరితచిత్తుడు

(47) వర్ణము = రంగు లేక జాతివిభాగసూచకమగు వ్యవహారకల్పితపదము

(48) గోయజ్ఞము = ఇంద్రియముల వాసనాన్వితములగు వృత్తులసంపూర్ణ బహిష్కారము

(49) గోస్వామి = (తత్సమశబ్దము.) గోసాయి = ఇంద్రియములపై నాధిపత్యము వహించినధీరుడు

(50) సాతొల్లత్మ్రె = భూలోకస్వర్గము, ఇందిరాసుందరుడు (స్థిరమగుసంపద యనగా శాశ్వతానందనిలయుడు) దేవేంద్రవైభవము, థాతవాత (అవశ్యభోక్తవ్య మనుటకు వ్యవహారమందున్న పదము) ఇవన్నియు నతిశయోక్త్యలంకారయుక్తములగు కొన్ని వాడుకలో నున్న పదములు.

సంపూర్ణము.



# పరిశిష్టము : విశేషాంశములు



## శ్రీబుద్ధదేవుని ధార్మికసార్వభౌమత్వము

శ్రీబుద్ధదేవుని ధర్మ మతివిశాలమయి యుండుటం జేసి విశ్వమందలి యేమానవుడును తద్దేవుని స జోదార పథము ననుసరించుట కెంతమాత్రము సంకోచించి యుండ లేదు. భిన్న ముఖంబుల స్రవింపుచు, నానావిధములగు సలిలంబుల గల్గి యుండు నదీనదంబులన్నియు నేరీతి "నదీనాం సాగరోగతిః" యనులోకోక్తిని సార్థక మొనరింపుచు సంద్రమందున బోయి చేరుచున్నవియో యదియే చందమున విశ్వవ్యాప్తంబులగు నానాధర్మముల యందలి సత్సారాంశము నిత్యపరిశుద్ధంబగు బౌద్ధధర్మంబున మూర్తీభవించి యుండెను బౌద్ధధర్మశాస్త్ర ములయందు సర్వజీవకారుణ్యమే ప్రధానసిద్ధాంతమగుడు జీవ కోటికి విషమతరంబుగ బ్రతీతమగు సమస్యయే లేకపోయెను. బౌద్ధధర్మ మేజాతీయుని హృదయాంతర్గములగు ధార్మికాభి లాషలకు ప్రతిబంధకమయి యుండలేదు. బుద్ధదేవు డొకతూరి బౌద్ధవిహార మందిరమున నుపన్యసింపుచు నీరీతినుడివి యుండె ను:—"నాయనలారా! నాధర్మము శాసించునది కాదు, ప్రేమ పురస్సరంబుగ నాహ్వానించునది. దౌర్జన్యము నాధర్మమునకు విరుద్ధము, విశ్వప్రేమయే మద్ధర్మమందిరమునకు బునాది

గంగాయమునా నదములు వివిధదిగ్దేశంబుల జననమందియు సంగమమునకు వారిధినిజేరు చుండియు, దమస్వతంత్రాధికారమును సంరక్షించుకొను చందంబుననే చతుర్వర్ణములకుజెందిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రులు, వీరు వారననేల, దైవసృష్టియందలి సమస్తమానవులు సత్యధర్మ పరిగ్రహణ మాత్రంబున వర్ణమును, గోత్రమును విసర్జించి యేకజాతీయు లయిపోవుదురు." మంగలివాడగు నుపాలి హీన జాతియం దుద్భవించి, సంసారులచే బతితుడుగ నిరసింపబడు చుండియు, ధర్మావతారమూర్తి యగు బుద్ధదేవుని ప్రియశిష్యుడయ్యెను. నవీనధర్మావలంబనమున నతనికి జన్మతో బ్రాప్తించిన శూద్రత్వము భానూదయ కాలమందలి తమఃపటలంబుపగిది మటుమాయమయ్యెను. అంతనతడు సాధుత్వంబునను, జ్ఞానాధిక్యత వలనను ధర్మప్రచారకుండగు నాచార్యుడయి సంసారసన్మాన భాజనుండయ్యెను.

ఒక కాలమందు శ్రీబుద్ధదేవుని శ్రీముఖోద్గత పీయూష వాగ్ఝరి నిర్జీవంబును, పతనోన్ముఖంబును నగు దీనహీనభారతమును సజీవముగావించి, యాభారతమాత యొక్క శిథిలంబులగు కర్ణపుటంబుల నాధ్యాత్మికోత్తేజనాపూరితంబగు నభయ మంత్రధ్వానమును ఘోషింపజేసి యుండెను. తద్దేవునిచే బ్రచలితము గావింపబడిన నవీన ధర్మము సర్వజీవరక్షణా

లయంబయి, కీర్తివహించెను. బౌద్ధధర్మము ముముక్షువులకే గాక మానవ మానవేతర జీవములకు సహిత మాశ్రయ భూతమయ్యెను. థేరగాథయం దొక్కముముక్షు వీప్రకార మాత్మీయ జీవితవృత్తాంతమును గూర్చి వచించియున్నాడు. "నేనొక నీచకులమునందు జన్మించియుంటిని, జన్మతోడనే దరిద్రదేవత నన్ను వరించినది. తద్దేవీగాఢాలింగనమందే కష్టపరిణామంబగు దుఃఖానుభవమును బడయుచుంటిని. తత్సమయమందు జీవనోపాధికయి నేనవలంబించినదియు దుర్వృత్తియె. ప్రజలెల్లరు నిరంతరము నన్నవమానపఱచుచుండిరి. నేనుమాత్రము సంతతము నవనతమస్తకుండనై సమస్త జనుల నాదరింపుచు నేయుంటిని. అనంతర మొక్కతూరిభిక్షుమండలితో గూడి మహాపురుష వరేణ్యుండగు బుద్ధదేవుని సందర్శించియుంటిని. మగధదేశీయులకతడు బోధింపుచున్న దివ్యవాక్యముల నాలకించినంతనే నాచిత్తము భక్తిరసపరిప్లుతమయ్యెను. నేనంత శీర్షముపై వహించియున్న భారమును భూమిమీద విసరివైచి, ఆదేవదేవుని శ్రీచరణకమలములయం దాత్మసమర్పణముగావించి వైచితిని. లోకమాన్యుండగు నాదేవుడు దీనుండనగు నాపైదయాదృష్టిని బ్రసరింపజేసినంతనే ధన్యవాదముల నర్పించుచు నే నతని యనుచరుండ నయితిని. కరుణామయుండగు నాప్రభుశేఖరుడు తత్క్షణము నాకాశ్రయ మొసంగి, తనశిష్యకోటియందు జేర్చుకొనియెను.

శ్రీబుద్ధదేవుని జీవితచరితము నవలోకింప నతడు నిశ్శంకితమతియయి, భ్రష్టాచారిణియు, వారాంగనయు నగునామ్రపాలి యొసంగిన యాతిథ్యంబును ప్రేమపురస్సరంబుగ స్వీకరించినటుల దెల్లమగుచున్నయది. దేవుని యీవ్యవహారము యొక్క నిగూఢంబును, పరిశుద్ధంబును నగు తాత్పర్యమును గ్రహింపజాలక లిచ్ఛవీవంశీయులగు నరనాథు లప్రసన్నతను వెల్లడించియుండిరి. కాని భౌతికవ్యామోహదూరుండగు దేవుడు వారి యసంతోషము నెంతమాత్రము బాటించియుండలేదు. లౌకికు లకుగదా. అల్పాధిక భావంబులతోడి నెయ్యము! మహాపురుషుండగు బుద్ధచంద్రుని విశదకిరణ జాలస్పర్శంబున బతితయు, సమస్త జనతిరస్కృతయు, నిహపరదూరయు నగు నాజారిణీ వేశ్యకాంత యొక్క సంకుచితాపరిశుద్ధచిత్తము క్షణమాత్ర కాలంబున నవనవతేజఃపుంజ విరాజితంబును శతదళాన్వితంబును నగుకమలంబుమాడ్కి వికాసము యొక్క చరమసీమ నధిష్ఠించెను. తద్వారాంగన చిత్త సరోజము నారీతి వికాసభాసురంబు గావించి, నిజానూన మనోహర సుగంధ ప్రభావంబున శిక్షిత బౌద్ధసమాజమును విస్మయ వారిధినిమగ్నము గావించి వేసెను.

సమస్తమానవ, మానవేతరజీవములకును మాననీయుండగు శ్రీబుద్ధచార్యుడు, అనర్థకరంబులును, అర్థశూన్యంబులును నగు జాతిభేదములను, ధనగౌరవంబులను, ఉచ్చపదము,

హాత్మ్యాది మిథ్యాభిమానములను తుచ్ఛాతి తుచ్ఛములని సి ద్ధాంతీకరింపుచు, తదనుసరణమందే యాత్మానంద పారవశ్యము నందుచుండెను. ఏతత్కారణంబుననే పిన్నలు పెద్దలు, ధనాఢ్యులు నిర్ధనులు, ఆర్యానార్యులు, వీరువారను తారతమ్యము నెడబాసి, పరమాహ్లాదచేతస్కులయి, ఆదేవుని దివ్యోపదేశ ముల ద్రికరణంబుల స్వీకరింపుచుండిరి. తద్దేవదేవుండగు బుద్ధాచార్యుని యుపదేశములు సర్వమాన్యంబులును, సర్వజన ప్రియంబులును నగు కారణంబుననే ప్రప్రథమ మవ్వానిని భారతీయ పతితజాతీయులు సత్వరము భక్తిభారావనతమస్తకు లయి కైకొనియుండిరి.

బుద్ధభగవానుడు నిర్హేతుకంబును, నిందనీయంబును నగు వర్ణావేశపిశాచమును పరాభూతముగావించి జ్ఞానసంప న్ననకే యాధిక్యత నిహపరంబుల బ్రసాదించియుండెను. అత డీరీతి బ్రాహ్మణపదమునకు వ్యాఖ్యానము సేయుచుండు టెంతయు బ్రశంసనీయము :—స్థిరబుద్ధిసంపన్నుడును, మేధా వియు, సత్యాసత్యపరిజ్ఞాతయు, సర్వోత్తమంబగు నిర్వాణపద ప్రాప్తినందినట్టి వ్యక్తియు, బ్రాహ్మణుడయి సమస్తజన సంస్తవ పాత్రుండగును.

ఆత్మీయదుఃఖాంతము నెరింగి, యిహలోకంబున నిష్కా ముకుడయి, బంధవిముక్తుడయి యుండువాడే సంస్తవనీయుం డగు సద్బ్రాహ్మణుండు.

శత్రుమండలియెడ మిత్రభావంబును, దండించువారిపట్ల సుప్రసన్న భావంబునుగల్గి వర్తించునట్టియు, సాంసారికవిషయంబుల ననాసక్తుడయి మెలంగునట్టియు మానవశ్రేష్ఠునే బ్రాహ్మణుం డనజెల్లు.

చదువరులారా! ప్రస్తుత మిలాతలంబున వ్యాప్తమయి యున్న తేమత మీయభిప్రాయముతో సానందచిత్తముతో నేకీభవింపకుండును? ఉపర్యుక్త వ్యాఖ్యానాంశములయం దెట్టి జీవహితరహస్యము దాగియున్నదో విజ్ఞప్రపంచము గుర్తింపక పోదు. ఎవ్వాడును బాహ్యకారణంబులచేతను, ఆకస్మికంబగు జన్మచే నను బ్రాహ్మణుడు (ఉత్తముడు) కాజాలడని దేవుని సిద్ధాంతములు చాటుచున్నయవి. వంశానుగతమిథ్యాజాతిభేదమును దిరస్కరించి, బుద్ధాచార్యుడు వర్ణవిషయకంబగు ప్రాచ్యపాశ్చాత్య మతభేదభావమును సమూలముగ విధ్వంస మొనర్చెను. వర్ణవిభాగ సమస్యాపరిష్కారముచే భారతీయమతముల గౌరవమును సంరక్షించిన శ్రీబుద్ధాచార్యుడే.

శ్రీబుద్ధభగవానుడు "వృషలసూత్ర" మను గ్రంథము నందు వర్ణవిభాగమునుగూర్చిన నిజాశయంబుల స్పష్టముగ చిత్రించియున్నాడు. అగ్నిభరద్వాజుడు దేవుని దివ్యసన్నిధి కేతెంచి జాతిలక్షణంబు లెట్లుండునని పృచ్ఛించినపు డత డీరీతి వచించెను:—సృష్టియం దేదేశమందయినను, కాలమునందయి

షను నరుడు గుణకర్మలవలననె బ్రాహ్మణాబ్రాహ్మణుం డగును. పవిత్రగర్భంబునుండి జననమొందుటంజేసికాదు. దుర్గుణంబులగల్గి, దుష్కర్మ నాచరించు జ్ఞానభ్రష్టుడే చండాలుడగుచందమున దీనికి బ్రతికూలంబులగు సద్వృత్తుల నాశ్రయించి మను మానవుడు బ్రాహ్మణుండగును.

పాపాచరణ యుక్తుండును, కపటాత్ముండును, హింసకుండును, అసత్యదర్శనమునకు హృదయమునందు స్థానమొసంగినవాడును, మాయాపరీతచిత్తుండును, సంసారమును వ్యాసంగించుటయందు ప్రవీణుండునునగు భ్రష్టమానవుడే చండాలుడు.

స్వహస్తములతోడ బశుపక్ష్యాదులవధించునట్టియు, నిర్దయుండైనట్టియు నిందితప్రకృతిగలవాడె చండాలుడు.

నిర్హేతుకముగ బరుల హింసించునట్టియు, అన్యుల విత్తము నపహరించునట్టియు, ఇతరులనుండి ఋణముగైకొని పిదప ననంగీకారమును దెల్పునట్టియు, విత్తలోభంబుచే నన్యుల ప్రాణముల బలిగొనునట్టియు, నిత్య వ్యభిచారవృత్తి నవలంబించియుండునట్టియు మానవాధముడే చండాలుడు.

వృద్ధులగు జననీజనకుల సేవాశుశ్రూషల నిరతుడయి యుండనట్టియు, కటువచనంబుల బంధుమిత్రవర్గము యొక్క

చిత్తమునకు బరితాపము నొదవజేయునట్టియు నీచమానవుడే చండాలుడు.

ఉత్తము ండను భావముచే బ్రజలు తనచెంతకు సద్విషయకంబులగు సమ్మతుల బడయవచ్చుచుండ, వారలకు చెడ్డసలహాలనొసంగుచు, సత్యదూరుడయి, యసత్యము నాశ్రయించి, యాదరించు క్రూరుడే చండాలుడు.

అహంకార పరిపూర్ణ హృదయుడయి, యాత్మస్తుతి గావించుకొనునట్టియు, పరుల నవలోకించి ద్వేషింపుచునసహ్యించుకొనునట్టియు, పరుల నిందించునట్టియు, నరాధముడే చండాలుడు.

దేవుని యీసిద్ధాంతంబుల నవలోకింప బామర పండిత మండలికిసహిత మతనిబుద్ధివైశద్యమును, ధర్మవిస్తీర్ణతయు, లోకోపకార పారీణతయు మతవిషయక సిద్ధాంత నిర్ణయ శక్తియు దెల్లమగుచున్నయవి. ఆతడు ప్రత్యక్షంబులును లోకానుభవ లబ్ధంబులునునగు దృష్టాంతములచే శ్వపచుండయినను, సాధుశీలుడును, జ్ఞానసంపన్నుండునగుచో నిహపరముల, సుఖశాంతుల నిరాతంకముగ బడయగలడని నొక్కివక్కాణించి యుండెను. మాతంగుడను నామధేయముగల యొక్క శ్వపచబాలుడు కామక్రోధాది దుష్ప్రవృత్తుల ద్యజియించి పరమసాధువయినట్లు బుద్ధదేవుడొకచో వచించియున్నాడు.

ఆబాలకుని యనన్యసులభంబగు యశము చతుర్దిశల వ్యాప్త మగుటంజేసి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు తండోపతండ ములుగా నాసాధువర్తనుని సన్నిధికరుదెంచి భక్తివినమ్రు లయి యతనికి సాష్టాంగదండ ప్రణామంబు లాచరింపుచుండిరి. మరణానంతర మాశ్వపచకులీనుండగు మహాపురుషుడునిర్వాణ పదవి నలంకరించెను.

బ్రాహ్మణకులమునం దావిర్భవించి నంతమాత్రమున బ్రయోజన మావంతయు వాటిల్లనేరదు. ఒకానొక బ్రాహ్మ ణాధ్యాపకుడు వేదమంత్రముల శిక్షనుబడసియుండియు, బాపా చరణమునుండి విముక్తి నందజాలకపోయెను. అతనికి దుష్ప్ర వర్తనముచే నిహమందును, బరమందును శాంతిశ్రీనారా ధించు మహద్భాగ్యము లభింపకపోయెను. ఇహమునం దపార ఖేదానుభవంబును పరమందు నరకకూపనివాసప్రాప్తియు నత డనుభవించెను. ఇట్టి యధఃపతనమునుండి యావిప్రుని కుల గోత్రములుగాని వేదజ్ఞానముగాని యెంతమాత్రము సంర క్షింపజాలవయ్యెను.

బుద్ధాచార్యుని ప్రభావోత్పాదకంబులును హృద్వికా సోల్లాసకరంబులును నగు నైతికవాక్యము లగ్నిభరద్వాజుని చిత్తము నాకర్షించెను. అతడనంతరము మిథ్యాజాత్యభిమా నము నెడబాసి దేవునిచరణకమలయుగ్మమునం దాత్మ సమ

ర్పణము గావించివై చెను. సంఘముచే బతితులుగ భావింప బడిన నిమ్నవర్ణసంభూతులనెల్లగ శ్రీబుద్ధాచార్యు డన్యసర్మ పరివర్తుల చందమున నుపేక్షాదృష్టితో నవలోకింపక యాదరించి యాథాత్మికశిక్షచే దీక్షితులగావించెను. ధర్మసిద్ధాంతముల నత డలంకారరసద్వంద్వార్థ భూయిష్ఠంబగు భాష యందు నుపన్యసింపక వ్యావహారికంబును పండితపామర జనబోధకంబును నగు గ్రామ్యమునందే యుపదేశించెను. అతడు పతితుల నుద్ధరించెను. సన్మార్గచ్యుతుల సత్పథగాములుగ జేసెను. అజ్ఞానాంధకారమునబడి మ్రగ్గువారల సుజ్ఞానజ్యోతిర్మయావరణమునం దధివసింపజేసెను. పాషాణసదృశ కఠోర చిత్తుల కరుణారసపరిప్లుత హృదయుల గావించెను. వేయేల! నిర్జీవమానవజాతిని సజీవముగావించి యంతటితో మనస్తుష్టి వహింపక దివ్యాథ్యాత్మిక శిక్షాజ్యోతిచే వికాసవంత మొనరించెను. బుద్ధాచార్యుని దివ్యావతారంబుచేతను యతనిధార్మిక సార్వభౌమత్వంబునను అస్తమించిన సుజ్ఞానదివాకరు డుదయించెను. సుధామయంబగు నిజజ్ఞానప్రభచే జగమును దేదీప్యముగావించెను.

పరిష్కృతంబగు హిందూధర్మమే బౌద్ధమయి ప్రథమమనార్యుల కాదినివాసస్థానంబగు మగధదేశంబున నపేక్షాపరులగు నసంఖ్యాకులచే స్వీకరింపబడియెను. పరివర్తనము

సృష్టిధర్మమయి యున్నందునను పరివర్తనసూత్రమును బ్రకృతి స్వయముగా హస్తమున బూనియున్న హేతువుచేతను, ప్రాయికంబుగా సంస్కారము సంసారవికాస ప్రవర్ధకంబగుట వలనను హిందూధర్మము బుద్ధాచార్యునిచే సంస్కరింపబడి ప్రాచీనార్యమతము (వైదికము) యొక్క ప్రాశస్త్యమును సంరక్షించి, సమస్తదేశీయులకు స్పష్టపఱచెను. క్రీస్తుశకము 300 వత్సరములకు బూర్వము మగధరాజ్యశ్రీసమ్ముఖంబున సమస్తానార్యవర్ణ భారతవర్షీయరాజ్యలక్ష్మలు తలలువంచి యున్న తరుణంబున రాజశక్తియొక్క పరమసాహాయ్యంబునను బౌద్ధధర్మము సమగ్రభారతమున వ్యాపించెను.

పరిశుద్ధ ధర్మసార్వభౌముండగు శ్రీబుద్ధాచార్యుడు కృత్రిమాచార వ్యవహారంబులను, మిథ్యాజాతి గౌరవంబులను బాటించియే యున్నచో హిందూధర్మ మీచందమున సంస్కరింపబడి, పతితమానవ జాతికి నూతనజీవితము నొసంగి నదీనద మహారణ్య పర్వతసాగరంబుల నుల్లంఘించి, స్వాభావిక ప్రతిబంధకముల నతిక్రమణము జేసి, నానాభాషీయుల రాష్ట్రముల సంకుచితధర్మక్షేత్రముల ధార్మిక విజయధ్వజము నే రీతి స్థాపితము గావించి జీవకోటుల కనంతామల నిర్వాణ సాఖ్యామృతరసమును బ్రదానము సేయగల్గియుండెడిది? వైదికధర్మద్యోతకంబగు బౌద్ధధర్మము భూమండలముయొక్క యొక

ప్రధానధర్మముగ బరిణమించి, నిజోత్తమౌదార్య విశేషమును బ్రపంచమునకు జాటియుండెను. శ్రీ బుద్ధోపదేశములు ప్రాచీన కాలమునందు పీయూషరసధారను భారతంబున బ్రవహింపజేసి, తత్పానంబున మానవుల శుష్కహృదయముల బల్లవింపజేసిను. అపుడే సాహిత్యము, విజ్ఞానము, శిల్పము నూతనాభ్యుదయము నందెను. స్వావలంబిత జీవితనిర్వాహణమునకాధారభూతంబగు పారిశ్రామికవృత్తి యాకాలంబున బూర్ణముగ వికసించియున్నటుల శ్రీమదాంధ్రదేవుని యొక్కయు, శ్రీమదాచార్య ప్రఫుల్లచంద్రరే గారియొక్కయు, తంతుకారకసంఘముల గూర్చి వ్రాసిన వ్యాసముల నవలోకింపదెలియనగును. భారతము యొక్క యాయతీతయుగపు నాగరికతానిలయమునుండి యధునాతనవిద్వాంసు లనేకప్రయత్నముల నమూల్యధర్మసిద్ధాంతరత్నముల బడయ గృషి సలుపుచున్నారు. శ్రీ బుద్ధదేవ ప్రవర్తంబగు ధర్మము సమగ్రసంసారవ్యాప్త ధర్మములలోని కెల్ల నుత్కృష్టంబగుకతన నాదేవునకు సార్వభౌముడను పదవి లభించెను. నవనవతేజఃపుంజములతో నీధర్మమాచంద్రతారార్కంబుగాసృష్టియందెల్లెడల వ్యాపించుటయం దెంతమాత్రము సంశయములేదు.



## శ్రీబుద్ధాహ్వానము.

సృష్టియందింతపర్యంతము నాధ్యాత్మికాభ్యుదయసీమను నిర్ధారిత మొనరించినవాడు దృష్టిగోచరము కాలేదు. అద్దాని చరమావస్థ మానవప్రయత్నము లేకుండగనే స్వయముగా తరుణము ననుసరించి ప్రకటితంబగుచుండును. లేదా, యా యనిర్వచనీయతకు మధ్య సాధనాంతమున నెపుడో యొకసారి సాధకు డుపస్థితుండగుటమాత్రము వాస్తవమునకు భిన్న మయినది కాదు. ఆధ్యాత్మిక చరమావస్థనుగూర్చి యభినుతింప మానవశక్తి కతీతమయిన కార్యము. అయ్యది వాణియొక్క యపూర్వశక్తి నతిక్రమించిపోయినది. సాధనాబలంబున సిద్ధి నంది యీయనిర్వచనీయానందవార్ధి నోలలాడి సాధకు లీసత్వ థ వృత్తాంతమును విశదపఱచగల్గుటమాత్రము రూఢియె కాని వాగ్విశేషముచే నిద్దాని చరమసీమను నిర్దేశింప నశక్తులు. సాధకులు స్వయముగా స్వావలంబనపూర్వకముగ నిజోద్యోగముచే సమస్త మార్గాంతరాయముల నతిక్రమించి యాత్రయొక్క యంతిమస్థానమును జేరుచుందురని శ్రీబుద్ధాచార్యుడు చాటియున్నాడు. అతడొకతూరి యుచ్చైస్స్వరంబున నిట్లుద్ఘోషించి యుండెను:—"నాయనలారా! మీరు నిజపాదములపయి నాధారపడియుండి, సాధనము సేయుడి. స్వావలంబనము విస్మరించి, పరావలంబనము నారాధింపక మెలంగుడి."

శ్రీబుద్ధాచార్యుడు మానవజాతి కనిర్వచనీయానందమయ పథ రహస్యమునుగూర్చి విశదీకరింపక నిర్భయ చిత్తముతోడ నిట్లుపదేశించి యుండెను. తదుపదేశముయొక్క మర్మమిద్ది యః—"నిర్వాణపథము ననుసరించు నా మునలారా! అమంగళమునుండియే మహత్కల్యాణమును బడయ యత్నించుడి. వ్యాధిఖేద జరామరణ సంకులంబగు ప్రపంచవాతావరణము నుండియే యమందానందకందంబగు నిర్వాణసౌభాగ్యమును గరతలామలక మొనరించుకొనుడి. సుఖదుఃఖముల ప్రాదుర్భావమును, అవ్వాని యవినాభావసంబంధమును గుర్తెఱింగి నిత్యశాంతిశ్రీ నారాధింప నవీనంబగు నౌత్సుక్యమునంద నుపక్రమింపుడి." శ్రీబుద్ధాచార్యుని నిష్పాపంబులును, సమస్తజనాదరణీయంబులునునగు సిద్ధాంతములన్నియు సుస్పష్టంబగు భాషయందుపదేశింపబడుటం జేసి జను లవ్వాని నత్యంతాదరముతో నాహ్వానింపుచుండిరి. ప్రాచ్యపాశ్చాత్య వేదాంతశాస్త్రవిదుల స్వానుభవప్రాప్త సమస్తసిద్ధాంతముల నీదేవుని హితోపదేశ వాక్యరత్నము లుద్దీపింపజేయుచున్నవి. వారల యాథ్యాత్మికోహాల కాధార మాదేశముల వ్యాప్తమయియున్న బౌద్ధమతమేయను సందేహమొడముచున్నయ దన్న నతిశయోక్తి కానేరదు. దేవుడుచాటిన "అమంగళమునుండియే కల్యాణమునందు" మనువాక్యమును పాశ్చాత్యదార్శనికుల "good out of evil, చెరుపునంచే మంచికలదు." అను సూక్తిర

త్నము ననుసరింపుచుండు టెంతయు సంతోషదాయకము.
ఏతద్వాక్యమును సంస్మరింపుచు గార్యోన్ముఖుండగు వ్యక్తి
సంసార క్షేత్రమున నాత్మవిశ్వాసమును గోలుపోవక, సాధక
బాధకములనెల్ల సహించుచు, విఘ్నంబుల "శ్రేయాంసి బహు
విఘ్నాని" యనుచందమున గౌగిలింపుచు, కర్మవీరుడయి
సత్కర్మయొక్క ఫలితమగు సచ్చిదానందనిలయమును సమీ
పించును. నిర్జీవుండును, కర్మభీరువును, జీవన్మృతుండునునగు
మానవుని హృత్కమలమును నవనవతేజః పుంజవికాస భాసు
రంబుగావించున దీ శ్రేయోదాయకాశాసంపూరితంబగు వాక్య
రత్నమె. వేదవేదాంగోపనిషత్పురాణకావ్య గ్రంథరచయిత
లకును, పాఠకులకును "అమంగళమందే మంగళ"మను వాక్య
ము స్వల్పమగు మహత్తుకలదిగ గోచరంబయినను సృష్టితత్వ
రహస్యానుభవపరుల త్రైలోక్యదృష్టియందు మాత్రమట్లు
గాక, అక్షయపీయూష పరిపూర్ణభాండమువలెగానవగుచుండు.
పశ్చిమదేశీయుండగు నొక్కయాత్మానందయోగి స్వానుభవం
బున నీక్రిందివాక్యమును నుడివియుండ, భారతీయాధ్యాత్మి
కోపాసకులగు రామతీర్థాదులు సమర్థించియున్నారు: "There
is a soul of goodness in things evil, చెడులోమంచి
యంతర్గతమయి యున్నది." ఉపరివాక్యము నే నిద్దియు బల
పఱచుచున్నయది. ఇందు విశాలతరంబగు జ్ఞానవిజ్ఞానసారము
మూర్తీభవించియున్నది.

దేవునివ_క్తృత్వము సహజగమవంబున మానవసంఘహృదయ సరోవరమును గలచివైచెను. ఆకాలమున సాంఘికుల హృత్సరోవరముల నుప్పతిలిన యాందోళనమే వారియాత్మ సంస్కారములకు బ్రథమసోపానమయ్యెను. దుర్భావపూరిత హృదయుండగు వ్యక్తి యభ్యుదయమును బడయుటకు బూర్వము నిజచిత్తమునం దొక్క సంస్కారసూచకంబగు నాందోళన ముదయమగుచుండుట నవలోకింపగలడు. పాపకార్యము నాచరించి విపరీతపరిణామంబున బడయు విషాద (పశ్చాత్తాప) మెట్లు వానిపురోభివృద్ధికి మార్గమగునో యట్లే బుద్ధాచార్యుని దివ్యవాక్యముల నాలకించినపిదప పూర్ణసంస్కారక్రియ ప్రారంభమగుటకు బూర్వము ప్రజాహృదయమున గల్లోలముదయించినట్లు బౌద్ధమతగ్రంథములు తెల్లమొనరించుచున్నయవి. ప్రాప్యంబును, అనుభవైకవేద్యంబును, వాగభినుతి కతీతంబునునగు విషయమునుగూర్చి దేవుడు వృథాప్రలాపంబుల వచియించినట్లె కానరాదు.

అతడెల్లర నుద్దేశించి యిట్లుపదేశించి యుండెను:—

"బిడ్డలారా! జడత్వమును నిర్మూలించుడి. సావధానత నాదరించుడి. దుఃఖరోగగ్రస్తులగువారు కింకర్తవ్యతామూఢులయియుండగాదు. మిథ్యాగతంబులగు సౌఖ్యంబులబడయ యత్నింపగల్గిన నజ్ఞానమందు గానగు భయ విషాద రోగ మరణముల

నుండి ప్రతిజీవియు విముక్తినంద మార్గముకలదు. రిత్తకోర్కెల నుండి చిత్తమును మరల్చినంతనే ముక్తిమార్గ మాయత్త మగును." దేవుని యీ జీవకళాయుక్తంబులగు ధార్మికవాక్యము లెంత సారగర్భితములు! అపారాసార సంసార పారావారతర ణంబునకెట్టి యుత్తమనౌకలు!! చిత్తమును లగ్నమొనర్చుచో పథమేల లభింపదాయన్న బుద్ధాచార్యునివాక్యము ననుసరించు " Where there is a mind there is a way " అను పాశ్చాత్య తీయ పండితుని వాక్యము సంస్తవనీయ పరిణామదాయకమే!

శ్రీబుద్ధదేవుడు కర్మయోగశాస్త్ర సిద్ధాంతముల వన్నె లను, చిన్నెలనుబెంచు "మానవుడా! నీభాగ్యమునకు నీవే కర్తవు" అను మహద్వాక్యమునకు వెనువెంటనే పాశ్చాత్య వేదాంతులెట్లు దురితగమనంబున బరుగెత్తి వచ్చుచున్నారో పాఠకులారా! అవధరింపుడు:—" The man is the master of his fate నరుడే తనయదృష్టమునకు గర్త" కర్తయగువాడే భర్త, హర్తృశక్తుల సహితము గల్గియుండును.

శ్రీ జినప్రభువు (బుద్ధదేవుడు) యొక్క నిమ్నోదా హృతములగు వాక్యముల సకలమతావలంబులు నెట్లు సన్మా నించుచున్నారో సూక్ష్మతరదృక్కుల నారయుడి. "కుమారా! భవితవ్యమునుగూర్చి మది దలపోయకుము. ఏనిముసమం దాచరింపదగిన కార్యము నానిముసమందే యాచరింపుము. అవ

సరము వచ్చినపుడు నీకు దోడ్పడు స్నేహితునే యథార్థముగ సుహృద్వరునిగ నెఱుంగుము." అంతఃకరణ వేదము యొక్క రత్నభాండారమందలి సానదీరిన రత్నములివ్వి. "క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం దేహం క్షణం సర్వం క్షణక్షణమ్" అను గురుజనులవాక్యము దేవునివాక్యము ననుసరించియేయున్నది. 'ఒకక్షణ మున్న చిత్తము మఱొక్కక్షణమ్మున కెల్ల మాఱెడిన్' అనునాంధ్రకవి కుమారపద్య ప్రమోదవాటికాసుమ మెంతసుందరము! ఈనిముసమందున్న చిత్తము మరొక్క నిముసము నందు పరివర్తనము జెందునన్న నాశ్చర్య మేమికలదు? ఒకవేళ మృత్యువే సమీపించకూడదా? సమయము మనకయి వేచియుండునా! "Time and tide wait for no man" అను నాంగ్లకవీశ్వరుల వాక్యము నాదరించు మనము, నవ్యభారతీయుల మగుమనము దేవుని వాక్యముల నిబిడగూఢార్థమును గ్రహింపలేకపోము. సమయమునకు మనము కర్తలము కాకపోవుటం జేసియే "catch time by the forelock impure, work in present, do not think for the future" మొదలగు నాంగ్లేయ వాగ్విధాతలు సమాధానసూచకంబగు శిరఃకంపనము సేయుచుండ బుద్ధదేవుడు 'ప్రస్తుత కర్తవ్యము నాచరింపుడి, ముందునుగూర్చి విచారింపకుడి' యను వాక్యముల వచించియున్నాడు.

దేవ్రనినీతిసే బలపఱచు "కాలప్రివాహమును నిరోధి-ప జీవకోటికి సాధ్యముకాదు" అను వాక్యముపై నొక్క గాథ భారతీయపురాణములయం దున్నట్లు వినరాయెడిని. ఆకథ యిట్లున్నది: "పూర్వ కాలమునందు సకల శాస్త్రవిశార దుండును, స్వానుభవైక వేదాంత పరిజ్ఞాతయునగు నొక్క భూపాలుడుండెను. అతడు మహాదాత. చిత్తచాంచల్యమును నతడెపుడు సౌదామినీగతికి బోల్చుచుండువాడు. చిత్తవశీకరణమె (mind in control) సుఖమునొదవజేయునని యతడు విశ్వసించియుండెను. అద్దానికి సువ్యవస్థయందలి చిత్తము (Balanced mind) పరమావశ్యకంబని యతడు విచారించు చుండెను. "సత్కార్యాచరణంబుల సత్వరోపక్రిమణమే నిత్య వికాసమున కాధారభూతము" అను నతడొకతూరి "యాచకుండగు మిథ్యాబ్రాహ్మణుడు నిజసన్నిధికి వేంచేసి యంజలి ఘటియింప, తన వామహస్తమునందున్న ముత్యాలహారము నాబాపని కావామహస్తముతోడనే దానమొసంగెను. అంతనా పుడమివేల్పు, 'పుడమిఱేడా! ఉత్తమ బ్రాహ్మణుండనగు నాకు నీవశౌచమును శుద్ధిజేయు నప్రశస్యహస్తముతో దాన మునొసంగుట యుక్తమే?' యని పృచ్ఛించెను. అంత నా వసుంధరాధిపతి మందహాసము సేయుచు నిట్లు మృదులంబగు నుత్తరం బొసంగెను :—"అయ్యా! నీ వేపదార్థమును యాచింప మత్సమ్ముఖంబున కేతెంచితివో యదిసంసారుల

నెల్ల వశముగావించుకొన్న తళుకుబెళుకులు గలటక్కులమారిఁత్మీ. నీ వేతెంచునప్పటి కీహారము నావామహస్తమునందేయున్నది. తావకంబగు యాచనాధ్వని నాలకించినంతనె, నేనీహారము నట్లే నీ కొసంగివైచితిని. వామహస్తమునుండి దక్షిణహస్తమునకు దెచ్చుకొనునంతలో జిత్తమెట్టి పరివర్తనమునకధీనమయి నీయభీష్టమునకు భంగమునొదవజేయునోయని శంకించితి." బ్రాహ్మణుడు సిగ్గుచే నొదలవంచుకొనియెను.

హిందూపురాణములయందలి యీకథయు బౌద్ధనీతి వాక్యమగు "ఆలసింపక నాచరింపుము; ఆలసించిన నాపత్తు కలుగును" నే గౌరవించుచున్నయది. "ఆపత్కాలమందు నుపయోగపడు మిత్రుడే నిజమగు చెలిమికాడు" అను శ్రీబుద్ధాచార్యుని వాక్యరత్నమునకు" A friend in need is a friend in deed" అను నాంగ్లదార్శనికుల నీతి సానవెట్టుచున్నయది. దేవు డైహికంబులగు నేపదార్థములు కాని, పుత్రమిత్రకళత్రాది బాంధవులుకాని, ఆపత్కాలమున ననగా మృత్యుముఖంబున బడుసమయంబున "నాయిల్లాలును రాదు, పుత్రుడును దోడై రాడు తప్పింపగన్" అను నాంధ్రకవి వాక్యానుసారంబుగా నడ్డుపడరనియు, జ్ఞానమొక్కటియే వచ్చుననియు దెలిపెను. కష్టించి, నష్టించి యగాధజలంబున నీదనేర్చు వ్యక్తి నౌకాప్రయాణ సమయంబున దైవికముగా నౌకబ్రద్దలగుచో

బూర్వ మార్జించియున్న నీతనూతగాగొని యుద్ధరింపబడు
చందమున నే జీవితకాలమున సముపార్జించిన జ్ఞానవిత్తము మర
ణాసన్నసమయంబున జీవునుద్ధరించునని బుద్ధాచార్యుల బోధ,
"నమలువానికన్న మిఁగువాడే గట్టివా" డన్న గ్రామీణుల
సామెతవలెను "బుద్ధగీతయందలి వాక్యముల నెల్ల వల్లింపజూచు
వానికంటె నొక్కవాక్యమునయిన గార్యాచరణంబున జీర్ణింప
జేసికొను వాడే పండితశ్రేష్ఠుడు" అనువాక్యమెంతయు నాత్మా
గామునిగనుట కుత్తమపథమయి వెలయుచున్నయది. బుద్ధా
చార్యుని "కర్తకు వాగాడంబరము లేదు" అనువాక్యమును
"ఎట్టిగొడ్డు కఱవు లెక్కుచ" యను నాంధ్రగ్రామీణ సూక్తి
యు "Barking dog never bites" అనునాంగ్లేయారోక్తి
యు శ్రద్ధాదృక్కుల వీక్షించుచున్నవి.

శ్రీబుద్ధాచార్యుడు పామరపండితుల కెల్లరకు సృష్ట్యాది
నుండియు నెల్లదేశీయులచే మహాగూఢంబనియు, సాధారణ
మానవశక్తుల కతీతంబనియు భావింపబడుచు వచ్చియున్న
యాత్మతత్వము (నిర్వాణపథ స్వభావము)ను పాడిమాటలచే
బరిత్యక్తానుభవమందున్న దివ్వెలవంటి దృష్టాంతములచే నిండు
నిరూపణంబుల జూపించియున్నాడు. మానవహృదయమును
ద్రవింపజేయు సంగీతంబునకన్న పాషాణముల ద్రవింపజేయు
సంగీతము మిన్న కదా! ప్రపంచమం దింతపర్యంత మావిర్భవిం

చిన నీశ్వరావతారములుగ భావింపబడు ధర్మప్రవక్తలలోని కెల్ల నుత్తమోత్తముం డీబుద్ధాచార్యుడే. ఇతడు విరక్తభావమునకు జిత్తమున దావాసంగినతత్క్షణమే ప్రమాదరహితుడయి, జ్ఞానాశ్రయంబున హృదయక్షేత్రమునుండి కామబీజముల నిర్మూలముగావించివైచెను. దేవునియుపదేశ గ్రంథములయం దెచ్చోటి నన్వేషించినను హృద్విదారకంబులును, ఆచరణాసాధ్యంబులును, పక్షపాతభావపూరితంబులును, కర్ణకఠోరంబులును నగు వాక్యములుకాని, పదములుకాని గోచరమగుటయే లేదు. శ్రీబుద్ధాచార్యుడు ధర్మజ్ఞానపిపాసార్తులగు సంసారులనెల్లర సంబోధించి యిట్లువన్యసించి యుండెను :—"నాయనలారా! మీకు నేను బోధింపనున్న ధర్మము, మంగళమయము, నిర్దోషము. ఇయ్యది జ్ఞానుల కెంతయు బ్రశస్తమయినది. ఏతద్ధర్మాచరణంబున మీకు కల్యాణసుఖములు లభ్యమగును. నాయనలారా! రండు! శీఘ్రమానందచిత్తులరయి వెంచేయుడు. నేనుమీకు ప్రాచీనతమంబగు ధర్మరహస్యమును దెలుప వాంఛించుటలేదు; దుర్జ్ఞేయంబగు ధర్మతత్వమునుగూర్చి మీకు దెలుపుట నాయభిమతము కాదు. పరులవచనములపై జీవితపరమావధి నాధారముగావింపుడని నేవచింపబోను. నేను వాక్యానుసీతుల నే శిలాక్షరములుగ మీరు విశ్వసింపవలయునని యెడి దురభిలాష నాకు లేదు. నే నుపదేశించు సమస్తమును మీరు స్వయముగా నేత్రయుగ్మమున

నవలోకింపుడు; బుద్ధిపూర్వకముగా విచారించియే గ్రహింపుడు; దీనియొక్క సత్ఫలమును మీరు శీఘ్రకాలమునందే పడయగలరు; నే నుపదేశించు ధర్మము ప్రత్యక్షము, సుస్పష్టము."

శ్రీబుద్ధాచార్యుని సమస్తోపదేశగీతముల సాంగోపాంగముగ నవలోకింప నోచినవార లవశ్య మా దేవుని లోకబాంధవ్యమునకును, తేజసంపన్నత్వమునకును, సాధు, సరళస్వభావంబునకును విస్మయవిస్ఫారితచిత్తు లగుదురు. కమలాప్తుని కిరణమాలికా ప్రసారంబున వసుంధరపైనున్న సమస్తపదార్థములును బ్రకాశభాసురంబు లగుచందమున నే మహాపురుషాగ్రేసరుండగు శ్రీబుద్ధభగవానుని నిర్నిరోధంబగు స్థిరప్రజ్ఞావినిర్మలజ్యోతి మానవుల సాధనమార్గము నాద్యోపాంతముగ బ్రకాశవంతము గావించివైచెను.

శాస్త్రోక్తంబులగు విధానములయెదుటను లోకాచారముల సమక్షమంబునను బుద్ధిని, యుక్తిని బలిదానముగావించి సహజమగు సత్యమును దోసిబుచ్చిన మానవసంఘము శ్రీబుద్ధదేవుని పరిశుద్ధజ్ఞాన ప్రభావంబున సత్యపథమును సమీపించగలిగెను. శ్రీ బుద్ధాచార్యుడు దార్శనికత్వమునకును పాండిత్యమునకును స్వీయకర్తవ్యక్షేత్రమున స్థానమొసంగక సర్వజన గ్రాహ్యంబగునాత్మీయధర్మతత్వముయొక్క వ్యాఖ్యానము గావిం

చెను. అతడితరేతరధర్మప్రవర్తకులవలె వేదవేదాంతముల యొక్కయు, దర్కశాస్త్రముల యొక్కయు నాశ్రయము నభిలషింపక బుద్ధిని, సాధారణయుక్తిని మానవప్రబోధమునకయి స్వీకరించెను. శ్రీబుద్ధప్రబోధ మత్యంత సులభంబును, సర్వజనోపయోగకరంబును నగుటంజేసియే మానవాంతఃకరణంబును, బుద్ధియును, విచారణశక్తియు నిస్సంకోచభావముతో నాప్రబోధమునకు శిరమువంచెను. ఏతత్కారణంబుననే బౌద్ధధర్మము సాంఘికవిప్లవము నొదవజేయక, ధార్మికావాంతరములనెల్ల నతిక్రమించి విఘ్నబాధల దొలగద్రోసి, యల్పసమయమునందే విశాలతమంబగు నాసియాఖండమునం దంతట వ్యాపించిపోయెను.

శ్రీ బుద్ధదేవుడు, స్వశక్తిని, స్వావలంబనమును దురించి పరిమాదమును మూఢభక్తిని బెంచు దురాశల వ్యర్థముగా మానవుల కెట్టియవస్థయందును సత్వర స్వధర్మపరిచారాభ్యుదయము నపేక్షించి కల్గించియుండలేదు. ముక్తినభిలషించి తన్నాశ్రయించిన సంసారులకెల్లరకు స్పష్టముగా నిట్లు వక్కాణించియుండెను:—"తుమ్హేహికిచ్చం ఆతప్పమం" మీరు స్వాయముగా నుద్యమముతోడ శుభాచరణంబును గల్గియుండవలయును, మీరలే యష్టాంగమార్గముల నాచరింపవలయును, మీరే ధ్యానపరాయణులరయి సాధుతమంబగు ఋజువర్తమునచే ముక్తిపదవిని గరతలామలకము గావించుకొనుడి;

నేను మార్గమునుజూపించు నిమిత్తమాత్రుండనేగాని మీ మోక్షమునకు గారణభూతుడను గాజాలను. సావధానచిత్తములతో మీరలే కృషి సలుపుడి. మాంద్యమునకును ముక్తికిని గడుదూరము. ముముక్షువులు సర్వకాల సర్వావస్థలయందును చిత్తమును, సంకల్పమును జాగ్రదవస్థయందే భద్రపఱచుకొందురు; కారణమేమన—"కుసీద పణ్ణాయమగ్గం అలసో నవిందతి," నిర్వీర్యుండును, నిస్తేజుండును, ప్రమత్తుండును నగు మనుష్యుడు జ్ఞానమార్గమును సహస్ర ప్రయత్నముల గావించినను బడయజాలడు, ఇది ధ్రువము.

వాఙ్మనోనిష్ఠను గల్గియుండి దైహికపాప మెద్దియు నాచరింపరాదనియు నీప్రకారము సంయమపరుడయి యుండుటంజేసి, మానవుడు త్రికరణంబుల బరిశుద్ధుడయి, ధర్మమార్గమును గరగతముజేసికొన శక్తుండగునని సెప్పు శ్రీబుద్ధాచార్యుని యాభ్యంతరిక సంస్కారవిధాన ప్రాశస్త్యంబును, బాహ్యాశూన్య సంస్కారాడంబరవిధాన నిరసనమును సుస్పష్టమగుచున్నయవి. శ్రీ బుద్ధాచార్యుడు ధర్మమునే విహారయోగ్యంబగు ప్రమోదవనంబుగను, ధర్మమునే యానందమందిరముగను, ధర్మమునే యభిరుచికరంబగు పదార్థముగను ధర్మమునే జ్ఞాతవ్య విషయంబుగను, ధర్మమునకు బ్రతిబంధకమగు సాంఘిక కలహమునే వినిందిత త్యాజ్య

పదార్థముగను భావించుకొనవలసినదని నిర్వాణానక్తులగు సంసారుల కెల్లరకు బోధించి, మూత్రపురీషాదులతో నిండిన శరీరమునకును, అద్దాని కనేక కార్యపరిణామంబు లగు సుఖదుఃఖముల నాసంగు చిత్తమునకును ప్రాపంచిక వినశ్వరైశ్వర్యము లెంతమాత్రమును నుపయోగకరంబులు కాజాలవనియు, మానవజీవితము నూర్ధ్వముఖంబునకు గొని పోవు సజీవంబగు ధర్మమే సర్వోత్కృష్టంబనియు దెలుపుచు ధర్మప్రవక్తల కార్యక్షేత్రమును సంపూర్ణముగా సంస్కరించి యద్దానికి నవీనజీవిత కళాస్ఫూర్తిని బ్రసాదించెను. అతడు, జీవితకాలమునంతయు బాహ్యసంస్కారములకును, మూర్తి పూజలకును రాద్ధాంత సిద్ధాంతములకును, తర్కవితర్కము లకును వినియోగింపక సుందరభాషణంబునకును, సత్యపరిశీల నమునకును వెచ్చింప సౌఖ్యశాంతులు లభ్యమగునని బోధిం చెను. అతడు సాంగత్యప్రభావ మనిర్వచనీయంబనియు, కవికల్పనా విడంబనమున కతీతమయినదనియు నిశ్చయించెను. చతురుండగు నావికు డసంఖ్యాకులగు ప్రయాణికుల నొక్క నౌకపై నాసీనుల గావించుకొని చిరపరిచితంబగు జలమార్గం బున నియమితస్థానంబునకు దెడ్డుయొక్క సాహాయ్యంబున గొనిపోవు చందమున నే జ్ఞానసంపన్నుండగు సాధువు తన్ననుసరించు వేలకొలది సంసారుల ధర్మజ్ఞానమార్గానుసరణంబున

గళ్యాణమయంబగు మోక్షసామ్రాజ్య పథమును సమీపింప గలడని యతడు సిద్ధాంతీకరించెను.

మనస్తుష్టిని గల్గియుండుటయు, శీలపాలనమందు జాగరూకతను వహించుటయు, సమస్తేంద్రియ సంయమమును గల్గియుండుటయు మానవధర్మమనియు, శీలపాలనంబున బుద్ధి చాంచల్యము నెడబాయుననియు నద్దానిచే మానవునిదుఃఖము దూరమగుడు సుఖము లభించుననియు నత డుపదేశించెను. పూలమొక్క నవీనసుమనములు వికసించుటచే వాడు బారిన పుష్పముల రాల్చివేయునటులే మానవుని చిత్తము పుణ్యంబునను, పారిశుద్ధ్యము చేతను విభూషిత మగుటంజేసి యద్దాని స్థానమునందున్న పురాతనంబులగు కామవాసన లప్రియత్నముగనే నిర్మూలమగునని దేవుడు చాటెను. జ్ఞాన పూర్వకంబుగ మనమును వశము గావించుకొన శీలసంరక్షణ మావశ్యకంబనియు, వశీకృతచిత్తముచే బరమానంద ప్రాప్తి యే నిక్కువంబనియు, నష్టాంగమార్గము లే సమస్తమార్గముల లోనికెల్ల శ్రేష్ఠంబులనియు, నార్యసత్య చతుష్టయము సంపూజ్యమనియు, సమస్తసత్యములలో బ్రధానమనియు, బ్రసన్న హృదయముతో నెల్లరు నీధర్మోపదేశముల స్వీకరించి యాత రింపవలయుననియు న్నిందుచే ముక్తియే కృషియొక్క ఫలితం బగు ననియు నాబుద్ధాచార్యుడు బోధించెను. అంతఃకరణ

వేదము యొక్క యీయుపదేశముల నాలకించి నిర్మలంబగు శాంతిని బడయ బుద్ధునాహ్వానించిన జనులు ధన్యులు!

---

బౌద్ధనీతి

సమస్తలోకకల్యాణకరంబగు బౌద్ధనీతినిగూర్చిన హితోపదేశవాక్యంబులన్నియు ధమ్మపదమునందే మాప్రియపాఠకశ్రోతలవలోకించియే యుందురు. తద్గీతావాక్యములయందంతర్గర్భితమయియున్న విశేషంబును గుఱించి యోకించుక ముచ్చటించుటయందే మహదానందముకలదు. మహచ్ఛ్రేయమునందనభిలషించు సాధకులెల్లరు నప్రమత్తులయి, బాహ్యాభ్యంతరిక పారిశుద్ధ్యమును బడయవలసియుండును. పారిశుద్ధ్యమే సాధనమునకు ప్రథమసోపానము. ఏతద్ధేతువుచేతనే బ్రహ్మచర్య వ్రతపాలనంబును, శీలధారణంబును విధేయములయియున్నవి. ఆధ్యాత్మికనేత్రము తెరువనిదే సత్యము సాక్షాత్కరించుట స్వప్నవార్త. ఈకారణంబుననే సాధకు లవిరళకృషిచే మనము నత్యంతపరిశుద్ధము గావింప నుత్సుకతనుగల్గియుందురు. సాధనోపక్రమణమునకు బూర్వమే యాయుత్తమసాధకులు చిత్తశుద్ధివలనను, స్థిరత్వంబునను సత్యము యొక్క దివ్యజ్యోతి ప్రకాశసందర్శనము కలుగునని గుర్తించియే యుందురు.

కూర్మమేరీతి నిజావయవంబులనెల్ల గోపనీయముగ స్వశరీరమునం దిమిడ్చుకొనుచున్నదియో యదియేచందమున

సాధకులయిన పురుషోత్తములు పరిశుద్ధాభ్యాసమున నాత్మీయ చిత్తముల సమస్తాఘములనుండి మరలింప యత్నించుచుందురు. చిత్తమును వశీకృతముగావించుకొన జాలని సాధకుడు ధ్యానముసేయుటకుగాని, ఉపాసనకుగాని యర్హుడు కాజాలడు. అట్టి వానికి సుఖశాంతులు లభించుట దుర్లభంబు. చిత్తము యొక్క గుప్తస్థానంబున నెలకొనియుండు సమస్తపాపవాసనలును పండితశేఖరుల చిత్తముల సహితము చలింపజేసివేయును. పాపమును బాపమనిగుర్తెఱుంగ శక్తులమయినపుడే మనమద్దానినుండి విముక్తినందగలము బాహ్యసంస్కార ప్రవృత్తులచే జిత్తమొకించుక సత్యప్రకాశ ప్రతిబింబముచే నుద్దీపితంబయినను సాధనమార్గము ననుసరింప నుపక్రమించినంతనే యాచిత్తము ముఱ్ఱూతలూగిపోయి, నిజచాంచల్యముచే సాధనభంగము గావించివేయును. శ్రీబుద్ధాచార్యు డీవిషయమయి ధమ్మపదమను పేరనొప్పు మనబుద్ధగీతయందిట్లు వచించియున్నాడు:

"ఆకాసేచ పదం నత్థి సమణో నత్థి బాహిరే."

అంబరపథమున జనుటకుమార్గము లేనిచందమున బాహ్యకర్మాచరణంబున మానవుడు యథార్థమగు పరివ్రాజకుడయి సుఖింప నసమర్థుడు. బాహ్యప్రయత్నముచే గరపదములాదిగాగల కర్మేంద్రియముల నిరోధించినను, స్వాంతమునందే పాపచింతనమందు మనము నిమగ్నులమయి యున్నచో సత్యప్రాప్తి నందజాలము. సత్యమన్నను, ధర్మమన్నను కేవ

లము చిత్తముయొక్క యద్భుతవ్యాపారమే కాని వేరొండు కాదు. బుద్ధగీతయం దీవిషయమయి యీచందమున లిఖియింపబడియున్నది. ధర్మము మనమునుండియే యుత్పన్నమగుచున్నయది. మనఃపు వాక్కార్యముల మనోపారిశుద్ధ్యముచే బరిష్కృతమొనరించుట యుక్తము. అప్పుడే ధర్మము "ధర్మో వర్ధతి వర్ధతే" యను గురుజనోక్తిని సార్థకమొనరింపగలదు.

మనశ్శుద్ధివలననే సౌఖ్యము లభ్యమగుచుండును. శ్రీబుద్ధగీతావాక్యము సరయుదము.

"మనసాచే పసన్నేన భాసతివా కరోతివా।
తతోనం సుఖ మన్వేతి ఛాయావ అనపాయినీ॥"

పరిశుద్ధంబగు చిత్తముతో సంభాషించినను, కార్యమాచరించినను కర్తవెనువెంటనే సౌఖ్యము ఛాయవలెనంటియుండును. అట్లు గావింపనిచో నీరీతి వాటిల్లునని వ్రాయబడియున్నది:

"మనసాచే పదుట్ఠేన భాసతివా॰ కరోతి వా।
తతోనందుక్ఖ మన్వేతి చక్కంచవహతో పదం॥"

అపరిశుద్ధంబగు చిత్తముతో భాషించినను, కార్యమాచరించినను కర్తపిఱుందనే, శకటము నీడ్చువృషభముల వెనువెంటనే చక్రము పరుగిడుచువచ్చు చందమున, దుఃఖమువచ్చు

చుండును. కర్తయగువా డుభయకార్యముల యొక్క పరిణామముల ననుభవింప గ్రిమమగా జన్మ చక్రమునబడుచు జన్మ రాహిత్యమునందు చుండును. హిందూశాస్త్ర మీావిషయమయి యిట్లు శాసించుచున్న యది. "అవశ్యమేవభో క్తవ్యం కృతంకర్మ శుభాశుభం." ఆద్యహిందూశాస్త్ర నీతి బౌద్ధనీతి కెంతమాత్రము భిన్నముగా లేదు. నిరంతర దుష్కార్యము చే బుద్ధి జడత్వమునను బొల్పడుటయే వాస్తవము. ముఖమాకృతి ననుసరించియే దర్పణమున బ్రతిబింబించు చందమున గార్యంబు ననుసరించియే బుద్ధి నిర్మితమగు చుండును. సుఖార్థులును, ధర్మార్థులును నగు వారలెట్టి వారలయియున్నను మనమును వశము గావించుకొన వలయును. హృదయమును సమస్త విధముల బాపములనుండి మరలించి పరిశుద్ధంబును, తేజస్సంపన్నంబును గావింపవల యును. ఇందువలననే శ్రీబుద్ధభగవానుడు విశ్వాసపాత్రులకును, సచ్చరిత్రులకును శీలగ్రహణమే యుక్తధర్మమని యాదేశించియుండెను. పరమోత్తమంబగు బౌద్ధధర్మమునందు "శీలమే" నిర్వాణముయొక్క ప్రథమసాధనమయి యొప్పుచున్నయది. శీలమే మానవుని చరితమును బలిష్ఠంబును సుసంఘటితంబును గావించివేయును. కనుక సాధనమార్గప్రయాణమున మార్గవ్యయమున కీశీలమే యుపయోగపడును. "సుఖం యాబజరాసీలం" జీవనావితముపర్యంతము శీలపాలనమే శ్రేయస్కరము.

బౌద్ధుల యొక్క "శీలముల" గూర్చి విచారించుచో మనకు బుద్ధదేవుని యసన్యసామాన్యంబగు ప్రతిభ వెల్లడికాగ లదు మానవుని బాహ్యాచారములను, వ్యవహారములను నియమితమొనరించు నీతిశాస్త్రభాగమును బుద్ధదేవుని శీలము లంతమాత్రము సుపేక్షసేయునని కావు. శ్రీబుద్ధాచార్యుడు మానవహృదయమును బరిశుద్ధమొనర్చు శుభమార్గమును గల్గియున్న నీతిశాస్త్రఖండముపై దీవ్రతరంబును, దీర్ఘంబును నగు దృష్టిపి బ్రసరింపజేసెను. ఐహికాముష్మిక సౌఖ్యాభిలాషచే నాచరింపబడు యజ్ఞయాగాదుల బౌద్ధనీతి నిష్ఫలంబనియు, నింద్యమనియు దెల్పుచున్నయది. ఇంద్రియ విజయమును, చరిత్రసంశోధనమును గావించు, దయాదాక్షిణ్యయుక్తంబును, ప్రేమబద్ధంబును నగు కల్యాణమయ వ్రతసాధనమొక్కటియే నిత్యానంద ప్రాప్తికి మూలమార్గము. ఇదియే శ్రీబుద్ధాచార్యుని సంకల్పము. పరిష్కృతంబగు చిత్తముద్వారా మానవులు కల్యాణమును బడయగలరు, బాహ్యానుష్ఠానంబున మనము పడయునది స్వల్పళక్కియె. శ్రీ బుద్ధదేవుని గీతావాక్యముల నరొక్కతూరి తిలకింపుడి:

"నతంమాతా పితాసయిరా అఞ్ఞేవాపిచఞాతకా।
పమ్మాప్రణిహితం చిత్తంసేయ్యసోతంతతోకరే।"

సమ్యక్పరిష్కృతంబగు చిత్తము కల్యాణమును మానవునకొనరించు చందమున జననీజనకులుగాని, తదితరాత్మీయులు

గాని గావింపజాలరు. విశ్వాసభాజనుండగు మానవుని చరిత్ర మును, కార్యమును, భావమును, బౌద్ధనీతి సౌభాగ్యప్రదంబులు గను, సౌఖ్యదాయకంబులుగను జేయుచుండును. బౌద్ధ సాధువు లేయవస్థయందును నిశ్చేష్టులయియుండ నభిలషింపరు. అహో రాత్రములు వారు సమగ్ర మానవజాతీయ కల్యాణమయ సాధనమునందే నిమగ్నులయియుందురు. వారు సర్వదా భావ ధానచిత్తులయి, సంకల్పితావస్థయందు చిత్తమునునిచి, సద్భా వములయందే యాత్మానందము నందుచుందురు. కల్యాణ ప్రాప్తికొఱకు సత్వరముముందంజవేయుట మానవునిధర్మము. పరిమత్తచిత్తముతో నెట్టులో పుణ్యకర్మల నాచరించినను మాన వునిచిత్తము పాపమునందే లగ్నమయియుండును.

బాహ్యక్రియా కలాపంబులకయి సత్యస్వరూపంబగు సమయమును, హృదయానందమును (Energy of mind) దుర్వినియోగము సేయరాదని దేవుడు చాటియుండెను. అశ్ర ద్ధచే నాత్మీయులచే బలాత్కారంబున నాచరింపబడు ప్రాణ హీనంబగు పుణ్యకార్యముసహితము నిష్ప్రయోజనమని యా దేవుడు చాటియున్నాడు. అనురాగపూర్వకంబుగ నాచరింప బడిన సుకృతము మానవులకు సౌఖ్యమును, శుభమును గలి గింపజాలదు. సద్భావమున్నపుడే ప్రేమయొదవును. అట్టిప్రేమ చే నాచరింపబడు సత్కార్యమే సత్ఫలదాయకంబు కాగలదు.

ఈవిషయమయి హిందూమతము సహితము భావము ననుస రించియే కార్యాకృతి యేర్పడునని వక్కాణించుచున్నాది—
"యద్భావం తద్భవతి, యాదృశీ భావనాయస్య సిద్ధిర్భవతి తాదృశీ భావగ్రాహీ జనార్దనః॥" కాన సద్భావముతోడనే మైత్రిచిత్తమును గల్గియుండి సత్కార్యము నాచరించు మానవుడే నిర్వాణమునందవచ్చును. నిరంతరము పుణ్యకార్యము నాచరించుచుండు మానవుని హృదయమునందు క్రమముగా నపూర్వానురాగ పుణ్యాచరణమునెడ నేర్పడును. శ్రీబుద్ధదేవుడిట్లు నుడివియున్నాడు:

"పుఞ్ఞే ఇఞ్ఞే పురిసోకయిరాకయిరా థేనంపునప్పునం।
తంహి ఛన్దంకయిరాథసుఖో పుఞ్ఞస్సఉచ్చయో॥"

పుణ్యానుష్ఠానము సత్వర సమస్త జనాచరణీయము. ఎల్లరు గర్తవ్యజ్ఞానసంజనిత ప్రేమచే నయ్యదాచరింపవలయును గాని పరానురోధంబునగాదు. ప్రతిమానవుడాత్మీయ మనోల్లాసంబుననే పుణ్యకార్యము నాచరింప గడంగుచుండవల యును. విహంగము మనోల్లాసతరంగము ననుసరించి గానము సేయువిధంబునను, పుష్పము సహజముగనే వికసించు చందమునను, నిర్మలానందముతోడను, సహజభావంబుతోడను కళ్యాణవ్రతమునందు నియుక్తుడగు మానవుడే యుద్ధరింపబడును. అభ్యాసముద్వారా పాశ్చాత్యుల ధర్మ

నీతిసెప్పు "Practice makes man perfect" యను చంద మునసే బౌద్ధనీతియు బుణ్యకర్మము నతివిశేషముగా నాచరింప నదియు, స్వాభావికమయి కళ్యాణదాయకంబగునని నుడువు చున్నయది. పుణ్యకార్యము పరిపక్వము కానంతపర్యంతము సాధుపురుషుడు పుణ్యకార్య క్షేత్రమునం దశుభలక్షణముల గనుచునే యుండును. కాని పుణ్యకర్మము పరిపక్వమయినం తనే పుణ్యకార్యాంతరాళమున శుభములే దృష్టిగోచరమగు చుండును. బాగుగా బచనమయిన యాహారము రక్తమాంస ముల బరివర్తనమయి దేహమందు మిళితమయిపోవు చందము ననె, నిత్యాభ్యాసంబున బుణ్యకర్మను బరిపక్వమొనర్చి చిత్త ము యొక్క సహజవ్యాపారముగ జేసివేయవలయును. అట్టిచో "బుద్ధిః కర్మానుసారిణి" యగుచు మోక్షము నొసంగును. అనగా మానవుడు తానాచరించు సత్కర్మ ననుసరించి బుద్ధి వికానముజెంది పరమానందమయంబగు మోక్షమును బ్రసా దించును. మనచిత్తము స్వాభావిక పుణ్యపరిభావిభూషితమయి నపుడే మననమస్తానుష్ఠానములు, ననంతర మపూర్వ కళ్యాణ దాయకంబులగును.

యథార్థముదిక్కునకు బౌద్ధధర్మము యొక్క యాసక్తి ప్రవాహము ప్రవహించుచున్నను, నీతిక్షేత్రమునం దీధర్మ భావమున కత్యుచ్చోత్తమాసనంబు నొసంగియున్నది. మా

ట్లాడునదెల్ల మనః పూర్వకంబుగను, జేయునదెల్లమనము నను సరించియు నుండుటయందే మహాద్భుతము దాగియున్నదని బౌద్ధ నీతి నవనీరద నిర్ఘోషనిందకంబగునినాదముతోడ గర్జించుచున్న యది. మనమునుండియే ధర్మోత్పత్తి గాగల్గినదని శ్రీ బుద్ధాచా ర్యుని సంకల్పము. ఇందుచే ధర్మము నభివృద్ధిసేయ నుం కించుటకుబూర్వ మద్దాని జన్మ స్థానమగు చిత్తమునే బరిపుష్టంబును, బరిశుద్ధంబును గావింప శ్రీ బుద్ధాచార్యు డుపదేశించుచున్నాడు. స్వీకరించు శీలము నిజేచ్ఛచేతనే బ్రవృత్తము గావలయునని దేవునియాజ్ఞ, శీలమును, విధివిధానముల నచలంబగు సీమాంతరాళము బంధిం ప ఫలముశూన్యమగునని దేవుడు చాటియున్నాడు. మానవ వుడు స్వీకరించు శీలములన్నియు స్వతంత్రములయి యుండ వలయును. ప్రజాసంఘమునుండి ధన్యవాదములను, సంస్తవ పాఠంబులను, ద్రవ్య లాభంబును పడయునిమిత్తము శీలముల నాచరించుట, న్యాయసంగతము గాదని బుద్ధాచార్యుడు రూఢిగ దెల్పియుండెను. ఉద్ధరింపబడ నభిలషించు మానవు డాచరింపనెంచు శుభకార్యము ననుష్ఠించుట శ్రేయోదాయ కము. సత్కార్యము జ్ఞానపూర్వకంబుగ నాచరింపవలయును. అజ్ఞానివలె జనుల నిరీక్షణయందుండి సాధువెపుడును సుకృ తము నాచరింపజనదు. శ్రీబుద్ధాచార్యుడీవిషయమయి యిట్లు సెలవిచ్చియున్నాడు :—

"అత్తదత్థమభిఞ్ఞాయ సదత్థపసుతోసియా"

మానవుడు తానాచరించు శుభకార్యమును బాగుగా నెఱింగి, తదాచరణమునందు బ్రవృత్తుడగుట శ్రేయస్కరము. పరిశుద్ధంబగు చిత్తమునుగల్గియుండని వ్యక్తికి బాహ్యముగా నెట్టిశ్రేయము లభ్యముకాజాలదు. శ్రీబుద్ధాచార్యుడు ముముక్షువుల కొకదివసంబున నీవడువున నుపదేశించియుండెను:—"మీరు క్రోధమును విసర్జించివేయుడి. చిత్తసంయమ వ్రతపరిపాలనము నేమరకుడి. దుష్కర్మాచరణమునుండి చిత్తమును విముఖముగావించి మనముద్వారా సత్కర్మల నాచరించుడి. మనోవాక్కాయ కర్మలసంయమంబును గల్గియుండువాడే యజేయుడనబఱగు. ప్రేమచే గ్రోధమును, శుభముచే నశుభమును, నిస్స్వార్థభావముచే స్వార్థాంధతను, సత్యముననసత్యమును దెగటార్చుటహితకరము; అపకారమునకు మారుగానుపకారము నెల్లవారికి జేయుచుండుడి." శ్రీబుద్ధాచార్యునియీవాక్యములయం దెంతయుశుభోదావహంబగునీతియు ధర్మపరిజ్ఞానసారాంశమును మూర్తీభవించి యున్నవి. హితోపదేశవాక్యములన్నియు శ్రీబుద్ధగీతయందు వ్రాయబడియున్నవి. కాన మరలవానిని సంక్షిప్తముగ నయిన లిఖియింపబూనుట చర్వితచర్వణముగ నుండును. విశాలతమంబగు నీవిశ్వమందు వ్యాప్తమయియున్న సకలమతములయందు వెలయు సాంఘిక, నైతిక, ధార్మిక, పారమార్థిక హితోపదేశవాక్యము లీబౌద్ధ

స్థితియందున్నయవి. క్రీస్తుభగవానుని చందముననే చిత్తమును నిష్పాపమొనరించి తండ్రియగు దేవునిసన్నిధి కరుగుటకు వల యునన్న సద్గుణములను, సద్వృత్తులను శ్రీబుద్ధాచార్యుడు సహితమీపరికాగము వాకుశిచ్చియున్నాడు:—జీవహింససేయ రాదు; నీది కానట్టియు, బదులచే నీకొసంగబడనట్టియు పదార్థ మును స్వీకరింపకుము; వ్యభిచరింపకుము; అసత్యమునకు బొల్పడకుము; మద్యపానము సలుపవలదు; దృష్టిని నిర్మల ముగా నునిచికొనుము; స్వీయసంకల్పమును సత్యయుతము గావించుకొనుము; యథార్థమగువచనములనే భాషింపుము; సాధువ్యవహారమును గల్గియుండుము; సద్వృత్తిచే జీవికను నిర్వహించుకొనుము; ఉత్తమప్రయత్నములనే యాచరించు చుండుము; సద్విషయకచింతన సలుపుచుండుము; పరిశుద్ధధ్యా నముచే జిత్తమును సమాధిస్థము గావింపుము." దేవుడు నిర్వాణపదము ననుసరించువారల సంబోధించి యొకమా రిట్లుద్బోధించి యుండెను. ఇందెట్టి దూరదర్శిత్వము; ఐహిక పారిశుద్ధ్యము; స్వపరవికాసయుక్తంబగు ధర్మవిధాన మం తర్గర్భితమయి యున్నదో పాఠకభ్రాతలారా! విచారించుడి!

"నాయకులారా!

(1) సదాధ్యవసాయమున నార్జించిన సుకృతమును నిరంతరము సంరక్షించుకొనుడి.

(2) నిత్యము నవీనంబులగు పుణ్యముల సముపార్జింప యత్నింపుడి.

(3) పూర్వసంచితంబులగు సమస్తపాపముల విధ్వంసమొనర్చుడి.

(4) నూతనంబగు పాపముదండెత్తి వచ్చి మిమ్మాక్రమింపకుండునటుల మీరు సావధానచిత్తులరయి మనుచుండుడు.

ఉపర్యుక్తములగు నైతికనిషేధముల నైదింటిని బౌద్ధసాధకులు "పంచశీలము"లనిచెప్పుదురు. బౌద్ధులు మోక్షప్రాప్త్యర్థమనారతము "పంచశీలములను,అష్టశీలములను దశశీలములనుస్వీకరించుచుందురు.శీలమును బౌద్ధులు నిర్వాణోపలబ్ధికి బాధేయముగ నెంచుచుందురు. శీలపాలనమువలననే వారు కల్యాణమును బడయుచున్నందున నెల్లశీలములకు "మహామంగళములనియు కుశలములనియు" నామములనొసంగి యున్నారు.

మానవుని హృదయమునందుగూడి ఘనీభవించియున్న పాపమును అస్థిరత్వమును సత్యప్రాప్తికి బ్రతిబంధకములగుననియు నాపాపమనెడి మనస్సుయొక్క మాలిన్యమే యవిద్యయనియు శ్రీబుద్ధాచార్యుడు నుడివియున్నాడు. సమస్తమాలిన్యములకంటె సత్యసాక్షాత్కారమున కవాంతరమును గల్పిం

మ నీపాపాస్థిరత్వముల యొక్క కల్మషమునే—యీ యవి ద్యసే మహానికృష్టమని దేవుడు సృష్టీకరించియున్నాడు. ఈ విషయమయి దేవుడిట్లభిప్రాయము నొసంగియున్నాడు:—

"తతో మలా మలతరం అవిజ్జాపరమం మలం।
ఏతం మలం పహత్వాన నమ్మలా హోథ భిక్షవో॥"

మాలిన్యములలోని కెల్ల గడునీచమయినయీయవిద్యా క్షయమునే యభ్యుత్థానమునభిలషించు సాధువులెల్లరు బడయు టవసరమయి యున్నది. ఓభిక్షువులారా! మీర లీయతినీచతమం బగు మాలిన్యమును దూరముసేయుడి. ఈయవిద్య యనెడి కల్మషమునే శీఘ్రము దొలగించి చిత్తముల నిష్పాపంబు లుగను, బరిశుద్ధములుగను గావించుకొనుడి. అపుడే మీకు సకలమున కాద్యంబును, సర్వవ్యాపకంబును, సచ్చిదానంద యుక్తంబును, అనూనాపూర్వ తేజస్సంపన్నంబును నగు విరాట సత్యము యొక్క సత్యస్వరూపము దృగ్గోచరంబగును. శ్రీ బుద్ధదేవుని కనంతరమువాడగు శ్రీయేసుక్రీస్తు భగవానుడు సహితమిట్లే యుద్ఘోషించియుండు టెంతయునానందదాయకము. "Blessed are the pure in heart, for they shall see God." నిర్మలంబగు హృదయముగలవారు సర్వేశ్వరసాక్షాత్కా రమును బడయుదురుగాన వారుధన్యులు! సకలమతముల యం దున్న సర్వోచ్చాదర్శములు బౌద్ధనీతియందుండు టెంతయు నాశ్చర్యకరము.



## బౌద్ధగృహస్థులు; గృహిణులు

బౌద్ధధర్మము సంసారమందలి సకలజనులను, స్త్రీ పురుష భేదంబులేక సన్యాసవ్రతమును స్వీకరింపవలసినదిగా శాసించి యుండలేదు. అయ్యది సన్యాసమును హృదయపూర్వకంబుగ నాహ్వానించియుండి యున్నను, గృహస్థాశ్రమమును సహితము సన్మానించియేయున్నది. శ్రీబుద్ధాచార్యుడు బౌద్ధపరివ్రాజకుల సంబోధించి, ప్రత్యేకముగా బోధించియున్నను గృహస్థులను గృహిణుల నుద్దేశించి ధర్మసిద్ధాంతముల నుపదేశించియుండకపోలేదు. ఆదేవుని గ్రంథములయం దెన్నియో ప్రత్యేకించి గృహస్థాశ్రమవాసులకును, వాసినులకును బ్రయోజనార్థము వ్రాయబడియున్న ధర్మోపదేశములు జీవకళాయుక్తములయి వెలయుచున్నవి. ప్రపంచమందలి సమస్త సంప్రదాయములకును, జాతులకును నుపయోగించు చందమున బౌద్ధధర్మ గ్రంథస్థితోపదేశములు శ్రీబుద్ధముఖ నిర్గతములయియుండు టెంతయు శ్రేయోదాయకము.

శ్రీ బుద్ధదేవుడు గృహిణుల నుద్దేశించి యిట్లు నుడివియున్నాడు:—ఓ గృహిణులారా! మీ రాత్మీయ నికేతనముల శుభోజ్జ్వల ప్రకాశముచే బ్రదీప్తములు గావించుడి, గృహముల జతుర్దిక్కులనుండి మంగళపరంపరలచే సురక్షితములు గావింపుడి. సత్వశూన్యంబులగు బాహ్యకర్మ కలా

పములచే మీాసదనము లెంత మాత్రము రక్షింపబడజాలవని గుర్తెఱుంగుడి.

"ఓ గృహస్థులారా! మీారు స్వకీయ మాతాపితల సేవాశుశ్రూషల శ్రద్ధాభక్తుల సలుపుడి. వారి ధనధాన్యసంపద్విశేషముల సంరక్షించుడి. సమస్తవిధముల వారల కుత్తరాధికారులగుటను వలయు యోగ్యతను బడయుడి. జననీజనకులు తనువులెడబాసినంతనే శ్రాద్ధపిండ ప్రదానాది బాహ్యకర్మానుష్ఠానంబుల నల్పత్యాగంబులజేసి మనస్తృప్తిజెందక శ్రద్ధాసహితంబుగ వారల సంస్మరించుచు, వారి చిత్తశాంతికయి నవీననవీనంబులగు పుణ్యముల సముపార్జించుడి. ఇట్లాచరించుటం జేసి మీాగృహము యొక్క యొకభాగము సురక్షితమయి యుండగలదు.

"ఏపుణ్యపురుషాగ్రేసరుని నిర్వ్యాజవాత్సల్యంబున మీా జ్ఞానచక్షురింద్రియములు తెఱవనేర్చినవో యట్టి గురూత్తముడు ప్రత్యక్షమయినంతనే కూర్చునియున్న మీారు లేచి నిలువబడి వారికి భక్తిపురస్సరంబుగ వందనము లాచరించి, వారికి యథోచితసేవల జేయుడి. వారి యాజ్ఞాపాలనమునం దేమరకయుండుడి. శక్తికొలది వారి యభావముల దూరము సేయుడి. వారుపదేశించు బోధలనెల్ల హృదయపూర్వకంబుగ నాకర్ణింపుడి. ఇందువలన మీాగృహము యొక్క రెండవభాగము సురక్షితమయి యుండగలదు.

"మీకు సహధర్మిణియు, సహకర్మిణియు, సహభోగినియు నయియుండు వనితాలలామయెడ నాదరమును గల్గియుండుడి. విశ్వాసఘాతుకత నెపుడు సేయవలదు. మీయెడ శ్రద్ధాభక్తులగల్గి మెలఁగుచందమున గృహిణులుండులాగున మీరుత్తమకార్యముల నాచరింపుడు. వారికి వలయు వసనాలంకారముల నొసంగి వారిహృదయముల సుప్రసన్నముల గావింపుడి. మీ పుత్రపుత్రికల బాపమయకార్య క్షేత్రమునుండి విముఖుల గావించుచుండుడి. వారికి ధర్మవిజ్ఞాన శిల్పములగూర్చి బోధింపుడు. వారల మీసంపదల కుపయుక్తులగు నుత్తరాధికారులుగ జేసికొనుడి. ఇట్లాచరించుచో మీ గృహముయొక్క మరొక్కభాగము కల్యాణముచే సురక్షితము కాగలదు.

"మీకాత్మీయులును స్వజనులును, మిత్రులునునగు జనులతోడ వాత్సల్యమునుగల్గి వర్తించుచు, మధురభాషణములచే వారినానందపరచుడి. వారికుపహారములనొసంగుచుండుడి. శక్తికొలది వారికి హితమునే సేయుచుండుడి. మిమ్ము మీరు ప్రేమించుకొను చందముననే వారల సహితము మీసమానులుగా భావించి ప్రేమింపుడి. మీధనమందలి కొంతయంశమును వారికి బ్రదానముసేయుడి. వారిని కుమార్గములనుండి నిరోధించుచుండుడి. వారు దారిద్ర్యమునకు బాల్పడుచో విత్తమునొసంగి సన్మానింపుడి. నిరాధారులగుచో నాశ్రియ

ము నొసంగుడి. వారి పరిజనులతోడ సద్వ్యవహారమునుగల్గి వర్తింపుడి. ఇట్లాచరించుచో మీగృహముయొక్క పడమటి భాగము మంగళముచే రక్షింపబడగలదు.

"పరోపకారనిమిత్తము స్వీయసుఖోపభోగముల ద్యజియించినట్టియు, నిరపేక్షాభావముతో సకలజీవుల హితమును సలుప యత్నించుచుండునట్టియు సాధువులయొక్కయు, సజ్జనులయొక్కయు సేవాశుశ్రూషల మనోవాక్కాయకర్మల నేయుచుండుడి. వారి కాహారపానీయ వస్త్రాదుల నొసంగుడి. వారిని మీగృహముల కాహ్వానించి, యాతిథ్యము నొసంగి సత్కరింపుడు. ఇట్లు సేయుటవలన మీగృహముయొక్క యింకొకభాగము శుభముచే రక్షింపబడగలదు.

"త్రికరణంబుల మీసేవ సలుపునట్టియు మీప్రసన్నతకయి సర్వదా యత్నించునట్టియు దాస దాసీజనములవలన నుచితసేవలగొనుచు, భోజనవేతన పారితోషికాదుల బ్రసాదించి వారిని పోషింపుడి; మీరారగించు నాహారమందు కొంచెముభాగము ప్రేమపూర్వకంబుగ మీభృత్యులకొసంగుడి; మధ్యమధ్య మీదాసదాసీజనములకు విశ్రాంతినిమిత్తము కార్యమునుండి విముక్తినిచ్చి వారిచిత్తముల కానందము నాపాదింపుడి; వారు వ్యాధిగ్రస్తులగుచో వారిచికిత్సకును, పథ్యపానాహారములకును వలయు సౌకర్యముల జేయుచుం

డుడి; ఇందువలన మీాగృహము యొక్క యవశిష్టభాగము మహా మంగళము యొక్క దివ్యదీప్తితో జగజ్జేగీయమానము కాగలదు."

శ్రీ బుద్ధాచార్యుడు జననీజనకులను, గురువును దేవతుల్యులుగ భావించి యారాధించుటకును, సహచరులను, బంధువులను, విశ్వాసపాత్రులుగనెంచి యాదరించుటకును, భృత్యులఁ బుత్రవాత్సల్యంబున బ్రేమించుటకును, సాధువులును, లోకోపకార పారీణులును నగు జీవన్ముక్తుల బూజించి పోషించుటకును హిందూధర్మాదర్శ గ్రంథములగు శాస్త్రాదులును, పురాణాదులును శాసించి యున్నటులే, మానవజాతి కుపదేశించుటంబట్టి విచారింప బౌద్ధమునందును, హిందూధర్మమునందును నీషణ్మాత్రమయిన భేదంబు లేనట్లును, మధ్యయుగంబున నజ్ఞానము యొక్క పరిణామంబగు జాతి విద్వేషము చేత బ్రబలియున్న కాలుష్యమే కించిన్మాత్ర తారతమ్యము నుదయింపజేసినట్లును దెల్లమగుచున్నయది.

సమస్తజనులచే ఆస్తికంబని భావింపబడు హిందూమతము యొక్క జ్ఞాన కర్మ ధర్మములే మతపరిజ్ఞానశూన్యులగు హిందువులచే నాస్తికంబుగ భావింపబడు బౌద్ధధర్మమునందును షోడశకళలచే జీవకళాస్ఫూర్తిని గల్గి వెలయుచుండు టెంతయును శుభావహము. పాఠకభ్రాతలారా ! బౌద్ధమతకర్త

యగు శ్రీ బుద్ధాచార్యు డెటుల గృహస్థుల సంబోధించి కృతి మహిందూ ధర్మశాస్త్రకర్తలకు దలపంపు లగునట్లు సర్వజన హితప్రదాయకంబులగు ధర్మసిద్ధాంతముల నుపదేశించు చున్నాడో యాలకింపుడి :— “ఓనా ప్రియగృహస్థులారా! ధర్మమును హృదయపూర్వకంబుగ నభిలషించువారే విజయులు; ధర్మము నేహ్యదృష్టి నరయువారే పరాజితులు. దుర్జనప్రియులును, సాధుస్వభావము నెడబాసి, దుర్జనులకు జేదోడు వాదోడుగా నుండువారును శీఘ్రకాలమునందే పరాభవింపబడుదురు. అసంఖ్యాకుల సాంగత్యంబునం దుండియు నిష్ప్రయోజకులయి, ఉద్యమదూరులయి, సాహసహీనులయి జీవితముల వ్యతీతము సేయువారును, క్రోధోన్మత్తులయి మనువారును తప్పక దీరని పరాభవమునకు గురియగుట నిక్కువము. ధనధాన్యైశ్వర్యముల కధిపతులయి యుండియు మాతాపితల భరణపోషణాది బాధ్యతల వహింపనట్టి వారలవశ్యము పరాభవాగ్నిం బడి మ్రగ్గుట వాస్తవము. సాధువులను, సజ్జనులను మిథ్యాభాషణంబుల మోసగించువారు పరాభూతులగుటయే యథార్థము. అశేషంబులగు ధనధాన్యైశ్వర్యముల కధిపతులయి యుండియు, స్వార్థాంధులయి స్వసుఖోపయోగార్థము భోగోపకరణముల నార్జించుకొను విలాసపరులవశ్యము బరిభవింపబడుదురు. ధనగర్వంబునను, కులాభిమానంబునను, వంశగౌరవంబునను మదాంధులయి బంధు బాంధ

వుల నీర్ష్యాగ్రుక్కుల వీక్షించు ధూర్తు లతిసత్వరము పరా భూతులగుదు రనువాక్కు సత్యేతరముగాదు. దివారాత్రములు వ్యభిచార మద్యపానద్యూతముల మగ్నులయియుండు ధర్మ భ్రష్టులు పరాభవమునకు వశులగుదురు. ఆత్మీయ ధర్మ పత్నులపట్ల నౌదాసీన్యము నవలంబించి పరదారలతోడ స్నేహ భావంబున వర్తించునట్టియు, తమకున్న నైశ్వర్యంబుల మన స్తుష్టిజెందక సామ్రాజ్యముల బడయవలయు ననియెడి తృష్ణ యను పెనుభూతమునకు వశవర్తులయి చెలంగు మూర్ఖులు, లోభులు తీరని పరాభవానలజ్వాలల దగ్ధమగుటయే వాస్త వము."

మన బుద్ధాచార్యుని సకల ధర్మగ్రంథముల నెల్లదుత సిద్ధాంతములు ననుసరించుచు నేయున్నవి. ఈవిషయమున ధర్మ పరిజ్ఞానమును గల్గియున్న పాఠకభ్రాతలే మద్వాక్యమును యథార్థమని తెలియగలరు.

గృహమునునలు దెసలనుండి శుభకర్మములచే సురక్షితము గావించుకొనునిమిత్తము శ్రీబుద్ధాచార్యుడు గృహస్థుల కుపదే శించిన ధర్మవాక్యముల పారిశుద్ధ్య మటులుండ నా దేవుడు సమ స్తగృహస్థులకును బాహ్యాభ్యంతరిక పుణ్యముల యొక్కయు శుద్ధియొక్కయు కవచములచే సంరక్షించుకొను సదుపాయ మును సహితము నిర్వచించియుండెను. దేవుని బాహ్యాంతరిక

శుద్ధివిధానము లెంతయు బ్రశస్తములు! అతడు గృహస్థుల నుద్దేశించి యిట్లుపదేశించి యున్నాడు:—'ఓనాగృహస్థభ్రాత లారా! మీరు గృహధర్మ పాలన భారమును వహించు తరుణమునందు గృహత్యాగులగు పరివ్రాజకులవలె వ్రతానుష్ఠానముల నాచరింప నసమర్థులగుదురు. కాన సాధువుల (సన్యాసులు) నుండి భిన్నములగు ధర్మోపదేశవాక్యముల గొన్నింటిని జేర్కొనుచున్నాడ. ఈసిద్ధాంతవాక్యముల మీరతిశ్రద్ధాభక్తుల నాచరించుచో నుత్తమ (సాధు) గృహస్థులు కాగలరు :—

"మీ రేస్థితియందును జీవహింస సేయకుడి. అన్యుల జీవహింసకు బ్రేరేపింపకుడు. పరులుకావించు జీవహత్యల కామోదింపకుడి. అనగా మీరలేహింసకును గర్తలుకాని, ప్రేరేపకులుకాని, అనుమోదములుకాని గావలదు. సబలనిర్బలంబులగు ప్రాణులవేనిని హింసింపకుడు. అహింసయే మీ పరమ ధర్మము. మీది కానట్టి పదార్థమును పరులు మీకొసంగనిదే స్వాయముగా మీరుకాని, పరుల సాహాయ్యంబునగాని స్వీకరింపవలదు. సమస్తవిధములగు చౌర్యవృత్తులనుండి మిమ్ము మీరే సంరక్షించుకొనుడి. పరజనపదార్థాపహరణము నింద్యము.

"జ్ఞానముగల గృహస్థు డబ్రహ్మచర్యత్వమును మండుచున్నప్రచండానలముగ భావించి యద్దానినుండి దూరముగనే

యుండును. అనగా సట్టివాడు స్వీయేంద్రియముల వశపఱచు కొని నింద్యంబులగు నేయయుక్తకార్యముల నాచరింపగడం గడు. మీరు మీపరివృత్తులపై సంపూర్ణాధికార విజయమును బడయలేకపోయినను వ్యభిచారవృత్తికి బాల్పడకుడి. స్వయముగా మీరసత్యమును భాషింపక, యన్యుల నసత్యభాషుల గానీయకుడి. ఏయవస్థయందును మిథ్యాభాషణపక్షమును మీరు సమర్థింపపలదు. సమస్తప్రకారముల యొక్క మిథ్యాపరివృత్తుల సంపర్కమునుండి విముఖులయియుండుడి. సద్ధర్మముపై మీ కీషణ్మాత్రమయిన విశ్వాసమేయున్నచో విస్మృతినయిన మద్యాదిమాదక పానీయముల ద్రావవలదు. ఏకారణంబునను బరులకు మద్యమును బానముసేయ బోధింపకుము. అన్యుడెవ డయినను ద్రావుచున్న మీరందుల కామోదింపకుడు. మద్య పానంబున నున్మత్తులయి, రజోతమోగుణము లుద్రేకింప నసంఖ్యాకు లెన్నియోపాపకార్యముల నాచరించియున్నారు. మద్యపానాభిరతులగు నజ్ఞానులు స్వయముగా దాము భ్రష్టత్వమునకు బాల్పడి, యన్యులసహితము మద్యము ద్రావజేసి వారల నున్మత్తులగావించి వేయుదురు. సమస్తపాపముల కావాసభూమియగు సురాపానమే మానవుని నాశపఱచు చున్నను దీనిని దుర్జనులే విశేషించి ప్రేమించుచుందురు. మీర లీపాపమయ నాటకమున బ్రవేశింపవలదు. కామోత్పా దకంబులగు చందనకర్పూరాదికముల స్వీకరింపకుడు. పుష్ప

మాలికల ధరింపకుడి. సుగంధవస్తువుల నిరసింపుడి. కోమలంబులగు సెజ్జల బవ్వళింపకుడి. నశ్వరంబులును నష్టకష్టదాయకంబులును నగుభోగవిలాసంబుల పిఱుందనే మీరుపరుగిడకుడు." శ్రీబుద్ధాచార్యుని యీ గవ్యాష్టోపదేశముల మన నైతికధర్మ సిద్ధాంతంబులన్నియు ననుసరించుచున్నయవి. దేవుడహింసా పరమోధర్మంబను సిద్ధాంతమును, సప్తవ్యసన నిషేధమును గృహస్థులకు ముఖ్యధర్మములుగా నుపదేశించి వైదికమత గౌరవమును సంరక్షించినాడు.

శ్రీబుద్ధాచార్యు డింకనేరీతి బౌద్ధగృహస్థ ప్రపంచమున కుపదేశించుచున్నాడో విచారింతము! "ఓ నాప్రియ మయిన గృహస్థ సహోదరులారా! మీరు పరమకల్యాణమును బడయవాంఛించుచు సత్వరము శక్తివిహీనులయి యున్నవృద్ధులసేవనే ముఖ్యముగా సలుపుడి. పరులబుద్ధివికాసము నవలోకించి మీరలీర్ష్యాళురు కావలదు. ధర్మమందే నిరంతరము బరమాహ్లాదము నందుచుండుడి. ధర్మమునందే మీచిత్తముల ప్రేమబీజము లంకురించుగాత! ధర్మజ్ఞానప్రాప్తికయి మీచిత్తోత్కంఠత పెంపొందుగాత! ధర్మమునందే మీచిత్తములు లగ్నమగుగాత! (శ్రీ బుద్ధాచార్యుని యీ ధర్మవాక్యములు హిందువుల—ధర్మేణహీనాః పశుభిఃసమానాః।ధర్మోవర్ధతివర్ధతే। యతోధర్మస్తతో జయ-మ్మనువాక్యముల నుద్దీపింపజేయుచుండ బౌద్ధమును నాస్తికమను మూఢహిందువుల నేమనగవచ్చు?

బౌద్ధధర్మ వాక్యములే మూర్తీభవించిన హిందువులతిప్రియా ర్హాంశము లయియుండ మనవారు జేలలగుదురేల?) అస త్య ప్రియత్వము ను గూలద్రోసి, మృదుమధురంబగు సత్య భాషణంబునకు గడంగుడి. గురువులగు వారిచెంతకు యథో చిత సమయంబుల నేగుచుండుడి సమస్తవిధములగు నుద్దండ తను, ఔద్ధత్యమును, హఠమునుబాసి వినమ్రులయి, భక్తిభా రావనత మస్తకులయి వారిసమక్షంబున గూరుచుండుడి. మంగ ళములనే నిరంతరము స్మరియించుచు నభ్యాసవశంబున మీ రు సహిత మూమంగళాకారములుగ బరివర్తన మయిపోవుడి. మీరు కపటవ్యాహారచనానైపుణిని, కాఠిన్యమును, లోభము ను, మోహమును, అహంకారమును మహాపాపంబులుగ నెఱిం గి సత్వరత్యాగమే శుభంబని గ్రహించి బహిష్కరించివేయు డి. సద్ధర్మముచే మీహృదయములుప్రసన్నములగుచో మీరు శాంతి, ప్రేమ, ధ్యానములయందు మీచిత్తముల నవస్థితములు గావించుకొన సమర్థులయ్యెదరు. రూపభేదంబుచే బశుపక్ష్యాదు ల కంటె మానవుడుత్తముడు గాక జ్ఞానాధిక్యతచేతనే కాగల్గిన ట్లు మతమును, ధర్మమును మూత్రపురీషాదులతోనిండినశరీర మును గల్గియుండి బృహద్రూపంబున వెలయునొక్క పురుష వరేణ్యుడే మాకుద్రోడుసీడయగు దేవుడనుటకన్న నతడు పరి శుద్ధుడని గ్రహించి,, ఆ పరిశుద్ధుని బడయుటకు బ్రథమకర్త వ్యంబగు జ్ఞానసముపార్జనమును, సద్గుణగణసంపాదనము సేయు

టయే శుభప్రదంబు కదా! దేవా! దేవా! యని బాహ్యంబున కాసర్వేశ్వరుని స్మరించుచు నీచకార్యంబుల సలుపు హిందూ ధర్మంబుకన్న నీశ్వరా! సర్వేశ్వరా? యని వాచాలత్వమును బ్రదర్శింపక భక్తిచే పారమార్థిక జీవితమున కనువగు సద్గుణములచే నొప్పుగృహస్థులచేతను, సన్యాసులచేతను విరాజిల్లు బౌద్ధమతమే సర్వోత్తమంబుకదా!

---

## బౌద్ధనీతి.

దుఃఖాస్తిక్యము మహాసత్యము. మానవ జీవితము యొక్క యపరిహార్యంబును, అనంతమును, అసహనీయంబును నగు దుఃఖమును సిద్ధార్థుడు పూర్ణముగా గ్రహించిన తత్క్షణమే భోగవిలాసములనుండి విముఖుడయి, భిక్షుచర్యమును స్వీకరించెను. సాధారణమానవు డిలాతలంబున నపారమగు దుఃఖము ననుభవింపవలసియుండునని యతడు గుర్తెఱింగెను. ఒక దుఃఖమాక్రమించి మానవహృదయము నుట్టూతలూగించి, యతని సుఖశాంతి మందిరమును భగ్నమొనర్చివేయుచుండగనే మరొక్క దుఃఖమావిర్భవించి మానవుని నఖశిఖాగ్రి పర్యంతము దుఃఖాబ్ధి ముంచివైచును. సాగరమందలి వీచికాపరంపరగల యుత్థానపతనంబుల బోలియే యీజగమున దుఃఖపరంపర లుద్భవమగుచుండును. నిరంతర మీదుఃఖపరంపరలు

మానవుని వెంటనంటియే యుండుచుండును. దుఃఖతరంగోదయమున కంతముగాని విశ్రాంతికాని లేదు. సిద్ధార్థుని హృదయమునం దపరియత్నముగా నీదుఃఖమునకు హేతువదేమి యనుపరిశ్న యొదవెను. మానవు డాత్మశక్తి నాధారముగ గైకొని యీదుఃఖజాలమును నిర్మూలింప సమర్థుడగునా! ఏయుపాయస్వీకృతిచే నీదుఃఖ మంత మొందును? యనుప్రశ్నలే సిద్ధార్థునిహృదయంబున వాటిల్లెను.

సామాన్యమనుష్యుడు తనవ్యక్తిత్వము యొక్క గుప్త తత్వముల గుర్తింపజాలడు. ఈజీవితమంతరించినంతనే వాడెట్టి పరిణామమును బడయునో చిత్తమునందయిన, నూహాపోహాల నయిన జూచియుండడు. సాధారణ మనుష్యులు తమ యెట్టి కార్యము, ఎట్టివచనము, యెట్టి భావ మెట్టి పరిణామము యొక్క సృష్టిని రచియించుచున్నదియు గ్రహింపజాలరు. వారి యీమానవదేహ మెందునిమిత్త మావిర్భవించినదియు, యీ ప్రస్తుతంబగు వ్యక్తిత్వమెట్లు వారికి లభ్యముయినదియు వారు గుర్తించియేయుండరు. మానవు డాత్మవిషయంబును గుర్తెఱుంగకయే యాత్మీయస్వత్వ సంరక్షణార్థము తత్తరపడుచుండును. అంధునకు స్వయముగా మార్గావలోకన సామర్థ్యము లేకయున్నను సతడెటుల హస్తదండము నాధారముగ జేసికొని తడుముకొనుచు కేంద్రమును సమీపించునో, అదియే చందమున మానవుడు సహితము జీవితపథమున జరింపుచుం

డును. మానవుడు సత్యరక్షణనిమిత్త మీజీవితసంగ్రామరంగ మునం దశేషదుఃఖము ననుభవించుచున్నకొలదియు జ్ఞానపాఠ ముల నల్పముగనో యధికముగనో యభ్యసింపుచునే యుం డును, వాని కశేషదుఃఖానుభవము, వెంటనే సుఖానుభవంబు సహిత మల్పముగ లభ్యమగుచుండును. మానవజీవితము సుఖ దుఃఖమయమయి పులగమువలె నుండును. చంద్రుని కళలు హెచ్చుచు తగ్గుచుండు చందమునను, తరంగము లుదయ మయి యస్తమించువిధంబునను మానవజీవితమునం దెపుడును సుఖదుఃఖోదయాస్తమయము లగుచుండు.

దుఃఖాస్తిక్యమును గూర్చి సందేహించు మానవుని యదూరదర్శిత్వము వెల్లడియగుచుండును. సమగ్రసంసారము నుండి తన్ను బ్రత్యేకించుకొని మనుష్యుడాత్మీయంబగు సాధారణ సత్వమును సంరక్షించుకొన యత్నించునపుడే యతడపారంబగు దుఃఖము ననుభవింపగలడు. ప్రపంచము నందు వెలయు సంయోగ వియోగముల యొక్క యమోఘం బగు నియమమును మానవులేకాదు దేవతలయినను భంగ పఱచజాలరు. ఏశక్తి సమూహంబుయొక్క సమాగమనంబున నొక్క స్వతంత్రసత్వ ముద్భూతమయినదో యాశక్తిసమూహ మొకానొక దివస మవశ్యము శిథిలముకాగలదు. ఏనిముస మందు నవీనంబగు నొక్క సత్వము సృజియింపబడునో, ఆని ముసమందే జరావ్యాధి మరణముల ధర్మమగు కార్యలీల

యద్దానిపై ప్రారంభమగును. మానవుని సత్వమొక నిర్దిష్టసీమ యం దాక్రమింపబడియున్నది. సీమయందు తావునసే యవిద్యయు, నవిద్య కలస్థానమందే దుఃఖము నిరంతరము విద్యమానమయి యుండును.

మానవుడెపు డొక్క స్వతంత్రమగు సత్వమునుబడ యునో, అపుడే యతనిచిత్తంబును జ్ఞానేంద్రియ పంచకంబును విముక్తమార్గంబున బాహ్యవిశ్వ ప్రకృతియందు తమప్రభా వమును వ్యాపింపజేయ మొదలిడును. వీనియొక్క పరిణా మంబుననే మానవుని చిత్తమునందు వేదనాసంచార మారంభ మగును. ఈవేదనయే తృష్ణయొక్క యనేకరూపంబుల బ్రత్య క్షమగును. మానవు డెన్నివిధంబుల బ్రయత్నించినను విశాలత మంబగు తనయీ తృష్ణను సంపూర్ణము గావించుకొనజాలడు. చిత్తమున కధికప్రియంబుగ దోచిన పదార్థము సర్వకాల సర్వావస్థలయందును మానవునకు లభింపజాలదు. మనమున కప్రియంబుగ బ్రతీతమగు పదార్థమును మానవుడు పరిత్య జించివేయ నభిలషించుచుండ నద్దానిని నరుడు పదపదమున గ్రహింప బాధ్యుడగుచుండును. తృష్ణయను పెనుభూతము నకు వలయు నాహారమును సిద్ధపఱచుటయందు మానవునకు గల్గు నసామర్థ్యమే దుఃఖమునకు మూలహేతువగుచుం డును. ఆత్మ పరిచయమునెంచని మానవునితృష్ణ వసంత ఋతువునందలి లతికవలె నభివృద్ధిజెందుచుండును. తృష్ణాభిభూ

తుండగువ్యక్తి యొక్క దుఃఖ మనుదినము వృష్టిజలసించితంబగు పచ్చికవలె వృద్ధియగుచుండును. తృష్ణాధీనుండగు వ్యక్తి జాల గ్రస్తంబగు శశకమువలె బంచేంద్రియములును, పంచవిష యంబులును నను బంధనములచే బంధింపబడి చీటికిమాటికి దుఃఖము ననుభవింపుచుండును. అవిద్యచే మానవుడు సంసారమునుండి తన్నొక స్వతంత్రునిగ భావించుకొనుచుండును, వాస్తవమరయ నత డీయనంతసంసారసాగరమునం దొక్క క్షణ భంగురంబగుబుద్బుదమె. స్వాభావికంబుగనే మానవునకు భూతభవిష్యద్వర్తమానకాలముల యొక్క చేతనాచేతనంబులగు సకలపదార్థములనుండి తానొక స్వతంత్రుడయి యున్నటుల స్ఫురించుచుండును. ఈయజ్ఞానమున కధీనుడయినంతనే మానవుడు నిజతుచ్ఛ వ్యక్తిత్వము యొక్క సుఖసాధనము నిమిత్తము ఘోరకృషి సలుపుచుండును. ఘోరతరపరిశ్రమచే వానికి సాధారణంబగు సుఖసామగ్రి లభ్యమయినను వాని తీవ్రతరంబగు తృష్ణమాత్రము పూర్ణము కాజాలదు. నిత్య మభివృద్ధిని చెందుచునేయుండును. ఈచందమున మానవుడు మహాదుఃఖమును, భయంకరంబగు నైరాశ్యమును వసుధాస్థలిపై డీకొనవలసియేయుండును.

సమతలంబగు వసుధపై నతివేగంబున సైంధవమును బరుగెత్తించి సారధి రథమునధిరోహించి ముందునకు సాగిపోవుచు బ్రతిక్షణము తన ప్రచండ గమనము యొక్క యనుభవ

మును బడయుచుండును. బలదర్పితంబగు నశ్వము పదదళితంబగు పృధ్వినుండి తన్ను స్వతంత్రముగ భావించుకొనును. కాని సమున్నతస్థలంబున నిలువబడియున్న ద్వారపాలకుడు వీని యొక్క స్వతంత్రసత్వము వైపునకు ధ్యానమొసంగక, భూమిమీద నొక యఖండపదార్థము కదలుచున్నదనియే భావించుకొనును. మారుతాహతిచే నల్లలలాడు పుచ్ఛరోమగుచ్ఛము సైంధవము యొక్క యొకశరీరభాగమే యయిన చందమున వసుంధరపై గదలు నుపర్యుక్తంబగు నఖండపదార్థము సహితము పృధ్వి యొక్క భాగమే సుడీ! సుజ్ఞాన భూధరోచ్ఛ శిఖరము నారోహించు పురుషవరేణ్యులకు సంపూర్ణసత్యము సాక్షాత్కరించును. మానవుడు తృష్ణా మహాపిశాచమునకు వశీభూతుడయి తుచ్ఛ సుఖభోగముల నన్వేషించుచు నహంకారమునందు నిమగ్నుడయి యున్నంతవఱకును, ఆత్మీయ తుచ్ఛజీవితమును సర్వోత్తమంబుగ భావించుచున్నంత పర్యంతమును దుఃఖమునుండి తా నేవిధముగను విముక్తి నందజాలడు. రాగద్వేషాదుల వికారము మనము నెడబాయునంతనే చిత్తము శాంతించును. అప్పుడే ధర్మము యొక్క సమ్యగుపలబ్ధి కల్గినంతనే మానవున కపూర్వానందము కరతలామలక మగును.

మహాపురుషుండగు శ్రీ బుద్ధాచార్యుని జీవితచర్యలు మానవసంఘము నుద్దేశించి యీరీతి నుపదేశించుచున్న

యది:—" మానవులారా! సంసారము యొక్క మహదైక్య మునుండి మిమ్ము భిన్నపఱచిన భేదభావయుక్తంబగు నహం బుద్ధిని శీఘ్రము విడనాడుడి; బుద్ధిని సుస్థిరము గావించి శీల మును స్వీకరింపుడి. శుభపవిత్రానుష్ఠానమువలన బరిశుద్ధానం దము ప్రాప్తమయినంతనె క్రమముగా మీ సమస్తదుఃఖ ములు రూపు మాసిపోవును. నవీనముగా బుష్పించియు న్న వృక్షము వాడిపోయిన సుమనముల విసర్జించువడువున రాగద్వేషాదిప్రముఖుల బహిష్కరించి వేయుడి. బోధను జాగ రితమొనర్చి మీరు విశాలవ్యాపనమునకయి యత్నించుచో మీయందు వేరునాటియున్న హైన్యంబును, క్షుద్రత్వమును నశింపఁడు సర్వోచ్చస్థితినరసి, దేశకాలంబుల కతీతంబగు విశ్వ ముతోడ నైక్యమును బడయగలరు. ఈజ్ఞానమే ఐక్యానుభవ మున కాధారభూతము; ఈజ్ఞానమే సమగ్రసత్యము యొక్క సారము. సంకోచమును బాసి, నిరాతంకముగా నిర్భయచిత్త ములతో ముందంజవేయ మీకీకళ్యాణప్రదమగు నిర్వా ణమే కరగతంబగును.

"ఓనరులారా! సర్వ సంశయముల నిర్వర్తించుకొని మీరు పరమ సత్యాన్వేషణకార్యమునందు బ్రవృత్తులగుడి. ఏతత్సత్యము యొక్క బీజము మీయంతఃకరణముల గోపనీయం బుగనున్నది. మీదగు క్షుద్రస్వార్థము పరిశుద్ధానందమును మీకు బ్రసాదింపగలదా? మీర లేపదార్థమునిమిత్త మింత

ఘోరంబగు పరిశ్రమను శ్రమయనక సేయుచున్నారు? ఒక వేళ స్వాస్థ్యము, సంపద, సుఖసాఫల్యము, ప్రతిష్ఠ మొదలగు నవియే మీ కాంక్షితపదార్థములయిన గావచ్చును; కాని మీ కీవస్తువు లానందమును బ్రసాదింపగలవా? జరావ్యాధులు మీ దేహారోగ్యమును నశింపజేయ నహోరాత్రము లవిరళకృషి సలుపుచు నేయున్నవి. మీరు నిత్యపరిశుద్ధంబగు శాంతిని బడయసంతపర్యంతము ధనధాన్యైశ్వర్యములును, భోగవిలాసములును, శక్తిసామర్థ్యములును, కీర్తివైభవంబులును మీకు వాస్తవికానందము నొసంగజాలవు. సామాన్యసుఖభోగముల యొక్క బంధనములదుంచివైచి మహాసత్యము యొక్క విమలజ్యోతిచే నిజహృదయముల మీరు ప్రకాశభాసురంబులు గావించుకొనగల్గినపుడే పరిపూర్ణంబును, గంభీరంబును, వ్యాపకంబును నగు మహత్కల్యాణమును బడయగలరు.

"నిర్వాణమునభిలషించుమానవభ్రాతలారా! మీ చిత్తమను సైంధవమును మచ్చికచే వశపఱచుకొనుడి; తృష్ణాబీజమును సమూలముగ బెఱకివేయుడి. లేదేని నదీప్రవాహతీరమున వ్యాపించియున్న ఉస్న మొక్కలను శతమతముగావించి వేయుచందమున గామలాలసలు చీటికిమాటికి నాక్రమణము జేసి మిమ్ము బాధింపుచుండును. మూలము భూమియందు శేషించియుండుటంజేసి పునఃసృష్ట్యోత్పత్తి సహజమగు విధంబున తృష్ణాబీజమొకించుక చిత్తక్షేత్రమునం దుండిపోవుచో

మరల మహాభ్యుదయము నాత్మపడయగలదు. మీరు సాలీడు తనగూటియందు తానేచిక్కువడియుండు విధంబునను, పట్టు పురుగు తానునిర్మించుకొనిన గూటియందే మగ్గునట్లును మహావిపత్తుల గుడుచుచు, మండూకము కూపమునే బ్రహ్మాండముగా భావించుచందమున మహాసత్యము నెఱుంగక విషయాదులతోనిండిన నశ్వరప్రపంచమునే సమస్తమని భ్రాంతి జెందుచుందురు. మండూకమునకు గూపబహిర్భాగమున కేతెంచినంతనే విశాలవిశ్వదృశ్యము గోచరించులాగున. ప్రమాదావస్థనుబాసి, జాగ్రతవస్థనుబడసి, స్వార్థత్యాగముగావించి, పరార్థసాధనమునకు గడంగి, క్షుద్రత్వము నెడబాసి, విస్తీర్ణతను గ్రహించి, నిజహృదయాంతరాళమున నాత్మీయాల్పమూర్తి నన్వేషింపక సమస్తజీవరాసులయందును, సకలప్రాణులయందును మీవిరాట్ స్వరూపము నన్వేషించికనుడి—అపుడు మీరును సత్యలోకమును సందర్శింపగలరు.

"ధర్మమార్గము ననుసరించుభ్రాతలారా! మీరలాత్మీయప్రేమ నుదారచిత్తములతోడ సమస్తదేశ కాలములయందు వ్యాప్తమొనరింపుడి. మీ రీజన్మయందే నాత్మీయ విరాటసత్వానుభవమును బడయగల్గుదురు; ఇదియే మీ యొక్క సర్వోత్తమంబగు ప్రతిష్ఠయగును. మీకుమీరే ప్రకాశకులయి యాత్మశక్తిసాహాయ్యంబున బరమకల్యాణమును బడయుడి, ఇందే మీకు బరమగౌరవముకలదు. మీ

రేదిన మచలంబగుబోధి (యథార్థజ్ఞానము, అమృతధామసిద్ధి)ని బడసి కృతార్థులయ్యెదరో నాడే మీస్వార్థము సమస్త విశ్వవాసులయొక్క స్వార్థము కాగలదు. నాడే మీకల్యాణము విశ్వకల్యాణము కాగలదు." ఇట్టి బౌద్ధజీవితమందే విరాట సత్వానుభవమునంది మానవుడు నిర్వాణమును బడయసమర్థుం డగును. ఏతత్కారణంబుననే బౌద్ధసాధువులు జీవితము సమూల్యపంతమని భావించుచుందురు. వారు సుఖదుఃఖములను, ఆనందనిరానందములను, వేయేల? మృత్యువును గ్రహింపరాని దానిగా జేసివైచి, ప్రాణికోటియొక్క హితసాధనమందే య కుంఠితచిత్తములతోడ నాత్మసమర్పణము గావించివేయుదురు. తామేజీవములనుండియు భిన్నముగానుండ లేదనియు, గుప్త రీతిని నెల్లజీవులతో సంయోగమును గల్గియున్నట్లును, సమస్త జీవహితమే తమహితమనియు వారనారతము భావించుచుం దురు. తమక్షుద్రసత్వమును బూర్ణముగా బహిష్కరించివైచి, విశ్వవ్యాపకంబగు విరాటసత్వమునందే నిజాస్తిక్యమును గనుటే బౌద్ధజీవితముయొక్క పరమలక్ష్యము. బౌద్ధజీవితలక్ష్యము భారతీయుల యద్వైతసిద్ధాంతమున కెంతయు మెరుగువెట్టుచున్న యది. క్రైస్తవమత మీ యద్వైతభావమందే శుద్ధానందము నందుచందమున బౌద్ధమతముసహిత మటులే సేయుచు హిందూ మత సిద్ధాంతమగు "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" మును సార్థకపఱచుచున్నయది. సకలమతములు సత్యపదస్వరూపంబు

లనియు, సత్వరసత్యప్రాప్తియే మతముయొక్క పరమలక్ష్య మనియు నెంచు నధునాతన ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞప్రపంచము వారొను సార్వజనికజీవితము (universal life or public life) నే బౌద్ధజీవిత మత్యుత్తమమనియు నందే నిర్వాణ ముకలదనియు నుడువుటెంతయు మంగళకరము.

---

## బౌద్ధకర్మము.

శరీరగృహనిర్మాత నన్వేషించుటకు సంసారమునం దెన్నియో మతములుపుట్టి పెరిగినవి. కార్యమున కాధార భూతము కారణమయిన చందముననే మతముల కాధార భూతులు కొందఱు మహాపురుషులు. ఈశ్వరాన్వేషణమున మహాత్ముల విశాలపరిశుద్ధ హృదయంబులగల్గిన యభిప్రాయమే బహిర్గతములయి యసంఖ్యాకులగు సంసారులచే లాలనపాలనము గావింపబడి విరాట్స్వరూపంబున మతమను పేర బ్రఖ్యాతమయ్యెడిని. మతములన్నియు నెన్నివిధముల నీశ్వరాన్వేషణమును గావించియున్నను "నేతి, నేతి" యను సందేహ సూచకంబగు పదమునే ఫలితముగా బడయగల్గినవి కాని నిశ్చితార్థము సుస్పష్టముగా బ్రదర్శింపజాలకపోయినవి. మత మనగా స్వస్వరూపావలోకన ప్రాప్తికయి మానవుని హృదయమునందేర్పడిన నిశ్చితాభిప్రాయము. మతము దర్పణము వలె బరిశుద్ధమయియుండునది. అట్లుండునపుడే దర్పణమున

ముఖబింబమును గాంచగల్గినటుల మనము దేవుని స్వరూప మును దిలకింపశక్తులమయ్యెదము. ఈమతమునకు బాహ్యాను ష్ఠానముతోడను, బాహ్యవిశ్వప్రకృతితోడను గౌణసంబంధమే యుండునుగాని ప్రధానమగు సంపర్కము లేదు. అవ్యక్తమగు నాదిశక్తి నవలోకింప నాంతరికంబగు జ్ఞానప్రవృత్తియు, ననుష్ఠా నంబును నావశ్యకంబులయి యుండును. బాహ్యకర్మములు విశేషించి మతమును, తదవలంబులను బరిశుద్ధపఱచజాలవు. భువిపై నింతపర్యంతము వ్యాప్తమయియున్న మతములన్నియు నీదూరదృష్టికివశమయి, బాహ్యశుద్ధియందును, బాహ్యచరణ మందును, బాహ్యవిశ్వప్రకృత్యను సంధానమందును సత్య మువెల్లడియగునని యెడిభ్రాంతికిజిక్కి సత్యపదమునకు దూరము లయిపోయినవి. బౌద్ధధర్మము సంసారమందలి యెల్లధర్మముల "గొఱ్ఱెలబుద్ధితో "ననుసరింపక స్వతంత్రమయి, పరిశుద్ధమయి నిరర్థకమగు కర్మకాండకు హృదయస్థానమునం దెక్కడు ప్రాముఖ్యము నొసంగక, జ్ఞానకాండమునే మిక్కిలియాదరించి సత్యము యొక్క యథార్థమగు పథమును లోకమునకు సంకు చితార్థములకు వశముగాక చాటియున్నది. మనమతమగు హిం దూమతగ్రంథము లేకారణంబుననో తొల్లింటి పారిశుద్ధ్యము నెడబాసి వాస్తవికేతరంబగు కర్మకాండకయి సర్వస్వమును ధారపోయుచుండు టెంతయు జింత్యము.

శ్రీబుద్ధాచార్యుడు బాహ్యకర్మల యపారిశ స్త్యమును సామకులకు సహితము బోధించి యాంతరికంబగు జ్ఞాన పరివృత్తుల జాగరితంబొనర్చు కర్మములే యుత్తమములనియు, సత్వరాచరణీయములనియు నిరూపించియున్నాడు. పాఠకులారా! మానవ ప్రపంచమును దరింపజేయునట్టియు, సృష్టికారణమయినట్టియు బౌద్ధకర్మను గూర్చి విచారింతము! విమల బోధి ప్రాప్త్యనంతరము శ్రీబుద్ధభగవానుడు ధమ్మపదమునందిట్లు వచించియున్నాడు:—

"అనేకజాతి సంసారం సంధావిస్సం అనిబ్బిసం॥
గహకారకంగ వేసంతో దుక్ఖాజాతి పునప్పునం॥
గహకారకం! దిట్ఠోసి, పునగేహం న కాహసి॥
సబ్బాతే ఫాసుకాభగ్గా గహకూటం విసంఖితం॥
విసంఖారగతం చిత్తం తణహానంఖయమజ్ఝగా॥

'గృహనిర్మాత నన్వేషించి, పడయజాలక నేనెన్నియో పర్యాయము లీధరావలయంబున జన్మించియుంటిని, ఎన్నియో లోకముల నవలోకించితి, ఎంతయో పర్యటనము సల్పితిని, చీటికిమాటికి జన్మచక్రింబునబడి దుఃఖానుభవమునందితిని! ఓగృహరచయితా! నేనీపర్యాయము నిన్గాంచినాడను. ఇంకనీ వీకపట కాయగృహ నిర్మాణముగావింప సమర్థుడవుకాజాలవు. తావకంబులగు స్తంభములును, భిత్తికలును భగ్నమయి

పోయినవి, మామకంబగు విగతసంస్కార చిత్తము యొక్క సమస్తతృష్ణలును మూలసహితముగ విధ్వంసమయిపోయినవి."

శ్రీబుద్ధాచార్యుని యీవచనములవలన నొక్క గృహ కారకుడు జీవకోటి యొక్క జన్మ జన్మాంతరములకును కారణ స్వరూపుడయి యున్నటుల స్పష్టపడుచున్న యది. ఆ హేతు భూతుడు బోధి (ఆత్మపరిజ్ఞానము) ప్రాప్తిచే మానవమాత్రు నకు బ్రత్యక్షమగుడు గృహము యొక్క సమస్త పరికరములు శిథిలములయి పోవును; గృహకారుని శిల్పవిద్యానైపుణీవిశేష మంతయు బూదెబోసిన పన్నీటిచందమగును. గృహనిర్మాత (సృష్టిరచనకు గారణ భూతంబగు నాద్యశక్తి) యొక్క ప్రతి ష్ఠాక్షేత్రము పూర్వకర్మ యొక్క వాసనయు, సంస్కారము ను, తృష్ణయు నయియున్నది. తృష్ణాసంస్కార క్షయమయినంత నే గృహకారకుని గృహనిర్మాణ వృత్తి నిర్మూలమయిపోవును. అభిధర్మము మనయీగృహకర్త నే కర్మయని నుడువుచున్న యది మనయీకర్మ బాహ్యక్రియకుగాని వ్యాపారమునకు గాని సంబంధించినది కాదు. "నేనుశత్రువు నంతమొందించితి ని" ఈహత్యాప్రవృత్తియు గర్మకాదు; వాస్తముగా నీసాధనము వలన నేసంస్కార ముదయమయ్యెనో, అదియేకర్మయని తెలియ నగును, లేదా యాసంస్కారాంతర్గతమగు గూఢశక్తియే కర్మ. "రూపము, సంజ్ఞ, వేదన, సంస్కారము, విజ్ఞానము" ఈయైదింటి మధ్యనుండి, వీనిసన్నింటిని నేసి యొక్కయపూర్వం

బగు వ్యక్తిత్వమనియెడి జాలమును సిద్ధమొనరించు శక్తియొక్క నామమే కర్మ. బౌద్ధులీవ్యక్తిత్వముయొక్క నిరపేక్షితస్థితిని స్వీకరింపనొల్లరు. సూర్యకిరణముల యొక్కయు, వృష్టికణములయొక్కయు నపూర్వసమ్మేళనంబున మనోహరంబగు నింద్రధనుస్సు నిర్మితమగుచున చందముననే రూపవేదనాది స్కంధములే విచిత్రింబగు వ్యక్తిత్వమును సృజియింపజేయుచున్నవి. వాస్తవమనయ వ్యక్తిత్వమునకేవిధమయినట్టియు స్వతంత్రాస్తిక్యము లేదు. రెండుస్థానములమధ్యనీడు వాయుప్రవాహమాస్థానద్వయాక్రమణ తారతమ్యము నెడబాసినంతనే విశ్వవాయువునం దైక్యము జెందిపోవు విధంబుననె మనవ్యక్తిత్వమునసహితము వాసనలు నశించినంతనే బ్రహ్మండ సత్తయందు విలీతమయి పోవుచున్నయది.

వ్యక్తిత్వముయొక్కగాని యహంకారముయొక్కగాని పారమార్థికముగా నెట్టి యాస్తిక్యమును లేదనియే తెలియనగును. రూపాద్యుపర్యుక్త పంచవిధస్కంధములే వ్యక్తిత్వమునకు మూలకారణములు. ఇద్దాని యాస్తిక్యము (ఉనికి లేకఉన్నదను భావము) యొక్కస్వభావ మెట్టిదయియున్నను వ్యక్తి దుఃఖమునసనుభవించియే తీరును. ఈవ్యక్తిదే సంసారమునందు పరిభ్రమణము సేయుచుండును. వీనికే నిర్వాణము సహితమునసంప్రాప్తము కాగలదు. దుఃఖము,సంసారము,నిర్వాణము, వీనికేవశమయి వ్యక్తివీనినే నియమితమొనరింపుచుండు

ను. కాని వ్యక్తికి దానాచరించు కర్మపై నాధిపత్యముండ జాల
దు, కర్మమే వానిపై ప్రభుత్వము సేయుచుండును. ఒక్కసన్నని
నూలుపోగు సహస్రింబులగు పుష్పములమధ్య రంధ్రముల
గుండా ప్రవేశించి, చెదరిపడియున్న కుసుమములనెల్ల నొక్క
మాలికారూపంబుగ సేయగల్గినటులనే యీయదృశ్యంబగు
కర్మశక్తి, భిన్నముహూర్తము, భిన్నవాసరము, భిన్నకాలము,
పృథగ్బాల్యము, భిన్నయౌవనము, భిన్నప్రౌఢము, భిన్నవృ
ద్ధాప్యము మొదలగు విభిన్నావస్థలయొక్కయు, జన్మజన్మాం
రముల యొక్క యొకేజీవుని భిన్నవ్యక్తిత్వములమధ్యగా బ్రవ
హించి వీనినన్నింటి నొక్కసూత్రమునందే సమ్మిళితము
గావించివేయుచున్నయది. ఈవర్తమానకాలమునందున్న నేనను
రూపము పూర్వకాలమునందున్న నేనను నాకృతియొక్క
పరిణామ మాత్రమేగాని వేరొండుకాదు. మనము దుగ్ధము
నుండి దధిని, దధినుండి నవనీతమును, నవనీతమునుండి ఘృత
మును బడయుచున్నాగము; దుగ్ధాశ్రయంబుననే దధినవనీత
ఘృతాదులు మనలకులభించి యున్నను క్షీరమునే దధియని
యు, నవనీతమనియు, ఘృతమనియు నుడువవలను పడదు.
పెరుగు పాలుకానేరదు. కాని పెరుగు పాలనుండిభిన్నమయిన
పదార్థము మాత్రముకాదు. దధిత్వముయొక్క యుత్పత్తి
తోడనే దుగ్ధత్వముయొక్క నిరోధము వాటిల్లుచున్నయది;
కాని దుగ్ధత్వముయొక్క ధర్మము దధిత్వమునందు విద్య

మానమయి యున్నది. ఈ ప్రకారముగానే బాలకుని యొక్కయు, యౌవనుని యొక్కయు, ప్రౌఢుని యొక్కయు, వృద్ధునియొక్కయు వ్యక్తిత్వములు స్వతంత్రము లయి యున్నను, ఒక్కే దేహము నాశ్రయభూతము గావించుకొని భిన్నభిన్నావస్థలు ప్రాప్తమగుచున్నయవి. కర్మ యొక్క పరిణామము ప్రతిదినము, ప్రతిక్షణము మనయందు నవ్యతరంబులగు వ్యక్తిత్వముల నిర్మాణ మొనరింపుచునేయున్నది. వజ్రము యొక్క శక్తిప్రభావంబున దిగ్దర్శన యంత్ర మనుక్షణము కదలుచునేయుండుభాతి కర్మప్రవాహము మానవ జీవనమునుగొని నానావిధంబులగు క్రీడల నాసక్తమయియుండు చున్నయది. ఎన్ని యుగయుగాంతరములనుండి, యెన్ని జన్మ జన్మాంతరములనుండి యీ మహాక్రీడ సాగుచున్నయదో దురూహ్యము! ఈ ఖేలనము సమాప్తముకాదా యను ప్రశ్నము సహజముగనే మన హృదయములయందు దోదవుచుం డును. ఈ విషయమయి బౌద్ధులిట్లు వక్కాణించుచున్నారు:—

'ఈమాట లేకలీల యవశ్యము సమాప్తమగును, యిందసత్యము లేదు. కాని మానవుని హృత్సీమ యందు నెలకొనియున్న యవిద్య దూరముకానంతపర్యంతము మనుష్యుడు కర్మ యొక్క ప్రబలతమశక్తికభిలాష తనకు లేకపోయినను దాస్యముసేయ బద్ధుడయియుండును. మానవుడు బోధిప్రాప్తినందినంతనే వానికి కర్మయొక్క సత్యస్వభావంబును, అద్దాని విచిత్రకార్య పరం

పరలును గోచరించును; అంత కర్మయే యామానవునకు దాస్య మొనర్చును; మానవుడే కర్మ కధిపతియగును. కర్మ యొక్క శక్తిసమ్మిళిత భవిష్య ద్వర్తమానకాలసేతువు. తృష్ణాక్షయమయినంతనే యీ సంయుక్తంబగు సేతువు భగ్నమై పోవును. అంతనిర్వాణముప్రాప్తమగుడు పునర్జన్మయే యట్టివాని కసంభవమయిపోవును. చీటికి మాటికి జన్మించుటకుగల కారణము తొలవడినంతనే పునఃజనన మందవలసిన యవసరమే నశించును. దుక్కి దున్నక, బీజములు చల్లకయే ధాన్యము నభిలషించు టయుక్తమయిన చందముననె వాసనాసక్తుల నిర్మూలింపకయే నిర్వాణము నభిలషించుట మౌఢ్యము. గృహమునందు దీపము వెలుగుటంజేసియే యాసదనమందు నంతకుపూర్వము వ్యాపించియున్న ఘోరాంధకారము దూరమగుడు సమస్త పదార్థములు స్పష్టముగా గోచరించుచందముననే, జ్ఞానదీపికోదయంబుననే సాధకుని హృదయంబున వ్యాప్తమయియున్న నజ్ఞానాంధకారము నశియింప వాని కార్యసత్యచతుష్టయము గోచరమగుచున్నదని బౌద్ధులెల్లరు నుడువుచుందురు. అప్పుడాసాధకుని స్థిరబుద్ధి యొకవైపున చిత్తమును గట్టిగా బంధించి నిరోధించిగూండి, రెండవవైపునుండి తృష్ణామూలోచ్ఛేదనము గావించివైచును. వాని తృష్ణామూలము ఖండింపబడినంతనే వాని జన్మజన్మాంతరముల యొక్క కర్మసూత్రము సహితము ఖండితమయిపోవుచున్నయది. మన శారీరక, మానసిక, వాచ

హితానుహితకార్యము లన్నియు సంఘటించుటకు హేతువం తయును మనయాంతరిక ప్రేరణమే యని సులభముగా గ్రహిం పవచ్చును. మనము మనస్సుచే బ్రేరేపితులమయి యెల్లకార్య ముల సలుపుచున్నారము. మనము కర్మ నాచరింపవలసియే యున్నది, అద్దాని ఫలమునుసహిత మవశ్య మనుభవింపవల సియేయున్నది. ఊర్ధ్వముఖంబుగా విసరివేయబడిన మంటిపెల్ల తిరిగి పృథ్విపయి పడవలసియేయున్న చందమున శుభాశుభ కర్మములు నవీనసంస్కారముల నావిర్భవింపజేయుచుండును. దీర్ఘకాలపర్యంతము దూరదేశ మరిగియున్నవాని నాత్మీయ వర్గము స్వగృహమున కేతెంచినయంతనే యధికానురాగంబు తోడ సత్కరించువిధంబుననే యీలోకమునుండి లోకాంతర గతుడయి నపుడు మానవుని యతనిపుణ్యకర్మ బంధుమిత్రాదుల వలె నాతిథ్యమొసంగి విశేషముగా సన్మానించునని ధర్మపథ మునందు శ్రీబుద్ధాచార్యుడు నుడివియున్నాడు. శుభాశుభ కర్మములు మనల నొకపరిణామమునుండి మరొక్కపరిణామ మునకు, జన్మనుండి జన్మాంతరమునకును గొనిపోవుచున్న యది. కర్మయొక్క యీప్రబలతరంబగుశక్తి యిచ్ఛామాత్రం బుననే నష్టభ్రష్టము కాజాలదు. సమస్తవిధంబులగు శుభా శుభకర్మలు చీటికిమాటికి నన్నిలాతలంబున జన్మింపజేయుటకు హేతుభూతములయి, ముక్తిమార్గమున కంతరాయముల గల్పించుచున్నవి కాన నేనిప్పటినుండి యేపాపపుణ్యంబులగు

ద్వివిధకర్మముల బరిత్యజించివైచితినని సాధకుడు సాధనము యొక్క ప్రథమావస్థయందే భావించుటెంతయు ననుచితంబు. తృష్ణాక్షయము నాధారముగ జేసికొని యాత్మీయవ్యక్తిత్వ మును లుప్తమొనరించుటకు బూర్వమే సాధకున కీవచనము నుడువుట కధికారము లేనటుల బౌద్ధులు పేర్కొనుచున్నారు. సాధకుడు హఠముచే నేను పాపపుణ్యముల నాచరింపను అనుప్రతిజ్ఞ నొనరింపుచో వానియీప్రతిజ్ఞవలన మఱొక్క నూతన సంస్కారోత్పత్తి కాగలదని బౌద్ధుల సంకల్పము మూర్ఖుడయి యిట్లాచరించుచో విషమపరిణామ మనుభవింప వలసియే యుండును. స్త్రీజాతిమండూకము స్వాభావికనియ మోల్లంఘన మొనర్పినంతనే నిజపుచ్ఛమును గోల్పోవును. బల ప్రయోగముచే నిజపుచ్ఛము నుండి నీళ్లు వదలుకొని మండూ కమురుతరంబగు హానికిజిక్కును. సాధనము క్రమక్రమ మొన రింపగా నేదివసము సాధకునివ్యక్తిత్వము నష్టమయిపోవునో, ఆదినమే వానితృష్ణాగ్ని తనంతటతానే చల్లారిపోగలదు. అప్పుడే సాధకుడు ప్రచండమగు కర్మపైనాధిపత్యము వహింపసమర్థుం డగును. ఇట్టి యవస్థవాటిల్లుటకుబూర్వ మెద్దియయిన స్వభావ విరుద్ధమగు బలప్రయోగమును గావించినచో నెట్టిఫలము లభ్యము కాజాలదు.

ఒకవైపున కర్మయొక్క సృష్టికర్త మానవుడగుచుండ మఱొకవైపున మానవుని సృష్టికర్త కర్మయే యగుచున్నయది

కర్మజాలమునుండి విముక్తినంది సుగతినందుట సాధారణ శిక్షావిషయంబు కాదు. సర్వస్వమును ధారపోసి సాధనమునకు మానవుడుపక్రమింప వలసియుండును. ఈ మహాసాధన యజ్ఞమునందు వ్యక్తిత్వము నాహుతిగావించి వేయవలసి యుండును. సాధకుడు సాధనముచే నహంకారమును మటుమాయము గావించివైచినను, యీ కాయమునశింపక విద్యమాన మయి యుండుననియు నపుడు సహితము సాధకు డనేకవిధంబులగు కార్యముల నాచరింపవలసియే యుండునను ప్రశ్నము కలుగవచ్చును. అపుడు సహితము సాధకుడేల కర్మల నాచరింపవలయును? ఈప్రశ్నమునకు సంక్షిప్తముగా నిదియే ప్రత్యుత్తరము :—స్థిర ప్రజ్ఞావంతుడగు సాధకుని బాహ్య క్రియలు తృష్ణాభిభూతములయి యుండజాలవు; రూపవేదన సంజ్ఞా సంస్కారవిజ్ఞానముల యేయాంతరికశక్తి సాధారణ మనుష్యుని కర్మయందు ప్రవృత్తుని గావింపుచున్నయదో, యాశక్తివలన సిద్ధసాధకునికి కర్మము లుదయింపజాలవు. ఇందువలన వానికర్మములు నూతనసంస్కారములను, నూతన వ్యక్తిత్వములను, నవ్యతరదుఃఖములను సృష్టింపజాలవు.

అబోధబాలకుడు దర్పణమునందాత్మీయ ప్రతిబింబము నవలోకించి భయప్రకంపితు డగుచున్నాడు; కాని యా ప్రతిబింబము యొక్క యాథార్థ్యమును గ్రహించినంతనే భయమును వీడుచున్నాడు. కర్మ యొక్క సత్యమూర్తిని

మనము గుర్తింపజాలకున్నారము, ఇందువలననే యది మన సమీపమున భయంకరంబుగ బ్రతీతమగుచున్నయది. పాప పుణ్యములయొక్క బంధమును హస్తమునంగొని కర్మ మనలకు దండన పురస్కారంబుల బ్రసాదింప న్యాయాధిపతి యాస నముపై నాసీనమయి మనదిక్కు తీవ్రతరంబులగు దృక్కుల వీక్షింపుచున్నయది కాని సాధకుని సమ్ముఖంబున నీకర్మ యొక్క సమగ్రసామర్థ్యము విఫలమయి పోవును. కారణమే మన కర్మవృక్షమే ఝరముయొక్క రసధారను స్వీకరించి వివిధశాఖోపశాఖలను, పత్రములను ఫలపుష్ప సముదాయం బులనుగల్గి హరితవర్ణ విలసనంబున నయనమనోభిరామమగు చున్నయదో, యాఝరము యొక్క ముఖద్వారమునే సాధ కుడు ప్రిప్రిధమమె బంధించివైచును! తృష్ణారసక్షయమయి నంతనే మానవుని కర్మతరువు భూతలపతితమయి శుష్కించి పట్టియం దేకమయి పోవును. ఈప్రకారము సాధకు డుత్త మానుత్తమంబులగు సమస్తకార్య బంధనములనుండి విముక్తు డయి, శోకరహితుండును, నిష్పాపుండును, పరమ పరిశుద్ధుం డును నయిపోవును. తృష్ణాబీజ మూలోచ్ఛేదనంబున సాధ కుడు గృహారామక్షేత్ర శూన్యుండయిపోవును; అనగా వాని నేగృహకర్త జన్మ జన్మాంతరములయందును, నానాలోకముల యందును పరిభ్రమణము సలుపునట్లుజేసి యశేషదుఃఖము ననుభవింపజేసి యున్నాడో యాగృహ నిర్మాతయొక్క

సమస్తోపకరణములను, స్తంభములను, భిత్తికలను, ద్వార వాతాయనములను నష్టభ్రష్టమొనర్చి వేసి సాధకుడు స్వతంత్రుడయి యాత్మానంద పరవశుడయియుండును. శారీరకంబుగను, మానసికంబుగను, వాచికంబుగను నెద్దియేని కుకర్మ సేయుచో కర్త యవశ్య మద్దానిఫలము ననుభవించితీరునని బౌద్ధులు నొక్కి వక్కాణింతురు. శకటము నీడ్చు వృషభముల గొరిజలనంటియే వచ్చు చక్రములవలె పాపపుణ్యముల ఫలితములు కర్తల వెంటనంటియే యుండునన్న వాక్యంబు వలననే బౌద్ధుల కర్మము లెట్టి మమత్వ దూరములయినదియు, స్నేహశూన్యము లయినదియు హృదయంగమంబగుచున్న యది. కల్మషశూన్యంబగు ముకురంబున స్పష్టముగా బ్రతిబింబము గోచరించు విధంబుననే కర్మసహితము యథాయోగ్యంబగు ఫలమునే ప్రత్యక్షముగా బ్రదానము సేయుచుండును. మతసంబంధమయిన దూరదృష్టి లేని హిందూశుష్కపండితులు కొందరు బౌద్ధమతము కర్మమునే సర్వేశ్వరుని లేక బ్రహ్మ యొక్క సర్వోచ్చాసనంబున గూర్చుండజేసినదని భావించుచుందురు. కాని యిందెంతయు భ్రమావివేకము లేకమయి ఘనీభవించి మతద్వేషమును పురికొల్పినవనియే వచింపనొప్పు బౌద్ధమతము ప్రత్యక్షముగా జీవాత్మకే సర్వోచ్చంబగు నీశ్వరీయాసనమును బ్రసాదించినది. చీటికిమాటికి "నారాయణా, రామా, కృష్ణా, శంకరా" యను కల్పితపదంబుల నుచ్చరింప నుద్బోధ

నేయుటే మతధర్మమని భావించి భ్రమించుపామరులకు బౌద్ధ
ము పరిశుద్ధమయియుండియు నాస్తికంబుగనే ప్రతీతముగావ
చ్చును. స్వరూపముచేగాక బుద్ధిచే మానవజాతికిజెందిన వ్యక్తి
బౌద్ధనీతి నాద్యోపాంతముగ బరిశీలించి నాస్తికమన్న నాశ్చ
ర్యములేదు! మానవుడు సాధనముచే మూత్రపురీషాది
మలపూరితంబగు కాయనిర్మాణమునకు మూలమగు కర్మపై
నధికారమును నిస్సందేహముగా బడయగలడు. తనయదృష్ట
మునకును, దురదృష్టమునకును, పరిణామంబునకును, శుభా
శుభంబులకును వేయేల? వీనికివాని కననేల? సమస్తమునకును
మానవుడు తానేకర్త. అర్థశూన్యంబులగు బాహ్యకర్మల
నుద్బోధించు శాస్త్రములన్నియు నుదరంభరిత్వాపేక్షచే
ప్రాపంచికపండితులు విరచించినవియే. వానినాదరించి మానవ
సంఘము వికాసమునకు దూరమయి కుకర్మయొక్క పరిణామం
బగు దుర్గతినిజెందుటయే ధ్రువము. తనబంధనముల నిర్మించు
కొనునదియు మానవుడే, వానినిఖండింపగల్గునదినహిత మతడె.
బౌద్ధధర్మము మానవునకు బంధనమునుండి ముక్తిని బడయ
యుక్తినిదెల్పి వానియాత్మ కత్యంతమగు ప్రతిష్ఠనార్జించినది.
కర్మయోగశాస్త్రముయొక్క పరిశుద్ధాభ్యాసమీమతంబుననే
వెలయుచున్న దనవచ్చును. హిందువులయందు వేరునాటి
యున్న దురాచారవిచార పుంజద్యోతకంబులగు కర్మల
న్నియు నింద్యములనియు, నిర్హేతుకంబులనియు మనకు బౌద్ధ

నీతివలన దెల్లమగుచున్నయది. నైతికాదర్శము పరిశుద్ధదర్పణ మువంటిదయి యైహికాముష్మిక సౌఖ్యాసౌఖ్యసముదాయమూర్తుల మానవజాతికి గోచరింపజేసిన దీబౌద్ధమునందే యని మనలకు స్పష్టపడుచున్నయది. ఊబియందుప దిగబడి పెనగులాడుకొను వానివిధంబున, కుకర్మకాండ యందుండు ప్రస్తుతహిందూమతము నాదరించు వ్యక్తి జన్మచక్రమున బడి మ్రగ్గవలసినదే!!!

---

## బౌద్ధసాధనము

ఒకపార్శ్వమున భోగవిలాసముల ప్రఖరప్రవాహము; మరొక దిక్కున దుస్సహంబగు కఠోరసాధనము; వీనికిమధ్యగా సోదారంబగు నిర్వాణరాజపథము వెలయుచున్నది. శ్రీ బుద్ధాచార్యు డవలంబించిన దీయుత్తమరాజమార్గమే. దేవుడు మృగదావము (సారనాథము) నం దీరీతి ధర్మపిపాసువులగు భక్తజనుల కుపదేశించియున్నాడు:—వత్సలారా! కఠోరసాధనంబున ముక్తిపథము నన్వేషింపకుడి. ప్రచురభోగ విలాస విశేషంబుల దవిలి మిమ్ము మీరువిస్మరింపకుడి. మద్యమత్స్య మాంసాహారబహిష్కారంబునను, వస్త్ర ధారణాత్యాగంబున ను, శిరోముండన స్వీకారంబునను, జటాముకుట వల్కలధారణంబునను, భస్మవిభూషితశరీరంబునను; హావనకార్య నిర్వాహణంబునను చిత్తముయొక్క కల్మషంబు దూరముకాజా

లదు. మోహమును నశియింపజేయనట్టి మానవుని యొక్క బాహ్యసాధనాంగములగు వేదపాఠము, దానము, యజ్ఞము, కఠోరతపము మొదలగున వన్నియు నిష్ఫలములే యగును.

క్రోధము, అనాచారము, కాఠిన్యము, కార్పణ్యము, కపటము, అహంకారము, ద్వేషము మొదలుగా గలదుష్ప్రవృత్తులే చిత్తమును కలుషితమొనరించి వేయుచున్నయవి; కేవలము మత్స్యమాంసాదుల వలననే చిత్తము పాపపూరిత మగుట లేదు. అత్యధికంబులగు భోగవిలాసంబులకును, కఠినతపస్సునకును మధ్యవర్తించు సాధనమార్గమును గూర్చియే పిపాసువులగు మీ కుద్బోధింప సంకల్పించుకొంటిని. శరీరమున కసహ్యాకరంబులగు క్లేశంబుల నొసంగి, యస్థిచర్మావశేషముగావించి వైచుటవలన సాధకుడు నానావిధంబులగు వృథావ్యథల తోడను, సంశయములతోడనుగూడి ఖేదపడుచుండును. కఠినతపమాచరించుటచే జంచలతరంబులగు నింద్రియాదుల జయించుట సత్యము, అందువలన సాధారణంబగు సాంసారికజ్ఞానము సహితము కరతలామలకము కాజాలదు. తైలమునకుమారుగా దీపమును జలముచే నుద్దీపితమొనరించువాని సదనమెట్లు ప్రకాశవిలసితంబు కానేర్చు? ఇంధనములుదగ్ధమయిన యనంతరము శేషించియున్న భస్మరాశిచే దీపమును వెలిగింప జూచుటెంతయునిష్ప్రయోజనము! ఏతత్కారణంబుననే కఠినతరంబగు తప మనా

వశ్యము, దుర్భరదుష్టక్లేశ దాయకము, వ్యర్థము, అనర్థదాయకము.

మానవునిచిత్తసీమపై నాధిపత్యమువహించు నిరంకుశంబగు నహంకారము రూపుమాయనంతపర్యంతము, యిహపరలోక సౌఖ్యతృష్ణ నశియింపనంతపర్యంతము సేయబడుతపస్సాధనమంతయు వ్యర్థశ్రమయగుటయేకాక దుఃఖోత్పాదకమగును. అహంకారమును చూర్ణీకృత మొనరించు ధీరాగ్రేసరుడేయవస్థయందును స్వర్గమర్త్యలోకముల యెట్టిసౌఖ్యంబులను విస్మృతిచేత నయిన నభిలషింపడు శరీరప్రయోజనమును పూర్ణమొనరించుకొను నిమిత్తము పరిమితాహారస్వీకారంబున నట్టివానిచిత్త మణుమాత్రమయిన కలుషితమగు నన్న స్వాప్నవార్త: కమలము సరోవరమధ్యజలంబున వెలయుచున్నను దానిని సలిలంబు స్పృశింప జాలదుకదా! ఇట్లాచరింపనిపక్షమున సమస్తేంద్రియముల యొక్క పారవశ్యము శరీరమును, చిత్తమును దుర్బలము గావించివైచును. ఇంద్రియ లోలుపుడగు మనుష్యుడు ప్రవృత్తికి దాసుడయి మనుచుండును. ఇంద్రియ సుఖభోగాభిలాషయే మానవుని మనుష్యహీనునిగను, నీచాతినీచునిగను జేసివేయుచుండును. ఇందుచే యుక్తాహారవిహారపానీయ స్వీకృతియ కల్యాణ దాయక మెంతమాత్రము గానేరదు. శరీరమును స్వస్థముగాను, బలవత్తరంబుగను నుంచుకొనుటయే పిపాసువు ధర్మము. శరీరము సబలముగా లేనిచో

మన మెట్లు జ్ఞానదీపికనుద్దీపిత మొనరింప సమర్థులమయ్యెదము? ఓ నా ప్రియమయిన భిక్షువులారా! నేవచించిన మధ్యమార్గ మెంతయు ముక్తిప్రాప్తికి బ్రశస్తమయినది, సత్యాగకల్యాణ దాయకమయినది! భోగవిలాసముల ప్రాచుర్యమును వర్జించి, కఠోరతపఆచరణము నెడబాసి వీని మధ్యమార్గముగా ముక్తినందుడి.

శ్రీబుద్ధాచార్యుని మధ్యమార్గ మెంతయు నుత్తమం బయి హిందూమతావలంబుల దేహదండనాది యౌగికక్రియల నిరసించుచున్నయది. ఒక్క హిందూమతమందలిపామరు లీయభిప్రాయముతో నేకీభవింపకపోయినను సంసారమందలి సకల మతావలంబులు సానందచిత్తులరయి దీని నామోదింతురు. ఒక తూరి శ్రీ బుద్ధాచార్యుడు బౌద్ధపరివ్రాజకమండలి నుద్దేశించి యీచందమున వాక్రుచ్చియున్నాడు:—"నాయనలారా! ఆర్య సత్య చతుష్టయరహస్య విదులయినవారికి సృష్టిక్రమభేద మంత యు హృదయ పటలాంకితమగుడు వారువెంటనే యుత్తమపథ విడంబనమున నిర్వాణమునంద శక్తులయ్యెదరు. ఇట్టిరహస్యవిదు లకు సమ్యగ్దృష్టియంతట దీపికయయి యజ్ఞానాంధకారపటలా వృతంబగుప్రపంచ క్షేత్రంబున యుక్తపథమునుదర్శింపజేయును, సమ్యక్సంకల్పము స్థిరమార్గము ననుసరింప మానవునినిర్దేశించి దృఢసంకల్పచిత్తు నొనర్చును. సమ్యగ్వచన మవ్వానికి మార్గము నవిశ్రామస్థానమును బ్రసాదించును. అంతట వానివర్తనము

ఋజుత్వమును బడయ వానియాచారవిచారములు సుస్థిరము లయి నిత్యానందసంధాయకంబులయి పరిశుద్ధము లగును: అతడు పరిశుద్ధాన్నంబు నారగించి నిర్మలంబగు తృప్తినందును. కారణంబేమన నతడు సాధువృత్తియందే వర్తించుచుండును, పరిశుద్ధోద్యోగమునకయి యతడెపుడు సంచరించుచుండును; హేతు వదెద్దియన నతడెపుడును నిజసంయమవ్రతానుష్ఠానము నుండి విముఖుడయి యద్దానికి విరుద్ధమగు నాచరణమును బడ యనొల్లడు. సమ్యక్స్మృతియే వానికి నిశ్వాసములు. కారణ మేమన సత్యవిచారము లతని కుచ్ఛ్వాసనిశ్వాసములవలె నిరంతరము హృదయమున బ్రవహించుచుండును. సద్విచారము లతనికి స్వాభావికములని తాత్పర్యము. సమ్యక్ ధ్యాన మతనికి సుఖశాంతుల నొసంగును; కారణంబెద్దియన జీవితము యొక్క యథార్థతత్వమనన ధ్యానాదులవలన వానిచిత్తమున కపారంబగు శాంతి లభ్యమగును. శ్రీబుద్ధాచార్యుని యాత్మపరిజ్ఞాన సాధనము లెంతయు సాధుతరములయి యున్నవి.

నిజాంతరిక పరమసత్యసంబంధమగు జ్ఞానము (బోధ) నందుటయే బుద్ధత్వప్రాప్తియని గుర్తెఱుంగనగును. సాధారణ జ్ఞానముచే మానవుడు గ్రహించునదంతయు ఖండజ్ఞానమున బడుగు. కాని మానవుని యాధ్యాత్మికదృష్టి తెఱవబడినంతనే ఖండజ్ఞానముయొక్క యవనిక తొలంగును. అపుడు మానవుని కాత్మీయవాస్తవిక స్వరూపంబు ప్రత్యక్షమగును. మాన

వుని యీయంతర్దృష్టి బంధింపబడియున్నంత పర్యంతము వాడు వ్యక్తిత్వమనియెడి యంధకారపటలాచ్ఛాదితంబగు సంకీర్ణ దుర్గాంతరాళమున బంధితుడయి యుండును. వ్యక్తిత్వమును వ్యాపక మొనరించి నిజాంతర్గతబృహత్సత్యము నవలోకించుటయే శ్రీ బుద్ధాచార్యు డుపదేశించిన సాధనావిధానము యొక్క లక్ష్యమయియున్నది ఈ లక్ష్యము వ్యక్తిగతజీవితమును విశ్వజీవనముతో నైక్య మొనర్చుటయందు చరితార్థమగును. సాధనమువలన నంతర్దృష్టి బంధనవిముక్త మయినంతనే సాధకుని యాంతరికగూఢతత్వదివ్యపరికాశము గోచరమగును. ఈపరమపరికాశమును మనము బ్రిహ్మమని కాని, అల్లాయని కాని, హోలీగోస్టు అని కాని, ధర్మకాయమని కాని చెప్పుకొనవచ్చును. నామభేదంబున నయ్యది వికృతము కాజాలదు. వీని యన్నింటియొక్క మూలపదార్థ మొక్కటియే· ఇవన్నియు నొక్క నిగూఢంబగు సత్యమును సూచించునవియే యయియున్నవి. సాధనాబలంబుననే శరీరమనంబులకు పారిశుద్ధ్యపటుత్వములు లభ్యమగునట్లు శ్రీబుద్ధాచార్యుడు నుడివియున్నాడు. మనము దేహమును మనముయొక్క బాహ్యావరణయని చెప్పుకొనుచందముననే మనస్సు సహితము దేహముయొక్క సూక్ష్మతమంబగు . సత్తయంబుయున్నది. బాహ్యమునకు దేహరూపంబున గాన్పించు జీవునియొక్క సత్తానుభవముననే లోనిదగు మనస్సని చెప్పదగును· జీవుని

సత్త్వయంతయు నీరెంటియొక్క సమ్మేళనపుష్టియే యని తెలియుడి. దేహమును పరిశుద్ధముగా నుంచుకొను టెట్లవసరమయియున్నదో, యదియే చందమున ప్రవృత్తియొక్క ధూళిని దులిపివేసి మనస్సును పరిశుద్ధమగు దర్పణమువలె జేసి వేయు టెంతయు ముఖ్యము. చిత్తమును బరిశుద్ధమొనరించుట కడు గడుగునకు గఠినసంయమ వ్రతానుష్ఠానమును గల్గియుండియే శ్రీబుద్ధాచార్యుడు నైతికానుశాసనము (శిక్షలు)ః వైపున కిట్టి ధ్యానము నొసంగియున్నాడు. దేవుడు యజ్ఞయాగాది క్రియ లన్నియు నింద్యములనియు, నుత్తమసాధకు సధఃపతితు నొనర్చివేయు కుకర్మలనియు నిరూపించి యాత్మశక్తిద్వారా సమస్తేంద్రియముల వశము గావించుకొని శుభకర్మల నాచరింపవలసినదిగా జాటియున్నాడు. జీవు డొక నిర్మలంబును నిర్వికారంబును నగు మనస్సుతోడ సంసారమున జన్మించు చున్నదను బౌద్ధాభిప్రాయమే విశ్వసనీయమయి యున్నది. అనేకకారణముల మోహప్రభావము మనో సామంజస్యమును నష్టమొనరించివేయునపు డద్దాని ననేకంబులగు ప్రవృత్తియొక్క విషమసమస్య లెదుర్కొనుచున్నవి. అపుడు మానవచిత్తమనేకప్రకారంబులగు తృష్ణలచే విదళితమయి ప్రబలతరంగమాలికల మధ్య బడిపోవు చిన్ననావవలె జలింప నారంభించును. ఈ విషయమయి బుద్ధగీతవలెనే భగవద్గీతయు నీరీతి శాసించుచున్నయది :—

"ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి॥"

అసావధానముగా నున్న నావికుని నావను ఝంఝా మారుత మగాధజలంబున ముంచివేయుచున్నది. అదియే చందమున జిత్తము సంయమరహితముగ నింద్రియముల ననుసరించి సంచరించుచో, నింద్రియభోగవిలాసముల యొక్క లాలస వానిబుద్ధిని హరించివేయును. మానవుని యీ యవస్థనే శ్రీబుద్ధాచార్యు డజ్ఞానావస్థయని నుడివియున్నారు.

ఏతదవిద్యకు వశీభూతుడయి మానవు డహంకారమును సత్యముగ దలంచును; అంత నతడు చిరసత్యమును, శాశ్వతకళ్యాణమును విస్మరించివేయును. ఏతదనిత్యాహంభావమును, నిత్యసత్యమును వీని మధ్యవెలయు ప్రభేదమును స్పష్టముగా సాధకుడు గ్రహింపవలయును. సాధకుడు పడయ వాంఛించు సత్య మనశ్వరము, శాశ్వతము; ఇద్దానికి దేహము వలె జననమరణంబులును నాద్యంతములును లేవు. సాధకుడు నిజాంతరికసత్తను దుష్టాహంబుద్ధినుండి విడబడజేసినంతనే వానికి స్వచ్ఛస్ఫటికంబుపగిది సత్యముయొక్క విమలజ్యోతి ప్రకటితంబగును. అట్టిదశయందు సాధకుడు ప్రత్యేకపదార్థమందు సత్యమునే యవలోకించును. విరాటసత్యముతోడనగు నీసాధకుని సమ్మేళనమే ముక్తి లేక నిర్వాణము. అహంకారమును

నిర్మూలింప బౌద్ధసాధన ముపదేశించు సుపాయమొక్క "నేతి, నేతి" యే కాదు. సాధకు డొకవైపునుండి తన్ను చుట్టబెట్టుకొనును, రెండవవైపునుండి సమస్తప్రాణులయందాత్మీయస్వరూపము నవలోకించును శ్రీ బుద్ధాచార్యుడు మానవజాతి కిట్లుపదేశించియున్నాడు:—

(1) హింస సలుపరాదు.

(2) చౌర్యవృత్తి నేస్థితియందు నవలంబింపజనదు.

(3) వ్యభిచరించుట మహాపాపము.

(4) అసత్యభాషణమునకు గడంగరాదు.

(5) మద్యపానము సేయవలదు

స్థూలదృష్టితో విచారింప నీపంచశీలములును సాధారణ నైతికనిషేధములుగ భావింపబడుచున్నవి. కాని యీనియమములవలన సాధకుని సంయమము గంభీర మగుడు హృదయబల మనుదిన మనూనంబగు వికాసమును బడయును. మానవుని యజ్ఞానమూలకము లగు నీచవృత్తు లన్నియు దూరమయినపుడు హృదయమునందు వివిధ కల్యాణకరములగు సద్గుణము లవశ్య మావిర్భవింపగలవు. హింసావృత్తిని బరిత్యజించి మానవుడు క్రోధరహితుండును క్షమాన్వితుండును నెపుడు కాగల్గునో, అపుడే క్రమక్రమముగా వాని హృదయమునందు జీవకోటియెడ బ్రేమయు దాక్షిణ్యంబును పరివర్ధమానమగును, ధనముపట్ల మానవున కెపు డపారమగులోభము నశించునో;

అపుడే వానిచిత్తమునం దుదారభావోదయంబగును; కామలాలసనుండి విముఖంబయిన మనుష్యుని చిత్తము నిర్మలంబగును. అపుడవ్వాని హృదయంబున నిస్స్వార్థంబగు ప్రేమ యావిర్భవించును. శీలముల యొక్క సమ్యక్పాలనంబున నాత్మజ్ఞానప్రాప్తి యొదవును. ఇందువలన శ్రీబుద్ధాచార్యుని యీశీలములు కేవలము మానవుని బాహ్యముగా గాక, యాంతరికంబుగా సహితము శుభపథానుగామిగ జేసివైచును. గృహస్థులేమి, సన్యాసులేమి, వీరువారను భేదంబులేక సమస్త జనులు ధర్మనీతి నాదరించి వర్తించుచుండవలయును. శ్రీబుద్ధదేవుని స్వతస్సిద్ధములగు నీ "శీలములు" మనుష్యుని యంతర్గతంబగు నైతికబలమును జాగరిత మొనరించుట కెంతయు నుపయుక్తములగును. ఈ 'శీలములే' శుభమార్గముయొక్కయు నిర్వాణము యొక్కయు సోపానములయియున్నవి. దేవుడీయుత్తమోత్తమంబులగు శీలముల నభివృద్ధిజేసి వీనికన్నింటికి మహామంగళములను నామకరణమును జేసియున్నాడు. పాఠకభ్రాతలారా! మహామంగళముల తత్వరసము నాస్వాదింప నువ్విళ్ళూరుచొరండు! నా యభ్యంతరము లేదు!

"మానవుడా!

(1) అసత్పురుషుని సేవింపకుము, సజ్జనుల సేవాశుశ్రూషలు, సాంగత్యంబును జేయుచుండుము. పూజ్యుల నారాధించు చుండుము.

(2) సాధన కనుకూలంబగు స్థానమునం దుండుము. పూర్వ (ఇపుడున్న సమయమునకు ముందని తాత్పర్యము.) కృతంబులగు సుకృతముల నభివృద్ధిసేయ నవిరళకృషిసలుపుము! శీలపాలనమందును, ధర్మకార్యములందును సమ్యగూపంబున నియుక్తుడవయి యుండుము.

(3) బహు సత్యములను, శిల్పము యొక్కయు వినయము యొక్కయు శిక్షను, ఉత్తమవిషయంబులను జనుల కుపదేశించుచుండుము.

(4) జననీజనకుల శుశ్రూష, పుత్రకళత్రాదుల హిత సాధనము, శుభకర్మానుష్ఠానము నిత్యము సేయుచుండుము.

(5) దానము సేయుటయు పరివారకల్యాణసాధనమును విస్మరింపకుము.

(6) పాపాచరణమునెడ ఘృణయు, మద్యపానమం దరుచియు, ధర్మసాధనమందు తత్పరత్వమునుగల్గి వర్తింపుము.

(7) మర్యాదపాలనమును, నమ్రత్వమును, సంతోషమును, కృతజ్ఞతను గల్గియుండుము.

(8) క్షమను, ప్రియవాక్యములను, సాధుసందర్శనమును సన్మానింపుము.

(9) బ్రహ్మచర్యమును, తపమును, ఆర్య సత్య ప్రతిష్ఠయమును గౌరవించుము.

(10) లోకనిందనుండి నిరుద్వేగమును, శోకతాపముల యందు హృదయమున స్థిరత్వమునుగల్గి మనుము."

సమస్తవిధములగు భయవిషాదములనుండి విముక్తిని బడయ నెట్టి గంభీరసంయమముయొక్కయు, మంగళవ్రతసాధనమున కెట్టి గంభీరానురాగముయొక్కయు పరమావశ్యకత కలదో పిపాసువులు సహజముగనే గ్రహింపగలరు. బౌద్ధసాధకులు యాగాదికర్మకాండమందు విశ్వాసమును గల్గియుండరు. వారికి మానవోద్ధారకులగు గురువులుకాని, పురోహితులు కాని యుండలేదు. వారు కామక్రోధాద్యరిషడ్వర్గమునకుదాస్య మొనర్చుచు కుటుంభరిత్వమునకయి విత్తమునార్జింపమానవుల చెంత కేతెంచు పౌరోహిత బృందముకంటెను, సర్వమును త్యజించి సన్యసించిన గురువులమని సన్నిధికి విచ్చేయు శుష్క వేదాంతులకంటెను పరిశుద్ధాంతఃకరణప్రబోధమును, శీలములను, అప్రమత్తతను, తృష్ణారాహిత్యమునే విశేషముగా సన్మానించుచుండెడివారు. బౌద్ధులు సాధనామార్గమునందే కాకులయియుందురు. ఒకవేళ సాధకుడు నిర్బలుడగుచో కేవలము వానికి సిద్ధసాధకులు పథమునుమాత్రము జూపించు చుందురు. ఇంతకుదక్క మరేమియు చేయజాలరు. మానవుని యుత్థానపతనముల కతడే కర్త. గురువులు, ఆచార్యులును కేవలము పథప్రదర్శకులేకాని ఫలప్రదాతలును, ఆపదుద్ధారకులును మాత్రముకారు. సాధకుడేకమాత్రంబగు నాత్మబల

సాహాయ్యంబున సమగ్రసాధనామార్గము నతిక్రమించి గమ్య స్థానమును జేరవలసియుండును.

మృత్యుశయ్య నలంకరించియున్న శుభావసరంబున శ్రీ బుద్ధాచార్య డాత్మీయోపస్థాయకుండగు నానందుని సంబోధించి యిట్లు వక్కాణించి యున్నాడు:—"నాయనా! ఆనందా! నాజీవితము యొక్క యెనుబదివత్సరములు గతించిపోయి నవి. నాసమయము పూర్తియయినది. నేనింక నీప్రపంచము నుండి విముక్తుండ నయ్యెద. కుమారా! ఇంతపర్యంతము నేను నిశ్చింతుడనయి, నిర్భయుడనయి స్వాత్మమీద నే యాధారపడియుంటిని. స్వావలంబనపూర్వకంబుగ వర్తించి యుంటిని. ఆత్మనిర్భరత్వమును విస్మరింపకుడు. దీనినే నేర్వవలసియుండు నెల్లరు. స్వయంప్రకాశకులగుడి, మీకు మీరే యాధారభూతులగుడి. మిమ్ము మీకుతక్కనన్యులపై విశ్వాసమును గల్గి యుండవలదు. జాగ్రత్త! జాగ్రత్త! ఇందెంతయో బౌద్ధనీతి యిమిడియున్నది సుమా!" బౌద్ధసాధనము "లేదు" అనుపదము వైపునకు ధ్యానమొసంగు విధంబుననే యొక్కయద్భుతంబగు "అగును" అనుశబ్దమువైపునకు సహితము ధ్యానము నిచ్చియున్నది. నిర్వాణము నభిలషించు సాధకులు, దుఃఖపీరితులయి జీవుని యొక్క శరీరమును రోగమందిరముగను, క్షణభంగురంబుగను, దుఃఖమయంబుగను, జననమరణాధీనంబుగను తెలియుచందముననే సకలజీవులు సమంబులనియు

నెవ్వియు ఘృణాపాత్రములు కావనియు నెంచుచుందురు. వారు సమస్తజీవములయందు సమానమగు దివ్యప్రేమను గల్గియుందురు. సాధకులు సమగ్రసంసారముయొక్క దేవ మానవజీవజంతువులయొక్క హితాకాంక్షయందే తన్మయు లయి యుందురు. శత్రుమిత్రుల హితాభిలాషలచే వారిహృద యములు పరిపూర్ణములయి యుండును. సమస్తజీవములు రోగ శోకవ్యాధి మృత్యువులనుండి విముక్తిని బడయుగాత్మమ్మను కాంక్షనే బౌద్ధసాధకులెల్లరు హృదయమందు సర్వదా కలి గియుందురు. దుఃఖితులయొక్క విషాదము నుపలక్షించినం తనే బౌద్ధసాధకుల హృదయములు కరుణారసపూరితము లగు చుండును. సౌఖ్యవంతుల మహదానందమునుగాంచ వారి చిత్తములపూర్వానందముచే బులకితంబులగును; వారుసర్వదా యీరీతి భావించుచుందురు :—

"దిట్ఠావా యేచ అదిట్ఠా యేచ దూరేవసంతి అవిదూరే।
భూతోవా సంభవేసీవా సబ్బే సత్తా భవంతుసుఖితత్తా॥"

దృష్టాదృష్టజీవములేమి, దూరవాసులేమి, నికటవాసు లేమి, భూతకాలము వారేమి, భవిష్యత్కాలము వారేమి వీరు వారనక సకలజీవులు సౌఖ్యవంతములయి యుండుగాత! మైత్రి, దయ, ముదిత, అశుభము, ఉపేక్ష,యను నీపంచవిధ ములగు భావనలయందు బౌద్ధసాధకులు నిరంతరము ధ్యాన ముగ్గల్గియుందురు.

బౌద్ధసాధనమును జ్ఞానమూలకంబగు ప్రేమసాధనమని చెప్పదగును. కోసలరాజ్యాంతర్గతమగు మనసాకృతగ్రామము నందు నామ్రవాటికయం దొక్కదివసము శ్రీబుద్ధాచార్యుడు ధర్మోపదేశము నొసంగుచుండెను. తత్సమయమందే భరద్వాజ వసిష్ఠులను బ్రాహ్మణకుమారు లిరువురు ధర్మప్రసంగము సేయు సంకల్పముతో దేవుని దివ్యసన్నిధి కేతెంచియుండిరి. అపుడు దేవు డిరువుర కిట్లుద్బోధించియుండెను. "బుద్ధుని ధర్మ సాధనారంభమున బ్రేమయే ప్రకాశము. ప్రేమయే ధర్మసా ధనము యొక్క యున్నతియు గతియు నయియున్నది. ఈసాధ నము యొక్క పరిణామము ప్రేమయె." బుద్ధుడు ప్రేమపరిపూ ర్ణంబగు నిజచిత్తమును బ్రహ్మాండము యొక్క చతుర్దిశల వ్యాపింపజేసియుండెను. ఈచందమున బుద్ధున కుపరిభాగంబును, అధోభాగంబును, అగ్రిభాగంబును, పృష్ఠభాగంబును ప్రేమరస పరిప్లుతములయి యెప్పుడుండగలవు. విశ్వప్రేమ లేక విశ్వమైత్రి బౌద్ధశాస్త్రమునం దత్యంతమగు విశదరూపంబున బ్రతిపా దితమయియున్నది. విజ్ఞానమయదృక్కుల నవలోకింప బౌద్ధశా స్త్రగ్రంథముల విశుద్ధవిశ్వప్రేమ మూర్తీభవించి స్ఫురద్రూ పంబున వెలయుచుండు నట్లు తెలియును. బౌద్ధశాస్త్రముల యందు భిక్షువు లేప్రకారము ప్రేమయుక్తములగు చిత్త ములద్వారా దిగ్దిగంతముల బ్రకాశవంతములు గావింప సమర్థు లగుదు రను ప్రశ్న యుకలదు. ఆప్రశ్నమున కీరీతి నుత్తరము

వ్రాయబడియున్నది:—"సంసారమునందు జనులు ప్రియవ్యక్తు లగాంచి వారితోడ మైత్రి సంపాదించు విధంబుననే బౌద్ధ సన్యాసులు విశుద్ధభావముతోడ సకలజీవులయందు మైత్రిభావ మును గల్గియుండవలయును. 'అభిధమ్మపిటకము' నందు మైత్రిభావము యొక్క లక్షణ మీచందమున వర్ణింపబడియు న్నది:—సమస్తప్రాణులు శత్రురహితములయి, బాధారహి తములయి, ప్రసన్నచిత్తములతోడ వర్తించుచుండుగాత మ్మని బౌద్ధసాధకులు హృదయమున విచారించుచుందురు. సకల ప్రాణులు, సకలజీవులు సమస్తవ్యక్తులు, వేయేల? జన్మించిన వన్నియు నిర్వైరభావంబుతో నిశ్చింతగా మెలంగుగాత! సకలస్త్రీపురుషులు, సమస్తారార్యనార్యులు, సకలదేవమాన వులు, నరకాదులయందున్న యెల్లజీవములు శత్రుభావమును వీడి, బాధను రూపుమాపి, సుఖపూర్వకంబుగ వర్తించుగాత మ్మని బౌద్ధసాధకులు చింతించుచుందురు.

బౌద్ధసాధకుని ధ్యానము నాల్గు విషయముల గల్గి యున్నది.

(1) నిర్జనస్థానమునందు ధ్యానముసలిపి చిత్తమును సమస్తవిధంబులగు పాపలాలసలనుండి విముక్త మొనరించుట. (2) పూర్ణానందము యొక్కయు సౌఖ్యము యొక్కయు ధ్యాన ముచే చిత్తము నేకాగ్రమొనరించుట (3) ఆధ్యాత్మిక ధ్యాన

ముచే జిత్తమును బ్రసన్నముగావించుట (4) చిత్తమును సాంసారికసుఖదుఃఖముల జాలములనుండి విడిపించి పారిశుద్ధ్యము యొక్కయు శాంతి యొక్కయు మధ్యభాగంబున విహరింపజేయుట. బౌద్ధసాధకుని పరమలక్ష్యము బుద్ధత్వప్రాప్తియె. అజ్ఞానమనియెడి కల్మషముచే జిత్త మావృతమయి యుండు హేతువుచే మానవులు స్వార్థపరాయణులయిపోవుచుందు రనురహస్యమును బౌద్ధసాధకు లెఱుంగుదురు. చరమలక్ష్యము యొక్క విషయమున మూర్ఖులగుటంజేసియే మానవులు ప్రవృత్తికి దాసులగుచున్నారు. సమస్తజనులను మనలనుండి భిన్నముగానున్నారని భ్రమించుకారణంబుననే మనము క్రోధాంధులమయి, హింసాద్వేషాద్యగ్నుల కింధనప్రాయుల మగుచున్నారము. జ్ఞానమువైపునకు బౌద్ధసాధన మొసంగిన ప్రగాఢధ్యానము నవలోకించి దూరదృష్టిలేని పామరులీసాధనమును నీరసంబనియు నేకాంగియమనియు భావించియవహేలన సేయుచుందురు. బోధి (ఆత్మసాక్షాత్కారము) నే చరమలక్ష్యముగా గొన్న బౌద్ధసాధనము జ్ఞానసాధనమే యన్న సత్యోక్తికానేరదు. బౌద్ధసాధనము యొక్క యుత్పత్తి, ప్రయాణము, పరిణతి మొదలగునవన్నియు ప్రేమాంతర్గతములేయని గ్రహింపవలెను. విశుద్ధ విశాల విశ్వ ప్రేమప్రసారమే బౌద్ధసాధకుని దైనికసాధనము. మౌనధ్యానములవలననే యిది తెలియనగును.

"అంగుత్తరనికాయమున ప్రథమనిపాతము" యొక్క ద్వితీయవర్గమందు బుద్ధదేవు డిట్లు నుడివియున్నాడు :—"ఓనా ప్రియమయిన భిక్షువులారా! కామనోత్పత్తిని నిర్మూలించునట్టికాని, ఉత్పన్నమయి మనువాంఛను విధ్వంసమొనర్చునట్టికాని ప్రభావమును గల్గియున్న ధర్మమును నే నింతపర్యంత మెటను గాంచియుండలేదు. జ్ఞానపూర్వకంబుగ శరీరానిత్యత్వమునుగూర్చి విచారించుచున్నచో కామలాలస యుద్భవింపజాలదు. పుట్టిపెరుగు కామాభిలాష నశించిపోవును. పరుల కనిష్టమును గావించు కామమును నశింపజేయునట్టియు, హింసను, రూపుమాపివేయునట్టియు, ఉద్భవమయి ప్రసరించు హింసాత్మకంబగుబుద్ధిని నిర్మూలించునట్టియు ప్రభావమును గల్గియున్న యొక్క ధర్మమునయిన నే నవలోకించియుండలేదు. ఓ! భిక్షువులారా జ్ఞానపూర్వకంబుగ మైత్రిభావమును మననము సేయుచుండుటవలన హింసాత్మకజ్ఞాన ముదయింపజాలదు, ఉత్పన్నమయియున్న హింసాద్వేషములు నష్టమయిపోవును. మనన్ను సకలప్రాణులతోడ ప్రేమభావమునుగల్గి వర్తించుట వలన కామక్రోధంబులను, పరానిష్టచింత ఔద్ధత్యము మొదలగు దుర్గుణము లన్నియు మూలసహితంబుగ నశించిపోవును. బౌద్ధసాధనప్రశస్త్యవర్ణనము కల్పనాశక్తి కతీతము!



## బౌద్ధసాధనము

### (ద్వితీయ సోపానము)

అవిద్యతోడి సంగ్రామము సలుపుటయే బౌద్ధసాధనము యొక్క ప్రథమ లక్ష్యము. బోధివృక్షతలంబున శ్రీబుద్ధాచార్యు డుపవిష్టుడయి ధ్యానమననాదుల జేసియున్న శుభ వాసరంబుననె మనుష్యజీవితము యొక్క దుర్జ్ఞేయరహస్య మాదేశనకు సంపూర్ణముగా విశదమాయెడిని. అతడు తనకు నవీనముగా బ్రాప్తించిన ప్రజ్ఞాదృష్టిప్రభావంబున నవిద్యచే సంస్కారము, సంస్కారమువలన విజ్ఞానము, విజ్ఞానముచే నామరూపములు, నామరూపములవలన షడాయతనములు, షడాయతనములచే స్పర్శము, స్పర్శచే వేదనము, వేదనమున తృష్ణ, తృష్ణచే నుపాదానము, ఉపాదానమువలన భవము, భవమువలన జన్మప్రాప్తమగుచున్నదని గ్రహించెను. ఈ జన్మవలననే మానవుడు రోగ శోక జరావ్యాధి మరణ దుఃఖ యంత్రణలకు జిక్కుచుండును. మానవుని దుఃఖాస్తిక్యమును, దుఃఖోత్పత్తిహేతువును, నివృత్త్యుపాయమును నిర్ధారణ చేయుటయందే మహాపురుషుండగు శ్రీబుద్ధాచార్యుని ప్రతిభ యంతయు వ్యయమయినది. అవిద్యనే దేవుడు మూలవ్యాధి యని నిశ్చయించి యున్నాడు.' ఏతదవిద్యానాశనంబుననె మానవుడు నిర్వాణమును గాంచగలుగుని. శ్రీబుద్ధాచార్యుడు

ధమ్మపదము (బుద్ధగీత) నం దిట్లు సెప్పియున్నాడు:—'అవిజ్జా పరమంమలం'. దేవుడు సాధకునుద్దేశించి యిట్లు నుడివి యున్నాడు:—"ఏతం మలంపహాత్వాన నిమ్మలా హోథ భిక్ష వో." ఓ భిక్షువులారా! ఈమాలిన్యమును విసర్జించి పరిశుద్ధు లగుడి. ఈయవిద్యావినాశార్థమేయత డష్టవిధార్యమార్గముల మానవజాతికి జూపించియున్నాడు. వీనితోడ సంగ్రామ మొనరించుటకే సాధకునకు మైత్రి, కరుణ, ముదిత మొదలగు సద్గుణము లావశ్యకమయియున్నవి. ఈకారణంబుననే దేవుడు మానవజీవితాపరిహార్యదుఃఖములగూర్చియు సర్వజీవైక్యతను గుఱించియు దీర్ఘముగా విచారించియున్నాడు. ఈయథమాధ మంబగు నవిద్య (మహామాలిన్యము లేక మహామాయ) ను రూపుమాపివేయుటయే శీలగ్రహణము యొక్క తాత్పర్యము.

ఈ యవిద్యను కొంతవఱకు నశియింపజేసి సాధకుడు సాధనక్షేత్రమునందు ప్రవేశించినప్పుడు సహిత మీయవిద్య పాపప్రలోభనములయొక్క యనేకరూపములధరించి చతుర్దిశల నుండి సాధకు నాక్రమించివేయును. అవిద్యయే తన్ను సంసారమునుండి వేరుజేసి క్షుద్రాహంభావము యొక్కయు, సంకీర్ణత యొక్కయు దుర్గాంతరాళమున బంధించిన విషయము సాధకు డెల్లపుడు గ్రహించియేయుండును. ప్రాయికంబుగా సాధకుడు మధ్యమధ్యం చకితుని చందాన నిజాపూర్వమహా సత్తానుభవమును బడయుచునే యుండును; కాని యాజ్ఞా

నము సుస్థిరమయియుండదు; అది తనకుదగ్గిసత్తనే సత్యమని నిత్యము భావించి భ్రమించుచుండును. అవిద్యవలననే పరివర్తకుని చిత్తమునందపుడపుడు నిజావలంబితార్యమార్గములయెడ నవిశ్వాసము జనించుచుండును, అపుడపుడతడు సద్ధర్మము పట్లను సత్కర్మలయెడను శ్రద్ధాభక్తుల గోల్పోయి యధీరుడయిపోవుచుండును. ఉన్నది లేదను భావతరంగముల నాందోళితమయియున్న చిత్తము నాధారము జేసికొనియే యాసాధకుడు సాధనకార్యమునందగ్గిసరుడు కావలసియుండును. వాడలసుడు కాక "అభిత్థరేథ కళ్యాణే పాపాచిత్తం నివారయే" చిత్తముయొక్క సమస్తపాపముల విధ్వంస మొనర్చి శుభమార్గము వైపునకు దృఢసంకల్పముతో బదుగిడుచుండును. వాని శుభోద్యమంబును, ధర్మనిష్ఠయు నొక్కొక్కటిగా సంశయములనెల్లరూపుమాపి వేయుచుండును. వాని సాధనమార్గమునందలి విఘ్నపరంపరల కంతములేదు. సాంసారికభోగలాలసములును, పారలౌకిక సుఖేచ్ఛలును అహంకారమును సాధకునిసమ్ముఖంబున సుదృఢ భిత్తికలవలె నిలువబడియుండును. అతడు శీలపాలనమందును ధర్మసాధనమందును స్థిరచిత్తుడయిక్రమక్రమముగానాభిత్తికలభగ్న మొనర్చివేయును. అనుదిన మధ్యవసాయపరిభావంబున శనైఃశనైః విఘ్నములన్నియు దూరమయిపోవును. అతడనుదినము నిజస్వాభావిక సాధువృత్తుల నభివృద్ధిసేయ జూచుచుండును. నవీనసద్గుణగణ

ప్రాప్తికయి నిత్యమతడు ప్రయత్నము సలుపుచుండును. వాడు సావధానుడయి నిజహృదయాంతరాళమందలి సమస్త చిర సంచితపాపములనెల్ల దొలగించి పారిశుద్ధ్యమును బడయుచుండును. మరియు నత డాత్మీయచిత్తమునకు శుభాభిలాష యని యెడి కవచమును దొడిగి ధర్మశాస్త్రమునందు పాపాక్రమణ మార్గమునందు ప్రతిబంధకముల నొదవజేయుచుండును.

ఈ ప్రకారముగా ఘోరసంగ్రామ భూమిమధ్యగా నడచి బౌద్ధసాధకు డవిద్యను కొంతవఱకు నశియింపజేసి సాధనము యొక్క శుభక్షేత్రమున బ్రవేశించినంతనే పూర్ణముగా నవిద్యాబీజములు దగ్ధమయిపోవ మహాబోధి లభ్యమగును. ఈయవస్థయందే సాధకు డాత్మీయ క్షుద్రసత్తను విశ్వసత్తతో నేకీభవింపజేసి యాత్మస్వరూపమును సందర్శించును. ఈచెప్పబడిన సాధనప్రణాళిక యకస్మాత్తుగా భువి కవతరించిన నవీన విధాన మెంతమాత్రమును గాదు. మన పూర్వమతాచార్యులు ప్రకారాంతరముల స్వల్పముగా నీమతమును స్వీకరించియే యుండిరి. ఈ సాధనావిధానమునందు ఘోరతపశ్చర్య త్యాజ్యమని నుడువబడిన వధువుననే యమనియమాది రహితంబులగు భోగవిలాసములును వ్యర్థములేయని గ్రహింపనగును. బౌద్ధసాధనపద్ధతి ప్రేమవిహీనమగు శుష్కజ్ఞాన మెంతమాత్రము కానేరదు. అజ్ఞానము వికృతప్రేమగాని కేవల భావోన్మాదముగాని కాదు. బౌద్ధసాధనము యోగభోగ

ముల సామంజస్యము. జ్ఞానప్రేమల సమన్వయము. యథా శక్తి సకలాశుభముల త్యాగము. మంగళమయకార్యానుష్ఠానము. చిత్తమును సమస్తవిధ సాంసారిక సమస్యా విఘ్న పరంపరలనుండి విముక్త మొనరించి, జీవప్రపంచముతో నైక్యము గావించుట మొదలగు ధర్మభావములతో వర్తించునదియే బౌద్ధసాధనమని సంక్షిప్తముగా దెలియనగును. నిత్యానూనాపూర్వపరిశుద్ధ సర్వవ్యాపక జ్ఞానవ్యాపనమే యీయుత్తమోత్తమంబగు సాధనముయొక్క పరమావధి.

బౌద్ధ ధర్మరాజము దార్శనిక విచారాధారముపయి ప్రతిష్ఠింపబడినది. దీని యీ యాధార మెంతయు బలవత్తరమయినదియు గానిదియు విజ్ఞులే యూహించుకొందురుగాత! ఈ ధర్మముయొక్క శీలములును, విశ్వప్రేమ (మైత్రి) యు మానవ సమాజహృదయము నెంతయు బరిశుద్ధమొనర్చినవని ప్రతిపండితుడు తప్పక చెప్పియేతీరును. ఈధర్మముయొక్క పరిశుద్ధతత్త్వము జ్ఞానరూపంబున సాధకుని (వేదాంతి) హృదయమున బ్రవేశించుట యటుండ, ప్రప్రథమాధర్మతత్త్వాంశము సకలజీవప్రపంచశుశ్రూషాహితసాధనమునందు మూర్తిమంతమయి యపూర్వంబగు లాభమును దర్శింపజేయుటయు సత్యేతరమయిన విషయముకాదు. ప్రధానముగా బౌద్ధసాధకులు దయకే ధర్మక్షేత్రమున నం దాధిక్యము నొసంగి యున్నారు. వారు సూర్యాతపముచే వ్యాకులచిత్తు లయిన

వారికి వృక్షచ్ఛాయను, దాహపీడితులగు పథికులకు మార్గ మధ్యంబున విశ్రామభవనములను, అసహాయులకు జాతిభేదం బులేక యనాథ శరణాలయములను, నిస్సహాయ వ్యాధిగ్రస్తుల కౌషధాలయములను, అజ్ఞానాంబుధి నిమగ్నులగు సంసారు లకు జ్ఞానప్రబోధమును సలుప బౌద్ధవిహారమందిరాంతర్భాగ ములగు బోధనాలయములను నిర్మింపజేసి యున్నారు. బౌద్ధ సాధకుల యసాధారణానిర్వచనీయంబగు స్వార్థత్యాగము, దృఢసంయమ వ్రతానుష్ఠాన మాహాత్మ్యము, దయాప్రేమో జ్జ్వల సజీవదృష్టాంత సముదాయములు ధర్మపిపాసువులగు పాఠకభ్రాతల హృదయముల విస్మయానందవార్ధుల దేల్చి వేయును.

బౌద్ధసాధకుని చరమలాభము నిర్వాణము (మహాశాం తినిలయము లేక సుగతి). సాధనపద్ధతివలన వారు పరమలక్ష్య స్థానము (కేంద్రము)ను గూర్చి పర్యాలోచించుటవలన నిర్వా ణమన విశుద్ధజ్ఞానము యొక్కయు విశుద్ధప్రేమ యొక్కయునంతి మపరిణామమయినటుల స్పష్టమగుచున్నయది. ఈనిర్వాణము మూఢహిందూ వేదాంతులు భావించుచందమున శూన్యత్వ వాచకమయినదికాదు. ఈ సాధనము యొక్క నిర్వాణము సకలదుష్ప్రవృత్తుల యొక్క నిర్వాణమనియే తెలియుడు. క్షుద్ర మమకార నిర్వాణమ్ము, హింసాద్వేషాది పాపలాలసలచే మం డుచున్న మహానలజ్వాలా నిర్వాణ (నిత్యోపశాంతి) మయి

యున్నది. మరొక్క విధముగా విచారించిన నిర్వాణము పాప ప్రవృత్తుల యొక్క నిర్వాణము, కాని ప్రేమనిర్వాణముమాత్రము కాదు. ప్రేమవ్యాపనము, క్షుద్రసత్తా నిర్వాణము, విరాట సత్తా నిర్వాణము కాదు. విరాటసత్తానుసంధానమున సపూర్వమగు విజయము; అశుభనిర్వాణము, కల్యాణ నిర్వాణము కాదు,— కల్యాణాన్వేషణము.

దార్శనిక విద్వన్మండలి నానావిధములుగ నిర్వాణతత్వమునకు గావించిన వ్యాఖ్య లతి విచిత్రములు! వారు తమ తమ మతముల సమర్థించుకొను నిమిత్త మనేక విధములగు యుక్తి ప్రయుక్తుల నుపయోగించుచుండిరి. నిర్వాణము యొక్క తాత్పర్యము శూన్యత్వమేయని బౌద్ధశాస్త్రము బోధింపుచున్నచో నిదియు నొక్క యనిర్వచనీయంబగు పరమ పదార్థమేయని గ్రహింపనగును. ఈ దివ్యంబగు శూన్యత్వము "నాస్తికత" యెంతమాత్రము కానేరదు. ఇయ్యది "నాస్తికతకును, ఆస్తికతకును" భిన్నమగు పదార్థము; వాఙ్మనంబుల కగోచరమయి, యనశ్వరమయి, అప్రమేయమయియుండునది. ఈ శూన్యత్వమునకె పరమాత్మ, పరబ్రహ్మ, విశ్వసత్త, పూర్ణత్వము (Everlasting yea) లేక యీమహాచ్ఛ్రీణి యొక్క మఱే యేదివ్యనామంబునయిన నొసంగుచో మనవారి భ్రమయు నిరాధారమయినదని నిర్ధారణంబగును. సంపూర్ణ

ముగా మర్మమును బాసి నాస్తిక్యమును బోధించి యాస్తికత్వ
మును దూషించు శూన్యతయే యగుచో దానికి నీతి నియ
మంబులతోడను, సత్యాసత్యములతోడను ధర్మాధర్మముల
తోడను, సంయమ వ్రతంబులతోడను, జీవకారుణ్యముతోడను
విశ్వ ప్రేమతోడను, పారలౌకికజ్ఞాన ప్రపత్తితోడ నేటి
కీనిండయిన నెయ్యము? నిరంతరాపార పరిశుద్ధా హింసాత్మకం
బగు నపూర్వశాంతిస్థాపన యేల శూన్యతాబోధకంబగు నిర్వా
ణము నభిలషించు బౌద్ధమతము సేయ హృదయసర్వస్వమును
నీవసుధ సమర్పించి యావద్విశ్వవ్యాప్త ధర్మజ్ఞాన పిపాసు
వులనున్న నల గన్నది? అహంకార మమకారముల నిర్మూలించు
టయే ముఖ్య కర్తవ్యముగాగొన్న సర్వేశ్వరమతంబగు బౌద్ధ
మూ నాస్తికత నాపాదించునది మానవ హృదయమునకు?
బాహ్యానుష్ఠానములతోడను, వృథా వాగ్వివాద విలాస పరి
పూర్ణములగు నుపనిషన్మతములతోడను, చిత్తవికాస ప్రతి
బంధకములగు సాకారవికార ప్రకారోపాసనా విధానముల
తోడను నెయ్యమున కియ్యకొను మూఢపౌరాణికులు పర
మతసహనదూరులయి యథవా నిజమతాంధభక్తి విశ్వాసప్రే
రితులయి బౌద్ధమతమును నాస్తికంబందురేమోకాని మాన
వులు—యుక్తాయుక్త పరిజ్ఞాతలగు మానవులు—ధర్మ తత్వ
జ్ఞాన సంపన్నులగు మానవులు. స్వప్నమందయిన నిట్లు నుడువ
జాలరు, నుడువజాలరు, నుడువజాలరు !!! జ్ఞానమూలకంబగు

"నేతి" ద్వారా బౌద్ధసాధకు డాత్మీయాహంబుద్ధిని నిత్యము క్షీణింపజేయ యత్నము సలుపుచునేయుండును. వారు "ఉస్సు కేసు మనుస్సేసు విహరామ అనుస్సుక" విషయాసక్తులమధ్య ననాసక్తులరయియుందురు. వారు విశుద్ధ జ్ఞానావలంబనమున "జిఘచ్ఛా పరమారోగా సంఖారా పరమాదుఖా" హింసనే మహారోగంబుగ మదినెంచి, పూర్వార్జిత సంస్కారము (కర్మ) నే పరమదుఃఖమని భావించి యతులనీయానందశాంతి ధామం బగు నిర్వాణమునకయి ఘోరకృషి సేయుచుందురు. ఈకృషి నీచందమున సలుపుచునే వారు రెండవవైపున నాత్మీయాంత రిక విశుద్ధసత్తను మైత్రిభావముచే భూలోకమునుండి స్వర్గ లోకపర్యంతము వ్యాప్తమొనరించివేయుచున్నారు. బౌద్ధసాధ నము యొక్క యథార్థమగు మర్మమును గుర్తెఱుంగ నభిల షించువా రుపర్యుక్తములగు నుభయవిషయముల సాంగో పాంగముగా గ్రహింపవలసియుండును. అపుడే వారికి బౌద్ధ ధర్మము నాస్తికత్వ బోధకమయినది కాదనియు నతీతంబగునట్టి యాస్తిక్యము నుపదేశించు దివ్యమతమనియు గోచరము కాగలదు.

తుదిసెజ్జపయి పండియున్న శ్రీబుద్ధాచార్యు డుపదేశిం చిన యీసాధనముయొక్క దివ్యపథము "మహాపరినిబ్బాన సుత్త" మందు వర్ణింపబడియున్నది. ఇందు దేవుడు చతుర్విధ ములగు ధ్యానముల గూర్చియు, చతుర్విధములగు ధర్మచేష్టల

గుఱించియు, చతుర్విధంబులగు బుద్ధిపాదముల గూర్చియు, పంచపథములగు నైతికబలంబులగుఱించియు, సప్తవిధంబులగు బోధలగూర్చియు, అష్టవిధపథములగుఱించియు, సద్గ్రంథమందే లేటతెల్లము గావించియున్నాడు. ఆదేవు డుపదేశించిన యీ సాధనము విశుద్ధజ్ఞానముయొక్కయు, ప్రేమయొక్కయు సాధనమె. "ఉరగవగ్గుయొక్క మేత్తాసుత్త" (బౌద్ధగ్రంథనామమిద్దియ) మునందు సాధకునిమైత్రి శుభభావనము గుఱించియు జేయబడిన యభివర్ణన మెంతయు హృదయరంజకముయి యున్నది. శాంతిపథలాభమును హస్తగతము గావించుకొన నభిలషించువారు కర్తవ్యపాలనమందు కుశలురయి, సరళస్వభావులయి, వినమ్రులయి, నిరభిమానులయి యుందురుగాత! వారి కత్యల్పసంఖ్యాకములగు పదార్థములయొక్క యావశ్యకతయే యుండుగాత! వారల్పమునందే సర్వదా మనస్తుష్టిని గల్గియుందురు గాతమ్మని దేవుని యామహోత్తమపునీత బౌద్ధ శాస్త్రమునందు లిఖియింపబడియున్నది. వారల కేవిధమయిన దుర్భావనకు హేతువు వాటిల్లకుండుగాత ! వారు జితేంద్రియులయి, సదసద్వివేచనాపరులయి, స్థిరచిత్తులయి, అనాసక్తులయి, ధీరులయి వర్తించుచుందురు గాత! వారలేవిధములయిన సాధారణ పాపములనయిన సలుపకుందురుగాత ! సకలజీవములు సౌఖ్యములను నిరాపదను బడయవలయునను భావమునందే వారు సర్వదా వర్తించుచుందురుగాత! సబలులు, దుర్బలులు, సమీప

వర్తులు, దూరప్రదేశవాసులు వీరు వారననేల సమస్తప్రాణులు పిపీలికాది బ్రహ్మపర్యంతము సుఖశాంతుల ననుభవించుచుమను చుండుగాతమ్మని వారభిలషించు చుందురుగాత! వార లెవ్వా రిని కపటవ్యూహమున బడద్రొబ్బక, యేజీవముల గాంచియు నీర్ష్యజెందక, క్రోధాంధులయి యెవ్వారిని శాపగ్రస్తుల జేయక పరానిష్టచింతన సేయక నిత్యము జీవించుచుందురిగాత! మాతృదేవి నిజజీవిత సౌఖ్యసౌకర్యముల నెల్ల దృణప్రాయ ములుగదృజించివేసి సంతాన హితకార్య పరతంత్రియయి సమయమును వ్యతీతము సేయు భంగియే వారు (బౌద్ధసాధ కులు లేక వేదాంతులు) సమస్త జీవరాసులమీాద నపారంబగు నిర్వ్యాజ వాత్సల్యమును, పరిశుద్ధ ప్రేమభావములను, దయాదృష్టిని గల్గియుందురిగాత! వారు సర్వకాల సర్వావస్థ లయందు సంసారమున జతుర్దిశల నాత్మీయ హింసారహితం బును, శతృత్వశూన్యంబును, విఘ్నబాధా విహీనంబును, నపరిమేయంబునునగు ప్రేమను వ్యాపింపజేయుదురు గాత! వారు నిలువబడియున్నను, కూర్చొనియున్నను, నడచుచు న్నను, భుజియించుచున్నను, నిదురించుచున్నను, అవస్థాభేదం బులేక నిత్యము విశుద్ధ విశ్వప్రేమ వ్యాపనమును విస్మరింప కుందురుగాత! మైత్రిభావ ప్రచారసంలగ్నంబగు చిత్తమే సర్వోత్కృష్టంబగు నవస్థ నవలంబించుననని దేవుని యభిప్రా యము. బౌద్ధశాస్త్రమిద్దాని నే "బ్రహ్మవిహారము లేక జీవిత"

మని నుడువుచున్నయది. బౌద్ధసాధనము యొక్క శీర్షస్థానమందే యనిర్వచనీయంబులగు నీరెండు (విశ్వప్రేమ, మంగళమయ ధర్మము) ను విద్యమానమయి యున్నవి. ఈ పరిశుద్ధమగు సాధనము పరిణామమునందు మానవుని నీచస్థితికి గొనిపోవదు.

మహాత్ముండును, లోకమాన్యుండును, కవిసార్వభౌముండును నగు డాక్టరు రవీంద్రనాథ ఠాకురుగా రీవిధంబున బౌద్ధమతమును గుఱించి తన ఘనమయిన యభిప్రాయము నొసంగియున్నారు :—

శ్రీబుద్ధభగవానుని వాస్తవిక తాత్పర్యమును గ్రహింప నుంకించువారు, వారి శిక్షావిభాగము యొక్క Negative (అభావార్థకమయినది) యంశమును గాంచుటవలన బ్రయోజనము సుంతయు గలుగనేరదు; దేవుని శిక్ష యొక్క Positive (భావార్థక మయినది) భాగము నవలోకింపుచో స్పష్టపడగలదు. దుఃఖమును దూరమొనరించుటయే బుద్ధాచార్యులవారి ముఖ్య తాత్పర్యమగుచో వాసనానివృత్తివలననె విషాదాస్తిక్యము నొకించుక కార్యము సిద్ధింపగలదు. సమగ్ర బ్రహ్మాండముతో మైత్రిని గల్గియుండుటకు దాత్పర్యమేమి? ఇద్దానిచే దేవుని దివ్యోపాఖ్యానము విశ్వప్రేమ వైపునకు• విశేషించి పరుగిడినటుల విశదమగుచున్నయది. మన.

యహంభావమును, మమకారమును మనల స్వార్థబంధనముల బంధించివేయుచున్నయవి; విశుద్ధ విశ్వప్రేమవైపునకును పరిశుద్ధానందము దిక్కునకును మాత్రము కాదు. ఏతత్కారణంబున నహంభావమును నస్తవ్యస్తమొనరింప సహజముగా మన కాయానందలోకము ప్రాప్తింపగలదు. "చిత్ర" యందు "పూర్ణిమ" యను శీర్షికతో నొక్కగీతము కలదు. అందీచంద మున లిఖియింపబడి యున్నది:—నేనొక దివసము సూర్యాస్తమయకాలంబున నావ నధిరోహించి సౌందర్య తత్వమును గూర్చిన యొక దివ్యగ్రంథమును పారాయణము సేయుచు గ్లాంతుడనయినంతనే యుద్విగ్నచిత్తుండనయి దీపము నార్పి వైచితిని. దీపజ్యోతి మునిగిసినంతనే వాతాయన మార్గమునుండి సుధాకరుని దివ్యశుద్ధా పూర్వజ్యోత్స్న ప్రవాహము ద్రుతగమనంబున నేతెంచి మామకంబగు కక్షాంతరాళమును ప్లావిత మొనరించెను. నా మేజాబల్లపయి వెలుగుచున్న చిన్న దీప మున్నంతపర్యంతము విశాలాకాశంబునందంతయు వ్యాపింపగల్గిన చంద్రిక గృహమునందు ప్రవేశింప జాలకపోయెను. నావయొక్క బాహ్యప్రదేశంబున భూలోకమును, స్వర్గలోకమును శాచ్ఛన్నము గావించివైచిన దివ్యప్రకాశమును నేనణుమాత్రమయిన గాంచలేక పోయియుంటిని. ఇదియే చందమున నహంభావము నొక సాధారణమగు దీపమువంటిది. ఈ యల్పమగు దీపమే మనహృదయమునందధివసించి మన

బోధశక్తి (జ్ఞానసామర్థ్యము)ని చతుర్దిశలనుండి యాక్రమించి పైచినది. మన మనంతగగనవ్యాప్తమగు నానందరాశి నవ లోకింప నసమర్థులమయి యున్నాము. ఈ యహంకారమను దీప మేనాడు చల్లారిపోవునో యాదివసమందే యాయనిర్వచ నీయంబగు నానందము సంపూర్ణరూపంబున మన సన్నిధాన మున బ్రత్యక్షము కాగలదు. ఇందువలన శ్రీ బుద్ధదేవుని యానంద మిదియేయని బోధపడుచున్నయది; ఈ యానంద ప్రాప్తియే బౌద్ధుల పరమలక్ష్యము. లోక లోకాంతరముల యొక్క జీవకోటితోడ విశుద్ధప్రేమను గల్గియుండుడను శ్రీ బుద్ధాచార్యుని వచనమువలన వారి సాధనముయొక్క చరమఫల మీవిరాటానందమే యని బోధయగుచున్నయది. విశ్వవ్యాప్తమగునీప్రేమను సత్యస్వరూపంబున బడయ వాం ఛగలవారు నిజాహంభావమును బూర్ణముగా నశింపజేయవల యును. ఈయుత్తమశిక్షను బ్రజాసంఘమునకు బ్రసాదించుట కే దేవుడవతరించియున్నాడు. లేనిచో విశుద్ధాత్మమహాత్మ్యకథల నాకర్ణింప సంసారముయొక్క యసంఖ్యాకులగు పామర, పండి తులేల యాదేవుని జతుర్దిక్కులనుండి చుట్టుముట్టియుందురు?

రవీంద్ర కవీంద్రుని యీసారగర్భితములగు వాక్యముల యం దెంతయో మహదర్థము కేంద్రీభూతమయి బౌద్ధమతము యొక్క ప్రత్యక్ష ప్రాశస్త్యము నుద్ఘోషించుచున్నయది.

ప్రాచ్య పాశ్చాత్య పూర్వార్వాచీన వేదాంత విద్యావిశార దుండును, సకలలోక పూజ్యుండును, విశాల సంసారవ్యా ప్తయశశ్చంద్రికా విరాజితుండును, వేదాంత మహీచక్రి దిగ్విజయుండును, సార్థక నామధేయుండునునగు వివేకానం దుని "బౌద్ధమతము వైదికమునకు భిన్నము కాదు" అనువ్యా సాంశముల బాఠకలోకసౌకర్యము నపేక్షించి యుపోద్ఘాత మున వ్రాసియుంటిని. "మహావగ్గు" యొక్క షష్ఠమఖండ మునందు నిగ్రిస్థ సాధుసింహునితోడ శ్రీబుద్ధాచార్యునకు జరిగిన ప్రసంగము విశేషించి వ్రాయబడియున్నది. తత్ప్ర సంగమునందు శ్రీ బుద్ధదేవు డాత్మీయ సాధనము యొక్క యుభయవిభాగముల స్పష్టముగా జిత్రించియున్నాడు. సంక్షే పముగా దాని సారాంశ మిద్దియ :—

"సాధుసింహా ! నేనర్థములేని క్రియకాండము (కర్మ కాండము) ను నిషేధించు చున్నాడను. కారణమేమన నేను ధర్మోపదేశాదియందే యేసాధకుడుగాని, బౌద్ధగృహస్థుడు గాని మనోవాక్కాయముల నెట్టి యశుభప్రదంబగు కార్య మును సలుపరాదనియు, చిత్తమునం దెట్టిదుర్భావమును గల్గి యుండరాదనియు బోధించియుంటిని. అట్టిస్థితియందు కుకర్మ లకు స్థానమే లేదు.

'నేను కర్మకాండము నధికముగా బేధించుచున్నా డను. హేతువదెద్దియన సాధకుడు మనోవాక్కాయంబుల శుభకర్మల నిత్య మాచరింపవలసినదిగా నేను బోధించి యుంటిని. కళ్యాణకరంబులగు భావనలకే హృత్సీమను స్థాన మొసంగుటకును నే నుపదేశించియుంటిని.

'సింహా! నే నుచ్ఛేదన వాదమును సమర్థించుచున్నా డను. కారణ మేమనగా దురహంకారమును, కామాభిలాషలను, దుర్విచారములను, భ్రాంతిని సమూలముగ నశియింపజేయ నేను నిత్యము సమస్తజనులకు బోధించియున్నాడను. కాని నేను క్షమను, ప్రేమను, దాక్షిణ్యమును, సత్యమును నిర్మూలింప బోధింప నిచ్ఛగించువాడనుగాను!

'ప్రియసింహా! మనోవాక్కాయకర్మల నేవిధమయిన పాపమునాచరించుట నింద్యమనియు, ఘృణార్హమనియు నేను సర్వదా భావించుచుందును.

'నేను సతతము "అహంకారమును, కామాభిలాషలను, అనిష్టచింతనమును, భ్రాంతిని" రూపుమాపివేయ బ్రచారము సలుపుచుందును. కళ్యాణమయభావవినాశమునకయి ఘోషించుట నాయభిమత మెంతమాత్రముగాదు.'

శ్రీబుద్ధాచార్యుని యుపర్యుక్తములగు మహావాక్య రత్నములవలన బౌద్ధసాధనము కేవల మాత్మహత్యాద్యోతకమగునదని నుడువసాహసించు టెంతయు నవివేకము. ఆత్మవికాసప్రతిపాదకంబులగు నాచార వ్యవహారవిచారముల నుద్బోధించుమతము నాత్మహత్యామూలకంబగు రాక్షసధర్మమనుచు బోల్చువారెంతయు బాషండపతితపాతకయాజులే యగుట ధ్రువము!

ఎట్టియుత్తమమతము జిజ్ఞాసువులకును, పిపాసువులకును ముముక్షువులకును ముక్తినిబడయ బరిశుద్ధజ్ఞానము కావలయునని యు నిద్దానింబడయ నహంకారమును, శత్రుషట్కమును జయింపవలయుననియు, అహింసాత్మకంబగు సాధుజీవిత నిర్వాహమునకు విశ్వప్రేమయావశ్యకంబనియు నవశ్యముబోధించును? హిందువులచే నారాధింపబడు నపౌరుషేయములును, ఆర్షేయములునునగు మతగ్రంథము లీబోధనే ముక్తికవ్యకాకరపరిగ్రహణాభిలాషుల కొసంగియున్నది. క్రైస్తవమతముసహితము నశ్వరములగు సౌఖ్యాకాంక్షల వర్జించి సైతాను (కాముడు)ని చిత్తదుర్గమునుండి పారద్రోలి పరహితమునకయి చిలువనెక్కి (ఆత్మసమర్పణము) తండ్రిసన్నిధికి జేరుడియని బోధసేయుచున్నది. మహమ్మదీయమతము సహిత మీచందముననే ముక్తిపథమును దప్పిన కాఫర్లను జేయూతనొసంగి మతదీక్షాజ్ఞానము

చే శిక్షితునొనర్చి 'సత్పథమునను సహోదరులగోసిరము క్రి
నీసుఖమును నీవే చూచుకొని స్వార్థుడవు కావలదు. మతమున
కయిపుట్టి మతమునకయిచావు. అనగా మతమునొక్క పరమ
లక్ష్యమగు సత్యమునే సర్వస్వముగా నెఱుంగు' మని బోధిం
చినది. బౌద్ధమతసాధన మీమతములయెల్లసాధనములకు మె
ఱుగుపెట్టుచు భువి కేవలశబ్దబోధకమగు నాస్తిక్యమును స్థా
పించక, సజీవంబును, మూర్తిమంతంబును నయినట్టి యాస్తిక్య
మును స్థాపించుచున్నది. ఆధ్యాత్మికతత్త్వసంబంధంబున శ్రీ
బుద్ధాచార్యుని నిర్వాణవిషయకంబగు నిస్తబ్ధతనుగూర్చి విచా
రించి కొందఱు మానవుని బుద్ధికల్పించుకొను నాత్మసంబంధ
మగు నుచ్చతమావస్థ కతీతమయిన మరొకయవస్థకలదని యూ
హించుచున్నారు. ఇదియు నవశ్యము స్వీకరింపదగిన విష
యమె. శ్రీబుద్ధభగవానుని యనంతవ్యాపకంబగు నాధ్యాత్మిక
దివ్యదృష్టి నిర్వాణముయొక్క సీమావిరహితంబగు నాకాశ
మును భేదించి గగనముయొక్క యావలిపార్శ్వమును సమీ
పించినది. దేవునియపూర్వంబగు నిస్తబ్ధతయే యిద్దానికి బలిబల
ప్రమాణము. దేవు డాత్మీయానుచరసంఘదృష్టిపన్ని ధానమున
శుభానంద శాంతులకు నిలయంబగు నిర్వాణమును స్థాపించి
సంతుష్టాంతరంగుడయ్యెను; ఈలోకమున కతీతమయిన
మరొక్క లోకము కలదా లేదా యను విషయమును గూర్చి
దేవుడు స్వీయజీవితకాలమున జాటియుండలేదు.

శ్రీబుద్ధాచార్యుని యీనిర్వాణసాధనమునం దొక్క విశేషచమత్కారము కలదు. అతఁడు సాధకునిసమక్షమం దొక్క యపూర్వంబగు మార్గమును సుస్పష్టముగ జిత్రించియున్నాఁడు. సాధకుఁడీమార్గమును కేవల మాత్మశక్తి విశ్వాసబలంబుననే యనుసరింప సమర్థుండగును, కాని సందేహగహ్వరమున బడిమ్రగ్గవలసినయావశ్యకమువూత్రము సాధకునకు సంప్రాప్తింపజాలదు. దేవుని సమస్తకార్యము లాత్మవిశ్వాసప్రేరితములును, వర్ధకములునయియుండ నాత్మహత్యాదోషమును బౌద్ధమతముపయి నారోపించు స్వమతమిథ్యాగౌరవాడంబర సంస్థాపనాదక్షులగు శంకరాచార్య శిష్యప్రశిష్య సముదాయముల నేమనగవలయు? సాధకుని పర్యటనమును గుఱించియు, వ్యవహార విహారముల గుఱించియు, సంభాషణావిధానమును గుఱించియు, విచారపద్ధతిని గుఱించియు, ధ్యానమననాదుల గుఱించియు, వీని కనుకూలమగు సమయమును గూర్చియు విశదరూపంబున బౌద్ధగ్రంథముల వర్ణింపబడియున్నది. శుభమార్గగాములగు సాధకులకు లక్ష్యస్థానము (గమ్యస్థానము) ను జేరుట కెంతటి యింగితజ్ఞాన మావశ్యకమయి యున్నదో యంతియే దేవుఁడనేక సంకేతముల ద్వారా బోధించి యున్నాఁడు. దేవుఁడు లేనిదానిని, ఉన్నదానిని మిళితముజేసి శుష్కచాటుభారతమును రచియించుటయందే నిజధర్మప్రచారబాధ్యత నిర్వర్తింప

బడినదని మనస్తుష్టినందియుండలేదు. రోగగ్రస్తున కత డౌషధ
మును బ్రేమపూర్వకంబుగ నొసంగెను. కాని యనవసరమని
యెంచి రోగికి వానిరోగమెద్దియో నుడివియుండలేదు. ఎంత
పృచ్ఛించినను, నిర్బంధించినను శ్రీబుద్ధాచార్యుడు మానవ
జీవితాభ్యుదయమున కంతరాయముల గొల్పు దుర్జ్ఞేయతత్త్వ
ముల గుప్తవిషయమును నేమఱుపాటునయిన నుడివియుండ
లేదు. పారబడితి, ప్రబుద్ధునకు ప్రమాదమెట? "మౌన
మర్ధాంగీకార" మన్న చందమున దేవుని యీ మౌనావలంబ
నమె నిందకుల నిరంతరాక్రమణములకు బ్రధానాధార మ
య్యెను. మౌనావలంబనస్థానమున బౌధవాగ్విలాసచ్ఛటాస్ఫూ
ర్త్యుక్తములగు శుష్కప్రలాపవిధానములు ప్రకటితమయి
యున్న ఈ నిందకులు మౌనము వహించియుండువారె కాని
యసత్యభాషణంబున మతప్రచారము సేయుటకాని, దౌర్జన్య
ముచే మతధ్వజస్థాపనముగాని, అంధవిశ్వాసప్రేరేపణమున
ననుచరసంఖ్యాభివృద్ధి గావించుకొనుట గాని శంకరునకే
తగినది కాని బుద్ధునికెంతమాత్రము సమ్మతముకాలేదు. కాని
లోకమాన్యబాలగంగాధరుని సత్వరస్వాతంత్ర్య విధాన
మందలి "Tit for tat, కుక్కకాటునకు జెప్పుదెబ్బ" యన్న
యంశము ననుసరించు బౌద్ధులేయున్న నీమిథ్యామత చోరసంఘ
మీచందమున బౌద్ధముపై తలెత్తి యుండెడిదియే కాదు. పాఠ
కభ్రాతలారా! ఏమతమును దూషింపవలయునను మనో

భీష్టము నాదియెంతమాత్రము కాదు. మతజ్ఞానసంపన్నుల దివ్య పాదారవింద రజోకణ లేశసదృశుండనగు నాయభీష్టము సర్వ మతసారైక్యసిద్ధాంతప్రచారమే. బౌద్ధసాధనముయొక్క చరమలక్ష్యమును బరిమితమొనర్చు టెంతయు ననుచితంబై యగును. సర్వదా యాత్మత్యాగము గావించి ప్రాప్తించు మహల్లాభమునే మహావిజయమని భావింపవలయును. బౌద్ధ సాధకుడు సాధనాబలంబున నపారమగు పరిశుద్ధానందమును బడయును. ఇదియే పరమసత్యము. బౌద్ధనిర్వాణసాధనా విధాన మిటులుండ పులిసిన మేకమాంసముచే సైతానును బారద్రోల నెంచు క్రైస్తవులును, మేకలగొంత్తుల బిస్మిల్లాజేసి, కాఫర్లజంపి యల్లాయుల్లమును బల్లవింపజేయ జూచు యవ నులును, ముడ్డినెండగట్టుకొని నఖశిఖలబెంచుకొని నల్లమందు గంజాయి దమ్ములగొట్టుచు శఠహఠయోగముల ముక్తిని బడయ వాంఛించు హిందువులును తమసాధనమునకయి లజ్జిం తురుగాత!

---

## బౌద్ధసాదకుడు, తదాదర్శము

బౌద్ధసాధనమును గూర్చి గతాధ్యాయమునందు విపు లముగా వివరించియుంటిని. ఇంక బౌద్ధసాధకుని యాదర్శమును మన ప్రస్తుతాంశమునకు వత్తము. దుర్భరదుర్భేద్యంబగు

మహాదుఃఖము జీవుని నిత్యము బాధించుచున్నదను రహస్యమును గుర్తెఱింగినంతనే విశ్వకుటుంబపోషణాసక్తుండగు బుద్ధదేవుని హృదయము కరుణారసముచే ద్రవీభూతమయ్యెను. దేవుని యష్టాంగమార్గముల యొక్క సాధనాపరిణాలిక దుఃఖనివృత్తి కేర్పడినదియేయని మాపాఠకభ్రాతలెల్లరు గ్రహించియే యుందురు. సాధనావలంబనమున సిద్ధినంది జ్ఞాననేత్రమహిమాధిక్యముచే శోకశల్యము యొక్క నియమితస్థానమును గుర్తించి జీవప్రపంచ హితార్థమయి శ్రీబుద్ధాచార్య డీకల్యాణమయపథమును నిస్తులానంద సంధాయకంబని నిర్ణయించియున్నాడు. నిర్వాణప్రాప్తికయి తత్తరపడు చిత్తమును గల్గియున్న బౌద్ధముముక్షువులెల్లరు శ్రేణీత్రయంబున విభజింపబడియున్నారు. ఇందొక్క తరగతివారు శ్రీబుద్ధాచార్యని దివ్యవాణిని శిరసావహించి, తద్దేవునిచే నిర్దేశింపబడిన పథమునను సరించువారు. దుఃఖాస్తిక్యమును గ్రహించి, తదుత్పత్తిని తన్నివృత్తిని, తన్నివృత్త్యుపాయమును (ఇవియే యార్యసత్య చతుష్టయము), సమ్యగ్విధంబునబడసి నిర్వాణము నాసించుటయే వీరి యేకమాత్రంబగు పరమలక్ష్యము. వీరినే "శ్రావకు" లందురు. రెండవతెగవారు సయితము నిర్మలజ్ఞానావలంబనమున నిర్వాణపదప్రాప్తినిమిత్తము బుద్ధాదేశితమార్గంబునను సరించుచుందురు. జన్మపరిగ్రహణంబున జీవసముదాయము జరావ్యాధిమృత్యుయాతనల ననుభవించుచున్నయది.

ఈరహస్యమును గుర్తించి వీరు జ్ఞానముయొక్క పరమసాహాయ్యంబున నవిద్యవలననే కార్యకారణ పరంపరల నాధారముగగొని జీవు లుత్పన్నమగు విధానమునుదెల్పి నిర్వాణమును బడయుచుందురు. వీరు "ప్రత్యేకబుద్ధు" లను నామంబుల ప్రసిద్ధులయియున్నారు తృతీయశ్రేణివారు "బుద్ధత్వము"ను "సర్వజ్ఞత్వము"ను బడయనెంచి పూర్వవర్తులగు బుద్ధులచందమున నిర్వాణసాధనమునందు బ్రవృత్తులగుచుందురు. విశ్వప్లావితంబగు కరుణారసప్రేరణంబున వీరు సమస్త దేవ మానవహితకార్యపరతంత్రులయి యుండి నిర్వాణ సాధనమునందు నిమగ్నులయియుందురు. వీరు "బోధిసత్త్వ" లనియు "మహాసత్త్వ" లనియు గణుతికెక్కియున్నారు.

పై నుదహరింపబడిన త్రివిధశ్రేణుల యొక్క సాధకులును నిర్వాణసాధనమం దప్రమత్తులయి నిమగ్నులయి యుందురు. శ్రావకుల యొక్కయు, ప్రత్యేకబుద్ధుల యొక్కయు సాధనమందును బోధిసత్త్వులసాధనమునందును భూవ భూంతరాళ తారతమ్యము కలదు. బోధిసత్త్వులు విశ్వకోలాహలమునుండి దూరులయి, యేకాంతగిరికందరముల బ్రవేశించి, దేహానిత్యత్వమునకయి ధ్యానమునొనంగక, నిజసౌఖ్య కల్యాణముల కల్పంబుగనయిన స్వార్థంకిత-చిత్తులునుగాక, ప్రకృతశాంతిలోభంబున నిర్జనప్రదేశాన్వేషణంబు సలుపక సకల

జీవుల నిర్వాణసాధన నిమిత్తము విశ్వము యొక్క విషమ సమస్యల నెదుర్కొనుచునే యుందురు. అవిద్యాప్రభావం బున జీటికిమాటికి జన్మచక్రంబున బడు నరనారీమణుల హితము నపేక్షించి పూర్వోల్లిఖితసాధకబృందము నిజశక్తి సామర్థ్యముల ధారపోయుట యందే యాత్మానందము నందుచుండుటయు గలదు. జనసంఘముమధ్య వారు నిర్వాణము యొక్క సుధారసోపేతంబులగు శుభవాక్కుల వ్యాపింపజేయు చుందురు. స్వీయకళ్యాణము నభిల షించియు, నిజదుఃఖనివృత్త్యర్థంబును శ్రావకులును, ప్రత్యే కబుద్ధులును కఠినసాధనమునందు బ్రవృత్తులగు చుందురు. వీరి సాధనము విశేషించి ప్రేమమూలకమయి యుండదనియే చెప్ప నొప్పు. అనంతప్రాణుల యొక్క యశేషదుఃఖముల గూర్చి వీరంతగా విచారింపరు. తమకుమాలిన ధర్మము తగదన్న చందముగ వీరుధర్మమునుండి విముఖులుకాక నిజోత్కర్షకయి యత్నించు చుందురు. వీరుసహితము వాసనల నిర్మూలించి నిర్వాణపదవి నందుచుందురు. ఈ నిర్వాణము కేవలము వాస నల నిర్వాణమేయని చెప్పదగును. ప్రేమ కరుణాదాక్షిణ్య ముల యొక్క నిర్వాణమున కిది యెందును సరిరాదు ; ఇందు మహానిర్వాణము యొక్క చరమప్రకాశము లభించుటయే దుస్తరంబగును. కారణమేమనగా వీరు సాధనానంతరము బడ యు సాఫల్యత జీవప్రపంచ హితసాధనమునకు విశేషకల్యాణ

దాయక మెంతమాత్రమును గాజాలదు; ఇది దుఃఖితజీవప్రపం
చమున కెంతమాత్రము సుఖోత్పాదకము కాజాలదు. వీరు
సిద్ధినందిన యనంతరము సహితము పాపభారాక్రాంతులగుచు
నరనారీమణుల స్పృశించుటకుసహిత మెంతయో సంకోచించు
చుందురు. సకలజీవుల యొక్క నిర్వాణ సాధనము తమవ్యక్తి
గతజ్ఞానమునకును, శక్తికిని నతీతమయిన విషయమనియే యీ
యుభయ శ్రేణులకుజెందిన సాధకులు భావించుచుందురు.

కాని యవతారపురుషులవలె జీవితయాత్రను నడుపు
బోధిసత్త్వులు తమ్ము బుద్ధుని యొక్క పరిశుద్ధస్థానము నాక్ర
మించిన వారిగనే భావించుచుందురు. సంసారసాగరము నొం
టరిగా నతిక్రమించిపోవుటయందు వీ రెంతమాత్రము హర్షిం
పరు. వార లనిశ మీచందమున దృఢసంకల్ప చిత్తములతో
నుడువుచుందురు:—'మేము బుద్ధత్వమును సర్వజ్ఞత్వమును
బడసి స్వయముగా సంసారాంబుధి నుల్లంఘించి నిర్వా
ణమును బడయుచందముననే సమస్తప్రాణుల సంసార
సాగరమునుండి తరింపయజేయ యథాశక్తి ధనమానప్రాణ
సర్వస్వముల దృణప్రాయముగ నయిన విసర్జించి కృషి
నేయుచుందుము. మావలెనె మాయిరుగుపొరుగున నున్న
వారెల్లరు దుఃఖభారంబుచే క్రుంగి కృశించుచుండ వార
ల దిగవిడచి మేమెట్లు ఆనందధామమును బ్రవేశింపనుంకిం

తుము!" ఈచందమున దలపోయు వీరు సమస్తజీవుల నాక్రమించియున్న దుఃఖభారమును స్వయముగ దామే శిరసావహించి యసాధ్యంబగు కఠోరనిర్వాణసాధనమునం దప్రమత్తులయి ప్రవృత్తు లగుచుండురు. ఈమహాసాహసికశిఖామణులగు సాధకులే భావనచే బ్రేరేపితులయి యీసాధనా సమరక్షేత్రమున నడుగిడుచున్నారు? అవిద్యయను పెనుభూతమునకు వశీభూతములయి సమస్త ప్రాణులును దివారాత్రములు పాపకర్మల దవిలియుండి, తత్ఫలంబుననే యశేష క్లేశానుభవంబునకు గురి యగుచున్నవని యీ సాధకోత్తములు విచారించుచుందురు. జీవులదుఃఖము వర్ణనాతీతము. పామరులగు జనులు బుద్ధునాదరింప నిచ్ఛగింపరనియు, మంగళమయోపదేశముల గ్రహింప నొల్లరనియు, సాధకులయెడ శ్రద్ధావిశ్వాసదూరులయి యుందురనియు దెల్పినంతనే విశ్వజీవసంరక్షణ కార్యపరతంత్రులగు బోధిసత్త్వుల చిత్తము లపారవిషాదాక్రాంతము లగుచుండును; వారిచిత్తసీమల నాక్రమించు ఆసహానుభూతిలబ్ధంబగు దుఃఖ మొకించుక శాంతించినంతనే మహాసత్త్వులు జీవప్రపంచ సేవార్థమయి నిజహృదయాంతర్గత స్థిరసాధు సంకల్పజాగృతిచే బయలువెడలెదరు. వారంత సకలజీవుల పాపాజ్ఞానభారం బాత్మీయస్కంధముల వహించి పరోపకారార్థము మహానిర్వాణ సాధననిరతు లగుచుందురు. జీవుల యవిద్యాభార మెంత తమ్మణచి వేయుచున్నను వారు

తాము ధరించియున్న దృఢసత్సంకల్పములనియెడికవచంబులచే సురక్షితులయి కర్తవ్యపథమునుండి యధీరహృదయులయి చలింపనొల్లరు. వారిప్రజ్ఞయు, కరుణయు, మైత్రియు, సత్కర్మయు— వేయేల? వారిసర్వస్వంబును జీవహితము నిమిత్తమే యుపయోగింపబడును. వారికయి శేషించియుండునది లేదు.

ఏవ్రతమును స్వీకరించి యుత్సాహ పూరితంబులగు చిత్తములతో నవీనులగు బోధిసత్త్వులు సాధనమునందు ప్రవృత్తులగునదియు బదునేడవ శతాబ్దమందలి బౌద్ధగ్రంథకారుడగు "శాంతిదేవుడు" "బోధిచర్యావతార"మను తన యొకగ్రంథ రాజమునందు విశదరూపంబున లిఖియించియున్నాడు. తత్సారాంశమిట్టిది:—బోధిసత్త్వులీచందమున సంకల్పించుచుందురు:—బుద్ధమహాశయుల నారాధించి, వారిశరణాగతులమయి, నిజపాపభారమును స్వీకరింప మాకు లభ్యమయిన పుణ్యమంతయు జీవహితార్థంబును, బోధినిమిత్తంబును వ్యయమగుగాత! మేము క్షుధార్తుల కాహారరూపంబునను, పిపాసాపీడితులకు పానీయరూపంబునను బరివర్తనమయి యుందుముగాత! మేము మమ్ములను, నిజవర్తమాన కాలసత్తను, జన్మ జన్మాంతరముల భావిసత్త్వమును జీవప్రపంచకల్యాణము నపేక్షించి సమర్పించివేసి యున్నారము. పూర్వవర్తులగు బుద్ధులేభావమునకు వశవర్తులయి వ్రతధారణమును జేసియున్నారో వారలబుణములకు మేము బాధ్యులమును, గృత

జ్ఞులమును నయి వారిభావానుసరణమును జేయుచుందుము;
సకల జీవనిర్వాణ సాధనోపక్రమణమే మావిహితధర్మము.'
బోధిసత్త్వుల యీనిర్వాణ సాధనవృక్షము పెకలించివేయ
సాధ్యపడదు. వారొకవైపున భోగవిలాస వాసనాబీజముల
సంపూర్ణముగా త్యజియించివేయు చందముననే మరొకప్రక్క
స్వార్థ మూలకంబగు నహంభావమును క్షీణింపజేయుచుందురు.
మఱొక దిక్కున వారలే యపూర్వంబగు దయారసముచే ద్రవీ
భూతచిత్తపరీతులయి విశ్వప్రేమభావంబున లోకలోకాంతర
ముల యొక్క సకలజీవరాసులతోడ నైక్యమును జెందుచుందురు.
వీరు ధ్యానపరాయణులయియుండియు, దయార్ద్రచిత్తులును, విన
యవిధేయతాయుక్తులును, సహిష్ణుతాన్వితులును నయి విరా
జిల్లుచుందురు. వీరి సకలశుభకర్మల యొక్కయు, సమస్తప్రి
యత్నముల యొక్కయు, సమస్త ధ్యానముల యొక్కయు
మూలమునందు జీవకోటియెడ నప్రమేయంబగు సహానుభూతి
విద్యమానమయి యుండును. బోధిసత్త్వులు సహితము వ్రతము
ను గ్రహించిన తత్క్షణమే సమస్తపాపసముదాయములనుండి
యు విముక్తులగుదురని భావించుటెంతయు భ్రమాత్మకంబు.
పాపప్రలోభనములనుండి యుద్ధరింపబడుటకే వారు శీలగ్రహణ
ము సేయుచున్నారు. కాని వారు పరహితార్థమయి యాత్మ
సమర్పణము గావించుటకొఱకే శీలపరిగ్రహణము సేయుచు
న్నటియు వారెల్లరు నెఱుంగుదురు. జీవకోటిపయి దయారస

మును జిలికించు నిమిత్తమే వారలసీమక్షమను చిత్తభూషణ ము గావించుకొనియున్నారు. నీతిదూరులును, దుష్టాత్ములును నగు దుర్జనులెవ్వరయిన వారలబట్టి ఘోరముగ దండించినను వారు ప్రతిక్రియకు బాల్పడక మౌనముతో జడపదార్థముల వలె సహించుచుందురు. క్రోధాంధులగుట వారి ధర్మమునకు విరుద్ధమయిన కార్యము. దేహమును ధరించిన జీవులమే మన మయియున్నపుడు దైహికకష్టపరంపరల ననుభవించుటయే స్వీయధర్మముగ వారలెంచు చుందురు. పరిహారకర్తలగు వ్యక్తులు వారికి బుద్ధులచందముననె పరమమిత్రులు. దండించు దుర్జనులు హింసించి తమకు సహిష్ణుతయొక్కయు, క్షమాశీల త్వము యొక్కయు గుణపాఠముల నేర్పుచున్నారు కాన వా రలుసహితము సమ్మానభాజనులే యగుదురని వారనిశము మది దలపోయు చుందురు. పాపరహితులగుటకు హింసకులవలన బ్రాప్తమగు నీరెండు మహద్గుణములే పరమావశ్యకంబులగు నని వారిభావము. వారు తమతో శత్రుత్వమును వహించిన వారిని గాంచి క్రుద్ధులగుటకుమారుగా వారిపైదయాదృష్టిని బ్రసరింప జేయుచుందురు. బుద్ధులేయవిచలంబగు చిత్తము తో ముక్తిని గూర్చి విచారించియుండిరో యటులనే వ్వారును క్షమిసలుపుటయం దెంతమాత్రము నేమరియుండనొల్లరు.

సాధనమువలన బోధిసత్త్వు లేవిధముగ దివ్యదర్శనము, దివ్యశ్రవణము మొదలగు నపూర్వబుద్ధుల బడయుచున్నారో,

అదియే ప్రకారము వారు శ్రేష్ఠతమంబులగు మంగళములను, శాంతి బడసి కృతార్థులగుచున్నారు. వారిధ్యాన మేస్థితియందును వ్యక్తిగతలాభనష్టమువైపునకు బోవుటయే దుస్తరము! వారు మహాపాపాత్ముల నుద్ధరించుటకు నకుంఠితచిత్తములతోడ నరకముకంటె దుర్గమప్రదేశముల ననాయాసముగా బ్రవేశింప నుద్యుక్తులయి యుందురు. వారిసమస్త తేజములు, బలము, సమస్తోద్యమములు, సమస్తప్రయత్నములు జీవప్రీతిరసముచే బ్రవహించుచుండును. బోధిసత్త్వులు బుద్ధబృందము చందమున సమ్యక్సమ్బుద్ధు లెంతమాత్రమును గారు. జీవహితసాధనంబునను, ఉత్సాహాధిక్యముచేతను వారి కార్యవిధానమునం దెన్నియో త్రుటులు లౌకిక ప్రపంచమునకు దృష్టిగోచర మగుచుండును. కాని వారి యాయల్పాపరాధములన్నియు స్వార్థపర్వతముచే భూషితములయి దూష్యము లెంతమాత్రమును గావు. ఏవియెటులున్న నేమి? బోధిసత్త్వులు విశ్వముయొక్క సోదారరాజపథానుసరణంబున బరిపూర్ణాదర్శమువైపునకు దీవ్రగమనంబున నగ్రసరులగుచునే యుందురు. వారి కుదారచరిత్రప్రభావంబున విశ్వమంతయు నాత్మీయ పరివార్గమువలె స్ఫురించుచుండును.



## బౌద్ధసాధకుని నిర్వాణము.

సాధనంబున సిద్ధినిబడసి బౌద్ధసాధకులు రాగద్వేష రహితులయి శాంతచిత్తు లగునపుడు వారిమానసికావస్థ యెటులుండును? వాసనాసంస్కారావిద్యలు నశించిన యనంత రము వార లేయవస్థయందుండి సమయమును వ్యతీతము సేయ గడంగుదురు? ధమ్మపదమునం దీచందమున వ్రాయబడి యున్నది :—'రాగద్వేషాదులనుండి రహితములయిన హృద యముల గల్గియున్నట్టియు, శాంతచిత్తములచే విభూషితులయి నట్టియు, సమ్యగ్భావంబున ధర్మాచరణమును గల్గియున్న ట్టియు భిక్షువుల కలౌకికానందము లభ్యమగును. సాధారణ మనుష్యులమగు మనము సేయు కార్యములన్నియు స్వీయ సుఖము నభిలషించియేగదా! మన సమస్తకార్యకలాపములు (నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు) స్వార్థభూయి ష్ఠములయి యుండును. మన దుర్విషయాసక్తంబగు నహం కారము మిథ్యయనియు, మనస్వార్థపరత్వము మిథ్యయనియు, సాంసారిక విషయభోగము మిథ్యయనియు మనము కోవిదుల వలన వినగల్గినంతనే లజ్జితులమగుచుందుము. మనస్నేహము, ప్రీతి, దయ, మాయమొదలగు సమస్తానందరసముల స్రవం తులును, అహంకారమనియెడి మర్యాదాబద్ధములయి యున్న టుల మనకుగల్లు దృఢవిశ్వాసమే మనలజ్జకు హేతువు. మన యీయహంకారము యొక్క కట్ట ఖండింపబడినయెడల మనకింక

నెట్టిబాధయు గలుగనేరదు. దివ్యదృష్టినిబడసి మానవప్రకృతి రహస్యమును బ్రత్యక్షముగ నవలోకించిన వార లుచ్చైస్స్వరంబున, మానవుని యహంభావము నశించినంతనే విశ్వవ్యాపకంబగు నానంద మతిదుర్గమనంబున వానిచెంతజేరునని నుడివియున్నారు.

స్వార్థపరాయణులును, అజ్ఞానవశంబున "మేము" "మాది" యను భావంబునకు దాస్యముసలుపు వారును సోదరమానవులను, దేశవాసులను, ప్రాణికోటులను, విశ్వమును స్వప్నమందయిన బ్రేమింపజాలరు. ఇదిరూఢి. ఈ యజ్ఞానమే, యీ యవిద్యయే సర్వోత్తుంగములును, ఉన్నతములునునగు భిత్తికలవలె మానవుని చతుర్దిశల నాక్రమించి వానిదృష్టిపరిసారమును నిరోధించివేయును. చెఱయందుండు బందీలవలె వారలీ కారాగారమున బద్ధులయి స్వాతంత్ర్యమును గోల్పోయి యుందురు. వారు కారాగారము యొక్క యసహనీయంబగు వేదనము ననుభవించుచుందురు; ఎన్నియో పర్యాయములు వారు దుస్సహంబులగు దుఃఖములచే నధీర చిత్తులగుచు నుందురు, కాని మార్గముగానరాని హేతువుచే హరిచెఱయందే జీవితశేషమును వ్యతీతము సేయుచుందురు. అతిఘోరంబగు నీమహాదుఃఖమునుండి విముక్తినిబడయుటయే బౌద్ధసాధనము యొక్క పరమలక్ష్యమయి యున్నది. సమస్త కాలములయందు, సర్వజీవుల యొక్క సకలవిధములగు దుఃఖ

జాలముల నివారించుటయే యీ సాధనము యొక్క ప్రధానోద్దేశ్యము. ఈ శుభసాధనముద్వారా సమస్తమనుష్యులకు దుఃఖనివృత్తి యొక్క యుపాయమును జూపించినవారే యెల్ల తావుల మహాపురుషాగ్రేసరులుగ నారాధింపబడుచుందురు. వారలే వాస్తవముగా మహాసత్త్వులు లేక మహాపురుషులు; కారణమేమన వారు యవిద్యాహంకారభిత్తికల సమూలముగ గూలద్రోసి, తమ్ము సమస్తమనుష్యుల మొ్రల సర్వేశ్వరాంశ సంభూతులుగ జేసికొనినారు. మహాసాధకుల యొక్క దివ్య వాణి పరస్పరమునందు విభిన్నమయి యున్నను, వారి సాధనావిధానము విచిత్రమయియున్నను వారిసాధనము యొక్క మూలమును, పరిణామమును యభిన్నములయి వర్తించుచుండును. సాంసారిక దుస్సహ దుఃఖసముదాయములే వారినెల్లర సాధనమునందు బ్రవృత్తులగావించినది; ఎల్లరు సిద్ధిలాభము నంది శుద్ధహృదయులయి సమస్తదుఃఖ పరంపరలనుండియు ముక్తినిబడసినారు. సిద్ధిలాభానంతరము మహాపురుషులు బద్ధ జీవులయి యుండరు; వారు జీవన్ముక్తులయి యుందురు. అంతట వారు స్వార్థమూలకంబగు మమకారము నశించుటంజేసి స్వీయసౌఖ్యమునిమిత్తము సహిత మీషణ్మాత్రమయిన నభిలాషను గల్గియుండరు. వారుసేయు ప్రతి కార్యమునుండియు సమస్తజీవహిత పరత్వస్ఫూర్తియే ప్రకాశించుచుండును. సమస్తప్రాణులు సుఖించునట్టియు, మహత్కల్యాణమును

బడయునట్టియు సత్కార్యసముదాయమునే ప్రశాంతచిత్తు లగు మహాపురుషు లాచరించుచుందురు. అవిద్యాజాలమునుండి విముక్తులయి దివ్యదృష్టివలనను, ధర్మదృష్టివలనను సమస్తము ను వారవలోకించునపుడే జీవప్రపంచమునెడ వారిహృత్సరోవరములనుండి కరుణాప్రేమరసములు ప్రవాహరూపంబున స్రవించుచు శోకాతప్తవిశ్వమును శాంతింపజేయును. ఈప్రేమయు, కరుణయు సాధారణమానవుల కలభ్యంబులని నుడివి ధమ్మపదము (బుద్ధగీత) "అమానుషీరతి" యను నామంబున వీనిని నిర్దేశించియున్నది.

ధ్యానము యొక్క ప్రభావముచే సాధకునిచిత్తవతి ప్రశాంతమగునపుడును, వైరాగ్యబలాధిక్యముచే వానిచిత్తము నిర్వికారమగునపుడును నిత్యసత్యముతోడ వానిసమ్మేళనమపుడేకాగల్గును; అనగా సుజ్ఞానసూర్యోదయంబున నవిద్యాంధకారము దూరమయిపోవుచున్నయది. తత్సమయంబున బౌద్ధసాధకునకు జతుర్విధంబులగు నార్యసత్యములు దృష్టిగోచరంబగును. వానితత్త్వరహస్యముసహిత మపుడే సాధకునకు హృదయంగమంబగును. మానవుడు వసుధాస్థలి నిలువబడినపుడు వానిదృష్టిని జతుర్దిశల యొక్క సంకీర్ణంబులగు సీమలును నిరోధించివేయుట సహజమేయగును; కాని వాడే సర్వోన్నతంబగు భూధరశృంగము నధిరోహించినపుడు వాని దృష్టి నలుకెలంకుల చాలదూరముపర్యంతము నిర్నిరో

థంబుగ వ్యాపించుచున్న నాశ్చర్యమదెద్ది కలదు! సాధనా క్షేత్రము యొక్క చరిత్రయు నింతియేయని పాఠకభ్రాతలు గుర్తెఱుంగుదురుగాత మ్మని మామకంబగు విజ్ఞప్తి. మానవుడు జరావ్యాధి మరణగ్రస్తంబగు రంగభూమియందు విహరించుచున్నంత పర్యంతము నహంకారము యొక్క వలయము మానవునిదృష్టిని నలువైపులనుండియు నిరోధించుచునే యుండును. కాని వాడు ధ్యానమనియెడు పర్వతోచ్చశిఖరము నధిష్ఠించినంతనే వానిదృష్టి క్రిందనున్న వసుధపైకిబ్రసరింప, జరావ్యాధిమృత్యువుల యొక్క సత్య స్వరూపము వానికి లోచనగోచరంబగును. దుఃఖమునందు నిమగ్నుండయియున్న వ్యక్తి యవశ్యము విషాదజ్వాలానుభవమునుబడసియేయుండును, కాని దుఃఖముయొక్క వాస్తవికంబగుస్వరూపము వానికి స్వప్నమందయిన గోచరించుట యసంభవము. సాధకుడు దుఃఖముయొక్క దుర్గమునుండి విముక్తినిబడయగల్గినపుడే యద్దానియథార్థమగు స్వరూపమును సాక్షాత్కరించుకొన నర్హుడగును. ఇదియే నిర్వాణమను మహాల్లాభము.

స్థూలరూపంబున విచారించుచో బౌద్ధసాధకుని యొక్క నిర్వాణము వాసనానిర్వాణమనియు, సంస్కారనిర్వాణమనియు, దుఃఖనిర్వాణమనియు గ్రహింపదగును. కాని యీనిర్వాణము కేవలము లయముమాత్రమే కాదు. కారణమెద్ది

యన మానవుడు భ్రాంతినుండి యవశ్యవిముక్తి నందినాడు; సాధనమునకుబూర్వ మతడు నిమ్నప్రదేశంబున నవస్థితుడయి యుండెను. సాధనానంతర మున్నతస్థలమున నిలువబడసమర్థుడయినాడు. నిమ్నప్రదేశమునందున్న పర్యంతము వాని కెద్దియు గోచరింపలేదు. ఉన్నతస్థానమున కేతెంచినయనంతర మతడు సర్వమునవలోకింప సమర్థుడయినాడు. ఈసత్యస్వరూపావలోకనసామర్థ్యమే నిర్వాణము; కేవలము క్షయముమాత్రమే కాదని నిరూపించుచున్నయది. వైజ్ఞానికులు తమయాలోకనయంత్రము నటునిటుద్రిప్పి యంత్రమున కోకపటముపై దివ్యతమంబగు ప్రకాశపుంజమును ఘనీభవింపజేసినపుడావస్త్రముపయి ననేకవిధంబులగు చిత్రములు ప్రతిబింబితములగును. ఈ చందమున ననంతాకాశమున బ్రకాశము బుంజీకృతమొనర్చుచో ప్రతిబింబము దృష్టిగోచరము కాజాలదు. మానవుని యహంభావముసహిత మీవిధమయిన హృద్గతగాఢవస్త్రము వంటిదే. దానిమీదనే నానావిధంబులగు దుఃఖములును, యాతనలును ప్రతిబింబితములగుచుండును. కాని వానిబుద్ధి స్థూలాహంకారము నతిక్రమించి యసీమయందు మిళితమయి పోయినపుడు వాని దుఃఖానుభవజ్ఞానము పూర్ణముగా నశించును; ఈప్రకారము మమకారదివాకరు డస్తమించినంతనే సాధకుడు దుఃఖసాగరతరణమునందు విజయుడగును. ఇదియే నిర్వాణమని నుడువబడుచున్నయది. ఈపరిశుద్ధంబగునిర్వాణమును గే

వలము శూన్యమనియు, వినాశమనియు, లయమనియు, క్షయమనియు వాకొనుట యుక్తవిషయ మెంతమాత్రమును గానేరదు. కారణమేమనగా సాధకునియొక్క వాసనాకలుషితంబగు చిత్తమహంకారముయొక్క సీమనుల్లంఘించి యసీమయందు నిమజ్జితమాయినది. సమస్తవిఘ్నపరంపరలును, వికారసముదాయంబులును దూరమగుడు సాధకునిచిత్తము సమస్తవిధముల స్వతంత్రమయిపోయినది. ఇదియేముక్తి, ఇదియేనిర్వాణము; ఇదిశూన్యమని వాదించువారు కేవలము వెఱ్ఱివెంకటాయలేసుమీ!

బౌద్ధదార్శనికులు నిర్వాణముయొక్క గూఢరహస్యమునుగూర్చి యనుమాన ప్రమాణాప్త వాక్యములకంటెను, యుక్తిప్రయుక్తులకంటెను బ్రత్యక్షానుభవమునకే ప్రాధాన్యమునొసంగి వ్యాఖ్యానమును జేసియున్నారు. ఈమహత్తరంబగు తత్వమునుగూర్చి సాధారణులును కించిజ్ఞులును విచారించిగాని, పరిశీలించికాని యిదమిత్థమని నిర్ణయింప నశక్తులు. ప్రస్తుతము నిర్వాణగతుడగు సాధకునియవస్థ యెటులుండునాయను విషయమయి విచారింతము. బుద్ధగీత దీనింగూర్చి యీ భంగి వక్కాణించుచున్నయది :—" సాధకుడు బుద్ధిస్థైర్యమును సముపార్జించి, శీలాచరణయుక్తుడగు సుఖానుభవమును బడయుచుండియే దుఃఖమును దూరముగా ద్రొలగద్రోసివేయును

శ్రీబుద్ధాచార్యుని సాధనావిధానము యొక్క మనోహరంబగు వివరణము "లలితవిస్తారము" అనుబౌద్ధమత గ్రంథమునందు విశదరూపంబున నభినుతింప బడియున్నది. గ్రంథకారు డీ గ్రంథమునందు శ్రీబుద్ధాచార్యునిచే నీశుభవచనముల నుడివింపజేసి యున్నాడు:—

"మైత్రీబలేన జిత్వా పిబతో మేఽస్మిన్నమృతమండః।
కరుణాబలేనజిత్వా పిబతో మేఽస్మిన్నమృతమండః॥
ముదితాబలేనజిత్వా పిబతో మేఽస్మిన్నమృతమండః।
భిన్నామయాహ్యవిద్యా దీప్తేన జ్ఞానకఠినవజ్రేణ॥"

తాత్పర్యము. 'ఈబోధివృక్షతలంబున నాసీనుండనయి మైత్రిబలంబు (విశ్వప్రేమబలము) న విజయుడనయి, నేను పీయూషరసపానము సేయుచున్నాడను; కరుణాబలంబున జయమును బడసి నే నమృతరసమును బానము సేయుచున్నాడను, మోద బలంబున సఫలుండనయి నేను సుధారసమును గ్రోలుచున్నాడను. ప్రదీప్తంబగు జ్ఞానమని యెడి కఠోరవజ్రాఘాతంబున నే నవిద్యాధ్వంసముగావించి వైచితిని." నేనుబడసిన యీసిద్ధియందే చందమున మైత్రి, కరుణ, ప్రమోదము మొదలగునవి కలవో యదియేచాడ్పున మమకారశూన్యంబగు విశుద్ధజ్ఞానము సహిత మిందు విరాజిల్లుచున్న యది. ఈసిద్ధిని లేక బుద్ధిని బడసియే సాధకులు "అమానుషీరతి" ని ననతికాలమునందే సంప్రాప్తింపజేసి కొనియెదరు. వారిచిత్త మహంకారశూన్య

మయినంతనే నీరసంబును, శుష్కంబునునగు విశుద్ధజ్ఞానమునందు జిక్కువడి యుండదు. సమగ్ర సంసారముయొక్క కల్యాణంబును, సౌఖ్యంబును వారల ననుసరించుటం జేసియే సాధకుల చిత్తములు అనిర్వచనీయ సంపూర్ణానందాంబుధిని నిమగ్నంబులగును. శ్రీబుద్ధగీతయొక్క వ్యాఖ్యాన మింక నింతటితో బరిసమాప్తమయినది. హిందూమతగ్రంథముల బుద్ధగీతావాక్యముల ననుసరించు శ్లోకము లనేకములు కలవు. పాశ్చాత్యుల యాదర్శగ్రంథవాక్యములు సహితము కొన్ని బుద్ధగీతావాక్యముల సమర్థించుచున్నవి. భారతీయసాహిత్యజ్ఞులచే దమకావ్యగ్రంథముల నుడువబడిన మహద్వాక్యము లెన్నియో మనబుద్ధగీతను సమర్థించుచుండుట మహదానందసంధాయకంబు. వానిని గూర్చి యొకింతముచ్చటింతము. పాఠకులారా! పరమతసహనంబు లేక బౌద్ధమతమువంటి సర్వోన్నతమతమును దూషించుట యుక్తముకాదు. మధ్యకాలమున గల్పితములయిన జాతిమతద్వేషస్వార్థభూయిష్ఠంబులగు మతగ్రంథసిద్ధాంతముల నీబౌద్ధమతము విమర్శించుచున్నను, ఆద్యంబును, ఆర్షంబును నగు మనప్రాచీన వైదికమతమున కెంతయు మెరుగువెట్టుచున్నదను నావాక్యము లెంత యథార్థములో మీరేస్వయముగా నీక్రింద నుదహరింపబడు శాస్త్రగ్రంథముల సిద్ధాంతసముదాయముల నవలోకింపుడు; సత్యమంత దేటతెల్లము కాగలదు.



# బౌద్ధమతానుకూల హిందూమత శ్లోకములు

## యమకవర్గము

మన ప్రస్తుత దేహస్వరూపము గతమనోభావముల యొక్క పరిణామమయి యున్నది. అది మన భావములపై నాధారపడియున్నది. శకటమునీడ్చు వృషభముల గోరిజల నంటియే చక్రములు పరుగిడివచ్చుమాడ్కి హృదయమున దుష్టభావముల గల్గియుండి, దుష్పథము ననుసరించు వ్యక్తి పిఱుందనే దుఃఖపరంపరలు పరుగిడివచ్చుచుండును.

— బుద్ధగీతలోని మొదటివాక్యము.

మన హిందూమతగ్రంథములు సహితము మనశరీర నిర్మాణమునకు మానసమే మూలకారణమగుచున్నట్లు నుడువు చున్నయవి. మనమానసము భావవ్యాపారమున కాధారభూత మగు పుంజీకృతశక్తి స్వరూపము. ఈచిత్తము (మనస్సు) నుండియే ద్వివిధంబులగు భావన లుద్భూత మగుచున్నయవి. మూర్తీభవించిన భావనయే మానవాకృతియన్న సరియగును. హిందూమతాదర్శశాస్త్రమగు భగవద్గీత భావవిషయికంబగు స్వకీయాభిప్రాయము నీవడువున గటాక్షించియున్నది:

"యాదృశీ భావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ."

మన గతభావముయొక్క సిద్ధియే యీ దేహము. "యద్భావం తద్భవతి" యను గురుజనవచనంబును, భావమే సమస్త క్రియాత్మకంబగు స్వరూపమునకు మూలమగుచున్న దనియే తెలుపుచున్నదనవచ్చును. మనహిందూమత గ్రంథ కర్తలే "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనిగదా వక్కాణించి యున్నారు. మనము భావమున కుత్పత్తి స్థానమే కదా! మనోవ్యాపారమగు భావమే మనయీదేహ మను బంధనమునకు హేతువయినది. శ్రీబుద్ధాచార్యుడు మానవుడు తా నాచరించు దుష్టకార్యముయొక్క దుష్ఫలమను మహాపిశాచముచే వెంబడింపబడునని సెలవిచ్చియున్నాడు.

"త్రిభిర్వర్షై స్త్రిభిర్మాసై స్త్రిభిః పక్షై స్త్రిభిర్దినైః
అత్యుత్కటైః పాపపుణ్యై రిహైవ ఫల మశ్నుతే॥"

(హితోపదేశము.)

"అతి తీవ్రతరంబులగు సుకృతదుష్కృతముల యొక్క శుభాశుభఫలములను దివసత్రయంబునగాని, పక్షత్రయంబున గాని, మాసత్రయంబునగాని, వర్షత్రయంబున గాని లేక యెప్పుడో యొకప్పుడీయిహలోకమునందే మానవు డనుభవింప వలసియే యుండును. బుద్ధదేవుని గీతయందలి ప్రథమవర్గము యొక్క రెండవగీతము శుభకర్మ ఫలభోగమును గూర్చి వ్రాయబడియున్నది. హిందూమతాదర్శము "అవశ్యమేవ

భో_క్తవ్యం కృతంకర్మ శుభాశుభం.'' శ్రీబుద్ధాచార్యుని రెండు గీతముల కిదియే సరియగు నామోదమును దెల్పుచు మత ద్వయంబును గూర్చిన మూఢజనుల భేదాభిప్రాయమును రూపుమాపి వేయుచున్నది.

3వ గీత, 4 వ గీత:—వాడు నన్ను దూషించినాడు— మొదలగు నిందాస్తుతులను హృదయమున స్థానమొసంగు వ్యక్తి వైరభావమును నశింపజేసి యానందింప నశక్తుడనియు, దీనికి విరుద్ధముగావర్తించువ్యక్తియొక్క వైరభావము క్షయమగుడు, దివ్యానందానుభవమునందు ననియున్నది. భగవద్గీతసహితము నిందాస్తుతుల దుల్యభావముతో నవలోకించువ్యక్తినే సర్వే శ్వరుడు ప్రేమభాజనునిగ మదిదలపోయుననియే నుడువు చున్నది.

''తుల్యనిన్దా స్తుతి ర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః॥''

''నిందాస్తవముల సమానబుద్ధితో వీక్షించువ్యక్తి సాశ్రయుడగుచుండ, వానినే భేదబుద్ధితో వీక్షించు ప్రపంచకుడు నిరాశ్రయుండగును.''

5 వ గీత :— శ్రీబుద్ధాచార్యుని యీ గీతాభిప్రాయమును సమర్థించు వాక్యము లెన్నియో మన హిందూమత గ్రంథముల గలవు.

" మృదునా దారుణంహన్తి మృదునా హన్త్యదారుణం
నాసాధ్యం మృదునా కిఞ్చి త్తస్మా త్తీవ్రతరంమృదు॥"
"మహాభారతము"

" కోమలత్వమువలన గాఠిన్యమును, మృదుత్వమును సహితము వశీభూత మొనర్చుకొనవచ్చును. మార్దవముచే సాధింపబడని కార్య మెద్దియును లేదు. అనగా కఠోరంబును సుస్నిగ్ధ నవనీత సదృశహృదయవిదారకంబును నగు ద్వేష మును బ్రేమచే జయింపుము." క్రీస్తుభగవాను డిట్లు శాసించి యున్నాడు:— "ఈ చెంపగొట్టిన గినియక యాచెంపబట్టుము; ప్రేమమయంబగు నీశ్వరరాజ్యమంత నీకొఱకు సిద్ధమగును." "ప్రేమ యెంతటి ఘోరభయంకరరాక్షసులనయిన జయించును. ద్వేషము ప్రేమాగ్నికింధనప్రాయము."—గాంధిభగవానుడు.

" The Evil is increased by Evil
It is impossible to destroy Evil by Evil."
"Leo Tolstoy"

" కీడు కీడువలన నభివృద్ధిజెందు; నశించుట దుస్సాధ్యము."

టాలస్టాయి మహాత్మునియీవాక్యము ప్రేమసాధనో న్ముఖమయినదియె. "అపకారికి నుపకారము నెపమెన్నక, సేయువాడె నేర్పరి సుమతీ." ఈవాక్యము సహితము ప్రేమ

సాధకుండగు కవికుమారుని హృత్సరోవర నిర్గతచారుతరంగమె.
కారణమేమన :—

"ప్రతికర్తుం నశక్తా యే బలస్థాయాపకారిణే
అసూయా జాయతే తీవ్రా కారుణ్యా ద్వినివర్తతే."

6వ గీత :— "ప్రపంచాస్థిగత్వబోధక జ్ఞానసంపన్నునికి ద్వేషవైరభావము శూన్యము."

—శ్రీ బుద్ధదేవుడు

"నిరంతర మృత్యు సంస్మరణము మానవుని యజ్ఞానమయచర్యల నొకించుక క్షీణింపజేసి, వానిని పాపభీతిగలవానిగ జేసివేయును."

—బేకన్.

"దేహశాశ్వతత్వమునుగూర్చి విచారించువారికి శుభబుద్ధియొదవి, అహంబుద్ధిని రూపుమాపివేయును."

"అశ్వినీకుమారదత్తు"

అద్వైతవాదియగు శంకరుడు సహితము శరీరాభిమానపేరితవ్యక్తి జీవితము దూషితమగుననియు, మృత్యుముఖగ్రస్తమగు దేహతత్త్వము నెఱుంగుమానవుని వ్యామోహాము పటాపంచమగుననియు నూహించినే :—

శ్లో॥ నలినీదళగతజల మతితరళం
తద్వజ్జీవిత మతిశయచపలం

విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం
లోకం శోకహతంచ సమస్తం.

ఈశ్లోకఖండము సయితము మానవుని వ్యామోహాయుక్తములగు సమస్యలనెల్ల సమూలముగ నిర్మూలించివేయనుపయుక్తమగును :—

"ఏతన్మాంసవసాది వికారం
మనసి విచిన్తయ వారంవారం;"
"గతవతివాయౌ దేహాపాయే
భార్యా బిభ్యతి తస్మిన్కాయే."

"ఈ దేహమెంతయు నిస్సారమను భావ మిందు చిత్రింపబడియున్నది."

జ్ఞానోదయప్రాప్తికయి శరీరము యొక్క యస్థిరత్వమును, దానిని విషయాసక్తమొనరించు సమస్తైహిక నశ్వర పదార్థములును నింద్యములనియు, మృగతృష్ణాసమానములనుజ్ఞానము నార్జింప హిందూమతశాస్త్రకారు లెన్నియో శ్లోకముల దమ కీర్తికాయసూచకములగు గ్రంథముల వ్రాసియున్నారు.

"అమేధ్యపూర్ణే క్రిమిజాలసఙ్కులే
స్వభావదుర్గన్ధ వినిన్దితాన్తరే

కళేబరే మూత్రపురీషపూరితే
రమన్తి మూఢా విరమన్తి పండితాః॥"

—యోగోపనిషత్తు.

"అపరిశుద్ధంబును, క్రిమి సముదాయ పూరితంబును, స్వాభావిక దుర్గంధ భూయిష్ఠంబును, మూత్రపురీష సంపూర్ణంబును నగు నీ కళేబరమునిమిత్తమయి మూఢులు భోగాపేక్షను గల్గి మసుచుండురు. పండితులు (జ్ఞానులు) దీనినుండి విముఖులయి వర్తించుచుండురు."

యోగవాసిష్ఠమున శ్రీరామచంద్రభూపాలు డిట్లు నుడివియున్నాడు :—

"త్వఙ్మాంసరక్తబాష్పాంబు పృథక్ కృత్వా విలోచన
సమాలోకయ రమ్యశ్చేత్ కిం వృథా పరిముహ్యసి॥"

"నీవు రూపవతి యని భ్రమించుచున్న వనితాలలామ యొక్క త్వక్కును, మాంసమును, రుధిరమును, బాష్పరాశిని వాయువును వేఱుగ భావించి దీర్ఘముగ విచారించుము. నీవు శూన్యమునే సర్వమని భ్రాంతిజెంది ప్రేమించుచున్నట్లు విశదమగును." రామచంద్రప్రభువు వేరొక్కచోట నొక విప్రుని వ్యామోహాగ్రస్తచిత్తుండగుట నవలోకించి యిట్లు నుడివియున్నాడు :

విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం
లోకం శోకహతంచ సమస్తం.

ఈశ్లోకఖండము సయితము మానవుని వ్యామోహ యుక్తములగు సమస్యల నెల్ల సమూలముగ నిర్మూలించివేయ నుపయుక్తమగును:—

"ఏతన్మాంసవసాది వికారం
మనసి విచిన్తయ వారంవారం;"
"గతవతివాయౌ దేహాపాయే
భార్యా బిభ్యతి తస్మిన్కాయే."

"ఈ దేహమెంతయు నిస్సారమను భావ మిందుచిత్రిం పబడియున్నది."

జ్ఞానోదయప్రాప్తికయి శరీరముయొక్క యస్థిరత్వమును, దానిని విషయాసక్తమొనరించు సమస్తైహిక నశ్వర పదార్థములును నింద్యములనియు, మృగతృష్ణాసమానములనుజ్ఞానము నార్జింప హిందూమతశాస్త్రకారు లెన్నియో శ్లోకముల దమ కీర్తికాయసూచకములగు గ్రంథముల వ్రాసియున్నారు.

"అమేధ్యపూర్ణే క్రిమిజాలసఙ్కులే
స్వభావదుర్గన్ధ వినిన్దితాన్తరే

కళేబరే మూత్రపురీషపూరితే
రమన్తి మూఢా విరమన్తి పండితాః॥"

—యోగోపనిషత్తు.

"అపరిశుద్ధంబును, క్రిమి సముదాయ పూరితంబును, స్వాభావిక దుర్గంధ భూయిష్ఠంబును, మూత్రపురీష సంపూర్ణంబును నగు నీ కళేబరమునిమిత్తమయి మూఢులు భోగాపేక్షను గల్గి మనుచుందురు. పండితులు (జ్ఞానులు) దీనినుండి విముఖులయి వర్తించుచుందురు."

యోగవాసిష్ఠమున శ్రీరామచంద్రభూపాలు డిట్లు నుడివియున్నాడు :—

"త్వఙ్మాంసరక్తబాష్పాంబు పృథక్ కృత్వా విలోచన
సమాలోకయ రమ్యంచేత్ కిం వృథా పరిముహ్యసి॥"

"నీవు రూపవతి యని భ్రమించుచున్న వనితాలలామ యొక్క త్వక్కును, మాంసమును, రుధిరమును, బాష్పరాశిని వాయువును వేఱుగ భావించి దీర్ఘముగ విచారించుము. నీవు శూన్యమునే సర్వమని భ్రాంతిజెంది ప్రేమించుచున్నట్లు విశదమగును." రామచంద్రప్రభువు వేరొక్కచోట నొక విప్రుని వ్యామోహాగ్రస్తచిత్తుండగుట నవలోకించి యిట్లు నుడివియున్నాడు :

"శ్లో. ఇతోమాంస మితోరక్త మితోఽస్థీనీతి వాసరైః
బ్రహ్మన్ కతిపయైరేవ యాతి స్త్రీ గతచారుతా॥"

—యోగవాసిష్ఠము.

"ఓ విప్రుడా! పూబోండ్లరూపరాశి యొకదివసము, ఒకప్రదేశమున రుధిరమును, మరొకస్థలమున మాంసమును, మరి యొకచో నస్థులునునయి పడిపోయి విచ్ఛిన్నమగును." ఈ శ్లోకి మెంతటి వైరాగ్యభావోత్పాదకశక్తి కాశ్రయభూతమగు చున్నయదో భాత్రితలారా! విచారింపుడి. అఖండభక్తిజ్ఞానవైరాగ్యనిలయుండగు శుకమహర్షి శరీరవినిందితప్రకృతినిగూర్చి యుద్బోధించి, మృతజీవుల కెట్టి సుబోధపీయూషరసమును బ్రసాదించుచు, బుద్ధదేవునిగీతావాక్యమును సమర్థించుచున్నాడో తిలకింపుడు!

"శ్లో—వ్రణముఖ మివ దేహ మ్మూత్రచర్మావనద్ధం।
క్రిమికులశతపూర్ణం మూత్రవిష్ఠానులేపం।
విగతబహుళరూపం సర్వభోగాధివాసం।
ధ్రువమరణనిమిత్త జ్జ్కాన్తు మోహప్రసక్త్యా।
ఇదమేవ క్షతద్వారం నపశ్యసి కదాచన।
క్షయన్తే యత్రసర్వాణి యౌవనాని ధనాని చ॥"

—యోగోపనిషత్తు

"గాయముయొక్క ముఖబిలమువలెనే, దుర్గంధయు క్తమగు త్వగాచ్ఛాదితంబును, శతసంఖ్యాక క్రిమినిలయంబును, మూత్ర పురీషాదిసంపూర్ణమయి నిరంతరపరివర్తనసూత్రబద్ధం బునునగు నీకాయము మోహావేశముచే సమస్తభోగమందిర మగుచో నియ్యది మృత్యువున కాస్పదమగుచున్నయది. యావ సధనాదికము లన్నియు సమూలముగ విధ్వంసమయిపోవుచు న్నయవి" శుకుని యీసుబోధకంబగు సుశ్లోక మెంతయు విష యాసక్తమృత్యుముఖగ్రస్తగృహస్థప్రపంచహితోపయుక్త మ యి భాసిల్లుచున్నయది.

"అపశ్యతాం హి యద్భానం ప్రపంచం భాతి సత్యవత్
ప్రపశ్యతాం హి యద్భానం ప్రపంచం యాతిశూన్యతాం॥"

ఈశ్లోకముసయితము మూఢజనావళికి జ్ఞానము నుపదే శించుట కర్హమయినదియె.

"కలదుకలదన్నవారికిఁ • గలదుజగము.
లేదులేదన్నవారికి • లేదుజగము."

ఇందును నెంతయో మూఢజననిర్మైతుకాభిమానభంజ కంబగు బలవత్తరశక్తి యంతర్భూతమయియున్నది. ఇహపర ముల పూర్వాపరములను, సారసములను గ్రహించిన వేదాంత శాస్త్రపారంగతుండగు భర్తృహరి మృత్యుదేవి యొక్క

మహాభయంకరంబును, భీభత్సంబునునగు తాండవసాక్షాత్కార మున లోకుల నిరాధారంబులగు నైహికవాదప్రాశస్త్యమును దునిమివేయుచున్నాడు:—

శ్లో:—"క్వైత ద్వక్త్రారవిన్ద జ్క్వ తదధరమధు, క్వాయతా స్తే కటాక్షాః।
క్వాలాపాః కోమలా స్తే క్వచ మదనధను
గ్భఙ్గురో భ్రూవిలాసః।
ఇత్థ ఙ్ఖట్వాఙ్గకోటీ ప్రకటితదశనం
మఞ్జుగుఞ్జత్సమీరం।
రాగాన్ధానామివోచ్చై రుపహసతి మహా
మోహజాల జ్కపాలం॥"

—శాంతిశతకము.

"మదభ్రూమియం దొక పడతియొక్క యస్థిపంజరము భగ్నావశిష్టమయి పడియుండెను. తలపుఱ్ఱెనుండి దంతపంక్తులు వెలుపలకు వచ్చియుండెను. సమీర మాశల్యవినిర్మితం బగుశీర్షమునం బ్రవేశించి—'కామమదోన్మత్తులగు మూఢుల నవలోకించి పరిహసింపుచు నిట్లు నుడువుచున్నట్టు లుం డెను:—"సురుచిరంబును, మనోజ్ఞంబునునగు నాముఖకమల మేమయినది? సంధ్యారాగరంజితంబులగు నాయధరము లెట నున్నవి? సుధారససేచితంబులగు నాశీతలకటాక్షవీక్షణ పరంపర

లెచట? ఆమృదుమధురశుకపికాలాపము లెటకరిగినవి? మన్మథ ధనుర్వినిందకములగు నాచంచలకుటిల భ్రూవిలాసము లెట డాగినవి?" మూర్ఖనిమాంధ్యమును, అహంకారమమకారరస ప్రవాహోద్రేకమును క్షీణింపజేయ నీహిందూమతాదర్శ గ్రంథవాక్యములు బుద్ధచంద్రునిగీతావాక్యమును సమర్థించుట లేదా? ఇందులకేగదా, ఆర్యులు—"ఓరీ! మూఢనరుడా! "దేహంరోగమందిరం" బయియుండ, మృత్యువే దానియంతిమ పరిణామమయియుండ, నిరంతరగగనహర్మ్య నిర్మాణమందే సమయమును దుర్వినియోగము సేయక, భగవచ్చింతన (ప్రశ్వాజీ వనము) యందేల వినియోగింపవురా?" అనిరి!

శునకమునుజూచి యొకతూరి యస్పృశ్యభావప్రేరితు డయి, రామదాసయోగి శునకాగమనపథమునుండి యొకింత విచలితుడయియుండ—కబీరుదాసు పరిహసించుచు—'రామ దాస! మృత్యుదేవీభృత్యుడవగు నీకేల యీభేదబుద్ధి? అఖిలము నకొక్కటియే! కారణముగదా! రేపోమాపోమరణింపనున్న నీకా యీ శునకమును గాంచి యేవగించుకొనవలసిన యవసరము తటస్థించినది? విశ్వవ్యాపకోదార జీవిత పరిజ్ఞానదూరుడవగు నీకృషియంతయు నిరుపయోగమె." అనినుడివి తనచెంతనున్న రొట్టెల బంచదారయు, నేయియు గలిపి శునకమును బుత్ర వాత్సల్యంబున జేరబిలిచి దానిని విందారగింపజేసెను.

7-8 గీతలు:—కామదేవునిచే నధఃపతితులు గావింప బడువారు.

మనమతగ్రంథము లీగీతల నీ చందమున సమర్థించు చున్నయవి:

"ఇంద్రియాణాం ప్రసంగేన దోష మృచ్ఛత్యసంశయం.
సంనియమ్యతు తాన్యేవ తతస్సిద్ధిం నియచ్ఛతి॥"

"మనుస్మృతి"

"ఇంద్రియ పరతంత్రుడగు మానవు డవశ్య మనర్థకములకు గురియగును." ఇది 7వ గీతను సమర్థించు చున్నయది. శ్రీ బుద్ధాచార్యుని 8వ గీతను మనుస్మృతిశ్లోకము యొక్క ద్వితీయ చరణము సమర్థించు చున్నయది. అర్థమేమన—ఇంద్రియముల వశీకృత మొనర్చుకొనువాడు నిస్సందేహముగా సుగతికు డగును.

" Not for himself, but for the world he lives."

"Lucan"

"అతడు తననిమిత్త మయి జీవించుటలేదు. విశ్వహితము నపేక్షించియే సజీవుడయి యున్నాడు." శ్రీబుద్ధదేవుని వచనానుసారముగా లూకెన్‌మహాశయుడు సృష్టిహితమునకే నరుడు జీవించుచున్నట్లు వచించియున్నాడు.

"పరోపకారార్థ మిదంశరీరమ్." ఇందుసహితము బుద్ధాభిప్రాయమే కలదు.

"భావమిచ్ఛతి సర్వస్య నాభావే కురుతే మనః
సత్యవాదీ మృదుర్దాన్తో యః స ఉత్తమపూరుషః॥"

"మహాభారతము"

"సమస్తమానవ కల్యాణమునభిలషించునతడే యుత్తమ పురుషుడు." ప్రమత్తుడవు కావలదను దానికి—Act, act in the living present!" "ప్రస్తుతము కర్మ సేయుము."

"హతం జ్ఞానం క్రియాహీనం;" "పురుషకారం అనువర్తతే దైవం." వీనివలన సోమరితనము తగనివృత్తియనియు, కర్మ సేయుత్తమంబనియు విశదమగుచున్నది.

"Blessed are they who covet nothing,
For they will receive all that others covet."

"Paul Richard"

"సకలాన్య వాంఛితం సంసిద్ధినొందుఁ
గాన నిష్కాముఁడుం కడుధన్యుఁ డతఁడు."

లోకకల్యాణ పరత్వము, జితేంద్రియత, అప్రమత్తత మొదలగు గుణములచే రాణించువాడు కాముని జయించు. వీనికి విరుద్ధాచరణయుక్తుడు, కామునికి దాసుడగునను భావము నే పైనుదహరింపబడిన వాక్యములు తేటపఱచుచున్నవి

9-10 గీతలు:—పాపములను, కామాది వికారములను జయించినవాడు నిరభ్యంతరముగా గాషాయ వస్త్రములు ధరింపవచ్చును, అంతశ్శుద్ధి లేనివా డనర్హుడు.

శ్రుతి. "యదా సర్వే ప్రముచ్యంతే కామా యస్యహృదిశ్రితాః।
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥"

"సమస్త కామముల నశింపజేసి యాత్మధ్యానమందు స్థిరత్వమును, ప్రజ్ఞనుగల్గియున్నవాడు బ్రహ్మమే, యనగా జీవన్ముక్తుడు."

శ్లో॥ "ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిం.॥"

—భగవద్గీత 6-10

"ప్రయత్న పూర్వకముగా నభ్యాసము సేయుచు సమస్త పాపములనుండి విశుద్ధుడయి జన్మ జన్మాంతర లభ్యమగు సిద్ధిచే పరమగతిపుడగును."

శ్లో॥ "జటిలో ముణ్డీ లుఞ్చితకేశః
కాషాయాంబర బహుకృతవేషః
పశ్యన్నపిచ నపశ్యతి మూఢో
హ్యుదరనిమిత్తం బహుకృత వేషః."

"జటాధారణయు, శిరోముండన స్వీకృతియు, కాషాయ వసనధారణయు నాదిగాగల వేషములచే మూఢుడు నిర్వాణమును జెందజాలడు. ఇవన్నియు కుక్షింభరణోచిత వేషములు.' ముక్తి కాత్మశుద్ధియే ప్రధానముగాని బాహ్యవేషానుషా నాడంబరము లెంతమాత్రమును గావు.

**13-14** గీతలు:—సువ్యవస్థిత చిత్తము సుఖోత్పాదకము; తద్విరుద్ధము దుఃఖకారణము.

"ఇంద్రియాణాంతు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియం।
తేనాస్యక్షరతి ప్రజ్ఞాదృతేః పాత్రాదివోదకం॥"

—మనుస్మృతి.

"రంధ్రముగల పాత్రయందు జలముండని లెఱంగున నే మానవుని యింద్రియముల యం దేయొకయింద్రియము చలించినను కామముద్భూతమగును."

ఉ॥ "ఏల కుమార! శోషిలఁగ నీజననంబున నన్నుఁగానఁగాఁ
జాలవునీవు కామముఖషట్కమునిర్దళితంబుఁ జేసి ని
ర్మూలితకర్ముఁడైన మునిముఖ్యుఁడు గాని కుయోగిగానఁగాఁ
జాలఁడునీదుకోర్కి కొనసాగుటకై నిజమూర్తిఁజూపితిన్॥"

—భాగవతము.

నారదునకు బోధింపబడిన యీ పద్యము వలన "గామము నశింపనిదే, సత్యము సాక్షాత్కరింప బడదు." అని తెలియుచున్నయది. ఈగురుజనవాక్యములన్నియు మనోస్థిరత్వము నపేక్షించుచున్నవి.

15 నుండి 18 వఱకు సంఖ్యగలగీతలు సత్కర్మానుష్ఠానపరుని కిహాపరలోకముల సౌఖ్యము కలుగుననియు, దుష్కార్యాసక్తున కిహాపరములదుఃఖమే భోక్తమగుననియు శ్రీబుద్ధాచార్యుని యభిప్రాయము.

"పశ్యైతాన్ మహాభాగ పరార్థైకాంతజీవితాన్
వాతవర్షాతపహిమాన్ సహన్తో వారయన్తినః 1
అహో ఏషాంవరంజన్మ సర్వప్రాణ్యుపజీవనం
సుజనస్యేవ యేషాంవై విముఖా యాంతినార్థినః 2
పత్రపుష్పఫలచ్ఛాయా మూల వల్కల దారుభిః
గంధనిర్యాస భస్మాస్థితోక్మైః కామాన్వితన్వతే॥ 3
ఏతావ జ్జన్మసాఫల్యం దేహినా మిహ దేహిషు
ప్రాణైరర్థై ర్ధియావాచా శ్రేయ ఏవాచరేత్సదా॥" 4

—భాగవతము 10 స్కం. 22 అధ్యా॥

"పరోపకారార్థమే కేవలము సజీవములయి యున్న వృక్షసముదాయములు యెంతసంస్తవనీయములు! వానిజీవితముల దిక్కునకు మీా ధ్యాన శకటముల బర్వత్తింపుడి. వాత

శీతాతపవర్షముల బాధల సహించుచు మనల రక్షించుచు యాచకబృందమును సజ్జనకోటి సంతసింపజేయు చడువున, పత్ర పుష్పఫలచ్ఛాయల నొసంగుచు హర్షాంబుధి నోలలాడించు చున్నవి." శ్రీకృష్ణభగవానుడు పరోపకారమునే సర్వోత్త మంబగు సత్కార్యముగను, దానివలననె జన్మసాఫల్యము కర తలామలకంబగుననియు వర్ణించి యున్నాడు.

"పరోపకరణం యేషాం జాగర్తి హృదయేతా,
నశ్యంతి విపదస్తేషాం సమ్పదః స్యుః పదే పదే."

—చాణక్యనీతి.

"పరోపకారము సేయుసత్పురుషులకు విపత్పరంపరలు నశింప నడుగడుగున సంపద లభివృద్ధిజెందును."

20వగీత:—విషయముల నశింపజేసి, రాగద్వేషాదుల వీడి పరిశుద్ధుడగు వాడే యాచార్యుడు. ఇతడే కైవల్యాధికారి.

శ్లో॥ తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణాం,
ముముక్షూణా మపేక్ష్యోయ మాత్మబోధో విధీయతే.

—ఆత్మబోధ.

"పరిపక్వం మనోయేషాం కేవలోయంచ సిద్ధితః
గురుదైవత భక్తానాం సర్వేషాం సులభో జనాత్."

ఈ రెండు శ్లోకములను తపమాచరించి శాంతినంది వీతరాగియయిన వాడే పరిపక్వంబును, సుదృఢంబును నగు చిత్తముచే నుత్తముడయి మోక్షమును బడయ సమర్థుండగు నని వ్రాయబడియున్నవి.

* * * *

## అప్రమాద వర్గము

గ్రంథవిస్తర భీతిచే శ్రీబుద్ధాచార్యునిధమ్మపదగీతముల భావమును సమర్థించు శ్లోకములను, పండిత వాక్యములను సంక్షిప్తముగా బొందు పలుపనెంచితిని. ప్రతిశ్లోకమునకు దాత్పర్యము వ్రాయమొదలిడుచో వేరొక గ్రంథమే సిద్ధమగునుగాన కఠినతమంబులగు వానికి మాత్రమే భావార్థము వ్రాయు చున్నాడను. ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యుడు సోమరితనమును దరిజేర నీయరాదనియు, కామక్రోధములు దీనివలననే చెంతజేరు చుండు ననియు, జాగ్రత్తను గల్గియుండు వ్యక్తికి భయవిషాదములు వాటిల్లనేరవనియు వక్కాణించియు న్నాడు. బౌద్ధేతరమతాభిప్రాయములు:—

శ్లో॥ "ఆసుప్తేరామృతేః కాలంనయేత్ వేదాన్తచిన్తయా,
దద్యాన్నావసర జ్కిఞ్చిత్ కామాదీనాం మనాగపి."

—పంచదశి.

"నిద్రాభిగ్రస్తుడవు గానంతపర్యంతము, మృత్యుముఖ ద్వారమును బ్రవేశింప నంతదనుక వేదాంతచింత (సత్యా

న్వేషణము లేక పరిశీలనము) యందే సమయమును వ్యతీతము చేయును. కాని మదియందణుమాత్రమైన గామాదివికార ములకు స్థానమీయరాదు."

"సర్వకాల సర్వావస్థలయందు నీశరీర మున్నంతపర్యంత ము మానవుడు జాగరూకుడయియుండి సత్యాసత్యధర్మ పరి శీలనము నేయుచుండిన వానిని భయంకరశత్రువగు కాము డేమియు జేయజాలడు."

—న్యూటన్.

అప్రమత్తు డగువాడు సత్యపదార్థచింతనము లేక ధ్యానమందుండుచో విషయాదులవ్వానిని స్పృశింపజాలవను సిద్ధాంతమును:—

శ్లో॥ "మకరందం పిబన్ భృంగో గంధం నోపేక్షతే యథా
ధ్యానాసక్తం తథాచిత్తం విషయాన్నహి కాంక్షతే."

"మందార మకరంద పానాభిలాషాయుక్తంబగు భ్రమ రము దుర్గంధము నపేక్షింపని విధంబుననే ధ్యానాసక్తము లేక జాగృతచిత్తము విషయాదుల వాంఛించునన్న స్వప్నవార్త."

"మృత్యువు సర్వదా జీవకోటి హృదయమందే డాగి యుండి సమయమును జూచి యొక్కసారి ప్రత్యక్ష మగును. అయ్యది ప్రత్యక్ష మగుటకు బూర్వమే మానవులప్రమత్తులయి.

యుండి యజ్ఞానినాహ్వానింప సిద్ధమయి యున్నచో వారికది
దుఃఖమునకుమారానందమునే వాటిల్లజేయును. నేను మృ
త్యువు నీబాహువల్లరితో గౌగిలింప వేచియుంటి."

—సుకరాత్తు.

తే॥ గీ॥ "విను మొకరహస్య మెఱిగింతు • వేయునేల?
యే మహాప్రాజ్ఞునకు మాన • సేంద్రియములు
పంచిన ట్లాజ్ఞలో నిల్చి • పనులుచేయు
నతఁడు నాత్మస్థితప్రజ్ఞుఁ • డగు బుధేంద్ర!"

—సీతారామాంజనేయము.

మానవుఁ డలసుడగుట తగదు నిత్యము కృషిసేయుచు జాగరూకుడయి యున్న కామక్రోధాది రిపులు మనోదుర్గమును భేదింపజాలక మానవునికార్యదక్షతకు భయపడి పరుగిడి పోవును.

—బుద్ధుడు.

శ్లో॥ "శ్వఃకార్య మద్యకుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికం
నహిప్రతీక్షతే మృత్యుః కృతమస్య నవాకృతం."

"ధర్మస్య త్వరితాగతిః" అని యెఱిగి నీవిహితకృత్యమును (ధర్మమును) రేపటిది నేడు, ముందుగడియ దీగడియ యందు జేసివేయుము. కారణమేమనగా మృత్యువు మనకార్యము లెంతవఱకు పూర్తియయినదియు నిచారింపబోదు."

జాగ్రత్తను వహించి ధర్మమును శీఘ్రమాచరింపుమని యీపాశ్చాత్య పండితుని వాక్యము బోధసేయుచున్నది:—

" Are you in earnest ? Seize this very minute
What you can do, or think you can begin it."

—Faust.

"పదంహి సర్వత్ర గుణైర్నిధీయతే."

"అప్రమాదము యొక్క స్వభావసిద్ధములగు సద్గుణములను గల్గియుండియే ముందంజ వేయదగును."

" The wise and prudent conquer difficulties
By daring to attempt them. Sloth and folly
Shiver and shrink at sight of toil and danger,
And make the Impossibility they fear."

—Rowe.

"వివేకసంపన్నులును, దూరదృష్టియుక్తులును నగుమానవులు కఠినకార్యములం సహితము చేయగలమను సాహసము చేతనే సాధింపగల్గు చున్నారు. ప్రమాదము, మాంద్యము పరిశ్రమనుగాంచి భీతిజెంది కంపించిపోవు చున్నయవి. కానసాధ్యములగు కార్యములగాంచి భయపడువ్యక్తి స్వయముగ దానే యసావధానుడయి యసాధ్యతోత్పత్తికి హేతుభూతుడగుచున్నాడు."

సుఖదుఃఖముల జలింపరాదనియు, నిత్య మానందమునే పడయుచుండ వలయుననియు, నట్టివానిని జయించు పదార్థ మెద్దియు లేదనియు బుద్ధుని సిద్ధాంతము.

"అథ ఊర్ధ్వత్వ మాయాతి యాత్యూర్ధ్వత్వ మథ స్తథా
సంసారస్య చలస్యాస్య చక్రనేమి రివాభితః॥"
—యోగవాసిష్ఠము.

"రథము యొక్క చక్రపాంత మూర్ధ్వాధోముఖముల సంచరించుచుండువిధంబుననే సంసారము యొక్క యూర్ధ్వభాగ మధోభాగంబునకును, అధోభాగ మూర్ధ్వ భాగంబునకును సహజముగనే, వచ్చుచుండును" అనగా సుఖదుఃఖములు సహిత మిట్లేచందమున వచ్చుచుండును గాన నప్రమత్తుడు సౌఖ్యావస్థయం దున్మత్తుడును, దుఃఖావస్థయందు హతాశు డును గారాదు.

"సుఖమాపతితం సేవే ద్దుఃఖ మాపతితం తథా
చక్రవ త్పరివర్తంతే దుఃఖానిచ సుఖానిచ॥"

"కృష్ణశుక్ల పక్షములవలె—క్రిందికి, మీదికిని తిరుగు చక్రముచందానవచ్చు సుఖదుఃఖముల నప్రమత్తుడయి మాన వు డనుభవించవలయును."

"సుఖమధ్యేస్థితం దుఃఖం, దుఃఖ మధ్యేస్థితం సుఖం
ద్వయ మన్యోన్యసంయుక్తం ప్రోచ్యతే జలపంకవత్।

తస్మాద్ధైర్యేణ విద్వాంస ఇష్టానిష్టోపపత్తిషు
నహృష్యన్తి నముహ్యన్తి సర్వంమాయేతి భావనాత్॥"
—అధ్యాత్మ రామాయణం.

" సుఖదుఃఖములు త్రిగుణాత్మకములు. కనుక సుఖము నందు దుఃఖమును, దుఃఖమందు సుఖమును గలవని యెఱుంగుడి. ఈ రెండును పంకి, జలమువలె బరస్పరసంయోగాన్వితము లయి యున్నవి. కాన విద్వాంసు లిష్టానిష్టభేదమును బాసి సమస్తమును నిశ్చలచిత్తముతో ననుభవింతురు."

* * * * *

చిత్తవర్గము (భావసంయమ వర్గము.)

ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యుడు ప్రపంచక్షేత్రమున మానవుడు జీవితశకటమును నడుపుతరుణమునం దతని చిత్తమును నలుకెలంకుల వ్యాపించియున్న సమ్మోహజనకంబు లగు పదార్థము లాకర్షించి, కామక్రోధాది యరిషడ్వర్గ బలమును బ్రవర్ధమానము సేయుచుండ వానినుండి నిజచిత్తమును సంరక్షించుకొని శమదమాద్యుత్తమ గుణాలంకార భూషితమొనర్చి తదుత్తమచిత్తబలాతిశయంబున నిహపర సౌఖ్యసాధనంబగు నిర్వాణమార్గమును ధర్మజిజ్ఞాసపిపాసువులకు జూపించియున్నాడు. చిత్తవశీకరణమును గూర్చియు, భావసంయమమును గుఱించియు; ఇంద్రియచాంచల్యపరివృత్తిం గూర్చియు హిందూశాస్త్రాది మహోద్గ్రంథములయందును, విదేశీయ,

విజాతీయ, విరుతావలంబుల ధర్మగ్రంథనూల సజీవములయి రాణించుచున్నట్టియుసిద్ధాంతముల నిటబొందుపఱచుచున్నాడను. ప్రత్యేకబుద్ధగీతపై వ్యాఖ్యానము వ్రాయువిధానము వింతటితో గ్రంథవిస్తరభీతిచే విరమింపజేసినందులకు బాఠకలోకము నన్నుమన్నించుగాత!

"It is the mind that makes good or ill,
That maketh wretched or happy, rich or poor."

—Spenser.

"మంచికిని కీడునకును మూలముచిత్తమె. ఇదియె సౌఖ్యమునకును దుఃఖమునకును, భాగ్యమునకును దుర్భాగ్యమునకును మూలమగుచున్నది.

"నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయఏవాభివర్ధతే॥"

—మనుస్మృతి.

"కామభోగానుభవంబున గాంక్ష యెన్నటికి నిర్మూలము కాజాలదు. అది సుంతయు శాంతింపక నిత్యము నాజ్యాహుతిసందిన ప్రచండానలమువలె వృద్ధినందుచునే యుండును."

"వశీకృత్వేంద్రియగ్రామం సంయమ్యచ మనస్తథా।
సర్వాన్ సంసాధయే దర్థా నక్షిణ్వన్ యోగతస్తనుం॥"

—మనుస్మృతి.

శ్రీబుద్ధాచార్యుడు శాసించినవిధంబుననే మనుస్మృతి సహితము శరీరమును హఠశఠయోగాదు లను నసాధ్యభావి. క్లేశోపాయములచే శుష్కింపజేయక సంయమవ్రతానుష్ఠానంబున జిత్తమును స్వాధీనమొనర్చుకొని సర్వార్థసిద్ధినందుటయే శ్రేయోదాయకమని నుడువుచున్నయది.

చిత్తమున కంగసదృశమగు వాగింద్రియమును మనస్సుతోఁబాటు సంయమబంధమున బంధించి విషయాదుల నుండి యద్దానిభావప్రవాహమును నిరోధించినచో బ్రహ్మజ్ఞానప్రతిపాదకములగు నెల్లసౌఖ్యముల బడయవచ్చునని యీ క్రిందిశ్లోకము తెల్ల మొనరించుచున్నయది:

"యస్య వాఙ్మనసే శుద్ధే సమ్యగ్గుప్తేచ సర్వదా।
స వై సర్వ మవాప్నోతి వేదాన్తోపగతం ఫలం॥"

—మనుస్మృతి.

"మనశ్శుద్ధియు, వాక్శుద్ధియునుగల్గి సంయమమును బాలించువా డెల్లఫల ములనిస్సంశయముగ బడయ సమర్థుం డగును."

శ్లో:—సంసారః స్వప్నతుల్యోహి, రాగద్వేషాదిసంకులః
స్వకాలే సత్యవద్భాతి, ప్రబోధే సత్యవద్భవేత్॥
తీర్త్వా మోహార్ణవం, హత్వా రాగద్వేషాదిరాక్షసాన్
యోగీ శాంతిసమాయుక్తో, హ్యాత్మారామో విరాజతే॥

"ఆత్మప్రబోధము."

"రాగద్వేషాదిసంకులంబగు నీసంసారము స్వప్నసదృశము. ఇయ్యది స్వప్నావస్థయందు సత్యమువలె గానవచ్చుచు జాగ్రదవస్థయందు మిథ్యాన్వితమయి గోచరించును. రాగద్వేషాదిరాక్షసుల విధ్వంసమొనర్చి మోహమనియెడి సాగరము నుల్లంఘించి, శాంతచిత్తుండగు సంయమచంద్రుని, ననగా మనస్సును వశీభూతమొనర్చుకొనిన యుత్తముని హృదయమునం దాత్మారాముడు (విజ్ఞానముయొక్క విశుద్ధసత్యజ్ఞానజ్యోతి) ప్రకాశమానముగ విద్యమానమయియుండును."

"ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్।
ఆత్మైవహ్యాత్మనోబంధు రాత్మైవ రిపు రాత్మనః॥"
—మహోపనిషత్తు.

"ఆత్మచే నాత్మనే స్వాధీనము జేసికొనుట శ్రేయస్కరము. ఆత్మను శుష్కీభూత మొనర్చుట హితకరము. తన చిత్తము తనకు వశమయియున్నచో నదియె మానవుని కాప్తబంధువగును. మానవునే వశపఱచుకొని స్వేచ్ఛాపరతంత్రమయి, విషయభోగ సామ్రాజ్యాసనము నధిష్ఠించిన చిత్తమే మహాప్రాణాంతకశత్రువగును." తృతీయసర్గమునందు దేవుడుపదేశించిన తుదివాక్యమిదియె.

"దుఃఖే ష్వనుద్విగ్నమనాః, సుఖేషు విగతస్పృహః॥"

"ఖేదములచే చిత్తము సంక్షుభితము కాజాలదు; సుఖములచే మానసము హర్షింపదు." జనకమహర్షి శుకునితో వచించిన యీవాక్యములం దెట్టిమహత్తరంబగు ననాసక్త భావస్ఫూర్తి కలదో విచారింపుడి. చిత్తవశీకరణము జననమరణరహితంబగు నిర్వాణమునకు హేతుభూతమగున ట్లీవాక్యమే విశదము సేయుచున్నది. ప్రాచీన పండితోత్తముం డొకడీవిధమున గటాక్షించియున్నాడు :—

"ఆశాపాశ విముక్తి యుక్త మమలం సంతోషమూర్త్యం మనః."

'డుగాల్డు స్టుఅర్టు' అను నామధేయముగల యొకానొక పాశ్చాత్యభాషా పండితోత్తముడు సుఖసాధనమును దీర్ఘకాల పర్యంతము కృషిచేసి యన్వేషించి యంతమునకు విజయభేదియయి యీచందమున వక్కాణించి యున్నాడు :—

"The great secret of happiness is to study to accommodate our own minds to things external rather than to accommodate things external to ourselves."

"బాహ్యపదార్థముల దమ్మనుసరింప జేసికొనుటకయి యత్నించుటకంటె దమ చిత్తములనే వశముచేసికొని బాహ్యవిశ్వప్రకృతి ననుసరింపజేసిన సౌఖ్యరహస్యము వెల్లడికాగలదు. స్వాధీనమయిన చిత్తము బాహ్యాంతరిక విశ్వప్రకృ

తుల ననాయాసముగా ననుకరింప సమర్థమయి యుండుననియే భావము."

"యోఽన్తః శీతలయా బుద్ధ్యా రాగద్వేష విముక్తయా।
సాక్షీవ త్పశ్యతీదంహి జీవితం తస్య శోభతే॥"

"రాగద్వేషాది రహితచిత్తుడయి, యాంతరిక శీతలత్వముచే విరాజిల్లు బుద్ధిని గల్గియుండు మానవోత్తముడు సంసారమును బరిశోధకునిచందమున వేఱుగా నిలువబడి యవలోకించుచుండును; వాని జీవితమే శోభాయమానమగును."

"శ్లో. బంధురాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మైరాత్మనాజితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్॥"

"దేహేంద్రియముల నెల్ల జయించి వానిపై స్వతంత్రాధికారమును గల్గియుండు చిత్తమే మానవున కాత్మబంధువయి యాపత్కాలమందు సన్నిహితము వానిని సంరక్షించును. ఇంద్రియానుగ్రహమునకు వశమయి నిగ్రహము నెడబాసి విషయవాసనా పరతంత్రమగు చిత్తమే నరునకు మహాప్రాణశత్రువు."

"Balanced mind shows the real path to Godhead"

"సంయమితచిత్తమే నిర్వాణమునకు నిజమగు పథమును జూపించును."

శ్రుతివాక్యమిట్లు వినబడుచున్నయది :—

—రామతీర్థ స్వాములు

"య స్త్వవిజ్ఞానవా న్భవ త్యయుక్తేన మనసా సదా।
తస్యేంద్రియా ణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః॥"

"జ్ఞానశూన్యుడయి, మనోనిగ్రహదూరుడయి మెలంగు వ్యక్తియొక్క స్వీయేంద్రియములే, సారథికి వశముకాని దుష్టాశ్వమువలెనే స్వాధీనముగాక దుష్పథమున నడిపించి కష్టముల పాల్సేయును."

రోమక సామ్రాజ్యము యొక్క సత్యపరిశోధకుండగు సేనేమహాశయుడీ తెలంగుల సెలవిచ్చియున్నాడు :—

"The great blessings of mankind are within us, and within our reach, but we shut our eyes, and like people in the dark, we fall foul of the very thing we search for without finding it."

"Wisdom allows nothing to be good that will not be so for ever; no man to be happy, but he that needs no other happiness than what he has within himself."

"The greatest felicity of all is not to stand in need of any."

"మానవజాతి యొక్క సర్వోత్తమంబగు సౌఖ్యభండారము మనయందే గోపనీయమయి యున్నది; అది మనకు ప్రాప్తించగలదు. కాని మనము మనదృష్టిని బంధించుకొని

యున్నారము; అంధకార పటలమందు నిలువబడియున్న వ్యక్తివలె మన మద్దాని నన్వేషించుచున్నారముకాని మనము గోడదెబ్బలు తినుచున్నాము, సుఖము లభించుటలేదు.''

''ఉత్తమము కాని పదార్థమును మన వివేక మెట్టిస్థితి యందును బేరిమింపజాలదు. ఆంతరికసౌఖ్యావశ్యకమును దక్క మరెట్టి సౌఖ్యావసరమును గల్గియున్న వ్యక్తినయిన నయ్యది పేరిమింపజాలదు.''

''ఏసౌఖ్యము యొక్క యభిలాషను గల్గియుండకుండు టమే సర్వోత్తమంబగు సౌఖ్యము.'' అనగా మనస్సును విషయాదులనుండి మరల్చుకొన్నచో నయ్యది పరిశుద్ధమగును. అప్పుడట్టియుత్తమచిత్తమందు కలుగు నాత్మానంద పరాకాష్ఠయే సౌఖ్యముయొక్క చరమసీమ యగును.

ఆంతరిక సౌఖ్యమన్నను, ఆంతరికశాంతి, ఆనందము, స్థిరత్వము, ప్రజ్ఞయన్నను మనోనిగ్రహము యొక్క సుస్నిగ్ధ సాధుమహోజ్జ్వల పరిణామమె. జర్మనుదేశము యొక్క షోపనహోరుడను పండితుడు చిత్తసౌఖ్యమును గురించి యిట్లనుచున్నాడు :—

"The happiness we receive from ourselves is greater than that which we obtain from surroundings."

" Our happiness depends in a great degree upon what we are, upon our individuality."

"For what a man is in himself, what accompanies him when he is alone, what no one can give or take away, is obviously more essential to him than anything he has in the way of possessions, or even what he may be in the eyes of the world."

" మనచిత్తమునుండిలభ్యమగు సౌఖ్యమే మన చతుర్దిశ వ్యాప్త పదార్థసంచయమునుండి లభ్యమగు సౌఖ్యముకంటె కడు ప్రశస్తమయినది."

"మనదగుసౌఖ్యము విశేషించి మనమీదను, మనవ్యక్తిత్వముమీదను నాధారపడియుండును."

"సర్వేశ్వరాధికారమందు సురక్షితమయియున్న మానవుని పదార్థసంపత్తికంటెను, సంసారముయొక్క దృష్టిలో మానవుడు పరిగణింపబడు దానికంటెను, మానవునియందే నిరతముండి యతడేకాకిగానున్నపుడతనికి సహచరునిగా వర్తించుచు నెవ్వారిచేత నపహరింపబడకుండ నుండునదియె మానవుని కధికావశ్యకమయినది. అందే సౌఖ్యముకలదు."

భావమేమనగా నిలపై బ్రాప్తించు సకలపదార్థతతులెట్లుప్రాప్తించినవో యటులే నశించునవి సహితమయియున్నవి. కానియుత్తమంబగు చిత్తమునే బ్రాప్తమగు మానవుని

సౌఖ్యప్రపత్తి నిరంతర మతనిని వెంటాడి రక్షించుచుండును. శ్రుతివాక్యము లిట్లు కర్ణగోచరములగుచున్నవి:—

“శ్లో:—యస్త్వవిజ్ఞానవాన్ భవ త్యమనస్కః సదాఽశుచిః।
నస తత్పదమాప్నోతి సంసారంచాధిగచ్ఛతి॥

“జ్ఞానశూన్యుడయి సర్వదా మనోనిగ్రహదూరుడయి సంసారమం దశుద్ధుడయి విషయవాసనానురక్తుడగు మానవు డధఃపతితుడయి నిర్వాణమును బడయ నితాంత మసమర్థు డగును. జనన, మరణ, వ్యాధిగ్రస్తమగు నీభవసాగరమున జీటి కిమాటికి జననమందుటయే వాని విధియగును.”

“యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః।
స తత్పద మవాప్నోతి యస్మా ద్భూయో నజాయతే॥”

“నిరంతరము మనోనిగ్రహాయుక్తుడయి, బాహ్యాం భ్యంతరికశుద్ధుడయి వర్తించుధీరాగ్రణి నాశరహితంబును పునరావృత్తిశూన్యంబునునగు విశుద్ధనిర్వాణపదవి నందగల్గు చున్నాడు.

* * * * *

పుష్పవర్గము.

“ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యులవారు, ధర్మజ్ఞాన సాధకుడు త్రిలోకముల నవలీలగ జయింప సమర్థుండనియు, జీవితమును మృగతృష్ణాతుల్యంబుగను, బుద్బుదసదృశంబుగ

నెలుంగువ్యక్తి కామునిజయించి, మృత్యువును బారదోలి
సమర్థుండగుననియు, ప్రమత్తుడు మృత్యుముఖగ్రస్తుడగుననియు,
పుష్పములనుండి భ్రమరములు సాధువృత్తిచే మకరందమును
గ్రహించిన విధంబున బౌద్ధసాధువులు ప్రజాసంఘముమధ్య
జీవింపదగుననియు, పరులదుష్కార్యములను, దోషపుంజము
ల నెన్నుటకంటె స్వీయదోషసంస్కరణమునకయి యత్నిం
చుటయే మానవునికర్తవ్యమనియు, సుగంధయుక్తమగు
సుమనమును జనులు ప్రేమించుభాతియే మనోవాక్కర్మల
నొక్కరీతివర్తించువారిని జనులాదరింతురనియు, మిథ్యావా
గాడంబరుల సుగంధరహితములగు కుసుమములవలె సంసార
ము త్యజించివేయుననియు, ఒక్కపుష్పరాశినుండియే యసం
ఖ్యాకములగు పుష్పమాలలు కూర్చబడుచందమున నే యొ
క్కసారి మానవజన్మను ధరించినంతమాత్రంబుననే సహస్రను
సహస్రసుకృతముల మానవుడు సేయగలడనియు, వాయుగ
తికి విరుద్ధముగా నరుగశక్తిలేని కర్పూరాదిసుగంధద్రవ్యముల
కుదురుసువాసనకంటె, దేశకాలభేదంబు లేక సర్వత్రవ్యాపించు
సత్పురుష సౌజన్యగంధమే సర్వోత్తమంబనియు, సద్వి
చారసమన్వితుండును, సద్గుణాలంకృతుండును, సత్యజ్ఞానకర్మ
యోగసాధకుండునునగు వ్యక్తినిగాంచి కాముడు పలాయనుం
డగుననియు, మురికికుప్పల నుత్పన్నమయి తననలువంకల సుగం
ధభరితమొనర్చు కమలమువలె జ్ఞానియగుసాధువు తనకు

జతుర్దిశలవ్యాప్తమయియున్న యజ్ఞానాంధకారబంధురంబగుజన సంఘమ్మధ్య దేదీప్యమానముగ వెలుంగుచుండుననియు జెప్పియున్నాడు. శ్రీబుద్ధదేవుని యీయభిప్రాయములనే తమమతము యొక్క ముఖ్యాదర్శములుగాఁగొన్న ప్రాచ్యపాశ్చాత్య మతావలంబుల సిద్ధాంతవాక్య సముదాయముల సీదిగువ జేర్కొనుచున్నాడను:—

"శ్లో:—కాంతాకటాక్ష విశిఖా నదహన్తి యస్య
చిత్తం న నిర్దహతి కోపకృశానుతాపః।
కర్షన్తి భూరివిషయాశ్చ న లోభపాశై
ర్లోకత్రియం జయతి కృత్స్న మిదం స ధీరః॥

—భర్తృహరి.

"వనితాలలామల సుస్నిగ్ధకటాక్షము లను తీవ్రబాణములకు భేదింపనసాధ్యమయినట్టి చిత్తముకలవాడును, క్రోధమను ప్రచండానలజ్వాలలచే దహింపబడనట్టిచిత్తముచే భూషితుండయినట్టివాడును, ఇంద్రియవిషయలోభపాశములచే బంధింపబడనట్టిచిత్తముచే విరాజిల్లునట్టివాడును ధీరపురుషుడుగాన త్రిలోకముల నపూర్వంబగు విజయమును బడయుచున్నాడు."

Wanted!
Reformers
Not of others, but of themselves;
Who have won
Not university distinctions,
but victory over the local self.
Age:- the youth of divine joy.
salary :— God-head.
Apply sharp:
With no begging solicitations,
but commanding decision to the
Director of the Universe,
Your Own Self
Om! Om! Om!

—Rama.

"విజ్ఞాపనము! కావలయును!! సంస్కర్తలు!!!

పరులనిమిత్తముకాదు; స్వాత్మార్థము. విశ్వవిద్యాలయపట్టభద్రులు కారు; అహంభావమును జయించిన వారు. ప్రాయము:—దివ్యానందపూర్ణ తారుణ్యము. వేతనము:—నిర్వాణము (ఈశ్వరప్రాప్తి). ఈదిగువవిలాసమునకు వ్రాసికొనుడు:—జగన్నియంత అనగా స్వాత్మకనియె. కేవలము దాసోహముతో మిళితమయిన దైన్యముతోడగాదు; నిశ్చయాత్మకంబగు నధికారముతోడ! ఓం! ఓం! ఓం!

"రామతీర్థస్వామి",

స్వాత్మసంస్కరణకర్తలు నిర్వాణమును బడయుట కెట్టి ప్రతిబంధకము లేదని రామతీర్థస్వాములవారు, విజ్ఞాపనమునం దు వెల్లడించియున్నారు. ఈదిగువ నుదహరింపబడుశ్లోకము ధర్మజ్ఞానసాధకులగు మహాపురుషుల నెట్లు సంస్తుతించుచున్న దో తిలకింపుడు:—

"స్వసుఖనిరభిలాషః ఖిద్యసే లోకహేతోః
ప్రతిదిన మథవా తే వృత్తి రేవంవిధైవ।
అనుభవతిహిమూర్ధ్నా పాదప స్తీవ్రముష్ణం
శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానాం॥"

—కాళిదాసు

మహాపురుషులు స్వసుఖనిరభిలాషులయి లోకహితపర తంత్రులయి యుందురు. ఇట్టివారలే త్రిలోకవిజయమున కర్హు లని శ్రీబుద్ధాచార్యుడు వచించియున్నాడు. ఈశ్లోకమునందు మహాపురుషులగుణము లెట్లు కీర్తింపబడినవో చూడుడు!

"విద్యావిలాసమనసో ధృతశీలశిక్షా,
స్సత్యవ్రతారహితమాన మలాపహారాః।
సంసారదుఃఖదలనేన సుభూషితా యే,
ధన్యా నరా విహితకర్మ పరోపకారాః॥"

బుద్ధాచార్యుని ధర్మజ్ఞానసాధకులగు నుత్తమనరు లిట్టి వారె! వీరుధన్యులు! వీరికయి యీశ్వరరాజ్యము సిద్ధమయి యున్నది.

"అవిజిత్య య ఆత్మాన మమాత్యాన్ విజిగీషతే।
అమిత్రాన్ వాఽజితామాత్యః సోఽవశః పరిహీయతే॥"

—మహాభారతము.

"తన్నుదాను జయించుకొనక మిత్రులను, మిత్రులను జయించక శత్రువులను, జయింపనభిలషించు వ్యక్తి దీనుడయి నష్టమునకు గురియగును." ఇట్టివ్యక్తి త్రిలోకవిజయమున కెట్టికృషి గావించినను బడయజాలడు.

"Brave conquerers! for so you are
That war against your own affections,
And the huge army of the world's desires."

—Shakespeare.

"ధర్మసంగ్రామమున స్వీయచంచలేంద్రియముల నణచి ప్రాపంచికాభిలాష లను మహాభయంకర శత్రుసైన్యమును జయించినవారే ధీరులగు విజేతలు." వీరలే త్రిలోకవిజయులు.

"The Government of one's self is the only true freedom for the Individual.

—Frederic Parthes.

"వ్యక్తి కిలాతలంబున నాత్మపరిపాలనమే వాస్తవికం బగుస్వాతంత్ర్యము లేక విజయము." వీరే శ్రీబుద్ధాచార్యుని త్రిలోకవిజయులు.

"తన్నుదాను జయించుకొన్న మహాధీరవీరాగ్రేసరచక్రవర్తియే సర్వాంసహాదిగ్విజేతకంటెను వేయిమడుంగులుత్తముడు."

—క్రీస్తుభగవానుడు

"భస్మాంతం శరీరం"—యజుర్వేదము

ఈరహస్యము నెఱుగువాడు తృష్ణాశూన్యుడయి, కాముని జయించును.

"యత్రానేకః క్వచిదపి గృహే తత్రతిష్ఠత్యథైకో
యత్రాప్యేక స్తదనుబహవ స్తత్రనైకోఽపిచాన్తే।
ఇత్థంనేయౌ రజనిదివసౌ లోలయన్ ద్వావివాక్షౌ
కాలఃకాల్యా భువనఫలకే క్రీడతి ప్రాణిశారైః॥"

—వైరాగ్యశతకము

"ఏయింటియం దొకప్పు డనేకజీవులుకలవో ఆగృహమునందు నేడొక్కప్రాణియే యుండిపోయినది. ఎచ్చోట నొక్కప్రాణియేయుండెనో,అటనేకప్రాణులు సమావేశమయినవి. అంతమున నొక్క ప్రాణియునులేదు." ఈసంసారజీవగమనాగమన రహస్యమునెఱింగినవారు మారజిత్తులగుదురు.

శ్లో:"మా కురు ధనజన యౌవనగర్వం
హరతి నిమేషా త్కాలస్సర్వం
మాయామయ మిద మఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా."

—భజగోవిందం

"విత్తమును, కుటుంబమును, యౌవనమునుగాంచి గర్వాంధుడవుగాకుము. నిమేషమాత్రకాలమునం దీయైశ్వర్య

ములన్నియు స్వప్నలబ్ధభాగ్యమువలె నశించును. ఇదియంతయు మిథ్య; తృష్ణాసదృశము. అంతయును నశ్వరమేయని గ్రహించి శాశ్వతమగు నిర్వాణపథమునకయి చింతించుము."

శ్రీబుద్ధాచార్యుని వాక్యానుసారముగా నీమాయా మర్మభేదనచింత కాముని బరాజితుని గావించుటయందెంతయు వ్యక్తికి దోడ్పడును.

శ్లో: "వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరివర్జయంతి
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహం,
ఆయుఃపరిస్రవతి భిన్నఘటాదివాంభో
లోకాస్తు దాస్యహిత మాచరతీతిచిత్రం!"

"భయంకరవ్యాఘ్రమువలెను జరాభారము మీద బడి హత్యసేయుటకును, వ్యాధులు దినదినము ప్రాణశత్రువుల చందమున హింసించుటకును, ఆయువు భగ్నఘటమునందలి జలంబుపగిది నిముసనిముసమునకు క్షీణించిపోవుటకును సిద్ధమయియుండ నరుడిది యవలోకించి జననమరణయుక్తమగు సంసారఘోరాంబుధినుండి తరింప మార్గమునన్వేషింపకుండు టెంత యాశ్చర్యజనకము." అని భర్తృహరి నుడువుచున్నాడు.

"సుఖమల్పంబహుక్లేశో విషయంగ్రాహిణాంనృణాం
అనంతబ్రహ్మనిష్ఠానాం మితి వేదాంతడిండిమః॥

— వేదాంతడిండిమము.

"విషయానందరతులయిన నరులకు క్షణికంబగు నల్పసుఖమును, అపారమగు ఖేదము నుదితమగుచుండును. జ్ఞాననిష్ఠాగరిష్ఠుల కపారంబును, శాశ్వతంబునునగు సౌఖ్యము కరతలామలకంబగును."

శ్లో. "చలా లక్ష్మీశ్చలాః ప్రాణా శ్చలో దేహోఽపియౌవనం
చలం చలశ్చ సంసారః కీర్తి ర్ధర్మశ్చ నిశ్చలా॥"

"ఐశ్వర్యములు, ప్రాణము, దేహము, యౌవనము, సంసారము ఇవన్నియు నస్థిరములయినవిగాన జలబుద్బుదములవలె దృటిమాత్రకాలంబున విధ్వంసమయి పోవునవియె. యశస్సు, ధర్మము అనునీరెండును శాశ్వతములు."

ఈభావములన్నియు శ్రీబుద్ధదేవుని కథనానుకూలంబుగ మానవుల గామునివ్యామోహజాలమునుండి యవశ్యము రక్షింప సాయపడును.

"కాతేకాన్తా కస్తే పుత్ర
స్సంసారోఽయ మతీవవిచిత్రః
కస్యత్వంవా కుత ఆయాతః
తత్త్వంచింతయ తదిహ భ్రాతః."

—భజగోవిందశ్లోకములు.

"పత్నియెవ ర్తుక? సుతులెవ్వారలు? నీవెవండవు? త్వాదాగమన మీలోకమున కెచ్చోటనుండి? ఈసంసారము యొక్క

విషయము లతివిచిత్రములు, అను నీతత్త్వము నన్నా! గు ర్తెఱుంగుము.

సంసారముయొక్కయు, నిందుచరించు జీవరాసులయొక్కయు, దేదీప్యమానములుగ వెలుంగు సకలపదార్థనిచయము యొక్కయు నశాశ్వతత్వమును గూర్చి చింతించుటవలన వానియెడ మోహముదయింపదనియే బుద్ధునియూహ. "అప్రిమత్తుడు సుఖింప బ్రమత్తుడు దుఃఖాబ్ధినిబడి యంతమున మృత్యుముఖమున బడును." అనువాక్యమును సమర్థించు సిద్ధాంతవాక్యము లివి:—

"ఆపదాం కథితః పంథా ఇంద్రియాణా మసంయమః।
తజ్జయః సంపదాంమార్గో యేనేష్టం తేన గమ్యతాం॥"

"ఇంద్రియవిషయాదుల బ్రిమత్తుడయియుండువానికే విపత్పరంపరలు సంఘటించును. ఇంద్రియాదుల నప్రమత్తుడై వానిని జయించుటయే మహత్సంపదయగును. అపుడే సౌఖ్యము వాటిల్లును."

"ఉత్తిష్ఠత! జాగ్రత ప్రాప్య వారాన్నిబోధత."

"అజ్ఞానమనిమెడినిద్రనుండి మేల్కాంచుము, అప్రిమత్తుడవగుము. వాస్తవిక జ్ఞానమువైపునకు నడువుము."

"స్థూలాదిసంబంధవతోఽభిమానినః
సుఖంచ దుఃఖంచ శుభాశుభేచ

విధ్వస్తబంధస్య సదాత్మనో మునేః
కుతః శుభం వా ప్యశుభంఫలంవా॥"

"ప్రమాదమును గొలుపు బాహ్యస్థూల పదార్థముల తోడి నెయ్యమున కియ్యకొనువారి కర్తవ్యపథమునందే సుఖ దుఃఖములును, శుభాశుభములును బ్రతిబంధకములగును; అభిమానాదిదుర్గుణములు వారినే తమమాయాజాలమున జిక్కించుకొనును. బాహ్యపదార్థబంధనరహితు డప్రమత్తు డగును గాన వానికి శుభాశుభములనునవియే లేక నశించును."

"నైవ కించిత్కరోమీతి, యుక్తో మన్యేత తత్త్వవిత్।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్
స్వపన్ శ్వసన్।
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి।
ఇంద్రియాణీంద్రియార్థేషు, వర్తంత ఇతి ధారయన్॥"

—భగవద్గీత

"పదార్థముల నవలోకించుచు, శబ్దములనాకర్ణించుచు, వస్తువుల స్పృశించుచు, సుగంధముల నాఘ్రాణించుచు, సంచరించుచు, నిద్రించుచు, శ్వాసనిశ్వాసముల జేయుచు, సంభాషించుచు, మూత్రపురీషవిసర్జనము సేయుచు, వేయేల? సర్వావస్థల యందు నింద్రియములయందు ప్రమత్తతనువహింపక ననాసక్తుడయి యుండవలయును."

" సాత్వికమయిన మనస్సు శరీరమునకు జీవమువంటిది."
మనోదుఃఖమువలన నాత్మ శుష్కించిపోవును.
హర్షితహృదయము ముఖపద్మమునకు దేజస్సునొసంగును.
ప్రమత్తుని పథము కంటకాకీర్ణము."

—బైబిలు 596 పే.

" Know thyself." ఆత్మానందయోగియగు సుకరాత్తు మహాశయుని యీ హితోపదేశ వాక్య ఖండమునం దెంతయో మహదర్థముకలదు. ఏతదారాధ్యవాక్యమును భజించు వ్యక్తి ప్రమత్తుడు కాజాలడు.

బౌద్ధసాధువు, నవవికసిత సుమనములనుండి మకరందము నాకుసుమముల కేవిధమైన క్షతిలేకుండ భ్రమరసముదాయము స్వీకరించువిధంబున బ్రజాసంఘ మధ్యంబున విహరింప దగునన్న బుద్ధుని వాక్యమును సమర్థించు శ్లోకములు:—

" విత్తే త్యాగః క్షమాశక్తౌ దుఃఖే దైన్యవిహీనతా।
నిర్దమ్భతా సదాచారే స్వభావోఽయం మహాత్మనాం॥"

" ధనాఢ్యులయి యున్నపుడు మహాత్ములు దానము సేయుటకును, సామర్థ్యమును గల్గియున్నపుడ శేషంబగుక్షమను, విపద్గ్రస్తులయినపు డపారమగు ధైర్యమును, సదాచార గ్రహణమునందు నిరభిమానమునుగల్గి వర్తింపుచుందురు." బుద్ధుని యాదర్శోత్తమ సాధుపుంగవు లిట్టివారె!

"సత్పూరుషః ఖలు హితాచరణై రమంద
మానందయ త్యఖిలలోక మను క్తఏవ
ఆరాధితః కథయ కేనకరై రుదారై
రిందుర్వికాసయతి కైగవణీకులాని॥"

—భర్తృహరి.

"సత్పురుషులు లేక సాధూత్తములు స్వీయోదార చరిత్రవలన సమస్తజనుల బ్రసన్నచిత్తుల జేయుదురు. సుధాకరుడు నిజ సుధాసంసించిత కిరణమాలికలచే గుముదినీ సముదాయమును హర్షవిశేషముచే ప్రఫుల్లతాసాగరమున నోలలాడించునట్లే యాచింపకుండగనే సాధువులు లోకము నానందపఱచుచుందురు."

"క్షమతే శతశో దోషాః సదయస్య యథాహరిః
తథా శిష్టకృతాన్ దోషాన్ సహన్తే సకలాజనాః॥"

"దయాళురచే గల్గిన యపరాధముల దయామయుడు క్షమించువిధంబుననే సాధుపురుషులచే నెవ్వియేని తప్పులొనరింపబడిన సకలజనులు సహింతురు."

"అవిరతం పరకార్య కృతాం సతాం
మధురిమాతిశయేన వచోఽమృతం
అపిచ మానస మంబునిధి ర్యశో
విమల శారద పార్వణ చంద్రికా॥"

—భర్తృహరి.

"సాధుపురుషులు సర్వదా మృదుమధురభాషణముచే పరోపకారము సలుపుచునేయుందురు. వారి హృత్సాగరము నిరంతరము సత్కీర్తియను రాకాసుధాకర శీతల కిరణస్పర్శ మునే యపేక్షించి పొంగిపొరలుచుండును."

హిందూమతాదర్శ గ్రంథముల బేర్కొనబడిన సాధువు లిట్టివారు :—

"గర్వం నోద్వహతే ననిందతి పరా న్నో భాషతే నిష్ఠురం
ప్రోక్తం కేనచిదప్రియంచ సహతే న క్రోధమాలంబతే
శ్రుత్వా కావ్య మలక్షణం పరకృతంసంతిష్ఠతే మూకవత్
దోషాంశ్ఛాదయతే స్వయం నకురుతే హ్యేత త్సతాం
లక్షణం॥"

"చిత్తమునందుగర్వమునుగల్గియుండక, పరనిందసేయక, కటువాక్యముల భాషింపక, పరజనకథితాప్రియవాక్యముల సహించుచు, క్రోధ ప్రసంగతరుణమందు సహితము క్రోధోన్మాదమును గల్గియుండక, పరుల దోషాన్వితములగు కార్యమ్ముల నాకర్ణించియు మౌనముద్రను వహించుచు పరుల దోషోద్ఘాటనము సలుపక యథాసాధ్యము వారల దోషవిముక్తుల జేయుచు స్వయముగా నెట్టి యకార్యములను సలుపక వర్తించుజనులే సాధువులు లేక సజ్జనులు."

"సౌజన్య ధన్యజనుషః పురుషాః పరేషాం
దోషా నపాస్య గుణమేవ గవేషయన్తి।
త్యక్త్వా భుజంగమవిషాణి పటీరగర్భాత్
సౌరభ్యమేవ పవనాః పరిశీలయన్తి॥"

"సజ్జనులు లేక సాధువులు పరుల దోషముల స్వీకరింపక గుణలేశమునే గ్రహింపుచుందురు. వాయువు చందన వృక్షస్థిత సర్పవిషమును స్వీకరింపక సుగంధమునే కొనుచుండునుగదా!"

"What good gift have my brothers, but it came
From search and strife and loving sacrifice?"
—"The Light of Asia."

"నా సహోదరులు పడసిన యుత్తమశక్తి, వారి కనుకరణంబునను, అన్వేషణంబునను, అంతశ్శత్రు దమనంబునను, నిజప్రియాభిలాషాపరిత్యాగంబునను ప్రాప్తించినది. ఇంతకు దక్క మదీయభ్రాతలచెంత నున్నదేమి?" ఈ పద్యమునందు బుద్ధదేవుని శిష్యులగు సాధువుల సహజసంపత్తి తెలియుచున్నది. ఇందే వారి సారళ్యము, సామరస్యము, సహజసద్భావసంపత్తి, కామరిపుదళపరాభవశక్తి వెల్లడియగుచున్నయవి."

ఆదానంహి విసర్గాయ సతాం వారిముచామివ."

"అంబుదముల భాతియే సాధువుల వస్తుస్వీకృతియు బునః మనకొసంగుటకేయని తెలియవలయును. బౌద్ధసాధువుల యల్పా

హార భిక్షాపరిగ్రహణంబు సహితము ప్రజల నైహికాముష్మిక జీవిత పరిష్కారకంబగు జ్ఞానోపదేశము నొసంగుటకుగాను జీవించుటకేయని గ్రహింపనగును."

"పరుల దోషముల నెన్నవలదు, నీ దోషముల బరిశీలించుకొని విడనాడుము."

—బుద్ధుడు.

"ఖలః సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యతి
ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి న పశ్యతి॥"

—భర్తృహరి.

"దుర్జనులే యావగింజలంతటి పరులదోషముల నవలోకింపుచుందురు కాని వసంతర్తువున నవనవలాడుచు బెరుగు నిజదోషపుంజముల మాత్రము జూడజాలరు."

"అల్పులు పరులకంటియందుండు రేణువునయిన జూడగల్గుదురుగాని తమనేత్రములయందుండు దూలములనయిన జూడలేరు. ఇది సజ్జనులకు దగదు."

—క్రీస్తు దేవుడు.

సత్పురుషుడు పరులదోషపుంజముల గూర్చి విచారింపక నిత్యము తనచరిత్రమునే బుద్ధదేవుని వాక్యానుసారముగా బరిశోధించుకొనుచుండును.

"ప్రత్యహం ప్రత్యవేక్షేత నర శ్చరిత మాత్మనః।
కిం ను మే పశుభిస్తుల్యం కిం ను సత్పురుషైరపి।"

"మానవుడనుదిన మాహారమును భుజించునపుడద్దానిని బరిశీలించుకొనువిధంబుననే తనచరిత్రము పశుచరిత్రము వలెనున్నదా లేక సత్పురుషుల చరిత్రసదృశముగా నున్నదా యని విచారించుకొనవలయును."

"Be good to yourself"—మంచిచే నీకు నీవే హితైషివగుమను బేకనునీతిశాస్త్రవేత్తవచనమునందు సయితము సత్యములేకపోలేదు.

"విత్తం యత్నేన సంరక్షేత్ విత్తమేతి చ యాతిచ।
అక్షీణో విత్తతఃక్షీణో వృత్తతస్తు హతోహతః॥"
—మహాభారతము

"నడవడి నతిప్రయత్నంబున సంరక్షించుకొనుచుండుము. ధనమువచ్చుచుండును, బోవుచుండును. ధనముచే మానవుడు దీనుడు, హీనుడు కాజాలడు." చరిత్రధనరహితుడే జీవన్మృతుడగుదీనుడు, హీనుడు. పరులదోషములెన్నుటయు, బరనిందసేయుటయు నీచకార్యములు:—

"నకశ్చిత్కస్యచిన్మిత్రం నకశ్చిత్కస్యచిద్రిపుః।
వ్యవహారేణ జాయన్తే మిత్రాణి రిపవస్తథా॥"

"మానవునకు మిత్రులు; శత్రువులు కేవలము నిజచరిత్రము ననుసరించియే కలుగుచుందురు."

"యదీచ్ఛసి వశీకర్తుం జగదేకేన కర్మణా।
పరాపవాద సస్యేభ్యో గాం చరంతి నివారయ॥"

"మానవు డొక్క కర్మ వలననే జగమునంతయు వశము గావించుకొన నభిలాషయున్న బరనిందా క్షేత్రమునుండి నిజ వాగ్ధేనువును మరల్చవలయును."

"The crown and glory of life is character. Character is human nature in its best form. It is the moral order embodied in the Individual."

—Smile.

"నడవడియే మానవజీవితమునకు మకుటంబును, విజయమునయి యొప్పుచున్నది. సక్రమస్థితియందున్న చరిత్రమే మానవస్వభావమనదగు. వ్యక్తి కిదియే నీతి నొసంగునది."

"A beautiful behaviour is better than a beautiful form; it gives a higher pleasure than statues and pictures; it is the finest of the fine arts."

—Emerson.

"మనోజ్ఞమగు శిష్టాచారమే సుందరపదార్థముల కంటె బ్రశస్తమయినది. ఇదియె మానవులకు జిత్తాకర్షకంబును, మనోజ్ఞంబునగు చిత్తరువుకంటె నాహ్లాదకరమయినది. ఇదియే లలితకళలయందలి చిత్రకారుని విద్యకంటె శ్రేష్ఠమయినది." పైనుదహరింపబడిన వాక్యములన్నియు మానవుని పరనింద, పర

దోషావలోకనము మొదలగు దుర్వ్యాపారములనుండి నిరోధించి స్వీయచరిత్ర పరిశోధనాభ్యుదయములకయి వ్రాయబడినవి యె.

"సుగంధయుక్త సుమనమట్లు విద్యావంతుని, గుణవంతుని, మహాత్ముని లోకమాదరించును."

—బుద్ధుడు.

"రూపయౌవన సంపన్నా విశాలకులసంభవాః।
విద్యాహీనా నశోభన్తే నిర్గంధాఇవ కింశుకాః॥"

"రూపవంతుడును, యౌవనుడును, ఉచ్చకులసంభూతుడును, ధనవైభవాదికయుక్తుడును, విద్యా విహీనుడగుచో కింశుకపుష్పంబువలె రాణింపడని తాత్పర్యము. (విద్యయనగా భాషయనికాదు, వివేకమునొసంగునది.)

"యేషాం నవిద్యా నతపో నదానం
జ్ఞానం నశీలం నగుణో నధర్మః
తే మర్త్యలోకే భువిభారభూతా
మనుష్యరూపేణ మృగాశ్చరంతి॥"

—భర్తృహరి.

"విద్యాతపోదాన జ్ఞానగుణశీల ధర్మములయందొక్క గుణసంపత్తి నయిన గల్గియుండని మానవుడు మానవరూపము నందున్న పశువయి, పృధ్వికి భారసదృశుడయి సంచరింపుచు లోకముచే ననాదరింపబడును."

"విద్యావిహీనః పశుః" అను మహావాక్యము సహితము శ్రీబుద్ధభావద్యోతకమె. "విద్వాన్ సర్వత్రపూజ్యతే," వివేకసంపన్నుడెల్లచోట్ల పూజింపబడును.

"విద్యా దదాతివినయం వినయాద్యాతి పాత్రతాం
పాత్రత్వా ద్ధన మాప్నోతి ధనాద్ధర్మం తతఃసుఖం॥"

తే॥ గీ॥ విద్య యొసగును వినయంబు, • వినయమునను.
బడయుఁ బాత్రత, పాత్రత • వలన ధనము,
ధనమువలనను ధర్మంబు • దానివలన
నైహికాముష్మికసుఖంబు • లందు నరుడు."

"మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం।
మనస్యన్య ద్వచస్యన్య త్కర్మణ్యన్య ద్దురాత్మనాం॥"

"త్రికరణంబుల (మనోవాక్కాయకర్మల) నొక్కరీతివర్తించువారే మహాత్ములు. త్రికరణముల వర్తించని వారలే దురాత్ములు."

శ్రీబుద్ధాచార్యునిచే బూజింపబడువారు త్రికరణముల శుద్ధులయిన వారు.

"కేయూరాణి నభూషయన్తి పురుషం హారా నచంద్రోజ్జ్వలాః
నస్నానం నవిలేపనం నకుసుమం నాలంకృతా మూర్ధజాః

వాణ్యేకా సమలంకరోతిపురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తే ఖలు భూషణాని సతతం వాగ్భూషణం భూషణం॥"
—భర్తృహరి.

"కంకణాది భూషణములును, మజ్జనము, చందనాది విలేపనములు, మానవు నలంకరింప జాలవు. కేవల మొక్క యుత్తమ వాణియే శోభిల్లజేయును. మణిమయసువర్ణాభూషణము లన్నియు గాలము ననుసరించి విధ్వంసము లగును. వాగ్భూషణము శాశ్వతాలంకారమయి మానవ దేహమును బ్రకాశవంత మొనర్చును." ఇట్టివాడు పూజ్యుడని బుద్ధుని యూహ.

"ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమః
జ్ఞానస్యోపశమః కులస్య వినయో విత్తస్య పాత్రేవ్యయః
అక్రోధ స్తపసః క్షమాబలవతాం ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషా మపి సర్వకారణ మిదంశీలం పరంభూషణం॥"
—భర్తృహరి.

"ఐశ్వర్యమునకు సౌజన్యమే భూషణము. శౌర్యమునకు గోమలాలాపము భూషణము. జ్ఞానమునకు శాంతి భూషణము. కులీనతకు వినయ మలంకారము. ధనమునకు సత్పాత్రదానమే భూషణము. తపస్సునకు క్రోధరాహిత్యమే తొడవు. బలాఢ్యులకు క్షమయెనగ. ధర్మమునకు నిష్కాపట్యమే యలం

కారము. కాని సమస్తసద్గుణాభూషణములకంటె శీలమే యపూర్వోత్తమాభూషణము."

"కోకిలానాం స్వరో రూపం నారీరూపం పతివ్రితం
విద్యా రూపం కురూపాణాంక్షమా రూపం తపస్వినాం."
—చాణక్య నీతి.

"తే.గీ. స్వరమె రూపంబు కోకిల • కరయఘాతి,
భర్తృ పాదశుశూ్రిషయే • పడతితొడవు
విద్యయే భూషణము రూప • విరహితునకు
ధరణి సహనమే రూపంబు • తాపసులకు."

క్షమనే భూషణముగా గొన్నతపోధనుడే పూజింపబడును గాని కౌశికునివంటి శుష్కతాపసులతపము వృథాయని బుద్ధునియూహ. దుష్టమానవులు హింసించినను క్షమయే మహాత్ముల లక్షణమయి యుండవలయునని బుద్ధాచార్యుడీవర్గమున వ్రాసియున్నాడు.

"Blessed are they whom the present persecutes for they are the children of the future."
—Paul Richard.

మంజరి (నిర్ప్రాసము)
"ఇప్పటివారిచే • హింసింపఁబడెడు
నతఁడు పుణ్యాత్ముఁడే • లనఁగ నాతండు
రాబోవువారి గా • రాబు బిడ్డండు."

"చలశ్చ సంసారః కీర్తి ర్ధర్మశ్చనిశ్చలా."

"అయంనిజః పరో వేతిగణనా లఘు చేతసాం।
ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబినీ॥"

"ఇదినాది, ఇదిపరులదియను హాిస్వభావము క్షుద్రి బుద్ధులయందే యుండును. విశ్వమంతయు నుదారహృదయుల కు స్వపరివారమువలె స్ఫురించును."

* * * * *

బాలవర్గము (మూఢవర్గము)

ఈమూఢ వర్గమునందు శ్రీబుద్ధాచార్యుల వారు, 'ధర్మతత్వజ్ఞాన శూన్యుని జీవితమును గురించియు, ఉత్తమ సాంగత్యస్వీకారము, దుర్జనసాంగత్య నిరసనమును గూర్చియు, దేహముపై నధికారము లేనట్టి నరుడు 'వీరు నాయాత్మజులు, ఇది నాధనధాన్యసంపత్తి' యనివచింప సాహసించు టెంతయు మమత్వమను విషయమును గురించియు, తనమౌఢ్యమును స్వీకరింపని వానికంటె నిజాజ్ఞానమును సమ్మతించునరుడె యుత్తముండను సంగతిని గురించియు, మూర్ఖులును, విషయలంపటులును నగు భ్రష్టాచార్యులు సజ్జనసన్నిధి నశేష కాలపర్యంతమున్నను లాభము హుళక్కియేయను విషయమును గురించియు, విషయవికార దూరుడగు నుత్తమమానవుడు క్షణ

మాత్రికాలమయిన జ్ఞానులచెంతనున్న సత్యపథతత్త్వపరిజ్ఞాను డగుననువిషయమును గూర్చియు, అల్పజ్ఞానముగలవాడు తనకు దానే శత్రువనువిషయమును గుఱించియు, ధర్మము సుఖో త్పాదకమను నంశమును గుఱించియు, దుష్కార్యము దుఃఖ మునకు మూలమను విషయమును గుఱించియు, మూఢుడు జ్ఞానివలె బాహ్యవేషాడంబరముల గల్గియున్నను బ్రయోజన ము శూన్యమేయగునను సంగతిని గుఱించియు, పాపము నరుని శిక్షింపజేయునను విషయమునుగుఱించియు, నాదే గొప్పవిష యమను దురభిమాన సంపన్నుం డహంకారమమకార పరివేష్టి తుండగుననుసంగతిని గుఱించియు, సంసారమునందు మానవుల నౌకపథము కామినీకాంచనాదులవైపున కీడ్చుచుండ మఱొక్క తెన్ను నిర్వాణమున కాకర్షింపుచుండు నను విషయమును గూర్చియు బోధించి యున్నారు.

"నహి జ్ఞానేనసదృశం పవిత్రమిహ విద్యతే।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం స న్తరిష్యసి॥"

—భగవద్గీత.

"జ్ఞానముతో సమానమగు పరిశుద్ధమయిన పదార్థ మీావిశ్వమందున లభింపజాలదు. ఓధనంజయా! నీవు జ్ఞాననౌక యం దారూఢుడవయ్యి యీావిశాలభవసాగరమును తరింప గలవు."

"సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥"
—భగవద్గీత.

"అర్జునా! సంసారముయొక్క సమస్తకార్యములు జ్ఞానమునందే సమాప్తమగుచున్నయవి; అనగా సమస్తకర్మలును జ్ఞానాంతర్గతములే."

"అహః న్యస్తమయాంతావి ఉదయాన్తా చ శర్వరీ।
సుఖస్యాంతం సదాదుఃఖం దుఃఖస్యాన్తం సదాసుఖం॥
సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః।
సంయోగాశ్చ వియోగాన్తా మరణాన్తం చ జీవితం॥
.........................జ్ఞానస్యాన్తో నవిద్యతే॥"
—వ్యాసానుగీత.

"దినాంతమున నిశయు, నిశానంతరము దివసమునుక్రమబద్ధములయి వచ్చుచున్నవి. అదియేచందమున సుఖానంతరము దుఃఖము, దుఃఖాంతమున సుఖము వాటిల్లుచుండును. ఏకత్రితమయినది యవశ్యము లయముజెందును. ఉన్నతినందినవ్యక్తి యవనతినందుట ధ్రువము. సంయోగము వియోగరూపమును ధరించును. నేటిసజీవుడు రేపటిమృతజీవుడె. కానిజ్ఞానమున కంతము (నాశము) గాని పరివర్తనముగాని లేదు."

"Serene he stands, above
All fears; above the inexorable fate,
And that insatiate gulf that roars below."
—Virgil.

"సమస్తభయములకతీతుడయి, నిష్ఠురుండును, నిర్దయుండును నగు దైవమున కూర్ధ్వ, అధోభాగంబుల గర్జింపుచున్న యత్రుప్తఖాతమువలె జ్ఞానసంపన్నుండగు మానవుడు శాంతచిత్తుడయి నిలువబడియుండును.

"ధర్మంచర, ధర్మాత్ పరన్నాస్తి।
ధర్మః సర్వేషాం భూతానాం మధు॥
ధర్మేణహీనాః పశుభిస్సమానాః॥"

"ధర్మమునాచరింపుము. ధర్మముతో దుల్యమగు నదెద్దియును లేదు. సకలభూతప్రపంచమునకు ధర్మమే మధురమయినది. ధర్మవిహీనుడు పశుతుల్యుడు"

"శాంతితుల్యం తపోనాస్తి, నసంతోషాత్ పరంసుఖం।
నతృష్ణాయాః పరోవ్యాధి ర్నచధర్మో దయాపరః॥"

"శాంతితోసదృశమగు తపోధనము, సంతోషముతో సమానమగుసుఖము, తృష్ణతోదుల్యమగు వ్యాధి, దయాధర్మముతో సీడగుధర్మము విశ్వమందులేదు."

• "అనేకాన్తం బహుద్వారం ధర్మమాహు ర్మనీషిణః।
అహింసా సత్య మక్రోధ మానృశంస్యం దమస్తథా।
ఆర్జవంచైవ రాజేంద్ర నిశ్చితం ధర్మలక్షణం."

—మహాభారతము

మహాత్ములు ధర్మమున కనేకద్వారముల బేర్కొని యున్నారు:—

"రాజేంద్రా! సకలప్రాణుల స్వాత్మసమానములని యెంచి యేవిధముగనయిన హింసింపకుండుట, నిరంతరము త్రికరణంబుల సత్యమునే స్వీకరించుట, క్రోధమును బరిత్యజించుట, మాత్సర్యమును బహిష్కరించి వేయుట, ఇంద్రియదమనముచే విరాజిల్లుట, వినయవిధేయతల నొప్పారుట మొదలుగునవియే ధర్మము యొక్క ముఖ్యలక్షణములు."

"యతోఽభ్యుదయనిశ్శ్రేయససిద్ధిః సధర్మః."

—వైశేషికధర్మబోధ

"దేనివలన నభ్యుదయము, శ్రేయస్సులభించునో అదియే ధర్మము."

శ్రీబుద్ధాచార్యుడిట్టి ధర్మమును జ్ఞానమును గల్గియున్న వ్యక్తి ముక్తినందునని యె. సాంగత్యము సజ్జనులతోడి దే, సౌఖ్యానందసంధాయకమనియు, దుర్జనులతోడి మైత్రి వర్జనీయమనియు నను బుద్ధాచార్యునివాక్యమును సమర్థించు వాక్యములు.

"శ్లో:—సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం।
నిస్సఙ్గత్వే నిర్మోహత్వం।

నిర్మోహత్వే నిశ్చలతత్త్వం,
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥
—భజగోవిందశ్లోకములు.

తాత్పర్యము:

మ॥ సమకూరున్ బుధలోకసఖ్యమున నిస్సంగత్వ, మద్దాన మో
హము శాంతించు, దదుత్తరక్షణమ దివ్యజ్ఞానమౌ, దాన అ
భ్యమగున్ శాశ్వతమప్రమేయమగుజీవన్ముక్తి, గానన్ గురూ
త్తముసేవారతిఁ గాంచి, మోహజడమతీ! ధ్యానింపు
గోవిందునిన్॥

"సద్భిరేవ సహాసీత సద్భిః కుర్వీత సంగతిం।
సద్భిర్వివాదం మైత్రీంచ నాసద్భిః కించిదాచరేత్॥"

"సజ్జనులతోడనే కూర్చుండ వలయును, సజ్జనుల సహ
వాసమందే సమయమును వ్యతీతము సేయవలయును. వాద
వివాదముగాని మైత్రిగాని సజ్జనులతోడిదే సౌఖ్యదాయకం
బగును. దుర్జనులతోడ నేవిధమయిన సంబంధము సేయరాదు."

"జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం,
మానోన్నతిం దిశతి పాప మపాకరోతి।
చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం।
సత్సంగతిః కథయ కిన్న కరోతి పుంసాం॥"
—భర్తృహరి.

"సజ్జనుల సాంగత్యము మానవుల బుద్ధిజాడ్యమును హరించును. వాక్కును సత్యసంశోభితము గావించును. మానాభ్యుదయముల బ్రసాదించును. పాపపుంజమును బలాయన మొనరించును. హృత్కమలమును బ్రఫుల్ల మొనరించును. కీర్తిచంద్రికల దశదిశల వ్యాపింప జేయును. సత్సాంగత్యము మానవుల నేమి సేయజాలదో వచింపుడి?"

"అనుగన్తుం సతాం వర్త్మ కృత్స్నం యది నశక్యతే।
స్వల్పమ ప్యనుగన్తవ్యం మార్గస్థో నావసీదతి॥"

"సజ్జనులు పేర్కొనిన పథము నొక్కసారిగా ననుసరింపజాలక పోయిన నెమ్మది నెమ్మదిగానయిన ననుకరింపుచు ముందంజ వేయుచుండవలయును. సత్పథమున బదమిడినంతనే యపూర్వంబగు సుఖము ప్రాప్తమగును."

"శీలావలంబన మహర్నిశ మిష్టచింతా
విత్తానురూప మశనాభగణాది కార్యం
వార్యంచ దుర్జనసమాజ నిజప్రశంసా
హాస్యాది సజ్జనవచో హృదయే నిధేయం॥"

"సుశీలత్వము, ఉచ్చాభిప్రాయములు, నిజవిభవానుకూలాహార స్వీకారము, వస్త్రభూషణ వ్యవహారము, దుర్జన సాంగత్య తిరస్కారము, ఆత్మస్తుతిరాహిత్యము, పరనిందావిహీ

నత, సజ్జనవచన సన్మానము ఈ మొదలగు నవియే సౌజన్యము యొక్క సల్లక్షణములయి యొప్పుచుండును"

"సత్సంగాద్భవతి హి సాధుతా ఖలానాం
సాధూనాం నహి ఖలసంగతః ఖలత్వం
ఆమోదంకుసుమభవం మృదేవధత్తే
మృద్గంధం నహి కుసుమాని ధారయన్తి॥"

"సత్సాంగత్యము వలన దుష్టజనమండలి సహితము సాధుత్వముచే విభూషితమగు చున్నయది. కాని దుస్సాంగత్యము వలన సత్పురుషులు దుర్జనత్వమును బడయజాలరు. పుష్ప సుగంధము మృత్తికయందు వ్యాప్తమగు చున్నయది, మృత్తికాగంధము పుష్పముల స్పృశింపనయిన జాలదు గదా!"

"మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః
పరగుణ పరమాణూ న్పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్తః సన్తిసన్తః కియన్తః॥"

"సజ్జనులు పరిశుద్ధభావములచే ప్రేరితులయి, త్రికరణముల సంసారహితమును జేయుచుండురు. పరమాణు తుల్యములగు పరులసద్గుణముల పర్వతాకారములుగ నెంచి మదినెంతయు బ్రసన్నులగుచుందురు. ఇట్టిసజ్జను లెందరుకలరు?"

"దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోఽపి సః।
మణినా భూషితః సర్పః కిమసౌ నభయంకరః॥"

"దుర్జనుడు భాషాప్రవీణుండయినను త్యాజ్యుడె. మణిచే విభూషితమయి యున్నను సర్పము భయంకరము కాదె!"

"పరగుహ్య గుప్తినిపుణంగుణమయమఖిలైః సమీహితం నితరాం
లలితాంబరమివ సజ్జన మాఖవఇవ దూషయన్తి ఖలాః॥"

"పరుల యవగుణముల గుప్త పఱచుటయందు నిపుణులగునట్టి గుణమయ సజ్జనుల నెల్లరు లలితాంబరముల గోరుచుండు విధంబున నపేక్షించుచుండ, మూషికా సదృశులగు దుర్జనులు వారల దూషితుల గావించుచుందురు."

"కతిపయదిన పరమాయుషి మదకారిణి యౌవనే దురాత్మనః।
విదధతి తథాపరాధం జన్మైవ యథావృథా భవతి॥"

"ఈజీవిత మెన్నిదివసములుండును? అయినను దుర్జనులు యౌవనోద్రేకమున దుష్కార్యము లాచరించి మానవజన్మను వృథాచేసివేయుచున్నారు."

"విద్యా వివాదాయ ధనం మదాయ
శక్తిః పరేషాం పరపీడనాయ
ఖలస్య సాధో ర్విపరీతమేతద్
జ్ఞానాయ దానాయ చ రక్షణాయ॥"

"సాధుపురుషుల విద్య జ్ఞాననిమిత్తము, ధనము సత్పాత్రదానార్థము, శక్తి దీనరక్షణహితమయి వెలయుచుండ, దుర్జనులవిద్య వివాదమునకును, విత్తము గర్వాంధకార వ్యాపనమునకును, శక్తి పరపీడనమునకును ప్రయోగింపబడుచుండును."

"ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోస్తి సదృశో మయా।
యక్ష్యేదాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః॥
అనేకచిత్త విభ్రాన్తాః మోహజాల సమావృతాః।
ప్రసక్తాఃకామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥
ఆత్మసంభావితాః స్తబ్ధాః ధనమానమదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దంభోనాఽవిధిపూర్వకం॥
అహంకారం బలందర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మా మాత్మ పరదేహేషుప్రద్విషన్తోఽభ్యసూయకాః॥"

—భగవద్గీత.

మూఢులు:—"అజ్ఞానముచే విమోహితులయి 'మేము ధనవంతులము; కులీనులము; మాతో సమానులగువారలెవరును లేరు; మేము యజ్ఞములను, దానములను జేసి హాయియనుభవింతుము' ఇట్టి నానావిధములగు విభ్రాంతభావనల మధ్య బడికొట్టుకొనుచు, మోహజాల బద్ధులయి, భోగవిలాసరతులయి, అపరిశుద్ధమగు నరకమున బడుచుందురు. నిజప్రశంస జేసికొనువారును, హఠము సేయువారును, ధనప్రతిష్ఠా పేక్షా

పరులయి విధిరహితముగా దంభముతోడ నామమాత్రమే యజ్ఞము సేయుచున్నారు. ఈదుష్టులు కామక్రోధాహంకార బలాభిమానములకు దాసులయి పరుల (నారూపముతోనిండి నవారు) ద్వేషింపుచు నే యుందురు. వారికి సమభావము స్వప్న మందయిన నుండబోదు."

"తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్।
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥
ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవకౌన్తేయ తతోయాన్త్యధమాంగతిం॥"

—భగవద్గీత.

"ఇట్టిద్వేషులును, క్రూరులును, అధములును నగునీచ మానవుల భగవంతుడు నీచరాక్షసి యోనులయందు జన్మింప జేయును. ఈమూఢులు రాక్షసియోనుల జన్మజన్మాంతరముల పర్యంతముండి దేవుని బడయలేక యధమగతికి బొల్పడి యెదరు."

"కురుతే గంగాసాగర గమనం
వ్రతపరిపాలన మథవా దానం
జ్ఞానవిహీన స్సర్వ మతేన
ముక్తిం నభజతి జన్మశతేన."

—శాస్త్రకారుడు.

తాత్పర్యము:—"కంధిని బ్రింగిన గంగమునింగిన
గ్రిమముగ దానవ్రితములు జరిపిన
వంద పుట్టువులకేని మోక్షపద
మంద; గవజ్ఞతనెన్ని(టి నెఱపిన."

అజ్ఞానిలేక మూఢునిగతి యింతియె!

ఇట్టిమూఢుల సాంగత్యమునే బుద్ధాచార్యుడు వర్జనీయ మని నొక్కివక్కాణించెను.

'అర్ధజ్ఞాన మనర్థకమునకు మూలము'

—బుద్ధుడు

"Half knowledge is always dangerous."

"అర్థ (సగము, పూర్ణముకానిది) జ్ఞానము మోసము గల్గించును."

"ఇసుకనుండి తైలము దీయవచ్చు, కుందేటికొమ్ము సాధింపవచ్చు, గాని తెలిసియు దెలియని మనుజునకు బోధింప బ్రహ్మకయినను శక్యముకాదను వేమనయోగిభావ మపూర్ణ జ్ఞానము నిష్ప్రయోజన మగుట యటుండ మీదుమిక్కిలి మోసము నొదవించుననియె. శ్రీబుద్ధాచార్యు డహంకార మమకారములు మూఢునిసంపద లనియె.

"Blessed are they who make nothing their own for they shall possess all things."

—Paul Richar

"మా దేదిగాదను • మమకారరహితు
లెంతయు ధన్యు; లీ • సృష్టిసర్వంబు
తృప్తాత్ములగు వారి • దేయగుఁగాన."

"సమస్త ప్రపంచ విభవాదులనుండియు విముఖులయిన వారి (దీనులు) మోక్షల నీశ్వరరాజ్యరమాదేవి సాష్టాంగ పడుచున్నదనుట సత్యము."

—క్రీస్తు భగవానుడు.

"ఆహారనిద్రా భయమైథునంచ,
సామాన్యమేతత్ పశుభి ర్నరాణాం।
ధర్మోహి తేషా మధికో విశేషో
ధర్మేణహీనాః పశుభిః సమానాః॥"

"ఆహారము, నిద్ర, భయము, మైథునము మొదలగు శారీరక, మానసిక వికారములన్నియు స్వాభావికంబుగనే మానవులందుబలె బశువుల యందును గానవగుచున్నవి. మానవులకు బశువునకంటె వైశేషికసంపత్తి ధర్మము. ఈధర్మము లేనివాడు పశుతుల్యుడె." మూఢుని కిదియెలేదు. ఇట్టి మూఢుడు.—

"తన్నుఁదాఁ దెల్సి జగమెల్లఁ • దానయైన
మర్మమెఱుఁగంగఁ జాల రీ • మందమతులు
గడవఁజాలరు సంసార • ఘనపయోధి
నవ్యతరభోగి శ్రీసదా • నందయోగి."

## పండితవగ్గము

ఈవర్గమునందు—"పండితు ననుసరించుట శ్రేయోదాయకము, పండితుని తిరస్కారవచనములు హితకరములె, దుర్జనులు పండితులదూరి భ్రష్టులగుదురు, దుర్జనుని నేస్తము దుఃఖమునకు హేతువు, సజ్జనునిసాంగత్యము సుఖమునకుమూలము, జ్ఞానసంపన్నుడు భవమునుండితరించును, బుద్ధిమంతుడు నిజజీవితమును జక్కగా నిర్మించుకొనును, ధీమంతుడు సుఖదుఃఖములకు జలింపక యనుభవించును, వీరపండితుడు విషయవికారాగ్నుల నార్పివేయ సమర్థుడు, అధర్మముచే వనితావిత్తాదుల సముపార్జింపగడంగనివాడే మహాపండితుడు, భవసాగర తరణమునందు విజయులయినట్టివారి సంఖ్యస్వల్పము, విశేషసంఖ్యాకులగు ప్రాపంచకులు పంజరబద్ధములగు విహంగముల వలె విషయపాశబద్ధులయి దుఃఖింపుచుందురు, జ్ఞాని కిహమందే జీవన్ముక్తి కల్గును, అజ్ఞాని భయవిషాదాగ్నులంబడి మస్గిపుచుండు," నను విషయముల గుఱించి బుద్ధాచార్యుల వారు బోధించి యున్నారు.

"భక్తి రష్టవిధా హ్యేషాయస్మిన్ మ్లేచ్ఛోఽపి వర్తతే।
సవిప్రేంద్రోమునిః శ్రీమాన్ సయతిః సచపండితః॥"

—గారుడ పురాణము.

"అష్టవిధములగు భక్తిచే వెలయుచున్న మనుజుడు మ్లేచ్ఛుడయినను మ్లేచ్ఛుడనబడక 'మునిశ్రేష్ఠుడు, బ్రాహ్మణోత్తముడు, పండితుడు' అని పేర్కొనబడును."

"విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శునిచైవశ్వపాకేచ పండితాః సమదర్శినః॥"

—భగవద్గీత.

"విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మణుని, గోవును, దంతావళమును, శ్వపచుని, వేయేల? సర్వమును సమదృష్టితో నవలోకించు వారలే పండితులు."

"ఆత్మవత్సర్వభూతేషు యః పశ్యతి సపండితః।"

"స్వాత్మ సదృశముగ సకలజీవరాసుల గాంచువాడే పండితుడు."

"పరులెల్లరు దనయెడ నెట్లువర్తింప వలయునని మను జుడు కోరుచుండునో, అటులే పరులయెడ వ్యవహరించుమనుజుడే విద్వాంసుడు."

—క్రీస్తుభగవానుడు.

"Adam Smith's Moral Sentiments."

పండితు లీచందమున బరీక్షింప బడియెదరు:—

"యథాచతుర్భిః కనకం పరీక్ష్యతే,
నిఘర్షణచ్ఛేదనతాపతాడనైః।
తథా చతుర్భిః పురుషః పరీక్ష్యతే,
శ్రుతేన శీలేన గుణేన కర్మణా॥"

"నిఘర్షణము, ఛేదనము, తపనము, తాడనము మొదలగు వానివలన దపనీయము పరీక్షింపబడు విధంబుననె పండితుడగు పురుషుడు విద్యాస్వభావ గుణకర్మాది చతుర్విధలక్షణంబుల బరీక్షింపబడును."

"Who noble ends by noble means obtains,
Or failing, smiles in exile or in chains,
Like good Aurelius let him reign, or bleed
Like Socrates, that man is great indeed."

—Pope

"ఉచ్చసాధనములవలన నుచ్చపురుషార్థముల సంపాదించువాడే పండితుడు లేక మహాపురుషుడు. ఇట్లాచరించునపుడు వాని ప్రయత్నము నిష్ఫలమగునను, వాడు దేశము నుండి వెడలగొట్టబడినను, ఏబంధనమునందయిన జిక్కువడినను ప్రసన్నుడయియే యుండును. సాధుచరిత్రుడగు నారేలియసు విధంబున రాజ్యమును బరిపాలింపుచున్నను అథవా సుకరాత్తువలె బ్రాణదండనకు బాల్పడినను, లేక యెట్టి యధమస్థితియందున్నను నచంచలుడయి యుండుగాన నతడే పండితుడు లేక గొప్పవాడు."

"నిజధర్మకర్మల నాచరించుటయందు నష్టమగుడి, కాని భ్రష్టులగుట తగదు."

—కర్మయోగి గాంధి

శ్లో: "స్పృహణీయగుణైర్మహాత్మభిశ్చరితం వర్త్మనియచ్ఛతాం
మనః। విధిహేతురహేతు రాగసాం వినిపాతోఽపి సమః
సమున్నతేః॥

—కిరాతార్జునీయము.

"అనుకరణీయములగు గుణములచే నలరారు పండితోత్తములచే నిర్దేశింపబడిన మార్గము ననుసరింపజేసిన యంతఃకరణముగల సజ్జనులు పతనమునందినను, అస్తమించినను, అది యపరాధహేతువుచే వాటిల్లక భాగ్యకారణంబున దటస్థించినది కాన నభ్యుదయముతో సమానమయినదియె."

"సుఖం వా దుఃఖం వా కిమివహి జగత్యస్తి నియతం,
వివేకప్రిధ్వంసాద్భవతి సుఖదుఃఖ వ్యతికరః
మనోవృత్తిః పుంసాం జగతి జయినీ కాఽపిమహతాం,
యయా దుఃఖం దుఃఖం సుఖమపిసుఖం వా నభవతి॥"

—చండకౌశికము.

"సుఖదుఃఖములకు సార్థక్యమెచట! పృథగ్భాగము లేని సుఖదుఃఖముల మనుజుడు వివేకలయంబున ననుభవించుచున్నాడు. విలక్షణ విజయదాయకంబగు పండితులవృత్తి సుఖదుఃఖములమధ్య తారతమ్యమునే గాంచలేదు"

"నోదేతి నాస్తమాయాతి సుఖేదుఃఖే మనఃప్రిభా।"

—వసిష్ఠుడు.

"దుఃఖమునం దంతమందనట్టియు, సుఖమునందు వికసింపనట్టియు మనఃప్రిభను గల్గియున్నట్టి వాడే పండితుడు, ధీరుడు లేక మహాత్ముడు."

సప్తజ్ఞాన తత్త్వసముపేతుడు నిర్వాణమునందును (ఈ వర్గమునందలి తుదివాక్యము) వసిష్ఠుడు బుద్ధాచార్యుడునుడివిన సప్తజ్ఞానముల గుఱించి యిట్లు నుడివియున్నాడు:—

"ఇమాం సప్తపదాం జ్ఞానభూమి మాకర్ణయానఘ
నానయాజ్ఞాతయా భూయో మోహపంకే నిమజ్జతి॥"

"ఓదాశరథీ! జ్ఞానభూములనబడు నీయేడింటి నాకర్ణింపుము. వీనిని గ్రిహించినయెడల నీవు వ్యామోహపంకమందు దిగబడవు."

"జ్ఞానభూమిః శుభేచ్ఛాఖ్యా ప్రిథమా సముదాహృతా।
విచారణా ద్వితీయా స్యా త్తృతీయా తనుమానసా।
సత్త్వాపత్తిశ్చతుర్థీ స్యా త్తతోఽసంసక్తినామికా।
పదార్థభావనా షష్ఠీ సప్తమీ తుర్యగాగతిః॥"

జ్ఞానభూమిసప్తక క్రిమవివరణము :—(1) శుభేచ్ఛ (2) విచారణము (3) తనుమ్యానస (4) సత్త్వాపత్తి (5) అనాసక్తి (6) పదార్థభావన (7) తుర్యగగతి.

(1) శుభేచ్ఛ:—

"స్థితః కిం మూఢఏవాస్మిన్ ప్రేక్ష్యేహం శాస్త్రసజ్జనైః
వైరాగ్య పూర్వమిచ్ఛేతి శుభేచ్ఛే త్యుచ్యతే బుధైః॥"

"నేనెందులకు మూర్ఖుండయియుంటి? విరక్తభావముతోడ శాస్త్రపరిశీలనమునకు గడంగుదు. సజ్జనులతో నేకీభవింతును. ఇట్టికోర్కెనే ప్రథమజ్ఞాన భూమియగు 'శుభేచ్ఛ' యందురు"

(2) విచారణ :—

శాస్త్రసజ్జన సమ్పర్కై- ర్వైరాగ్యాభ్యాసపూర్వకం।
సదాచార ప్రవృత్తా యా ప్రోచ్యతే సా విచారణా॥"

"శాస్త్రాభ్యాస సజ్జనసాంగత్యములవలన నొదవువైరాగ్యాభ్యాసపూర్వకంబగు సత్యమెద్ది? అసత్యమెద్ది? స్థిరమేది? ఆత్మయేది? ప్రకృతి యెద్ది? కర్తవ్యమేది? అకర్తవ్యమేది? ధర్మాధర్మములెయ్యవి? పాశమేది? విముక్తియెద్ది? అనునాలోచనతో మనుజుడు సదాచారమునందు బ్రవృత్తుడగుటకే ద్వితీయజ్ఞానభూమియగు "విచారణ" యని చెప్పబడును."

(3) తనుమానస :—

"విచారణా శుభేచ్ఛాభ్యా మిన్ద్రియార్థే ష్వరక్తతా
యత్ర సా తనుతాభావాత్ ప్రోచ్యతే తనుమానసా॥"

"శుభేచ్ఛ యొదవినపిదప, సదసద్విమర్శనవలన నింద్రియ భోగ్యములందు రతికలుగకుండుటకే "తనుమానస" యని చెప్పబడును. ఈ స్థితియందు చిత్తము విషయముల వైపున కాకర్షింపబడక స్థూలత్వము నెడబాసి సూక్ష్మతను బడయును."

(4) సత్తాపత్తి ; (5) అనాసక్తి :—

"భూమికాత్రితయాభ్యాసాచ్చేత్యర్థే విరతేర్వశాత్
సత్తాత్మని స్థితే శుద్ధే సత్తాపత్తి రుదాహృతా."

"ప్రథమజ్ఞానభూమిత్రియము నుబడయ, చతుర్థజ్ఞాన భూమియగు సత్తాపత్తియను సాత్వికభావోదయంబగును. అందుచే విషయాభిలాష నాశమగును. ఈవిషయ వాంఛావిముక్తినే 'అనాసక్తి లేక అసంసక్తి' యందురు."

(6) పదార్థభావన :—

"భూమికా పఞ్చకాభ్యాసాత్ స్వాత్మారామతయాభృశం
అభ్యన్తరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్."
పరం ప్రియుక్తేన చిరం ప్రియత్నేన విబోధనం
.పదార్థభావనానామ షష్ఠీ సఞ్జాయతేగతిః."

"పైజెప్పబడిన నైదింటి నభ్యసింప విశ్వసత్తయందు లీనమగు శక్తి కలుగును. అందుచే నామనుజునకు బాహ్యపదా

ర్థచింత వాటిల్లనేరదు. ఈ సమస్త చింతలు నశియింప యత్నముచే నాత్మతత్వచింతన మేర్పడును. ఇదియే "పదార్థభావన."

(7) తుర్యగగతి:—

"భూమిషట్కం చిరాభ్యాసా ద్భేదస్యా నుపలమ్భతః
యత్స్వాభావిక నిష్ఠత్వం సాజ్ఞేయా తుర్యగాగతిః॥"

"ఉపర్యుక్తములగు నాఱింటిని నేర్వ, స్వపర భేదజ్ఞానము సమసిపోవును. తత్కారణంబున విశ్వసత్తయందు నైసర్గికనిష్ఠ యేర్పడును. ఇదియే 'తుర్యగగతి.' పండితుడగువా డీ సత్తజ్ఞాన భూముల నంది ముక్తిజెందునని బుద్ధుడు వక్కాణించెను.

అర్హతవర్గము. (పూజ్యవర్గము)

ఈవర్గమునందు శ్రీ బుద్ధాచార్యుడు— భయ విషాద దూరుండును, సంయమవర్తానుగతజీవియు, స్వచ్ఛంద జీవియు హానికి బాధింపబోడు. ఇట్టి వ్యామోహదూరుడు గృహము నెడబాసి చనును. పుణ్యపురుషుడు సాత్వికాహారము నే జీవికకయి యారగించును. విషయాగ్నిజ్వాలల జల్లార్చినవాడు గొప్పవాడు. విషయానురక్తిని వర్జించిన యతడు ముక్తినందును. విషయాదుల జయించినవాడు తిరిగి జన్మింపడు. వికారదూరుడగు సత్తము డెయ్యెడ నధివసించునో

యచ్చోటనే బ్రహ్మానందము నెల వేర్పఱచుకొనును. విషయ భోగానురక్తు డెల్లపరిదేశముల దుఃఖమునే బడయును. ఈవిషయములగూర్చి యుద్బోధించి యున్నాడు.

"శ్లో॥ యేహిసంస్పర్శజాభోగా దుఃఖయోనయ ఏవతే।
ఆద్యంతవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః॥"

—భగవద్గీత.

"ఓపార్థా! ఇంద్రియాది విషయసంయోగముచే నొదవు నశ్వరములగు సుఖములు బహుళ దుఃఖకారణములు. ఆ సుఖముల కాద్యంతములు కానరావు. కాన జ్ఞాని (పూజ్యుడు) యీనిస్సారములును, క్షణికంబులును, దుఃఖోత్పాదకంబులును నగు సుఖముల నిరతుడయి యుండుడు."

"అగ్నిదగ్ధం యథాబీజం శాఖాపల్లవవర్జితం।
జ్ఞానదగ్ధం తథా యోగి పునర్జన్మ నవిద్యతే॥"

"స్వానందభావే పరితుష్ట మన్తః
సుశాన్త సర్వేంద్రియవృత్తిమన్తః
అహర్నిశం బ్రహ్మణి యే రమన్తః
కౌపీనవన్తః ఖలుభాగ్యవన్తః"

—శంకరాచార్యులు.

"స్వానందమందు నిరంతర రతులును, సంయమబద్ధములగు నింద్రియములను, తద్వృత్తులను గల్గియున్నవారును

దివారాత్రిములు బ్రహ్మము (విశ్వసత్త యిదియే నిర్వాణ కారణము) నందు లగ్నమనస్కులును నగువారు కౌపీనధారులయి యున్నను భాగ్యశాలురె. వీరలే పూజింపబడువారు."

పూజితులు అనగా పుణ్యపురుషులు శత్రువుల నీరీతి ప్రేమింతురు:—

శ్లో॥ "అరావప్యుచితం కార్య మాతిథ్యం గృహమాగతే।
ఛేత్తుమప్యాగతే ఛాయాం నోపసంహరతే ద్రుమః॥"

—మహాభారతము.

"శత్రువయినను గృహమునకేతెంచిన నతిథి సత్కారము సేయవలయును. కుఠారమును హస్తమున దాల్చి తన్ను ఖండించి వేయవచ్చు మనుజునిపైనుండి వృక్షము తానాసంగు ఛాయను దొలగించివేయుట లేదుకదా!"

పూజితులు నిరంతర పరోపకారవృత్తియందే త్రికరణంబుల లగ్నమయి యుందురు. ఇంక బూజితు లెట్టివారలన—

"స్వయం నఖాదన్తి ఫలాని వృక్షాః।
పిబన్తి నాంభస్స్వయమేవ నద్యః।
ధారాధరో వర్షతి నాత్మహేతోః।
పరోపకారాయ సతాం విభూతిః॥"

"విటపములు పరిపక్వఫలములు, వాహినుల సలిలము, అంబుదముల వృష్టి, మొదలగు పదార్థములనియు సార్థము

నకుగాక లోకహితార్థమేర్పడి యున్నవో, అదియేచందమున బూజితుల విత్తము స్వసుఖనిమిత్తముగాక పరోపకారార్థమే యుపయోగపడును."

"దానాయ లక్ష్మీః సుకృతాయ విద్యా,
చిన్తాపరబ్రహ్మ వినిశ్చయాయ।
పరోపకారాయ వచాంసి యస్య,
వంద్యస్త్రిలోకీ తిలకః సఏకః॥"

"ధనమును దానము నిమిత్తమును, విద్యను ధర్మహిత మును, విచారణశీలతను నిర్వాణకీర్తనమునకును, వాక్కును పరోపకారార్థమును చరితార్థము సేయువారు సమగ్రవిశ్వ ముచే బూజితులు కారె!"

గీ॥ మాలకరి పుష్పములు గోయు • మాడ్కిఁదేటి
పువ్వుఁదేనియఁగ్రోలెడు • పోల్కి నెదిరి
గందకుండఁగఁ గొనునది • కార్యఫలము......॥
—ఆంధ్రమహాభారతము

పూజ్యులకర్తవ్యలక్షణ మిట్లు సాధుతరమయి జెలంగు.

శ్లో:—యతో యతో నిశ్చలతి మనశ్చంచలమస్థిరం।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్॥

"చంచలంబును, అస్థిరంబునునగు చిత్తమును విష యాదులనుండి మరల్చి యాత్మయందుండునట్లు సేయుటల

యును. అప్పుడే స్థిరత్వ మేర్పడును. పూజితులు ఇట్లే సేయుదురు."

శ్లో:— "శ్రిద్ధేయా విప్రలబ్ధారః ప్రియా విప్రియకారిణః।
సుదుస్త్యజా స్త్యజన్తోఽపి కామాఃకష్టాహి శత్రవః॥"
—కిరాతార్జునీయము.

"కామముయొక్క యాకర్షణవలన మొదట విశ్వాస మొదవుట నిశ్చయము. కాని యంతమున నను మోసము గలుగును. విడువవలయునన్నను యిది మనల వీడదు. ఇంతకంటె మహాశత్రువు మనకు మరెద్ది కలదు?" బుద్ధునిపూజితులు యీ కామమును "విషభోజనమివ పరిణామదుఃఖాః" యని తెలిసి గర్హించి త్యజించివేయుదురు. పూజితులు మహాభక్తులయి యుందురు. భక్తియన నపవిత్రతతో నేకీభవించియున్న విశ్వజీవ విశుద్ధప్రేమ యోగాభ్యాసమని బుద్ధుని యూహ. విశ్వసత్త యొక్క స్వరూపమగు నిర్వాణము లేక దేవుడు యెట్టివాడన,

"తదేవరమ్యం రుచిరం నవం నవం।
తదేవ శశ్వన్మనసో మహోత్సవం।
తదేవ శోకార్ణవశోషణం నృణాం।"

నిర్వాణచింత నిరంతరానూనదుఃఖములతో వెలయుచు మనోజ్ఞమయి, సర్వదా నవీనోత్సవంబుపగిది నలరారుచు నిషా

దసాగరము నింకించివేయగలదు. పూజితు లీమర్మము నెఱింగి వర్తింపుచుందురు పూజితు లీచందమున నుడువుదురు:—

శ్లో:—వయమిహ పరితుష్టావల్కలైస్త్వందుకూలైః
సమఇవ పరితోషో నిర్విశేషో విశేషః।
సతు భవతు దరిద్రో యస్యతృష్ణా విశాలా।
మనసిచ పరితుష్టే కోఽర్థవాన్ కోదరిద్రః॥"

—వైరాగ్యశతకము.

"నేను సాధారణములగు నారబట్టలనే ధరించి మనస్తుష్టి నందుచున్నాను. నీవు బహుమూల్యములగు పీతాంబరముల ధరించి సంతుష్టి జెందుచున్నావు. వేషధారణా పరిణామమగు సంతోషమున మన ముభయులము సమానులమె. నీకు భోగాభిలాష విశేషముకలదు. నాకన్నరో స్వల్పము. నీవు వల్కలముల ధరింప నపేక్షిసన్నడవయ్యెదవు. దరిద్రుని కాంక్షకు హద్దులేదు. ధనికునకును దరిద్రునకును భేదమును గల్పించునది తృష్ణయె." సాదృశ్యమునందును సాధుభావమునందును బూజితులు మనోహర్షమును జెందుచుందురు.

## సహస్రవర్గము.

ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యుడు— మానవాభ్యుదయమునకు దోడ్పడని వాక్యములును, బాహ్యాడంబర యుక్త

ములగు గ్రంథములును నిరర్థకములు. ధర్మజ్ఞానబోధకంబగు నొక్క వాక్యఖండమయిన నారాధ్యమె. అనేకయోధుల జయించుటకంటె నిజశత్రువులగు కామాదుల జయించుటయె ఘనము. ఆత్మస్వాతంత్ర్యము శ్రేయోదాయకమయినది. మారజిత్తును డీకొనువారు లేరు. యజ్ఞయాగాదుల నెపంబున సహస్రంబులగు రూకలను, అసంఖ్యాకములగు జీవములను బలివెట్టుటయు దగనికార్యము. స్థితప్రజ్ఞాన్వితుండగు విద్వాంసునికి ప్రణమిల్లుటయే యేండ్లును బూండ్లును అరణ్యముల దపమాచరించుటకంటె హితకరము. వృద్ధులసేవ సేయవలయును. విషయాదుల జయించి యొక్క నిముసమయిన జీవింప ముక్తిగల్గును. మందుడును, వీర్యపటుత్వశూన్యుడును బ్రదికియు జచ్చినవాడె. జననమరణములు, సుఖదుఃఖములు సహజములని గ్రహించువాడు ధీరుడు. మృత్యువు నానందపురస్సరంబుగా నాహ్వానింపుము. "బుద్ధధర్మస్వీకారము మహత్సౌఖ్యసంధాయకము" అనువిషయముల బోధించియున్నాడు.

శ్లో॥ "అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః
బ్రహ్మతత్త్వం నజానాతి దర్వీపాకరసం యథా॥"

శ్లో॥ "బహుశాస్త్రకథాకంథా, రోమంథేన వృథైవ కిం
అన్వేష్టవ్యం ప్రయత్నేన, తత్త్వజ్ఞైర్జ్యోతిరాంతరం॥"

"అనేకశాస్త్రములను బదేపదే వల్లించి కంఠస్థము జేసి నను లాభ మిసుఘుంతయు ఖున లేదు. సత్పురుషులచే హృదయస్థమయియున్న సత్యస్వరూపము నెఱుంగవలయును."

శ్లో॥ "సపురాణాః పంచవేదాశ్శాస్త్రాణి వివిథానిచ
జ్ఞాత్వాప్య నాత్మవిత్తేన నారదాతిశిశోచహ॥"

శ్రీనారదమహర్షులు నమస్త పురాణములను, పంచవేదములను, తర్కవ్యాకరణాది నిఖలశాస్త్రముల బారంగతుడయ్యు నాత్మజ్ఞానశూన్యతచే దుఃఖితుడయ్యె."

"అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా"

ఆత్మజ్ఞానానుభవశూన్యుని శాస్త్రాభ్యాసకృషి నిష్ప్రయోజనము.

"సకల సామ్రాజ్యముల జయించి యేకచ్ఛత్రాధిపత్యముగ బరిపాలించు యోధశాసకుండొక్క వీరుడు కాడు. వీని శౌర్య పరాక్రమక్రమమంతయు మృత్యుదేవతయొక్క వేడి నిట్టూర్పునుం దొక్క క్షణమయిన స్థిరముగ నిలువజాలదు. ఈయోధుని విజయలక్ష్మి మృత్యువునుగాంచి పలాయనంబగును."

"ఇంద్రియాదుల జయించినవానికి సామ్రాజ్యాభిలాషయే యుండదు. నిరంతరానందానుభవమే వాని నిత్యవృత్తి.

మృత్యు వావిషయ వికారదూరు నవలోకించి పారిపోవును.
వానికి పునర్జన్మయు లేదు, మరణమును లేదు."

—రామతీర్థస్వాములవారు.

"Self-reverence, Self knowledge, Self control,
These three alone lead life to sovereign power.
Yet not for Power, power for Himself
Would come uncalled for but to live by law,
Acting the law we live by without fear;
And because right, to follow right,
Where wisdom in the Scorn of consequence."

—Tennyson.

స్వయంశక్తి, స్వయంజ్ఞానము, స్వాత్మవశీకరణము.—ఈమూడును మానవజీవితమును సచ్చిదానందమయావస్థకు నడుపును. అంత మానవునకు బాహ్యాధికారముగాక స్వాత్మాధికారము లభ్యమగును. అపుడే మానవుడు ధర్మసంగతముగ జీవితమును వ్యతీతముసేయ సమర్థుండగును..........' టెన్నిసను కవిపుంగవుడు స్వయంశక్తినే స్తుతియించుచు నదియె ముక్తికి హేతుభూతమను భావము నీపద్యమునందు వ్యక్తీకరించియున్నాడు. ఈవర్గమునందలి బుద్ధదేవుని గ్రంథాభిప్రాయము నొకింత యీశ్లోకము సార్థకము సేయుచున్నది:—

"తదేవకావ్యం సఫలం,
ఉపమముక్తంహి యద్భవేత్ !

స్వేషాం పరేషాం విదుషాం,
ద్విషామ విదుషామపి॥"

పామర పండిత భేదములేక సకలజనుల కుపయుక్తమగు కావ్యమే సఫలమయినది.

తే॥ గీ॥ ద్రవ్యమయమైన యజ్ఞతంత్రంబుకంటె
జ్ఞానయజ్ఞంబు శ్రేష్ఠత జాలనొప్పు.

—భగవద్గీత. అ. 4. శ్లో. 49

తే॥ గీ॥ శ్రద్ధచే జ్ఞానసంసిద్ధి సంభవించు
నపుడె యింద్రియసంచార మణగిపోవు
జ్ఞానసంప్రాప్తిచేతను శాంతిబొందు
శీఘ్రకాలంబునందున చిరయశోర్థి
అజ్ఞునకు శ్రద్ధలేనట్టి యధమునకును
సంశయాత్మకునకు హాని సంభవింప
వీరిలోపల మిక్కిలి దూరమగును
సంశయాత్మకు, యిహాపర సౌఖ్యమనఘ."

—భగవద్గీత, 4 అధ్యా.

కం॥ "జీవునకు మనము బంధుఁడు
జీవునిచే మానసంబు జితమైనతఱిన్
జీవునకు మనము శత్రుఁడు
జీవుఁడెగా మానసంబు జితపడనితఱిన్."

—గీత, 6 అధ్యా.

"Idleness offers up the soul, as a blank to the devil for Him to write what He will upon it"

—Dr. South.

"ఈవాక్యము సోమరితనమునే నిషేధింపుచున్నది."

"In works of labour or of skill
Let me be busy too
For Satan finds some mischief still
For Idle Hands to do."

—Dr. Watts.

"నిరంతరము నన్ను కార్యమునందు నిమగ్నుడనయి యుండనిమ్ము; లేనిచో సైతాను (కామదేవుడు) యుపద్రవము నొదవజేయును. అపరిమత్తులగృహముల దానికి ప్రవేశము లేదు."

"మరణం బిందుపాతేన, జీవనమ్బిన్దుధారణాత్"

శుక్లపతనమువలన మరణము, ధారణమువలన నాయుర్వృద్ధియు గల్గును.

శ్రీ బుద్ధాచార్యుడు సోమరితనము నింద్యమనియు, వీర్యపటుత్వ మావశ్యకంబనియు నుడివియున్నాడు.

అఘువర్గము (పాపవర్గము)

ఈవర్గమునందు శ్రీమదాచార్యులవారు దుష్టబుద్ధి తగదనియు, పాపకార్యములు సేయరాదనియు, శుద్ధాచరణ

శూన్యుడు నరకగుండమున బడుననియు, పాపపరిణామ మసహనీయంబగు దుఃఖమనియు, పుణ్యము యొక్క ఫల మనిర్వ చనీయంబగు సౌఖ్యమనియు, సాధువు సుకృతముల నెన్ని యిక్కట్టులు పిక్కటిల్లినను సేయుచునే యుండుననియు, దుశ్చింత, దుష్టవాక్యప్రయోగము, దుష్టకార్యము సేయుట నింద్యమనియు, బిందువు వెంట బిందువు పడుటచే ఘటము జలపూరితంబయిన చందముననె మూర్ఖునిసాంగత్యము క్రమ క్రమముగ మానవుని జీవితమును దూషిత మొనర్చుననియు, పాపమే ఘోరమగు ప్రాణాంతక శత్రువనియు, జ్ఞానసంప న్నుని పుండులేని కాయముపై విషము పనిసేయజాలనట్లు పాపలాలస లెంతమాత్రము స్పృశింపజాలవనియు, ఎదురుగా లిపై విసరబడిన ధూళి, కండ్ల బూడ్చిపెట్టునట్లే, పుణ్యాత్ముని బీడించువాని దుష్టబుద్ధి వానినే హతమొనర్చుననియు, పాపి దీర్ఘకాలము జీవించియు సుఖమును బడయక తుదకు నరక గామి యగుచుండ, సుకృతుడు ముక్తి నొందుననియు, దుష్కార్యానురక్తు డెచటడాగినను ఫలమనుభవించు ననియు, ఎట్లు భద్రముగా దాగినను మృత్యువు వెంటాడి మ్రింగుటయే స్థిరమనియు విపులముగా బోధ జేసియున్నారు."

(1) పాపము ప్రజల కవమానమును గల్గించును. (2) చెడుతనమును విడిచి చనుట్టయే సత్యవంతుల ధర్మము (3) కుటిలవర్తనుడు మేలు పొందడు (4) నాహృదయమును శుద్ధమొ

నరించుకొని, పాపమును బారదోలి పవిత్రుడనయితిననుకొను వాడెవడు ? (5) పాపము చేయువారికే భయంకరమగును. (6) దుర్జనునకు ముందుగతిలేదు. (7) పాపులు నాశనమునందు టకుగాని వారి పాదములు ముందునకు బరువులెత్తును.

—బైబిలు 570వ పేజీ 16, 17, 18 అధ్యా.

"జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్ పాపస్య కర్మణః।
యథాఽదర్శతల ప్రఖ్యే పశ్యత్యాత్మాన మాత్మని॥"

''ధూళిధూసరితమగు దర్పణము పరిశుద్ధ మొనరింప బడినయపుడే దానియందు ముఖబింబాకృతి స్పష్టముగ జూడ బడు చందముననె నిఖిలపాపముల బహిష్కరించివేసినవాడే నిజాత్మ క్షేత్రమునందు సత్యము యొక్క దివ్యజ్యోతిర్మయ తాండవమును సందర్శింప శక్తుడగును."

చౌలిసుడను నాంగ్లేయ గ్రంథకారుడిట్లు నుడివియున్నాడు:

"Once the demon enters
Stands within the door
Peace and Hope, Gladness,
Dwell there never more."

''పాపభావమును యీ సైతానొక్కసారి మన శరీర గృహంబుల బ్రవేశించినపుడు సర్వనాశనమగును. అది యట నుండి వెడలుట కష్టసాధ్యము. ఆగృహమునం దికెప్పుడును శాంతి, సదమలాశ, ఆనందము నివసింపజాలవు."

"సతాం సత్కర్మసంవేగః పురాణం ప్రణుదన్నయం।
వర్షౌఘఇవ భూతానాం, దవానల మసేచయత్॥"

—గణేశగీత.

"వృష్టిసలిల దానంబుచే దావానలముపశమించు వడు
వుననె సత్కర్మల యపూర్వప్రభావంబున గర్తయొక్క సమ
స్తపాపములు నశించును."

"క్షాలయంతి మలేనైవ మలం క్షాళనకోవిదాః।
వారయంత్యస్త్రమస్త్రేణ, విషం ప్రతివిషేణచ॥"

—వసిష్ఠుడు.

"పాపములు సుకృతములచే నశించును. అపుడే చిత్త
శుద్ధి యొదవి జ్ఞానోదయంబునకు హేతుభూతమగును. భూమి
యందున్న చవుడే వస్త్రమాలిన్యమును బోగొట్టుచుండుగదా.
ఆగ్నేయాస్త్రము, వరుణాస్త్రప్రయోగంబునను, మానవుని
యం దేదియో కారణముగ బ్రవేశించిన విషము పాషాణాది
విషప్రయోగంబునను నశింపుచుండునుగదా!"

"చ॥ సకలజనప్రియత్వము నిజంబుగఁ గల్గిన పుణ్యశాలి కొ
క్కొకయెడ నాపదైనఁ దడవుండదు వేగమె పాసిపోవుగా
యకలుషమూర్తియైన యమృతాంశుడు రాహువు తన్ను
మ్రింగినం, డకటక మానియుండఁడె దృఢస్థితి నెప్పటి
యట్ల భాస్కరా!

ఒకవేళ పుణ్యాత్మునికి నాపద వాటిల్లినను, అది స్థిర ముగా నుండబోదు.

'మృత్యువెచ్చోట దాగినను తప్పదు' అను బుద్ధవాక్య మునకు రామదాసిట్లు నుడివియున్నాడు:—

"చ॥ రాకన్ మానదు దుఃఖ మొందుగతి సామ్రాజ్యంబుఁ బాలించినన్
రాకన్ మానదు మృత్యువెంతతనువున్ రక్షించిభూషించినన్"

ఒకానొక భక్తకవికుమారుని భావప్రవాహతరంగ మి ట్లుప్పొంగినది:—

"చ॥ పుడమినిజొచ్చినన్ విపినభూమినిఁ దాగినఁ మింటికేగినన్
గడలినిజొచ్చినన్ దుదకు గాదని దానినె కావవేడినన్
విడువదు మృత్యు వెవ్వరిని వేళకువచ్చి వధించుఁ దానికై
యడలిననేమికద్దు మనసా హరిపాదము లాశ్రయింపవే॥"

"చ॥ గజతురగాది సంపదలుఁ గాంతలతోడి విహార లీలలుం
బ్రజకనురాగమొందఁబరిపాలనసేయుక్రమంబుఁబోరులన్
విజయముఁ బొంది పేర్చుటయు విస్ఫురితాభరణానులేప
వస్త్రజనితవైభవంబు గలరాజులుఁ బోయిరిగాక నిల్చిరే?"

—ఆంధ్రమహాభారతము



## దండన వర్గము

ఈవర్గమునందు శ్రీమద్బుద్ధాచార్యులవారు—"జీవుల హింసింపవలదు. సహానుభూతిని గల్గి మనుము. ప్రాణిహింస మహాపాపము, స్వసుఖమునకై జీవపీడనము నింద్యము, అహింసయే యుత్తమధర్మము. కటువాక్య శరప్రయోగము సయితము హింసయె. మధురభాషణ మహింసయె. క్రోధము క్రోపముచే నుపశమింపదు. సాధువు క్రుద్ధునికటువచనముల నోరిమితో సహించును. మానవజీవితములు క్షణభంగురములె. దుష్టబుద్ధి యగ్నికంటెను భయంకరమయినది. సాధుహింసకు డేదియో నొక్కవిపత్తునకు గురియగును. చిత్తశుద్ధియే యుత్తమునిలక్షణముగాని బాహ్యానుష్ఠానముకాదు. బాహ్యవేషము లుదరపోషణ నిమిత్తమె. స్థిరచిత్తుడె బ్రాహ్మణుడు లేక శ్రమణుడు. విషయాదుల జయించినవాడు నిందింపబడడు. సాధితాశ్వముపగిది నిజేంద్రియముల వశమొనర్చుకొనుము. ఇంద్రియ దమనమునకు శ్రద్ధ, ఉత్సాహము, ధ్యానము, సత్ప్రవర్తనము, జ్ఞానము మొదలగు సాధనము లావశ్యకములు. నిజోత్థానపతనములకు మానవుడు తానే కర్త." ఈ విషయముల బోధించి యున్నారు:—

"ఆ॥ జీవి జీవిజంపి జీవికివేయగా
జీవివలన యేమి జిక్కియుండు!

జీవహింసకులకు జిక్కునా మోక్షంబు
విశ్వదాభిరామ వినురవేమ."

"అహింసాపరమోధర్మః, ఆత్మవత్సర్వభూతాని, పాపాయ పరపీడనాయ" యీమొదలగు ధర్మవాక్యము లన్నియును హింసను నిషేధింపుచు సర్వజీవకారుణ్యమును, జీవసహానుభూతిని వెల్లడింపుచున్నయది.

శ్లో॥ ప్రాణా యథాఽఽత్మనోఽభీష్టా భూతానామపి తే తథా।
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వంతి సాధవః॥"

"మనప్రాణములు మనకెట్లు మధురములయి యున్నవో, అదియేమాడ్కి సకలజీవరాసులకు వానివాని ప్రాణములు వానికతిప్రియములే యయి యుండును. కాన సాధూత్తములీమర్మమును గుర్తెఱింగి సకలజీవుల నపారదయాబ్ధి నోలలాడింపవలెను."

"కం॥ దానము ధర్మము తపమి
జ్ఞానిష్ఠ యనంగగల్గు సత్క్రియ లెల్లన్
మానవనాథ యహింసా
నూనాకృతులందుఁ బ్రీతులనూనిన పెద్దల్॥"

—మహాభారతము.

"శ్లో॥ ప్రాణిహింసపరాణాంతు, కల్పకోటి శతమునే
తత్రి తైల కటాహేషు గాఢం బధ్యావపద ద్వయం॥"

" ఓముని ప్రవరా! ప్రాణిహింసకుల శతకోటి కల్పాంతముల పర్యంతము నరకమున దప్తతైల మహాభాండమున రెండు పాదముల బంధించి పడవేసి యమదూతలు బాధింతురు."

" Non-voilence as perfect state, it is a goal towards which all mankind moves naturally though unconsciously." —Mahatma Gandhi.

"అహింసయనున దొక పరిపూర్ణంబగు స్థితి. అదియొక్క లక్ష్యప్రదేశము. అప్రయత్నముగనే సకలమానవజాతి స్వభావసిద్ధమగు మనోభావప్రవాహముచే నాగమ్యస్థలమునకే బరుగిడుచుండును." —గాంధిమహాత్ముడు.

సకలజీవరాసులయందా పరబ్రహ్మస్వరూపంబగు చలనశక్తియే కలదు. పిపీలికాది బ్రహ్మపర్యంతము వెలయుననబడు దేవుడీ ప్రాణశక్తియె. కాన పీడనమును బాసి మానవజాతి విశ్వప్రేమబద్ధులయి మనవలయు." —రామకృష్ణ పరమహంస.

"కం॥ ఇందుగల డందులేడని।
సందేహము వలదు చక్రి సర్వోపగతుం।
డెందెందు వెదకి చూచిన।
నందందే కలడు దానవాగ్రణి! వింటే."

—ఆంధ్ర మహాభాగవతము.

"ఎల్ల జీవులయందు నేనే కలను, నేను విశ్వమయుడను. జగమిశ్వరమయమని తెలియుమో యర్జునా" యన్న వాక్యము సకలజీవబంధుత్వమునే వెల్లడింపుచున్నది. —భగవద్గీత.

"పాపీ! నీవీశ్వరరాజ్యమును వీడిపోకుము. (ఇది వలను పడదు) నలుదెసల నీశ్వరరాజ్యముకలదు. ఎల్లచోటుల దేవుడు వెలయుచున్నాడు. కాన పాపాత్ముడా! పాపమునే వీడుము. హింసకు బాల్పడకుము. —సాధు ఇబ్రిహీం బేన్ ఆదాం.

"ఓరాజా! దేవుడెల్ల ప్రదేశములవ్యాపించియుండ నతడు లేనిదెచట?" —శేఖు సాదీ.

"Each soul is potentially divine"

—Swami Vivekananda.

ప్రతి జీవాత్మయందును బరమాత్మశక్తి యంతర్భూత మైయున్నది. —వివేకానందస్వామి.

ఈమహాత్ముల దీర్ఘకాల తపోనిష్ఠాద్యనుష్ఠాన లబ్ధ సత్య ధర్మజ్ఞాన కథితంబులగు నీవాక్యములబట్టి విచారింప జీవుని హింసించుట పరమేశ్వరుని నిందించుటయే యని రూఢి యగుచున్నయది. ఈశ్వరప్రాప్తి, యీశ్వరప్రాప్తి యని మది దలపోయుచు యజ్ఞయాగాది వ్యాజంబుల జీవుల మట్టుబెట్టు వా రెంత మూఢులు! ఆరాధన యెట్లుండవలయు— "తస్మిన్

ప్రీతి స్తస్య ప్రియకార్య సాధనంచ తదుపాసనమేవ" ఈశ్వ రునియందు బ్రీతి జూపుచు నతనికి ప్రియంబులగు కార్యముల నలుపుటయే దైవారాధన మనబడునని మహర్షి దేవేంద్రనాథ టాగూరు బ్రహ్మనంద కేశవచంద్రసేనుడు, రామమోహన రాయలు మొదలగు ప్రభృతులు నొక్కి వక్కాణించియు న్నారు. ఇట్టి స్థితియందు దన్ను (జీవాత్మలయందున్న ప్రాణ శక్తిని) బీడించువా రెట్లు తనయారాధకులగుదురని దైవము తలంచును?

నాగరకులని భావింపబడు మూర్ఖుల నెట్లు పరిహాసము నొకవిద్వాంసుడు చేసియున్నాడో చూడుడి.

"Nations measure their civilization by
their power to harm others"

—Paul Richard

"ప్రతిదేశమందుండు వారును దమకుఁ
బరపీడఁ గావించు బలమెంతయున్న
నంత నాగరకుల మనుకొందురౌర!॥

పీడించువా రనార్యులనియు, అసభ్యులనియు, మోటు మానసులనియు బాలిరిచార్డు మహాశయుని యూహ.

భారతమున ధర్మవ్యాధుడు నిజధర్మ ప్రాశస్త్యమును "జీవహింస యెన్నఁడును జేయనసఘు" యను గీతావాక ము చే వెల్లడించెను.

"విను మహింస ధర్మవితతికెల్లను మేటి."

—ఆం॥ భారతము.

"దంతియడుగులోన తక్కిన జంతుచ
యంబు నడుగులెల్ల నడగియుండు
నట్లు ధర్మకోటులన్నియు లోనగు
నిద్ధగుణ యహింస కింతనిజము."—ఆం॥ భారతము.

ఈ పద్యభావమునే వెల్లడింపుచు శ్రుతు లహింసామహిమ నిట్లు వెల్లడింపుచున్నవి.

"అహింసా పరమోధర్మః, అహింసా పరమం తపః
అహింసా పరమందానం ఇత్యాహు ర్మునయస్తథా॥"

"అహింసాసదృశమగు ధర్మములేదు. అహింసతో తుల్యమగు తపములేదు. అహింసకు సమమగు భూరిదానము లేదు." అని తపోధనులగు మునిప్రవరులు నొక్కి నక్కాణింపుచున్నారు.

అధునాతన కవికుమారు డొక్కరుం డెట్లు నిజోదార హృదరత్న-భండారమునుండి యహింసా సుధారసోపేతంబగు భావరత్నమును బాలకలోకమున కొసంగియున్నాడో విలోకింపుడు,

"మ॥ పరమాత్ముండగు దేవదేవునకు సర్వప్రాణులుఁ దుల్య
ముల్; । కరుణాదృష్టి నినుఁ ననుఁ సకలముఁ గాపా
డునాతండె; సా । దరబుద్ధిఁ విడనాడి కృత్రిమ సమర్థ
త్వాప్తి గర్వించి; సో । దర జంతువ్రితతిఁ భుజించు
టదియుఁ ధర్మంబె మర్త్యాళికిఁ॥"

"మాంసభక్షైః సురాపానై ర్మూర్ఖైశ్చాక్షర వర్జితైః।
పశుభిః పురుషాకారై ర్భారాక్రాంతాస్తి మేదినీ॥"

"మాంసభక్షులును, మదిరాపాన మత్తులును, నిరక్షర
కుక్షులును నగు మూఢ నరపశువులు భూదేవికి భారసదృశు
లయి యున్నారు."

"ఋషయో బ్రాహ్మణా దేవాః ప్రశంసన్తి మహామతే।
అహింసాలక్షణం ధర్మం వేదప్రామాణ్య దర్శనాత్॥
కర్మణా మనుజః కుర్వఁ హింసా పార్థివసత్తమ।
వాచాచ మనసాచైవ కథం దుఃఖాత్ ప్రముచ్యతే॥"

—భీష్మాచార్యులు.

"ఋషులును, బ్రాహ్మణులును, జ్ఞానులును వేదశాస్త్ర
ప్రమాణులతోడ నహింసాస్తవ మొనరింపుచున్నారు. త్రికర
ణంబుల హింసాసురక్తుం డెట్లు దుఃఖవిముక్తిని బడయ
నేర్చును?"

"పూర్వన్తు మనసా త్యక్త్వా తథావా చాథకర్మణా।
నభక్షయతి యో మాంసం త్రివిధం సవిముచ్యతే॥"

"ప్రప్రథమము చిత్తఃశుచేతను, అనంతరము వాక్కు వలనను, పిదప కార్యరూపంబునను మాంసాహారమును విసర్జించి మను వ్యక్తి త్రివిధతాపముల నెడబాపుకొన సమర్థుండగును."

దశలక్షణ యుక్తంబగు ధర్మలక్షణములలోనికెల్ల నహింసకే ప్రథమస్థానమును మనువొసంగి యున్నాడు.

ఇంకను మహాత్ములగు ఋష్యాదు లెట్లు పరిశుద్ధంబగు నహింసాధర్మమును సంస్తుతించియున్నారో యాలకింపుడి.

"శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః
దయాసమం నాస్తిపుణ్యం, పాపం హింసాసమం నహి॥"

"అసంఖ్యాకములగు వేదాది గ్రంథముల సారము నీయర్థశ్లోకమునందే వచింపుచున్నాడను. దయతో సమమగు పుణ్యంబును, హింసతో సమమగు పాపంబును లేదు.

"కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా।
అక్లేశం జననం ప్రోక్తా త్వహింసా పరమర్షిభిః॥"

"మనోవాక్కర్మల సర్వకాల సర్వావస్థల నేప్రాణికి క్లేశము నొదవజేయరాదు." ఇదియే యహింసయని మహా

ర్షులు వాకొనియున్నారు. కఠోరవాక్యప్రయోగము సహిత మిందు నిషేధింపబడి యున్నది. ఇది సూక్ష్మహింస.

"ప్రవిశంతి యథా నద్యస్సముద్రం బుజువక్రగాః।
సర్వే ధర్మా అహింసాయాం ప్రవిశంతి తథాదృఢం॥"

"సమస్తములయిన నదీనదములు బుజువక్రగమనంబుల వెలయుచు నంబుధి జేరుచున్న చందమున నె నిఖిలధర్మములు నహింసాసాగరముననే జేరుచున్నవి.

"సర్వయజ్ఞేషు యద్దానం సర్వతీర్థేషు యత్ఫలం।
సర్వదానఫలం వాపి తన్న తుల్య మహింసయా॥"

"సర్వయజ్ఞముల (ఇంద్రియాదుల జయించుటనే యజ్ఞ మందురు) ఫలములును, సమస్తతీర్థముల (చిత్తమను తీర్థశుద్ధినే తీర్థస్నాన మండ్రార్యులు) ఫలములును, నిఖిలదానఫలములును, అహింసావ్రతానుష్ఠాన లబ్ధఫలమం దొక్క కోటి యంశమయిన నుండజాలవు."

శ్లో:— "అహింసా పరమోధర్మ స్తథాధర్మః ప్రాణినాం వధః॥"

అహింసకంటె నుత్కృష్టమగు ధర్మంబును, హింస కంటె నీచంబగు నధర్మమును విశ్వమునందు మరెద్దియును లేదు.

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖంవా యదివా దుఃఖం సయోగీ పరమోమతః॥"
—భగవద్గీత.

"ఓ అర్జునా! సకల భూతరాసుల సుఖదుఃఖముల దనవిగా జూచుకొను నతడే నాకు బ్రియుడు."

"అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః॥
—పాతంజలి.

"అహింసాప్రకాశభాసురుండగు వానితోడ నెల్ల భూతములు వైరమును వీడును." ధర్మరాజు బృహస్పతి నీప్రశ్న యడిగెను.

"కం॥ ధ్యానం బింద్రియవృత్తులు
మానించుట హింస గురు సమర్చనవిధి ని
త్యానుష్ఠానము దపమను
వీనంబర సేవ్య మెద్ది?
(ఇది ధర్మరాజుప్రశ్న)

బృహస్పతి యిట్లుత్తర మొసంగును :—

"కం॥ ఈయూతను మంచి తెరువు
లెయ్యుండు నహింస యున్న యెదిటికి బవి

తాప్రియతన మట్లుగాకయు
నేయుత్తమ ధర్మములను నిడి వెలిగించున్॥"

ఈయహింసాధర్మ మహిమాతిశయాభినుతి సేయ నుప క్రమించిన నొక్క మహద్గ్రంథమే సిద్ధంబగును. గ్రంథవిస్తర భీతి నన్ను వెంటాడుచున్నది. "జీవో బ్రహ్మైవ నాపరః" అను శ్రుతి వాక్యమును విస్మరింపకుడు; ఇదియే నాప్రార్థన.

"వాఙ్మాధుర్యా న్నాన్య దస్తి ప్రియత్వం।
వాక్పారుష్యాచ్చోపకారోఽపినేష్టః।
కిం తద్ద్రవ్యం కోకిలేనోపనీతం।
కోవా లోకే గర్దభస్యాపరాధః॥"

"ఈవిశ్వమందు మృదుమధురవచనముకంటె ప్రియ మయిన దెద్దియులేదు. కటువచనముకంటె నప్రియమయినది యును లేదు. కటుభాషణముచే నుపకార మొనరించినను నది ప్రేమభాజనము కాజాలదు. ఆరోహణావరోహణము లొప్పు చుండ సప్తస్వరమాధుర్య రసపీయూషమును ప్రసాదించు పికము మనకొసంగిన మహాభాగ్యమును లేదు. దివారాత్రమవి రళకృషి మానవహితార్థమయి సలుపు కటుస్వరయుక్తమగు గార్దభము మనకు మహాభాగ్యముల నీయనిదియు లేదు. కటు మధురవాక్యభేద మెంత జేసినది."

దీర్ఘముగ బరిశీలింప నీవిశ్వజీవరాసులన్నియు లాలింపుల నాదరించినట్లు, బెదరింపుల నాదరింపకున్నవి. ఏజీవమున కయిన ప్రేమయే కాంక్షిత వస్తువయియున్నది. దీనింబట్టి చూడ బ్రతిజీవియు సాధుత్వమును, సారళ్యమును వాంఛించుచున్నటులే విశదమగుచున్నయది. ఆసాధుత్వమే యపారమయినపుడు పరిశుద్ధమగు సత్వగుణమయి సచ్చిదానంద స్వరూపంబగును. గాంధిమహాత్ము డిద్దానినే "Natural and perfect state" అని వచించి యున్నాడు.

"నారుస్తుదః స్యాదార్తోఽపి నపరద్రోహకర్మధీః।
యయాస్యోద్విజతేవాచా నాలోక్యాంతాముదీరయేత్॥"

—మనుస్మృతి.

"ఒకరిచే బీడింపబడియు నెవ్వారిని హృద్విదారకంబులగు కటువచన శరప్రయోగంబున బాధింపరాదు. మనస్సుచే నెవరికి హానిసేయు టనుచితము. పరహృదయానంద సంహారకంబును, పరహృదయోద్వేగప్రవర్ధకంబును నగువాణి నహితకరంబని తెలిసి పరిత్యజించవలయును."

"విశ్వము క్రోధముతో నిండియున్నది. అది ప్రచండానలము వంటిది. ప్రేమసలిలదానంబున నయ్యది చల్లారును. పరస్పరశిలాఘర్షణంబుననే యగ్నిస్ఫులింగము లుదయించును.

రాతికి దోడు దూదియున్న నగ్ని యుదయింపదు కదా! ప్రేమో
దయంబున గోప్రిథా స్తమయమగును."

"Do Not hurt others by hard words or deeds"

"పరుల కఠోరవాక్యంబుల నేమి, నిర్దయకార్యంబుల
గాని చెఱుపకుము" అని యొకానొక యాంగ్లేయ పండితుఁడు
నుడివియున్నాడు.

"కం॥ క్షమియించు వారిఁ గని చా।
లమి వెట్టుదురైననుం దలంప ననూన।
క్షమయ కడు మెఱయు తోడవు।
త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్."

కం॥ పురుషుండు రెండు దెఱఁగుల
ధరను త్తముఁ డనఁగబరఁగు దానెయ్యెడలం
బరుసములు వలుకకునికిన్
దురితంబులు వొరయు పనులు దొఱఁగుటవలనన్.

గీ॥ చెల్లియుండియు సైరణ సేయునతఁడుఁ
బేదవడియును నర్థికిఁ బ్రియముతోడ।
దనకుఁగలభంగి నిచ్చునతండుఁ బుణ్య
పురుషులనిచెప్పిరార్య కురువరేణ్య"

—ఆంధ్రమహాభారతము.

"ఈశ్వరోపాసననే భాషయందు, ఏస్థలమందు నెట్టిస్థితియందు జేసినను నష్టములేదు. అది చిత్తశుద్ధితోగూడి యుండవలెను. ఉపాసకుని త్రికరణములు ధ్యానముతో సమ్మిళితమయిపోవలయును. మంత్రములు, తంత్రములు, ఆడంబరములు, ధూపదీప నైవేద్యాదులు, పుష్ప తాంబూలాక్షతలు మొదలగునవన్నియు బాహ్యకర్మలె. బాహ్యానుష్ఠానముల వలన బ్రయోజనములేదు."

—మహాత్మా గాంధి.

ఆ॥ చిత్తశుద్ధిఁగలిగి • చేసినపుణ్యంబు
కొంచమైన నదియుఁ • గొదువకాదు"

—వేమనయోగి.

"చిల్లరరాళ్లకు మ్రొక్కుతువుంటే • చిత్తముజెడురా వోరేవోరే। చిత్తమునందున చిన్మయరూపుని • చూచుచుండుట సరేసరే ॥ వొక్కపొద్దుల యెండుతువుంటే • వొనరుగ చెడుదువు వోరేవోరే। వొక్కడైన యావైభవమూర్తిని • చూచుచుండుట సరేసరే ॥ —మాలపల్లి.

గీ॥ తమనిజంబేమి యెఱుగరు • ధాత్రిజనులు
మృచ్ఛిలాకాష్ఠతామ్ర నిర్మితములైన
దేవతలగొల్చువా రెట్లు • దెలియనేర్చు?
సవ్యతరభోగి శ్రీసదానందయోగి."

" A little ignorance makes men bow down to wood and stone; a greater ignorance prevents them from doing it."
—Paul Richard.

"కించిదజ్ఞానంబు ◆ తీఁతి మానవులను
రాతిని గట్టి నా◆రాధింపఁజేయు;
నజ్ఞానమధికమై ◆ యర్చార్చనలను
వారు సల్పుట కడ్డుఁ◆పడి మానఁజేయు."

—పాల్ రిఛార్డు.

" Doctrines and dogmas, or rituals, or books or temples, or forms are but secondary details."
—Swami Vivekananda.

"వాదములు, రాద్ధాంతములు, కర్మకాండము మత గ్రంథములు, దేవాలయములు, బాహ్యాచారపద్ధతులు, మొదలగున వన్నియు నప్రధానవిషయములు."

—వివేకానందస్వామి.

ఇంద్రియ దమనమున కీగుణముల బుద్ధాచార్యు డావశ్యకములనియె:— శ్రద్ధ, సంతోషము, ధ్యానము, సత్ప్రవర్తనము, జ్ఞానము :—

"పురుషుడు శ్రద్ధామయుడు; ఈశ్రద్ధయే వానిజీవిత నిర్మాణమునకు మూలమగును." —భగవద్గీత.

"True Happiness is to no place confined
But still is found with a contented mind"
—Sonnets.

"నిర్బంధములేనిదే యథార్థమగు సౌఖ్యము. తృప్తి జెందిన చిత్తమే దానినొసంగు."

"Poor and Content is rich, and rich enough,
But Riches endless are as poor as winter,
To Him that ever bears he shall be poor."
—Shakespear.

"నిర్ధనులయియుండియు మనస్తృప్తికలవారే ధనాఢ్యులు. తగుపాటిధనవంతులు అంతములేనిధనము గోరువారు, హేమంతర్తువువలెె నిర్ధనులె యగుదురు."

"Ignorance is the curse of god, knowledge
the wing with which we fl y to Heaven."
—Shakespear.

"అజ్ఞానమే భగవానుని కఠోరశాపము. జ్ఞానమే స్వర్గమున కెగిరిపోవ సాయపడు రెక్కవంటిది."

"శ్లో:—ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు!
సంజయే యత్నమాతిష్ఠే ద్విద్వాన్ యన్తేవవాజినాం॥"
—మనుస్మృతి.

"చిత్తాకర్షకంబులగు విషయాదులవైపున కింద్రియములు పరుగిడుచుండును. యోగ్యుడగు సారథి సైంధవముల స్వాధీనమునందునిచికొను విధంబుననే విద్వాంసుడు లేక జ్ఞాని యింద్రియాదులనెల్ల వశమునందు నినికొనదగును."

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు।
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ॥"

—కఠోపనిషత్తు.

"మానవుని శరీరమొక్క శకటము వలెనున్నది. జీవాత్మ యీశకటము నధిరోహించియున్నది. బుద్ధి సారథిగా నున్నది."

"ఇంద్రియాణి హయానాహు ర్విషయాం స్తేషుగోచరాన్।
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః"

—కఠోపనిషత్తు.

"ఈశకటమున పంచజ్ఞానేంద్రియములును బంచాశ్వములుగ గట్టబడియున్నవి. ఈగుఱ్ఱములనోట మనస్సనియెడి కళ్లెము పెట్టబడియున్నది. శబ్దరూపస్పర్శాది పంచవిధమార్గములీబండినడచుట కేర్పడియున్నవి. ఆత్మ, యింద్రియ చిత్తములతోడగూడి వీనిభోక్త యగుచున్నయది."

"Depend upon your mind, do not depend upon others."

"నీపై నీవే యాధారపడి యుండుము; అన్యులపై వలదు."

పశ్చిమదేశీయులు బుద్ధాచార్య కథనానుకూలముగ నీభావమునే కల్గియుందురు.

---

## జరావర్గము.

ఈవర్గమువందు శ్రీమదాచార్యులవారు — అజ్ఞానాంధకారబంధుర సంసార వ్యామోహవలయ మధ్యంబునందు జిక్కువడినవారు సుజ్ఞానజ్యోతి నన్వేషింపవలదె? అస్థిచర్మరుధిరమాంసమయంబగు నీదేహము వట్టిబూటకము. క్షణికంబగు నీదేహము విశ్వాసయోగ్యమయినది కాదు, మృత్యువేయీ శరీరపరిణామము. సమస్తదుర్గుణము లీకాయమునే తమ నివాసగృహముగ నేర్పఱచుకొని యున్నవి. సజ్జనుల ధర్మము, కీర్తి నశించినవి కావు. కండరముల బెంచుకొని నేను దండివాడనని మిడిసిపడు మిథ్యాభిమాని జరావస్థను గాంచి దుఃఖించును. జ్ఞానికి బునర్జన్మ లేకుండ బోవును. ధర్మజ్ఞానశూన్యుని జీవితము పశుజీవితతుల్యమయి యంతరించును. యుక్తప్రాయమునందే జ్ఞానమును సముపార్జించియుండక మృత్యువేళ సమీపించినపుడు బేలయయి మూర్ఖుడు విలపించును." ఈ మొదలగు విషయముల నుపదేశించి యున్నారు.

యయాతి వార్ధక్యమును గూర్చి యీచందమున జింతిం చియున్నాడు:—

"శా॥ కాంతాహేయము బంధునింద్యము దురా కందూతి
మిశ్రింబు హృచ్చింతామూలము పీనసాన్వితముప్రస్వే
దవ్రిణాకంపన భ్రాంతి స్ఫోటకయుక్త మీముదిమి..."

—భాగవతము.

"శ్లో:-గాత్రం సఙ్కుచితం గతిర్విగలితా భ్రష్టాచ దన్తావలి
ర్దృష్టిర్నశ్యతి వర్ధతే బధిరతా వక్త్రంచ లాలాయతే।
వాక్యం నాద్రియతే చ బాన్ధవజనో భార్యా న శుశ్రూషతే
హా!కష్టం! పురుషస్యజీర్ణవయసః పుత్త్రోఽప్యమిత్త్రాయతే.

—భర్తృహరి.

తెనుగు:—

"చ॥ తనువుముడుంగు ( బాదగతిదప్పును దంతములూడు (జీక
టుల్ । కనుఁగవ వర్తిలుంజెవుడు గ్రమ్మను జొంగలుగారు
మోమునకా। జనములుమాటచేకొనరు సన్నిధిజేరదు భార్య
పుత్రుడుకా। గొనకొని శత్రువిసట్లు తిరుగుం గడుఁ గష్టము
వృద్ధదేహికిన్॥"

భాగవతంబున వృద్ధాప్యమును గూర్చి వ్రాయబడిన యీ సీసపద్యము శ్రీబుద్ధాచార్యుడు నుడివిన జరాభార

విశేషము యొక్క దైన్యావస్థాస్ఫూర్తిని వెలయింపుచున్న యది. అజామిళునికి:—

"సీ॥ నిర్మలంబునఁ జాల నెఱయుచిత్తంబన
నల్లనివెండ్రుకల్ తెల్లనయ్యెఁ
దగు మోహపాశబంధంబు జాఱినమాడ్కిఁ
బొదలిన యంగముల్ • వదలి వ్రేలె,
నింద్రియంబులకోర్కు • లిక నొల్లననుభంగి
నుడుగక తల చాల • వడఁకఁజొచ్చెఁ
దమకంబు ప్రియంబుఁ • దగిలిపోయినమాడ్కి
లోచనంబులజాడ్కి • నీచమయ్యె
ఆ॥ వగరు పుట్టె నంత • బెగలె దంతంబులు
నుక్కిపయును దగ్గుఁ • బిక్కటిల్లె
శిరసు నొవ్వఁ దొడఁగెఁ • జెదరె మనంబంత
గడఁదియైన ముప్పు • కాలమబ్బె."

—ఆంధ్రభాగవతము.

"శ్లో:—యావత్స్వస్థమిదంకళేబరగృహం యావచ్చదూరేజరా
యావచ్చేంద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయోనా
యుషః। ఆత్మశ్రేయ సితావదేవ విదుషా కార్యః
ప్రయత్నోమహాన్। ప్రోద్దీప్తే భవనేతు కూపఖనన
ప్రత్యుద్యమః కీదృశః."

—భర్తృహరి.

తెనుగు :—

చ॥ ధృతిఁగొని రోగముల్ జరయు • దేహము నొంపకముం
దె యింద్రియ। ప్రతిహతి లేకముందె తన • ప్రాణవిరా
మము కాకముందె పం।డితజనుఁ డాచరింపఁదగు • శ్రీమఁ
బ్రియత్నము ముక్తికిన్ మహో।ద్ధతశిఖి నిల్లుగాలు
తఱిఁ • దాలిమి నూతులు ద్రివ్వ టొప్పునే?"

శ్రీ బుద్ధాచార్యులవారు యుక్తప్రాయమందె సత్యా సత్య వస్తువిచారంబున సత్యధర్మజ్ఞానతత్త్వంబు నన్వేషించి యైహికాముష్మిక సౌఖ్యంబు జెందమనిరి. జనమేజయున కాంగిరసుం డిట్లనియె :— భూపాలా ! విచారింపకుడి.

చ॥ "మృతియును జీవనంబు నివి మేదినిలోపల జీవకోటికిన్
సతతము సంభవించు సహజంబిది............

—ఆంధ్రభాగవతము

"We all must die. After death we shall be judged. Prepare for death. Ask god to cleanse your Heart before your death" —Jesus Christ•

"మనమెల్లరము మరణించువారమె. మరణానంతరము మన న్యాయాన్యాయ పరీక్ష జరుగును. మృత్యుప్రసక్తయి సిద్ధపడుము. మరణమునకు బూర్వమే నీహృదయమును బరిశుద్ధమొనరింప దేవుని వేడుము." —క్రీస్తుదేవుడు.

"శ్లో :—నలినీ దళగత జలమతి తరళం
తద్వజ్జీవిత మతిశయచపలం
విద్ధివ్యాధ్యభిమానగ్రస్తం
లోకం శోకహతంచ సమస్తం."—శంకరాచార్యులు.

తెనుగు: "జలజదళమ్మున సలిలకణముఁగతిఁ
జపలతమము జీవితమని తెలియుము;
మలుగుశోకమున లోకమఖిల మభి
మాన వ్యాధిగ్రస్తతఁ దొలఁగుము."

"శ్లో:—యధా మేరు శ్రీమాన్నిపతతియుగాన్తాగ్నివలితః
సముద్రాశ్శుష్యన్ని ప్రచురమకరగ్రాహనిలయాః
ధరాగచ్ఛత్యన్తం ధరణిధరపాదైరపి ధృతా
శరీరాకావార్తా కరికలభ కర్ణాగ్రచపలే."
—భర్తృహరి.

"చ॥ స్థిరతరమైనమేరువు నశించు యుగాంతకృశానుకీలలన్
వరమకరాలయంబులగు,వారినిధానము లెల్ల నింకు భూ
ధరములచే ధరింపఁబడు • ధారుణిపోఁడిమి దప్పుగావునన్
గరికలభశ్రవశ్చపల • కాయమునందిఁక వార్తలేటికిన్."

"విశ్వమందు గానసగు సకలపదార్థతతులు నశించునవి
యే యయియుండ దేహము నశింపకుండునా?" అని దేవుడు

వచించియున్నాడు. "యద్దృశ్యం తన్నశ్యం" కాని కీర్తికాయము శాశ్వతమయినది. బలిచక్రవర్తి శుక్రునితో నిట్లనియెను:—

"శా॥ కారేరాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ! సిరి మూటఁగట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరేకోర్కులువారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!"

"కీర్తిధర్మశ్చ నిశ్చలా." ధర్మయశంబులు నిత్యంబులు.

## ఆత్మ వర్గము.

ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యులవారు— "స్వాత్మ సంస్కరణాసక్తుడు కౌమార యౌవన వార్ధకముల జాగరూకుడయి యుండదగును. పరులకు బోధించుటకు బూర్వము స్వాత్మసంస్కరణ మొనరించికొనుము. అన్యుల కుపదేశించిన చందముననె నుందు నీవు భక్తిశ్రద్ధల నాచరింపుము. స్వాత్మ విజయమే విశ్వమందలి బాహ్యాంబులగు జయములకంటె ఘనమయినది. ఆత్మవిజయునిపై నధికారము నెఱపగలవారు లేరు. దుష్టబుద్ధిని మానవుడార్జించినదియే యతనిని హతమార్చును. ఇరుగుపొరుగుల వ్యాపించియున్న లతలు వృక్షముపైకెగబ్రాకి దానిని వంచివేయువిధంబుననే దౌష్ట్యము, ఆత్మపతనమునకు హేతుభూతంబగును. దుష్కర్మలే సుకరములు. సత్కర్మలు కష్టసాధ్యములుకాని యమూల్యఫలప్రదాయకములు. జ్ఞానుల

హితబోధను దిరస్కరించువాడు భ్రష్టుడగును. ఎవనియున్నతికి వాడే కర్త. బోధకులు నిమిత్తమాత్రులె. పరగురుధర్మంబు కంటె నాత్మీయధర్మమే హితకరము." అనువిషయముల నుపదేశించియున్నారు.

శ్లో॥ సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖం।
—మనుస్మృతి.

"ఆత్మవశమగునదియే సౌఖ్యము, పరవశము దుఃఖము. అనగా కామక్రోధాది చిత్తప్రవృత్తుల జయించి, ప్రమత్తతను బారద్రోలి యప్రమాద సుశ్లోకముల గానము సేయువా డాత్మవీరుడయి యాత్మారాముని సాక్షాత్కరించుకొనును."

"శరీరము కుక్షింభరి వ్యాహారాది క్లేశముల జిక్కువడియున్నను, ఆత్మవికాసమును గల్గియుండి కామక్రోధాది శత్రువుల రజోతమోగుణ ప్రతిపాదక భావరస ప్రవాహము నరికట్టి, బాహ్య విశ్వయోగాశ్రయము నందక, ఆంతరిక విశ్వయోగానందాధిక్యతచే దాదాత్మ్యము నందియుండు నాత్మానందయోగిని భౌతికప్రపంచసాగర సుఖదుఃఖాదివీచికాపరంపరలు మీదబడియు నేమి సేయగలవు?''
—శ్రీమదాచార్య బ్రహ్మానందకేశవచంద్రసేను.

"జన్మ జన్మాంతరముల నుండి పీల్చిపిప్పిజేయుచు బీడించుచున్న నాంతరిక శత్రువుల మదమడచినవానిని కారాగృహనిర్బంధము లేమి సేయగలవు?" —మహాత్మాగాంధి.

తే॥ గీ॥ "ఆత్మబుద్ధికి గడు మెక్కుడని యెఱింగి
మనము నింద్రియములతోడ • మనుడఁ బట్టి
కామమనెడు దురాసద • కష్టరిపుని
గెలువు మర్జున బుద్ధిచేఁ • గేవలముగ."

—కర్మయోగము.

"నాస్తి మేఘ సమం తోయం నాస్తిచాత్మ సమం బలం"

—చాణక్యనీతి.

"మేఘముతో దుల్యమగు జలంబును, ఆత్మతో సమాన మగు బలంబును లేదు."

"Let Him that would move the world move Himself."

—Socrates.

"సంసారమును బేరేపింప వాంఛించునతడు, తన్ను దానే పేరేపించుకొనవలయును." —సుకరాత్తు.

"ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ" -మనుస్మృతి

"సుఖార్థి స్వాత్మాధారమునే గల్గియుండదగును."

"This above all, to thine own self be true
And it must follow as the night the day,
Thou canst not then be false to any man."

—Shakespear.

"నీనిమిత్తము సత్యవాదివగుము. రాత్రి దివము నను సరించుచున్న విధంబుననే సత్యపాశముల స్వాత్మను బంధించిన

వాడు, పరులహితార్థముసహితము సత్యసంధు డగుట కెంత మాత్రము శంకాన్వితుడు కాడు."

—ఆంగ్లకవికుల కమలదివాకరుడు.

"Time, my good friend, will all that's needful give
gain self-reliance, and you 've learn'd to live."

తాత్పర్యము:—జర్మను దేశము యొక్క సుప్రసిద్ధలేఖకుడు గుగుటేగోథు యిట్లు నుడివియున్నాడు.

"నా సన్మిత్రులారా! మీయవసరముల నెల్ల సమయమే తీర్చును. మీరు స్వావలంబనము (ఆత్మపై నాధారపడియుండుట) నే స్వీకరింపుడు. ఇట్లాచరింపుచో మీరీ విశ్వమందు సుఖకరమగు జీవితయాత్రను నిర్వహింపగల్గుదురు."

ఆర్యోక్తి యొండిట్లుకలదు :—Example is better than precept"

"ఉపదేశముకంటె ప్రత్యక్షాచరణము విశేషప్రభావోత్పాదకము."

"తత్సుఖం సాత్వికం ప్రోక్తం ఆత్మబుద్ధిప్రసాదజం"

—భగవద్గీత.

"ఇంద్రియ సుఖాదులతో సంబంధము లేక, ఆత్మతో సంబంధమును గల్గియుండు బుద్ధి ప్రసన్నతాలభ్యములగు సుఖములు ప్రశస్తములై"

"చ॥ జయమునుగూర్చి యింకవినుజానుగ సర్వజయంబులందునిం
ద్రియజయమే మహాజయము నీరజనాభుని ప్రేమచేత నా
జయము ఘటించుఁ దాన మరిజన్మము రాదదిగాన నీదుసం
శయములనెల్లమాని మనసా హరిపాదములాశ్రయింపవే."

చ॥జయము లనేకము ల్గలవు చక్కగగాంచిన వానియందు నిశ్చ
యముగ నెప్పుడైన యమచర్చకు లోబడకుండు టొక్కటే
జయమని చెప్పవచ్చు............................

—ఒకానొక కవి.

ఆంగ్లారోక్తి యొకటికలదు:—

"God helps those who help themselves"

ఆత్మశక్తిపై నాధారపడియుండువారికే సర్వేశ్వరుడు తోడ్పడును.

"కురంగ మాతంగ పతంగభృంగ
మీనాహతాః పంచభిరేవ పంచ
ఏకప్రమాదీ సకథం న హన్యతే
యః సేవతే పంచభిరేవ పంచ॥"

—గరుడ పురాణము.

"కురంగ మాతంగ పతంగ భృంగ మీనములు తమ పంచేంద్రియములలో నొక్కొక్క యింద్రియ దాస్యమున కొడంబడి మృత్యుముఖంబున బడుచున్నవి. ఏకేంద్రియాదాస్య

వృత్తికి బాల్పడినంతనే మరణగ్రస్తము లీపంచప్రాణు లగు చుండ, పంచేంద్రియ కైంకర్య నిమగ్నుల మగు మనము— మానవులమేల మృత్యుముఖంబున బడకుందుము? సత్యానందాభ్యానంద సంధాయకంబగు నాత్మచింతనాపరుల కిట్టి దుర్గతి వాటిల్ల నేరదు"

"గృహారామక్షేత్ర వస్తువాహన కాంతాకనకములనె శాశ్వత సంపదల గదలింప జేయుచు, కామక్రోధాది చిత్త ప్రవృత్తుల విజృంభింపజేయు భౌతికజ్ఞాన ప్రపత్తికి బరోక్షము గనున్న శాశ్వతామలావ్యక్త దివ్యాత్మజ్ఞానసంపత్తియే ప్రశ స్తమయి, సార్వత్రికమయి, ద్వంద్వార్థముల జయించి నిర్వాణ మొసంగ గల్గునది. తద్దివ్యతత్వమున కితరములయినవన్నియు మిథ్యలు. దుఃఖముల నొదవించును." —వివేకానంద స్వామి.

"స్వధర్మే నిధనంశ్రేయః పరధర్మోభయావహః"

—భాగవతము.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః' —భగవద్గీత.

## లోకవర్గము.

ఈవర్గమునందీ దిగువ నుదహరింపబడు యావద్విషయ ము లుపదేశింపబడినవి. "దుష్కార్యము సేయరాదు. దుష్పథ ము ననుసరింపజనదు. దుశ్చరిత్రము దుఃఖకారణము. సత్వర మగు జగత్తు నవలంబింపకుము. లేచి కూర్చుండుము; అలసుడవు

కావలదు. జ్ఞానమును సంపాదించుము. సద్గుణములను, సద్భావములను సముపార్జింపుము. స్థిరచిత్తమును గల్గియుండుము. సత్యమును విస్మరింపకుము. పాపమును బారదోలుము. సాధుత్వము సంతసము నిడును. తళుకు బెళుకుల నొప్పుజగము మిథ్యయని తెలియుధీరు డానందించును. మెఱుపువంటి దీసంసార సుఖము. సంసారసాగరమును జ్ఞానులు తరింతురు. జ్ఞానభ్రష్టు లటునిటు కొట్టుకొనుచుందురు. జ్ఞానము నిర్వాణదాయకము. అజ్ఞానమును, అసత్యభాషణమును ప్రేమించువాడు నరకగామియగును. లోభము ముక్తిమార్గమునందలిప్రతిబంధకము. దానము మానవజాతికి శిరోభూషణము. సత్పాత్రదానమే శ్రేయోదాయకము. అన్న విత్తదానములకంటె జ్ఞానదానము వేయిమడుంగులుత్తమము."

"దుష్కార్య కలాపముల నాచరించుట వివేకశూన్యునకు క్రీడాసమానము. పాపకార్యముకర్త ప్రాణముల బలిగొనును. బుద్ధివిహీనత నరకము నొసంగునది. బుద్ధిహీనుని వీపుపై బెత్తపుదెబ్బలు పడుటయే రూఢి."

—క్రీస్తుభగవానుడు.

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతꣳసమాః"

యజుర్వేదం. అ 40. మం. 1

"మనుష్యులారా! ఉత్తమ కార్యముల నాచరించుచు నీసంసారమున శతవర్షముల పర్యంతము జీవింప వాంఛగల్గి యుండుడి."

"ఆచారః ప్రథమో ధర్మః శ్రుత్యుక్తః స్మార్త ఏవచ।"

—మనుస్మృతి.

"సదాచారము నార్జింపుమనియే వేదములు, స్మృతులు బోధించుచున్నవి.

"నకశ్చిత్కస్యచిన్మిత్రం నకశ్చిత్కస్యచిద్రిపుః।
వ్యవహారేణ జాయంతే మిత్రాణి రిపవస్తథా॥"

"కేవలము మనుజునిచరిత్ర ననుసరించియే జనులు శత్రులు, మిత్రులు నగుచున్నారు."

"శ్లో॥ మాకురు ధనజన యౌవనగర్వం
హరతి నిమేషాత్కాలస్సర్వం
మాయామయ మిద మఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశవిదిత్వా."

—శంకరాచార్యులు.

"ఉ॥ కాలమువాతఁజిక్కి చెడుఁగాన నిమేషములో సమస్తమీ
వాలిని బిడ్డలన్ ధనముఁ యౌవనముంగని పొంగఁబోకు మా
యాలలిత ప్రపంచమున నాసవహించక తత్వవేత్తవై
క్రాలఁగఁజాలినన్ సుఖముఁగల్గు, హరిన్ భజియింపుమూఢుఁడా!

"ఉ॥ నీతిపథంబునన్ బ్రిదుకఁ నేర్చుట యుత్తమభంగి శౌర్యసం
జాతములైె కరంబలరు • సంపదలొందుట మధ్యవృత్తియ
స్ఫీతములైన భారవహ • జీవనముల్ దలఁపంగ నిష్ఠముల్
నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్."

—మహాభారతము.

"O gentlemen, the time of life is short;
To spend that shortness basely, were to long;
If life did ride upon a dial's point,
Still ending at the arrival of an Hour."

Shakespear.

"ఆర్యులారా! లెండు! మేల్కొనుడు. మనజీవితకాల మత్యల్పము. చేయవలసినకార్యములనేకములు. మనము నియమము ననుసరించి జీవితకాలము నుపయోగింపదలచిన నది యల్పమేయని తెలియగలదు. ఘటికాయంత్రము తిరిగిపోవుచున్నది. కార్యమగుటలేదు. అనుభావముపై బద్యమునందు కలదు."

"ఆరభేతైవ కర్మాణి శ్రాంతః శ్రాంతః పునః పునః
కర్మాణ్యారభమాణంహి పురుషం శ్రీర్నిషేవతే॥"

—భీష్మాచార్యులు.

"మాటిమాటికి మానవుడు శ్రాంతుడయినను కర్మనాచరింపుచునే యుండవలయును. కారణమేమన గర్మారంభము సేయువారిని సంపద వరించును."

గీ॥ పాపములకెల్ల నెక్కుడు • పాతకములు
సువ్వె క్రోధలోభంబులు సుపవిత్రాత్మ
వాని రెంటి జయించిన•వాఁడుగాని
యెందుఁ బరమధార్మికుఁడని • యెన్నబడడు."
—ఆంధ్రమహాభారతము.

లోభము తగదనుట కెన్నియో దృష్టాంతములుకలవు:—
"లోభాత్ క్రోధః ప్రభవతి లోభాత్ కామః ప్రజాయతే
లోభాన్మోహశ్చ నాశశ్చ లోభః పాపస్య కారణం॥"
—హితోపదేశము.

"లోభముచే గ్రోధము, కామము, మోహమునుబుట్టు చున్నవి. సమస్తపాపములకు లోభమే మూలకారణము"

"లోభః ప్రజ్ఞానమాహన్తి ప్రజ్ఞాహన్తి హతాహ్రియం
హ్రీర్హతా బాధతే ధర్మం ధర్మోహన్తి హతః శ్రియం."
—మహాభారతము.

"లోభముచే బ్రజ్ఞ నశించు; నద్దాన లజ్జ ధ్వంసమగు. దాన ధర్మ నష్టమొదవును. అంత సంపద నాశనమగును."

ఉ॥ దానము చేయనేరని య•ధార్మికు సంపదయుండి యుండియున్
దానె పలాయనంబగుట•తథ్యము, బూరుగుమ్రానుగాచినన్
దానిఫలంబు లూరక వృ•థాపడిపోవలె యెండి గాలిచేఁ
గానలలోన నేమిటికిఁ•గాక యభోజ్యములౌట భాస్కరా!

"బోధయన్తి నయాచన్తే భిక్షాద్వారాగృహేగృహే
దీయతాం దీయతాం నిత్యమదాతుః ఫలమీదృశం॥"

—చతుర్వర్గ చింతామణి.

"భిక్షుకులు ద్వారద్వారమునకరిగి యాచించుటలేదు. కృపణుల కిట్టిగతియే కల్గును. దానము చేయుడి—దానము చేయుడి." అని బోధింపుచున్నారు.

"దరిద్రాన్ భర కౌన్తేయ మాప్రయచ్ఛేశ్వరే ధనం."
ధర్మనందనా! దరిద్రుల బోషింపుము. ధనికుల వలదు.

—మహాభారతము.

## బుద్ధవర్గము.

ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యులవారు విషయాదులను, అప్రమత్తతను కామక్రోధాదులను, అజ్ఞానమును బోధింపబడిన బుద్ధులను గూర్చియు, వారికొదవు మహాదానదాతిరేకమును గూర్చియు, నాబుద్ధుల లక్షణములను గురించియు వ్రాసియున్నారు. వాటినన్నింటినిట బేర్కొనదలంచిన గ్రంథము విస్తరించిపోవును. ఇక సంక్షేపప్రయత్నమునుండి విరమించి సంక్షిప్తముగా శేషవిషయముల దెలుప నిశ్చయించితిని. మనబుద్ధాచార్యులచే నుడువబడిన బుద్ధులు, సిద్ధులు, జ్ఞానులు, సన్యాసులు, భిక్షువులు, బ్రాహ్మణులు, పండితులు, పూజితులు.

శిరోమణులు నందరు నించుమించుగా సమానములగు సద్గుణ పంక్తులచే భాసిల్లువారేయని నివేదించుకొనుచున్నాడను.

హిందూమతమందిర స్తంభస్వరూపులగు ఋష్యాదులిట్లు ఘోషింపుచున్నారు:—

"శ్లో:—కామైరహత ధీర్దాంతో మృదుశ్శుచిర కించనః
అనీహో మిత భుక్శాంతస్థిరో మచ్ఛరణో మునిః।"

"కామాతరంగములచే జలింపని స్థిరపరిజ్ఞానాన్వితుడును, నవనీతసదృశ హృదయుండును, పరిశుద్ధుడును, సంశయదూరుడును, తృష్ణావిజేతయును, సాత్వికాహార భోక్తయును, నిత్యశాంతచిత్తుడును, స్థిరచిత్తుడును, నిర్వాణమునే శాశ్వతమయిన సంపదగ భావించువాడును జ్ఞాని లేక సర్వమును త్యజియించినవాడని చెప్పబడును.

"శ్లో:—అప్రమత్తో గభీరాత్మా ధృతిమాన్ జితషడ్గుణః
అమానీమానదః కల్పో మైత్రః కారుణికఃకవిః॥"

"అప్రమత్తుడును, గంభీరమగు చిత్తముచే వెలయువాడును, ధీరుడును, జితషడ్గుణుడును, సన్మానము సేయువాడును, కల్పనాశక్తియుక్తుడును (అనగా మూర్ఖులకు బోధింప దృష్టాంతాది ప్రత్యుత్తరముల గల్పింప నేర్చినవాడు) సకల భూతముల బ్రేమించువాడును, దీనదయాళువును, సర్వజ్ఞుడగువాడును జ్ఞాని యనబడును."

బుద్ధుడు (జ్ఞాని) యెట్టివాడో భగవద్గీత యిట్లు ఘోషించు చున్నయది.

"శ్లో:—అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవం
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః॥ 1

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార మేవచ
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనం 2

అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు
నిత్యంచ సమచిత్తత్వ మిష్టాఽనిష్టోపపత్తిషు 3

మయి చాఽనన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ
వివిక్త దేశసేవిత్వ మరతిర్జనసంసది 4

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్వజ్ఞానార్థ దర్శనం
ఏతద్ జ్ఞానమితిప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా॥"

"ఆత్మస్తుతి రాహిత్యము, దంభశూన్యత, అహింసా వ్రతానుష్ఠానము క్షమా శక్తిసంపన్నత్వము, ఋజువర్తనము, ఆచార్యశుశ్రూష, బాహ్యాంతరికశుచి, సత్సంధానుకరణాశక్తి, మనోనిగ్రహము, విజయనిరసనభావ పటుత్వము, అహంకార బహిష్కారము, సంసారనిత్యత్వ చింతనము, ధనకనక వస్తువాహన వనితాపుత్రాది నశ్వరపదార్థ మమకారవిహీనత, సుఖదుఃఖములయందు సుస్థిరమగు చిత్తమునుగల్గియుండుట, నిర్వా

ణముపట్లన చంచలమగు శ్రద్ధ, నిరత్మలేకాంతవాసస్వీకృతి, సంసార జనసంగమాభిలాషాపరిత్యాగము, ఆధ్యాత్మికజ్ఞాన స్థిరత్వ విశ్వాసము, అమృతధామశాశ్వతత్వ సంకీర్తనము, యీ మొదలగు వింశతి సద్గుణములచే జెన్నొందు వ్యక్తియే జ్ఞాని లేక బుద్ధుడు.

## సుఖవర్గము.

ఈవర్గమునందు యథార్థమగు సౌఖ్యము నందగోరు వారికే యేమార్గముల ననుసరింపవలసిన యావశ్యకత కలదో వర్ణింపబడియున్నది.అందు క్లుప్తముగ నీవిషయములు కలవు:— 'ద్వేషమును ప్రేమచే జయింపుము. దుర్జనులయందు సజ్జనుడవయి యుండుము, ఆసక్తులలో నిరాసక్తుడవగుము. అహంకార మమకారత్యాగము సుఖోత్పాదకము. నిష్కామకర్మ సేయుము. విషయభోగము అగ్నిముద్దవంటిది. ద్వేషమే దుర్గుణాగారము. దేహమే దుఃఖమునకు మూలము. తృష్ణయె మహావ్యాధి. ఏకాంతవాసము, శాంతి, ఉత్సాహము మొదలగునవి సుఖమునకు మూలము. దుష్టజనసందర్శనము దుఃఖమునకు మూలము. సాధుదర్శనము లాభదాయకము. దుర్జనసాంగత్యము వలదు. సజ్జనసాంగత్యము సుఖదాయకము పుణ్యపురుషుల ననుసరింప ముక్తి గలుగును."

"To love your enemy is to conquer him"

—Paul Richard.

ద్వేషిని బ్రేమించుటయన్న వానిని జయించుటయే.

"నో చేత్ వివేకనీరౌఘః రాగాగ్నిః కేన శామ్యతి।"

—శతశ్లోకీచూడామణి

"జ్ఞానమని యెడి జలధార లేనిదే రాగాగ్ని శాంతింపదు."

"హరతికుల కలంకం లుంపతే పాపపంకం
సుకృత ముపచినోతి శ్లాఘ్యతా మాతనోతి
నమయతి సురవర్గం హన్తి దుర్గోపసర్గం
రచయతి శుచిశీలం స్వర్గమోక్షౌ సలీలం॥"

—సిందూరప్రకరణము.

'శీలమను సద్గుణము కులకళంకమును బాపును. పాపమలమును శుభ్రపఱచును దారుణసంకటముల హరించును. జగమునందు కీర్తిని విస్తరింపజేయును. స్వర్గమోక్షముల నొసంగును. కరుణారసముచే సుకృతముల నార్జించును. సురబృందవంద్య మియ్యదనిన జాలుగదా!"

శ్లో :—నజాతుకామః కామానా ముపభోగే నశామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయఏవాభి వర్ధతే॥"

—శుకుడు.

"కామము విషయభోగముచే నుపశమింపదు. దానిచే నయ్యది ఆజ్యమునందిన నగ్నివలె నభివృద్ధి జెందును."

"శ్లో:—వరం పర్వత దుర్గేషు భ్రాంతం వనచరైస్సహ।
సమూర్ఖజనసంపర్కః సురేంద్రభవనేష్వపి॥"
—భర్తృహరి.

"వనవాసులతోడ నడవిక జనులతోడ నాద్రులపై జరింపనయిన వచ్చునుగాని దేవేంద్రమందిరములందయిన మూర్ఖులతోడ నుండరాదు."

"శ్లో:—నహ్యమ్మయాని తీర్థాని, నదేవామృచ్ఛిలామయాః।
తేపునంత్యురుకాలేన, దర్శనా దేవసాధవః॥"
—శ్రీమద్భాగవతము.

"జలమయ తీర్థములు కాని, మృచ్ఛిలానిర్మిత దేవమూర్తులు కాని సత్వర ఫలప్రదాయకంబులు కావు. కాని సాధువులు మనుజుల దర్శనమాత్రంబున బరిశుద్ధులుగ జేయును."

## ప్రియవర్గము (ఆసక్తవర్గము)

"ఈవర్గమునం దీవిషయములు కలవు:—ప్రపంచపదార్థముల దేనిని గోరవలదు. సుఖదుఃఖముల సమానముగ భావించుము. ఆసక్తి దుఃఖమును నొదవజేయును. ఆసక్తివలననే శోకము, భయము, మరణము, జననమును గల్గుచుండును. మోహము లేక ఆసక్తి నశింపగల్గునది నిర్వాణమే. ఆసక్తిని జయించిన పూర్ణానందప్రాప్తి కలుగును. మనస్తుష్టిని గల్గియుండుము.

సత్యము నం దాసక్తిని గల్గియుండుము. ఆసక్తిని జయించిన ధీరునకు నిందాస్తుతులు సమానమే. సుకృతములే స్వర్గమున జ్ఞానినాహ్వానింప మూర్తీభవించును." ఇట్టివే నింక ననేకవిషయములు కలవు.

"Self control is the liberation of man from desires Their subordination to moderation."

—Leo Tolostoy.

"మానవాభిలాషాసముదాయ విమోచనమే యాత్మ వశీకరణ మనబడును. వాంఛల మితత్వముసహితము దానికే జెందును."

శ్లో :—"ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం।
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్
తద్వత్కామాయం ప్రవిశన్తి సర్వే
పశాన్తి మాప్నోతి నకామకామీ॥"

—భగవద్గీత, సాంఖ్యయోగము.

"నదీనదములన్నియు బ్రవాహసలిలముచే బూర్ణములై సాగరమున బ్రవేశింపుచున్నను నది వచ్చు జలమునంతయు గ్రహింపుచు మర్యాద నతిక్రమింపని విధంబుననే శబ్దాదుల స్వీకరింపుచున్నను జ్ఞాని వానికి వశుడుకాడు. కాని విషయసుఖములయం దాసక్తికలవా డెపుడును శాంతిని బడయజాలడు."

"పరిత్యాహార బడిశేన ఇచ్ఛామత్స్యం నియచ్ఛతే।"

ఇంద్రియసంయమ మనియెడి గాలమునకు, ఆసక్తియను మత్స్యము సులభముగా జిక్కును." ఆసక్తిమత్స్యమునిట్లు వధింపవలయును."

"శ్లో:—భూః పర్యఙ్కో, నిజభుజ లతాకన్దుకః, ఖం వితానం
దీపశ్చన్ద్రో, విరతి వనితాలబ్ధ సఙ్గప్రమోదః।
దిక్కాన్తాభిః పవన చమరై ర్వీజ్యమానః సమన్తాత్।
భిక్షుః శేతే నృపఇవ భువిత్యక్త సర్వస్పృహోఽపి"
—భర్తృహరి.

"సన్యాసి సమస్తములయిన యాసక్తులను బహిష్కరించి భూపాలునివలె శయనించియున్నాడు. పృథ్వి యతనికి సెజ్జయయినది. నిజకరములే దిండ్లయినవి. శిరోపరిభాగము నంబర వీధి విస్తీర్ణమగు చాందినివలెనున్నది. సుధాకరుడు దీపమయినాడు. అనాసక్తియే యతని కిల్లా లయినది. మారుతమను చామరము వీచుచున్నది." అనాసక్తిచే సమస్తము సౌఖ్యదాయకమె యగును.

"శ్లో:—ఉదయతి యదిభానుః పశ్చిమే దిగ్విభాగే।
ప్రచలతి యది మేరుః శీతతాం యాతి వహ్నిః।
వికసతి యదిపద్మం పర్వతాగ్రే శిలాయాం।
నభవతి పునరుక్తం భాషితం సజ్జనానాం॥"

"పశ్చిమ దిగ్విభాగంబున దివాకరు డుదయమయిన నగుగాక. మేరుపర్వతము సంచరింప గడంగిన గడంగుగాక. అగ్ని శీతలమయిన నగుగాక. భూధర శిఖరాగ్రముల బాషాణమయ ప్రదేశంబున సరోజము వికసించిన వికసించుగాక. సజ్జనులకు సత్యమునుండి మరలు బుద్ధిలేదు." అనాసక్తు లిట్టివారే.

"శ్లో:—నిన్దన్తు నీతినిపుణా యదివా స్తువన్తు।
లక్ష్మీః సమావిశతు గచ్ఛతువా యథేష్టం।
అద్యైవవా మరణ మస్తు యుగాన్తరేవా।
న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం నధీరాః॥"

—భర్తృహరి.

"నీతినెఱిగినవారు నిందాస్తవములు కల్గినను, సంపదలు వచ్చినను పోయినను, మరణమిపుడే వచ్చినను, కల్పాంతమున లభ్యమయినను, ఆసక్తినిజయించిన ధీరులగుటచే నీషణ్మాత్రమయిన యుక్తమార్గమునుండి చలింపరు."

"శరీరమాద్యంఖలు ధర్మసాధనం" —కుమారసంభవము.

"శ్లో:—ఆహారస్య పరంధామ వీర్యం తద్రక్ష్యమాత్మనః।

—చరకసంహిత.

క్షయో యస్య బహూనాం రోగా న్మరణంచ నియచ్ఛతి॥"

"ఇహపరముల సాధింప వీర్యమును రక్షింపుము. ఇది నష్టమైన వ్యాధులు కల్గి మృత్యువాతను బడవేయును."

"శ్లో:—అన్తః సన్త్యక్త సర్వాశో వీతరాగో వివాసనః
బహిః సర్వసమాచారో లోకే విహర రాఘవ॥"
—యోగవాసిష్ఠము.

"ఓ దాశరథీ! ఆశను, ఆసక్తిని, వాసనలను నీయంత రంగంబునుండి వెడలజేసి బాహ్యమునందు సంసారకార్యముల నిర్వహింపుము."

## క్రోధ వర్గము.

ఈవర్గమునం దీవిషయములు వర్ణింపబడియున్నవి. క్రోధము విషసర్పముకంటెను, ప్రచండానలముకంటెను భయావహమయినది. క్రోధాహంకార గర్వములు త్యాజ్యములు. తీక్ష్ణంబగు క్రోధావేశమును నిరోధింపగల వ్యక్తియే యుక్తుడు. క్రోధ మక్రోధంబునను, లోభము నౌదార్యంబునను నశింపజేయవలయును. ఉత్తముడు సత్యమునే నిత్య మారాధింపుచుండును. క్రోధముసయితము హింసయే పరుల పదార్థతతులయం[illegible]దాసక్తినీడి వానిని నీవే పరులకు దానముసేయ నుద్యుక్తుడవయి మనుము. త్రికరణంబున బరుల కపకారమును దలంపని ధర్మాత్ముడు నిర్వాణమును బొందును. అప్రమాదము, అధ్యయనము, సత్కార్యాచరణము మానవ విధులు. వివేకమును బడయని మానము మూకత్వమును దెల్పును. వాచాలత్వము నిష్ప్రయోజనము. ప్రపంచనిందా

స్తుతులతో మనకు బనియేమి? నిష్కళంక చరిత్రమును సద్గుణములను, ధీశక్తిని గల్గియుండువాడె సంపూజ్యుడు. దైహిక క్రోధము నెడబాయుము. మనుజున కాభూషణములు సద్గుణములె. జిహ్వాగ్రమునుండి విస్మృత్యవస్థయందయిన గటువాక్యము వెలువడజనదు. మానసికక్రోధము నయితము వర్జనీయమె. రసనేంద్రియ చిత్తదేహముల వశమొనర్చుకొనిన వాడు యతియె. రాగమును జిత్తమున బ్రవేశింపనీయరాదు. మానసిక దైహిక పాపభావముల నుటుమాయ మొనరింప దగును. ఆనందమును గల్గి వర్తించుము."

క్షాన్తశ్చేత్కవచేనకిం కిమరిభిః క్రోధోఽస్తిచేద్దేహినాం,
—భర్తృహరి.

"క్షమయేయున్న దేహసంరక్షణమునకు గవచము లక్కరలేదు. క్రోధమేయున్న నుపద్రవ మొనరింప వేఱుగ శత్రువుల యావశ్యకతయే లేదు."

"శ్లో :—ధృతిః క్షమా దమా౽స్తేయం శౌచమిన్ద్రియనిగ్రహః।
ధీర్విద్యాసత్య మక్రోధో దశకం ధర్మలక్షణం॥"
—మనుస్మృతి.

"స్థైర్యము (స్వత్కార్యము నాచరించుటయందు గల్గు కష్టనష్ట నిష్ఠూరంబులనెల్ల డీకొన నర్హమగు ధీరప్రవృత్తి లేక సుఖదుఃఖాదిద్వంద్వములు ఘనా[illegible]త్తమునందే[illegible]ంప

బేరేచు సమ్యగ్వృత్తి అథవా మృత్యువు నాహ్వానించు హార్షప్రపత్తి.) (2) క్షమ (అనగా మూాధులు కావించు సమస్త నష్టకష్టముల ననుభవించియు బునః ప్రతిక్రియ నాలోచింప కుండుట (3) సమస్తేంద్రియదమనము (4) చౌర్యాది నీచప్రవృత్తుల బహిష్కరించివేయుట (5) బాహ్యంతరికశుద్ధి (6) బుద్ధివృద్ధి (7) విద్యాసంపాదనము (8) సత్యమును గల్గియుండుట (9) అక్రోధము (10) దమము"

క్రోధరాహిత్యమే ధర్మలక్షణమని రాజర్షిమనువు సెలవిచ్చియున్నాడు.

"క్రోధము అగ్నికంటె భయంకరమయినది. లోకనాశనకరయినది. యుక్తాయుక్తబుద్ధి నీయగ్ని భస్మ మొనర్చివేయ వ్యక్తి జీవచ్ఛవంబయి నిరతము కడగండ్ల గుడుచును."

—బేకన్.

"Anger is like a full hot horse who being allowed His way, Self mettle tires Him."

—Shakespear.

"క్రోధ మొక్క స్వేచ్ఛపథవిహారమునందిన తప్తాశ్వము వంటిది. ఆత్మతేజ మద్దానినోడింపగలదు. క్రోధ మగ్నిగోళము వలె స్పృశించినవస్తువునెల్ల దహించునని భావము."

" Anger is like a ruin, which breaks itself upon what it falls." —Seneca.

"క్రోధమనున దొక్క గొప్పచేటు. దీనిపైబడిన పదార్థ మెల్ల నశించును."

కం॥ కోపము నుబ్బును గర్వము
నాపోవని యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము ననునవి
కాపురుషగుణంబులందు కౌరవనాథా॥"

—ఆంధ్రమహాభారతము.

"క్రోధమునకు నావకాశము నొసగినను మనుజుడు క్రుద్ధుడగుట నుచితము. క్రోధమునకు వశుడుకాని వ్యక్తియే విజయుడు. అతడే నియమమును బాలించినవాడు అహింసా ధర్మ నిర్వాహకుం డెపుడును నమ్రవృత్తినే యవలంబించును. క్రోధ మహింసను దూషితమొనర్చి జ్ఞానమును నశింపజేయు రాక్షసగుణము."

"క్రోధావేశ పూరితచిత్తుడయి ప్రహారమున కుద్యమించు మనుజుడు తప్పక నిజకార్యమునం దపజయమునంది పరిభ వింపబడుటయే నిక్కువము. క్రోధముచే వ్యక్తిపీడితుడయినను దాని నాశ్రయింపకయున్నచో శీఘ్రకాలమునందే పరిశుద్ధ హృదయుడయి సత్పరిణామము నవలోకింప శక్తుడగును."

—మహాత్మ గాంధి

"మనోవాక్కార్య రూపంబుల క్రోధమును బహిర్గత మొనరింపక యద్దానిమూలము నూడబెఱికివేసిన వ్యక్తి బ్రహ్మచర్యాంగముల నెల్ల పరిపూర్ణుడయి యద్వితీయానంద ధామమగు ముక్తి నందును." —దయానందసరస్వతి.

"ఎండుగడ్డివంటి ప్రపంచమునకు క్రోధము నిత్యము మండు నిప్పుముద్దవంటిది." —క్రీస్తుభగవానుడు

"క్రోధమునుగుఱించి ధర్మనందనుడు నిజసతీమణికిట్లు బోధించెను:—

"శ్లో:—క్రోధమూలో వినాశో హి ప్రజానామిహ దృశ్యతే
క్రుద్ధః పాపం నరః కుర్యాత్ క్రుద్ధో హన్యాద్ గురూనపి
క్రుద్ధః పరుషయా వాచా శ్రేయసోఽప్యవమన్యతే
వాచ్యావాచ్యౌ హి కుపితో న ప్రజానాతి కర్హిచిత్
నాకార్యమస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే తథా
హింస్యాత్ క్రోధాదవధ్యాంస్తు వధ్యాన్ సంపూజయేచ్చ
ఆత్మానమపి చ క్రుద్ధః ప్రేరయే ద్యమసాదనం
క్రుద్ధో హి కార్యం సుశ్రోణి న యథావత్ ప్రపశ్యతి"
—మహాభారతము.

"ప్రజావిధ్వంసమునకు క్రోధమే మూలహేతువు. క్రోధ కారణంబుననే మనుజులు పాపకార్యాచరణోన్ముఖులగుదురు.

కుద్ధుడాత్మీయాచార్యుని వధించుటకయిన భయము నెందడు. కటువచనములచే సాధుపురుషుల మానభంగము సేయుచుండును. కుపితునకు యుక్తాయుక్త వివేచనము సుంతయు నుండదు. క్రోధాంధుడు సేయని దుష్కార్యముగాని, వచింపని కటువాక్యముగాని యుండదు. క్రోధముచే నరుడు దైత్యుడయి యారాధ్యులవధ కియ్యకొనును. వధార్హుల బూజింపగడంగును. క్రోధోన్మత్తుడు స్వహితమునయిన గుర్తెఱుంగక మృత్యుగేహమార్గమున సంచరించును. క్రోధపూరిత చిత్తుడు కర్తవ్యాకర్తవ్యములను దత్ఫలంబులను గ్రహింపజాలడు. కోపి మంచికార్యములనయిన దెలియలేడు. స్వాగౌరవమును సంరక్షించుకొను విధానమును క్రోధాంధు డెఱుంగజాలడు."

"గీ॥ కోపమునను ఘనత కొంచెమై పోవును
గోపమునను మిగుల గోడుచెందుఁ
గోపమడచెనేని గోరికలీడేరు
విశ్వదాభిరామ వినురవేమ."

"శ్లో॥-రోహతే సాయకైర్విద్ధం వనం పరశునాహతం।
వాచాదురుక్తయావిద్ధం నసంరోహతి వాక్షతం॥ (1)
తేజస్వీతి యమాహుర్వై పండితా దీర్ఘదర్శినః।
నక్రోధోఽభ్యన్తరస్తస్య భవతీతి వినిశ్చితం॥ (2)

—మహాభారతము.

" (1) తీక్ష్ణశరాఘాతంబున నేమి, కుఠారాఘాతంబున నేమి పాదపము తిరిగి కిసలయంబుల బొందవును. కాని కటు వాక్య బాణక్షతమయిన హృత్కమలము మాత్రము తిరిగి శాంతినందజాలదు. (2) దూరదృష్టిగల పండితులచే పేర్కొన బడిన యట్టి తేజస్సంపన్నుల హృదయములందు క్రోధలేశము నకు దావు లేదు."

క్రోధమును గూర్చి వచింపబడిన సిద్ధాంతవాక్యములు లక్షోపలక్షలింకనుగలవు.

" సత్యదూరమగునది సర్వము నీరసమె. సత్యమే లోక కల్యాణకరమయిన సత్సాధనము. ఒక వేళ నసత్యముచే నశ్వరం బగు లాభము ప్రాప్తమయినను సత్యమును వీడరాదు"

"హిందూమతము యొక్క యాంతరిక పరిశుద్ధస్వరూపము సత్యము, అహింసయె."

"నేను సత్యాన్వేషణమును, సదాచరణమును, సత్యసంకీర్తనమును సలుపుచు మృత్యుదేవ్యాలింగనము నంద నభిలషింపుచున్నాడను. ఇదియే నావాంఛ."

"సత్యము, సేవాధర్మము యివి రెండును నిత్యపరిశంసార్హములు" ——మహాత్మా గాంధి.

"క్రోధము క్రోధముచే నుపశమింపదు. అది ప్రచండాగ్నివంటిది. దానిని జల్లార్ప శ్రేమసలిలధారయే యుక్తమయినది."
—రామమోహనరాయి.

" Do not tell lies. Do not cheat. Live in peace. Forgive one another. Bless but do not curse. Be not proud. Do not covet. Do not waste time. Time is money. —Sentences of Christ (Westners readers for boys.)

"అసత్యమాడవలదు. పరుల మోసగింపకుము. శాంతితో జీవించుము. ఒండొరుల క్షమించుకొనుడు. గర్వమును గల్గియుండకుము. దురాశనుగల్గి యుండకుము. కాలమును దుర్వినియోగపఱచకుము. సమయమే సంపద."
—క్రైస్తవబాలుర పాఠపుస్తకమునుండి.

'నాస్తిసత్యాత్ పరోధర్మః, నాస్తిసత్యేభయంక్వచిత్ సత్యంవద'
—ప్రాచీన ఋషివాక్యములు.

శ్లో:—పరిత్యజేయం త్రైలోక్యం రాజ్యం దేవేషువాపునః।
యద్వాప్యధిక మేతాభ్యాం నతు సత్యం కథంచన॥"
—భీష్మపితామహుడు.

"నేను త్రైలోక్యసంపదను బహిష్కరించి వేయుదును. దేవతల స్వర్గమును దృణప్రాయముగ విసర్జించివైతును. వీనిని మించిన మహత్పదార్థమెద్దియేని యున్న నదియు త్యజించుటకు సంసిద్ధుడను. కాని నేను సత్యమును వీడజాలను."

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ నబ్రూయాత్ సత్యమప్రియం"

"స్మృతులిట్లు ఘోషించుచున్నవి:— హితకరమగు సత్యమును వచింపుము. అహితకరము లేక యహింసాత్మక మగు సత్యమును భాషింపజనదు. (సత్యాసత్య విమర్శనమును గూర్చి లోకమాన్య బాలగంగాధరుని గీతారహస్యమందు వివరముగ గలదు)

"సత్యశ్రీమాభ్యాం సకలార్థసిద్ధిః, నభవతి పునరుక్తం భాషితం సజ్జనానాం।"

"సత్యము నాశ్రయించువారి సర్వార్థములు సిద్ధించును. సజ్జనులు సత్యమునుండి విముఖులుకారు."

శ్లో:- "పైశూన్యం సాహసం ద్రోహ ఈర్ష్యానూయార్థదూషణం।
వాగ్దండభంచ పారుష్యం క్రోధజోపి గణోష్టకః॥"

—భాగవతము.

" (1) నిందించుట (2) దుస్సాహసము (3) దోషము లెన్నుట (4) ఈర్ష్య (5) దూషించుట (6) అపకారము సేయుట (7) కటువచనములు. (8) వాక్పారుష్యము— యీయెనిమిది క్రోధలక్షణములు కాన త్యాజ్యములు."

"మ॥ పరహింసా పరకీయవిత్తహరణాభావంబు సత్యవ్రతా
దరమున్ దానపరత్వ మన్యవనితోదంతోక్తి మూకత్వమున్

బరతృష్ణార్ఘురభంజనంబు గురునమ్రత్వంబునుం బాత్రిణభృ
త్తరుణాశాస్త్ర సమత్వసద్విధులుభద్రప్రాప్తికిన్ మార్గముల్."

—భర్తృహరి.

"జీవకారుణ్యము, నిర్లోభత్వము, సత్యభాషణము, యుక్త సత్పాత్రిదానము, స్త్రీవిషయక ప్రసంగముల మానము తృష్ణా బహిష్కారము, పెద్దలయందు భక్తిమొదలగు సద్గుణములు గల్గియున్న శ్రేయంబు కలుగును."

మ ల వ ర్గ ము (అవిద్యావర్గము)

మలము, కల్మషము యీశబ్దములు రెండును ధమ్మపదమునం దవిద్యావాచకములుగ బ్రయోగింపబడినవి. ఈవర్గమునం దీవిషయము లుపదేశింపబడియున్నవి :— "నరుడా! మృత్యుముఖమున బడనున్న నీవింక జ్ఞానము (విద్య) నార్జించి యుండలేదేమి ? దుర్గుణములనెల్ల రూపు మాపివేయుము. పరిశుద్ధవర్తనమున సంచరింపుము. మోక్షసామ్రాజ్యము త్వదర్థము సిద్ధముకాగలదు. మహాప్రయాణమునకు నుద్యుక్తుడవయి యున్న నీవింక మార్గసౌకర్యోపకరణముల గూర్చుకొని యుండలేదేమి ? అవిద్యను రూపుమాప బునర్జన్మ నశించును. మానవ ప్రయత్నము లేనిదే యీశ్వరకృపయు, సిద్ధియు గలుగ నేరవు. నిరంతరము ధీమంతుడును, గర్మయోగియు నగు వ్యక్తిని [illegible] విద్యోపార్జనచే మాలిన్యమును దొలగజేయు

చుండును. సత్పథమునుండి విముఖుడగువాడు విధ్వంసమ గును. అభ్యాసరాహిత్యము, ప్రమాదము మనుజునకు గళంక మాపాదించును. సాధ్వీలోకమునకు బరపురుష గమ నము కళంకము నాపాదించును. దాతకు లుబ్ధత్వము కళంకమొ దవించును. అవిద్యామార్గము భయలోకముల జెఱచును. అన్నింటికంటె మహాపాపదాయక మవిద్యయె. నీచుల జీవిత యాత్రి బహుదుర్ఘటము. ఉత్తముల జీవితయాత్రి మహదా నందదాయకము. సప్తవ్యసనలోలురు స్వప్రాణహంతకు లగు దురు విషయదాసుని జీవితము కడు నింద్యమయి భయవిషా దముల కాలవాలమగును. పరౌన్నత్యమును గాంచి యీర్ష్యా ళురగు మనుజులు యసహనీయంబగు పరితాపాగ్నిం మ్రగ్గు చుందురు. మచ్చరమును నిర్మూలించినవాని చిత్త మపూ ర్వంబగు శాంతినంది సుఖించును. వ్యసనము లేనివాడు సుఖిం చును. విషయవికారమునుబోలు యగ్నియు ద్వేషమునుబోలు పిశాచమును, తృష్ణకీడగు ప్రవాహంబును, అవిద్యకు సాటి వచ్చు బంధనమును లేదు. అజ్ఞాని పరులదోషముల లెక్కింప నేర్చునుగాని తనయందున్న గురుతరములగు దోషపుంజముల గ్రహింపజాలరు. పరుల తప్పుల నెన్నువానిని స్పృశింపనయిన దగదు. బాహ్యవేషములచే నేమనుజుండును శ్రీమణుడు కాజాలడు సంసారవ్యాపార దూరుడగువాడే బుద్ధుడు. అతఁడాకల్పస్థాయిగా వెలుంగ సమర్థుడు."

శ్లో :-విద్యానామ నరస్య రూపమతులం ప్రచ్ఛన్న గుప్తంధనం
విద్యాభోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః,
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరాదేవతా
విద్యా రాజసు పూజ్యతే నహిధనం విద్యావిహీనఃపశుః"

—భర్తృహరి·

తెనుగు :—

ఉ॥ విద్యనిగూఢగుప్తమగు • విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి • విద్య గురుండు విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము • విద్యకు సాటి ధనంబులే దిలన్
విద్య నృపాలపూజితము•విద్యనెఱుంగనివాఁడుమర్త్యుఁడే."

"Ignorance is the curse of god."

—Shakespeare.

" అవిద్యయే యీశ్వరుని తీవ్రమగు శాపము."

—ఆంగ్లకవికుల కమలభాస్కరుడు.

"The goal is to manifest this divine within, by controlling nature, external and internal."

—Swami Vivekananda·

"బాహ్యాభ్యంతరిక దుర్గుణములనెల్ల రూపుమాపివేసి హృదయాంతరాళమున వెల్గుచు పరతత్త్వమును వెలువఱుచుటయే మానవుడు పాటింపవలసిన నిర్వాణము."

—వివేకానందస్వామి.

శ్లో॥ అజానన్దాహాత్మ్యం పతతు శలభో దీపదహనే
సమీనోఽప్యజ్ఞానాద్బడిశయుత మశ్నాతు పిశితం,
విజానన్తోఽప్యేతే వయ మిహ విపజ్జాలజటిలా
న్నముఞ్చామః కామా నహహ గహనో మోహమహిమా॥
—భర్తృహరి.

చ॥ తెలియక నాశహేతువగు • తీవ్రతరానల కీలలోపలన్
శలభముచొచ్చుఁగాక మతి•చాలక మీనముగాలపుంగొనం
గలపిశితంబు తామెసగు•గాక, యెఱింగియు మేము దుఃఖదో
హాలవనితాసుఖంబువిడ•నాడము మోహమహత్త్వమెట్టిదో॥

ఉపర్యుక్తశ్లోకమునందు భర్తృహరి అజ్ఞాన మహిమో
ద్ఘాటన మొనర్చియున్నాడు.

శ్రీ బుద్ధాచార్యుల విద్యను రూపుమాపి సద్వర్తన
మును గల్గియుండుమనియు నంత ముక్తి లభించుట సుకరమే
యనియు బోధించియున్నాడు :—

"Men of Character are the conscience of the society to which they belong."

—Emerson

"సద్వర్తనా సంశోభితులగువారు తమ సంఘమునకు
హృదయమువంటివారు."

ఒక హర్యాణభాషాపండితు డిట్లు వచించెను :—

"Loss of wealth nothing lost
Loss of Health something lost
When the character is lost
Everything is lost."

"ధనముపోయిన మరల సంపాదింపవచ్చును. స్వాస్థ్య ము నశించిన నీషన్నష్టము కల్గును. కాని నడవడి చెడిన సర్వనాశన మయిపోయినదని యెఱుంగుడి."

"శ్లో :—అవిద్యాకామకర్మాది పాశబంధం విమోచితుం।
కశ్శక్నుయా ద్వినాత్మానం కల్పకోటిశతైరపి॥"

"అవిద్య, కామము, తాఁజేసిన దుష్కర్మము మొదలగు బంధనములను మనుజుడు తానే నశింపజేసికొనవలయును. గాని పరుల సాహాయ్యంబున నశింపవు."

శ్లో :—"కామం క్రోధం లోభం మోహం,
త్యక్త్వాఽఽత్మానం పశ్యతి సోఽహం।
ఆత్మజ్ఞానవిహీనా మూఢా,
స్తే పచ్యన్తే నరకనిగూఢాః॥

—భారతీవంశులు.

"చిత్తమునందు నెలకొనియున్న లోభమోహ మద మత్సర కామముల నఃజ్జగించి అజ్ఞానదూరమగు నాత్మను జూడని విద్యావిహీనుడు నరకగామి యగును."

శ్లో॥హర్తుర్యాతి నగోచరం కిమపి శం పుష్ణాతి యత్సర్వదా౽
ప్యర్థిభ్యః ప్రతిపాద్యమాన మనిశం ప్రాప్నోతి వృద్ధింపరాం
కల్పాన్తేష్వపి నప్రయాతి నిధనం విద్యాఖ్యమన్తర్ధనం
యేషాం తాన్ప్రతిమాన ముజ్ఝత నృపాః కస్తైస్సహ స్పర్ధతే.

—భర్తృహరి.

ఉ॥ హర్తకుఁగాదు గోచరము హర్నిశము౯ సుఖపుష్టి సేయు స
త్కీర్తి ఘటించువిద్య యను దివ్యధనం బఖిలార్థకోటికిం
బూర్తిగనిచ్చినం బెరుఁగుఁ బోదు యుగాంతపు వేళనైన భూ
భర్తలు దద్ధనాధికుల పట్టున గర్వము మానుటొప్పగు౯."

విద్యయనగా శబ్దములతో నిండియున్న భాషయే కాదు. భాష కేవలము విద్యనుబడయ నొక్కసాధనమాత్రమె. విద్యాతత్వ నిరూపనము రెండుపంక్తులలో మహాత్ముడిట్లు గావించియున్నాడు:—

"ముక్తికి హేతుభూతమయినదియే విద్య. ముక్తి ద్వి విధములు. బాహ్యముక్తి, ఆంతరికముక్తి, బాహ్యసామ్రాజ్యముక్తి, ఆత్మసామ్రాజ్యముక్తి. ప్రథమంబగుముక్తి యల్ప కాలపర్యంత ముండునది. ద్వితీయము శాశ్వతమయినది. ముక్తి నొసగజాలనివిద్య త్యాజ్యము. కారణమేమన నట్టివిద్య యవిద్య లేక దైత్యవిద్య. అదియధర్మసంగతమయినది."

—గాంధి మహాత్ముడు.

శ్లో॥ సర్వమేవేహహి సదా సంసారే రఘునందన
సమ్యక్ప్రియత్నాత్సర్వేణ పౌరుషా త్సమవాప్యతే॥"
—యోగవాసిష్ఠము.

"ఓరఘునందనా! ఈవిశ్వమందు సకలఫలములు పూర్ణ ప్రియత్నంబునను, పురుషార్థమువలనను లభ్యమగుచున్నయవి. ఇం దీషత్తైనను సందేహములేదు.

శ్లో॥ఉద్యోగినః కరాలంబం కరోతి కమలాలయా
అనుద్యోగి కరాలంబం కమలాగ్రిజా॥"

"అప్రిమత్తతనుబాసి యుద్యోగియగువానిని సంపదలు వరింప, నిర్వ్యాపారిని దారిద్ర్యము (సకలసంపదాభావము, సంపద యనగా విత్తమేకాదు. సత్సుఖమునకు బనికివచ్చు యెల్లసాధనములును) వరించును."

గీ॥ నియతతపమును నింద్రియనిగ్రహంబు
భూరివిద్యయు శాంతికిఁ గారణములు
వానియన్నింటికంటె మేలైనశాంతి
కారణము లోభముడుగుట కౌరవేంద్ర!"

కం "పరులధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులులేని వేదనంబడు నధిపా!"


—ఆంధ్రిమహాభారతము.

శ్రీబుద్ధాచార్యుడు వర్జింపవలసినదిగా నుడివిన జారత్వము, మద్యము, పరుషవాక్యము మొదలగు దుర్గుణములు మన మహాభారతమున నుడువబడిన సప్తవ్యసనముల బోలుచున్నవి.

గీ॥ వెలది జూదంబు పానంబు • వేట పలుకు
పరుసదనంబును దండంబుఁ • బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ • వమ్ముసేత
యనెడు సప్తవ్యసనములఁ • జనదుతగుల."

—ఆంధ్రమహాభారతము.

"బాహ్యవేషములచే శ్రమణుడు కాజాలడను బుద్ధాభిప్రాయమునకు—

శ్లో॥—:సన్యాసం నిర్మలం జ్ఞానం, నతుకాషాయముండనం
నివర్తరాగస్య గృహం తపోవనం."

"సన్యాసమునకు లక్షణము నిర్మలమయిన జ్ఞానముకాని కాషాయ శిరోముండనాదులుకావు."

"చెప్పెదనొకమాట • చెవియొగ్గి వినుము
తప్పుఁగాచినమీఁదఁ • దగదెగ్గులెన్న."

—వీరేశలింగము.

గీ॥ తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్వి జనులకెల్ల నుండుఁ దప్పు

దప్పులెన్ను వారు తమతప్పులెఱుఁగరు
విశ్వదాభిరామ వినురవేమ!"

పరులదోషముల నెన్నుటే వృత్తిగాఁగొన్న సజ్జనుల బుద్ధులు స్పృశింపరాదనియె.

కం॥ ఎప్పుడు తప్పులు వెదకెడు
నప్పురుషునిఁ గొల్వఁగూడ దది యెట్లన్నన్
సర్పంబు పడగనీడను
గప్పవసించినవిధంబు గదరా సుమతీ."

సంసారవ్యాపారముల బాసినవాడే బుద్ధుడయి వెలుంగునన్న బుద్ధవచనమునకు—

గీ॥ అనఘ శబ్దాది విషయంబులందుఁ దగిలి
యిచ్చఁ జరియించు నెప్పుడు నింద్రియములు
బుధుడు దత్స్వభావముఁ దనబుద్ధి నెఱిఁగి
యేమఱిక వానిదగఁ గుదియింపవలయు.

## ధర్మశీలవర్గము. (న్యాయవర్గము)

ఈవర్గమునందు శ్రీబుద్ధభగవానుడు—" విచారించకయే కర్తవ్యాకర్తవ్యముల నిర్ణయింపరాదు. ధార్ష్ట్యముచే మనుజుల దన్ననుసరింపజేయక, ధర్మముచే చేయువాడు ధర్మాత్ముడు. అధికప్రసంగి పండితుడుకాడు. పరుల దిరస్కరింపక

పాపభీతిని గల్గియుండువాడే పండితుడు. వాచాలతను వెల్ల డించువ్యక్తి పండితస్థానమున కనర్హుడు. ధర్మశాస్త్రాధ్యయన మందు నిపుణుడు గాకపోయినను ధర్మానుకూలవర్తనా సంశోభితుడును, ధర్మాపేక్షాపరుడును నగువాడే యోగ్యుడు. వయోవృద్ధుడు, పెద్దవాడనదగడు. సత్యధర్మము, సద్గుణములు, ప్రేమము, సంయమము నియమపాలనము మొదలగు గుణముల నధికప్రాయము గడచినవాడే వృద్ధుడు. అనగా జ్ఞానవృద్ధుడే వృద్ధుడు, లేక పెద్దవాడు. ఈర్ష్యాంధుడును, కృపణుడును, ఆదర్శదూరుడు (అప్రామాణికుడు)ను నగు వ్యక్తి యెట్టిరసమయ వాక్ప్రసంగచాతురీ విలసితుండయినను చిత్తాకర్షక రూపవంతుడయినను శ్రేష్ఠుడు కాజాలడు. ఉపర్యుక్త దుర్గుణదూరుడును, సమస్తకల్మష హంతకుడును నగు వ్యక్తి సర్వమాన్యుడు. తృష్ణాలోభపాశముల బద్ధుడయి, నియమపాలనమును జేయక బాహ్యవేషముల నవలంబించినంత మాత్రమున మనుజుడు సన్యాసికాజాలడు. అల్పాధికంబులగు సమస్తకిల్బిష నిచయముల శమింపజేసినవాడే శ్రమణుడు. పరులద్వారములకేగి యాచించినంత మాత్రంబుననే వ్యక్తి భిక్షువు కాజాలడు. ధర్మజ్ఞాన సంపన్నుడయి యుండవలయును పుణ్యపాపముల నిర్లిప్తుడయి బ్రహ్మచర్యపాలనమున సమర్థుడయి యిహలోకమున జ్ఞానపూర్వకంబగు దివ్యజీవితమును వ్యతీతముసేయు నతడే భిక్షువయి యుభయలోకముల శ్లాఘ

మును జెందును. మూర్ఖుడును, అజ్ఞానియు మానవప్రీతముదరిచే మని కాజాలరు. సత్తునుగ్రహించి, అసత్తునుబాయు జ్ఞానియే ముని. సదసద్వివేకియగువా డుభయలోకముల నుత్తమస్థానమును బడయసమర్థుండగును జీవుల బీడింపక సకలజీవరాసులయందు సకృత్రిమంబును, అవ్యాజంబును నగు ప్రేమగలయతడే యార్యుడు. వాసనాక్షయముకానిదే జ్ఞానసత్త్వలకు బ్రాప్తించు దివ్యశాంతి, సౌఖ్యము మనుజున కిలాతలంబున బాహ్యానుష్ఠానాడంబర పటాటోపముల లభ్యమగు టసంభవము" అను నీవిషయముల నుపదేశించియున్నాడు.

"కర్తవ్యముముందు సకలలోకసంపదలు శిరము వంచును. కర్తవ్యమను బహుమూల్యరత్నమును స్థిరబుద్ధితో దూరదృష్టితో దీర్ఘకాలము విచారించి గుర్తెఱుంగదగును. అస్థిరహృదయుడు త్వరపడి యకర్త్యవమునే విధిగా నెఱింగి పతితుడగును." —ఈశ్వరచంద్ర విద్యాసాగరు.

"ఆతురపడువా డంతమునకు దుఃఖించువాడే."

—క్రీస్తుభగవానుడు.

ఒకానొక హూణభాషాపండితు డిట్లు నుడివియున్నాడు:—

"See first that the design is wise and just,
That ascertained, pursue it resolutely.
do not for one repulse forego the purpose,
That you resolved to effect."

తాత్పర్యము :—"ఒక కార్యము నాచరింపబూనుటకు బూర్వ మాకార్యము హితకరమగునదా లేక యహితప్రద మయినదాయని విచారింపదగును. తత్కార్యము విచారణానం తరము న్యాయసంగతమని రూఢియగుచో తత్క్షణమే భల్లూ కపు పట్టుదలతో నా కార్యమును సాధింపుము. ఇదియె కర్త్య విధి."

"జ్ఞానమును బేర్మించువాడు తనతండ్రిని సంతోషపట చును. ధర్మశాస్త్రము ననుసరించువాడు ధన్యుడు. నిత్యము భయముగలిగి వర్తించువాడు ధన్యుడు. ధర్మమును బాసి చరిం చువారెన్ని సంపదలుగల్గియున్నను బాగుపడనివారు. న్యాయ మును, ధర్మమును గాపాడుకొనువారు యోహెూవాప్రియ పుత్రులు."
—బైబిలు సామెతలు.

"శ్లో:-గుణవ దగుణవ ద్వా కుర్వతా కార్య మాదౌ
పరిణతి రవధార్యా యత్నతః పండితేన,
అతిరభసకృతానాం కర్మణా మావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః."
భ-నీతిశతకము.

"తే॥ సగుణనిర్గుణకార్యముల్ సలుపు సుమతి
చేతఁ బరిణతి గడుఁ బరీక్షింపఁదగును
బరుషకర్మవిపాకంబు ఫలముదనుక
హృదయము దహించు శల్యంబురీతి జగతి."

"క్రైస్తవ మతబోధకుల యొక్కయు, పరిచారకుల యొక్కయు కార్యవిధానము నాకు రుచించుట లేదు. జనుల దమ్మ మనుసరింపజేసికొన వాంఛయున్న బలాత్కారముగా గాని స్వార్థమును జూపికాని, లంచము లొసంగికాని కర్తవ్యమును నిర్వహించుకొనరాదు. ధర్మ విశేషమందున్న గొప్పతనమును జూచి ప్రజలే వత్తురు." —సి. యఫ్. ఆండూ్రసు.

"వాచాలుండును, నానావిధప్రసంగనిపుణుడును బండితుడు కాజాలడు. పదిశ్లోకముల నేర్చినవాడును పండితుడనబడడు. వృక్షంబుమాడ్కి పరోపకారియు, మేఘంబుమాడ్కి త్యాగియు, పృథ్వివలె సహనశీలుండును, నిశాకాలంబుపగిది శాంతచిత్తుండును తృణంబుభాతి నమ్రుడును నయియుండు వాడే పండితుడు, జ్ఞాని, ధర్మాత్ముడు." —గాంధిమహాత్ముడు.

శ్రీశంకరాచార్యులవారి శిష్యుడు ముక్తినిజెంద యోగ్యుడగు శ్రమణు నిట్లుస్తుతించె:—

"శ్లో॥ సురమన్దిర తరుమూలనివాస,
శ్శయ్యా భూతల మజినంవాసః
సర్వపరిగ్రహ భోగత్యాగః,
కస్య సుఖం కరోతి విరాగః॥" —నిత్యానందుడు.

తెనుగు :—

ఉ॥ అజినముబట్టయై, పడకరైయి భువిగుళ్లును వృక్షమూలముల్
నిజసదనంబులై, స్వతరుణీసుఖభోగము త్యక్తధర్మమై

త్రిజగదనుత్తమంబయి నుతింగనునట్టి విరాగమిచ్చు నెట్టి
జనునకేని మోక్షమని డెందమునన్ హరిఁగొల్వుమూధుడా!

శ్లో॥ అబ్ధివ ధృతమర్యాదా భవన్తి విగతాశయాః।
నియతిం నవిముఞ్చంతి మహాంతో భాస్కరా ఇవ॥"
—వసిష్ఠునిని ర్వాణప్రకరణము.

"మహాత్ములును, విగతాశయులును నగువారు సాగరంబువాడ్కి మర్యాద నతిక్రమింపక, భాస్కరునివగిది క్రమ మార్గబద్ధులయి యుందురు."

"ఎల్లజీవరాసుల సృష్టిస్థితిలయంబులకు నా భూరివిభూతియే హేతువని యెఱింగి "అనుకంప"ను గల్గియుండువారే పండితులు, పూజ్యులు" అని భగవద్గీతయందు శ్రీకృష్ణుడు సవ్యసాచికి బోధించినట్టు లెన్నియో శ్లోకములుకలవు.

"శ్లో॥ ప్రాప్నువన్తి యతః స్వర్గ, మోక్షౌ ధర్మపరాయణే।
మానవా మునిభి ర్జ్ఞానం, సధర్మ ఇతి కథ్యతే॥ 1

సత్వవృద్ధికరో యోఽత్ర, పురుషార్థోఽస్తి కేవలః।
ధర్మశీలే తమే వాహుః, ధర్మం కేచిన్మహర్షయః॥ 2

యా బిభర్తి జగత్సర్వ, మీశ్వరేచ్ఛా హ్యలౌకికీ।
సైవ ధర్మోహి సుభగే, నేహ కశ్చన సంశయః॥" 3
—రాజశిక్షాస్వోపానము.

"స్వర్గ మోక్షప్రదాయకంబగు కర్మయే ధర్మము. సత్వగుణ ప్రవర్ధకంబగు పురుషార్థమే ధర్మము. ఈజగత్తుసం తయు ధరించుగుణమే ధర్మమని కొందరు."

ఈబుద్ధాభిప్రాయమును ప్రథమశ్లోకద్వయ మను సరింపుచునే యున్నది. మూర్ఖుడు మౌనముద్రను వహించి నంత మాత్రంబుననే మునికాడనియె బుద్ధుడు. భర్తృహరి మూఢుని మౌన మతని మౌఢ్యమును గుప్తముగా నుంచు కొనుట కొకసాధన మనియె."

"శ్లో॥ స్వాయత్తమేకాన్తహితం విధాత్రా
వినిర్మితం ఛాదన మజ్ఞతాయాః,
విశేషతః సర్వవిదాం సమాజే
విభూషణం మౌన మపండితానాం."

తే॥ "స్వవశము హితంబు మూఢతా • చ్ఛాదనంబు
గాఁగ నీగతి నిర్మించెఁ • గమలభవుఁడు
సర్వవిదులగు సుజనుల • సభలలోన
మౌనమె విభూషణము మూఢ • మానవులకు."

—భర్తృహరి.

ఉ॥ ధర్మమపల్కుచుం దగిలి • ధర్మపథంబునఁ జేసి యర్థముం
బేర్మియుఁ గాంచి ధర్మవిధిఁ • బెండిలియై ప్రజలఁ సృజించి స

ఛ్ఛాత్రమ్రములంబ్రశస్తములుగాఁ *గ్రతువుల్ బొనరించుసజ్జనుల్
ధర్మజ యిందునందును ముదంబునఁగాంతురభీష్టసౌఖ్యముల్

—ఆంధ్రమహాభారతము

* క్రతువు, యజ్ఞము — దీనికి బండిత వాస్వాని త్యా
మనునర్థమును నిర్ణయించియున్నాడు మహాత్మ గాంధి గృహ
ప్రపంచమునకు వలయు రోకలి, పొయ్యి, తిరుగలి, కుండ
రాట్నము వీనినిసహితముపంచయజ్ఞములని వచించియున్నాడు
గాంధిగారే యజ్ఞమునకు బ్రధానార్థము ఆత్మాభ్యుదయ ప్రతి
పాదకంబగు సమర్పణమనిరి. భగవద్గీత యింద్రియాది ప్ర
త్తులను, వానిభోగ్యపదార్థములను జ్ఞానాగ్ని కర్పణము
సేయుటనే యజ్ఞమని వచించెను. బంకిముచంద్ర ఛటర్జీమహా
శయుడును, కేశవచంద్రసేనుడు మొదలయినవారు గో
ధము (ఇంద్రియదమనము) గోయజ్ఞమువలెనే యజ్ఞము
జిత్తవశీకరణ కార్యమని యర్థమును జెప్పియున్నారు. శ్రీబుద్ధా
చార్యుని యభిప్రాయమును వీరెల్లరు ననుసరింపుచునే
యున్నారు.

* * *

## ధర్మమార్గవర్గము.

ఇందు శ్రీబుద్ధాచార్యులవారు:—"అష్టాంగ మార్గము
లుత్తమములు. ఆర్యసత్య చతుష్టయముత్తమము:—(1) దుఃఖ
ము (2) దుఃఖసమాలము (3) దుఃఖలయము (4) దుఃఖోపశమ

సమున కర్తవ్యములగు నష్టాంగమార్గములు. వీని వివరము:—
(1) సమ్యగ్దృష్టి (2) సమ్యక్సంకల్పము (3) సమ్యగ్వాక్కు (4)
సమ్యక్కార్యము (5) సమ్యగ్జీవనము (6) సమ్యగ్వ్యాయా
మము (7) సమ్యక్స్మృతి (8) సమ్యక్సమాధి. చిత్తమును బరి
శుద్ధమొనరింప నివియే యుత్తమమార్గములు. ఏతత్ప్రభేతర
మార్గములన్నియు మారుని పాశములె. మానవుడు స్వయము
గా బ్రయత్న మొనరింపవలయును. బుద్ధు డుపదేశకుడు మా
త్రిమె. నరు డాత్మీయభాగమునకు దానే కర్త. నిర్మితములగు
సమస్తపదార్థములు నశించునవె. సర్వము సంసారముతో సహా
నశించునదే యను తత్త్వమును భజించువ్యక్తి శుద్ధుడు కా
గలడు. సంసారము దుఃఖమయమను రహస్యమును గుర్తెఱుం
గుటయే చిత్తశుద్ధికి సులభోపాయము. ఆకృతిబద్ధమగు సర్వ
ము మిథ్య. ఇట్లు తెలుపుమార్గమే యుత్తమము. సకాలము
నకు నిద్రినుండి విముక్తిని బడయనట్టియు, తరుణప్రాయము
నందుండియు, చురుకుదనమును గల్గియుండనట్టియు, అల్ప
భావములచే జెన్నొందునట్టియు నధముడు జ్ఞానమార్గచ్యుతు
డగును. మనోవాక్కర్మల దుష్కార్యము నేయక యుండువా
నికి మునిజనోపదేశితమార్గము లభ్యమగును. నిత్యాభ్యాసము
జ్ఞానాభివృద్ధికి మూలము. సాధనాభావము జ్ఞానమును క్షీణింప
జేయును. తృష్ణను సమూలముగ ధ్వంస మొనరింపవలయును.
స్త్రీలయం దాసక్తి యుండరాదు. స్త్రీలు మోహదృష్టితో

జూడబడినపుడు నరకమునకు దారితీయువారగుదురు. వ్యామోహ మున్నంతపర్యంతము సత్యపథము గోచరించదు వ్యామోహమనుదానిని మూలసహితముగ నశింపజేయును నిర్వాణపథము దృష్టిగోచరమగును. భవిష్యత్తునుగూర్చి మూఢుడు విచారించును. ఎప్పటికర్తవ్యము నపుడే నిర్వహించును కామినీకాంచనపుత్రమిత్రగేహారామక్షేత్రాది సంపదనుర మగు చిత్తమును గల్గియున్న మూర్ఖుడు దుఃఖవారిధిం కొట్టుకొనిపోవును. మృత్యుముఖంబున బడనున్నవారి నా యులెవరు నుద్ధరింపరు. ప్రాణము పోయినతరువాత స్పృశించువారయిన నుండరు. నశ్వరసంసార మాయాతత్త్వ నెఱుంగుజ్ఞాని వ్యామోహబంధనముల నెల్ల ఖండించి నిర్వా మును బడయును.'' అను విషయములు బోధజేసియున్నా

మహాభారతమున యక్షుడు ధర్మనందనుని నిట్లు ప్రశ్ని చెను:—

''కః పన్థాః ?''

యుధిష్ఠిరుని ప్రత్యుత్తరము:—

శ్లో:—''శ్రుతిర్విభిన్నా స్మృతయోఽపిభిన్నా,
నైకో మునిర్యస్య వచః ప్రమాణం
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం,
*మహాజనో యేనగతః స పన్థాః॥''

—మహాభారతము

*"మహాజనో యేనగతః సపన్థాః." ఈచరణమునకు కలకత్తా హైకోర్టు జడ్జిగారును, కీర్తిశేషులును నైట్, యం. ఏ., పీ. హెచ్.డీ., డీ., యల్., కే. సీ. ఐ. యీ. బిరుదాంకితులును నగు సర్ గురుదాస బెనర్జీగారు యిట్లన్వయముచేసి యున్నారు:—"మహాజనులు లేక అధికజనులు— జనసామాన్యము వెళ్లుమార్గమే యుత్తమమార్గము." నాయల్పబుద్ధి కీరీతి స్ఫురింపుచున్నయది. శ్రీవారి యభిప్రాయము మెజారిటీ, మైనారిటీలవైపునకే బరుగెత్తినది. ధర్మకర్మ నిర్ణయమునకు ప్రాపంచికుల యధికసంఖ్యయే తగుచో, ప్రస్తుతము ప్రపంచమునం దజ్ఞాన జన్యములగు దుష్కర్మలనాచరించువారి సంఖ్యయే మితిమీరియున్నది. సహస్రమున నొక్కండయిన ధర్మమార్గానుసరణమున కాత్మసమర్పణముగావించువా డుండునో లేదో తెలియకున్నది. అల్పకార్యముల నాచరించువారి సంఖ్య యీభూమండలమున గొలవడియుండలేదు. విద్యాశూన్యములగుస్థలముల మూఢులనేకులుండి యొకనిందనీయమగుకర్మనే ధర్మమార్గమనిన నది యుక్తమగునా? వారిమాధ్యదేశమున కాయల్పకర్మయే ధర్మమందురా? వీలుపడదు. అజ్ఞాని యూహాకంపనంతమాత్రమున నధర్మమునె ధర్మముగ నెంచరాదు. జ్ఞానమును బడయగల్గినవారలే ధర్మాధర్మ నిర్ణయాధికారులు. మహాజనులన మహామతులు లేక భూరిసత్త్వులు, జ్ఞానసత్త్వులు, మహాత్ములనియే తాత్పర్యముండునని నాయల్పబుద్ధి

బోధింపుచున్నది. లాంగుఫెలో కవీశ్వరుని పద్యమొకటి స్మృతికి వచ్చుచున్నయది:

" Lives of great men all remind us,
We can make our lives sublime."

"మహాపురుషుల జీవితములు మనమునహితము నిజజీవనములు శ్రేష్ఠతమములు గావించుకొనవచ్చునని బోధనేయుచున్నవి." జ్ఞాన ధర్మ కర్మ లే మానవాభ్యుదయమున కనుకూలమగు పరిష్కృతమార్గమును దర్శింపజేయునది. అట్టి సంపత్తియము మహాపురుషులు నడచిన పథానుసరణంబున నే లభ్యములగు. మహాభారతమునఖితము యిందునిమిత్తమే "మహాత్మనాంచ చరితం శ్రోతవ్యం నిత్యమేవచ." మహా యనగా గొప్పయను నర్థము కలదు. మహాజనమను దానికి ముఖ్యులగు జనులని నిఘంటువు లర్థముజేయుచున్నవి. శ్రీవారు 'మహాజనో' యనుదానికి మహాత్ములని యర్థము జేసియున్న నెంతయు బాగుండెడిది. మార్గ మాదర్శప్రాయమయినది. ఆదర్శము చంచలచిత్తులగు ననంఖ్యాక సంసారములనుండి లభింపక మూర్తీభవించిన జ్ఞానస్వరూపులగు మహాపురుషుల దివ్యతేజస్సంపన్న హృదయాగతమగునదియె. శ్రీబుద్ధుడు (జ్ఞానమునందినవాడు) నడచినమార్గము ప్రశస్తము. హిందూమతము "జగన్మిథ్యా" యని తెల్పుచున్నయది. మిథ్య నాశయింపగల్గునది దుఃఖము, భయము, కారణకార్యములు రెండును

సమములె. "జగత్సర్వం దుఃఖమయం" అను సర్థమే పైదానితో మేళగించును

(1) సమ్యగ్దృష్టి— సత్యముతో గూడిన దృక్కు. దీనినే హిందూమతము జ్ఞాననేత్రమను. బాహ్యాభిశ్వాపరికృతి కతీతం బగు పరతత్త్వమును గనున దిదియె. (2) సమ్యక్సంకల్పము— సత్యమగు భావము. మిథ్యా భావమును బాసి సద్భావముల నాశ్రయింప మన గ్రంథాదులన్నియు నొక్కి పెట్టున ఘోషింపుచు నేయున్నవి. (3) సమ్యగ్వాక్కు—సత్యవచనము—సత్యరుున కింక హిందూమతము సర్వము నర్పించుటకు సంసిద్ధమె. (4) సమ్యక్కార్యము—సత్యకార్యము లేక సత్కార్యము. ఉన్నతి కిడియే పథము (5) సమ్యగాజీవనము—సజ్జీవితము అనగా సత్యధర్మ సంగతమగు జీవితమని తాత్పర్యము. మహాత్ముడగు వివేకానందస్వాములవారీ జీవితార్థము నిట్లు విచిత్రగతిని వెల్లడించియున్నారు:— ప్రశ్న: what is life ? జీవితమనగా నేమి? "Life is the tendency of unfolding and develop ment of a being under circumstances tending to press it down." "జీవము నిజస్వరూప జ్యోతిని బ్రకటింప యత్నింపుచు నేయుండును. కాని యనేక శక్తు లద్దాని నణచివేయ బ్రయత్నము సేయుచుండును. జీవప్రకాశ ప్రతిబంధకముల నీశక్తుల జయించి, నిజశక్తి ప్రకటనార్థము గావింపబడు,

నిరంతర కృషియే జీవితము." బుద్ధుని సజ్జీవితము సయిత మీహిందూమతాచార్యుని యభిప్రాయమునే నిరూపింపుచు న్నది. (6) సత్యవ్యాయామము అనగా మనోదైహిక పరిశ్రమయని తాత్పర్యము. వ్యాయామముచే శరీరబలపాటవమే గాక మనోబల పటిమయు నభివృద్ధి కావలయునని దేవుని యూహ. శరీరము యొక్క బలమునకు దేజస్సును నశింపజేయు పదార్థము లెన్నియో మనమునుండియే యుత్పన్న మగుచున్న వనిప్రాచ్యపాశ్చాత్యమతావలంబులయభిప్రాయము. సుప్రసిద్ధ విద్వాంసుడగు లార్డు యెవ్బరీ మహాశయు డిట్లు వచించియు న్నాడు:—"Many bodily ailments have their origin in the mind." శరీరము నాక్రమించు వ్యాధులన్నియు దమను మూలములను మనస్సునుండియే పడయుచున్నవి. శరీరసంర క్షణనిమిత్తము మనోవశీకరణ మావశ్యకము. ఆయుర్వేద గ్రంథములు దేహసంరక్షణకు వ్యాయామ మావశ్యకంబని యీరీతి నుడువుచున్నయవి :—

శ్లో :—"లాఘవం కర్మ సామర్థ్యం దీప్తాగ్నిం మేదసః క్షయం
విభక్త ఘనగాత్రత్వం వ్యాయామా దుపజాయతే॥"

(7) సత్యస్మృతి—జ్ఞానసాధనా లబ్ధంబగు సత్యమును విస్మరింపకుండుట. (8) సత్యసమాధి. బ్రహ్మనందమం దైక్యమందుట తురీయము, తాదాత్మ్యము, మనోలయము మొదలగు

పరిశుద్ధానందమయ విశ్వసత్తారాధన లన్నియు నించుమించుగ నొక్కటియె. వీనినిగూర్చి శ్రీరామకృష్ణపరమహంస విపులముగ నుపదేశించియున్నాడు. అష్టాంగ మార్గముల గూర్చి ప్రతి భారతీయ వేదాంత శాస్త్ర నిష్ణాతయు స్వీయగ్రంథముల విపులముగ వ్రాసియే యున్నాడు. రాగద్వేషాదులు చిత్తమున నెలకొనియున్నపర్యంతము సాధనకు గడంగు వ్యక్తికి ధర్మపథము గోచరింపదను బుద్ధుని భావమును,

"ఉ॥ బిలుసుగ నెత్తినుండు మెలి• వెండ్రుక నెంతగఁ దిన్న జేసినం।
గలుకుగ నుండురీతి నిహ• కాంతులఁ జిక్కెడువాని కెంతగాఁ
గలిపిన నీతివాక్యములు • జ్ఞానమునొందక వాడు నీచుఁడై
మలుగుచుఁబాపవృత్తిబుజు• మార్గమునంటిచరింపలేడుగా!"

—రామకృష్ణపరమహంస.

సమర్థింపుచున్నయది.

ఆకృతిబద్ధములగు వస్తువులన్నియు నశించునవియెయని బుద్ధుడు బోధించెను.

సీ॥ "మాధవసంసేవ • మఱచి ప్రమత్తతా
మతిమాంద్య నిద్రాని• మగ్నులౌదు,
నున్నార్థు మూర్ధులీ • యుర్వి వారినిలేపఁ
బనిగొని యిటకు నే • వచ్చినాఁడ,

చెలులార ! నావిధి • చేసికొని చనెద
　　　　లెండు సుప్తిని వీడి • లెండు ! లెండు !
మేను లనిత్యము • మృత్యుదేవత యెప్పు
　　　　డో వచ్చి కొనిపోవు • నుసురు లయ్యొ!
ఆ॥ దార, ధనము, సుతులు, • తమ్ములు, నన్నలు
　　బంధుజనము, మిత్రవర్గ, మిండ్లు,
　　విపుల రాజ్యభోగ • వితతియుఁ గీర్తియు
　　వెంటరావు ! రావు ! • వెళ్లులార !"

—శ్రీ చైతన్యస్వామి.

కార్యమును బ్రారంభించి మధ్య భయభీతులయి త్యజియింపరాదను శ్రీ బుద్ధభావము నీక్రింది శ్లోకము సార్థకమొనరింపుచున్నయది.

శ్లో :—"ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచైః,
　　ప్రారభ్య విఘ్ననిహతా విరమన్తి మధ్యాః।
　　విఘ్నైః పునః పునరపి ప్రతిహన్యమానాః,
　　ప్రారభ్య చోత్తమ జనా నపరిత్యజన్తి॥"

—భర్తృహరి.

తాత్పర్యము :—

శా॥ ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
　　యారంభించి పరిత్యజింతురురు విఘ్నాయత్తులై మధ్యముల్

ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచుఁ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థములుజ్జగింపరుసుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్ ॥

ఆంగ్లారోక్తి కలదు: "Man is the maker of his destiny," "మానవుడు నిజభాగ్యమునకు దానే విధాత."

"Early to bed and early to rise
Makes a man healthy, wealthy and wise."

"సమయము గతించిన దిరిగి లభించుట దుర్లభము"
—బుద్ధుడు

"Each day is a little life." (The pleasures of life)

"ఒకదినము జీవితమందలి కొంతయంశము."

"The moments we forego
Eternity itself cannot retrieve."

"గతించిన క్షణముల మనల కొసంగ శక్తిసామర్థ్యముల గలవా డీ భూతలంబున లేడు." త్రికరణంబుల దుష్కార్యముల జేయక సత్కార్యముల జేయవలయును. అపుడే ముక్తికల్గును.

"చ॥ స్థిరమగు పుణ్యకర్మమున దేవభవంబగుఁ బుణ్యపాప సంకరమున మానుషత్వమగుఁ గల్మషముల్ పశుకీటభావముం బొరయఁగఁ జేయునిప్పగిదిఁ బుట్టుచుఁ జచ్చుచు మోహవార్ధిలోఁ దిరుగుచునుండుఁ గాని యొకతీరముఁ జేరఁడు జీవుఁ డెన్నడున్."

చ॥ ఇదిసకలంబుగాంచిబుధుఁ • డెప్పుడుఁ బాపముఁబొంతఁబోకని
ర్మదనికహాంక్రియాత్ముఁడును•మత్సగదూరుఁడునై చరించుఁ
బెం।పొదవఁగధర్మమార్గమున •నొయ్యనధర్మముతీ పెఱింగి
తా।వదలఁడు తత్క్రియావిధము• వారక యొక్కఁ డొనర్చు
ధర్మముల్.

చ॥ చిరముగ ధర్మముల్ నడపఁ • జిత్తము జేయుఁ బ్రిసన్న
చిత్తుఁడై। పరువడి నింద్రియార్థముల • భంగులు రిత్తలుగా
నెఱింగి చె। చ్చెర నవి యంతపట్టు నిర • సించి తపోదమసత్య
శీలతం। బరిణతినొంది పొందుఁ బిద • పం బరమార్థపదప్రి
భావముఁ.

—ఆంధ్రమహాభారతము.

స్త్రీవ్యామోహము దుఃఖమునకు మూలమనియు, జ్ఞాన
నాశమునకు హేతువనియు బుద్ధాచార్యుడు వచించియున్న
గీతముల నీదిగువ నుదహరింపబడు శ్లోకములు సార్థకము సేయు
చున్నవి:

"శ్లో॥ నారీస్తనభర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశం
ఏతన్మాంసవసాది వికారం
మనసి విచిన్తయ వారం వారం."



—శంకరాచార్యులవారు.

తెనుగు:—

"మ. నడుమున్ జన్నులుఁ గన్నులున్ వదనమున్ । నాభీప్రదే
శంబు మై । బెడఁగుల్ గన్గొని, సుందరీవశుఁడవై ప్రేమిం
పఁగాఁబోకు మె। ప్పొడుః మాంసాస్థివసా ద్యసహ్యములుగా
బుద్ధిన్ విచారించి యే । ర్పడ గోవిందు భజింపు సౌఖ్య
ములు సంప్రాప్తించు మూఢాత్మకుడా!"

స్త్రీవిషయిక వ్యామోహము నింద్యమనుటకు ఋష్యుక్త
శ్లోకప్రమాణము లెన్నియో కలవు:—

శ్లో॥త్వఙ్మాంసరక్త బాష్పాంబు పృథక్కృత్వా విలోచనం।
సమాలోకయ రమ్యం చే త్కిం వృథాపరిముహ్యసి॥ 1

శ్లో॥మాంసపాంచాలికాయాస్తు యంత్రలోలేఽంగపంజరే।
స్నాయ్వస్థి గ్రంథిశాలిన్యాః స్త్రియాః కిమివశోభనం॥ 2

శ్లో॥కేశకజ్జల ధారిణ్యో దుస్స్పర్శాలోచన ప్రియాః।
దుష్కృతాగ్నిశిఖా నార్యో దహంతి తృణవన్నరాన్॥ 3

శ్లో॥జ్వలతా మతిదూరేఽపి సరసాఽపి నీరసాః।
స్త్రియోహి నరకాగ్నీనా మింధనం చారు దారుణం॥ 4

శ్లో॥కౌటిల్య దంభసంయుక్తా సత్యశౌచ వివర్జితా
కేనాపి నిర్మితా నారీ బంధనం సర్వదేహినాం॥ 5

శ్లో॥మూత్రశోణిత దుర్గంధే హ్యమేధ్య ద్వారదూషితే।
చర్మకుండే యే రమన్తితే లిప్యంతే నసంశయః॥ 6

శ్లో॥భగాది కుచపర్యంతం సంవిద్ధి నరకార్ణవం।
యే రమన్తి పునస్తత్ర తరంతి నరకంకథం॥ 7

శ్లో॥మనసా కర్మణా వాచా త్యజతాం మృగలోచనాం।
నతే స్వర్గాపవర్గో వా సానందం హృదయం యది। 8

తాత్పర్యము :—(1)త్వక్కు, మాంసము, రుధిరము, తప్తబాష్పాంబువులు వీనిని వేలు వేలుగ భావించి చూడుము! ఎంత యసహ్యమును గొల్పును! మోహము వ్యర్థము ! (2) నరముల చేతను, అస్థులవలనను, మాంస ఖండముల వలనను నిర్మితంబయిన వనితామూర్తియం దేమియున్నది? అది యొకచలింపుచున్న యంత్రమువంటి అస్థిపంజరమే సుమీ! (3) చారుకేశకలాపమును, కజ్జలసంశోభిత సుందరనేత్రయుగ్మవిరాజితలును నగు వనితలను స్పృశించినంతనే యగ్నివలె దగ్ధము సేయుదురు. శుష్కతృణప్రాయులగు పురుషులకు బూబోండ్లు ప్రచండానల జ్వాలలవంటి వారయి యొప్పుచుందురు. (4) రససంభరితలవలె బొడగట్టుచంచలనేత్రలురసశూన్యలయి యొప్పుచుందురు. చారునేత్రలు నుండుచున్న నరకాగ్నిజ్వాలల కింధనప్రాయలు. (5)కౌటిల్యదంభాసత్యాశౌచయుక్తయగు నీస్త్రీ యెవనిచే నిర్మింపబడినదియో తెలియకున్నది! స్త్రీయే సంసారములోని పాశ

ములలోని కెల్ల దృఢతరమగు బంధనము. (6) మూత్రరక్త దుర్గంధ భూయిష్ఠంబును, రజస్సుచే దూషితం బయినదియు, మలద్వారంబును నగు స్త్రీచర్మనిర్మితయోనితో సంభోగించు వారు మాయాబద్ధులగుచున్నారు. ఇం దీషణ్మాత్రమయిన సందేహము లేదు. (7) మానవుడా! నీవు కుచయోని మధ్యప్రదేశంబు నంతయు నరకార్ణవంబని యెఱుంగుము. నరకార్ణవంబున నిమగ్నులగువా రెట్లు భవాబ్ధిని దరింప శక్తులగుదురు? (8) స్త్రీ యెప్పుడును మానవున కానందమునుగాని సుఖమునుగాని స్వర్గమునుగాని ప్రసాదింపజాలదు. కాన దరికరణంబుల వనితాపరిత్యాగమే యుక్తము. కాముకదృష్టితో స్త్రీచేజూడబడు పురుషుడు సయితమిదియే చందమున వనితాప్రపంచముక్తిభంజకుడే యగును. స్త్రీపురుషులెల్లరు బరస్పరము స్త్రీపురుష భావశూన్యులయినను స్వప్రాణులు పరిశుద్ధ బ్రహ్మానందమయము లేయని భావించి విశ్వసత్తారాధనాభావతత్పరమతులయి విశ్వప్రేమవారిధి నీదులాడ వచ్చునని యె బుద్ధుని యూహ. ఈచందముగనే వైరాగ్యసిద్ధ్యనంతరము యశోధరాబుద్ధులు పరస్పరము సంచరించియుండిరి. 'భక్తిని గల్గి గోవిందుని భజియింపవె మనసా' యను శంకరాచార్యుల భావమున కనుగుణ్యముగనే శ్రీబుద్ధ భగవానుడు ప్రమత్తతను బాసి యనగా కామక్రోధాదుల జయించి విశ్వసత్త, పిపీలికాది బ్రహ్మపర్యంత వ్యాప్తమగు చలనశక్తిని నీయందు లయమొనరించుకొన యత్నించుము.

అని చెప్పి యున్నాడు. హిందూబౌద్ధమతాభిప్రాయములు శబ్దభేదమే కాని ధ్యేయాంతరము లేదు. మాయావివర్జితుం డగు వ్యక్తి పరతత్త్వజ్ఞాన సముపేతుడయి నిర్వాణమును జెందు ననియె శ్రీబుద్ధాచార్యులు. హిందూమత ప్రధాన గ్రంథరాజ మగు భారత మీచందమున బుద్ధాభిప్రాయమును సార్థకసఱచు చున్నయది:—

ఉ॥ ధీరుఁడునిర్జితేంద్రియుఁడు • తెల్లముగాఁదనుఁగాంచుభూతవి
స్తారనిరూఢమైనపర • తత్త్వముగాఁ దనయందు భూతవి
స్తారము నెల్లఁగాంచు సత • తస్ఫుటదర్శనుఁడై సమగ్రవి
స్ఫారముఁబొంది నిర్మలత•పంబులయందుఁ జలింపఁడెప్పుడున్.

చ॥ అరదము దేహ మింద్రియము• లశ్వము లాత్ముఁడు సూతుడి
మ్మహా। తురగచయంబు ధైర్యమను• త్రోరపుఁబగ్గమునన్
దృఢంబుగా।నురవడిఁబోకయుండ వెర•వొప్పఁగఁబట్టినవాడు
స్వర్గపుం। దెరువున నేగు నప్పరమ•ధీరుఁడునువ్వ యుదారుఁ
డెయ్యెడన్." —ఆంధ్రమహాభారతము.

భవిష్యదాలోచన తగ దనియె బుద్ధుడు. ప్రస్తుతకర్తవ్య మును శీఘ్రమే నిర్వహింపుమనియె.

"కాలకరై సో ఆజకరై, ఆజకరై సో అబ్।
క్షణమేఁ పరలయ హోయగీ బహురికరోగే కబ్॥"

—కబీరుదాసు.

"రేపటి కార్యమును నేడే యాచరింపుము. నేటి దిపుడే నిర్వహింపుము. ఏక్షణమునకు ప్రళయముకల్గునో! తిరిగి సేయున దెప్పుడు?"

* * *

## ప్రకీర్ణకవర్గము (వివిధవర్గము)

ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యుడు:—"జ్ఞానియగువా డల్పసౌఖ్యమును నిషేధించి యధికసౌఖ్యమును బడయ యత్నింపుచుండును. పరులకు దుఃఖమునొదవజేసి సుఖము నార్జింపజూచు వ్యక్తి ద్వేషపాశబద్ధుడయి సుఖదూరుడే యగును. ధర్మదూరునిదురావాసన లభివృద్ధిజెందును. సత్కార్యసద్ధర్మానుష్ఠానంబుల జైతన్యమునుగల్గి వర్తించువానిని సౌఖ్యమువరించును. జన్మచే బ్రాహ్మణుండగు ననుట యథార్థముకాదు. అందును నట్టి బ్రాహ్మణుడు పతితకార్యము లాచరించినను దండనార్హుడు కాడనుటెంతయు మౌఢ్యము; నింద్యము. బౌద్ధులు చైతన్యులు, ధర్మానుష్ఠానపరులు, అప్రమత్తులు. మనోదేహేంద్రియాదులపై శ్రీగౌతమశిష్యు లధికారమును గల్గియేయుందురు. బౌద్ధులు నిరంతర పరిశుద్ధభావాచరణముల గల్గియుందురు. దుర్జనసాంగత్యము సుఖప్రదము కాదు. సంసారబంధనత్యాగము కష్టసాధ్యమే. కాని వీని యన్నింటికంటె సన్యసించుకర్మ బహుకష్టసాధ్యమయినది. ధనాఢ్యుండును, యశస్వియును దామున్న తావులయందే.

యాదరింపబడుచుండ జ్ఞానియు, సజ్జనుండును నగువ్యక్తి సర్వ
త్రి సన్మానింపబడుచుండును. ఏకాంతవాసమనగా గృహాదుల
ద్యజియించి గహనాంతరము కరుగుట యెంతమాత్రమును
గాదు. తనచుట్టుపట్లనున్న పరిస్థితుల ప్రభావంబున కెంత
మాత్రము జలింపక వ్యక్తి తనయందు తానైక్యమందుటనే
యేకాంతవాస మనియెదరు. అట్టివాడు చంచలతరంబులగు
చిత్తప్రవృత్తుల జయించి, విషయవాసనాదూరుడయి స్థాన
కాలభేదరాహిత్యంబున్న బ్రకాశింపగలడు" అనువిషయముల
నుపదేశించియున్నాడు.

"అల్పసౌఖ్యంబుల దృణప్రాయంబులుగ బహిష్క-
రించి యనశ్వరంబులగు నధికసౌఖ్య సముదాయముల నంద
గృషి సేయుచుండువాడె బుధుడు."

—ఆంధ్ర మహాభారతము.

'తుచ్ఛసుఖంబుల నింద్యములనియెంచి యుత్తమంబగు
పరిశుద్ధాత్మానందసౌఖ్యము నందువా డుత్తముడు.'

—గాంధిమహాత్ముడు.

"అల్పసుఖంబులయందే స్వాత్మబలిదానమొనర్పకుము.
పరమార్థచింతను సయితము కలిగియుండు నరుడే తండ్రి
యొద్దకు జేర సమర్థుడగును."



—క్రీస్తుదేవుడు.

"గీ॥ విను మహింస మేటి • యనఁజను ధర్మంబు
యోగకర్మ మెపుడు • నొనరఁ బండి
యుండు మనసుకొ్రివ్వ • ఖండింపఁగా మోద
మెసఁగు సుజనసంధి • యెడలదెందు.

క॥ అమరఁగ దాక్షిణ్యము ధ
ర్మమునకుఁ గుదురండ్రు కీర్తి • మహిమ నెలవు దా
నము సత్యము సురపురిమా
ర్గము శీలము సంశ్రియము సు• ఖంబుల కెల్లన్

గీ॥ ప్రియము నప్రియంబుఁ • బెల్లగు సౌఖ్య దుః
ఖములు భూతభావి• కార్యములును
నెవ్వనికి సమంబు• లివి సర్వధని యన
బరఁగుఁ జువ్వె యట్టి • భవ్యుఁ డనఘ॥

—ఆంధ్రమహాభారతము.

"శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయం॥"

—భగవద్గీత.

"చాతుర్వర్ణ్యమును నేనే గుణకర్మల ననుసరించి విభ
జించితిని. అనశ్వరుండనగు నేనే యావర్ణోత్పత్తికి గర్తనని
యెఱుంగవలయును."

సర్వజనప్రియుండును, సంపద్విభాసితుండును, నిశ్శోకుండును, సౌఖ్యవంతుడును నగు వ్యక్తిలక్షణముల గూర్చి ధర్మజుడు యక్షునితో నిట్లువచించెను :—

"గీ॥ సర్వజనసమ్మతుండగు • గర్వ ముడిగి
క్రోధమడఁచి శోకమునకుఁ • గుదురుగాడు
వినవె యర్థాఢ్యుఁడగు లోభ • మొనర విడిచి
తృష్ణవర్జించి సౌఖ్యంబు • తెరువుగాంచు.

క॥ విను విషయజ్ఞానమునకు
ననయంబును మనసు మూల • మది కామక్రో
ధ నిరూఢ మగుచుఁ బురుషుని
ననిశము నలయించు నింద్రి • యార్థంబులకున్.

సీ॥ ఇంద్రియార్థములకు • నెలసినపురుషుండు
గాఢ రాగంబున • గరఁగుచుండు,
రాగంబువలనఁ ది • రంబగు లోభంబు
లోభియై కరుణకు • లోనుగాఁడు
మఱి సచ్ఛద్మవృత్తి • మఱుగుఁ బాపక్రియఁ
దగువాడనెప్పుడి • తగవువినఁడు,
కుజనులదెసఁ బ్రీతి • గోరు దుర్లభ్యంబులు
గాకుండు వాఙ్మనః • కర్మభంగు,

గీ॥ లిహమునందుఁ బుణ్యహీనుఁడై చెడిపోవుఁ
బరమునందు దుఃఖ భరము నొందుఁ
గాన నింద్రియార్థ గతిఁబోక సాధుసం
సర్గఁజేసి సుగతిఁ జనుట యొప్పు.

కం॥ భూతముల యందు వెలిఁగెడు
భూతాత్ముని నెఱుఁగుదురు ప్ర బుద్ధులు నిత్య
జ్యోతిర్మయు నవ్యయు న
ద్వైతంబగు బుద్ధిసూక్ష్మ ధర్మము వలనన్॥"

—ఆంధ్రమహాభారతము.

బుద్ధునిచే నుడువబడిన బౌద్ధుల లక్షణము లీక్రింద నుద
హరింపబడు సీసపద్యముయొక్క రెండు చరణములందును
గలవు:—

"సీ॥ తెలివి నొందిన బుద్ధి గల మహాత్ముఁడు శుభా
శుభ కర్మములయందుఁ జొరకయుండుఁ
గ్రమమున సౌఖ్యదుః ఖములాదిగా నశే
షద్వంద్వముల యందు సమతనుండు॥

క॥ కామంబును గ్రోధంబును
నేమఱక జయింపవలయు నెల్లవిధములన్
ధీమహిత! యిదియ సతత
క్షేమంకరమైన పథము కృతబుద్ధులకున్."

ఏకాంతవాసమును గూర్చిన ఋష్యభిప్రాయము లింకనెన్ని యోకలవు. గ్రంథవిస్తరభీతి వెంటాడుచునే యున్నది.

* * * * * *

## అధోగతిమార్గవర్గము (నరకవగ్గము)

ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యుడు "అసత్యభాషణము స్వయంకృతాపరాధనిరాకరణము నను నీరెండు దుర్గుణములగల్గియుండువారు నరకమును బడయుదురు. కాషాయాంబరధారులును, బాహ్యానుష్ఠానపరులును నిర్మలహృదయులయి యుందురనుట సత్యము. పైకి యోగులవలెను, లోలోన భోగుల చందమున వర్తించువారు నరకపాత్రులు. పరులపై నాధారపడి జీవనయాత్రసేయుచు, మందుడయియుండువ్యక్తి నరకమును బడయును. పరదారాగమనాభిలాషి చతుర్విధములగు దండనలకు గురియగును. పరస్త్రీసాంగత్యాసక్తుడు నరకగామి యగును. సంయమవ్రతానుష్ఠానమునం దశ్రద్ధ వహించు మనుజుడు నరకమునకే పాల్పడుట నిక్కువము. సత్కార్యముల బ్రారంభించుటయందు రవంతేని యాలసించు వానికి నరకమే శరణ్యమగును. సత్కార్యాచరణము మానవుని చిత్తము నావహించియున్న సందేహదుఃఖములనెల్ల దొలగ ద్రోసి సుఖోదయమును గలుగజేయుచుండ, దుష్కార్యము మానవుని చిత్తమునందు లేని సందేహభయ విషాదముల నావిర్భ

వింపజేయును. ధరణీశులు తమసామ్రాజ్యముల సురక్షితముగా నుంచుకొనువిధంబున నే, మనుజు లాత్మీయచిత్తసీమల దుర్గుణ గణశాత్రవమండలినుండి నిత్యము రక్షించుకొను చుండవల యును. ఏతద్భావసరమును గోల్పోవువ్యక్తి నరకగామి యగును. అనావశ్యకమగు లజ్జయు, ఆవశ్యకమగు లజ్జలేకుం డుటయు మనుజు నధోగతికీడ్చునవియె. భీతివిషయము నింతి యె. నిషేధింపబడవలసినవానిని స్వీకరించునట్టియు, నిషేధిం పరాని పదార్థముల నిరాకరించునట్టియు మానవుడు నరకమున బడును" అనువిషయముల నుద్బోధించి యున్నాడు.

మన భారత భాగవత రామాయణాది మహద్గ్రంథముల నసత్యవాదుల వినాశనమును గుఱించియు రావణ సైంధవకీచ కాది పరవనితాసక్తులగు ప్రభృతుల విధ్వంసమును గూర్చియు వ్రాయబడిన యంశము లెన్నియోకలవు.

ఆ॥ "విష్ణుభక్తి రహిత • పృథ్వీసురేంద్రుని
కంటె విష్ణుభక్తి • కలితచిత్తుఁ
డైన యధమజాతి • యతఁడెన్ని మడుఁగులో
డెక్కుడండ్రు నిమి వంచించునెపుడు."

చైతన్యస్వామి వచించిన యీపద్యమందలిభావము నను సరించి విచారింప బాహ్యవేషంబులగు కాషాయాంబరాదుల ధరించు నిష్ఠాశూన్యుండగు వ్యక్తికంటె నొక్కయుత్తమగృహ

స్థుడే వేయిచదుంగు ఉత్తముండనియే స్పష్టమగుచున్నది. భగవద్గీతయు బాహ్యశుద్ధుల నెన్నియో విధముల దిరస్కరించుచునే యున్నది.

క॥ "స్వర్గనరకంబు లింద్రియ
వర్గసమాచరణము నన • వచ్చును వినవే
స్వర్గమగుఁ దన్నివారణ
దుర్గతియగుఁ దన్నిరోధ • దుర్బలత మెయిన్."

—ఆంధ్రమహాభారతము.

నరకములనుండి విముక్తిని బడయ వలయు సద్గుణములియ్యవి. ఇట్టిగుణాలంకారముల సుశోభితులగువారలె సత్పురుషులు.

శ్లో:—"తృష్ణాం ఛిన్ధి భజక్షమాం జహిమదం పాపేరతింమాకృథాః। సత్యం బ్రూహ్యనుయాహి సాధు పదవీం సేవస్వ విద్వజ్జనం। మాన్యా న్మానయ విద్విషోఽప్యనునయ ప్రఖ్యాపయ ప్రశ్రయం। కీర్తింపాలయ దుఃఖితే కురు దయా మేత త్సతాంచేష్టితం॥"

—భర్తృహరి.

తెనుగు:—

శా. "ఆశాసంహరణంబునోర్మి యుమద•త్యాగంబుదుర్దోషవాంఛాశూన్యత్వము సత్యముక్తి బుధమతా•చారంబున త్సేవయున్

వైశద్యంబును శతురిలాలనము మా • న్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందుగృపయుఁ • శిష్టాలికిఁ ధర్మముల్."

చిత్తము నైహికవాంఛాశతురివర్గమునుండి నిత్యము సంరక్షించుకొను చున్న నపవర్గము కరగతంబగు నన్న శ్లోకము లెన్నియో యుపనిషత్తులగలవు.

* * * * *

దంతావళవర్గము.

ఈవర్గమునం దాచార్యులవారు 'సమరభూమియందు శాత్రవయోధులచే బ్రయోగింపబడిన యస్త్రప్రహారంబుల నపూర్వంబగు క్షమతో గరి సహింపునట్లు మనుజుడు ధూర్తు నొసరించు బాధలనెల్ల ననుభవింపదగును. నిందావాక్యముల నతిశాంతహృదయముతో నాలకింపదగును. ఆత్మనిగ్రహము గల వ్యక్తియే యోధానుయోధుం డనదగును. గజతురగ స్యందనాదుల నధిరోహించి నరుడు నిర్వాణపురమున కరుగ జాలడు. ఇంద్రియదమనంబుననే ముక్తిపురికరుగ సమర్థుం డగును. శాంతియు, దాంతియు నిర్వాణమందిర ప్రథానసోపాన ములు. స్థూలకాయుండును, లుబ్ధాగ్రేసర సార్వభౌముం డును, నిత్యామితాహార నిద్రాసక్తుండును, నిరుద్యోగియు నగు మనుజుడు నింద్యుండయి, జననమరణంబులకు జిక్కుచుం డుట ధ్రువము. చంచలంబులగు నింద్రియములును చిత్త

మును దుఃఖమున్నొసంగు. చంచలంబగు మనస్సును సంయమం
బున వశమొనరించు కొనదగును. జ్ఞానినను సరింపుచు, వానిని
నిత్యము సందర్శింపుచు, సేవింపుచునుండు వ్యక్తి సంస్కరింప
బడి సుఖించును. సజ్జనసాంగత్య మహాభాగ్యమును బడయని
వ్యక్తి దుర్జనసంగతి నపేక్షింపజనదు. ఏకాంతమున సద్భావ
ధ్యాన మననంబుల నుండుటెంతయు శ్రేయస్కరంబు. మన
స్తృప్తి సుఖోత్పాదకమయినది. వాక్కుచేగాక సంకటమయ
దశయందు కార్యరూపంబున సాహాయ్యమొనరించు స్నేహి
తుడు సంస్తవనీయుడు. మనోవికారదూరులు ధీరులు. సన్యాస
వృత్తి మానందదాయకము! జ్ఞానసముపార్జనము సుఖదాయ
కము," అను విషయాదుల విపులముగ బోధించియున్నారు.

"సమ్రీత్వేనోన్నమన్తఃపరగుణకథనైః స్వాన్గుణాన్ ఖ్యా
పయన్తః" —భర్తృహరి.

"సత్పురుషు లణకువగల్గియే యున్నతినందుదురు."

"క్షమయనెడి మహాఖడ్గము యొక్క తీక్ష్ణధారకెల్లశాత్ర
వు లెఱయగుదురు. ఎల్లలోకముల రక్తధారల స్రవింపజేయక,
ఈషణ్మాత్రమయిన హింసనొనర్పక దిగ్విజయమును బడయ
గల్గువ దీక్షమ యనెడి యభేద్యకవచమును ధరించునతడే."

"మూషికపీడనమును సహింపగల్గు మార్జాలము క్షమ
యం దారితేరినదియే. శక్తియుండియు బరుల బీడింపని గుణమే

క్షమ. ఇయ్యది చరాచరాత్మక ప్రపంచమునకు దలమానికము వంటిది."

—గాంధిమహాత్ముడు.

"ఓర్పును మించిన మహత్తుగల సంపద లేదు. క్రోధానలమును జల్లార్పుట కీక్షమయనెడి సలిలము తగును."

—క్రీస్తుభగవానుడు.

"వర్ణమాలయందు అక్షరములన్నియు వేరువేరుగానున్నవి. హకారమునకు బూర్వమందున్న శ, ష, స యను నక్షరములవలన మనలకు "సహించుము, సహించు"మను బోధ లభించుచున్నయది. క్షమయె తపస్వుల ధనము."

—రామకృష్ణ పరమహంస.

"క॥ క్షమగలిగిన సిరిగలుగును
క్షమగలిగిన వాణిగలుగు • సారప్రభయుక్
క్షమగలుగఁ దానగలుగును
క్షమగలిగిన మెచ్చుశౌరి • సనయుఁడు తండ్రీ!"

—భాగవతము.

"మ. అనయంబుక్ శమవంతుఁడై వినుత శిష్టాచార మార్గంబులన్। జనుపుణ్యాత్ముఁడు దుర్గతుల్ గడచి ప్రజ్ఞాహర్మ్య సంరూఢుఁడై । కనుచుండుం బటుమోహపంకజలమగ్నంబైన లోకంబు నీ । కధోభాగమునందు డింది కడుదుఃఖంబొందగా నవ్వుచున్."

—ఆంధ్ర మహాభారతము.

"తే॥ గీ. ఎవ్వి యింద్రియవిషయాళి • నెసగఁ బుట్టు
నట్టి సుఖములు దుఃఖంబు • లందుచుండు
నవియు నాద్యంతవంతంబు • లట్లుగాన
బుధుడు విషయజభోగముల్ • వారయఁ డనఘ

క॥ కామక్రోధోద్భవమగు
పామరపున్వేగమెల్లఁ • బ్రాజ్ఞుఁడునై దా
నేమఱక విడుచుపురుషుం
డామనిగా మోక్షసౌఖ్య మందుఁ గిరీటీ!"

—భగవద్గీత ౕ అధ్యా.

"శ్లో:—మోహఏవ మహామృత్యు ర్ముముక్షో ర్వా పురాదిషు
మోహెహా వినిర్జితో యేన స ముక్తిపద మర్హతి॥
మోహంజహి మహామృత్యుం దేహదారా సుఖాదిషు।
యంజిత్వా మునయోయాంతి తద్విష్ణోఃపరమంపదం॥"

—రాజయోగసారము.

"ముముక్షువగువానికి శరీరమందు రాగమున్న నదియే భయంకర మృత్యురూపధారిణియగును. దేహాదులయెడనున్న రాగమును సంపూర్ణముగా జయించినవాడే సుగతినిజెందును. సతీసుతాదులపట్ల సహజముగా నెలకొనియుండు మహారిపు రూపధారిణియగు రాగమును జయింపనగును. మును లీరాగమును జయించియే ముక్తినందియున్నారు.

శ్లో:— "యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచ యః
హర్షామర్ష భయోద్వేగైః ర్ముక్తో యః సచ మేప్రియః॥"

—భగవద్గీత.

"పరులను భయపెట్టనివాడును, పరులచే భీతిజెందని వాడును, హర్షక్రోధ భయోద్వేగ విముక్తుండును నగునట్టి వ్యక్తి నాకుబ్రియుండు."

"అకృత్యం నైవకర్తవ్యం ప్రాణత్యాగేఽపి సంస్థితే
నచ కృత్యం పరిత్యాజ్యం ధర్మ ఏష సనాతనః॥"

"ప్రాణము నశించునట్టి విపదవస్థ సంభవమయినను, అకర్తవ్యము నాచరించుటయు, కర్తవ్యమును త్యజించుటయు దగనికార్యము. ఇది సనాతనధర్మము."

శ్లో:— "బుద్ధ్వా ప్యత్యంతవైరస్యం యః పదార్థేషు దుర్మతిః
బధ్నాతి భావనాం భూయో నరో నాసౌ సగర్దభః॥"

—శంకరుడు.

"ఎవడింద్రియాది విషయములనుండి యొకతూరి విరక్తుడయి, జ్ఞానసముపార్జనమునందు లగ్నమనస్కుడయియుండియు దిరిగి విషయములకు వశుడగునో వాడు మహాగార్దభము."

శ్లో:— "సంగం నకుర్యా దసతాం శిశ్నోదర తృపాం క్వచిత్
తస్యానుగ తమస్యంధే పతత్యంధానుగాంధవత్॥

సత్యంశౌచం దయా మౌనం బుద్ధిహ్రీర్శ్రీర్యశఃక్షమా
శమోదమోభగశ్చేతి యత్ సంగాద్యాతి సంక్షయం॥
తేష్వశాంతేషు మూఢేషు ఖండితాత్మ స్వసాధుషు
సంగంనకుర్యాచ్ఛోచ్యేషు యోషిత్ క్రీడామృగేషుచ॥
—భాగవతము.

(1) "అసత్యవాదియు, విషయలంపటుండును నగువాని తోడ గలిసి వర్తింపజనదు. అట్టిధూర్తు ననుసరించువానిగతి ఘోరాంధకారమునబోవు నంధుని ననుసరించువాని దుర్దశను బోలియుండును. (2) దుర్జనమైత్రిచే సత్యము, శౌచము, దయ, మౌనము, బుద్ధి, లజ్జ, కీర్తి, శమము, సంపద మొదలగునవన్ని యు ధ్వంసమయిపోవును. (3) అజితేంద్రియులతోడను, మూర్ఖులతోడను, దేహమునే శాశ్వతముగా నెలుంగువారితోడ ను మైత్రిసేయరాదు. అసాధువులతోడి స్నేహమునుదగదు."

"భక్తిస్తు భగవద్భక్తసంగేన పరిజాయతే,
రవిశ్చ రశ్మిజాలేవ దివాహన్తి బహిస్తమః,
సంతఃసూక్తి మరీచ్యౌఘైశ్చాంతర్ధ్వాంతంహిసర్వదా॥
—బృహన్నారదీయము.

"భగవద్భక్తుల (విశ్వపత్రారాధకులు—స్వయంసమర్పిత జీవన్ములు, అపవిత్రులు) సాంగత్యంబునంజేసి స్థిరమగుభక్తి యొదవును, దినకరకరమాల మహాధ్వాంత పటలమును నిర్మూ

లించును. సత్పురుష దివాకర సద్వచన కిరణసమూహము మానవ హృదయవ్యాప్తాజ్ఞానాంధకారమును బారద్రోలును."

* * *

## తృష్ణావర్గము.

ఇందాచార్యులవారు "తృష్ణయొక్క ప్రచండానలసదృశ స్వభావము గురించియు, నదియె సమస్తార్తులకును మూలమగుచు మానవుల బునర్జనన మరణచక్రంబున బడద్రోయుచుండుననుసంగతిని గూర్చియు, మహాశత్రువగు తృష్ణను జయించిన ధీరపుంగవుడు నిర్వాణగతుండగునను విషయమును గురించియు, తృష్ణాబద్ధుండగువ్యక్తి నరకగామి యగుననియు" బోధించియున్నారు. ఈవర్గము యొక్క సారాంశమిది. శౌనకుడు ధర్మనందనునకు భారతమునందిట్లు బోధించినట్లున్నది—

కం॥ స్నేహార్ణవ మగ్నుండయి
దేహి మహాదుఃఖముల నధృతిఁబొందును దుః
ఖాహతుఁడు శోకతాప వి
మోహియగుఁ స్నేహమూలములు రాగాదుల్.

వ. "కావున బంధుమిత్ర ధనసంచయంబులవలని స్నేహంబు విడుచునది. పద్మపత్రంబు నీరువోరయనియ ట్లెరుకగలవానికి నెట్టియెడలను స్నేహంబు వొందదు. స్నేహంబున రాగం

బును, రాగంబునం గామంబును, గామంబునం గ్రోధంబును గ్రోధంబునం దృష్ణయు వర్తిల్లు."

కం॥ అది సర్వదోషముల కా
స్పద మది దురితక్రియానుబంధంబులకుఁ
మొదలు నిరంతర దుఃఖ
ప్రదమని మదిఁదలఁచి తృష్ణఁబాతురు సుమతుల్.

వ. "మఱియుఁ దృష్ణాతురుం డర్థలోభంబునం గోటరస్థంబగు నగ్నియనలంబునం జేసి దగ్ధంబగు వృక్షంబునుంబోలె వినాశంబువొందును."

—ఆంధ్రమహాభారతము

తే॥ గీ॥ దుఃఖమడరిన దానితోఁ దొట్రుపడక
సుఖముజెందిన రాగవిస్ఫురణమాని
వీతరాగ భయక్రోధ జాతుఁడగుచు
నలరునాతడు సిద్ధుఁడై వెలయఁగలఁడు.

తే॥ గీ॥ విషయములయందు సంప్రీతి విడువలేని
వానియందున సంగంబు వరుసఁ బుట్టు
సంగమునఁజేసి కామంబు సంభవించుఁ
గామమున క్రోధ మప్పుడె కలుగు ననఘ."

—భగవద్గీత 2 అధ్యా. 60 శ్లో. 67 శ్లో.

శ్లో॥ నాస్తి విద్యాసమం చక్షుః, నాస్తి సత్యసమం తపః
నాస్తి రాగసమం దుఃఖం, నాస్తి త్యాగసమం సుఖం॥
—భారతము—భీష్మాచార్యులు.

"విద్యతో సమానమగు దృష్టియు, సత్యముతో నీడగు తపోధనంబును, రాగమువంటి దుఃఖమును, త్యాగసదృశమగు సుఖమును లేవు."

శ్లో॥ భ్రాన్తం దేశమనేకదుర్గవిషమం ప్రాప్తం నకించిత్ఫలం,
త్యక్త్వాజాతికులాభిమానముచితం సేవాకృతానిష్ఫలా
భుక్తం మానవివర్జితం పరగృహే షాశ్వాశంకయాకాకవ
త్తృష్ణే! జృమ్భసి పాపకర్మనిరతే నాద్యాపిసంతుష్యసి॥

చ॥ వినికితి దుర్గదుర్విషయవిభ్రమయుక్తిఁ గులాభిమానముఁ
బనచెడ సేవఁజేసితి వి • పన్నుఁడనై పరగేహసీమ వా
యసమువలెన్ భుజించితి ప్రయత్నము నిష్ఫలమై నశించె సం
తసపడ వుగ్రకర్మ! పిశునత్వము చూపెద వాశ యేటికిన్॥

శ్లో॥ ఉత్ఖాతం నిధిశఙ్కయా క్షితితలం ధ్మాతా గిరే ర్ధాతవో,
నిస్తీర్ణస్సరితాంపతిర్నృపతయో యత్నేన సంతోషితాః,
మన్త్రారాధనతత్పరేణ మనసా నీతాశ్శ్మశానే నిశాః,
ప్రాప్తః కాణవరాటకోఽపి నరుయా తృష్ణే! సకామా భవ॥

చ॥ నిధియనుశంకభూతలముఁ ద్రవ్వితినావచేమహో
దధిదరియించితిన్ శిఖరి ధాతువులూఁదితి రాజుఁగొల్చితిన్

వ్యర్థగాని ఘోరమంత్ర జప • మర్థినొనర్చితి గర్వయైన నే
విధమునఁ బొందనైతిఁగద • వే ముదమొందఁగ దే దురాశరో॥

శ్లో॥ ఖలోల్లాసా స్సోఢాః కథమపి తదారాధనపరై,
ర్నిగృహ్యాన్తర్బాష్పం హసితమపి శూన్యేన మనసా।
కృతోవిత్తస్తమ్భ ప్రతిహతధియా మంజలిరపి,
త్వమాశే! ఽమోఘాశే! కిమపర మతో నర్తయసి మాం॥

చ॥ పలువలుపల్కు మాటలొకం • భంగిసహించితి బాష్పవారి లో
పలనెహరించి శూన్యమగు • భావమునన్ నెడనవ్వునవ్వితిన్
బొలుపటి విత్తజాడ్య హత • బుద్ధుల కంజలి చేసితిం గటా!
తలఁకక యింక నేపనికిఁ • దార్చెదు నన్ను దురాశ! నీవిటుల్॥

శ్లో॥ అమీషాం ప్రాణానాం తులితబిసినీ పత్రపయసాం।
కృతే కిం నాస్మాభి ర్విగళితవివేకై ర్వ్యవసితం।
యదాఢ్యానామగ్రే ద్రవిణమదనిస్సంజ్ఞ మనసాం।
కృతం వీత వ్రీడై ర్నిజగుణకథా పాతకమపి॥

మ॥ నళినీ పత్రగతాంబు చంచలము లెన్నం బ్రాణముల్ వీనికై
గళితప్రజ్ఞత మేము చేయని యసత్కార్యంబు లేదేమియున్,
బలవద్విత్తమదాతిరేక జనితా • పస్మారులైనట్టి లు
బ్ధుల ముంగల నిజసద్గుణస్తుతిమహా • దోషంబు గావించుటన్•

శ్లో॥ భోగా నభుక్తా వయమేవ భుక్తా
స్తపో నతప్తం వయమేవ తప్తాః॥

కాలో నయాతో వయమేవ యాతా
స్తృష్ణా నజీర్ణా వయమేవ జీర్ణాః॥

క॥ భోగానుభవంబు తపో
యోగము కాలంబు చనుట • యును ఘనతృష్ణో
ద్యోగవిరామము లే దహ
హా! గురుతవహించి తృష్ణ • యలజడి తెచ్చెన్.

శ్లో॥ వలిభి ర్ముఖ మాక్రాన్తం పలితై రంకితం శిరః।
గాత్రాణి శిథిలాయన్తే తృష్ణైకా తరుణాయతే॥

క॥ కరచరణాద్యవయవముల
భరముడిగెన్ వళులు మొగము • పైనిండారెన్
శిరసెల్లఁ దెల్లవాఱెను
దరిమాలిన తృష్ణయొకఁడె • తరుణతఁబూనెన్.

శ్లో॥ ఆశానామనదీ మనోరథజలా తృష్ణా తరంగాకులా,
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ।
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోత్తుఙ్గచిన్తాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నన్దన్తి యోగీశ్వరాః॥

చ॥ కలితమనోరథంబు లుద • కంబులు తృష్ణలు భూరివీచికా
వళులనురాగముల్ మకర • వర్గము మోహవితర్కముల్ స్ఖగుల్,

పులుఁగులుగాఁగ ధైర్యఫల•భూజముఁ గూల్చు దురాశ పేరిపు
ష్కలనదిదాఁటి నిత్యసుఖ•సంపదఁ గాంతురు యోగిపుంగవుల్.

శ్లో॥ "దినయామిన్యౌ సాయంప్రాత,
శిశిరవసన్తౌ పునరాయాతః,
కాలః క్రీడతి గచ్ఛత్యాయు,
స్తదపి న ముఞ్చ త్యాశావాయుః॥"

—శంకరాచార్యులు

చ॥ "శరధితరంగమట్లు ఋతు•షట్కము రేల్బవళుల్ ద్విసంధ్య
లున్। మఱిమఱి వచ్చుచున్న వికి్ర•మఁబుగఁ గాలము క్రీడ
సల్పెడిన్। తఱుఁగుచు నున్న దాయువు, య•థార్థ మెఱింగిన
వాయుతుల్యమౌ। దురితపుటాశ వోదనుచుఁ•దోయజనా
భు భజింపు మూఢుడా !"

శ్లో॥ "అఙ్గంగళితం పలితం ముణ్డం।
దశన విహీనం జాతం తుణ్డం।
వృద్ధో యాతి గృహీత్వా దణ్డం।
తదపి నముఞ్చత్యాశాపిణ్డం॥"

—హస్తామలకాచార్యుడు.

ఉ॥ దంతములూడినన్ బిగిసి • దప్పి శరీరము చిక్కినన్, శిరం
బంతయుఁ దెల్లవాఱినను•నన్నము దగ్గిన, నూతఁగొన్న, నో

క్కింతయు నాశసన్నగిల॰దీగృహదారలయందు దేహీ, కా
ళ్ళింతినివీడి వేఁడుమిఁకఁ॰బంకజనాభుని మూఢచిత్తుఁడా!"

అధునాతన కవికుమారుఁ డొక్కరుండు తృష్ణావిషయి
కంబగు నిజాభిప్రాయము నీరీతి మృదుమధుర మంజుల కవితా
శైలిని వెల్లడించియున్నాఁడు :—

చ॥ "ధననిధులెల్లగల్గినను ॰ ధాత్రిసమస్తము నేలుచుండినన్
గనుఁగొను మాశతీర దది॰గావున దానిబరిత్యజించి పొం
దినమరిపొందకున్నగడు॰తృప్తియెందునుబొందుచుండినీ
వనిశముభక్తి మీరమన॰సా! హరిపాదములాశ్రయింపవే॥"

"తృషార్తో దుఃఖమాప్నోతి పరత్రేహచ మానవః॥"

—హితోపదేశము.

"తృష్ణాన్వితు డుభయలోకభ్రష్టుఁడయి, దుఃఖవారిధిం
గూలబడును."

శ్లో:—"యత్ పృధివ్యాంవ్రీహియవంహిరణ్యం పశవఃస్త్రియః,
ఏకస్యాపి నపర్యాప్తం తస్మాత్తృష్ణాం పరిత్యజేత్।
యా దుస్త్యజా దుర్మతిభి ర్యా న జీర్యతి జీర్యతః,
యోఽసౌ ప్రాణాన్తకోరోగస్తాంతృష్ణాంత్యజతఃసుఖం॥
పూర్ణం వర్షసహస్రం మే విషయాసక్తచేతసః,
తథాప్యనుదినం తృష్ణా మమైతే ష్వభిజాయతే।

తస్మాదేనామహం త్యక్త్వా బ్రహ్మణ్యాధాయ మానసం,
నిర్ద్వన్ద్వో నిర్మమో భూత్వా చరిష్యామి మృగైస్సహ॥"
—మహాభాగవతము, నవమస్కంధము.

యయాతి కుమారునితో నీరీతి వచించెను: "నాయనా! నీయౌవనమును గైకొని దీర్ఘకాలపర్యంతము నేను భోగంబుల ననుభవించితి కాని యింకను గాంక్షానివృత్తియగుట లేదు. వసుధాస్థలియందున్న సకలధాన్యములను, కామినీ కాంచన పశ్వాదిక సంపదల నన్నింటిచే నొక్కమనుజుని తృష్ణనయిన దీర్చుట దుస్సాధ్యము. ఏతత్కారణంబున దృష్ణావివర్జితుండ వగుము. మూఢాంధులంటిపట్టుకొనియుండు దేహము సంపూర్ణముగా శిథిలమయి పోయినను, జీవాంతకంబును, మహాభుజంగ సదృశంబునునగు తృష్ణావ్యాధి నశింపదు. ఏతద్ధేతువుచే నీ భయంకరంబగు తృష్ణను దునుమాడ నేర్చినయతండే ధీరుడయి సుఖించును. ఏను సహస్రవర్షంబులాడిగ లోభనీయంబగు విషయవాంఛాసముదాయముల ననుభవించియుంటిని. నేటికిని తృష్ణాపిశాచము నన్వెంటాడుచునే యున్నది. కాన నింక నేనీ నిందనీయంబును, ప్రాణాంతకంబును నగు తృష్ణను బూర్ణముగా బహిష్కరించి యీశ్వర పదారవింద ధ్యానతత్పర హృదయుండనయి, సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడనయి, మమకారదూరుండనయి వన్యమృగములతో నధిక వాత్సల్యంబున జరియింపుచు శేషజీవితమును గడపెదను."

"శ్లో॥ మనోనామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు
చరత్యత్ర నగచ్ఛంతు సాధవో యే ముముక్షవః॥"

—రాజయోగ రత్నాకరము.

"విషయవికారమనియెడి భయంకరారణ్య భూముల మనస్సనియెడి భీకరవ్యాఘ్రము సంచరింపుచున్నయది. కాన నో సాధువులగు నిర్వాణాసక్తులారా! మీరచ్చోటి కరుగవలదు."

విశ్వప్రేమగత జీవులకును, జ్ఞానులకును లోహకాష్ఠ రజ్జు వినిర్మిత బంధనము లౌక పాశములు కావని బుద్ధాచార్యుడు నుడివెను.

"Stone walls do not make a prison,
Nor iron bars a cage,
Minds innocent and quiet take
That for an hermitage."
"If I have freedom in my love,
And in my soul am free;
Angels alone that soar above,
Enjoy such liberty."

—Lovelace.

"శిలానిర్మిత కుడ్యపరివేష్టిత ప్రదేశము కారాగారము కాజాలదు. లోహదండనిర్మిత గేహము బంధించుట కొక్క బోను కాజాలదు. నిర్దోషియు, శాంతచిత్తుండును నగు పురుషుని కివి యొక్క పవిత్రంబగు నాశ్రమమువంటివె". "నా

పేరిమయందు స్వాతంత్ర్యమే యున్నచో, మదీయాత్మ స్వతంత్రమే యగుచో నే నపూర్వానందమునే యనుభవింపగల్గుదు ఈ యానందమును కేవలము గగనమున విహరించు దేవదూతలే యనుభవింపుచుందురు.'' ఆత్మస్వేచ్ఛ యంతర్బాహ్య ప్రకృతుల వశీకరణంబుననే లభ్యమగును. అందు దృష్ణయు దగ్ధమయిపోవును.

"శ్లో॥ మమపితా మమ మాతా మమేయ గ్గృహిణీ గృహం।
ఏవం విధం మమత్వం యత్ స మోహఇతి కీర్తితః॥"
—పద్మపురాణము.

"'నాజనని, నాజనకుడు, నాపత్ని, నాగేహము' అను మమత్వమునే మోహమని యెదరు. ఈమోహమే యసారంబులగు వస్తువులయందు తృష్ణనొదవజేయును."

శ్లో:—నఖల్వ ప్యరసజ్ఞస్య కామః క్వచ న జాయతే।
సంస్పర్శా ద్దర్శనాద్వాపి శ్రవణా ద్వాపి జాయతే।
అప్రాశన మసంస్పర్శ మసందర్శన మేవచ।
పురుషస్యైష నియమో మన్యే శ్రేయో నసంశయః॥"
—మహాభారతము, శాంతిపర్వము.

భీష్మాచార్యులవారు ధర్మజున కీచందమున నుపదేశించి యున్నాడు:—"ఏమనుజు డెద్దానియందు రసజ్ఞుడయి యుండడో వానికద్దానియందు వాంఛ యుదయింపదు. కాని సందర్శన

సంస్పర్శనశ్రవణంబుల నభిలాషజనించుట స్వాభావికంబగును. ఈమర్మమును గ్రహించి దుర్భావముల నొదవించునట్టి యే దృశ్యము నవలోకింపదగదు; స్పృశింప జనదు; ఆకర్ణింప వలదు. ఈనియమము ప్రతిమనుజునకు శ్రేయోదాయకము కాగలదు. ఇం దావంతయు సందేహము లేదు."

"సైతాను నవలోకించినంతనే భయముజెందక జుట్టు పట్టి యీడ్చువాని కామక్రోధ మదతృష్ణాది దుర్గుణము లన్నియు గూకటివేళ్లతో దమంతటదామే పెల్లగిలును."

—క్రీస్తుదేవుడు.

శ్లో॥ "వికారహేతౌ సతి విక్రియన్తే।
యేషాం నచేతాంసి తఏవ ధీరాః॥"

—కుమారసంభవము, ప్రథమసర్గ.

"వికారోత్పాదకపదార్థములకు సయితము మించుకయు జలింపని చిత్తముగలవారే ధీరులు."

దానము సేయుటకే హస్తములను; సత్యభాషణమునకును, జ్ఞానోపదేశమునకును ముఖమును; సత్పురుష సందర్శనగమనమునకు బాదములను సర్వేశ్వరుం డొసంగియున్నటుల భారతభాగవతాది యుద్గ్రంథములు ఘోషింపుచున్నయవి:

"త్యాగశ్రేష్ఠంమునయో వైవదన్తి" "నాస్తి త్యాగసమంసుఖం."

—మహాభారతము, శాంతిపర్వము.

"త్యాగమే శ్రేష్ఠ మయినదని మునులు వచించుచు న్నారు." "త్యాగమునుబోలు సుఖము లేదు."

ధర్మనందనుడు భీష్మాచార్యుల నిట్లుపృచ్ఛించెను:—

"కీదృశాః సాధవో విప్రాః కేభ్యోదత్తం మహాఫలం?"
"ఏవిప్రుడు శ్రేష్ఠుడు? ఎవనికి దానమొసంగ వలయును?"

భీష్ముని ప్రత్యుత్తరము:—

"అక్రోధనా ధర్మపరాః సత్యనిత్యా దమేరతాః।
తాదృశాః సాధవో విప్రా స్తేభ్యోదత్తం మహాఫలం॥"

"క్రోధరహితులును, ధర్మపరాయణులును, సత్యవాదులును ఇంద్రియ నిగ్రహులును నగువారె శ్రేష్ఠులగు విప్రులు. వారికి దానమొసంగుట లాభదాయకము."

శ్లో:—"అమానినః సర్వసహా దృఢార్థా విజితేన్ద్రియాః।
సర్వభూతహితా మైత్రా స్తేభ్యో దత్తం మహాఫలం॥"

—మహాభారతము.

"మానాభిలాషావిహీనులును, సహనశీలురును, ధర్మమునందు సుస్థిరమతులయి యున్నవారును, సకలభూతహితపరతంత్రులును, సకలభూతమిత్రులును నగు శ్రేష్ఠమానవులకొసంగు దానమే శ్రేయోదాయకమయినది."

శ్రీబుద్ధాచార్యుని తృష్ణావిషయక మీమాంసను బలపఱచు సిద్ధాంతవాక్యములు లక్షోపలక్షలు కలవు. వాని నన్నింటి చేర్చుటకిచట వీలుపడదు.

* * * * *

భిక్షువర్గము. (సన్యాసివర్గము)

ఈవర్గమునందు శ్రీ బుద్ధదేవుడు "వైరాగ్య విధానమును గుఱించియు, శ్రమణ ధర్మలక్షణావళులను గూర్చియు, సన్యాస వ్రతానుష్ఠానంబున లబ్ధమగు మహదానందాతిశయమును గుఱించియు బోధించియున్నాడు. శ్రమణుడు, భిక్షువు, సన్యాసి, విరాగి, అవధూత, గోస్వామి మొదలగు శబ్దములన్నియు విశేషించి విరక్తునకు జెందు పదములె. పరస్పరభేద మల్పము.

శ్లో॥ "జ్ఞేయః నిత్యసన్యాసీ యో నద్వేష్టి నకాంక్షతి।
నిర్ద్వన్ద్వోహి మహాబాహో సుఖంబంధాత్ప్రముచ్యతే."

—భగవద్గీత, 5వ అధ్యాయము.

"ఓయర్జునా! ఘృణను సమయజేసినట్టియు, నభిలాషాసముదాయమును వర్జించినట్టియు, రాగద్వేషాది ద్వంద్వముల నశింపజేసినట్టియు, పాశవిముక్తుడయినట్టియు వ్యక్తియే సన్యాసి యనబడును."

శ్లో॥ "యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే॥"
—భగవద్గీత, 5 అ.

"యోగము (భక్తిజ్ఞాన కర్మసాధనము) నందు నిరతుడయినట్టియు, పరిశుద్ధాంతఃకరణవిభాసితుండయినట్టియు, మనస్సును జయించినట్టియు, సమస్తేంద్రియముల వశమొనరించుకొనినట్టియు, సకలభూతాత్మల స్వాత్మసమానముగ మదినవలోకించునట్టియు వ్యక్తిసత్తముడు కర్మము నాచరించుచుండియు బంధనముల జిక్కడు."

శ్లో॥ "బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతి యః!
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా॥"
—భగవద్గీత, 5. అ. 10.

"విశ్వసత్తయం దైక్యమయినట్టియు, సంగమును ద్యజియించివైచినట్టియు వ్యక్తిసత్తముడు ప్రవృత్తిమార్గమునందున్నను వానిని నళినీదళగత జలకణంబుపగిది పాపసముదాయము స్పృశింపనేరదు."

శ్లో॥ "ఇహైవ తేర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాత్ బ్రహ్మణి తే స్థితాః॥"

"సమాధాన వృత్తియందున్న చిత్తముచే వెలయునట్టి మానవోత్తముండు దేహమును సులభముగనే జయించు

చున్నాడు. కారణమేమనగా నిర్దోష సమమగు బ్రహ్మయందే నిత్యము వాడుండు చుండును.''

''నప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్యచాప్రియం
స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవిద్ బ్రహ్మణి స్థితః॥''

—5 అ. 20 శ్లో.

''ప్రియపదార్థ ప్రాప్తిచే సంతుష్టాంతరంగుడు కానట్టియు, నప్రియవస్తుసంప్రాప్తివలన దుఃఖితుడు కానట్టియు, నిర్లిప్తుండును, స్థిరచిత్తుండును నగుజ్ఞానిసత్తముడు నిర్వాణవిదుడై నిర్వాణస్థితుండగును.''

''బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖం।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే॥''

—భగవద్గీత, 5 అ. 21 శ్లో.

''బాహ్యప్రశ్య విషయంబుల నెవ్వానిచిత్తము లగ్నముగాకుండునో, స్వాంతముసం దెవ్వాడు నిరంతర సుఖానుభవము నందుచుండునో, అట్టి విశ్వసత్తైక్యయోగిపురుషుడు నశింప నట్టియు, శాశ్వతం బయినట్టియు నానందమునకు బ్రాపించును.''

''కామక్రోధ విముక్తానాం యతీనాం యతచేతసాం।
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనాం॥''

—భగవద్గీత, 5 అ. 26వ శ్లో.

"కామక్రోధ రహితులును, చిత్త విజేతలును, ఆత్మ జ్ఞాన సంపన్నులును నగుయతీశ్వరులకు శీఘ్రకాలమునందే నిర్వాణము లభ్యముకాగలదు."

"యతేన్ద్రియ మనోబుద్ధి ర్మని ర్మోక్షపరాయణః।
విగతేచ్ఛా భయక్రోధో యః సదాముక్త ఏవ సః॥"
—5 అ. 28 శ్లో.

"మోక్షము నన్వేషించు మునీశ్వరుడు మనో బుద్ధీంద్రియముల జయించి, కామక్రోధాదుల విసర్జించి, సర్వదా విముక్తుడయి యుండునని తాత్పర్యము."

"బంధురాత్మాత్మన స్తస్య యే నాత్మై వాత్మనా జితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్."
—భగవద్గీత. 6. 6.

"తన్నుదా జయించుకొనినవాడు తనకు దానే మిత్రుడగును. తన్నుదానుజయించుకొనలేకపోయినవాడు తనకుదానే శత్రువగును."

"జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః।
యుక్త ఇత్యుచ్యతేయోగీ సమలోష్టాశ్మ కాఞ్చనః॥"
—భ. అ 6. శ్లో. 8

"జ్ఞాన విజ్ఞానముల సంతుష్టమయియున్న హృదయమును గల్గియున్నట్టియు, స్థిరచిత్తుండయినట్టియు, సమస్తేంద్రియ విజ

యమును బడసినట్టియు, మట్టిపెల్లను, సువర్ణ ఖండము నొక్క దృష్టితో నవలోకించునట్టియు వ్యక్తియే సిద్ధుడు."

"సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు।
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥" 6. 9 శ్లో.

"పేర్మాస్పదుడు, మిత్రుడు, శత్రువు, పరమహంస, మధ్యస్థుండగు వైరి, బంధువు, సాధువు, పాపి మొదలగువారి నొక్కదృష్టితో గాంచువాడే శ్రేష్ఠుడు."

"యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరం।
తత స్తతో నియ మ్యైత దాత్మ న్యేవ వశంనయేత్॥"
— 6 అ. 26 శ్లో.

"చిత్తము చంచలమగునపుడెల్ల దానిని నిరోధించి వశ మొనరించుకొనవలయును"

"పార్థ! నై వేహనాముత్ర వినాశ స్తస్య విద్యతే।
నహి కల్యాణకృత్కశ్చిద్ దుర్గతింతాత! గచ్ఛతి॥" 40 శ్లో.

"ధనంజయా! శుభకర్మ నాచరించువా డిహపరముల దుర్గతికి బాల్పడడు."

శ్రీ బుద్ధాచార్యులవారు భిక్షువర్గమునం దుపదేశించియున్న జ్ఞానోపార్జనము, సంయమ పరిపాలనము, ఇంద్రియ వశీకరణము, సన్యాసిలక్షణములు మొదలగు విషయంబులను సంబంధించిన శ్లోకము లెన్నియో భగవద్గీతయందు కలవు. వాని నన్నింటిని నుదహరింప వలనుపడదు.

"కామైరహతధీ ర్దాంతో మృదు శ్శుచి రకించనః।
అనీహో మితభు క్శాంత స్థిరో మచ్ఛరణో మునిః॥"

కాంతానాంతరంగ పరిహారంబుల జలింపని స్థిరబుద్ధియు, మృదుమంజుల స్వభావ విరాజితుండును, పరిశుద్ధుండును, సందేహ విరహితుండును, ఆశాపాశ విముక్తుండును, మితసాత్వికాహార భోక్తయు, నిత్యశాంత చిత్తుండును, అచంచలప్రజ్ఞామతియు, నిర్వాణమునందే విశ్వాసమును గల్గినవాడును సన్యాసియని శంకరాచార్యులవారు వివేకచూడామణియం దవధూత వివరణమున జెప్పియున్నారు.

శ్లో॥ భిక్షాసీ జనమధ్యసఙ్గరహిత స్స్వాయత్తచేష్ట స్సదా,
హానాదానవిరక్తమార్గ నిరతః కశ్చి త్తపస్వీ స్థితః।
రథ్యాకీర్ణవిశీర్ణ జీర్ణవసనై రాస్యూతకన్థాధరో,
నిర్మానో నిరహంకృతి శ్శమ సుఖాభోగైకబద్ధస్పృహః॥"

—భర్తృహరి.

"భిక్షాన్నము నారగింపుచు, జనసంఘుమధ్యమందున్నను వారి సంగతిని బాసి స్వతంత్రుడయి, గ్రహణత్యాగములకు దూరముగానుండి, ఆడంబరము లేని వల్కలముల ధరించి నిరభిమానాహంకారుడయి, శాంత్యానందరసప్రవాహంబున దేలియాడుచుండునతడయి యోగీశ్వరు డుండును." (యోగమనగా దుఃఖమునుండి ముక్తినొసంగునదని భగవద్గీతాకర్త వచించెను.)

శ్రీబుద్ధభగవానుడు పేర్కొనియున్న భిక్షువుధర్మంబులును, లక్షణములును సామాన్య భేదముతో భగవద్గీతా, భారత, భాగవతాది పూర్వగ్రంథములయం దనేకశ్లోకముల గలవు. బుద్ధునిభిక్షువు ప్రధానముగా సమస్తేంద్రియ విజేతయయి, నిరాడంబరుడయి, మాధుకర వృత్తిచే శరీరమును బోషించుకొనుచు, లోభమద తృష్ణాబహిష్కార మొనరించుచు, సమస్తలోకహితమునందు నిరతుండయి యుండును. హిందువుల మునులు, ఋషులు, తపస్వులు, యతులు, గోసాయిలు, సన్యాసులు, మహాత్ములు నిట్టివారె.

* * *

బ్రాహ్మణ వర్గము.

ఈవర్గమునందు శ్రీబుద్ధాచార్యులవారు "బ్రాహ్మణధర్మ ముత్తమంబనియు, బ్రాహ్మణుడనువాడు జన్మచేగలుగక గుణముచేతను వృత్తిచేతను గర్మచేతనే యగుననియు, సద్గుణఖనియే బ్రాహ్మణుండనియు ధర్మజ్ఞాన గుణవిహీనుడు నామమాత్ర బ్రాహ్మణుండనియు" నిరూపించి యున్నారు.

శ్లో:—"శమోదమ స్తపః శౌచం క్షాన్తి రార్జవ మేవచ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజం॥"
—భగవద్గీత, 18 అధ్యా. 42 శ్లో.

"సమత్వము, దమము (ఇంద్రియ నిగ్రహము), తపము, పారిశుద్ధ్యము, శాంతి, సాధుత్వము లేక సారళ్యము, జ్ఞానము విజ్ఞానము, ఈశ్వర (నిర్వాణము) విశ్వాసము, మొదలగు గుణములన్నియు బ్రాహ్మణునం దుండవలయునని యె భావము."

"బ్రహ్మనెఱిగి నట్టివాడె—బ్రాహ్మణుండు కానమున్న
బ్రహ్మమైన వేదమందు బ్రహ్మగనవలెన్."
—దయానంద సరస్వతి.

బ్రాహ్మణలక్షణంబు లెట్టివను నహుషప్రశ్నంబునకు పాండునందనుం డిట్లు ప్రత్యుత్తరం బొసగె:—

సీ. "సత్యక్షమాదమ • శౌచదయాతపో
దానశీలంబు లెం • దేనిఁగాన
నగు నట్టివాఁడు బ్రా • హ్మణుఁడు సుఖంబు దుః
ఖమునైన యెడ నిమో • హమును బొంద
కునికియ వానికి • నుత్తమంబగు విద్య......"

నహుషుండు బ్రాహ్మణ లక్షణలక్ష్యంబుల నెఱిఁగి, బ్రాహ్మణలక్షణయుక్తుండగు శూద్రయోని సంభూతుడు విప్రుం డుకానేర్చునాయని పృచ్ఛింపబాండవాగ్రజుండు: 'ఏ ప్రమాదంబున వర్ణసంకరం బయినప్పుడు వర్ణపరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేలువేల స్వాయంభువుండయిన మనువు సెప్పె. సత్యాది గుణంబులు శూద్రునందు గలిగెనేని వాడు బ్రాహ్మ

ణుండు గానేర్చును. ఆ సద్గుణములే బ్రాహ్మణునందు లేని నాఁడు శూద్రుండ యనంబడుం గావున వృత్తంబ యుత్తమంబు.

గీ॥ వృత్తవంతుండు వెఁడియు • వివిధగతుల
విత్తవంతుడు గానేర్చు • వృత్తహీనుఁ
డైనవాఁడు విహీనుండ • యండ్రుగాన
విత్తరక్షకు గడు మేలు • వృత్తరక్ష. (ఆంధ్రమహాభారతము)

అనివచించెను."

ధర్మవ్యాధుడు నిజజననీ జనకుల సన్నిధికి గౌశికుని దోడ్కొని పోయి, బ్రాహ్మణ గుణముల నిట్లు వక్కాణించెను :—

కం॥ నిత్యముఁ గర్మియుఁ గర్మఫ
లత్యాగియునగుట లెస్స • లౌల్యవియోగం
బత్యుత్తమయోగము ద
ద్భృత్యయలక్ష్యుండు సూవె • బ్రాహ్మణుఁడు మహిన్.

చ॥ అరయఁగజీవితంబుగడు • సధ్రువమింత యెఱింగియాత్మనె
వ్వరిదెసఁ గీడురోయకధుర్యవంబగు మైత్రిభజించిసత్కృపా
పరతుఁడునిస్పరిగ్రహుఁడు • నిత్యతపస్వియునిత్యతృప్తుఁడుం
బరమశమాస్పదుండునగు • బ్రాహ్మణుడొందుసనాతనస్థితిన్."

—ఆంధ్రమహాభారతము.

"ఘూర్జరదేశీయ భక్తశేఖరుండగు నరసీ మెహతా గారిచే స్వాత్మానందప్రియంబుగా మాతృభాషయందు విరచింపబడిన యీగీతములను గాంధిభగవాను డాత్మీయపరిశుద్ధహృదయ ఫలకంబున జిత్రించికొనియెను :—

"వైష్ణవజనతో తేనేకహియే జో పీడపరాయీజాణేరే.
పరదుఃఖే ఉపకారకరేతో యేమనఅభిమానననఆణారే.
సకలలోకమాఁ సౌనేబన్దే నిన్దా నకరే కేనీరే,
వాచ, కాఛ, మన, నిశ్చయరాఖైధనధనజననీ తేనీరే.
సమదృష్టీనే తృష్ణాత్యాగీ పరస్త్రీ జేనేమాతరే,
జిహ్వాథకీ అసత్యనబోలే పరధననవఝాలే హాథరే.
మోహమాయా వ్యాపే నహిఁజేనేదృఢవైరాగ్య జేనా మనమాఁరే
రామనామసూఁతాలీలాగీసకలతీరధ తే నామననమాఁరే
వణలోభీనే కపటరహితఛే కామక్రోధ నివార్యారే,
భణేనరసైయోఁతే నూఁదర్శనకరతాఁకుల ఏకోతేర తార్యారే.

పైనుదహరింపబడిన గీతాపంచకమునందు వైష్ణవుని లక్షణములన్నియు నున్నవి. ఇక్కాలమున వైష్ణవుడనువాడు బ్రాహ్మణశాఖకు జెందినవాడయి యున్నాడు. విష్ణువనగా నీశ్వరుడు. బౌద్ధు లీశ్వరునే నిర్వాణ మందురు. నిర్వాణప్రాప్తికి పశ్వాసత్త్వాత్మక జీవితము వ్యక్తికావశ్యకము. నిర్వాణచింతనా

పరుడు లేక యపరిమత్తుడే వైష్ణవుండగును. ఇట్టివానినే బ్రాహ్మణుండని బుద్ధాచార్యులు నుడివియున్నారు. పైగీతముల భావార్థమియ్యది:—"పరులబాధను గ్రహించువాడును, అనగా నాత్మవత్సర్వభూతాని యని యెఱుంగువాడును, దుఃఖగ్రస్తులగువారికి సాహాయ్య మొనరింపుచుండియు గించిదభిమానమునయిన నెఱుంగనివాడును, సకలలోకములం దెవరిని నిందింపనివాడును, త్రికరణ స్థిరసంపన్నుండును, సమదృష్టియు దృష్ణావివర్జితుండును, పరస్త్రీని మాతృతుల్యముగ భావించువాడును, అసత్యమును భాషింపనివాడును, పరధనాపేక్షాశూన్యుడయినట్టి వాడును, మాయామోహ దూరుండును, స్థిరనిత్య వైరాగ్య ధనసంపన్నుండును, విగతలోభుండును, కపటవిహీనుండును, కామక్రోధాది రిపుషట్క విజేతయును నగు నట్టి వైష్ణవుడు కరతాళధ్వనితో రామనామ సంకీర్తనము సేయుచు సకలతీర్థముల హృదయంబునందే గనుచుండును. అట్టివాని దర్శనమాత్రంబున గులమెల్ల దరించునుగదా!"

"జ్ఞానకర్మోపాసనాభి ర్దేవతారాధనే రతాః।
శాన్తో దాన్తో దయాలుశ్చ బ్రాహ్మణశ్చ గుణైకృతః."

—శుక్రనీతి. అధ్యా.1 శ్లో 40.

"జ్ఞానకర్మోపాసనాదులచే బరమేశ్వరారాధనయందు రతుడయి, శాంతుడయి, దాంతుడయి, దయాళుడయియుండు వాడే బ్రాహ్మణుడు."

శ్లో:— "నయోని ర్నాపిసంస్కారో నశ్రుతం నచసంతతిః।
కారణాని ద్విజత్వస్య వృత్తమేవతు కారణం॥
సత్యం దానం క్షమాశీల మానృశంస్యం తపో ఘృణాః
దృశ్యంతే యత్ర నాగేంద్ర స బ్రాహ్మణఇతి స్మృతః॥
—మహాభారతము, వనపర్వము.

ఈశ్లోకద్వయమున కర్థమునుపైన వ్రాసియేయుంటి.
"బ్రహ్మజ్ఞానేతు బ్రాహ్మణః"
"బ్రహ్మజ్ఞానముననే బ్రాహ్మణుండగును."

సమాప్తము.



శ్రీబుద్ధదేవు డశ్వత్థ వృక్షతలంబున నుపవిష్టుడయి దృఢతాపూర్వకంబుగవక్కాణించియున్న * "మైత్రీబలేన జిత్వా, కరుణాబలేన జిత్వా, ముదితాబలేన జిత్వా" యనుశ్లోకమునకు భర్తృహరి "కురుత కరుణామైత్రీ ప్రజ్ఞా వధూజన సంగమం" అనుశ్లోకఖండముచే సార్థక మొనరించి యున్నాడు.

భర్తృహరిశ్లోకంబులకు బద్యరూపంబున దాత్పర్యము వ్రాసినవారు. ఏనుగ లక్ష్మణకవిగారు. శంకరాచార్యుని శ్లోకములకు దెనుగున గబ్బముల్లిన కవు లనుర్యేలు. ఆపద్యములు నావికావు. ఈవిశేషాంశముల నెల్ల సాంగోపాంగముగ బఠించు

విజ్ఞప్తిపంచము బౌద్ధక్రైస్తవ హిందూమతంబు లన్నియు ప్రాచీనార్షమతపుత్రికలే యనియు, సమయానుకూలంబుగ నేవో కొన్నికారణాంతరములచే భిన్న బాహ్యరూపంబుల దాల్చి, అభేద్యంబును, ఐక్యంబునునగు ధర్మాదర్శ హృదయాంబుజముతో వెలయుచున్న వనియు దెలియగలరు. సూక్ష్మంబులగు విజ్ఞానమయ దృక్కుల సకలమతాంభ్యంతరిక రూపంబున నవలోకించువారు మతభేదము హుళక్కియే యనియు, సకలమతధ్యేయ మొక్కటియే యనియు గ్రహింప గలరు. సకలమతసామరస్య గ్రహణమే మనవిధి.

సర్వేజనాస్సుఖినో భవంతు!



---

* ఈశ్లోకము "పరిశిష్టము: విశేషాంశములు" యొక్క శాద్ధసాధకుని నిర్వాణముతుదిని గలదు.

# సత్యధర్మపరిబోధగీతావళి

బ్రాహ్మహృదయము బౌద్ధధర్మ హృదయమునం
దీచందమున మేళగించుచున్నది:

గీ॥ ఆదిమధ్యాంత వర్జియా • నభవుచేత
నిర్మితంబైన సృష్టిని • నీతిగల్గి
ధూర్త బుద్ధిని సతతంబు • దూఱ కుర్వఁ
బూజసేయుటె బ్రాహ్మల • పుణ్యమతము. 1

ఆత్మవ త్సర్వభూతాని • యనెడి సూక్తి
బ్రాహ్మ సంఘంబు నందునఁ • బరగుచుండు
విశ్వమానవ ప్రేమయు • వెలయుచుండు
నిల దురాచారపుంజంబు • దొలఁగియుండు 2

బ్రాహ్మలెల్లరు వసుధపై • భవ్యమతిని
వేదవాక్యముల్ సర్వత్ర • వెలయఁ జేసి
జాతిభేదంబు లన్నింటి • జాఱవిడచి
సర్వజాతుల సమముగ • స్వాంతమందు
దలఁచుచుందురు జ్ఞానులై • ధర్మవృత్తి. 3

బుద్ధదేవుడు చాటిన • శుద్ధగీత
ననుసరించిరె సర్వదా • యరుగు చుండు
రామమోహన రాయని • రమ్యమతము
భేద మిసుమంత యైనను • లేదు, లేదు! 4

గీ॥ సర్వమతముల ధర్మంబు • సరగఁజూడ
బీదసాదల రక్షించి • సాదరమున
జీవకోటుల సంతత • క్షేమమరసి
భక్తితోడను సర్వేశుఁ • బ్రణుతిఁజేసి
ముక్తి పదవిని బొందుటే • పురుషులార! 5

దానధర్మంబులన్నింట • దయయె గొప్ప
దయనుబాసిన మనుజుఁ డెం • దగునఁ జెడఁడె?
పరుల కుపకారమొనరించు • నరుఁడు ధరణి
నాత్మ సామ్రాజ్య సౌఖ్యంబు • లందుఁ గాదె! 6

సర్వజీవులపై భువి • సంతతంబు
గరుణను వహించు మనుజుండె • ఘనుడు సుమ్మి
హింసఁ జేసెడి వాఁడె నృ • శంసుడనఁగ
మహిని బరఁగుచునుండు నో • మాన్యులార! 7

యజ్ఞయాగాదు లెన్నియో • యనవరతముఁ
జేయుచుండెడి హిందువుల్ • చెసఁటుబగుచుఁ
ధరణి ధర్మంబు వీడి కు • తంత్రులగుచు
వెలయుచుండుట నిజమయ్య • విజ్ఞులార! 8

గాంధిదేవుని ధర్మంబు • గ్రాంచుఁ డయ్య
చెంపఁగొట్టినఁ గినియక • చెంపఁబట్టు



గుండెఁజూపిన ధీరుఁడై • గుండెఁజూపు

గీ॥ బీదసాదల నవనిపై • బ్రీతిమెరయఁ
గావ నవతారమెత్తిన • దేవుఁడితఁడె 9

బుద్ధచంద్రుఁడు చేసిన • బోధయందు
గాంధిచంద్రుని ప్రస్తుత • గాథయందు
రామమోహన రాయని • వ్రాఁతయందుఁ
దారతమ్యము నరయ సుం • తయును లేదు
ధీరగుణులార! హైందవ • పౌరులార! 10

మతము మతమంచు నిరత మి • మ్మహిని నీతి
జాతిభేదంబులం గల్గి • సంతతంబు
సృష్టియందలి సారంబు • నష్టపఱుప
ముక్తిభుక్తులు గల్గునే • పురుషులార! 11

మూఁడుదినముల బ్రతుకు కీ • గోడు లేల?
దేవుఁ డొకఁడని శాస్త్రముల్ • దెలుపుచుండ
వివిధదైవంబులను గొల్చి • వింతగాను
శత్రుమైనట్టి ధర్మముల్ • దప్పఁజనునె! 12

సంకుచితమైన దుర్భావ • సమితిఁ బాసి
సర్వధర్మంబు లందుండు • సరసమతము
స్వీకరించి మెలంగుట • శిష్టజనుల
ధర్మమని నేను ధ్రువముగఁ • దలఁచి చెప్ప
సాహసింపుచు నున్నాఁడ • సరసులార! 13

గీ॥ మతమనఁటన్నది వేఱుగ • మహిని లేదు
మనుజవిశ్వాస మదియపో • మతమనంగ
సామ్యవాదంబె జగమున • సత్వరముఁగ
సంతసంబును గొల్పుట • సత్యమయ్య
బౌద్ధ ధర్మంబు నిద్దియే • పల్కుచుండు. 14



గీ॥ విశ్వమంతయు సృజియించి • వెలయునట్టి
యీశ్వరునిజాడ నాత్మనూ • హించునరుఁడు
భూతదయగల్గి సరసంపు • నీతిగల్గి
మృత్యుదేవత నిలఁ గాంచి • భృత్యుఁడగును
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 15

జ్ఞానవిజ్ఞాన భేదంబు • గనుచునెవఁడ
విద్య నెడఁబాసి బుద్ధిచే • వెలయుచుండు
నతఁడె బ్రాహ్మణుఁడై జగ • న్నుతినిగాంచి
నిర్మలానంద గరిమచే • నెగడఁగలఁడు
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 16

జన్మమునఁగల్గు వర్ణంబు • జగతిలేదు
వృత్తిచేతనె వర్ణము • వృత్తియయ్యెఁ
[illegible] • [illegible]

గీ॥ వర్ణవిద్వేషమును వీడ • వలయు నరుఁడు
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 17

గొప్పయనియెడి భావంబె • ముప్పుఁదెచ్చు
నదియె భ్రాంతిరైై సతతంబు • నవనిఁజెలఁగి
యస్థిరంబైన కాయంబు • నంటుఁగాన
శుద్ధమౌ నాత్మ సద్దానిఁ • జూడలేము
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 18

* కర్మవలననె దేహంబు • గలుగుచుండు
నాత్మసామ్రాజ్య మందలి • యఖిలసుఖముఁ
గర్మమును బాయుమనుజుండు • గాంచగలఁడు
లాతివానికి నేరీతి • లభ్యమగును
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 19

కర్మపాశముల్ ఖండింపఁ • గడఁగువాఁడు
జ్ఞానఖడ్గంబుఁ గరమున • బూనవలయు
లోహనిర్మితఖడ్గంబు • దేహపాశ
తతిని ఖండింపఁ జాలదు • తథ్యమిద్ది
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 20

సర్వమునకును మూలమౌ • సదమలాత్మ
యంతరంగంబునందె తా • నరయఁగలదు

* కర్మ జననమరణములకు హేతుభూతంబగు దుష్కర్మ...

చెట్లఁ బుట్టల వెదుకంగ • నేమమగునె
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 21

కరములో నవనీతము • గల్గియుండి
నేతికై పరువ్వులెత్తెడు • నీతిహీన
మానవునిబోలు జగము నె • మ్మదిదలంపఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 22

అంతరంగంబునందు లే • నట్టి జెట్టి
విశ్వనిర్మాత యన్యత్రి • వెలయునొక్కొ
చిత్తశుద్ధిని బడయని • చెనఁటివాఁడు
దేవళంబుల దేవుని • దీప్తిమెఱయ
జూడలేడెప్డు నిజముగఁ • జూడఁబోఁడు
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 23

జ్ఞానదీపికచేత న • జ్ఞానతిమిర
జాలములు దూరమైపోవు • జగమునందుఁ
తిమిరజాలంబు లెడఁబాయఁ • దిరముగాను
నిత్యమైనట్టి మార్గంబు • నెఱి లభించుఁ
బాయరా! తృష్ణ ముక్తికై బాలకృష్ణ! 24

స్థూలదేహంబు నశియించు • వేళయందు
ముక్తి నరులకు దొరకదే • యుక్తినయిన
దేహముల మూటి నెడఁబాయు • దేహియొకఁడె
తిరిగి దేహముల్ బడయక • త్వరితగతిని

గీ॥ మోక్షసామ్రాజ్య సుఖములం • బొందఁగలఁడు
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 25

జాతిభేదం బనఁగ నొండు • జగతిలేదు
చర్మ మెల్లగ నొక్కఁడె • చర్చ సేయఁ
గాయధారణ మది కర్మఁ • గలుగుచుండ
నగ్రవర్ణంబనంగ నీ • యవనిఁగలదె?
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 26

మాయనెడబాయ సర్వంబు • మనదెయగును
నేను నీవన్న భేదంబు • నెగడుదనుకఁ
జిత్తవృత్తులు మనయందె • చెలఁగుచుండుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 27

దేహామే సర్వమనుచును • దెలియునరుని
సౌఖ్యముల్ భువి మృగతృష్ణ • సరణినుండు
దేహమస్థిరంబని యెంచు • దేహియొకఁడ
ముక్తికన్యను జేపట్టి • ముదమునందుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 28

సృష్టియంతయు దేవుని • చేష్టయగుట
వాని నేరీతిఁ బూజింప • వాంఛకలదొ,
అవ్విధంబున నే సృష్టి • నరయువాఁడు
తాన జగమున దేవుఁడై • తనరఁగలఁడు
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 29

తృష్ణయనునది మదిలోన • దీరెనేని
చింత కల్లైన మనుజుల • చెంతరాదు
సుఖమె సర్వత్ర సతతంబు • జూడ దొరకు
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 30

నామరూపక్రియ లరయ • నశ్వరములు
భోగభాగ్యంబులన్నియు • బూటకంబు
లన్నదమ్ముల స్నేహమ్ము • లరయ సున్న
నిండుభక్తియె తలపంగ • నిత్యమయ్య
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 31

ఆత్మవాక్యంబులను భువి • నరయువాడు
చిత్తమందలి కోర్కుల • రిత్తకోర్కు
లనుచు భావింపుచుండెడి • యమలగుణుడు
దీనజనరక్షకునియందు • లీనమగును
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 32

జీవు డీశ్వరు డనువారు • చేరి యొకటె,
భేదమిసుమంత యైనను • లేదు సుమ్మ;
నీవు నేనను భేదంబు • లేనిపగిది
జీవు డీశ్వరుడే సుమ్మ • చెనటి నరుడ!
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 33

వ్యష్టికాయత్రయోపాధి • వాగుర బడి
చెలగుచుండును నాత్మయే • జీవుడనగ

భిన్నమై దీనికి సతంబు • వెలయు బ్రహ్మ
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 34

మూఢులైనట్టి మనుజులీ • గూఢమతము,
నెఱుఁగఁజాలక భేదమా • నెఱుకబడసి
వెలయుచుందురు భ్రష్టులై • విశ్వమందుఁ,
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 35

నీవె వాఁడుగా జగమున • నెగడుచుండ
వేఱుమతి లేక దేవుని • వెదుకఁజనునె
మూర్ఖమానవుఁడా! నీవు • ముక్తిపథము
వెదుక యత్నింప భేదముల్ • వీడవేల?
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 36

జగము నెఱిఁగిననరునకు • జందెమేల!
బాహ్యవేషంబె మనుజుల • భ్రష్టపఱచుఁ
జిత్తశుద్ధియె నిజముగఁ • జేర్చుసుఖముఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 37

జనకరాజర్షి చందాన • జగమునందు
సంగమంబును బాసిన • సౌఖ్యతతిని
గనిసఁ గామంబు సుంతేని • గలుగఁబోదు
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 38

నీటిబుగ్గ విధంబున • నెగడుజగతి
మాయయని యెంచి యద్దాని • హేయభావ

తలనివీడంగ మోక్షంబు • త్వరగఁగల్గుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 39

గృహము నెడఁబాసి చనినంతఁ • దృష్ణ నరుని
బాయఁజాలదు నిజముగఁ • బాయజాల
దింద్రియంబుల నణచుటే • హితముసుమ్మి
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 40

జననమరణముల్ రెండును • సమములనుచు
భావమందుఁ దలంచిన • భవ్యమతిని
భార్యతోడనె వసియించి • పడయవచ్చు
భుక్తిముక్తుల సారంబు • భువిని మనము
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 41

చిత్తశౌచంబు లేనిదే • తీర్థ నదెట్లు
గంగలోమున్గఁ బుణ్యంబు • గల్గనేర్చు
భ్రమయటన్నది యిదియె పో • భ్రష్టనరుఁడ!
పాయరా! తృష్ణ ముక్తికై బాలకృష్ణ! 42

తృష్ణయే మానవుల దుర్గతికిని బంపుఁ
దృష్ణ నెడఁబాయ నరకంబు • దీఱిపోవుఁ
దృష్ణవలననె దుఃఖముల్ • దొరలుచుండుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 43

నీటిపై నౌక నిశ్చింత • నెగడురీతి
నరుఁడు సంసారయాత్రిలో • నడువవలయు
నౌకలో నీరు నిలిచిన • నావమునుఁగు
నట్ల లోకంబు నరునిలో • నణఁగియున్న
భ్రిష్టుఁ డైపోవు నాతఁ డె • ప్పగిదిఁగనినఁ
బాయరా ! తృష్ణ ము క్తికై • బాలకృష్ణ! 44

జగము నశ్వరంబనియెంచి • సంతతంబు
భక్తిభావంబుచేఁ భువిఁ • బరఁగు మనుజుఁ
డంతరంగంబునందున • నణఁగియుండు
రిపులనిర్జించి ముక్తిచేఁ • దృప్తుఁడగును
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 45

నామభేదంబునఁ జగ • న్నాథునరయు
మానవుని చిత్తమెపుడును • మాయఁజిక్కి
తథ్యమైనట్టి పథమును • దప్పిపోయి
కుందుచుండును మెండుగఁ • గోర్కులాదవఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 46

అస్థిచర్మ వినిర్మితం • బైనయట్టి
దేహకాంతిని వీక్షించి • మోహమునను
గర్వమందెడు మనుజుండు • కనునె ముక్తి?
గర్వమనునదె నరుల దు • ర్గతికి నీడ్చుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 47

సర్వజీవులయందు నీ • శ్వరుఁడు సతము
వెలయు నను వాక్కు తథ్యమై • విశ్వమందుఁ
బరఁగుచుండంగ మూర్ఖులై • భ్రష్టజనులు
మహిని వర్ణవిభేదాల • మగ్గఁజనునె?
పామరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 48

ఇంద్రియంబు లనన్నింటి • నెవ్వఁ డణఁచి
వసుధఁ జిత్తంబు బుద్ధికి • వశము సేయు
నతఁడ దివ్యాత్మతత్త్వము • నరసి మిగుల
శాశ్వతానందబ్రహ్మమై • జగతినొప్పఁ
బామరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 49

రామదాసాది భక్తులు • కామముడుగ
సరసభూసుర కులమున • జననమంది
యెల్లజీవుల దయతోడ • నిలనుగాంచి
దేహవాంఛను త్యజియించి • దివ్యదేవు
శాశ్వతత్వమ్మును గ్రహించి • చనఁగలేదె
పామరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 50

లోపమెద్దానిఁగాంచినఁ • బాపియందె
గాననగుచుండు, సజ్జను • కథలయందు
మందునకునైన దోషంబు • నంద లేము

గాంధిదేవుని చరితమ్ము • గాంచనిదియె

హృదయఫలకాంకితంబగును • హృద్యముగను
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 51

సత్యమే సృష్టియందలి • సారమయ్య
సత్యమే సత్వహీనుల • సారశక్తి
సత్యమే ప్రాణికోటికి • నిత్యధనము
సత్యవంతున కెల్లప్డు • సౌఖ్యమొదవుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 52

జీవన సరస్సునందునఁ • జెలువుమీఱఁ
గ్రాలుచుండెడి దివ్యమౌ • కమల, మిదియె
హర్షమే యిందు మకరంద • మనఁగఁ గుల్కఁ
గీర్తి సౌరభమిందెప్డుఁ • బూర్తినుండుఁ,
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 53

పూర్వకాలమునందునఁ • బృథ్వియందు
మునుల చిత్తంబు లెన్నియో • ముదముతోడ
సత్యమనియెడి కలువల • సరసఁ జేరి
భ్రమరగణముల చందాన • భ్రమసి మిగుల
సంతిమావస్థయందునఁ • జింతఁ బాసి
సురుచిర స్వర్గసౌఖ్యమ్ముఁ • జూఱఁగొనఁగఁ
బ్రాణవాయువు నచ్చోటఁ • బాసిచనియెఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 54

సర్వ జాతీయసోదరుల్ • సత్యమరయ
దేవదేవుని బిడ్డలే • ధీరులార!
కాన సత్యము స్మరలు • గాచుకొఁటకు
భూతదయగల్గి శీఘ్రంబు • ముక్తిఁగనుఁడి
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 55

చంద్ర చంద్రికలందుండు • సహజమైన
భేదమెట్టిదియో యట్టి • భేదగతియె
సగుణ నిర్గుణ బ్రహ్మముల గలదయ్య
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ 56

దుగ్ధమునయందు దానిఁ నిర్దుష్టధవళ
వర్ణమం దొప్పు భేదమే • వంద్యులైన
సగుణ నిర్గుణ బ్రహ్మము • లఁ గలదెందుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 57

దహనమునయందు నద్దాని • దగ్ధశక్తి
యందు నొదవెడి భేదంబె • యరయ నరయ
సగుణ నిర్గుణ బ్రహ్మము • లఁ గలదయ్య
పాయరా! తృష్ణ! ముక్తికై • బాలకృష్ణ! 58

పారిశుద్ధ్యము నెడబాయు • వస్త్రతతిని
బాసి నిర్మలినంబులౌ • వసనములను
జనులు ధరియింతు రైనడిఁ సంతతంబు

జీవుఁడు ననేక తనువులఁ • జేరుచుండుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 59

సూర్యుఁ డొకఁడయ్యు జీవుల • చూడ్కులందు
భిన్నరూపంబులం గాను • పించుచుండు
పగిదిఁ, బరమాత్మ యొక్కఁడే • ప్రకృతివలన
వేలువేలుగఁ గాన్పించు • విశ్వమందుఁ,
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 60

అంగనాపుత్త్రమిత్రాదు • లందుఁ గల్గు
ప్రేమయే మోహ మనుపేర • వెలయు రీతి
సర్వమున కాద్యుఁడై యొప్పు • సదయహృదయుఁ-
డైన సర్వేశునెడఁ గల్గు • నట్టిప్రేమ
భక్తియను నాఖ్యఁబరఁగుదు • ముక్తినొసఁగుఁ,
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 61

ప్రాణికోటుల హింసించు • పరుషమతిని
బ్రాణికోటులను సృజించు • పరమపితయె
పట్టి దండించు నను వాక్య • బద్ధమగునె?
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 62

పృథివి సారథిలేనట్టి • రథమువోలె
బుద్ధి నిరసించు మన స్సుఁ • బోవు నిచ్ఛ
బుద్ధిఁ బడయంగ వాంఛించు • పురుషవర్యుఁ

డాత్మసంయమిరైై కాంతుఁ • గణంచవలదె?
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 63

దీప మున్నట్టి చోటునే • దీప్తిమెఱయు
నీడ యనునది సహజమై • నెగడు రీతిఁ
బరగు తత్త్వంబు నంటక • పరగు మాయ,
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 64

శాశ్వతంబులు కానట్టి • సౌఖ్యములను
బడయు వాంఛచే మనుజుండు • భ్రష్టబుద్ధి
విత్త మార్జింప ధర్మమున్ • వీడఁజనదు
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 65

మత్తుగొల్పెడివస్తుపుల్ • చిత్తమలర
ననుభవింపుచుఁ గామంబు • నడఁపఁజూచు
మూఢజనులకు నేరీతి • ముక్తి యొదవుఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 66

తెలివిలేనట్టి సుతుల వం• దలకొలందిఁ
బడయవాంఛించు టదియేల? • భక్తిగల్గి
జ్ఞానపుత్రుని బొందెడి • మానవుండె
భవము నెడఁబాసి శీఘ్రింబ • పడయుముక్తి
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 67

హద్దులేనట్టి చిత్తంబు • విద్దెలేక
మోహపాశంబులఁ జిక్కి • మోదముడుగ

నరకకూపంబునంబడి • పొరలుచుండు,
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 68

జ్ఞానమూవంతమైనను • గనక నరుఁడు
దీర్ఘకాలంబుదనుక ధాత్రీతలాన
మనుటకంటెను జ్ఞానియై • మాన్యుఁడగుచు
గడియరైయెనను జీవింపఁ • గలదు ముక్తి,
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 69

అనుభవంబును బడయక • యఖిలశాస్త్ర
జనిత విజ్ఞానకుశలంబు • గనెడి నరుని
జీవితైశ్వర్య విభవంబు • జీర్ణమగుచుఁ
గాననములోని వెన్నెల • కరణిగాదె?
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 70

మెఱవు మెఱసిన చందాన • మెఱసి మిగుల
క్షణములోన వినాశంబు • గనుచునుండు
జగతియెడనున్న మోహంబు • సమయఁజేసి
జన్మరాహిత్యమునుబొంద • సత్వరమునఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 71

శుష్కవేదాంత ఫలితంబు • శూన్య మరయ,
ధర్మమును మానక• చరింపఁ• దగు సతంబు,
నుర్వి సత్య వచోలబ్ధి • యుత్తమంబు,
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 72

దుఃఖరూపంబు నెఱఁజూచి • దూరదృష్టి
దుఃఖమొదవంగ నేమి హేతువొ యెఱింగి
దుఃఖమును దుఃఖహేతువుఁ • దునుముమయ్య,
పాయరా! తృష్ణముక్తికై • బాలకృష్ణ! 73

ఆశకు సమంబగు పిశాచ • మరయ లేదు
ఆశ నెడఁబాయుటే పర • మాత్మఁగనుట
గాఢ వైరాగ్యభావమే • ఘనసుకృతము
రాగమునకంటె విషమేది • రా? జగాన,
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 74

దయకు సమమైన పుణ్యమెందయినఁగలదె?
వసుధ నిర్దయకంటెఁ బా • పంబు లేదు
చూడఁగాఁ దెల్వికంటెను • సుఖ మికెద్ది?
ఘనతరాజ్ఞానమునకంటెఁ • గనము చింతఁ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 75

అమలమగు భక్తితోడ నీ • దైనతోడవు
కలదె? మోక్షంబుకంటెను • గలిమికలదె!
గండఁడగు శత్రువయ్యహం • కారమకద!
దాన్నివిడచిన జన్మ సా • ర్థకముగాదె?
పాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 76

శత్రుషడ్వర్గంబు [illegible] • సత్వరమున

శమదమాదుల నార్జించి • సర్వజనులు

స్త్రీపురుష భేదములఁ బాసి • చిద్వికాసుఁ
జేర సద్విద్యలొసఁగ • జేయవలదె?
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 77

స్థాన భేదంబులేక యా • సదమలాత్మ
యెల్లజీవులయందు రా • జిల్లుచుండు
జాతి మత భేద బుద్ధి క • తీతుఁడతఁడు
విశ్వ మానవ ప్రేమయే • విజయ మొసఁగుఁ,
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 78

విగ్రహారాధన మొనర్చు • వెఱ్ఱులందు
నిలువనేరదు విజ్ఞాన • నేత్రగరిమ
చేరు వెన్వెంటనే మాయ • చిత్రగతులఁ,
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 79

విశ్వమే దేవసదనమై • వెలయుచుండు
ధరణి సద్బుద్ధి విమల తీ • ర్థంబుగాదె?
సత్యము యపారమైనట్టి • శాస్త్ర మెందుఁ
దలఁప విశ్వాసమే కదా? • ధర్మ మరయ
బాయరా! తృష్ణ ముక్తికై • బాలకృష్ణ! 80

అమలమగునట్టిప్రేమయే • యాత్మశిక్ష
స్వార్థశూన్యత వైరాగ్య • సంపదకద?

జీవహింసను బాయుటే ॰ జీవితమును
సార్థకంబొనరించుట ॰ జగతియందుఁ,
బాయరా! తృష్ణ ముక్తికై ॰ బాలకృష్ణ!

వసుధభిన్నంబులై పాఱు ॰ వాహినులును
సందిరము వలనఁబుట్టియె ॰ సాగరమునఁ
జేరుచుండెడిచందాన ॰ క్షితితలాన
మతములన్నియువైదిక ॰ మతమునుండి
పుట్టిపెరుగుచునద్దానఁ ॰ బోయి చేరుఁ
బాయరా! తృష్ణ ముక్తికై ॰ బాలకృష్ణ!

వేదములునాల్గు నీజగ ॰ దాదియందు
బ్రహ్మయే వ్రాసె ననుట య॰బద్ధమయ్య
పౌరుషేయములై యివి ॰ ప్రబలె నవని
మూఢవిశ్వాసమందున ॰ ముక్తిలేదు
పాయరా! తృష్ణ ముక్తికై ॰ బాలకృష్ణ!

అంతిమవిన్నపము.

తే॥ గీ॥ సంఘహితమొందఁ డెకాంక్షించి ॰ సంతతంబు
ధర్మగ్రంథములను వ్రాయఁ ॰ దలఁచి నేను
గార్యరంగంబుఁ జొచ్చితిఁ ॰ గానఁ గరుణ
[illegible] ॰ సదయులార!

తే॥ గీ॥ దేశహితమునుగోరని • తెలుపులేల?
నీతి నెడఁబాయుకవుల యా • నేర్పులేల?
ముక్తికిఁ జాడఁదెల్పని • పొత్తమేల?
ఆంధ్రసోదర వరులార! • ఆర్యులార! 85

తే॥ గీ॥ మానవాదర్శ గ్రంథాల • మహిమఁగాంచఁ
జేసిపఁదీవించి, పోషించి • ప్రియముఁగూర్చు
వందనంబులొనర్తు నా • నందమెసగ
సమలగుణులార! ఘనులార! • యాంధ్రులార! 86

తే॥ గీ॥ కల్పితములయిన కథలందుఁ • గాంక్షఁబాసి
ద్వేషమునుగొల్పు మతముల • దీక్షరోసి
నశ్వరములయిన తృష్ణల • నాశపఱచి
జ్ఞానమును వృద్ధిగావింపఁ • గడఁగరేల?
సదయులైనట్టి యోరాజ • చంద్రులార! 87

తే॥ గీ॥ అల్పమతినగు నాపల్కు • లందుఁగల్గు
తప్పులన్నింటి దయతోడ • నొప్పులుగను
భావమందున దలఁపంగ • భక్తిమీఱ
వందనంబు లిడుదుఁ గవి • వర్యులార!

గీ॥ పం॥ బౌద్ధధర్మంబునందలి • శుద్ధభావ
పుంజములనెల్ల జనులకు • బోధఁజేయ
నీపురాణమె, వేదమై • నిఖిలగతుల
దివ్యమణిభాతి నిరతంబుఁ • దేజరిలుచు
ధరణివెలయుత మాచందరి • తారకముగ॥

అసతో మా, సద్గమయ
తమసో మా, జ్యోతిర్గమయ
మృత్యోర్మా౽మృతంగమయేతి.

సంపూర్ణము.

---